చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము 5

(మంగళ శ్లోక - తాత్పర్య - అధ్యయన సమేతంగా)

సంపుటి-5 అథర్వణవేదాంతర్గత (8) శుక్లయజుర్వేదాంతర్గత (1)

- 9 ఉపనిషత్తులు -

**అథర్వణ వేదాంతర్గత**

15. పరమహంస పరివ్రాజక 16. పాశుపత బ్రహ్మ 17. భావన 18. మహావాక్య

19. శరభ 20. సీత 21. సూర్య 22. హయగ్రీవ

**(మరియు) శుక్ల యజుర్వేదాంతర్గత**

**బృహదారణ్యకోపనిషత్**

చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము 5

(మంగళ శ్లోక - తాత్పర్య - అధ్యయన సమేతంగా)

సంపుటి - 5 అథర్వణవేదాంతర్గత (8), శుక్లయజుర్వేదాంతర్గత (1) (బృహదారణ్యక)

- "9" ఉపనిషత్తులు -


అధ్యయన విద్యార్థి

- యేలేశ్వరపు హనుమ రామకృష్ణ



ప్రథమ ముద్రణ : **23-9-2018**

ప్రతులు : 1000

వెల : 500/-

పబ్లిషర్ మరియు ప్రతులకు

**శ్రీమతి యేలేశ్వరపు కనకదుర్గ**

D.No. 2/8, Siva Temple Street,

Kuchipudi - 521 136 Krishna Dist. A.P. India

Cell : 92479 25278, **9247105392** Land : 08671 - 251164

Cover Page Designedy By

**M/s. Aravinda Graphics,** Eluru

Cell : 98486 44882

***DTP & Printed By*** and ***also For copies***

**BRUNDAVANAM SAI KUMAR**

Hasitha Graphics & Printers

Rose Gardens, Eluru-1 W.G. Dist

Cell : 97042 75472

# ముందుమాట

**శ్రీ మద్గురో! నిఖిలవేద శిరో నిగూఢ! బ్రహ్మాత్మబోధ సుఖసాంద్ర తనో! మహాత్మన్!**
**శ్రీకాంత వాక్పతి ముఖాఖిల దేవ సంఘాన్! స్వాత్మావ బోధక! పరేశ! నమో నమస్తే॥**
**ఓం శ్రీగురుభ్యో నమః ఓం సద్గురు శ్రీశ్రీశ్రీ అంతర్ముఖానంద - పరబ్రహ్మణే నమః**
**ఓం సద్గురు శ్రీశ్రీశ్రీ స్వామి రామానంద పరమహంసాయ నమః**
**ఓం సద్గురు శ్రీశ్రీశ్రీ స్వామి శివానంద పరమహంసాయ నమః**
**ఓం జగద్గురు శ్రీశ్రీశ్రీ శ్రీకృష్ణ పరమాత్మనే నమః**

అనాదిగా ప్రతి ప్రాణి **నిరంతరమైన, నిరవధికమైన** సుఖాపేక్ష కలిగి ఉన్నదని అందరకూ తెలిసినదే. సుఖ దుఃఖములు సాపేక్షములు (Merely relative) – అనునది కూడా లోక విదితమే. కాల చక్రప్రవాహములో సకల జీవులయొక్క సుఖ, దుఃఖ భూయిష్టమైన **జీవన పరిభ్రమణం కూడా నిత్యానుభవమే.** అయినప్పటికీ ఎడతెరిపిలేని ఈ ప్రయాణానికి గమ్యం శాశ్వత సుఖమని నిశ్చయించి, అలుపెరుగని ప్రయత్నం అనంతకాలంగా ప్రతి జీవునిచేత నిర్వర్తించబడుచూనే ఉన్నది.

అనేకమంది సగటు మానవుల వలెనే నేను కూడా అదే రంగుల రాట్నంలో, అదే దిగ్గజ చక్రంలో ప్రయాణిస్తున్నాను. ఆశ్చర్యం ఏమిటంటే మనకంటే ముందు **"నేనెవరు? నా నిజరూపమేమిటి?"** అనే విషయమై అద్భుతమైన పరిశోధన చేసినవారు ఉన్నారు. తరువాతి తరాలు అనాయాసంగా, ఆనందభరితంగా తమతమ ప్రయాణాలు సుగమం చేసుకొని, **పరమపద గమ్యం** చేరేందుకు వెసులుబాటు కల్పించిన మహాత్ముల వాఙ్మయమును, వారి అవ్యాజ ప్రేమభరిత ఆప్తవాక్యాలను విస్మరిస్తున్నామేమో। ఆశాపాశబద్ధులమై, శమించరాని తృష్ణ, భరించలేని తాపం దహించివేస్తుంటే, దారి తెన్నూ లేకుండా ఈ సువిశాలమైన మాయా ప్రపంచమనే ఎడారిలో, ఒయాసిస్సులని భ్రమించి, మృగతృష్ణలలను చూచి సుఖముకొరకై పరుగులు తీస్తూనే ఉండటం, భ్రాంతిని వీడకపోవటము – బహుశః మన 'అశ్రద్ధ' యొక్క ఫలితమా?



నాతో సహా, అనేకమంది ప్రజానీకపు ఈ దుస్థితికి కారణం స్వయంకృతాపరాధమో (లేక) ప్రయత్నలోపమేనేమో! గుడ్డిలో మెల్ల నయమన్నట్లు, కొన్ని సంవత్సరముల క్రితమే నాకు సిద్ధయోగులైన సద్గురువుల ఆశ్రయం, సదుపదేశము, (మరియు), బాల్యంలో – నా తల్లిదండ్రులైన అప్పల శేషమ్మ–అప్పల రామమూర్తి గార్ల దిశానిర్దేశము లభించాయి. యోగాభ్యాసిగా తీర్చిదిద్దిన నా సద్గురువు సిద్ధయోగి శ్రీశ్రీశ్రీ అంతర్ముఖానంద స్వామి వారిచే, యోగవాసిష్ఠము పఠించమని ఆదేశించబడింది. శ్రీ హనుమ రామకృష్ణ గారిచే 32000 శ్లోకములు అనుసృతంగా అనువదించబడిన **"శ్రీ వసిష్ఠ–రామ సంవాదం"** (శ్రీరామకృష్ణమఠ్, హైద్రాబాద్ వారు ప్రచురించినది) పఠించే అదృష్టం నన్ను వరించింది. ఆ ప్రకాశకుల సహాయం వలన సనాతన భారతీయ తత్త్వశాస్త్రమును అధ్యయన పుష్పములతో ఆ పరమాత్ముని అర్చిస్తూ ఉన్న శ్రీ హనుమ రామకృష్ణ గారితో పరిచయం లభించింది. భక్తి తత్పరులై, పరమ పవిత్రము–పరమానంద భరితము అయిన ఆధ్యాత్మిక జీవనశైలి కలిగిన ప్రేమ మూర్తులు శ్రీ రామకృష్ణగారు, శ్రీమతి కనకదుర్గ అమ్మగారు దంపతులు. వారి పరిచయ భాగ్యం అనే మధుర ఘట్టం నా జీవితంలో నాలుగు సంవత్సరముల క్రితం సందర్భమవటము నాపట్ల **ఒక గొప్ప మైలురాయి.**

ఆధ్యాత్మికత అంటే కేవలం గుళ్ళు, గోపురాలు దర్శించి, తీర్థయాత్రలు చేసి, అతీంద్రియ శక్తులు కలవారుగా ప్రచారం పొందిన వారిని సేవించి, భౌతిక ప్రయోజనములు అర్థించి, ప్రార్థించి, లబ్ధి కలుగనిచో దుఃఖించి, ఆశ్రయించిన దేవతామూర్తుల హెచ్చు తగ్గులను తర్కించి, మహాత్ములనిన వారిని మరల దూషించి, (లేదా) భయానక మౌనం వహించి ఉండిపోవడం కాదు. సానుకూల్యత సిద్ధించినప్పుడు అది స్వకీయ ప్రతిభ మాత్రమేనని లోలోన గర్వించి, సత్యాన్వేషణ చేయక, జీవితమును నిరర్థక పరచుకోవటం కూడా కాదు. అదంతా ఒక రకంగా **ప్రథమాంకము** కావచ్చునేమో। ద్వితీయ అతిముఖ్య విభాగము – **స్వస్వరూప అఖండాత్మ జ్ఞానమే.**

తొలుత, అదృష్టవశాత్తు మహాత్ములు ప్రముఖులు సుప్రసిద్ధులైన ఆధ్యాత్మికవేత్తలైన శ్రీశ్రీ రవిశంకర్, శ్రీ జగ్గివాసుదేవ్, శ్రీ ఓషోగార్ల వంటి ప్రవక్తల ప్రవచనములు చదివి, విని ప్రభావితమై, **భారతీయతత్త్వ, యోగ శాస్త్రములను సరియైన దృష్టికోణంలో పరిశీలించవలసిన ఆవశ్యకతను నేను గుర్తించగలిగాను.**

వర్తమానంలో భారతీయ సంస్కృతి, హిందూ ధర్మంగా చెప్పబడుచున్న సనాతన సాంప్రదాయపు సిసలైన సిద్ధాంతములు, ఆచరణలపై సదావగాహన కలుగనారంభించింది. అప్పుడు దైవవశంగా శ్రీ హనుమ రామకృష్ణగారితో గురు–శిష్య అనుబంధం ఏర్పడింది.

భగవాన్ వేదవ్యాసులు క్రోడీకరించిన చతుర్వేదాంతర్గతములైన 108 ఉపనిషత్ వాఙ్మయములోని సుమారు 90,000 మంత్రములకు తాత్పర్యసహిత వివరణలతో **"అధ్యయన పుష్పార్చన యజ్ఞము"** చేయుచున్న పూజ్యులు శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణగారి **అకుంఠిత దీక్ష నన్ను మంత్రముగ్ధుడ్ని చేసింది.** 16 సంవత్సరముల వయసువారిలో కూడా కనిపించని అరుదైన వారి ఉల్లాసభరిత, **ఉత్సాహపూర్వక ఉద్యమశక్తి ఆధ్యాత్మిక విద్యార్థులకు ఆదర్శప్రాయము.** (He is an examplary Inspiration to many like me).

ఆచరణకు అత్యంత సులభసాధ్యమైన పద్ధతులతో కూడిన, ఉదాత్త భరిత ఆత్మజ్ఞాన బోధక మంత్రములను, తెలుగుజాతికి పునః పఠనంగాను, అధ్యయనముకొరకు అందించే శ్రీ రామకృష్ణగారి ప్రయత్నం – ఉపనిషత్ ఋషుల అనుగ్రహం. శ్రీ సరస్వతీదేవి కృప. **"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి".** అను పరమ సత్యమును సూటిగా ప్రకటిస్తూ, అపోహలను ఖండిస్తూ, ఖచ్చితమైన దిశానిర్దేశం చేస్తాయి మన ఈ **ఉపనిషత్–అధ్యయన పుష్పములు.**

అనుష్ఠానము, అనుభవ జ్ఞానమును ప్రోత్సహిస్తూ, మాయాజాలములో పడకుండా హెచ్చరిస్తూ, వాచా వేదాంతమును గర్హిస్తూ, **పరమపదమునకు చేర్చునవి ఉపనిషత్తులు.**

దృష్టాంతంగా 'ముక్తికోపనిషత్' గురించి ముచ్చటించుకుందాము. చారిత్రాత్మకంగా రాముడు ఒక గొప్ప రాచబిడ్డ. ఉత్తమశిష్యుడు. పితృవాక్య పరిపాలకుడు. మహాయోధుడు. ప్రజారంజకుడైన మహాచక్రవర్తి. ప్రేమమూర్తియైన భర్త. సమస్త జీవులకు బంధువు. వినయశీలి. ఇంత మాత్రమే కాదు. ఆయన **ఒక మహాఋషి. బ్రహ్మజ్ఞాని.** హనుమను భవిష్యద్విధాతగా తీర్చిదిద్దిన మహద్గురువు. ఇది **ముక్తికోపనిషత్** పఠించినవారే గుర్తించగలరు. అత్యంత సూక్ష్మమైన ఆత్మవిద్యను మరింత సంగ్రహంగా స్వల్ప సంఖ్యలో (కేవలం 33 మంత్రములలో) పొందుపరచి, మహాత్ములైన శ్రీ హనుమంతుల వారిని సంబోధిస్తూ యావత్ మానవాళికి కటాక్షించిన కరుణామూర్తి.

ఇట్టి ఎందరో బ్రహ్మానంద సామ్రాజ్య చక్రవర్తులు, మహానుభావులైన **ఋషులు అందించిన అనంత జ్ఞాన సంపద, మన ఉపనిషత్తులు.**

శ్రీ హనుమ రామకృష్ణగారు ఇతః పూర్వం 32000 శ్లోకముల శ్రీ వసిష్ఠరామ సంవాదమును వచనములో అనువదించి ఉన్నారని చెప్పుకున్నాం కదా।

**అందులోని కొన్ని విశేషాలు:**

(యోగవాసిష్ఠం) – **"కిం ధనేన కిమంబాభిః, కిం రాజ్యేన కిమీహయా? ఇతి నిశ్చయవానంతః, ప్రాణత్యాగ పరః స్థితః"।** పరిపక్వ వైరాగ్యంతో "ఈ ధనంతో, ఈ బంధుజనంతో, ఈ రాజ్యములతో, ఈ ప్రయత్నములతో నాకేమి పని? నేను నిశ్చయంగా ఇట్లే సమస్తము వదిలేస్తాను. ప్రాణత్యాగమును కూడా లెక్క చేయను".

**"ఆపదః క్షణమాయాంతి। క్షణమాయాంతి సంపదః। క్షణం జన్మ, క్షణం మృత్యుః। మునే! కిమివ న క్షణమ్?"**– (యోగవాసిష్ఠం). "ఓ మునీశ్వరా! క్షణంలో జన్మ। క్షణంలో మృత్యువు। ఈ ప్రపంచంలో క్షణికం కానిదేమిటో చెప్పండి?" అని శాశ్వత సత్య అన్వేషణలో, సకల శాస్త్ర ప్రాజ్ఞుడై, సంపూర్ణ వైరాగ్యశీలియై, **సూటిగా పరిప్రశ్నించిన శిష్యరత్నం శ్రీరాముడు.**

శ్రీరాముడు సద్గురు బోధలకు, అనుగ్రహమునకు పాత్రుడై, శోధించి, సాధించి **"బంధో హి వాసనా గంధో। మోక్షస్యాత్ వాసనా క్షయః। వాసనాం సంపరిత్యజ్య, మోక్షార్థిత్వమ్ అపి త్యజ।"** అని సారవాక్యంగా ప్రకటించారు. *(ముక్తికోపనిషత్ 2-15).*

**"వాసనా గంధమే బంధము. వాసనా క్షయమే మోక్షము.** వాసనలన్నీ పరిత్యజిస్తూ, చివరకు **'నాకు మోక్షము లభించాలి'**-అను **వాసనను కూడా త్యజించు** అని అంటూ శ్రీ ఆంజనేయస్వామితో పరమసత్యమును సూటిగా ప్రకటించి, లక్ష్యశుద్ధిని అనుగ్రహించిన సద్గురువు శ్రీరాముడు. **"ద్వే బీజే చిత్త వృక్షస్య। (1) ప్రాణస్పందన (2) వాసనే। ఏకస్మిం చ తయో క్షీణే, క్షిప్రం ద్వే అపి నశ్యతః।"** - (ముక్తికోపనిషత్ -7)। **"వాసనా సంపరిత్యాగః ప్రాణస్పంద నిరోధనమ్।** - (ముక్తికోపనిషత్ 2-10). **"చిత్త వృక్షపు రెండు బీజఖండములు వాసనలు మరియు ప్రాణస్పందన. ఒకటి నశిస్తే, రెండవది కూడ నశిస్తోంది. వాసనలు పరిత్యజించండి. ఎలా? ప్రాణాయామ అభ్యాసముచే ప్రాణస్పందన నిరోధించండి"**- అని అభ్యాసయోగ రహస్యం అందించిన **ముక్తికోపనిషత్ ఋషి** మన **శ్రీరాముడు.ఎంతటి మహత్తర విషయం!**

❖ ❖ ❖

**"భ్రువోః - ఘ్రాణస్య చ యః సన్ధిః, స "ఏష ద్యౌర్లోకస్య - పరస్య" చ సంధిః భవతి। ॥ఇతి॥ - ఏతత్ <u>వై</u> సంధిం 'సంధ్యామ్' బ్రహ్మవిద ఉపాసత। ॥ఇతి॥"** - (జాబాలోపనిషత్ - 2). భ్రుమధ్యము (భ్రుకుటి) - ఘ్రాణము (ముక్కు)లకు మధ్య అభౌతికశక్తి స్థానము ఏర్పడినదై ఉన్నది. అది **ద్యౌర్లోకము-భౌతిక ఆకాశములకు** పరమై ఉన్నది. ఆవలయై ఉన్నది. దీనినే యోగవేత్తలు (ఆత్మకు-లోకములకు) **సంధిస్థానమని** అంటున్నారు. **అట్టి సంధ్య స్థానమై ఉన్నట్టి సంధ్యాతత్త్వమును, బ్రహ్మముగురించి ఎరిగిన బ్రహ్మవిదులు ధ్యానిస్తున్నారు. అదియే సంధ్యావందనము.** అదియే యుక్తము అని సూటిగా, సాధనా మార్గమును, అభ్యాస సూచికలను, నిర్దుష్టంగా ప్రకటిస్తున్నది- **జాబాలోపనిషత్,** (మరియు) తదితర కొన్ని ఉపనిషత్తులు కూడా।

- ❖ **"యజ్ఞోపవీతమ్ పరమమ్ పవిత్రమ్। ..... (బ్రహ్మోపనిషత్ - 5")।**
- ❖ **"స శిఖం వపనం కృత్వా, బహిస్సూత్రం త్యజేత్ బుధః ... (బ్రహ్మోపనిషత్ - 6")।**

అంటూ యజ్ఞోపవీత ధారణ ఉద్దేశ్యాన్ని, లక్ష్యమును, స్పష్టీకరిస్తూనే, **"ఆత్మాహమ్"** భావనయే ఆశయముగా గల బుధుడు - క్రమంగా శిఖతో సహా, బహిస్సూత్రము ఇత్యాది బాహ్యాచారపు పరిమితులను గుర్తించి, త్యజించి ఉండమని ఉత్తరోత్తర ఫలప్రదమును ధృవీకరించునవి **ఉపనిషత్తులు.**

**"జరామరణ రోగాది న తస్య భువి విద్యతే, ఏవం దినే దినే కుర్యాత్ అణిమాది విభూతయే।"** - అనుచూ ఇహ పర సాధక యోగక్షేమ రహస్యములను సర్వజన ప్రోత్సాహకరములుగా బయల్పరుచు కల్పతరువులు ఉపనిషత్‌లు. **(బ్రహ్మవిద్యోపనిషత్ - 24).**

**"దేహ జాతి ఆది సంబంధాః, సర్వ వర్ణాశ్రమ సమన్వితాన్, వేద శాస్త్రాణి చ అన్యాని, పాదపాంసుమ్ ఇవ త్యజేత్। (బ్రహ్మోపనిషత్-29,30).** ఈ సమస్తమును, స్వాత్మను సాక్షాత్ బ్రహ్మముగ నిశ్చయించి, దేహ సంబంధమయిన జాతి భేదములను, వర్ణాశ్రమ వివక్షలను, వేదశాస్త్ర నియమ - మీమాంసలను **పాదధూళి శుభ్రపరచుకొనునట్లు** త్యజించాలి - అని **శాస్త్ర ప్రయోగ, ఉపసంహారములను** అనుగ్రహిస్తున్నది.

సకల చరాచర సృష్టిలో జీవరాశిపట్ల సమదృష్టిని (Ultimate Socialism), విశ్వజనీనమైన ప్రేమను (Science of Universal Love) ప్రతిపాదించునవి ఉపనిషత్తులు. సర్వజన శిరోధార్యముగ, ఉదాత్త భరిత భావనలను పెంపొందించు **అమూల్య జ్ఞాన రత్నాకరములు ఉపనిషత్తులు.**

**"<u>ఆత్మానమ్</u>" అరణిమ్ కృత్వా, "<u>ప్రణవం</u>" చ ఉత్తరారణిమ్, "<u>ధ్యాన</u>" నిర్మధన అభ్యాసాత్, దేవం పశ్యేత్ నిగూఢవత్?" - (బ్రహ్మోపనిషత్-12).** జగత్ భావనాయుక్తమైన **జీవాత్మ** (మనస్సు)ను క్రింది కొయ్యగను, **పరబ్రహ్మవాచకమైన 'ఓం'** అను ప్రాణాయామ సాధనోద్భవమగు అనాహత **ప్రణవనాదమును (పరమాత్మను)** పై కొయ్యగను ఉపయోగిస్తూ, **అంతర్మథన రూప ధ్యానాభ్యాసము** చేత - **సర్వాంతరంగుడు, స్వాత్మారాముడు** అగు **ఆత్మదేవుని సాక్షాత్కారమును స్వానుభవముగ సందర్శించవలెను** - అని పరమ రహస్యమౌ ఆత్మజ్ఞాన సిద్ధిని కరతలామలకము చేయు కల్పవృక్షములు మన **ఉపనిషత్తులు.**

**"గురుః ఏవ హరిః సాక్షాత్ - న అన్యః। ఇతి బ్రవీత్ శృతిః।" .....**
**"శృత్యా విరోధే న భవేత్ ప్రమాణమ్, భవేత్ అనర్థాయ వినా ప్రమాణమ్।" - (బ్రహ్మవిద్యోపనిషత్ - 31).**

గురువు లేనిదే విద్య లేదు, ముక్తి లేదు – అని గుర్తు చేయునవి ఉపనిషత్తులు. **"గురువే సాక్షాత్ హరి. శృతులే సత్య ప్రమాణములు. శృతి విరోధములు అప్రమాణములు. అనర్ధ దాయకములు"** అంటూ సత్య జ్ఞానమునకు శ్రేయో మార్గమును సప్రామాణికంగా స్థిరీకరించునవి **ఉపనిషత్తులు.**

**"తస్మాత్ యోగం సమాధాయ సర్వదుఃఖ బహిష్కృతః యోగ ధ్యానం సదా కృత్వా, జ్ఞానం తన్మయతాం వ్రజేత్"॥ – (బ్రహ్మవిద్యోపనిషత్–44).** "యోగ సమాధి అభ్యాస రతుడైన విద్యార్ధి (ముముక్షువు) – సర్వశ్రమ, దుఃఖ వర్జితుడై, పరమానంద జ్ఞాన భరితుడగునుచు పునరుద్ఘాటించు అమృత భాండములే ఉపనిషత్తులు.

***ప్రస్తుత శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారి ప్రయత్నమును గురించి మరొక్కమారు ప్రస్తావిస్తున్నాను.***

పరతత్త్వార్థ శోధనకు ఉపక్రమించు సాధక మహదాశయులకు సిద్ధిప్రదమగునట్లు, మంత్రములు సరళముగ పఠించగల్గుటకు సంధి విచ్ఛితిని చేస్తూ అందిస్తున్నారు. యథాతథముగ అర్థము గ్రహించుటకై **తాత్పర్యమును** రచిస్తున్నారు. అంతరార్థ ప్రధానముగ వారి **అధ్యయన పుష్పములను** అందరికీ పంచుతూ చేస్తున్న వీరి బృహత్ ప్రయత్నము ఎంతో అభినందనీయమైనది. ఇది ఐదవ (5) అంకము.

తదుపరి ఆరవ భాగము (ఛాందోగ్యోపనిషత్‌తో సహా '10' ఉపనిషత్తులతో) అతిత్వరలో రానున్నది. ఉపనిషత్తులు పఠించు యోగజ్ఞాన సాధకులకు, వీరు శాశ్వత ప్రేమాస్పదులుగా అగుచున్నారు.

అత్యంత సులభ శైలిలో, అంతంతమాత్రపు తెలుగు పరిజ్ఞానము కలిగిన వారికి, ఆంగ్లభాషా పరిచయం గలవారికి కూడా సౌలభ్యమునకై, అక్కడక్కడ ఆంగ్లములో అందించిన భావజాలము వీరి సౌహార్ధమును, పాఠకులకొరకై సౌలభ్యమును చాటుచున్నవి.

తెలుగుభాషలో వీరి శైలి, మృదుమధురమైన ఒరవడితో పరమార్ధ దృష్టి నింపుచూ ఉన్నవి. పైన చెప్పుకున్న ఉపనిషత్ విశేషాలను వీరు వివరించే విధానము అద్భుతం. "ఎంత పరిమళమోయి ఈ తోటపూలు!" – అనిపిస్తూ ఉంటుంది.

వృత్తి విరమణానంతరము కూడా, 67 సంవత్సరములు పైబడిన వయస్సులో, 108 ఉపనిషత్తుల అనువాద వివరణ అందించాలని, నిత్యసమోత్సాహులై వీరు చేస్తున్న అవిరళ కృషిని తలచినప్పుడల్లా, నేను నా అలసత్వాన్ని గుర్తించి సిగ్గిలుతుంటాను.

అర్థం తెలియని ఆచార వ్యవహారములలో మునిగి తేలుతూ, ప్రాపంచిక విషయవాసనా పూరితమానసులై, ఆధ్యాత్మిక అభ్యున్నతి కొరకై తగినంత సమయమును, శక్తియుక్తులను వెచ్చించక, పురుష ప్రయత్నం తగినంత చేయకుండా, లౌకిక సుఖ ప్రాప్తికి మాత్రమే ప్రాముఖ్యతనిస్తూ ఉంటే ఎలా? మార్గదర్శకులగు మహాత్ముల, మహర్షుల బుక్కులను పెడచెవిని పెట్టి, వ్యర్ధ విషయ వాసనలతో కాలాయపన చేయువారి అశ్రద్ధ పూర్వక అప్రయోజకత్వము **ఏమాత్రము క్షేమము కాదు.** కనుక, మనము శ్రద్ధగా వీరి శ్లోక – తాత్పర్య – అధ్యయన పుష్పములను పఠించి తరించెదము గాక। ఇందలి సంపుటిలో బృహదారణ్యకము అన్ని ఆరణ్యకముల జ్ఞానవిశేష సంకలనము చదివి తనివితీర ఆనందించవలసిందే।

**ప్రార్థన – రాజ్యాది మోక్ష పర్యంతం, సమస్తా ఏవ సంపదా, దేహానిల విధేయత్వాత్, సాధ్యా సర్వస్య, "రాఘవ"।** – (యోగవాసిష్ఠం) అని బోధించిన సద్గురు వరేణ్యులు శ్రీ వసిష్ఠ మహర్షి వాక్యాలను హృదయస్థం చేసికొని, శోధించి సాధించిన ఆదర్శమూర్తి శ్రీరాముడు. పురుషోత్తముడై, ఉపనిషత్ ప్రవచనముచే శాశ్వత చారిత్రక సద్గురువైన ఆ శ్రీరామ చంద్రుని పాదపద్మములను ఆశ్రయించుచున్నాను.

ప్రాతః స్మరణీయులైన శ్రీరామ మార్గాశ్రయులు శ్రీ సీతామాత, సౌమిత్రి, ఆంజనేయాది అనుచరగణముల అడుగుజాడలను అనుసరిస్తూ నమస్కరిస్తున్నాను.

యావజ్జీవులు ఆత్మగురుదేవానుగ్రహ ప్రాప్తులై తరించెదరు గాక। నన్ననుగ్రహించిన సద్గురువులు సిద్ధయోగి శ్రీశ్రీశ్రీ అంతర్ముఖానంద స్వామి వారు, మరియు శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు మొదలైన మహాత్ముల పాద పద్మములకు నొసలు తాకించి, వారి పాదధూళితో నన్ను పునీతులను చేయగలరని ప్రార్థిస్తూ, వినమ్రపూర్వక శత సాహస్ర సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తున్నాను.





చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము

## 5వ సంపుటి

---

---

## మంగళాచరణము (ముందుగా చేయు ప్రార్థన)।

**శ్లో॥ ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి, త్రయం యద్భావ సాధనమ్।**
**తద్బ్రహ్మ సత్తా సామాన్యం, సీతాతత్త్వమ్ ఉపాస్మహే॥ (సీతోపనిషత్)**

మనలోని 'ఇచ్ఛ జ్ఞాన క్రియలు' అనబడే త్రి శక్తులు (శక్తి త్రయము) ఏ జ్ఞానము / భావన సంపాదించటానికి ఉపకరణములో, అట్టి బ్రహ్మసత్తా సామాన్యము అగు (అందరిలోను సమముగా ప్రకాశమానమై యున్న) **"సీతా"** అనబడే **మూల ప్రకృతి తత్త్వమును** ఆత్మజ్ఞాన సిద్ధికై **ఉపాసించుచున్నాము.**

**శ్లో॥ స్వ అజ్ఞోఽపి యత్ ప్రసాదేన, జ్ఞాన తత్ఫలమ్ ఆప్నుయాత్**
**సోఽయం హయాస్యో భగవాన్, హృది మే భాతు సర్వదా। (హయగ్రీవోపనిషత్)**

మేము స్వతఃగా ఆత్మ జ్ఞానము దృష్ట్యా మూఢులమే అయి ఉన్నప్పటికీ, ఎవరిని మనస్సుతో తలచినంత మాత్రంచేత వారి ప్రసాదముగా 'తత్త్వజ్ఞానము' పొందగలమో, అట్టి హయ (గుర్రము) ముఖులగు హయగ్రీవ భగవానులవారు మా హృదయములో సర్వదా జ్ఞాన ప్రకాశమానులగుదురు గాక। మమ్ములను అజ్ఞానము నుండి రక్షించుచుండెదరు గాక।

**శ్లో॥ సూర్యాత్ భవంతి భూతాని, సూర్యేణ పాలితాని తు,**
**సూర్యే లయం ప్రాప్నువంతి, యత్ సూర్యః సోఽహమేవ చ॥ (సూర్యోపనిషత్)**

కిరణములవలె ఈ సమస్త భూతజాలము ఏ సూర్యునిచే జనించి, సూర్యునిచేతనే పాలించబడుచు, చివరికి (తిరిగి) సూర్యునియందే లయం పొందుతోందో, అట్టి సూర్యుడే నాయందు (నాకు అనన్యంగా) వేంచేసినవారై ఉన్నారు. [ నేనే సూర్యుడను। కనుక ఈ సమస్తము నాయందే జనించి, చరించి, నాయందే (జలములో తరంగంలాగా) లయిస్తున్నదగుచున్నది. జగత్తులు అనే కిరణములన్నీ నా నుండి బయల్వెడలి తిరిగి నాయందే ఉపశమిస్తున్నాయి].

**శ్లో॥ ఓం నమో భగవతే దత్తాత్రేయాయ। స్మరణమాత్ర సంతుష్టాయ। మహాభయ నివారణాయ।**
**మహా జ్ఞాన ప్రదాయ। చిదానందాత్మనే। బాలోన్మత్త పిశాచ వేషాయేతి।**
**మహా యోగినే। అవధూతాయేతి। అనసూయానంద వర్ధనాయ।**
**అత్రి పుత్రాయేతి। సర్వకామ ప్రదాయ "ఓం"। (దత్తాత్రేయోపనిషత్)**

ఓం నమో భగవతే। సమస్తమును వెలిగించువాడా! దత్తాత్రేయ స్వామీ! మిమ్ములను స్మరించినంత మాత్రంచేతనే మీరు సంతుష్టులౌతారు. మాయొక్క జన్మ-జన్మాంతర సాంసారిక మహా భయములన్నీ తొలగించువారు। మాకు మహా (ఆత్మ) జ్ఞాన ప్రదాత। బాలునివలె, పిచ్చివానివలె బయటకు వేషము ప్రదర్శించువారు। హే మహాయోగీ! అవధూత స్వామీ! బ్రహ్మర్షి అగు శ్రీ అత్రిపుత్రులు, అమ్మ అనసూయకు సంతోషము కలిగించువారు అగు మీకు **నమస్కారము।**

మా యొక్క ఇహ - పర ఆశయములు నెరవేర్చువారు, ఓంకార స్వరూపులు అగు దత్తాత్రేయ స్వామీ! శరణు। శరణు। శరణు।

*"ఓం" నమో భగవతే దత్తాత్రేయాయ।"*

శ్లో॥ యతో వాచో నివర్తంతే
అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్
న బిభేతి కథాచన॥

అణోరణీయాన్ మహతో మహీయాన్
ఆత్మస్య జంతోః నిహితో గుహాయామ్
తమ్ అక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదాన్ మహిమానమ్ ఈశమ్॥ (శరభోపనిషత్)

ఎవరిని సమీపించి కూడా, వాక్కు మనస్సు – ఆ స్వామిని పొందజాలక, వెనుకకు మరలుచున్నాయో, అట్టి ఆనందమయమగు బ్రహ్మమును ఎరిగినవాడు ఇంక దేనికి భయపడతాడు? దేనికీ ఎన్నడూ భయపడడు.

ఏ దేవాది దేవుడు సమస్త ప్రాణుల హృదయ గుహలో అణువుకంటే అణువుగాను, మహత్తరమైన సమస్తముకంటే కూడా మహిమాన్వితముగాను ఏర్పడినవారై ఉండి ఉన్నారో, అట్టి సమగ్ర స్వరూప ఆత్మభగవానుని – **"నిర్మలము రాగ– శోక రహితము"** అగు బుద్ధిని సంపాదించుకున్నవారు **తమయందే స్వస్వరూపముగా** దర్శించుచున్నారు.

***ఆత్మానంద స్వరూపులగు సమస్త వేదవేత్తలకు, అధ్యయనులకు, వేదతత్త్వజ్ఞులకు, పాఠక మహాశయులందరికి నమస్కరిస్తూ...,***

ఇప్పటి వరకు (1 నుండి 4వ సంపుటి వరకు) ఋక్–యజుర్–సామ–అథర్వణ వేదములలో అంతర్గతమైయున్న '89' ఉపనిషత్తులను (సంధులు విడదీసిన) **శ్లోక – తాత్పర్య – వ్యాఖ్యానపూర్వకంగా** చెప్పుకున్నాము.

ఇప్పుడీ '5'వ సంపుటి – అథర్వణవేదాంతర్గతమైన '8' ఉపనిషత్తులతోను, శుక్ల యజుర్వేంతార్గతమైన **"బృహదారణ్యకోపనిషత్"**తోను – శ్లోక తాత్పర్య అధ్యయనపుష్ప సమేతముగా వెలువరించుకుంటున్నాము.

"ఉపనిషత్ అధ్యయనము" అనగా ఎవరికి వారు **"నేను స్వతఃగా ఎవరై, ఏమై ఉన్నాను?"** – అను విశేషంగా అధ్యయనమే। ఇవన్నీ శ్రీ వేద వ్యాస మహర్షి విభాగ నిర్ణయంగా, వేదముల అంతర్గతంగా, కర్మ–ఉపాసనా ప్రాధాన్యముల అనుసరణ తరువాతగా, చతుర్వేదములలోని ప్రతి విభాగంలో చివరిలో – **అలంకరించారు.** అందుకే **'వేదాంత విభాగము'** – అనబడుచున్నాయి. మనందరిలోన తెలిసుకునేవానిని (The knower) గురించి వేదాంత పురుషుడుగా వర్ణిస్తూ, – తెలియజెప్పేవే – **ఉపనిషత్తులు.**

⌘ **వేదములలోని** యజ్ఞ – యాగ – క్రతు విభాగములు,

⌘ **వేదశాఖలు** (ఋగ్వేదము – 21 శాఖలు. యజుర్వేదము – 109 శాఖలు. సామవేదము – 1000 శాఖలు. అథర్వణవేదము – 50 శాఖలు).

⌘ **వేద – ఉపాంగములయినట్టి కల్పము** (యుగ యుగాంత కాల వివరణలు), **వ్యాకరణము** (శబ్ద–లక్షణ–వాక్య నిర్ణయములు), **నిరుక్తము** (వేద శబ్దముల అవయవార్థములు), **జ్యోతిష్యము** (సూర్య చంద్ర నక్షత్ర గ్రహమండల కదలికలు, వాతావరణ విశేషాలు, కర్మలకు సంబంధించిన ఉచిత–అనుచిత విధి విధాన నిర్ణయములు), **ఛందస్సు** (పద్య–పద–గణ–ప్రాస సంబంధమైన గ్రాంథిక – వ్యావహారిక భాషా నియమములు వివరించు శాస్త్రము), **శిక్ష** (వేద స్వరములు, వేద ఉపాంగ దర్శనములు నేర్పు విద్యాభ్యాసములు,

⌘ **వేద శాఖాంగములైనట్టి పూర్వ ఉత్తర మీమాంస, న్యాయ శాస్త్రము** మొదలైనవి,

⌘ వేదముల ఉపాంగ విస్తరణ రూపములయినట్టి ఇతిహాసములు, పురాణములు, పంచమవేదముగా చెప్పబడే 'భారతము' మొదలైనవి,





⌘ ఉప వేదములుగా చెప్పబడే –

**వాస్తు వేదో, ధనుర్వేదో, గంధర్వశ్చ తథా మునిః**
**ఆయుర్వేదశ్చ పంచైతే – ఉపవేదాః ప్రకీర్తితాః॥**

(1) **వాస్తు వేదము** (ఇళ్ల నిర్మాణ శాస్త్రము),

(2) **ధనుర్వేదము** (విలువిద్య, అస్త్రవిద్య, శస్త్ర విద్య),

(3) **గంధర్వవేదము** (నాట్యము, సంగీత, సాహిత్యములతో కూడిన విద్య),

(4) **మునివేదము** (సమస్త విషయముల మధ్యగా తపో ధ్యానపూర్వకంగా – **నిర్విషయుడై** ఉండగలుగు విద్య),

(5) **ఆయుర్వేదము** (ప్రకృతి నుండి చికిత్స).

ఇవన్నీ వేదములలో అంతర్విభాగములుగా మహర్షుల–ప్రసాదములు.

ఇవన్నీ కూడా అంతిమంగా గమనిస్తే, – **“సోఽహమ్–తత్త్వమ్”** మహావాక్యార్థమగు ఆత్మజ్ఞానము వైపుగా దారి చూపేవే. **సర్వం కర్మాఖిలం జ్ఞానే పరిసమాప్యతే. ఈ జగదృశ్యమును స్వస్వరూప విస్తారముగాను, స్వయంకల్పిత లీలా వినోదముగాను ఆస్వాదించటానికి మార్గప్రదాతలే. ఎందుకంటే ‘ఆత్మ’యే పరమసత్యము కాబట్టి.**

ఉపనిషత్తులు – **“తత్–త్వమ్. నీవు సహజముగాను, స్వాభావికంగాను, అకారణంగాను, అవిచ్ఛిన్నంగాను, అవిరోధంగాను – “నిర్మలము, నిత్యము, అఖండము, అప్రమేయము” అగు ఆత్మవే** – అని నిర్దిష్టముగా, సుస్పష్టంగా, నిస్సందేహముగా నిరూపిస్తూ వస్తున్నాయి.

**ఇటువంటి “ఆత్మవిద్య” (లేక) “భౌమా విద్య”కు మనయొక్క విద్యావిధానంలో తగినంత ప్రాధాన్యం ఇస్తున్నామా?** – అని మనలను మనం ప్రశ్నించుకోవలసిన సమయం ఇది. ఇవ్వటల్లేదు కాబట్టే, చిన్న చిన్న విషయాలు కూడా సాంఘికక్షేమ విధానమును తూట్లు పొడుస్తున్నాయి.

వేద – ఉపనిషత్ విద్యను విద్యావిధానంలో (Degree, Post Graduation, భాషా ప్రవీణ, విద్యాప్రవీణ మొదలైన ప్రత్యేక కోర్సులలో) మనం స్వీకరించకపోతే ఎట్లా? మన నిజస్వరూపమును సుస్పష్టపరచే శాస్త్రమును ప్రక్కకు పెట్టినవారమౌతాము కదా?

‘మనది సెక్యులర్ దేశము’ అని చెప్పుకోవటంలో తప్పు లేదు. మంచిదే. అయితే, **“వేద – ఉపనిషత్‌ల గురించి విద్యావిధానంలో సంభాషించవద్దు”** – అనే అర్థాన్ని ఎప్పటి నుండి ఎందుచేత ఏ ఉద్దేశ్యంతో అనుకోవటం ప్రారంభించామోగాని, చివరికి వేదవిద్య / ఉపనిషత్ విద్యను ఏమూలో దాచి ఉంచటము ప్రారంభించాము. పర్యవసానంగా వేదములు, ఉపనిషత్తులు మనం చదువము. చదివే వారిని చదువనియ్యము. అర్థమును అధ్యయనము చేయనీయం. ఇది సముచితమా? కాదు కదా! ఇట్లా అయితే ఎట్లా?

మతములన్నీ మానవుడికోసమే ఉన్నాయి. మానవుని ఉన్నతుని చేయటమే మతముల ఆశయము. మతములన్నిటికన్నా ముందుగా మానవుడు ఉన్నాడు. అట్లాగే వేద–వేదాంగ–పురాణ ఇతిహాసములు మొదలైనవన్నీ కూడా – మానవుడు మాధవుడవటానికి సహకారికములు. నరుని నారాయణునిగా తీర్చిదిద్దటమే వాటి ధ్యేయము.

మతములసారమేమిటో ప్రక్కకు పెట్టి మతము–మతములలోని శాఖల పేర్లు చెప్పుకొని దండయాత్రలు, మారణహోమం చేసుకోవటము ఉచితమే – అని తలచువారి ఆవేశములు ప్రతిహతమగు గాక. వారిలో సర్వత్రా ప్రేమ వెల్లివిరియును గాక.

ప్రపంచశాంతికి భంగం కలిగించేవారు – **‘ఆత్మజ్ఞానము’** అనే శాంతియుత ఔషధము సేవించటము అత్యావస్యకము, అత్యవసరము కూడా. మానవులమగు మనము అడవి జంతువులవలె పరస్పరం బాధించుకుంటుంటే, – అప్పుడు మానవుడి కంటే జంతువులే అధికమైన జన్మలు అవుతాయి.



అందుచేత విజ్ఞులకు, ప్రభుత్వానికి ఒక విన్నపము.

1. మనము ఇప్పుడు 108 ఉపనిషత్తులను శ్లోక - తాత్పర్య - వ్యాఖ్యానపూర్వకంగా ఒకచోటకి తెచ్చిపెట్టుకుంటున్నాము.
2. శ్లోకములను సంధులు విడదీసి, చదివేవారికి అర్థము స్ఫురించే ప్రయత్నము చేస్తున్నాము.
3. ఇవి అనేక భారతీయ భాషలలోకి తర్జుమా అవటము (లేక) అన్ని భారతీయ భాషలలో ఇటువంటి శ్లోక-తార్పర్య వ్యాఖ్యాన ప్రయత్నములు (108 ఉపనిషత్తులకు) జరగటము, - లోక కళ్యాణము కొరకై అవసరము. అత్యవసరము.
4. విశ్వ విద్యాలయములు ఇంటర్, గ్రాడ్యుయేటు, పోస్ట్ గ్రాడ్యుయేటు కోర్సులను ఉపనిషత్ విద్య కొరకై ప్రారంభించెదరు గాక!
5. 'ఉపనిషత్ అధ్యయనము' అనగా మరొక మతమును దూషించటమో, ద్వేషించటమో కాదు. **అన్ని మతముల అంతిమ సారాన్ని అధ్యయనము చేసి హృదయస్థము చేసుకోవటము.** మానవ-మాధవ (జీవాత్మ-పరమాత్మ) సంబంధమైన **నిర్దిష్టమగు సత్యాన్వేషణ.**

'మానవుడు' అనే సందర్భమును గురించిన ఇతః పూర్వపు-వర్తమాన-తదనంతరములను అధ్యయనము చేయటము.

ఈ జీవుని యొక్క స్వాభావికమైన **దివ్యత్వమును గమనించటము, ఆస్వాదించటమే - వేద హృదయము.**

**అట్టి వేద పరిభాషను మానవాళికి అందించటమే 'ప్రపంచశాంతి'కి అసలైన మార్గమని నా మనవి.**

వేదోపనిషత్ గానము అయినట్టి జన్మ-కర్మలకు ఆవలగల అమృత-ఆనందమయమగు స్వస్వరూపమును గమనించి, ఆస్వాదించటమే **'వేదవిద్య'** యొక్క మహదాశయము.

ఇట్టి మార్గములో మనమందరము ఆశయము కలిగి ఉండెదము గాక - అని సర్వాంతర్యామి అగు పరమాత్మకు ప్రార్థన.

## గురు నమస్కారము

గురుదేవులగు

శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారికి (శుకబ్రహ్మాశ్రమము - శ్రీకాళహస్తి).

శ్రీశ్రీశ్రీ మళయాళస్వామి వారికి (వ్యాసాశ్రమము - యేర్పేడు).

శ్రీశ్రీశ్రీ యేలేశ్వరపు రామకృష్ణయ్య గారికి (హరిదాసు, కూచిపూడి - అస్మత్ పితామహులు).

ఇంకా ఎందరో మార్గదర్శకులు. వారందరికీ నమో నమో నమో నమః।

**కృతజ్ఞతలు** - మాతృ పితృదేవతలు శ్రీ ఆదిలక్ష్మి కామేశ్వరమ్మ, లక్ష్మీనారాయణ దంపతులకు పాదాభివందనము. శ్రీమతి కనకదుర్గను జీవిత భాగస్వామిగా ప్రసాదించిన జగన్మాతకు నమస్కారములు. వారి తోడు **'అమూల్యము'.**

## కృతి సమర్పణ

ఎవ్వరైతే....,

- ఈ సమస్త జగత్తుకు **ఆధారుడై,** సమస్తము తానే అయి ఉన్నారో,
- ప్రపంచములోని మతములన్నీ **ఏ సర్వాత్మకుడగు పరమాత్మయొక్క** తత్త్వమును ఎలుగెత్తి గానము చేయుచున్నాయో, ఎవరిగురించి సమస్త ఋషులు, మునులు, ప్రవక్తలు, గురువులు **శృణ్వన్తి విశ్వే! "అదిగో! చూడండి"** - అని గొంతెత్తి ఘోషిస్తున్నారో,
- **ఏ తత్త్వ పురుషుని గురించి** గురుదేవులగు ఆచార్యులు స్వానుభవమును రంగరించి **"అదియే నీవు - తత్త్వమసి"** అని విడమర్చి చెప్పుచుండగా, శ్రవణము చేస్తున్న మనమంతా **'సోఽహమ్'** భావమును వృద్ధి చేసుకుంటూ ఉన్నామో,
- **ఏ అమృత స్వరూపుని గురించి** తత్త్వవేత్తలు ఆత్మానందభరితులై యుక్తి యుక్తం చెప్పుచుండగా, వేదాంతర్గతమగు 'ఉపనిషత్' వాఙ్మయము శ్రవణముచేసినవారిచే శ్రుతులుగా మనందరికీ ప్రసాదించబడిందో,





- శివుడు, విష్ణువు, నారాయణుడు, పద్మభువుడు, రాముడు, కృష్ణుడు, లలిత, అల్లా, యహెూవా, బుద్ధదేవ, మౌల సాయి, మహావీర, నానక్, అమ్మ ఈవిధంగా – ఏ **"అనంతుడు ఆద్యంత రహితుడు"** అగు పరమాత్మ **అసంఖ్యాక నామరూపములుగా** ప్రపంచములోని జనులందరిచే ఉపాసించబడుచూ, ఆరాధించబడుచూ, – ప్రేమించబడుచూ ఉన్నారో,
- గురువులు– **ఏ కేవలానంద ఆత్మ పురుషుని** తమ శిష్యులలో దర్శిస్తూ, శిష్యులకు తత్త్వబోధ చేస్తూ ఉండగా, **శిష్యులు – తమయందే, వేంచేసియున్న ఆ పరమాత్మ తమకు అభిన్నమని తెలుసుకొని బ్రహ్మానందభరితులగుచున్నారో,**
- **ఏ పరాత్పరుడు** ఒక చీమ నుండి సృష్టికర్త యగు బ్రహ్మ దేవుని వరకు మనందరి దృశ్యానుభవములకు ఆవల గల మన బుద్ధికి సాక్షి అయి వెలుగొందుచున్నారో, (యా బ్రహ్మాది పిపిలీకాంత తనుషుః ప్రోక్తా జగత్ సాక్షిణా),
- **ఏ పరంధాముడు** అనేకమంది ధ్యాత–వక్త–రచయితల స్వరూపుడై ఉపనిషత్తు వాఙ్మయమును, వ్యాఖ్యానములను తరతరాలుగా అందిస్తూ మనందరికీ మహెూపకారము చేస్తూ ఉన్నారో,
- ఏ **మహత్ అహంకారుడు** సమస్త జీవులలో "నేను – నేను" అను ప్రదర్శనముతో ఈ విశ్వ దృశ్యములు అసంఖ్యాక రీతులుగా ఆస్వాదించుచూ, మనలను తన మాయతో భ్రమింపజేస్తూ, ఇంతలోనే మనము శరణు వేడుచుండగా సర్వ స్వరూపుడై మన బుద్ధికి అనుభవమగుచున్నారో,
- **ఏ తురీయ స్వరూపుడు** మహర్షుల స్వరూపుడై ఈ బుద్ధిని ప్రేరేపిస్తూ, సమస్త పాఠక దేవతల స్వరూపుడై నన్ను ఈ మహత్తరమైన **'ఉపనిషత్ ఉద్యాన వనము'** అను మహా యజ్ఞమును నిర్వర్తింపజేస్తూ, నాపై అనుగ్రహముతో నాయొక్క **"జన్మ జన్మల అజ్ఞానాంధకారము"** అనే నిబిడాంధకారము (చిమ్మచీకటిని) తొలగిస్తూ ఉన్నారో...,
- **ఎవరిని గురించి** వేదోపనిషత్తులు విస్తారంగా చెప్పియుండి కూడా **"మేము చెప్పలేము కూడా"** – అని వెనుతిరిగి నమస్కరిస్తున్నాయో...,

**అట్టి జగత్ స్వరూపునికి, జగదతీతునికి, జగదానందునికి, జగత్ సంమోహ మోహినీ స్వరూపునికి, అవాక్ మాన గోచరునికి నమస్కరిస్తూ, సమస్తము ఆ పరాత్పరునికి, పరంధామునికి, "లోకకళ్యాణమగు గాక!" అని మనః పూర్వకంగా సమర్పిస్తున్నాను.**

తమ వంతు ఆర్థిక సహకారము అందిస్తున్న "ఆంధ్రాబ్యాంక్" సంస్థకు, సివిల్‌సప్లైస్ కార్పోరేషన్ వారికి తదితరులకు సర్వదా దిగ్విజయమగు గాక!

ఎంతో నేర్పు – ఓర్పులతో డి.టి.పి. ముద్రణలలో పరిశ్రమిస్తున్న చిరంజీవి బృందావనం సాయికుమార్, హసితా గ్రాఫిక్స్ అండ్ ప్రింటర్స్ – ఏలూరు, (సెల్ – 9704275472), కవర్ పేజి సుందరంగా తీర్చిదిద్దుతున్న చిరంజీవి పి. సుబ్రహ్మణ్యం, అరవింద గ్రాఫిక్స్ – ఏలూరు (సెల్ – 9848644882) – వీరిరువురికి శుభాశీస్సులు. ఈ కార్యక్రమము ద్విగిజయంగా కొనసాగటానికి చి॥ బృందావనం సాయికుమార్‌ను ఋషిపుంగవులు నాకు తోడుగా ప్రసాదించారు. ఈ మహత్తర అవకాశమును మా ఇద్దరికి ప్రసాదించిన పరమేశ్వరునికి – వేనవేల నమస్కారములు. దొరకునా, ఇటువంటి సేవ?

**శివార్పణమస్తు। శ్రీమన్నారాయణార్పణమస్తు। శ్రీకృష్ణార్పణమస్తు।**

**ఆత్మార్పణమస్తు। ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు।**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥**

*"భగవత్ భక్తజన-యోగజన-జ్ఞానజన చరణ కములోపాసకుడు, అధ్యయన విద్యార్థి"*

**యేలేశ్వరపు హనుమ రామకృష్ణ** B.Com., C.A.I.I.B.,
(Retd, Chief Manager - Andhra Bank)
D.No. 2/8, "Sri Vasista Rama Nilayam", Siva Temple Street, **Kuchipudi - 521 136** Krishna Dist. A.P. India
Cell : 9247105392, 7981610804 Land : 08671 - 251164
e-mail: yhrk2525@gmail.com Website: www.yhramakrishna.com





## ⌘—————— విషయ సూచిక ——————⌘

### సంపుటి - 1

ఋగ్వేదాంతర్గత



శుక్లయజుర్వేదాంతర్గత







⌘——————— # విషయ సూచిక ———————⌘

## <u>సంపుటి - 2</u>

### కృష్ణయజుర్వేదాంతర్గత-అనుష్ఠాన పాఠము



### కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (22)

# ⌘——— విషయ సూచిక ———⌘

## సంపుటి - 3

### కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (10)



### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (8)

# ⌘—————— విషయ సూచిక —————— ⌘

## సంపుటి - 4

### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (7)



### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (14)







# విషయ సూచిక

## సంపుటి - 5

### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (8)



### శుక్లయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తు (1)

### బృహదారణ్యకోపనిషత్



## సంపుటి - 6

### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (10)



### సామవేదాంతర్గత-ఉపనిషత్తు (1)

## సుషమ్ననాడి
## సప్తభూమికలు / చక్రములు / స్థానములు




7. సహస్రారము
కపాలమునుండి ఊర్ధ్వప్రదేశము వరకు
బ్రహ్మరంధ్రము / సుషిరగము
కపాల ఊర్ధ్వ స్థాన బిందువు

6. ఆజ్ఞా చక్రము / 'భ్రూ'మధ్య స్థానము

5. విశుద్ధ భూమిక / చక్రము
కంఠ స్థానము

4. అనాహత భూమిక / చక్రము
హృదయ స్థానము

3. మణిపూరక భూమిక / చక్రము /
కమలము – నాభి స్థానము

2. స్వాధిష్ఠాన భూమిక / చక్రము /
కమలము. మూలాధారమునకు బెత్తెడు
పైపైపుగా /ఉపరిగా

1. మూలాధార భూమిక / చక్రము /
కమలము, గుదమునకు కించిత్
పైపైపుగా



ఇడ–సుషమ్న–పింగళ

7. సహస్రారము
బ్రహ్మరంధ్రమునకు ఊర్ధ్వము, బీజాక్షరము = 'ఓం', విశ్వాకాశము/దహరాకాశము; 'ఓం' ఝుంకారనాదము; దేవత = పరబ్రహ్మము, సహస్రదళములు; శ్వాసలు = 1000.
బ్రహ్మరంధ్రమునకు (ఆవల) బాహ్యము = నాలో దేహము / జగత్తు,
బ్రహ్మరంధ్రమునకు ఈవల='దేహములో/జగత్తులో "నేను"

6. ఆజ్ఞా
భ్రూమధ్య ప్రదేశము, బీజాక్షరము = 'హ్రీం', మహా ప్రకృతి స్థానము; అబ్ధినాదము (తరంగముల ఘర్షణ శబ్దము); కెంపు వర్ణము; దళములు = '2', శ్వాసలు = 1000.

5. విశుద్ధ
కంఠప్రదేశము, బీజాక్షరము = 'హం', ఆకాశస్థానము; మేఘనాదము; స్ఫటిక వర్ణము; దళములు = '16', శ్వాసలు = 1000. దేవత = ఈశ్వరుడు/బిందువు.

4. అనాహత
హృదయ ప్రదేశము, బీజాక్షరము = 'యం', వాయు స్థానము; శంఖారావము; బంగారు వర్ణము; దళములు = '12', శ్వాసలు = 6000. దేవత = రుద్రుడు

3. మణిపూరక
నాభిప్రదేశము, బీజాక్షరము = 'రం', అగ్ని స్థానము; వేణునాదము; నీల వర్ణము; దళములు = '10', శ్వాసలు = 6000. దేవత = త్రినేత్రుడు

2. స్వాధిష్ఠాన
మూలాధారము–నాభిలమధ్య, బీజాక్షరము = 'వం', జల స్థానము; వీణానాదము; పీత వర్ణము; దళములు = '6', శ్వాసలు = 6000. దేవత = బ్రహ్మ

1. మూలాధారము
గుదమునకు పైపైపుగా, బీజాక్షరము = 'క్లీం', పృథివీ స్థానము; కింకిణీనాదము; కుంకుమ వర్ణము; దళములు = '4', శ్వాసలు = 600. దేవత = గణపతి



శ్లో॥ ఓమ్ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్!
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం,
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

---

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యాం పరిపాలయంతాం।
న్యాయేన మార్గేణ మహీం మేహేశాః।
గోబ్రాహ్మణేభ్యాః శుభమస్తు నిత్యం।
లోకాః సమస్తాః సుఖినో భవన్తు॥

ఓం అసతో మా సద్గమయ ।
తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతంగమయ ॥

ఓమ్ సహనావవతు । సహ నౌ భునక్తు! సహ వీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు । మావిద్విషావహైః ॥

ఓమ్ పూర్ణమదః। పూర్ణమిదం। పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే ॥

శ్లో॥ సర్వేஉస్య సుఖినస్సంతు సర్వేసంతు నిరామయా ।
సర్వే భద్రాని పశ్యంతు । మా కశ్చిత్ దుఃఖభాక్ భవేత్ ॥





శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥

శ్లో॥ అపుత్రాః పుత్రిణస్సంతు, పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనాస్సధనాస్సంతు, జీవంతు శరదాంశతమ్॥

శ్లో॥ దుర్జనో సజ్జనో భూయాత్! సజ్జనః శాంతిమాప్నుయాత్ ।
శాంతోముక్తేత బంధేభ్యో! ముక్తశ్చ అన్యాం విమోచయాత్ ॥

ఓమ్ మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం ।
చారు లీలావతారాయ శ్రీ రామకృష్ణాయ మంగళం ॥
వైకుంఠ పురవాసాయ లక్ష్మీనాథాయ మంగళమ్ ॥
మంగళం శ్రీ కురుక్షేత్ర రణక్షోణి విహారిణే ॥

ఓం ద్యౌః శాంతిః! అంతరిక్షమ్ శాంతిః! పృథివీ శాంతిః!
ఆపః శాంతిః! ఓషధయః శాంతిః! వనస్పతయః శాంతిః!
విశ్వే దేవాః శాంతిః! బ్రహ్మ శాంతిః! సర్వం శాంతిః!
శాంతిరేవ శాంతిః! సామా శాంతిరేధి!

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

ఓమ్ సర్వేషాం స్వస్తి ర్భవతు! ఓమ్ సర్వేషాం శాంతిర్భవతు ।
ఓమ్ సర్వేషాం పూర్ణం భవతు ॥
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

– ధర్మస్య విజయోఽస్తు – అధర్మస్య నాశోస్తు ।
– ప్రాణిసు సద్భావనాఽస్తు – విశ్వస్య కళ్యాణమస్తు।
– సర్వేజనాః సుఖినోభవంతు – సమస్త సన్మంగళాని సన్తు।
– అసతోమా సద్గమయ – తమసోమా జ్యోతిర్గమయ।
– మృత్యోర్మా అమృతంగమయ.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

❖❖❖





**వేదోపనిషత్ - అంతర్గత**

# శాంతి - మంగళ శ్లోకములు

| | |
|---|---|
| ఓం<br>1. శివనామ ని(వి)భావితే<br>అంతరంగే, మహతి జ్యోతిషి<br>మాననీమయాఽ_ర్థే<br>దురితాని అపయాన్తి దూరదూరే<br>ముహురాయాన్తి<br>మహాన్తి మంగళాని। | ఏ **పరమశివము** మహత్తరమై - అఖండజ్యోతి ప్రకాశ స్వరూపమై సర్వజీవుల హృదయాంతరంగములలో సదా వెలుగొందుచున్నదో- అట్టి పరమార్థమగు **శివ బ్రహ్మమును** స్తుతించుచున్నాము.<br>- మేము ఆరాధించు తత్త్వము మాయొక్క సర్వ దురితములను మా నుండి తొలగించును గాక!<br>**- మహత్తరము, మంగళ ప్రదము అగు పరబ్రహ్మ స్థానమునకు మమ్ములను తిరిగి చేర్చును గాక!** |
| 2. స్మృతే సకల కల్యాణ భాజనం<br>యత్ర జాయతే<br>పురుషస్యమ్ అజమ్,<br>నిత్యమ్ వ్రజామి శరణమ్।<br>హరిః ఓం॥ | సర్వ శుభములను చేకూర్చు కళ్యాణ భాజనుడు, జన్మరహితుడు, నిత్యుడు - అగు ఏ పరమ పురుషుని స్మృతులన్నీ గానం చేస్తూ చూపుచున్నాయో,...<br>**అట్టి ఓం కార స్వరూప శ్రీహరియగు విష్ణు భగవానుని మమ్ములను మాయనుండి దాటించుటకై శరణు వేడుచున్నాము.** |
| 3. ఓం వాక్ మే మనసి ప్రతిష్ఠితా।<br>మనో మే వాచి ప్రతిష్ఠితమ్।<br>ఆవిః ఆవీః మ(మే) ఏధి<br>వేదస్య మ (మే) ఆణీస్థః।<br>శ్రుతం మే మా ప్రహాసీః।<br>అనేన అధీతేన,<br>అహో రాత్రాన్ సందధామి।<br>ఋతమ్ వదిష్యామి।<br>సత్యమ్ వదిష్యామి।<br>తత్ మాం అవతు ।<br>తత్ వక్తారమ్ అవతు।<br>అవతు మాం।<br>అవతు వక్తారమ్॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | **ఓం కార పరబ్రహ్మమును స్మరించుచున్నాము.**<br>నా వాక్కు - నేను పలుకు పలుకులు నా మనస్సునందు సుస్థిరమై, ప్రతిష్ఠితమై ఉండును గాక!<br>నాయొక్క మనస్సు వాక్కునందు నెలకొని, ప్రతిష్ఠితమగును గాక! **మనస్సు ఒక తీరుగా, వాక్కు మరొక తీరుగా ప్రవర్తనము కలిగి ఉండకుండును గాక!**<br>ఓ పరంజ్యోతి స్వరూప పరమాత్మా! నా అజ్ఞానాంధకారమును పోగొట్టుటకై విజ్ఞాన దీపమును వెలిగించండి! మా మనో-వాక్కులు విజ్ఞానము కొరకై సమర్థమగును గాక!<br>మేము గురువుల నుండి, గ్రంథములనుండి ఎరుగుచున్నదంతా మాయందు సుస్పష్టము- సుస్థిరము అగును గాక!<br>వినుచున్నదంతా యథా - అర్థసహితంగా బుద్ధి-హృదయములలో ప్రవేశించి వికసించి ఉండును గాక!<br>అనేక రీతులుగా అధ్యయనము చేస్తున్న ఆత్మతత్త్వ విశేషాలు మేము రాత్రింబవళ్ళు - ఎల్లప్పుడు బుద్ధితో 'అవగతము' తో కూడుకొని అనుసంధానము చేయుచుండెదము గాక! ఋక్కులు (వేదోపనిషత్తులు, వేదవేత్తలు, ఆత్మవేత్తలు) చెప్పుచున్న ఋతమునే పలికెదము గాక! యథార్థమునే పలికెదము గాక! 'సత్' స్వరూపమగు చిదానంద పరబ్రహ్మము గురించియే చెప్పుకొను చుండెదము గాక!<br>**సర్వరక్షకుడగు ఆ పరబ్రహ్మ భగవానుడు** - నాకు, (వక్తారుడై నాకు బ్రహ్మ తత్త్వమును బోధిస్తున్న) గురుజనులకు కూడా - సదా రక్షకుడై ఉండును గాక!<br>నాకు, ఆచార్యవర్యులకు సర్వదా సర్వ సమృద్ధములు ప్రసాదిస్తూ... పరిపోషించుచుండును గాక!<br>**ఆధి - ఆత్మిక, ఆధి - దైవిక, ఆధి - భౌతిక త్రితాపములు ప్రశాంతమగు ఆత్మయందు ఆత్మత్వము పొంది సశాంతించును గాక!** |

| | |
|---|---|
| **4. ఓం పూర్ణమ్ అదః।<br>పూర్ణమ్ ఇదమ్।<br>పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।<br>పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ,<br>పూర్ణమేవ అవశిష్యతే॥<br>ఓం శాన్తి శాన్తి శాన్తిః॥** | 'పరాత్పర' స్వరూపమగు ఆ బ్రహ్మము సర్వదా (సర్వకాల - అవస్థలయందు) సదా పూర్ణము. (The Experiencer of the Experiencer is complete by **HIM** self).<br>'ఇహాత్మ' స్వరూప విభాగ విశేషములగు జీవాత్మ (The Experiencer) - జగత్తు (All that being experienced) లు కూడా పూర్ణమే!<br>పూర్ణమగు 'పరాత్మ' నుండియే పూర్ణమగు 'ఇహాత్మ' (జలంలో తరంగముల వలె) బయల్వెడలి సంప్రదర్శితమగుచున్నది.<br>(మట్టి నుండి కుండలు, బంగారము నుండి ఆభరణములు, జలము నుండి తరంగములు బయల్వెడలుచున్నప్పటికీ మట్టి - బంగారము - జలము సర్వదా యథాతథమై యున్న విధంగా) ....,<br>.... పూర్ణమగు పరమాత్మ నుండి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి అనుభవి స్వరూపుడగు జీవాత్మ బయల్వెడలి, సంప్రదర్శితుడగుచూ ఉన్నారు.<br>(సర్వజీవుల) స్వస్వరూపమగు పరమాత్మ (లేక) పరబ్రహ్మము సర్వదా యథాతథమే! పూర్ణమే!<br>**భ్రమాత్మకములగు తాపత్రయములు అట్టి ఓంకార పరబ్రహ్మమునందు సశాంతించునవై ఉండును గాక!** |
| **5. హరిః ఓం॥<br>సహ నా(నౌ) అవతు<br>సహ నౌ భునక్తు।<br>సహ వీర్యం కరవావహై।<br>తేజస్వినా (నౌ)<br>అధీతమ్ అస్తు।<br>మా విద్విషావ హై॥<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥** | **ఓంకార సర్వాత్మ స్వరూపుడగు శ్రీహరికి నమస్కరిస్తున్నాము.**<br>శిష్య - ఆచార్యులమగు మనమిరువురము సర్వజగద్రక్షకుడగు ఆ పరమాత్మచే సదా **సంరక్షించబడెదము** గాక!<br>సర్వజీవ పరిపోషకుడగు ఆ పరంధాముడు శిష్య - ఆచార్యులమగు మన ఇరువురిని **పరిపోషించును** గాక!<br>(గురు శిష్యులమగు) మనము ఇరువురము **ధైర్య - ఉత్సాహ - సాహసములచే వీర్యవంతులమై బ్రహ్మతత్త్వ - అధ్యయనమునందు పరిశ్రమించెదము గాక!** నిర్వర్తించెదము గాక! ఆ పరబ్రహ్మతత్త్వము మనపట్ల తేజోవంతమై స(సు)-ఫలప్రదమగును గాక!<br>(శిష్యునకు వినటము రాదు - ఆచార్యులకు చెప్పటము రాదు - ఇత్యాది) అల్ప భావములకు లోనై శిష్య - ఆచార్యులమగు మనమిరువరము పరస్పరము ద్వేషించుకొనకుండెదము గాక! ప్రేమించుకొనెదము గాక! మన ఇరువురి మధ్య ఆప్యాయత - ప్రపత్తులు వెల్లివిరియును గాక!<br>**దృశ్య - ద్రష్ట - దర్శన త్రయములు ఆత్మరూపమునందు సశాంతించినవగును గాక!** |
| **6. ఓం<br>శం నో మిత్రః। శం వరుణః।<br>శం నో భవతు అర్యమా।<br>శం న ఇంద్రో బృహస్పతిః।<br>శం నో విష్ణుః ఉరుక్రమః॥<br>నమో బ్రహ్మణే।<br>నమస్తే వాయో।<br>త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి।<br>త్వాం ఏవ ప్రత్యక్షం బ్రహ్మ-<br>అవాదిష్యామ్। (బ్రహ్మవదిష్యామి)।** | (పంచ ప్రాణములలోని 'ప్రాణము'నకు, 'పగలు'కు అభిమాన దేవతయగు) **మిత్ర భగవానుడు....,**<br>- ('అపానము'నకు, 'రాత్రి కాలము'నకు అభిమాన దేవతయగు) **వరుణ భగవానుడు...,**<br>- (దృష్టితత్త్వాభిమాని, పితృలోకములో శ్రేష్ఠుడు అగు) **అర్యమభగవానుడు...,**<br>- (త్రిలోకములలోని / ఈ దేహములోని ఇంద్రియ తత్త్వముల అభిమాని, అధి దేవత అగు) ..... **ఇంద్రభగవానుడు...,**<br>- (దేవతలకు గురువు, బుద్ధ్యభిమాన దేవత అగు) **బృహస్పతి భగవానుడు...,**<br>- (త్రివిక్రమావతారంలో త్రిపాదములతో భూమి - ఆకాశములను, అహంకార తత్త్వమును కొలచి వేసిన) ఉరుక్రమ బిరుదాంకితుడగు **విష్ణు భగవానుడు మాకు శుభములను, మనో ప్రశాంతతలను ప్రసాదించును గాక!** |

| | | |
|---|---|---|
| | **ఋతం అవాదిష్యామ్। (ఋతం వదిష్యామి)।**<br>**సత్యం అవాదిష్యామ్। (సత్యం వదిష్యామి)।**<br>**తత్ మామ్ ఆవీత్। (తన్మా మవతు)।**<br>**తత్ వక్తారమ్ ఆవీత్। (తద్వక్తారమవతు)।**<br>**ఆవీత్ (అవతు) మాం।**<br>**ఆవీత్ (అవతు) వక్తారమ్।**<br>**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥** | ఓ వాయు భగవాన్! ప్రాణస్వరూపా! ప్రాణేశ్వరా! సర్వ స్వరూపము - సర్వసాక్షి అగు పరబ్రహ్మమా! సర్వాత్మకుడా! ఆత్మదేవా! సర్వస్థితుడవగు మీకు భక్తి పూర్వకంగా నమస్కరిస్తున్నాము.<br>మిమ్ములను 'ప్రత్యక్ష బ్రహ్మము'గా (దృశ్యజగత్తును/విశ్వేశ్వరుడుగా) దర్శించుచున్నాము. స్తుతించుచున్నాము.<br>ఋగ్వేదములోని ఋక్కులచే, సర్వవేదములచే అభివర్ణించబడుచున్న 'ఋతము' అగు పరమాత్మను స్తుతించుచున్నాము.<br>'సత్' స్వరూప పరబ్రహ్మము గురించిన సత్యమును స్తుతించుచున్నాము.<br>అట్టి పరబ్రహ్మము నన్ను, నాకు తత్త్వజ్ఞానము బోధిస్తున్న ఆచార్యుల వారిని సదా రక్షించును గాక! ఉభయులను కాపాడును గాక!<br>**భూ భువర్ సువర్ త్రిలోక సర్వభేదములు నిర్మల పరబ్రహ్మ స్వరూపమునందు సశాంతించినవగు గాక!** |
| **7.** | ఓం<br>**అహం వృక్షస్య రేః ఇవ।**<br>**కీర్తిః పృష్ఠం గిరేః ఇవ।**<br>**ఊర్ధ్వ పవిత్రో వాజినీవ,**<br>**'స్వమ్' అమృతమస్మి।**<br>**ద్రవిణగ్ం సవర్చసమ్,**<br>**సుమేధాః అమృతో అక్షితః।**<br>**ఇతి త్రిశంకోః వేద అనువచనమ్॥**<br>**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥** | ఈ 'సంసారము' అను వృక్షమునకు 'ఆధారము' అయి ఉన్న 'రేః' - చైతన్య స్ఫూర్తి నేనే!<br>పర్వతముయొక్క శిఖరాగ్రమువలె నా 'కీర్తి'యే వేద-ఉపనిషత్ వాఙ్మయ పర్వత శిఖరముపై ప్రకాశమానమై యున్నది.<br>ఊర్ధ్వ పవిత్రత (ఘనత)గా సర్వత్రా ఉన్నది - నాలోని నేనైన ఆత్మయే! ఆకాశంలో ఎల్లప్పుడూ ప్రకాశించే సూర్యునికి ఉదయాస్తమయములు లేని తీరుగా నేను స్వయముగా... **జన్మ - మృత్యువులకు చెందనట్టి, సంబంధించనట్టి 'అమృత స్వరూపుడను' అయియే ఉన్నాను.**<br>ఈ దృశ్యమంతా నాకు సంపద అయినట్టి బ్రహ్మ వర్చస్సుచే సృష్టికళా విశేష సమన్వితుడను.<br>ఇదంతా నా చిదానందము! ఎరుకరూపము. వేదో వీక్షణము! బుద్ధి ప్రదర్శన చమత్కారము! ఇక నేనో మార్పు చేర్పులకు ఆవల, దృష్టికి ఆవల ... కేవల దృక్-అమృత-ఆనంద స్వరూపుడను!<br>ఇతి త్రిశంకు మహర్షి ప్రవచిస్తూ బోధించు వేద ప్రమాణముతో కూడిన అనువచనము. **దృశ్య - జీవ - ఈశ్వర భేదమంతా ఆత్మానందమునందు సశాంతించినవగును గాక!** |
| **8.** | ఓం<br>**యః (యం) ఛందసాం**<br>**ఋషభో విశ్వరూపః,**<br>**ఛందోభ్యో అధి అమృతాత్**<br>**సంబభూవ,**<br>**స మే ఇన్ద్రో మేధయా స్పృణోతు।**<br>**అమృతస్య దేవ ధారణో భూయాసమ్।**<br>**శరీరమ్ మే విచర్షణమ్।**<br>**జిహ్వా మే మధు మత్తమా।**<br>**కర్ణాభ్యాం భూరి విశ్రువమ్।**<br>**బ్రహ్మణః కోశోసి**<br>**మేధయా పిహితః।** | ఏ ప్రణవ నాదమును వేదములు ప్రప్రథమంగా పలుకుచున్నాయో, ఈ విశ్వమంతా ఎద్దానికి తన రూపమే అయి ఉన్నదో...,<br>ఏ 'ఓం' కారము అమృత రూపమై, ఆత్మరూపమై వేద వాఙ్మయము నుండి ప్రవచన - నిర్వచన రూపంగా ప్రకటించబడుచున్నదో...,<br>అట్టి మహత్తర ఆత్మ తత్త్వము నా ఇంద్రియములను, మేధస్సును (బుద్ధిని) విజ్ఞానరూపమై స్పృశించును గాక!<br>నేను ఇంద్రుడంతటి మేధస్సు కలిగియుండెదను గాక! ఓ ఆత్మదేవా! నేను అమృతరూపమగు బ్రహ్మజ్ఞాన 'ధారణ' పొందినవాడను అయ్యెదను గాక!<br>ఈ నా శరీరము బ్రహ్మతత్త్వము యొక్క శ్రవణ - మనన - నిదిధ్యాసల నిమిత్తమై అర్హము, ఆరోగ్యవంతము, ప్రజ్ఞాసమన్వితము అయి ఉండును గాక!<br>నా ఈ నాలుక - బ్రహ్మతత్త్వ విశేషాలను పలుకు మాధుర్యము కలిగి ఉండును గాక!<br>ఈ నా చెవులు ఆచార్యుల వద్ద నుండి బ్రహ్మతత్త్వ ప్రవచన వాక్యములు విరివిగా వినుటకు యోగ్యమై ఉండును గాక!<br>సంసార రూపములైనట్టి పంచకోశములకు సంబంధించిన బుద్ధిచే, మాయందు అంతరంగమున అనునిత్య ప్రకాశమైయున్న **పరబ్రహ్మము** కప్పబడినదై ఉన్నది. |

| | |
|---|---|
| శ్రుతం మే గోపాయ॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ ఆత్మ దేవా! మీ గురించి వినుచున్న మాటలచే (గురువాక్యములచే - వేదాంత సిద్ధాంతములచే), మీరు వినబడుచున్నవారై మమ్ములను గోపాయ - కాపాడండి! **మా యొక్క స్థూల - సూక్ష్మ - కారణ దేహములు ఆత్మ రూపము సంతరించుకొని, ఆత్మగా సశాంతించునవై ఉండును గాక!** |
| **9.** ఓం<br>ఆప్యాయన్తు మమ అంగాని<br>వాక్ ప్రాణః చక్షుః శ్రోత్రమ్ అథో బలమ్<br>ఇంద్రియాణి చ సర్వాణి।<br>సర్వమ్ బ్రహ్మ – ఔపనిషదమ్। (బ్రహ్మోపనిషదౌ)<br>మా అహమ్ బ్రహ్మ నిరాకుర్యామ్।<br>మా మా బ్రహ్మ నిరాకరోత్।<br>అనిరాకరణమ్ అస్తు।<br>అనిరాకరణమ్ మే అస్తు<br>తత్ ఆత్మని నిరతే<br>య ఉపనిషత్సు ధర్మాః,<br>తే మయి సన్తు।<br>తే మయి సన్తు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓంకార సంజ్ఞా సర్వతత్త్వ స్వరూపుడవగు ఓ పరమాత్మా! ఇది మా విన్నపము! వినండి. ఉపనిషత్తులచే చేతులెత్తి ప్రకటించబడుచున్న **బ్రహ్మము (లేక) సర్వాత్మకుడగు** పరమాత్మ మా యొక్క సర్వ అంగములను, వాక్కును, ప్రాణమును, కళ్ళను, చెవులను (కాళ్ళు-చేతులు, నడతలు, పనులు, మాటలు, శక్తి, చూపు, వినుచున్నవి - వీటన్నిటినీ) - బ్రహ్మోపాసనకై ఆప్యాయము, మధురము చేసి, సిద్ధము చేయును గాక!<br>- బ్రహ్మము (బ్రహ్మజ్ఞానము) నన్ను నిరాకరించకుండును గాక!<br>- నేను బ్రహ్మజ్ఞానమును నిరాకరించకుండుదును గాక! బ్రహ్మము - మేము పరస్పరము ఆదరణ, ఆప్యాయత కలిగి ఉండెదము గాక!<br>ఉపనిషత్తులు చెప్పు ఆత్మ ధర్మము గురించిన సమాచారము - విశేషముల అధ్యయనమునందు మేము నిరతులమై ఉండెదము గాక!<br>అట్టి పరబ్రహ్మము మమ్ము కాపాడును గాక! రక్షించును గాక!<br>**భూత - వర్తమాన - భవిష్యత్ త్రికాల కల్పనా విశేషమైనట్టిదంతా ఆత్మ స్వరూపమై, ఆత్మయందు లయించి - 'శాంత - ఆత్మత్వము'ను సంతరించుకొనును గాక!** |
| **10.** ఓం<br>భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।<br>భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।<br>స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।<br>వ్యశేమ దేవ హితం యత్ ఆయుః।<br>స్వస్తి నః ఇంద్రః వృద్ధశ్రవాః।<br>స్వస్తి నః పూషా విశ్వవేదాః।<br>స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః।<br>స్వస్తి నః బృహస్పతిః దదాతు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥<br>భద్రం మే అపివాతాయ మనః॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ దేవతలారా! మీరు ప్రసాదించిన ఈ చెవులతో మేము భద్రమగు (శుభ ప్రదమగు) దాని గురించియే (బ్రహ్మ తత్త్వమునే) వినుచుండెదము గాక!<br>యజన (యజ్ఞ - యాగ - యోగ ప్రయత్న) శీలురమగు మేము భద్రమైన దానినే (సర్వము బ్రహ్మముగా) చూచుచుండెదము గాక!<br>బలము - కలిగియున్న అంగములతో ఆరోగ్యవంతము అగు శరీరముతో - దేవతలచే ప్రసాదించబడిన ఆయుష్షును దేవతల హితముగా (దేవతలకు ప్రియముగా) - గడుపుచుండెదము గాక!<br>ఔన్నత్యముతో కూడిన వినికిడిగల, లోకాధిపతి అగు **ఇంద్ర భగవానుడు,** విశ్వతత్త్వము ఎరిగిన **సూర్యభగవానుడు,** దోషములను తొలగించి మమ్ములను పవిత్రులుగా తీర్చిదిద్దుదురు గాక! బుద్ధి కుశలుడగు **బృహస్పతి భగవానుడు** మాకు అనుగ్రహమును ప్రసాదించెదరు గాక! మాకు స్వస్థత కలుగజేయుదురు గాక!<br>మా మనస్సులకు ప్రాణేశ్వరులగు వాయు దేవులవారు శుభము, భద్రము కలుగజేయుదురు గాక! **ఓం శాంతిః శాంతిః శాంతిః॥** |
| **11.** యో బ్రహ్మనమ్ విదధాతి పూర్వమ్,<br>యోవై వేదాంశ్చ ప్రహిణోతి, తస్మై<br>తగ్ం అహమ్ ఆత్మబుద్ధి ప్రకాశమ్,<br>ముముక్షుర్వై శరణమ్<br>అహమ్ ప్రపద్యే॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | - ఏ పరబ్రహ్మము ఈ జగత్తుకు మునుముందే ఉన్నదై, ఈ జగత్ రూపముగా విస్తరించినదై ఉన్నదో,<br>- ఏది వేద - ఉపనిషత్తులచే 'తత్త్వమ్' శాస్త్రముగా స్తుతించబడుచున్నదో,<br>- అట్టి **ఆత్మ నా బుద్ధికి ప్రకాశమానమగుటకై...,**<br>**ముముక్షువునై ఆచార్యులను, బ్రహ్మజ్ఞులను, వేదాంత శాస్త్రమును శరణు వేడుచున్నాను.**<br>**సర్వము శాంతాత్మయందు సశాంతించును గాక!** |

శ్లో॥ ఓం మంగళమ్ గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళమ్॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 15 పరమహంస పరివ్రాజకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

**పరమహంస: 'సోఽహమ్ పరమ్' = "సమస్తమునకు ఆవలగల నేనైన నేనే నేను" అను ఎరుక కలవాడు.**
**పరివ్రాట్: అట్టి కేవలమగు 'సోఽహమ్' నందు సంచరిస్తూ సమస్తమును స్వస్వరూపంగా దర్శించువాడు.**

శ్లో॥ పారివ్రాజ్య ధర్మవన్తో
యన్(త్) జ్ఞానాత్ బ్రహ్మతాం యయుః
తత్ బ్రహ్మ ప్రణవైకార్థం
తుర్య తుర్యమ్ అహం భజే॥

ఏది తెలుసుకొని 'పరివ్రాజ్య' ధర్మము ఆశ్రయించిన వారు బ్రహ్మము తావే అగుచున్నారో, అట్టి ప్రణవ-ఏకార్థము అయినట్టిది, తురీయమునకే తురీయమైనది - అగు 'తత్' అర్థ బ్రహ్మమును స్తుతించుచున్నాము.

ఓం

మం॥ శ్లో॥

1. అథ పితామహః –
స్వ పితరమ్ ఆదినారాయణమ్
ఉపసమేత్య, ప్రణమ్య పప్రచ్ఛ :

ఒకానొక సందర్భములో పితామహులగు బ్రహ్మభగవానుడు - వారి పితృదేవులగు శ్రీమన్ ఆదినారాయణ స్వామిని దర్శించి హృదయపూర్వక ప్రణామములు సమర్పించారు. అనేక విశేషాలు శ్రవణం చేసి, ఇంకా ఈ విధంగా అడిగారు.

---

భగవన్! త్వత్(న్) ముఖాత్
వర్ణాశ్రమ ధర్మ క్రమం
సర్వం శ్రుతం విదితమ్, అవగతమ్।
ఇదానీం పరమహంస పరివ్రాజక
లక్షణం వేత్తుమ్ ఇచ్ఛామి।

**బ్రహ్మదేవుడు:** హే భగవన్! ఆదినారాయణ స్వామీ! మీరు నాకు వర్ణాశ్రమ ధర్మక్రమము గురించి అనేక విశేషాలు చెప్పగా, అవన్నీ విని నేను అనేక విశేషాలు అవగతము చేసుకోవటం జరిగింది.

ఇప్పుడిక **పరమహంస-పరివ్రాజక లక్షణముల** గురించి మీ వద్ద నుండి శ్రవణం చేయాలనే ఇచ్ఛ, ఉత్సుకత కలిగి ఉన్నాను. దయతో వివరించి చెప్పండి.

---

కః పరివ్రజనాధికారీ?
కీదృశం పరివ్రాజక లక్షణమ్?
కః పరమహంసః?
పరివ్రాజకత్వం కథమ్?
తత్ సర్వం మే బ్రూహి॥ ॥ఇతి॥

**"పరివ్రాజకుడు"** అని పిలువబడటానికి పరివ్రజన - అధికారి (అర్హుడు) ఎవరు?
పరివ్రాజక లక్షణములు ఏమేమి?
"పరమహంస" అనగా ఎవరు?
"పరివ్రాజకత్వము" అనేది ఎట్లా సిద్ధించగలదు?
ఈ ఈ విశేషాలన్నీ దయచేసి నాకు బోధించండి.

---

2. సహో వాచ భగవాన్ ఆదినారాయణః :
సద్గురు సమీపే సకల విద్యాపరిశ్రమజ్ఞో భూత్వా,
విద్వాన్ సర్వమ్
ఐహిక ఆముష్మిక
సుఖశ్రమం జ్ఞాత్వా,

ఆదినారాయణ భగవానుడు:
హే! బ్రహ్మదేవా! చెప్పుకుందాం వినండి.
ఎవరి బోధను 'సత్ రూపము' అగు తత్త్వజ్ఞానము (you are that) ఆశ్రయించి ఉంటుందో, అట్టి సద్గురువును ముముక్షువులు సమీపించెదరు గాక. ఆత్మతత్త్వము గురించి పరిశ్రమించి అధ్యయనము చేసెదరు గాక. ఐహికమైనవి, ఆముష్మికమైనవి అగు సుఖములన్నీ అనేక దుఃఖములు పర్యవసానముగా కలిగి ఉన్నదని గ్రహించెదరు గాక!

| | |
|---|---|
| **ఈషణా త్రయ, వాసనా త్రయ**<br>**మమత్వ-అహంకారాదికం**<br>**వాన్తాన్నమివ హేయమ్**<br>**అధిగమ్య, మోక్షమార్గైక సాధనో**<br>**బ్రహ్మచర్యం సమాప్య, గృహీ భవేత్॥** | - (భార్యేషణ, పుత్రేషణ, ధనేషణ అనే) **ఈషణాత్రయమును,**<br>- ("దేహవాసన, దృశ్యవాసన, శాస్త్రవాసన" అనబడే) **వాసనాత్రయమును,**<br>- **"ఇదంతా నాది. నాకు చెందినది. నేను దీని దీనికి చెందినవాడను. నేను ఇంతటి వాడను. ప్రత్యేకమైన వాడను"**- మొదలైన అహంకారరూప ఆయా సంబంధ బాంధవ్య అనుబంధములను -<br>**'కక్కినకూడు'** వలె ఈ జీవులు వదలి (అధిగమించి) ఉండెదరు గాక!<br>'మోక్షము'నకు బీజము అయినట్టి **బ్రహ్మచర్యము (సమస్తము బ్రహ్మముగా భావన చేయుటము)**ను బాల్యములోనే అభ్యసించాలి.<br>- అప్పుడు **"బ్రహ్మజ్ఞాన దృష్టితో సంఘములో ఎట్లా ఉండాలి?"** - అనే సూత్ర విధానము (శాస్త్రవిధానము) ఎరిగినవాడై **గృహస్థాశ్రమము స్వీకరించు గాక!** |
| **గృహాత్ వనీ భూత్వా ప్రవ్రజేత్।**<br>**యదివ ఇతరథా, బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్।**<br>**గృహాద్వా వనాద్వా, అథ పునః అవ్రతీ వా,**<br>**వ్రతీ వా, స్నాతకో వా, (అస్నాతకో వా)**<br>**ఉత్సన్నాగ్నిః, సాగ్నిః అనగ్నికో వా**<br>**యత్ అహరేవ విరజేత్**<br>**తత్ అహరేవ ప్రవ్రజేత్॥** | గృహస్థాశ్రమము నుండి-ప్రపంచమును (సాంఘిక జీవితమును) దాటివేయు, ప్రపంచాతీతత్వము వహించు అర్థముగల **వానప్రస్థాశ్రమమును - ఆశ్రయించును గాక।**<br>లేదూ, బ్రహ్మచర్యము నుండే కూడా "వానప్రస్థము" స్వీకరించవచ్చు.<br>ఒకడు గృహస్థుడుగా ఉన్నా, (లేక) వానప్రస్థుడుగా ఉన్నా, (లేక) వ్రతములు చేయనివాడైనా, చేయువాడైనా, స్నానశీలరతుడైనా, అస్నాతుడు (స్నానము చేయనివాడు) అయి ఉన్నా, ఉత్సన్నాగ్నికుడు (ఎల్లప్పుడు అగ్నిని వెలిగించి ఉంచుతూ ఉపాసన చేయువాడు) (నిత్య అగ్నిహోత్రుడు) అయినా, నిరగ్నిమంతుడైనా, అగ్నిమంతుడు అయినా కూడా →<br>- **ఏరోజు 'విరక్తుడు' అయితే ఆరోజే ప్రవ్రజుడు** (Leaving the Social Life) **అయి, సమస్తము వదలి సన్న్యాసమును స్వీకరించును గాక.** |
| **3.** **ఇతి బుద్ధ్వా సర్వ సంసారేషు**<br>**విరక్తో బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో వా,**<br>**పితరం మాతరం కళత్రం పుత్రమ్**<br>**ఆప్తబన్ధువర్గం తత్ అభావే**<br>**శిష్యం సహవాసినం వా**<br>**అనుమోదయిత్వా,** | **"(త్యాగేనైవతు కైవల్యమ్) - ఈ కనబడేవన్నీ దేహముతో సహా నన్ను విడువకముందే, నేను వీటిని మనస్సుతో విడచివేసి ఉండెదను గాక"**- అను బుద్ధిని సంపాదించుకొనును గాక. ఒకడు బ్రహ్మచారి అయినా, గృహస్థుడు అయినా, వానప్రస్థుడు అయినా కూడా - ఈ దృశ్యముపట్ల విరక్తుడై సన్యాసాశ్రమము స్వీకరించి, బుద్ధిని నిశ్చలపరచుకొనుచు **విరక్తుడు** అయి ఉండును గాక।<br>తండ్రి, తల్లి, భార్య, కుమారులు, తదితర ఆప్త బంధువుల వద్ద తన సన్న్యాసస్వీకారమునకు అంగీకారము పొందాలి. ఒకవేళ దగ్గిర బంధువులు లేకుంటే శిష్యుల వద్ద, సహవాసులవద్ద (తన తోటి వారివద్ద) అట్టి అనుజ్ఞ పొందును గాక! |
| **తద్ధైకే (తత్ హి ఏకే) ప్రాజాపత్యామే వేష్టిం కుర్వన్తి।**<br>**తదు తథా న కుర్యాత్**<br>**ఆగ్నేయ్యామేవ కుర్యాత్।** | ఆవిధంగా సన్న్యాసము స్వీకరించువారిలో కొందరు ముందుగా **ప్రజాపత్యేష్టి** అనే (అగ్న్యోపాసనతో కూడిన) వ్రతము చేయుచున్నారు.<br>అది నిర్వర్తించలేని వారు **'అగ్నేయాష్టి'** అనేది చేయవచ్చును. |
| **అగ్నిర్హి ప్రాణః ప్రాణమేవ ఏతయా కరోతి।**<br>**త్రైధాతవీయామేవ కుర్యాత్ ఏతయైవ**<br>**'త్రయో' ధాతవో యదుత**<br>**'సత్త్వం రజః తమ' ఇతి।** | అగ్నియే ప్రాణము. అట్టి ప్రాణశక్తియే ఈ సమస్తమును నిర్వర్తించు చున్నది.<br>అట్టి అగ్నికి త్రి (3) ధాతువులు. (1) సత్త్వము (2) రజము (3) తమము. అవియే త్రిగుణములు. ప్రాణశక్తి నిర్వర్తిస్తున్న ధారణయే త్రిగుణములు. మాయొక్క అశుచికరమగు ఇంద్రియ విషయములన్నీ కూడా |

| | |
|---|---|
| అయం తే యో నిర్బత్త్వియో<br>యతో జాతో అరోచథాః।<br>తం జానన్ అగ్న ఆరోహా<br>అథానో వర్ధయారయిమ్॥ | నాశనశీలములు, అభాగ్యములు. దుఃఖమే పరిణామముగా కలిగి ఉంటున్నాయి. కాబట్టి నిర్బతములు. అరుచియే అయి ఉన్న ఇంద్రియ విషయ వ్యవహారమంతా అగ్నిచేత భస్మము చేయబడు గాక! మేము ఋతము (సత్యము)ను ఆశ్రయించెదము గాక! అట్టి ఆత్మభావనచే ఆత్మయందు వర్ధనము (Progress) పొందెదము గాక! సత్యమగు 'ఆత్మ-ఆత్మభావన'యందు ప్రవేశించి ఉండెదము గాక! |
| ఇతి అనేన మంత్రేణ అగ్నిమ్ ఆజిఘ్రేత్।<br>ఏష వా అగ్నేః యోని ర్యః ప్రాణః।<br>ప్రాణం గచ్ఛ స్వాం యోనిం।<br>గచ్ఛ స్వాహేతి ఏవమ్ ఏవై తదాహ। | ఈ విధమైన ఆయా మంత్రములతో అగ్నిని ఉపాసిస్తూ, వాసన చూడాలి.<br>ప్రాణము అగ్ని నుండి జనిస్తూ అగ్నిని యోనిగా కలిగి యున్నది. అట్టి ప్రాణము ప్రాణేశ్వరుడగు ఆత్మదేవునియందు ప్రవేశించి సశాంతించి ఉండును గాక। |
| (తదాహ) గ్రామాః శ్రోత్రియాగారాత్ అగ్నిమ్ అహృత్య<br>స్వ విధ్యుక్త క్రమేణ పూర్వవత్ అగ్నిమ్ ఆజిఘ్రేత్। | శ్రోత్రియాగారము (పవిత్రమైన యజ్ఞశాల, దేవాలయము మొదలైన ప్రదేశము) నుండి అగ్నిని తీసుకురావాలి. వేదజ్ఞులచే నియమించిన విద్యుక్త విధిగా (As is commanded by ఋత్విజులు) అగ్నికి ఆహుతులను సమర్పించాలి. పైన చెప్పిన విధంగా అగ్నిని వాసన చూచి, ఇక సన్న్యాసాశ్రమమును స్వీకరించాలి, |
| యత్ ఆతురోవా అగ్నిం న విన్దేత్।<br>అప్సు జుహుయాత్<br>ఆపో వై సర్వా దేవతాభ్యో జుహోమి। (స్వాహా)॥ | **(ఆతురసన్న్యాసము:** మరణము సమీపిస్తున్నప్పుడు అగ్ని విధులను పాటించే సమయము, మంత్రములను అనుష్ఠించే శరీర స్థితి లేనప్పుడు స్వీకరించు సన్న్యాసము). అట్టి "ఆతుర సన్న్యాసము" స్వీకరించునప్పుడు అగ్ని కార్యమునకు అవకాశము సమయము లేకపోతే - అప్పుడు **"ఆపోవై సర్వా దేవతాభ్యో జుహోమి స్వాహా।"** అను మంత్రముతో నీటిలోనే సమస్తము సన్న్యసిస్తూ 'హోమము' చేయవచ్చును. |
| **4.** స్వాహేతి హుతా ఉద్ధృత్య<br>ప్రాశ్నీయాత్ ఆజ్యం<br>హవిః అనామయమ్ ఏష విధిః। | "స్వాహా" అని పలుకుచూ ఆజ్యము (నేయి)తో కూడిన హవిస్సును స్రువముతో (నేయిని ఆహుతి చేయటానికి ఉపయోగించే మాని గరిటెతో) చేయి ఎత్తి అగ్ని ద్వారా అనామయుడగు పరమాత్మకు సమర్పించాలి. ఇది వేదవిహితమగు విధి విధానము. |
| వీరాధ్వానేవ, అనాశకే వాసం ప్రవేశేవ<br>అగ్ని ప్రవేశే, మహాప్రస్థానే వా।<br>యత్ ఆతురః స్యాత్<br>మనసా వాచా వా సన్న్యసేత్। | వీరాధ్వాన విధిగా కాని, నాశక విధిగాకాని, **(సంప్రకాశవిధిగా గాని, అగ్నిప్రవేశ విధియందుగాని), మహాప్రస్థాన విధియందుగాని "<u>స్వాహా</u>"** అను మంత్రముచే హవిస్సును సమర్పించటమే విధి - విధానము.<br>ఆతురసన్న్యాసమైతే - 'నాది' అనబడు సమస్తమును మనస్సుతోను, వాక్కుతోను సన్న్యసించెదరుగాక. (అగ్నికార్యముయొక్క అవసరము లేదు) |
| ఏష పంథాః స్వస్థః క్రమేణైవ చేత్<br><u>"ఆత్మ శ్రాద్ధం", "విరజా హోమం"</u> కృత్వా,<br>అగ్నిమ్ ఆత్మని ఆరోప్య,<br>లౌకిక వైదిక సామర్థ్యం<br>స్వ చతుర్దశ కరణ ప్రవృత్తిం చ<br>పుత్రే సమారోప్య,<br>తదభావే శిష్యే వా,<br>తదభావే స్వాత్మన్యేవ వా, | సన్న్యసించునప్పుడు స్వస్థుడు (peaceful) అయి క్రమమును పాటిస్తూ ఆత్మశ్రాద్ధము, విరజాహోమము నిర్వర్తించాలి.<br>ఆ తరువాత ఆత్మను అగ్నియందు ఆరోపించాలి. **" ఈ సృష్టి అనబడే సమస్తమునకు ముందుగా అగ్నియే జ్వాజ్వల్యమై ఉన్నది"** అని మననము చేయాలి. **(అగ్నిమీళే పురోహితే)**।<br>లోకసంబంధమైన, వైదిక సంబంధమైన సమస్త సామర్థ్యములను, స్వకీయమైన కరణ ప్రవృత్తులను పుత్రుని పట్ల సమారోపణ చేయాలి. కుమారుని బ్రహ్మముగా (ఆత్మగా) భావించాలి. కుమారుడు లేకుంటే శిష్యునిపట్ల సమారోపణ చేయవచ్చును.<br>శిష్యుడు కూడా లేకుంటే స్వాత్మ (స్వకీయ జీవాత్మ) (once own salt) యందు సమారోప్యము చేయవచ్చును. |

| | |
|---|---|
| "బ్రహ్మ త్వమ్। యజ్ఞః త్వమ్।"<br>– ఇతి అభిమంత్ర్య,<br>బ్రహ్మ భావనయా ధ్యాత్వా,<br>సావిత్రీ ప్రవేశపూర్వకమ్<br>అప్సు సర్వ విద్యార్థ స్వరూపాం<br>బ్రాహ్మణ్యాధారాం<br>– వేద మాతరమ్ క్రమాత్<br>వ్యాహృతిషు త్రిషు ప్రవిలాప్య, | ఓ కుమారా! (లేక) ఓ శిష్యా! (లేక) ఓ ఆత్మపురుషా! (లేక) మమ ప్రకృతి- అంతర్గత జీవాత్మ స్వరూపమా!<br>**"నీవే బ్రహ్మవు! నీవే (ఈ సృష్టి) యజ్ఞమువు"** అని అభిమంత్రించాలి. బ్రహ్మభావనను ధ్యానించాలి.<br>సావిత్రీ ప్రవేశపూర్వకంగా, - సర్వ విద్యాధ్యయన స్వరూపి, బ్రహ్మవిద్యకు ఆధారము అగు వేదమాతకు జలతర్పణంగా వేదవిహితక్రమంగా '3' సార్లు వ్యాహృతులు ప్రవిలాపనము చేయాలి. (సమర్పించాలి) |
| వ్యాహృతి త్రయమ్ – 'అ'కార, 'ఉ'కార<br>'మ'కారేషు ప్రవిలాప్య,<br>తత్ సావధానేవ అపః ప్రాశ్య<br>ప్రణవేన శిఖామ్ ఉత్కృష్య, | "వ్యాహృతిత్రయము" అయినట్టి 'అ' కార, 'ఉ'కార, 'మ'కారము లందు సమస్తము ప్రవిలాప్యము చేయాలి (సమర్పించాలి).<br>తత్ పరబ్రహ్మతత్త్వ భావనయందు సావధానుడై (Fixed Attention), **("ఓం")** అని ప్రణవమును ఉచ్చరిస్తూ శిఖ (పిలక)ను ఛేదించాలి. |
| 5. యజ్ఞోపవీతం ఛిత్వా<br>వస్త్రమపి భూమౌ వా<br>అప్సు వా – విసృజ్య,<br>"ఓం భూః స్వాహా। ఓం భువః స్వాహా।<br>ఓగ్ం సువః స్వాహా।" – ఇతి। | - యజ్ఞోపవీతమును త్రెంచాలి.<br>- వస్త్రములను కూడా భూమిపైగాని, నీటిలోగాని వదలివేయాలి.<br>**"ఓం భూః స్వాహా! ఓం భువః స్వాహా! ఓగ్ం సువః స్వాహా!"** అని పలుకుచూ పరమాత్మకు సమర్పించాలి. [ (1) The Matter (2) The Thought (3) The Thinker (Individual Self) - All three be submitted to Al-mighty]. |
| (ఇతి) అనేన జాతరూప ధరో భూత్వా<br>స్వరూపం ధ్యాయన్,<br>పునః పునః ప్రణవం<br>వ్యాహృతి పూర్వకం | పుట్టినప్పటినుండి - వర్తమాన క్షణము వరకు ఏర్పడినవై ఉన్న సమస్త సంబంధ అనుబంధములను త్యజించి, అప్పుడే పుట్టిన పిల్లవానివలె స్వస్వరూపమును ధారణ చేయాలి.<br>**'ఓం'** అను ప్రణవమున మరల మరల **"అ-ఉ-మ"** - వ్యాహృతిపూర్వకంగా పలుకుచూ, **"ప్రాపంచకమైన సమస్తమును మనసా, వాచా వదులు చున్నాను"** అని పలుకుచూ వదలివేయాలి. |
| మనసా వచసాఽపి –<br>"సన్న్యస్తం మయా। సన్న్యస్తం మయా।"<br>"సన్న్యస్తం మయా।" – ఇతి<br>– మంద్ర మధ్యమ తార ధ్వనిభిః | మనస్సుతోను వాక్కుతోను కూడా -<br>**"నాచేత సమస్తము సన్న్యసించబడుతోంది"** - అనే భావనతో **"సన్న్యస్తం మయా"** - అని 3 సార్లు మంద్రముగాను, మధ్యమ - తార (దీర్ఘ) ధ్వనులతోను ధ్వని చేస్తూ వుండాలి. |
| త్రివారం త్రిగుణీకృత ప్రేషోచ్చారణం కృత్వా,<br>ప్రణవైక ధ్యాన పరాయణః సన్<br>అ(న)భయగ్ం సర్వ భూతేభ్యో మత్తః స్వాహేతి। | (పైన చెప్పినట్లు) మూడుసార్లు త్రిగుణీకృతంగా ప్రేష - ఉచ్చారణ చేస్తూ, ప్రణవైకంగా ధ్యానపరాయణుడై ఉండాలి.<br>**"అభయగ్ం సర్వభూతేభ్యో మత్తస్వాహా"** అంటూ, చేతులెత్తి **"సర్వ భూతజాలమును మమాత్మస్వరూపమే! కనుక అభయుడను"** అని ఎలిగెత్తి పలకాలి. |
| ఊర్ధ్వ బాహుః భూత్వా "బ్రహ్మాహమస్మి"<br>ఇతి "తత్త్వమసి" ఆది<br>వాక్యార్థ స్వరూప సంధానం కుర్వన్, | రెండు చేతులూ పైకి ఎత్తి<br>**నేను బ్రహ్మమునే అయి ఉన్నాను-బ్రహ్మాహమస్మి।**<br>**'నీవు' గా కనిపిస్తు ఉన్నదంతా బ్రహ్మమే అయి ఉన్నది-తత్త్వమసి।**<br>అను వేదోపనిషత్ మహావాక్యముల స్వరూపార్థమును అనుసంధానము చేస్తూ ఉండాలి. **(సోఽహమ్ - తత్త్వమ్ మహావాక్యముల అర్థ మననము).** |

| | |
|---|---|
| **ఉదీచీం దిశం గచ్ఛేత్**<br>**జాతరూప ధరశ్చరేత్ – ఏష సన్న్యాసః।** | దిగంబరుడై (వస్త్రములు విడచి), 10 దిక్కులను తన వస్త్రముగా (ఆత్మస్వరూపుడై) భావన చేస్తూ, ఉత్తరదిశగా అభిముఖుడై నడువ నారంభించాలి.<br>ఇది **"సన్న్యాసము"** అనబడుతోంది. |
| **తత్ అధికారీ భవేత్, యది (If) గృహస్థః**<br>**ప్రార్థనా పూర్వకమ్, అభయగ్ం**<br>**సర్వభూతేభ్యో మత్తః సర్వం ప్రవర్తతే॥** | గృహస్థుడు పైరీతిగా సన్న్యాసమునకు అధికారి అయితే, **"అభయగ్ం సర్వభూతేభ్యో। మత్తః సర్వం ప్రవర్తతే।"** - "సర్వభూతజాలముల అభయ స్వరూపమగు ఆత్మనగు నేనే। ఆత్మనగు నాచేతనే సమస్తము ప్రవర్తింపజేయబడుచు, క్షేమము పొందుచున్నది.<br>- ఆత్మపురుషుడునగు నాచేతనే [(14 లోకములలోని) సమస్తము ప్రవర్తనశీలమగుచున్నది।"<br>- అని మననమును నిశ్చితము, నిశ్చలము చేసుకొనును గాక।<br>ఓ ప్రార్థనా దేవీ (లేక) జపాదేవీ! నాయొక్క రక్షకుడగు సంజ్ఞుడవు నీవే। ఇంద్రుని వజ్రమువంటి దానవు! మాలోని దుష్టత్వమును, దుర్వార్తలను, పాపదృష్టులను తొలగించుము. ఆత్మానందము ప్రసాదించెదవు గాక. |
| **6. "సఖా మా గోపాయోజః, సఖాయో అసి।**<br>**ఇంద్రస్య వజ్రోఽసి, వార్త్రఘ్నః శర్మ మే భవ**<br>**యత్ పాపం తన్నివారయ" – ఇతి।**<br>**(ఇతి) అనేన మంత్రేణ**<br>**ప్రణవపూర్వకగ్ం సలక్షణం వైణవం**<br>**దండం కటిసూత్రం కౌపీనం**<br>**కమండలుం వివర్ణ వస్త్రమ్ ఏకం పరిగృహ్య,** | **మంత్రార్థము - కౌపీనము, దండము మొదలైన స్నేహితులారా! మీరు నా ఈ సన్న్యాసయోగమునకు రక్షకులై, సఖులై ఉండండి. ఇంద్రుని వజ్రమువలె ప్రాపంచక వ్యవహారములనుండి దోష దృష్టుల నుండి రక్షించండి.**<br>**"సఖా మా గోపాయోజః - - తన్నివారయ"** - మంత్రమును పలుకుచు ప్రణవపూర్వకంగా సంజ్ఞగా - చక్కటి లక్షణములుగల వైణవదండము (వెదురు దండము)ను వైణవ కటిసూత్రము (నడుముకు కట్టే త్రాడు)ను, కౌపీనము (గోచి)ను, కమండలువు (జలపాత్ర)ను, వివర్ణ అంగవస్త్రమును పరిగ్రహించాలి. |
| **సద్గురుం ఉపగమ్య, నత్వా**<br>**గురుముఖాత్ 'తత్ త్వమ్ అసి'**<br>**– ఇతి వాక్యమ్ ప్రణవపూర్వకమ్ ఉపలభ్య।** | సద్గురువును సమీపించి వారికి నమస్కరించి గురుముఖతః **"తత్త్వమసి" "నీవుగా కనిపించే సమస్తము తత్ - పరమాత్మయే"** అను మహావాక్యార్థమును శ్రవణ - మనన - బుద్ధి పూర్వకంగా పొందాలి. |
| **అథ జీర్ణ వల్కలాజినమ్ ధృత్వా,**<br>**అథ జలావతరణమ్ ఉర్ధ్వగమనమ్**<br>**ఏకభిక్షాం పరిత్యజ్య, త్రికాలస్నానమ్ ఆచరన్–**<br>**వేదాంత శ్రవణపూర్వకం**<br>**'ప్రణవ' అనుష్ఠానం కుర్వన్,** | జీర్ణమైన నారబట్టలను ధరించుచు,<br>జలములో ప్రవేశ - నిష్క్రమణములను వదలివేసి, ఏకభిక్షను కూడా పరిత్యజించుచు,<br>**వేదాంత శాస్త్రపూర్వకంగా ప్రణవ అనుష్ఠానమును రోజుకు మూడుసార్లు ఆచరించును గాక।** |
| **బ్రహ్మమార్గే సమ్యక్ సంపన్నః**<br>**స్వాభిమతమ్ ఆత్మని గోపయిత్వా**<br>**నిర్మమో, అధ్యాత్మనిష్ఠః।** | బ్రహ్మమార్గములో సమ్యక్ (సర్వ సమదృష్టి) యోగ సంపదా సంపన్నుడగు చుండును గాక।<br>సమస్త స్వాభిమతములను ఆత్మయందు (ఆత్మభావనయందు) లయింపజేసివేయును గాక।<br>'నాది' అను మమకారము త్యజించినవాడై,<br>సర్వత్ర **'ఆత్మ సందర్శనము'** అను **'ఆధ్యాత్మనిష్ఠ'** ను ఆశ్రయించును గాక! |

| | |
|---|---|
| **కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య<br>దంభ దర్ప అహంకార అసూయా<br>గర్వ ఇచ్ఛా ద్వేష హర్ష – ఆమర్ష<br>మమత్వాదీంశ్చ హిత్వా....** | "ఇంకా ఏదో కావాలి" అనే కామమును,<br>పగ-కోపావేశరూపమగు క్రోధమును,<br>దాచుకొనే - మమకార స్వభావమగు **లోభమును,**<br>అవివేకరూపమగు **మోహమును,**<br>ధన-జన-బల-అధికారరూపమగు **మదమును,**<br>ఇతరులను బాధించే (Sadism) **మత్సర్యమును (గర్వమును), ఇచ్ఛను, ద్వేషమును,**<br>సంతోష దుఃఖ రూపములగు **హర్ష-అమర్షములను,**<br>**"నాకు వీరు చెందినవారు. నేను వీరికి చెందిన వాడిని"** - అను రూపముగల **మమత్వము** మొదలైన (ఆసురీ) సంపత్తిని త్యజించును గాక। |
| **జ్ఞానవైరాగ్యయుక్తో,<br>విత్త స్త్రీ పరాఙ్ముఖః। శుద్ధమానసః।** | ఆత్మజ్ఞానమును ఆశ్రయిస్తూ, క్రమంగా దృశ్యముపట్ల వైరాగ్యమును పెంపొందించుకొనును గాక।<br>ధనము, స్త్రీ మొదలైన సంపద విశేషములపట్ల విరక్తుడై ఉండును గాక।<br>(మనస్సును **'ఆత్మతత్త్వ మననము'** నందు నియమిస్తూ) శుద్ధ మానసుడై ఉండును గాక। |
| **సర్వ ఉపనిషదర్థమ్ ఆలోచ్య।<br>"బ్రహ్మచర్య", "అపరిగ్రహ" "అహింసా"<br>సత్యం – యత్నేన రక్షయన్।** | ఉపనిషత్తులు ఎలుగెత్తి చెప్పుచున్న స్వస్వరూపాత్మయొక్క తత్త్వమును విచారణ చేయుచుండును గాక! (సమస్తము బ్రహ్మముగా భావన చేయు అభ్యాసమగు) **బ్రహ్మచర్యము,** (దృశ్యమును బాహ్యముననే త్యజించి ఉండు) **"అపరిగ్రహము"**ను, **అహింసను, సత్యమును, ధృతమును** ప్రయత్నపూర్వకంగా పరిరక్షించుకుంటూ ఉండును గాక। |
| **7. జితేంద్రియో బహిరంతః<br>స్నేహవర్జితః శరీర సంధారణార్థం<br>త్రిషు వర్ణేషు అభిశస్త పతిత వర్జితేషు<br>పశు అద్రోహీ భైక్షమాణో<br>బ్రహ్మభూయాయ భవతి।** | ఈ విధంగా బాహ్యేంద్రియములైనట్టి శబ్ద స్పర్శ రూప గంధములకు, అంతరింద్రయములైనట్టి మనో - బుద్ధి చిత్త అహంకారములకు వశము కానివాడై ఉండునుగాక". **"ఇది నాకు చెందినది. నేను దీనికి చెందిన వాడను"** - అను రూపముగల స్నేహబంధములను, (రాగ- లోభములను) వదలియుండును గాక।<br>త్రివర్ణములలో అభిశస్తులను, పతితులను వదలి, మిగిలినవారి ఇళ్ళలో భిక్ష స్వీకరిస్తూ జీవించును గాక।<br>[ **అభిశస్తులు = (1) ఇతరులకు హాని చేయు ఉద్దేశ్యము కలవారు. (2) హింసించువారు (3) దోషారోపణములు చేయుటమే అలవాటుగా కలవారు (4) ఎల్లప్పుడు నిందారోపణలు చేయువారు**].<br>**పతితులు** = పాప అభ్యాసులు, పశుస్వభావులు.<br>ఇట్టి స్వభావము గలవారి వీరి వీరి ఇళ్లలో భిక్ష అడుగక, తదితరుల అందరి ఇళ్లలో భిక్ష స్వీకరించును గాక! ఎవ్వరిపట్ల కూడా దోషబుద్ధి కలిగి ఉండ కుండును గాక! అట్టి బ్రహ్మతత్త్వాభ్యాసి-బ్రహ్మమును సిద్ధించు కొనగలడు. |
| **సర్వేషు కాలేషు లాభ – అలాభౌ సమౌ భూత్వా,<br>కరపాత్ర – మాధూకరణేన అన్నమ్ అశ్నన్<br>మేదోవృద్ధిమ్ అకుర్వన్** | లాభ - అలాభముల పట్ల సమదర్శి అయి ఉండునుగాక. చేతులనే "భిక్షపాత్ర"గా కలిగియుండి మధూకరవృత్తిగా (భిక్షాటనగా) లభించిన ఆహారమును స్వీకరిస్తూ, ఆకలి తీరటమే లక్ష్యమై ఉండు గాక. అంతేగాని "మేదో (కండ) పుష్టి" మొదలైనవి లక్ష్యము అవకుండును గాక. |

| | |
|---|---|
| **కృశీభూత్వా**<br>**"బ్రహ్మాహమస్మి" – (బ్రహ్మమ్–అహస్మి)**<br>**ఇతి భావయన్,** | **కృశీభూత్వా:** శరీరమును, ఇంద్రియములను బ్రహ్మజ్ఞాన-అధ్యయనము నందు నియమిస్తూ శమదమములు అభ్యసించునుగాక।<br>**"నేను బ్రహ్మమునే"** అను భావమును గుర్తు చేసుకుంటూ సమస్తము బ్రహ్మముగా భావించువాడై ఉండును గాక! |
| **గుర్వర్థమ్ గ్రామమ్ ఉపేత్య,**<br>**ధ్రువశీలో। అష్టౌమాస్య ఏకాకీ చరేత్।**<br>**ద్వావేవ ఆచరేత్।** | గురువు కొరకై (ఆహారము కొరకు, గురువాక్యములు ప్రచారము కొరకు) గ్రామగ్రామములు సంచరించు శిష్యుడై ఉండునుగాక! (కుటీచక సన్న్యాసి)<br>సంవత్సరములో '8' మాసములు ఒకచోట నిలువక సంచారములు నిర్వర్తించుచు, 4 నెలల (లేక) 2 నెలల కాలము చాతుర్మాస్యము (ఒకచోట ఉండటము) అవకాశానుసారంగా (బహూదక, హంస, పరమహంస మొ॥వారు) నిర్వర్తించెదరు గాక। |
| **యదా అలం బుద్ధిః భవేత్ తదా–**<br>**కుటిచకో వా, బహూదకో వా,**<br>**హంసో వా, పరమహంసో వా** | బుద్ధియొక్క-విషయములనుండి విరామము (అలం) రూపమగు **నిర్మలత్వము** సిద్ధించాలనే ఆశయముతో చతుర్విధ సన్న్యాసులగు (1) కుటీచక (3) బహూదక (3) హంస (4) పరమహంస జీవిత విధానములలో ఒకానొకటి నిర్వర్తించును గాక. |
| **తత్ తత్ మంత్ర పూర్వకం**<br>**కటిసూత్రం, కౌపీనం దండం,**<br>**కమండలుం – సర్వం అప్సు విసృజ్య**<br>**అథ, "జాతరూపధరః" చరేత్॥** | శాస్త్రములు సూచిస్తున్న విధంగా సన్న్యాసము ఆశ్రయించును గాక। మంత్రపూర్వకంగా (కుటీచక, బహూదక, హంస, పరమహంసల సన్న్యాసవిధులను అనుసరించి) కటిసూత్రము (మొలత్రాడును), కౌపీనమును, (బ్రహ్మదండమునకు గుర్తు అయిన) దండమును, కమండలము - జలములో వదలివేసి **జాతరూపధరుడై** - (అప్పుడే పుట్టిన బిడ్డయొక్క విషయసంబంధ రహిత మనోబుద్ధులు కలవాడై) చరించును గాక। |
| **8.** గ్రామ – ఏకరాత్రమ్।<br>**తీర్థే – త్రిరాత్రమ్।**<br>**పట్టణే – పంచరాత్రమ్।**<br>**క్షేత్రే – సప్తరాత్రమ్।** | **పరమహంస, పరివ్రాజకులు - నివాస సమయము**<br>- గ్రామములో అయితే - **ఒక్క రాత్రి** (రోజు) మాత్రమే,<br>- తీర్థప్రదేశములో - **మూడు రాత్రులు** మాత్రమే,<br>- పట్టణములో - **ఐదు రాత్రులు** మాత్రమే,<br>- ముఖ్యక్షేత్రములలో - **ఏడు రాత్రులు** మాత్రమే,<br>**నివసించువారై ఉంటారు.** |
| **అనికేతః। స్థిరమతిః। అనగ్నిః।**<br>**సేవీ। నిర్వికారో....**<br>**నియమ – అనియమమ్ ఉత్సృజ్య,** | ఈ విధంగా ఒకచోట స్థిరనివాసము కలిగి ఉండక 'అనికేతుడు' అయి ఉంటున్నారు.<br>పరబ్రహ్మోపాసనపట్ల నిశ్చలచిత్తుడు అగుచున్నారు.<br>అగ్నికార్యములు (యజ్ఞ యాగములు మొదలైనవి) నిర్వర్తించటము వారికి ఉండదు.<br>సమస్త జగద్విషయములపట్ల నిర్వికారులై ఉంటారు.<br>నియమ అనియమములను (శాస్త్రములు చెప్పే చేయవలసినవి - చేయకూడనివి) మొదలైన ఆచారములకు వారు పరిమితులు కారు. |

| | |
|---|---|
| ప్రాణసంధారణార్థం అయమేవ<br>లాభాలాభౌ సమౌ భూత్వా,<br>గోవృత్త్యా భైక్షమ్ ఆచరన్।<br>ఉదకస్థల కమండలుః।<br>అబాధక రహస్యస్థల వాసో। | ప్రాణ - సంధారణను ఉద్దేశించి మాత్రమే ఆహారము స్వీకరించువారై ఉంటారు. (అంతేగాని రుచి ఇష్టము మొదలైనవాటి దృష్టితో కాదు)<br>లభించువాని గురించి, లభించనివాటి గురించి వారు సమదృష్టి - కలిగి ఉంటారు.<br>గోవు ఏది లభిస్తే, అదే సంతోషముగా స్వీకరించువిధంగా, భిక్షాటణనము (భిక్షము)చే స్వాభావికంగా (In its natural course) లభించినది స్వీకరించు వారై ఉంటారు.<br>జలము కొరకు మాత్రమే కమండలము కలిగి ఉంటారు. (అంతేగాని ఆయా విలువైన వస్తువులు దాయటానికి కాదు)<br>ఎవ్వరికీ బాధ కలిగించరు. ఏకాంతవాసి (Alone) అయి ఉంటారు. |
| న పునః లాభాలాభ రతః।<br>శుభాశుభ కర్మ నిర్మూలనపరః।<br>సర్వత్ర భూతల శయనః।<br>క్షౌరం కర్మ పరిత్యక్తో।<br>యుక్త చాతుర్మాస్య వ్రతనియమః। | లాభ నష్టముల గురించి, శుభ అశుభ కర్మల వ్యవహారముల గురించి వ్యసనము కలిగి ఉండక, వదలి ఉంటారు.<br>ఈ భూమి అంతా వారికి శయన మందిరమే.<br>క్షౌరకర్మల వదలి ఉంటారు. అవకాశములను అనుసరించి చాతుర్మాస వ్రతుడు (లేక) ద్విమాస వ్రతుడు అయి ఉంటారు. |
| శుక్ల ధ్యాన పరాయణో।<br>"అర్థ, స్త్రీ, పుర పరాఙ్ముఖో।<br>అనున్మత్తోఽపి ఉన్మత్తవత్ ఆచరన్।। | సాత్త్విక గుణములతో, కేవలమగు పరబ్రహ్మము గురించి ధ్యాన పరాయణులై ఉంటారు.<br>ధనము - స్త్రీ - పురనివాసముల పట్ల పరాన్ముఖులై (స్వీకరించని వారై, దరిచేరనివారై) ఉంటారు.<br>పరమహంస పరివ్రాజకుడు బ్రహ్మజ్ఞానముచే మహాప్రాజ్ఞుడు. 'దృశ్యవ్యసనము' అనే ఉన్మత్తత ఆతనిని స్పృశించదు. అట్లయి కూడా, లోకసంబంధమైన విషయాలపట్ల 'పిచ్చివాడు' (లేక) 'తెలియనివాడు', సామాన్యుడు - వలె కనబడుతూ ఉంటారు. |
| అవ్యక్త లింగో, అవ్యక్త ఆచారో,<br>దివా నక్తమపి వా అస్వప్నః<br>స్వరూపానుసంధాన బ్రహ్మ<br>ప్రణవత్ ధ్యాన మార్గేణ, బహిః సన్న్యాసేన<br>దేహత్యాగం కరోతి,<br>స "పరమహగ్ంస పరివ్రాజకో" భవతి। | ఈవిధంగా అవ్యక్తమైన (బయటకు కనబడని) - ఆత్మభావన సమన్వితమగు అంతరంగమును, ఆచారములను (Not Outwardly exhibited Inner Heart and inner practices ) కలిగి ఉంటారు. **రాత్రింబవళ్లు ఆత్మోపాసనయందే నియమితులు అయి ఉంటారు. జగద్దృశ్యముపట్ల కల్పనలన్నీ త్యజించి ఉంటారు.**<br>ఎల్లప్పుడు స్వస్వరూపానుసంధానము (Connection with Permanent Self) కలవాడై, ఆత్మధ్యాని అయిఉంటారు.<br>**బాహ్య-అభ్యంతర సన్న్యాసముచే దేహము నశించిన వస్తువుగా దర్శించు వాడు, దేహభావములన్నీ వదలినవాడు - పరమహంస పరివ్రాజకుడు.** |
| బ్రహ్మోవాచ :<br>9. "భగవన్। బ్రహ్మ ప్రణవః కీదృశ?" –<br>– ఇతి బ్రహ్మా పృచ్ఛతి। | బ్రహ్మదేవుడు: భగవాన్! శ్రీమన్ నారాయణస్వామీ! బ్రహ్మప్రణవము ఎట్టిదో విశదీకరించి చెప్పండి.<br>**శ్రీమన్నారాయణుడు** - బ్రహ్మ ప్రణవము "16" మాత్రలు కలిగిఉన్నట్టిది. |

| | |
|---|---|
| **సహోవాచ నారాయణః :**<br>**బ్రహ్మ ప్రణవః**<br>**షోడశ మాత్రాత్మకః।**<br>**సో అవస్థా చతుష్టయ గోచరః।**<br>**– "జాగ్రత్" అవస్థాయాం జాగ్రదాది**<br>**చతస్రో అవస్థాః ।**<br>**– "స్వప్నే" స్వప్నాది చతస్రో అవస్థాః।**<br>**– "సుషుప్తౌ" సుషుప్త్యాది చతస్రో అవస్థాః।**<br>**– తురియే తురీయాది చతస్రో అవస్థా భవంతీతి।** | అది 4 అవస్థలలో గోచరమై (కనబడుచూనే) ఉన్నట్టిది.<br>జాగ్రత్‌లో - (**జాగ్రత్ జాగ్రత్, జాగ్రత్ స్వప్నము, జాగ్రత్ సుషుప్తి, జాగ్రత్ తురీయము** అను) - **జాగ్రదాది చతుర్ అవస్థలు.**<br>స్వప్నములో - (**స్వప్న జాగ్రత్, స్వప్న స్వప్న, స్వప్న సుషుప్తి, స్వప్న తురీయ** - అను) - **స్వప్నాది నాలుగు అవస్థలు.**<br>సుషుప్తిలో - (**సుషుప్తి జాగ్రత్, సుషుప్తి స్వప్నము, సుషుప్త సుషుప్తి, సుషుప్తి తురీయము** - అనబడే - **సుషుప్త్యాది చతుష్టయ అవస్థలు)**<br>తురీయములో - (**తురీయ జాగ్రత్, తురీయ స్వప్నము, తురీయ సుషుప్తి తురీయ తురీయము అనబడే నాలుగు తురీయావస్థలు** ఏర్పడినవై ఉన్నాయి. |
| **జాగ్రత్ అవస్థాయాం విశ్వస్య –**<br>**చాతుర్విధ్యమ్।**<br>**(1) "విశ్వవిశ్వో (2) విశ్వతైజసో (3) విశ్వప్రాజ్ఞో**<br>**(4) విశ్వతురీయ" – ఇతి।**<br>**స్వప్నావస్థాయాం తైజసస్య**<br>**చాతుర్విధ్యమ్।**<br>**(1) తైజస విశ్వః (2) తైజస తైజసః**<br>**(3) తైజస ప్రాజ్ఞః (4) తైజస తురీయ – ఇతి।** | జాగ్రత్ సంబంధమైన పురుషకారము విశ్వుడు. అట్టి విశ్వుడు 4 విధములుగా ప్రదర్శితుడు.<br>(1) విశ్వవిశ్వుడు (2) విశ్వతైజసుడు (3) విశ్వప్రాజ్ఞుడు (4) విశ్వ తురీయుడు.<br>స్వప్నావస్థకు సంబంధించిన పురుషకారము - తైజసుడు<br>ఆతడు 4 రీతులుగా ప్రదర్శితుడు<br>(1) తైజస విశ్వుడు<br>(2) తైజస తైజసుడు<br>(3) తైజస ప్రాజ్ఞుడు<br>(4) తైజస తురీయుడు |
| **సుషుప్త్యవస్థాయాం ప్రాజ్ఞస్య**<br>**చాతుర్విధ్యం చ।**<br>**(1) ప్రాజ్ఞ విశ్వః (2) ప్రాజ్ఞతైజసః**<br>**(3) ప్రాజ్ఞప్రాజ్ఞః (4) ప్రాజ్ఞతురీయ – ఇతి।** | సుషుప్త్యవస్థకు సంబంధించిన పురుషకారమును 'ప్రాజ్ఞుడు'' అని అంటున్నారు. అట్టి ప్రాజ్ఞుడు 4 రీతులు గా ప్రదర్శమగుచున్నాడు.<br>(1) ప్రాజ్ఞ విశ్వుడు (2) ప్రాజ్ఞ తైజసుడు (3) ప్రాజ్ఞ ప్రాజ్ఞుడు (4) ప్రాజ్ఞ తురీయుడు |
| **తురీయావస్థాయాం తురీయస్య చ**<br>**చాతుర్విధ్యమ్।**<br>**(1) తురీయ విశ్వః (2) తురీయ తైజసః**<br>**(3) తురీయ ప్రాజ్ఞః (4) తురీయ తురీయ ఇతి॥**<br>**తే క్రమేణ షోడశమాత్ర ఆరూఢాః॥** | **తురీయమునకు సంబంధించి 4 తురీయ పురుషకారములు:**<br>(1) తురీయ విశ్వుడు (2) తురీయ తైజసుడు (3) తురీయ ప్రాజ్ఞుడు (4) తురీయ తురీయుడు.<br>ఈ విధంగా జాగ్రత్ స్వప్నసుషుప్తి తురీయా పురుషకారములు "4×4 = 16" షోడశమాత్రలు (16 Types of Appearnces) - ఆరూఢత (occupation, documented) ఏర్పడి ఉంటున్నాయి. |
| **10. 'అ' కారే జాగ్రత్ విశ్వః।**<br>**'ఉ' కారే జాగ్రత్ తైజసః।**<br>**'మ' కారే జాగ్రత్ ప్రాజ్ఞః।**<br>**అర్ధమాత్రా యాం జాగ్రత్ తురీయః।** | 'అ' కారము - జాగ్రత్ విశ్వుడు<br>'ఉ' కారము - జాగ్రత్ తైజసుడు<br>'మ' కారము - జాగ్రత్ ప్రాజ్ఞుడు<br>అర్ధమాత్ర - జాగ్రత్ తురీయుడు |

| | |
|---|---|
| **బిందౌ స్వప్న విశ్వో।**<br>**నాదే స్వప్న తైజసః।**<br>**కలాయాం స్వప్న ప్రాజ్ఞః।**<br>**కలాతీతే స్వప్న తురీయః।** | బిందువు - స్వప్నవిశ్వుడు<br>నాదము - స్వప్నతైజసుడు<br>కలా - స్వప్నప్రాజ్ఞుడు<br>కాలాతీతము - స్వప్నతురీయము |
| **శాంతౌ – "సుషుప్త విశ్వః"।**<br>**శాంత్యతీతే – "సుషుప్త తైజసః"।**<br>**ఉన్మన్యాగ్ం – "సుషుప్త ప్రాజ్ఞః"**<br>**మన ఉన్మన్యాగ్ం (మనోన్మన్యాగ్ం)**<br>**– "సుషుప్త తురీయః"।** | శాంతి - సుషుప్త విశ్వము<br>శాంత్యతీతము - సుషుప్త తైజసము<br>ఉన్మని - సుషుప్త ప్రాజ్ఞము<br>మనోన్మన్యము - సుషుప్త తురీయము |
| **→ వైఖర్యాం – తురీయ విశ్వః।**<br>**→ మధ్యమాయాం – తురీయ తైజసః।**<br>**→ పశ్యంత్యాం – తురీయ ప్రాజ్ఞః।**<br>**→ పరాయాం – తురీయ తురీయః।** | వైఖరీ - తురీయ విశ్వము<br>మధ్యమము - తురీయ తైజసము<br>పశ్యంతి - తురీయ ప్రాజ్ఞము<br>పర - తురీయ తురీయము |
| **→ జాగ్రన్మాత్రా – చతుష్టయమ్**<br>**'అ' కారాగ్ంశమ్।**<br>**→ స్వప్నమాత్రా – చతుష్టయమ్**<br>**'ఉ' కారాగ్ంశమ్।**<br>**→ సుషుప్తి మాత్రా చతుష్టయమ్**<br>**'మ' కారాగ్ంశమ్।**<br>**→ తురీయమాత్రా చతుష్టయమ్**<br>**అర్థమాత్రాగ్ంశమ్॥**<br>**అయమేవ "బ్రహ్మప్రణవః"॥** | జగత్‌మాత్రా చతుష్టయము -"**అ**"కారాంశము.<br>స్వప్నమాత్రా చతుష్టయము -"**ఉ**"కారాంశము.<br>సుషుప్తిమాత్రా చతుష్టయము -"**మ**"కారాంశము.<br>తురీయామాత్రా చతుష్టయము - -"**అర్థమాత్ర**"అంశము.<br>ఇదియే **"బ్రహ్మప్రణవము"** |
| **11. స పరమహగ్ంస తురీయాతీత**<br>**అవధూతైః ఉపాస్యః।**<br>**తేనైవ బ్రహ్మప్రకాశతే।**<br>**తేన విదేహ ముక్తిః।** | ప్రియ బ్రహ్మదేవా! సృష్టికర్తా! మనము చెప్పుకున్న **'బ్రహ్మప్రణవము'** - అనునది పరమహంస, తురీయాతీత, అవధూతలచే స్వానుభవరూపంగా ఉపాసించబడుతోంది.<br>అట్టి షోడశమాత్రోపాసనచే బ్రహ్మతత్త్వము ప్రకాశమానమవగలదు. అద్దానిచే **'విదేహముక్తి'** సిద్ధిస్తోంది. |
| **(బ్రహ్మోవాచ)**<br>**"భగవన్। కథమ్ అయజ్ఞోపవీతీ,**<br>**అశిఖీ సర్వకర్మ పరిత్యక్తః?**<br>**కథం బ్రహ్మనిష్ఠా పరః?**<br>**కథం బ్రాహ్మణ?"**<br>**= ఇతి బ్రహ్మ పృచ్ఛతి।** | బ్రహ్మదేవుడు: భగవాన్! ఆత్మానారాయణా! యజ్ఞోపవీతుడు, శిఖ ధరించినవాడే సన్న్యాసమునకు అర్హుడని శాస్త్రవచనము కదా! మరి అయజ్ఞోపవీతుడు, అశిఖి (ఆ రెండు లేనివాడు) - **సర్వకర్త పరిత్యాగ రూపమగు పరమహంస పరివ్రాజకత్వము ఎట్లా - ఆశ్రయించగలడు?** అసలు ఎవరు బ్రహ్మనిష్ఠాపరుడు? ఎవరు బ్రాహ్మణుడు? బ్రాహ్మణుడు అను శబ్దమునకు అసలైన అర్థమేమై ఉన్నది? |

సహోవాచ విష్ణుః :

భో భో అర్భక।

యస్యాస్తి అద్వైతం, ఆత్మజ్ఞానం

తదేవ యజ్ఞోపవీతం।

విష్ణుభగవానుడు: ఓ అర్భకుడా! అమాయకబాలుడా! పరమహంస బ్రహ్మనిష్ఠాపరుడు, బ్రాహ్మణుడు, పరివ్రాజకుడు మొదలైనవి భౌతికమైనవా? యజ్ఞోపవీతము, వస్త్రధారణ, నివసించే ప్రదేశమునకు సంబంధించినవా? **కానే కావు.**

**"ఆత్మకు ద్వితీయమైనదే లేదు. ఈ సమస్తము ఆత్మస్వరూపుడుగా నాకు అన్యము కానేకాదు" - అనునదే యజ్ఞోపవీతము.**

---

తస్య ధ్యాననిష్ఠైవ శిఖా।

తత్ కర్మ స పవిత్రమ్।

స సర్వ కర్మ కృత్। స బ్రాహ్మణః।

స బ్రహ్మనిష్ఠాపరః।

స దేవః। స ఋషిః। స తపస్వీ।

స శ్రేష్ఠః। స ఏవ సర్వ జ్యేష్ఠః।

స ఏవ జగద్గురుః।

స ఏవ అహం విద్ధి।

**ఆత్మతత్త్వమును గురించిన నిష్ఠయే** (ఆత్మగా అనుకునే అభ్యాసమే) 'శిఖ'।

**ఆత్మభావనతో కర్మ నిర్వహణయే పవిత్రము** (పితృకార్యములలో ధరించే దర్భముడి).

**"సమస్తము పరమాత్మ యొక్క స్వకీయ ప్రదర్శనా చమత్కారమే"** అను భావన కలవాడు సర్వకర్మలు నిర్వర్తించినట్లే. అట్టి వాడే **బ్రాహ్మణుడు.** ఆతడే **బ్రహ్మనిష్ఠాపరుడు.** ఆతడే **దేవత.** ఆయనయే **ఋషి,** ఆతడే **సర్వశ్రేష్ఠుడు, సర్వజ్యేష్ఠుడు కూడా.** ఆయనయే **జగద్గురువు.**

ఓ బ్రహ్మదేవా! సమస్తము ఆత్మగా దర్శించువాడు విష్ణు స్వరూపుడేనయ్యా! నేనే ఆతడు. ఆతడే నేను.

---

లోకే పరమహగ్ంస

పరివ్రాజకో దుర్లభతరో, -

యత్ ఏకోఽస్తి।

స ఏవ నిత్యపూతః।

స ఏవ వేదపురుషో।

మహాపురుషో,

యః తత్ చిత్తమ్ మయ్యేవ అవతిష్ఠతే।

అహం చ తస్మిన్ ఏవ అవతిష్ఠతః॥

**"ఈ కనబడే సమస్తము మమాత్మ ప్రదర్శనమే"** అను స్వాభావిక బ్రహ్మతత్త్వ దర్శనము చేయు పరమహంస పరివ్రాజకులు ఎక్కడో గాని ఉండరు. సుదుర్లభులు. వారు ఎక్కడున్నా కూడా పవిత్ర స్వరూపులై, సమస్తమును పవిత్రముగా చేయువారై ఉంటారు. **వారే వేదపురుషులు.**

వారి చిత్తము **"సర్వాత్మకుడు సర్వ తత్త్వ స్వరూపుడు"** అగు నాయందే సర్వదా అవతిష్ఠితమై ఉంటుంది.

నేను కూడా వారియందే సర్వదా అవతిష్ఠితుడనై ఉంటాను.

---

**12.** స ఏవ నిత్య తృప్తః।

స శీతోష్ణ సుఖదుఃఖ మానవమాన వర్జితః।

స నిందా ఆమర్ష సహిష్ణుః।

స షడూర్మి వర్జితః।

షట్ భావ (షడ్భావ) వికారశూన్యః।

స జ్యేష్ఠ – అజ్యేష్ఠ వ్యవధాన రహితః।

సర్వత్రా సమమగు ఆత్మదర్శనముచే పవిత్రదృష్టి సంపాదించుకున్న ఆ మహనీయులు -

- సర్వదా స్వాభావికంగానే **నిత్య తృప్తులై ఉంటారు.**
- **శీత-ఉష్ణ, సుఖ-దుఃఖ, మాన అవమానముల పరిధులను దాటివేసినవారై** ఉంటారు.
- **నింద-అమర్షములను** (అసహనములను) **ఓర్చుకొనగలిగినవారు** అయి ఉంటారు.
- "ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణము" అనబడే **షట్ భావములను జయించి వేసి ఉంటారు.**

వారి దృష్టిలో వారికి షట్‌భావ వికారములు (పుట్టుక - అగుట - కలుగుట - పెరుగుట- తరుగుట - నశించుట అనునవి) లేవు.

వారికి "తక్కువవాడు- ఎక్కువవాడు - సమానుడు అనే వ్యవధానములు (సంగతి, సందర్భములు) ఉండవు. సమస్తము అఖండమగు ఆత్మయే అయి ఉండగా ఇక ఎక్కువ- తక్కువలు ఏముంటాయి? దేనికి ఏది సమానము? ఏది దేనికంటే అధికము (లేక) అల్పము?

**సః స్వ వ్యతిరేకేణ, న అన్య ద్రష్టా - ఆశాంబరో।**
**- న నమస్కారో।**
**- న స్వాహాకారో। న స్వధాకారశ్చ।**
**- న విసర్జన పరో।**
**నిందా స్తుతి వ్యతిరిక్తో।**
**న మంత్ర తంత్రోపాసకో।**
**దేవాంతర ధ్యానశూన్యో।**

(ఒక నవలా రచయిత తాను వ్రాసిన నవలను చదువుచూ, ఆ నవలలోని పాత్రలన్నీ తన రచనా కల్పిత రూపములుగానే చూడు విధంగా) - పరమహంస తన స్వరూపమునే సర్వత్రా సమస్త సహ జీవరూపములుగా స్వకీయ కల్పిత వినోద చమత్కారంగా చూస్తాడు. తనకు అన్యముగా దేనికీ 'ద్రష్ట' అయి (వేరుగా) ఉండడు.

- దేనినీ ఆశించువాడై ఉండడు.
- తనకు వేరైనట్లుగా భావించి ఎవ్వరికీ నమస్కరించడు.
- ఎవరో బాహ్య దేవతలను ఉద్దేశ్యించి ఆహూతులను, పితృదేవతలను ఉద్దేశ్యించి 'స్వధామ' అని తర్పణములు సమర్పించడు. దేవతలను, పితృ దేవతలను ఆత్మకంటే వేరైన వారిగా భావించడు.
- దేనినీ విసర్జించువాడై ఉండడు. సమస్తము తానే అయి ఉంటాడు.
- దేనినీ నిందించడు. స్తుతించడు.
- మంత్ర తంత్ర ఉపాసకుడై ఉండడు. స్వస్వరూపాత్మకు వేరుగా దేవతను గమనించువాడై ఉండడు. అనగా దేవతలను అనన్య భావనతో ధ్యానించడు.

---

**లక్ష్య అలక్ష్య నిర్వర్తకః**
**సర్వ ఉపరతః।**

లక్ష్యము - అలక్ష్యములేవీ ఆ పరమహంస పట్ల ఏర్పడి ఉండవు.
- సమస్త దృశ్య ప్రపంచము నుండి ఉపరతుడు అయి ఉంటాడు.

---

**సచ్చిదానంద అద్వయ చిద్ఘనః**
**సంపూర్ణానందైక బోధో "బ్రహ్మైవాహమస్మి"**

సత్ చిత్ ఆనందములను (ఉనికి - ఎరుక - వినోదములను) తనయొక్క ముఖ్య (కేవల) రూపముగా కలవాడై, సమస్తము తానే అయి ఉండటంచేత **అద్వితీయుడై, "నేను బ్రహ్మానంద బోధ స్వరూపముగు బ్రహ్మమును"** అని ఎరిగి ఉంటాడు.

---

**ఇతి అనవరతం**
**బ్రహ్మ ప్రణవ-అనుసంధానేన**
**యః కృతకృత్యో భవతి, స (యేవ) -**
**<u>"పరమహగ్ంస పరివ్రాట్"</u>**

<u>పరమహంస పరివ్రాజకోపనిషత్ సమాప్తా</u>

**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।।</u>**

ఈవిధంగా ఎవ్వరైతే అనవరతము (ఎల్లప్పుడు కూడా, Always and at all times )" బ్రహ్మప్రణవ అనుసంధానము" చేస్తూ ఉంటారో, అట్టి అనుసంధానమునందు కృతకృత్యులు (Well performed and established) అవుతారో, అట్టివారు **పరమహంస పరివ్రాట్** అయి తుర్య తుర్యస్థితి సంపన్నులు - **అగుచున్నారు.**

***<u>ఇతి పరమహంస పరివ్రాజకోపనిషత్</u>***

***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 15 పరమహంస పరివ్రాజకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



"పరివ్రాజ" ధర్మమును అనువర్తిస్తున్న మహనీయులు క్రమంగా ఏ విధంగా "బ్రహ్మము" రూపము సంతరించుకుంటున్నారో, అట్టి ప్రణవ ఏకార్థమైనట్టి **'తుర్యతుర్య (తుర్యమునకే తుర్యమైన) స్థానము'** నకు నమస్కరిస్తున్నాము.

-----

ఒక సందర్భములో సృష్టికర్త, సృష్టిపాలకుడు అగు బ్రహ్మదేవులవారు బ్రహ్మలోకము నుండి సంచారముగా బయలుదేరారు. ఆయా లోకాలలోని జనులు వారి వారి ధర్మమార్గములను వదలి చరిస్తూ, ఫలితంగా అనేక దుఃఖ స్థితి గతులను అనుభవిస్తూ ఉన్నారు. జన్మ – కర్మ – చక్ర పరంపరలలో ఇరుక్కొని అనేక మనోకల్పిత బంధనములలో మ్రగ్గుతూ ఉన్నారు.

**అయ్యో! ఆనందము కొరకై నేను లోకాలను సృష్టిస్తూ ఉంటే, ఈ జీవులు ధర్మమార్గము విడచి, "నవ్వుతూ తప్పులు చేయటము – ఏడుస్తూ అనుభవించటము – (హసతా క్రియతే కర్మా! రుతతా పరభుధ్యతే|)–** జరుగుతోందే? దుఃఖములు పొందుతూ కూడా, అజ్ఞాన జనితమైన ఆవేశము, అవిచారణ, (ఇంద్రియానుభవముల వంటి) అల్ప లక్ష్యములను గొప్పవిగా భావించటము – ఇవన్నీ జీవులు సుదీర్ఘ దురభ్యాసంగా ఆశ్రయిస్తున్నారు.

**వీరు ధర్మమును ఏమరచి అనేక కష్టములు తెచ్చిపెట్టుకొంటూ కూడా, సరి అయిన మార్గము విచారించటము లేదు, అనుసరించటమూ లేదు. చివరికి నా సృష్టిలోని లోకాలన్నీ దుఃఖము, భయము, అల్పత్వము, హీనత్వము మొదలైన వాటితో కప్పివేయబడుచున్నాయి. సుందరముగా నాచే సృష్టించబడే ఈ సృష్టి జీవులు ఆనందించటానికి బదులుగా, చివరికి వారిపట్ల అనేక బంధనములకే దారితీస్తోందే? ఏమి ఉపాయము?"** – అని యోచించసాగారు. ఈ విధంగా గమనించిన సృష్టికర్త తన బిడ్డలగు జీవుల దౌర్భాగ్యస్థితిగతులకు తానే దుఃఖము పొందినవారై, తన పితృదేవులు, సర్వజగత్ రక్షకులు అగు శ్రీమన్ విష్ణు భగవానుని దర్శించటానికై వైకుంఠము వెళ్లారు. జీవులు పడుతున్న యాతనలన్నీ వర్ణించి చెప్పి **"తండ్రీ! జీవునికి దుఃఖములు తొలగే మార్గము నాకు చెప్పండి"** – అని అభ్యర్థించారు.

అప్పుడు విష్ణుదేవుడు పద్మసంభవుడగు బ్రహ్మదేవునికి – ఈ జీవులు ఆశ్రయించవలసిన **జీవనవిధానము** గురించి, చాతుర్వర్ణ్య **ధర్మములను ఆశ్రయించటము** గురించి, **ధర్మము ఏమరచినప్పటి పర్యవసానము**ల గురించి విశదీకరించి చెప్పారు.

**విష్ణు భగవానుడు :** అత్యంత సుందరమగు సృష్టిని కల్పిస్తూ ఉన్న మహామేధావీ! కుమారా! బ్రహ్మదేవా! సృష్టిలో ధర్మములు ఉన్నాయి. ఈ మానవులు వారి వారి ధర్మములు ఏమరచటము చేతనే దుఃఖములు వచ్చి పడుచున్నాయి. తాము తల్లిదండ్రులపట్ల, సహజీవులపట్ల తదితరలపట్ల నిర్వర్తించవలసిన ధర్మములు ఏమరుస్తున్నారు. పర్యవసానంగా ఋణగ్రస్తులగుచున్నారు. చివరికి (తదితరులు నిర్వర్తించవలసిన ధర్మములు) తమపట్ల నిర్వర్తించబడక – అధర్మ ప్రవర్తనచే అధర్మఫలములు పొందుచూ దుఃఖిస్తున్నారు.

['సృష్టి' అనేది ఒకరిది కాదు. అందరిదీను. అందరూ కలసి ధర్మములు నిర్వర్తించాలి. "ఇంటి ఇల్లాలు, ఇంటి యజమాని, కొడుకు, కోడలు, పిల్లలు, కూతుళ్ళు, అల్లుళ్ళు' – ఈ విధంగా వేరువేరు వారంతా కలసి ఒక కుటుంబము. ఒకడు – **తాను ధర్మము నిర్వర్తించక, తనపట్ల తదితరులు ధర్మము నిర్వర్తించటము లేదని వగచి ఏమి ప్రయోజనం**? ఒక కార్యక్రమము సరిగ్గా జరగటానికి అందరి ధర్మములు (Duties of all) వేరువేరుగా ఉంటాయి. సంఘ పరిరక్షణ కొరకే వేరు వేరు జనులకు వేరు వేరు ధర్మములు (Division of Labour) కేటాయించబడ్డాయి.]

## "బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర" – ధర్మములు

### బ్రాహ్మణ ధర్మములు :

– తాను ప్రశాంతముగా ఉండి, ఇతరులకు **శాంతి, ఐకమత్యములను గుర్తు చేయటము. వేద ఉపనిషత్ అధ్యయనము.**

– శమము – (అంతరింద్రియ – మనోబుద్ధి చిత్త అహంకారముల) నిగ్రహము.

– దమము – బాహ్య ఇంద్రియ నిగ్రహము.

– తపస్సు – శుచి అయిన భావాలు గుర్తు చేయటము ఓర్పు.

– సూటి అయిన భావాలు (ఆర్జవము). మనోవాక్కాయములచే ప్రదర్శించు భావముల త్రికరణ శుద్ధి.

– శాస్త్ర అధ్యయనము. శాస్త్రజ్ఞాన విజ్ఞాన ఆస్తిక్యముల పట్ల తదితరులను ఉత్సాహపరచటము.

### క్షత్రియ ధర్మములు :

- సహ జీవులకు రక్షణ కల్పించటము. శూరులై ఉండటము.
- ధృతి (ధైర్యము) కలిగించటము.
- దయ – దాక్షిణ్యము కలిగి ఉండటము.
- యుద్ధ సమయాలు వచ్చినప్పుడు వెన్నుచూపి పారిపోకపోవటము.
- దానము, ఈశ్వరభావములు ప్రోత్సాహపరచటము. క్షేత్రపాలకులై ఉండటము (వ్యవసాయము).

### వైశ్య ధర్మములు :

- కృషి. సంపదరక్షణ. వ్యాపారము. (పశు సంపద రక్షణ).

### శూద్ర ధర్మములు :

- సహజనుల వారి వారి అవసరములు తీర్చటము. సేవాభావం కలిగి ఉండటము.

"గుణములను అనుసరించి స్వధర్మము"ను సశాస్త్రీయంగా గమనించి, సందర్భానుసారంగా వారివారి స్వకీయ ధర్మములు నిర్వర్తించువారికి, వారి వారి ధర్మనిరతియే మోక్షమునకు మార్గము కాగలదు.

ఇట్లాగే శాస్త్రములు బ్రహ్మచారి – గృహస్థ – వానప్రస్థ – సన్న్యాస ధర్మములు ప్రవచిస్తున్నాయి.

ధర్మ నిరతిచే ఈ ఈ జీవుడు నిర్మలుడు, పునీతుడు కాగలడు.

క్రమంగా ఈతడు జీవితపరమాశయము వైపుగా దృష్టి సారించాలి. ధర్మబలంతో అర్హుడై క్రమంగా జ్ఞాని అయి, బ్రహ్మచర్య – గృహస్థ ధర్మములు నిర్వర్తిస్తూ **పరమహంస పరివ్రాజకుడై** 'జీవితము' అనే అవకాశమును సద్వినియోగపరచుకొనెదరు గాక!

❖ ❖ ❖

ఈవిధంగా **'విశ్వధర్మము'** అనబడే స్వధర్మము యొక్క ఆశ్రయము, వర్ణాశ్రమధర్మములు మొదలైనవి విష్ణు భగవానుడు బోధించారు. **'పరమహంస పరివ్రాజకత్వము'** అను మహదాశయము కలిగి ఉండాలని **విశదీకరించారు**. అప్పుడు సర్వ జీవుల పితామహుడగు బ్రహ్మదేవుడు ఇట్లా సంభాషణను కొనసాగించారు.

❖ ❖ ❖

**లోకపితామహుడగు బ్రహ్మదేవుడు:** హే భగవాన్! ఆదినారాయణా! **త్వన్ముఖాత్ వర్ణాశ్రమక్రమం శ్రుతం విదితం అవగతమ్।** మీరు బోధిస్తూ వస్తున్న ధర్మ నిరతి వలన ప్రయోజనములు, ధర్మచ్యుతి వలన కలిగే అనర్థములు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర చాతుర్వర్ణ ధర్మములు, ఆశ్రమ ధర్మములు, ధర్మనిరతి, పరమహంస ధర్మముకు అర్హత – మొదలైనవన్నీ విన్నాము. చాలా సంతోషము. మీ అనుగ్రహం చేత అవన్నీ హృదయస్తము అగుచూ ఉండగా, – **"అవి నాకు, సమస్త లోక జీవులకు సర్వదా ఆచరణీయములు, ఆత్మ బలము ప్రసాదించునవి"** – అని తెలుసుకొన్నాను.

స్వామీ! **ఇదానీం పరమహంస - పరివ్రాజక లక్షణం వేత్తుమ్ ఇచ్ఛామి।** ఈ జీవుడు ఏవిధంగా త్రిమూర్తులకు కూడా పూజనీయుడగు **'పరమహంస–పరివ్రాజకుడు'** కాగలడు? **పరమహంస పరివ్రాజక లక్షణములు** ఏవేవి?

ఎవడు ఏ లక్షణములచే పరవ్రాజకమునకు **అధికారి** (Deserved, Qualified) అవుతాడు?

**'పరమహంస'** అనగా ఎవరు?

**'పరివ్రాజకత్వము'** ఎట్లా సిద్ధిస్తుంది?

ఈ ఈ విశేషాలు దయతో వివరించండి.

**భగవంతుడగు ఆదినారాయణస్వామి** : నాయనా ప్రియపుత్రా! బ్రహ్మ దేవా! మీరు అడిగిన విశేషాలు చెప్పుకుందాము. వినండి.

❖ ❖ ❖

**'మానవ జీవితము'** అనునది ఈ జీవునిపట్ల **తన యొక్క "విష్ణుత్వము, శివత్వము, బ్రహ్మత్వము, ఆత్మత్వము"** – తెలుసుకోవటానికి మహత్తరమైన అవకాశము.

ముందుగా స్వధర్మ నిరతిచే బుద్ధిని సాత్వికము, విస్తారము, నిశ్చలము, సునిశితము చేసుకోవాలి.

**సద్గురువు:** **'శిక్ష, సాధన, శోధన, సత్‌వస్తు బోధన'** చేయువారై ఉంటారు. **"పరమసత్యమగు పరమాత్మ అనగా నీయొక్క నిజ – నిత్య – సత్య – శాశ్వత రూపము"** అని ఆయన తన వాక్కు బోధచే, – సంశయనివారణ చేయువారు. **పరిభాషణలచే స్వస్వరూపము గురించి సుస్పష్టపరచువారు– సద్గురువు.**

అట్టి సద్గురువును సమీపించాలి. శ్రద్ధగా భక్తి – జ్ఞాన – యోగాభ్యాసములకు చెందిన విద్యలను శ్రవణం చేయాలి. శ్రవణం చేస్తున్నది శ్రద్ధగాను, సవిచారణగాను, స–విచక్షణాపూర్వకంగాను **మననము** చేయాలి. విషయములను మూల – మధ్య – అంతఃపూర్వకంగా పరిశీలించి విద్వాంసుడు కావాలి.

ఈ జీవుడు దృశ్యములో

**సర్వం ఐహికాముష్మిక సుఖశ్రమం జ్ఞాత్వా।**

*"– ఏదో పొందాలి*

*– ఇది ఇలా ఉండకూడదు. అట్లా ఉండాలి.*

*– నా గురించి ఇలా అనుకోకూడదు. అలా అనుకోవాలి.*

*– ఇది ఇలా అయితే సుఖము. అలా అయితే దుఃఖము".* –

ఈవిధమైన భావనలన్నీ **'భావనాజనిత శ్రమ'** (సుఖము కొఱకు శ్రమ) అనబడుతోంది. 'కావాలి – పొందాలి – వదలాలి – అనుకోవాలి – **అనిపించాలి**'– అను శ్రమలన్నీ క్రమంగా నెమ్మది నెమ్మదిగా జయించివేయబడుగాక.

**ఈషణాత్రయ హేయం అధిగమ్య :** భార్య – పుత్ర – ధనములపట్ల **"నేను అనుకున్నట్లే ఉండవేమి?"** – అనే ఈషణాత్రయమును దాటి ఉండాలి.

**వాసనాత్రయమ్ హేయం అధిగమ్య: "దేహవాసన, దృశ్యవాసన, శాస్త్రవాసన" అనే వాసనాత్రయమును అధిగమించివేయాలి.**

**మమత్వమ్ అధిగమ్య :** "ఈ జనులలో కొందరు నాకు చెందినవారు. కొందరు కాదు. ఈ వస్తు సముదాయము నాకు చెందినది. నేను ఈఈ విషయ – వస్తు సముదాయమునకు చెందినవాడను. వీటి వీటితో నాకు అవినాభావ సంబంధము ఉన్నది" మొదలైన **సంబంధిత, అసంబంధిత మమత్వమును త్యజించినవాడై ఉండాలి.**

**అహంకారమ్ హేయమ్ అధిగమ్య : "నేను – నాది. నాకు చెందినవాటిచేత నేను ప్రత్యేకతగలవాడను. ఎక్కువవాడిని (లేదా) తక్కువవాడిని. ధన – జన – విద్య – జ్ఞానములచే ఎక్కువ వాడిని (లేక) తక్కువ వాడిని"** మొదలైన లక్షణముల రూపమగు అహంకారమును జయించివేయాలి.

ఈవిధంగా ఐహికాముష్మిక సుఖాశయశ్రమను, ఈషణా త్రయమును, వాసనా త్రయమును, మమత్వ – అహంకారములను, వమనము చేసిన అన్నము (కక్కిన కూడు, వాన్తాన్నము) వలె వదలివేయాలి. అధిగమించివేయాలి. 'మోక్షము' అను ఏకైక సాధనము (The only objective) ను స్వీకరించాలి. మిగతా లౌకిక ఆశయములను (కక్కిన పదార్థమువలె) త్యజించి, క్రమంగా దాటివేయాలి.

**I. బ్రహ్మచర్యము :** పై ఆశయములతో, జాగరూకతలతో 'బ్రహ్మచర్యాశ్రమము'ను గురు సమక్షములో సంపూర్తి చేయాలి. **(బ్రహ్మచర్యము = బ్రహ్మమునందు సమస్తము సమన్వయించుకోవటము).**

**II. గృహస్థాశ్రమము :** బ్రహ్మచర్యము తరువాత (బ్రహ్మము గురించిన అధ్యయన, సమాశ్రయముల తరువాత) గురు అనుజ్ఞతో గురువు నియమించిన శాస్త్రములను, బోధిస్తున్న నియమ నిష్ఠలను మనోబుద్ధులలో పదిలపరచుకొంటూ, **గృహస్థాశ్రమము స్వీకరించాలి.** (బ్రహ్మజ్ఞానము కలిగియుండి, లోకసంబంధమైన సందర్భ – సంగతి – సంబంధ – అనుబంధ – బాంధవ్య – సంపద – ఆపదల సందర్భములను **ఎట్లా స్వీకరించాలో–ఎట్లా స్వీకరించకూడదో గ్రహించి, అవిధంగా నిర్వర్తించటము – గృహస్థాశ్రమము**).

| |
|---|
| గ = శ్రేష్ఠమైన విధంగా ఋహస్త = ఋత్ (సత్యము)ను వదలక – ఆశ్రమ = ఆశ్రయించి జీవించటము. |

**III.** వానప్రస్థాశ్రమము – ఉచిత సమయమంలో బాధ్యతలు తరువాతి తరానికి అప్పగించి, ఏకాంత జీవన ఉపాసనల నిమిత్తమై స్వీకరించు ఆశ్రమము.

[ (అనేక విషయముల మధ్యగా ఉంటూ కూడా బుద్ధిని విషయరహితంగా ధారణ చేయటము కూడా వానప్రస్థమే).

(వనము = Forest. Hands in the world, while Head in the Forest)].

**IV. సన్న్యాసము :** ఉపాసనలు, సాధన పరికరములు మొదలైనవన్నీ ప్రక్కకుపెట్టి 'సత్'ను మాత్రమే న్యాసము (ఆశ్రయించటము) – **సన్న్యాసము** (లేక) **సన్న్యాసాశ్రయము.** (**న్యాసము** = ఆశ్రయించటము, నిర్వర్తించటము. ఉదా॥ – ఉపన్యాసము).

– వానప్రస్థము నుండి → సన్న్యాసము (లేదా)

– బ్రహ్మచర్యము నుండి (నేరుగా) → సన్న్యాసము కూడా (సందర్భములను అవకాశములను అనుసరించి) స్వీకరించవచ్చును.

ఒకడు గృహస్థుడు అయినా, (లేక) వానప్రస్థుడు అయినా, వ్రతస్తుడు (వ్రతములు చేయువాడు) అయినా, అవ్రతుడు అయినా, స్నాతకుడు అయినా కాకపోయినా , అగ్నికార్యములందు ఉత్సాహవంతుడై ఉన్నా, ఉండకపోయినా, దైనందికంగా(Everyday) అగ్నికార్యములు చేయువంశపారంపర్య "అగ్నికుడు" అయినా, (లేక) అనగ్నికుడు అయినా కూడా..., **యత్ అహరేవ విరజేత్, తత్ అహరేవ ప్రవ్రజేత్॥** ఏరోజు, ఏ సమయములో విరక్తుడైతే అప్పటికప్పుడే ఆరోజుననే **"సన్న్యాసము"** (మనోగతంగా) స్వీకరించును గాక।

సాంఘికమైన సందర్భములను, వ్యవహారములను (మానసికంగా) త్యజించి, పరమాత్మతో మమేకత్వమే మహదాశయముగా స్వీకరించి, తదితరమైన సమస్త కర్తృత్వ – భోక్తృత్వ వ్యవహారములన్నీ సత్ (ఆత్మ గురించిన) ఉపాసనగా అవధరించి ఉండటమే వాస్తవమైన సన్న్యాసము.

# సన్న్యాసాశ్రమము స్వీకరించు విధి

**అఖండమగు పరమాత్మ తత్త్వము**ను పరమాశయముగా ఏవిధంగా గ్రహించాలి?

- బ్రహ్మచారి అయినా, గృహస్థుడైనా, (లేక) వానప్రస్థుడైనా **'సన్న్యాసము'**నకు సంసిద్ధుడు అవవచ్చును.
- సమస్త దృశ్య (సాంసారిక) వ్యవహారములపట్ల అనురక్తిని మొదలంట్లా త్యజిస్తూ, **"విరక్తి"** (Non relatedness) ని అభ్యాసముగా కలిగి ఉండును గాక।
- తల్లి, తండ్రి, గురువు ముఖ్య బంధువుల అంగీకారము పొందును గాక।
- తండ్రిని, తల్లిని, భార్యని, పుత్రుడుని, (వారెవరూ కాకపోతే) శిష్యునికిగాని, సహవాసిని గాని పిలచి తనపట్ల శేషించియున్న అనివార్య కార్యక్రమములు అప్పగించివేయును గాక!
- పైవారిలో ఒకరిని ఆత్మపురుషునిగా భావిస్తూ ప్రజాపతియేష్ఠి (యాగము) నిర్వర్తించును గాక।
- అది కుదరని సందర్భములో అగ్నిని సాక్షిగా సన్న్యాసాశ్రమము స్వీకరిస్తూ, **'అగ్నియజ్ఞము'** నిర్వర్తించును గాక।

## త్రైదాతవీయము

అగ్నియే 'ప్రాణము' రూపముగా విశ్వమంతా, (మరియు) సమస్త దేహములలోను వేంచేసినదై ఉన్నది.

అట్టి ప్రాణశక్తి వలననే జగత్తంతా నిర్మితమై ప్రదర్శనమౌతోంది.

అట్టి అగ్నికి సత్త్వ – రజో – తమో త్రిగుణములు త్రిధాతువులుగా జగత్ కల్పన కొరకై రూపము పొందినవై ఉంటున్నాయి. ఇప్పుడు సన్న్యసించువాడు ఇట్లు పలుకుచున్నాడు.

**అగ్నిర్హి ప్రాణః। ప్రాణమేవ ఏతయా కరోతి। త్రైధాతవీయామేవ కుర్యాత్।**
**ఏతయేవ త్రయో ధాతవో యదుత। "సత్త్వం రజః తమ" ఇతి॥**

*"అగ్నియే ప్రాణశక్తి అయి ఈ సమస్త జగద్వ్యవహారము నిర్వర్తిస్తోంది. అట్టి అగ్నియొక్క త్రి-ధాతువులే "సత్త్వ-రజో-తమో" త్రిగుణములు".*

**"అయం తే యో నిర్ఋత్వియో, యతో జాతో అరోచథాః।**

**తం జానన్ అగ్న ఆరోహా, అథా నో వర్ధయా రయిమ్"॥**

*నేను అగ్నిసాక్షిగా అట్టి త్రిగుణములను దాటివేస్తూ, నిర్ఋత్తి (అభాగ్యము, మృత్యురూపము) అగు ఇంద్రియ విషయముల గురించి తెలుసుకొని, నాయొక్క దృశ్య సంబంధములన్నీ అగ్ని యందు వ్రేల్చివేసి,* ***'ఆత్మతత్త్వము'*** *అనే తేజో-వర్ధమానము కొరకై అగ్నిదేవుని శరణువేడుచున్నాను.*

**ఇతి అనేన మంత్రేణ అగ్నిం ఆజిఘ్రేత్।** ఈఈ విధములైన మంత్రములతో – అర్థము, అంతరార్థము తెలుసుకొంటూ, మననము చేస్తూ అగ్నియేష్టిని నిర్వర్తిస్తూ **"సన్న్యాసము"**నకు సంసిద్ధుడగును గాక!

**"అగ్నే యోనిః ర్యః ప్రాణః,**
**ప్రాణం గచ్ఛ స్వాం యోనిం గచ్ఛ స్వాహా।"**
**- ఇత్యేవమ్ ఏవై తదాహ।**

*ఈ ప్రాణము అగ్నినుండే బయల్వెడలి, అగ్ని ప్రసాదముగా నావెంట నంటి ఉంటోంది. తిరిగి ప్రాణము అగ్ని ప్రవేశము చేయబోవుచున్నది. కనుక ప్రాణమును అగ్నిదేవునికి చెందినదిగా భావించి సమర్పిస్తున్నాను. స్వాహా!!*

ఈవిధమైన మంత్రములతో (సన్న్యాస స్వీకారమునకు ముందుగా) శాస్త్రములు చెప్పే సంవిధానము (సన్న్యాస భావనయొక్క అవగాహన, సుస్థిరత, నిశ్చలత కొరకై) పాటించబడు గాక!

సన్న్యాస స్వీకార సమయంలో నిర్వర్తించే అగ్నికార్యము కొరకై – అగ్నిని శ్రుతులను (వేదములను) ఉపాసించేచోటున ఉండే **యజ్ఞగుండము** (లేక) **అగ్ని కార్యముల**నుండి అగ్నిని తెచ్చి, (శ్రోత్రియాగారము నుండి అగ్నిని తెచ్చి) :-

- స్వశాఖ విద్యుక్త ధర్మము (కులము యొక్క శాస్త్రము నియము)లను పాటించి **"అగ్నియేష్టి"** నిర్వర్తించాలి.
- అగ్నిని ఆఘ్రాణము చేయాలి (ముక్కుతో వాసన చూడాలి)

## ఆతురసన్న్యాసము

కొందరు వ్యాధి కారణంగానో, వార్ధక్యము చేతనో శాస్త్రములు నియమించిన ఆయా అగ్నియేష్టి మొదలైన అగ్నికార్యములను నిర్వర్తించగలిగే పరిస్థితి, శారీరక స్థితి ఉండకపోవచ్చును. అట్టివారికి **'ఆతురసన్న్యాసము'** సూచించబడుతోంది. అట్టి వారు పైన మనము చెప్పుకున్న ప్రజాపతియేష్టిగాని, 'అగ్నియేష్టి'గాని నిర్వర్తించవలసిన అవసరము ఉండదు. అట్టివారు –

**"ఆపోవై సర్వదేవతాభ్యో జుహోమి స్వాహా"** అని పలుకుచూ, అగ్నిలో ఆజ్యము (నేయి) గాని, అగ్ని – ఆజ్యములు దొరకనిచోట – నీటితోగాని **"ఆత్మాగ్ని (The Fire of Absolute self) హోమము"** చేస్తూ ఆతురసన్న్యాసము స్వీకరించవచ్చును.

**యేష్టి:** "స్వాహా" అని పలుకుచు, హోమగుండము నిర్మించి యజ్ఞ (అగ్ని) పురుషుని హవము (Invite) చేస్తూ, హవిస్సు (అగ్నిహోత్రము నందు వ్రేల్చుటకొరకై ఇవురబెట్టినట్టి అన్నమును, నెయ్యిని) ప్రాశనము (సమర్పించటము) మంత్రముగ్ధంగా చేయటమే **"యేష్టి"** (లేక) **"యజ్ఞము"**. ఇది శాస్త్రములు చెప్పే విధి – విధానంగా చేయబడును గాక!

వీరాధ్వానముగాని, (అ)నాశకమునగాని, సంప్రవేశనగాని, అగ్ని ప్రవేశమునగాని, మహాప్రస్థానమునగాని శాస్త్రీయ విధివిధానంగా యేష్టిని నిర్వర్తించాలి. (ఇవన్నీ యాగవిధిలో వివిధ విధాన విభాగములు).

**యత్ ఆతురః స్యాత్, – మనసా వాచా వా సన్న్యసేత్। ఏష పంథాః।** అనారోగ్య పరిస్థితులలో ఆతుర సన్న్యాసము మనస్సు చేతను, వాక్కు చేతను **"సన్న్యాసం మయా"** అని (3 సార్లు గాని, 11 సార్లు గాని, 32 సార్లు గాని) పలుకుచు **ఆతుర సన్న్యాసము** స్వీకరించవచ్చు. ఇది శాస్త్ర విధియే అవుతుంది.

ఆ ఆతుర సన్న్యాసి తిరిగి **స్వస్థుడైతే** – (ఆరోగ్యవంతుడైతే), ఆ తరువాత సన్న్యాసము కొరకై చెప్పిన విధులన్ని యథావిధిగా ఆచరించాలి.

**సన్న్యాసము తీసుకొనేడప్పుడు ఆచరించవలసిన విధానము.**

(1) ఆత్మశ్రాద్ధము.

(2) విరజా హోమము.

(3) అగ్ని యందు సమస్తము ఆరోపణ (Attribution and submission) చేయటము.

(4) లౌకికమైన, ప్రాపంచకమైన వ్యవహార సామర్థ్యము, బాధ్యతలును తనయొక్క "14" విధములైన కర్మేంద్రియ – జ్ఞానేంద్రియ – మనోబుద్ధి చిత్త అహంకారముల ప్రవృత్తులను, – ఇవన్నీ కూడా →

- పుత్రుని పరమాత్మగా భావించి **"పుత్రా! త్వం బ్రహ్మ"** మంత్రముతో పుత్రునికి సమారోపణము (Handing over) చేయాలి.
- కుమారుడు లేనప్పుడు పై విధంగా శిష్యునికి సమారోపణ చేయవచ్చు.
- శిష్యుడు కూడా లేనప్పుడు **"స్వాత్మ"** యే (స్వకీయ జీవాత్మయే) **పరమపురుషునిగా** (లేక) **బ్రహ్మముగా** భావించు సమారోపణ చేయవచ్చు.

**"పుత్రా! బ్రహ్మత్వం। యజ్ఞః త్వమ్।"** ఈ విధమైన శాస్త్రములో చెప్పబడిన మంత్రములతో సమారోపణము చేయాలి.

(5) **"సావిత్రీ ప్రవేశపూర్వకమ్ అప్సు సర్వవిద్యార్థ స్వరూపాం, బ్రహ్మణ్యాధారాం, క్రమాత్ వ్యాహృతిషు త్రిషు ప్రవిలాప్య। సావిత్రీ (యోఽ_సావై బ్రహ్మ)" మంత్రములను** పఠిస్తూ సర్వదా విద్యాధ్యయనుడు (విద్యార్థి) అయి ఉండాలి. **వేదమాతకు వ్యాహృతులతో బ్రహ్మమును ఉద్దేశించి** త్రివ్యాహృతలతో జలములో ప్రవిలాపనము చేయాలి. (వదలాలి).

(6) వ్యాహృతి త్రయము – 'అ' కారము, 'ఉ'కారము, 'మ'కారములందు సమస్తము మంత్రోచ్చారణతో సమస్త జగత్ ధోరణులను ప్రవిలాపనము చేయాలి.

(7) **తత్ సావధానే ఆపః ప్రాశ్య ప్రణవేన శిఖం ఉత్కృష్య।** జలమును సావధానంగా ప్రణవపూర్వకంగా ప్రాస్యము చేసి (పానము చేసి, త్రాగి) శిఖ, (పిలక)ను తొలగించాలి.

**(8)** **యజ్ఞోపవీతము** త్రెంచాలి.

(9) వస్త్రములను భూమిమీదగాని, నీటిలోగాని వదలాలి.

**(10)** **"ఓం భూః స్వాహా। భువః స్వాహా। ఓగ్ం సువః స్వాహా।"** అను మంత్రము దీర్ఘముగా పఠిస్తూ ఇక ఆపై **"జాతరూపధారణ"** చేయాలి. ఏవిధంగా అప్పుడే పుట్టిన బిడ్డకు బంధు–మిత్ర–మమకార–అహంకార–సాపేక్ష–అధిక–అల్ప భావసంబంధములు ఉండవో, ఆ విధంగా అప్పుడే పుట్టిన బిడ్డవలే మనో బుద్ధులను కేవలరూపంగా ధారణ చేయాలి. **జాతరూపధరుడు** కావాలి.

**(11)** **'ఓం' 'ఓం' 'ఓం'** – అను ప్రణవమును వ్యాహృతము చేయును గాక। (అనగా) ఓం అని మరల మరల ఎలుగెత్తి ఉచ్ఛరించును గాక। (Out speaking) పైకి పలుకును గాక।

(12) **సమస్తమునకు 'సాక్షి', కేవలము, మనో బుద్ధి – చిత్తములకు ఆవలిది** – అగు కేవల **స్వస్వరూపము**ను ధ్యానిస్తూ ప్రణవ (ఓం) – వ్యాహృతము (పలకటము) అనేకసార్లు చేయుచుండును గాక।




ఉచ్ఛారణ–ధ్యానముల రెండిటినీ ఒక్కసారిగా నిర్వర్తించును గాక.

(13) మంద్ర (Low Pitch), మధ్య (Medium Pitch), తారధ్వని (High Pitch) లలో – మనసా, వాచా (At inner zone of feelings, Thoughts and psycho attributes as well as by expression) -

| | | |
|---|---|---|
| **సన్న్యస్తం మయా!** (మంద్ర ధ్వని।) | **సన్న్యస్తం మయా!** (మధ్యమ ధ్వని।) | **సన్న్యస్తం మయా!** (తారాస్థాయి ధ్వని) |

3 × '3సార్లు' పలుకును గాక।

(14) ఈ విధంగా ప్రేషోచ్చారణము (ఎలుగెత్తి పలకటం)తో కూడిన ఆజ్ఞాపిస్తున్న ధ్వనితో, ప్రణవముమాత్రమే పలుకుచుండునుగాక।

(15) ప్రణవైకధ్యాన పరాయణుడై ఈ క్రింది వాక్యములు మరల మరల ఎలుగెత్తి పలుకునుగాక।

> **"అభయగ్ం సర్వ భూతేభ్యో మత్త స్వాహా।"**
>
> సమస్త సహజీవులకు నేను అభయముగా(భయము తొలగుంచువానిగా) అగుచు, నన్ను నేను (ఆత్మతత్త్వమునకు) సమర్పించుకుంటున్నాను.
>
> **"అహం బ్రహ్మాస్మి। బ్రహ్మైకమస్మి। తత్త్వమసి। సర్వంఖలు ఇదం బ్రహ్మ।"**

ఈవిధంగా తత్త్వర్థపూర్వకమగు సత్–భావనను (అనేకసార్లు) గొంతెత్తి పలుకును గాక।

(16) ఇక ఈ సన్న్యసించిన స్థానము నుండి లేచి నిలబడి, పరిసములను, జీవులను ఆత్మ భగవానుని ప్రత్యక్షరూపముగా మనస్సుతో నమస్కరిస్తూ, అప్పుడే పుట్టిన పిల్లవానివలె (జాతరూపధరుడై), ఎవరితోగాని, ఏవస్తు విషయ – ఇల్లు మొదలైన వాటితోగాని ఏ సంబంధము, పరిచయము లేని వానివలె బయల్వెడలాలి.

(17) ఉత్తరదిక్కుగా నడుచుకుంటూ వెళ్ళాలి.

ఈవిధంగా సన్న్యాసాధికారి సన్న్యాసము స్వీకరించే విధి (Method procedure) చెప్పబడుతోంది.

## నిత్య సన్న్యాసి

**'సన్న్యాసము'** అనునది వస్తుతః మనో సంబంధమైన స్థితి. ఎప్పుడైతే దేనిపట్ల ద్వేషముగాని, ఏదో కావాలనిగాని ఉండవో, **అట్టి స్థితియే నిత్య సన్న్యాస స్థితి. (జ్ఞేయస్య నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి, న కాంక్షతి – గీత)।**

**<u>గృహస్థుడు సన్న్యాసము స్వీకరించినప్పుడు పాటించు విధానము.</u>**

(1) ముందుగా శరీర భావనను, లోకసంబంధమైన అనుబంధ బాంధవ్యములను మొదలంట్లా త్యజించి ఉండటము ప్రారంభించాలి. వాటికి అతీతత్వము సిద్ధించుకొని ఉండును గాక।

– సర్వాత్మకుడగు పరమాత్మగా ఈ సమస్తమును ఉపాసించుచూ ఉండును గాక।

– **"నేను ఆత్మరూపుడను"** అను భావనను శ్రవణ – మనన – నిదిధ్యాసపూర్వకంగా (వినటము–అనుకోవటము–అనిపించటములను) ఆశ్రయిస్తూ ఉండాలి.

– ప్రార్థనాపూర్వకంగా....

**"అభయగ్ం సర్వభూతేభ్యో। మత్తః సర్వం ప్రవర్తతే।"**

*ఆత్మస్వరూపుడనగు నాయొక్క చిత్ చైతన్య చమత్కారము చేతనే సమస్తము ప్రవర్తనశీలమౌతోంది. కథారచయితకు తన కథలోని ఒక పాత్ర గురించి భయమేముంటుంది? అట్లాగే నేను సమస్త భూతజాలముపట్ల అభయుడను।*

పై మంత్రమును (గృహస్థుడైనా కూడా) మానసికంగా మననము చేయుచుండునుగాక। ఈవిధంగా నిత్య సన్న్యాసి అయి, ఇక క్రమంగా లోకాశ్రయములన్నీ ఒక్కొక్కటిగా వదలివేస్తూ ఉండును గాక।

---

**<u>సన్న్యాస వస్తు సేకరణము</u>**

ఇక సన్న్యసించటానికై ఉపకరణ, సేకరణము చేయునుగాక।

సలక్షణమైనటువంటి

(1) వైణవం దండము (వెదురు దండము).

(2) కటి సూత్రము (మొలత్రాడు).

(3) కౌపీనము (గోచీ).

(4) కమండలువు (సన్న్యాసులు జలము ఉంచుకునే పాత్ర).

(5) వివర్ణవస్త్రము. **ఇవన్నీ సేకరించును గాక।**

**<u>ఉపాసనా మంత్రము</u>**

**"సఖా మా గోపాయోజః**
**సఖాయో అసి। ఇంద్రస్య వజ్రోఽసి।**
**వార్త్రఘ్న శర్మ మే భవ।**
**యత్ పాపం తన్నివారయేతి॥"**

అను మంత్రమును ఉపాసించెదరు గాక।

(దండము కౌపీనము మొ॥న సన్న్యాసాశ్రమ ఉపకరణములారా! నా ఈ ఉపాసనను స్నేహితులై సంరక్షించండి. ఇంద్రుని వజ్రమువలె మా యొక్క పాప దృష్టులను పెకలించివేయండి).

---

**(2)** సద్గురుమ్ ఉపగమ్య, నత్వా। తత్త్వదర్శిని (తత్–త్వమేవ అను పాఠ్యాంశమును బోధించు సమర్థుడగు సద్గురువును) ఆశ్రయించునుగాక। **"అమృతము, అఖండము, సహజము, నిత్యము, సమస్తమునకు అతీతము అగు ఆత్మపురుషుడవే నీవు అయి ఉన్నావు"**–అను **నిరూపణవాక్యములను బోధించువారే–సద్గురువు.** స్వకీయ సాంసారిక ఉద్దేశ్యములను, అభియోగములను, అభిప్రాయములను ప్రక్కకుపెట్టి ఆ సద్గురువు చెప్పే "నీవు పూర్ణమగు ఆత్మవే" అనే అర్థమును మననం చేయాలి.

**(3)** **గురు ముఖాత్ "తత్త్వమసి" ఇతి వాక్యం ప్రణవపూర్వకం ఉపలభ్యా।** అట్టి సద్గురువు బోధించు "తత్త్వమసి" వాక్యములు విని, సందేహములు తొలగించుకోవాలి. ప్రణవపూర్వకంగా ఆకళింపు చేసుకోవాలి. **"నేను చావు–పుట్టుకల మధ్యగా పుట్టుకొస్తున్న ఒక జీవుడను. అల్పుడను"** – మొదలైన బలహీన భావములను – "అనుమాన నివృత్తి" పూర్వకంగా వదలించుకోవాలి.

**(4)** అథ జీర్ణ వల్కాజనమ్ ధృత్వా। జీర్ణ జింక చర్మవస్త్రములు ధరించును గాక।

(5) జలావతరణము (తలంటి స్నానము), ఊర్ధ్వగమనము (సాంసారిక వ్యవహారములలో తిరుగుడు), ఏకభిక్ష (నేననుకున్నదే జరగాలి – అనే ఆవేశము) మొదలైనవి త్యజించును గాక।

**(6)** **'త్రికాలస్నానమ్ ఆచరేత్'।** త్రికాలములలోను ఆత్మభావనయందే స్నాన-సంచారములు నియమించుకొనునుగాక।

**(7)** **వేదాంతశ్రవణపూర్వకం ప్రణవానుష్ఠానమ్ కుర్వన్।** ఈ ఇహ-పర, జీవాత్మ-పరమాత్మ, దేహ-దేహాంతర, కాల - కాలాంతర అనుభవమంతా "స్వస్వరూపసంజ్ఞ" అగు 'ఓం'కారముతో ఏకంచేసి, **ప్రణవానుష్ఠానమును** సర్వకాల - సర్వావస్థలలో ఆశ్రయించును గాక!

**(8)** **సమ్యక్ సంపన్నః ।** "**అనేకము**గా కనిపిస్తూ ఉన్న ఈ సమస్తము **ఏకమే** - అయి ఉన్న ఆత్మతత్త్వముచే సర్వదా సుసంపన్నము" - అను తత్త్వదృష్టిని ఆశ్రయించును గాక!

**(8)** **స్వాభిమతమ్ । "సమస్తము మామాత్మయొక్క చిత్త (ఇష్ట) ఆనంద ప్రదర్శనమే"** - అను భావన, అనుభూతి పదిలపరచుకొనునుగాక।

**(9)** **ఆత్మని గోపయిత్వా।** సర్వత్రా ఆత్మభావనను హృదయాంతరంగముగా పరిరక్షించుకుంటూ, రహస్య - అరహస్యములుగా ఆస్వాదిస్తూ ఉండును గాక।

(10) **నిర్మమో।** "హే సర్వాంతర్యామీ! **నాది - నాది** అని నేను అనుకుంటున్నదంతా 'నాది' కాదయ్యా! **నీది**" - అను భావమును ఆశ్రయించి మమకార రహితుడు అగుచుండును గాక!

**(11)** అధ్యాత్మ నిష్ఠః। సర్వదా **"ఆ పరమాత్మయే ఈ సమస్త రూపములుగా నాకు అగుపిస్తున్నారు"** - అను ఆధ్యాత్మనిష్ఠను ఆశ్రయించును గాక।

(12) **ఇక ఎల్లప్పుడు వదలి ఉండవలసినట్టివి:**

**(i) కామము** - "ఇంకా ఏదో పొందవలసి ఉన్నది" అనే ఆవేశపూర్వకమైన ఆశ - పేరాశ - దురాశ - నిరాశలు మొదలైన వ్యసనములు.

**(ii)** క్రోధము - కోపావేశము, పగ, తప్పులెన్నటము, బాధించే ఉద్దేశ్యములు - మొదలైనవి.

**(iii) లోభము**- "నావే। నాకే చెందినవి।"-అనే మమకారముతో దాచుకోవటము, దోచుకోవటము. పంచుకోకపోవటము.

**(iv) మోహము - 'సత్యము - శాశ్వతము'** ఏమిటో విచారించకుండా **"ఆపాదితము - అశాశ్వతము"**లను పట్టుకొని భ్రమలు వీడకు, సంకుచితుడై ఉండటము.

**(v) మదము** - తనను తాను గొప్ప చేసుకొని, ఇతరులను అల్పదృష్టితో చూడటము. గర్వము.

**(vi) మాత్సర్యము** - ఇతరులను బాధించు స్వభావము. తనవలన ఇతరులకు కష్ట - నష్టములను ఉద్దేశ్యపూర్వకంగా అధికము చేయటము.

**(vii)** దంభము - లేని గొప్పలను చూపి, గుర్తింపుకై పాకులాడటము. తాను పొందుచున్నవి ఏమరచి, తాను ఇస్తున్నవి అధికముగా భావించటము.

**(viii) అహంకారము** - 'నేను-నాది' అను స్వభావమును వీడక ఉండటము.

**(ix) అసూయ** - ఇతరులకు కలిగే 'మంచి' చూచి ఓర్వలేకపోవటము.

**(x)** గర్వము - తన గొప్ప తానే అధికము చేసి భావించటము.

**(xi)** ఇచ్ఛా-ద్వేష, హర్ష-అమర్షములు - **"వీరంటే ఇష్టము. వారంటే నాకు ద్వేషము. ఇది నాకు సంతోషము. అది నాకు**

**దుఃఖము"** – మొదలైనవి కలిగి ఉండటము.

**(xii)** మమత్వము – ఇల్లు, గ్రామము, జాతి, భాష మొదలైనవాటి పట్ల "నావి। నాకొరకై। నాకు చెందినవి। నాకు చెందనవి" – ఇటువంటి భావావేశములు.

ఈఈ మొదలైన **"సాంసారికములు, సంకుచిత దృష్టిప్రదాతలు"** అగు అభ్యాసములను తొలగించుకొనును గాక!

## సన్న్యాసాశ్రమ నిష్ఠ (మరికొంతగా)

**జ్ఞాన-వైరాగ్యయుక్తో :**

(1) దృష్టినంతా **"ఆత్మజ్ఞాన, ఆత్మ మనన, ఆత్మధ్యాస – ఆత్మభావన"** లతో జ్ఞానమును ఆశ్రయిస్తూ, దృశ్య వ్యవహారముల పట్ల విరాగి (Non attached / Non Related) అగుచుండును గాక।

(2) ధన – జన – స్త్రీ వ్యవహారముల నుండి దృష్టిని వెనుకకు మరల్చుచూ **'పరాఙ్ముఖుడు'** (పరాత్-ముఖుడు) అగును గాక।

(3) మనస్సు నుండి వ్యతిరిక్త (Negative) యోచనలను తొలగించి **'శుద్ధమనస్కుడు'** అగును గాక!

(4) ఉపనిషత్ వాఙ్మయము ఎలుగెత్తి గానము చేస్తున్న **'స్వస్వరూపాత్మ'** యొక్క **స్వాభావికమైన ఔన్నత్యము** గురించి విచారణ (Analysing) చేయుచుండును గాక।

(5) **"సమస్తము బ్రహ్మమే"** – అను భావనను ఆశ్రయించి **'బ్రహ్మచర్యము'** స్వీకరించును గాక।

(7) **అపరిగ్రహో।** దేనినీ స్వీకరించక, సమస్తమునకు అతీతుడై ఉండును గాక।

(8) **'అహింస-సత్యము'**లను వ్రతముగా స్వీకరించును గాక।

(9) **జితేంద్రియో। "ఇంద్రియములు నాచే స్వీకరించబడి, నన్ను సేవించుటకై ఉన్నాయి. అంతేగాని, ఇంద్రియ – ఇంద్రియ విషయములకు నేను దాసుడను కాను"** అను బుద్ధి స్థితిని కలిగియుండి, **జితేంద్రియుడు** – అగును గాక।

**(10) బహిరంతః స్నేహవర్జితః** – బాహ్యమున (In the outside) అంతరమున (Inside) కూడా దేనిపట్ల ప్రేమాభిమానపూర్వక ఆవేశము కలిగి ఉండకుండునుగాక। దేనితోను అవినాభావ సంబంధము పొందకుండును గాక।

**(11) శరీర సంధారణార్థం త్రిషు వర్ణేషు అభిశస్త పతితవర్జితేషు, పశుః అద్రోహీ, భైక్షమాణో।**

శరీర సంధారణ కొరకు మాత్రమే భిక్షను నిర్వర్తించునుగాక। అట్టి భిక్షాటణము 3 వర్ణముల వారి ఇళ్లల్లో నిర్వర్తించవచ్చు. అట్టివాడు క్రమంగా బ్రహ్మీ తత్త్వమును సమీపించగలడు.

(12) **సన్న్యాసాశ్రమి సర్వకాలములందు సర్వత్రా సమదర్శి అయి ఉండాలి.**

(1) పరమాత్మ ఏక – **అఖండ – అప్రమేయ – నిత్యానంద స్వరూపుడు.**

(2) ఆ **పరమాత్మయే జీవులందరిలోను** వేంచేసి ఉన్నారు.

(3) **సమం సర్వేషు భూతేషు।** పరమాత్మ **సమస్త జీవులుగాను సమస్వరూపుడై వేంచేసి ఉన్నారు.**

(4) **"అట్టి పరమాత్మయే నాకు ఉపాసన వస్తువు"**

అనునదే సన్న్యాస యోగుల ముఖ్య లక్షణమగు **సమదర్శనము.** (అట్టి సమదర్శనము చాతుర్వర్ణ్యముల వారికి మోక్ష మార్గముగా శాస్త్రములచే విధించబడుతోంది).

(13) సన్న్యాసయోగిః – **“ఇది లాభము – ఇది నష్టము”** అను ద్వంద్వదృష్టిని దాటి ఉంటాడు. **లాభ–అలాభములను సమదృష్టితో చూచువాడై ఉంటాడు.**

**“– నాకు భిక్షవేయువాడు [ (లేక) దానము చేయువాడు ]. మంచివాడు. భిక్షవేయనివాడు చెడ్డ”** అను దృష్టిని జయించి వేసి ఉంటాడు.

(14) అఱచేతులనే “మధూకరపాత్ర’గా ధరించి ఆహారము భిక్షగా స్వీకరిస్తూ ఉంటాడు.

(15) “నాకు బలము ఇచ్చే రుచికర పదార్థములనే భిక్షగా ఇవ్వాలి” – అనే మేదోవృద్ధి (క్రొవ్వు వృద్ధి) ఆశయము కలిగి ఉండరు.

(16) (i) ఈ సమస్తము బ్రహ్మమే।

(ii) నేను బ్రహ్మమునే।

(iii) నేనే ఈ సమస్తము అయి ఉన్నాను అను **“బ్రహ్మోహమస్మి”** భావనను వీడని వారై ఉంటారు.

**(17)** గుర్వర్థం గ్రామమ్ ఉపేత్య । గురువుకు ఆహారము సమర్పించటానికై గ్రామములో సంచరిస్తూ భిక్షను స్వీకరించటమును ఆశ్రయించాలి. లభించిన భిక్షను గురువుయొక్క ఆజ్ఞానుసారంగా ప్రసాదంగా స్వీకరించాలి.

**(18)** ధృవ శీలో । సాత్త్వికమైన, ధృవమైన (క్షణ క్షణ చాంచల్యము పొందని) ప్రవర్తన కలిగి ఉండాలి. అరవటం, భయపెట్టటం, శపించటము వంటి క్రియలు చేస్తూ భిక్షాటనము చేయరాదు.

**(19)** అష్టౌ మాస్య ఏకాకీ చరేత్। **చాతుర్మాస్య వ్రతము :** సంవత్సరములో 8 మాసములు ఎక్కడా ఒకచోట నివాసము కలిగి ఉండకుండా, సంచారుడై ఉండాలి. 4 మాసములు (వర్షాకాలంలో) గాని (అది సాధ్యపడకపోతే) – 4 పక్షములుగాని (రెండు నెలలుగాని) ఒకచోట ఇతరులతో నివసించువ్రతము – అనబడే **“చాతుర్మాస్యవ్రతము”** (లేక) **“చాతుర్పక్ష వ్రతము”** నిర్వర్తించువాడై ఉండాలి.

---

అట్టి సన్న్యాస జీవనము – “ఇకచాలు” – అని అనిపించినప్పుడు – ఇక ఆపై (1) కుటీచకుడుగానో (2) బహూదకుడుగానో (3) హంసగానో (4) పరమహంసగానో జీవనమును ఆశ్రయించాలి. వాటి వాటి జీవములను మంత్రపూర్వకంగా స్వీకరించునుగాక.

## జాతరూపధరుడు

### (Disconnected from entire social life)

వీరు సన్న్యాస పరాకాష్ఠ అగు కుటీచక, బహూదక, హంస, పరమహంస లక్షణములను ఆశ్రయించువారు. మంత్రపూర్వకంగా కటిసూత్రము (మొలత్రాడు), కౌపీనము (గోచి), దండము (బ్రహ్మదండము), కమండలువు (త్రాగే నియమైన పాత్ర)ల నియమములను కూడా విసర్జించి ఉంటున్నారు.

### *సన్న్యాస ఆచార నియమములు (మరికొన్ని)*

సన్న్యాసి సంవత్సరములో (చాతుర్మాస్యము కాకుండా మిగిలిన) 8 మాసములు ఒకేచోట నివాసము కలిగి ఉండడు.

| | | |
|---|---|---|
| గ్రామములో అయితే | – | ఒక రాత్రి (1) మాత్రమే. (మరుసటి రాత్రి వేరే గ్రామము)। |
| తీర్థ స్థలములలో | – | మూడు (3) రాత్రులు మాత్రమే। |
| పట్టణంలో అయితే | – | ఐదు (5) రాత్రులు మాత్రమే। |

క్షేత్ర ప్రదేశములలో (కాశీ, రామేశ్వరము వంటి చోట) – ఏడు (7) రాత్రులు మాత్రమే – **నివాసి అయి ఉంటారు.** ఎందుకంటే – సన్న్యాసి 'నివాస స్థలము'తో ఎట్టి మనో సంబంధము (Relatedness) కలిగి ఉండడు. **"అనికేతః"।**

**స్థిరమతిః** – ఉపాసన ఎందుకు? చంచలమగు మనస్సును నిశ్చలం చేయటానికి. నిశ్చలమగు మనస్సుకు ఆత్మయొక్క ఔన్నత్యము స్వాభావికంగానే అనుభవము అవుతుంది. **సన్న్యాసి తన మనస్సును, వాక్కును, ఆచరణను అదుపులో పెట్టుకొని 'స్థిరమతి' అయి ఉంటాడు.**

అనగ్నిః। – సన్న్యాసి అగ్ని కార్యములను కూడా వదలి ఉంటాడు.

సేవీః। – ఆతడు 'నేను సేవకుడను' అను భావన కలిగి ఉంటాడు. అంతేగాని **"సన్న్యసించాను కాబట్టి నేను తదితర బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థులకంటే గొప్ప గొప్ప వాడిని"** అని ఆలోచించడు. **"నేను పరమాత్మకు సర్వదా సేవకుడను"** అని తలుస్తాడు.

**నిర్వికారో** : దుష్టమైన, చాడీలు చెప్పే బుద్ధిని జయించి ఉంటాడు. సానుకూల్య – ప్రాతికూల్య సందర్భములలోను, సుఖ–దుఃఖ సంఘటన, సందర్భములలోను వికారములకు (కోపము, దుఃఖము, ఆవేశములకు) లోను కాకుండా, నిర్వికారుడై ఉంటాడు.

**నియమ-అనియమమ్ ఉత్సృజ్య** : మడి, ఆచారములు అగ్ని కార్యము మొదలైన సాంఘికమైన నియమ అనియమములు వదలివేసి ఉంటారు.

గోవు లభించిన దానినే తృప్తిగా భుజించువిధంగా, పరమహంస – పరివ్రాజకులు ఏ ఆహారము భిక్షగా లభిస్తే అదియే ప్రీతిగా స్వీకరించువారై ఉంటారు. నీరు దొరికిన చోట కమండలువును త్రాగునీరుతో నింపుకొని ఉంటారు. **"నావే బాధలు" అనే కార్పణ్యము** (Self Sympathy) **కలిగి ఉండరు.** దేవాలయ ప్రాంగణము, నది ఒడ్డు, గుహ మొదలైనచోట్ల రహస్యస్థల – నివాసులై ఉంటారు. "ఇది లభించాలి" అది "లభించకూడదు" మొదలైన లాభ అలాభ భావములు కలిగి ఉండరు. **శుభాశుభ కర్మ నిర్మూలన పరః।** శుభ – అశుభ కర్మఫల ధ్యాసలు విడచి ఉంటారు. ఆయనకు భూమి అంతా శయనాగారమే. అరుగుపైగాని, మరెక్కడైనా గాని, హాయిగా నిదురించుచూ ఉండగలరు. జుట్టు నాజూకుగా కత్తిరించటము మొదలైన క్షౌర కర్మలు పరిత్యజించి ఉంటారు. చాతుర్మాస్యము యోగాభ్యాసములచే యుక్తులై గడుపుతూ ఉంటారు. చాతుర్మాస్యము కాలములో కుదరకపోతే చాతుర్ – అర్ధ మాస (2 నెలల) ఏక ప్రదేశ నివాసవ్రతము (చాతురర్ధమాస్యము) ఆచరిస్తూ ఉంటారు.

– శుక్ల (జ్ఞాన) ధ్యాన పరాయణులై ఉంటారు.

– ధనము, స్త్రీ మొదలైన వాటిపట్ల స్వీకరించనివారై ఉంటారు.

**అనున్మత్తోఽపి ఉన్మత్తవత్ ఆచరన్।** ప్రజ్ఞచే స్వస్వరూప–సమస్తత్వము గురించిన – ఆత్మజ్ఞానము ఎరిగి ఉండి కూడా, బయటకు మాత్రం పిచ్చి వానివలెనే ఉంటారు.

***<u>బయటగా కనబడని</u>***

– ఆత్మలింగభావులై,

– ఆత్మతత్త్వోపాసనా–ఆచారులై,

– రాత్రింబవళ్లు **"స్వస్వరూప కేవలాత్మనుసంధానము"** (I am that in which all this is placed) అను బుద్ధియొక్క భావన నిర్వర్తిస్తూ, అట్టి నిశ్చల బుద్ధిని వదలక ఉంటారు. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో ఆత్మ భావన వీడనివారై ఉంటారు.

**"ప్రణవ సన్న్యాస మార్గం"గా బాహ్యమంతా సన్న్యసించి, "దేహము నాకు సంబంధించినది కాదు. నేను దేహమునకు సంబంధించిన వాడిని కాను"** అను నిశ్చల నిశ్చయముతో దేహమును విడచివేసినవారై ఉంటారు.

ఈవిధంగా ఆతడు **"పరమహంస పరివ్రాజకుడు"** అగుచున్నారు.

# శ్రీమన్నారాయణ - బ్రహ్మదేవ సంవాదము

## బ్రహ్మ ప్రణవ నిర్వచనము

బ్రహ్మదేవుడు : భగవాన్! శ్రీమన్నారాయణ దేవా! 'బ్రహ్మ ప్రణవము' అనగా ఎటువంటిది? దాని రూపమేమిటి? అద్దాని గురించి దయతో వివరించి చెప్పండి.

శ్రీమన్నారాయణుడు : సృష్టికర్తా! హిరణ్యగర్భా! వినండి. బ్రహ్మ ప్రణవమునకు–

షోడశ (16) మాత్రలు (జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ: 4×4).

**బ్రహ్మ ప్రణవము**
**(ప్రణవ షోడశ (16) మాత్రాత్మక అవస్థా చతుష్టయము)**

| జాగ్రత్‌మాత్రా చతుష్టయము — విశ్వ పురుషుడు | స్వప్నమాత్రా చతుష్టయము — తైజస పురుషుడు | సుషుప్తిమాత్రా చతుష్టయము — ప్రాజ్ఞ పురుషుడు | తురీయమాత్రా చతుష్టయము — తురీయ పురుషుడు |
|---|---|---|---|
| 1. విశ్వ విశ్వుడు **'అ' కారము** | 1. తైజస విశ్వుడు **'బిందు'** | 1. ప్రాజ్ఞ విశ్వుడు **'శాంతి'** | 1. తురీయ విశ్వుడు **'వైఖరీ'** |
| 2. విశ్వ తైజసుడు **'ఉ' కారము** | 2. తైజస తైజసుడు **'నాద'** | 2. ప్రాజ్ఞ తైజసుడు **'శాంత్యతీత'** | 2. తురీయ తైజసుడు **'మధ్యమా'** |
| 3. విశ్వ ప్రాజ్ఞుడు **'మ' కారము** | 3. తైజస ప్రాజ్ఞుడు **'కలా'** | 3. ప్రాజ్ఞ ప్రాజ్ఞుడు **'ఉన్మనీ'** | 3. తురీయ ప్రాజ్ఞుడు **'పశ్యంతీ'** |
| 4. విశ్వ తురీయుడు **'అర్ధమాత్ర'** | 4. తైజస తురీయుడు **'కలాతీత'** | 4. ప్రాజ్ఞ తురీయుడు **'మనోన్మనీ'** | 4. తురీయ తురీయుడు **'పర'** |

(1) జాగ్రత్ అవస్థా పురుషుడు (విశ్వుడు) – **జాగ్రత్ మాత్ర చతుష్టయం. 'అ'కారాంశము.**

(i) విశ్వ విశ్వ అవస్థ – **"అ"** **(జాగ్రత్‌లో జాగ్రత్ అవస్థ)।**

(ii) విశ్వ తైజస అవస్థ – **"ఉ"** **(జాగ్రత్‌లో స్వప్నావస్థ)।**

(iii) విశ్వ ప్రాజ్ఞ అవస్థ – **"మ"** **(జాగ్రత్‌లో తురీయ సాక్షీ అవస్థ)।**

(iv) విశ్వ తురీయ అవస్థ – **"అర్ధమాత్ర"** **[ జాగ్రత్‌లో తురీయ (సాక్షీ) అవస్థ)]।**

(2) స్వప్న - అవస్థా పురుషుడు - **(తైజసుడు)** (అవస్థలు). – **స్వప్నమాత్రాచతుష్టయం. "ఉ"కారంశము.**

(i) తైజస విశ్వుడు – **"బిందు"** **(స్వప్నములో జాగ్రత్ అవస్థ)।**

(ii) తైజస తైజసుడు – **"నాద"** **(స్వప్నములో స్వప్నావస్థ)।**

(iii) తైజస ప్రాజ్ఞుడు – **"కలాయం"** **(కల)** **(స్వప్నములో సుషుప్త్యవస్థ)।**

(iv) తైజస తురీయుడు – **"కలాతీతః"** **(కలాతీతము)** **(స్వప్నములో తురీయావస్థ)।**

**(3)** సుషుప్తి అవస్థా పురుషుడు (ప్రాజ్ఞుడు). <u>**సుషుప్తి మాత్రా చతష్టయం. – 'మ'కారంశము.**</u>

(i) ప్రాజ్ఞ విశ్వుడు – <u>**'శాంతి'**</u> **(సుషుప్తిలో జాగ్రత్ అవస్థ)।**

(ii) ప్రాజ్ఞ తైజసుడు – <u>**'శాంత్యతీత'**</u> **(సుషుప్తిలో స్వప్నావస్థ)।**

(iii) ప్రాజ్ఞ ప్రాజ్ఞుడు – <u>**"ఉన్మనీ"**</u> **(సుషుప్తిలో సుషప్త్యవస్థ)।**

(iv) ప్రాజ్ఞ తురీయుడు – <u>**"మనోన్మన్యాగ్ం"**</u> **(మన–ఉన్మని) (సుషుప్తిలో తురీయావస్థ)।**

**(4)** తురీయ పురుషుడు – <u>**తురీయమాత్రా చతుష్ఠయం – "అర్ధమాత్రాంశము".**</u>

(i) తురీయ విశ్వుడు – <u>**"వైఖరీ"**</u> **(తురీయములో జాగ్రత్ అవస్థ)।**

(ii) తురీయ తైజసుడు – <u>**"మధ్యమా"**</u> **(తురీయములో స్వప్నావస్థ)।**

(iii) తురీయ ప్రాజ్ఞుడు – <u>**"పశ్యంతీ"**</u> **(తురీయములో సుషుప్త్యవస్థ)।**

(iv) తురీయ తురీయుడు – <u>**"పర"**</u> **(తురీయములో తురీయావస్థ)।**

పైన చెప్పుకున్న "4 × 4 = 16" మాత్రలను, అంశలను (షోడశాంశలను) **"బ్రహ్మ ప్రణవము"** అని తత్త్వజ్ఞులు శాస్త్రీయంగా వివరించి చెప్పుచున్నారు.



అట్టి బ్రహ్మ ప్రణవము పరమహంస తురీయాతీత – అవధూతలకు ఉపాస్యము (Object of Adoration) అయిఉంటోంది.

అట్టి అధ్యయన – అవగాహనలచే బ్రహ్మము స్వానుభవమై ప్రకాశించగలదు. బ్రహ్మము యొక్క **అసంశయ స్వాభావికానుభవము సిద్ధించగలదు.** అదియే **'విదేహముక్తి'**గా కూడా చెప్పబడుతోంది.

**బ్రహ్మదేవులవారు** : భగవాన్! శ్రీమన్నారాయణ దేవాది దేవా! పరమహంస, తురీయాతీతుడు అగు అవధూత – సమస్తము సన్న్యసించి ఉంటాడుకదా? అతడు **'బ్రాహ్మణుడు'** అవుతాడా?

**నారాయణ భగవానుడు :** అవును. సమస్తము మొదలంట్లా సన్యసించి ఉంటాడు. సమస్త కర్మలు త్యజించి ఉంటాడు. **'బ్రాహ్మణుడు'** అని చెప్పబడతాడు.

**బ్రహ్మదేవుడు :** అనగా "పరమహంస (మరియు) అవధూత అయజ్ఞోపవీతి – అశిఖి (యజ్ఞోపవీతము, శిఖ త్యజించిన వాడు) అయినవాడు ఇంక దేనిని త్యజించి **పరమహంస** (మరియు) **అవధూత – అనే బ్రహ్మనిష్ఠాపరుడు అవుతాడు**? యజ్ఞోపవీతము బ్రహ్మనిష్ఠ కలిగి ఉండటానికి గుర్తు కదా మరి?

**నారాయణ భగవానుడు :** బిడ్డా! బ్రహ్మదేవా! భో అర్భక! చిన్న పిల్లవానివలె (అర్భకునివలె) అడుగుచున్నావయ్యా! అవధూత (మరియు) పరమహంస విషయములో దూది నిర్మితమైన యజ్ఞోపవీతము (జందెము, జంధ్యము, జందియము)తో పని ఏమున్నది? ఏమీ ఉండదు.

**యస్య అస్తి అద్వైతమ్ ఆత్మజ్ఞానం, తదేవ 'యజ్ఞోపవీతమ్'। – "ఈ సమస్త జీవులు, జగత్తు కూడా ఆత్మస్వరూపమే. ఆత్మకు ద్వితీయము అనునదే లేదు"** – అను స్వస్వరూపమునకు చెందిన ఆత్మతత్త్వ జ్ఞానమే – <u>**'యజ్ఞోపవీతము'.**</u> అట్టి యజ్ఞోపవీతము వారు ధరించియే ఉంటారు.

**తస్య ధ్యాన నిష్ఠైవ'శిఖా'।** – సమస్తము ఆత్మగా ధ్యాస (ధ్యానము) నిర్వర్తించటమే 'శిఖ'.

ఆత్మభావనయే అతడు చేయు **సత్కర్మ.**

**స సర్వ కర్తకృత్।** – అట్టి వాడు **(సమస్తము స్వస్వరూపాత్మకంగా సందర్శించువాడు)** సమస్త కర్మలు నిర్వర్తించినట్లే.

స బ్రాహ్మణః – ఈ సమస్తము బ్రహ్మముగా దర్శించువాడు బ్రాహ్మణుడు।

స బ్రహ్మనిష్ఠాపరః – సమస్తము బ్రహ్మముగా చూడటమే ఆయనయొక్క బ్రహ్మనిష్ఠాపరత్వము. అద్వైత – ఆత్మజ్ఞానియే బ్రహ్మనిష్ఠాపరుడు (అంతేగాని దారము సంబంధమైన యజ్ఞోపవీతము ధరించిన మాత్రం (లేక) విడచినంతమాత్రం చేతకాదు).

స దేవః – అట్టి బ్రహ్మసంభావనయే దివ్యమగు దైవీతత్త్వము. దేవత। ఆ **అద్వైత జ్ఞానియే దేవత।**

స ఋషి । – అట్టి (సమస్తము బ్రహ్మముగా) అనుభవమే 'ఋత్'. 'ఋత్'ను (అద్వైత జ్ఞానమును) ఆశ్రయించి ఉన్నవాడే **ఋషి।**

స తపస్వీ। – ఆతడే తపస్సు చేయువాడు. ఆత్మజ్ఞాన, ఆత్మతత్త్వానుభవముల గురించిన **తపనయే తపస్సు.**

స శ్రేష్ఠః। – అట్టి అఖండాత్మానుభవము కలవాడే **'శ్రేష్ఠుడు'.**

స ఏవ సర్వజ్యేష్ఠః। – ఆతడే అందరికంటే **జ్యేష్ఠుడు.**

స ఏవ జగద్గురుః। – ఆతడే **జగద్గురువు** కూడా.

**"అట్టి ఆత్మయే నేను"** – అని ఈ జీవుడు తెలుసుకొని **'పరమహంస'** అగుచున్నాడు.

**పరమహంస = "సోఽహమ్–పరమమ్"**

– **"ఆవల గల నేనైన నేనే నేను".** (సందర్భ సత్యమునకు ఆవలగల సహజమైయున్న నేనైన నేనే – సోఽహమ్–**"నేను"**).

**పరివ్రాజకుడు** = తన సంచారమంతా అట్టి ఆత్మయందే కలిగి ఉన్నవాడు. అట్టి పరమహంస అయిన పరివ్రాజకుడు ఈ వేలాది, లక్షలాది జీవులతో ఎక్కడోగాని తారసపడడు. **(మనుష్యాణాం సహస్రేషు। దుర్లభతరో, యత్ ఏకో అస్తి।)**

స ఏవ నిత్య **పూతః** – అతడు నిత్యనిర్మలమగు పరమాత్మయే। ఆయనయే వేదపురుషుడు. తెలియబడే సమస్తము తనయొక్క **'పురుషకారము'**గా ఎరుగువాడు. ఓ బ్రహ్మదేవా! ఆతని చిత్తము ఎల్లప్పుడు నాయందే ఏర్పడినదై ఉంటోంది. **యః తత్ చిత్తం మయ్యేవ అవతిష్ఠతి।**

అంతేకాదు. నేను ఎల్లప్పుడు ఆతనియందే ఏర్పడినవాడనై ఉంటాను. **అహం చ తస్మిన్ ఏవ అవస్థితః।**

బ్రహ్మదేవుడు: స్వామీ! నారాయణ భగవాన్! ఎవ్వడైతే **"ఆవల ఉన్న ఆ అమృతానంద రూపమగు ఆత్మయే నేను"** – అను పరమహంస భావమును సంపాదించుకొని, సమస్త అన్యభావములనుండి విడివడినవాడై, అవధూతత్వము సంతరించుకుంటాడో, అట్టి వాని లక్షణములు ఇంకా కూడా ఏతీరుగా ఉంటాయి?

**శ్రీమన్నారాయణుడు:** బ్రహ్మదేవా! ఈ ప్రపంచంలో ఏదైనా కూడా, అభ్యాసముచేతనే సిద్ధించగలదు కదా! మనము చెప్పుకోబోతున్న ఈఈ అభ్యాస, లక్షణములచే ఏ జీవుడైనా సరే, తప్పక **పరమహంస–పరివ్రాజకుడు కాగలడు.**

**(1)** నిత్యతృప్తః – **నిత్య తృప్తుడై ఉంటాడు.** ఈ దృశ్య ప్రపంచంలో కనిపిస్తున్న దేహములు, జన్మ–మృత్యువులు, సందర్భములు, సంఘటనలు, సంబంధములు, మనో–బుద్ధి–చిత్త–అహంకారములు ప్రదర్శించే కార్యక్రమములు మొదలైనవేవీ ఆతని స్వాభావిక, అప్రమేయ, అవ్యాజమగు **'ఆత్మతృప్తి'**ని కించిత్ కూడా 'అసంతృప్తి' వైపుగా మరల్చలేవు.

**(2)** స శీతోష్ణ సుఖదుఃఖ, **మానావమాన వర్జితః ।** – ఆతడు **ద్వంద్వ మోహములైనట్టి** శీత – ఉష్ణములను, సుఖ – దుఃఖములను, మాన – అవమానములను **మొదలంట్లా జయించినవాడై,** త్యజించినవాడై ఉంటాడు.

**(3)** స నింద – **అమర్ష సహిష్ణుః।** – ఆయన **నిందను** (దూషణ, తిరస్కారములను), **స్తుతి (పొగడ్త)**ని, **అమర్షమును** (కోపము, ఇతరుల ఓర్వలేనితనము–అసహనములను) స్వాభావికంగానే చిరునవ్వు వీడక, **సహించువాడై ఉంటాడు.**

**(4)** షడూర్మి వర్జితః – **"ఆకలి, దాహము, శోకము, మోహము, జర (వార్ధక్యము), మరణము (చావు)"** – అను ఆరు ఊర్మిలను దాటి, తన ఆత్మస్వరూపమును ఆవలగా దర్శిస్తూ ఆనందించువాడై ఉంటాడు. ఆతని దృష్టిలో భౌతిక శరీరముయొక్క 'రాక'– జన్మ కాదు. 'పోక' – మృత్యువు కాదు. (ఊర్మి = ప్రవాహ వేగము).

(5) **షట్‌భావ వికారశూన్యః** – "శరీరభావాశ్రయము, శరీరము యొక్క పుట్టుక, బాల్యము, యౌవనము, వార్థక్యము, మరణము" అనబడు షట్ (6) భావవికారములు తనయందు లేనివాడై ఉంటాడు.

**(6)** స జ్యేష్ఠ - అజ్యేష్ఠ వ్యవధాన రహితః – ఆతడు సర్వే సర్వత్రా ఆత్మనే దర్శిస్తాడు. **"మట్టితో చేసిన బొమ్మలు అనేకం కావచ్చు. కానీ, మట్టి ఒక్కటే కదా! బంగారు ఆభరణాలు అనేకం కావచ్చు. కానీ, బంగారము ఒక్కటే కదా! అట్లాగే ఏకమగు ఆత్మయే అనేకముగా కనిపిస్తోంది।"** – అను **దృష్టిని నిశ్చలము, సుస్థిరము, అకలంకము అనుక్షణికము చేసుకొని ఉంటాడు.** అందుచేత ఆయన– **"ఈతడు గొప్పవాడు. ఆతడు తక్కువవాడు. ఇతను జ్యేష్ఠుడు. ఆతడు కనిష్ఠుడు"**...మొదలైన భేదభావములు ఏమాత్రము కలిగి ఉండదు. అట్టి వ్యవచ్ఛేదములు (విభాగభేదములు), వ్యవధానములు (మఱుగు, అంతరము) **ఆతనికి వస్తుతః అనిపించవు. కనిపించవు.**

**(7).** స స్వ-వ్యతిరేకేన। న అన్యత్ ద్రష్టా।

*పరమాత్మను భావించే (5) విధానములు:*

(i) ఎక్కడో దూరాన పరమాత్మ (వైకుంఠములోనో, కైలాసంలోనో, మణిపురంలోనో, దేవాలయములోనో పఠములోనో వేంచేసియున్న స్వామి) → యొక్క అర్చన (God at some distance).

(ii) పరమాత్మ నేను చూచే **సర్వదేహము**లలో వేంచేసి ఉన్నారు. → అనే మనన–ఉపాసన. (God in all).

(iii) "పరమాత్మ సమస్త **జీవులుగా,** సర్వదేహములలోని **'దేహి'**గా ప్రదర్శనమగుచున్నారు". → అను సర్వత్రా దర్శనము. 'నిదిధ్యాస' – స్థితి **'తత్త్వము'** (God as all). **(తత్ త్వమ్)।**

(iv) 'నేను'గా ప్రదర్శనమగుచున్నది ఆ పరమాత్మయే → **'అదియే నేను'** – అను రూపము గల **'సోఽహమ్।' తత్త్వము.** (I am that as well).

(v) నేనే ఈ సమస్త లోకాలుగా లోకపాలకులుగా, లోకస్థులుగా ఆత్మనై ప్రదర్శనము అగుచున్నాను → **మయా తతమ్ ఇదమ్ సర్వమ్ జగత్ – అవ్యక్త మూర్తినా।** → అందరిలోని నేనైన **నేనే నేను.** ఇది **సమాధి స్థితి.** (All this and that is what am I).

ఈ ఐదు అభ్యాస స్థితులను కరతలామలకుము చేసుకొన్నవాడై, పరమహంస పరివ్రాజకుడు (సోఽహమ్ – తత్త్వమ్ ఏకార్థమై) ప్రకాశించుచున్నారు. అందుచేతన ఈయన **"నాకు వేరైనది లోకాలలోగాని, లోకములకు ఆవలగాని ఎక్కడా ఏదీలేదు"** – అను స్వాభావిక, అవ్యాజ, అనునిత్యానుభవం (Non conditioned and always experiencing) పొందుచున్నారు. తత్ – స్వాభావికుడై ఉంటున్నాడు. **"లోకాలలో నేను ఉన్నట్లే, లోకాలన్నీ కూడా నాలోనే ఉన్నాయి"** అను **ఏక అక్షర బ్రాహ్మీదృష్టి-**ని ఆశ్రయించి ఉంటున్నాడు. అందుచేత–స్వవ్యతిరేకేన న అన్యత్ ద్రష్టు తనకు వేరైన దేనికో తాను– "ద్రష్ట" అయి ఉండడు. **తాను చూచే సమస్తము తానే అయి ఉంటాడు.** పరమహంసకు సమస్తము తానేనను నిశ్చయము సర్వదా చెక్కు చెదరదు.

**న అన్యత్ ఆశా అంబరో।** "నాకు ఇంకేదో కావాలి. ఇంకా కూడా ఏదో పొందాలి" – అనే ఆశ, దురాశ, పేరాశ, నిరాశలకు చోటు ఇవ్వడు. **"సమస్తము నేనే అయి ఉండగా, ఇంక నేను – ఈ నేనే అయి ఉన్న 14 లోకముల నుండి – పొందవలసినది ఏముంటుంది? ఏమీ ఉండదు"** – అనే అవగాహనచే **'ఆశించటము'**ను జయించివేసి ఉంటాడు. ఆశ అనే వస్త్రము ధరించవలసిన పని ఆతనికి ఉండదు. ఆశకు అవకాశమే ఇవ్వడు. "నేనే అయిన నానుండి నేనేమి కోరుకోవాలి?" – అని ప్రశ్నిస్తాడు.

**(9)** న నమస్కారో। న స్వాహాకారో। న స్వధాకారశ్చ । న విసర్జనపరో। అట్టి పరివ్రాజకుడు అనన్య భావనను సంతరించుకొన్నవాడై, అనన్య భావనా ప్రభావితుడై ఎవరికీ నమస్కరించడు. ఎదురుగా చూడబడే దేవతనుగాని, సహజీవుని గాని తనకు వేరుగా భావన చేయడు. **తానే 'తత్' అయి ఉన్నట్లు తత్ ఏ 'తాను' అయి ఉన్నట్లు స్వానుభవుడై ఉంటాడు.**

**న స్వాహా కారో।** దేవతలకు సమర్పణ చేయువాడు, పిత్రు దేవతలకు సమర్పించువాడు అయి ఉండడు. అవన్నీ తానేగా దర్శిస్తూ ఉంటాడు.

న స్వధాకరో। న విసర్జనపరో : **'పితృదేవతలు కూడా ఆత్మనగు నాకు అనన్యమే'** అని ఎరిగి, ఏదీ **'స్వధా'** గా సమర్పించనివాడై ఉంటాడు. దేనినీ వదలడు. పట్టుకోడు. **ఏది చేస్తూ ఉన్నా, (లేక) చేయకున్నా నిర్వికారుడై ఉంటాడు.**

**(10) నిందాస్తుతి వ్యతిరిక్తో** – నింద, స్తుతులు పొందుచున్నప్పుడు దేనికీ వ్యతిరేకుడై ఉండడు.

**(11) న మంత్ర - తంత్ర ఉపాసకో** : ఒక మంత్రమునకో, ఒక తంత్రము (విధానమునకో) పరిమితుడు అయి ఉండడు.

**(12) దేవాంతర ధ్యానశూన్యో।** – బాహ్యదేవతలను ధ్యానించువాడై ఉండడు.

**(13) లక్ష్య - అలక్ష్య నిర్వర్తక । సర్వ ఉపరతః।** – లక్ష్యములను, అలక్ష్యములను (ఆశయములను, అనాశయములను, చేయవలసినవి – చేయకూడనివి) ఆయా విధములుగా నిర్వర్తిస్తూనే-సమస్త లోకసంబంధమైన విషయ–విశేష–వ్యవహార–సంబంధ–బాంధవ్యముల నుండి ఉపరతుడై (Having completely withdrawn) ఉంటాడు. సర్వత్రా నిర్వర్తనుడు (వర్తనలేనివాడై) ఉంటాడు.

(14) **సర్వదా – సత్ (ఉనికి) చిత్ (ఎరుక) ఆనంద** (ఆనంద) సహజస్వరూపుడై వెలుగొందుతూ ఉంటాడు.

**(15)** చిద్ఘనః– కేవల 'చిత్' (ఎరుగుట) స్వరూపుడై, ఎరుగబడేదంతా **'ఎరుగుట'** అనుదానియందు **ఘనీభూతము చేసినవాడై ఉంటాడు.**

**(16) సంపూర్ణా** – ఇంక 'పొందవలసినది' అంటూ ఏదీ ఆతనిపట్ల శేషించి ఉండదు. కాబట్టి తనయందు, సర్వభూతములయందు సదా సంపూర్ణత్వమును సందర్శిస్తూ ఉంటాడు.

**(17) సంపూర్ణ - ఆనందైక రూపో** – అట్టి **'పూర్ణమదః' పూర్ణమిదమ్ । పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే'** అను భావనతో సర్వత్రా ఆనందైక రసరూపుడై ఉంటాడు. జలబిందువు కొత్తగా జలముగా అవవలసిన పనేముంటుంది?

(18) **బ్రహ్మైవాహమస్మి। "బ్రహ్మము"** అని వేద – ఉపనిషత్తులచే, తత్త్వజ్ఞులచే **ఎలుగెత్తి పిలువబడుచున్నది నాగురించే।** నేను అట్టి **బ్రహ్మమే అయి ఉన్నాను"** – అని ఎలుగెత్తి చేతులెత్తి **"ఆత్మగానం"** చేయువాడై ఉంటాడు.

**ఇతి అనవరతమ్**
**బ్రహ్మప్రణవ – అనుసంధానేన**
**యః కృతకృత్యో భవతి,**
**స "పరమహంసగ్ం పరివ్రాట్।**

పైన మనం చెప్పుకుంటున్న '18' సూత్రములను కలిపి **"బ్రహ్మప్రణవ అనుసంధానము"** అని అంటారు. అట్టి అనుసంధానముచే క్రమంగా కృతకృత్యుడు అయినవాడు – **"పరమహంస పరివ్రాట్"** అని చెప్పబడుచున్నాడు.

ఓ బ్రహ్మదేవా! **"కః పరివ్రజనాధికారీ? కీ దృశం పరివ్రాజక లక్షణం? కః పరమహంసః? పరివ్రాజకత్వం కథమ్?"** అనే మీ ప్రశ్నకు సమాధానంగా –

- పరివ్రాజకత్వమునకు అర్హుడు ఎవరో,
- పరివ్రాజక లక్షణములు ఏమేమిటో
- పరివ్రాజకత్వము ఏవిధంగా సిద్ధించగలదో

ఆయా విశేషాలు, తత్త్వవేత్తల ప్రవచనముల, వేదాంతర్గతములైనట్టి ఉపనిషత్తుల – సారముగా మనము ఇప్పుడు చెప్పుకున్నాము.

(బ్రహ్మచారి, గృహస్త, వానప్రస్త, సన్న్యాస–ఇత్యాది)– ఏ ఆశ్రమంలోవారైనా సరే పైన మనము చెప్పుకున్న పరమహంస – పరివ్రాజక లక్షణములను అభ్యాసపూర్వకంగా అనుష్ఠానము చేస్తూ ఉంటే, అట్టివాడు **పరమహంస పరివ్రాజకుడు** కాగలడు. **ఇది నిశ్చయము.**

***ఇతి పరమహంస పరివ్రాజకోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 16 పాశుపత బ్రహ్మోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ పాశుపత బ్రహ్మవిద్యా
సంవేద్యం పరమాక్షరమ్
పరమానంద సంపూర్ణం
రామచంద్రపదం భజే॥

"పాశుపతము" అని పిలువబడు "బ్రహ్మవిద్య" యొక్క అధ్యయనముచే తెలియబడునది, సర్వజగత్‌దృశ్యమునకు మునుముందే సర్వదా (పరమై)యున్నట్టిది, మార్పుచేర్పులచే స్పృశించబడకపోవుటచే అక్షరమైనట్టిది, పరమానందము, స్వసంపూర్ణము అయినట్టిది - అగు "శ్రీరామచంద్రపదమును" ఉపాసించుచున్నాము.

ఓం। సర్వము హరిమయము।

| | |
|---|---|
| **1.** హరిః ఓమ్।<br>అథ హ వై స్వయంభూః బ్రహ్మా<br>"ప్రజాః సృజాని....!"<br>ఇతి కామకామో జాయతే। | తనకు తానే జనించినట్టి (స్వయంభువు అగు) బ్రహ్మదేవుడు ఒకానొకప్పుడు **"నేను జీవులను సృష్టించెదను గాక!"** - అను కోరికను పొందారు (కామకాముడు అయినారు). [ఆవిధంగా 'అన్యము' రూపంగా సమస్త జగద్వ్యవహారము కల్పించబడసాగుతోంది]. |
| కామేశ్వరో వైశ్రవణో బ్రహ్మపుత్రో<br>వాలఖిల్యః స్వయంభువమ్ పరిపృచ్ఛతి:<br>"= జగతాం కా విద్యా? కా దేవతా?<br>జాగ్రత్ తురీయయోః<br>అస్య కో దేవః? | ఒక సమయంలో కామేశ్వరుడు, వైశ్రవణుడు, బ్రహ్మపుత్రుడు, వాలఖిల్యుడు అను నలుగురు ఋషులు బ్రహ్మదేవుని సమీపించి ఈవిధంగా అడిగారు. "తండ్రీ!"<br>1) ఈ సమస్త జగత్తులలో అత్యుత్తమమైన విద్య ఏది?<br>2) ఈ జగత్తులకు దేవతలు (Devine to all worlds) ఎవరు? జాగ్రత్‌కు దేవత ఎవరు? తురీయమునకు దేవత ఎవరు? |
| యాని తస్య వశాని?<br>కాలాః కియత్ ప్రమాణాః?<br>కస్య ఆజ్ఞయా రవి చంద్ర<br>గ్రహాదయో భాసంతే?<br>కస్య మహిమా గగనస్వరూపః? | (3) ఆ దేవత వశంగా ఏమేమి ఉన్నాయి?<br>(4) కాలము ఎంత ప్రమాణము కలిగి ఉంటోంది?<br>(5) ఎవ్వరి ఆజ్ఞచే ఆకాశంలో సూర్యుడు, చంద్రుడు, గ్రహములు మొ॥నవి (ఒకానొక విధి విధానంగా) భాసిస్తున్నాయి?<br>(6) ఆకాశ స్వరూపముయొక్క 'మహిమ" ఎవ్వరిది? |
| ఏతత్ అహగ్ం శ్రోతుం ఇచ్ఛామి।<br>న అన్యో జానాతి।<br>త్వం బ్రూహి, బ్రహ్మన్!" | స్వామీ! స్వయంభూ! బ్రహ్మదేవా! ఈఈ విశేషాల వివరణలు మేము శ్రవణం చేయతలచి మిమ్ములను శరణువేడుచున్నాము. ఈఈ విశేషాలు మీరు మాత్రమే ఎరిగియున్నారు. అందుచేత దయతో మీరే వివరించి బోధించ ప్రార్థన. |
| **2.** స్వయంభూః ఉవాచ :<br>కృత్స్న జగతాం మాతృకా విద్యా<br>ద్వి - త్రి వర్ణ సహితా।<br>ద్వివర్ణ మాత్రా। (ద్వివర్ణమాతా)। | బ్రహ్మదేవుడు : ఈ జగత్తుయొక్క ఉత్పత్తిని వివరించే **'మాతృకావిద్య'** రెండు - మూడు వర్ణములతో కూడి ఉన్నది. రెండు వర్ణములైన మాత్రకలు, మూడు వర్ణములతో కూడినది, 'నాలుగు' తీరులైన చాతుర్మాత్రాత్మ ఏకము - అగు 'ఓం' కార రూపిణియే అయి ఉన్నది. **నాకు కూడా ప్రాణాత్మకమైన దేవత- ఆ మాతృకా విద్యయే.** |

| | |
|---|---|
| **త్రివర్ణ ఉపేతా। చతుర్మాత్రాత్మక-**<br>**'ఓం' కార రూపిణీ।**<br>**మమ ప్రాణాత్మికా దేవతా।**<br>**అహమేవ జగత్ - త్రయైకః పతిః।**<br>**మమ వశాని సర్వాణి యుగాన్యపి।** | 1) **"అ-మ"** ద్వివర్ణాత్మకము<br>2) **"అ-ఉ-మ"** త్రివర్ణాత్మకము<br>3) **"అ-ఉ-మ-హంస"** చాతుర్మాత్రాత్మకము<br>(భూ-స్వర్గ-పాతాళ) త్రిజగత్తులకు ఏకైక పతిని, ప్రభువును నేనే।<br>యుగములన్నీ నాకు వశమై (Under my control) ఉంటున్నాయి. |
| **అహోరాత్రాదయో మత్ సంవర్ధితాః।**<br>**కాలాః మమరూపం।**<br>**రవేః తేజః చంద్ర నక్షత్ర**<br>**గ్రహ తేజాంసి చ,**<br>**గగనో - మమ త్రిశక్తి మాయా స్వరూపః।** | రాత్రి-పగలు-అనేవి నాచే వృద్ధి చేయబడుచున్నట్టి, నాయొక్క కాలస్వరూపము.<br>సూర్యతేజస్సు, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు, ఆకాశము - మొదలైనవన్నీ కూడా నాయొక్క మాయాస్వరూపమై ఆకాశమున వెలయుచున్నాయి. |
| **నాన్యో మత్ - అస్తి। (నాన్యో మదస్తి)।**<br>**- తమో మాయాత్మకో రుద్రః।**<br>**- సాత్త్విక మాయాత్మకో విష్ణుః।**<br>**- రాజస మాయత్మకో బ్రహ్మా।**<br>**- ఇంద్రాదయః తామస రాజసాత్మికాః।**<br>**న సాత్త్వికః కోఽపి।**<br>**- అఘోరః సర్వసాధారణ స్వరూపః।** | ఎక్కడా ఏదీ కూడా నాకు వేరుగా ఏమాత్రము లేదు.<br>రుద్రుడు తమో మాయాత్మకుడు.<br>విష్ణువు - సాత్త్విక మాయాత్మకుడు.<br>బ్రహ్మయో - రాజస మాయాత్మకుడు.<br>ఇంద్రుడు మొదలైన దేవతలంతా తామస - రాజసాత్మకులు. కేవల సాత్త్విక రూపుడు ఎవరూ లేరు. (ప్రకృతిలో ఉండరు).<br>అఘోరము (సూక్ష్మరూపము) - సర్వ సాధారణ స్వరూపమైయున్నది. (స్థూలమంతా సూక్ష్మరూప ప్రదర్శనమే). |
| **సమస్త యాగానాం →**<br>**రుద్రః పశుపతిః → కర్తా।**<br>**రుద్రో → యాగ దేవః।**<br>**విష్ణుః → అధ్వర్యుః।**<br>**హోతా → ఇంద్రః।**<br>**దేవతా → యజ్ఞభుక్।** | **<u>సమస్త యాగములకు -</u>**<br>పశుపతి యగు రుద్రుడు → **కర్త।**<br>రుద్రుడు → **యాగదేవుడు।**<br>విష్ణువు → **అధ్వర్యుడు** (యజ్ఞమునందు మంత్ర విధానము నడుపువాడు)।<br>ఇంద్రుడు → **హెూత** (ఋక్కులు తెలిసిన ఋత్విక్కు, హోమము చేయువాడు)।<br>దేవతలు → **యజ్ఞభోక్తలు।** |
| **మానసం → బ్రహ్మా।**<br>**మాహేశ్వరం → బ్రహ్మా।**<br>**మానసగ్ం → హగ్ంసః।**<br>**సోఽహగ్ం → 'హగ్ంస' ఇతి।** | బ్రహ్మ → **మానసము (మనోరూపము)।**<br>బ్రహ్మ → **మహేశ్వరుడు।**<br>హంస → **మానసము।**<br>హంస → **సోఽహమ్।** |
| **తన్మయ → యజ్ఞో నాదానుసంధానమ్।**<br>**తన్మయ వికారో → జీవః।**<br>**పరమాత్మ స్వరూపో → హగ్ంసః।** | తన్మయ (తత్ - మయ) → యజ్ఞము యొక్క నాదానుసంధానము<br>తన్మయ వికారమే → ఈ **జీవుడు।**<br>**'హంస' యే సోఽహమ్। అదియే పరమాత్మ స్వరూపము.** |

| | |
|---|---|
| **3. అంతర్బహిః చరతి హగ్ంసః।**<br>**అంతర్గతో – అనవకాశాంతర్గత**<br>**సువర్ణ స్వరూపో హగ్ంసః।** | హంసయే - బాహ్య అభ్యంతరములలో చరించునది. సమస్తమునకు అంతర్గతము.<br>ఆకాశ - అనవకాశములకు కూడా అంతర్గతుడు ఎవరు? సువర్ణ స్వరూపుడగు **'హంస'** యే! |
| **షణ్ణవతి (96) తత్త్వ తంతువత్ వ్యక్తమ్।**<br>**చిత్ సూత్రత్రయ "చిన్మయలక్షణమ్"।**<br>**నవతత్త్వ "త్రిరావృతమ్"।** | అట్టి కేవలమగు హంస - '96' తత్త్వములతో - తంతువువలె (తామర తూడు దారమువలె) 'వ్యక్తము' (Manifested) అగుచున్నది.<br>చిత్ సూత్రత్రయముతో 3 సూత్రములతో (**ఎరుగువాడు - ఎరుక - ఎరుగబడునది** లతో) కూడి **'హంస'** చిన్మయలక్షణుడు.<br>**నవతత్త్వములతో** (నవ-ఆత్మగుణములు జ్ఞాన , సుఖ, దుఃఖ, ఇచ్ఛా ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మ, సంస్కారములతో), మూడు పేటలతో (సత్వ-రజో-తమములతో) హం - త్రిరావృతమై- ఏర్పడి ఉంటోంది. |
| **బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకమ్।**<br>**అగ్నిత్రయ కళోపేతమ్।** | 'హంస' ఇంకా కూడా, - బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకము (సృష్టి - స్థితి - లయాత్మికము). (అహవనీయాగ్ని, దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని అనబడు) త్రిఅగ్నులు తనయొక్క కళలుగా (యజ్ఞమునందు) కలిగి ఉన్నట్టిది. |
| **'చిత్' గ్రంథి బంధనమ్।**<br>**అద్వైత గ్రంథిః।** | చిత్ (ఎరుక - ఎరుగువాడు - ఎరుగబడునది) అనబడు గంధనములచే (ముడులచే) బంధనము కలిగి ఉంటోంది.<br>(జీవాత్మ పరమాత్మల **పరస్పర అద్వితీయత్వము** అనే) **అద్వైత గ్రంథి** కలిగి ఉన్నట్టిది కూడా. |
| **యజ్ఞ సాధారణాంగమ్।**<br>**బహిరంతః జ్వలనమ్।** | ఈ విశ్వమంతా తనయొక్క యజ్ఞరూపముగా సాధారణమైన అంగముగా కలిగి ఉన్నట్టిది - **హంస।**<br>బాహ్య - అభ్యంతరములుగా వెలుగొందుచున్నట్టిది - హంస. |
| **యజ్ఞాంగ లక్షణ – బ్రహ్మస్వరూపో హగ్ంసః।**<br>**ఉపవీత లక్షణ సూత్ర బ్రహ్మగా యజ్ఞాః।** | హంసయే [ఆత్మయే (లేక) బ్రహ్మమే] - ఈ సమస్తమును తన స్వరూపముగా కలిగి, యజ్ఞాంగములు తన లక్షణములుగా కలిగి ఉన్నట్టిది.<br>**'యజ్ఞము'** - సూత్రబ్రహ్మగతమై ఉపవీత లక్షణములు కలిగి ఉన్నట్టిది. |
| **బ్రహ్మాంగ లక్షణయుక్తో – యజ్ఞసూత్రమ్।**<br>**తత్ బ్రహ్మసూత్రమ్,**<br>**యజ్ఞసూత్ర సంబంధీ – బ్రహ్మయజ్ఞః।** | **యజ్ఞసూత్రము:** బ్రహ్మము యొక్క ద్రష్ట - దర్శన - దృశ్య - దృక్ బ్రహ్మాంగలక్షణముల- సంజ్ఞ. అదియే (తత్త్వరూపమే) బ్రహ్మ సూత్రము 'యజ్ఞసూత్ర' సంబంధముగా **'బ్రహ్మయజ్ఞము'** అనబడుతోంది. |
| **తత్స్వరూపః।**<br>**అంగాని మాత్రాణి।**<br>**మనోయజ్ఞస్య హగ్ంసో – యజ్ఞసూత్రమ్।** | అద్దాని అంగములు - శబ్ద స్పర్శ రూప రస గంథములనబడే పంచ తన్మాత్రలు. మనస్సుతో చేసే మనో యజ్ఞమునకు హంస (సోఽహమ్) యే యజ్ఞ సూత్రము. |
| **ప్రణవం బ్రహ్మసూత్రం బ్రహ్మయజ్ఞమయమ్।**<br>**ప్రణవ – అంతర్వర్తీ హగ్ంసో –**<br>**"బ్రహ్మసూత్రమ్।"** | 'ఓం' (అ+ఉ+మ+హంస) అను ప్రణవము - బ్రహ్మ యజ్ఞమునందు బ్రహ్మసూత్రము.<br>ప్రణవ - అంతర్వర్తి (అంతరంగా వర్తించుననది) అగు హంసయే (సోఽహమ్ యే) - **బ్రహ్మసూత్రము.** |

| | |
|---|---|
| **తదేవ బ్రహ్మయజ్ఞమయమ్।**<br>**మోక్షక్రమమ్। బ్రహ్మసంధ్యా క్రియా, మనో యాగః।**<br>**'సంధ్యాక్రియా' మనోయాగస్య లక్షణమ్।** | - ఇవన్నీ "బ్రహ్మసంధ్యా క్రియలు". "మనో యాగము". **బ్రహ్మయజ్ఞమయ విశేషములు.** మోక్షమునకు క్రమ విధానము.<br>మనో యాగము యొక్క లక్షణ విశేషమే **"సంధ్యాక్రియ".** |
| **యజ్ఞసూత్ర ప్రణవ బ్రహ్మయజ్ఞ**<br>**క్రియాయుక్తో బ్రాహ్మణః।**<br>**బ్రహ్మచర్యేణ చరంతి దేవాః॥** | **యజ్ఞసూత్రము, ప్రణవోపాసన, బ్రహ్మయజ్ఞము** - అను క్రియలు - **'బ్రాహ్మణము'** - అనబడుచున్నాయి. నిర్వర్తించువారు బ్రాహ్మణులు.<br>దేవతలు బ్రహ్మమునందు ఆచరణ కలిగి ఉన్నారు. |
| **4. హగ్ంస సూత్రచర్యా యజ్ఞాః।**<br>**హంస – ప్రణవయోః అభేదః।**<br>**హంసస్య ప్రార్థనాః త్రికాలాః।**<br>**త్రికాలాః త్రివర్ణాః।** | 'హంస' (ఆత్మ, సోఽహమ్) యొక్క సూత్ర (Indicative) చర్యలు **"యజ్ఞములు".**<br>హంస, ప్రణవము అభేదమైనవి. ఏకరూపము కలిగినట్టివి. **హంసయొక్క ప్రార్థనా రూపములే త్రికాలములు.** త్రికాలములు (భూత-వర్తమాన-భవిష్యత్ కాలములు) ఆత్మకు త్రివర్ణములు (3 రంగులు) వంటివి. |
| **త్రేతాగ్ని (గ్న్యన్) అనుసంధానో యాగః।**<br>**త్రేతాగ్న్య ఆత్మాకృతి వర్ణ**<br>**'ఓం' కార హగ్ంస**<br>**అనుసంధానో అంతర్యాగః।** | (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అనబడు) త్రేతాగ్నుల (అగ్నిత్రయము యొక్క) అనుసంధానమే 'యాగము'.<br>(త్రైతాగ్నులైనట్టి జీవాత్మ, ఈశ్వరుడు, పరమాత్మల) - త్రైతాగ్నుల ఏకాత్మకృతి వర్ణనయే 'ఓంకారము'. అట్టి త్రేతాగ్నుల ఆత్మకృతి వర్ణము - ఓంకారముతో అనుసంధానమే **'అంతర్యాగము'.** |
| **చిత్ – స్వరూప సత్ తన్మయం**<br>**తురీయ స్వరూపమ్।** | చిత్ స్వరూపముతో కూడిన సత్-తన్మయమే **"తురీయస్వరూపము"** (జాగ్రత్ స్వప్న సుషుప్తులకు సాక్షి అయి, ఆ మూడిటిని సంచార స్థానములుగా కలిగి ఉన్నట్టిది - 'తురీయము'). |
| **అంతరాదిత్యే జ్యోతిస్స్వరూపో హగ్ంసః।**<br>**యజ్ఞాంగం బ్రహ్మ సంపత్తిః।**<br>**బ్రహ్మ ప్రవృత్తౌ తత్ ప్రణవహంస**<br>**సూత్రేణైవ ధ్యానమ్ ఆచరంతి।** | అంతర్గమైయున్న ఆదిత్యుని జ్యోతి స్వరూపమే **'హంస'.**<br>బ్రహ్మసంపత్తియే (బ్రహ్మతత్త్వజ్ఞానమే) యజ్ఞములో ముఖ్యమైన సంపత్తి. (సంపదా విశేషము).<br>ప్రణవము (ఓంకారము) ధ్యానించేడప్పుడు అది బ్రహ్మసంపత్తికి సూత్రముగా ధ్యానిస్తూ, **బ్రహ్మభావనయే ఆచారణగా కలిగి ఉండటము- "బ్రహ్మ ప్రవృత్తి".** |
| **ప్రోవాచ పునః స్వయంభువం:**<br>**ప్రతిజానీతే బ్రహ్మపుత్రో,**<br>**ఋషిః వాలఖిల్యః :**<br>**హంససూత్రాణి కతిసంఖ్యాని?**<br>**కియద్వా ప్రమాణమ్?** | **ఇంకా బ్రహ్మ మానసపుత్రుడగు వాలఖిల్యమహర్షి - స్వయంభువు, ప్రజాపతి అగు బ్రహ్మదేవుల వారిని ఈవిధంగా అడిగారు.**<br>హంస సూత్రములు ఎన్ని?<br>దానికి ప్రమాణము ఏమిటి? |
| **(స్వయంభువౌ వాచ):**<br>**హృత్ ఆదిత్య మరీచీనాం**<br>**పదం షణ్ణవతిః (96)।**<br>**చిత్ సూత్ర ఘ్రాణయో,**<br>**స్వర నిర్గతా, ప్రణవధారా**<br>**షట్ (6) అంగుళదళా అశీతిః।** | **శ్రీ స్వయంభువు ఈ విధంగా వివరించారు.**<br>"హృదయము" అనే సూర్యుని యొక్క కిరణములు (ప్రసరణ స్థానములు) - '96'.<br>చిత్ సూత్రము - అనే ఘ్రాణము (వాయుసంచలము) యొక్క స్వర నిర్గతమైన ప్రణవాధారములు '6' అంగుళముల విస్తీర్ణతతో '80' దళములు. |

| | |
|---|---|
| వామబాహు దక్షిణకట్యోః<br>అంతశ్చరతి హగ్ంసః పరమాత్మా।<br>బ్రహ్మ గుహ్య ప్రకారో<br>న అన్యత్ర విదితః॥ | **ఎడమ భుజమునకు - కుడికంటికి (కుడి మొల ప్రదేశమునకు) మధ్యగా హంసరూపుడగు పరమాత్మ సంచారము కలిగి ఉన్నారు.**<br>**“బ్రహ్మగుహ్యప్రకారమును”** (బ్రహ్మతత్త్వ రహస్యమును) అనుసరించి ‘అన్యత్ర’ తెలియబడడంలేదు. (ఆత్మ అనన్యము, ఆత్మకు వేరుగా ఏదీ లేదు). |
| యే జానంతి, తే అమృతఫలకాః।<br>సర్వకాలగ్ం హంస ప్రకాశకమ్। | **“ఆత్మకు వేరుగా ఏదీ లేదు”** అను అనన్యత్వమును ఎరిగినవారు అమృత ఫలము పొందినవారగుచున్నారు.<br>(త్రికాలములు అనబడే) సర్వ కాలములందు హంస (ఆత్మ) ఈ సమస్తముగా ప్రకాశమానమై ఉన్నది. |
| ప్రణవ హంసా అంతర్ధ్యాన<br>ప్రకృతిం వినా న ముక్తిః।<br>నవ సూత్రాన్ పరిచర్చితాన్।<br>తేఽపి యత్ బ్రహ్మ చరంతి,<br>అంతరాదిత్యం న జ్ఞాతం<br>మనుష్యాణామ్। | ప్రణవ హంస (The Comprehensive Self of every self) - యొక్క అంతరధ్యానముగా సమస్త ప్రకృతిని దర్శించటమునకు వేరుగా ‘ముక్తి’కి నిర్వచనము లేదు. **సమస్తము స్వస్వరూపాత్మగా అనునిత్యము సందర్శించటమే ‘ముక్తి’.** మరొకటేదీ కాదు.<br>ఎవరైతే నవ (9) సూత్రములను పరిచర్చించి ఇది ఎరుగుచున్నారో, అట్టి వారు స్వాభావికముగా బ్రహ్మమునందు చరించుచున్న వారగుచున్నారు.<br>మానుష (ఇంద్రియ పరిమిత, దృశ్య పరిమిత) దృష్టిచే అంతరాదిత్యుని (అంతర సూర్యుడగు ఆత్మను) ఎరుగజాలకున్నారు. |
| “జగదాదిత్యో రోచత” ఇతి।<br>జ్ఞాత్వా తే మర్త్యా విబుధాః।<br>తపన ప్రార్థనాయుక్తా ఆచరంతి। | **“ఈ జగత్తు అంతరాదిత్యుని (ఆత్మ పురుషుని) రుచికర ప్రదర్శనము”** - అని ఎరిగినవారు విభుదులై (తెలివి కలవారై), ఆత్మయందే ప్రార్థనాయుక్తమైన తపన (తపస్సు)ను ఆచరిస్తూ ఉంటారు. |
| **5. <u>వాజపేయః</u>**<br>పశుకర్తా – అధ్వర్యుః।<br>ఇంద్రో – దేవతా।<br>అహిగ్ంసా – ధర్మయాగః<br>పరమ హగ్ంసో అధ్వర్యుః। | వాజపేయ ఆత్మయజ్ఞము నందు, ఇంద్రియ పశువులను పాలించు పశు కర్త (పశుపతి)యే - **అధ్వర్యుడు.** (యజుర్వేద మంత్రాలు చదువువాడు).<br>ఇంద్రుడు - **దేవత.**<br>అహింసయే - **ధర్మయాగము.**<br>పరమహంసయే - **అధర్వ్యుడు.**<br>(సోఽహమ్ పరమమ్ **“కేవలమగు నేనే నేను”** అనునదే **పరమహంస స్థితి**). |
| పరమాత్మా దేవతా – పశుపతిః।<br>బ్రహ్మోపనిషదో బ్రహ్మ।<br>స్వాధ్యాయ యుక్తా –<br>బ్రాహ్మణాః చరంతి। | పరమాత్మయే - **పశుపతి దేవత.** (ఇంద్రియములకు నియామకుడు, అధినేత).<br>బ్రహ్మోపనిషత్తులు - బ్రహ్మ.<br>బ్రాహ్మణులు - బ్రహ్మము గురించిన **స్వాధ్యాయయుక్తులుగా చరించు వారు.** (బ్రహ్మము గురించి అధ్యయనముచేస్తూ, ఎలుగెత్తి గానము ప్రకటించువారు).<br>{ **హోత = ఋగ్వేద మంత్రములు చదువు వారు.**<br>**ఉద్గాత = సామవేదమంత్రాలను గానం చేయువాడు.**<br>**అధ్వర్యుడు** = యజుర్వేద వేదమంత్రాలను ఉచ్చరించువాడు.<br>**బ్రహ్మ** = అథర్వణ వేదమంత్రాలను పలుకువారు.<br>(అధ్వర్యుడు ముఖ్యుడు. యజ్ఞము మొత్తాన్ని ఏ పొరపాటు లేకుండా జరిపించువారు)<br>ఋత్విక్కులు = యజ్ఞములోని తక్కిన అనేక కార్యక్రమములు నడిపించు వారు. [ ఉదా: అగ్నీధ్రుడు, ప్రతిప్రస్థాత, నేష్ట, ఉపద్రష్ట మొ॥వారు] } |

| | |
|---|---|
| **అశ్వమేధో →**<br>**మహాయజ్ఞ కథా।**<br>**తద్రాజ్ఞా (తత్ రాజ్ఞా)**<br>**బ్రహ్మచర్యమ్ ఆచరంతి।** | "అశ్వమేధము" - అనునది మహాయజ్ఞ కథా సంవిధానముగా మనము చెప్పుకొంటున్నాము. అశ్వమేధము నిర్వర్తించు రాజు బ్రహ్మచర్యము ఆచరించటమును (అశ్వము ఆత్మజ్ఞానముగాను, విధానము మనోఅశ్వ సంచార విజయముగాను) ఎరుగుదురుగాక। |
| **సర్వేషాం పూర్వోక్త బ్రహ్మయజ్ఞక్రమం**<br>**ముక్తిక్రమమ్ ఇతి।** | "బ్రహ్మయజ్ఞము" అని (వేద వాఙ్మయంలో) వివరించబడుచున్నదంతా 'క్రమముక్తి' విధానము. |
| **బ్రహ్మపుత్రః – ప్రోవాచ।**<br>**ఉదితో హగ్ంస ఋషిః।**<br>**స్వయంభూః తిరోదధే**<br>**రుద్రోపనిషదో హగ్ంస జ్యోతిః పశుపతిః।** | పూర్వోక్తమైన బ్రహ్మయజ్ఞక్రమము ముక్తిప్రదమని పలుకుచు, బ్రహ్మ మానస పుత్రులకు బ్రహ్మదేవుడు ఇంకా చెప్పసాగారు.<br>హంసఋషి ఉదయించగానే స్వయంభువు తిరోధానము (అంతర్ధానము) అగుచున్నాడు. అనగా, సృష్టి క్రమమంతా కల్పిత మాత్రమే అగుచున్నది, సృష్టి, సృష్ట్యనుభవము కూడా కల్పితమాత్ర అసహజ సత్యముగా తెలియవస్తున్నది. 'రుద్రోపనిషత్'లో వర్ణించబడిన హంస జ్యోతియే పశుపతి। |
| **ప్రణవః తారకః।**<br>**స ఏవం వేద హగ్ంసాత్మ**<br>**మాలికావర్ణ బ్రహ్మకాల ప్రచోదితా।** | ప్రణవము (అ+ఉ+మ = ఓం) - తారకము (తరింపజేయునది).<br>ఈవిధంగా ఎవడు తెలుసుకుంటాడో అట్టివాడు -**'హంసాత్మక మాలికావర్ణ బ్రహ్మకాల ప్రచోదితుడు'** అగుచున్నాడు. |
| **పరమాత్మా పుమాన్ ఇతి।**<br>**బ్రహ్మసమ్పత్తి కారిణీ।**<br>**అధ్యాత్మ బ్రహ్మకల్పస్య ఆకృతిః।** | పరమాత్మయే పురుషుడు।<br>బ్రహ్మసంపత్తి (ప్రకృతియే) సమస్తమునకు కారణము.<br>అధ్యాత్మము - బ్రహ్మకల్పన'కు ఆకారము (ఆకృతి). |
| **కీదృశీ, కథా బ్రహ్మజ్ఞాన ప్రభా**<br>**సన్ధ్యాకాలో గచ్ఛతి ధీమతామ్?**<br>**హంసాఖ్యో దేవమ్।**<br>**ఆత్మాఖ్యమ్।**<br>**ఆత్మతత్త్వ ప్రజాకథమ్।** | అట్టి ఆధ్యాత్మము ఏవిధంగా కనబడుచున్నది? ధీమంతులు సంధ్యాకాలము ప్రవేశించి బ్రహ్మజ్ఞాన ప్రభ ఏమని పొందారు?<br>'హంసాఖ్యుడు' అనే ఆయన [(లేక) హంస-సోహం అధ్యయనుడు] ప్రజాకథనమగు ఆత్మతత్త్వ దేవుని కథను (కథనమును) (తమ తపస్సు ద్వారా) ఎరిగి లోకమునకు చాటిచెప్పారు.<br>'హంస'యే దేవత. హంసయే 'ఆత్మ' గురించిన వివరణ. హంసయే ఆత్మతత్త్వ ప్రజా కథనము. |
| **అంతః ప్రణవ నాదాఖ్యో**<br>**హంసః ప్రత్యయ బోధకః।**<br>**'అంతర్గత ప్రమా' గూఢం**<br>**జ్ఞాననాళం విరాజితమ్।** | అంతరములోని ప్రణవనాదాఖ్యుడే (Inner voice expressor) హంస - ప్రత్యయ బోధకుడు.<br>అంతర్గత (కేవల) బుద్ధియందు రహస్యముగా (గూఢముగా) ప్రకాశించుచున్నట్టిది, జ్ఞాన నాళములో విరాజిల్లుచున్నట్టిది - **హంస (జీవాత్మ).** |
| **శివ శక్త్యాత్మకం రూపం**<br>**చిన్మయానంద వేదితమ్।**<br>**'నాద బిందు కళా' త్రీణి**<br>**నేత్రం విశ్వ విచేష్టితమ్।।** | శివ - శక్త్యాత్మకరూపమే - పురుష ప్రకృతి, చిన్మయానందముగా (I & My) తెలియబడుతోంది.<br>అట్టి చిన్మయానందము "నాద-బిందు-కళలు" (Sound, Pin and Art) అనే త్రినేత్రములతో విశ్వముగా నిర్మితమై ప్రదర్శితమై యున్నది. |
| **6.** **త్రియంగాని, శిఖా త్రీణి,**<br>**ద్విత్రాణాం సాంఖ్యమ్ ఆకృతిః।**<br>**అంతర్గూఢ 'ప్రమా' హంసః**<br>**ప్రమాణాత్ నిర్గతం బహిః।** | సాంఖ్యము (జ్ఞానవిచారణ) కు త్రి అంగములు **(జగత్ స్వప్న సుషుప్తులు),** (జగత్-జీవ ఈశ్వరులనబడే) త్రిశిఖలు. "2-3"- ఆకృతులు ఉంటోంది.<br>అంతర్గూఢంగా గల 'ప్రమ' (యదార్థమగు ఆత్మ)యే "హంస". అట్టి **అంతర్గూఢాత్మయే ప్రమాణము** (As an appearance)గా **జగత్తు అయి బహిర్గతమౌతోంది.** |

| | |
|---|---|
| **బ్రహ్మసూత్రపదం జ్ఞేయం**<br>**బ్రాహ్మ్యం విధ్యుక్త లక్షణమ్।**<br>**హంసాఖ్య ప్రణవ ధ్యానమ్**<br>**ఇత్యుక్తో జ్ఞానసాగరే।**<br>**ఏతత్ విజ్ఞానమాత్రేణ**<br>**జ్ఞాన సాగర పారగః।** | "ఈ సమస్తము బ్రహ్మము యొక్క విధ్యుక్త లక్షణ విశేషమే" - (All this is the duly exhibited quality of 'Brahman') - అను అవగాహనయే **బ్రహ్మ సూత్ర పదము.**<br>హంసాఖ్యమైన ప్రణవ ధ్యానమే (ఆత్మ) జ్ఞానసాగరముగా చెప్పబడుతోంది.<br>ఈ మాత్రము తెలుసుకున్నంత మాత్రం చేత ఈ జీవుడు జ్ఞానసాగర పారగుడు అగుచున్నాడు. |
| **స్వతశ్శివః పశుపతిః సాక్షీ,**<br>**సర్వస్య సర్వదా**<br>**సర్వేషాం తు మనః తేన**<br>**ప్రేరితం నియమేన తు।**<br>**విషయే గచ్ఛతి ప్రాణః**<br>**చేష్టతే వాక్ - వదత్యపి।** | ఈ జీవుడు స్వతఃగా శివుడే. **శివతత్త్వమ్। శివోఽహమ్।** అట్టి పశుపతియే కేవల సాక్షి.<br>ఆ స్వతఃశివుడగు పశుపతి చైతన్యమే సర్వ దేహములలో, సమస్త జీవులయొక్క మనోరూపమై నియమానుసారంగా సమస్త జీవులను ప్రేరితము (Inspired) చేయుచున్నది.<br>ప్రాణము ఇంద్రియ విషయములవైపుగా వెళ్ళుచున్నది. వాక్కు మాట్లాడు చేష్ట కలిగి ఉంటోంది. |
| **చక్షుః పశ్యతి రూపాణి**<br>**శ్రోత్రం సర్వం శృణోత్యపి,**<br>**అన్యాని ఖాని సర్వాణి**<br>**తేనైవ ప్రేరితాని తు।** | కళ్ళు రూపములను చూస్తూ ఉన్నది. చెవులు సమస్త శబ్దాలను వింటూ ఉన్నది. అట్లాగే సమస్త ఇంద్రియములు ప్రాణశక్తిచేతనే ప్రేరణపొందు చున్నాయి. విషయముల కల్పనచే జగత్తుగా అనుభవము పొందుచున్నాయి. **ప్రాణేశ్వరుని ప్రాణశక్తి ప్రేరణయే ఇదంతా!** |
| **స్వం స్వం విషయం ఉద్దిశ్య**<br>**ప్రవర్తంతే నిరంతరమ్।**<br>**ప్రవర్తకత్వంచాపి అస్య**<br>**మాయయా, న స్వభావతః।** | ఆవిధంగా ఇంద్రియములన్నీ కూడా వాటి వాటి విషయముల గురించి నిరంతరము (ప్రాణశక్తివలన) ప్రవర్తన కలిగి ఉంటున్నాయి.<br>ఏ జీవుడైతే అట్టి ఇంద్రియములతో, విషయముల పట్ల ప్రవర్తకుడై ఉన్నాడో అదంతా 'మాయ' చేతనే. అంతేగాని, ఇంద్రియ విషయాను సంధానము - అనేది ఈ జీవుని సహజస్వభావము కాదు. (ఆత్మత్వమే సహజ స్వభావము). |
| **శ్రోత్రమ్ ఆత్మని చ అధ్యస్తం।**<br>**స్వయం పశుపతిః పుమాన్।** | వినికిడి (Hearing) అనునది అధ్యస్తము (Inner Placed) అయి ఉన్నది - **ఆత్మయందే.**<br>ఇక ఈ పురుషుడు (జీవుడు) స్వయముగా పశుపతి (శివ) స్వరూపుడే. |
| **అనుప్రవిశ్య శ్రోత్రస్య**<br>**దదాతి శ్రోత్రతాం శివః।**<br>**మనః స్వాత్మని చ అధ్యస్తం**<br>**ప్రవిశ్య పరమేశ్వరః।** | తన చమత్కారమగుశక్తిచే శివుడు శ్రోత్రమును అనుసరించినవాడై చెవులకు వినికిడి (Hearing)ని ప్రసాదిస్తున్నారు. **వినబడు విషయములు కూడా శివచైతన్యమే.**<br>పరమేశ్వరుడు ప్రవేశించి మనస్సును ఆత్మయందు అధ్యస్తముగా (As Inner Placed) కలిగి ఉంటున్నాడు. |
| **మనస్త్వం తస్య సత్త్వస్థో**<br>**దదాతి నియమేవ(న) తు।**<br>**స ఏవ విదితాత్ అన్యః**<br>**తథైవ అవిదితాత్-అపి।** | పరమేశ్వరుడే సత్త్వస్థుడై (ఉనికి ప్రదర్శనా సంకల్పుడై) మనస్సును ప్రసాదించువాడై ఉంటున్నారు.<br>**ఈ జీవుడు తెలియబడేదానికి, తెలియబడనిదానికి కూడా వేరుగా పరమాత్మస్వరూపుడై ఉన్నాడు.** |
| **అన్యేషాం ఇంద్రియాణాం తు**<br>**కల్పితానామపి ఈశ్వరః।** | ఈశ్వరుడు కల్పితమే అయినట్టి తదితర ఇంద్రియములుగా కూడా విస్తరించువారై ఉన్నారు. |

| | |
|---|---|
| **తత్ తత్ రూపమ్ అనుప్రాప్య<br>దదాతి నియమేన తు।** | ఈశ్వరుడే - ఆయా చెవులు, కళ్లు మొదలైన ఇంద్రియములను విశేషములుగా కల్పించుకొని, పొంది, ప్రవేశించి, - **వాటియందు ఇంద్రియానుభవములను నియమించుచున్నారు.** |
| **తతః చక్షుశ్చ వాక్చైవ<br>మనశ్చ అన్యాని ఖాని చ।<br>న గచ్ఛంతి స్వయంజ్యోతిః<br>స్వభావే పరమాత్మని॥** | పరమాత్మచే స్వయం కృతంగా నియమించబడిన కళ్లు, చెవులు, తదితరములన్నీ స్వయం జ్యోతి స్వభావుడగు పరమాత్మను కప్పి ఉంచ గలవా? లేనే లేదు. (అవి ప్రకృతిలోని విశేషములు మాత్రమే అయి ఉంటాయేగాని), ఇంద్రియములు పరమాత్మను పొందలేవు, చేరలేవు, కప్పి ఉంచలేవు. |
| **7. అకర్తృ విషయ ప్రత్యక్<br>ప్రకాశం స్వాత్మనైవతు।<br>వినా తర్క ప్రమాణాభ్యాం<br>బ్రహ్మయో వేద వేదసః।** | ఈ జగత్ దృశ్యరూపంగా సిద్ధిస్తున్న ఇంద్రియ విషయములు స్వయం కర్తృత్వములు కావు. అవి జడములు మాత్రమే. అవన్నీ కూడా స్వాత్మయొక్క చైతన్య ప్రకాశము చేతనే అనుభూతి రూపంగా రూపుదిద్దుకొని ఉంటున్నాయి.<br>సమస్త తర్క ప్రమాణములు (Logics and standardized views) దాటిపోయి, ఎవ్వడైతే అట్టి ఆత్మను తెలుసుకుంటాడో, అట్టివాడు సమస్తము గురించి తెలుసుకొన్నవాడు అగుచున్నాడు. |
| **ప్రత్యగాత్మా పరంజ్యోతిః<br>మాయా సా తు మహత్తమః।<br>తథా సతి కథం మాయా సంభవః<br>ప్రత్యగాత్మని?** | ప్రత్యగాత్మ (సమస్తమునకు వేరైనట్టి ఆత్మ) **పరంజ్యోతి స్వరూపము.** అట్టి ఆత్మ యొక్క మాయ మహత్ తమమైనది. (Superlatively మహిమ గలది) .<br>అయితే అత్యంత **నిర్మలము, మహత్తమము, కేవలము, అద్వితీయము** అగు ప్రత్యగాత్మ యందు "మాయ" అనునది మాత్రం ఎట్లా సంభవం? (దర్పణంలో వస్తువులు కనిపిస్తూ ఉన్నప్పటికీ, దర్పణంలో అవి ఉండవు కదా!) |
| **తస్మాత్ తర్క ప్రమాణాభ్యాం<br>స్వానుభూత్యా చ చిద్ఘనే।<br>స్వప్రకాశైక సంసిద్ధే<br>నాస్తి మాయా పరాత్మని।** | కాబట్టి, ఈ జీవుడు శాస్త్ర ప్రమాణ పూర్వక తర్కముచేతను, స్వానుభవము చేతను **తనయందే 'చిద్ఘనము'ను దర్శించును గాక। సిద్ధించుకొనును గాక।** (అంతేగాని, మనోదర్పణమునందో, జగద్దృశ్యమునందో-కాదు).<br>స్వయంప్రకాశము అయి పరాత్మ తనయందే స్వానుభవముగా ఆత్మభావనగా సంసిద్ధము అగుచుండగా, అద్దానియందు 'మాయ'కు చోటెక్కడిది? ('మాయ' అనగా 'యామా' - స్వతఃగా లేనిదే అగుచున్నది). |
| **వ్యావహారిక దృష్ట్యా<br>అయం విద్యా-అవిద్యా।<br>న చ అన్యథా...।** | **వ్యావహారిక దృష్ట్యా మాత్రమే "విద్య, అవిద్య, మాయ" మొదలైనవి ఉన్నట్లుగా అనిపిస్తోంది. అన్యథా (వస్తుతః, వాస్తవానికి) - అవి లేవు.** |
| **తత్త్వ దృష్ట్యాతు నాస్త్యేవ<br>తత్త్వమేవ అస్తి కేవలమ్।** | తత్త్వ దృష్ట్యా చూచినపుడు కేవలమగు "తత్ త్వమ్" మాత్రమే ఉన్నది. మాయ, విద్య, అవిద్య-ఇవన్నీ **"వ్యావహారికదృష్టి"** మాత్రమే. **"ఆత్మప్రకాశము"** యొక్క వెలుగు చమత్కారమేగాని, ఆత్మకు వేరుగా వ్యావహారికమైనదంతా మొదలే లేదు.<br>(అందుకే అవన్నీ జ్ఞాన బోధకు ఉపయోగించుకొని, ఆ తరువాత విడచివేసియే ఉండాలి). |
| **వ్యావహారిక దృష్టిస్తు<br>ప్రకాశ అవ్యభిచారతః।<br>ప్రకాశ ఏవ సతతం<br>తస్మాత్ మౌనం హి యుజ్యతే।** | వ్యావహారిక, తదితర - సమస్త సందర్భములలోను (సతతము) నిర్విషయ, మౌన ఆత్మప్రకాశమే సర్వత్రా ఏర్పడినదై ఉన్నది. ఎప్పటికీ ప్రకాశము ఉండియే తీరుతోంది కాబట్టి, అది విషయములకు ఆవలిది కనుక **'మౌనము'** - అని వర్ణించబడుతోంది. |

| | |
|---|---|
| అయమ్ అర్థో, మహాన్ యస్య<br>స్వయమేవ ప్రకాశితః<br>న స జీవో। న చ బ్రహ్మా।<br>న చ అన్యదపి కిన్చన।<br>న తస్య వర్ణా విద్యంతే<br>న ఆశ్రమాశ్చ తథైవ చ ।<br>న తస్య ధర్మో అధర్మశ్చ<br>న నిషేధో విధిః న చ ॥ | **ఎవనిపట్ల అయితే - "ఆత్మయే ఉన్నది. వ్యావహారికమైన విద్య అవిద్య మాయ అనునవే - స్వతఃగా లేనే లేవు"** - అను మహత్తరమగు అర్థము స్వాభావికంగాను, **స్వయముగాను ప్రకాశితమై ఉంటుందో, - అట్టివాడు ఇక జీవుడు కాడు.** (శబ్దరూపమగు) బ్రహ్మము కాదు. మరింకేమీకూడా కాదు. ఆతనిపట్ల వర్ణాశ్రమ ధర్మములు మొదలైనవన్నీ లేనివే అగుచున్నాయి.<br>ఆతనికి సంబంధించి విధి (Dos) లేదు. నిషేధము (Don'ts) ఉండ జాలవు. ధర్మము, అధర్మము అనునవి కూడా ఉండజాలవు. |
| **8.** యదా బ్రహ్మాత్మకం సర్వం<br>విభాతి స్వత ఏవ తు<br>తదా దుఃఖాది భేదో అయమ్<br>ఆభాసోఽపి న భాసతే। | ఎప్పుడైతే ఈ లోకములు, ఈ జగత్తులుగా కనిపిస్తున్నదంతా కూడా స్వతఃగానే బ్రహ్మాత్మకముగా ప్రకాశమానమౌతుందో (అనుభవైక వేద్యమౌతుందో, తెలియవస్తుందో), **అప్పుడిక దుఃఖముల అభాస కించిత్ కూడా భాసించదు.** |
| జగత్ - జీవాదిరూపేణ<br>పశ్యన్ అపి పరాత్మవిత్,<br>న తత్ పశ్యతి చిద్రూపం<br>బ్రహ్మవస్తు-ఇతి పశ్యతి।<br>ధర్మ ధర్మిత్వ వార్తా చ<br>భేదే సతి హి భిద్యతే। | **"పరాత్మవేత్త"** - ఇక్కడ జగత్తు, జీవుడు మొదలైన రూపములుగా చూస్తూ ఉన్నప్పటికీ, వాటినన్నిటినీ జగత్ జీవాత్మ భేదముతో చూడడు. ఇదంతా చిద్రూప - పరబ్రహ్మ వస్తువుగానే (బ్రహ్మ పదార్థంగానే) సర్వదా దర్శిస్తూ ఉంటాడు. ఆతనిపట్ల అనేకమంతా ఏకదృష్టియే అగుచున్నది.<br>ధర్మము - ధర్మిల మధ్యగల భేదవార్తలన్నీ ఆతనిపట్ల చెదిరిపోయినవి అవుతాయి. |
| భేద - అభేదః తథా<br>భేదాభేదః సాక్షాత్ పరాత్మనః।<br>నాస్తి స్వాత్మ అతిరేకేణ<br>స్వయమేవ అస్తి సర్వదా।<br>బ్రహ్మైవ విద్యతే సాక్షాత్<br>వస్తుతో, అవస్తుతోఽపి చ। | **బేధ అభేదములన్నీ, భేదాభేదములకు ఆవలివాడగు పరమాత్మయొక్క సమక్షంలో స్వతఃగానే వీగిపోతాయి.**<br>ఆత్మకు వేరై ఎక్కడా ఏదీ ఏకించిత్ కూడా మొదలే లేదు. ఆత్మయే స్వయముగా సర్వదా సర్వత్రా వేంచేసినదై యున్నది.<br>వస్తువుగాను, అవస్తువుగాను ఉన్నదంతా కూడా సాక్షాత్ బ్రహ్మమే అయి ఉన్నది. |
| తద్దైవ బ్రహ్మవిత్ జ్ఞానీ<br>కిం గృహ్ణాతి? జహాతి కిం?<br>అధిష్ఠానమ్। అనౌపమ్యమ్।<br>అవాక్-మానస గోచరమ్। | అట్టి బ్రహ్మము గురించి ఎరిగియున్న బ్రహ్మజ్ఞాని ఈ దృశ్య జగత్తులో దేనిని స్వీకరిస్తాడు? దేనిని వదులుతాడు? ఏదీ స్వీకరించడు, వదలడు.<br>బంగారు ఆభరణములకు బంగారము వలెనే, - **పరబ్రహ్మము సమస్తమునకు అధిష్ఠానమైనట్టిది. ఏ ఉపమానములతోను నిర్దేశించి చెప్పబడజాలదు. (వాక్కుకు మనస్సును అందక) అవాక్-మానస గోచరమైనట్టిది.** |
| యత్ తత్ అద్రేశ్యమ్,<br>అగ్రాహ్యమ్, అగోత్రమ్, రూపవర్జితమ్,<br>అచక్షుః శ్రోత్రమ్ అత్యర్థం<br>తత్ అపాణిపాదం తథా, | ఏదేదైతే దృశ్యములో కనబడే ఒకానొక వస్తు దృశ్య వంటిది కాదో, ఆలోచనలకు అగ్రాహ్యమో (గ్రహించరానిదో), గోత్రవిభాగసంబంధమైనది కాదో, రూపములేనట్టిదో, కళ్లకు కనబడనిదో, వినికిడిచే అర్థము కానిదో దేనికి కాళ్లు చేతులు లేవో (రాకపోకల కదలికలు లేవో...),<br>**(అదియే ఆత్మతత్త్వము).** |

| | |
|---|---|
| నిత్యం విభుం సర్వగతం<br>సుసూక్ష్మంచ్చ తత్ అవ్యయమ్।<br>బ్రహ్మైవ ఇదం అమృతం<br>తత్ పురస్తాత్ బ్రహ్మానందం।<br>పరమంచైవ పశ్చాత్। | ఏది త్రికాలములలోను నిత్యము - **అనునిత్యము అయి ఉన్నట్టిదో,** (రాజ్యమునకు 'రాజు' వలె) ఏది సమస్తమునకు **విభువో,** (కథా రచయిత కథలో వలె) ఏది **సర్వగతమో,** (సాకారము కంటే కూడా) **సూక్ష్మాతి సూక్ష్మమో,** ఏది 'వ్యయము' (Spent off) అనే ధర్మము లేనిదై, **అవ్యయమో** - అట్టి అమృతరూపమగు బ్రహ్మమే ఇదంతా, ఈ సమస్తము కూడా! |
| బ్రహ్మానందం పరమం దక్షిణే చ।<br>బ్రహ్మానందం పరమం చ ఉత్తరే చ। | **అట్టి పరబ్రహ్మమునకు**<br>❑ ముందుగా ఉన్న రూపము బ్రహ్మానందము<br>❑ తరువాత ఉన్నది - 'పరమానందము'<br>❧ దక్షిణముగా ఉన్నది - పరమగు బ్రహ్మానందము<br>❧ ఉత్తరముగా ఉన్నది - పరమగు ఆ బ్రహ్మానందమే।<br>**అన్నివైపులా బ్రహ్మానందమే ఆక్రమించి ఉన్నది. బ్రహ్మానందమే అద్దాని స్వాభావిక విన్యాసము.** |
| 9. స్వాత్మన్యేన స్వయం సర్వం<br>సదా పశ్యతి నిర్భయః।<br>తదా ముక్తో, న ముక్తశ్చ<br>బద్ధస్యైవ విముక్తతా। | ఆత్మదర్శి తన ఆత్మయందే ఈ సమస్తమును స్వయముగా నిర్భయముగా, నిస్సంసయముగా దర్శిస్తున్నాడు.<br>అట్టివాడు ముక్తుడే అయినప్పటికీ తన యందు దర్శించే ఈ జగత్తులను విడువనివాడే కనుక అముక్తుడే. సమస్తము నుండి విముక్తుడే అయి కూడా ఏదీ వదలటము లేదు కాబట్టి బద్ధుడు కూడా। |
| ఏవం రూపే పరా విద్యా<br>సత్యేన తపసాపి చ<br>బ్రహ్మచర్యాదిభిః భక్తైః<br>లభ్యా వేదాంతవర్త్మనా। | తెలియబడేదానికి ఆవల "తెలుసుకొనువాడు" (The knower prior to all knowings) - వేంచేసి ఉన్నాడు.<br>ఆతడు అసత్యమును అధిగమించి సత్యమును ఆశ్రయించటంచేతను, బ్రహ్మమునే ఉపాసిస్తూ బ్రహ్మచర్యము నిర్వర్తించుట చేతను, భక్తి చేతను - **అట్టి పరావిద్యను పొందుచున్నాడు.** |
| స్వశరీరే స్వయం జ్యోతిః<br>స్వరూపం పారమార్థికమ్<br>క్షీణదోషాః ప్రపశ్యంతి।<br>నేతరే మాయయావృతాః॥ | అట్టివాడు స్వయంజ్యోతి స్వరూపమగు పారమార్థికస్వరూపమును స్వశరీరంలోనే సందర్శిస్తున్నాడు. దృష్టికి సంబంధించిన సమస్త దోషములు తొలగగా అట్టి వేదాంతజ్ఞాని తనయందే పరమాత్మను గమనిస్తున్నాడు.<br>మాయాదృష్టితో ఆవృతమైన బుద్ధిగల తదితరులు పరమాత్మను ఎక్కడా కూడా బాహ్య-అభ్యంతరములలో దర్శించలేకపోతున్నారు. |
| ఏవం స్వరూప విజ్ఞానం<br>యస్య కస్యాస్తి యోగినః<br>కుత్ర చిత్ గమనం నాస్తి<br>తస్య సంపూర్ణ రూపిణః॥ | ఏ యోగి (లేక) యోగ సిద్ధుడైతే (అంతర హృదయములో సర్వాత్మకుని ఆత్మయందు దర్శనము అనబడే)- స్వరూప విజ్ఞానము కలిగి ఉంటాడో....<br>**- సంపూర్ణ రూపి (పూర్ణస్వరూపుడు)** అగు ఆతనికి (ఒక లోకము నుండి మరొక లోకమునకు రాకపోకలు అనబడే) **గమనాగమనములు ఉండవు.** |
| ఆకాశమ్ ఏకం సంపూర్ణం<br>కుత్రచిత్ నహి గచ్ఛతి,<br>తద్వత్ బ్రహ్మాత్మవిత్ శ్రేష్ఠః<br>కుత్రచిత్ నైవ గచ్ఛతి।<br>అభక్ష్యస్య నివృత్త్యా తు<br>విశుద్ధం హృదయం భవేత్। | సంపూర్ణము, సర్వగతము అగు ఆకాశము ఏవిధంగా ఎక్కడికో వెళ్లటము, ఎక్కడినుండో రావటము - అనునవే ఉండవో,<br>అదేవిధంగా బ్రహ్మమును గురించి ఎరిగి, బ్రహ్మము తానై యున్న బ్రహ్మాత్మవిత్‌శ్రేష్ఠునికి-ఎక్కడి నుండి ఎక్కడికీ **రాక - పోకలు ఉండవు. అట్టివారు అభక్ష్యము (పొందకూడనివి, అనుభవించకూడనివి) పొంద కుండానే ఉన్నవారై,** సమస్త అభక్ష్యములనుండి **విముక్తులై,** విశుద్ధమగు హృదయమునందు **అఖండమగు ఆత్మను దర్శిస్తూ, స్వహృదయమునందే ఆత్మస్వరూపులై ఉంటున్నారు.** |

| | |
|---|---|
| ఆహార శుద్ధౌ చిత్తస్య<br>విశుద్ధిః భవతి స్వతః।<br>చిత్తశుద్ధౌ క్రమాత్ జ్ఞానం।<br>త్రుట్యంతే గ్రన్థయః స్ఫుటమ్। | [ ఇంద్రియములతో - శాస్త్రానుగతంగా స్వీకరించవలసినవి స్వీకరిస్తూ, త్యజించవలసిన (కామ క్రోధాదులను) త్యజిస్తూ], ఆహారము (ఇంద్రియ విషయములు) - సంబంధించిన శుద్ధి పొందుచున్నారు. తద్వారా (ఇష్టాయిష్ట రూపములతో కూడిన) చిత్తముయొక్క శుద్ధి స్వతఃగానే అతనియందు కలుగుతుంది.<br>చిత్తశుద్ధిచే 'జ్ఞానము' క్రమంగా వికసించ గలదు. అట్టి జ్ఞానముచే హృదయగ్రంథులు విడిపోతాయి. |
| అభక్ష్యం బ్రహ్మవిజ్ఞాన<br>విహీనస్యైవ దేహినః<br>స సమ్యక్ జ్ఞానినః తద్వత్<br>స్వరూపగ్ం సకలం ఖలు। | <u>ఇంకా కూడా,</u><br>సమ్యక్‌జ్ఞానికి ఈ జగత్తంతా తన యొక్క స్వాభావిక చమత్కార స్వరూపమే అవుతుంది. అందుచేత బ్రహ్మజ్ఞానికి ఇక్కడ 'అభక్ష్యము' అంటూ ఏదీ ఉండదు.<br>బ్రహ్మజ్ఞాన - విహీనునికో? ఆతనిచే స్వీకరించబడేదంతా అభక్ష్యమేగా పరిణమించగలదు. |
| **10.** "అహమ్ అన్నగ్ం।<br>సదా అన్నాద।"<br>ఇతి హి బ్రహ్మవేదనమ్।<br>బ్రహ్మవిత్ గ్రసతి జ్ఞానాత్<br>సర్వం బ్రహ్మాత్మనైవ తు। | <u>**బ్రహ్మజ్ఞానము కలవాడు**</u><br>నేనే అన్నమును (I am all that being experienced)<br>నేనే అన్నాదును కూడా (I am the maker / worker for all that being experienced) - **అని ఎరిగి ఉంటున్నాడు.**<br>బ్రహ్మము ఎరిగిన బ్రహ్మవేత్త 'సమస్తము బ్రహ్మమే' అను బ్రహ్మాత్మ జ్ఞానమును ఏమాత్రము ఏ సందర్భములోను విడువడు. |
| బ్రహ్మ క్షత్రాదికం సర్వం<br>యస్యస్య ఆదోదనం సదా<br>(యస్యస్యాదోదనం సదా),<br>యస్య ఉపసేచనం మృత్యుః<br>తన్ జ్ఞానీ తాదృశః ఖలు।<br>బ్రహ్మస్వరూప విజ్ఞానాత్<br>జగత్ భోజ్యం భవేత్ కిల। | ఏ ఆత్మకు (పరబ్రహ్మమునకు) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనబడేదంతా ఆదోదనము (ఆహారము) అగుచున్నదో, ఎవనికి మృత్యువు కూడా ఉపశేచనము (ఉపాహారము / Tiffin ) వంటిది అవుతోందో... అట్టి - పరమాత్మ పురుష స్వరూపమే తానని గ్రహించిన వాడు **"ఆత్మజ్ఞాని".**<br>'బ్రహ్మము ' గురించిన స్వరూపవిజ్ఞానము సిద్ధించుకున్నవానికి - ఈ జగత్తంతా కూడా తాను భోగించు వస్తువుగా అగుచున్నది. |
| జగత్ ఆత్మతయా భాతి<br>యదా భోజ్యం భవేత్ తదా (కిల)?<br>బ్రహ్మ స్వాత్మతయా నిత్యం<br>భక్షితం సకలం తదా।<br>యత్ ఆభాసేన రూపేణ<br>జగత్ భోజ్యం భవేత్తు తత్।<br>మానతః స్వాత్మనా భాతం<br>భక్షితం భవతి ధ్రువమ్। | ❋ జగత్తంతా ఆత్మయే అయి ఉన్నప్పుడు ఈ జగత్తు ఆత్మకు భోజ్యవస్తువు.<br>❋ అయితే, ఏదీ కాని ఈ జగత్తు ఆత్మకు భోజ్య వస్తువు (something that is enjoyable) ఎట్లా అవుతుంది?<br>ఎట్లా అంటే బ్రహ్మమే - **స్వాత్మమయము** అయి, ఈ **సమస్తమును ఆస్వాదిస్తూ** ఉన్నది కాబట్టి.<br>ఎప్పుడైతే 'ఆభాస' (లేనిది ఉన్నట్లుగా తోచటం) రూపంగా ఈ జగత్తు సత్యమగు ఆత్మకు భోజ్యవస్తువు అవుతోందో, అప్పుడు ఇక ఇదంతా "స్వాత్మ"కు భక్షిత (భుజింపబడే) వస్తువు అవటం ధృవమే (నిజమే) అవుతుంది. |

| | |
|---|---|
| **స్వస్వరూపం స్వయం భుక్తే**<br>**నాస్తి భోజ్యం పృథక్ స్వతః।** | **వాస్తవానికి ఆత్మ తనయొక్క స్వస్వరూపమునే జగత్తుగా అనుభవిస్తోంది.** అంతేగాని జగత్తు తనకు బాహ్యమైన భోజ్య వస్తువుగా కాదు. |
| **అస్తిచేత్ అస్తితా రూపం**<br>**బ్రహ్మైవ అస్తిత్వ లక్షణమ్।** | ఒకవేళ "ఈ జగత్తు ఉన్నది" అని అనుకుంటే **"బ్రహ్మమే ఈ జగత్తును తనయొక్క అస్తిత్వ లక్షణముగా కలిగి ఉంటోంది"** అనవలసిందే। |
| **అస్తితా లక్షణా సత్తా।**<br>**సత్తా బ్రహ్మ న చ అపరా।** | "అస్తి (ఉన్నది)" - అనునదే **సత్త।** "సత్త" అనునది **బ్రహ్మమే** - అయి ఉన్నది. **బ్రహ్మమునకు వేరైన సత్తా దేనికీ లేదు.** |
| **నాస్తి సత్తా అతిరేకేణ**<br>**నాస్తి మాయా చ వస్తుతః।** | "సత్త"కు వేరే ఏదీ లేదు. వస్తుతః "మాయ" అనునదేదీ లేదు. (అందుకే యా మా = ఏది లేదో అని మాయ నిర్వచించబడుతోంది) |
| **యోగినామ్ ఆత్మనిష్ఠానాం**<br>**మాయా స్వాత్మని కల్పితా।** | యోగికి 'ఆత్మనిష్ఠ' యొక్క దృష్టిచే **'మాయ' అనబడేది స్వకీయమగు ఆత్మయొక్క స్వయం కల్పితము మాత్రమే।** |
| **సాక్షి రూపతయా భాతి**<br>**బ్రహ్మజ్ఞానేన బాధితా।** | బ్రహ్మజ్ఞానముచే 'మాయ' అనబడేది బాధించబడినదై, కేవలమగు (నిర్విషయ) సాక్షిత్వమే సర్వత్రా స్వానుభవమవుతోంది.<br>- మాయకు ఆత్మయే సాక్షి.<br>- సాక్షి అగు ఆత్మయే ఉన్నది. 'మాయ' ఆత్మకు స్వయంకల్పితం మాత్రమే।<br>- 'మాయ' అనబడేది ఆత్మకు వేరుగా లేదు. |
| **బ్రహ్మవిజ్ఞాన సంపన్నః**<br>**ప్రతీతమ్ అఖిలం జగత్।**<br>**పశ్యన్ అపి సదా**<br>**నైవ పశ్యతి స్వాత్మనః పృథక్॥** | బ్రహ్మజ్ఞాన సంపన్నుడు → ఈ ప్రతీతము (ప్రదర్శనము) అగుచున్న సమస్త జగత్తును - **జగత్తుగా చూస్తూనే, స్వస్వరూపాత్మగా ఆస్వాదిస్తూ ఉంటున్నాడు.**<br>**అనేకంగా** కనిపిస్తున్న ఈ జగత్తు బ్రహ్మజ్ఞానికి **"ఏకమగు ఆత్మ"** గా అనుక్షణికము - **స్వాభావికము అయి అనిపిస్తూ** ఉన్నది. |

❖ ❖ ❖

ఈ విధంగా స్వయంభువు బ్రహ్మ - తన మానస పుత్రులకు కామేశ్వర, వైశ్రవణ, బ్రహ్మపుత్ర, వాలఖిల్యులకు ఆత్మజ్ఞానము బోధించారు.

❖ ❖ ❖

**పాశుపతబ్రహ్మోపనిషత్ సమాప్తా**

***ఓం శాంతిః। శాంతిః। శాంతిః ॥***

**ఇతి అథర్వణ వేదాంతర్గత "పాశుపత బ్రహ్మోపనిషత్"**

***ఓం శాంతిః। శాంతిః। శాంతిః ॥***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 16 పాశుపత బ్రహ్మోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**హరిః ఓం। హరిస్వరూపమై, 'ఓం' కార సంజ్ఞార్థమగు పరమాత్మకు నమస్కరిస్తూ।**

స్వయంభువు (one who is himself the reason for his presence) అగు బ్రహ్మదేవుడు – సమస్తమునకు అనన్యము, ఏకము అయి ఉండి కూడా, **"నేను అన్యమగు జగత్తును, ఆ జగత్తును ఆస్వాదించు 'అనుభవి' స్వాభావులగు జీవులను సృష్టించుకొని ఆస్వాదించెదను గాక।"** – అని లీలగా, క్రీడగా, వినోదముగా సంకల్పించారు.

అట్టి సృష్టి పరిఢవిల్లటానికై మనస్సు నుండి సృష్టిని నడిపించు సామర్థ్యముగల బ్రహ్మమానసపుత్రులను, దేవతలను, లోక పాలకులను, 14 లోకములను, లోకాంతర్గత జీవులను సృష్టించి, వారియొక్క అంతరంగ – బహిరంగములను కల్పించసాగారు.

**అట్టి సృష్టిలోని జీవులు ఎప్పుడో తమ స్వస్వరూపమును ఏమరచి, దృశ్యధ్యాసలకు బద్ధులు కాసాగారు.** (అనగా) 'ద్రష్ట'గా తమ కేవలత్వమును, ఆత్మోన్నత్యమును ఏమరచసాగారు.

ఇదంతా ఈవిధంగా జరుగుచుండగా, ఒకసారి బ్రహ్మమానసపుత్రులు, ఋషులు, అగు– **కామేశ్వరుడు, వైశ్రవణుడు, బ్రహ్మపుత్రుడు, వాలఖిల్యడు** – అను నలుగురు **'ఆత్మతత్త్వజ్ఞానసిద్ధి'** అను మహదాశయముతో తండ్రియగు బ్రహ్మదేవుని సమీపించారు.

**బ్రహ్మమానసపుత్రులు (ఋషులు) :** తండ్రీ! ప్రజాపతీ! సృష్టికర్తా! సమస్త రుగ్మతలకు ఔషధము తత్త్వజ్ఞానమే కదా! అట్టి బ్రహ్మజ్ఞానము కొరకై మిమ్ములను శరణువేడుచు, మాకు తారసబడుచున్న కొన్ని సందేహములకు **సశాస్త్రీయమగు పరాకాష్ఠ వివరణ** కొరకై మీపాదపద్మములు ఆశ్రయిస్తున్నాము.

**బ్రహ్మదేవుడు :** బిడ్డలారా! మీకు వస్తున్న సందేహములేమిటో చెప్పండి. తత్త్వజ్ఞానమును వివరించుకుందాము.

**ఋషులు :** పితృదేవా! వినండి.

(1) మీరు కల్పించిన ఈ జగత్తులలోని జీవులు అనేక విద్యలను, తద్వారా సంపదలను, పురాణ ఇతిహాసములను ఆశ్రయిస్తున్నారు. అంతే కాకుండా, అనేక ఉపవిద్యలచే మీరు నిక్షిప్తం చేస్తూ ఉన్న అనేక ఆకృతి విశేషములను ఉపయోగిస్తూ, ఆయా శాస్త్రములను అధ్యయనం చేస్తున్నారు. పరిశోధనలు కొనసాగిస్తున్నారు. మానవుల జీవితసరళి ఎప్పటికప్పుడు మారిపోతూ వస్తోంది.

ఇంతవరకు బాగానే ఉన్నది. ఇక, ఇప్పుడు మా ప్రశ్న. **ఈ సమస్త జగత్తులలో అత్యుత్తమమైన విద్య ఏది?**

(2) ఈ లోకములన్నీ నడిపిస్తూ ఉన్న దివ్య (అశరీర) ప్రజ్ఞలగు దేవతలు (Divine Being) ఎవరు? ఎట్టివారు? ఎక్కడివారు?

(3) జాగ్రత్‌కు, తురీయమునకు అధిష్ఠాన దేవత ఎవరు?

4) ఆ దేవతల వశంగానే లోకస్తులగు జీవులు ఆయా సుఖదుఃఖములు, జన్మ కర్మలు పొందుచున్నారా? (లేక) జీవులు స్వయంకృత కర్మ ఫలములుగా జన్మ-కర్మలను పొందుచున్నారా? (కాక) ఈ జగత్ సంఘటనలను మరేదైన కారణం ఉన్నదా?

(5) ఈ **'కాలము'** యొక్క కల్పన ఎవరిది? కాలమునకు ఆవల, ఈవల ఉన్న సత్యమేది?

(6) ఎవరియొక్క 'ఆజ్ఞ'ను అనుసరించి ఆకాశములో సూర్య చంద్ర నక్షత్ర గ్రహ - ఇత్యాదులన్నీ ప్రవర్తిస్తూ ఉన్నాయి?

(7) ఈ ఆకాశము యొక్క మహిమ ఎట్టిది? ఈ దృశ్యమానమగుచున్న సమస్తము కూడా ఎవరియొక్క మహిమ?

స్వామీ! ప్రజాపతీ! ఈ ఈ విశేషాలలోని **అంతిమ సత్యము** (The Finest Truth) ను మీవద్ద శ్రవణము చేసి తెలుసుకోవాలని మిమ్ములను ఆశ్రయిస్తున్నాము. ఈఈ విశేషములయొక్క **ఆత్యంతికార్థము** మీరు మాత్రమే ఎరిగి ఉన్నారు. అందుచేత ఆయా పరాకాష్ఠ విశేషాలు బోధించవలసినదిగా మిమ్ములను అర్థిస్తున్నాము.

**స్వయంభువు (బ్రహ్మదేవుడు) :**

బిడ్డలారా! ఈ సమస్త జగత్తుయొక్క తత్త్వమేమిటో ఎరుగుట **'మాతృకా విద్య'** అని అంటారు.

[ మాతృకల పురాణ నామములు = బ్రహ్మీ, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండీశ్వరి ].

**మాతృక = (The Origin of whatever / all This )**

***ఈ జగత్తు అంతా కూడా (మాతృకా రూపంగా) -***

⌘ **ద్వివర్ణ సహితము।** (జీవాత్మ-పరమాత్మ చమత్కారము).

⌘ **ద్వివర్ణ మాత్రా।** - (అనుభవి - అనుభవముల కలయిక).

⌘ **త్రివర్ణోపేతా ।** - (సత్త్వ రజో తమో - త్రిగుణాత్మకము).

⌘ **చతుర్మాత్రక ఓంకారరూపిణీ।** - అకార ఉకార మకార అర్ధమాత్రలతో కూడిన ఏకాక్షర స్వరూపము.

⌘ **ప్రాణాత్మికా దేవతా।** ఇదంతా ప్రాణశక్తియొక్క (ప్రాణదేవత యొక్క) అనేకరూప ప్రదర్శనములు.

ఓ ప్రియ మానసపుత్రులారా! ఈ (భూ పాతాళ స్వర్గము లనబడే) త్రిలోకములు నా భావనా సృష్టియే కాబట్టి నేనే **'జగత్రయ - అధిపతి"** ని.

- కాల స్వరూపమైనట్టి (కృత-త్రేతా-ద్వాపర-కలి) యుగములంతా నా రచనయే. కాబట్టి (కథకు ఆ కథా రచయితవలె) నాకు వశమయ్యే ఏర్పడి ఉంటున్నాయి.
- రాత్రింబవళ్లు, పక్షములు, నెలలు, మాసములు, సంవత్సరములు, యుగయుగాంత పునర్యుగములు - మొదలైనవన్నీ నేను వృద్ధి చేయుచున్న కాలరూప చమత్కారమే। **మమ సంవర్ధితములే।**
- ఆకాశంలో కనబడే సూర్య-చంద్ర-నక్షత్రములన్నీ నాయొక్క తేజో-అంశ విశేషములే.

- **గగనో మమ త్రిశక్తి స్వరూపః।** ఆకాశము నాయొక్క (జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ, కర్తృ కారణ కార్య, ద్రష్టృ దర్శన దృశ్య, భూత వర్తమాన భవిష్యత్ – ఇత్యాది) **త్రిశక్తి** మాయా స్వరూపము.
- **న అన్యో మత్ అస్తి।** నాకు వేరుగా ఎక్కడా ఏదీ కించిత్ కూడా లేదు. ఈ సమస్తమునకు కర్తను నేనే। భోక్తను కూడా నేనే! **అకర్త – అభోక్తను కూడా నేనే అయి ఉన్నాను.**

మాయకు ఆవల ఉండి ఉన్నాను. **'మాయ' నాయొక్క కల్పితమాత్రము** అయి ఉన్నది.

**రుద్రుడు** – తమో మాయాత్మకుడు.

**విష్ణువు** – సాత్విక మాయాత్మకుడు.

**ఇంద్రుడు మొదలైన దేవతలు** – తామస రాజసాత్వికులు.

కేవలమగు 'సాత్త్వికము' సృష్టిలో ఉండదు.

[కేవలమగు – ఆత్మమాత్రమే (మాయాతీత) సాత్త్వికము.].

**అఘోరము** – (సూక్ష్మస్వరూపము) నాయొక్క సర్వ సాధారణ రూపము.

***ఈ విశ్వయాగమునకు :***

- రుద్రుడు, పశుపతి **కర్త।**
- రుద్రుడే – **యుగపురుషుడు.**
- హోత – **ఇంద్రుడు.**
- అధ్వర్యుడు – **విష్ణువు.**
- యజ్ఞఫల స్వీకారులు (యజ్ఞభుక్) – **దేవతలు.**
- మనస్సే – **బ్రహ్మ (మానసం బ్రహ్మ).**

## "హంస (ఆత్మ)"

నా కల్పన అగు ఈ (14 లోకములతో కూడిన) ఈ సృష్టి యొక్క బాహ్య – అభ్యంతరములలో 'హంస' (ఆత్మ)యే అంతటా ఏర్పడినదై ఉన్నది. (నాటక రచయిత యొక్క **కల్పనయే** అన్ని పాత్రలయొక్క, పాత్రల సంబంధములయొక్క, కథా సంఘటనలయొక్క అంతర్లీనంగా ఉన్నట్లుగా, బంగారు ఆభరణమంతా బంగారముతో నిండి ఉన్నరీతిగా) – ఆకాశ అనాకాశములలో అంతర్గతంగా ఏర్పడి ఉన్నది – **'హంస'**యే.

నాటకం దృష్ట్యా నాటకంలో రచయిత కనబడడు. కాబట్టి ఆతడు **అంతర్గతుడు, అవ్యక్తుడు** కదా! అట్లాగే హంస కూడా సృష్టి యొక్క సమస్తమునకు **అంతర్గతము, అవ్యక్తము** కూడా.

***అట్టి ఆత్మ లేక 'హంస' ఇంకా కూడా...,***

- '96' తత్త్వములతో సృష్టిగా వ్యక్తము అవుతోంది. *(వివరణ – 48వ పేజీ)*

- [ **(1) ఎరుగుచున్నవాడు** (The Knower) **(2) ఎరుక** (The Knowing) **(3) ఎరుగబడునది** (All that being known as – అనురూపమగు] **– చిద్రూపత్రయ – చిన్మయ లక్షణుడు. (ఆత్మ – వాటిని అన్నిటినీ) తన బాహ్య లక్షణములుగా కలిగి ఉన్నట్టిది).**
- (పంచ ప్రాణములు, మనోబుద్ధి చిత్త అహంకారములతో కూడిన) **నవతత్త్వ త్రిరావృతము.** (త్రిగుణములు ఒకదానితో ఒకటి కూడి 3 × 3 = 9 రకముల గుణసంపన్నము – ఆ 'హంస' యే).
- సృష్టించటము, సృష్టిని పరిపోషించటము, సృష్టిని లయము చేయటము – అను అభిమాన తేజో పురుషులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకము – అట్టి 'హంస' యొక్క విన్యాసమే.
- (గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని – అని పిలువబడే) – అగ్నిత్రయ కళలతో కూడుకొని ఉన్నట్టిది – ఆ 'హంస'యే.
- (బ్రహ్మగ్రంథి – విష్ణుగ్రంథి – రుద్రగ్రంథి అనబడే) చిత్ (ఎరుకకు సంబంధించిన) గ్రంథిలచే (ముడిలచే) ఇంధనము పొందుచున్నట్లుగా కనబడుచున్నది – 'హంస'. [ వాస్తవానికి హంస (ఆత్మ) బంధరహితము) ].
- (జీవాత్మ–ఈశ్వర–పరమాత్మల ఏకత్వము సూచించు) – అద్వైత గ్రంథి (ఏకముడి) సమన్వితము – "హంస".
- (విశ్వ) యజ్ఞము యొక్క సాధారణ – అంగములను – తన అంగములుగా కలిగి ఉన్నట్టిది – "హంస".
- (ఆత్మయే లేక "హంస"యే) – ఈ సమస్త జగత్తు యొక్క జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల యొక్క బహిరంతరములు – తనవిగా కలిగి ఉన్నట్టిది. అంతటా వెలుగొందుచున్నది. **(బహిరంతర్జ్వలనమ్)।** **– ఇతి హంసః॥**

## యజ్ఞసూత్రము – బ్రహ్మ సూత్రము

**ఉపవీత లక్షణసూత్ర బ్రహ్మగా యజ్ఞాః। "ఆత్మగా నేను ఈ సమస్తము త్రిగుణాత్మకంగా ధరించుచున్నాను"** అను ఎరుకయే ఉపవీత లక్షణ సూత్రము. **"పూదండలో దారము వలె నేనే సర్వత్రా స్వకీయ భావనాపూర్వకంగా కల్పించుకొని అలంకరించుకొంటున్నాను"** – అనునదే **బ్రహ్మయజ్ఞము. అదియే సూత్రయజ్ఞము. అదియే ఉపవీత లక్షణ సూత్రము.**

**బ్రహ్మాంగ లక్షణ యుక్తో బ్రహ్మసూత్రః ।** బ్రహ్మము యొక్క అంగలక్షణ (అఖండ–అప్రమేయ–నిత్య–సత్య– అమృత లక్షణములు) సూచించునదే యజ్ఞసూత్రము. **'తత్'** యే బ్రహ్మసూత్రము. సమస్తమునకు ఆవలిదగు పరబ్రహ్మోపాసనను ఉద్దేశించినదే **'బ్రహ్మసూత్రము'.**

**బ్రహ్మయజ్ఞమే।** యజ్ఞసూత్రము. విశ్వయజ్ఞ సంబంధమైన ఉపాసనయే బ్రహ్మయజ్ఞము. **"ఈ విశ్వము ఆత్మయొక్క సహజమగు 'తత్' స్వరూపమే। బ్రాహ్మీ స్వరూపమే"** – అను ఉపాసనయే బ్రహ్మయజ్ఞము.

**బ్రహ్మము యొక్క అంగములు: అంగాని మాత్రాణి।** శబ్దస్పర్శ రూప రస గంధములనబడే పంచతన్మాత్రలు – బ్రహ్మముయొక్క అంగములు (అవయవములు – దేహరూపము). బ్రహ్మమో? **'దేహి' స్వరూపము. విశ్వదేహియొక్క (విశ్వేశ్వరుని యొక్క) స్వకీయానంద స్వరూపమే విశ్వము.**

**మనో యజ్ఞస్య హగ్ంసో యజ్ఞసూత్రమ్।** ఆత్మగురించి మనస్సు చేసే ఉపాసనా యజ్ఞమే **యజ్ఞసూత్రము.**

**బ్రహ్మసూత్రము।** ప్రణవమే బ్రహ్మ సూత్రము. వస్త్రములో ధారము, దూదిలాగే **బ్రహ్మయజ్ఞమయమే యజ్ఞసూత్రము.**

**ప్రణవాంతర్వర్తీ హగ్ంసో యజ్ఞసూత్రమ్।** ఏ హంస ప్రణవము యొక్క **"అంతర్వర్తి"** (Inner sense) (అంతరార్థము) అయి ఉన్నదో – అదియే "బ్రహ్మసూత్రము". బ్రహ్మసూత్రమే యజ్ఞసూత్రము కూడా. **యజ్ఞసూత్రము 'యజ్ఞము' అనబడే సృష్టి వినోదమునకు 'సంజ్ఞ'.**

**తదేవ బ్రహ్మయజ్ఞమయమ్।** ఆ తత్‌బ్రహ్మమే **'సృష్టికల్పన'** అనబడే **బ్రహ్మయజ్ఞమయము**గా అగుచున్నది. అనగా, సృష్టి బ్రహ్మయజ్ఞ అంతర్విభాగమే।

# మోక్షక్రమమ్।

**బ్రహ్మసూత్రము (లేక) యజ్ఞసూత్రము**: "బ్రహ్మము అయి ఉన్న నేను ఈ 'అన్యము' గా కనిపిస్తున్న అంతటినీ సూత్రప్రాయంగా ధారణ చేస్తున్నాను"– అను బ్రాహ్మీభావనయే యజ్ఞసూత్రము (లేక) బ్రహ్మసూత్రము. **అట్టి కేవలగు ఆత్మభావనయే కైవల్యము.**

**'అన్యము'గా కనిపించేదంతా 'యజ్ఞసూత్రము'గా ధరించటానికి ఉపాయములు :**

**(1)** బ్రహ్మ సంధ్యాక్రియ : **'ధ్యానము', 'కర్మయోగము', 'ప్రాణాయామోపాసన', 'పరాప్రేమస్వరూపమగు భక్తి'** వంటి క్రియలతో బుద్ధిని – **జీవాత్మ (ఇహస్వరూపము) పరమాత్మ (ఆవలిదగు పరస్వరూపము)** ల మధ్యగా గల **"సంధ్యాస్థానము"** నందు – నిలిపి ఉంచటమును – **"బ్రహ్మసంధ్యా క్రియ"**గా చెప్పుకుంటున్నాము. (ఇది **క్రమముక్తిగా** చెప్పబడుతోంది).

**(2) మనోయాగము** : మనస్సును **'కేవలము, సర్వాత్మకము, సర్వతత్త్వస్వరూపము'** – అగు ఆత్మతో అనుసంధానము చేయు అనునిత్య క్రియా విశేషమే **'మనోయాగము'**. (ఇది **సద్యోముక్తిగా** వర్ణించబడుతోంది)

ఇక్కడి ఈ రెండిటినీ విడివిడిగా చెప్పుకుంటున్నప్పటికీ, మనోయాగము కూడా – బ్రహ్మసంధ్యాక్రియా యోగము యొక్క ఒకానొక విశేష లక్షణమే అయిఉన్నది.

అట్టి అఖండాత్మ సంజ్ఞయగు **'ప్రణవ బ్రహ్మయజ్ఞము'**ను అనుష్ఠానము చేయు ధారణయే **'యజ్ఞసూత్రము'**. అట్టి **"యజ్ఞసూత్ర–ప్రణవబ్రహ్మయజ్ఞ క్రియాయుక్తుడు"** – అయినప్పుడు 'బ్రాహ్మణుడు'గా చెప్పుకోబడుచున్నాడు.

అట్టి బ్రహ్మయజ్ఞ క్రియాయుక్తులై దేవతలు – జగత్తును నిర్వర్తిస్తూ, పరిపోషిస్తున్నారు. 'యజ్ఞసూత్ర ధారణ'గా భావించి, తమ తమ విద్యుక్తధర్మములైనట్టి సృష్టిరచన–సృష్టి క్రియా కల్పనలయందు యజ్ఞ భావనతో పాల్గొంటున్నారు. **ఈ విధంగా దేవతలు 'బ్రహ్మచర్యము'ను ఆచరిస్తున్నవారు అగుచున్నారు. [ యజ్ఞము కొరకుచేయు కర్మ బ్రహ్మచర్యమే]।**

# యజ్ఞ ముఖ్యార్థము

**'యజ్ఞము'** అనగా? హంస **(సోఽహమ్ ఓం)** సూత్రమును ఉద్దేశించి ప్రాపంచక కర్మలు, ఉపాసనలు, అగ్ని కార్యములు, తదితర సమస్త క్రియలు నిర్వర్తిస్తూ ఉండటమే 'యజ్ఞము'. ఇదియే యజ్ఞము అను వేద శబ్దముయొక్క ముఖ్యార్థము.

(1) హంస (ఆత్మ) (2) 'ఓం' – అను ప్రణవము అనబడేవి రెండు కూడా వేరు వేరు కాదు. **హంసః ప్రణవో అభేదః।**

(హంస = సోఽ హమ్. ప్రణవము = సమగ్రమగు స్వస్వరూపము).

- 'హంస' (ఆత్మ) యొక్క భావనారూప–ప్రార్థనా చమత్కారమే **త్రికాలములు** (భూత భవిష్యత్ వర్తమానకాలములు).
- **త్రికాలములు, త్రివర్ణములు కూడా!** (జీవ ఈశ్వర పరాత్మలు), (జాగ్రత్ స్వప్న సుషుప్తులు), (సత్త్వ–రజో–తమములు).
- **యాగము :** త్రేతాగ్నుల (3 అగ్నుల అనుసంధానమే **'యాగము'.** (ఆహవనీయాగ్ని, దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని). (సృష్టి, స్థితి, లయలు) అనుసంధానమే 'యాగము' అను శబ్దముయొక్క ఒకానొక శబ్దార్థము).

  **(పంచాగ్నులు** : గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ, సభ్యా, అవసథ్యాగ్నులు).

*[ **యాగము = (నిరుక్తారము) దృశ్య–జీవ–ఈశ్వరుల – ఏకరూప అనుసంధానము** ]*

# అంతర్యాగము

**త్రైత అగ్న్య ఆత్మాకృతి వర్ణ ఓంకార హగ్ంస - అనుసంధానో 'అంతర్యాగః'।**

(1) గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ - త్రి అగ్నులు.

(2) ఆ మూడు తనవైన హంస (ఓంకారము, ఆత్మ) యొక్క మనో - **అనుసంధానమే అంతర్యాగము.**

> **"ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తులు నావైన నేనే 'నేను'. అట్టి నేను ఆత్మస్వరూప, స్వభావుడనై సమస్తమునకు ఆధారమును, కర్తను కూడా"** - అను భావన - అవగాహనల అనుసంధానము - **'అంతర్యాగము'.**

# తురీయము

**(చతురీయము, 4వది)**

- జాగ్రత్ స్వప్న సుషుప్తులు నాయొక్క స్వకీయ కల్పితస్థానములై, సంచారము కొరకు నాకై కల్పించుకున్న **'నేనైన నేనే' - తురీయము'.** అట్టి తురీయము యొక్క స్వరూపము ఎట్టిది? **చిత్స్వరూప సత్ తత్‌మయం తురీయ స్వరూపమ్।** (తురీయ పురుషుని రూపము – **చిత్** (knowing) తో కూడిన **'సత్'** (Absolute presence) రూపము (మరియు) **తత్** (That form beyond all) స్వరూపము - కూడా।
- **హంస = అంతరాదిత్యే జ్యోతిస్స్వరూపో హగ్ంసః।** అంతర హృదయములో సూర్య (ఆదిత్య) జ్యోతి స్వరూపము– 'హంస' అనబడుతోంది.
- బ్రహ్మసంపత్తి = 'యజ్ఞము' యొక్క ముఖ్య అంగము - **"బ్రహ్మతత్త్వజ్ఞాన సంపత్తి".**

ఈ జీవుడు బ్రహ్మమునందు ప్రవృత్తుడైనవాడై అట్టి **'ప్రణవ హంస'** అగు ఆత్మను 'సూత్రము'గా ఆచరించి, తద్వారా అఖండాత్మ భావనను సిద్ధించుకోగలడు.

-----

**బ్రహ్మమానసపుత్రులైనట్టి వాలఖిల్య, కామేశ్వర, వైశ్రవణ మొ॥ వారు** :

తండ్రీ! బ్రహ్మభగవాన్! **'హంస సూత్రములు'** అనబడు హంస (ఆత్మ)కు సూత్రములు ఎన్ని?

అద్దాని ప్రమాణము (పరిమాణము) ఎట్టిది?

**బ్రహ్మదేవుడు** : హృదయాదిత్యుని నుండి (హృదయములోని సూర్యుని నుండి) సృష్టిగా విస్తరిస్తున్న కిరణములు "96".

[**పంచ కర్మేంద్రియములు (+) పంచ జ్ఞానేంద్రియములు (+) పంచ ప్రాణములు (+) పంచ ఉపప్రాణముల (+) అంతరంగ చతుష్టము అగు మనో బుద్ధి చమత్కారములు - 4**] = 24.

**జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములలో ఈ '24'. అనగా 24 × 4 = "96"**

ఇవన్నీ చిత్ సూత్రము యొక్క ఘ్రాణములు (వాసనలు / చిరుగంటలు).

అట్టి 'చిత్' సూత్ర ఘ్రాణముల యొక్క స్వర నిర్గతమైన (ప్రదర్శనమైన) (Sound, Expressively spoken) ప్రణవధారలు 'ఆరు' - అంగుళములు.

# భౌతికమైన యజ్ఞ సూత్రము (బ్రహ్మసూత్రము)

**"బ్రహ్మము అయి ఉన్న నేను ఈ దృశ్య జగత్తును సూత్రముగా** (Like an ornament) **అవధరించుచున్నాను"** – అను 'పరమార్థము'నకు సూచనయే బ్రహ్మసూత్రము (లేక) భౌతికమైన యజ్ఞసూత్రము. అట్టి యజ్ఞ సూత్రము (ప్రత్తి తంతువుల సంజ్ఞగా) ఎడమభుజము నుండి కుడి కటి (మొల) వరకు '80' అంగుళముల పొడవుగలది ధరించబడుతోంది. అట్టి స్థానము **'హంస-సంచారక స్థానము'**గా భావించబడి, ఉపాసించ బడుతోంది. బ్రహ్మము ఈ యజ్ఞసూత్ర స్థానములో (జందెము ధరించిన శారీరక స్థానములో) (భౌతిక – ఉపాశ్రయముకొరకై) అనుభవము కాగలదు. బ్రహ్మముయొక్క స్వకారమగు తాత్త్విక స్వరూపము తేలికగా అనుభవము కాగలదు. **బ్రహ్మగృహ్యా ప్రకారో న అన్యత్ర విదితః।** బ్రహ్మ సూత్రము యొక్క ఆశ్రయము చేతనే బ్రహ్మము అనుభవమౌతుంది. వేరే త్రోవ లేదు. **అట్టి పరమాత్మతత్త్వము ఎరిగినవారు అమృత ఫలప్రదులు కాగలరు.**

---

హంస (ఆత్మ) సర్వకాలములందు నిత్యప్రకాశకము.

ప్రణవహంస యొక్క అంతర్ – ధ్యాన ప్రకృతి లేకుండా ఈ జీవునికి ముక్తి సిద్ధించదు.

ఆత్మజ్ఞానము కొరకై (**బ్రహ్మము, పరమాత్మ, ఈశ్వరుడు, జీవాత్మ, దృశ్య-జగత్తు-మనోబుద్ధి చిత్త అహంకారములు** అనబడే) "నవసూత్రము" ముందుగా విచారించబడు గాక।

ఆ నవ సూత్రములుగా చరించుచున్నది కూడా ఆత్మయే. అంతరాదిత్యుడగు ఆత్మభగవానుని ఎరుగని మానవుడు – బాహ్య సూర్యుని గురించి మాత్రం ఏమి, ఎంతవరకు తెలుసుకోగలడు? **ఆత్మతత్త్వ జ్ఞానము ఎరిగిన విబుధులు సర్వత్రా ఆత్మనే దర్శిస్తూ, సమస్తమును ఆత్మగానే ఉపాసిస్తున్నారు. ఆత్మయందే ఆచరణము కలిగి ఉంటున్నారు. మరణమును అధిగమించి అమృత స్వరూపులగుచున్నారు.**

## "వాజపేయము-ఆత్మయజ్ఞము"

***యజ్ఞము నిర్వర్తించువారు*** :

(1) **యజమాని** = యజ్ఞమునకు కర్త.

(2) **అధ్వర్యుడు** = యజ్ఞములో యజుర్వేద మంత్రములను పలుకువారు. ఈయన యజ్ఞము చేయించువారిలో ముఖ్యులు. యజ్ఞమును ఎట్టి పొరపాట్లు లేకుండా చూచుకొను బాధ్యత కలవారు.

(3) **హోత** = యజ్ఞవిధిలో ఋగ్వేద మంత్రములను చదువువారు.

(4) **ఉద్గాత** = యజ్ఞ సంవిధానములో సామవేదమును గానము చేయువారు.

(5) **బ్రహ్మ** = "అధర్వణ వేద మంత్రములను చెప్పువారు.

(6) **ఋత్విక్కులు** = యజ్ఞవిధిలోని ఆయా అనేక విధులను నిర్వర్తింపజేయువారు. వీరు 'అగ్నిధ్రులు, ప్రతిపస్థాత, నేష్ట, ఉపద్రష్ట' మొదలైన పేర్లు కలిగి ఆయా యజ్ఞ క్రియలు నిర్వర్తిస్తూ ఉంటారు.

***వాజపేయములో (మనో వాజపేయ బ్రాహ్మీ యాగములో)***

| | | |
|---|---|---|
| **పశుహర్త (పసుపతి)** | → | ఆధ్వర్యుడు |
| **ఇంద్రుడు** | → | దేవత |
| **ధర్మయాగము (ధర్మసూత్రము)** | → | అహింస |
| **పరమహంస** | → | ఆధ్వర్యుడు |
| **పశుపతి** | → | పరమాత్మయగు దేవత |
| **బ్రహ్మ** | → | బ్రహ్మోపనిషదము |
| **స్వాధ్యాయయుక్తులు** | → | బ్రాహ్మణులు. (తత్త్వజ్ఞులగు మహనీయుల ప్రవచనములు, బోధలు, స్వానుభవములు) |

అశ్వమేధము – మహాయజ్ఞ కథనమునకు:

- రాజు **(యజ్ఞకర్త)** – బ్రహ్మచర్యము **(బ్రహ్మోపాసన)**
- ఆశయము – ఆత్మజ్ఞానముగాను విధానము మనో సంచారము” విజయము సంపాదించటముగాను చెప్పబడుతోంది.

**బ్రహ్మపుత్రుడు : సర్వేషాం పూర్వోక్త బ్రహ్మయజ్ఞ క్రమం – ముక్తిక్రమం'।** ఇట్టి మన తండ్రిగారు చెప్పిన బ్రహ్మయజ్ఞక్రమము – **'ముక్తిక్రమము'** అయి ఉన్నది. (బ్రహ్మయజ్ఞము – అని వేద వాఙ్మయంతో చెప్పబడినది – **క్రమముక్తి విధానము**).

❖

ఈ విధంగా బ్రహ్మదేవుడు 'హంస ఋషి' తత్త్వము బోధించారు. **స్వయంభూః తిరోదధే।** స్వయంభువు అగు ప్రజాపతి అదృశ్యమైనారు.

❖

అట్టి ఈ 'రుద్రోపనిషత్' అని చెప్పబడే వివరములకు హంసజ్యోతి పురుషుడు – **పశుపతి।**

**తారకము** = ప్రణవము (తరింపజేయునది). ఉపనిషత్‌లోని విశేషములు ఎరిగినవాడు **'హంసాత్మ మాలికా వర్ణ ప్రబోధితుడు'** – అనబడుచున్నాడు.

**పరమాత్మయే** – పురుషుడు।

**ప్రకృతియే** – బ్రహ్మసంపత్తికారిణీ।

**అధ్యాత్మము** – బ్రహ్మకల్పము అయినట్టి జగత్తు యొక్క ఆకృతి। **(అధ్యాత్మ బ్రహ్మస్య ఆకృతిః)**

ధీమంతుల (ఆత్మబుద్ధి కలవారు) ఈ కనబడుచున్న దృశ్యమును **'బ్రహ్మజ్ఞాన ప్రభోధము'** యొక్క సంధ్యాకాలంగా (సంధ్యావందన క్రియచే) ఉపాసిస్తూ ఉంటున్నారు.

❖

**హంసాఖ్యముని** “ఆత్మతత్త్వ ప్రజాకథనము” ద్వారా ఆత్మదేవుని గురించి స్వానుభవముగా తెలుసుకొని ఉన్నారు. ఆయన ఇంకా ఈ విధంగా ముముక్షువులకు ఎలుగెత్తి చెప్పుచున్నారు.

**అంతర హృదయంలో ప్రణవనాదాఖ్యుడు 'ఓం' కార స్వరూపుడై వేంచేసి ఉన్నారు. ఆయనయే ప్రత్యయ బోధకుడు. బాహ్యమునుండి బుద్ధిని వెనుకకు మరల్చుదాము. అట్టి అంతరనాద స్వరూపుని గమనిద్దాము. శ్రవణం చేద్దాము. ఏకాగ్రబుద్ధితో – (1) బుద్ధికి ఈవల బుద్ధియందు (2) బుద్ధికి ఆవల గూఢముగాను – ప్రకాశించుచున్న ఆత్మ చైతన్యమును ధ్యానిద్దాము.**

**'నాద-బిందు-కళలు'** :- ఈ మూడు కూడా **బుద్ధియందు అంతర్గతమై జ్ఞాననాళములు. చిన్మయానంద వేదితములు. విశ్వచేష్టితమునకు** (విశ్వనిర్మాణమునకు, అనుసంధానము. ఆత్మాకాశమునందు ఏర్పడుచున్న) **మూలకారణములుగా** అగుచున్నాయి.

***శివశక్త్యాత్మకం రూపం చిన్మయానంద వేదితమ్*** – *చిన్మయానందము సిద్ధించగా రూపించునది, (కనిపించునది) శివ- శక్తుల (కేవల సందర్భముల, పురుష-ప్రకృతుల, "నేను-నాయొక్క") ("I" and "MY") ఏకరూపము. ఈ సమస్తము శివ శక్త్యాత్మకమే। పరస్పరం అభేదము కూడా।*

**నాద బిందు కళా త్రీణి ద్విత్రాణాం సాంఖ్యం అకృతిః।** – *ఈ విశ్వమంతా 'నాద-బిందు-కళలు" అనే త్రినేత్రముల సంక్రియా ప్రదర్శనములతో కూడి ఉన్నది. సాంఖ్యపూర్వకంగా జీవాత్మ – పరమాత్మల ద్విత్వ చమత్కారము. సాకారంగా అనుభవమగుచూ ఉంటున్నాయి.*

**అంతర్గాఢ 'ప్రమా' హంసః ।** – *సమస్త జీవుల హృదయాలలోను హంసయే (ఆత్మయే) 'ప్రమ'గా (సహజసత్త్వమై, యదార్థముగా) వేంచేసి ఉన్నది. అట్టి ప్రమ అగు (సత్యమగు) ఆత్మయొక్క స్వయం కల్పిత 'ప్రమాణము' – ఈ* ***దృశ్యజగత్తు.***

**బ్రహ్మసూత్ర పదం జ్ఞేయం బ్రాహ్మ్యం విధ్యుక్త లక్షణం।** బ్రహ్మజ్ఞుల విధ్యుక్త లక్షణము : **బ్రహ్మ సూత్ర పదము** [ బ్రహ్మమే (పూదండలలో దారములాగా) సమస్త జీవుల హృదయములందు సమరూపమై ఉండటము] **స్వానుభవమై ఉండటము.** "బ్రహ్మ-సూత్రపదము" ఎరిగి ఉండటము – బ్రాహ్మ్యము యొక్క (బ్రాహ్మణుల) విధ్యుక్త లక్షణము.

**"తెలుసుకొనువాడు", 'తెలివి'లతో సహా తెలియబడేదంతా బ్రహ్మమే"** – అనునదే సదా **జ్ఞేయము.**

హంసాఖ్య ప్రణవ ధ్యానమే ఓంకార సంఖ్యార్థమగు కేవలాత్మ స్వరూప ధ్యానము.

ధ్యానము చేయు విధానమే జ్ఞాన (అధ్యాత్మ) శాస్త్ర పారగము. అట్టి **"స్వస్వరూప, సర్వ స్వరూప ఆత్మ"**ను తెలుసుకున్నంత మాత్రం చేతనే ఈ జీవుడు తెలుసుకోవలసినది తెలుసుకున్నవాడై **"జ్ఞానసాగర పారగుడు"** (One who reached the other end of the ocean of knowledge) అగుచున్నాడు.



**స్వస్వరూపాత్మయే శివుడు.** ఆయనయే అందరిలో కేవల స్వరూపముగా వెలయుచున్నారు. సమస్త జీవులలో స్వతఃశివుడుగా వెలుగొందు చున్నారు. అట్టి పశుపతి అగు స్వతఃశివుడే – **సర్వము సర్వదా తానే అయి, సమస్తమునకు ఆవల "సాక్షి"** అయిఉన్నారు కూడా।

అట్టి చైతన్య స్వరూపుడగు శివభగవానుడే సమస్త జీవులలో మనోరూపుడై సమస్తమునకు ప్రేరణ కలిగిస్తూ, నియమించుచున్నారు. **సర్వజీవులలోని మనోదర్పణము – ఆ శివతత్త్వవిలాసమే।**

**అట్టి స్వయం శివ ప్రేరణాన్వితుడగు ఈ జీవుని పట్ల** (An Individualstic state):

- ప్రాణము "ప్రియము" రూపముగా ఇంద్రియ విషయములవైపుగా వెళ్లి వ్రాలుచూ ఉన్నది.
- ప్రాణము నుండి ప్రియమగు వాక్కు చేష్టత (Inclination) పొంది – మాట్లాడటము జరుగుతోంది.
- ప్రాణము నుండి ప్రియమగు చూపు రూపుదిద్దుకొని, రూపములను చూడటం జరుగుతోంది.
- ప్రాణము నుండి ప్రియమగు శ్రవణశక్తి బయల్వెడలి సమస్త శబ్ద జాలమును వినగలుగుతోంది.
- తదితర ఇంద్రియములు – ఆయా ఇంద్రియ విషయములన్నీ కూడా ప్రాణశక్తి నుండియే పొందుచున్నాయి.

ప్రాణశక్తియే ఇంద్రియ – ఇంద్రియ విషయములుగా కూడా ప్రదర్శనమౌతోంది.

[(ఉదా: చర్మము= స్పర్శ, స్పర్శించబడే వస్తువు, నాలుక = రుచి, రుచి చూడబడే వస్తువు, ముక్కు = వాసన, వాసన చూడబడే వస్తువు) – ఇవన్నీ కూడా **ఆత్మయొక్క "శక్తి"** రూపమగు **'ప్రాణము'** చేతననే **ప్రేరణ** పొంది ప్రవర్తిస్తున్నాయి. అనగా, **ఆత్మకు చెందిన (పశుపతి దత్తమైన) ప్రాణశక్తియొక్క వివిధ ప్రదర్శనములే ఈ కర్మ జ్ఞానేంద్రియములు, వాటివాటి విషయములు కూడా।**]

ఈ ఇంద్రియములన్నీ ప్రాణశక్తి నుండి ప్రేరణ పొంది, విషయములలో ప్రవర్తిస్తూ ఉన్నాయి, అయితే, ప్రవర్తింపజేయువాడు ఎవరు? **ఆత్మ యొక్క స్వయం విన్యాస కల్పితుడగు మాయా పురుషుడే।** అంతేగాని ఈ ఇంద్రియ జగదనుభవము ఆత్మయొక్క సహజ స్వరూపము కాదు, స్వభావము కాదు. **పరమాత్మయే పశుపతి. జీవాత్మానుభవములతో కూడిన లోక విన్యాసమంతా పశుతత్త్వమే।**

## పశుపతి – శ్రోత్రము

శ్రోత్రము (వినికిడి)నకు "ఉనికి స్థానము" (Zone of Placement) ఏది? **అది స్వయం – పశుపతి పురుషుడగు ఆత్మయందే అధ్యస్తము అయి ఉన్నది.** ఆ పరమపురుషుని కళయే శ్రోత్రము. కాబట్టి వినికిడి యొక్క ఉనికి స్థానము పశుపతియే (ఆత్మపురుషుడే।). తన జీవాంశచే శివుడు – శ్రోత్రమును అనుసరిస్తూ విషయముల కల్పన, వాటి అనుభవము కూడా నిర్వర్తిస్తున్నారు.

## పశుపతి – మనస్సు

**మనస్సు ఆత్మయందే అధ్యస్తము అయి ఉన్నది.** (Thought has its Placement in 'Absolute Self' only). ఆత్మపురుషుడే మనస్సునందు ప్రవేశించి, మనోరూపుడై మనస్సును ప్రేరేపిస్తూ ఉన్నాడు. ఆలోచించబడుచున్న దానిపై మనస్సును నియమించువాడు కూడా తానే అయి ఉంటున్నారు. అంతేకాదు. **మనస్సుకు తెలియబడుచున్న సమస్తము కూడా ఆయనయే।**

**స ఏవ విదితాని అన్యః, తథైవ అవిదితానపి।** ఇక్కడి తెలియబడేది (అట్లాగే), తెలియబడనిది – అంతా కూడా **ఆ ఆత్మ పురుషుని చిద్విలాస విన్యాసమే.**

ఆ ఈశ్వరుడే (1) సమస్తమైన (కల్పితమాత్రములగు) ఇంద్రియార్థములలోను, ఇంద్రియములలోను ప్రవేశించటము, (2) ఇంద్రియానుభవములుగా ప్రాప్తిస్తున్న సమస్త రూప నామ అనుభవములను – ఉభయము తానే స్వయముగా దాల్చుచుండటము కూడా – నిర్వర్తిస్తున్నారు. **ఇంద్రియములను, ఇంద్రియ విషయములను మనో విన్యాసముగా నియమిస్తున్నది కూడా ఆ ఆత్మదేవుడే.** మనోవిన్యాసము, మనోబంధమోక్షములు – ఇవన్నీ కూడా **జీవుడుగా ప్రదర్శనమగుచున్న పశుపతియొక్క స్వయంకృత లీలా కల్పనయే।**

**తతః చక్షుశ్చ, వాక్ చ ఏవ, మనస్య, అన్యాని 'ఖాని' చ, న గచ్ఛంతి స్వయంజ్యోతిః స్వభావే పరమాత్మని।** స్వయంజ్యోతి స్వరూపుడగు పరమాత్మయొక్క తేజో విభవములే ఈ కళ్ళు, వాక్కు, మనస్సు తదితర ఇంద్రియ రంధ్రములు కూడా! అంతేగాని, అవన్నీ ఆత్మకు వేరైన, అతీతమైన ఉనికి కలిగి లేవు. **ఇంద్రియములుగాను, ఇంద్రియ విషయ రూపమగు నామరూపాత్మక జగత్తుగాను కనిపించే ఉభయము పశుపతి యొక్క విశ్వ తాండవ నృత్యమే। ఆత్మ విన్యాసమే।**

❖ ❖ ❖

**స్వాత్మయే** అయి ఉన్న **పరమాత్మ సమస్త ఇంద్రియ విషయములకు అకర్త.** బాహ్య-అంతరంగ విభాగములకు వేరై, **ప్రత్యక్ ప్రకాశ రూపుడు.** సమస్తము తనయొక్క ప్రకాశము, తేజోవిభవముగా కలిగి ఉన్నట్టి వారు. అట్టి బ్రహ్మమును విజ్ఞులు తర్క – ప్రమాణములను (Logic, examples) ఉపయోగించుకుంటూనే తర్క ప్రమాణములను అధిగమించి (1) **"తెలియబడే సమస్తము"** గాను, **"తెలుసుకొంటున్నవాడు"** గాను తెలుసుకొంటున్నారు. **(వేద వేదసః। వేద విహితః। వేదవేద్యః।)**

అట్టి స్వస్వరూపుడగు ప్రత్యగాత్మ పరంజ్యోతి స్వరూపుడు. ఆయన యొక్క మాయ **"మహత్తరమగు స్వకీయ కల్పన"** అయి ఉన్నది. అంతేగాని **ఆత్మపురుషుని సమక్షంలో మరొకరెవరో వచ్చి 'మాయ'ను కల్పించటము లేదు.**

**అయితే,**

నిర్విషయుడు, సమస్తమునకు పరము (ఆవల) అయినట్టివాడు నిత్యనిర్మలుడు అగు 'ప్రత్యగాత్మ' యందు 'మాయ' అనే దోషకల్పన అసలు ఎట్లా ఏర్పడుతుంది? ఏర్పడటానికి వీలే లేదు. అందుచేత,

- తర్క ప్రమాణములచేతను (Through Logic and study of exaples / simeles)
- స్వానుభవము చేతను,
- స్వప్రకాశైక సంసిద్ధి చేతను,

సిద్ధించుచున్న చిద్ఘనమునందు (ఘనీభూతమైన కేవల చిత్ పరాత్మయందు)–**'మాయ' అనే అన్యమైనది ఘటించగల ప్రసక్తియే లేదు.**

## నాస్త్యేవ విద్యా - అవిద్యా।

**వ్యవహారిక దృష్టే అయం విద్యా, అవిద్యా। న చ అన్యథా।। వ్యావహారిక దృష్టి చేత** మాత్రమే [ (లేక) లోకసంబంధమైన - నామరూపాత్మకమైన) దృష్టిచేత మాత్రమే] **విద్య, అవిద్య అనబడేవి ఉన్నాయి.** అందుకు వేరైన దృష్టిలో చూచినప్పుడు **'విద్య, అవిద్యలు' లేనివే** అగుచున్నాయి.

**తత్త్వదృష్ట్యాతు నాస్త్యేవ, తత్త్వమేవ అస్తికేవలమ్।** తత్త్వ దృష్టితో చూస్తే **'కేవలమగు తత్త్వము'** మాత్రమే ఇక్కడ ఉండి ఉన్నది. ఒకడు వ్యావహారిక దృష్టిలో ఉన్నా, అది కూడా ఆత్మయొక్క సంప్రకాశ ప్రదర్శనమే. ఈవిధంగా **మౌన స్వరూపమగు ఆత్మప్రకాశమే 'సమస్తము' అయి వెలయుచున్నది.**

*ఎవరి పట్ల అయితే,*

**"విద్య-అవిద్యలకు ఆవల (జ్ఞాన-అజ్ఞానములకు అతీతంగా) అఖండాత్మ యొక్క ప్రకాశమే ఈ సమస్తము"** అను మహార్థము స్వాభావికంగా ప్రకాశించుచు, స్వాభావికంగా స్వానుభవము అవుతూ ఉంటుందో -

- అట్టివాడు 'జీవుడు' కాదు.
- 'బ్రహ్మము' - అను శబ్దమాత్రుడు కూడా కాదు.

### ఆతడు తనకు తానే సంపూర్ణుడు.

**"మరొకటేదో లభిస్తేనేగాని నేను పూర్ణుడను కాను"** అనే శంకయే ఆతనిపట్ల శేషించి ఉండదు. జీవుడు, బ్రహ్మము మొదలైనవన్నీ తనయొక్క ఆత్మప్రకాశమునందు ఏర్పడే కించిత్ సాకార స్వకీయ సందర్శనము వంటిది మాత్రమే। (దర్పణములో ప్రతిబింబము వంటిది మాత్రమే). (లేక) అవి అంతిమబోధకై మధ్యేమార్గరూప శాస్త్ర కల్పితాలు.

అట్టి సర్వత్రా స్వస్వరూప బ్రహ్మమును దర్శించువానిపట్ల వర్ణ రూప భేదములు గాని, బ్రహ్మచర్య - గృహస్త - వానప్రస్త - సన్న్యాస ఇత్యాది ఆశ్రమ భేదములుగాని ఉండజాలవు. ఆత్మని గురించి - ధర్మ - అధర్మములుగాని, విధి నిషేధములు గాని - ఏమని నిర్వచించి చెప్పగలము?

**శ్లో।। యథా బ్రహ్మాత్మకం సర్వం విభూతి స్వత ఏవ తు,**
**తదా దుఃఖాది భేదోఽ యమ్ ఆభాసోఽపి న భాసతే।।**

ఈ సమస్త దృశ్యమును - **"స్వతఃగానే** (In its natural course / act) **బ్రహ్మమే"** అని దర్శించువాడు -

- తాను లోకంలో అనేక దుఃఖముల మధ్యగా (లౌకికంగా) ఉన్నప్పటికీ కూడా, **కించిత్ కూడా అంతరంగంలో అవేవీ లేనివాడై ఉంటాడు.**

- ఆతనికి దృశ్యము దృశ్యముగా కనిపించక, కేవల 'చిద్రూపము' (In Absolute knowing form) గా అగుపిస్తూ ఉంటుంది.
- సాక్షాత్ పరమాత్మ యొక్క సమక్షంలో ధర్మ – ధర్మి (ధర్మము, అధర్మము, ధర్మిష్టుడు, అధర్మిష్టుడు) మొదలైన భేదములేవీ మొదలే ఉండజాలవు. సమస్తము ఆయనయే అయి ఉండగా, ఇక ఆయన పట్ల (లేక) ఆయన సమక్షంలో భేదాభేదములేమి ఉంటాయి? కథా రచనలోని "మంచివారు, చెడ్డవారు" మొదలైనవి కథా రచయిత తనపట్ల కలిగి ఉండదు కదా।

**నాస్తి స్వాత్మాతిరేకేణ, స్వయమేవ అస్తి సర్వదా!** ఆత్మకు ఆవలగా గాని, ఆత్మకు వేరైగానీ ఏదీ లేదు. **ఆత్మయే సర్వత్రా సమస్వరూపమై "ఈ సమస్తము"గా వెలయుచున్నది.** వస్తుతః గాని, అవస్తుతః గాని ఇక్కడ ఉన్నది బ్రహ్మమే. అట్టి బ్రహ్మమును ఎరిగిన బ్రహ్మజ్ఞాని తానే ఈ సమస్తము అయి ప్రకాశించుచున్నాడు. తనయొక్క తేజోవిభవమే అయిఉన్న దృశ్యజగత్తులో బ్రహ్మజ్ఞాని ఏది స్వీకరిస్తాడు? ఏది త్యజిస్తాడు? **కిం ఉపాదేయం? కిం హేయం? కిం గృహ్ణాతి, జహాతి కిం?**

❖❖❖

బంగారు ఆభరణములన్నిటికీ బంగారమే "అధిష్ఠానము" అయినట్లుగానే, **ఈ సమస్తమునకు (స్వస్వరూపమగు) ఆత్మయే అధిష్ఠానము.** అట్టి అధిష్ఠానమగు ఆత్మ **– అనౌపమ్యమ్।** ఉపమానాలను ఉపయోగించి ఒకరికి మరొకరు ఆత్మతత్త్వానుభవం కలిగించలేరు. **ఆత్మ ఉపమానములకు కూడా అందనిది.**

**అవాక్– మానస గోచరమ్।** అది వాక్కుకు, ఆలోచనలకు విషయము కాదు. వాక్కు, ఆలోచనలు తనవై ఉన్నట్టిది – (అధిష్ఠానమగు) ఆత్మ.

**అద్రేశ్యమ్।** ఆత్మ దేశ కాలాదులకు చెందినది కాదు. దేశ కాలాదులన్నీ అద్దాని స్వయం కల్పనా వినోదములు మాత్రమే।

**అగ్రాహ్యమ్।** బుద్ధితోనో, ఇంకొకరు చెప్పితేనో, లేక ఎక్కడైనా 'వింటేనో, చదివితేనో గ్రహించబడేది కాదు. ఎందుకంటే సమస్తము ఆయారీతులుగా గ్రహిస్తున్నది ఆత్మయే కనుక। **ఒకడు తనను తాను తెలుసుకొనే అధ్యయనోత్సాహంతో మాత్రమే – ఆత్మను గ్రహించబడగలదు.**

**రూపవర్జితమ్।** అది నామ రూపాత్మకమైనది కాదు. నామరూపములన్నీ ఆత్మయొక్క భావనా మాత్రములే। **'ఆత్మ'ను నామరూపాత్మక చట్రము (పరిధి)కి తెచ్చి నియమించి చెప్పలేము.**

**అచక్షు శ్రోత్రమ్।। అత్యర్థం తదపాణి పాదం తథా।** అట్టి ఆత్మ – కళ్లు, చెవులు తదితర జ్ఞానేంద్రియముల రూపములుగా అవదు. చేతులు, కాళ్లు, తదితర కర్మేంద్రియముల రూపములు పొందేది కాదు. వాటి వాటి విషయపరంపరల రూపము కూడా పొందేది కాదు. వాటికన్నిటికీ ఆత్మ సాక్షి, నియామకుడు, రచయిత కూడా.

**నిత్యమ్।** ఆత్మ త్రికాలములందు యథాతథము.

**విభుమ్।** సమస్త జగదనుభవములను (రాజువలె) పరిపాలించినది కాబట్టి – విభువు.

**సర్వగతమ్।** ఒక నాటక రచయిత – నాటకములోని కథా విభాగములోను, పాత్రల యొక్క పరస్పర (సానుకూల, ప్రతికూల) సంబంధ బాంధవ్యములలోను – సర్వగతుడై ఉంటాడుకదా! నాటకమంతా రచయితయొక్క ఊహాకల్పనయే కదా। అట్లాగే అనుభవముగా అగుచున్న సమస్తమునందు పరమాత్మయే (పాలలో నేయివలె) సర్వగతుడై, అంతర్లీనుడై ఉన్నారు.

ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు స్వయం కల్పిత కథావిశేషము వంటి **ఊహా – అపోహ నిర్మిత జగత్తంతా** అనుభవముగా కల్పించుకొని అనుభవిస్తున్నాడు,

**సుసూక్ష్మమ్।** ఆత్మ ఈ సర్వశరీరములలో సమముగా సూక్ష్మాతి సూక్ష్మస్వరూపమై వేంచేసి ఉన్నది. ఆకాశము కంటే కూడా ఎంతో సూక్ష్మమైనట్టిది.

**తత్ అవ్యయమ్।** ప్రతి ఒక్కని అంతర్యామియగు స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మ మార్పు-చేర్పులు ఏమాత్రము పొందనిది. అవ్యయమైనది. వ్యయము కానట్టిది.

**బ్రహ్మైవ ఇదమ్ అమృతం।** ఈ జగత్తుగా కనబడేదంతా కూడా - అమృతస్వరూపమగు బ్రహ్మమే అయి ఉన్నది.

**బ్రహ్మానందం పరమం దక్షిణేన చ। బ్రహ్మానందం పరమం చ ఉత్తరే చ॥** ఈ సమస్త లోకముల ఉత్పత్తి - స్థితి - లయములకు (లోకములకు మునుముందుగాను, లోకములు నశించిన తరువాత కూడా) ఇక్కడ, అక్కడ, ఇప్పుడు, అప్పుడు ఉన్నదంతా బ్రహ్మానందమే। పరమానందమే। బ్రహ్మమే ఈ దృశ్యమునకు అటు ఉత్తరంగాను, ఇటు దక్షిణంగాను ఆవలగా కూడా ఉండి ఉన్నది.

❖❖❖

ఆత్మను ఎరిగినవాడు స్వాభావికంగా **'అభయుడు'** అగుచున్నాడు. **స్వాత్మన్యేవ స్వయం సర్వం సదా పశ్యతి నిర్భయః।** నిర్భయుడగు ఆత్మజ్ఞాని ఈ జగత్తును స్వయంగా సదా తనయొక్క స్వస్వరూపాత్మరూపంగానే దర్శిస్తూ ఉంటాడు.

***ఆతడు జగత్ వ్యవహారాల దృష్ట్యా బద్ధుడివలె ఉంటూ కూడా, మరొకప్రక్క సమస్తమునకు అతీతుడై, (శరీరముయొక్క రాకపోకలతో సహా) సమస్త లోకసంబంధమైన, దృశ్య సంబంధమైన వ్యవహారములనుండి 'విముక్తుడై' (Al-relieved) ఉంటాడు.***

**శ్లో॥ ఏవం రూపే 'పరావిద్యా', సత్యేన తపసాపి చ**
**బ్రహ్మచర్యాదిభిః భక్తైః లభ్యా వేదాంత వర్త్మనా।**

ప్రతి ఒక్కరి (జగద్దృశ్యమునకు ఆవలిదగు) 'పర' స్వరూపమును (One's own Form which is beyond and mere witness to all this being seen) : - ఎరుగునది ఎట్లా?

⌘ **సత్యమార్గము** (త్రికాలములందు ప్రతి జీవునిపట్ల ఏర్పడి ఉండి కేవలమగు ఉనికి యొక్క **ఉపాశ్రయము**) చేతను,

⌘ **"సత్యము స్వానుభవము కావాలి. అసత్యము జయించబడాలి"** అనే **తపన** రూపమగు **తపస్సు** చేతను,

⌘ బ్రహ్మచర్యము. (బ్రహ్మము గురించిన అధ్యయనము, ఆచరణము) చేతను

⌘ **వేదాంత వర్త్మనా।** వేదాంత సంబంధమైన **వర్తనము** చేతను,

**(వేదము** = తెలియబడునది. **అంతము** = ఆవల।

**వేదాంతము** = తెలియబడుచున్నదంతా తెలుసుకొనుచున్న స్వస్వరూపము (The knower of all that being known) గురించిన వివరణ).

**- అట్టి స్వస్వరూప (వేదాంతరూప) అధ్యయనము చేత పరమాత్మను తనయందే ఈ జీవుడు ఎరుగగలడు. దర్శించగలడు. మమేకమవ గలడు.**

**శ్లో॥ స్వశరీరే స్వయంజ్యోతిః స్వరూపం పారమార్థికమ్,**
**క్షీణదోషాః ప్రపశ్యన్తి। నేతరే మాయయ ఆవృతాః॥**

సత్య తపో బ్రహ్మచర్య వేదాంత వర్తనములచే బుద్ధిలోని అల్ప-దోష దృష్టులు క్షీణించగా, అప్పుడు **సర్వతత్త్వస్వరూపుడగు పరమాత్మను అట్టివారు తమయందే దర్శిస్తున్నారు, స్తుతిస్తున్నారు.**

బుద్ధియొక్క దోషములు తొలగని వారు 'మాయ' చేత ఆవృతులై ఉండటంచేత తమయందే ఉన్న పరమాత్మను దర్శించలేకపోవుచున్నారు.

ఏయోగి అయితే సహజము - కేవలము - స్వాభావికము అగు స్వస్వరూపమునకు సంబంధించిన విజ్ఞానము సంపాదించుకుంటాడో, అట్టి పూర్ణస్వరూపునికి దృష్టియందు లోకములకు సంబంధించిన గమన - ఆగమనములు ఉండవు.

ఏకము సంపూర్ణము అగు ఆకాశము ఎక్కడికీ వెళ్ళటం, ఎక్కడి నుండీ రావటం ఉండనట్లే, **– ఆత్మాకాశమునకు కూడా 'ఇక్కడ నుండి అక్కడికి' అనునది ఉండనే ఉండదు.**

- **అభక్ష్యస్య నివృత్త్యా తు విశుద్ధం హృదయం భవేత్॥** ఎప్పుడైతే ఇంద్రియములు విషయముల నుండి నివృత్తి పొందుచూ ఉంటాయో, అప్పుడిక హృదయము విశుద్ధము పొందుచూ ఉంటుంది.
- **ఆహారశుద్ధే చిత్తస్య విశుద్ధిః భవతిస్వతః ।** ఆహారశుద్ధిచే చిత్తము స్వయముగా విశుద్ధి పొందగలదు. (స్వాత్త్వికాహారము, న్యాయార్జితాహారము, దైవార్పితాహారము, మితాహారము – అనునవి ఆహార శుద్ధి విశేషములుగా చెప్పబడుచున్నాయి)

  **('ఆహారశుద్ధి' – అనబడేదానికి విశేషార్థము:** ఇంద్రియములతో – ఆత్మజ్ఞాన ప్రయోజనముగల విషయములను స్వీకరించటము, అన్యవిషయములను త్యజించివేయటము (లేక) అంతరంగంలో మౌనం వహించి ఉండటము).
- **చిత్తశుద్ధౌ క్రమాత్ జ్ఞానం, త్రుట్యంతే గ్రన్థయః స్ఫుటా॥** చిత్తశుద్ధిచే (నిర్మల దర్పణమునందు దృశ్యమువలె) హృదయ దర్పణమునందు ఆత్మజ్ఞానము స్వభావంగానే సుస్పష్టమై సందర్శనమవగలదు. ఆత్మజ్ఞానము ప్రవృద్ధము అగుచూ ఉండగా దృశ్యానుభవమునకు సంబంధించిన హృదయగ్రంధులు తెగిపోగలవు.

[బ్రహ్మగ్రంధి = **"సృష్టి కల్పించబడినది"** – అనే భావనకు సంబంధించిన చిక్కుముడి.

**విష్ణుగ్రంధి = "ఈ సృష్టి కొనసాగటం ఆవశ్యకం. నేను ఆధారపడి ఉన్నవాడను"** అను భావనా గ్రంధి.

**రుద్రగ్రంధి** = ఈ సృష్టి ఉపసంహారమునకు సంబంధించిన భావనాగ్రంధి. "ఇంకా ఇంకా, ఏవో ఏవో తొలగితేగాని ఆత్మ అనుభవం కాదు" – అనే భ్రమాత్మకమైన చిక్కుముడి]

**సమ్యక్ జ్ఞాని** : ఎవడు ఆత్మదృష్టిని సంపాదించుకొని **సర్వత్రా సమదృష్టిని (సమ్యక్ దృష్టిని)** సంపాదించుకుంటాడో,...అట్టి వాని పట్ల అభక్ష్యము [శాస్త్ర నియమములైనట్టి విధి–నిషేధముల నియమితము (Applicability)] ఉండదు. సమ్యక్ జ్ఞానికి సమస్తము స్వాభావికంగాను, అనునిత్యంగాను "తన స్వరూపమే" అయి, ఆతనిచే బ్రహ్మానందముగా దర్శించబడుతోంది. ఆస్వాదించబడుతోంది.

**అహమ్ అన్నగ్ం॥** పంచేంద్రియములకు విషయములుగా ప్రదర్శనమగుచున్న ఈ దృశ్యజగత్తులోని శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ విషయములన్నిటితో కూడిన జగద్దృశ్యమంతా నాయొక్క స్వయంకల్పితమే॥ కనుక ఇంద్రియ విషయములయినట్టి అన్నము (అనుభవముగా అనుభవమగుచున్నట్టి) – **అంతా నేనే.**

[అన్నము = తినబడునది (అనుభవించబడుచున్నది). (కళ్లకు చూపు, నోటికి రుచి, చర్మమునకు స్పర్శ, చెవికి వినికిడి – మొ॥వి]

**అహం సదా అన్నాదగ్ం॥** ఈ అనుభవమగుచున్న సమస్తము నాయొక్క ఇష్టము చేతనే (స్వకీయ–జఠరదీప్తి చేతనే) ఏర్పడుతోంది. కనుక, ఈ సమస్తమునకు అన్నాదుడను. అనగా, ఉత్పత్తి స్థానమును, అనుభవమును సార్థకపరచువాడను కూడా "నేనే"॥

**[ (అన్నాదమ్ = సమస్తమునకు ప్రదాత. కారణ కారణము. (ఇదంతా నా ఆకలిగా, ఇష్టముగా కలవాడను – నేనే)]**

## బ్రహ్మ వేదనమ్

**బ్రహ్మమును ఎరుగుట బ్రహ్మ వేదనము.** తనను తాను ఈ సమస్తమునకు **'అన్నము'**గాను, **'అన్నాదుడు'**గాను గమనించటము, దర్శించటము, తానే ఉభయము అయి ఉండటమును గమనించటము → **'బ్రహ్మవేదనము'**గా చెప్పబడుతోంది.

**బ్రహ్మవిత్ గ్రసతి జ్ఞానాత్ సర్వం బ్రహ్మాత్మనైవ తు॥** బ్రహ్మమును ఎరిగినవాడు సర్వము బ్రహ్మాత్మకంగాను, స్వస్వరూపాత్మకంగాను ఎరుగుచున్నాడు.

# ఆత్మపురుషుడు

ఎవరికైతే...,

– బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అనబడు చాతుర్వర్ణ్యములు తాను ఆస్వాదించు ఆహారమువంటిదో, 'మృత్యువు' అనునది ఉపసేచనము (ఉపాహారము/పానీయము) వంటిదో,

**అట్టి ఆత్మపురుషుని స్వస్వరూపముగాను, సర్వాత్మకునిగాను ఎరిగినవాడే 'జ్ఞాని' అని చెప్పబడుచున్నాడు.** 'బ్రహ్మము' యొక్క స్వరూపము తెలుసుకున్నవానికి ఈ దృశ్యమంతా కూడా – తాను భోగించు వస్తువు (Subject matter of one's own enjoyable experience) – అగుచున్నదే గాని, బంధముగా కాదు.

ఇంకొక మాట।

ఈ జగత్తు 'ఆత్మ'గానే భాసిస్తూ ఉన్నప్పుడు, ఇక **'ఆత్మకు జగత్తు భోజ్యవస్తువు'** – అనటం మాత్రం ఎట్లా కుదురుతుంది? కుదరదు. మరి? **బ్రహ్మ స్వాత్మతయా నిత్యం భక్షితం సకలం తదా।** బ్రహ్మమే **స్వాత్మస్వరూపమగు ఈ సమస్తమును** తనకు భక్షితము (Consumption)గా కలిగి ఉండి, స్వయముగా ఆనందిస్తోంది. **తనయొక్క తేజోవిభవమునే జగత్తు అనబడు స్వయం కల్పితమును భోజ్యముగా పొందటం జరుగుతోంది.**

బ్రహ్మము తనయొక్క స్వాత్మత్వవికాసముచే నిత్యభక్షితముగాను, నిత్యభక్షితుడుగాను (నిత్యము భక్షించబడునదిగాను, నిత్యము భక్షించువానిగాను) అగుచున్నది. అట్టి ఆత్మ సర్వదా ధ్రువమై, మార్పు చేర్పులకు, సంగతి – సందర్భములకు ఆవలిదై, సాక్షియై, స్పర్శించబడనిజాలనిదై ఉన్నది.

**శ్లో॥ స్వస్వరూపం స్వయం భుక్తే నాస్తి భోజ్యం పృథక్ స్వతః॥**

*ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు స్వస్వరూపమునే 'భోజ్యము'...అగు 'పాంచభౌతిక–పంచేంద్రియ విషయ' జగత్తుగా తనకు వేరైన దానివలె (As if different from his own self) పొందుచున్నాడు.*

"ఈ జగత్తు ఉన్నది" అను భావనకు ఈ జీవుడు పొంది ఉండటానికి కారణం? ఈ జీవుని స్వకీయమైనట్టి "అస్తి" అను **స్వభావము నుండి** బయల్వెడలుచున్నట్టిదే – ఈ జగత్తు కాబట్టి.

(ఆత్మ = "అస్తి" + "భాతి" + "ప్రియము"
"ఉనికి" + "ఎరుక" + "అనుభూతి"
"సత్" + "చిత్" + "ఆనందము"
(I am + knowing + Enjoying)

తరంగములు అనేకం ఉండవచ్చు గాక। జలమే ఉనికి కలిగిఉన్నది. తరంగములకు ఆకారము, పేరు, పొడవు, వెడల్పు మొదలైనవి సత్యము, నిత్యము కాదు కదా। తరంగములు జలముయొక్క నిజస్వరూపంకాదు. జలమే జలముయొక్క నిజస్వరూపము. తరంగముల నిజరూపము జలమే!

అట్లాగే – ఆత్మకే ఉనికి ఉన్నది. భావనాతరంగరూపములగు జగదనుభవములకు అస్తిత్వమెక్కడ? అస్తిత్వము లేని దానికి కర్తృత్వ, భోక్తృత్వము లెక్కడ? జగదనుభవములు ఎవరివో, ఎవరి నిర్వచనములో, **అట్టి 'ఆత్మ' మాత్రమే 'ఉనికి' కలిగి ఉన్నది.**

**అస్తితా లక్షణా సత్తా। సత్తా బ్రహ్మ న చ అపరా।**

ఆత్మకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు. ఇక 'మాయ' అనబడేది మాత్రం – ఆత్మకు వేరైఎక్కడున్నది? మరి 'మాయ' అనబడేది (స్వతఃగా

లేకపోయినప్పటికి) ఎందుకు అనుభవమౌతోంది? ఈ విషయంలో యోగపురుషుల అభిప్రాయం ఈవిధంగా ఉన్నది :-

**యోగినాం ఆత్మనిష్ఠానాం 'మాయ" – స్వాత్మని "కల్పితా"।** ఆత్మనిష్ఠను స్వభావంగా సిద్ధించుకొన్న యోగపుంగవుల దృష్టిలో – **"మాయ" – అనబడేది "స్వస్వరూపాత్మయొక్క స్వయం కల్పిత వినోదము మాత్రమే".** ఇక 'మాయ' – అనబడేది 'బ్రహ్మము' గురించిన జ్ఞానముచే బాధించబడినదై, ఆపై – **"సాక్షి చైతన్యము"** మాత్రమే శేషించుచున్నది. (బంగారు ఆభరణమంతా బంగారమే అయిన తీరుగా) సమస్తము సాక్షి చైతన్యముగా స్వానుభవమగుచుండగా, ఇక మాయ గురించిన చర్చ ఎక్కడ? అద్దానికి చోటెక్కడ?

## బ్రహ్మవాక్।

ఓ వాలఖిల్య, వైశ్రవణ, కామేశ్వర, బ్రహ్మపుత్రులారా!

శ్లో॥ **బ్రహ్మ విజ్ఞాన సంపన్నః ప్రతీతమ్ అఖిలం జగత్**
**పశ్యన్ అపి సదా, నైవ పశ్యతి స్వాత్మనః పృథక్॥**

– బ్రహ్మవిజ్ఞాన సంపన్నునికి ఈ జగత్తంతా స్వాత్మయే।

– **జగత్తు అనబడేది** బ్రహ్మజ్ఞానికి (లేక) తత్త్వజ్ఞానికి – **ఆత్మకు వేరుగా, – ఏమాత్రము కూడా లేదు.**

ఏదేది ఆత్మకు వేరుగా అగుపిస్తూ ఉన్నదో, అదంతా కూడా "యా మా" "మా యా" (లేని'ది') గా శాస్త్రములచే చెప్పబడుతోంది.

కనుక అస్మత్ మానసపుత్రులారా! మీరంతా కూడా। →

- బ్రహ్మజ్ఞానులయ్యెదరు గాక।
- బ్రహ్మమే మీ స్వరూపముగా, మీచే దర్శించబడు గాక।
- నేను కల్పించుచున్న ఈ సృష్టిలో ప్రవేశిస్తున్న స్వయంకల్పిత సాంసారిక బంధముల రూపమగు (దృశ్యసంబంధమైన) దుఃఖములు తొలగటానికై **"జగత్తుగా కనిపించేదంతా స్వస్వరూపమునకు – అనన్యము అగు బ్రహ్మమే"** – అనే గుర్తు ముముక్షువులగు జనులకు ప్రకటించెదరు గాక।

ఇతి పాశుపత బ్రహ్మోపనిషత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 17 భావనోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ స్వావిద్యా పద తత్కార్యం
శ్రీచక్రోపరి భాసురమ్
బిందురూప శివాకారం
రామచంద్రపదం భజే॥



శ్రీ చక్రమునకు ఉపరిగా (పైనగా) భాసించు చున్నట్టిది, బిందురూపము, శివతత్త్వాకారము, ఈ సమస్తము తనయొక్క కార్యరూపముగా కలిగి యున్నట్టిది, స్వాత్మ విద్యా స్వరూపము - అగు శ్రీరామచంద్ర పదము (తత్త్వము)ను భజించుచున్నాము. శ్రీరామచంద్ర-స్వాత్మారాము పదమును ఆశ్రయిస్తున్నాము.

ఓం

1. ఆత్మానం అఖండమండలాకారం
ఆవృత్య, సకల బ్రహ్మాండ మండలం
స్వప్రకాశం ధ్యాయేత్।

**ఆత్మధ్యానము: స్వస్వరూపాత్మను** → సమస్త బ్రహ్మాండ మండలమును ఆవరించి, ఆక్రమించి ఉన్నట్టి **"అఖండ** (Indivisible) **మండలాకారము"** గాను, స్వయం ప్రకాశముగాను భావిస్తూ ధ్యానమును ప్రారంభిస్తున్నాము. (Chanting the "ABSOLUTE SELF" as indivisible form with universal Presentation).

---

శ్రీ గురుః – పరమకారణభూతా శక్తిః।
తేన నవరంధ్ర రూపో దేహః।
నవశక్తి రూపగ్ం శ్రీచక్రమ్।

సమస్తము 'లఘువు' అయి ఉండగా, కేలమగు ఆత్మయే సమస్తమునకు పరాకాష్ఠ - కాబట్టి **'గురువు'**. అట్టి **'సత్'** గురువే సమస్త శక్తి సంపదలకు పరమకారణభూతుడు.

అట్టి శ్రీ గురువగు **పరమకారణభూతము** యొక్క శక్తి చేతనే (ఆత్మశక్తి చేతనే) నవ రంధ్రములతో కూడిన ఈ భౌతిక దేహము నిర్మితమై జీవిస్తోంది. స్పందన సహితమై ఉండ గలుగుతోంది.

ఈ 'విశ్వరచన' అంతా తనయొక్క సంపదగా కలిగియున్న శ్రీచక్రము- '9' శక్తుల రూపంగా ప్రవర్తమానమై ఉన్నది.

---

వారాహీ,
పితృరూపా।
కురుకుళ్ళా।
భేరుండా।
దేవతా, మాతా।
పురుషార్థాః సాగరాః।

అట్టి ఆదిశక్తి స్వరూపిణియే శ్రీ చక్రదేవి. ఇంకా,

- **వారాహీ। మాతృకా రూపిణి.**
- ఈ సమస్తమునకు **పితృ రూపిణి.**
- **కురుకుళ్ళా।** శ్రీ చక్రములో **తేజో రూపిణియై** విలసిల్లుచున్న దేవి.
- **భేరుండ।** (శ్రీచక్ర మేరువులో - 9వ ఆవరణలో 4వ దేవతా స్వరూపిణి).
- దేవతలకు కూడా **జనని.**
- 'ధర్మ-అర్థ-కామ-మోక్షములు'' అనే పురుషార్థములను తరంగములు తనయందు కలిగినట్టి **అనంత సాగర-స్వరూపిణి.**

| | |
|---|---|
| **2. దేహో నవరత్న ద్వీపః।**<br>**[ ఆధార–నవకం ముద్రా శక్తయః (ఇత్యాది)]** | ఈ దేహమే నవరత్నములు కలిగియున్న ద్వీపము.<br>(పంచ ప్రాణములు + అంతరంగ చతుష్టయ).<br>**నవాత్మ గుణములు :** జ్ఞాన, సుఖ, దుఃఖ, ఇచ్ఛ, ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మ, సంస్కారములు.<br>ఆధారము నుండి '9' ముద్రలు, '9' శక్తి స్వరూపములు (నవశక్తి) మొదలైనవి. |
| **'త్వక్' ఆది సప్తధాతుభిః,**<br>**అనేకైః సంయుక్తాః।** | ఈ శరీరములో **సప్తధాతువులు**, (చర్మము, క్రొవ్వు, బొమికలు, రక్తము, మాంసము, మజ్జ, శ్లేష్మము) తోను, ఇంకా అనేక పదార్థ విశేషాల మిశ్రమముగాను నిర్మితమైనది. |
| **సంకల్పాః కల్పతరవః।**<br>**తేజః కల్పక ఉద్యానమ్।** | - ఇందులోని **సంకల్ప పరంపరలే** కల్పవృక్షము.<br>- **తేజస్సు** (మనస్సే) - అనేక కల్పవృక్షముల సమూహముగల కల్పక - ఉద్యాన వనము వంటిది. (భావనల తేజోకిరణములు). |
| **రసనయా భావ్యమానా।**<br>**మధుః ఆమ్ల తిక్త కటు**<br>**కషాయ లవణ రసాః షడృతవః। (షట్ రుచవః)।** | ఇంకా ఈ 'దేహము' మధ్యగా గల నోటితో (షట్ ఋతువుల నుండి) 'మధురము (తీపి), ఆమ్లము (పులుపు), తిక్తము (చేదు), కటువు (కారము), కషాయము (వగరు), లవణము (ఉప్పతనము) - అని రసములు (షట్ రుచులు) సేవించబడుచున్నాయి. |
| **క్రియాశక్తిః పీఠమ్।**<br>**కుండలినీ జ్ఞానశక్తిః గృహమ్।**<br>**ఇచ్ఛాశక్తిః మహాత్రిపుర సుందరీ।** | ఈ శరీరము 'క్రియాశక్తి' (Working energy) వేంచేసి ఆశీనమైయున్న పీఠము. (Workmanship).<br>**'కుండలినీ'** అనే జ్ఞానశక్తికి ఇది నివాస గృహము.<br>అట్టి కుండలినీ - **'ఇచ్ఛాశక్తి'**యే మహాత్రిపుర సుందరీ స్వరూపము. |
| **జ్ఞాతా – హోతా।**<br>**జ్ఞానమ్ – అగ్నిః।**<br>**జ్ఞేయగ్ం – హవిః।** | ***<u>శ్రీచక్ర యజ్ఞము / శ్రీ చక్ర పూజనములో</u>***<br>**జ్ఞాత** (The Knower) = 'హోత' (ఋత్విక్కు - ఋక్కులు, ఋగ్వేదము ఎరిగినవాడు). [ (లేక) సమర్పించువాడు]. - **తెలుసుకొనువాడు.**<br>**జ్ఞానము** (తెలియుటము) (Knowing = 'అగ్ని'. - **తెలుసుకోవటము.**<br>**జ్ఞేయము** (తెలియబడునది) (That being known) = హవిస్సు. (అగ్నిహోత్రమునకు సమర్పించే నేయి, అన్నము మొదలైన రూపమైనవి). - **తెలియబడునది.** |
| **జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయా నామభేద**<br>**(అభేద) భావనగ్ం శ్రీచక్ర పూజనమ్।** | జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములు (The Knower, The knowing, that being known) గా, చెప్పుకోబడే వాటియొక్క **"అభేద భావన"యే (లేక) "ఏకత్వ భావన"యే-"శ్రీచక్ర పూజనము"**. (The Unity in the said Diversity). |
| **నియతి సహిత శృంగారాదయో**<br>**నవరసాః అణిమాదయః।** | నియామకమైయున్నట్టి, (నియమితమై యున్నట్టి) - **శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్సక, రౌద్ర, శాంత (9)** - నవరసములే ఈ దేహములో కనిపించే - (అణిమ, గరిమ, మహిమ, లఘిమ, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛ అనబడే) - **అష్టసిద్ధులు**గా చూడబడు గాక! |
| **కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య**<br>**పుణ్య పాపమయా బ్రాహ్మ్యాత్ అష్ట శక్తయః।** | ఈ శరీరము వెంటగా "కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య, పుణ్య-పాపములనబడే ఈ ఎనిమిది - శరీరములోగల అష్ట శక్తి ప్రదర్శనములు. అట్లాగే ఈ శరీరములో మాతృకలు ఆయా ధర్మములు నెరవేరుస్తున్నారు. (**సప్తమాతృకలు** = బ్రాహ్మీ, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి). (లేక) కాటి, కౌశిక, ఉద్ధత, హవిష, శారిక, ఆర్య, వైధాత్రి. |

**3.** ఆధార నవకం ముద్రాశక్తయః।
పృథివి ఆపః తేజో వాయుః ఆకాశ, శ్రోత్ర త్వక్
చక్షుః జిహ్వా (అ)ఘ్రాణ, వాక్ పాణి పాద పాయు
<u>ఉపస్థ - మనోవికారాః షోడశ (16) శక్తయః।</u>
వచన ఆదాన గమన విసర్గ ఆనంద హాన ఉపాదాన
ఉపేక్షా - బుద్ధయో అనంగకుసుమాది శక్తయో అష్టౌ।

'తొమ్మిది' ఆధార చక్రములు ముద్రా శక్తులు. (సంజ్ఞాక్షర శక్తులు, చిహ్నములు) (చిన్ముద్ర మొదలైనవి).

శరీరములోని షోడశ (16) శక్తులు

**(1) పంచ భూతములు** - పృథివి ఆపః తేజో వాయు ఆకాశములు. (5)

**(2) పంచ జ్ఞానేంద్రియములు** - చెవులు, చర్మము, కళ్లు, నాలుక, ముక్కు(5).

**(3) పంచ కర్మేంద్రియములు** - వాక్కు, చేతులు, కాళ్లు (పాదములు), పాయువు. (మల విసర్జనావయవం), ఉపస్థ (5)

**(4) మనస్సు** - వికారములు (1)

**వాక్కు, ఇచ్చుట, గమనము, వదలటము, ఆనందము, హానము** (నష్టపడటము), **ఉపాదానము** (ప్రతి గ్రహణము) లేక (ఇంద్రియములను మరలించటము), **ఉపేక్ష** - ఇవి ఎనిమిదివిధమైన బుద్ధులు-ఇవి. **అనంగ కుసుమము** మొదలైన "అష్ట శక్తులు". (హృదయాకాశ సంబంధమైన అష్ట శక్తులు).

---

<u>అలంబుసా, కుహూః విశ్వోదరీ</u>
<u>వరుణా, హస్తిజిహ్వా, యశశ్వతీ,</u>
<u>అశ్వినీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ</u>
<u>ఇడా, పింగళా, సుషమ్నా చ</u>
ఇతి చతుర్దశ (14) నాడ్యః।
'సర్వ సంక్షోభిణీ' - ఆది చతుర్దశారగ్ దేవతాః।

**<u>శరీరములోని చతుర్దశ (14) నాడులు:</u>**

(1) అలంబుసా (2) కుహూ (3) విశ్వోదరీ (4) వరుణా (5) హస్తి జిహ్వా (6) యశశ్వతీ (7) అశ్వినీ (8) గాంధారీ (9) పూషా (10) శంఖినీ (11) సరస్వతీ (12) ఇడ (13) పింగళ (14) సుషుమ్న - ఇవి 14 నాడులు.

వీరే శరీరము నందు రక్షణ కలుగజేయు చతుర్దశ దేవతలు - అయి ఉంటున్నారు. **'సర్వ సంక్షోభిణీ చతుర్దశ'** అనబడుచున్నారు.

---

<u>ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన,</u>
<u>నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయా...</u>
ఇతి దశ (10) వాయవః।
సర్వసిద్ధిప్రదాది దేవ్యో
బహిర్దశారగా దేవతాః।।

**<u>పంచప్రాణములు</u>** - (1) ప్రాణము (2) అపానము (3) వ్యానము (4) ఉదానము (5) సమానము

**<u>పంచ ఉపప్రాణములు</u>** - (1) నాగ (2) కూర్మ (3) కృకర (4) దేవదత్త (5) ధనంజయ. ఇవి **దశ ప్రాణ ఉపప్రాణములు.**

ఈ 10 వాయువులు సర్వసిద్ధులు ప్రసాదించగల దేవతలు. "బాహ్య దశార దేవతలు" - అని ఉపాసించబడుచున్నారు.

---

**4.** ఏతత్ వాయు దశక
సంసర్గక ఉపాధిభేదేన
<u>రేచక పూరక శోషక దాహక ప్లావక-</u>
అమృతమితి ప్రాణ ముఖ్యత్వేన
పంచవిధో జఠరాగ్నిః భవతి।

**<u>ప్రాణముఖ్యత్వేన - పంచవిధ జఠరాగ్నులు</u>**

అటువంటి పంచ ప్రాణ వాయు - పంచ ఉపప్రాణముల 'దశకము' యొక్క సంసర్గికమైన ఉపాధి భేదంచేత (Physical formations by virtue of mix up of 10 prana energies) (1) **రేచకము** (ఖాళీచేయటము) (2) **పూరకము** (నింపటము) (3) **శోషకము** (ఇంకించివేయు శక్తి) (4) **దాహకము** (అగ్ని - కాల్చటము) (5) **ప్లావకము** (బాహ్య-అభ్యంతరములలో ప్రవహించు తత్త్వము, తడుపటము)గా (శరీరంలో) అమృతమగు ముఖ్య ప్రాణము అగుచున్నది. ఇవి పంచవిధ జఠరాగ్ని రూపములు, దశవిధ ప్రాణశక్తులు- ఆయా సమ్మేళనములుగా అగుచు, దేహములో ఆయా కార్యములు నిర్వర్తిస్తున్నాయి.

| | |
|---|---|
| క్షారక ఉద్గారకః క్షోభకో మోహకో జృంభక<br>– ఇతి "అపాన" ముఖ్యత్వేన పంచవిధో అస్తి। | **అపాన ముఖ్యముచే పంచ విధములు**<br>అపాన ముఖ్యత్వముచే (1) **క్షారకము** (ఆకలి) (2) **ఉద్గారకము** (త్రేణుపు, వెడల కక్కటము) (3) **క్షోభకము** (కలత కలిగించునది) (4) **మోహకము** (మోహింపజేయునది) (5) **జృంభకము** (ఆవులింత) - అనే పంచవిధ ధర్మములు శరీరంలో కలుగుచున్నాయి. |
| తేన మనుష్యాణాం మోహకో, దాహకో,<br>భక్ష్య భోజ్య లేహ్య చోష్య<br>పేయాత్మకం చతుర్విధం<br>అన్నం పాచయతి ఏతా। | మనుష్యులయొక్క అట్టి మోహక-దాహక చర్యల వలన నోరుద్వారా శరీరములో ప్రవేశించిన భక్ష్య (చప్పరించి తినునది), భోజ్య (నమిలి తినునది) లేహ్య (నాకి మ్రింగునది) చోష్య (పీల్చబడునది) అగు చతుర్విధ ఆహారములు పచనమై, శరీరమునకు చలనశక్తి ప్రసాదిస్తున్నాయి. |
| (ఏతా) దశ వహ్నికలాః సర్వజ్ఞత్వాది<br>అంతర్దశారగా దేవతాః। | ఈవిధంగా '10' విధములైన అగ్నులకు సర్వశక్తి రూపిణులు అయినట్టి 10 మంది **అంతర్దశార దేవతలు దేహంలో వేంచేసి ఉన్నారు.** |
| శీత ఉష్ణ సుఖ దుఃఖ ఇచ్ఛా,<br>సత్త్వ రజః తమోగుణా<br>వశిన్యాది శక్తయో అష్టౌ। | ఈ దేహములో శీత-ఉష్ణ, సుఖ-దుఃఖ, ఇచ్ఛా-ద్వేష, సత్త్వ రజో తమోగుణములతో సుసంపన్నము చేయటానికై **వశిని** మొదలైన అధిష్ఠాన దేవతలు ఎనిమిదిమంది క్రియాశీలురై ఉండి ఉంటున్నారు.<br>(వశిని - ఆది వాగ్దేవతలు). |
| 5. శబ్ద స్పర్శ రూప రస గంధాః<br>– పంచ తన్మాత్రాః।<br>– పంచ పుష్ప బాణాః।<br>మన – ఇక్షుధనుః।<br>వశ్యో – బాణో।<br>రాగః – పాశో।<br>ద్వేషో – అంకుశః। | ***ఈ శరీరంలో ఇంకా →***<br>**పంచతన్మాత్రలు** - (1) శబ్దము (2) స్పర్శ (3) రూపము (4) రసము (5) గంధము. ఈ ఐదు కూడా ఐదు పుష్ప బాణములు.<br>**మనస్సు** → ఇక్షు (చెఱకుగడ) ధనస్సు.<br>**వశముచేసుకోవటం (వశిని)** → బాణము.<br>**రాగము** (అనురాగము) → పాశము<br>**ద్వేషము** → అంకుశము. |
| అవ్యక్త మహత్తత్త్వ అహంకారాః।<br>కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలిన్యో<br>అంతః త్రికోణాగ్రగా దేవతాః। | ***అంతరమున త్రికోణాగ్ర దేవతలు -***<br>**(1) అవ్యక్తము (2) మహత్ తత్త్వము (3) అహంకారము.**<br>- వీరే (1) కామేశ్వరి (2) వజ్రేశ్వరి (3) భగమాలిని అనే అంతః త్రికోణాగ్ర-గాన - దేవతలు. |
| పంచదశ తిథిరూపేణ<br>కాలస్య పరిణామావలోకన స్థితిః<br>పంచదశ నిత్యాః<br>శ్రద్ధానురూపా ధీర్దేవతా। | 15 తిథులు (శుక్ల-కృష్ణపక్ష తిధులు) - రూపంగా కాల పరిణామము అవలోకనము పొందుతూ ఉన్నది.<br>వారే పంచదశ (15) నిత్యలు. (నిత్యదేవతలు).<br>'శ్రద్ధ' అనే రూపముగా ఉన్నది ధీ (బుద్ధి) దేవత. |
| తయోః కామేశ్వరీ సదానంద ఘనా<br>పరిపూర్ణ స్వాత్మైక్యరూపా దేవతా లలితా। | ***ఈ సమస్త జీవుల దేహములలో దేవతలు -***<br>కామేశ్వరి, సదానంద ఘన పరిపూర్ణ, స్వాత్మ ఐక్యరూపిణి అగు పరదేవతయే - **సమస్తము తానే అయి విరాజిల్లుతోంది. సమస్త దేవతలు ఆ కామేశ్వరీదేవీ అంశయే.** ఇదంతా కూడా **'పరిపూర్ణ' అగు కామేశ్వరీదేవీ - సంప్రదర్శనమే. స్వ-ఆత్మ-ఐక్యదేవతయే శ్రీలలిత.** |

| | |
|---|---|
| 6. 'సలిలమ్' ఇతి సౌహిత్య కరణగ్ం "సత్త్వమ్"।<br>"కర్తవ్యమ్, అకర్తవ్యమ్" – ఇతి<br>భావనాయుక్త – "ఉపచారః"।<br>'అస్తి–నాస్తి' ఇతి కర్తవ్యతా "అనూపచారః"। | **అట్టి లలితా పరాభట్టారిక గురించిన పూజ, సన్నుతి।**<br>సౌహిత్య (స్నేహపూర్వకమైన, తృప్తితో కూడిన) సాత్త్విక **కరణములు, ప్రవర్తన** కలిగి ఉండటమే - **సలిలము**, (జలసమర్పణ), **జలాభిషేకము.**<br>''ఇది కర్తవ్యము - ఇది అకర్తవ్యము (ఇది చేయవలసినది, ఇది చేయవలసినది కాదు)'' - అను భావనలే **ఉపచారము (సన్న్యాసము).**<br>అస్తి-నాస్తి (ఉన్నది-లేదు) అను చర్చ - విమర్శలు **"అనూపచారము"** (అసన్మానము). |
| బాహ్య–అంతఃకరణానాం<br>రూపగ్రహణ యోగ్యతా స్థితి – "ఆవాహనమ్"। | అంతఃకరణము బాహ్యమున రూపమును గ్రహించు యోగ్యతా స్థితియే- ఆత్మదేవునిపట్ల **''ఆవ్హానము''**. సాకారమైనదంతా నిరాకార చేతనతత్త్వముగా భావించటము **'ఆవాహనము'**. |
| తస్య బాహ్య–అంతఃకరణానామ్<br>ఏకరూప గ్రహణమ్ "ఆసనమ్"। | ఆత్మ తాను ఏకరూపమై కూడా, అనేకమగు వినటము, చూడటము, చెప్పటము, స్పర్శ మొదలైనవి బాహ్య-అంతఃకరణములను (ఇంద్రియములను) పొందుచుండుటయే **'మనస్సు'** (మానసము). |
| రక్త శుక్ల పద ఏకీకరణం "పాద్యమ్"। | రక్త-శుక్ల పద ఏకీకరణమే ఆ లలితా పరాభట్టారిక (లేక) ఆత్మదేవికి సమర్పించే **'పాద్యము'** (పాదప్రక్షాళనము).<br>(రజో-తమో ఏకీకరణమే పాద ప్రక్షాళనము). |
| ఉజ్జ్వలత్ ఆమోదానంద "ఆసన" –<br>దానమ్ – "అర్ఘ్యమ్"। | హృదయపీఠముపై ఉజ్వలమగు 'ఆమోదము'తో కూడిన ఆసనదానము (స్థానము ఆశ్రయించటమే) **'అర్ఘ్యము'**.<br>(తనలో ఆత్మ ఎక్కడున్నదో ఎరిగి ఉండటమే అర్ఘ్యము). |
| స్వచ్ఛం స్వతఃసిద్ధమ్ ఇతి "ఆచమనీయమ్"।<br>చిత్ చంద్రమయీ సర్వాంగ స్రవణగ్ం "స్నానమ్"। | స్వతఃసిద్ధమైన స్వచ్ఛతయే **"ఆచమనీయము"**.<br>సర్వాంగముల చలనము-ప్రవర్తనములను చిత్ (ఎరుక) - అను చంద్రకిరణమయంగాను, సర్వాంగాల విషయములను ప్రణవముగా (పూర్ణాత్మగాను) భావించటము - **"స్నానము"**. |
| చిదగ్ని స్వరూప పరమానంద శక్తి<br>స్ఫురణం – "వస్త్రమ్।" | **"చిదగ్ని"** (The Enlightenment of Knowing) స్వరూపమగు "పరమానందము'' అనే శక్తికి సంబంధించిన 'స్ఫురణ'యే - దేవదేవికి (ఆత్మదేవికి) సమర్పించే **'వస్త్రము'**. |
| ప్రత్యేకగ్ం సప్త వింశతిధా (27)<br>భిన్నత్వేన ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మక<br>బ్రహ్మగ్రంథి మద్రస తంతు<br>బ్రహ్మనాడీ, "బ్రహ్మసూత్రమ్।" | **బ్రహ్మనాడియే బ్రహ్మ సూత్రము.**<br>ఒకదానికంటే మరొకటి ప్రత్యేకమయినది - అయినట్టి 27 తత్త్వములతో కూడుకొని ఉన్నట్టిది, అనేక విభిన్నత్వములతో కూడిన ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకమైనది-అయినట్టి **'బ్రహ్మనాడి'యే బ్రహ్మసూత్రము.** |
| స్వ వ్యతిరిక్త వస్తు సంగరహిత<br>స్మరణమ్ – విభూషణమ్। | స్వస్వరూపము కంటే వేరైన వస్తువులతో "సంగరహితము''గా అభ్యాసమే **"విభూషణము"**. సమస్తము స్వస్వరూపముగా దర్శించటమే **ఆభరణము.** |
| సత్సంగ పరిపూర్ణతా<br>అనుస్మరణమ్– "గంధః।" సచ్ఛంఖ<br>(సత్–శంఖ) (పరిపూరణానుస్మరణమ్–ఇతి పాఠాంతరమ్)<br>సమస్త విషయాణాం<br>మనసః స్థైర్యేణ అనుసంధానం కుసుమమ్। | **ఆత్మ పూజలో...,**<br>సత్సంగముతో కూర్చబడినట్టి ఆత్మ గురించిన అనుస్మరణమే **ఆత్మదేవునికి సమర్పించే గంధము.**<br>**'సత్'** అనే శంఖమును పూరించటము (లేక), **సత్-శంఖ పరిపూర్ణ - అనుస్మరణము**, సమస్త విషయములను మనస్సుతో ధైర్య-స్థైర్యములతో అనుసంధానము చేయటము - ఇవియే భగవానునికి **పుష్ప సమర్పణ.** |

| | |
|---|---|
| 7. తేషామ్ ఏవ సర్వదా స్వీకరణం – "ధూపః।" పవన అవచ్ఛిన్న ఊర్ధ్వ జ్వలన సత్–చిత్ ఉల్కాకాశ దేహో "దీపః।" | **మనస్సు వరకే ఈ జగత్తును స్వీకరించటము - ధూపము.** ఉచ్ఛ్వాస-నిశ్వాసలతో ఊర్ధ్వంగాను, అవిచ్ఛిన్నంగాను జ్వలిస్తున్న (వెలుగుచున్న) 'సత్-చిత్-ఆనంద దేహమే' దీపము. ఉల్కాకాశమున ఆనందమయ ఆత్మ- దేహధారణచేయుచున్నాను' - అను భావనయే ఆత్మ భగవానుని సమక్షంలో **'దీపము'. సాక్షాత్ దీపదర్శనము.** |
| సమస్త యాత – అయాత వర్జనం "నైవేద్యమ్।" | దేహములు, లోకములకు సమస్త యాత-ఆయాతములకు (రాక-పోకలకు) సంబంధించిన వ్యవహారశీలమంతా అధిగమించి ఉండటమే **"నైవేద్యము".** |
| అవస్థాత్రయ – ఏకీకరణం "తాంబూలమ్।" | జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు తనవైన ఏకాత్మ స్వరూపములో (తురీయములో) ఏకత్వము వహించి ఉండటము - **"తాంబూలము".** |
| మూలాధారాత్ – ఆ బ్రహ్మరంధ్ర పర్యంతమ్, బ్రహ్మరంధ్రాత్ – ఆమూలాధార పర్యంతమ్ గత–ఆగత రూపేణ "ప్రాదక్షిణ్యమ్।" | "మూలాధారము" నుండి "బ్రహ్మ రంధ్రము" వరకు, బ్రహ్మరంధ్రము నుండి (తిరిగి) మూలాధారము వరకు, నిర్వర్తించు (యోగాభ్యాసమునకు సంబంధించిన) - రాక పోకలే **"ప్రదక్షిణము".** |
| తురీయావస్థా – "నమస్కారః।" | జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు ఆవలి 4వ అవస్థ (తురీయావస్థ) యొక్క ధారణయే **నమస్కారము.** |
| దేహశూన్య ప్రమాతృతా – నిమజ్జనమ్ – "బలిహరణమ్।" | ఈ భౌతిక దేహమును 'నిర్విషయము' గాను, 'శూన్యము'గాను భావించి అట్టి శూన్యత్వములో 'నిమజ్జనము' అయి ఉండటమే **'బలిహరణము'.** |
| "సత్యమ్ అస్తి" – కర్తవ్యమకర్తవ్యమ్ ఔదాసీన్య నిత్యాత్మవిలాపనగ్ం "హోమః।" | సమస్త 'ఉనికి'లను, 'లేము'లను, కర్తవ్య - అకర్తవ్యములను ఉదాసీనము (Unmindful, quietly beyond) గా దర్శిస్తూ, **నిత్యము ఆత్మగురించిన విలాపనము (గానము)**ను నిర్వర్తించటము - **"హోమము".** |
| స్వయం తత్ పాదుకా నిమజ్జనం – "పరిపూర్ణధ్యానమ్।" | స్వయముగా జగన్మాతయొక్క పాదుకలయందు (పాదో అస్య విశ్వాభూతాని) - (మనో బుద్ధుల) నిమజ్జనము - **"ధ్యానము".** |
| ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్య సిద్ధిః॥ | ఈవిధంగా పరమాత్మయందు మూడు ముహూర్తముల కాలము నిశ్చలమైన "భావన" కలిగి యున్నంత మాత్రంచేతనే - అట్టి వానికి **"దేవతా-ఆత్మైక్య స్థితి"** సిద్ధించగలదు. |
| చింతిత కార్యాణి అయత్నేన సిద్ధ్యంతి। స ఏవ 'శివయోగి' ఇతి కథ్యతే। | అనుకున్న కార్యములన్నీ అప్రయత్నంగా (అయత్నేన) సిద్ధించగలవు. అట్టి (ఏక-అఖండ ఆత్మ) భావన కలిగియున్నవాడు "శివయోగి"- అగుచున్నాడు. |
| 'కా' ది 'హా' ది మత ఉక్తేన భావనా ప్రతిపాదితా జీవన్ముక్తో భవతి– – య ఏవం వేద। – ఇత్యుపనిషత్॥ | "కా" ది మత (కర్మ యోగ మార్గం)గాను, 'హా' ది మత (జ్ఞాన యోగ మార్గం) గాను ఎవడు ఈ భావనోపనిషత్ ప్రతిపాదిస్తున్న ఆత్మయొక్క రూపమును తెలుసుకుంటూ, భావన చేస్తూ, ఉపాసిస్తూ ఉంటాడో, అట్టివాడు "జీవన్ముక్తుడు"- అగుచున్నాడు. |

<u>*భావనోపనిషత్ సమాప్తా*</u>

<u>*ఓం శాంతిః శాంతిః శాంతిః*</u>

<u>***ఇతి భావనోపనిషత్***</u>

<u>***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***</u>

అధర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 17 భావనోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**"శ్రీచక్రము"** యొక్క ఉపరిగా (ఆవలగా) విస్తరించి **భాసిస్తూ ఉన్నట్టిది, బిందురూపము, శివతత్త్వ జ్ఞానరూపము,** సమస్త సృష్టికి **ఆదికారణము,** – అగు **"పరతత్త్వ శ్రీమాతకు"** నమస్కారము. అట్టి ఆత్మారామము (లేక) శ్రీ రామబ్రహ్మము–అనబడు అద్దానిని సర్వదా ఉపాసించుచున్నాము.

'ఆత్మ' యే సర్వజీవులకు పరాకాష్ఠ అగు **ఆరాధ్య వస్తువు.** ఎందుచేత? అందరికీ కూడా **'ఆత్మ' యే సహజముగాను, అనునిత్యముగాను 'స్వభావరూపము'** కాబట్టి. ఆత్మధ్యానము అనగా **"అనన్యము, సహజము అగు స్వస్వరూప ధ్యానమే"** – అవుతుంది. సమస్తమునకు **ఆవలిది, ఆది** అగు **'ఆత్మ'**యే ఈ సమస్తమునకు ఆధారము. అనేకముగా అనుభవమగుచూ కూడా 'ఏకమే' అయి ఉన్నట్టిది 'ఆత్మ'.

***అట్టి ఆత్మను ఉపాసించేది ఎట్లా? (1) తెలుసుకోవటము, (2) భావించటము – అందుకు ఉపాయం.***

*'భావన' ద్వారా 'భావించువాడు' అగు స్వస్వరూపాత్మను ఆశ్రయించి ఉండటమే భావనోపనిషత్.*

---

→ **ఆత్మ**యే సమస్త బ్రహ్మాండ మండలముగా సమస్తమును **ఆవరించి ఉన్నది.**

→ అట్టి ఆత్మ **స్వయంప్రకాశకము.** అందుచేత అద్దానిని చూడటానికి మరొక ప్రకాశింపజేయు వస్తువుతో పని ఉండదు.

**గురువు: ఆత్మైవ హి గురుః।** 'ఆత్మ' యే **'గురువు'**. ఆత్మకు 'అన్యము'గా కనిపించేదంతా కూడా కల్పనామాత్రము, ఊహా–సందర్భ పరిమితము. కాబట్టి **"లఘువు"**. అట్టి 'గురువు' అగు ఆత్మ సమస్త జీవుల సహజమగు స్వస్వరూపమై, సమస్త శక్తి సంపదలకు కారణభూతమై ఉన్నది. **శ్రీ గురుః పరమ కారణ భూతా శక్తిః।**

అట్టి 'శ్రీ గురువు' అగు ఆత్మ భగవానుని యొక్క శక్తి ప్రదర్శనమే **"నవ రంధ్రములతో కూడిన ఈ పంచభూత నిర్మిత భౌతికదేహము"** కూడా. అట్టి శ్రీ గురువే–సమస్తము తనకు చెందినదే అయి ఉండటంచేత– **"నవశక్తి రూప శ్రీచక్రము"** అని కూడా అభివర్ణితము అవుతోంది.

(**నవశక్తి = నవాత్మలు =** జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ, సర్వాత్మలు).

(**నవరంధ్రములు =** 2 కళ్లు, 2 చెవులు, 2 ముక్కు రంధ్రములు, నోరు, గుహ్యము, గుదము, బ్రహ్మరంధ్రము).

అట్టి నవశక్తి రూపిణియగు **'శ్రీచక్ర దేవత'** అనబడే ఆత్మదేవియే ఇక్కడ **'ప్రకృతి-పురుష", "అనుభవ-అనుభవి", "దృశ్య-ద్రష్ట", "క్షేత్ర-క్షేత్రజ్ఞ"** - ఇత్యాది రూపములుగా కనపడుతోంది. విశ్వమంతా తన '9' శక్తుల ప్రదర్శనగా వెలయుచున్నది. సమస్త 'భావన'లకు తానే కారణమగుచున్నది. సముద్ర జలంనుండి తరంగములవలె, ఈ జగత్ దృశ్యములు ఆత్మదేవత నుండియే భావనాతరంగములుగా బయల్వెడలటము, సంచరించటము, లయించటము జరుగుతోంది. అట్టి **నవశక్తీ - శ్రీచక్రదేవి** ఇంకా ఇట్లా వర్ణించబడుతోంది.

**"వారాహీ"** → మాతృకా రూపిణి. సమస్త బ్రహ్మాండములకు, అందలి లోకములకు జననస్థానము. **కేవలమగు - అహంకార** తత్త్వరూపిణి. (The Sense of 'I' at its 'Absolute Form').

**పితృరూపా** → ఆత్మస్వరూపిణియగు శ్రీచక్ర దేవతయే సమస్తమునకు రక్షణను ప్రసాదిస్తూ ఉండటంచేత - **'పితృరూపిణి'.**

**కురుకుళ్ళా** → భక్తజనులు ఉపాశించే శ్రీచక్రములో తేజోరూపిణి అయి విలసిల్లటంచేత **'కురుకుళ్ల'.** జ్ఞానప్రదాత కాబట్టి 'కురుకుళ్ల' - సార్ధకనామధేయము.

**భేరుండా** → **శ్రీచక్రములో** (9వ ఆవరణలో 4వ) **దేవతా స్వరూపిణి.** పట్టుదలకు, మొండితనమునకు, ఏకాగ్రతకు చిహ్నము.

**దేవతామాతా** → మాతృకా స్వరూపిణి. శ్రీచక్ర స్వరూపిణి అగు ఆత్మదేవదేవి. 'దేవతలకు కూడా జననస్థానము. దేవతలకే తల్లి"!

**పురుషార్థాః సాగరాః** → ఆత్మకు 'సంజ్ఞ'యగు శ్రీచక్రమే - చతుర్విధ పురుషార్థములను (ధర్మ, అర్ధ, కామ, మోక్షములను) తన సాగర స్వరూపమునందు పడిలేచే తరంగాలవలె కలిగి ఉన్నట్టిది. శ్రీమాతయే. చతుర్విధ పురుషార్ధ సాగర స్వరూపిణి. (పురుషార్థములు - 'ధర్మము'ను నిర్వర్తించి, 'దైవీ సంపద, జ్ఞానగుణములు' అనే అర్థమును సంపాదించి, 'లక్ష్యశుద్ధి' అనే కామముతో "నాకు సంబంధమే లేదు" - అనే విముక్తి రూపమగు మోక్షము సిద్ధింపజేసుకోవటము.

---

## దేహము - నవరత్న దీపము

***ఈ దేహమే ఒక నవరత్న దీపము.***

| | | | |
|---|---|---|---|
| I. | బాహ్యమున పంచభూతములు | | (5) + (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము). |
| | అంతరమున మనో బుద్ధి చిత్తాహంకారాలు (అంతరంగ చతుష్టయం) | | (4) (మననము, ధ్యాస, ఇష్టము, వ్యష్టిత్వము) |
| | | | (9) - అనే నవరత్నములు |

| | | | |
|---|---|---|---|
| II. | (1) దేహత్రయము - | స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము | (3) |
| | (2) అవస్థా త్రయము - | జాగ్రత్, స్వప్నము, సుషుప్తి | (3) |
| | (3) ఆత్మ త్రయము - | జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ | (3) |
| | | ఈవిధంగా కూడా ఈ దేహము నవరత్న దీపము | (9) |
| III. | మాతృకా త్రయము | 'అ' 'ఉ' 'మ' | 3 |
| | గుణత్రయము | సత్త్వ రజో తమో | 3 |
| | స్థాన త్రయము | విశ్వుడు, తేజసుడు, ప్రాజ్ఞుడు | 3 |
| | | | 9 |
| IV. | నవ ముద్రలు | 'ఆధారము' మొదలైన తొమ్మిది ముద్రలు. ఇవి తొమ్మిది శక్తి స్వరూపములు. చిన్ముద్ర మొదలుగా నవముద్రలు. నవావరణలు. | |

***ఈ శరీరము*** →

**సప్తధాతువులు = చర్మము, కొవ్వు, మాంసము, బొమికలు, రక్తము, మజ్జ, శ్లేష్మము** కలిగి ఉన్నది.

ఇంకా కూడా పాంచభౌతిక, అమ్ల – క్షార మిశ్రమములు అనేకము కలిగి ఉన్నది.

ఈ శరీరము సంకల్పములకు (Ideations, Assumptions, Pressumptions) కు **కల్పతరువు** (ఏది కోరుకొంటే అది ప్రసాదించే స్వర్గలోక వృక్షము) వంటిది.

అటువంటి అనేక **కల్పవృక్షములు గల ఉద్యానవనము – 'మనస్సు'.** అట్టి **మనస్సు – ఆత్మయొక్క తేజోరూపమే।**

ఈ శరీరంలోని నోరు రుచి ఆస్వాదిస్తూ 'షట్ రుచులు' అనబడే – మధురము (తీపి), ఆమ్లము (పులుపు), తిక్తము (చేదు), కటువు (కారము), లవణము (ఉప్పతనము), ఆస్వాదిస్తోంది.

ఈ శరీరంలో కూడా వసంత ఋతువు, గ్రీష్మ ఋతువు, శశిర ఋతువు, శరదృతువు, హేమంత ఋతువు, వర్ష ఋతువులు – అనే ఆరు ఋతువులు ఉన్నాయి.

## క్రియాశక్తి :

అట్టి ఈ భౌతిక శరీరము చూడటం, వినటం, వాసన ఆస్వాదించటం, స్పర్శ, రుచి, మాట్లాడటం, నడవటం మొదలైన అనేక క్రియా నిర్వర్తనలకు శక్తి పీఠము వంటిది. ఈవిధంగా శరీరంలో "క్రియాశక్తి" – పీఠం వేసుకొని ఉన్నది.

## కుండలినీశక్తి :

ఇంకా ఈ శరీరంలో **"కుండలిని"** – అని పిలువబడే **"ఇచ్ఛా – క్రియా – జ్ఞాన" త్రిశక్తి రూపమగు ఏకశక్తి ఉన్నది.** అట్టి ఈ కుండలినీ శక్తి **ఇంద్రియ విషయములవైపుగా** దీక్ష – ధ్యాస కలిగి ఉన్నపుడు **'కుండలినీ నిద్రాస్థితి'** – అని, (మరియు) (ఇచ్ఛా జ్ఞానక్రియా – ఇంద్రియముల నియామకుడగు **ఆత్మపురుషుని** వైపుగా దీక్ష–ధ్యాస కలిగి ఉంటే **"కుండలినీ జాగృత్"** అని చెప్పబడుతోంది. ఈ కుండలినీ శక్తియే దేహములోని ఇచ్ఛాశక్తి రూపమగు **"మహాత్రిపుర సుందరీ"** స్వరూపము.

| |
|---|
| **శ్రీచక్రము :** కేవలము, పరమప్రశాంతము, బ్రహ్మానందమయము, ఏకము, సర్వాతీతము అగు ఆత్మ తనయొక్క కేవలమౌన స్వభావమును వీడకయే, – అన్యమును కల్పించుకొని, పరిపోషించుకొని తిరిగి లీలగా ఆ అన్యమునంతా తనయందు అనన్యముగా లయము చేయు చమత్కారము – **శ్రీచక్రము.** |

***"శ్రీచక్రోపాసన" అనే "యజ్ఞము" లో*** →

**జ్ఞాతయే** (తెలుసుకొనువాడు) → హోత (ఋత్విక్కు).

**జ్ఞానము** (తెలుసుకోవటము) → అగ్ని.

**జ్ఞేయము** (తెలియబడునది) → హవిస్సు.

**శ్రీచక్ర పూజనము** = (1) జ్ఞాత (2) జ్ఞానము (3) జ్ఞేయము (The knower, The knowing and All that being known) లను అభేదరూపము గాను, శ్రీచక్ర స్వరూపమగు పరమాత్మకు "అనన్యము"గాను, 'ఆత్మ–భావన'ను అనుక్షణికంగా ఆశ్రయిస్తూ, **స్వాభావికంగా అయ్యే వరకు** ధారణ చేస్తూ ఉండటమే **'శ్రీ చక్రపూజనము'.**

**నవరసములు :** ఈ శరీరములో **"శృంగారము, వీర్యము, కరుణ, అద్భుతము, హాస్యము, భయానకము, భీభత్సము, రౌద్రము, శాంతము"** – అనబడే నవరసములు ప్రదర్శితమౌతూ ఉంటున్నాయి.

**అణిమ - గరిమ - మహిమ - లఘిమ - ఈశిత్వ - వశిత్వ - ప్రాకామ్య - ఇచ్ఛ** అష్టసిద్ధుల విశేషములు కూడా ఇందులో భావరూపమై ఉన్నాయి..

**సప్తమాతృకలు :** ఇందులో బ్రాహ్మీ, మహేశ్వరి, కౌమారి, వారాహి, వైష్ణవి, ఇంద్రాణి, చాముండి - అనే సప్త మాతృకలు ఉనికి. వారు శరీరములోని అనేక రసతత్త్వములకు పరిపోషకులు, అయి ఉంటున్నారు. ప్రేమాస్పదులై ప్రాకృత శరీరమును తమ ప్రభావముచే - పరిరక్షకులుగా అగుచున్నారు.

**అష్ట శక్తి ప్రదర్శనములు :** (1) కామము (2) క్రోథము (3) లోభము (4) మోహనము (5) మదము (6) మాత్సర్యము (7) పుణ్యము (8) పాపము - ఇవి శరీరంలోని బ్రహ్మీ - సంబంధమైన అష్టశక్తి ప్రదర్శనములు.

**ఆధారనవకం :** '9' ఆధారములు, ముద్రశక్తులు ఈ దేహములో నిక్షిప్తమై ఉన్నాయి. (బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, సత్త్వ రజో తమో గుణములు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు).

ఇంకా ఇందులో...,

**పంచభూతములు :** పృథివి ఆపః తేజో వాయు ఆకాశములు = (5) (Solid, Liquid, Head, Vapour, Space)

**పంచ జ్ఞానేంద్రియములు :** శ్రోత్రము (చెవులు), త్వక్కు (చర్మము, స్పర్శ), చక్షువులు (కళ్లు, చూపు), జిహ్వా (రుచి, మాట), ఘ్రాణము (వాసన) = (5)

**పంచ కర్మేంద్రియములు :** వాక్కు, పాణి (చేతులు), పాదము (కాళ్లు), పాయువు, ఉపస్థ = (5)

**మనస్సు :** ఆలోచన, భావాలు = (1)

ఇవన్నీ కలిపి షోడశ (16) శక్తులు.

**అనంగ కుసుమ ఆదిశక్తులు : అనంగము** (హృదయము) అనే పుష్పముయొక్క పుష్పదళములు. **(1) వాక్కు (2) ఆదానము** (ఇవ్వటము) **(3) గమనము (4) వదలటము (5) ఆనందము (6) హానము** (నష్టపడటము/వదలటము) **(7) ఉపాదానము** (ప్రతి గ్రహణము) ఇంద్రియములను విషయములనుండి మరలించటము. **(8) ఉపేక్ష** (పట్టించుకోకపోవటము) - ఇవన్నీ బుద్ధి యొక్క **"అష్ట-అనంగ కుసుమములు.**

**చతుర్దశ నాడులు :** ఈ శరీరములోని 14 నాడులు. ఇవన్నీ **'మూలాధార చక్రము'** నుండి బయల్వెడలుచున్నాయి.

**(1) అలంబుసా :** గుద (మల విసర్జన) స్థానము వరకు విస్తరించి ఉండే 'నాడి'.

**(2) కుహూ :** మర్మాయవము వరకు వెళ్లుచుండే నాడి.

**(3) విశ్వోదరి :** పొట్టలోని 'అన్నకోశము' వరకు (వైపుగా) పోవుచుండే 'నాడి'.

**(4) వరుణా :** కొమ్మ-ఉప కొమ్మలవలె శరీరమంతా వ్యాపించి ఉండే నాడి.

**(5) హస్తి జిహ్వా**

**(6) యశశ్విని** | : కుడి-ఎడమ పాదముల బొటనవ్రేలు వరకు విస్తరించి ఉండే నాడులు.

**(7) హస్విని**

**(8) శంఖిని** | : కుడి-ఎడమ చెవుల వరకు ఏర్పడి ఉంటున్న నాడులు.

**(9) గాంధారి**

**(10) పూషా** | : కుడి-ఎడమ కనులు, కంటి పాపల వరకు విస్తరించి ఉండే నాడులు.

**(11) సరస్వతీ :** రసేంద్రియమును (నాలుకను) చేరుచున్న **నాడి.**

**(12) ఇడ :** ఎడమ ముక్కు వరకు విస్తరించు **నాడి.**

**(13) పింగళ :** కుడి ముక్కు వరకు వెళ్ళుచుండే **'నాడి'.**

**(14) సుషుమ్న :** మూలాధారమునుండి బ్రహ్మ రంధ్రము వరకు, అక్కడినుండి సహస్రారము వరకు పైపైకిపోవు **'నాడి'.**

-----

ఈ దేహములో దశవిధ వాయువులు అనునిత్యము సంచారము నిర్వర్తిస్తూ, ఈ జడ దేహమును అనునిత్యము ఉజ్జీవింపజేస్తున్నాయి.

**పంచ ప్రాణములు :** (1) (ముఖ్య) – ప్రాణము, (2) అపాన ప్రాణము, (3) వ్యాన ప్రాణము, (4) ఉదానప్రాణము, (5) సమాన ప్రాణము. ఇవి హృదయము, గుదము, శరీరమంతటా, కంఠము, నాభి ప్రదేశములలో ముఖ్య స్థానము కలిగి ఉండి శరీరములో ప్రవర్తిస్తున్నాయి.

**పంచ ఉప ప్రాణములు :** (1) నాగ ఉప ప్రాణము (2) కూర్మ ఉప ప్రాణము (3) కృకర ఉపప్రాణము (4) ధనంజయ ఉప ప్రాణము (5) దేవదత్త ఉప ప్రాణము.

ఇవి వచనము, దాన పరిగ్రహణములు, గమన ఆగమనములు, విషయ–కేవల ఆనందములు, విసర్జనము – అనునవి విషయములుగా కలిగి ఉన్నాయి.

**పంచవిధ అమృతములు (పంచామృతములు) :** ఈ **ప్రాణ (5) ఉపప్రాణ (5) = 10 దవిధ వాయువులు** అనేక స్థాన, ఆకార, కలయిక, విడిపోవటముల చర్య కారణంగా ఉపభేదం పొందుచున్నాయి.

**ఉపాధిభేదం చేత :** (1) రేచకము (2) పూరకము (3) శోషకము (4) దాహకము (5) ప్లావకము అనునవిగా అయి, ఈ శరీరమును 'మృతము' నుండి కాపాడుచున్నాయి. **అమృత జీవనము ప్రసాదిస్తున్నాయి.** అందుచేత **'పంచామృతములు'**గా చెప్పబడుచున్నాయి.

(**రేచకము** = వాయువును బయటికి పంపటము.

**పూరకము** = వాయువు నింపటము.

**శోషకము** = ఉష్ణమును జనింపచేసి ఎండించటము.

**దాహకము** = దహించటము. కాల్చటము. (వైశ్వానర ధర్మము).

**ప్లావకము** = జలముచే వ్యాప్తము చేసి ఉంచటము. తడిపి ఉంచటము).

**పంచవిధ జఠరాగ్నులు :**

దశవిధ వాయువుల వివిధ కలయికలచే శరీరంలో పంచవిధ జఠరాగ్నులు జనిస్తున్నాయి, శరీరంలో చరిస్తున్నాయి.

**(1) క్షారక** – ఆకలి.

**(2) ఉద్గారక** – త్రేణువు / కక్కు.

**(3) క్షోభక** – కలత కలిగించేవి (కడుపు నొప్పి మొ॥వి).

**(4) మోహక** – మోహింపజేసేవి (పులి త్రేణుపులు మొ॥వి).

**(5) జృంభక** – ఆవలింత.

ఈ ఈ పంచవిధ జఠరాగ్నులచే ఆయా పంచవిధ వ్యవహారములన్నీ సంభవిస్తున్నాయి.





అటువంటి క్షారక, ఉద్గారక, క్షోభక, మోహక, జృంభక **చర్యలచే** – శరీరములో ఆహారరూపంగా ప్రవేశించే **భక్ష్య** (చప్పరింత), **భోజ్య** (నమలటం), **లేహ్య** (నాకటం), **చోష్య** (పీల్చటం) – అగు చతుర్విధాన్నములు – (చతుర్విధ (4) రకముల ఆహారములు) – పచనము అయి, **శక్తిగా మారుచున్నాయి.**

ఈవిధంగా దశాగ్నులను నియమించు సర్వజ్ఞత్వ లక్షణులగు పదిమంది దివ్య ప్రజ్ఞా స్వరూపులగు దేవతలు ఈ శరీరములో వాయువు యొక్క రాకపోకల ధర్మములు తమ దైవీశక్తిచే నిర్వర్తించువారై ఉంటున్నారు.

ఇంకా ఈ శరీరంలో 'వశిని' మొదలుగా గల వాగ్దేవతలు వేంచేసి ఉన్నారు. అట్టి దేవతల అష్టశక్తులు శరీరంలో శీతలము (Cool), ఉష్ణము (Hot/Heat), సుఖము (Pleasantness), దుఃఖము (Un-Pleasantness), ఇచ్ఛ (Expectation, Desire), సత్త్వ రజో తమో త్రిగుణములుగా సంప్రదర్శనమౌతున్నాయి.

**పంచన్మాత్రలు :** ఈ శరీరంలో మాతృకల ప్రదర్శనములు (Motherly original presentations) ఉన్నాయి. అవియే **"శబ్దము** (Sound), **స్పర్శ** (Touch), **రూపము** (Form), **రసము** (Taste), **గంధము** (Smell)" అను పంచన్మాత్రలు శరీరంలో ఉంటున్నాయి.

ఇవే **పంచ పుష్ప బాణము** – అని కూడా చెప్పబడుచున్నాయి.

| | | |
|---|---|---|
| మనస్సు (ఆలోచన) | – | చెఱకుగడ / ధనస్సు. |
| మనస్సు విషయములకు 'వశము' అవటము | – | బాణము. |
| రాగము (Relatedness, Deep Atachment) | – | పాశము. |
| ద్వేషము (Dis liking) | – | అంకుశము. |

**అంతః త్రికోణాగ్ర దేవతలు** (1) అవ్యక్తము (2) మహత్ తత్త్వము (3) అహంకారము

**(1) అవ్యక్తము :** బీజములో ఆయా వృక్ష ధర్మాలవలె, **ఇంకనూ వ్యక్తీకరణము కానట్టి,** (కానీ) **వ్యక్తీకరించగలిగినట్టి** – ఆవలి **సవిషయ – విషయములకు మునుముందటి స్వస్థితి.**

**(2) మహత్–తత్త్వము :** (కలలో కనిపించే అనేకమంది జనులకు చెందిన అహంకారము ఎవరిది? కల తనదైన వానికి చెందినదే కదా! అట్లాగే, ఆత్మయొక్క సమష్టితత్త్వమే. **ఈ జగత్తులో కనిపించే భిన్న భిన్న అహంకారులంతా** (అహంకారములన్నీ) – [ఈ జగత్తు స్వయంకల్పిత స్వప్నమువంటిదే కాబట్టి] – **'జాగ్రత్ తనదే' అయిఉన్న ఈ జీవుని సమష్టి అహంకార రూపమే.** అదియే "మహత్ తత్త్వము" అని కూడా పిలువబడుతోంది.

**(3) అహంకారము :** వ్యక్తిగతమగు 'అహం' (నేను) భావన. దేహములోని త్రికోణాగ్ర దేవతల (ఇచ్ఛా–జ్ఞాన–క్రియల) కార్యక్రమ విశేషము.

లోపలగల దేవతలు **"కామేశ్వరి – వజ్రేశ్వరి – భగమాలిని"** అను మూడు పేర్లతో (పౌరాణికంగా) చెప్పుకోబడుచున్నారు.

**సదానంద ఘనా। పరిపూర్ణ స్వాత్మైక్య రూపా దేవతా లలితా॥**

ఆత్మ దేవత ఈ శరీరములో పరాకాష్ఠ అయి, పరాత్పరము అయి వేంచేసి ఉన్నది. అట్టి పరదేవతయే 'లలితాదేవి'. **(స్వాత్మానంద లవీభూతా। అహమిత్యేవ విభావయేత్ భవానీమ్।).** అట్టి ఆత్మాధిష్ఠాన స్వస్వరూప దేవతయే – ఈ జీవునిలోని ఘనీభూతమైన **సదానంద స్వయమాత్మ** స్వరూపము. **స్వాత్మయే స్వరూపముగా గల ఆ ఆత్మదేవియే,** (జీవాత్మ – ఈశ్వర – పరమాత్మ త్రయము తన ప్రదర్శనా చమత్కారమై ఉండగా) → **దేహముయొక్క బాహ్య–అంతరములలో వెలయుచున్నది.**

**ఆత్మదేవతయే ।** →

- సమస్త జీవులలో **'ధీ'** శక్తిగా (బుద్ధి శక్తిగా) వెలయుచున్నది.
- కాల స్వరూపిణి అయి, పంచదశ తిథుల పరిణామ – అవలోకనమునకు (కాల పరిణామమునకు) సాక్షి అయి వెలుగొందుచున్నది. (పంచదశ తిథులు = పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దసి, పౌర్ణమి / అమావాస్య).
- పంచదశలలోను నిత్య అయి, సమస్త దశలకు, మార్పు చేర్పులకు ఆవలిదై (పరమై) పరమేశ్వరి అగు లలితాదేవి (ఆత్మదేవి) ప్రకాశించుచున్నది.

## మానసిక – ఆత్మదేవతా పూజ

అట్టి స్వాత్మ దేవత అగు లలితా పరా భట్టారిక (సుందర స్వరూప ఘన దేవత) గురించిన ఉపనిషత్ పూర్వకమైన **"మానసిక పూజ"** గురించి చెప్పుకుంటున్నాము.

1. **"సలిలమ్ ఇతి సౌహిత్య కరణగ్ం సత్త్వమ్।"** స్నేహపూర్వకమైన, తృప్తితో కూడిన సాత్త్విక కరణములు, క్రియలు, భావములు – కలిగి ఉండటమే...., → ***దివ్య స్వరూపిణి అగు లలితా–ఆత్మ స్వరూపిణీ దేవికి జల సమర్పణ। జలాభిషేకము।***

2. **"కర్తవ్యమ్, అకర్తవ్యమ్" ఇతి భావనాయుక్త ఉపచారః। –** శాస్త్ర గురు ఆర్య వాక్యములను అనుసరించి **"ఇది కర్తవ్యము – నిర్వర్తించవలసినది", "ఇది అకర్తవ్యము – నిర్వర్తించకూడనిది"** అని ఎరిగి – వర్తించు భావనలు → ***ఆత్మదేవుని సన్మాన రూపమగు "ఉపచారము".***

3. **అస్తి నాస్తీతి కర్తవ్యతా – "అనూపచారః"। –** ఏది సర్వదా త్రికాలములలో ఏర్పడినదై ఉన్నదో, అది **'అస్తి'**. ఏది దేశ–కాల–భావనానుగతం మాత్రమే ఉన్నట్లు అగుపిస్తూ (అనిపిస్తూ), వాస్తవానికి స్వతఃగా లేదని ఎరిగి ఉండు భావనలే → ***అనూపచారము (ఆచారము కాదని వ్యవహరించటము).***

4. **బాహ్య–అంతఃకరణనాం రూపగ్రహణ యోగ్యతా అస్తి "ఆవాహనమ్"। –** అంతరంగ చతుష్టయము (అంతఃకరణములు) అయినట్టి మనో – బుద్ధి – చిత్త – అహంకారములతో బాహ్యమైన పంచ జ్ఞానేంద్రియములను, పంచకర్మేంద్రియములను ఉపయోగించి రూపగ్రహణ యోగ్యతా స్థితిని ధారణ చేయుచుండటమే. → ***ఆత్మ దేవదేవికి ఆహ్వానమంత్రము / ఆవాహన ప్రవచనము.***

5. **తస్య బాహ్యాంతః కరణానాం ఏకరూప గ్రహణమ్ "మానసమ్"। –** అట్టి బాహ్య – అంతఃకరణములకు విషయముగా అగుచున్న భిన్న భిన్న విశేషములలో ఏకత్వము [ భిన్నత్వములో ఏకత్వము, (The unity in the Divercity)] ను మనస్సు (మననము)తో దర్శిస్తూ ఉండటమే → ***'మానసమ్'। మానసికోపాసన। మానసిక పూజ।***

6. **రక్త శుక్ల 'పద' ఏకీకరణమ్ "పాద్యమ్"। –** ఎరుపు, తెలుపు పదముల ఏకీకరణమే ఆత్మదేవికి **"పాద ప్రక్షాళనము".**

   → ***రక్తము = రజోగుణము.     శుక్లము = సత్త్వ గుణము***

   → ***రక్త – శుక్లముల ఏకత్వము = గుణాతీతమగు ఆత్మను ఉపాసించటము.***

7. **ఉజ్జ్వలత్ ఆమోద ఆనంద "ఆసనమ్"। –** "ప్రహర్షితము" అయినట్టి ఆమోద–ఆనందములే (Agreeing with life situations and maintaining undisturbed pleasantness) → ***"ఆసనము".***

8. **దానమ్ "అర్ఘ్యమ్"।** – సహజీవులకు దానముచేయు క్రియలే ఆత్మదేవునికి **"అర్ఘ్యము"**. (చేతులు కడగటము).

9. **స్వచ్ఛం స్వతః సిద్ధమ్ – ఇతి "ఆచమనీయమ్"।** – సర్వదా స్వచ్ఛమైన, స్వతః సిద్ధమైన – (Its presence by virtue of its own Self - అగు) ఆత్మ గురించిన, శ్రవణ మనన నిదిధ్యాసలే → ***"ఆచమనీయము".***

10. **చిత్ చంద్రమయీ సర్వాంగ స్రవణగ్ం – ఇతి "స్నానమ్।" –** పంచ జ్ఞానేంద్రియ, పంచ కర్మేంద్రియ విషయములన్నీ చిత్ భావనతో ఏకము, తన్మయము చేయటమే **"ఆత్మ దేవుని పూజ"** లోని → **"స్నాన సమర్పణ"** .

    (**చిత్** = ఎరుక. **"ఎరుగుచున్నవాడు, ఎరగటము, ఎరుగబడునది – ఇవన్నీ కూడా ఈ జీవుని కేవలచిత్ నుండే స్రవించుచున్నాయి"**– అను అవగాహన, అచంచలమగు అనుభూతియే ***'చిత్ చంద్రమయము'***).

11. **చిదగ్ని స్వరూప పరమానంద శక్తి స్ఫురణం –** 'వస్త్రమ్'। – **"చిదానంద రూపమగు చిదగ్ని తేజోశక్తియే ఈ సమస్త జగత్తు"** – అను స్ఫురణయే **ఆత్మ దేవాది దేవి** కి సమర్పించే → ***"వస్త్రము".***

12. **ప్రత్యేకగ్ం సప్తవింశతిధా (27) భిన్నత్వేన ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మక బ్రహ్మగ్రంథిమత్, రసతంతు బ్రహ్మనాడీ – బ్రహ్మసూత్రమ్।"** – ఏ బ్రహ్మనాడి ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకమై '27' తంతువులతో (27 వేరువేరైన తత్త్వములకు ఆశ్రయమై) యున్నదో, అట్టి **బ్రహ్మనాడియే – "బ్రహ్మసూత్రము".** అట్టి **"బ్రహ్మము"** అను నాడిని బుద్ధితో ధారణ చేయుచుండటమే → ***ఆత్మదేవీ పూజలో బ్రహ్మసూత్ర (యజ్ఞసూత్ర) సమర్పణము.***

13. **స్వ–వ్యతిరిక్త వస్తు సంగరహిత స్మరణమ్ – "విభూషణమ్।" –** ఏకమగు ఆత్మకు వేరైనట్లు అగుపిస్తూ, "అనేకముగా కనిపించే" – అనాత్మకు సంబంధించిన – వస్తు, సంగతి, సందర్భ, సంబంధ, అనుబంధ – ఇత్యాది వ్యవహారములు స్మరించక, **భిన్నముగా కనిపించే ఈ సమస్తములో 'ఏకత్వము'ను ఆశ్రయించి ఉండటమే** → ***ఆత్మదేవికి సమర్పించే ఆభరణములు (లేక) విభూషణము.***

14. **సత్సంగ పరిపూర్ణత – అనుస్మరణం – గంధః। –** 'అసత్' తో సంగము జయించి, 'సత్'తో 'సంగము' వలన అనుభవమగు **"ఆత్మగా నేను పరిపూర్ణుడను"** – అను ఆత్మకు సంబంధించిన పరిపూర్ణతతో → ***అనుస్మరణమే ఆత్మదేవతకు 'గంధము'.***

15. **'సత్' శంఖ–పరిపూర్ణానుస్మరణమ్, సమస్త విషయాణాం మనసః స్థైర్యేణ అనుసంధానం– "కుసుమమ్"।** ఆత్మయొక్క స్వాభావిక లక్షణము 'సత్'. 'నేను ఉన్నాను' అను ఉనికి స్వరూపముగా (సత్‌గా) ఆత్మ సమస్త దేహములలో వేంచేసినదై ఉన్నది. త్రికాలములకు గాని, దేహ దేహాంతరములచేతగాని, జాగ్రత్ స్వప్న సుషుప్తి 'త్రి' అవస్థల చేతగాని పరిమితము, నియమితముకాని అట్టి **'సత్' – 'పరిపూర్ణము'** అయిఉన్నది. సమస్తము అట్టి సత్‌కు చెందినదే! అట్టి పరిపూర్ణమగు సత్ స్వరూపమే స్వస్వరూపాత్మగా (1) మనన రూపమగు మనస్సుతో, (మరియు) (2) బుద్ధిచే కలిగిన స్థైర్యముతో 'అనుసంధానము' ***ఎల్లప్పుడు కలిగి ఉండటమే – ఆత్మదేవత అగు లలితాదేవికి సమర్పించే కుసుమము (హృదయ పుష్పము).***

16. **తేషామ్ ఏవ సర్వదా స్వీకరణం ధూపః। –** శుద్ధమైన మనస్సు ఈ సమస్తమును నిర్మలమగు ఆత్మగా భావన చేయటము, (మరియు) స్వీకరిస్తూ ఉండటము – ఇవియే ఆత్మభగవతికి సమర్పించే → ***ధూపము.***

17. **పవనావత్ అఛిన్న ఊర్ధ్వ జ్వలన 'సత్–చిత్' ఉల్క ఆకాశ దేహో 'దీపః' –** వాయువుచే (ఉచ్ఛ్వాస – నిశ్వాసలచే) కుండలినీ శక్తి ఊర్ధ్వముగా వెలుగుచుండగా, **'సత్–చిత్ ఆనంద స్వరూపమగు జ్యోతిర్మయాకాశమే నా దేహము'** – అని దేహి తనయొక్క ఆత్మదేహమును తేజోమయముగా దర్శిస్తూ ఉండటమే → ***'దీపము' అను సమర్పణ.***

18. **సమస్త యాత - ఆయాత వర్జనం "నైవేద్యమ్"।** - సమస్తమైన యాతము (గతము, పోగొట్టుకొంటున్నవి), ఆయాతము (ముందు ముందు వచ్చునవి) - రెండిటినీ అధిగమించి, అతీతుడై ఉండు అభ్యాసమే → ***ఆత్మదేవతకు 'నైవేద్యము (నివేదనము)'.***

19. **అవస్థాత్రయ ఏకీకరణమ్ - "తాంబూలమ్"। -** స్వప్నములో అనుభవమయ్యేవన్నీ కల్పితములే. స్వప్నమునకు **మునుముందుగాను,** స్వప్నమునకు **తదనంతరముగాను → వేంచేసి ఉన్న కేవల స్వరూపమగు 'నేనే' సత్యము.**

అట్లాగే జాగ్రత్ అనుభవములు కూడా. ఎందుకంటే అవన్నీ మనో కల్పితములే. **జాగ్రత్‌కు మునుముందుగాను, జాగ్రత్‌కు తదనంతరముగాను వేంచేసి ఉన్న కేవల స్వస్వరూపమగు 'నేనే' సత్యము.**

సుషుప్తి విషయంలో కూడా '**సుషుప్తి తనదైనవాడే" - సత్యము.**

- అట్టి త్రి-అవస్థల ఏకీకరణముచే, **ఆ మూడు తనవైన 'నేను'**ను ఆశ్రయించు అభ్యాసమే ఆత్మానందదేవికి **"తాంబూల సమర్పణము"**

20. **మూలాధారాత్ - ఆ బ్రహ్మరంధ్ర పర్యంతమ్ -**

(మూలాధారము నుండి -
బ్రహ్మరంధ్రము వరకు)



**బ్రహ్మరంధ్రాత్ - ఆ మూలాధార పర్యంతమ్ →**

బ్రహ్మరంధ్రము నుండి

మూలాధారము వరకు

## గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్।

మూలాధార - బ్రహ్మరంధ్రముల మధ్యగా గతము - ఆగతము (పోవటము-రావటము) రూపంగా ధ్యానముయొక్క (ధ్యాసయొక్క) చలనము (Conscious move) జరుగుచూ ఉన్నదో - అదియే, ఆత్మదేవీ శ్రీమాతకు చేసే **"ప్రదక్షిణము".**

21. **తురీయావస్థా - నమస్కారః -** (1) జాగ్రత్ అవస్థ, (2) స్వప్నావస్థ, (3) సుషుప్త్యవస్థ (గాఢనిద్రా స్థితి) నావైన నేనే - తురీయము. **ఆ మూడిటి సాక్షి నేనే అయి ఉన్నాను. అతీతమై యున్నాను. ఆ మూడు అవస్థలకు ప్రేరణము, ఆధారము అయి ఉన్న నాలుగవ అవస్థయే "తురీయము" (చతురీయము. నాలుగవది).** అట్టి తురీయ స్థానమును భావన, ధారణలచే ఆశ్రయిస్తూ ఉండటమే → ***"ఆత్మ శ్రీమహారాజ్ఞి"కి చేయు 'నమస్కారము'.***

22. **దేహ శూన్య ప్రమాతృతా నిమజ్జనం 'బలిహరణమ్'। -** ఈ భౌతిక దేహమును ఒక శూన్యమైనదిగా భావిస్తూ, అట్టి భావనను 'ప్రమాత' యందు (సమస్త దృష్టాంతములకు సూచిత విషయమైన పరమాత్మ తత్త్వమునందు) నిమజ్జనము చేయటమే → ***"బలిహరణము". (ప్రమ = సత్యము, పరమ సత్యము).***

23. **సత్త్వమస్తి కర్తవ్యమ్। అకర్తవ్యమ్ ఉదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ం హోమః। -** "ఇదే చేయాలి। అది చేయకూడదేమో? ఇంతవరకే చేయాలి। అంతవరకు కాదు".... మొదలైన ఆయా కర్తవ్య - అకర్తవ్యముల పట్ల ఉదాసీనము వహిస్తూ,

- కేవలమగు 'సత్త్వము' - నందు స్థానము ధారణచేస్తూ, భావిస్తూ ఉండటము - **హోమము.**

నిత్యమగు ఆత్మతత్త్వము గురించి గానము చేయటము (ఎరుగుచు, దర్శిస్తూ, అదే తాను అగుచుండటము) – **ఇదియే హోమము.** ప్రపంచము కనిపించే అనేకమంతా ఏకమగు **"సత్–తత్త్వము"** నందు దర్శించు సత్త్వదృష్టియే (లేక) (తత్త్వ దృష్టియే) **'హోమము'.**

24. **స్వయం తత్ పాదుకా నిమజ్జనం పరిపూర్ణ ధ్యానం।** – ఈ జీవాత్మత్వమును సర్వ తత్త్వ స్వరూపిణి అగు ఆ **"ఆత్మ మహాదేవి"** యొక్క (లేక) **శ్రీ చక్ర స్వరూపిణి** అగు జగజ్జనని **యొక్క** పాద పద్మములందు (తరంగము జలములో నిమజ్జనమగు విధంగా) – నిమజ్జనము చేసివేయటమే **'పరిపూర్ణ ధ్యానము'**. సర్వతత్త్వ స్వరూపమగు ఆత్మదేవతయందు పాదుకము పొందటము (నెలకొని ఉండటము, స్థిరపడి ఉండటము, మేళవించుకోవటము) – **పరిపూర్ణ ధ్యానము.**

---

పైవిధంగా విషయ భావనలతో నిండి ఉన్న మనస్సును "ఆత్మ భావన"తో నింపి ఉంచి, **ఆత్మతో "అనన్య భావన"ను సిద్ధించుకోవటమే 'భావనోపనిషత్'** ।

- 'కా ది' మత **(కర్మయోగ)** సిద్ధాంత మార్గము అనుసరించి,
- 'హా ది' మత **(జ్ఞాన/సాంఖ్య)** సిద్ధాంత మార్గము అనుసరించి
- (లేక) ఆ ఉభయమార్గములను శ్రద్ధగా అనుసరిస్తూ ఎవ్వడైతే ('కాది–హాది' మత సిద్ధాంతానుసారంగా) ఆత్మదేవిని తెలుసుకొని ఉంటాడో, అట్టివాడు 'జీవన్ముక్తుడు' అగుచున్నాడు.

ఇతి భావనోపనిషత్
ఓం శాంతిః। శాంతిః। శాంతిః।

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 18 మహా వాక్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్ మహావాక్య సిద్ధాన్త
మహావిద్యా కళేబరమ్,
వికళేబర కైవల్యం
రామచంద్రపదం భజే॥

ఏదైతే వేదోపనిషత్ ప్రవచితమైన మహావాక్యముల సిద్ధాంతసారమగు 'మహావిద్య'గా మూర్తీభవించినదై యున్నదో, వికళేబర కైవల్యమై (విదేహ కైవల్య స్వరూపమై) విరాజిల్లుచున్నదో, అట్టి శ్రీరామచంద్ర మూర్తి యొక్క పదమును భజించుచున్నాము.

ఓం

1. అథ హైూ వాచ భగవాన్ బ్రహ్మ :
"అపరోక్షానుభవ పర–ఉపనిషదమ్"
(పరోపనిషదమ్) వ్యాఖ్యాస్యామః॥

**భగవానుడగు చతుర్ముఖ బ్రహ్మదేవుడు :** మహర్షులు, మానసపుత్రులు, దేవతలు మానవులు-మొదలైన సమస్త ప్రియ ముముక్షు జనులారా! ఇప్పుడు మనము-**"అపరోక్షానుభవము"** యొక్క ఉప (**సామీప్య**) నిషదము (**ఆసీనము**) (Sitting Very Close) గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము. (నిషాదము - కూర్చుండబెట్టడము).

గుహ్యాత్ గుహ్యతరమ్ ఏషా।
న ప్రాకృతాయ ఉపదేష్టవ్యా।

ఈ అపరోక్షానుభవ విశేషాలు - రహస్యాలన్నిటికంటే రహస్యమైనది.

ప్రాకృత, ప్రాపంచక, బాహ్యేంద్రియ దృష్టి, ఆశయము కలవారు ఈ **"అపరోక్షానుభవము"**ను బోధింపబడటానికి అర్హులు కారు.

సాత్త్వికాయ, అంతర్ముఖాయ
పరి శుశ్రూషవే॥ (ఉపదేష్టవ్యా)।

ఎవ్వరైతే సాత్త్విక గుణ సంపన్నులై, బాహ్యముగా కనిపించే నామ-రూప-గుణ-మార్పు చేర్పులను అధిగమించిన "అంతర్ముఖ దృష్టి" కలిగి ఉంటారో, గురువు వద్ద [ప్రణిపాత (నమస్కరిస్తూ), పరిప్రశ్నలతో కూడి] శుశ్రూష చేయువారై ఉంటారో,- **వారు ఉపదేశమునకు తప్పకుండా అర్హులే!**

2. అథ సగ్ంసృతి బంధ – మోక్షయోః।
విద్యా – అవిద్యే చక్షుషీ
ఉపసగ్ంహృత్య విజ్ఞాయ,
అవిద్యా లోక–అంధః తమో దృక్।

దృశ్యముతో పెట్టుకొంటున్న సంసృతి (అవినాభావభావ సంబంధము)ను అనుసరించే బంధములు ఏర్పడుచున్నాయి. సంబంధము ఏర్పరచుకొని ఉంటే **బంధము**. అంతరమున సంబంధము లేనివాడై ఉంటే - **మోక్షము.**

(బంధ మోక్షములకు) విద్య అవిద్యలు రెండు వేరైనచూపుల (దృష్టులు) వంటివి. అందుచేత **జగత్ భావములను ఉపశమింపజేయుచు, విజ్ఞానదృష్టి ఆశ్రయించెదరు గాక.**

లోకమును- అజ్ఞాన, లోకపరిమిత, తమో దృష్టితో దర్శించటమే అవిద్య.

తమో హి శారీర ప్రపంచమ్।
ఆబ్రహ్మ స్థావరాంతమ్॥
అనంతాఖిల అజ అండభూతమ్।
(అనంతాఖిలాజాండభూతమ్)।

ఈ శరీరమునుండి ప్రపంచము వరకు ఏర్పడి ఉన్నట్లు కనిపిస్తూ, బ్రహ్మ నుండి-స్థావరము కనిపించేదంతా కూడా **తమో (మాయా) ఆవరణయే।**

ఆత్మ-ఈ అఖిలాండకోటి బ్రహ్మాండస్వరూపము. అజము. జననమే లేనట్టిది. మొదలు చివర లేనిది. అజ-అండ భూతము.

(కలలోనో, కల్పనలోనో కనిపించే) కల్పనా వస్తువుకు జననమెక్కడిది? నాశనమెక్కడిది?

| | |
|---|---|
| **నిఖిల నిగమ-ఉదిత**<br>**సకామకర్మ వ్యవహారో లోకః।**<br>**నైషో అంధకార అయమాత్మా।** | ఈ లోకములన్నీ కూడా (1) వేదములలో చెప్పబడిన (మరియు) (2) లౌకికమైన ఆయా అనేక సకామ కర్మ వ్యవహారములచే నిర్మితమై ఉన్నట్టివి. అనగా, ఈ జీవుడు స్వపురుషమాత్రుడా?<br>ఈ జీవాత్మ (లేక) జీవుడు అంధకార స్వరూపుడు కానే కాదు. (నిర్విషయుడు, లేనివాడు, శూన్యము కాదు). (ఆత్మ తేజో రూపుడే)। |
| **విద్యా హి కాండ, అంతరాదిత్యో,**<br>**జ్యోతిర్మండలం గ్రాహ్యం।**<br>**న అపరమ్।**<br>**"అసావాదిత్యో బ్రహ్మేతి"**<br>**అజపయా ఉపహితగ్ం**<br>**"హగ్ంసః - సోఽహమ్"।** | ఈ జీవుడు ఆత్మయొక్క **'ఎరుక'** అనే వెలుగుచేత జడ జగత్తులో ప్రకాశించుచున్న విద్యా స్వరూపుడుగాను, **హృదయాంతరంగంలో** వెలుగొందుచున్న **ఆదిత్య స్వరూపుడుగాను.** జ్యోతిర్మండలాకారమగు ఆత్మ స్వరూపుడుగాను నిర్వచింపబడుచున్నాడు.<br>**ఈ జీవుడు పరమాత్మకు అన్యుడు కాడు. భిన్నము కాదు.**<br>ప్రకాశించుచున్న ఆదిత్యుడే బ్రహ్మము. (బ్రహ్మము నిత్యప్రకాశుడగు ఆదిత్యునివంటిది). [స్వయం ప్రకాశము. సర్వమును తానై వెలిగించునది]<br>అజపానుసంధానంగా (శబ్దములనుదాటి భావనయొక్క అనుసంధాన పూర్వకంగా) - **హంస** - **సోఽహమ్** (కేవల - సందర్భముల మధ్య)గా వెలుగొందువాడు. |
| **ప్రాణ అపానాభ్యాం**<br>**ప్రతిలోమ - అనులోమాభ్యాగ్ం**<br>**సమ - ఉపలబ్ధ్యైవగ్ం,**<br>**సా చిరం లబ్ధ్వా త్రివృత్ - ఆత్మని, బ్రహ్మణి**<br>**అభిధ్యాయమానే**<br>**సచ్చిదానందః పరమాత్మా ఆవిర్భవతి।।** | అట్టి బ్రహ్మమును ప్రాణ - అపానధారణ పూర్వకంగాను, ప్రతిలోమ (అవరోహణ క్రమము-దిగటము), అనులోమ (ఆరోహణ క్రమము-ఎక్కడము) గుర్తులతోను, కేవలముగాను **"హంసః। సోఽహమ్"** అని దీర్ఘకాలము జపించాలి. ఉపాసించాలి.<br>క్రమంగా (దీర్ఘకాల ఉపాసనచే) సమ్యక్ జ్ఞానము (**సర్వత్రా సమదృష్టి - అనే జ్ఞానము**)చే బ్రహ్మమును ధ్యానించటంచేత సత్ (ఉనికి), చిత్ (ఎరుక), ఆనంద (భావన) స్వరూపుడగు పరమాత్మ అంతరహృదయంగా ఆవిర్భవించ గలడు. (అనగా) పరతత్త్వము స్వానుభవము కాగలదు. |
| **3. సహస్రభానుమత్ చు(సు)రితా, (స్ఫురితా),**<br>**పూరితత్వాత్ అలిప్యా,**<br>**పారావార పూర ఇవ।** | అట్టి అఖండ పరతత్త్వానుభవం ఎటువంటిదంటే....,<br>- ఆత్మ వేలాది సూర్యుల యొక్క కాంతితో ప్రకాశించు సురి (చురకత్తి) వంటిది. (కత్తివలె 'అన్యము' అనేదంతా ఖండించివేయునది).<br>పూర్ణమగు సముద్రమువలె ఆత్మ నిర్మలము, పరిపూర్ణము అయి ఉన్నట్టిది. జగత్తులతో పూర్ణమై (దలీయాత్) - **వెల్లివిరియుచున్నట్టిది.** |
| **నైషా సమాధిః।** | 'సమాధి' అనేది సమస్త ఆలోచనలు విరమించు స్థితి. కాని **ఆత్మానందమో? ఆలోచనలన్నిటికీ ఆవల, ఆలోచనలతో సహా సమగ్రమై సమస్తమును తనయందు కలుపుకొని ఉన్నట్టిది.** కనుక అది **'సమాధి'** స్థితి అని కూడా అనలేము. |
| **నైషా యోగసిద్ధిః।** | అట్టి ఆత్మస్థితి ప్రతి జీవునిపట్ల సర్వదా సిద్ధించియే ఉన్నట్టిది. అందుచేత "అది యోగాభ్యాసము తరువాత సిద్ధించునది" - అనవీలు కాదు. |
| **నైషా మనోలయః।**<br>**(కింతు) బ్రహ్మైక్యం తత్।** | మనస్సు ఉండటానికి, లేకపోవటానికి ఆత్మస్వరూపమునకు సంబంధము లేదు. కనుక, అది మనో "లయస్థితి" అని కూడా చెప్ప వీలుకాదు.<br>మరి ఆత్మానుభవము (లేక) బ్రహ్మోస్థానము గురించి ఏమని చెప్పుకోవాలి?<br>అది ఈ **జీవాత్మయొక్క తత్ స్వరూపమగు (ఆవలిరూపమగు) "బ్రహ్మము"తో మమైక్య స్థితి. బ్రహ్మమునకు అనన్యస్థితి.** |

| | |
|---|---|
| **ఆదిత్యవర్ణం, తమసస్తు పారే<br>సర్వాణి రూపాణి విచిత్య ధీరః,<br>నామాని కృత్వా అభిదవన్ యదాస్తే** | ధీరులగు వారు- [ ఉత్తమ, సునిశిత, విస్తార, నిర్మల, విచక్షణాసహిత 'ధీ' (బుద్ధి) కలవారు] - సమస్తనామ రూపాత్మకమైనదంతా విచారించి, మాయామయములుగా నిర్ణయించి, అటుపై ఏ 'బ్రహ్మము' గురించి ఎలుగెత్తి చెప్పుచున్నారో, - అట్టి బ్రహ్మము - **ఆదిత్యునివలె స్వయంప్రకాశకము. తమస్సుకు ఆవలది.** |
| **ధాతా పురస్త ఆద్యమ్ ఉదాజహార,<br>శక్రః ప్రవిద్వాన్ ప్ర-దిశశ్చతస్రః।** | అట్టి 'బ్రహ్మము' గురించి ధాత (బ్రహ్మదేవుడు) ముందుగా వర్ణించారు. ప్రవచించారు. అది తెలుసుకొని ఇంద్రుడు ఆత్మానంద పరవశంతో నలుదిక్కుల గానం చేస్తున్నారు. |
| **తమేవం విద్వాన్ "అమృత ఇహ" భవతి।<br>న - అన్యః పన్థా అయనాయ విద్యతే।** | నాలుగు దిక్కులందు, నాలుగు అవాంతర దిక్కులందు ఏ ఆత్మను దర్శించి త్రిలోకాధిపతి అగు ఇంద్రుడు గానము చేస్తున్నారో, - అట్టి 'అఖండాత్మ' లేక 'బ్రహ్మము'ను విద్వాంసుడైనవాడు **ఇప్పుడే తెలుసుకొని, ఇక్కడే సర్వత్రా దర్శించుచున్నాడు**. మృత్యువును దాటి **అమృతుడగుచున్నాడు.**<br><br>అట్టి ఆత్మయొక్క దర్శనము, మమేకముచే **'అమృతత్వము'**ను (మృత్యు పరిధులను అధిగమించటమును) **ఇప్పుడే ఇక్కడే సిద్ధించుకోవాలి**. వేరే ఎప్పుడో, ఎక్కడో కాదు. ఎప్పటికో తెలిసేది కాదు. |
| **యజ్ఞేన యజ్ఞ మ యజంత దేవాః।<br>తాని ధర్మాని ప్రథమాన్యాసన్। (ప్రథమాని ఆసన్)।** | పైవిధంగా దేవతలు 'జ్ఞాన యజ్ఞము' చేత యజ్ఞ స్వరూపుడగు పరమాత్మకు సర్వతత్త్వ స్వరూపుడుగా యజనము (యోగోపాసన) సమర్పిస్తున్నారు. అట్టి ఆత్మ ధర్మములను **(నిత్యత్వము, సత్యత్వము, అతీతతత్వము, కేవలసాక్షిత్వము మొదలైన ఆత్మయొక్క ముఖ్య ధర్మములను)** న్యాసము (ఉపాసన), అనుష్ఠానము, ధారణ చేస్తున్నారు. |
| **తే హ నాకం మహిమానః సచంతే,<br>యత్ర పూర్వే సాధ్యాః సంతి దేవాః॥** | అట్టి ఆత్మయొక్క విశిష్ట ధర్మములను ఉపాసించువారు మహాత్ములగు జీవన్ముక్తుల స్థానము సిద్ధించుకొని, **ఆత్మయే తామై, ఆయా నిత్యత్వాది విశేష ఆత్మగుణములతో ప్రకాశించుచున్నారు.** |
| **4. సో౽హమ్ అర్కః, పరంజ్యోతిః।<br>అర్కజ్యోతిః। అహగ్ం శివః।** | సూర్యునిలోని పరంజ్యోతి స్వరూపముగా ఏ ఆత్మయొక్క మహిమ వెలుగొందుచున్నదో - అట్టి ఆత్మజ్యోతి, పరంజ్యోతి, అర్కజ్యోతి, శివానంద స్వరూపము - "నేనే" అయి ఉన్నాను. |
| **ఆత్మజ్యోతిః అహగ్ం శుక్రః।<br>సర్వజ్యోతిః అసావహమ్।** | నేనే నిర్మలమగు ఆత్మగా సమస్త జీవులయందు ప్రకాసిస్తున్న జ్యోతి స్వరూపుడను. రస స్వరూపుడను. అఖండాత్ముడను. |
| **ఏతత్ అథర్వశిరో అధీతే, ...** | అథర్వవేదమునకు శిరస్సు వంటి ఈ మహావాక్యోపనిషత్‌యొక్క **"అధ్యయన ఫలశృతి" చెప్పుకుంటున్నాము.** |
| **ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి।<br>సాయం అధీయానో దివసకృతం పాపం నాశయతి।** | ఉదయము పఠణము, అధ్యయనము చేసిన వానిపట్ల (తద్విధమైన ఆచరణ ఆశ్రయించినవానిపట్ల) రాత్రి చేసియున్న పాపదోషములు నశించగలవు.<br><br>సాయం సమయంలో ఈ ఉపనిషత్ విశేషాలను అధ్యయనం చేస్తే, పగలు చేసిన కర్మల దోషములు తొలగ గలవు. |





| | |
|---|---|
| **తత్ సాయం ప్రాతః ప్రయుంజానః<br>పాపో అపాపో భవతి।** | ఉదయము, సాయంత్రము కూడా అధ్యయనము చేస్తూ ఉండగా అట్టివాడు 'పాపి' అయినప్పటికీ 'అపాపి' (పవిత్రుడు) కాగలడు. పరమ పవిత్రుడౌతాడు. సర్వత్రా ఆత్మదృష్టిని పొందగలడు. |
| **మాధ్యందినమ్ ఆదిత్యాభిముఖో అధీయానః<br>పంచమహా పాతక–ఉపపాతకాత్ ప్రముచ్యతే॥** | మధ్యాహ్నమువేళ సూర్యునికి అభిముఖంగా నిలచి, ఈ మహావాక్యోపనిషత్ విశేషాలను పఠణము, మననము చేయువాడు తనయొక్క జన్మజన్మల మహాపాతక, ఉపపాతకములనుండి ముక్తుడు (విముచ్యుడు) కాగలడు. |
| **సర్వ వేదపారాయణ పుణ్యం లభతే।<br>శ్రీ మహావిష్ణు సాయుజ్యమ్ అవాప్నోతి॥** | అట్టి వానికి నాలుగు వేదముల పారాయణము చేసిన పుణ్యము లభించగలదు.<br>ఆతడు విష్ణుసాయుజ్యము పొందుచున్నాడు. |

**<u>మహావాక్యోపనిషత్ – సమాప్తా।</u>**

**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>**

***<u>ఇతి మహావాక్యోపనిషత్</u>***

***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 18 మహా వాక్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



ఒక సందర్భములో కొందరు మునులు, దేవతలు, బ్రహ్మమానస పుత్రులగు సనత్కుమారుడు, సనత్సుజాతుడు, సనకుడు, సనందనుడు – మొదలైనవారు ప్రజాపతి అగు బ్రహ్మదేవుని దర్శనం చేసుకొన్నారు.

⌘

**దేవతలు మొ॥ వారు :** హే పితామహా! సృష్టికర్తా! బ్రహ్మదేవా! 'జీవించాలి' – అనే అభిమానముగల జీవులు – బ్రాహ్మీదృష్టి పొందే సులువైన సాధనామార్గమును, జ్ఞానమును బోధించవలసినదిగా కోరుతూ, మిమ్ములను శరణు వేడుచున్నాము.

**భగవంతుడగు బ్రహ్మ :** బిడ్డలారా! ఇప్పుడు మనము **"అపరోక్షానుభవము"**నకు సంబంధించిన ఉపనిషత్ ప్రబోధము గురించి వ్యాఖ్యానించుకుందాము.

1. **ఇంద్రియములకు ప్రత్యక్షముగా అనుభవమగుచూ ఉంటే – అది "ప్రత్యక్షానుభవము".**

   *ఆత్మయో? ఇంద్రియములకు విషయము కాదు. ఇంద్రియములకే ఆధారమగుచు, వాటిని వెలిగించునది. కనుక ఆత్మ* ***"ప్రత్యక్షానుభవము" కాదు, ఇంద్రియములకు విషయమై కనబడేది, వినబడేది కాదు.***

2. **ఆత్మ జీవునకు పరోక్షమైనది కాదు. ఇంద్రియములకు, దేహమునకు జీవునకు వేరుగా ఎక్కడో ఉండి, ఎప్పటికో ఎచ్చటనో లాభించేదైతే "పరోక్షానుభవము". ఆత్మయో?**

   ***ఇంద్రియములకే జనన-ప్రేరణస్థానమైయున్న ఆత్మ – ఈ జీవునికి వేరుగా ఎక్కడో లేదు. అన్యము కాదు. కాబట్టి పరోక్షానుభవము కాదు.*** *ఇప్పటికే* ***సిద్ధించి, వెన్నంటి*** *ఉన్నట్టిది 'పరోక్షము' ఎట్లా అవుతుంది?*

3. **ప్రత్యక్షము కానిది, పరోక్షము కానిది – "అపరోక్షము"।**

   *ఆత్మ ప్రత్యక్షము, పరోక్షము కాదు. కాబట్టి* ***"అపరోక్షానుభవము"*** *అయి ఉన్నది. ఇంద్రియములకు అవిషయము.* ***అనుభవికి అనన్యము.*** *కాబట్టి –* ***"అపరోక్షము".***

ఆత్మ – వక్త, శ్రోతలు ఇరువురికి కూడా వర్తమానములోనే ఏమాత్రము **అన్యమే కానట్టిది.** కాబట్టి **అపరోక్షము.** అట్టి **"స్వస్వరూపాత్మ" గురించిన జ్ఞానము రహస్యములలోకెల్ల అత్యంత రహస్యమై ఉన్నట్టిది. ఇది "శ్రోత– స్వాభావికమగు తన స్వస్వరూపము గురించి**

**తానే ఎరగటము"** – అయిఉన్నట్టిది. అందుచేత ఎవరి దృష్టి ప్రాకృతమైన (ప్రకృతి సంబంధమైన / ఇంద్రియ సంబంధమైన / బాహ్య సంబంధమైన) – విషయ విశేషాలకు పరిమితమై, సంకుచితత్వము వహించి ఉంటుందో, **అట్టి వారికి అపరోక్షమగు ఆత్మ గురించిన స్వాభావిక తత్త్వము బోధించటంచేత ప్రయోజనము ఉండదు.** అట్టి శ్రోతపట్ల ఆత్మానుభవము సులభమై సిద్ధించదు.

## ఎవ్వడైతే →

- సత్త్వగుణ సంపన్నుడై, (రాజసిక – తామసిక భావాలను అధిగమించినవాడై),
- నామ–రూప–గుణాత్మకమైన సమస్తమునకు ఆవలగల కేవల–స్వస్వరూప సాక్షి యొక్క అనునిత్య దర్శనముచే అంతర్ముఖత్వము నందు అభిరుచి కలవాడై, –
- ఆత్మజ్ఞాన–ఆత్మ భావన యొక్క సముపార్జన కొరకై ఆచార్యులను సేవించు పరిశుశ్రూష స్వభావము గల వాడై – **ఉంటాడో,** అట్టివానికి ఈ మహావాక్యోపనిషత్‌యొక్క తాత్త్వికార్థము తప్పక ఉపదేశించబడు గాక! (బోధించబడు గాక)।

❖ ❖ ❖

మొట్టమొదట ఈ జీవుడు ఈ దృశ్యముతో మానసికంగా ఏర్పరచుకొన్న సంబంధము స్వకీయ అజ్ఞానముచేత "బంధము"గా అగుచున్నదని గమనించి, ఆపై అట్టి బంధము తొలగి ఆత్మానందమును సిద్ధించుకొను **ఆశయము** పొంది **'ముముక్షువు'** అగుచున్నాడు.

అట్టి ముముక్షువు

(1) **శమము** (ఇంద్రియ నిగ్రహము),

(2) **సంతోషము** (కలిగినదానితోను, పొందినదానితోను తృప్తిని అభ్యాసముగా కలిగి ఉండటము),

(3) **విచారణ** (నిత్యానిత్య వివేకము గురించిన ప్రయత్నము. శాస్త్ర / గురువాక్య పరిశీలన),

(4) **సత్సంగము**

అనబడు సాధన చతుష్టయమును ఆశ్రయిస్తున్నాడు. అట్టి ఉత్తమ ప్రయత్నముల ప్రయోజనముగా **'ఆత్మవిద్య'**కు అర్హుడగుచున్నాడు.

- సంసృతికి (లేక) సంసారమునకు → **"అవిద్య"** కారణము.
- మోక్షమునకు → **"విద్య"** కారణము.

రెండు వేరువేరైన దృష్టులను విభాగించటమును తెలుసుకొని, **'విజ్ఞానము'** (లేక) **ఆత్మజ్ఞానము** సహాయముతో వివేకి అయినవాడు **అనాత్మ దృష్టిని** (సాకార పాంచభౌతిక ఖండాత్మక దృష్టిని) క్రమంగా **ఉపసంహారము** చేసుకొంటున్నాడు. జయించివేస్తున్నాడు.

**దేవతలు, బ్రహ్మ మానసపుత్రులు :** తండ్రీ! బ్రహ్మదేవా! 'అవిద్య' అనగా ఏది? ఏ రూపముగా ఈ జీవునిపట్ల ప్రవర్తించటం జరుగుతోంది?

**బ్రహ్మదేవుడు :** బిడ్డలారా! వినండి.

స్వస్వరూపమగు ఆత్మకు అన్యముగా అనిపించేదంతా 'అనాత్మ'గా చెప్పబడుతోంది. **అనేకముగా కనిపిస్తున్న ఈ సమస్తము 'ఏకము, అక్షరము' అగు "ఆత్మ"గా అనిపించటమే 'విద్య'.** బంధ–మోక్షములకు విద్య–అవిద్యలు రెండు కళ్లు (వేరైన దృష్టులు) వంటివి. ఎందుకంటే దృష్టిని అనుసరించియే బంధ మోక్షములు ఏర్పడినవై ఉంటున్నాయి.

ఓ ప్రియజనులారా! మీరంతా ఆత్మతత్త్వ ధ్యానము కొరకై అనాత్మను ప్రక్కకు నెట్టి వేయండి. **పదార్థ దృష్టిని అధిగమించి పరమార్థ దృష్టిని ఆశ్రయించండి.** ఎవరు బ్రహ్మమును మాత్రమే సర్వత్రా దర్శిస్తారో, అట్టివారు **'సంసృతి'**ని (సంబంధముచే ఏర్పడే బంధమును) జయించి, **నిత్య ముక్తత్వము సిద్ధించుకోగలరు.**

'అవిద్య' అనగా? **అవిద్యా లోకాంధ తమో దృక్।**

**అవలోకనమే** (Way of seeing) మూలమైనట్టి **'లోకదృష్టి పరిమితత్వము'** – అనే **తమో ధ్యాసయే** (లేక) **కల్పితమైన అజ్ఞాన దృష్టియే** – అంధకారముతో సమానమైన **"అవిద్య"**.

ఈ శారీరకమైన **స్థితిగతుల అనుభవము,** (బ్రహ్మ నుండి స్థావరము వరకు అనుభవమయ్యే) **ప్రపంచానుభవము,** (ఏకమునందు అనేకానుభవం – ఇదంతా **తమస్సు** (అజ్ఞానము) చేతనే ఏర్పడుతోంది.

అట్లాగే, అనంతమగు సమస్త భౌతిక బ్రహ్మాండములు **(అనంతాఖిల అజాండభూతమ్),** సకల వేదములనుండి సకామ కర్మరూపమగు లౌకిక (లోక) కర్మ వ్యవహారములు **(నిఖిల నిగమోదిత సకామకర్మో లోకః।)** – ఇవన్నీ కూడా తమో **విశేషములే!**

ఆత్మకు లేని బంధము కల్పించి ఆపాదించబడుచున్నవే.

## ఈ జీవుడు (ఇంకాకూడా) ఎట్టివాడు?

ఈ జీవాత్మ ఆత్మతేజో ప్రకాశస్వరూపుడే గాని, అంధకార స్వరూపుడు కాదు. **ఆత్మ విద్యాసాగర స్వరూపుడు. అంతరాదిత్య స్వరూపుడు.** (అంతరంగాకాశంలో ప్రకాశించే స్వయంప్రకాశ ఆదిత్యుడు).

కేవలాత్మగా జ్యోతిర్మండల స్వరూపుడు. విద్యానంద స్వరూపుడు.

**గ్రాహ్యం నాపరం।** ఈ జీవాత్మ పరమాత్మనుండి వేరుపడి ఉండనే లేదు. పరమాత్మకు వేరైనవాడు ఏమాత్రము కాదు.

"బ్రహ్మమే సర్వ జీవుల హృదయములలోను ప్రకాశించుచున్న ఆదిత్యుడు।"
"అట్టి హంస (ఆత్మ) నేనే అయి ఉన్నాను. **హంసస్సోఽహం।**"

అని సర్వదా సర్వత్రా జపము (మననము) ఆశ్రయించాలి.

**ప్రాణ–అపానాభ్యాం।** ప్రాణ అపానములను ఒక ప్రదేశములో కుంభకం చేసి జీవాత్మ పరమాత్మల ఏకత్వము అనేకసార్లుగా ఉపాసించాలి.

**ప్రతిలోమ** (అవరోహణక్రమము / పైనుండి క్రిందికి) – **అనులోమ** (ఆరోహణక్రమము / క్రిందినుండి పైకి) (యోగపరంగా సహస్రారం నుండి మూలాధారం వరకు)

(**ప్రతిలోమము** = ప్రతికూలముగా. అనులోమము = ఒకానొక క్రమమును అనుసరించటము)

1. "సో (సః)" నుండి "హం" వరకు (సహజము నుండి సందర్భము వరకు) → ప్రతిలోమ క్రమము/అవరోహన క్రమము. *(పరమాత్మ నుండి జీవాత్మ వరకు). (యోగపరంగా – సహస్రారము నుండి మూలాధారము వరకు).*
2. "హం" నుండి "సో" (సః) వరకు. (సందర్భము నుండి సహజము వరకు) → అనులోమ క్రమము/ఆరోహన క్రమము. ***(యోగపరంగా మూలాధారం నుండి సహస్రారం వరకు)***

ఈవిధమైన క్రమంగా **"సోఽహం హంసః" "హంసః సోఽహం"** అని బహుకాలంగా అజపంగా (సహజ–సందర్భములను ఈవిధంగా సమ్యక్ దృష్టిని (లేక) సర్వత్రా సమమై, అఖండమైయున్న **"ఆత్మదృష్టి"**ని) సంపాదించుకోవాలి సుమా!

(ద్రష్ట దర్శన దృశ్య) **తివృత్ ఏకస్వరూపమగు బ్రహ్మమును ధ్యానించాలి.**

**సచ్చిదానందః పరమాత్మ–ఆవిర్భవతి॥** క్రమంగా ఈ జీవుడు స్వయముగా సత్–చిత్–ఆనంద స్వరూపము, సమస్తమునకు 'పరము' (ఆవలిది) అగు ఆత్మ స్వరూపముగా ఆవిర్భావము పొందినవాడు అవగలడు.

***అట్టి అఖండ - అప్రమేయ - సమగ్ర - అనునిత్య సత్యమగు "తత్త్వవృత్తి" (లేక) తత్త్వ దృష్టి మహత్తరమైనది.***

- వేలాది సూర్యుల కాంతితో సమానముగా **ప్రకాశమానమైనట్టిది.**
- పరిపూర్ణ మహాసముద్రమువలె సమస్తమును తనయందు ఏకము చేసుకొన్న **"పూర్ణస్వరూప భావన". జగదనుభవములన్నీ తనయందు తరంగములుగా కలిగి ఉన్నట్టి 'ఆత్మానందసాగర భావన'.**
- దర్పణములో దృశ్యములువలె-**తనయందు జగద్దృశ్యములను స్వకీయ లీలా కల్పనా వినోదంగా ప్రతిబింబింప చేసుకొనుచున్నట్టిది.**
- జగత్తులుగా వెల్లివిరియునది. తానే ఈ సమస్తము అయిఉన్నట్టిది.



# ఆత్మ - నేతి

**నైషా సమాధిః॥ :** 'సమాధి' అనగా (కొన్ని శాస్త్ర విభాగములు ఇస్తున్న నిర్వచనమును అనుసరించి) - సమస్త హావభావముల **విరామస్థితి**. కానీ ఆత్మ పురుషుడో? సమస్త హావభావములు తనవే అయి, తాను వాటన్నిటికీ ఆవల ఉన్నట్టివాడై, **"జగత్తులు - జగద్భావములు - జగత్ భావ సమన్వితుడు"** - అగు త్రివృత్ ఆత్మ స్వరూపుడై **విరాజిల్లువాడు.** కనుక - ఆత్మానుభవము "సమాధి" వంటిది - **అని పరిమితముచేసి చెప్పలేము.** అఖండాత్మానంద భావనకు "జగత్ విషయ విరామము" యొక్క అగత్యమేదీ లేదు.

**నైషా యోగ సిద్ధిః :** అట్టి ఆత్మానుభూతి యోగాభ్యాసముల తదనంతరము సిద్ధించేదా? కాదు. సర్వదా సిద్ధించియే ఉన్న 'ఆత్మ' కొరకై - "యోగాభ్యాసముల తరువాత"-అని **ఎట్లా అంటాము?** అందుచేత **"ఆత్మానందము యోగసిద్ధి రూపము"- అని కూడా అనలేము.**

**నైషా మనో లయః। : ఆత్మయొక్క 'మననము' అనే క్రియావిశేషమే మనస్సు.** అట్టి మనస్సుకు మునుముందుగాను, మనస్సు ప్రవర్తిస్తూ ఉన్నప్పుడు, మనస్సు లయించిన తరువాత కూడా **'ఆత్మ' - యథాతథము.** తరంగము ప్రదర్శనము కాకముందు, తరంగము సందర్భముగాను, తరంగము లయించిన తరువాత కూడా జలము యథాతథము కదా! ఆత్మనుండే మనోతరంగములు బయల్వెడలి, తిరిగి ఆత్మయందే లయిస్తున్నాయి. అందుచేత **'ఆత్మ మనోలయ రూపము'** అని అనలేము. ఎందుకంటే మనస్సు ఉన్నా, లేకున్నా కూడా ఆత్మ సర్వదా **పరము** (Beyond), మరియు, **యథాతథము** కూడా.

జీవ బ్రహ్మైక్యమే (ఏకమ్, అఖండమ్) - ఆత్మయొక్క స్వాభావిక రూపము.

***అట్టి ఆత్మయొక్క మహిమా విశేషాలు ఇంకా కూడా ఎట్టివంటే...,***

**ఆదిత్య వర్ణమ్, తమసస్తు పారే। :** అది చీకటికి ఆవల సూర్యతేజో విలాసముగా నిత్య ప్రకాశము. అజ్ఞానమునకు సంబంధించక, ఆవల అనునిత్య తేజోవిలాసమై వెలుగొందుచున్నట్టిది. 'జీవాత్మ'గా కనిపించేదానికి ఆవలగా, సాక్షిగా ప్రకాశించుచున్నట్టిది.

**సర్వాణి రూపాణి విచిత్య, ధీరః, నామానికృత్వా అభిదవన్ యదాస్తే। :** ఉత్తమ బుద్ధి గల ధీరులు "ఈ నామ రూపాత్మకంగా ప్రదర్శనమగుచున్నదంతా **"స్వయం ప్రకాశమగు ఆత్మ" యొక్క ప్రదర్శనమే** (Manifestation of Absolute Self) **" - అని గమనిస్తూ, దర్శిస్తున్నారు.**

**ధాతా పురస్తాత్ ఆద్యమ్ ఉదాజహార। :** ఈవిధంగా ధాత (బ్రహ్మ భగవానుడు) ఇతఃపూర్వమే (సృష్టికి పూర్వమే) - **"నేను నిర్వర్తించబోవు ఈ సృష్టి అంతా కూడా ఆత్మ యొక్క ఆనంద ప్రదర్శనా చమత్కారమే"** - అని ఎలుగెత్తి గానం చేసి, సృష్టి కల్పనకు ఉపక్రమించుచున్నారు.

**శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చ తస్రః। :** అప్పుడు త్రిలోకాధిపతి అగు ఇంద్ర భగవానుడు **"ఈ సమస్తము కూడా ద్రష్టయొక్క కేవల స్వరూపమగు స్వస్వరూపాత్మయే। అనేకంగా (స్వకీయ కల్పనచే) అగుపించేదంతా ఏకమగు ఆత్మయే"** అని నిస్సందేహముగా ఎరిగినవారై, అట్టి ఆత్మతత్త్వ జ్ఞానమును **పది దిక్కుల మార్మ్రోగేటట్లుగా గానం చేస్తూ** వినిపిస్తున్నారు.

**తమేవమ్ విద్వాన్ అమృత ఇహ భవతి। :** అట్టి స్వస్వరూపమగు "ఆత్మ" గురించి ఇప్పుడే తెలుసుకొన్నవాడు ఇక్కడే జన్మ-మృత్యువుల పరిధులను అధిగమించి, వాటికి సాక్షి అయిన తనయొక్క అమృతత్వమునందు అనుక్షణికంగా **"స్వానుభవుడు"** కాగలడు.

అట్టి అమృతమగు ఆత్మగురించి తెలుసుకోవటము తప్పించి, ఇక (మృత్యువును అధిగమించటానికి) వేరే త్రోవయే లేదు.

**యజ్ఞేన యజ్ఞమ్ అయజంత దేవాః, తాని ప్రథమాన్యాసన్। :** అట్టి "ఆత్మతత్త్వ జ్ఞాన యజ్ఞము"ను నిర్వర్తించి దేవతలు అట్టి యజనముచే అమృతతుల్యులై, ముక్తులైనారు.

ఆత్మ జ్ఞాన లక్షణములే ప్రధానములైన గుణములు.

అట్టి ఆత్మ జ్ఞానముచే జీవులు జీవన్ముక్తులై, తత్త్వవేత్తల స్థానము పొంది ప్రకాశించగలరు.

-----

## "నేను" ఎవరు?

- నేను ఆత్మగా స్వయం ప్రకాశకమగు ఆత్మ సూర్య-జ్యోతి స్వరూపుడను.
- అర్కజ్యోతి శివానంద రూపుడను.
- సమస్తమునందు నిర్మలమగు ఆత్మగా రసస్వరూపుడనై వేంచేసి ఉన్నవాడను.
- అఖండమగు ఆత్మజ్యోతిని నేనే!
- అగ్నియే సమస్త దీపములలో వెలుగుచు, కాంతిమయమై ఉన్నట్లుగానే, ఆత్మనగు **నేనే సమస్త జీవులలో స్వయముగా జ్యోతికే, జ్యోతిగా, ఆత్మజ్యోతిగా "శివోఽహమ్" అయి వెలుగొందుచున్నవాడను.**

## ఫలశ్రుతి

**బ్రహ్మదేవులవారు :**

ఓ ప్రియజనులారా! సమస్త జీవులారా!

ఈ మహావాక్యోపనిషత్ విశేషముల సారము అథర్వణవేదమునకు శిరస్సు వంటిది. ఇందలి తాత్త్విక పాఠ్యాంశమును అధ్యయనము చేసి హృదయస్థము చేసుకొనెదరు గాక! (ఉపనిషత్తులు వేదములకు శిరస్సులుగా వర్ణించబడుచున్నాయి).

- ప్రాతః కాలము (ఉదయము) ఈ ఉపనిషత్తును పఠిస్తే రాత్రి చేసియున్న పాపముల దోషము తొలగగలదు.
- సాయం సమయములో పఠిస్తే పగలుచేసి యున్న కర్మల దోషములు తొలగిపోగలవు.
- ఉదయ సాయంకాల సమయములలో ఈ ఉపనిషత్ సత్సంగపూర్వకంగా అధ్యయనము చేస్తూ ఉంటే - పాప సంస్కారములన్నీ తొలగి, అట్టి అధ్యయనముచేయువాడు పుణ్యకార్యములకు సంబంధించిన ఉత్తమ సంస్కారములు పొందగలడు.

ఎవ్వరైతే మధ్యాహ్నకాలంలో సూర్యునికి ఎదురుగా నిలబడి సూర్యనమస్కారములు నిర్వర్తించి, ఆ తరువాత ఈ ఉపనిషత్ విశేషాలు ఆదిత్యుని (సూర్యుని) సమక్షంలో అధ్యయనం చేస్తారో, అట్టి వారు పంచ మహాపాతక ఉపపాతకముల నుండి ప్రముచ్యులు (Relieved) కాగలరు.

ఈ ఉపనిషత్ విశేషములు అధ్యయనము చేయువారికి సమస్త వేదముల పారాయణ పుణ్యము లభించగలదు.

**అట్టివారు మహావిష్ణు సాయుజ్యము పొందగలరు.**

*ఇతి మహావాక్యోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

19

# శరభోపనిషత్

(శరభుడు = సమస్త జీవులు తన శరములుగా కలవాడు)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ సర్వం సంత్యజ్య మునయో,
యత్ భజన్తి ఆత్మరూపతః।
తత్ చ ఆరంభం త్రిపాద్ బ్రహ్మ,
– స్వమాత్రమ్ అవశిష్యతే॥



మునులంతా సమస్తమును త్యజించినవారై దేనిని ఆత్మరూపంగా భజిస్తూ ఉన్నారో, అట్టి ఆది త్రిపాద్ బ్రహ్మము - మనందరి స్వస్వరూపమే అయి ఉన్నది. ఘనశేషబ్రహ్మమే స్వస్వరూపము.

ఓం

| | |
|---|---|
| **1.** ఓం। అథ హి ఏనం (అథహైనం) పైప్పలాదో బ్రహ్మాణమ్ ఉవాచ :- | ఒకానొక సందర్భములో పిప్పలాద మహర్షి కుమారుడు పైప్పలాదుడు బ్రహ్మ దేవుని ప్రత్యక్షము చేసుకొన్నారు. ఆ సందర్భంలో ఇట్లా అడిగారు. |
| "భో, భగవన్! బ్రహ్మ విష్ణు రుద్రాణాం మధ్యే కోవా అధికతరో ధ్యేయః స్యాత్? తత్త్వమేవ నో బ్రూహి। ఇతి॥ | "హే భగవన్! బ్రహ్మదేవా! (తాత్త్విక దృష్టిచే) బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఎవరు అధికతమమై, ధ్యానింప తగినవారు?" - అట్టి తాత్త్విక విశేషము గురించి మాకు దయతో వివరించి బోధించండి. |
| తస్మై సహ ఉవాచ పితామహశ్చ : హే పైప్పలాద! శృణు వాక్యం ఏతత్। | **పితామహులగు బ్రహ్మ భగవానుడు:** ఓ పైప్పలాదా! మీకు ఒక విశేషము చెప్పుచున్నాను. విను. |
| బహూని పుణ్యాని కృతాని యేన, తేనైవ లభ్యః పరమేశ్వరో, అసౌ। | ఎవ్వనిచేతనైతే అనేక పుణ్య క్రియలు నిర్వర్తించబడినవై ఉన్నాయో, అట్టి వానికి మాత్రమే పరమేశ్వరుడు లభ్యుడు (లభించినవాడు) అగుచున్నాడు. |
| యస్య అంగజో అహం హరిః ఇంద్ర ముఖ్యాః। మోహాత్ న జానంతి సురేంద్ర ముఖ్యాః, ప్రభుం, వరేణ్యం, పితరం మహేశం॥ | ఎవ్వరి అంగములనుండి నేను, హరి, ఇంద్రుడు మొదలైన ముఖ్య దేవతలందరము జనిస్తూ ఉన్నామో, - అయినా కూడా మోహముచే ఎవరిని నేను, సురేంద్రుడు మొదలైన ముఖ్య దేవతలు కూడా ఎరుగలేకున్నారో, - ఎవరు దేవతలకే దేవతయో, ప్రభువో, స్తుతించతగినవాడో, తండ్రియో- **అట్టి పరమేశ్వరునికి నమస్కారముము.** |
| **2.** యో బ్రాహ్మణం విదధాతి తస్మై, వేదాంశ్చ సర్వాన్ ప్రహిణోతి చ అగ్ర్యమ్, తం వై ప్రభుం పితరం దేవతానామ్ మమ అపి విష్ణోః జనకం దేవమ్ ఈడ్యమ్॥ | ఓ పైప్పలాదా! ఇంకా విను. ఎవ్వరైతే సృష్టికర్త అగు బ్రహ్మకే సృష్టికర్తయో, ఎవరు చతుర్వేదములను సృష్టికర్తకు ప్రసాదించి ఉన్నారో, అట్టి పరమేశ్వరుడే పితరులకు, దేవతలకు సృష్టికర్త అగు నాకు రక్షకుడు. పరిపోషకుడు. విష్ణువునకు కూడా ఆయనయే ప్రభువు, తండ్రి, దేవదేవుడు. మా అందరికి **పూజార్హుడు.** |

| | |
|---|---|
| **యో అంతకాలే సర్వ లోకాన్ సంజహార,**<br>**స ఏకః శ్రేష్ఠశ్చ, సర్వ శాస్తా స ఏవ।** | ఎవ్వడైతే అంత్య (ప్రళయ) కాలంలో సమస్తము తనయందు లయం చేసుకుంటున్నారో, ఆ పరమేశ్వరుడే సర్వశ్రేష్ఠుడు, సమస్తము శాసించువాడు కూడా। |
| **యో ఘోరం వేషం ఆస్థాయ శరభాఖ్యం మహేశ్వరః,**<br>**నృసింహం లోకహంతారం, సం జఘాన మహాబలః।** | ఏ మహేశ్వరుడైతే శరభ (శరభము) అనే ఘోర వేషమును ధరిస్తున్నారో, లోక హంతకుడైన నృశింహుని జయించారో, ఆయనయే ముఖ్యమైన పూజనీయుడు. |
| **హరిగ్ం హరం తం పాదాభ్యాం, అనుయాంతి సురేశ్వరాః।**<br>**మావధీః పురుషం విష్ణుం, విక్రమస్వ మహానిశి॥** | దేవతలు హరునికి (రుద్రునికి) పాదాభివందనము చేస్తూ **"ఓ మహేశ్వరా! విష్ణువును మాకొరకై రక్షించి మాకు ప్రసాదించండి. వధించకండి!"** అని ప్రార్థించగా..., |
| **కృపయా భగవాన్ విష్ణుం**<br>**విదదార నఖైః ఖరైః।**<br>**చర్మాంబరో మహావీరో**<br>**వీరభద్రో బభూవ హ॥** | ఆ పరమేశ్వరుడు దయతో విష్ణుమూర్తిని ప్రసాదించారు. వాడి అయిన గోళ్ళతో చీరారు. (దక్షయజ్ఞ సందర్భము).<br>మహావీరుడు, కరి చర్మము ధరించినవారు - అగు పరమేశ్వరుడే వీరభద్రుడుగా అయినారు. |
| స ఏకో రుద్రో ధ్యేయః।<br>**సర్వేషాం సర్వసిద్ధయే,** | (అనేకములలో **ఏక స్వరూపుడైయున్న అట్టి రుద్రభగవానుడే దేవతలకు, మాకు ధ్యానింపతగిన ధ్యేయువస్తువు**. ఆయనయే సమస్తమును ప్రసాదించు వారు. సర్వులకు సంపదలను, సామర్థ్యములను సిద్ధింప జేయువారు. |
| **యో బ్రహ్మణః పంచమ వక్త్ర హంతా,**<br>**తస్మై రుద్రాయ నమో అస్తు।** | ఏ పరమేశ్వరుడైతే బ్రహ్మ దేవుని యొక్క ఐదవ ముఖమును ఖండించారో, అట్టి రుద్ర భగవానునికి నమస్కారము. |
| **యోఽపి స్ఫులింగేన లలాటజేన సర్వం జగత్**<br>**భస్మసాత్ వై కరోతి। (భస్మసాద్వై కరోతి।)** | ఏ స్వామి అయితే తనయొక్క లలాటములో గల మూడవ నేత్రమునుండి పుట్టిన ఒక చిన్న నిప్పు రవ్వతో సమస్త జగత్తులను భస్మము చేసి వేయగలరో, అట్టి రుద్ర దేవాది దేవునికి నమస్కారము. |
| **3. పునశ్చ సృష్ట్వా పునరపి అరక్ష దేవగ్ం**<br>**స్వతంత్రం ప్రకటీ కరోతి,**<br>**తస్మై రుద్రాయ నమో అస్తు।** | ఏ పరమాత్మ అయితే భస్మము నుండి ఈ సమస్త సృష్టిని పునః సృష్టిస్తూ, రక్షిస్తూ దేవాది దేవుడై సర్వ స్వతంత్రము ప్రదర్శిస్తూ ఉన్నారో, అట్టి రుద్రభగవానునికి ఎల్లప్పుడు నమస్కరిస్తూ ఉన్నాము. |
| **యో వామపాదేన జఘాన కాలం ఘోరం,**<br>**పపావథ హాలాహలం తమ్, తస్మై రుద్రాయ నమో అస్తు॥** | ఏ రుద్ర దేవుడైతే తన ఎడమపాదముతో (భక్తుడగు మార్కండేయుని రక్షించటానికి) ఘోరము అయినట్టి యముని గుండెను తన్నారో, భక్తులపై ప్రీతితో హాలాహలమును త్రాగి కంఠమున ధరించారో, అట్టి స్వామికి నమస్కారము. |
| **యో వామ పాదార్చిత విష్ణు నేత్రః**<br>**తస్మై దదౌ చక్రం అతీవ హృష్టః**<br>**తస్మై రుద్రాయ నమో అస్తు।** | ఏ శివభగవానుని ఎడమ భాగము పొందుట కొరకై విష్ణువు వారి ఎడమ పాదమును ఆశ్రయించి, చూపును నిలిపారో **(త్వత్ పాదౌ నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహ భాగో హరిః** - శివానంద లహరి), దానికి సంతోషించి భక్తవత్సలుడై విష్ణువుకు 'చక్రము' ప్రసాదించారో, **అట్టి రుద్ర భగవంతునికి నమస్కరిస్తున్నాము.** |
| **యః దక్షయజ్ఞే సురసంఘాన్ విజిత్య**<br>**విష్ణుం బబంధ ఊరుపాశేన వీరః,**<br>**తస్మై రుద్రాయ నమో అస్తు॥** | ఏ స్వామి అయితే దక్ష ప్రజాపతి అశాస్త్రీయంగా చేస్తున్న నిరీశ్వర దక్ష యజ్ఞమును వీక్షిస్తూ ఉన్న కారణంగా అప్పటికప్పుడు తనయొక్క వీరభద్రాంశతో దేవతలను జయించి, విష్ణువును ఊరు (పెద్ద) పాశములతో బంధించారో - అట్టి రుద్ర పరమాత్మా! నమస్కారము. |

| | |
|---|---|
| **4. యో లీలయైవ త్రిపురం దదాహ,<br>కామం కాలం సోమ సూర్యాగ్ని నేత్రః।** | ఏ స్వామి అయితే 'లీలా వినోదము'గా త్రిపురములను కాలాగ్నిచే కాల్చి వేశారో, అట్లాగే కాముని, కాలుని కూడా తనయొక్క మూడవ నేత్రముతో దహించారో, |
| **సర్వే దేవాః పశుతామ్ అవాపుః<br>స్వయం తస్మాత్ పశుపతిః బభూవ,<br>తస్మై రుద్రాయ నమో అస్తు॥** | - ఏ పరమేశ్వరుడు చంద్ర సూర్య అగ్నులను త్రినేత్రములుగా కలిగి ఉన్నారో, 'దేవతలు' అనే పుష్పములున్న పూపొద (అవాపము) తానై అయి ఉన్నారో,<br>- ఏ ఈశ్వరుడు దేవతలను అందరిని పశువులుగా చేసి తాను 'పశుపతి' బిరుదాంకితులైనారో, **అట్టి రుద్ర స్వామి వారికి నమస్కారము.** |
| **యో మత్స్య కూర్మాది వరాహ సింహాన్<br>విష్ణుం క్రమంతం వామనం ఆదివిష్ణుమ్,<br>వివిక్లబం పీడ్యమానం జఘాన,<br>భస్మీచకార మన్మధం యమం చ,<br>తస్మై రుద్రాయ నమో అస్తు।** | ఏ పరాత్పరుడైతే ....,<br>- మత్స, కూర్మ, వరాహ, నారసింహ ఇత్యాది అవతారములు ధరించిన విష్ణుమూర్తిని, అదంతా కూడా మనస్సు యొక్క లీలగా బోధించి, మనోవేదనను తొలగించారో,<br>- చూపు మాత్రం చేత మన్మధుని యమింపజేసి, భస్మము చేసివేశారో,- అట్టి రుద్ర భగవానునికి నమోస్తు। నమస్కారము। |
| **ఏవం ప్రకారేణ బహుధా ప్రతుష్ట్వా<br>క్షమాపయామాసుః నీలకంఠం, మహేశ్వరమ్।** | ఈవిధంగా నీలకంఠుడగు మహేశ్వరునికి దేవతలు అనేకవిధాలుగా స్తుతులను సమర్పించి, హృదయపూర్వకంగా క్షమాపణలు వేడుకొంటున్నారు. |
| **5. తాపత్రయ సముద్భూత, జన్మ మృత్యు జరాదిభిః,<br>నానావిధాని దుఃఖాని, జహార పరమేశ్వరః॥** | ఏ పరమేశ్వరుడైతే ఈ జీవులకు (ఆదిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక) తాపత్రయముల వలన కలుగుచున్న జన్మ-జరా-మృత్యు ఇత్యాది - సమస్త దుఃఖములను హరిస్తారో, అట్టి హరునకు నమస్కారము. |
| **ఏవం మంత్రైః ప్రార్థ్యమాన ఆత్మా వై సర్వదేహినామ్,<br>శంకరో భగవాన్ ఆద్యో, రరక్ష సకలాః ప్రజాః।** | ఏ స్వామి అయితే సమస్త దేహములలో వేంచేసియున్న 'ఆత్మ'గా ప్రార్థించబడుచూ ఉన్నారో, ఆద్యుడు, భగవానుడు-అగు శంకరుడై సమస్త జీవులను ప్రేమతో రక్షిస్తున్నారో, అట్టి రుద్ర పరంధామునికి నమస్కారము. |
| **యత్ పాద-అంభోరుహ ద్వంద్వం<br>మృగ్యతే విష్ణునాధునా,<br>స్తుత్వా స్తుత్యం మహేశానం<br>అవాఙ్మానస గోచరం,** | **"స్వామి పాదపద్మాలు ఎక్కడ"?** అని విష్ణుమూర్తి (ఆది వరాహమూర్తి అయి) ఇప్పటికీ వెతుకుచున్నారో, అవాక్ మానసగోచరుడగు ఏ మహేశ్వరుని స్తుతించి, విష్ణువు లోక పాలనా సామర్థ్యమును అనుగ్రహంగా పొందుచున్నారో, |
| **భక్త్యా నమ్రతనోః విష్ణోః<br>ప్రసాదం అకరోత్ విభుః।** | - ఏ రుద్రదేవునికి నమ్రతుడై విష్ణువు వంగి నమస్కరిస్తూ ఉండగా ఆ రుద్రుడు తన అనుగ్రహమంతా ప్రవహింపజేసారో, |
| **యతోవాచో నివర్తంతే<br>అప్రాప్య మనసా సహ।** | - ఎవరియొక్క సాన్నిధ్యమును (స్థానమును) మనస్సు పొందలేక వాక్కుతో సహా వెనుతిరుగుతోందో, |
| **ఆనందం బ్రహ్మణో విద్వాన్<br>న బిభేతి కదాచన।** | అట్టి ఆనంద బ్రహ్మమగు **రుద్రభగవత్ తత్త్వము** ఎరిగినవాడు ఇక దేనికి భయము ఉండదు. |
| **అణోరణీయాన్ మహతో మహీయాన్<br>'ఆత్మ' అస్య జంతో నిహితో గుహాయామ్** | ఆ స్వామి సమస్త జీవుల హృదయ గుహలో -<br>- అణువుకంటే **సూక్ష్మంగాను,** - సమస్త మహద్వస్తువుల కంటే **మహనీయము గాను, స్థూలముగాను** వేంచేసి ఉన్నారు. |
| **తమ్ అక్రతుం పశ్యతి వీత శోకో<br>ధాతుః ప్రసాదాత్ మహిమానం ఈశమ్।** | అట్టి ఈశ్వరుని మహిమను **నిర్మలమగు హృదయమును పొందినవారు తమ అంతరంగమునందే ఆ రుద్ర 'చైతన్యమూర్తి'గా దర్శిస్తున్నారు.** |

| | |
|---|---|
| **వసిష్ఠ వైయాసికి వామదేవ<br>విరించి ముఖ్యైః హృది భావ్యమానః,<br>సనత్సుజాతాది సనాతనాద్యైః<br>ఈడ్యో మహేశో భగవాన్ ఆదిదేవః।** | అట్టి రుద్రమూర్తి (ఇంకా కూడా) →<br>- వసిష్ఠుడు, శ్రీశుకుడు, వామదేవుడు, బ్రహ్మ మొదలైన ముఖ్యులందరి హృదయమునందు స్వానుభవంగా వేంచేసి ఉన్నవారు.<br>- సనత్సుజాతుడు, [(సనత్కుమారుడు, సనకుడు, సనందనుడు) (బ్రహ్మ మానసపుత్రులు)] మొదలైన మహనీయులచే సర్వదా సనాతన ధర్మస్వరూపులుగా స్తుతించబడువారు.<br>అట్టి మహేశ్వరులు, భగవంతుడు, ఆదిదేవుడు అగు **రుద్రభగవానునికి నమస్కారము.** |
| **సత్యో, నిత్యః, సర్వసాక్షీ, మహేశో,<br>నిత్యానందో, నిర్వికల్పో, నిరాఖ్యః<br>అచింత్య శక్తిః భగవాన్ గిరీశః<br>స్వావిద్యయా కల్పితమాన భూమిః।** | **ఆ రుద్ర భగవానుడు** →<br>- **సత్యము నిత్యము** అయినట్టివారు.<br>- సమస్తమునకు **సాక్షి.**<br>- తానే సమస్తముగా విస్తరించటముచేత **'మహేశుడు'.**<br>- **నిత్యానంద స్వరూపుడు.**<br>- సర్వ కల్పనలు తనవై, తాను ఆవలివాడవటంచేత **నిర్వికల్పుడు.**<br>- నామరూపములకు పరిమితము కానివాడు కాబట్టి **నిరాఖ్యుడు.**<br>- ఆచింత్యమగు శక్తి సంపన్నుడు, **అచింత్య శక్తుడు.**<br>- సర్వమును ప్రకాశింపజేయుటచే **'భగవానుడు'**।<br>- నిశ్చల స్వరూపుడు కాబట్టి **గిరీశుడు**।<br>- స్వకీయమైన అవిద్య చేతనే సమస్త భూమి - భూమికలు కల్పించుకొని ఆస్వాదించువారు. (Creates all Levels and enjoys).<br>అట్టి ఆ రుద్రదేవునికి నమస్కారము. నమస్కారము. |
| **అతి మోహకరీ మాయా<br>మమ విష్ణోశ్చ, సువ్రత!<br>తస్య పాదాంబుజ ధ్యానాత్<br>దుస్తరా సుతరా భవేత్॥** | ఓ సువ్రతా! పైప్పలాదా! నాచేతను, విష్ణువుచేతను కల్పించబడుచున్న మాయ అత్యంత దుస్తరమైనది. దాటరానిది. అయితే పరమేశ్వరుడగు రుద్రభగవానుని పాదపద్మములను ఆశ్రయించి, ధ్యానిస్తూ ఉన్నావా, ... ఇక 'దుస్తరము' - అగు సంసారము నీపట్ల సు-తరము (తేలికగా తరించి వేయగలిగినది) కాగలదు. |
| **6. విష్ణుః విశ్వ జగత్ యోనిః<br>స్వాంశభూతైః స్వకైః సహ,<br>మమాంశ సంభవో భూత్వా<br>పాలయతి అఖిలం జగత్।** | విష్ణువు తనయొక్క (స్వకీయ) 'అంశ' లచే మమ 'యోని' అగు నాచే సృష్టించబడిన జగత్తును 'పాలన' చేస్తున్నారు.<br>నా 'అంశ'గా జనించిన జగత్తుకు విష్ణువు 'పరిపోషణ' అనే లీలను నిర్వర్తిస్తున్నారు. |
| **వినాశం కాలతో యాతి<br>తతో అన్యత్ సకలం మృషా।** | అట్టి ఈ సాకార - సగుణ కల్పిత జగత్తు అంతా కూడా - కాలగతిగా వినాశనము పొందుతోంది. **ఈ రుద్రుడు కాలః కాలుడు.** కాలమునకే నియామకుడు. ఆయన అనన్యుడు. 'అన్యము' అనునదే లేనివాడు. ఆ రుద్రభగవానునికి అన్యముగా అనిపించేదంతా **'మృష'** (భ్రమ) యే. |

| | |
|---|---|
| **ఓం తస్మై మహాగ్రాసాయ<br>మహాదేవాయ శూలినే,<br>మహేశ్వరాయ మృడాయ<br>తస్మై రుద్రాయ నమో అస్తు॥** | ❖ స్వామి 'ఓం' శబ్ద-సంజ్ఞార్థ స్వరూపులు.<br>❖ తరంగములన్నీ జలములో లయమగుచున్న తీరుగా సమస్తమునకు **మహాగ్రాసుడు.. లయకారుడు.**<br>❖ ఆయన దేవతలకే ఉపాస్యము కాబట్టి - **మహాదేవుడు.**<br>❖ **త్రిలోకములను, త్రిగుణములను సాయుధులై** ధరించుటచే **త్రిశూలురు.**<br>❖ సమస్త దేహములలో, భావములలో, మనస్సులలో వేంచేసియున్న **మహేశ్వరులు.**<br>❖ మృడుడు (మృగచర్మధారుడు). **అట్టి రుద్ర పరంధామునికి నమస్కారము. నమస్కారము.** |
| **7. ఏకో విష్ణుః మహద్భూతం<br>పృథక్ భూతాని అనేకశః<br>త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా<br>భుంక్తే విశ్వభుగ్ అవ్యయః॥** | మహద్భూతుడు, ఏక స్వరూపుడు అగు విష్ణువే స్వకీయమాయచే - పాంచభౌతికంగాను, అనేక భూతజాలము (జీవ జాలము)గాను ప్రదర్శనమగుచున్నారు.<br>సమస్త జీవులయొక్క **ఆత్మస్వరూపుడు, అవ్యయుడు**-అగు ఆ విష్ణువే విశ్వానుభవి (జీవుడు) అయి **'స్వకీయ కల్పన'** అగు విశ్వమును ఆస్వాదిస్తున్నారు. ఆ విష్ణువే జీవుడుగా కూడా అయి వెలయుచున్నారు. |
| **చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిః ఏవ చ,<br>హూయతే చ పునః ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు॥** | - (దృశ్య-దేహ-జీవ-ఈశ్వరులనే) నాలుగు (బాహువులు) కలవారు.<br>- (మనో బుద్ధి చిత్త అహంకారములనబడే) మరొక 4 (బాహువులు) కలవారు.<br>- మరల (జీవాత్మ పరమాత్మలనబడే) రెండుగా కూడా అగుచున్నవారు ఆ పరమశివుడే!<br>**అట్టి పరమాత్మ మా పట్ల 'ప్రసన్నుడు' అగు గాక!** |
| **బ్రహ్మార్పణం। బ్రహ్మహవిః।<br>బ్రహ్మాగ్నౌ। బ్రహ్మణా హుతమ్।<br>బ్రహ్మైవ తేన గంతవ్యం,<br>బ్రహ్మకర్మ సమాధినా।** | **సమస్తము బ్రహ్మమే!**<br>నిర్వర్తించబడుచున్న కార్యక్రమమంతా- బ్రహ్మమే।<br>"హవిస్సు (నేయి మొ॥వి) - బ్రహ్మమే।<br>యజ్ఞాగ్నిగుండములోని అగ్ని - బ్రహ్మమే।<br>హుతము (సమర్పించబడేవన్నీ) - బ్రహ్మమే।<br>గంతవ్యము (పొందవలసినది) - బ్రహ్మమే।<br>నిర్విషయ భావన అగు 'సమాధి'. **బ్రహ్మముయొక్క కర్మ విశేషముగా సర్వత్రా సమదర్శనమే - (సమాధి= సమ+అధి). ఈ సమస్తము బ్రహ్మ కర్మయే అగుచున్నది.** |
| **శరాః జీవాః। తత్ అంగేషు భాతి నిత్యం హరిః స్వయమ్।<br>బ్రహ్మైవ శరభః సాక్షాత్ మోక్షదో అయం, మహామునే!** | ఈ జీవులంతా శరభములు (బాణములు) వంటివారు. ఈ జీవులందరి **శరీరాంగములుగా హరియే స్వయముగా నిత్యము ప్రకాశించుచున్నారు.**<br>శరభుడే (రుద్రుడే) బ్రహ్మము.<br>ఓ మహామునీ! ఆయనయే మోక్షప్రదాత కూడా! (ఆయనయొక్క ప్రదర్శనమే నీవు, నేను కూడా!). |

8. మాయావశాత్ ఏవ
దేవా మోహితా మమతా ఆదిభిః।
తస్య మాహాత్మ్య లేశాంశం అపి వక్తుం న శక్యతే।

ఓ పైప్పలాదా! ఎవ్వరి 'మాయ'కు బద్ధులై దేవతలు కూడా మమత మొదలైన బంధములు పొందుచూ (దృశ్యము చూస్తూ ఉన్నప్పుడు) మోహితులై ఉంటున్నారో,- **అట్టి రుద్రభగవానుని మహత్మ్యము యొక్క ఒక లేశము (కించిత్) కూడా మేము వర్ణించజాలము.**

---

పరాత్పర తరం బ్రహ్మ,
యత్ పరాత్ పరతో హరిః,
తత్ పరాత్ పరతో అధీశః।
తస్మాత్ తుల్యో అధికో నహి॥

- పరాత్ పరతరము - '**బ్రహ్మ**'। పరాత్పరమునకే పరము - '**హరి**'।

అయితే, అట్టి హరిరూప పరాత్పరపరముకే పరమైనవారు - **రుద్రుడు**।

**అట్టి పరాత్పరమునకే పరమైయున్న పరమ శివునకు సమానమైనదిగాని, అధికమైనదిగాని వేరే ఏమి ఎక్కడా లేదు.**

---

ఏక ఏవ శివో నిత్యః।
తతో అన్యత్ సకలం మృషా।

ఈ సమస్తము కూడా - నిత్యము, అక్షరము, ఏకము అగు "శివ స్వరూపమే" అయి ఉన్నది.

ఏకము, నిత్యము అగు శివతత్త్వముకంటే వేరుగా ఏదైనా, ఎక్కడైనా అనిపిస్తూ ఉంటే, - అది భ్రమ (మృషము) (Illusion) మాత్రమే.

---

తస్మాత్ సర్వాన్ పరిత్యజ్య,
ధ్యేయాన్ విష్ణ్వాదికాన్ సురాన్।
శివ ఏవ సదాధ్యేయః
సర్వ సంసారమోచకః।
తస్మై మహాగ్రాసాయ మహేశ్వరాయ నమః।

అందుచేత విష్ణువు మొదలైన అన్య దేవతలను వదలి **ఏకము, అఖండము, నిత్యము అగు శివతత్త్వమునే ధ్యానించాలి.** అది సర్వసంసార బంధములనుండి విమోచనము కలిగించగలదు.

అట్టి సమస్తము గ్రహించివేయుచున్నట్టి, సమస్తమునకు లయకారుడయినట్టి **మహేశ్వరునికి నమస్కారము.**

---

పైప్పలాద మహాశాస్త్రం
న దేయం యస్య కస్యచిత్,
నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే,
దామ్భికాయ నృశంసాయ,
శఠాయ, అనృత భాషిణే॥

ఈ ఉపనిషత్‌లో మనము చెప్పుకొనియున్న **"పైప్పలాద మహాశాస్త్రము"** అనబడే **"ఏకాక్షర శివతత్త్వ జ్ఞాన విశేషములు"** బోధించటానికి (కొందరికిగాను) ఈవిధంగా **నిషేధించబడింది :**

- (సర్వాధారమగు పరమాత్మ తత్త్వమును అంగీకరించనట్టి) **నాస్తికునికి,**
- చేసిన మేలు మరచిపోయి, తాను చేసిన సహాయములు మాత్రమే సంభాషించే **కృతఘ్నునికి,**
- దుర్వృత్తులు (Negative Avocation that bother / trouble others) అభ్యసించు **దుర్వృత్తునికి,**
- **దురాత్మునికి** (దోష బుద్ధి కలవానికి),
- **దాంభికునికి** (లేని గొప్ప ప్రదర్శించు వానికి),
- **నృశంసునికి** (క్రూరునికి, ఘాతుకునికి),
- **శఠునకు** (అసూయ, మూర్ఖము, మోహము స్వభావముగా కల వానికి,
- అవాస్తవములను వాస్తవమువలె సంభాషించు వానికి, -

ఇట్టి స్వభావ లక్షణములు కలవానికి పైప్పలాద శాస్త్రము బోధించటము **'నిషేధము'** అని చెప్పబడుతోంది.

---

సువృత్తాయ, సుభక్తాయ సువ్రతాయ సుశీలినే,
గురుభక్తాయ దాంతాయ, శాంతాయ ఋజు చేతసే,
శివ భక్తాయ దాతవ్యం, బ్రహ్మ కర్మోక్త, ధీమతే!

**సువృత్తునకు** (సాత్త్విక - శుభప్రద వృత్తులు కలవానికి), **దాంతునకు** (ఓర్పు, ధైర్యము, బహిరింద్రియ నిగ్రహము, కష్ట సుఖ సందర్భములలో సహనము కలవానికి), **శాంత స్వభావునకు, ఋజువర్తనునకు** (త్రికరణ శుద్ధి కలవానికి), **శివభక్తి కలవానికి,** బ్రహ్మోపాసనా సంబంధమైన కర్మ నిర్వర్తించు ఉత్తమ బుద్ధి కలవానికి **తప్పక బోధించబడు గాక!**

| | |
|---|---|
| **స్వభక్తాయైవ దాతవ్యమ్<br>అకృతఘ్నాయ సువ్రత!<br>న దాతవ్యం సదా గోప్యం,<br>యతోనైవ, ద్విజోత్తమ!** | ఓ సువ్రతా! పైప్పలాదా! భక్తి కృతజ్ఞత కలవానికి ఈ శాస్త్రము సవివరణముగా బోధించబడు గాక!<br>ఓ ద్విజోత్తమా! అనర్హునికి బోధించరాని ఈ శాస్త్రము సదా 'రహస్యము'గా భావించబడు గాక। భక్తి లేనివానికి, కృతఘ్నునికి అడిగినా కూడా చెప్పకూడదు. |
| **పైప్పలాదం మహాశాస్త్రం<br>యో అధీతే శ్రావయేత్ ద్విజః,<br>స జన్మ మరణేభ్యో ముక్తో భవతి।<br>యో జానీతే, సో అమృతత్వం చ గచ్ఛతి।<br>గర్భవాసాత్ విముక్తో భవతి।** | ఓ ద్విజోత్తమా! ఈ పైప్పలాద మహాశాస్త్రమును ఎవరు **అధ్యయనము** చేస్తారో, (మరియు) ద్విజుడై ఎవరు అభిరుచి గలవారికి **వినిపిస్తారో,** అట్టివాడు జన్మ-మరణములనుండి **విముక్తుడు కాగలడు.**<br>ఇందలి సారము ఎరిగినవాడు అమృతస్వరూపుడగుచున్నాడు. గర్భ నరకము నుండి విముక్తుడు అవగలడు. మృత్యువుకు కూడా ఆత్మగా 'సాక్షి' అయి ఆనందముగా శేషించి ఉండగలడు. |
| **9. సురాపానాత్ పూతో భవతి।<br>స్వర్ణ స్తేయాత్ పూతో భవతి।<br>బ్రహ్మహత్యాత్ పూతో భవతి।<br>గురు తల్ప గమనాత్ పూతో భవతి॥** | **ఈ శరభోపనిషత్ అధ్యయనము చేసిన పుణ్యఫలం చేత -**<br>సురాపానదోషము (మత్తు పదార్థముల సేవనము), బంగారము దొంగిలించిన దోషము, బ్రహ్మ హత్య, గురు తల్పగమనము - మొదలైన పంచ మహాపాతకములు చేసి ఉంటే, వాటి దోషములు తొలగి - **ఆ అధ్యయనుడు పవిత్రుడు అగుచున్నాడు.** |
| **స సర్వాన్ వేదాన్ అధీతో భవతి।<br>స సర్వాన్ దేవాన్ ధ్యాతో భవతి।** | అట్టివాడు సర్వ వేదములను ఉపాసన - అధ్యయనము చేసినవాడు, సర్వ దేవతలను ధ్యానించినవాడు కాగలడు. |
| **స సమస్త మహాపాతకాత్ పూతో భవతి।<br>తస్మాత్ అవిముక్తం ఆశ్రితో భవతి।** | సమస్త మహాపాతకముల నుండి పునీతుడు కాగలడు. అట్టి అధ్యయనము చేసినవాడు అవిముక్తము (కాశీ క్షేత్రము)ను ఆశ్రయించిన, సేవించిన పుణ్యము పొందుచున్నాడు. |
| **సతతం శివప్రియో భవతి।<br>స శివ సాయుజ్యమేతి।<br>న స పునరావర్తతే।<br>న స పునరావర్తతే।<br>బ్రహ్మైవ భవతి।<br>ఇతి ఆహ భగవాన్ బ్రహ్మా॥** | అట్టివాడు శివభగవానునికి 'ప్రియము' అగుచున్నాడు. శివసాయుజ్యము పొందగలడు. పునరావృత్తి దోషము పొందడు. **బ్రహ్మవేత్త అయి, బ్రహ్మమే తానై వెలయుచున్నాడు.**<br>---<br>ఈవిధంగా సృష్టికర్త, ప్రజాపతి అగు బ్రహ్మదేవుడు తత్త్వజ్ఞానాభిలాషతో తనను ఆశ్రయించిన పైప్పలాద మునికి శివతత్త్వము బోధించారు. |

**శరభోపనిషత్ సమాప్తా।**
**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥**

***ఇతి శరభోపనిషత్ ।***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥***

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 19 శరభోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

ఈ సమస్త ఇంద్రియ జగత్ విశేషములను అధిగమించి, వాటివాటిపట్ల (అవి ఎట్లా ఉన్నా కూడా ఒక్కటే – అనే రూపంగా), మౌనము సిద్ధించుకొన్న మునులు ఏ 'ఆత్మరూపము' పట్ల **ధ్యాన, ధారణా నిష్ఠులై** ఉంటున్నారో, అట్టి **తివిక్రమ (జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనయొక్క త్రిపాదములు (మూడు అడుగులు) అయి ఉన్నట్టి స్వస్వరూప – సర్వ స్వరూప పరబ్రహ్మమునకు నమస్కారము.**

⌘

పిప్పలాద మహర్షి కుమారుడగు పైప్పలాదుడు తనయొక్క శ్రద్ధతో కూడి తపస్సుచే బ్రహ్మదేవుని మెప్పించారు. **సమస్తమునకు "ఆది", సనాతనుడు, సమస్త జీవులకు పరిపోషకుడు, ప్రజాపతి, సర్వులలో శ్రేష్ఠరూపుడు** అగు బ్రహ్మ భగవానుడు ఒకానొకరోజు పైప్పలాదుని ముందు అనుగ్రహపూర్వకంగా ప్రత్యక్షమైనారు.

⌘

**పైప్పలాదుడు :** హే పితామహా! బ్రహ్మానందస్వరూపా! సమస్త జీవుల స్వరూప స్వభావములను సృష్టిస్తున్న మహా ప్రజ్ఞానంద స్వరూపా! **నమో నమః।** హే భగవన్! **నేను మోక్షార్థినై యున్నాను స్వామీ!**

**బ్రహ్మదేవుడు :** బిడ్డా! పైప్పలాదా! నాకు చాలా సంతోషము. ఇతఃపూర్వంలాగానే ధ్యానము కొనసాగించి క్రమంగా బుద్ధిని సునిశితము, విస్తారము చేసుకొనెదవు గాక! అన్యమును ఉపశమింపజేసుకొనెదవు గాక! అనన్యుడగు పరమాత్మయందు **మమేకత్వము, సునిశ్చలత్వము, అనునిత్యత్వము, స్వాభావికత్వము** పొందెదవు గాక!

**పైప్పలాదుడు :** పరమకారుణ్య మూర్తివగు ఓ ప్రజాపతీ! తమ ఆజ్ఞానుసారం బుద్ధి నిర్మలత, నిశ్చలత కొరకై ధ్యానమునకు ఉపక్రమిస్తాను. అయితే, హే భగవన్! **బ్రహ్మ విష్ణు రుద్రాణాం మధ్యే కోవా అధికతరో ధ్యేయః స్యాత్।** ముక్తికొరకు సృష్టికర్త అగు బ్రహ్మ, పరిపోషణకర్త అగు విష్ణువు, లయకర్త అగు రుద్రులలో ఎవరు అధికతరంగా ధ్యేయముగా (Most Fine Object for Chanting) ధ్యానింపతగిన వారు? అట్టి ఆ యొక్క **అధికతర ధ్యేయము** యొక్క **తత్త్వము ఎట్టిది?**

హే మహాత్మా! నాపట్ల సద్గురువులై, మోక్షమునకు మార్గదర్శకులై, నాకు ఆయా సంబంధిత తాత్త్విక విశేషములను బోధించవలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తూ, శరణు వేడుచున్నాను. **దయతో నా ధ్యానమునకు మార్గదర్శకులవండి.**

**బ్రహ్మ భగవానుడు (పితామహుడు) :**

బిడ్డా! పైప్పలాదా! చెప్పుచున్నాను విను.

'పరమేశ్వరుడు' అగు రుద్రభగవానుని అనుగ్రహ రూపమగు "అఖండ బ్రహ్మతత్త్వము" – అనన్య సామాన్యము. అనేక పుణ్యకార్యములు చేసియున్నట్టి పుణ్యకర్మఫలంగానే సిద్ధించగలదు. **ఈ సమస్తము స్వస్వరూపాత్మ బ్రహ్మముగా – నిస్సందేహముగాను, అనుక్షణికముగాను, స్వాభావికముగాను – స్వానుభవమవటమే రుద్రతత్త్వ జ్ఞానము. అది సమస్తము కంటే శ్రేష్ఠము.**

- ❒ నేను, హరి, ఇంద్రుడు మొదలైన వారమంతా ఎవరికి అవయవములు (అంగముల) వంటివారమో,
- ❒ మేమంతా ఎవరి అంగములనుండి జనిస్తున్నామో,
- ❒ అయినాకూడా మోహవశంచేత మాయొక్క జననస్థానము అయినట్టి శివస్థానమును మేమే ఎరుగలేకుండానే ఉండిపోతున్నామో,
- ❒ ఎవరు దేవతలందరికీ కూడా ఆది స్థానమో, నియామక ప్రజ్ఞాస్థానమో,

అట్టి **సర్వతత్త్వ స్వరూపుడు, సర్వాత్మకుడు అగు రుద్రభగవానుడే** మాకు వరేణ్యుడు (స్తుతింప తగినవాడు), తండ్రి, సర్వముగా విస్తరించి ఉన్నట్టి 'మహేశ్వరుడు' కూడా।

**అట్టి 'పరమేశ్వరుడు' అగు రుద్రభగవానుడు :-**

- బ్రహ్మను సృష్టించి చతుర్వేదములను ప్రసాదించి ఉన్నారు. కనుక సృష్టికి సృష్టికర్తకు 'అగ్ర్యమ్' – మునుముందే ఉన్నవారు, దేవతలకే **పితరుడు (తండ్రి)**. సమస్తమునకు **ప్రభువై** నియమించువారు.
- ప్రళయ (కల్పాంత) కాలములో సమస్తము హరించి తనయందు లయము చేసుకొనువారు. ఏకస్వరూపులై ఆనంద సాగరంలో విహారము చేయువారు. (**భ్రస్యన్ దేవగణన్, త్రసన్ మునిగణన్, నస్యత్ ప్రపంచం లయన్, పశ్యన్ నిర్భయ ఏకయేవ విహరతి ఆనందసాంద్రో భవాన్॥ – (శివానంద లహరి).**
- మరల క్రీడగా, లీలగా, వినోదముగా సృష్టికాలంలో సమస్తమును నియమించువారు. **సర్వశాస్తా।** జగత్తులన్నిటినీ శాసించువారు. వసిష్ఠుడు. (The superlative). **అట్టి రుద్రస్వామి మాకు సర్వదా ఆరాధ్యము.**
- ఏ పరమేశ్వరుడైతే 'శరభ' అను ఘోరమైన, భీభత్సమగు వేషము ధరించి లోకాలను సంహరించు ఆవేశము గల నృశింహ విష్ణుని జయించి వశం చేసుకొన్నారో, మహాబలుడో,
- దేవతలు ఏ హరునికి పాదాభివందనములు సమర్పించి " ఓ మహేశ్వరా! నృశింహ విష్ణువును ఏమీ చేయకండి. రక్షించి తిరిగి మాకు ప్రసాదించండి. ఆయనయే మాయొక్క బలము, వైభవము కదా!" – అని అర్థించగా చిరునవ్వుతో విష్ణుమూర్తిని ప్రసాదించారో...,
- ఏ స్వామి వీరభద్రుడుగా అయి, తన వాడి అయిన నఖములతో (గోళ్ళతో) దక్షయజ్ఞమును ధ్వంసము చేసారో,
- ఏ స్వామి కరి చర్మాంబరధారియో, వీరాధివీరుడో,

**అట్టి ఏక – అఖండ – సర్వాత్మకుడగు పరమేశ్వరుడే మాచే సర్వసిద్ధికై ఉపాసించబడువారు. మాయొక్క సృష్టి స్థితి సామర్థ్యముల కొరకై సమస్తము ప్రసాదించగల రుద్రభగవానుని స్తుతిస్తున్నాము. శరణు వేడుచున్నాము.**

- **యో బ్రహ్మణః పంచమ వక్త్ర హంతా।** ఎవరైతే సృష్టికర్తయగు **బ్రహ్మదేవుని యొక్క** (తన సృష్టిలోని స్త్రీని కామించిన కారణంగా) **ఐదవ ముఖమును ఎడమ చేయి చిటికిన వ్రేలుతో ఖండించారో,**

- **యోఽపి స్ఫులింగేన లలాటజేన సర్వం జగత్ భస్మసాత్ వై కరోతి।** ఎవరు ప్రళయకాలంలో లలాటము నుండి (మూడవ నేత్రము నుండి) జనించే జ్ఞానాగ్ని యొక్క స్ఫులింగము (నిప్పురవ్వ)చే ఈ అనేక బ్రహ్మలతో కూడిన ఈ దృశ్య జగత్తునంతా భస్మము చేసి వేయుచున్నారో,

- **పునశ్చ సృష్ట్వా, పునరప్యరక్ష దేవగ్ం స్వతంత్రం ప్రకటీ కరోతి।** తిరిగి సృష్టికాలంలో తన అమృతమయమగు దృక్కులతో ఈ సృష్టినంతా పునః పునః సృష్టిస్తూ ఇదంతా అత్యంత మధురముగా చేసివేస్తున్నారో, దేవాది దేవుడై ఈ సృష్టినంతా సర్వస్వతంత్రముగా ప్రకటిస్తూ సర్వదా రక్షిస్తూ ఉన్నారో,

**తస్మై రుద్రాయ నమో అస్తు।** అట్టి రుద్ర దేవాది దేవునికి **'నమో నమః'।** (స్వామి అనుగ్రహముచే) మాకు **"(న)"** బ్రహ్మముతో **(మః)** జీవైక్యము (జీవ బ్రహ్మైక్యము) సిద్ధించును గాక!

❖ ❖ ❖

బిడ్డా! పైప్పలాదా! రుద్రోపాసనాపూర్వకంగా ఇంకా కూడా కొన్ని విశేషాలు చెప్పుకుందాము. విను.

- ఏ పరమేశ్వరుడైతే – (శివలింగమును కౌగిలించుకొని భక్తి పారవశ్యంగా శరణువేడిన మార్కండేయుని రక్షించటానికి) – తన ఎడమ పాదముతో ఘోరమైన స్వభావముగల "మృత్యు అధినేత, దిక్పాలకుడు" అగు **యముని గుండెను తన్ని, భక్తుని రక్షించారో (వక్షస్తాడన మంతకస్య కఠిన ఆపస్మార సంమర్దనమ్।** – శివానంద లహరి),

- దేవ దానవులు [ మృత్యువు (మార్పు)కు ఆవలిదైన ] **అమృతత్వము** యొక్క (అమృతము యొక్క) సిద్ధి కొరకై పాల సముద్రమును మధిస్తూ ఉండగా జనించిన హాలాహలమును (కాలకూట విషమును) లోక రక్షణార్థమై త్రాగి కంఠనమున నిలిపి, **'నీల కంఠుడు'** అను బిరుదు పొందారో,

- సర్వదా లోక రక్షక, లోక కళ్యాణ కారకులై ఉంటున్నారో, కాలఃకాలుడై కాలమునకు ఆవలిదగు ఆత్మతత్త్వామృతమును లోకస్థులు పొందటానికి మార్గదర్శకులగుచున్నారో,

  ***అట్టి రుద్ర పరమాత్మకు నమో అస్తు। నమో నమః। నమస్కారము.***

ఇంకా కూడా,

- **యో వామ పాదార్చిత విష్ణునేత్రః తస్మై దదౌ చక్రమతీవ హృష్టః।** ఏ పరమశివుని ఆత్మానందపూర్వకమగు శివతాండవము దర్శిస్తూ ఉండగా పరవశుడై విష్ణువు – రుద్రుని ఎడమ పాదమును దర్శిస్తూ తనను తాను సమర్పించుకొని బ్రహ్మానందము సిద్ధించుకొన్నారో,

  అది గమనించిన ఆ శివదేవుడు ఎంతగానో ఆనందించినవారై విష్ణువుకు చక్రాయుధము (విష్ణుచక్రము) ప్రసాదించారో...,

  **తస్మై రుద్రాయ నమో అస్తు।** అట్టి రుద్రభగవంతునికి నమస్కారము.

- దక్ష ప్రజాపతి నిరీశ్వర (ఈశ్వర తిరస్కారముతో కూడిన) దక్ష యజ్ఞము నిర్వర్తిస్తూ ఉండగా, దక్షప్రజాపతి కుమార్తె, రుద్రుని అర్థాంగి సతీదేవి 'పుట్టినిల్లు ఆడపడుచు' భావనతో యజ్ఞ ప్రాంగణము ప్రవేశించింది. ఆమెను – శివదూషణలతో అవమానించగా ఆ దేవి యోగాగ్నికి, దేహమును సమర్పించారు. అప్పుడు రుద్రభగవానుని స్వకీయ 'అంశ' అగు వీరభద్రుడు రుద్రశిఖ నుండి జనించి దక్షుని శిక్షిస్తూ ఉన్న సమయంలో విష్ణు భగవానుని పెద్దపాశముతో కట్టిపడేశారు. **అట్టి ఆది దేవుడగు రుద్రునికి నమస్కారము.**

- ఏ స్వామి లీలగా త్రిపురాసుర త్రిపురములయొక్క తనయొక్క మూడవ నేత్రమునుండి జనించిన 'అగ్ని' యొక్క ఒక శిఖచే ఒక్కసారిగా దహించివేశారో (**అంతరార్థంగా** – జాగ్రత్, స్వప్న సుషుప్తులను తన యొక్క తురీయ తాత్త్విక స్వరూపంతో కేవలసాక్షిత్వమునందు లయింపజేసివేస్తున్నారో), **ఆ స్వామిని శరణు వేడుచున్నాము.**
- ఏ భగవానుడు తనయొక్క మూడవ కన్నుతో కాముని (మన్మథుని) క్షణంలో భస్మము చేసివేశారో, **అట్టి రుద్రభగవానునికి నమో నమః।**
- ఏ దేవాది దేవుడు సూర్య–చంద్ర–అగ్నులను తనయొక్క త్రినేత్రములుగా కలిగియుండి, జడమాత్రమగు ఈ జగత్తంతా తేజోమయము చేసివేస్తున్నారో, అట్టి జగత్ప్రభువుకు నమస్కారము.
- ఏ పరమ పురుషుడు సృష్టిలోని  సమస్త జీవుల జీవన ప్రయోజనము కొరకై దేవతలందరిని 'పశువులు'గా తీర్చిదిద్ది, తాను 'పశుపతి' అయి ఉన్నారో, – **తస్మై రుద్రాయ నమో అస్తు।**
- మహావిష్ణువు మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన ఇత్యాది అవతారముల ధారణచే మనో వికార – వికల్పములు పొందగా, ఏ భగవంతుడగు రుద్రుడు అట్టి మనస్సును తన స్వాధీనము చేసుకొని విష్ణు భగవానునికి స్వాంతనము ప్రసాదించుచున్నారో,
- ఎవరు మన్మథుని, యమింపజేసి, చూపు మాత్రంచేత భస్మము చేసివేశారో, – అట్టి రుద్రునికి నమస్కరిస్తున్నాము.

ఓ పైప్పలాదా! కాలకూట విషమును కంఠమునందు బంధించి 'నీల కంఠుడు' అని స్తుతించబడే మహేశ్వరుని ఆత్మానంద–దివ్య ఔన్నత్యమును పరిపరివిధములుగా స్తుతిస్తూ దేవతలు క్షమాపణలు వేడుకొంటూ ఉంటున్నారు.

**ఆ పరమేశ్వరుడు** – (ఆధి భౌతిక, అధి దైవిక, ఆధ్యాత్మికములనబడే – Physical, mental and spiritual) తాపత్రయముల నుండి (Trio - worries) జీవులపట్ల సంభవిస్తున్న నానావిధములైన దుఃఖముల నుండి – రక్షించువారు అయిఉన్నారు.

**("నా రుద్రో రుద్రమర్చతి"** మొదలైన) అద్వైతపూర్వకమైన అనేక స్తుతులచే, మంత్రములచే ప్రార్థించబడుచున్న రుద్ర భగవానుడే సర్వ దేహములలో "ఆత్మ (The absolute self of all selves)" – అయి విరాజిల్లుచున్నారు.

-----

**భగవంతుడు (సమస్తము తనయొక్క వెలుగుగా కలిగి ఉండువాడు), ఆద్యుడు** (One who is there prior to all Beginings) అగు శంకరుడే సమస్త జీవులను రక్షించువారు. ఈ జీవుడు జీవించి ఉన్నప్పుడు 'జీవనము' ప్రసాదిస్తూ, దేహ పతనానంతరము కూడా ఈ జీవునికి 'తోడు'గా ఉండటానికే **'శ్మశానవాసి'** అగుచున్న త్యాగమూర్తి. (**శ్మశానము** = ఈ జీవుడు అప్పటి వరకు ఉపయోగించిన భౌతికదేహమును కోల్పోవుచున్న తరుణము, దేహానంతరము పొందుచున్న స్థితి, గతులకు ప్రతీక).

- **"ఈ పరమశివుని పాదపద్మములు ఎక్కడ స్థానము కలిగి ఉన్నాయి?"** – అనేది తెలుసుకోవటానికై విష్ణువు ఆది వరాహమూర్తి అయి, ఏ పాదములు దర్శించి శరణాగతి పొందటానికి ఇంకా కూడా (అవి దొరకనందువల్ల) వెతుకుచూనే ఉన్నారో...,
- అవాక్ మానస గోచరమగు అట్టి శివతత్త్వమును స్తుతిస్తూ ఉండగా, విష్ణుమూర్తి సృష్టి పరిపోషణా సామర్థ్యమును పొందుచున్నారో,
- వంగి నమస్కరిస్తు విష్ణుదేవునికి సమస్త సాయుధ సంపదలను, సామర్థ్యములను ఏ రుద్రుడు ప్రేమపూర్వకమైన చూపుతో ప్రసాదిస్తున్నారో,
- **యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ।** ఎవరియొక్క కేవలీ అనంత తత్త్వమును ఎంతో ప్రయత్నించి కూడా పొందలేక మనస్సు తన ఉపకరణము అగు **'వాక్కు'** తో సహా వెనుతిరగవలసి వస్తోందో...,

**ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన। అట్టి ఆనందమయుడైనట్టి శివబ్రహ్మమును ఎరిగినవాడు, – ఇక దేనికి భయపడతాడు? దేనికీ భయపడడు.**

ఆ రుద్ర భగవానుడు ఎక్కడో ఆకాశంలోనో, కైలాసంలోనో లేరు. మరి? జీవుల హృదయాంతరంగుడై...,

- అణువుకు కూడా అణువై, సూక్ష్మాతిసూక్ష్మ స్వరూపుడై, **అణోరణీయాన్,**
- మహాస్థూలమై, మహనీయమైయున్న సమస్త పదార్థములకంటే మహనీయుడై, ఘనీభూతుడై,–**మహతో మహీయాన్** –

**సమస్త జీవుల ఆత్మస్వరూపుడై మౌన – ప్రశాంత – ఆనంద స్వరూపముగా వేంచేసి ఉన్నారు.**

ఎవరి బుద్ధి అయితే ఉత్తమ కర్మలచే కర్మపరిధులను అధిగమించి, నిర్మలమై, దోషరహితమై, సునిశితమై, విస్తారమై ఉంటుందో, – అట్టివారు ఆ రుద్ర భగవానుని యొక్క ఉనికి – తేజో విభవములను తమ హృదయమునందే దర్శిస్తున్నారు.

***ఆ సర్వేశ్వరుడగు రుద్రమూర్తి ఇంకా కూడా...,***

- వసిష్ఠుడు, వామదేవుడు, శ్రీశుకుడు, బ్రహ్మదేవుడు మొదలైన బ్రహ్మజ్ఞానులగు తత్త్వవేత్తలచే తమ హృదయమునందే భావించబడుచూ, అనుక్షణము ఉపాసించబడుచున్నారు.
- సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు మొదలైన సనాతనులగు బ్రహ్మమానస పుత్రులు మొదలైనవారిచే సర్వదా **'హే రుద్రభగవాన్!'** – అని హృదయాంతరంగుడుగా దర్శించబడుచున్నారు.

- **మహేశో।** మహేశ్వరులై ఈ **సమస్తముగా లీలా వినోదంగా** సంప్రదర్శనమగుచున్నట్టి వారు.
- **భగవాన్।** సమస్త దేహములలో వేంచేసి ఉండి, తమయొక్క **'భావనా సౌందర్యము'తో సమస్తము సర్వదా వెలిగించుచున్నట్టి వారు. సర్వులకు అంతర్యామి।**
- **ఆది దేవః।** సమస్తమునకు మునుముందే చేతన (చైతన్య) స్వరూపులై సమస్తమును ప్రసాదించువారవటముచేత **'ఆది దేవులు'.**
- **సత్యో।** సర్వులలో 'నేను ఉన్నాను' అనురూపంగా 'సత్' 'యో' (ఉండియే ఉన్నవారు) కాబట్టి **సత్య (సత్యో) స్వరూపులు.**
- **నిత్యో।** కాలమునకు నియామకులై (కాలః కాలురై) భూత–వర్తమాన–భవిష్యత్ కాలములలో సచ్చిదానంద స్వరూపులు. **నిత్యులు. భూత వర్తమాన భవిష్యత్తులలో సర్వదా యథాతథ స్వరూపులు.**
- **సర్వసాక్షీ।** దృశ్యమునకు ద్రష్టవలె, పఠణము చేయు కథకు పఠించువానివలె **సమస్తమునకు సాక్షీ స్వరూపులై ఉన్నవారు.**
- **మహేశో।** సమస్తమునకు ఆ రుద్రభగవానుడే నియామకుడై, తానే తద్విధంగా విస్తరించి ఉండటముచేత **'మహేశ్వరుడు'** అని స్తుతించబడుచున్నవారు.
- **నిత్యానందో।** తన ఆనందము యొక్క ప్రదర్శనంగానే (స్వకీయ వినోదముగా) సమస్త లోకములను, జాగ్రత్ స్వప్న సుషుప్తులను సృజియించి, పాలించి, ఉపసంహారము నిర్వర్తిస్తున్నవారు. కనుక, **ఈ సమస్త దృశ్య వ్యవహారము ఆ రుద్రదేవుని నిత్యానందమే! ఆయన నిత్యానందులు.**
- **నిర్వికల్పో।** సర్వకల్పనలు తనవై, వాటన్నిటికీ ఆవల నిర్వికల్పులై ఉన్నవారు.

- **నిరాఖ్యః।** (ఆఖ్యః = పేరు)। నామ రూపాదులచే ఏమాత్రము కూడా పరిమితము కానివారు.
- **అచింత్య శక్తిః।** చింతనకు విషయమే కానట్టి సర్వశక్తిమంతులు. సర్వశక్తి స్వరూపులు.
- **భగవాన్।** సమస్తమును వెలుగించువారు (One who enlightens all else).
- **గిరీశః।** హిమగిరిపై సంచరిస్తూ ఉన్న ఈశ్వర స్వరూపులు.
- **స్వ-అవిద్యయా కల్పిత మానభూమిః।** తాము నిష్ప్రపంచ స్వరూపులు అయి ఉండి కూడా, – స్వకీయ అవిద్యచే కల్పితమైన సప్త భూమికలు, సమస్త ప్రపంచము కలవారు. తన కల్పనయందు తానే ప్రకాశించి, సంచారములు చేస్తూ, వినోదించువారు.

ఓ పైప్పలాదా! అట్టి రుద్రస్వామిని మేము ఎల్లప్పుడు సేవిస్తున్నాము.

ఓ సువ్రతా! నాయొక్క, విష్ణువు యొక్క 'మాయ' అత్యంతమోహము కలిగించగలిగినట్టిది. అట్టి దుస్తరమగు మా మాయ, – రుద్రభగవానుని పాదపద్మములు ఆశ్రయించువారికి **'సం-తరా' (తరించటానికి అత్యంత సులభము)** అవుతోంది సుమా! అందుచేత జీవులంతా ఆ శివభగవానుని పాదములను శరణువేడి, మాయనుండి తరించెదరు గాక!

-----

శ్రీ విష్ణుదేవుడు తన అంశలగు దేవతలచే 'తన యోని' అయినట్టి 'జగత్ యోని'ని పాలిస్తున్నారు. ఆయన కాలఃకాలుడగు రుద్రుని అంశ అయి అఖిల జగత్తును రక్షిస్తున్నారు. **వినాశం కాలతో యాతి।** సమస్తము కాలముచేత జనించి, కాలముచేతనే వినాశనము పొందుచున్నది. **రుద్రభగవానుడో? కాలః కాలుడు। కాలమునకే కాలము అయినవాడు. కాలమును నియమిస్తున్నట్టివారు.**

అట్టి రుద్రభగవానుడు **'అనన్యుడు'.** ఈ సమస్తము ఆయనకు అనన్యము (ఏమాత్రము వేరు కానిది) అయి ఉన్నది. **స్వప్నదృశ్యమంతా మెలకువరాగానే ఏమౌతోంది? స్వప్న ద్రష్టలో మౌనంగా లయమౌతుంది కదా!** రుద్రభగవానునికి (లేక) ఆత్మకు అన్యముగా కనిపించేదంతా 'స్వప్న దృశ్యము' లాగానే **మృషము.** (అసత్యము, కల్పితమాత్రము, అబద్ధము, అశక్యము, (Which is impossible to at all exist), అవిషయము) అయిఉన్నట్టిది. రుద్రభగవానుని కల్పనయగు ఇదంతా రుద్రునియందే లయిస్తోంది.

> **ఓం తస్మై మహాగ్రాసాయ, మహాదేవాయ శూలినే, మహేశ్వరాయ మృడాయ, తస్మై రుద్రాయ నమో అస్తు।।** సమస్తమును గ్రహించి తనయందు లయింపజేయు **లయకారుడు**, దేవతలకే దేవత అగుటచే **మహాదేవుడు,** త్రి-గుణాత్మక, త్రి-లోక, త్రి-అవస్థల సంజ్ఞగా చేతియందు శూలము ధరించినట్టి **త్రిశూలి,** సమస్త జీవులుగా విస్తరించిన వారగుటచే **మహేశ్వరులు,** మృడుడు (మృగచర్మధారుడు). (ఆది భిక్షువు) – అగు **రుద్రభగవానునికి నమస్కారము.**

**శ్లో।।  ఏకో విష్ణుః మహత్ భూతం పృథక్ భూతాని అనేకశః,**
**త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుక్, అవ్యయః।।**

శ్రీవిష్ణువు సర్వదా ఏక స్వరూపుడై అందరిలో వేంచేసి ఉన్నవారు. పంచభూతముల ఏకస్వరూపుడవటంచేత **'మహత్‌భూతుడు'.** (పంచభూతములు తనయొక్క మహత్ స్వరూపముగా కలవారు).

అట్టి ఏక-అఖండ స్వరూపుడగు విష్ణువు (ఏకమే అయి ఉండి కూడా) – (ఒకే బంగారము, అనేక అభరణములవలె) – అనేక జీవులుగా రూపములను దాల్చుచున్నారు. ఆయన మూడు లోకములలో అనేక అసంఖ్యాక రూపములు ధరించి సమస్తమును ఆస్వాదిస్తున్నారు.

అట్టి విష్ణుభగవానునికి హోమ ద్రవ్యములు సమర్పిస్తూ యజ్ఞక్రియలు (హోమము) నిర్వర్తిస్తూ ఉన్నాము.

**చతుర్భిశ్చ** – మనో బుద్ధి చిత్త అహంకార పూర్వకంగాను,

**చతుర్భిశ్చ** – దృశ్య – జీవాత్మ – ఈశ్వర – కేవలాత్మకంగాను,

**ద్వాభ్యాం** – జీవాత్మ – పరమాత్మపూర్వకంగాను,

**పంచభిరేవచ** – "ప్రాణ – అపాన – వ్యాన – ఉదాన – సమాన" – పంచ ప్రాణాత్మికంగాను, పంచభూతాత్మికంగాను,

**పునః ద్వాభ్యాం** – మరల ఇహ–పర పూర్వకంగాను (Worldly side of 'what I am' and the original side of 'what I am').

హోమము చేస్తూ ఉండగా మాకు విష్ణు భగవానుడు ప్రసన్నుడు అగు గాక! **"వషట్కము"** (అగ్నియందు వేల్వబడిన హవిస్సు) స్వీకరించి మమ్ములను ఆత్మజ్ఞాన తేజో సంపన్నులుగా తీర్చిదిద్దును గాక!

## బ్రహ్మ కర్మ సమాధి – క్రియాక్రమములు

| | | |
|---|---|---|
| **బ్రహ్మార్పణం =** | అర్పించటము, త్యాగము చేయటము, సమర్పించటము. **హోమము చేస్తున్నవాడు.** | **బ్రహ్మమే।** |
| **బ్రహ్మ హవిః =** | అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఉపయోగించే నేయి, ఇవురుబెట్టిన అన్నము మొ॥వి | **బ్రహ్మమే।** |
| **బ్రహ్మాగ్నౌ =** | ఏ అగ్నికి ఆహూతులు సమర్పిస్తున్నామో అట్టి అగ్ని కూడా | **బ్రహ్మమే।** |
| **బ్రహ్మణాహుతమ్ =** | వేల్చబడినవి, సమర్పించబడినవి | **బ్రహ్మమే।** |
| **బ్రహ్మకర్మ సమాధినా =** | బ్రహ్మము, బ్రహ్మజ్ఞానము, ఉద్దేశించి చేసే సమస్తకర్మలు 'సమాధి' అభ్యాసమే। 'సమస్తము బ్రహ్మమే' అను దృష్టి, దర్శనములే **"బ్రహ్మకర్మ సమాధి"** | |
| **బ్రహ్మైవ తేన గంతవ్యమ్ =** | బ్రహ్మకర్మ, బ్రహ్మోపాసన, బ్రహ్మయజ్ఞము మొ॥ వాటిచే పొందవలసినది ఏది? "నేనే బ్రహ్మమును" – అను స్థానమే. | |

❖❖❖

ఓ మహాముని! పైప్పలాదా!

ఈ జీవులందరూ 'బాణము' వంటి వారై ఉండగా, వారి శరీరములలో హరి నిత్యము స్వయముగా శరభోపాసకులై (శివోపాసకులై) వేంచేసి ఉన్నారు.

❋ శరభుడు అగు శివుడు సాక్షాత్ స్వయముగా బ్రహ్మమే అయి ఉన్నారు.

❋ అట్టి శరభుడే (శివుడే) సాక్షాత్ మోక్ష ప్రదాత! సద్యోముక్తి ప్రదాత.

❖❖❖

ఓ పైప్పలాదా! ఎవరియొక్క 'మాయ'చేత దేవతలంతటివారు కూడా ఈ కల్పిత దృశ్యముపట్ల మోహితులు అగుచు, మమత – అహంకారములను పొందుచూ ఉంటున్నారో.., **తస్య మాహాత్మ్య లేశాంశమ్ అపి వక్తుం న శక్యతే।** – అట్టి పరమేశ్వరుని మహత్మ్యము యొక్క ఒక కించిత్ విభాగము (లేశాంశము కూడా) మాకు వర్ణించటానికి అలవి కానిది సుమా!

❀ **ఇహాత్** – ఈ జీవునికి చెందిన ఇహ ప్రకృతిలోని వ్యష్టి రూపము.

- **పరాత్ –** ఈ జీవునికి సంబంధించి ఇహము (దృశ్యములో కనిపించే అనుభవి – అనుభవము)నకు **ఆధారమై, ఆవల ఏర్పడి ఉంటున్న పరస్వరూపము. పరమ్** (ఆవలి స్వస్వరూపము).
- **పరాత్ పరమ్ –** – సమస్త అనుభవములకు, దేహ–దేహాంతరములకు ఆవలిది.
  – సమస్తమునకు 'సాక్షి' స్వరూపము.
  – సమస్తమునకు ప్రేరణ స్థానము.
  – పరమునకే పరమగు ఆదిస్వరూపము.
- **పరాత్ పరతరమ్ బ్రహ్మా। – "అందరిలోని నేనైన నేనే – నేను"** అయి, సమస్తమునకు వేరైనది కూడా అయినట్టిది. నాటకంలో పాత్రలన్నీ రచయిత సంకల్పమే అయినట్లు, పరాత్‌పరతరము (Next to positive Degree. Comparative Degree) – బ్రహ్మదేవుని ప్రదర్శనమే! (All this is the own manifestation of the superlative i.e., "BRAHMANI")
- **యత్ పరాత్ పరతో హరిః। –** పరమునకే పరమైన వారు (ఈ జీవునికి చెందిన అనేక ఉపాధులు నావైన 'నేను' ) – 'హరి' స్వరూపము.
- **తత్ పరాత్ పరతో అధీశః –** అట్టి (1) పరాత్ (2) పరాత్ పరము (3) పరాత్ పరతరములకు ఆవలివాడు – శివుడు ఒక్కడే! ఆయనకు ఆవల మరింకేమీ లేదు. అందుచేత **'పరాత్ పర తమము'** (The finest of the finest of what everybody of us is) - అని శివభగవానుడు స్తుతించబడుచున్నారు.

-----

ఓ పైప్పలాదా! అట్టి శివతత్త్వము గురించి ఇంకా కొన్ని విశేషాలు చెప్పుకుందాము. వినండి.

**ఏక ఏవ శివో।** అనేకముగా కనిపిస్తున్న ఈ జగద్దృశ్యము – ఏకమగు శివస్వరూపమే! (ఒకచోట అనేక బంగారపు ఆభరణములు ఉన్నప్పటికీ – బంగారము ఏకమే అయి ఉన్నది కదా!).

**నిత్యః।** కాలమునకు ఆవలివారు అవటంచేత ఆ శివుడు [(లేక) మనందరిలోని ఆ శివతత్త్వము] **త్రికాలాబాధ్యము. భూత–వర్తమాన భవిష్యత్తులలో యథాతథము. (కాలః కాల ప్రసన్నానాం కాలః కిన్ను కరిష్యతి?)**

**అట్టి శివునికి అన్యమైనదంటూ** ("జీవుడు – మనో బుద్ధి చిత్త అహంకారములు, – లోకపాలకులు – లోకములు – జ్ఞానులు – అజ్ఞానులు" – మొదలైనదంతా) **ఎక్కడా ఏదీ లేదు.**

అనేకంగా కనిపిస్తూ కూడా శివతత్త్వము ఎరిగిన వానికి ఇదంతా కూడా – **ఏకమగు 'శివానంద లహరి'**గా స్వానుభవమౌతోంది.

**తతో అన్యత్ సకలం మృషా। (శివాత్ పరతరం న అన్యత్ కించిత్ అస్తి।)।** శివునికి వేరై ఎక్కడా ఏదీ కించిత్ కూడా లేనే లేదు. శివునికి, శివతత్త్వమునకు, శివాత్మతత్త్వమునకు, శివసంకల్పమునకు అన్యముగా (వేరుగా) ఏదైనా కనిపిస్తూ ఉంటే, – **అదంతా మృష (భ్రమ, స్వకీయ మనో కల్పన) మాత్రమే! శివుడే ఆత్మ। శివుడే అఖండము। శివుడే నేను। శివోఽహమ్।**

అందుచేత ఓ పైప్పలాదా! ఓ సమస్త ప్రియ ఆత్మతత్త్వాధ్యయనులారా!

**శ్లో।। తస్మాత్ సర్వాన్ పరిత్యజ్య ధ్యేయాన్ విష్ణ్వాదికాన్ సురాన్,**
**శివ ఏవ సదా ధ్యేయః సర్వ సంసార మోచకః।।**

సమస్త సంసార దోషములు తొలగటానికై అన్య దేవతోపాసనను (విష్ణువు వేరు–నేను వేరు, తదితర దేవతలు వేరు. నేను వేరు– మొదలైన అన్యధ్యానములను) పరిత్యజించివేసి, **ఏకము, అఖండము, స్వస్వరూపమునకు అభిన్నము, సమస్త జీవుల స్వాభావిక,**

**సహజ రూపములకు అనన్యము, నిత్యము** – అగు శివతత్త్వమునే – **"తత్ శివో త్వమేవ। శివోఽహమ్। సర్వమిదం శివమ్।"** – అనురూపమగు అనునిత్యోపాసనగా అనుష్ఠించెదరు గాక!

**తస్మై మహాగ్రాసాయ, మహేశ్వరాయ నమో నమః॥**

అట్టి సర్వమును **తనయందు హరించు లయకారుడు**, సమస్తము **ఆకర్షించి గ్రహించివేయు మహాగ్రాసుడు,** (బంగారు ఆభరణములన్నిటికీ బంగారమువలె) సర్వము **తనకు అనన్యమైనవాడు** – అగు **శివభగవానుని, మహేశ్వరునికి నమస్కరిస్తున్నాము.**

## నియమము

**శాస్త్ర నిష్ఠ నియమములు : పైప్పలాద మహాశాస్త్రం న దేయం యస్య కస్యచిత్॥** ఈ "పైప్పలాదము" అనబడే మహాశాస్త్రమును అర్హత లేని వారికి, (అనర్హునికి) బోధించకూడదు – అనునది ఆర్యుల / విజ్ఞుల నియమము.

- ❊ ఈ జగద్దృశ్యమునకు ఆధారమైయున్న దివ్యమగు దైవీ ప్రజ్ఞను అంగీకరించక, **'నాస్తికుడు'**గా ఉన్నవానికి, నాస్తికాచారములు ఆశ్రయించువానికి,
- ❊ ఇతరులు తనకు చేసిన ఉపకారములను మరచి, తాను ఇతరులకొరకై చేయు ఉపకారములు మాత్రమే సంభాషించు **కృతఘ్నునికి,**
- ❊ ఇతరులకు కష్టము కలుగజేయు **దుష్టవృత్తులు విడువని వానికి,**
- ❊ ఇతరులకు అకారణముగా హానిచేయు స్వభావము ప్రదర్శించు **దురాత్ములకు,**
- ❊ తమ గొప్పతనము అధికముగాచేసి సంభాషించు స్వభావము గల **దాంభికునిని,**
- ❊ క్రూరమైన ఘాతుకములు చేయు స్వభావముగల **నృశంసులకు,**
- ❊ అసూయ, మూర్ఖత్వము, మోహము, మౌఢ్యత్వములతో కూడిన అభ్యాసము ఆశ్రయించు **శఠునికి,**
- ❊ అసత్యము సంభాషించటానికి గాని, ఆశ్రయించటానికి గాని వెనుకాడని **అనృతభాషిణులకు,**

ఈ ఉపనిషత్ శాస్త్ర రహస్యములు బోధించటము సముచితము కాదు.

***ఓ ద్విజోత్తమా! రహస్యములలోకెల్ల రహస్యమగు ఈ విద్యను***

- చక్కటి వృత్తులు (నడతలు) కలవానికి,
- భక్తి ప్రపత్తులు కలవానికి,
- ఉత్తమ వ్రతములు నిర్వర్తించువానికి,
- ఉత్తమ శీలత్వము, ప్రవర్తన కలవానికి,
- గురుభక్తి కలవానికి,
- బాహ్య ఇంద్రియ నిగ్రహము గల దాంతునికి,
- శాంత స్వభావునికి,
- మనసా వాచా కర్మణా ఏకభావన, ఋజుత్వము గల చిత్తము గలవానికి,
- శివభక్తుడై ఉన్నవానికి,
- బ్రహ్మతత్త్వ అభ్యాసముతో కూడిన బ్రహ్మకర్మ నిష్ఠునికి,
- కృతజ్ఞత కలిగి ఉండువానికి

***(ఈ పైప్పలాద విద్యను) అర్హతానుకూలంగా తప్పక బోధించబడు గాక!***

## ఫలశ్రుతి

ఎవ్వరైతే ఈ "పైప్పలాద దర్శన విద్య" అనబడే శరభోపనిషత్ విషయములను అధ్యయనము చేస్తారో,

ఎవరు ఇందలి విశేష విద్యను అర్హులగు వారికి విశదీకరిస్తారో, బోధిస్తారో, ప్రవచిస్తారో, –

అట్టి ద్విజుడు జన్మ – మరణ చక్రమునుండి 'విముక్తుడు' అగుచున్నాడు.

ఈ శివతత్త్వ విద్యను ఎరిగినవాడు 'గర్భవాసము' అనే దౌర్భాగ్య (బాధాకర) స్థితులనుండి విముక్తుడగుచున్నాడు.

**యో జానీ తే అమృతత్వం భవతి।** ఇందలి తాత్త్వికార్థమును బుద్ధితో అధ్యయనము చేసి ఎరిగినవాడు – జన్మ జన్మాంతర సందర్భములకు అప్రమేయ సాక్షిత్వము (Mere witness while being unconcerned with comings and goings of physical bodies) పొందుచున్నాడు. **"అమృతత్వము"** సిద్ధించుకోగలడు.

**ఈ శరభోపనిషత్‌లోని రుద్రతత్త్వము (లేక) శివతత్త్వ జ్ఞానము ఆశ్రయించినవాడు –**

**ఇతః పూర్వము నిర్వర్తించియున్న పాపదోషముల నుండి పునీతుడు కాగలడు.**

- సురాపానము (మత్తు ద్రవ్యము) సేవించిన దోషమునుండి,
- బంగారము దొంగిలించిన దోషమునుండి,
- బ్రహ్మహత్యా దోషము నుండి,
- గురుతల్పగమన దోషమునుండి, పంచమహాపాతకముల నుండి పునీతుడు కాగలడు.

---

- నాలుగు వేదములు సేవించిన పుణ్యఫలము పొందగలడు.
- సర్వదేవతలను ధ్యానించిన ఫలము సిద్ధించుకోగలడు.
- సమస్తపాతక, ఉపపాతక దోషములనుండి **పునీతుడు కాగలడు.**
- అవిముక్తము (కాశీ క్షేత్రము) దర్శించి సేవించిన ప్రయోజనములు పొందుచున్నాడు.

---

- అట్టివాడు సర్వదా శివభగవానునికి ప్రియము కాగలడు.
- ఇక్కడే శివసాయుజ్యమును పొందగలడు.
- అట్టివానికి జన్మ-కర్మల పునరావృత్తి దోషములు ఉండవు.
- ఈ ఉపనిషత్ అధ్యయనము చేయువాడు శివతత్త్వ జ్ఞానము, బ్రహ్మజ్ఞానము పొందినవాడై, బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాడు.

-----

ఈవిధంగా బ్రహ్మదేవులవారు పైప్పలాద మహర్షికి పునరావృత్తి దోషము లేనట్టి **"సోఽహం బ్రహ్మ" (లేక) "శివోఽహమ్"** సిద్ధిని బోధించారు.

ఇతి శరభోపనిషత్

ఓం శాంతిః। శాంతిః। శాంతిః।

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 20 సీతోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి
త్రయం యద్భావ సాధనమ్।
తద్బ్రహ్మ సత్తా సామాన్యం
– "సీతాతత్త్వమ్" ఉపాస్మహే॥

తత్త్వ జ్ఞానార్థులు తమ ఉపకరణములుగా ఇచ్ఛ జ్ఞాన క్రియా త్రయీ శక్తులను ఏకముచేసి ఏ 'భావన' సిద్ధించుకోవటానికై ఎక్కుబెట్టుచున్నారో, - **అట్టి సర్వత్రా నవు స్వరూపమై యున్న బ్రహ్మతత్త్వముగు 'సీతాతత్త్వము'**ను ఆరాధన పూర్వకంగా **ఉపాసిస్తున్నాము.**

మం॥ శ్లో॥

1. ఓం దేవా హ వై ప్రజాపతిం అబ్రువన్।
"కా సీతా? కిం రూపం?" ఇతి॥
సహోవాచ ప్రజాపతిః।
– సా సీతా ఇతి॥

ఒక సందర్భములో దేవతలు బ్రహ్మలోకము ప్రవేశించినవారై, బ్రహ్మదేవునికి నమస్కరించి, ఈవిధంగా అడుగసాగారు.

"పితామహా! ప్రజాపతీ!

- 'సీత' అనగా ఎవరు?

- "సీతాదేవి యొక్క దివ్యరూపము ఎట్టిది?"

అప్పుడు ప్రజాపతి - 'సీతాతత్త్వము' గురించి ఈవిధంగా వివరిస్తూ, బోధించసాగారు.

---

2. మూల ప్రకృతి రూపత్వాత్
సా సీతా "ప్రకృతిః" స్మృతా।
ప్రణవ ప్రకృతి రూపత్వాత్
సా సీతా "ప్రకృతిః" ఉచ్యతే।
"సీతా"–ఇతి త్రివర్ణాత్మా
సాక్షాత్ "మాయామయీ" భవేత్॥

**ప్రజాపతి (బ్రహ్మదేవుడు) :** బిడ్డలారా! వినండి.

సీతాదేవి మూలప్రకృతి అయి, ఈ ఎదురుగా గల సమస్త దృశ్య రూపము దాల్చు చున్నది. అందుచేత **"ప్రకృతియే సీతాదేవి"** అని చెప్పబడుతోంది కూడా!

**ప్రణవము యొక్క 'ప్రకృతి' రూపమే సీత.** అందుచేత 'సీతయే ప్రకృతి రూపము' - అనబడుతోంది.

'సీత'యే త్రివర్ణాత్మకమై (సత్త్వ రజో తమో త్రిగుణాత్మకమై) 'సాక్షాత్ మాయా స్వరూపిణి'గా విరాజిల్లుచున్నది.

('స' - 'ఈ' 'తా' - ఇతి త్రివర్ణాత్మికా।)

---

విష్ణుః ప్రపంచబీజం చ।
మాయా 'ఈ' కార ఉచ్యతే॥
"స" కారః సత్యం అమృతం ప్రాప్తః
సోమశ్చ కీర్త్యతే (పరికీర్త్యతే)॥

సీత = 'స' - 'ఈ' - 'త' లోని

**'ఈ' కారము**

**విష్ణు తత్త్వము.** ప్రపంచమునకు బీజము కాబట్టి **'మాయ'** అని కూడా అనబడుతోంది.

**'స' కారము**

**"సత్యము, అమృతము"** అగు ఆత్మ తత్త్వానుభవమునకు సంజ్ఞ. 'సోమ' అని కూడా కీర్తించబడుతోంది.

| | |
|---|---|
| 'త' కారః తారలక్ష్మ్యా చ<br>వైరాజః ప్రస్తరః స్మృతః। | **'త' కారము**<br>- తార (తరింపజేయునది).<br>- 'లక్ష్మీ తత్త్వము'గా సమస్త బాహ్య దృశ్య సంపదగా విరాజమానము. |
| 'ఈ' కార రూపిణీ 'సోమా', అమృతావయవ దేవీ | **'ఈ' కారము**<br>'ఈ' కార రూపిణి = సోమ (చంద్ర) రూపిణి.<br>అమృతమగు (మృత / మార్పు స్వభావము లేనట్టి) దేవీరూపము. |
| అలంకార 'స్రన్' మౌక్తికాది ఆభరణ అలంకృతా। | మౌక్తికము (ముత్యము) మొదలైన ఆభరణములచే అలంకరించబడినట్టి సాకార సాలంకృత రూపము. |
| మహామాయా, అవ్యక్త రూపిణీ - వ్యక్తా భవతి। | మహామాయ. స్వతఃగానే ఎల్లప్పటికీ 'అవ్యక్త'గా ఉంటూనే, ఈ సమస్తమును **'వ్యక్తీకరించునది' గా అగుచున్నది. వ్యక్తీకరణమంతా తానే అయి ఉంటున్నది కూడా.** |
| (1) ప్రథమా శబ్ద బ్రహ్మమయీ,<br>స్వాధ్యాయ కాలే ప్రసన్నా,<br>ఉద్భావనకరీ సాత్మికా। | **(1) శబ్ద బ్రహ్మరూపము :** మూల ప్రకృతి అగు సీతాదేవి యొక్క మహామాయ మొదటిరూపము - శబ్దబ్రహ్మమయీ రూపము. అట్టి శబ్ద బ్రహ్మరూపంతో స్వాధ్యాయనము (వేదాధ్యయనము) చేయుచోట ప్రసన్న రూపిణి అయి ఉంటుంది. ఉత్తమ, ఉన్నత భావాలు కలుగజేస్తూ ఉంటుంది. |
| (2) ద్వితీయా భూతలే హలాగ్రే సముత్పన్నా। | (2) ఆ సీతాదేవి యొక్క రెండవ మాయా రూపము - నాగలి యొక్క చివరి స్పర్శచే (జనకుని భూమిలో) లభించిన భూమిజా రూపము. |
| (3) తృతీయా 'ఈ' కార రూపిణీ,<br>అవ్యక్త స్వరూపా భవతి-ఇతి 'సీతా'। | (3) మూడవ రూపము - జగత్తంతా తన వ్యక్తీకరణమే అయి ఉన్నట్టి - తనయొక్క 'అవ్యక్త రూపము'. |
| - ఇతి ఉదాహరంతి శౌనకీ యే,<br>శ్రీరామ సాన్నిధ్యవశాత్<br>జగదానంద కారిణీ। | ఈవిధమైన సీతామాత యొక్క త్రివిధ మాయారూపము - శౌనకీయము. (శౌనకీ తంత్రములో చెప్పబడింది). అయితే అట్టి మహామాయా స్వరూపిణి- శ్రీరామచంద్రుని సాన్నిధ్యవశంచేత సారూప్యము పొంది, **'జగదానందకారిణి'**- అగుచున్నది. |
| ఉత్పత్తి స్థితి సంహారకారిణీ।<br>సర్వదేహినాం సీతా భగవతీ।<br>జ్ఞేయా। 'మూలప్రకృతి' సంజ్ఞితా।<br>ప్రణవత్వాత్ 'ప్రకృతిః' - ఇతి<br>వదంతి బ్రహ్మావాదిన ఇతి। | ఈ 'సీత' యే "మూలప్రకృతి' అని సంజ్ఞాపూర్వకంగా చెప్పబడుచూ<br>1. సమస్తమునకు ఉత్పత్తి-స్థితి-లయ కారణి అయి ఉంటున్నది.<br>2. సమస్త దేహములలో (i) 'దేహి' రూపిగా (ii) సర్వమును 'ఎరుక'చే వెలిగించునది (భగవతీ)(iii) ఎరుగబడు సమస్తముగా కూడా వెలయుచున్నది.<br>'సీత' - ప్రణవ స్వరూపిణి. **'మూల ప్రకృతి రూపిణియే సీత'** - అని బ్రహ్మవేత్తల ప్రవచనము. |
| అథాతో "బ్రహ్మ జిజ్ఞాసా" ఇతి చ।<br>సా సర్వ వేదమయీ। సర్వ దేవమయీ।<br>సర్వ లోకమయీ। సర్వ కీర్తిమయీ।<br>సర్వ మయీ। సర్వ ధర్మమయీ।<br>సర్వాధార కార్యకారణమయీ। | ఆ దేవి జీవులలోని (బ్రహ్మసూత్రముల ప్రారంభసూత్రము అయినట్టి) **బ్రహ్మజిజ్ఞాసా।** (సమస్తము అయి ఉన్న స్వరూపము గురించిన జిజ్ఞాసా) **స్వరూపిణీ।** అని కూడా అనబడుతోంది.<br>ఆ దేవాదిదేవి, త్రి జగన్మాత ఇంకా ఎట్టి మహిమ కలిగిఉన్నదంటే, **ఆ సీతామాతయే→**<br>❖ **తెలియబడేదంతా తానే అయి ఉన్నట్టిది.** చతుర్వేదములలో ఉపాస్య వస్తువు ఆ దేవియే. అందుచేత **సర్వవేదమయీ।**<br>❖ సమస్త దేవతలు తన విస్తరిత స్వరూపమే కాబట్టి **సర్వదేవమయీ।**<br>❖ సమస్త లోకములు ఆ జనని యొక్క అవలోకనా చమత్కారమే కనుక - **సర్వలోకమయీ। (అవలోకనా విశేషమితి లోకమ్)।**<br>❖ సీతాదేవీ మూల ప్రకృతి స్వరూపిణి। ఇంకాకూడా - **సర్వ కీర్తిమయీ। సర్వమయీ। సర్వధర్మమయీ।** |

| | |
|---|---|
| మహాలక్ష్మీః దేవేశస్య భిన్న-అభిన్న రూపా। చేతన-అచేతనాత్మికా। | ఈ సీతామాతయే...., మహాలక్ష్మి మొదలైన దేవతా స్త్రీలందరికి **భిన్న స్వరూపము, అభిన్న స్వరూపము** కూడా! (సమస్తమునకు పరము। సమస్తము తానే।) - ఆ తల్లి చేతన-అచేతనాత్మిక। [**కదలునది** (మరియు) సమస్తమైన కదలికలు తనవై, తాను మాత్రం **కదలనిది**]. |
| బ్రహ్మా స్థావరాత్మా। తద్గుణ కర్మ విభాగ భేదాత్ శరీర రూపా। | - బ్రహ్మదేవుని నుండి స్థావరము వరకు ఆత్మ స్వరూపిణియే - ఆ దేవి. - తనయొక్క గుణ-కర్మ విభాగభేదంచేత ఈ సమస్త శరీరములు ధరిస్తూ ఉన్నది. |
| దేవర్షి మనుష్య గంధర్వ రూపా। అసుర రాక్షస భూత ప్రేత పిశాచ భూతాది భూత శరీర రూపా। | - ఆ మాతయే దేవ, ఋషి, మనుష్య గంధర్వ స్వరూపిణి కూడా. - అసురుల, రాక్షసుల, భూత ప్రేత పిశాచముల ప్రదర్శనమంతా ఆ సీతామాతకు చెందినదే! "ఆకాశ-వాయు-అగ్ని-జల-పృథివి" అనే మహా పంచభూతములకు ఆది స్థానము. జనన స్థానము. పాంచభౌతికమైన సమస్త భౌతిక నామ రూపములు ఆ సీతాదేవీ శక్తి విన్యాస ప్రదర్శనములే! |
| భూతేంద్రియ మనః ప్రాణరూపేతి చ విజ్ఞాయతే॥ | **ఆ దేవియే →** పంచభూత, పంచకర్మేంద్రియ, పంచజ్ఞానేంద్రియ, పంచప్రాణ రూపిణిగా వెలయుచు, తెలియబడుచున్నది. |
| <u>శక్త్యాత్మనా త్రివిధం భవతి</u><br>3. సా దేవీ త్రివిధా భవతి శక్త్యాత్మనా। "ఇచ్ఛాశక్తి", "క్రియాశక్తి", "సాక్షాత్ శక్తిః" ఇతి। | ఆ సీతాదేవి త్రి-శక్త్యాత్మిక. తన శక్తితో త్రి (3) విధములుగా సంప్రదర్శన మౌతోంది. **(1) ఇచ్ఛాశక్తి (2) క్రియాశక్తి (3) సాక్షాత్ శక్తి** |
| ఇచ్ఛాశక్తిః త్రివిధా భవతి। శ్రీ భూమి నీళాత్మికా, భద్ర రూపిణీ, ప్రభావ రూపిణీ సోమ సూర్య అగ్ని-రూపా భవతి। | ఇచ్ఛాశక్తి మూడు విధములుగా -<br>❖ శ్రీ, భూమి, నీళాత్మికా।<br>❖ భద్రరూపిణీ।<br>❖ ప్రభావరూపిణీ।<br>**సోమ సూర్య అగ్ని రూపాత్మిక । అయి ఉంటోంది.** |
| సోమాత్మికా-ఓషధీనాం ప్రభవతి। | సీతాదేవి యొక్క ఇచ్ఛా శక్తియే సోమాత్మిక (చంద్రాత్మ) అయి, భూమిపై ఓషధులుగా ప్రభవిస్తోంది. |
| కల్పవృక్ష, పుష్ప, ఫల, లతా, గుల్మాత్మికా ఔషధ భేషజాత్మికా, అమృతరూపా। దేవానాం మహస్తోమ ఫలప్రదా। | కల్ప వృక్షముగాను, పుష్ప ఫల లతా, గుల్మాత్మికముల (పొద) రూపములుగాను, ఓషధ ప్రదర్శనాత్మికగాను అమృతరూపమై వెలయుచున్నది. దేవతలకు మహస్తోమ ఫలము (యజ్ఞఫలము) అందింపజేయుచున్నది. |
| అమృతేన తృప్తిం జనయతి దేవానాం, అన్నేన, (మనుష్యానాం), పశూనాం తృణేన, తత్ తత్ జీవానాం। | **దేవతలకు అమృతమును, మానవులకు అన్నమును, పశువులకు గడ్డి, ఆయా జీవులకు ఆయా ఆహారములు అందించునది - జగజ్జననియగు సీతాదేవియే!** |

| | |
|---|---|
| **4. (సూర్యాత్మికా)–సూర్యాది సకల భువన ప్రకాశినీ।** | సూర్యగోళము నుండి - సమస్త భువనములను ప్రకాశింపజేయునది - **'మూలప్రకృతి' రూపిణియే।** |
| **దివా చ రాత్రిః కాలకలా నిమేషం ఆరభ్య,**<br>**ఘటిక అష్టయామ దివస వార రాత్రి భేదేన పక్ష**<br>**మాస ఋతు అయన సంవత్సర**<br>**భేదేన మనుష్యాణాం శతాయుః**<br>**కల్పనయా ప్రకాశమానా।** | 'సీతాశక్తి' కాలస్వరూపిణి అయి విరాజిల్లుచున్నది. రాత్రింబవళ్ళ రూపమున కాలమును ప్రదర్శిస్తున్నది.<br>కాలరూపముతో కలానిమేషము (Fraction of a minute) - మొదలుకొని, ఘటికా, అష్టయామము (8 జాముల దినము), దివసము (Day), వారము (Week) రాత్రింపగళ్ళ భేదంతో, పక్ష, మాస, ఋతు, ఉత్తరాయణ, దక్షిణాయన, సంవత్సర భేదములతో శతసంవత్సర కల్పన (Century)గా ప్రకాశించుచున్నది. |
| **చిరక్షిప్ర వ్యపదేశేన నిమేషం ఆరభ్య**<br>**పరార్ధ పర్యంతం కాలచక్రం జగచ్చక్రం**<br>**ఇత్యాది ప్రకారేణ చక్రవత్ పరివర్తమానా**<br>**సర్వస్య తస్యైవ కాలస్య విభాగ విశేషాః,**<br>**ప్రకాశరూపాః కాల రూపా భవంతి॥** | **ఆ దేవియే → కాలరూపాః। ప్రకాశరూపాః।**<br>చిర (Long time) - క్షిప్ర (Immediate/Short time) రూపముగా నిమేషము నుండి (from the point of Eye Lap time) పదార్థము (matter) పర్యంతము కాలచక్రమును, జగత్ చక్రమును త్రిప్పుచు, తనయొక్క సమస్త పదార్థ విభాగ విశేషములుగా 'ప్రకాశరూప' అయి, **కాలరూపం**గా విద్యమానమై ఉన్నది. |
| **5. అగ్నిరూపా, అన్నపానాది**<br>**ప్రాణినాం క్షుత్ తృష్ణాత్మికా।** | **ఆ సీతాభగవతి తనయొక్క దివ్య చైతన్య తత్త్వస్వరూపముతో →**<br>❋ విశ్వమంతా అగ్ని-తేజోరూపమై విరాజిల్లుచున్నది.<br>❋ దేహములో జఠరాగ్ని రూపముగా ఉండి<br>- జీవులకు ఆకలి, దాహము కలిగించటము,<br>- వైశ్వానర రూపముతో చతుర్విధ అన్నములను పచనముచేయటము,<br>❋ శక్తిగా మరల్చి శరీరమంతా శక్తివంతముచేయటము<br>**నిర్వర్తించుచున్నది.** |
| **దేవానాం ముఖరూపా।**<br>**వన–ఔషధీనాం శీతోష్ణరూపా।**<br>**కాష్ఠేషు అంతః బహిశ్చ (అంతర్బహిశ్చ)**<br>**"నిత్య అనిత్య రూపా" భవతి॥** | సమస్త దేవతల ముఖరూప తేజస్సు తానే అయి ఉంటోంది.<br>వన ఔషధములలో శీత-ఉష్ణరూపిణిగా ఉన్నది. కాష్ఠము (దేహము) యొక్క లోపల-బయట రూపము తానే అయి ఉన్నది. **సమస్త జీవులలోని నిత్య-అనిత్య రూపము - తానే।**<br>ఈవిధంగా **మూలప్రకృతి స్వరూపిణిగా తానే సమస్తము అయి ఉంటోంది.** |
| **శ్రీదేవీ త్రివిధం**<br>**6. శ్రీదేవీ త్రివిధం రూపం కృత్వా**<br>**భగవత్ సంకల్ప అనుగుణ్యేన**<br>**లోక రక్షణార్థం రూపం ధారయతి।**<br>**'శ్రీః' ఇతి। 'లక్ష్మీః' ఇతి। 'లక్ష్యమాణా భవతి'**<br>**ఇతి। – విజ్ఞాయతే।** | ఆ శ్రీదేవి - ప్రకృతి స్వరూపిణిగా భగవత్ సంకల్పానుసారంగా లోక సంరక్షణార్థము **మూడు విధములైన రూపములను** ధారణ చేస్తోంది.<br>(1) 'శ్రీ' - ఇతి।<br>(2) 'లక్ష్మి' - ఇతి।<br>(3) 'లక్ష్యమాణా' - ఇతి। (లక్షించబడునదిగా)<br>**ఈ మూడు రూపములుగా తెలియబడుతోంది.** |
| **భూదేవీ సప్త సాగరాంభః సప్తద్వీపా వసుంధరా।**<br>**భూః ఆది చతుర్దశ భువనానాం ఆధార–**<br>**ఆధేయాం ప్రణవాత్మికా భవతి।** | సీతాదేవియే **భూదేవి**గా (హిందూ, అరేబియా, పసిఫిక్, ఆర్కిటిక్, అంటార్కిటిక్ మొదలైన) **సప్త సముద్రములతోను, (జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శౌక, పుష్కర** - అనబడే) **సప్త ద్వీపములతోను 'వసుంధర'** అయి వెలయుచున్నది. |

| | |
|---|---|
| నీళాచ ముఖ విద్యున్మాని(లి)నీ<br>సర్వ ఔషధీనాం సర్వప్రాణినాం<br>పోషణార్థం సర్వరూపా భవతి। | **నీళాదేవిగా** →<br>'ముఖ విద్యుత్‌మానిని' (ఉష్ణశక్తి, తేజోరూపిణి అయి) - భూమిలో **సర్వౌషధ (ఓజో) రూపిణిగాను,** భూమిపై - **సర్వప్రాణుల (తేజో) రూపంగాను** అగుచున్నది. సర్వప్రాణులకు 'తల్లి' అయి, అట్టి సర్వజీవుల పోషణార్థము- **"సర్వరూప" అయి భూమి లోపల, బయట కూడా ప్రదర్శనమౌతోంది.** |
| సమస్త భువనస్య అధోభాగే<br>జలాకారాత్మికా మండూకమయి ఇతి,<br>భువనాధార ఇతి-విజ్ఞాయతే॥ | ఇంకా కూడా, ఆ శ్రీదేవి అగు సీతాదేవియే సమస్త భువనముల అధోభాగంలో **"జలదేవత"**గా ప్రదర్శనమగుచున్నది. **"జలాకారాత్మిక"**గా అయి సమస్త జీవుల **'జీవనాధార'** అగుచున్నది.<br>మండూకమయ (కప్పరూపంగా) సమస్త భువనమునకు ఆధారమై వెలయుచున్నది. |
| 7. క్రియాశక్తి స్వరూపమ్।<br>హరేః ముఖాత్ నాదః।<br>తత్ నాదాత్ బిందుః।<br>బిందూ – ఓంకారః। ఓంకారాత్ పరతో<br>– రామ వైఖానస పర్వతః।<br>తత్ పర్వతే కర్మ జ్ఞాన మయీభిః<br>బహుశాఖా భవంతి। | **క్రియాశక్తి**<br>**ఆ దేవియొక్క క్రియాశక్తిరూపము గురించి ఇంకా** →<br>- **శ్రీహరి ముఖము** నుండి **'నాదము'** జనిస్తోంది.<br>- ఆ **నాదము** నుండి **"బిందువు"**.<br>- ఆ **బిందువు** నుండి **'ఓం'కారము** (ప్రణవము).<br>- అట్టి ఓంకారము యొక్క చివరగా **'మ్‌'** - (అర్థమాత్ర). రామ-వైఖానస పర్వతము - (అర్చన).<br>అట్టి రామ (కేవలాత్మ స్వరూప) (వైఖానస/ఉపాసన) పర్వతము నుండి కర్మ-జ్ఞానమయములైన అనేక శాఖ-ఉపశాఖలు గల వృక్షజాలములు. |
| తత్ర త్రయీమయం, శాస్త్రమాద్యం,<br>సర్వార్థ దర్శనం। ఋక్, యజుః,<br>సామ రూపత్వాత్ –<br>'త్రయీ' ఇతి పరికీర్తితా।<br>హేతునా కార్యసిద్ధేన<br>చతుర్థా పరికీర్తితా, | అక్కడనుండి త్రయీమయములయినట్టి ఋక్-సామ- యజుర్వేదము లనబడే శాస్త్ర-శాస్త్రార్థములు, (తద్వారా) సర్వార్థదర్శనములు ఏర్పడు చున్నాయి. (శబ్దము నుండి వైఖరి-వాక్యము, వాక్యమునకు అర్ద దర్శనము బయలుదేరుచున్నాయి).<br>"ఋక్ - యజుర్ - సామ" వేద రూపిణిగా త్రయీవిద్య అని, కార్యసిద్ధి - కొరకై నాలుగవది (అథర్వణ వేదము) గాను పరికీర్తించబడుతోంది. |
| ఋచో యజూంషి సామాని<br>అథర్వ అంగిరసః తథా।<br>చతుర్హోత్ర (చతుః హోత్ర) ప్రధానత్వాత్<br>లింగాది త్రితయం త్రయీ।<br>అథర్వ అంగిరసం రూపం<br>సామ ఋక్ యజురాత్మకమ్। | 4 వేదములను 'ఋక్-యజుర్-సామ-అథర్వ అంగిరసములు' అని కూడా అంటారు.<br>**4వది (అథర్వణ) హోతవిధి. కార్యక్రమమును నడిపే విధి-విధాన-నిషేధ విశేష ప్రాధాన్యము.**<br>'లింగాది త్రితయం త్రయీ' - కేవలమగు తత్త్వము నుండి త్రివిధములగు త్రివేదములు, త్రిగుణములు, త్రికాలములు, త్రి-అవస్థలు జనిస్తున్నాయి.<br>**అంగిరస రూపమగు అథర్వణవేదము కూడా- ఋక్ యజుర్ సామవేదాత్మకమే!** |
| తథా వింశతి అభిచార సామాన్యేన<br>పృథక్ పృథక్, ఏకవింశతి (21)<br>శాఖాయాం "ఋగ్వేదః" పరికీర్తితః॥ | ఋగ్వేదములో అభిచార ప్రాధాన్యంచేత (హోమ ద్రవ్య విశేష ప్రాధాన్యముల చేత) వేరువేరు విభాగములుగా '21 శాఖలు' అభివర్ణితమై (ఏర్పడినవై) ఉన్నాయి. [ ఋగ్వేదము బహుతరంగా మంత్ర (ఋక్కుల) విభాగము]. |

| | |
|---|---|
| **శతం చ నవ శాఖాస్స్యుః (109)**<br>**యజుషాం ఏవ జన్మనామ్।** | అదేవిధంగా యజుర్వేదంలో 109 శాఖలు ఏర్పడి ఉన్నాయి. (విధి విధానముల ప్రాధాన్యము). |
| **సామ్నః సహస్ర శాఖాస్స్యుః। (1000)** | సామవేదము- 1000 శాఖలు. అథర్వణ వేదములో 50 శాఖలు ఉన్నాయి. (అథర్వణము శాంతి, సాత్విక భావములు, దైవీ సంపదయొక్క ప్రాధాన్యత కలిగి ఉన్నది). |
| **పంచాశత్ శాఖా అథర్వణః। (50)**<br>**వైఖానసమ్ అతః తస్మిన్ నాదౌ**<br>**ప్రత్యక్ష దర్శనమ్। స్మర్యతే మునిభిః నిత్యం**<br>**వైఖానసమ్ అతః పరమ్,** | వైఖానసము (అర్చన విభాగము) అనునది ప్రత్యక్ష దర్శనము.<br>(సమస్తము **సీతాదేవీ తత్త్వముగా దర్శించు ఉపాసన-వైఖరి, విధానము = వైఖానసము).**<br>శబ్ద బ్రహ్మమునకు ఆవలగల **సీతాదేవీ మూల ప్రకృతి తత్త్వమును** మునీశ్వరులు ఎల్లప్పుడు ఉపాసిస్తూ గానం చేస్తూ ఉంటారు. |
| **కల్పో, వ్యాకరణం, శిక్షా, నిరుక్తం,**<br>**జ్యోతిషం ఛందః, ఏతాని షడంగాని।**<br>**షట్ (6) అంగాని॥** | వైఖానస వ్రతము (శబ్దోపాసన) యొక్క స్మరణ తరువాత షడంగములు.<br>1. **కల్పము** = వ్రతకల్పము, నిబంధనములు. యుగ-యుగాంతరకాల విశేషములు. **న్యాయము** = తగవు, తీర్పు, తత్త్వశాస్త్రము.<br>2. **వ్యాకరణము** = వాక్య విభజన, నియమములు. శబ్ద లక్షణములు.<br>3. **శిక్ష** = విద్యాభ్యాసము. బోధనా విధానము. వేదస్వరముల బోధ.<br>4. **నిరుక్తము** = పదముల అవయవార్థ వివరణ శాస్త్రము. వేదమంత్రోక్త శబ్దములకు అవయవార్థములు.<br>5. **జ్యోతిష్యము/జ్యోతిశ్శాస్త్రము** = సూర్యుడు, నవగ్రహములు, నక్షత్ర మండలముల సంచారములు తెలియజేయు శాస్త్రము. కాల నియమానుసారం వేదముచే విధించబడిన కర్మలకు ఉచిత కాలము, కర్మఫల ఉపాయములు చెప్పు శాస్త్రము.<br>6. **ఛందస్సు** = పద్య లక్షణము చెప్పే శాస్త్రము. శ్లోక లక్ష్యములు.<br>**ఇవి షడంగములు.** |
| **ఉపాగం అయనం చ ఏవ**<br>**మీమాంసా, న్యాయ విస్తరః**<br>**ధర్మజ్ఞ సేవితార్థం చ**<br>**వేద వేదో అధికం తథా॥**<br>**నిబంధాః సర్వశాఖా చ**<br>**సమయాచార సంగతిః,**<br>**ధర్మశాస్త్రం మహర్షీణాం**<br>**అంతఃకరణ సంభృతమ్।**<br>**ఇతిహాస పురాణాఖ్యం**<br>**ఉపాంగశ్చ ప్రకీర్తిమ్।** | **వేద ఉపాంగములు**<br>**మీమాంస** = కర్మకాండను, జ్ఞానకాండను సమన్వయపూర్వకంగా ప్రతిపాదించు శాస్త్రము.<br>**న్యాయము** = తగవు, తీర్పు, తత్త్వశాస్త్రము. తర్కశాస్త్రము.<br>**ధర్మశాస్త్రము** = పరస్పర సానుకూల్యంగా అంతఃకరణ శుద్ధికై చాతుర్వర్ణ్య జీవులు ఆచరించవలసినవిగా ఋషులచే చెప్పబడే సమయ-ఆచారములు. సాంఘిక సంబంధమైన పరస్పర సానుకూల్య కర్మలు.<br>మునులచే - లోక శ్రేయస్సు కొరకు ప్రవచించబడే అంతఃకరణ వృత్తుల సంస్కరణములే - ధర్మశాస్త్రము.<br>ఇతిహాసములు, పురాణములు కూడా వేద-ఉపాంగములుగా చెప్పబడుచున్నాయి. కీర్తించబడుచున్నాయి. |
| **వాస్తు వేదో, ధనుర్వేదో**<br>**గాంధర్వశ్చ తథా మునిః**<br>**ఆయుర్వేదశ్చ పంచైతే**<br>**ఉపవేదాః ప్రకీర్తితాః॥** | **పంచ ఉపవేదములు**<br>1. **వాస్తు వేదము** = గృహనిర్మాణ శాస్త్రము.<br>2. **ధనుర్వేదము** = విలువిద్య. అస్త్రవిద్య.<br>3. **గాంధర్వ వేదము** = సంగీత శాస్త్రము.<br>4. **ఆయుర్వేదము** = దేహ-చికిత్సా శాస్త్రము.<br>5. **మునివేదము** = ప్రాపంచక విషయములపట్ల మౌనము వహించి, పరతత్త్వమును ఆశ్రయింపజేయు శాస్త్రము.<br>- ఇవి పంచ ఉపవేదములు. |

| | |
|---|---|
| దండో నీతిశ్చ వార్తా చ<br>విద్యా వాయుజయః పరః<br>ఏకవింశతి (21) భేదో అయం<br>'స్వప్రకాశః' - ప్రకీర్తితః॥ | **స్వప్రకాశ శాస్త్రములు: (1) దండము** (Punishment) **(2) నీతి** (Principled Life) **(3) వార్త (వర్తనము).** (అర్థ అనర్థ వివేచన విద్య) (Historical events of great personalities) **(4) విద్య (ఆత్మ విద్య) (5) వాయుజయము** (ప్రాణాయామము)- ఇవన్నీ బహురూపములతో (21 భేద రూపములతో) కూడి స్వస్వరూప ప్రకాశక శాస్త్రములుగా పరికీర్తించబడుచున్నాయి. |
| వైఖానస ఋషేః పూర్వం<br>విష్ణోః వాణీ సముద్భవేత్,<br>త్రయీరూపేణ సంకల్ప్య<br>ఇత్థం దేహీ విజృంభతే॥ | మొట్టమొదట విష్ణు భగవానుని 'వాణి' యే ఋక్-యజుర్-సామ త్రయీ వేదములుగా వెలువడగా, - వైఖానసము (It is Applicability and Practical Implementation side of it) ఋషుల వాక్యముల నుండి బయల్వెడలుచున్నాయి. |
| సంఖ్యారూపేణ సంకల్ప్య<br>వైఖానస ఋషేః పురా,<br>ఉదితో యాదృశః పూర్వం<br>తాదృశం శృణుమే అఖిలమ్॥ | ఓ దేవతలారా!<br>**విష్ణు భక్తుడగు వైఖానస మహర్షికి విష్ణుభగవానుడు ఏది 'సాంఖ్య యోగ శాస్త్రము'గా బోధించారో, - అట్టి విశేషములను ఇప్పుడు వివరిస్తున్నాను. వినండి.** |
| **8.** శశ్వత్ బ్రహ్మమయం రూపం<br>"క్రియాశక్తిః" ఉదాహృతా॥ | సృష్టిలోని బ్రహ్మమయరూపమే 'క్రియాశక్తి'. (అట్టి క్రియాశక్తియే 'సీతామాత' యొక్క ప్రకృతి సంబంధమైన ప్రాకృతరూపము). "ఈ దృశ్యమంతా కూడా సీతాదేవియొక్క క్రియా స్వరూపమే" - అని చెప్పబడుతోంది.<br>- దేవియొక్క బ్రాహ్మీశక్తి (సృష్టి స్థితి లయ శక్తి) స్వరూపము. |
| "సాక్షాత్ శక్తిః" భగవతః స్మరణమాత్ర రూపా॥<br>ఆవిర్భావ ప్రాదుర్భావాత్మికా॥<br>నిగ్రహ-అనుగ్రహ రూపా॥<br>శాంతి తేజో రూపా॥<br>వ్యక్తా-అవ్యక్త కారణ చరణ<br>సమగ్రావయవ ముఖవర్ణ<br>భేద-అభేద రూపా॥ భగవత్ సహచారిణీ॥<br>అనపాయనీ॥ అనవరత<br>సహాయ ఆశ్రయణీ॥ | **సీత-సాక్షాత్ శక్తి**<br>- భగవతీ శక్తి. బ్రహ్మముయొక్క సాక్షాత్ శక్తి.<br>- ఆ సీతామాత యొక్క స్మరణ మాత్రం చేతనే సమస్తము అనుగ్రహముగా లభించగలదు.<br>- సమస్తము ఆవిర్భవింపజేయునది. సమస్తముగా ప్రవర్తింపజేయునది- సీతయే.<br>- నిగ్రహ - అనుగ్రహ రూపి. (నిగ్రహించగల, అనుగ్రహించగల దేవాది దేవి).<br>- పరమ శాంతమగు తేజస్సును రూపముగా కలిగి ఉన్నట్టిది - సీత॥<br>- వ్యక్త-అవ్యక్త, కారణములు చరణములు (నడవడిక) కలిగినది.<br>- ఈ సమస్త జగద్దృశ్యమంతా- తనయొక్క సమస్త అవయవములుగా, ముఖముగా కలిగి ఉన్నట్టిది - సీత॥<br>- అనేకము తానే అయి, ఆ అనేకములోని ఏకము తానే అయి ఉండటంచేత **భేద-అభేదరూపిణీ!** భగవంతునికి ఎల్లప్పుడు సహధర్మచారిణీ!<br>- అనపాయనీ॥ (తలచినంత మాత్రంచేత సమస్త అపాయములు తొలగించునది)॥<br>- ఎల్లప్పుడు సహాయ, ఆశ్రయములు ప్రసాదించునది. |
| ఉదిత-అనుదిత ఆకారా॥<br>నిమేష-ఉన్మేష సృష్టి స్థితి సంహార<br>తిరోధాన - అనుగ్రహాది<br>సర్వశక్తి సామర్థ్యాత్<br>"సాక్షాత్ శక్తిః" ఇతి గీయతే॥ | ఉదయిస్తున్న, ఉదయించని ఆకారము కలిగి ఉన్నట్టిది. కనులు మూసి- కనులు తెరచునంత కాలములోనే సృష్టి - స్థితి - సంహారము (ఉపసంహారము), తిరోధానము (తీసివేయునది), అనుగ్రహము మొదలైన సర్వశక్తి సామర్థ్యము కలిగియున్నట్టిది.<br>**సాక్షాత్ శక్తి స్వరూపిణిగా సీతాదేవికి మేము నమస్కరిస్తూ ఉంటున్నాము.** |

| | |
|---|---|
| **9. ఇచ్ఛాశక్తిః త్రివిధా।**<br>**ప్రలయ అవస్థాయాం విశ్రమణార్థం**<br>**భగవతో, దక్షిణ వక్షస్థలే**<br>**శ్రీవత్సాకృతిః భూత్వా, విశ్రమయతి**<br>**ఇతి-సా 'యోగశక్తిః'।** | సీతాదేవియొక్క **ఇచ్ఛాశక్తి**యే ఇదంతా।<br>అట్టి ఇచ్ఛాశక్తి మూడు విధములుగా సంప్రదర్శనమౌతోంది.<br>**1. యోగశక్తి 2. భోగశక్తి 3. వీరశక్తి.**<br>**1. యోగశక్తి :** సమస్తము శమిస్తూ అఖండ కేవల పరమాత్మ యందు విశ్రమించు 'ప్రళయ' కాలములో ఆ భగవంతుని దక్షిణ (కుడి) వక్షస్థలము నందు 'శ్రీ వత్సాకృతి' అయి విశ్రమించుచున్న శక్తి 'యోగశక్తి'. |
| **'భోగశక్తిః' భోగరూపా**<br>**కల్పవృక్ష కామధేను చింతామణి**<br>**శంఖ పద్మ నిధ్యాది నవనిధి సమాశ్రితా।** | **2. భోగశక్తి :** ఆ సీతామాత యొక్క ఇచ్ఛాశక్తి భోగశక్తిగా రూపుదాల్చి 'భోగ' రూపంగా అగుచున్నది.<br>ఆ భోగ ఇచ్ఛా శక్తియే **(మహాకాళ), కల్పవృక్ష, కామధేను, చింతామణి, శంఖ, పద్మ, (సర్వరత్న, పింగళము), నిధి** అనబడు నవనిధులను సమాశ్రయించినదై ఉంటోంది. |
| **భగవత్ ఉపాసకానాం**<br>**కామనయా, అకామనయా వా**<br>**భక్తియుక్త నరం, నిత్య నైమిత్తిక కర్మభిః।** | కోరికలు కలిగియుండిగాని, కోరికలు లేనివారై ఉండిగాని భక్తితో కూడి జీవులు చేసే నిత్య, నైమిత్తిక కర్మలకు ఫలములను అనుగ్రహిస్తూ ఉంటోంది. |
| **అగ్నిహోత్రాదిభిర్వా,**<br>**'యమ నియమ ఆసన ప్రాణాయామ**<br>**ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధిభిర్వా,**<br>**లమనణ్వపి గోపుర ప్రాకారాదిభిః**<br>**విమానాదిభిః సహ,**<br>**భగవత్ విగ్రహ-అర్చా,**<br>**పూజా కర్మకరణైః**<br>**అర్చనైః స్నానాదిభిర్వా**<br>**పితృ పూజాదిభిః అన్నపానాదిభిర్వా**<br>**భగవత్ ప్రీత్యర్థం ఉక్త్వా, -**<br>**సర్వం క్రియతే॥** | **సీతాదేవీ తత్త్వము ఎరిగి ఉపాసించు అనేకమంది భక్తులు - ఈ క్రింది విధానాలుగా ఆరాధిస్తున్నారు.**<br>i. **'అగ్నిహోత్రము'** మొదలైన యజ్ఞ విధానముల ఆచరణతో.<br>ii. **'అష్టాంగ యోగములు'** అయినట్టి,<br>**(1) యమము** (బాహ్యేంద్రియ నిగ్రహము) **(2) నియమము** (అంతరింద్రియములైనట్టి మనో బుద్ధి చిత్త అహంకారముల నిగ్రహము) **(3) ఆసనము** (ధ్యానముచేయటానికై ధారణ చేయు స్వస్తిక, పద్మ - ఇత్యాది కూర్చుని యుండు విధానములు) **(4) ప్రాణాయామము** (గాలి పీల్చి నిలిపి, వదలు పూరక-రేచక-కుంభక - కేవల కుంభక ఇత్యాది ప్రాణోపాసనలు) **(5) ప్రత్యాహారము** (ఇంద్రియములను విషయములనుండి వెనుకకు మరల్చటము, **ఏకము, అఖండము** అగు ఆత్మాదేవి యొక్క దర్శనమునందు భావనాపూర్వకంగా నియమించటము **(6) ధ్యానము** (ధ్యాసను సర్వాత్మకుడగు పరమాత్మ యందు నియమించటము). **(7) ధారణ** (ధ్యానముయొక్క చ్యుతి లేని నిశ్చలత్వము అభ్యసించటము **(8). సమాధి** (అఖండాత్మయే తానై భాసించటము - ఈ అష్టాంగ యోగాభ్యాసములతో - సీతాదేవిని ఆరాధిస్తున్నారు.<br>iii. **లమనము** (భగవత్ భక్తి, ప్రేమ ప్రదర్శనము)గా, గోపుర ప్రాకార విమానాదులను నిర్మించి సమర్పించటముచేత ఉపాసిస్తున్నారు.<br>iv. భగవంతుని **విగ్రహ-అర్చనల పూజావిధులచేత, భగవదత్తమై కర్మలచేత, స్నానాది నియమ నిష్ఠల చేత, పితృదేవతా పూజల చేత, అన్నపాన దానములుగా** - ఆరాధిస్తున్నారు. |

| | |
|---|---|
| **10. <u>అథాతో వీరశక్తిః :-</u>**<br>**చతుర్భుజా, అభయ వరద పద్మధరా**<br>**కిరీట-ఆభరణాదియుతా,**<br>**సర్వదేవైః పరివృతా,** | **<u>సీతాదేవి యొక్క సహజ వీరరూపమగు - ఇచ్ఛాశక్తియే</u>** →<br>- **స్థూల సూక్ష్మ కారణ మహాకారణ** దేహములుగా **చతుర్భుజ.**<br>- **(జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములు** తన భుజములు అయినట్టి) **చతుర్భుజ.**<br>- **అభయ - వరద - పద్మధర** (జ్ఞాన ప్రసాదిత) అయి నమస్కరించు వారిని అనుగ్రహించునది.<br>- కిరీటము మొదలైన ఆభరణములు ధరించునది.<br>- సర్వదేవతలచే పరివృతమై ఉన్నది. |
| **కల్పతరు మూలే చతుర్భిః గజైః రత్నఘటైః**<br>**అమృతజలైః అభిషిచ్యమానా।**<br>**సర్వదైవతైః బ్రహ్మాదిభిః వంద్యమానా।** | - కల్పతరువు యొక్క మూలమున, నాలుగు ఏనుగులు ఆ లోకమాతను రత్న నిర్మిత ఘటములచే (కుండలచే) అమృతజలముతో అభిషేకము సమర్పిస్తున్నట్టిది.<br>- బ్రహ్మాదేవుడు మొదలైన సమస్త దేవతలు నమస్కరిస్తూ ఉన్నట్టి పరాశక్తి స్వరూపిణి. |
| **అణిమాది అష్టైశ్వర్యయుతా,**<br>**సమ్ముఖే కామధేనునా స్తూయమానా।**<br>**వేదశాస్త్రాదిభిః స్తూయమానా।**<br>**జయాది అప్సర స్త్రీభిః పరిచర్యమాణా।** | - **"అణిమ, గరిమ, మహిమ, లఘిమ, ఈశిత్వ వశిత్వ, ప్రాకమ్య, ఇచ్ఛ-"** అనబడే అష్టసిద్ధులు అష్టైశ్వర్యములుగా కలిగి ఉన్నట్టిది, ప్రసాదించునది.<br>- ఎదురుగా కామధేనువు నిలబడి స్తుతిస్తూ ఉన్న రూపము.<br>- వేదములచే, శాస్త్రములచే అభివర్ణించబడుచున్న తత్త్వము.<br>- జయ, విజయ మొదలైన అప్సరసా స్త్రీలచే పరివృతమైనది - ఇట్టిది **"సీతాదేవి వీర రూపము".** |
| **ఆదిత్య సోమాభ్యాం దీపాభ్యాం ప్రకాశ్యమానా।**<br>**తుంబురు నారదాదిభిః గీయమానా।**<br>**రాకా సినీ వాలీభ్యాం ఛత్రేణ,**<br>**హ్లాదినీ మాయాభ్యాం చామరేణ,**<br>**స్వాహా స్వధాభ్యాం వ్యజనేన,** | ఇంకా కూడా, సూర్య చంద్రులను తనయొక్క తేజస్సుచే దీపమువలె వెలిగించునది. తుంబురుడు, నారదుడు మొదలైన దేవ ఋషి గణముచే స్తుతించబడునది.<br>రాకాసినివాలి - అనే ఛత్రములతో అలంకృతమైనట్టిది, 'హ్లాదినీ' అనే తన యొక్క మాయ చామరము (వింజామరము) చే సేవించబడునది,<br>"స్వాహా" "స్వధా", మొదలైన సమర్పణ శబ్దములచే , - ఈ తల్లి సీతాదేవియొక్క సహజమగు స్వాభావిక తాత్త్విక రూపమే- పూజించ బడుతోంది. |
| **భృగు పుణ్యాదిభిః అభ్యర్చ్యమానా ।**<br>**దేవీ దివ్య సింహాసనే పద్మాసనారూఢా।**<br>**సకల కారణ కార్యకరీ, లక్ష్మీర్దేవస్య**<br>**పృథక్ భవన కల్పనా।** | భృగువు మొదలైన పుణ్య పురుషులగు మహర్షులచే పూజింపబడు దేవి. దివ్య సింహాసనముపై పద్మాసనము ధరించి అధిష్ఠించి యున్న లోకపాలిని. **సకల కార్య-కారణ-కర్తృత్వములు తనవే అయినట్టి మూల ప్రకృతి రూపిణి,** లక్ష్మీదేవి యొక్క అంతఃపురములో శ్రీదేవి అయి విరాజిల్లునది. |
| **అలంచకార స్థిరా, ప్రసన్న లోచనా,**<br>**సర్వదైవతైః పూజ్యమానా**<br>**"వీరలక్ష్మీః" ఇతి విజ్ఞాయత॥**<br>***<u>ఇతి సీతోపనిషత్ ।</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** | సర్వాలంకారకృత, స్థిర స్వరూపిణి, ప్రసన్నము (ఆనందము)తో కూడిన కళ్లు కలిగినది, సర్వదేవతలకు పూజనీయము, అగు సీతాదేవి యొక్క **ఇచ్ఛారూపమగు వీరలక్ష్మీదేవి స్వరూపమును సర్వదా ఎరుగుచు, దర్శిస్తూ, ఉపాసిస్తూ శరణు వేడుచున్నాము.**<br>***<u>ఇతి సీతోపనిషత్ సమాప్తా।</u>***<br>***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u>*** |

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 20 సీతోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**శ్లో॥ ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి త్రయం యద్భావ సాధనమ్।**
**"తద్బ్రహ్మ సత్తా సామాన్యం" – సీతాతత్త్వమ్ ఉపాస్మహే॥**

ఇచ్ఛా జ్ఞాన క్రియా త్రిశక్తి స్వరూపిణి, మూలప్రకృతి, వ్యక్తావ్యక్త స్వరూపిణి, కరుణామూర్తి, జగన్మాతృదేవత, అనుగ్రహదేవత–అగు సీతామాతకు, ఆ తల్లియొక్క "తత్‌బ్రహ్మసత్తా సామాన్యము" – ను **భక్తితోను, అధ్యయన పూర్వకంగాను** నమస్కరిస్తున్నాము.

⌘

ఒకసారి దేవతాగణము సత్యలోకము ప్రవేశించి సృష్టికి కర్త, సర్వాత్మకుడు అగు ప్రజాపతిని దర్శించుకొని నమస్కరించారు. వినమ్రతతో బ్రహ్మదేవుడు, పితామహుడు అగు స్వామిని **అధ్యయన – విద్యార్థులై ఈవిధంగా అడుగసాగారు.**

**దేవతాగణము :** హే సృష్టికర్తా! పితామహా! బ్రహ్మదేవా! మా యొక్క సాంసారిక జాడ్యము తొలగటానికై తత్త్వదర్శులగు మీవద్ద **"సీతాదేవి"** యొక్క దివ్యతత్త్వము తెలుసుకోదలచాము. శ్రవణ మననములను ఆశ్రయించదలచాము.

**కా సీతా?** జనకునికి నాగలి స్పర్శచే లభించి, శ్రీరాముని పరిణయమాడి, లోకకంటకుడగు రావణుని సంహారమునకు కారణమైన **– ఈ సీత వాస్తవానికి ఎవరై ఉన్నారు?**

**కిం రూపం?** సందర్భమాత్ర సత్యమగు ఈ దృశ్య ప్రపంచము (పాంచభౌతిక ప్రపంచము)నకు సంబంధించక, సమస్తమునకు **'పరము'** (Beyond) అయి ఉన్న **ఈ సీతామాత యొక్క దివ్యరూపము** (The Divine Form) **ఎట్టిది? ఎటువంటిది?**

**అట్టి తత్త్వార్థ జ్ఞాన విశేషము మాకు బోధించవలసినదిగా ప్రార్థిస్తున్నాము.**

**ప్రజాపతి (బ్రహ్మదేవుడు) :** బిడ్డలారా! దేవతలారా! **"సీతా దేవీతత్త్వము"** అనిర్వచనీయము. అవాక్ మానసగోచరము. అయినప్పటికీ, మనయొక్క బుద్ధి నిర్మలత, కుశలత కొరకై, ఆ జగన్మాతయొక్క అనుగ్రహంచేత ఆయా **సీతాదేవీ తాత్త్విక విశేషాలు** చెప్పుకుంటున్నాము. వినండి.

⌘

కాంతి ప్రకాశిస్తూ ఉండగా, ఆ కాంతితో సాకారాత్మకమైన అనేక విశేషాలు కనబడుచూ ఉంటాయి కదా। (శ్రీరాముడు "కేవల నిర్విషయ సాక్షిమాత్రుడు" అయి ఉండగా) – సీతాదేవియే **"మూల ప్రకృతి స్వరూపము"** – అయి, సమస్తముగా సంప్రదర్శనమౌతోంది. అట్టి మూలాధార స్వరూపముతోనే ఈ ఎదురుగా కనిపించే అనేకముతో కూడిన సమస్త ప్రకృతిని తన యొక్క **'లీలా ప్రదర్శనము'**గా కలిగి ఉంటోంది.

**ప్రణవము** ("ఓం") యొక్క **ఐహిక** (లేక) **ప్రాకృత** రూపమే సీతాదేవి. అందుచేత **సీతయే ప్రకృతియొక్క స్వాభావిక రూపము. (లేక) ఈ ప్రకృతి అంతా సీతా మాతయే–** అని అభివర్ణించబడుతోంది.

సీతాదేవియే త్రివర్ణాత్మకమై (సత్త్వ రజో తమో త్రిగుణాత్మకమై) **"సాక్షాత్ మాయా స్వరూపిణి"**గా విరాజిల్లుతోంది.

**"సీతా"** = "స" + **"ఈ"** + **"త"** – ఇతి త్రివర్ణాత్మికా!

**"ఈ"**

**"ఈ" కారము:** – దేవియొక్క విష్ణుతత్త్వము. **అట్టి విష్ణు తత్త్వమే "ప్రపంచము" అను దానికి బీజము. "ఈ"** అనగా సీతాదేవియొక్క "మాయ"కు సంజ్ఞాక్షరము. సర్వత్రా సర్వదా వేంచేసి ఉన్న చైతన్య స్ఫూర్తియే విష్ణుశబ్దార్థము. **"సమస్తము తానే"** అయి ఉన్నట్టిదే – విష్ణుతత్త్వము.

**"స"**

**"స" కారము:** – ఆత్మ స్వాభావికమగు **"సత్యము".**

"**అమృతము.** (మార్పు చేర్పులకు ఆవలది)".

'స' అక్షరమునకు సంజ్ఞ. **"స – ఉమ" – "సోమ"** అని, 'స'కారముగా కీర్తించబడుతోంది.

**'సత్' ఏవ 'స'కారమ్।**

**"ఏక–అక్షర సత్" ఏవహి 'స' కారః।**

**"త"**

**"త" కారము: – 'త' కారః తార లక్ష్మ్యాచ।** సమస్త జీవులను మోహాంధకారము నుండి తరింపజేయునది. "లక్ష్మీ" అను ఆత్మజ్ఞాన స్వరూప సంపద. ఈ సమస్త బాహ్య దృశ్యము తన తత్త్వముగాను, సంపదగాను కలిగి ఉండటం చేత – లక్ష్మీరూపము. (తార। **"తారయత"** – ఇతి **'తార'**).

---

**"ఈ" కారము:**– సోమ (చంద్ర)–అమృతావయవదేవి. మృతమునకు (మార్పునకు) ఆవలి రూపము. మృత భావనను దాటివేయించు తత్త్వము. మార్పు–చేర్పులు లేనట్టి **'స్వస్వరూపము'**తో **అనుసంధానము.**

**అట్టి "లక్ష్మీదేవీ సాకార–(ఉపాసనా)" రూపము:** – ముత్యములు మొదలైన అనేక ఆభరణములచే అలంకరించబడిన రూపము.

**"ఈ" – మాయకు సంజ్ఞ.** ఆ దేవి స్వాభావికంగా 'అవ్యక్త'. **అయితే, ఈ సమస్తమును తనయొక్క మహామాయా చమత్కారముచే వ్యక్తీకరిస్తూ ఉన్నట్టిది.**

సహజంగానే **"అవ్యక్తము", "మూల ప్రకృతి స్వరూపము"** – అగు సీతాదేవి యొక్క మహామాయా రూపము వ్యక్తీకరణము స్వీకరిస్తూ, '3' ప్రదర్శనములు కలిగి ఉంటోంది.

**(1) ప్రథమా–శబ్ద బ్రహ్మమయీ – 'స' కారము:** శబ్ద స్వరూపిణియగు సీతాదేవి. వేదోపనిషత్ ఋక్–స్తుతి–మహావాక్య రూపములలో (సత్) అయి ప్రకాశించుచున్నది. వేదమంత్రముల రూపముగా దేవతా స్తుతులలో స్తుతించబడేది **సీతాతత్త్వమే.** (విష్ణు–శివ–లలితా – సరస్వతీ – లక్ష్మీ – ఇత్యాది సహస్రనామములన్నీ సీతాదేవీ తాత్త్విక వర్ణనములే)।

**"తత్త్వమ్। సోఽహమ్।"** ఇత్యాది మహావాక్యముల పరమార్ధ (తాత్త్వికార్ధ) ప్రవచనములు, వాటి నిరూపణముల యందు **దేవాదిదేవి యగు సీతయే తత్త్వార్ధమైయున్నది. (తత్త్వార్థ జ్ఞాన మంజుషా)।మార్గదర్శి అయి, మాతృదేవత అయి, సద్గురువు అయి ఆశ్రితులకు సమస్తము సుబోధకము చేస్తోంది.**

స్వాధ్యయనములందు (వేదగానములు జరుగుచోట) **'ప్రసన్న రూపిణి'** అయి సత్త్వ భావములను ఉద్భవింపజేస్తూ, ముముక్షువులకు **"స్వస్వరూప పరమాత్మత్వ భావన"** సిద్ధించుకోవటానికి అనుగ్రహము ప్రసాదిస్తూ ఉన్నది. ఆశ్రిత జనులను ఆత్మారామ–ఆనంద సాగరముతో మమేకమగునట్లు దారిచూపుతోంది. **"అహమ్ ఏక తరంగమస్మి – రామానంద సాగరమ్"** భావనను అనుగ్రహిస్తోంది.

అంతే కాకుండా సమస్తమును ఉద్భవింపజేయు **'ఉద్భవ కరీ'** రూపము.

**(2) ద్వితీయ భూతలే హలాగ్రే సముత్పన్నా। 'త'కార రూపిణీ। :** రెండవ రూపము – సీతాదేవియొక్క ప్రాకృత పాంచభౌతిక రూపము. జనకుడు నాగలి దున్నుచున్నప్పుడు అట్టి హలము (నాగలి) చివరి స్పర్శచే లభించిన రూపము. సమస్తశక్తి స్వరూపిణి అగు సీతామాత, సమస్త రూపములు 'తనవే' – అయి ఉండికూడా, – భక్తుల ఉపాసన కొరకై ధరించినట్టి **"నామ–రూపాత్మక–ప్రకృతి అంతర్గత రూపము".**

**(3) తృతీయా అవ్యక్త రూపా– 'ఈ' కార రూపిణీ:** ఈ విశ్వమంతా తన వ్యక్తీకరణముగా కలిగి ఉంటూనే, తాను ఈ సమస్తమునకు ఆవల 'అవ్యక్త' రూపము. (The unmanifesting Self while all else is being exhibited as its own Presentation / Manifestation).

ఈవిధంగా సీతాదేవియే మహామాయగా (1) 'శబ్ద–స్వాధ్యాయన–ప్రసన్న–ఉద్భవకరీ **'స'కార రూపము** (2) పాంచభౌతిక–హాలాగ్ర జనిత రూపము (3) సమస్తమును తన వ్యక్తీకరణముగా కలిగియున్న 'ఈ'కార **అవ్యక్తరూపము** కలిగి ఉన్నది.

ఇది **"శౌనకీ తంత్రము"** మొదలైన యంత్ర–మంత్ర శాస్త్రములలో సీతాదేవియొక్క మహామాయా స్వరూపము యొక్క అభివర్ణిత **"త్రిరూపములు".**

అట్టి మహా మాయా స్వరూపిణి అగు సీతాదేవి – కేవల ఆత్మారామమగు **శ్రీరామచంద్రుని సాన్నిధ్యవశంగా "జగదానంద కారిణి"–** అయి విరాజిల్లుచున్నది.

**మూల ప్రకృతి సంజ్ఞితా।** సీతామాత మూలప్రకృతి అయి ఉండగా, శ్రీరామచంద్రుడో? – ఆ మూల ప్రకృతి ఎవరికి చెందినదై, ఎవరిని ఆశ్రయించినదై ఉంటోందో – అట్టి **ఆత్మారామ స్వరూపుడు.** ఆత్మను (ఆత్మకు అనన్యమగు) మూల ప్రకృతి యొక్క ఆశ్రయముచేతనే 'అనుభవము' అనే వినోదరూపమగు ఆనందము సిద్ధించుచుండగా, శ్రీరామునిపట్ల – **"శ్రీరామానందుడు, ఆత్మానందుడు"** – అను స్వానుభవము పరిఢవిల్లుతోంది. [ శ్రీరాముడు = 'నేను' (I)। సీత = నాది (My) ]

***అట్టి మూల ప్రకృతి రూపిణియగు సీతాదేవి →***

- **ఈ జగత్తుయొక్క ఉత్పత్తి, స్థితి, లయకారిణిగా అగుచున్నది.** (సృష్టి కర్త్రీ బ్రహ్మరూపీ। గోప్త్రీ గోవింద రూపిణీ। సంహారిణీ విశ్వరూపా। తిరోధానకరి – ఈశ్వరీ – శ్రీ లలితా సహస్రనామము).
- **"చిత్ స్వరూపిణి"** అయి సమస్త దేహములలో (సమస్త జీవులలో) **"జ్ఞేయ"** (ఎరుక)గా ప్రదర్శనమై ఉంటోంది.
- ప్రకృతి రూపిణిగా సమస్త జీవులచే 'అనుభవము'గా పొందబడేదంతా సీతాదేవీ రూపమే అగుచున్నది. (తెలియబడేదంతా సీతాదేవీ – చిత్ ప్రదర్శనమే)।

ఆ దేవియే బ్రహ్మజ్ఞాన స్వరూపిణి। **"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా"।** – అని నిర్వచించబడుచు, బ్రహ్మమును తెలుసుకోవాలనే ఉత్సాహమంతా (The Inspiration and the Inclination) **"సీతా తాత్త్విక చేతనా విశేషమే"।**

**ఇంకా కూడా –** ఈ సీతాదేవి **వ్యక్తావ్యక్త స్వరూపిణి।** ఈ జనని యొక్క వ్యక్తా వ్యక్త స్వరూపమే సర్వత్రా వేంచేసినదై ఉన్నది।

**సా సర్వ వేదమయీ।** సర్వ వేదములు ఏ బ్రహ్మానంద స్వరూపము గురించి ఎలుగెత్తి గానము చేస్తున్నాయో, – అదియే **సీతాదేవీ దివ్య రూపము.** సర్వ వేదములలోని రసస్వరూపము కాబట్టి **"సర్వ వేదమయీ"** అని సీతామాత స్తుతించబడుతోంది. సర్వ వేదములు సీతా స్వరూపమే। (వేదము = తెలియబడునది). **ఈ తెలియబడేదంతా నిండి ఉన్నది సీతయే। (వేదమ్ = "తెలియబడుచున్న సమస్తము" – అని శబ్దార్థము)।**

**సర్వ దేవమయీ।** దేవతలంతా కూడా స్థానముగా కలిగియున్నది – **ఈ సీతాదేవి యొక్క ప్రకృతి స్వరూపము నందే!** సర్వ దేవతలు సీతాదేవి యొక్క మూల ప్రకృతి ప్రదర్శనా రూపులే।

**సర్వ లోకమయీ।** (స్వప్నమంతా స్వప్న ద్రష్ట యొక్క చేతనా రూపమే అయినట్లు, నవలలోని విశేషములన్నీ నవలా రచయిత యొక్క రచనా కల్పనా విన్యాసమే అయి ఉన్న తీరుగా) – ఆ సీతాదేవియే సమస్త లోకములలో స్ఫురించే **లోకేశ్వరి।**

**సర్వ కీర్తిమయీ।** జగత్ కథనములన్నీ, జగత్‌యశస్సు అంతా మూలాధారరూపిణి అగు సీతామాతకు చెందినవే।

**సర్వ ధర్మమయీ।** ఈ దృశ్య–దేహ–మనో–బుద్ధి–చిత్త–అహంకార–జీవ–ఈశ్వర–త్రిలోక ధర్మములుగా (Functional Features) ఏమేమి కనిపిస్తున్నాయో – అవన్నీ ప్రకృతి స్వరూపిణి అగు ఆ సీతామాత యొక్క చిత్కళా విన్యాసమే।

**సర్వాధార కార్యకారణమయీ।** ఈ దృశ్య ప్రపంచములో కనిపించే కార్యకారణ కర్తృత్వములన్నిటికీ ఆధారము ఈ సీతా జననియే. ("కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి" – ఉచ్యతే)।

**మహాలక్ష్మీః – దేవేశస్య భిన్న–అభిన్నరూపా।** ఈ సీతా మూలస్థాన రూపిణియే (1) మహాలక్ష్మీ (2) విష్ణుమూర్తిల రూపమును ఏకముగాను, భిన్నముగాను కూడా దాల్చుచున్నది.

**చేతన–అచేతనాత్మికా।** (1) కదలుచున్న సమస్తము, (2) తాను కదలక, సమస్తము కదల్చుచున్న చైతన్యము – **ఉభయము తానే అయి ఉన్నట్టిది – ఆ దేవీ రూపము.**

**బ్రహ్మ స్థావరాత్మా।** సృష్టికర్తయగు బ్రహ్మదేవుని నుండి ఒక స్థావరము (రాయి) వరకు గల సమస్తమునకు **"ఆత్మ స్వరూపిణి"** అగు – సీతా దేవియే।

**తత్ గుణ కర్మ విభాగ భేదాత్ శరీరరూపా।** బ్రహ్మ నుండి స్థావరము వరకు గుణ–కర్మ–విభాగ భేదములచేత వేరువేరుగాను, అనేకముగాను కనిపించేదంతా 'తన శరీరమే' అయి ఉన్న ప్రకృతి రూపిణి ఈ సీతామాతయే।

**దేవర్షి గంధర్వ రూపా। అసుర రాక్షస భూత ప్రేత పిశాచ భూతాదిభూత శరీర రూపా।** ఈ సీతా **మూల ప్రకృతి స్వరూపమే** – దేవతలుగాను, దేవర్షులుగాను, గంధర్వులుగాను, అసుర–రాక్షస రూపములుగాను, భూత ప్రేత పిశాచములుగాను, ఇంకా, .... పంచభూతములకు **'ఆది'** గాను, సమస్త భౌతిక శరీర బాహ్య–అభ్యంతర రూపములుగాను **ప్రదర్శనమగుచున్నది.**

## త్రిశక్తి స్వరూపిణీ సీతా।

ఈ సీతాదేవియే 'శక్తి' రూపిణి. అట్టి సీతా మూలశక్తి మూడు విధములైన సంప్రదర్శనములతో విరాజిల్లుతోంది.

**(1) ఇచ్ఛా శక్తి (2) క్రియాశక్తి (3) సాక్షాత్ శక్తి.**

ఇచ్ఛా శక్తి మూడు రూపములు కలిగి ఉంటోంది.

(i) శ్రీ (ii) భూమి (iii) నీళాత్మికా – గాను,

(i) భద్రరూపిణీ (ii) ప్రభావరూపిణీ (iii) సూర్య–చంద్ర–అగ్ని రూపాత్మికగాను – **త్రివిధములుగా అగుచున్నది.**

**సోమాత్మికగా:** – సీతామూర్తి యొక్క సోమరూపమే భూమిలో ఓషధులను ప్రభవింపజేస్తూ ఉన్నది.

ఈ సృష్టియందు కల్పవృక్షము యొక్క పుష్ప–ఫల–లత–గుల్మా(తీగా)త్మికగాను, ఔషధ భేషజాత్మికగాను, అమృతరూపం గాను, మహత్–సోమ ఫలముగాను అగుచున్నది.

→ మూల ప్రకృతి స్వరూపిణియగు సీతా జగన్మాతయే... తనయొక్క అమృతరూపముతో దేవలోకము (ఊర్ధ్వలోకము)లోని దేవతలకు మహస్తోమ (మహత్ సోమ) ఫలము ప్రసాదించుచున్నది.

- దేవతలకు అమృతరూపంగాను,
- మానవులకు 'అన్నము' రూపముగాను,
- పశువులకు తృణముల (గడ్డి) రూపముగాను,
- వివిధ జీవులకు వారివారి వివిధ ఆహారముల రూపముగాను,

సమస్త జీవులకు వారివారి జీవనమునకు తగినట్టి ఆహారము ప్రసాదించునది – సీతామాతయే।

***ఓజో రూపిణి అయి అన్నమును జీవులకు అందించటము, వైశ్వానర రూపిణి అయి దేహములో ఆహారము జీర్ణింపజేయటము నిర్వర్తిస్తోంది కూడా।***

**కాలరూపదేవీ స్వరూపిణి:**

సీతాదేవియే 'కాల స్వరూపిణి' అయి, సమస్త జగత్తులను **జనింపజేయటము, పరిపోషించటము, క్షయింపజేయటము** కూడా నిర్వర్తిస్తోంది.

- **తేజోరూపిణి** అయి – సూర్యగోళము మొదలైన సృష్టిలోని ఆయా పదార్థములను తనయొక్క కాంతిచే వెలిగించుచున్నది.
- రాత్రి – పగలు రూపంగా **కాలచక్రమును నడిపిస్తోంది.**
- **నిమేష** (రెప్పపాటు కాలము) – **కాష్ఠ** (18 రెప్పపాటుల కాలము – **కల** (30 కాష్ఠల కాలము) – **గడియ** లేక **ఘటిక** (24 ని॥ల కాలము) – 8 జాముల **దినము** (జాము = యామము = 3 గంటల కాలము), **రాత్రి–పగలు, వారము, పక్షము, మాసము ఉత్తరాయన–దక్షిణాయనములు** (6 + 6 నెలలు), **సంవత్సరము నుండి యుగ–యుగాంతముల వరకు ఇవన్నీ – సీతాదేవి యొక్క కాల స్వరూప విశేషములే.** మానవులకు 100 సం॥ల ఆయుష్షు, (అదేవిధంగా) ఆయా సమస్త జీవులకు ఆయుః పరిమాణ నిర్ణయము – మొదలైనదంతా ఆ ప్రకృతిదేవీ చమత్కార రచనా విశేషమే.
- చిర (Long Term) – క్షిప్ర (Immediate) ములు, నిమేషము నుండి–పదార్థముల స్థితిగతులు, వృద్ధి క్షయములు ఆ దేవియే।

  **తస్యైవ కాలస్య విభాగ విశేషాః ప్రకాశరూపాః కాలరూపా భవంతి।** ఆ దేవియే కాలస్వరూపి అయి, కాలచక్రమును త్రిప్పుచు తనయొక్క కాల విభాగ విశేషములతో ప్రకాశించుచున్నది.

  సీతాదేవియే కాలస్వరూపిణిగా ప్రకాశించుచు, కాలమునకు తానే **"నియామకురాలు"** అయి ఉంటోంది.

**తేజో రూపియగు సీతామాతయే...,**

- ❒ **అగ్నిరూపా।** అన్నగత ప్రాణులలో ఆకలి-దప్పికలుగా వైశ్వానరాగ్ని అయి దేహములలో ఆహారముయొక్క జీర్ణ ప్రక్రియను సంసిద్ధము చేయుచున్నది.
- ❒ **అన్న పానాది ప్రాణినాం క్షుత్ తృష్ణాత్మికా।** పదార్థములలో ఆహారశక్తి తత్త్వమై, - శరీర పరిపోషణలకు భక్ష్య భోజ్య లేహ్య చోష్యములుగా (మింగు, నమిలి మింగు, నాకి మింగు, పీల్చబడు వానిగా) దేహములో ప్రవేశించుటకై సంసిద్ధమగుచున్నది.
- ❒ **దేవానాం ముఖరూపా।** దేవతలలో తేజోరూపమై ముఖమునందు వెలుగొందుచున్నది.
- ❒ **వన-ఔషధీనాం శీతోష్ణరూపా।** ఓషధులలో (ఆహార పదార్ధములలో) శీత-ఉష్ణ (Cool and Hot) రూపమై వెలయుచున్నది.
- ❒ **కాష్ఠేషు అంతర్బహిశ్చ నిత్యానిత్యరూపా భవతి।** కొయ్యలో కొయ్యవలె, - ఈ సృష్టియొక్క బాహ్య-అభ్యంతరములలో నిత్య-అనిత్య రూపములు 'తానే' అయి ఉంటోంది.

❖ ❖ ❖

ఈ సమస్తము సీతాదేవికి చెందిన సంపదే కాబట్టి 'శ్రీదేవి'. **శ్రీదేవీ త్రివిధం కృత్వా, భగవత్ సంకల్పానుగుణ్యేన లోక రక్షణార్థం రూపం ధారయతి।** ఆ శ్రీదేవి పరమాత్మ యొక్క సంకల్పమును (వినోదమును) అనుసరించి లోక సంరక్షణార్థమై (ఈ నామరూపాత్మక జగత్తు నిర్మితమై, కొనసాగటానికై) - త్రివిధరూపములను దాల్చుచున్నది.

**(1) శ్రీః - ఇతి। (2) లక్ష్మీః - ఇతి। (3) లక్ష్యమాణా భవతి ఇతి।**

**'శ్రీ'** అని (శ్రీకారము అని), **'లక్ష్మి'** అని (సమస్త సంపద తనదైనదని) **'లక్షింపబడునది'** అని (సమస్త జీవుల ఆశయములు తనవే అయినది-అని) '3' విధములు - అని **తెలియబడుతోంది.**

**భూదేవిగా** - సప్త సాగర జలరూప, సప్త ద్వీపములతో కూడిన వసుంధర - అగుచున్నది.

→ **'భూ, భువర్, సువర్, మహర్, జనో, తపో, సత్య** సప్త ఊర్ధ్వ లోకములుగాను,

**"అతల వితల సుతల తలాతల, రసాతల, మహాతల, పాతాళ**, సప్త అధోలోకములుగాను,

**"చతుర్దశ భువన"** అయి వెలయుచున్నది.

**శ్రీదేవి అగు సీతాదేవియే - సమస్తమునకు :-**

⌘ **ఆధారము** - సమస్తము తనయందు ఉంచబడినట్టి తాను.

⌘ **ఆధేయము** - **ఉంచబడిన సమస్తము కూడా।** ఈ కనబడుచున్న సమస్తము సీతాదేవీ విన్యాసమే।

**'ప్రణవాత్మిక'।** - దృశ్య-దర్శన-జగత్తులకు తానే 'ఆత్మ' అయి ఉండటంచేత **"ప్రణవాత్మిక"** - అనబడుతోంది.

**నీళాదేవి అయి,** తేజస్సే ముఖముగా కలిగి ఉంటోంది. **'ముఖ విద్యున్మాలిని'** (తేజోముఖము) అయి సమస్త దేవతల ముఖములలో జ్యోతి-ఆనంద స్వరూపమై వెలయుచున్నది. **తేజోవిభవమై ప్రకాసిస్తోంది.**

**సర్వ ఔషధీం।** భూమిలో సర్వ ఔషధముల రూపముదాల్చినదై, ఆకు-ఫల-పుష్పముల రూపము దాల్చి, సర్వ జీవుల పరిపోషణార్థమై **"ఓషధీ రూపము"** దాల్చుచున్నది. **సర్వ ఆహార రూపములు, ఆ ఆహారములు స్వీకరించే సమస్త జీవుల రూపములు** 'తానే' అయి విలసిల్లుచున్నది.

**జలాకారాత్మికా। – సమస్త భువనస్య అదో భాగే 'జలాకారాత్మికా', మండూకమయీతి, భువన–ఆధారేతి విజ్ఞాయతే।** సమస్త భువనమునకు అడుగు (పాతాళ) భాగంలో 'జలాకారాత్మిక'గా (అపః తత్త్వమై / జలతత్త్వమై) సీతాదేవి చైతన్యమే వేంచేసి ఉంటోంది.

(**జలాక** = జలగ ఆకారంగా। **జలాకారము** = 'నీటిపై వ్రాత' వలె ఈ జగత్తులు కలిగి ఉంటోంది).

మండూకముగా (కప్ప–నాలుగు కాళ్లు, – (మాండూక్యోపనిషత్) – **"జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములు"**గా) అయి సమస్త భువనములకు తానే 'ఆధారము' అయి ఉంటోంది.

## క్రియా శక్తి స్వరూపీ!

ఈ సమస్తము **'సీతా ప్రకృతి మహత్–తత్త్వము'** యొక్క **క్రియాశక్తి చమత్కార రూపమే!**

- శ్రీహరి ముఖము నుండి → **'నాదము'** (Sound).
- అట్టి నాదము నుండి → **'బిందువు'** (Point).
- అట్టి బిందువు నుండి→ **'ప్రణవము'** ('ఓం'కారము). జీవ బ్రహ్మముల, దృశ్యముల సమగ్రమగు **"అద్వితీయ–పరమార్థ అక్షర సంజ్ఞ"**
- **'ఓం'కారాత్ పరతో 'రామ వైఖానస' పర్వతః।** → 'నాదము' ..... 'ఓం'కారమునకు పరమై (ఆవలిదై, ఓంకారమునకు పరార్థమై, శ్రేష్ఠార్థమై) – **రామ వైఖానస** (కేవలమగు ఆత్మారామ ఉపాసనా) **పర్వతము.**

(**వైఖానస** = వేద వాఙ్మయ అధ్యయనము)

అట్టి రామోపాసనా (ఆత్మోపాసనా) పర్వతమమునుండి **కర్మ జ్ఞానమయములైన** (Functioning and knowing సంబంధమైన) – **అనేక శాఖలు, ఉపశాఖలు.**

అచ్చట (ఆత్మారాముని యందు) త్రయీమయములగు త్రివేదములలోని పరమార్థము యొక్క స్ఫురణ (ఆత్మారామము)।

**శాస్త్రం ఆద్యం సర్వార్థ దర్శనమ్।** త్రివేదములలోని శాస్త్రీయ విషయాల అధ్యయనముచే సర్వార్థ దర్శన సిద్ధి.

[**త్రయీ :** 'ఋక్' వేదము 'యజుర్వేదము', 'సామవేదము' – ఈ మూడిటినీ కలిపి 'త్రివేదములు' అని చెప్పుతూ ఉంటారు.]

**నాలుగవేదము :** 'అథర్వణ'. ఇది కార్యసిద్ధి (Execution of Tasks spoken by three VEDA-S) యొక్క ప్రాధాన్యత కలిగి ఉన్నట్టిది. (అనగా ప్రధాన్యంగా – కార్యసిద్ధి నిమిత్తంగా నాలుగవ వేదము రూపుదిద్దుకొన్నదైనది).

నాలుగు వేదములను (1) ఋక్ (2) యజుః (3) సామ (4) అథర్వణ–అంగిరసము అని కూడా అంటారు.

(ముఖ్య ప్రాణమును **'అంగిరసము'** అని మునులు స్తుతించుచున్నారు – చాందోగ్యోపనిషత్).

**చాతుర్హోత్ర ప్రధానత్వాత్ లింగాది త్రితయం త్రయీ।**

**లింగ** = [(పంచవిశంతి (25) తత్త్వములకు ఆది అగు)] – ప్రకృతి.

**లింగాది** = ఆది పురుషుడగు 'పరమాత్మ'.

3 వేదములలో ఆది పురుష – ప్రకృతులకు 4 హోత్రములు (వ్రేల్చటములు) – ప్రాముఖ్యము కలిగి ఉన్నాయి.

అథర్వ–అంగిరస (ఉపాసనా ప్రాధాన్య) రూపము కూడా ఋక్–యజుర్–సామ **"త్రివేదహృదయాత్మిక" అగు సీతాదేవీ తత్త్వమే.**

| | | | |
|---|---|---|---|
| 1. ఋగ్వేదము | – | 21 శాఖలు | [మొత్తము వేదాంతర్గత శాఖా విభాగములు। (21)+(109)+(1000)+(50) = 1180 శాఖలు] |
| 2. యుజుర్వేదము | – | 109 శాఖలు | |
| 3. సామవేదము | – | 1000 శాఖలు | |
| 4. అథర్వణవేదము | – | 50 శాఖలు | |

**వైఖానసమ్ అతః తస్మిన్ ఆదౌ ప్రత్యక్ష దర్శనమ్।** ప్రాణోపాసనతో కూడి ప్రాణాయామాదులచే ఆది స్వరూపిణి అగు సీతాదేవీ (ఆత్మదేవీ) దర్శనము సిద్ధించగలదు. (**వైఖానసము** = ఆత్మతత్త్వ అపరోక్షానుభవము). అందుచేత మునులు వైఖానస దర్శనము (ప్రాణతత్త్వోపాసన)ను ముందుగా దర్శిస్తున్నారు. ఆ తరువాత శబ్దోపాసన. వైఖానస–శబ్ద దర్శనముల తరువాత – **వేదాంగ దర్శనము – షడంగ దర్శనములు / షట్ దర్శనములు.**

## వేద సంబంధిత – "వేద ఉపాంగములు"

1. **కల్పము** : యుగ యుగాంతర కాల కల్ప వివరణలు. వ్రత కల్పములు, నిబంధనలు – వివరించు వేదాంగము.

2. **వ్యాకరణము** : శబ్ద లక్షణ – వాక్యవివరణ, యతి ప్రాస సంబంధమైన నియమములు నిర్ణయించు శాస్త్రము.

3. **నిరుక్తము** : వేద శబ్దములకు అవయవార్థము. పదముల ముఖ్యార్థములు తెలియజేయు శాస్త్రము/దర్శనము.

4. **జ్యోతిష్యము** : సూర్య–చంద్ర–గ్రహ–నక్షత్ర–నక్షత్ర మండల కదలిక, సంచారముల గురించి తెలుపు శాస్త్రము. కర్మ సంబంధమైన ఉచిత – అనుచిత కాలనియమములను, నిష్కృతి–ప్రాయశ్చిత్తములను చెప్పు శాస్త్రము.

5. **ఛందస్సు** : పద్య లక్షణము, పదరచన, గణ–ప్రాస నియమములు మొదలైన భాషా నియమములు వివరించు వేదాంగము / దర్శనము.

6. **శిక్ష** : వేద స్వరములను, [ అనుస్వార (ఉదాత్త–అనుదాత్త) స్వర విశేషములను ] తదితర వేద – వేదాంగ – ఉపాంగ ఉచ్చారణాక్రమమును – నేర్పు విధి. విద్యాభ్యాసము, బోధనా విధానములను విశ్లేషించు శాస్త్ర / వేద విభాగ దర్శనము.

***వేద 'అనుబంధములు'గాను ఉపాంగములుగాను చెప్పబడు (వేద సంబంధిత) శాస్త్రములు:***

**1. మీమాంస శాస్త్రము :** పూర్వభాగంగా వేదములకు సంబంధించిన కర్మకాండను, ఉత్తర భాగంగా 'జ్ఞానము' బోధించు శాస్త్రము/ వేద ఉపాంగము. కర్మ–జ్ఞానములను సమన్వయించి విశ్లేషించు శాస్త్రము.

**2. న్యాయ శాస్త్రము :** తర్క శాస్త్రము (Logic).

## ధర్మశాస్త్రము

ఈ జీవులంతా పరస్పరము (ఒకరిపట్ల మరొకరు) ఏ ఏ ధర్మము నిర్వర్తించాలో, అట్టి 'ధర్మాచరణ' పైననే సాంఘిక జీవనము ఆధారపడినదై ఉంటుంది. అందుచేత – **ధర్మజ్ఞ సేవితార్థం చ, వేద వేదో – అధికం తథా।** ఒకడు తాను **చేయవలసినది** (ధర్మము), **చేయకూడనిది** (అధర్మము) – ఇవి అత్యంత ప్రాముఖ్యం అగుచున్నాయి.

ధర్మశాస్త్రము ధర్మప్రవచనములు – వేద వేదాంగముల కంటే కూడా (దైనందికంగా మానవుల జీవన విధానం పరిరక్షించేది, బాధించేది కూడా కాబట్టి) – ప్రాముఖ్యత సంతరించుకోసాగాయి.

ధర్మశాస్త్రములోని నిబంధనములు (Conditions) సమయ–ఆచారములకు సంబంధించిన సంగతులు (Timely practices and related duties of a person) – దైనందిక జీవితంలో అందరికీ ముఖ్యముగా తెలుసుకోవలసినవి అగుచున్నాయి.

అంతేకాదు. కాలమునుబట్టి ప్రదేశము, **వాతావరణాదులనుబట్టి ధర్మ–నియమ–నిష్ఠలు వేరువేరుగా రచించబడవలసి వస్తోంది.**

అట్టి అతి సూక్ష్మము – గహనము అయి ఉండటం చేత (**'మనుస్మృతి' 'పరాశరస్మృతి'** మొదలైన) మహర్షి అంతఃకరణములు ధర్మశాస్త్రములై వెలయుచున్నాయి. **ధర్మశాస్త్రం మహర్షీణాం అంతఃకరణ సంభృతమ్॥**

లోక క్షేమ ఆశయముతో మహర్షులు చెప్పు ప్రవచనములు, విధి-నిషేధములు 'ధర్మశాస్త్రము'గా ఆచరించబడుతోంది. అవి మానవులకు విధి-నిషేధ సంబంధమైన నిఘంటువులు (Dictionary References for Do's and Dont's) అగుచున్నాయి. [ **ధర్మో రక్షిత రక్షితః।** ధర్మమును రక్షించువాడు (శ్రద్ధగా నిర్వరించువాడు) ఆ ధర్మముచేతనే రక్షించబడుచున్నాడు].

## వేదము యొక్క ఉపాంగములు:

**ఇతిహాసము :** పరంపరగా చెప్పుకొనే పూర్వకథ. చరిత్రాంశము. పూర్వము జరిగిన చరిత్రను వివరించు గ్రంథము. ఉదాహరణకు భారతము, రామాయణము మొదలైనవి. (ఇతి-హ-అసమ్। **'హ'** - ఒకప్పుడు, **'ఇతి'।** - ఈవిధంగా, **'అసమ్'** = జరిగినది).

**పురాణములు :** బ్రాహ్మణముల గురించిన గ్రంథములు వ్యాసమహర్షిచే **'18' పురాణములు పలుకబడ్డాయి.**

**(మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రహ్మ, వైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ, అగ్ని, నారద, పద్మ, లింగ గరుడ, కూర్మ, స్కాంద పురాణములు)**

**(అష్టాదశ పురాణముల పేర్ల గురించి శ్లోకం -: 'మ'ద్వయం। 'భ'ద్వయంబైవ। 'బ్ర' త్రయం। 'వ' చతుష్టయం। అ నా పా లిం గ కూ స్కా - ని పురాణాని పృథక్ పృథక్)**

**పురాణములు :** పూర్వమే మొదలై ఉండిన ఆత్మతత్త్వము గుర్తుచేయు సంఘటనల అభివర్ణనలు కలది. ఇతః పూర్వమే ఉండి, ఇప్పటికీ, ఎప్పటికీ సమన్వయము కాగలిగినట్టివి - **పురాణములు**).

## పంచ ఉపవేదములు

**శ్లో॥ వాస్తువేదో ధనుర్వేదో గంధర్వశ్చ తథా మునిః**
**ఆయుర్వేదశ్చ పంచైతే - ఉపవేదాః ప్రకీర్తితాః॥**

**1. వాస్తు వేదము :** గృహములు మొదలైన వాటికి సంబంధించిన "నిర్మాణ" శాస్త్రము (Civil Engineering).

**2. ధనుర్వేదము :** విలువిద్య। అస్త్రవిద్య, శస్త్ర విద్య.

**3. గంధర్వ వేదము : గానము, సాహిత్యములతో కూడిన సంగీతవిద్య,** (గంధర్వగానము = దేవతా మధురగానము), **నాట్యవేదము.**

**4. ముని వేదము :** సమస్త ప్రాపంచిక విశేషములను ఆత్మయందు ఏకముచేసి, సమస్త అనేకములపట్ల అంతరమున 'మౌనము' వహించియుండు ఆత్మయోగసిద్ధి - శాస్త్రము.

**5. ఆయుర్వేదము :** మానవుల ఆయురారోగ్యములను రక్షించు, రోగులకు ఉపశమనము కలిగించు ఔషధ సంబంధమైన శాస్త్రము. (Medicine). రోగ చికిత్సా శాస్త్రము.

**ఉపశాస్త్రములు :** 'దండో నీతిశ్చ వార్తాచ విద్యా వాయుజయః పరః।

**(చతుశ్శాస్త్రములు :** వ్యాకరణ, తర్క, మీమాంస, ధర్మశాస్త్రములు).

**దండము :** నేరము - శిక్ష సంబంధమైనది. రాజశిక్ష.

**నీతి :** రాజనీతి. నీతి-నిజాయితీగా ఉండే సాంఘిక జీవన శాస్త్రము.

**వార్త :** ప్రవర్తనము. అర్థ, అనర్థములను వివేచనచేయు వర్తనము. జీవనోపాయములు, లోకోక్తులు.

**విద్య :** అధ్యాత్మ విద్య. జ్ఞాన సంపాదనము. శాస్త్ర విద్య.

**వాయు జయము :** ప్రాణాయామ ఉపశాస్త్రము. పూరక - రేచక - కుంభక అభ్యాసములు. స్వాభావ కుంభక సిద్ధి. ఇడ పింగళనాడులను ఉపయోగించి ఇచ్ఛాశక్తి రూపమగు కుండలినీ శక్తిని మూలాధారంలో నిదురలేపి (ఇడ-పింగళల మధ్యగా గల) సుషుమ్నానాడిలో ప్రవేశింపజేసి, బ్రహ్మరంధ్రమును భేదింపజేసి, సహస్రాకారములోను ప్రవేశింపజేయు అభ్యాసము. 21 ఉపనిషత్తులలో ప్రాణాయామము గురించి శాస్త్రీయం విశేషాలు చెప్పబడుచున్నాయి.

స్వయం ప్రకాశవిద్యలు **21 రూపములుగా శాస్త్రరూపములు దాల్చి ఉన్నాయి.**
**ఇవన్నీ కూడా *"సీతాదేవీ మూలప్రకృతి మహత్మ్య"* విశేషములే!**

❖

**సాంఖ్య శాస్త్ర రూపమగు సీతాదేవీ మహత్మ్యము విష్ణువు యొక్క వాణిగా, విష్ణు వాక్కుగా** వైఖానస ఋషి శ్రవణం చేసి ఉన్నారు. ఓ దేవతలారా! మనము ఆయా కొన్ని విశేషాలు ఇప్పుడు చెప్పుకుందాము.

సీతాదేవి సృష్టిలో **"క్రియారూపము"** అయి, సమస్తమును ఉత్తేజపరుస్తూ సజీవంగా నడిపించుచున్నది. (Inspiring and making lively).

**శశ్వత్ బ్రహ్మమయం రూపం 'క్రియా శక్తిః' ఉదాహృతా।** ఇదంతా ఎల్లప్పుడు (శశ్వత్) (బ్రహ్మమయమే అయి ఉండటంచేత, **దృశ్యవ్యవహారమంతా కూడా బ్రహ్మముయొక్క క్రియాశక్తి ప్రదర్శనా చమత్కారమే** – అని చెప్పబడుతోంది.

**– సాక్షాత్ శక్తిః భగవతః।** ఇదంతా భగవతి అగు – **సీతాదేవీ సాక్షాత్ శక్తి ప్రదర్శనా చమత్కారమే।**

**– స్మరణ మాత్ర రూపా! ఆవిర్భావ – ప్రాదుర్భావాత్మికా!** ఆత్మానంద స్వరూపిణి అగు సీతాశక్తి యొక్క స్మరణ మాత్ర రూపమే ఇదంతా కూడా! (All this being seen as the form of World Scenario is the pleasure-outcome of chanting by Absolute Form of Self). **అట్టి ఆత్మదేవి యొక్క స్మరణ మాత్రంచేత 14 లోకములు ఆవిర్భావము, పాదుర్భావము** (Creation and blossoming) జరుగుతోంది. ఈ సమస్తమునకు ఆవిర్భావ, ప్రాదుభావాత్మిక ఎవరు? **ఆత్మేశ్వరి అగు సీతామాతయే.**

ఇంకా కూడా – ఆ దేవదేవి →

**– నిగ్రహ–అనుగ్రహ రూపా।** నిగ్రహించి నిరోధించగలిగినది.

అనుగ్రహించి సమస్తము ప్రసాదించ గలిగినది కూడా,– **మూల ప్రకృతి, కేవలాత్మానంద స్వరూపిణి** అగు ఈ **సీతాదేవియే।**

## వ్యక్తా వ్యక్త స్వరూపిణీ

– ఆ దేవి శాంతి రూపముగాను, తేజో రూపముగాను సమస్త జీవుల బాహ్య–అభ్యంతరములలో సర్వదా వెలయుచున్నది.

– అవ్యక్తమై–వ్యక్తీకరించునది, వ్యక్తీకరించబడునది కూడా తానే అయి, **'వ్యక్తావ్యక్త రూపిణి'** అగుచున్నది. **వ్యక్తావ్యక్తమగు కార్య చరణములు కలిగి, ఈ సమస్తమును నడిపిస్తూ, నడుచుచూ ఉన్నది.**

– ఈ విశ్వమంతా తనయొక్క సమగ్రమైన అవయవములుగా కలిగి ఉండి, భేద–అభేద రూపముతో అంతటా వేంచేసినదై ఉంటోంది.

– ఆ సీతాదేవి **"భగవంతుడు, కేవలస్వరూపుడు" అగు ఆత్మారామునితో సహచర్యము కలిగినదై 'సహధర్మచారిణి'గా వర్తించు దివ్యశక్తి స్వరూపము.**

**– అనపాయినీ।** తనను శరణువేడిన బిడ్డలగు జీవులందరి ఆపదలను తొలగించునది.

**– అనవరత సహాయ ఆశ్రయణీ।** నిస్సహాయులగు జీవులకు ఎల్లప్పుడు 'సహాయము' కొరకై ఆశ్రయించతగినట్టి **కరుణామూర్తి!** ఆశ్రిత జన రక్షణి! నమస్కరించినంత మాత్రంచేతనే మాతృదేవి అయి అవ్యాజమైన **ప్రేమ, రక్షణ** ప్రసాదించునది।

**– ఉదిత–అనుదితాకారా।** సర్వత్రా సమస్తముగా ఉదయిస్తూ కూడా, – ఉదయాస్తమయ ధర్మమనేది ఏమాత్రము లేనట్టిది.

**– నిమేష ఉన్మేష సృష్టి స్థితి సంహార తిరోధాన అనుగ్రహాది సర్వశక్తి సామర్థ్యా।** రెప్ప తెరచి మూయునంతటి రెప్పపాటు కాలములో సృష్టి స్థితి సంహార తిరోధాన (ఉపసంహార) అనుగ్రహ–ఇత్యాది సర్వశక్తి సామర్థ్యములు ప్రదర్శించు దివ్య తత్త్వ స్వరూపిణియే సీతాదేవి।

ఈవిధంగా సాక్షాత్ శక్తి స్వరూపిణియే – ( The form of Absolute Energy which is there prior to all worldly manifestations and the worldly exhibitions) – **సీతాదేవి అని వేదవేదాంగములచే గానము చేయబడుతోంది. ప్రస్తుతించబడుతోంది.** (Every thing else tends to be Sita Devi's extension of hereself).

## ఇచ్ఛాశక్తి స్వరూపిణీ సీతా।

ఆ దేవదేవి యొక్క ఇచ్ఛాశక్తి సందార్భానుచితంగా మూడువిధములై ప్రదర్శనమౌతోంది.

**1. యోగశక్తి 2. భోగ శక్తి 3. వీరశక్తి**

**I. యోగశక్తి** (Getting back to SELF) : – ప్రలయకాలంలో లోకములు, లోకపాలకులు, మునిగణము – అంతాకూడా లయించగా, ప్రపంచమంతా కూడా నిష్ప్రపంచమగుచూ ఉండగా, – భగవతియగు మూలప్రకృతీ సీతామాత భగవంతుడగు పరమబ్రహ్మమునందు (తరంగము జలములో లయించు తీరుగా) లయిస్తోంది. **ఆయన యొక్క దక్షిణ (ఎడమవైపు) వక్షస్థలంలో విశ్రమించటానికై 'శ్రీవత్సాకృతి'ని ధరిస్తోంది.** అట్టి విశ్రమించు సీతాదేవీ ఆత్మసంయమమే **యోగశక్తి [ఆత్మతో శక్తి యోగము (ఏకము) పొందటము]** అని చెప్పబడుతోంది.

**II. భోగశక్తి** (Enjoying the own external) : – ఆ దేవియొక్క భోగశక్తియే దృశ్య జగత్తులో భోగరూపములు అగుచున్నది. సమస్త జీవులలోని 'భోగించాలి' అనే ఉత్సాహము సీతాదేవీ చైతన్య ప్రదర్శనమే।

**సీతాదేవియే కల్పవృక్ష, కామధేను, చింతామణి, శంఖ, చక్ర, గదా ఖడ్గ, పద్మ, నిధి** – అనబడే నవనిధులను ఆశ్రయించినదై, వాటివాటి వైభవములను సృష్టి కల్పనయందు సంప్రదర్శితము చేస్తూ ఉంటోంది.

భగవంతుని ఉపాసకులగు భక్తులకు తనయొక్క నవనిధులతో 'తోడు' అయి ఉంటోంది. వారు కోరికలతోగాని, కోరికలు లేకుండానేగాని (కామనయా, అకామనయా) చేయు **నిత్యకర్మలను** (Daily Puja etc.,), **నైమిత్తిక కర్మలను** (Occasionally taken up Dedications) – గమనిస్తూ **కర్మఫలములను ప్రసాదించుచున్నది.**

భక్తజనులగు అనేకులు జగన్మాతయగు సీతాదేవీ మహత్త్యము ఎరిగినవారై →

– నిత్య నైమిత్తిక (everyday - occasional) కర్మలతోను, (అగ్నిహోత్రమును పూజించటము, హవిస్సులను సమర్పించటము మొదలైన) **అగ్నోపాసనా విధులచేతను,** ఆ జగన్మాతను ఉపాసిస్తున్నారు.

– **అష్టాంగ యోగముల**చేత జగత్–చైతన్యస్ఫూరి అగు జగజ్జనని ఆరాధిస్తున్నారు.

**1. యమము : – బాహ్యేంద్రియ నిగ్రహము.** హింస మొదలైనవి భరించటము. శరీరమును యోగాంగముగా భావించి సాధకులై ఉండటము.

**2. నియమము :** – అంతరింద్రియములైనట్టి మనోబుద్ధి చిత్త అహంకారములను విషయములనుండి మరల్చి 'సర్వాత్మకము, సర్వసమరూపము' అగు పరమాత్మ వైపు **నియమించటము.**

**3. ఆసనము :** – ధ్యానము యొక్క ఏకాగ్రతకు సానుకూల్యమగు, శరీరమునకు అనుకూలముగా ఉండే "**ఆసనము** (Sitting Arrangement)" ధారణ చేయటము. యోగశాస్త్రముచే పద్మాసనము మొదలైన అనేక ఆసనములు సూచించబడ్డాయి. శరీరానుకూల్యత, వయస్సు, పరిసరముల అనుకూల్యతలను బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆసము 'సుఖాసనము' అవుతోంది. యోగాభ్యాసి తనకు ఏది సుఖాసనమో, దానిని స్వీకరించుచుండును గాక!

**4. ప్రాణాయామము :**

ముక్కు పుటముల ద్వారా **వాయువును పీల్చి, ధారణ చేసి, వదలటము।**

- ఇడానాడిలోకి పీల్చి పూరకము, **వాయు కుంభకము.** పింగళనాడిద్వారా రేచకము (గాలి వదలటము).
- పింగళనాడిలోకి పీల్చి పూరకము. **వాయుకుంభకము.** ఇడనాడి ద్వారా రేచకము (గాలి వదలటము).

- నవరంధ్రములలోను, షట్ చక్రములలోను, దేహములోని ఆయా 'భుజము' మొదలైన ప్రదేశములలోను క్రమంగా **'స్వాభావిక కుంభకము'**ను అభ్యాసము చేయటము. (పూరక-రేచకముల సహాయము లేకుండానే బుద్ధితో వాయు కుంభకము).

బాహ్య - అభ్యంతర స్వాభావిక కుంభకము మొదలైన ప్రాణోపాసన విధులు దేవీ ఆరాధనాపూర్వకంగా ఆశ్రయించబడటము.

**5. ప్రత్యాహారము :** - ఇంద్రియములను జగత్ విషయానుభవముల నుండి క్రమక్రమంగా ఉపసంహరించి, భగవదారాధనా పూర్వకమైన ఉపాసన, మనన, భావనలయందు నియమించటము.

**6. ధ్యానము :**- దృశ్య విషయములనుండి ధ్యాసను మరల్చి సర్వతత్త్వ స్వరూపిణియగు ఆ పరాత్పరి యందు, ధ్యాసను నిలిపి ఉంచు అభ్యాసము. **(ధ్యాసయే - ధ్యానము).**

**7. ధారణ :** - **'సమస్తము ఆత్మయే। ఇదంతా ఆత్మకు అనన్యము।'** అను భావన, అనుభూతి, అనుభవములను సునిశ్చల పరచుకొనే ప్రయత్నము అనుక్షణికము, స్వాభావికము చేసుకొను ఆత్మసంబంధమైన **'ధ్యాస నిశ్చలత'.**

**8. సమాధి :** - ఏ దేవాది దేవి యగు సీతామాత ఈ సమస్తము అయి ఉన్నదో, 'అట్టి అఖండాత్మ స్వరూపమే నేను. **సోఽహమస్మి'** - అను అఖండాత్మగా తన సహజ స్వరూపమును సర్వత్రా గమనించటము. తానే సీతా చైతన్యమై ఉండటము.

**ఈఈ అష్టాంగ యోగముల ద్వారా సీతాదేవియొక్క తాత్త్విక రూపము ఉపాసించబడుతోంది.**

**ఇంకా కూడా** - పరమాత్మపట్ల అవ్యాజమైన ప్రేమ చేత - గోపుర-ప్రాకార-విమానాదుల నిర్మాణ-దర్శనముల చేతను, భగవంతుని విగ్రహ అర్చన, అంగపూజ, షోడశ పూజా కర్మలచేతను,

- (కార్తీక మార్గసిర మాస-ఇత్యాది) స్నానాదులతో ఉపాసించుటచేతను,
- పితృ దేవతల పూజ చేతను,
- సహజీవులకు అన్న పానాదులు సమర్పించటము చేతను,

అమ్మవారి 'భోగశక్తి'ని భక్తులు భక్తితో ఉపాసించటము జరుగుతోంది.

## సీతాదేవీ వీరశక్తి

**III. వీరశక్తి :** - అమ్మవారు తనయొక్క వీరశక్తితో సాకార రూపమును భక్తుల ఉపాసన, ఏకాగ్రతల కొరకై ప్రసాదిస్తున్నారు.

- **చతుర్భుజా। :** జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములను, దృశ్య-దర్శన-ద్రష్ట-దృక్ (సాక్షి)లను, కార్య-కారణ-కర్తృత్వ-భోక్తత్వములను **తనయొక్క చతుర్భుజములుగా కలిగియున్నది.**
- **అభయ వరద పద్మధరా। :** భయమును పోగొట్టి **'అభయము'ను ప్రసాదించునది, వరప్రసాదిని, జ్ఞాన ప్రసాదిని అగు పద్మమును** అమ్మవారు చేతిలో ధరించుచున్నారు.
- కిరీటము మొదలుకొని - సమస్త ఆభరణములు సమన్వితమైయున్నది, సర్వ దేవతలచే పరివృతమైయున్నది.
- కల్ప వృక్షమూలంగా ఆశీనురాలై ఉండగా, నాలుగు ఏనుగులు రత్నఘటములతో అమృత జలముతో ఆ దేవాదిదేవికి అభిషేకము సమర్పిస్తూ ఉన్నాయి.
- బ్రహ్మ మొదలైన దేవతలందరు ఆ జననికి స్తుతులు సమర్పిస్తున్నారు.
- **"అణిమ గరిమ మహిమ లఘిమ ఈశిత్వ వశిత్వ ప్రాకామ్య ఇచ్ఛా"** - అనబడే అష్టసిద్ధులు ఆ దేవిని సేవిస్తూ ఉంటున్నాయి.
- ఆ తల్లి సమక్షంలో ఎదురుగా కామధేనువు. కామధేనువుచే ఆ దేవి ప్రస్తుతించబడుచూ ఉన్నది.

- లోకపావని యగు సీతామాతను వేద శాస్త్ర **పురాణములు** – వేదవతిగాను, త్రిపురేశ్వరిగాను, **సంస్తుతులు** సమర్పిస్తున్నారు.
- జయ మొదలైన అప్సరస స్త్రీలచే పరిచర్యలు (సేవలు) స్వీకరిస్తూ ఉంటోంది,
- ఆదిత్య, సోమ, దీపములలో (సూర్య – చంద్ర – అగ్నులలో) ఆ సీతామాత తేజో విభవమే అన్నివైపులా వెలుగులు చిందిస్తూ ఉన్నది.
- నారదుడు, తుంబురుడు మొదలైన దేవర్షులు, మహర్షులు ఆ చైతన్యమూర్తికి సన్నుతులు సమర్పిస్తున్నారు.
- 'రాకా సినీవాలీ' – అనే పేరుగల ఛత్రము యొక్క ఛాయలతో అలంకృతమై ఉన్నది.
- **'హ్లాదిని'** అనే మహామాయాదేవిచే చామరములు వీచబడుచూ ఉన్నది.
- **"స్వాహా" "స్వధా"** మొదలైన వేద శబ్ద వ్యజనములచే పూజించబడుచూ ఉన్నది,

  (**స్వాహా** = దేవతా స్తుతి. **'స్వధా'** = పితృదేవతల స్తుతి).
- **భృగువు** మొదలైన బ్రహ్మతత్త్వజ్ఞులగు మహర్షులచే, పుణ్యపురుషులచే అర్చించబడుచున్నట్టిది.

*అట్టి దేవి దివ్య సింహాసనముపై పద్మాసన – ఆరూఢ అయి అధిష్ఠించి ఉన్నది.*

- జగత్తులో సర్వ కార్య కారణ కర్తృత్వములు ఆ సీతాదేవి యొక్క ప్రభవ–తేజో పుంజములే!
- వైకుంఠములో విష్ణుభగవానుని మందిరంలో లక్ష్మీదేవి అయి విలసిల్లుచున్నది.
- 14 లోకములు తనయొక్క బ్రహ్మీరూపముతో నిశ్చలముగా, సుస్థిరముగా నింపి ఉంచుచున్నది.
- తనయొక్క ప్రసన్నతతో కూడిన చూపులతో ఆశ్రయించి నమస్కరించినంత మాత్రంచేత భక్తజనుల మనస్సులను ప్రసన్న–ప్రశాంతమయముగా తీర్చిదిద్దుచున్నది.
- సర్వదేవతలచే పూజింపబడుచున్నది.

***అట్టి వీరలక్ష్మిగా పిలవబడుచున్న సీతాదేవికి నమస్కరించుచున్నాము.***

ఆ తల్లి **'వీరలక్ష్మి'** అను నామముచే ప్రసిద్ధమై మాలోని అరిషట్ వర్గమును కడిగివేయును గాక!

మాకు ఆత్మానందమును అనునిత్యంగా, అనుక్షణంగా ప్రసాదించును గాక!

→ అట్టి **యోగశక్తి, భోగశక్తి, వీరశక్తి** సమన్వితమగు సీతాదేవి యొక్క ఇచ్ఛా జ్ఞాన క్రియా రూపములకు – **మాయను జయించే నిమిత్తమై, మేము నమస్కరిస్తున్నాము. శరణు వేడుచున్నాము.**

**మూల ప్రకృతి స్వరూపిణీ, ఇచ్ఛా జ్ఞాన క్రియా స్వరూపిణీ,**
**అస్మత్ ఆత్మ స్వరూపిణీ – శ్రీ సీతామాతాభ్యాం నమః॥**

ఇతి సీతోపనిషత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

అథర్వణవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

**21**

# సూర్యోపనిషత్

## (సావిత్రీ విద్య)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ సూదితః స్వాతిరిక్తారి సూరి నందాత్మ భావితమ్।
సూర్యనారాయణాకారం నౌమి 'చిత్' సూర్య వైభవమ్॥



స్వస్వరూపమునకు వేరుగా అనిపించేదంతా భస్మము చేయునది (లయింపజేయునది), ఆత్మభావనాకారము ప్రసాదించునది - అగు సూర్యనారాయణాకారమును చిత్ సూర్య వైభవముగా స్తుతించుచున్నాము.

ఓం।

1. అథ "సూర్య-అథర్వ అంగిరసం"
వ్యాఖ్యాస్యామః।
బ్రహ్మా - ఋషిః।
గాయత్రీ - ఛందః।
ఆదిత్యో - దేవతా।

ఇప్పుడు మనము "సూర్య" - అథర్వణవేద 'అంగిరసము' (మంత్రము)ను వ్యాఖ్యానించుకొంటున్నాము.

అట్టి ఈ **సూర్యాథర్వ** అంగిరస మంత్రమునకు -

ఋషి - **"బ్రహ్మదేవుడు"**

ఛందస్సు - **"గాయత్రి"**

దేవత - **"ఆదిత్యుడు"** (సూర్యుడు)

---

హగ్ంసః సోఽహమ్ అగ్ని ।
- నారాయణ యుక్తం - బీజం।
- హృల్లేఖా శక్తిః।
- వియత్-ఆది సర్గ సంయుక్తం కీలకమ్।
చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే వినియోగః।

**అగ్ని** - **"హగ్ంసః। సోఽహమ్"**।

**బీజము** - **"ఓం నమో నారాయణాయ"**

**శక్తి** - హృల్లేఖా (హృదయస్థానము)।

**కీలకము** - ఆకాశము ఆదిగా (ఆకాశము-వాయువు-అగ్ని-ఆపః-పృథ్వి) - పంచభూతములతో సంయుక్తము (కూడుకొన్నది).

("ధర్మ అర్థ కామ మోక్షములు" అనబడే) చతుర్విధ (నాలుగు రకముల)- పురుషార్థములు సిద్ధించటానికై - **వినియోగము (సంకల్పిస్తున్నాము).**

---

2. షట్ స్వరారూఢేన బీజేన షడంగమ్ -
రక్తాంబుజ సంస్థితమ్।
సప్తాశ్వ రథినమ్।
హిరణ్య వర్ణం। చతుర్భుజమ్।

తనవైనట్టి ఆరు స్వరములతో ఆరూఢము (కలిగినది) అయిన బీజముతో షడంగము. [**స్వరములు = ఉదాత్త** (వేదములోని ఊర్ధ్వ స్వరము, **అనుదాత్త** (క్రింద స్వరము), మధ్యమ మొ॥వి].

- ఎర్ర తామర పద్మమునందు ప్రకాశమానుడై ఉండువారు,

- ఏడు గుఱ్ఱములు పూన్చిన రథము అధిరోహించువారు, (సప్తాశ్వరథమారూఢమ్)

- బంగారు వన్నెలతో ప్రకాశించువారు, 4 భుజములు కలవారు,

| | |
|---|---|
| **పద్మద్వయ-అభయ వరద హస్తమ్।**<br>**కాలచక్ర ప్రణేతారం**<br>**శ్రీ సూర్యనారాయణం**<br>**య ఏవం వేద, స వై బ్రాహ్మణః-** | - **అభయము** (భయము పోగొట్టునది), **వరదము** (సమస్తము ప్రసాదించునది) - అగు రెండిటి సంజ్ఞగా రెండు చేతులతో రెండు పద్మములు ధరించువారు,<br>- కాల చక్రమును నడిపిస్తూ ఉన్నవారు -<br>అగు సూర్యభగవానుని తత్త్వతః ఎవరు తెలుసుకొంటారో, వారే బ్రహ్మమును ఎరిగినట్టి '**బ్రాహ్మణులు**'। |
| **ఓం భూర్భువస్సువః,**<br>**తత్ సవితుః వరేణ్యమ్**<br>**భర్గో దేవస్య ధీమహి-**<br>**ధియో యో నః ప్రచోదయాత్।**<br>**(ఇతి గాయత్రీ మంత్రః)।** | **భూ భువః సువర్** (Matter - Thought - Self Zones) - అను వ్యాహృతులు. (Expressions) గా గలవారు,<br>**స్తుతిపాత్రులు (వరేణ్యుడు), సత్-విత్** (కేవలమగు ఉనికి, ఎరుక) స్వరూపులు అగు **సూర్య భగవానుని మహిమను బుద్ధితో స్తుతించు చున్నాము.**<br>అట్టి **భర్గోదేవుడు** (సమస్తమును వెలిగించుచున్న సూర్యదేవుడు) మా **బుద్ధులను** (ఆత్మతత్త్వము వైపుగా, పరమ - సత్యము వైపుగా) **ప్రేరేపించుదురు** గాక! |
| **సూర్య ఆత్మా**<br>**జగతః తస్థుషశ్చ।**<br>**సూర్యాద్వై ఖలు ఇమాని భూతాని జాయంతే।**<br>**సూర్యాత్ యజ్ఞః పర్జన్యో, అన్నమాత్మా।** | (దేహమునకు దేహియే ఆత్మ - అన్న తీరుగా) - ఈ సమస్త జగత్తుకు సూర్యుడే 'ఆత్మ' (The Self of entire Creation). ఆయన నుండి ఈ జగత్తు (లీలగా) బయల్వెడలుతోంది.<br>సూర్యుని నుండియే ఈ సమస్త జీవులు జనించుచున్నారు.<br>సూర్యుని నుండే 'సృష్టి' అనే మహా యజ్ఞము. ఆ యజ్ఞములో అంతర్భాగంగా 'మేఘములు' (వర్షాధి దేవత). మేఘముల వలననే 'అన్నము'. అన్నము వలననే జీవులపట్ల 'జీవితము' అనే సందర్భము సిద్ధిస్తోంది. |
| **నమస్తే ఆదిత్య।**<br>**త్వమేవ ప్రత్యక్షం కర్మకర్తాసి।** | [ ఆదిత్యుడు = అదితి కుమారుడు.<br>(యః తు "ఆది = సమస్తమునకు మునుముందే ఉన్న సత్-విత్-ఋత్ ఆత్ముడు. సవితృడు).]<br>హే ఆదిత్య భగవాన్! మీకు నమస్కారము. స్వామీ! సృష్టిలోని సమస్త కర్మ వ్యవహారములకు "కర్త" అయి ఉన్నారు. ప్రత్యక్షకర్త మీరే! |
| **త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।**<br>**త్వమేవ ప్రత్యక్షం విష్ణురసి।**<br>**త్వమేవ ప్రత్యక్షగ్ం రుద్రోఽసి।**<br>**త్వమేవ ప్రత్యక్షం "ఋక్" - అసి।**<br>**త్వమేవ ప్రత్యక్షం 'యజుః' - అసి।**<br>**త్వమేవ ప్రత్యక్షగ్ం 'సామ' - అసి।**<br>**త్వమేవ ప్రత్యక్షమ్ 'అథర్వ' - అసి।** | **మీరే ప్రత్యక్ష దైవము। ప్రత్యక్ష నారాయణుడగు మీరే -**<br>- **ప్రత్యక్ష 'సృష్టి'కర్త** అగు బ్రహ్మదేవుడు!<br>- **ప్రత్యక్ష 'స్థితి' కర్త, పరిపోషకుడు** అగు విష్ణు భగవానుడు!<br>- **ప్రత్యక్ష 'లయ' కర్త** అగు రుద్రపరమాత్మ!<br>- ఋషుల స్వానుభవముగా గానము చేయబడుచున్న 'ఋక్కులు' ప్రాధాన్యము కలిగిన '**ఋగ్వేద మంత్ర స్వరూపులు**'.<br>- యజ్ఞయాగ యజుస్సుల ప్రాధాన్యము కలిగియున్న '**యజుర్వేద యజ్ఞ స్వరూపులు**'.<br>- వేదగానములతో కూడిన **సామవేద గాన స్వరూపులు.**<br>- మీరే ప్రత్యక్షమగుచున్న విశేషములను క్రోడీకరించి వివరించు అథర్వణవేద స్వరూపులు. (యజ్ఞవిధి, విధాన, నిషేధ వివరణములు- విశేషములు ప్రాధాన్యముగా గలది). |

| | |
|---|---|
| త్వమేవ సర్వం ఛందోఽసి।<br>ఆదిత్యాత్ వాయుః జాయతే।<br>ఆదిత్యాత్ భూమిః జాయతే।<br>ఆదిత్యాత్ ఆపో జాయంతే।<br>ఆదిత్యాత్ జ్యోతిః జాయతే।<br>ఆదిత్యాత్ వ్యోమ జాయతే।<br>ఆదిత్యాత్ దేవా జాయంతే।<br>ఆదిత్యాత్ వేదా జాయంతే। | మీరే భాషాశాస్త్ర విశేషమగు 'ఛందస్సు' - స్వరూపులు.<br>ఆదిత్యుడే - వాయువు, భూమి, జలము, జ్యోతి, వ్యోమము (ఆకాశము), దేవతలు, వేదములుగా అగుచున్నారు. **ఆదిత్యుని నుండే** భూ-జల- జ్యోతి (అగ్ని) -వాయు-ఆకాశములు, దేవతలు, వేదములు బయల్వెడలు చున్నాయి.<br>ఈ సమస్తమునకు ఆది ఏదో, **"తదేవ ఆదిత్యః".** |
| **3.** ఆదిత్యోవా ఏష<br>ఏతత్ మండలం తపతి।<br>అసావాదిత్యో బ్రహ్మ।<br>ఆదిత్యో అంతఃకరణ-<br>మనో బుద్ధి చిత్త అహంకారాః। | ఆదిత్యుడే తనయొక్క తేజస్సుచే సూర్యమండలమును తపింప జేయుచున్నారు. వెలిగించుచున్నారు.<br>ఆదిత్యుడే సర్వత్రా ఏర్పడియున్న బ్రహ్మము. ఆయనయే సృష్టికర్త అగు బ్రహ్మ. ఆయనయే జీవులలో అంతఃకరణ చతుష్టయమగు మనో బుద్ధి చిత్త అహంకారస్వరూపులు. |
| ఆదిత్యో వై వ్యానః సమాన<br>ఉదానో అపానః ప్రాణః। | ఆ ఆదిత్యభగవానుడే దేహములలో ప్రాణ-వ్యాన-సమాన-ఉదాన అపానములుగా (పంచప్రాణములుగా) అయి, శరీరములోని అంతర్గత వ్యవహారములన్నీ సజీవరూపంగా నడిపిస్తూ ఉన్నారు. |
| ఆదిత్యో వై శ్రోత్ర త్వక్ చక్షూ రసన ఘ్రాణాః।<br>ఆదిత్యో వై వాక్ పాణి పాద పాయు ఉపస్థాః।<br>ఆదిత్యో వై శబ్ద స్పర్శ రూప రస గంధాః।<br>ఆదిత్యో వై వచన ఆదాన ఆగమన విసర్గ ఆనందాః। | **ఆదిత్యుడే** →<br>**పంచ జ్ఞానేంద్రియములగు - చెవులు** (వినికిడి), **చర్మము** (స్పర్శ), **కళ్లు** (చూపు), **రసనము** (నాలుక), **ముక్కు** (వాసన) గాను<br>**పంచకర్మేంద్రియములు** అగు - **వాక్, పాణి** (చేతులు) **పాద** (కాళ్లు), **పాయు** (విసర్జన), **ఉపస్త** (గుహ్య) లు గాను,<br>పంచజ్ఞానేంద్రియ విషయములయినట్టి **శబ్ద స్పర్శ రూప** రస **గంధములు** గాను, పంచ కర్మేంద్రియ విషయములయినట్టి - **వచనము, ఆదానము, ఆగమనము, విసర్జనము ఆనందములు** గాను **అగుచున్నారు.** |
| ఆనందమయో విజ్ఞానమయో విజ్ఞాన ఘన ఆదిత్యః।<br>నమో మిత్రాయ భానవే। మృత్యోర్మా (మృత్యోర్మే) పాహి।<br>భ్రాజిష్ణవే, విశ్వహేతవే నమః। | ఆనందమయుడు, విజ్ఞానమయుడు (One enjoying and knowing many things), విజ్ఞాన ఘనము (The property of knowing at its absolute) - కూడా ఆ ఆదిత్యుడే!<br>అట్టి ఆనంద విజ్ఞాన ఘనుడగు మిత్రునికి (సూర్యునికి) నమస్కారము. సర్వము ప్రకాశింపజేయు స్వామికి నమో నమః। **మృత్యువు నుండి నన్ను రక్షించండి.**<br>**అట్టి భ్రాజిష్ణువుకు (అనేక భూషణములు ధరించు వారికి), ప్రకాశించుటయే స్వభావముగా కలవారికి,, ఈ సమస్త విశ్వమునకు కారణమైనవారికి** - నమస్కారము. |
| సూర్యాత్ భవంతి భూతాని।<br>సూర్యేణ పాలితాని తు। | ఈ సమస్త భూతజాలము (జీవజాలము) సూర్యుని నుండే పుట్టు చున్నారు. సూర్యునిచేతనే పాలింపబడుచున్నారు. |

| | |
|---|---|
| సూర్యే లయం ప్రాప్నువంతి<br>**యః సూర్యః, సోఽహమేవ చ।** | (తరంగాలన్నీ చివరికి జలములోనే లయించు తీరుగా) - ఈ జీవులందరు చివరికి ఆదిత్యుడగు సూర్యునియందే లయిస్తూ ఉన్నారు.<br>ఏ ఆదిత్యుడు సూర్యుడై ఆకాశములో స్వయముగా ప్రకాశించుచున్నారో, ఆయనయే సమస్త దేహములలో 'నేను'గా కూడా ఉన్నారు. నేనై ఉన్నాను. **సోఽహమస్మి।** |
| **చక్షుః నో దేవః సవితా।<br>చక్షుః న ఉత పర్వతః।<br>చక్షుః ధాతా దధాతు నః।** | ఆ సవిత్రు దేవాదిదేవుడే నాయందు (పర్వతమువలె) **'చూపు'** రూపంగా వేంచేసి ఉన్నారు.<br>**పర్వతము వంటి ఆయనయే - నాకు చక్షువులు.**<br>ధాత అగు ఆయన మాకు అట్టి **'సోఽహమ్'** దృష్టిని ప్రసాదించును గాక। |
| **"ఆదిత్యాయ విద్మహే<br>సహస్ర కిరణాయ ధీమహి।<br>తన్న సూర్యః ప్రచోదయాత్"** | అట్టి సమస్తమునకు **'ఆది యత్ తత్'** అగు ఆదిత్య తత్త్వమును తెలుసుకొనుచున్నాము.<br>ఆయనయొక్క సహస్ర కిరణసంప్రదర్శనా - **మహిమను బుద్ధితో నుతిస్తున్నాము.**<br>అట్టి ఆ సూర్య భగవానుడు మా బుద్ధిని (సత్యము, నిత్యము అగు అఖండాత్మయొక్క స్వానుభవమువైపుగా) ప్రేరేపించును గాక। సముత్సాహ పరచును గాక। |
| **సవితా పురస్తాత్। సవితా పశ్చాత్।<br>తత్ సవితా ఉత్తరాత్। (సవితా దక్షిణాత్।)<br>తత్ సవితా అధరాత్తాత్।<br>సవితా నః సువతు।<br>సర్వతాతిగ్ం, సవితా నో రాసతాం దీర్ఘమాయుః॥** | సత్-చిత్ (ఉనికి - ఎరుకల కేవల) స్వరూపుడగు సవిత్రుడే ముందుగాను, వెనుకగాను, ఉత్తరముగాను, దక్షిణముగాను పైన క్రింద వేంచేసి ఉన్నారు.<br>అట్టి సవితా దేవత మమ్ములను సదా రక్షించెదరు గాక!<br>సమస్తమునకు అతీతము (ఆవలది) అగు సవితాదేవత మాకు ఆనందమయమగు దీర్ఘాయువు ప్రసాదించెదరు గాక। |
| **4. 'ఓం' ఇతి ఏక అక్షరమ్ బ్రహ్మ।<br>(ఓమిత్యేకాక్షరం బ్రహ్మ)।<br>'ఘృణి' – ఇతి ద్వే అక్షరే।<br>'సూర్య' – ఇతి అక్షర ద్వయమ్।<br>'ఆదిత్య' – ఇతి త్రీణి అక్షరాణి।<br>"(ఘృణి సూర్య ఆదిత్య ఓం)।"<br>ఏకస్యైవ సూర్యస్య అష్టాక్షరో మనుః।** | 'ఈ అనేకము'గా కనిపించేదంతా **"ఏకము, అక్షరము"** - అగు బ్రహ్మమే।<br>అట్టి ఏకాక్షరమగు బ్రహ్మమే 'ఓం' అని వేదోపనిషత్ వాఙ్మయముచే పిలువబడుతోంది.<br>**'ఘృణి'** - ఏకము రెండుగా (ద్వే) అక్షరములుగా అదియే ప్రదర్శన మౌతోంది (వెలుగు-జ్వాల).<br>**'సూర్య'** - ఇది ద్వయాక్షరమ్। - (అగ్ని - తేజ)<br>**'ఆదిత్య'** - '3' అక్షరములు - (ఆది-తత్-యత్)<br>మంత్రము - **ఘృణి సూర్య ఆదిత్య ఓం** (అష్టాక్షరి).<br>**(వెలుగు జ్వాలల అగ్ని తేజో స్వరూపుడు, సమస్తమునకు మునుముందు వాడు" అగు (ఏకాక్షర) 'ఓం'కార రూప సూర్య దేవునికి నమస్కారము.**<br>**ఇది ఏక సర్వస్వరూపుడగు సూర్యునియొక్క అష్టాక్షరముల (ఘృణి సూర్య ఆదిత్య ఓం) - 'మూల మంత్రము'.** |
| **యః సదా అహరహః జపతి,<br>స వై బ్రాహ్మణో భవతి।<br>స వై బ్రాహ్మణో భవతి।** | ఎవరైతే ఈ 'సూర్యాష్టాక్షరీ' మూల - మంత్రమును రాత్రింబవళ్ళు జపిస్తూ ఉంటారో (రోజూ జపిస్తారో), అట్టివాడు **'బ్రాహ్మణుడు'** - అగుచున్నాడు.<br>- (స్వాభావికంగా) **బ్రాహ్మణుడు** అని అనిపించుకోగలడు. |

| | |
|---|---|
| **సూర్యాభిముఖో జప్త్వా**<br>**మహావ్యాధి భయాత్ ప్రముచ్యతే।** | ఎవ్వరైతే ఈ **'ఘృణి సూర్య ఆదిత్య ఓం'** - సూర్యాష్టాక్షరీ మంత్రమును సూర్యునికి అభిముఖులై జపిస్తూ ఉంటారో, - అట్టివారు మహా వ్యాధుల నుండి, మహాభయముల నుండి విముక్తులు కాగలరు. |
| **అలక్ష్మీర్నశ్యతి।** | వారిపట్ల 'అలక్ష్మి' (దారిద్ర్యము, భయము, ఉద్వేగము, ఆందోళన మొదలైనవి) తొలగిపోగలవు. |
| **అభక్ష్య భక్షణాత్ – పూతో భవతి।**<br>**అగమ్యాగమనాత్ – పూతో భవతి।**<br>**పతిత సంగ భాషణాత్ పూతో భవతి।**<br>**అసత్ సంభాషణాత్ పూతో భవతి।** | **అట్టి వారు –**<br>- తినకూడనివి తిన్న దోషముల నుండి,<br>- దోష భూయిష్టములైన (వెళ్లకూడని) ప్రదేశములకు వెళ్లియున్న దోషముల నుండి,<br>- ఇతరుల గురించి పతిత సంబంధమైన (దుష్ట) సంభాషణ పలికిన దోషముల నుండి,<br>- అసత్ విషయదోషములనుండి (భ్రమాత్మకమైనవి సత్యముగా మాట్లాడిన దోషములనుండి) **విముక్తులు కాగలరు.** |
| **మధ్యాహ్నే సూర్యాభిముఖః పఠేత్ –**<br>**– సద్య ఉత్పన్న (సద్యోత్పన్న)**<br>**పంచమహాపాతకాత్ ప్రముచ్యతే।**<br>**– స ఏషా (సైషా) సావిత్రీ విద్యా**<br>**న కించిదపి న కస్మైచిత్**<br>**ప్రశగ్ంసయేత్।** | ఎవరు మధ్యాహ్నము సూర్యునికి అభిముఖముగా నిలబడి సూర్య-అష్టాక్షరీ మంత్రము జపిస్తారో →<br>అనుకోకుండా ఉత్పన్నమగుచున్న ఇతఃపూర్వపు మహాపాతక-ఉప పాతకముల ఫలములు నుండి కూడా **ప్రముచ్యులు** కాగలరు.<br>"సావిత్రీ విద్య"గా ప్రసిద్ధి పొందియున్న ఈ సూర్యోపనిషత్ - అర్థ, అంతరార్థములను అర్హత లేనివారితో ప్రశంసిస్తూ ప్రసంగించరాదు. |
| **య ఏతాం మహాభాగః**<br>**ప్రాతః పఠతి, స భాగ్యవాన్ జాయతే।**<br>**పశూన్ విందతి।**<br>**వేదార్థం లభతే।** | ఏ మహాభాగుడు ఈ "సూర్యోపనిషత్"ను ఉదయ సమయంలో పఠిస్తాడో, అట్టివాడు 'భాగ్యవంతుడు' కాగలడు.<br>పశు సంపదను పొంది ఆనందించగలడు.<br>వేదముల పరమార్థము అట్టి వానికి లభించగలదు. |
| **త్రికాలమ్ ఏతత్ జప్త్వా**<br>**క్రతు శతఫలమ్ అవాప్నోతి।** | ఎవ్వడైతే ఉదయ మధ్యాహ్న సాయం సంధ్యా సమయ (త్రికాలములలో) ఈ సూర్యోపనిషత్ అధ్యయనము, సూర్య-అష్టాక్షరీ మంత్రము యొక్క ఉపాసన (జపించటము) నిర్వర్తిస్తాడో, అట్టివాడు అనేక క్రతువులు నిర్వర్తించిన పుణ్యఫలము పొందగలడు. |
| **హస్త ఆదిత్యే జపతి,**<br>**స మహామృత్యుం తరతి।**<br>**స మహామృత్యుం తరతి –**<br>**య ఏవం వేద। – ఇత్యుపనిషత్।।** | రెండు చేతులు జోడించి (సూర్య నమస్కార సంయుక్త-అసంయుక్త) హస్తములతో సూర్యునికి నమస్కరిస్తూ సూర్యోపనిషత్ పఠనము, సూర్య-అష్టాక్షరీ జపము జపించువాడు 'మహామృత్యువు' నుండి తరించ గలడు.<br>ఇందలి విషయము తెలుసుకొన్నవాడు మహా మృత్యువు నుండి తప్పక తరించగలడు. |

**సూర్యోపనిషత్ సమాప్తా।**
**ఓం శాంతిః శాంతిః శాంతిః।।**

*'సూర్యోపనిషత్' సమాప్తా।*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।।*

శ్రీ సూర్య అష్టాక్షరీ
"ఘృణిస్సూర్య ఆదిత్య ఓం"

**శ్రీ ఆదిత్య గాయత్రీ**
**"ఓం ఆదిత్యాయ విద్మహే, సహస్ర కిరణాయ ధీమహీ।**
**తన్న సూర్య ప్రచోదయాత్"।।**

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

21

# సూర్యోపనిషత్

## (సావిత్రీ విద్య)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**ఆత్మయొక్క భావనచే** → స్వ - అతిరిక్తము (స్వస్వరూపమునకు అన్యమైనదంతా) **సూదితము** చేయునది (ఆత్మకు అన్యమైన భావననంతటినీ నశింపజేయునది), సూర్యనారాయణ ఆకారము ధరించినది - అగు **"చిత్ - సూర్య వైభవము"**ను స్మరించుచున్నాము. స్తుతిస్తున్నాము.

⌘

ఇక ఇప్పుడు మనము అథర్వణ వేదాంతర్గతమగు సూర్య-అంగిరసమును (సూర్యనారాయణ తత్త్వమును) వ్యాఖ్యానించుకుంటున్నాము.

⌘

### సూర్యాథర్వణ అంగిరస మంత్రములు

1. **"ఘృణ సూర్య ఆదిత్య ఓం"।** - **"సూర్యాష్టాక్షరీ"।**

2. **ఓం భూర్భువస్సువః, తత్సవితుర్వరేణ్యం**
**భర్గో దేవస్య ధీమహి - ధియో యోనః ప్రచోదయాత్** - **"సవితుర్గాయత్రీ"। "గాయత్రీ మంత్రము"।**

3. **ఆదిత్యాయ విద్మహే, సహస్ర కిరణాయ ధీమహి।**
**తన్నసూర్యః ప్రచోదయాత్।** - **"సూర్య గాయత్రీ"।**

ఇవి "సూర్య అథర్వ అంగీరస మంత్ర రాజములు" గా ప్రసిద్ధము. త్రికాలములలో సూర్యోపాసనకు మననము చేయుటకై సూచించబడినవి.

**పై మంత్రములకు**

**బ్రహ్మ** - ఋషి। **గాయత్రీ** - ఛందః। **ఆదిత్యో** - దేవతా। **"హగ్ంస, సోఽహమ్" అగ్ని నారాయణ యుక్తం** - బీజమ్। **హృత్ లేఖా** - శక్తిః।

**వియత్ ఆది సర్గ సంయుక్తము** (ఆకాశము మొదలైన పాంచభౌతిక విశేషములతో సర్గముతో కూడినది) - కీలకము।

అట్టి మంత్రము - **"(1) ధర్మ (2) అర్థ (3) కామ (4) మోక్షములు" అనే చతుర్విధ పురుషార్థములు సిద్ధికై వినియోగము।**

షట్ (6) స్వరములతో ఆరూఢులమై షడంగన్యానము నిర్వర్తిస్తున్నాము.

# షడంగన్యాసము

| 1. కరన్యాసము | అంగన్యాసము |
|---|---|
| **ఘృణ** అగుష్ఠాభ్యాం నమః। | **ఘృణ** - హృదయాయ నమః। |
| **సూర్య** తర్జనీభ్యాం నమః। | **సూర్య** - శిరసే స్వాహా। |
| **ఆదిత్య ఓం** మధ్యమాభ్యాం నమః। | **ఆదిత్య ఓం** - శిఖయాయవౌషట్। |
| **ఘృణ** - అనామికాభ్యాం నమః। | **ఘృణ** - కవచాయ 'హుమ్'। |
| **సూర్య** - కనిష్ఠికాభ్యాం నమః। | **సూర్య** - నేత్రాత్రయాయ 'వషట్'। |
| **ఆదిత్య ఓం** - కరతల కరపృష్ఠాభ్యాం నమః। | **ఆదిత్య** ఓం - అస్త్రాయ ఫట్। |

భూర్భువస్సువః ఓం - ఇతి దిగ్బంధః।

అష్టాక్షరీ మంత్రము - **"ఘృణ సూర్య ఆదిత్య ఓం"**

---

| 2. | |
|---|---|
| **'తత్సవితుః' బ్రహ్మాత్మనే** అంగుష్ఠాభ్యాం నమః। | **'తత్సవితుః'** బ్రహ్మాత్మనే హృదయాయ **"నమః"**। |
| **'వరేణ్యం' విష్ణవాత్మనే** తర్జనీభ్యాం నమః। | **'వరేణ్యం'** విష్ణవాత్మనే శిరసే **"స్వాహా"**। |
| **'భర్గోదేవస్య' రుద్రాత్మనే** మధ్యమాభ్యాం నమః। | **'భర్గోదేవస్య'** రుద్రాత్మనే శిఖయాయ **"వౌషట్"**। |
| **'ధీమహి' సత్యాత్మనే** అనామికాభ్యాం నమః। | **ధీమహి** సత్యాత్మనే కవచాయ **"హుం"**। |
| **'ధియోయోనః' జ్ఞానాత్మనే** కనిష్ఠికాభ్యాం నమః। | **ధియోయనః** జ్ఞానాత్మనే నేత్రత్రయాయ **"వషట్"**। |
| **'ప్రచోదయాత్' సర్వాత్మనే** కరతలకరపృష్ఠాభ్యాం నమః। | **ప్రచోదయాత్** సర్వాత్మనే **"అస్త్రాయఫట్"**। |

"భూర్భువస్సువః ఓం - ఇతి దిగ్బంధః"।

గాయత్రీ - **ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియోయనః ప్రచోదయాత్॥**

---

**షట్ స్వరా రూఢేన బీజేన।** ఆరు స్వరములతో కూడిన బీజము (బీజమంత్రము).

[స్వరము = ఉదాత్త (పై స్వరంగా), అనుదాత్త (క్రింది స్వరంగా), మధ్యమ-ఇత్యాది నాదవిన్యాసముతో కూడిన వేదగానము]

(షడ్జము = ఒక స్వరము. (1) ముక్కు (2) కంఠము (3) వక్షస్థలము (4) తాలువు (దవడ) (5) జిహ్వ (6) దంతము - అనే "6" స్థలములలో పుట్టుచుండే "స్వరవిశేషము").

(అట్టి షడ్జమ స్వరయుక్తంగా వేద-మూల మంత్రములు గానము చేయబడుచున్నాయి).

❖ ❖ ❖

- **రక్తాంబుజ సంస్థితమ్** - ఎర్ర తామర యందు నిండుగా ప్రకాశించువారు,
- **సప్తాశ్వ రథినమ్** - [పంచ ప్రాణములు (లేక) పంచభూతములు + మనస్సు, బుద్ధి - అనబడే] 7 గుర్రములు పూన్చిన రథమును అధిరోహించినవారు,

స్తుతి

శ్లో॥ సప్తాశ్వ రథమ్ ఆరూఢమ్, ప్రచండం, కశ్యపాత్మజమ్।
స్వేత పద్మధరం దేవం, తం సూర్యం ప్రణమామ్యహమ్॥

(పంచప్రాణములు (లేక) పంచభూతములు, మనస్సు, బుద్ధి – అనే 7 గుఱ్ఱములు పూన్చిన రథము అధిరోహించినవారు, ప్రచండ తేజో విలాసులు, కశ్యప ప్రజాపతికి ఆత్మజులు (కుమారులు), తెల్లటి పద్మమును చేత ధరించినవారు అగు సూర్యదేవునికి ప్రణామములు.

---

- బంగారు వన్నెలు చిందించువారు, (దృశ్యము, జీవుడు, ఈశ్వరుడు, సాక్షి అనబడే) నాలుగు భుజములు ధరించి ఉన్నవారు,
- రెండు చేతులలో – **(1) అభయము** (సమస్త భయములు తొలగించునది) **(2) వరదమ్** (సమస్తము ప్రసాదించునది) – అగు – **రెండు పద్మములను ధరించినవారు,**
- (ఈ క్షణములు, నిముషములు, గంటలు, రోజులు, సంవత్సరములు, యుగములు, మహాయుగములతో కూడిన) **కాలచక్రమును నడిపిస్తూ ఉన్నవారు,**

అగు సూర్యనారాయణ తాత్త్విక స్వరూపమును ఎవరు తెలుసుకొంటారో, అట్టివారే **బ్రహ్మమును ఎరిగినట్టి** (బ్రహ్మజ్ఞులైనట్టి) **బ్రాహ్మణులు.** అట్టి స్వామిని మా బుద్ధిని వికసింపజేయటానికై ఈవిధమైన గాయత్రీ మంత్రోక్తంగాను, సూర్య అష్టాక్షరీ మంత్ర యుక్తంగాను జపిస్తున్నాము. స్తుతిస్తున్నాము. ఉపాసిస్తున్నాము.

| | | |
|---|---|---|
| **ఓం** | – | (ఓం ఇతి ఏక అక్షరం బ్రహ్మ)। "ఈ దృశ్య–ద్రష్ట–జీవ–ఈశ్వర–సాక్షిలతో కూడిన సమగ్రతత్త్వము" – ఇతి **"ఓం"** |
| **భూః భువః సువః (భూర్భువస్సువః) "తత్"** | – | వ్యాహృతమైనది. భూ భువ సువః గా (Matter, thought, thinker గా) ప్రకటనమగుచున్నది – అగు తత్ స్వరూపమును స్మరించుచున్నాను. **సమస్తము తానై, సమస్తమునకు వేరైనట్టి తత్త్వమునకు నమస్కారము.** |
| **సవితుః వరేణ్యం** | – | ఆయన సమస్త దేహములలో సత్–చిత్ (ఉనికి–ఎరుక) రూపుడుగా వరేణ్యుడై (ముఖ్యాతి ముఖ్యుడై) ఉన్నవారు. |
| **భర్గోదేవస్య ధీమహి।** | – | సమస్తమును వెలిగించు దివ్య స్వరూపులు. ఈ సమస్తము ఆయనయొక్క మహిమగాను, ఆయన "ధీ (బుద్ధి) ఔన్నత్యము" గాను దర్శిస్తున్నాము. (తత్త్వ స్వరూపుడు, సవితుడు, వరేణ్యుడు ధీమహి అయినట్టి ఆ భర్గో దేవుని యొక్క మహిమను స్తుతిస్తున్నాము. |
| **ధియో యో నః ప్రచోదయాత్॥** | – | (దేనిచే ఈ దృశ్య విషయములకు పరిమితమై ఉండిపోతున్నామో, అట్టి) **మా యొక్క పరిమితమైన బుద్ధిని ప్రచోదింపజేయుదురు గాక!** (ఉత్సాహవంతముగాను, సాహసవంతముగాను, ధైర్యవంతముగాను, వీర్యవంతముగాను, నిర్మలముగాను, సునిశితముగాను, విస్తారముగాను, పరమాత్మికము గాను) **మా బుద్ధిని వికశింపజేసెదరు గాక!** |

---

- (ఈ భౌతికదేహమునకు దేహియే 'ఆత్మ' అయి ఉంటున్నవిధంగా) – ఈ జగత్తుకంతటికీ సూర్యభగవానుడే **ఆత్మ.**
- **సూర్యాత్ వై ఖలు ఇమాని భూతాని జాయంతే।** ఇక్కడి సమస్త జీవజాలమంతా కూడా సూర్యభగవానుని నుండే జనించి, బయల్వెడలి, సూర్యతత్త్వమునందే పరిఢవిల్లుతోంది.
- సూర్యుని నుండే – 'సృష్టి' అనే ఈ మహా యజ్ఞము. [యజ్ఞము = అనేకమంది నిర్వర్తించు గొప్ప సామూహిక కార్యక్రమము]. అట్టి యజ్ఞము నుండి మేఘములు (జలము). మేఘముల వలన వర్షము. వర్షము వలన జీవులను పరిపోషించు "అన్నము". అన్నము నుండి దేహముల పరిపోషణ, జీవితము, జీవుడు మొదలుగా గల ఇవన్నీ సంభవిస్తున్నాయి, సందర్భమౌతున్నాయి.

## ఆదిత్యుడు – శబ్దార్థము।

**"ఆది – త – యత్"** – సృష్టికంటే మునుముందే ఉండి, సృష్టిగా తానే ప్రదర్శనమవటంచేత **'ఆదిత్యుడు'** అని ఆత్మపురుషుడగు సూర్యభగవానుడు శ్లాఘించబడుచున్నాము.

ఓ సమస్తమునకు ఆది (The begining) అయినట్టి ఆది పురుషుడా! ఆదిత్యా!

– మీకు రెండు చేతులు ఎత్తి హృదయపూర్వకంగా మంత్రోక్తంగా – నమస్కరిస్తున్నాము. **నమస్తే।** "న" = ఏకము, "మ" = అనేకము మీరే అయినట్లుగా దర్శిస్తూ, ఉపాసిస్తూ, భక్తితో నమస్కరిస్తున్నాము.

***మా ఈ స్తుతులు స్వీకరించండి.***

## ప్రత్యక్ష నారాయణ సూర్య స్తుతులు

ఓ ఆదిత్య భగవన్! ఆదినారాయణా! సత్–చిత్ స్వరూప సవితా! సూర్యదేవా! సూర్యనారాయణ స్వామీ! **నమస్తే ఆదిత్య।**

మా కళ్లకు ప్రత్యక్షమై కనిపిస్తూ ఉన్న **ప్రత్యక్ష నారాయణుడవు. ప్రత్యక్ష దైవమువు.**

**త్వమేవ ప్రత్యక్షం కర్మ కర్తాసి।** సృష్టిలో జరుగుచున్న సమస్త కర్మలకు, కార్యక్రమములకు మీరే 'కర్త' (You are Doer as well as prompter) అయి ఉన్నారు.

**బ్రహ్మదేవుడుగా సృష్టిస్తున్నారు।** ఈ సృష్టిని భావనచే, సంకల్పముచే – క్రీడగా, లీలగా కల్పించుచున్నారు. అట్టి సృష్టికర్త అగు **బ్రహ్మదేవుడుగా** అగుచున్నది ఎవరు? మీరే!

**విష్ణువుగా పరిరక్షిస్తున్నారు।** ఈ సృష్టిని పరిపోషించటము, కొనసాగించటము నిర్వర్తిస్తున్న **'విష్ణువు'**గా ఉన్నది కూడా తామే!

**రుద్రుడుగా లయింపజేస్తున్నారు।** అట్టి సృష్టిని మరొక సమయంలో లయింపజేయు లయకారుడగు **'రుద్రుడు' కూడా మీరే** – అయి ఉన్నారు.

మీరే ఋగ్వేదములో ఆత్మగురించిన 'సత్యవాణి' అయి ఉన్న ఋక్ గానము చేయు **ఋక్‌గాన స్వరూపులు।** ఆ ఋక్కులను ఆత్మయొక్క స్వానుభవముగా ఎలుగెత్తి గానం చేస్తున్న **'ఋషులు'** కూడా మీరే!

మీరే యజ్ఞములు, యజస్సులు ప్రాధాన్యముగా వచించబడుచున్న **యజుర్వేద స్వరూపులు.**

స్వర–సంగీత స్తుతుల ప్రాధాన్యమైయున్న **సామవేద స్వరూపులు** మీరే।

- **ప్రత్యక్షముగా కనిపిస్తున్న విశేషములను క్రోడీకరించి, ఉపాసనా రూపముగా తీర్చిదిద్దే వాఙ్మయముగల అథర్వణవేద స్వరూపులు కూడా తామే।**
- భాషను విధివిధానంగా తీర్చిదిద్దే **ఛందస్సుగా ప్రదర్శనమగుచున్నది** కూడా మీరే! ఛందోబద్ధమైనదంతా మీ విశేష స్వరూపమే!

సమస్తమునకు ఆవల "ఆది" యందు గల ఆ కేవలాత్మానంద స్వరూపులగు **"ఆదిత్య పరమాత్మ" నుండే పంచభూతములు బయలుదేరుచున్నాయి.**

- **స్పందనరూపముతో** కూడిన "వాయువు",
- **స్థూల, జీవపరిపోషక రూపమగు** "భూమి",
- **ద్రవ–జల రూపమగు** "ఆపః", (జలము),

- **తేజో, అగ్ని రూపమగు** "జ్యోతి", 'ఉష్ణము',
- **నిశ్శబ్దమై శబ్దమునకు జననస్థానమగు** "వ్యోమ (ఆకాశము)",

– ఇవన్నీ కూడా ఆదిత్యుడగు సూర్యభగవానుని నుండే జనిస్తున్నాయి.

సృష్టి నిర్మాణ – సంరక్షణలను నిర్వర్తిస్తూ ఉన్నట్టి – **అశరీర దివ్యప్రజ్ఞలగు దేవతలు ఆదిత్యుని నుండే బయల్వెడలుచున్నారు.**

**'వేదా'।** – తెలియబడుచున్న సమస్తము ఆదిత్యునినుండే ప్రకటనమౌతోంది. తెలియబడేదంతా ఆది–ఆత్మ స్వరూపుడగు ఆదిత్యునికి **'అనన్యము'.** అట్టి ఆదిత్యుని తాత్త్విక స్వరూప వర్ణనములతో ఋక్కుల ప్రాధాన్యము గల **ఋగ్వేదము**, యజ్ఞ యాగ అగ్ని కార్య ప్రాధాన్య **యజుర్వేదము**, స్తుతి గాన ప్రాధాన్య **సామవేదము,** దృశ్య ప్రపంచ విశేష ప్రాధాన్యమైన **అథర్వణవేదము**లతో కూడినవే **చతుర్వేదములు**.

-----

ఆత్మజ్యోతి స్వరూపుడగు ఆదిత్యుడే తనయొక్క తేజో స్వరూపముచే సూర్యమండలమును తపింపజేయుచున్నారు.

**"ఆసావ ఆదిత్యో బ్రహ్మ।"** బ్రహ్మమే అయి ఉన్న **ఆదిత్యుడే** సమస్తముగా **వసించువారై, విస్తరించువారై** ఉన్నారు.

ఈ సమస్తమునకు 'అనుభవి' (పొందుచున్నవాడు) – బ్రహ్మమే।

- పొందబడునదంతా బ్రహ్మమే।
- పొందుచున్నవాడు బ్రహ్మమే।
- ఆదిత్యుడే బ్రహ్మమై సమస్తమును పొందువాడై ఉంటున్నారు. **ఇతి ఆసావాదిత్యో బ్రహ్మ।**

**ఆదిత్యుడే అంతఃకరణ చతుష్టయము. (నాలుగింటి సముదాయము).**

1. **మనస్సు** = విషయములు **మననము** చేయు స్వభావములకు, అభ్యాసములకు, సంస్కారములకు, వాసనలకు సంబంధించిన అంతఃకరణ విభాగము.
2. **బుద్ధి** = **విచక్షించు** విభాగము. "ఏది ఆలోచించాలి? ఏది ఆలోచించవద్దు?" – అనే విషయము నిర్ణయించు అంతరంగ సంబంధమైన తెలివి (Intelectual, Wisdom, Analytical ability) విభాగము.
3. **చిత్తము** = అంతరంగములోని **ఇష్ట – అయిష్టములకు చెందిన** విభాగము.
4. **అహంకారము** = "నేను – నాది" రూపముతో కూడిన **"వ్యష్టి పరిమిత"** సంబంధమైన **అంతరంగ విభాగము.**

**ఆదిత్యుడే సమస్త జీవులలోని అంతరంగ చతుష్టయమగు మనో బుద్ధి చిత్త అహంకారముల ప్రదర్శకుడు. ప్రదర్శనమగుచున్న స్వరూపమంతా ఆయనకు చెందినదే। ఆయనకు అనన్యమైనదే।**

**అట్టి ఆదిత్యుడే సమస్త దేహములలో పంచప్రాణ స్వరూపులై విరాజిల్లుచున్నారు.**

1. **వ్యానప్రాణము** = శరీరమంతటా వ్యాపించి ఉండే ప్రాణశక్తి ప్రదర్శనము **(స్థానము–సర్వ శరీరము).**
2. **సమాన ప్రాణము** = దేహమునందు అంతటా వివిధ భాగములను సమ స్వరూపముగా **పరస్పరము సమన్వయము చేయు** ప్రాణ సంబంధిత ఏక ప్రదర్శనము **(ముఖ్య స్థానము – నాభి).**

**3. ఉదాన ప్రాణము** = (ముఖ్య స్థానము - కంఠము).

**4. అపాన ప్రాణము** = (ముఖ్య స్థానము - గుదము).

**5. (మూల) ప్రాణము** = (ముఖ్య స్థానము - హృదయము).

❋ ఆదిత్య భగవానుడే సమస్త ప్రాణులలో ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమాన క్రియా విశేషములతో కూడిన పంచప్రాణ స్వరూపుడై వెలయుచున్నారు. **శరీరములోని సమస్త అంతర్గత వ్యవహారములు నిర్వర్తిస్తున్నారు.**

❋ ఆదిత్యుడే చెవులు - చర్మము - కళ్ళు - రసము (నాలుక) ఘ్రాణము (వాసన) - అను పంచ జ్ఞానేంద్రియములై వెలయుచున్నారు.

❋ దేహములో పంచ కర్మేంద్రియములగు "వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ (స్త్రీ పురుషుల రహస్యావయవములు)గా - విలసిల్లుచున్నది ఆదిత్య - ఆత్మానందుడే!

❋ ఆదిత్యుడే పంచేంద్రియ విషయములగు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల స్వరూపుడు కూడా।

❋ కర్మేంద్రియ విషయములైనట్టి **వచన** (Talking), **ఆదాన** (Giving), **ఆగమన** (coming/walking), **విసర్జన** (Leaving), **ఆనందములు** (Enjoying) గా ఉన్నది కూడా ఆదిత్యుడే.

❋ ఆదిత్యుడే **అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ** పంచకోశములుగాను, **కేవల - ఘనీభూత విజ్ఞానమయ స్వరూపముగాను** అగుచున్నారు.

---

**నమో మిత్రాయ భానవే, మృత్యోః మాం పాహి।** సమస్త జీవులకు స్నేహితుడు అవటంచేత ఆనంద **విజ్ఞానఘనుడు, మిత్రుడు,** సమస్తమును వెలిగించువాడు కాబట్టి **భానుడు** - అగు **సూర్యభగవాన్!** నమస్కారము. **మమ్ములను మృత్యుముఖము నుండి రక్షించండి.** (అనగా) మార్పు చేర్పులకు విషయమే కానట్టి మాయొక్క సహజ-అమృత-అఖండ ఆత్మ స్వరూపమును మా బుద్ధి పొందునట్లు (గురువై) అనుగ్రహించండి.

జగత్తునంతటినీ తన ఆభరణముగా ధరించుచున్నవారగు భ్రాజిష్ణునకు, ఈ జగత్తుకు హేతువు అవటంచేత విశ్వహేతువు అగు ఆదిత్యునికి - **నమస్కారము.**

ఆ సూర్య భగవానుని వలననే, ఆయన నుండియే జీవులమగు మేమంతా బయల్వెడలుచున్నాము. సూర్యునియందే ఉనికి కలిగి ఉంటున్నాము. సూర్యునిచేతనే ఈ జగత్తంతా పాలించబడుతోంది.

(తరంగములన్నీ జలములోంచి ఉత్పన్నమై, జలమునందే సంచారములు కలిగి ఉండి జలమునందే లయించుచున్నవిధంగా) ఈ జీవులంతా సూర్యుని నుండి బయలుదేరి, సూర్యునియందే సంచారము కలిగి ఉండి, **సూర్యునియందే 'లయము' పొందుచున్నారు.**

---

## "య స్సూర్యః సోఽహమ్"

**యః సూర్యః సోహమ్ ఏవ చ।** సమస్తము సూర్యుని ఆత్మ తేజమే. కాబట్టి, **ఎవరు సూర్యుడై ప్రకాశించుచున్నారో, ఆ భగవానుడే సమస్తమునందువలెనే, నాలో నేనై ప్రకాశించుచున్నారు కూడా. కనుక సూర్యునిగా ఉన్నది నేనే। నేనుగా ఉన్నది సూర్యుడే।**

ఆ సవితా దేవతయే - **నాకు కళ్ళు. నాయొక్క చూపు, చూడబడునది** కూడా ఆయనయే।

నాయందు 'చూపు' గా నిశ్చల పర్వత స్వరూపుడై వేంచేసి ఉన్నారు. **దృక్ స్వరూపుడు, సృష్టికర్త అగు–ఆ ధాత, ఆ సవిత, ఆ సూర్యుడు– నాకు "సోఽహమ్ దృష్టి" ని ప్రసాదించుదురు గాక।**

**ఆదిత్యాయ విద్మహే, సహస్ర కిరణాయ ధీమహి। తన్నో సూర్యః ప్రచోదయాత్॥**

- *అట్టి ఆదిత్యుని మహిమను (పైన చెప్పుకొన్నవిధంగా) ఎరుగుచున్నాము.*
- *వేలాది కిరణస్వరూపుడగు ఆయన యొక్క మహిమయే – ఇదంతా కూడా। ఆయనను బుద్ధితో స్తుతిస్తున్నాము.*

*అట్టి ఆ సూర్యభగవానుడు మా యొక్క బుద్ధిని (స్వస్వరూపాత్మ తత్త్వము ఎరుగుటకై) ప్రచోదింపజేసెదరు గాక! వికాసపరచెదరు గాక। వికసింపజేసెదరు గాక। సముత్సాహపరచెదరు గాక।*

అట్టి సత్ విత్ (ఉనికి – ఎరుక) స్వరూపుడగు సవితా – పురుషోత్తముడు మా యొక్క **సహజమగు స్వస్వరూపుడై** →

- ముందుగా → జగత్–ద్రష్ట రూపంగాను,
- వెనుకగా → ఆత్మగురించిన ఏమరపు రూపంగాను,
- ఉత్తరముగా → ఈ జగద్దృశ్యమునకు ఆవలగాను,
- దక్షిణముగా → ఈ జగద్దృశ్యమువైపుగా కనిపిస్తున్న సమస్తముగాను,
- క్రిందగాను, పైన అంతటా, అన్నిచోట్ల, సమస్తముగాను **విస్తరించి ఉన్నారు.**

అట్టి సవితృభగవానుడు, సూర్యదేవుడు అగు ఆదిత్యుడు –. **నః సువతు। మాకు శుభప్రదుడై అనుగ్రహించెరు గాక! మాకు దీర్ఘాయువు ప్రసాదించెదరు గాక!**

---

## "ఓం ఇతి ఏక – అక్షరం బ్రహ్మ"

- ఏదైతే అనేకముగా కనిపిస్తూ ఉన్నప్పటికీ సత్య–జ్ఞాన అధ్యయన దృష్టికి ఏకమే అయి, **ఏకముగానే అనిపిస్తోందో,**
- ఏది వాస్తవానికి **సర్వదా, అప్రతిహతంగా 'ఏకమే'** – అయి ఉన్నదో,
- ఏదైతే మార్పుచెందు సమస్తము (దర్పణంలో దృశ్యములాగా) తనయందే కలిగి ఉండి, (కల తనదైనవాని వలె) తాను ఎట్టి మార్పు – చేర్పులు లేనిదై, సర్వదా యథాతథమై ఉన్నదో, –

అట్టి ఈ జీవుని **"ఏకాక్షర స్వరూపమే" బ్రహ్మము.**

**(I) త్రిపుటి** [ (1) దృశ్యము, (2) ద్రష్ట (3) దర్శనము ] **(II) జీవాత్మ** **(III)** "అనేక దేహములు నావైన నేను" – **రూపుడగు ఈశ్వరుడు, (IV) కేవలమగు పరమాత్మ** – ఈ నాలుగు ఏ తత్త్వముదృష్ట్యా 'ఏకము' అయి ఉంటున్నాయో, అట్టి అఖండాత్మకు సంజ్ఞయే **"ఓం" (ప్రణవము).**

**కనుక**

(ద్రష్ట–దర్శన–దృశ్య, భూత–వర్తమాన–భవిష్యత్, జీవ–ఈశ్వర–కేవల – ఇత్యాది త్రిపుటిగా ప్రదర్శనమగుచు కూడా) **'ఏకము అక్షరము'** అయి ఉన్నదో, అట్టి బ్రహ్మము – **'ఓం'** అను ప్రణవముగా (ప్రణవార్థ పూర్వకంగా) **వేద వాఙ్మయమునందు, వేదాంత శాస్త్రముచే చెప్పబడుతోంది.**

**శ్రీ సూర్యమంత్రము / శ్రీ సూర్య–అష్టాక్షరీ మంత్రము =**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **"ఘృణి** | **సూర్య** | **ఆదిత్య** | **ఓం"** | | |
| **2** | **2** | **3** | **1** | **=** | **"8"** |

**(ఓం = ఏకము, అక్షరము)**

**"ఘృణి"** – ఇది 'ద్వే' అక్షరే। రెండు అక్షరములు (2). (ఘృణము) – **కనికరము** కలవాడు. వేడి, **యండ పగలు, వెలుతురు స్వరూపుడు.**

**"సూర్య"** – ఇతి అక్షర ద్వయమ్। రెండు అక్షరములు (2). వెలుగు ప్రదాత. లోకములను ప్రకాశింపజేయువాడు. తేజోమయుడు.

**"ఆదిత్య" – ఇతి త్రీణి అక్షరాణి।** 'అదిత్య' – 3 అక్షరములు. యత్ 'ఆది', తత్ ఆదిత్య ఇతి। సమస్తమునకు 'ఆది' స్వరూపుడు కాబట్టి ఆదిత్యుడు. సమస్త జీవులలోని జగదానుభవములకు ఆవల **"జగదనుభవాతీత సాక్షీభూత కేవాలత్మ స్వరూపమే"** – ఆదిత్యుడు.

## ఫలశ్రుతి

**"ఘృణి స్సూర్య ఆదిత్య ఓం"** అను 'అష్టాక్షర మంత్రము' – సూర్యోపాసనకై 'బీజమంత్రము'.

ఎవ్వరైతే ఈ **సుర్యాంగీరస మహా మంత్రమును** పగలు రాత్రి కూడా జపిస్తూ ఉంటారో, అట్టివాడు బ్రహ్మజ్ఞాని కాగలడు. బ్రహ్మతత్త్వ దర్శనము ఆతనికి స్వాభావికమై, – **"బ్రాహ్మణుడు"** అని పిలువబడుచున్నాడు.

– ఎవ్వరైతే సూర్యభగవానునికి అభిముఖంగా నిలబడి (లేక పద్మాసనాశీనుడై) ఈ **"సూర్యాష్టాక్షరీ మంత్రము"** జపిస్తూ ఉంటారో, ఆతడు మహావ్యాధులనుండి, సమస్త భయముల నుండి విముక్తుడు కాగలడు. ఆతనిపట్ల అలక్ష్మీవిధి వ్రాత (దారిద్ర్యము, కరువు, సాంసారిక దుఃఖ సందర్భము, దుష్ట పర్యవసానములు) నశించగలవు.

**అభక్ష్యమ్** – (తినకూడనిది) తినిన దోషములనుండి, **అగమ్య గమనాత్** (వెళ్ళకూడని చోట్లకు వెళ్లిన) దోషములనుండి, పతితులు పాపులు అగు వారితో లోకసంబంధమైన దూషణ తిరస్కార ఇత్యాది **సంభాషణా దోషములనుండి,** అసత్ విషయముల గురించి దీర్ఘంగా మాట్లాడిన **పాప సంస్కారముల నుండి – (జపముచే) – పూతో భవతి।** – దోషములు తొలగి, పవిత్రుడు, పునీతుడు కాగలడు.

– ఎవడైతే మధ్యాహ్న సమయంలో సూర్యభగవానుని అభిముఖంగా భక్తితో నిలుచుని, ఈ ఉపనిషత్‌ను పఠిస్తాడో, (లేక) సూర్యాష్టాక్షరీ మంత్రమును జపిస్తాడో, అట్టివాడు **సద్యోత్పన్న సుజ్ఞానుడౌతాడు.** సాధనతో నిమిత్తం లేకుండానే అప్పటికప్పుడు, ఆత్మతో సంయమనము పొంది **'సద్యోముక్తుడు'** కాగలడు. అట్టివాడు పంచ మహాపాతకముల నుండి కూడా [ (1) బ్రహ్మహత్య (2) సురాపానము (3) బంగారము దొంగిలించటము (4) గురుతల్ప గమనము (5) ఈ నాలుగు పాపములు చేస్తున్న వారితో సాంగత్యము కలిగి ఉండటము – నుండి కూడా ] – **విముక్తుడు కాగలడు.**

-----





## బోధకు అర్హత

ఇది **'సావిత్రీ విద్య'**గా ఆధ్యాత్మవాఙ్మయంలో లోక ప్రసిద్ధమైయున్నది.

అట్టి ఈ **"సూర్యోపనిషత్"**లో మనము చెప్పుకొన్న **'సావిత్రీ విద్య'**ను ఎవరికైనా బోధించాలంటే, అట్టివాడు అర్హుడై ఉండాలి. అర్హత లేనివానికి బోధించరాదు. గురుశుశ్రూష, సేవాభావము, తపోధ్యానముల అభ్యాసము, **<u>ఆత్మజ్ఞానము గురించిన ఉత్తమాశయము</u>** మొదలైన **"అధ్యయన సద్గుణములు"** ఉంటేనే సూర్యోపనిషత్ విద్యకు అర్హుడు.

- ఏ మహాభాగుడై ఈ ఉపనిషత్‌ను పఠిస్తూ ఉంటాడో, అట్టివాడు భాగ్యవంతుడు (జ్ఞానైశ్వర్యవంతుడు) కాగలడు. పశు సంపద పొందగలడు.
- అట్టివాడు వేదముల సూక్ష్మార్థమును, అంతరార్థమును సులభముగా గ్రహించగలిగినట్టి నిర్మలము, సునిశితము, విస్తారము, ప్రశాంతము అగు బుద్ధిని సంపాదించుకొనగలడు – **వేదార్థం లభతే।**
- ఎవడు ఈ సూర్యోపనిషత్‌లో చెప్పబడిన మహామంత్రములను ప్రతిరోజు త్రిసంధ్యా సమయములలో జపిస్తూ ఉంటాడో, అట్టివాడు అనేక క్రతువులు చేయడంచేత లభించే ఉత్తమ పుణ్యఫలము పొందగలడు.
- ఉభయ హస్తములలో సూర్యభగవానుని భావనచేసి, **"హస్తాదిత్య ఉపాసన"** తో కూడుకొని, ఇందలి సూర్యాష్టాక్షరీ మొదలైన మంత్రములను జపిస్తాడో, అట్టివాడు సమస్త కర్మ–కర్మఫలములకు అతీతత్వము సంతరించుకొని, **"మహామృత్యువు"** నుండి తరించగలడు.

**స మహామృత్యుం తరతి। స మహా మృత్యుం తరతి – య ఏవం వేద।**

ఈ ఉపనిషత్ పరమార్థమును గురుముఖతః ఎరిగినవాడు జన్మ కర్మ పునర్జన్మ రూపమైనట్టి చక్రము నుండి బయల్వెడలి, 'మహామృత్యువు' నుండి తరించగలడు.

ఇతి సూర్యోపనిషత్
ఓం శాంతిః। శాంతిః। శాంతిః।

అథర్వణ వేదాంతర్గత

# 22 హయగ్రీవోపనిషత్

**శ్లోక తాత్పర్య పుష్పమ్**

శ్లో॥ జ్ఞానానందమయం దేవమ్
నిర్మల స్ఫటికాకృతిమ్,
అధారం సర్వవిద్యానాం
హయగ్రీవం ఉపాస్మహే॥

జ్ఞానానందమయులు, దేవదేవులు, నిర్మల స్ఫటికము వలె ప్రకాసించువారు, సర్వ విద్యలకు ఆధారులు -అగు 'హయగ్రీవ భగవానుని ఉపాసించుచున్నాము'.

స్తుతి

శ్లో॥ స్వ (అ)జ్ఞోఽపి యత్ ప్రసాదేవ జ్ఞానం తత్ ఫలమ్ అప్నుయాత్
సోఽయం హయాస్యో భగవాన్ హృది మే భాతు సర్వదా॥

ఏ స్వామి యొక్క ప్రసాదముచే- స్వయముగా 'అజ్ఞాని, మూఢుడు' అయి ఉన్నవాడు కూడా **'పరబ్రహ్మతత్-త్వమ్, సోఽహమ్'** జ్ఞానమును పొందగలడో, అట్టి హయగ్రీవ ఆచార్యులవారు మా హృదయములో సర్వదా ప్రకాశమానులై ఉండెదరు గాక॥

**1.** ఓమ్॥
నారదో బ్రహ్మాణమ్
ఉపసమేత్య ఉవాచ :
అధీహి భగవన్॥
బ్రహ్మ విద్యాం వరిష్ఠాం,
యయా అచిరాత్ సర్వపాపం
వ్యపోహ్య, బ్రహ్మవిద్యాం
లబ్ధ్వా, ఐశ్వర్యవాన్ భవతి?

ఒకానొక సందర్భములో బ్రహ్మమానసపుత్రులగు నారదమహర్షి సత్యలోకములో ప్రవేశించినవారై పితృదేవులగు బ్రహ్మదేవునికి నమస్కరించి ఈవిధంగా అడుగసాగారు.

నారదుడు : హే భగవాన్! అధీహి॥ అధిపతీ! అధ్యయనము కొరకై ఆశ్రయిస్తున్నాను.

దేనిచే అచిరాత్ (త్వరగా) సర్వపాపదోషములు తొలగి బ్రహ్మతత్త్వము గురించి జ్ఞానైశ్వర్యులము కాగలమో అట్టి పరాకాష్ఠ అయినట్టి బ్రహ్మవిద్య'ను దయతో అనుగ్రహించండి.

---

**2.** <u>బ్రహ్మోవాచ :</u>
హయగ్రీవ దైవత్యాన్ మంత్రాన్ యో వేద,
స శ్రుతి స్మృతి
ఇతిహాస పురాణాని వేద॥
స సర్వైశ్వర్యవాన్ భవతి॥

బ్రహ్మభగవానుడు : బిడ్డా! నారదా! విను. చెపుతాను. ఎవరైతే **'హయగ్రీవ దైవత్యములు'** అయినట్టి మనన-ధారణ రూపమంత్రములను ఎరుగుచున్నారో అట్టివారు **శ్రుతి** (శ్రవణముచే గ్రంథస్థమైనవి), **స్మృతి** (సంఘటనా పూర్వకం, దృష్టాంత చారిత్రకంగా వేదార్థములు అనుభవ సంబంధము), **ఇతిహాసంగా** [(ఐతిహాసిక) (పరంపరగా) చెప్పుకొనే పూర్వ కథలు, పూర్వ చరిత్రలు వివరించునది ఉదా: భారత, రామాయణములు], **పురాణ** (జగత్ సృష్టి, మన్వంతరక్రమ సంబంధమైన కథలను తెలిపే గ్రంథములు - [ఇవి వేదములకు వ్యాఖ్యానములవంటివి (పద్మపురాణము మొదలైనవి)] - ఇవన్నీ ఎరిగినవాడౌతాడు. సర్వ ఐశ్వర్యములు పొందినవాడగుచున్నాడు.

| | |
|---|---|
| **త ఏతే మంత్రాః**<br>**విశ్వ ఉత్తీర్ణ (విశ్వోత్తీర్ణ) స్వరూపాయ**<br>**చిన్మయానంద రూపిణే।**<br>**తుభ్యం నమో హయగ్రీవ విద్యా రాజాయ**<br>**విష్ణవే। స్వాహా। స్వాహా నమః॥** | హయగ్రీవదైవత్య (దివ్యతత్త్వ) మంత్రములు :<br>ఈ విశ్వమంతటికీ ఆవలి (పర) స్వరూపులు, కేవల - ఎరుక రూపమగు- చిన్మయానంద స్వరూపులు, (గుఱ్ఱపు ముఖమును మనుష్య దేహమును ధరించినట్టివారు, వేదములు మధుకైటభుల నుండి వెనుకకు తెచ్చి తిరిగి బ్రహ్మదేవునికి ఇచ్చినవారు, విష్ణు అవతారులు, విద్యారాజు - అగు హయగ్రీవ విష్ణు భగవానునికి నమస్కారము! మాకు చెందిన సమస్తము స్వామికి ఆహుతులుగా సమర్పిస్తున్నాము. స్వాహా। స్వాహా। |
| **(నమః) ఋక్ యజుః సామ రూపాయ**<br>**వేదాహరణ కర్మణే**<br>**ప్రణవ ఉద్గీథ వపుషే మహాశ్వ శిరసే నమః॥**<br>**స్వాహా। స్వాహా నమః॥** | **"ఋక్ యజుర్ సామ"** త్రయీస్వరూపా! వేదములను పరిరక్షించుట యందు ఉద్యుక్తులైన స్వామీ! ప్రణవ శరీరా! భగవత్ స్తుతిరూపమగు ఉద్గీథపరమార్థ స్వరూపుడా! మహాశ్వమును (గుఱ్ఱమును) శిరస్సుగా ధరించిన హయగ్రీవ స్వామీ! సర్వ సమర్పణ పూర్వకంగా స్వాహా। స్వాహా। ఇదం సమర్పయామి। నమో నమః॥ |
| **ఉద్గీథ। ప్రణవోద్గీథ।**<br>**సర్వ వాగీశ్వరేశ్వర।**<br>**సర్వ వేదమయ। అచింత్య।**<br>**సర్వం బోధయ బోధయ।**<br>**స్వాహా స్వాహా నమః॥** | సామవేదగాన మాధుర్యస్వరూపా! ఉద్గీథా! ప్రణవ (ఓం) శబ్ద మహదార్థమా! సమస్త మంత్ర వేద - ఉపనిషత్ వాక్ స్వరూపమునకు ఈశ్వరుడా! సర్వ వేదములందు అంతర్లీనుడవై, అంతఃకరణుడవై ఉండువాడా! మనస్సుకు, చింతనకు ఆవలివాడా! అచింత్యా! సమస్తము 'స్వాహా'గా సమర్పిస్తూ నమస్కరిస్తూ ఉన్నాము. ఆత్మను గురించిన సమస్తము మాకు బోధగా అనుగ్రహించండి.<br>**స్వాహా! స్వాహా! నమః** |
| **బ్రహ్మ అత్రి రవి సవితృ భార్గవా – ఋషయః।**<br>**గాయత్రీ త్రిష్టుప్ అనుష్టుప్ – ఛందాగ్ంసి।**<br>**శ్రీమాన్ హయగ్రీవః, – పరమాత్మా దేవతేతి।**<br>**హ్లాం (హ్సాం) – ఇతి బీజగ్ం।**<br>**సోఽహమ్ – ఇతి శక్తిః।**<br>**హ్లూం (హ్సూం) – ఇతి కీలకమ్।**<br>**భోగ మోక్షయోః వినియోగః॥** | ఈ హయగ్రీవ దివ్య మంత్రములకు -<br>**ఋషులు** → బ్రహ్మ, అత్రిమహర్షి, రవి, సవితృదేవుడు, భార్గవుడు।<br>**ఛందస్సు** → గాయత్రీ ఛందస్సు -త్రిష్టుప్, అనుష్టుప్।<br>**దేవత** → పరమాత్మ అగు శ్రీమన్ హయగ్రీవస్వామి।<br>**హ్లాం (హ్సాం)** → ఇతి బీజము।<br>**సోఽహమ్** → ఇతి శక్తి।<br>(ఆయనయే నేను)<br>**హ్లూం (హ్సూం)** → ఇతి కీలకమ్।<br>**మంత్రస్మరణ ఆశయములు** → **భోగ** (ఇహమందు సుఖము), **పరమందు** మోక్షము. (భోగ, మోక్షములు). |
| **'అ' కార 'ఉ'కార 'మ'కారైః**<br>**అంగన్యాసః / (కరన్యాసః)।**<br>**ధ్యానమ్ :**<br>**శ్లో॥ శంఖ చక్ర మహాముద్రా**<br>**పుస్తకాఢ్యం చతుర్భుజమ్**<br>**సంపూర్ణ చంద్ర సంకాశమ్**<br>**హయగ్రీవమ్ ఉపాస్మహే।** | 'అ' కార 'ఉ' కార 'మ'కార ములతో అంగన్యాసము, కరన్యాసములు (''హ్లాం-సోఽహమ్-హ్లూం-అ-ఉ-మ''లతో కరన్యాసము - (అంగుష్ఠాభ్యాం నమః-ఇత్యాది). అంగన్యాసము-(హృదయాయ నమః - ఇత్యాది).<br>**"శంఖము", "చక్రము", "మహాముద్ర"** (చిన్ముద్ర, తత్త్వమసిముద్ర) **'పుస్తకము'** ఈ నాలిగిటిని నాలుగు **చేతులతో ధరించినవారు,** పూర్ణచంద్రునివలె **ప్రశాంత-ఆనంద స్వభావులు** అగు హయగ్రీవస్వామిని ఉపాసించుచున్నాము. |

"ఓం శ్రీమ్" – ఇతి ద్వే అక్షరే। (2)
"హ్లాం (హ్సాం) – ఇతి ఏకాక్షరమ్। (1)
"ఓం నమో భగవత" – ఇతి సప్తాక్షరాణి। (7)
"హయగ్రీవాయ" – ఇతి పంచాక్షరాణి। (5)
"విష్ణవ" – ఇతి త్రీణి అక్షరాణి। (3)
"మహ్యం మేధాం ప్రజ్ఞాం" –ఇతి 'షట్'–అక్షరాణి। (6)
"ప్రయచ్ఛ స్వాహా" – ఇతి పంచాక్షరాణి। (5)
హయగ్రీవస్య తురీయో భవతి॥

| |
|---|
| ఓం శ్రీం హ్లాం ఓం నమో భగవత హయగ్రీవాయ విష్ణవ మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా॥ |

**"ఓం। శ్రీమ్"**। - '2' అక్షరములు (2)
**"హ్లాం (హ్సాం)"** । - ఏకాక్షరమ్। (1)
**"ఓం నమో భగవతే"**। - ఇతి సప్తాక్షరాణి। (7)
**"హయగ్రీవాయ"** - ఇతి పంచాక్షరాణి। (5)
**"విష్ణవ"** త్రీణి అక్షరాణి (3)
**"మహ్యం మేధాం ప్రజ్ఞాం"** - షట్ అక్షరాణి (6)
**ప్రయచ్ఛ స్వాహేతి।** ప్రసాదించుటకై పంచాక్షరీ (5)
స్వాహా। ఆహుతులుగా సమస్తము సమర్పిస్తున్నాము.
- పై హయగ్రీవస్య మంత్రోపాసనచే **తురీయసిద్ధి ప్రాప్తించగలదు.**
- **"జాగ్రత్ స్వప్న సుషుప్తుల నావైన నేను"** స్వరూపుడుగా, (తురీయుడుగా) సర్వజీవులలో వేంచేసియున్న హయగ్రీవస్వామికి నమస్కరిస్తున్నాము. సమస్తము సమర్పిస్తున్నాము.

---

3. "ఓమ్–శ్రీమ్" – ఇతి ద్వే అక్షరే । (2)
హ్లాం (హ్సాం) – ఇతి ఏకాక్షరం। (1)
ఐం ఐం ఐం – ఇతి త్రీణి అక్షరాణి। (3)
క్లీం క్లీం – ఇతి ద్వే అక్షరే । (2)
సౌః సౌః – ఇతి ద్వే అక్షరే। (2)
'హ్రీం' – ఇతి ఏకాక్షరమ్। (1)
"ఓం నమో భగవత" – ఇతి సప్తాక్షరాణి। (7)
"హయగ్రీవాయ" – ఇతి పంచాక్షరాణి। (5)
"మహ్యం మేధాం ప్రజ్ఞాం" – ఇతి షడక్షరాణి। (6)
"ప్రయచ్ఛ స్వాహా" – ఇతి పంచాక్షరాణి। (5)
– పంచమో మనుర్భవతి।
– హయగ్రీవా – ఏకాక్షరేణ బ్రహ్మవిద్యాం ప్రవక్ష్యామి।

**"ఓం - శ్రీం"** - (2) ద్వే అక్షరము।
**"హ్లాం (హ్సాం)"** - ఇతి ఏకాక్షరము। (1)
**"ఐం ఐం ఐం"** - ఇతి త్రీణి అక్షరాణి। (2)
**"క్లీం క్లీం"** - ఇతి ద్వే అక్షరే। (2)
**"సౌః సౌః"** - ఇతి ద్వే అక్షరే। (2)
**"హ్రీం"** - ఇతి ఏకాక్షరము। (1)
**"ఓం నమో భగవత"** - ఇతి సప్తాక్షరాణి। (7)
**"హయగ్రీవాయ"** - ఇతి పంచాక్షరాణి। (5)
**"మహ్యం మేధాం ప్రజ్ఞాం"** - షడక్షరాణి। (6)
**"ప్రయచ్ఛ స్వాహా"** - పంచాక్షరాణి। (5)
ఓంకార పంచమస్థానమగు **'తురీయాతీతము' సిద్ధించగలదు.**
హయగ్రీవ ఏకాక్షరము (ఏకము-అక్షరము) గురించిన బ్రహ్మ విద్య చెప్పుకుంటున్నాము.

---

| |
|---|
| ఓం శ్రీం హ్లాం ఐం ఐం ఐం క్లీం క్లీం సౌః సౌః హ్రీం ఓం నమో భగవత హయగ్రీవాయ। మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా॥ |

బ్రహ్మో మహేశ్వరాయ।
మహేశ్వరః సంకర్షణాయ।
సంకర్షణో నారదాయ।
నారదో వ్యాసాయ।
వ్యాసో లోకేభ్యః।
ప్రాయచ్ఛత్ ఇతి।

ఈ విద్యను
బ్రహ్మ భగవానుడు - మహేశ్వరునికి, (శివునికి)
మహేశ్వరుడు - సంకర్షణునికి,
సంకర్షణుడు - బ్రహ్మమానసపుత్రుడగు నారదునికి,
నారదుడు - వ్యాసునికి,
వ్యాసుడు - సమస్తలోకములకు
వివరించ చెప్పటము జరిగింది.

| | |
|---|---|
| **‘హ’ కార ఓం। ల(స) కార ‘ఓం’।**<br>**‘ఉ’ కార ఓం।**<br>**త్రయమ్ ఏకస్వరూపం భవతి।**<br>**(హ కార ఓం। ల(స) కార ఓం। ఉ కార ఓం।)**<br>**ఇతి మంత్రః।** | బ్రహ్మతత్త్వవిచారణచే - సోఽహం ।<br>**‘హ’** = కారము (జీవాత్మ)।<br>**‘ల’** (స) = కారము (సాక్షీస్వరూపాత్మ / కేవలాత్మ)।<br>**ఉ** = జగత్తు (అనుభవముగా పొందబడుచున్న సమస్తము)।<br>ఈ మూడు కూడా ఏకస్వరూపముగా ‘ఓం’లో ఏకమగుచున్నాయి. |
| **‘హ్లాం’ (హ్సాం) – బీజాక్షరం భవతి।**<br>**బీజాక్షరేణ హ్లాం (హ్సాం) రూపేణ,**<br>**తత్ జాపకానాం సంపత్ – సారస్వతౌ భవతః।** | **“హ్లాం (హ్సాం)”** అనేది బీజాక్షరము.<br>అట్టి **“హ్లాం (హ్సాం)”** - బీజాక్షరము జపించువానికి **ధనసంపద, సారస్వత వాఙ్మయ సంపద** తనకు తానై లభించగలవు. |
| **తత్ స్వరూపజ్ఞానాం**<br>**వైదేహీ ముక్తిశ్చ భవతి।** | పరమాత్మ యొక్క ‘తత్’ స్వరూపజ్ఞానముచే (లేక) ఆత్మ యొక్క స్వరూప జ్ఞానముచే (స్వాభావికతచే) **‘విదేహముక్తి’** సిద్ధించగలదు. |
| **దిక్పాలానాం రాజ్ఞాం నాగానాం**<br>**కిన్నరాణామ్ ‘అధిపతిః’ – భవతి।** | ఆత్మతత్త్వజ్ఞుడు - దిక్పాలకులకు, రాజులకు, నాగులకు, కిన్నెరులకు కూడా **అధిపతి (అధికుడు)** అగుచున్నారు. |
| **హయగ్రీవా – ఏకాక్షర**<br>**జపశీలాజ్ఞయా సూర్యాదయః స్వతః**<br>**స్వ స్వ కర్మణి ప్రవర్తంతే।।** | ద్రష్ట - దర్శన - దృశ్యత్రయీ ఏకస్వరూపార్థమగు “హయగ్రీవ ఏకాక్షర” జపశీలుని (అఖండాత్మపురుషుని) “ఆజ్ఞ” చేతనే సూర్యుడు మొదలైన వారంతా వారివారి (స్వేస్వే) కర్మ విధులతో ప్రవర్తించుచున్నారు. |
| **4. సర్వేషాం బీజానాం**<br>**“హయగ్రీవ ఏకాక్షరబీజం”**<br>**అనుత్తమం, మంత్రరాజాత్మకం భవతి।**<br>**హ్లాం (హ్సాం) – హయగ్రీవ స్వరూపోభవతి।** | అన్ని బీజాక్షరములలోను “హయగ్రీవ ఏకాక్షరబీజము” - ఉత్తమోత్తమము, మంత్రరాజాత్మకము - అని కూడా చెప్పబడుతోంది.<br>**“హ్లాం (హ్సాం)”** - అను ఏకబీజాక్షరము **“హయగ్రీవ స్వరూపము”**- అగుచున్నది. |
| **“అమృతం కురు కురు స్వాహా”।**<br>**తజ్జా(జ్ఞా)పకానాం వాక్సిద్ధిః, శ్రీసిద్ధిః**<br>**అష్టాంగయోగ సిద్ధిశ్చ భవతి।।** | **“అమృతం కురు స్వాహా”** - అను జపముచే ‘వాక్సిద్ధి’ ప్రాప్తిస్తూ, శ్రీ సిద్ధి (సమస్త సంపదలు) ప్రసాదించబడుతోంది.<br>**(యమము, నియమము, ఆసనము, ప్రాణనిరోధము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి** - అనబడే) - అష్టాంగ యోగ సిద్ధి - ప్రసన్నమౌతోంది. |
| **హ్లాం (హ్సాగ్) సకల సామ్రాజ్య సిద్ధిం**<br>**కురు కురు స్వాహా।** | హ్లాం (హ్సాగ్) - ఏకాక్షరము సకల సామ్రాజ్య సిద్ధి ప్రసాదించగలదు - ఇతి స్వాహా। (ఈ బీజాక్షరము పలుకుచు ఆహూతులు సమర్పించబడు గాక)। |
| **తాన్ ఏతాన్ మంత్రాన్ యో వేద**<br>**అపవిత్రః పవిత్రో భవతి।**<br>**అబ్రహ్మచారీ సుబ్రహ్మచారీ భవతి।** | ఈ **హయగ్రీవ ‘ఏకాక్షర మంత్రము**ను ఎరిగినవాడు -అపవిత్రతను తొలగించుకొని పవిత్రుడు కాగలడు.<br>బ్రహ్మమును అధ్యయనము చేయని అబ్రహ్మచారి కూడా - బ్రహ్మమును చక్కగా తెలుసుకొని **“సుబ్రహ్మచారి”** కాగలడు. |
| **అగమ్యాగమనాత్ పూతో భవతి।**<br>**పతిత సంభాషణాత్ పూతో భవతి।**<br>**బ్రహ్మహత్యాది పాతకైః ముక్తో భవతి।** | హయగ్రీవ మంత్రమును జపించువాడు వెళ్లకూడనిచోటుకు వెళ్లిన దోషములనుండి పవిత్రుడు కాగలడు.<br>పతిత సంభాషణాదోషములనుండి పూతుడు (పునీతుడు) కాగలడు.<br>‘బ్రహ్మహత్య’ మొదలైన మహాపాతక దోషముల నుండి కూడా ముక్తుడు కాగలడు. |

| | |
|---|---|
| **గృహం గృహపతిరివ – దేహీ దేహాంతే<br>పరమాత్మానం ప్రవిశతి।** | హయగ్రీవ దివ్య మంత్రములు ఎరిగి జపించువాడు - పరమాత్మ తత్త్వము సంతరించుకోగలడు.<br>గృహయజమాని సాయంకాలము ఇల్లు చేరువిధంగా, ఆ దేహి - దేహభావమును అధిగమించి 'పరమాత్మ' యందు ప్రవేశించగలడు. |
| **"ప్రజ్ఞానం బ్రహ్మ", "తత్త్వమసి",<br>"అయమాత్మా బ్రహ్మ"<br>"అహం బ్రహ్మాస్మి" – ఇతి మహావాక్యైః<br>ప్రతిపాదితమ్ అర్థం<br>త ఏతే మంత్రాః ప్రతిపాదయంతి।<br>స్వరవ్యంజన భేదేన ద్విధాయతే।<br>అథ అనుమంత్రాన్ జపతి।** | ఈ హయగ్రీవ దైవత్య మంత్రములు, ఏకాక్షరీ మంత్రము - ఇవన్నీ 'వేద మహావాక్యములు' ప్రతిపాదిస్తున్న అర్థమునే ప్రతిపాదిస్తున్నాయి. **(1) ప్రజ్ఞానం బ్రహ్మ (2) తత్త్వమసి (3) అయమాత్మా బ్రహ్మ (4) అహం బ్రహ్మాస్మి** - మహావాక్యార్థమును అందిస్తున్నాయి.<br>స్వరము - వ్యంజనము (శబ్ద వృత్తి / అర్థము) ఏకమగుచున్నాయి కదా! అట్లాగే, ఏకమగు బ్రహ్మము - జీవాత్మ-పరమాత్మలుగా భేదము కనిపిస్తూ ఉన్నప్పటికీ - సర్వదా ఏకమే. ఎందుకంటే సమస్తము బ్రహ్మమే అయి ఉన్నది కాబట్టి. |
| **యత్ వాక్ వదంత్య విచేతనాని (వదంతి అవిచేతనాని)<br>రాష్ట్రీ దేవానాం నిషసాద మంద్రా,<br>చతస్ర ఊర్జం దుదుహే వయాంసి<br>క్వస్విత్ అస్యాః పరమం జగామ?** | - ఎక్కడ వాక్కు మాట్లాడక మౌనం వహిస్తోందో, తన చేతనము విడచి ఉంటోందో,<br>- దేవతలచే మంద్రమైన నిషాదముగా (రాగమాలికగా) ఏది స్తుతించబడుతుందో,<br>- పైన చెప్పబడిన చాతుర్మహావాక్యముల పరమార్థమై యున్నదో,<br>**అట్టి పరాత్పరమగు ఆత్మను ఎవరు దాటగలరు?** |
| **గౌరీమ్ ఇమాయ సలిలాని<br>తక్షతి ఏకపదీ,<br>ద్విపదీ, సా చతుష్పదీ<br>అష్టా పదీ,నవ పదీ<br>బభూవుషీ సహస్రాక్షరా<br>పరమే వ్యోమన్।** | - అట్టి ఆత్మయొక్క విభవమే - భూమిపై జలతత్త్వముగాను,<br>- **ఏకపదము** (అనేకముగా కనిపిస్తూ కూడా ఏకమే అయిఉండటము) గాను,<br>- **ద్విపదీ** (పర-ఇహ స్వరూపము) గాను,<br>- **చతుష్పదీ** (మనో బుద్ధి చిత్త అహంకారములు) గాను,<br>- **అష్టపదీ** (పంచభూతములు, జీవుడు, ఈశ్వరుడు, పరమాత్మ) గాను,<br>- **నవపదీ** (జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ, సర్వాత్మ) గాను,<br>సహస్ర అక్షరముగాను, పరమాకాశముగాను వెలుగొందుచున్నది. |
| **ఓష్ఠాపిధానా నకులీ దంత్యైః<br>పరివృతా పవిః<br>సర్వస్యై వాచ ఈశానా<br>చారు మామ్ ఇహ వాదయేత్<br>ఇతి చ వాగ్రసః।** | ఓష్ఠము (పెదవులు) దంతములతో పరివృతమైన సమస్త వాక్కులు ఈశ్వరతత్త్వమై, ఈశ్వర విభవములు అగుచున్నాయి.<br>సమస్త శబ్దములు, నాదములు, శబ్దార్థ భావనలు ఈశ్వరుని జగద్రచనా విశేషములే. |
| **5. "సశర్వరీః అమృతం బాధ మానా<br>బృహన్ ఇమాయ జమదగ్ని దత్తా<br>అసూర్యస్య దుహితా తతాన<br>శ్రవో దేవేషు అమృతమ్ అజుర్యా।"** | సమస్త చీకట్లను తొలగించి అమృతమయము చేయునది, జమదగ్ని మహర్షిచే చెప్పబడి బృహత్తరమైనది, సూర్యలోకమునకు ఆవలిది- అగు - **'హయగ్రీవ అమృత తత్త్వము'**ను ఉపాసిస్తున్నాము. |

| | |
|---|---|
| **య ఇమాం బ్రహ్మవిద్యాం ఏకాదశ్యాం పఠేత్, హయగ్రీవ ప్రభావేణ మహాపురుషో భవతి।** | ఎవ్వడైతే ఈ హయగ్రీవోపనిషత్‌లో చెప్పబడిన బ్రహ్మవిద్యను 11 సార్లు పఠిస్తాడో, అట్టివాడు శ్రీ హయగ్రీవ భగవానుని ప్రభావము (అనుగ్రహం) చేత 'మహాపురుషుడు' కాగలడు. |
| **స జీవన్ముక్తో భవతి।** <br> **ఓం నమో బ్రహ్మణే** <br> **ధారణం మే అస్తు** <br> **అనిరాకరణం।** | అతడు **'జీవన్ముక్తుడు'** అగుచున్నాడు. <br> 'ఓం'కార - అక్షర సంజ్ఞార్థము అయినట్టి 'బ్రహ్మము' నకు (పరబ్రహ్మ పురుషునకు) నమస్కారము. అట్టి ఏకము, అక్షరము అగు బ్రహ్మముయొక్క ధారణ - మా బుద్ధికి సిద్ధించును గాక. |
| **(అనిరాకరణం మే అస్తు।)** <br> **మే అస్తు అనిరాకరణమ్।** | అట్టి బ్రహ్మము పట్ల మా బుద్ధికి 'నిరాకరణము' (Refusal) తొలగును గాక। మా మనస్సుకు, బుద్ధికి బ్రహ్మజ్ఞానమునపట్ల "అహమ్ బ్రహ్మాస్మి భావన' పట్ల అనిరాకరణము (Acceptence. Non refusal) సర్వదా సిద్ధించును గాక। |
| **ధారయితా భూయాసం** <br> **కర్ణయోః శ్రుతం మా చ ఊర్ధ్వం,** <br> **"మమ అముష్య" –** <br> **"ఓం" – ఇతి ఉపనిషత్॥** <br><br> <u>హయగ్రీవోపనిషత్ సమాప్తా।</u> <br> <u>ఓం శాంతిః శాంతిః శాంతిః॥</u> | ఈ చెవులతో ఏ బ్రహ్మము బ్రహ్మతత్త్వము గురించి వింటున్నామో, - అది మేము మరల మరల బుద్ధితో కూడా ధారణ చేయుచుండెదము గాక। మాయందు ఆత్మజ్ఞానము సునిశ్చితము అగు గాక। <br> మాయొక్క బ్రహ్మతత్త్వధారణచే ఐహిక ఆముష్మిక ఫలములు (ఇహ-పరములు) పొందుచుండెదము గాక। <br> ఇహమందు సానుకూల్యమును, పరమందు మోక్షమును సిద్ధించుకొనెదము గాక। <br><br> ***<u>ఇతి హయగ్రీవోపనిషత్।</u>*** <br> ***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>*** |

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 22 హయగ్రీవోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**శ్లో॥ స్వ (అ)జ్ఞోపి యత్ ప్రసాదేన జ్ఞానం తత్ ఫలం అప్నుయాత్**
**సోఽయం హయాస్యో భగవాన్ హృది మే భాతు సర్వదా॥**

*స్వయముగా అజ్ఞులము, ఆత్మజ్ఞాన విహీనులము అయి ఉండి కూడా,* ***ఎవరి అనుగ్రహంచేత*** *(సమస్తమునకు పరము – ఆవలిది, నిత్యము, అమృత – ఆనందమయము, కేవలము, సర్వదా యధా తథము అగు)* ***'తత్' స్వరూప 'ఆత్మజ్ఞానము' పొందగలుగుతామో*** *– అట్టి హయ (గుఱ్ఱపు) ముఖుడగు* ***శ్రీ హయగ్రీవ భగవానుడు మా హృదయములో సర్వదా వెలుగొందుచుండునుగాక! భాసించుచుండును గాక!***

**శ్లో॥ జ్ఞానానందమయం దేవం, నిర్మల స్ఫటికాకృతిమ్**
**ఆధారం సర్వవిద్యానాం, హయగ్రీవం ఉపాస్మహే॥**

*"ఆత్మజ్ఞానము" అనే ఆనందముతో సర్వదా ప్రదర్శనమగువారు, సర్వదేవతా స్వరూపులు, నిర్మలహృదయులు, స్ఫటికమువలె తేజోపుంజములు వెదజల్లువారు (స్ఫటికాకృతులు), సమస్త విద్యలకు ఆధారము అయినట్టి వారు – అగు శ్రీ హయగ్రీవ భగవంతుని* ***ఉపాసిస్తూ,*** *ఆయనకు* ***నమస్కరిస్తున్నాము.***

❖ ❖ ❖

**దేవీ భాగవతము**

శ్రీ హయగ్రీవుడు విష్ణుమూర్తి స్వామి అవతారము.

❖ ❖ ❖

ఒకప్పుడు దేవతల రక్షణ కొరకై విష్ణు భగవానుడు దానవులతో సుదీర్ఘకాలంగా యుద్ధము చేయవలసి వచ్చింది. యుద్ధము చేసి చేసియున్న విష్ణుమూర్తి కించిత్ అలసిపోయి, ఎక్కుపెట్టిన ధనస్సుపై తలబెట్టుకొని నిదురించసాగారు.

ఇంతలో దేవతలు యజ్ఞము చేసి, యజ్ఞభాగమును విష్ణుమూర్తికి సమర్పించటానికై వచ్చారు. ఆయన ఎక్కు బెట్టిన బాణపు త్రాడుపై తల ఆనించి నిదురిస్తూ ఉండటము గమనించారు. కానీ, **"నిదురిస్తూ ఉన్నవానిని నిదుర లేపకూడదు"** – అను సూత్రమును

అనుసరించి దేవతలుగాని, బ్రహ్మదేవుడుగాని విష్ణుమూర్తిని నిదురలేపటానికి జంకారు (Hezitated).

అప్పుడు శివదేవులవారు దేవతలతో **"ఓ దేవతలారా! ఈ విష్ణు భగవానుని నిదుర లేపటానికి ఒక ఉపాయము ఉన్నది. ధనస్సు యొక్క నారి (వింటిత్రాడు) ని త్రెంపితే, ఆ త్రాడు యొక్క కదలిక వలన విష్ణు దేవుని శిరస్సు కూడా కదలిక పొంది, అప్పుడు వారు తప్పక నిదురలేస్తారు"** – అని ఉపాయంగా చెప్పారు.

అప్పుడు బ్రహ్మ దేవుడు వమ్రిని (చెదపురుగు, చెట్టుపై ఉండె ఒక నల్లని కీటకమును) "బిడ్డా! నీవు వెళ్ళి, ఆ వింటి త్రాడును త్రెంచు" – అని అడిగారు.

ఆ వమ్రి **"నిద్రపోవువానిని లేపటము పాపము కదా, పితామహా!"** అని అడిగింది. అందుకుగాను బ్రహ్మదేవుడు **"నీకు కావలసిన ఆహారము ప్రతిరోజు నేనే అందజేస్తాను"** – అను ఒడంబడిక (Agreement)కు అంగీకరించారు.

ఆ తరువాత ఆ కీటకము (వమ్రి) నారిని కొరికింది. ఎక్కుపెట్టబడి ఉన్న ధనస్సు యొక్క నారి కొరకగానే ధనస్సు త్రుళ్ళినదై విష్ణుమూర్తి మెడకు బాణము తగిలి, ఆ మెడ తెగి శిరస్సు ఊడిపడింది. (ఇది లక్ష్మీదేవి యొక్క శాపపర్యవసానము. ఒకప్పుడు విష్ణుమూర్తి తనను చూచి అకారణంగా నవ్వినందుకు 'తల తెగుగాక!" – అని శపించటం జరిగింది. – దేవీ భాగవతము). అది చూచి దిగులుపడుచున్న ఇంద్రుడు మొదలైన దేవతలను ఓదార్చి –

***"ఓ దేవతలారా! వేదమంత్రములతో దేవిని స్తుతించండి"*** అని పలికారు. దేవతల ప్రార్ధనలకు లలితాదేవి ప్రసన్న అయి **"కారణముంటేనే కార్యము జరుగుతుంది. మీరు గుఱ్ఱము శిరస్సును అంటించండి"** – అని పలికి అంతర్ధానమైనారు.

అప్పుడు విశ్వకర్మ గుఱ్ఱము శిరస్సును విష్ణు దేవుని మొండెమునకు వేదమంత్రపూర్వకంగాను, సంప్రోక్షణ మొదలైన ఆయా మంత్ర–తంత్ర విశేషములతోను అతికించారు.

**అప్పుడు విష్ణుదేవుడు హయగ్రీవుడై దానవులను సంహరించారు.**

ఈ హయగ్రీవస్వామియే ఒకప్పుడు పాతాళ లోకం ప్రవేశించి, వేదములు దొంగిలించిన మధు కైటభులను జయించి సృష్టి కొనసాగించటానికై తిరిగి సృష్టికర్త అగు బ్రహ్మదేవునికి ఆ వేదములను అందించారు. హయగ్రీవులే కల్కి అవతారమని పౌరాణిక వర్ణనము. (దేవీపురాణము)

ఇక మనము **హయగ్రీవోపనిషత్** విశేషముల 'అధ్యయనము'లో ప్రవేశిస్తున్నాము.

---

ఒకానొక సందర్భములో బ్రహ్మమానస పుత్రులు, దేవర్షి – అగు నారదమహర్షి సత్యలోకము ప్రవేశించారు. తమ పితృదేవులగు సృష్టికర్త బ్రహ్మదేవుని దర్శించి, సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు.

**నారదమహర్షి** : తండ్రీ! భగవాన్। అధీహి। శరణు। మీ అధిపత్యము (ఆర్యత్వము)నకు నమస్కరిస్తున్నాను. స్వామీ! అన్నిటికంటే వరిష్ఠమైనది (The Highest) ఏది?

**బ్రహ్మదేవుడు** : కుమారా! **'బ్రహ్మవిద్య'**యే అన్నిటికంటే వరిష్ఠమైనది.

**నారదమహర్షి** : అట్టి బ్రహ్మవిద్య స్వానుకూలమయ్యేది, స్వానుభవమయ్యేది ఎట్లా?

**బ్రహ్మదేవుడు** : **బుద్ధి యొక్క దోషములు తొలగుతూ ఉండగా,** అట్టి నిర్మలబుద్ధికి బ్రహ్మ విద్య తప్పక ప్రకాశించగలదు.

**నారదమహర్షి : యయా అచిరాత్ సర్వపాపం వ్యపోహ్య, బ్రహ్మ విద్యాం లబ్ధ్వా ఐశ్వర్యవాన్ భవతి?** తండ్రీ! ఏమార్గంలో అతి త్వరగా మా బుద్ధి దోషములు తొలగి, బ్రహ్మ విద్య లభించగా, **"ఆత్మతత్త్వభావనా ఐశ్వర్యము"** లభించగలదు? – అట్టి బోధను దయతో అనుగ్రహించండి.

**బ్రహ్మభగవానుడు :** బిడ్డా! నారదా! బుద్ధి దృశ్యము నుండి ఉపసంహారము పొంది, ఆత్మయందు సునిశ్చలము కావటానికై **"అధ్యాత్మ వాఙ్మయము'**లో విశేషముగా **"హయగ్రీవ దైవత్య మంత్రములు"** చెప్పబడుచున్నాయి.

ఎవడైతే అట్టి హయగ్రీవ దైవత్యములైన (దివ్యములైన) మంత్రముల అర్థ – అంతరార్థములను చక్కగా తెలుసుకుంటూ, పారాయణము చేస్తాడో, – అట్టివాడు వేద, శృతి, స్మృతి, ఇతిహాస, పురాణముల అంతర – సారము ఎరిగినవాడు అగుచున్నాడు.

[ **– వేదములు** = తెలియబడే సమస్తము ఏవిధంగా ఉపయోగించుకొని 'తెలుసుకొనుచున్నవానిని' (ఆత్మ) గురించి తెలుసుకోవాలో తెలిపే **'త్రయా విద్య'.**

**– శ్రుతులు** : మహనీయుల స్వానుభవములు శిష్యుల శ్రవణముచే (శిష్యులచే) (గురుపరంపరగా) గ్రంథస్థమైనట్టివి. (ఉదా: వేద, ఉపనిషత్ మంత్ర మంగళ శ్లోకములు).

**– స్మృతులు**: శ్రుతులను శ్రవణం చేసి ఆచరించినవారి జీవిత విశేషములు. సోదాహరణ పూర్వకంగా ఉత్తమ ఆత్మదృష్టులను ఆశ్రయించిన వారియొక్క విధి విధానములు, సంఘటనలు, అనుభవములు తెలియజేసేవి.

**– ఇతిహాసములు** : పరంపరగా చెప్పుకోబడుచూ వస్తున్న పూర్వ కథలు. పూర్వ చరిత్రల వివరణ (ఉదా: రామాయణము, భారతము మొదలైనవి). ("ఒకప్పుడు ఇట్లు" అని జరిగిన విశేషములు చెప్పుచూ, తత్త్వజ్ఞానమార్గము సూచించునవి).

**– పురాణములు** : జగత్ సృష్టి, కాలచమత్కారము, మహనీయుల మహిమా విశేషములు, ఔన్నత్యము మొదలైనవి తెలుపునవి. శబ్దార్థము పురా–నవం= ఇతః పూర్వమే ఉండి, ఇప్పటికీ యథాతథమైన విశేషము (అఖండాత్మతత్త్వము).

**హయగ్రీవ దైవత్య మంత్రోపాసనలు ఎరిగినవాడు జ్ఞానైశ్వర్యుడు, సర్వైశ్వర్యుడు కాగలడు. పై విభాగములలోని సార విశేషములు ఎరుగగలడు.**

## త ఏతే మంత్రః। హయగ్రీవ దైవత్యాన్ మంత్రములు।

**1. శ్లో॥ విశ్వ ఉత్తీర్ణ స్వరూపాయ**
**చిన్మయా నంద రూపిణే।**
**తుభ్యం నమో హయగ్రీవ**
**విద్యా రాజాయ విష్ణవే–**
**స్వాహా। స్వాహా। నమః॥**

*– విశ్వమును దాటివేసినట్టి విశ్వేశ్వర – విశ్వాతీత స్వరూపుడు, విశ్వసాక్షీ ।*

*– చిత్ (కేవలమగు ఎరుక) మయ ఆనందరూపుడు, తెలుసుకోవటమును తన ఆనందరూపముగా కలవారు (One to whom "knowing" by itself is an enjoyment) అగు స్వామీ!*

*– అట్టి హయగ్రీవభగవన్! సమస్త విద్యలకు రాజు వంటి వాడా! సమస్తమునందు 'సత్' స్వరూపులై వేంచేసియున్న విభూ! విష్ణుప్రభూ! మీకు నమస్కారము। సమస్తము మీకు సమర్పిస్తున్నాము. స్వాహా! స్వాహా! నమః॥*

2. **ఋక్ యజుః సామ రూపాయ।**
**వేదాహరణ కర్మణే।**
**ప్రణవ ఉద్గీథ వపుషే**
**మహా అశ్వశిరసే నమః।**
**స్వాహా। స్వాహా। నమః॥**

*ఋక్ యజుర్ సామ – త్రివేదస్వరూపా। వేదములను ఉద్ధరించి (రక్షించి) తిరిగి అజునకు (బ్రహ్మదేవునికి) అందజేయు కార్యశీలుడా! ప్రణవ – ఉద్గీథ (ఆత్మ తత్త్వగాన) స్వరూపుడా! మహా అశ్వ (గుఱ్ఱపు) శిరస్సు కలవాడా।*

*సమస్తము సమర్పించుచూ నమస్కరిస్తున్నాము. స్వాహా! స్వాహా। నమః।*

3. **ఉద్గీథ ప్రణవోద్గీథ**
**సర్వ వాగీశ్వరేశ్వర।**
**సర్వవేదమయ। అచింత్య**
**సర్వం బోధయ। బోధయ।**
**స్వాహా। స్వాహా। నమః॥**

*ఓ ఉద్గీథ (జగత్ గాన) ఆనందకారకా! ప్రణవగాన స్వరూపా! సమస్త వాక్కులందు విస్తరించి ఉన్నవాడా! సర్వ శబ్దములకు ఈశ్వరా! సర్వ వేదములలో వేంచేసి ఉన్నవాడా! ఆలోచనకు అందనివాడా! స్వామీ! ఆత్మజ్ఞానము గురించినదంతా మాకు బోధించండి. తెలియజేయండి. ఈ మా సమస్తము స్వీకరించండి! స్వాహా। స్వాహా। నమో నమః।*

**<u>ఈ మంత్రములకు :</u>**

**ఋషులు** – బ్రహ్మదేవుడు, అత్రిమహర్షి, రవి, సవితృ, భార్గవులు"।

**ఛందస్సు** – "గాయత్రీ" – త్రిష్టుప్పు, అనుష్టుప్పు।

**దేవత** – శ్రీమాన్ హయగ్రీవ పరమాత్మ।

| | | |
|---|---|---|
| **"హ్లాం (హ్స్రాం)"** ఇతి బీజగ్ం | **"సోఽహమ్"** ఇతి శక్తిః | **"హ్లూం (హ్స్రూం)"** ఇతి కీలకం |

= భోగ మోక్షయో వినియోగః।

= **'అ'** కార – **'ఉ'** కార – **'మ'** కారై – **అంగన్యాసః। కరన్యాసః।**

(1) 'అకార (4) హ్లీం
(2) ఉకార (5) సోఽహమ్
(3) మకార (6) హ్లూం

**కరన్యాసము**
**అంగన్యాసము**

| అంగన్యాసము | | కరన్యాసము |
|---|---|---|
| హృదయాయ నమః | - | 'అ'కార - అంగుష్ఠాభ్యాం నమః |
| శిరసే స్వాహా। | - | 'ఉ'కార - తర్జనీభ్యాం నమః |
| శిఖయాయ వషట్ | - | 'మ'కార - మధ్యమాభ్యా నమః |
| కవచాయు 'హుం'। | - | 'అ'కార - అనామికాభ్యాం నమః |
| నేత్రత్రయాయ వౌషట్ | - | 'ఉ'కార - కనిష్ఠికాభ్యాం నమః |
| అస్త్రాయ ఫట్ | - | 'మ'కార - కరతల కర పృష్ఠాభ్యాం నమః |

**<u>భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః।</u>**

ధ్యానము

**శంఖచక్ర మహాముద్రా।**

**పుస్తకాఢ్యం చతుర్భుజమ్।**

**సంపూర్ణ చంద్ర సంకాశం**

**హయగ్రీవమ్ ఉపాస్మహే॥**

*(1) శంఖము (2) చక్రము (3) 'తత్త్వమసి' అనే అర్థమును సూచించే చిన్ముద్ర అగు మహాముద్ర (4) పుస్తకాధారణ లతో సారూప్యులు, (జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములనబడే) - నాలుగు భుజములు కలిగి ఉన్నవారు, పూర్ణచంద్రుని వలె ప్రశాంత ఆనందహృదయులు- అగు హయగ్రీవుల వారిని ఉపాసించుచున్నాము.*

**హయగ్రీవ దైవత్య మంత్రము - 1**

1. **"ఓం శ్రీం"** - ఇతి ద్వే అక్షరే। (2)
   **"హ్లౌం** (హ్సౌం)" - ఇతి ఏకాక్షరం (1) — **"ఓం శ్రీం హ్లౌం (హ్సౌం)"। (3)**

2. **"ఓం నమో భగవత**" - ఇవి సప్తాక్షరాణి। (7)
   **"హయగ్రీవాయ"** - ఇతి పంచాక్షరాణి (5)
   **"విష్ణవ**" - ఇతి త్రీణి అక్షరాణి (3) — **"ఓం నమో భగవత హయగ్రీవాయ విష్ణవ" (15)**
   **"మహ్యం మేధాం ప్రజ్ఞాం।"** - ఇతి షడక్షరాణి (6)
   **"ప్రయచ్ఛ స్వాహా ।"** - ఇతి పంచాక్షరాణి (5) — **"మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా।" (11)**

**హయగ్రీవ దైవత్య మంత్రము - 1**

| | | |
|---|---|---|
| ఓం శ్రీం | హ్లౌం (హ్సౌం) | ఓం నమో భగవత |
| **(2)** | **(1)** | **(7)** |
| హయగ్రీవాయ | విష్ణవ । | మహ్యం మేధాం ప్రజ్ఞాం |
| **(5)** | **(3)** | **(6)** |
| ప్రయచ్ఛ స్వాహా ॥ | | |
| **(5)** | | **(29 అక్షరములు)** |

ఈ మంత్రోపాసన **హయగ్రీవ తురీయస్థానము** (జాగ్రత్ స్వప్న సుషుప్తులు, తన యొక్క సంచార స్థలములై, ఆ మూడిటికి వేరై, సర్వమును ప్రేరేపిస్తున్న - నాలుగవదగు **"స్వస్వరూప స్థానము"**) ను - ప్రసాదించగలదు. [రోజు 21 (లేక) 36 (లేక) 54 చొప్పున '3' సార్లు (ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము) ఉపాసించటం (మంత్రోపాసకులచే) సూచించబడుతోంది ].

## హయగ్రీవ దైవత్య మంత్రము - 2

| | అక్షరములు |
|---|---|
| **'ఓం శ్రీం'** - ఇతి ద్వే అక్షరే। | (2) |
| **"హ్లౌం॥ (హ్సౌం)॥** - ఇతి ఏకాక్షరం। | (1) |
| **"ఐం ఐం ఐం"** - ఇతి త్రీణి అక్షరాణి। | (3) |
| **"క్లీం క్లీం"** - ఇతి ద్వే అక్షరాణి। | (2) |
| **"సౌః సౌః"** - ఇతి ద్వే అక్షరాణి। | (2) |
| **"హ్రీం"** - ఇతి ఏకాక్షరమ్। | (1) |
| **"ఓం నమో భగవత"** - ఇతి సప్తాక్షరాణి। | (7) |
| **హయగ్రీవాయ** - ఇతి పంచాక్షరీ | (5) |
| **మహ్యం మేధాం ప్రజ్ఞాం** - ఇతి షడక్షరాణి। | (6) |
| **ప్రయచ్ఛ స్వాహా॥** - ఇతి పంచాక్షరాణి। | (5) |
| | **34 అక్షరములు** |

| | | | |
|---|---|---|---|
| **ఓం శ్రీం** | **హ్లౌం (హ్సౌం)** | **ఐం ఐం ఐం** | **క్లీం క్లీం** |
| **2** | **1** | **3** | **2** |
| **సౌః సౌః** | **హ్రీం** | **ఓం నమో భగవత** | |
| **(2)** | **(1)** | **(7)** | |
| **హయగ్రీవాయ।** | **మహ్యం మేధాం ప్రజ్ఞాం** | | |
| **(5)** | **(6)** | | |
| **ప్రయచ్ఛ స్వాహా।** | | | |
| **(5)** | | | **(34 అక్షరములు)** |

**పంచమ 'ఓం' భవతి।**

[ఓం = (1) అ (2) ఉ (3) మ (4) "మ్‌మ్‌...." అర్ధమాత్ర (తురీయము) (5) **లయము = తురీయాతీతము**].

పై 34 అక్షరముల హయగ్రీవ దైవత్య మంత్రముయొక్క ఉపాసనచే కేవలసాక్షీరూపమగు **"తురీయాతీతము"** సిద్ధించగలదు.

### హయగ్రీవ ఏకాక్షరముతో బ్రహ్మవిద్య

**బ్రహ్మదేవుడు:** ఓ నారదా! ఇంకా కూడా విను. జీవులు హయగ్రీవ ఏకాక్షరమును వినియోగించి **"బ్రహ్మవిద్య"ను సిద్ధించుకోగలిగిన విధానము గురించి చెప్పుకుంటున్నాము.**

ఈ విద్యను ఆయా సందర్భములలో :

బ్రహ్మ – మహేశ్వరునికి,

మహేశ్వరుడు – సంకర్షణునికి,

సంకర్షణుడు – దేవర్షి అగు నారదునికి,

నారదుడు – వ్యాసునికి,

వ్యాసమహర్షి లోక కళ్యాణము కాంక్షించినవారై అనేకమంది శిష్యులకు, తనను ఆశ్రయించవచ్చిన అనేకమంది జనులకు బోధించటము జరుగుతూ వస్తోంది.

**'హ' కార ఓం। 'ల' (స)' కార ఓం। 'ఉ' కార ఓం॥**

**"త్రయం ఏక స్వరూపం భవతి"** – ద్రష్ట, దర్శనము, దృశ్యము – ఈ మూడిటికి ఏకత్వము సిద్ధిస్తోంది. (అనగా – **ద్రష్టయే దర్శన శక్తిచే దృశ్యరూపమును దాల్చి – స్వయం కల్పిత దృశ్యమును స్వయముగా ఆస్వాదిస్తున్నాడు** – అనునది స్పష్టమౌతోంది.

## "హ్లౌం" (హ్సౌం) = హయగ్రీవ –ఏకాక్షర జపము

హ్లౌ **(హ్లౌం)** బీజాక్షరము. అట్టి హ్లౌం (హ్సౌం) బీజాక్షరముతో కూర్చి మంత్రోపాసను నిర్వర్తించువానికి లౌకిక (లోకసంబంధమైన) సంపద, సారస్వత సంపద – రెండూ లభించగలవు. **'తత్'** అనబడే **"స్వస్వరూపాత్మయొక్క జ్ఞానము"** సిద్ధించగలదు. స్వస్వరూపము గురించి ఎరుగుటచే **"విదేహముక్తి"** లభించగలదు.

– అట్టి **"హ్లౌం" (హ్సౌం)** ఏకాక్షర / బీజాక్షరోపాసనచే **"సమస్తము నేనైన నేను"** అను స్వాభావికానుభవము అయినట్టి **"విదేహముక్తి"** సిద్ధించగలదు. అట్టివాడు దిక్పాలకులపై, రాజులపై, నాగులపై, కిన్నరులపై ఆధిపత్యము పొందగలడు.

అట్టి హయగ్రీవ ఏకాక్షర జపశీలుడు **"హ్లౌం" (హ్సౌం)** (ఏకాక్షర, బీజ జపము చేయువాడు) – ప్రకృతికి వశుడు కాడు. ప్రకృతిని తానే స్వాధీనపరచుకోగలడు. ఆత్మతత్త్వజ్ఞుడగు అట్టి ఏకాక్షరశీలుని ఆజ్ఞ చేతనే స్వయంప్రకాశ శీలుడగు సూర్యుడు మొదలైన వారంతా వారి వారి కర్మలు నిర్వర్తిస్తున్నారు. పంచభూతములు, దేవతలు మొదలైన వారంతా కూడా హయగ్రీవ ఏకాక్షర ఉపాసనా సిద్ధుని సంకల్పానుసారం తమ తమ ధర్మములలో ప్రవర్తిస్తున్నారు.

సమస్త బీజాక్షరములలోకెల్లా **'హయగ్రీవ – ఏకాక్షరబీజము'** – ఉత్తమోత్తమమైనది. "హ్లౌం (హ్సౌం)" బీజాక్షర సహిత ధ్యానముచేత ఆ ఉపాసకుడు హయగ్రీవస్వరూపమగు **'కేవలము, సమస్తము'** అగు **పరమాత్మానంద స్వరూపము పొందుచున్నాడు.**

**"హ్లౌం (హ్సౌం) అమృతం కురు స్వాహా॥"**

అను హయగ్రీవ ఏకాక్షరసమన్వితమైన మృత్యుంజయ–పరమార్థ మంత్రముచే – మృత్యుపరిధులను దాటిపోగలడు. అనగా **మృత్యు సందర్భములలో కూడా సర్వసాక్షి అగు తనయొక్క పరాత్–పర స్వరూపమును ధారణ చేసి ఉండగలడు.**

అట్టి హయగ్రీవ ఏక బీజాక్షరము (హ్లౌం) తో కూడిన మంత్ర జపముచే భగవానుడగు హయగ్రీవస్వామిని సేవించటము చేత –

– **'వాక్'** సిద్ధి, సమస్త సంపదలతో కూడిన **శ్రీసిద్ధి** లభించగలదు.

– (1) యమము (ఇంద్రియ నిరోధము) (2) నియమము (ఇంద్రియములను నియమించటము) (3) ఆసనము (4) ప్రాణోపాసన (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (10) సమాధి – అనబడే అష్టాంగ యోగముల సిద్ధి – **పొందబడగలదు.**

**(ఇంకా కూడా), ఈ "హ్లౌం" (హ్సౌగ్) బీజాక్షరముతో కూడిన మంత్రోపాసనచే –**

సకల సామ్రాజ్య సిద్ధిని "స్వాహా" – స్పందన పూర్వకంగా ప్రసాదించగలదు. [ (**హ్లౌం (హ్సౌగ్) సకల సామ్రాజ్యసిద్ధిం కురు కురు స్వాహా।** – ఇతి బీజాక్షర సహిత మంత్రము) ].

అట్టి ఈ మంత్రము యొక్క తాత్త్వికార్థము ఎవరు తెలుసుకుంటారో, అట్టి (స్వస్వరూప నిరూపణా) పరమార్థమును ఎవరు ఆశ్రయిస్తాడో →

- అట్టివాడు అపవిత్రుడు కూడా – పవిత్రుడు అగుచున్నాడు.
- బ్రహ్మమును లక్ష్యశుద్ధితో ఉపాసించని అబ్రహ్మచారి కూడా – **"సు–బ్రహ్మచారి"** కాగలడు.
- **అగమ్యాగమనాత్ పూతో భవతి।** నడవకూడని నడతలు, ప్రవర్తించకూడని ప్రవర్తనలు కలిగియున్నవాడు కూడా, – ఇప్పుడు ఈ హయగ్రీవ ఏకబీజాక్షర ధ్యానఫలముచే పవిత్రుడు కాగలడు.
- (ఇతరుల తప్పుపట్టుకోవటము, దూషించటము, మాటలతో ఇతరులను బాధించటము, అనృతము, దుష్టవచనములు పలకటము మొదలైన) – **పతిత సంభాషణములు** నిర్వర్తించియున్న దోషములనుండి హయగ్రీవ బీజాక్షరమంత్రోపాసకుడు పునీతుడు కాగలడు. అట్టివాని వాక్కు క్రమంగా పవిత్రత సంతరించుకోగలదు.
- (బ్రహ్మహత్య, సురాపానము, బంగారము దొంగిలించటము, గురుతల్పగమనము, పాతకములు చేసిన వానితో సాంగత్యము దోషము – అనబడు) పంచమహాపాతకముల దోషము కూడా ఆతనిపట్ల తొలగిపోగలదు.

ఒక గృహస్థ యజమాని తిరిగి తన ఇంటిలో ప్రవేశించుతీరుగా ఈ ఉపనిషత్‌లో మనము చెప్పుకున్న హయగ్రీవ బీజాక్షర సహిత మంత్రముల ఉపాసనచే ఈ జీవుడు తిరిగి **'పరమాత్మత్వము'** అను స్వగృహమునందు ప్రవేశించగలడు.

**మహావాక్యైః ప్రతిపాదితమ్ అర్థం త ఏతే మంత్రాః ప్రతిపాదయంతి।**

**శ్రీ హయగ్రీవ దివ్యమంత్రములు వేదములలో ఎలుగెత్తిగానము చేయబడిన 4 మహావాక్యముల మహదార్థమును సిద్ధింపజేస్తున్నాయి.**

**(1) ప్రజ్ఞానం బ్రహ్మ (2) తత్త్వమసి (3) అయమాత్మా బ్రహ్మ (4) అహం బ్రహ్మాస్మి**

**(1) ప్రజ్ఞానం బ్రహ్మ।** తెలియబడేదంతా దేనిచే తెలుసుకోబడుతోందో – అట్టి తెలుసుకోవటానికి మనముందే ఉన్న 'తెలివి'యే **ప్రజ్ఞానము.** (**ప్రజ్ఞానము** = The Feature of knowing in all beings. The knowing at its absolute Form). **అట్టి ప్రజ్ఞానమే బ్రహ్మము. బ్రహ్మమే ప్రజ్ఞానముగా ప్రదర్శనము అగుచున్నది.**

ఈ అనుభవముగా అగుచున్నది కాస్త ప్రక్కకుపెట్టి చూస్తే **"ఈ అనుభవము ఎవరికి చెందిన ఎరుకయో అట్టి కేవలమగు ఎరుకయే బ్రహ్మము.**

**(2) తత్త్వమసి** = నాకు ఎవరెవరైతే **"నీవు"** రూపంగా కనిపిస్తున్నారో, వారంతా కూడా **"తత్"** రూపమగు **'పరబ్రహ్మ'** (లేక) **'పరమాత్మ'** స్వరూపులే। ఏకమగు పరమాత్మయే అనేకములగు **"నీవు"లుగా** (అజ్ఞాన దృష్టికి) **కనిపిస్తోంది.**

బ్రహ్మదేవుని నుండి – ఒక పురుగు వరకు **అనేకములగు 'నేను'లు**గా కనిపిస్తూ ఉన్నదంతా (**'త్వం' అంతా**) – **తత్‌యే। (ఏకాక్షరమగు ఆత్మయే)।**

**(3) అయమాత్మా బ్రహ్మ** : నాటకంలో పాత్రగా కనిపించేవాడు ఆ పాత్ర వేస్తున్నవాడే కదా.

నాటకంలో నా పాత్ర = "జీవాత్మ"
ఆ పాత్ర ధారణ చేస్తున్న నేను = పరమాత్మ
నాటకము = ఈ జగన్నాటకము

- "జీవాత్మ" అని ఎవరిని అంటున్నామో, **అట్టి ఈతడు పరమాత్మ కాని క్షణమే "లేదు".**
- పరమాత్మయే సందర్భములలో "జీవాత్మ"గా అగుపిస్తున్నారు.
  కనుక **ఈ జీవాత్మ బ్రహ్మమే అయి ఉన్నాడు. (జీవో బ్రహ్మేతి నాపరః)।**

**(4) అహం బ్రహ్మాస్మి** : ఇక్కడ 'అహం' (నేను) జాగృత్ యొక్క అనుభవిగా మనలో ప్రతిఒక్కరికి తారసబడుతోంది కదా! అయితే ఈ 'జాగ్రత్'లోని **'నేను'** అనేది **నాయొక్క ఒక 'అంశ' మాత్రమే।** "జాగ్రత్‌లోని **'నేను'**, స్వప్నములోని **'నేను'** సుషుప్తిలోని **'నేను'** – అనే **మూడు నేనులు నావైన నేనే – 'అహం' అను శబ్దము యొక్క విస్తీర్ణార్థము.** ఈ జగత్తు యొక్క అనుభవము, దేహము, ఈ దేహమునకు ఇతఃపూర్వము, ఇప్పుడు ,ఈ దేహ తదనంతరము – **ఇట్టి సమస్తమైన సందర్భములకు ఆవలగల 'అహం' స్వరూపమే బ్రహ్మము.** (1) సమస్త జీవుల సహజ, వాస్తవ స్వరూపమై, (2) సమస్తమైన అన్యమునకు ఆవలిదై, (3) **అన్యమైనదంటికీ అనన్యమైనట్టి నేనే బ్రహ్మము.** అట్టి అర్థమును స్ఫురింపజేసేది – వేదమహావాక్యమగు **'అహంబ్రహ్మాస్మి'.**

బ్రహ్మము **స్వర** (శబ్దవృత్తి) – **వ్యంజన** (అర్థము)ల రెండు విధములుగా (వేద – వేదాంత వాఙ్మయమునందు) అభివర్ణించబడుతూ వస్తోంది.

ఈ అనుమంత్రములచే హయగ్రీవ పారమార్థికము (తత్త్వము) వర్ణించబడుతోంది.

| | |
|---|---|
| **యత్ వాక్ వదంతి అవిచేతనాని**<br>**రాష్ట్రీ దేవానాం నిషషాద మంద్రా,**<br>**చతస్ర ఊర్జం దుదుహే వయాంసి**<br>**క్వస్విత్ అస్యాః పరమం జగామ॥** | – ఎక్కడ వాక్కు మాట్లాడక మౌనం వహిస్తోందో, తన చేతనము విడచి ఉంటోందో,<br>– సమస్తదేవతలచే మంద్రమైన నిషాదముగా స్తుతించబడుతోందో,<br>– ఏది పైన చెప్పబడిన చాతుర్మహావాక్యముల పరమార్థమై యున్నదో,<br>**అట్టి 'పరము' అగు ఆత్మను ఎవరు దాటగలరు?** |
| **గౌరీమ్ ఇమాయ సలిలాని**<br>**తక్షతి ఏకపదీ, ద్విపదీ**<br>**సా చతుష్పదీ, అష్టాపదీ నవపదీ–**<br>**బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥** | – **అట్టి ఆత్మయొక్క విభవమే** – భూమిపై జలతత్త్వముగాను,<br>– **ఏకపదము** (అనేకముగా కనిపిస్తూ కూడా ఏకమే అయి ఉండటము) గాను,<br>– **ద్విపదీ** (పర–ఇహ స్వరూపము) గాను,<br>– **చతుష్పదీ** (మనో బుద్ధి చిత్త అహంకారములు) గాను,<br>– **అష్టపదీ** (పంచభూతములు, జీవుడు, ఈశ్వరుడు, పరమాత్మ) గాను,<br>– **నవపదీ** (జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ, సర్వాత్మ) గాను,<br>**సహస్ర అక్షరముగాను, పరమాకాశముగాను వెలుగొందుచున్నది.** |

| మంత్రములు | |
|---|---|
| **"ఓష్ఠాపి ధానా నకులీ<br>దంత్యైః పరివృతా పవిః<br>సర్వస్యై వాచ ఈశానా<br>చారు మామ్ ఇహ వాదయేత్<br>ఇతి చ వాగ్రసః॥"** | ఓష్ఠము (పెదవులు), దంతములతో (పల్లతో) (With Lips and Teeth) పరివృతమైన సమస్త వాక్కులు (పలికేవన్నీ) ఈశ్వరతత్త్వమై, ఈశ్వర విభవములుగా ఉపాసించుచున్నాము.<br>సమస్త శబ్ద-వాక్య-అర్థములు శ్రీ హయగ్రీవ వినోదకల్పనా విభవములుగా శ్రవణం చేస్తున్నాము. వినబడేదంతా శ్రీహయగ్రీవ స్వామి కళావిన్యాసమే। |
| **"సశర్వరీః అమృతం బాధమానా<br>బృహన్ ఇమాయ జమదగ్ని దత్తా<br>అసూర్యస్య దుహితా తతాన<br>శ్రవో దేవేషు అమృతమ్ అజుర్యా॥"** | సమస్త చీకట్లను తొలగించి అమృతమయము చేయునది, జమదగ్ని మహర్షిచే చెప్పబడి బృహత్తరమైనది, సూర్యలోకమునకు ఆవలిది, దేవతలచే ఉపాసించబడునది అగు - **'హయగ్రీవ అమృత తత్త్వము'**ను ఉపాసిస్తున్నాము. |



ఎవ్వడైతే ఈ "హయగ్రీవోపనిషత్"లో ప్రతిపాదించబడిన బ్రహ్మవిద్యావిశేషములను 11 సార్లు అధ్యయనపూర్వకంగా పఠిస్తాడో, అట్టివాడు శ్రీ హయగ్రీవస్వామి యొక్క ప్రభావం చేత, అనుగ్రహంచేత - **'మహాపురుషుడు'** కాగలడు.

(**మహాపురుషుడు** = జాగ్రత్ స్వప్న సుషుప్తులను, జన్మ జన్మాంతరములను, సమస్త దృశ్య వ్యవహారమును **"తన (స్వకీయ) పురుషకారముయొక్క "వినోద ప్రదర్శనా వికాసము"గా దర్శించటము** అనే **ఎరుకను ఆశ్రయించి**, అట్టి భావనను స్వాభావికము, అనునిత్యము చేసుకొన్నట్టివాడు).

**స జీవన్ముక్తో భవతి** : ఎవరి దృష్టిలో తమయొక్క జీవన్మరణములు 'జగన్నాటక పాత్ర'కు సంబంధించినవి మాత్రమే అయి ఉంటాయో, తమ దృష్టిలో వారికి వాటి వలన ఏమాత్రము బంధము ఉండదో, అట్టివాడు **'జీవన్ముక్తుడు'. హయగ్రీవ దివ్యమంత్రములను పారాయణము చేయువాడు 'జీవన్ముక్తుడు' కాగలడు.**

**ఓం నమో బ్రహ్మణే। "అఖండము, నిత్యము, సమస్తము" - అగు పరబ్రహ్మమునకు నమస్కరిస్తున్నాము.**

- **అట్టి బ్రహ్మముయొక్క ధారణ మేము నిరాకరణము చేయకుండెదము** గాక।
- **బ్రహ్మము మమ్ములను నిరాకరించకుండును** గాక।

**ధారయితా భూయాసం కర్ణయోః శ్రుతం మా చ ఊర్ధ్వం।**

**మేము చెవులతో విన్నతత్త్వము బుద్ధితో ధారణ చేయుచుండెదము గాక।**

**జాగరూకములమై వినెదముగాక। విన్నది వదలి ఉండకుండెదము గాక।**

**శ్రవణము చేసినది మా హృదయములో ఆముష్యము (సుప్రసిద్ధము) అయి ఉండును గాక!**

**మే అస్తు అనిరాకరణమ్।**
**మే అస్తు అనిరాకరణమ్।**

ఇతి హయగ్రీవోపనిషత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

**జగద్గురు శ్రీ హయగ్రీవస్వామి పాదారవిందార్పణమస్తు**

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

9

# బృహదారణ్యకోపనిషత్

## తృతీయ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

**శ్లో॥ సో కామయత ద్వితీయో।**



**అనన్యము, ఏకము, అఖండము, పరము అగు ఆత్మ పురుషుడు లీలా, క్రీడా వినోది అయి "నాకు ఎదురుగా రెండవది (అన్యమనునది) ఏర్పడినదై ఉండును గాక।" - అని భావించి, ద్వితీయమును సిద్ధింపజేసుకుంటున్నారు. ఇదియే జగత్ యొక్క వాస్తవ రూపము. కనుక జగత్తు స్వయంకృత కల్పనయే.**

## శాంతి పాఠము

**ఓం పూర్ణమదః। పూర్ణమిదమ్। పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।**
**పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ, పూర్ణమేవ అవ శిష్యతే॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

(ఈ ఎదురుగా కనిపించే సమస్తమునకు స్వస్వరూపమై, సర్వాత్మకమై, సహజమై వెలయుచున్నట్టి) – 'అదః', 'తత్' అనబడు ఆవలగల (All beyond) **"పరమాత్మ"** (One's own original SELF) – సర్వదా **పూర్ణుడే।**

అట్టి పూర్ణుని నుండి (బంగారము నుండి ఆభరణమువలె) ప్రదర్శనమగుచున్న "ఇదమ్" ప్రత్యయార్థమగు జీవాత్మ, జగత్తులు [The Experiencer (The Incidental SELF) and The experinces] కూడా సర్వదా పూర్ణమే। **అపూర్ణమనబడేది ఈ జీవాత్మ జగత్తులపట్ల ఏదీ ఏమాత్రము లేనేలేదు.**

(బంగారముచే తయారుచేయబడిన ఆభరణము బంగారమే అయినట్లు, జలం నుండి బయల్వెడలే తరంగము జలమే అయినట్లు) **జీవాత్మ జగత్తులు పూర్ణధర్మము విడువకయే పూర్ణమే"** – అయిఉన్నాయి.

పూర్ణము నుండి పూర్ణము (పరమాత్మ నుండి ⟶ జీవాత్మ) ఈవలికి తేబడినప్పుడు కూడా (0–0 = 0 వలె) సర్వదా, సర్వత్రా ఇహ – పరములందు పూర్ణత్వమే ఏర్పడి ఉండి, పూర్ణము నుండి వచ్చినది పూర్ణముతోనే మమేకమగుచున్నది. **ఈ సమస్తము సర్వదా పూర్ణమే।**

- ఆధిభౌతిక – ఆధి దైవిక – ఆధ్యాత్మిక త్రి–తాపములు,
- భూత – వర్తమాన – భవిష్యత్ – త్రి–కాలములు,
- జన్మయొక్క ఇతఃపూర్వపు–వర్తమాన–తదనంతర త్రి–స్థితిగతులు
- ద్రష్ట – దృష్టి – దృశ్యములు (త్రి–దృక్ రూపములు).
- స్వ–పర–పరాత్పరములు (త్రి–తత్త్వములు).

మొదలైన **త్రివర్ణములన్నీ కూడా ఆత్మసంభావనయందు సశాంతించినవే అగుచున్నాయి.**

***ఓం శాంతిః శాంతిః। శాంతిః శాంతిః॥***

## శుక్లయజుర్వేదాంతర్గత
## బృహదారణ్యకోపనిషత్
## 1 & 2 అధ్యాయముల గురించి

బృహదారణ్యకోపనిషత్ 8 అధ్యాయములు కలిగి ఉన్నది. అయితే మొదటి రెండు అధ్యాయములు యజ్ఞ - యాగ సంబంధమై కర్మ - ఉపాసనా ప్రశంసలు, కర్మ సంబంధమైన విధి - విధానములు, నియమ నిష్టలు మొదలైనవి ప్రధానముగా వర్ణించబడటంచేత, ఒకానొక పెద్దల ఆచారము ప్రకారము (శంకర, రామనుజ, మధ్వాచార్య సద్గురువులు అనుసరించిన విధానంగా) '3'వ అధ్యాయము నుండి మాత్రమే ఉపనిషత్ అధ్యయనము ప్రారంభించబడుతూ వస్తోంది. మొదటి రెండు అధ్యాయములు శబ్ద-నాద-ఉచ్ఛారణా యజ్ఞ విధాన ప్రాధాన్యముగా వాఙ్మయనిర్మితమై ఉన్నాయి.

మనము కూడా అదే పద్ధతిని అనుసరిస్తూ '3'వ అధ్యాయము నుండి శ్లోక తాత్పర్య అధ్యయన పుష్పములను వివరించుకుంటున్నాము. 'యజ్ఞ యాగ విధివిధానముల అధ్యయన జిజ్ఞాసువులు 1, 2 అధ్యాయములను కూడా పఠన, పరిశీలనములను (విడిగా) చేయతగును।" - అని యజ్ఞయాగ కర్మ - ఉపాసనా వేత్తలకు వినమ్రుడనై విన్నవించుకుంటున్నాను.

---

## బృహదారణ్యకోపనిషత్
## తృతీయ అధ్యాయః
## 1. ప్రథమ బ్రాహ్మణము
# అశ్వమేధ యాగము - సృష్టి సందర్శన ధ్యానము

**(మేధాశ్వము :: మేధ = ధారణాశక్తి గల, జ్ఞాపకశక్తితో కూడిన బుద్ధి) (అశ్వము = మనస్సు)**

**అశ్వమేధ యాగములోని అశ్వమే మనస్సు. ఈ విశ్వమే యాగ విశేషము.**



| | |
|---|---|
| విశ్వమే అశ్వము। బుద్ధియే మేధ। | **(అశ్వము = మనస్సు. మేధ = బుద్ధి. యాగము = పరాత్మకొరకై వినియోగము)** |
| 1 ఓం। ఉషా వా అశ్వస్య మేధ్యస్య శిరః। సూర్యః చక్షుః। వాతః ప్రాణో। వ్యాత్తమ్ అగ్నిః - వైశ్వానరః- సంవత్సర ఆత్మ । | 'విశ్వము' అనే అశ్వమేధయాగముయొక్క (యజ్ఞాశ్వముయొక్క) **శిరస్సు = బ్రహ్మముహూర్తము, ఉషస్సు. నేత్రములు = సూర్యుడు.** యజ్ఞాశ్వముయొక్క ప్రాణములు → **వాయువు.** యజ్ఞాశ్వము యొక్క తెరువబడిన నోరు → **వైశ్వనరాగ్ని.** విశ్వయజ్ఞము యొక్క సంవత్సరమే → ఆత్మ (దేహము జీవాత్మ). |
| అశ్వస్య మేధ్యస్య - ద్యౌః పృష్ఠమ్। అంతరిక్షం ఉదరం । | విశ్వము యొక్క ద్యులోకమే → అశ్వమేధాశ్వము యొక్క వీపు (వెనక ప్రక్క. పృష్ఠము) - **అంతరిక్షము** (ఆకాశమే) → యాగాశ్వముయొక్క పొట్ట. |
| పృథినీ పాదమ్ (పాజస్యమ్)। దిశః పార్శ్వే। అవాంతర దిశః పర్శవ ఋతవో అంగాని। | **భూమియే** → పాదము. **తూర్పు-పడమర-ఉత్తర-దక్షిణ దిక్కులే** → అశ్వముయొక్క పార్శ్వములు. **ఈశాన్య ఆగ్నేయ నైరుతి వాయువ్య అవాంతరదిశలే** → యజ్ఞాశ్వపు ప్రక్కటెములు. ఆరు **ఋతువుల** → అంగములు. |
| మాసాశ్చ, అర్థమాసాశ్చ పర్వాణి అహోరాత్రాణి - ప్రతిష్ఠా । నక్షత్రాణి అస్థీని। నభో మాంసాని। ఊవధ్యగ్ం సికతాః। | **మాసములు-సంధులు. అర్థమాసములు - పాదములు. రాత్రింబవళ్లే** → ఎముకలు. **నక్షత్రములే** ప్రతిష్ఠ (శాశ్వతముగా నిలుచునవి) అగు బొమికలు. ఆకాశమే - మాంసము. కడుపులోని జఠరాగ్ని (ఆకలి)యే → ఇసుక। |
| సింధవో గుదా। యకృచ్ఛక్లో మానశ్చ పర్వతా, ఓషధయశ్చ వనస్పతయశ్చ లోమాని। | నదులే → గుదము. **నదీనదములే** → నాడులు. **పర్వతములే** → మాంసపిండము. **ఓషధులు, వనస్పదులు** → వెంట్రుకలు. |
| ఉద్యన్ పూర్వార్థో। నిమ్లోచన్ జఘనార్థో। | ❀ అట్టి సృష్టి రూప యజ్ఞాశ్వమునకు పూర్వ విభాగము → **ఉదయిస్తున్న (మరియు) మధ్యాహ్న కాలము వరకు ప్రకాశించుచున్న సూర్యుడు.** (6 AM to 12 noon). ❀ ఉత్తర విభాగము - **మధ్యాహ్నము** నుండి **సాయంకాలము** వరకు ప్రకాశించుచున్న **సూర్యుడు.** ( 12 noon to 6 PM). |
| యత్ విజృంభతే, తత్ విద్యోతతే। యత్ విధూనుతే, తత్ స్తనయతి। యత్ మేహతి తత్ వర్షతి। వాగేవ అస్య వాక్ । (మేహ = శిశ్నము, మగగురి) | ఆ అశ్వము యొక్క అంగముల విజృంభణ (విస్తరణ)యే విద్యుత్ (తేజస్సు). అద్దాని అంగముల ప్రకంపనములు - **ఉరుములు.** ఆ అశ్వము మూత్రము విడువటమే వర్షము. అద్దాని సకిలింపు శబ్దములే వాక్కు. |
| 2. అహర్వా అశ్వం పురస్తాత్ మహిమాన్వ జాయత। తస్య పూర్వే సముద్రే యోనీ రాత్రిః ఏనం పశ్చాత్ మహిమాన్ అజాయత। తస్యాపరే సముద్రే యోనిః | అట్టి సృష్టి యజ్ఞాశ్వమునకు ముందు వెనుక ఉన్న బంగారు - వెండి పాత్రలే రాత్రింపగళ్లు. (యజ్ఞములో) స్వర్ణ - రజత పాత్రలు ఉంచు స్థానములే **తూర్పు - పడమర సముద్రములు.** రాత్రియే విశ్రాంతి పొందు యోని. అద్దాని **మహిమయే సందృశ్యమగుచున్న 'విశ్వదృశ్యము'.** అద్దాని పరస్థానము (జనన స్థానము) సప్త సముద్రములు. |

| | |
|---|---|
| ఏతౌ వా (యోనిరేతౌ వా) అశ్వం మహిమాన్<br>**ఆవభిః తత్ సంబభూవతుః** | ఈవిధంగా ఆ **మేధాశ్వము** అనబడే పరతత్త్వము యొక్క మహిమయే ఈ సమస్తముగా సంభూతమై ఉంటోంది. |
| **హయో భూత్వా**<br>**దేవాన్ అవహత్ వాజీ**<br>**గన్ధర్వాన్ అర్వా అసురాన్**<br>**అశ్వో మనుష్యాన్।**<br>**సముద్రయేవ అస్య బంధుః।**<br>**సముద్రో యోనిః।** | అద్దాని దివ్యరూపములే **దేవతలు, గంధర్వులు, అసురులు, మానవులు, తదితర సమస్త జీవులు.** అట్టి 'సృష్టి' అనే యాగాశ్వము - సముద్రమును జననస్థానముగా కలిగి ఉన్నది.<br>సముద్రమే విశ్వాశ్వమునకు బంధువు.<br>ఈ విధంగా ఈ సమస్త విశ్వము అశ్వమేధ యాగ యోగోపాసనగా ఉపాసించ బడుచున్నది.<br>[ మేధాశ్వము (ప్రజ్ఞ) + విశ్వము (విశ్వవిద్యాలయము) ల పరస్పరత్వమే 'జీవితము' అనే సందర్భము]. |

## బృహదారణ్యకోపనిషత్।
## తృతీయ అధ్యాయః
## 2. ద్వితీయ బ్రాహ్మణము
## మానసికాశ్వమేధ యాగము

| | |
|---|---|
| **1.** ఓం నైవ ఇహ కించన అగ్ర ఆసీత్। | **(మేధ = ధారణాశక్తి, జ్ఞాపకశక్తి గల 'బుద్ధి'. అశ్వము = 'మనస్సు' (అనునది పరోక్షార్థము).**<br>"మొట్టమొదట ఏమి ఉన్నది?" - అని పరిశీలించగా,<br>**- ఈ నామ రూపాత్మక దృశ్య - ద్రష్టల సంబంధములగు వ్యవహారాలేవీ మొట్టమొదట లేవు. (కేవలమగు ఆత్మయే ఉన్నది).** |
| **మృత్యు నైవ ఇదమ్**<br>**ఆవృతమ్ ఆసీత్।**<br>**అశనాయయా అశనాయా హి మృత్యుః।**<br>**తత్ మనోకురుత ఆత్మన్వీస్యామ్ ఇతి।** | మొట్టమొదట ఇవేమీ లేవు కాబట్టి మృత్యువు (మార్పు-చేర్పులు) అనునది కూడా లేదు. ఏదైనా ఉంటే కదా, 'అది మారుతోంది?' - అనేది ఉండగలదు?<br>మృత్యువు దేనినో భక్షించటం మొదలైనవేవీ లేవు. మృత్యువు అనగా సమస్తమును "భక్షించునది" - అనే కదా!<br>అట్టి కేవలమగు పరమాత్మ - తనయొక్క లీలా-క్రీడా-వినోదంగా సంకల్ప రూపమగు **మనస్సును నిర్మించుకొనుచున్నారు. (మననమే మనోరూపము).** |
| **సో అర్చన్ (న) చరత్।**<br>**తస్య 'అర్చత' ఆపోజాయాన్త**<br>**అర్చతే వై మే కమ్ 'అభూత్' - ఇతి।**<br>**తదేవ అర్కస్యాత్ అర్కత్వం।** | ఆ పరమాత్మయొక్క **"హిరణ్యగర్భ సృష్ట్యంశ"** - తన జనన స్థానమని పరమాత్మను పూజించుచుండగా (ఉపాసించుచుండగా) ఉదకము పుట్టింది.<br>అదియే అశ్వమేధయాగములోని జలముతో అర్క (సూర్య) ఉపాసన. |
| **కగ్ంహవా అస్మై భవతి**<br>**య ఏవమ్ ఏతత్, అర్కస్య అర్కత్వం వేద।** | అట్టి అశ్వమేధము గురించి ఎరిగినవానికి జలము సుఖమయము కాగలదు. |
| **2.** **ఆపోవా అర్కః।**<br>**తత్ యత్ అపాగ్ం**<br>**శర ఆసీత్ తత్ సమహన్యత।**<br>**సా పృథివి అభవత్, తస్యామ శ్రామ్యత్।**<br>**తస్య శ్రాన్తస్య తప్తస్య**<br>**తేజో రసో నిరవర్తతాగ్నిః॥** | ఉదకము - అర్క (సూర్య) (అగ్ని) స్వరూపమే అయి ఉన్నది.<br>జలములో ఏ రసతత్త్వము వేంచేసి యున్నదో, అదియే పృథివీ స్వరూపమై సృష్టికర్తకు శ్రాన్తము (అలసట) (కార్యవ్యవహారము) కలిగించుతోంది.<br>ఆ హిరణ్యగర్భుని శ్రమతో కూడిన తపించు తేజస్సే అగ్ని యందు సారము అయి ఉన్నది.<br>ప్రప్రథమ సృష్టి సంకల్పుడగు హిరణ్యగర్భుని తేజస్సే విశ్వమంతా నిండియున్న అగ్ని. (కనుక, అగ్ని-హిరణ్యగర్భ తేజస్సుగా ఉపాసించాలి). |

3. స త్రేధ (3) ఆత్మానం వ్యకురుత।
(అగ్నిః) – <u>ఆదిత్యం</u> – ద్వే।
<u>వాయుం</u> తృతీయగ్ం।
స ఏష ప్రాణః త్రేధా విహితః।

ఆ **"హిరణ్యగర్భ పరతత్త్వ చైతన్యము"** - తనను తాను (తన స్వరూపమును) మూడు విధములుగా వేరుపరచుకొంటోంది.

**(1) అగ్ని (2) ఆదిత్య (3) వాయు**

ఆయనయే త్రివిధ ప్రాణరూపములుగా (ప్రాణ-అపాన-వ్యానములుగా) (వ్యష్టి-సమిష్టి-కేవల ప్రాణరూపములుగా) ధారణ చేయుచున్నారు.

---

తస్య <u>ప్రాచీత్</u> దిక్ శిరో
అసౌ చ । అసౌ చేర్మౌ। (అసౌ చ ఏర్మౌ)।
అథ అస్య <u>ప్రతీచీత్</u> దిక్
సుచ్ఛమసౌ చ।
అసౌ చ సక్థ్యౌ <u>దక్షిణా</u> చ
ఉదీచీ చ పార్శ్వే।
ద్యౌః పృష్ఠమ్
అన్తరిక్షమ్ ఉదరమ్। ఇయమ్ ఉరః।

ఇట్లు వేరుపరుచబడిన (వాస్తవానికి ఏకమగు) పరమాత్మస్వరూపమే అయి ఉన్నట్టి **ప్రాణాగ్నియొక్క భౌతికరూపమే ఈ దృశ్య జగత్తు।**

తూర్పుదిక్కే → శిరస్సు.

ఈశాన్య ఆగ్నేయములు → రెండు బాహువులు (భుజములు చంకల నుండి వ్రేళ్ళ వరకు ఉండే భుజములు)

పశ్చిమదిక్కు → దేహముయొక్క క్రింద భాగము.

వాయువ్య - నైరుతులు → రెండు తొడలు

దక్షిణ, ఉత్తరములు → రెండు పార్శ్వములు (Left and Right sides)

ద్యులోకము (స్వర్గలోకము) (పృష్ఠము) → వీపు

ఆకాశము → ఉదరము (పొట్ట).

ఈ సమస్త దృశ్యము → రొమ్ము (ఉరము. వక్షస్థలము).

---

స ఏషో అప్సు ప్రతిష్ఠితో।
యత్ర క్వచైతి,
తదేవ ప్రతితిష్ఠతి
ఏవం విద్వాన్।

పరమాత్మ స్వరూపమే అయినట్టి అగ్ని ఉదకమునందు ప్రతిష్ఠితము.

ఈ రీతిగా అగ్నియొక్క స్థితిని తెలుసుకొని ఉపాసించువాడు తాను ఎక్కడ ఏమి నిర్వర్తించినా కూడా అగ్నియొక్క ఉపాసనా ఫలము పొందగలడు.

---

4. సో అకామయత ద్వితీయో,
మ ఆత్మాజాయేత ఇతి।
స మనసా వాచం
మిథునగ్ం సమభవత్।

<u>అట్టి ఏకము, అద్వితీయము, అక్షరము</u> అగు పరమాత్మ <u>"నాకు ద్వితీయము కలుగును గాక!"</u> అను కోరికను (కామమును) ఆశ్రయించారు. తనకు రెండవ శరీరము కలుగుగాక అని కోరారు. (రెండవది = జీవాత్మ).

మనస్సు జనించింది. మనస్సు వాక్కులను **మిథునము** (జంట)గా భావన చేయసాగారు. (అట్టి వాక్కుయే వేదవాక్కు). **మనో, వాక్కులు** కలిసి సంచరించ సాగాయి.

---

అశనాయా మృత్యుః తత్ యద్రేత
ఆసీత్। స సంవత్సరో అభవత్।
స హ పురా తతః
సంవత్సర ఆస తమ్
ఏతావంతం కాలమబిభః।

ఆయన ఆ తరువాత ఉదకమును (జలమును) సృజించారు. ఆయన రేతస్సుగా (తేజస్సుగా) జలములో ప్రవేశించగా, అండ రూపముతో గర్భము కలవాడైనాడు. హిరణ్యగర్భనామాంకితుని, (సంవత్సరాత్మక ప్రజాపని) సృజించారు.

ఆయన సంవత్సరము (బ్రహ్మసంవత్సరము) తరువాత అండమును ఛేదించి కాలమును (కాలాగ్నిని) తేజోరూపంగా జనించారు.

---

యావాన్ సంవత్సరః
తమ్ ఏతావతః కాలస్య
పరాః తత్ అసృజత।
తం జాతమ్ అభివ్యాదదాత్
స "భాణ" కర ఉత్సైవ
వాక్ అభవత్ (వాగభవత్)॥

సంవత్సరకాలం తరువాత పరమాత్మకు పుత్రుని రూపంగా జన్మించిన ప్రజాపతితోబాటే, (కాలఃకాలునిచే) కాలము సృజియించబడింది. అట్టి 'హిరణ్యగర్భుడు' అగు తన పుత్రునికి - (కేవల) పరమాత్మ స్వరూపము ఏమరచునట్లుగా - అజ్ఞానము కల్పించారు. అప్పుడు ఆ ప్రజాపతి 'భాణ్' అను శబ్దము (భయముతో) ఉచ్చరించసాగారు. అట్టి "భ" శబ్దము నుండి **"భు-భువః-సువః"** ఇత్యాది వ్యాహృతి రూపమైన వాక్కుగా పరిణమించ సాగింది.

| | |
|---|---|
| **5.** స ఐక్షత యది వా<br>ఇమమ్ అభిమగ్ం స్యే<br>"కనీయో 'అన్నం' కరిష్య" – ఇతి। | రోదనము చేస్తున్న పిల్లవానికి తండ్రి బిడ్డకు ఆటబొమ్మలు ఇచ్చి లాలిస్తూ ఉండు తీరుగా, ఆ పరమాత్మ "నేను ఈ నా పుత్రునికి అన్నము (పంచేంద్రియములకు విషయపరంపరలను) సంకల్పితంగా కల్పించెదను గాక" - అని భావించారు. |
| స తయా వాచా, తేన ఆత్మనా<br>ఇదగ్ం సర్వం అసృజత।<br>యత్ ఇదం కించ ఋచో యజూగ్ంషి<br>సామాని ఛన్దాగ్ంషి యజ్ఞాన్ ప్రజాః పశూన్। | ఆత్మశక్తిమంతుడగు - ఆ ప్రజాపతి తనయొక్క వాక్ శక్తిచే - ఋక్ యజుర్ సామవేద మంత్రములను, ఛందస్సులను, యజ్ఞములను, ప్రజలను, జంతు జాలమును తదితర సమస్తమును సృష్టించారు. |
| స యద్య దేవా సృజత<br>తత్తదత్తుమ్ అధ్రియత।<br>సర్వం వా అత్తీతి<br>తత్ అదితేః అదితిత్వగ్ం<br>సర్వస్యై తస్యాత్తా భవతి।<br>సర్వమస్య అన్నం భవతి,<br>– య ఏవమ్ ఏతత్<br>అదితేః అదితిత్వం వేద॥ | ఆ దేవాది దేవుడు ఈ సమస్తమును సృజించి, ఈ సమస్తమునకు తానే అనుభవి **(The Experiencer)** కూడా కాసాగారు. అనగా ఈ సమస్త 'జగత్తు' అనబడునది అతని 'అన్నము' అవసాగింది. (అనుభవి- అనుభవించ బడుచున్న సమస్తము - ఉభయము పరమాత్మయే).<br>ఈ విధమైన సర్వాత్మకుడగు పరమాత్మయొక్క **"తానే అనుభవి - అనుభవించబడు సమస్తము - (అన్నము)"** - అను **అద్వితీయతత్త్వము ఎరిగినవాడు - తానే సర్వాత్మకుడై ప్రకాశించగలడు.**<br>అనగా తనకు తానే-**సమస్త జీవులలోని 'నేనైన నేను'ను** గమనించి, - **ఆస్వాదిస్తూ ఆత్మానందుడవగలడు.** |
| **6.** సో అకామయత భూయసా<br>యజ్ఞేన భూయో యజేయేతి। | ప్రజాపతి - **"ఇప్పుడు** నేను 'సృష్టి' యొక్క వినోద సిద్ధి కొరకై మరల మరల (విశ్వ) యజ్ఞమును నిర్వర్తించెదనుగాక" - అని తలచారు. |
| సో అశ్రామ్యత్స తపో<br>అతప్యత। తస్య శ్రాన్తస్య,<br>తప్తస్య యశోవీర్యమ్ ఉదక్రామత్। | ఈ విధంగా 'తపన' అనే తపస్సు చేస్తూ ఉండగా ఆ శ్రమ నుండి (చెమట బిందువులనుండి) యశో-వీర్యములు (కీర్తి-బలములు) బయల్వెడలాయి. (బహిర్గతమైనాయి). |
| ప్రాణా వై యశో వీర్యం।<br>తత్ ప్రాణేషు ఉత్క్రాన్తేషు<br>శరీరగ్ం శ్వయితుమ్ అధ్రియత,<br>తస్య శరీర ఏవ మన ఆసీత్॥ | ఆ బయల్వెడలిన యశో-వీర్యములు ప్రాణస్వరూపములే అయి ఉన్నాయి. ప్రాణములనుండి (ప్రాణశక్తి నుండి) ప్రాణశక్తి స్వరూపములే అయి ఉన్న వినికిడి - స్పర్శ - రూప (చూపు)-రస (రుచి) - గంధము (వాసన) అనబడే ఇంద్రియతత్త్వములు బయలుదేరాయి. అందుకు స్థానమే శరీరము. అయితే ఆ శరీరము ప్రాణశక్తిచే నిండి ఉండి కూడా స్వయముగా (తనకు తానుగా - By itself) ప్రవర్తించజాలకున్నది.<br>అప్పుడు - అట్టి ప్రాణేంద్రియ దేహమును (పరమాత్మయొక్క) మనన రూపమగు మనస్సు ఆశ్రయించసాగింది. |
| **7.** సో అకామయత మేధ్యం<br>మ ఇదగ్ంస్యాత్<br>ఆత్మన్ వ్యనేన అస్యామ్ – ఇతి। | "ఇప్పుడు ఈ నా ప్రాణేంద్రియమనోగతమైన శరీరము మేధ్యము (సృష్టి యజ్ఞవిధి)గా రూపుదిద్దుకొనునుగాక" అని యజ్ఞపురుషుడగు దేవదేవుడు తలంచారు. (మేధము =యజ్ఞము, హవిస్సు) |
| తతో అశ్వః సమభవత్<br>యత్ అశ్వత్ తత్ మేధ్యం అభూత్ – ఇతి।<br>తదేవ అశ్వమేధస్య అశ్వమేధత్వం। | అట్టి తలంపు నుండి (దేహబాహ్య సమగ్రరూపమగు) అశ్వము జనించింది. అట్టి అశ్వమేధత్వమే అశ్వమేధ **విశ్వరూపము.** (మనన రూప మనస్సే అశ్వము. జగత్-దృశ్యములో అద్దాని సంచారమే **'మేధత్వము').** |
| ఏష హ వా అశ్వమేధం వేద,<br>య ఏవమ్ ఏవం వేద। | ఇట్టి విశ్వరచనా అశ్వమేధమును ఎరిగిన వాడే అశ్వమేధాయాగము గురించి తెలుసుకొన్నవాడు అగుచున్నాడు. (కల్పనలో సంచారమే మేధాశ్వవిహారము). |

| | |
|---|---|
| **తమన వరుద్ధ్యైవ అమన్యత।**<br>**తగ్ం సంవత్సరస్య**<br>**పరస్తాత్ ఆత్మన ఆలభత।** | అప్పుడు ప్రజాపతి **"ఈః (మనో) అశ్వము చేతనే (సృష్టి) యాగము చేయుదునుగాక।"** అని తలచారు. సంవత్సరము తరువాత తనకు తానే ఆ అశ్వమును ఛేదించి, అశ్వమేధయాగమును పూర్తి చేసారు. మనో లయమే ఆత్మ భావనాప్రాప్తి. |
| **పశూన్ దేవతాభ్యః ప్రత్యౌహత్।**<br>**తస్మాత్ సర్వదైవత్యం**<br>**ప్రోక్షితం ప్రజాపత్యం ఆలభన్తే।** | ఆ తరువాత "ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతల పాలన కొరకై పశువులు మొదలైన జంతుజాలమును సంకల్పించెదనుగాక।" - అని తలచారు. |
| **ఏష హ వా అశ్వమేధో**<br>**య ఏష తపతి।** | ఆ విధమైన విధానముగానే అశ్వమేధ యాగములో సంవత్సరకాలము తరువాత యాగాశ్వమును అగ్ని - సూర్య ఆదిగా గల దేవతలకొరకై అశ్వమేధ యజ్ఞాశ్వమును ఛేదించుచున్నారు. |
| **తస్య సంవత్సర ఆత్మా అయమ్ అగ్నిః అర్కః।**<br>**తస్య ఇమే లోకా ఆత్మానస్తావే**<br>**తాన్ అర్క అశ్వమేధౌ**<br>**సో పునరేకైవ దేవతా భవతి।** | అశ్వమేధ సాధనముగా గల యాగ స్వరూపమే సృష్టిలో సూర్యుని ప్రవేశము - సూర్య సంచలనముచే సంవత్సరము. యజ్ఞ సాధనమైన అగ్నికి - స్వర్గ మర్త్య పాతాళములు మూడు దేహములు కూడా।<br>అగ్ని - ఆదిత్యులు (సూర్యులు) అర్కాశ్వమేధములు ఉభయములకు ఆత్మ - **ప్రజాపతియే.** (అనేకముగా కనిపించేదంతా ఏకముయొక్క సందర్భానుగతమైన ప్రదర్శనమే). |
| **మృత్యురేవ అప**<br>**పునర్మృత్యుం జయతి।**<br>**నైనం మృత్యుః ఆప్నోతి।**<br>**మృత్యురస్య ఆత్మా భవతి**<br>**ఏతాసాం దేవతానాం ఏకో భవతి।** | ఎవ్వరు అగ్ని - సూర్యుల పరస్పర సాధనములను సృష్టికర్త సంకల్ప రూపములుగా గ్రహిస్తారో, అట్టివారు మృత్యువును, అపమృత్యువును జయించగలరు. వారు మృత్యువు (మార్పు)కు విషయమేగానట్టి ఆత్మస్వరూప భావన సిద్ధంచుకొనుచున్నారు.<br>అట్టి అవగాహన కలవాడు దేహభావము త్యజించి, 'పరము' (Beyond) అయి ఉన్న 'దేహి' భావము సిద్ధించుకొని, దేవతా స్వరూపుడుగా అగుచున్నాడు. |

**ఇతి బృహదారణ్యకోపనిషత్। తృతీయ అధ్యాయః।**
**"సృష్టి సందర్శనోధ్యాన" నామ-ప్రథమం బ్రాహ్మణమ్।**

## బృహదారణ్యకోపనిషత్। తృతీయ అధ్యాయః।

## తృతీయ బ్రాహ్మణము

## 3. ప్రాణానంద స్వరూప సిద్ధి

| | |
|---|---|
| 1. ద్వయా హ ప్రజాపత్యాః।<br>(1) దేవాశ్చ (2) అసురాశ్చ।<br>తతః కానీయసా ఏవ దేవా।<br>జ్యాయసా అసురాః।<br>త ఏషు లోకేషు స్పర్థన్త। | విశ్వరచన కొరకై రెండు విధములైన వాటిని (ద్వంద్వములను) (కథా రచయితవలె) ప్రజాపతి కల్పించసాగారు.<br>**(1) దేవతలు (2) రాక్షసులు**<br>దేవతలను కనీసము (తక్కువ) సంఖ్యగాను, అసురులను అధిక సంఖ్యగాను కల్పించారు.<br>ఉభయులు ప్రజాపతి సృష్టియే అయి ఉండి కూడా, అట్టి దేవతలు, రాక్షసులు లోకములలో ప్రవేశించి పరస్పరము స్పర్ధ కలిగి ఉండసాగారు. |
| తే హ దేవా ఊచుః :<br>హన్త అసురాన్<br>యజ్ఞ ఉద్గీథేన<br>అత్యయామ్ ఏతి॥<br>(అసురాన్యజ్ఞ ఉద్గీథేనా త్యయామేతి) | **అప్పుడు దేవతలు** →<br>"మేము యజ్ఞము నిర్వర్తించు ఉద్గీథము (పరబ్రహ్మము గురించిన స్తుతులు) చేత జగత్ పరిధులను అతిక్రమించు మార్గము నిర్మిస్తాము. ఆత్మతత్త్వము సిద్ధించుకుంటాము'' - అని భావించసాగారు.<br>(ఉద్గీథము = విశ్వమును ముఖ్య ప్రాణముగాను (లేక) పరమాత్మగాను భావించి గానము చేయటము).<br>(ఉద్గాత = యజ్ఞ విధానములో ప్రాణ-ప్రాణేశ్వరులను స్తుతిస్తూ ఎలుగెత్తి గానము చేయువాడు). |
| 2. తే హ వాచం ఊచుః -<br>"త్వం న ఉద్గాయ।" - ఇతి।<br>"తథా"। ఇతి। తేభ్యో వాక్ ఉదగాయత్।<br>యో వాచి భోగస్తం దేవేభ్య<br>ఆగాయత్ యత్ కల్యాణం వదతి తదాత్మనే। | యజ్ఞదేవతలు వాక్ (అభిమాన దేవత)తో "మీరు మా కొరకై (విశ్వ) యజ్ఞములో ఉద్గాతకర్మను (ఉద్గాత్రమును) నిర్వర్తించాలి" - అని పలికారు.<br>**వాగభిమానదేవత : "ఓ! అట్లాగే, నేను విశ్వదేవతల కొరకు, నా కొరకు కూడా ఉద్గాత్రము చేస్తాను"** - అని పలికి వేదగానము చేయసాగారు. అది కల్యాణ రూపమగు పరమాత్మ సంబంధమైన స్తుతి అవసాగింది. |
| తే విదురనేన వైన ఉద్గాత్రా అత్యేషు<br>(య) అన్తీతి తమభి ద్రుత్య<br>పాప్మనా అవిధ్యన్ స యః<br>స పాప్మా యదేవేదమ్ (యత్ ఏవ ఇదమ్)<br>అప్రతిరూపం వదతి స ఏవ స పాప్మా॥ | అప్పుడు రాక్షసులు (దేవతలపై అక్కస్సు, అసూయలతో) - వాక్కులో పాప సంకల్పములను ప్రవేశింపజేసి అపరిశుభ్రము చేయసాగారు. ఆ విధమైన దుష్ట వాక్ ప్రయోగము శాస్త్ర విరుద్ధమైన పాపము.<br>ఆ విధంగా రాక్షసులు శాస్త్ర విరుద్ధమైన పాప వాక్కును మానవుల వాక్కులో ప్రవేశింపజేసారు. ఆనంద రూపమైన వాక్కులో భీభత్సము, అబద్ధము, పరులదూషణ మొదలైన ఆసురీ విశేషములు ప్రవేశించసాగాయి. |
| 3. అత హ ప్రాణం ఊచుః ।<br>"త్వం న ఉద్గాయ" ఇతి। "తథా"। ఇతి।<br>తేభ్యః ప్రాణ ఉదగాయద్యః<br>ప్రాణే భోగస్తం దేవభ్య ఆగాయత్,<br>యత్ కల్యాణం జిఘ్రతి తదాత్మనే।<br>తే విదురనేన వై న ఉద్గాత్రాత్<br>ఏష్యన్తీతి (ఉద్గాత్రాత్యేష్యన్తీతి)। | అప్పుడు దేవతలు ఘ్రాణ (సువాసన) దేవతను సమీపించి ఇట్లా పలికారు.<br>"ఓ ప్రాణవాయురూప ఆఘ్రాణదేవతా! సువాసన కొరకై మీరు ప్రవర్తించండి. మా కొరకై ఉద్గానము చేయండి. పరతత్త్వస్తుతి నిర్వర్తించండి"!<br>**ఘ్రాణరూపప్రాణదేవత** : ఓ అట్లాగే। (ప్రాణము అనగా - ఇక్కడ గంధ సంబంధమైన ఉచ్ఛ్వాస నిశ్వాసలు)<br>ఇట్లా పలుకి ప్రాణవాయుదేవత దేవతలు దైవీసంపత్తి - (ప్రేమ, దయ, త్యాగము ఇత్యాది దైవగుణముల) కొరకై ఉద్గానము చేయసాగారు.<br>ప్రాణము యొక్క ఉచ్ఛ్వాస - నిశ్వాసలు (ఊపిరి బయటకు విడచు, లోపలకు తీసుకొను) దైవీ సంపత్తియుతములుగా, కల్యాణ రూపములుగా కాసాగాయి. అవియే సువాసనలు. |

తమ్ అభిద్రుత్య పాప్మన
అవిధ్యన్ స యః స పాప్మా
యత్ ఏవ ఇదమ్ అప్రతిరూపమ్
జిఘ్రతి స ఏవ స పాప్మా ॥3॥

అప్పుడు రాక్షసులు ఘ్రాణములో ప్రవేశించి దుర్వాసనలు ప్రవేశింపజేసారు. ఈవిధంగా ముక్కుకు, దుర్వాసనలు కూడా అనుభవం కావటమే రాక్షసులు క్రియా విశేషాలు. పాపప్రవేశము దుర్గంధానుభవముగా అవసాగింది. (అనేక-సంఘటనల రూపంగా దుర్గంధము సుగంధమును కప్పివేయసాగింది).

4. అథ హ చక్షుః ఊచుః :
"త్వం న ఉద్గాయ" ఇతి॥ "తథా" ఇతి।
తేభ్యః చక్షుః ఉదగాయత్।
యః చక్షుషి భోగస్తం దేవేభ్య
ఆగాయత్ యత్ కల్యాణం పశ్యతి, తత్ ఆత్మనే।
తే విదుః అనేనవై
న ఉద్గాత్రా అత్యేషు అన్తీతి ।
తమ్ అభిద్రుత్య పాప్మనా అవిధ్యన్ స
యః స పాప్మా యత్ ఏవ ఇదమ్
అప్రతి రూపం పశ్యతి, స ఏవ స పాప్మా॥

అప్పుడు దేవతలు → "ఓ చక్షువులారా! మీరన్నా మాయొక్క దివ్య - దైవీ సంపదకొరకై ఉద్గానము చేయుదురు గాక!" అని పలికారు. చూపు దేవతలు అందుకు ఒప్పుకున్నారు.

ఏదైతే దివ్య (దేవతా) దృష్టిచే కల్యాణ (శుభ) విశేషాలతో చూడబడుతోందో అవన్నీ ఆత్మ స్వరూపమే.

అది గమనించిన రాక్షసులు దృష్టిలో దోషములు (అశాస్త్రీయ కామదృష్టి, మమకార-లోభ-మోహములతో వస్తువులను, విషయములను, రూపములను చూడటం) - అనే పాపమును ప్రవేశింప జేయసాగారు.

చక్షువులు దేనిచేత అయోగ్యము, దోషముగల దృష్టితో చూస్తున్నాయో అట్టి ప్రతిరూపమంతా **పాపము, అశాస్త్రీయము అగుచున్నది.**

(జ్ఞాన దృష్టిని అజ్ఞాన దృష్టి కలుషితము చేయసాగింది).

5. అథ హ శ్రోత్రం ఊచుః :
"త్వం న ఉద్గాయ" ఇతి।
"తథా"। ఇతి। తేభ్యః శ్రోత్రం ఉదగాయత్।
యః శ్రోత్రే భోగస్తం దేవేభ్య
ఆగాయత్ కల్యాణగ్ం
శృణోతి తత్ ఆత్మనే। తే విదుః
అనేనవైన ఉద్గాత్రాతి ఏష్యన్తి। ఇతి॥

అప్పుడు దేవతలు శ్రోత్రము (వినికిడి)తో "మీరు దేవతల కొరకై ఉద్గాతృగానము నిర్వర్తించెదరుగాక!" - అని పలికారు.

శ్రోత్రము "అట్లాగే!" - అని పలికి కల్యాణ గుణ సమన్వితమైన దైవ విషయ శ్రవణము చేయసాగాంది. ఆవిధంగా దైవీ శ్రవణము ఆత్మతత్త్వము యొక్క ఉద్గానము, అట్టి శ్రవణముయొక్క పరమాత్మకల్యాణ గుణ విశేషము తెలిసినవాడే - **ఉద్గాత**. ఆయనచే నిర్వర్తించబడేదే **ఉద్గాత్రము.**

తమ్ అభిద్రుత్య పాప్మనా అవిధ్యన్
సః యః సః పాప్మాయత్
ఏవ ఇదం అప్రతిరూపగ్ం
శృణోతి, స ఏవ స పాప్మా॥5॥

ఇది ఇట్లా ఉండగా రాక్షసులు పాపమును శ్రవణము నందు ప్రవేశింపజేసారు. ఇక ఆపై **జనులు చెడు - ఆరోపణ - దూషణ విషయములు శ్రవణం** చేస్తూ అప్రతిరూపమగు **పాప శ్రవణమునందు ప్రవర్తించసాగారు.** (ఇతరుల చెడు వినటంలో ఆనందము పొందసాగారు).

ఈవిధంగా వాక్కు, ప్రాణవాయు, వాసన, దృష్టి, శ్రవణము - అప్రతిహతమగు దోషములు పొందగా అవన్నీ ఆత్మ సంబంధమగు దైవీ అనుభవమును కప్పివేయసాగాయి. అసురులు దుర్విషయములను ప్రవేసింపజేయటం చేతనే ఇదంతా అట్లా జరుగసాగుతోంది.

6. అథ హ మనః ఊచుః।
"త్వం న ఉద్గాయ" – ఇతి।
"తథా"। ఇతి। తాభ్యో మన
ఉదగాయత్। యో మనసి
భోగస్తం దేవేభ్య ఆగాయత్।

ఆ తరువాత అధిష్ఠాన దేవతలు **మనోదేవతను** సమీపించారు. వారు ఇట్లా అభ్యర్థించ సాగారు.

**"ఓ మనో దేవతా! మీరు మా దైవీ (ఆత్మ) తత్త్వమును ఉద్గాతృ గానము, ఔద్గాత (దేవతా సంబంధమైన) కర్మలను నిర్వర్తించెదరు గాక!"**

మనో అధిష్ఠానము అందుకు అంగీకరించింది. అప్పుడిక మనస్సుయొక్క భోగమంతా అఖండాత్మానుభవ సంబంధము కాసాగింది.

| | |
|---|---|
| యత్ కల్యాణగ్ం సంకల్పయతి<br>తత్ ఆత్మనే। తే విదుః అనేన వై<br>స ఉద్గాత్రా ఇతి ఏష్యన్తీతి।<br>తమ్ అభిద్రుత్య పాప్మనా అవిధ్యన్<br>స యః స పాప్మా యదేవ ఇదమ్।<br>అప్రతి రూపగ్ం సంకల్పయతి।<br>స ఏవ స పాప్మా ఏవమ్ ఖలు ఏతాః<br>దేవతాః పాప్మ అభిరుపాసృజన్<br>ఏవమ్ (నేవము) ఏనాః పాప్మనా అవిధ్యన్॥ | "మనస్సు యొక్క కల్యాణ సంకల్పములన్నీ ఆత్మతత్త్వమే" అని ఎరిగి ఆత్మగానము చేయువారే ఉద్గాత।<br>అట్టి కల్యాణ గుణ మననము కలిగిన మనస్సులోని పుణ్యభావాలు విధ్వసం చేసి పాప సంకల్పములను రాక్షసులు ప్రవేశింపజేయసాగారు. అప్రతిరూప సంకటములు, దోష సంకటములు బయలుదేరసాగాయి. ఎందుకు?<br>"అట్టి ఓద్గాత్ర కర్మతో దేవతలు అధికులు అవుతారేమో'' - అనే శంకతో రాక్షసులు మనుస్సులో దురాలోచనలను ప్రవేశింపజేసి అపరిశుద్ధము చేయసాగారు.<br>ఈవిధంగా ఇంద్రియములన్నిటిని దేవతలు తమ కొరకై (ఆత్మస్తుతికొరకై) ప్రార్థించగా, అవన్నీ దివ్యత్వ కర్మలు నిర్వర్తిస్తూ ఉన్న సమయం. రాక్షసులు ఆ సమస్త ఇంద్రియములుగా శాస్త్రవిరుద్ధమైన పాపము (sin) ప్రవేశింపజేసి దోష - అరిషట్ వర్గమయము చేయసాగారు. ఆత్మ భావాలను విధ్వంసము చేయసాగారు. |
| 7. అథ హేమమాసన్యం ప్రాణమ్ ఊచుః :<br>"త్వం న ఉద్గాయ" – ఇతి<br>"తథా"। ఇతి। తేభ్యః ఏష ప్రాణ ఉదగాయత్తే<br>విదురనేన (విదుః అనేన) ఉద్గాత్రాతి।<br>ఏషు అన్తీ ఇతి తమ్ అభిద్రుత్య<br>పాప్మన అవిధ్యన్। | అప్పుడు దేవతలు ముఖ్య ప్రాణ దేవతను సమీపించి "ఓ ముఖ్య ప్రాణేశ్వరా! మీరు మా కొరకై (ఆత్మతాత్త్వికమైన) ఉద్గాతీయ గానమును, ఉద్గీయకర్మను నిర్వర్తించండి" - అని కోరారు.<br>ముఖ్యప్రాణేశ్వరుడు అందుకు అంగీకరించారు.<br>ఇది తెలిసి ముఖ్య ప్రాణము యొక్క ఉద్గానమునందు 'పాపము' (దోషము) ప్రవేశింపజేయటానికి, ఆత్మ భావాలను విధ్వంసం చేయటానికి అసురులు ప్రయత్నం చేయసాగారు. |
| స యథాశ్మాన మృత్వా లోష్టో విధ్వగ్ం<br>సేతైవగ్ం (సా ఏతైవగ్ం) హైవ విధ్వగ్ం<br>సమానా విష్వంచో, వినేశుః।<br>తతో దేవా అభవన్ పరాసురాః<br>భవతి। ఆత్మనా పర అస్య ద్విషన్<br>పాప్మా భ్రాతృవ్యో। భవతే,<br>య ఏవం వేద। ॥7॥ | అయితే బండరాయిని మట్టిపెళ్ళతో కొట్టినప్పుడు బండరాయికి ఏమీ కాకుండా, మట్టిపెళ్ళయే విధ్వంసమై ముక్కలు అవుతుంది కదా। ఆ ఆసురులు నశించసాగారు. అప్పుడు దేహమునందలి ఇంద్రియములన్నీ దేవత్వము (దివ్యత్వము) సంతరించుకోసాగాయి. అసురులు పరాజయం పొందారు.<br>ఈవిధంగా ఎరిగి ప్రాణయోగము, అగ్ని - యజ్ఞము చేయువాడు దేహాభిమానము విడచి ప్రజాపతిత్వము పొందుచున్నాడు. పూర్ణఫలమును సిద్ధింపజేసు కుంటున్నాడు. |
| 8. తే హ ఊచుః : క్వను సో అభూద్యో<br>న ఇత్థమ్ అసక్తేత అయమ్ ఆస్యే<br>అన్తరితి సో అయాస్య ఆంగిరసో<br>అంగానాగ్ం హి రసః ॥8॥ | అప్పుడు దేవతలు "ఇంద్రియముల అనుభవములకు (విషయములకు) దివ్యత్వము సిద్ధింపజేసిన ముఖ్యప్రాణము యొక్క శరీరములోని స్థానమేది?" అని వెతికి, కనిపెట్టి ముఖముయొక్క మధ్యగా ముఖ్య ప్రాణేశ్వరుని దర్శించి ధన్యులైనారు. అందుచేతనే ముఖ్య ప్రాణమును "అయాస్యము" అని పిలుస్తున్నారు. సర్వ అవయవములలో శ్రేష్ఠము కాబట్టి "అఙ్గీరసము" (దేహావయవములలో సారభూతమైనది) అని కూడా అంటున్నారు. |
| 9. సా వా ఏషా దేవతా<br>'దూర్' నామ దూరగ్ం హి యస్యా (అస్యా)<br>మృత్యుః దూరగ్ం హ వా<br>అస్మాత్ న మృత్యుః భవతి,<br>– య ఏవం వేద ॥9॥ | అట్టి ముఖ్య ప్రాణ దేవతకు 'దూర్' అనే మరో పేరు.<br>ఎందుకంటే మార్పు - చేర్పుల రూపమగు మృత్యువు ప్రాణాభిమాన దేవతను సమీపించజాలదు కాబట్టి।<br>ఈవిధంగా "ప్రాణమును మృత్యువు భక్షించజాలదు" - అని తెలుసుకొని ఉన్నవానికి మృత్యువు దూరంగా ఉండగలదు. |

| | |
|---|---|
| **10. సా వా ఏషా దేవ తైతాసాం<br>దేవతానాం పాప్మానం మృత్యుం<br>అపహత్య యత్ర అసాం<br>దిశాం అన్తః తత్ గమయాన్।** | ఈ విధంగా ప్రాణదేవతోపాసన (ప్రాణాయామాభ్యాసము) సమస్త ఇంద్రియాభిమాన దేవతల విషయ సంబంధమైన పాపములను (దోషములను) తొలగించివేస్తున్నది. దిక్కులను దాటించివేస్తోంది. తూర్పు మొదలైన 'దిక్ భేదములు లేనిచోటికి దోషమును, పాపమును నెట్టివేయుచున్నది. |
| **చకార తదాసాం పాప్మనో విన్యత్ అధాత్<br>తస్మాత్ న జనమి యాత్ న అన్తమి యాన్నేత్<br>పాప్మానం మృత్యుం అన్వవాయాని ఇతి ॥10॥** | కనుకనే ప్రాణోపాసకుని మృత్యుసంబంధమైన (రాగ-ద్వేష-క్రోధ-మోహ ఇత్యాది) దోషములు, పాపములు సమీపించలేవు. సమీపించబోతే కూడా అవన్నీ నశించిపోగలవు.<br>ప్రాణోపాసనచే సమస్త సంసార దోషములు శమించగలవు. జనన మరణ దోషములు లేని స్థానమును ప్రాణోపాసకుడు స్వాభావికంగా సిద్ధించుకోగలడు. |
| **11. సా వా ఏషా దేవతై తాసాం దేవతానాం<br>పాప్మానం మృత్యుం అపహత్య<br>అథా ఏనా మృత్యుం అత్యవహత్॥ 11॥** | ఆ ప్రాణ దేవతయే మిగిలిన దేవతలందరిని పాపరూపమగు మృత్యువును దాటించివేసి వారికి "అమృతత్వము" ప్రసాదించుచున్నది. శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ అధిష్ఠాన దేవతల దోషములను తొలగించి తనయందు ఏకము చేసుకొనుచున్నది. |
| **12. స వై వాచమ్ ఏవ ప్రథమామ్<br>అత్యవహత్సా యదా మృత్యుమ్ అత్య ముచ్యత,<br>సో అగ్నిః అభవత్। సో అయమ్<br>అగ్నిః పరేణ, మృత్యుమ్ అతిక్రాన్తో దీప్యతే॥** | అట్టి ముఖ్య ప్రాణాభిమాన దేవత "వాక్కు"ను మృత్యు పరిధిని దాటివేయింప జేస్తోంది. మృత్యువుని అధిగమించిన వాక్కు 'అగ్ని' తేజో రూపము సంతరించుకోగలదు. అప్పుడు ఆ వాక్కు 'మృత్యు' రహితమై (మృత్యువుచే పరిమితము కానిదై) తన నిజస్వరూపమైన అగ్నిగా ప్రకాశించసాగుతోంది. |
| **13. అథ ప్రాణమ్ అత్యవహత్<br>స యదా మృత్యుమ్ అత్యముచ్యత<br>స వాయుః అభవత,<br>సో అయం వాయుః పరేణ<br>మృత్యుమ్ అతిక్రాన్తః పవతే॥** | ప్రాణవాయువు (పీల్చుగాలి) కూడా 'ప్రాణోపాసన' యొక్క మహత్యముచేత మృత్యుబంధముల నుండి విముక్తి పొంది తన నిజరూపమగు '**వాయువు**'గా ప్రకాశించసాగింది.<br>(అత్యవహత్ - అతిక్రమించటము). |
| **14. అథ చక్షుః అత్యవహత్ తత్ యదా<br>మృత్యుమ్ అత్యముచ్యత, స ఆదిత్యో అభవత్।<br>సో ఆసావాదిత్యః పరేణ మృత్యుమ్<br>అతిక్రాన్తః తపతి॥** | చక్షువు (కంటిదృష్టి) కూడా ప్రాణోపాసన యొక్క ప్రభావముచేత మృత్యు పరిమితులను అధిగమించివేసి అసావాదిత్యుని (సూర్యుని) రూపము దాల్చుచున్నది. **ఆవిధంగా చూపు మృత్యువుచే బంధింపజాలకుండా ఉండ సాగింది.** |
| **అథ శ్రోత్రం అత్యవహత్।<br>తత్ యదా మృత్యుమ్ అత్యముచ్యత<br>తా దిశో అభవగ్ం।<br>తా ఇమా దిశః పరేణ మృత్యుమ్ అతిక్రాన్తాః॥** | శ్రవణ దేవత (వినికిడి) - కూడా ప్రాణోపాసనచే - రాక్షస చర్యలవలన కలిగిన పాపదోషములనుండి పునీతము అయింది. మృత్యుబంధములను త్రెంచుకొని, దిక్ దేవతా స్వరూపము సంతరించుకొని ప్రకాశమానము కాసాగింది. శ్రవణదేవత దిక్కులను దాటి మృత్యువును అతిక్రమించివేసింది. |
| **16. అథ మనో అతి అవహత్<br>తత్ యదా మృత్యుమ్ అత్యముచ్యత,<br>స చన్ద్రమా అభ్యవత్।<br>సో అసౌ చంద్రః పరేణ మృత్యుమ్<br>అతిక్రాన్తో భాతి,** | ఆ తరువాత మనస్సు కూడా ప్రాణాధి దేవతయొక్క పాలన (ప్రాణోపాసన)ను ఆశ్రయించటం చేత దుష్ట - ఆలోచనలు - అనబడే) అపమృత్యు శృంఖలములను త్రెంచివేసుకోసాగింది. మృత్యు స్వరూపము నుండి విడివడి చంద్రస్వరూపము సంతరించుకోసాగింది. మృత్యువునకు ఆహారము (భోజనము) కాకయే తత్త్వచింతనలచే ప్రకాశించసాగింది. |

| | |
|---|---|
| ఏవగ్ం హ వా ఏనమ్ ఏషా<br>**దేవతా మృత్యుమ్ అతివహతి**<br>య ఏవం వేద॥ | ఈవిధంగా "ప్రాణశక్తి (ప్రాణోపాసనావిధులపూర్వకంగా) సమస్త ఇంద్రియములను మృత్యు పరిధులనుండి దాటించివేయగలదు". ఇది తెలుసుకొని, **ప్రాణోపాసన చేయువాడు ప్రాణదేవతచే మృత్యువు నుండి రక్షింపబడగలడు.**<br>[అమృతత్త్వము కొరకై - వాక్కు, ఘ్రాణము (వాసన), చక్షువులు (కాళ్లు), శ్రోతము (చెవులు), మనస్సు వీటియొక్కఅధిదేవతా రూపములను క్రమంగా ("అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, చంద్రుడు") - లను గ్రహించి ఉపాసించెదరు గాక]. |
| **17. అథ ఆత్మనే అన్నాద్యమ్**<br>**అగాయత్ (హి) యద్ధి**<br>**కించాన్న మద్యతే**<br>**అనేనైవ తదద్యత ఇహ ప్రతితిష్ఠతి॥** | అప్పుడిక ప్రాణాభిమానదేవత తనయొక్క అన్నాద్యము (భక్ష్యార్థము) (To get entitled to consume / enjoy externally) ఉద్గీథగానము చేయసాగింది.<br>**నోరు అన్నము (ఆహారము) భక్షిస్తూ ఉన్నప్పటికీ, అదంతా కూడా "ప్రాణము" చేత తనకొరకే భక్షించబడుచున్నదగుచున్నది.**<br>అన్నాద్యమే (ఆహార సంబంధమైన క్రియా భావనయే) భౌతికశరీరముగా పరిణమిస్తోంది. అట్టి అన్నాద్యము (భక్ష్యసంకల్పము) నుండియే శరీర రూపము. అన్నమును కొరకు ప్రాణదేవత గానము చేయసాగింది. |
| **18. తే దేవా అబ్రువన్ ఏతావద్వా**<br>**ఇదగ్ం సర్వం యత్ అన్నం,**<br>**తత్ ఆత్మన ఆగాసీరను**<br>**నో అస్మిన్ (న) అన్న ఆభజస్వేతి**<br>**తే వై మా అభిసంవిశతేతి।**<br>**తథేతి తగ్ం సమన్తం పరిణ్య విశన్త।**<br>**తస్మాత్ యత్ అనేన అన్నమ్**<br>**అత్తి తేనైతాః తృప్యన్తి।** | ఆవిధంగా ప్రాణాభిమానదేవత 'అన్నము' గురించి గానము చేస్తూ ఉండగా, (వాక్కు, ఘ్రాణము, చూపు, వినికిడి, స్పర్శ, మనస్సు - మొదలైన) శరీరములో ప్రకాశించబోతున్న అభిమాన దేవతలు - ఇట్లా పలికారు.<br>**మనస్సు, ఇంద్రియ విషయ అభిమాన దేవతలు :**<br>ఓ ప్రాణదేవా! మీరు గొప్పగా ఉద్గీథగానము చేసి రాక్షస ప్రవృత్తి కల్పనలను స్వవశం చేసుకున్నారు కదా. అన్నాదులై మీరు మమ్ములనుకూడా మీ అన్నము (అనుభవము) విభాగములందు చేర్చుకోండి.<br>**ప్రాణదేవత** : ఓ ఇంద్రియ మనో అభిమాన దేవతలారా! మీరు కూడా 'అన్నము' (Something to experience) కోరుచున్నారు కదా! మంచిది మీరు నాయందు అంతటా అభిముఖులై ప్రవేశించండి.<br>అప్పుడు ఆ ఇంద్రియ దేవతలు ప్రాణము పొందుచున్న అన్నమును తాము పొందుచున్నవారై, **ప్రాణమునందు స్థితి కలిగి ఉండసాగారు. ప్రాణాగ్నిచేత తృప్తి పొందసాగారు.** |
| ఏవగ్ం హ వా, ఏనగ్ం స్వా **అభిసంవిశన్తి**<br>**భర్తా స్వానాగ్ం, శ్రేష్ఠః**<br>**పుర ఏతా భవతి,**<br>**యత్ అన్నాదో అధిపతిః**<br>య ఏవం వేద॥ | ఈవిధంగా ప్రాణముయొక్క ఇంద్రియ మనో - అన్న తృప్త చమత్కారమును ఎవరు తెలుసుకుంటారో, వారి స్వజనులు, సంబంధితులు కూడా 'తృప్తి' పొందినవారగుచున్నారు. ఆతడు సమస్తము భరించువాడు అగుచున్నాడు. శ్రేష్ఠుడగుచున్నాడు. అన్నాదములకు (అనుభవ ప్రసాదకులకు) అధిపతి అగుచున్నాడు.<br>అన్నిటికీ ముందు నడుచువాడు, వ్యాధి లేనివాడు, పరిపాలకుడు అగుచున్నాడు, భరించవలసినవారలను భరించువాడగుచున్నాడు. |
| య ఉ హైవం విదగ్ం<br>**స్వేషు ప్రతిప్రతిః బుభూషతి।**<br>**న హైవ అలం భార్యేభ్యో భవతి।** | ఇంద్రియములను ప్రాణశక్తి యొక్క అంశాత్మకంగా ఎరుగువారు ప్రాణ - అన్న - ఇంద్రియ అన్నాద ప్రతిపత్తి (నేర్పు)చే అలంకరించబడువారు అగుదురు. సహజనుల బరువు మోయగలుగువారగుదురు. |

| | |
|---|---|
| **అథ య ఏవై తమ్ అనుభవతి।**<br>**(ఏవై తమనుభవతి)**<br>**యో వైతమ్ అనుభార్యాన్ బుభూషతి**<br>**స హైవ అలం భార్యేభ్యో భవతి॥** | తదితరులు కూడా - ఆతనిని అనుసరించువారు (తమనుభవతి) అవగలరు. అట్టివారికి తత్ పరమాత్మ అనుభవమవగలదు. సహజీవులకు అనుభార్యుడు (భరింప తగినవాడు) అయి అలంకారమవగలడు. భరించవలసినవారికి భరింప సామర్థ్యుడు అగుచున్నాడు. |
| **19.** **సో అయాస్య ఆంగిరసో**<br>**అంగానాగ్ం హి రసః।** | సర్వాంగములలో ప్రాణము రసస్వరూపమై ఉంటున్నది కనుక ప్రాణమునే **"అంగిరసము"** అని పిలుస్తున్నారు. |
| **ప్రాణో వా అంగానాగ్ం రసః।**<br>**ప్రాణో హి వా అంగానాగ్ం రసః।** | ప్రాణమే అంగములన్నిటికీ రసము. అంగములో? ప్రాణరసస్వరూపములే. **అన్ని అవయవముల రసస్వరూపము ప్రాణమే।** |
| **తస్మాత్ యస్మాత్, కస్మాత్ చ, అంగాత్**<br>**[ (తత్) కస్మాచ్చాఙ్గాత్ ]**<br>**ప్రాణ ఉత్క్రామతి తదేవ తత్ శుష్యతి**<br>**ఏష హి వా అంగానాగ్ం రసః।** | ఏ అవయవము నుండి ప్రాణశక్తి ఉపశమిస్తుందో (gets withdrawn subsided), ఆ అంగము నిస్తేజమై ఎండిపోతోంది. శోషిస్తోంది. అనగా సమస్త అంగములలోని ముఖ్యాంగమే ప్రాణరసము.<br><br>ప్రాణశక్తియొక్క ప్రదర్శనా విశేషములే పంచేంద్రియములు. |
| **20.** **ఏష ఉ ఏవ బృహస్పతిః**<br>**వాగ్వై బృహతీ**<br>**తస్యా ఏష పతిః తస్మాదు**<br>**(తస్మాత్ ఉ) బృహస్పతిః॥** | అట్టి ప్రాణతత్త్వమే బృహస్పతి అయి ఉన్నది. ఋగ్వేదములలో ఋక్కులుగా విస్తరించి ఉన్నది. ఋక్కులలోని వాక్కు - **బృహతీ ఛందస్సు.** అట్టి బృహతీ ఛందోరూపమైనట్టి ఋగ్వేదమునకు గూడార్థ రూపంగా **ప్రాణేశ్వరుడే ప్రభువు.**<br><br>**ఏషపతిః** - బృహత్ - 'బృహస్పతిః'। - **ప్రాణేశ్వరుడే బృహస్పతి.** |
| **21.** **ఏష ఉ ఏవ బ్రహ్మణస్పతిః।**<br>**వాగ్వై బ్రహ్మ (యజుః) తస్యా**<br>**ఏష పతిః తస్మాదు బ్రహ్మణస్పతిః।** | అట్టి ప్రాణమే 'వాక్కు' రూపమైన యజుర్వేదమునకు అధిపతి. **బ్రహ్మణస్పతియే ప్రాణము. బ్రహ్మమే ప్రాణపతి.** కాబట్టి ప్రాణమే 'బ్రహ్మణస్పతి' అని కూడా చెప్పబడుచున్నది. |
| **22.** **ఏష ఉ ఏవ సామ వాగ్వై**<br>**సామ ఏష సా చ అమశ్చేతి**<br>**తత్ సామ్నః సామత్వమ్।** | అట్టి ప్రాణమే సామవేదములోని 'సామము'. 'సా+అమ'ల కలయిక - సామము. ప్రాణమే సామ (సరిగమ) యొక్క సమరసత్వము.<br><br>(జీవాత్మ-పరమాత్మల సమరసత్వమే 'సామ' - శబ్దార్థము) |
| **యద్వేవ సమః ప్లుషిణా**<br>**సమో మశకేన। సమో నాగేన।**<br>**సమ ఏభిః త్రిభిః లోకైః।**<br>**సమో అనేన సర్వేణ**<br>**తస్మాద్వేవ సామా అశ్నుతే।**<br>**సామ్నః సాయుజ్యగ్ం స లోకతాం జయతి**<br>**య ఏవమ్ ఏతత్ "సామవేద"।** | అట్టి ప్రాణమే ప్లుషికము (మధుపము, తేనెటీగ) యందు, మశకము (దోమ) యందు పాముయందు, త్రిలోక సమస్త జీవులయందు, సమస్తము నందు - సమస్వరూపమై **'సామ'** అని - అనిపించుకొంటోంది.<br><br>ప్రాణముయొక్క సమస్త సమత్వమును సామవేదసారముగా ఎరిగినవాడు సాయుజ్యరూపమగు సమస్త లోకజయము సిద్ధించుకోగలడు. ప్రాణముయొక్క ఇంద్రియ, మనో, అన్యజీవ ప్రాణ-సమత్వము ఎరుగుటయే సామవేదము (వేదము =ఎరుగుట, ఎరుగబడునది). **(సమం సర్వేషు భూతేషు ఇతి సామ.)** |
| **23.** **ఏష ఉ వా ఉద్గీథః**<br>**ప్రాణో వా ఉత్-ప్రాణేన**<br>**హీదగ్ం సర్వముత్తబ్ధం**<br>**వాగేవ గీథోచ్చ గీథాచేతి స "ఉద్గీథః"॥** | ప్రాణమే **ఉద్గీథము.** ప్రాణమే వాక్ సముదాయము.<br><br>ప్రాణమే → ఉత్. ఎందుకంటే సమస్తము ప్రాణముచేతనే ధరించ బడుతోంది కాబట్టి. వాక్కే → గీథము<br><br>ఉత్ (ప్రాణము) గీథముతో (వాక్కుతో) కూడి ఉద్గీథము అగుచున్నది. |

| | |
|---|---|
| **24. తద్ధాపి బ్రహ్మదత్తః**<br>**చైకితానేయో రాజానం**<br>**భక్షయన్ను, వాచాయంతి।**<br>**అస్య రాజా మూర్ధానం విపాతయత్।**<br>**ఆద్యదితో అయాస్యా**<br>**అంగిరసో అన్యేన ఉదగాయతి।**<br>**ఇతి వాచా చ హి ఏవ**<br>**సప్రాణేన చ "ఉదగాయత" ఇతి।** | **<u>దీని గురించి ఒక సంఘటన</u>**<br>చికితానుడు అనే విద్వాంసుని కుమారుడు - చైకితాన బ్రహ్మదత్తుడు అనే రాజు. ఆయన **"సోమరసము భుజిస్తూ ఉద్గానము చేస్తున్నప్పుడు ఆయాస్యము (ఉద్గాతృస్వరూపమును ఉపాసనా కర్మభావనగా ఉపాసించటము) (2) వాక్కు (3) ప్రాణము** - ఈ త్రిచైతన్యములను పరస్పరముఅన్యముగా భావించి ఉద్గానము చేస్తే సోమరాజు (ఆ యజ్ఞకర్త) తల తెగి వ్యష్టి ప్రాణము సప్రాణములో కలిసిపోగలదు" - అని సిద్ధాంతీకరించారు. **(ఆ ముగ్గురు దేవతల రూపము స్వస్వరూప ప్రదర్శనగా భావిస్తూ ఉద్గానము చేయాలి- - అని భావన, బోధ).** |
| **25. తస్య హి ఏతస్య సామ్నో**<br>**యః స్వం వేద భవతి హ అస్య**<br>**(హాస్య) స్వం తస్య వై స్వర ఏవ స్వం**<br>**తస్మాత్ ఆర్త్విజ్యం కరిష్యన్**<br>**వాచి స్వరమ్ ఇచ్ఛేత।** | మనము పైన చెప్పుకున్నట్లుగా - "సామ (వేదము)"ను సా + అమ; ప్రాణమే సామము. వాక్కు అమ (స్వరము). సామ = సమరసత్వము. ఇట్టి సామ (శబ్దవాచ్యమైన ప్రాణము) ఎవడు తెలుసుకుంటాడో అట్టివాడు సుస్పష్టముగా, నిర్దుష్టముగా ఆత్మను ఎరుగుచున్నాడు. ప్రాణమే 'స్వం' ప్రసిద్ధమౌతోంది. 'స్వం' యే స్వరము. ప్రాణమునకు స్వరమే భూషణము, త్రాణ కూడా. |
| **తయా వాచా స్వర సంపన్నః**<br>**యా (ఆ)ర్త్విజ్యం కుర్యాత్।**<br>**తస్మాత్ యజ్ఞే స్వరవన్తం దిదృక్షన్త ఏవ।**<br>**అథో యస్య స్వం భవతి।** | ఋత్విజుడు ఈ విషయము ఎరిగియే ఆర్త్విజ్యము (ఋత్విజ క్రియలను) నిర్వర్తించునుగాక.<br>అందుచేత ప్రాణమే 'సామ'గా ఎరిగిన ఋత్విజుని **ఆర్త్విజ్యము సుస్వరవంతము**, సువర్ణము (యజ్ఞపురుషునకు సాలంకారము) అగుచున్నది. |
| **(భవతి) హాస్య స్వం య ఏవమ్ ఏతత్**<br>**'సామ్నః' స్వం వేద।** | **"సామ్న, స్వర, స్వ, ప్రాణ"** - తత్త్వముల ఏకత్వమును ఎరిగి ఉద్గీథగానము చేయుటచే - స్వస్వరూప స్థానము" **స్వాభావికమై సిద్ధించగలదు.** |
| **26. తస్య హైతస్య సామ్నో**<br>**యః సువర్ణం వేద భవతి,**<br>**హాస్య సువర్ణం।**<br>**తస్య వై స్వర ఏవ సువర్ణం భవతి।** | "సామ్న" శబ్ద కావ్యముయొక్క సువర్ణత్వము (ప్రాణాభరణత్వము) ఎరిగినవాడు సువర్ణుడు అగుచున్నాడు. ఆతనిపట్ల (ఉద్గాత పట్ల) స్వరము సువర్ణమై ప్రకాసించగలదు. |
| **హాస్య సువర్ణం య ఏవమేతత్**<br>**'సామ్న సువర్ణం' వేద।** | సామ్న సువర్ణము ఎరిగినవాడు 'సువర్ణుడు' అగుచున్నాడు. ఈ జగత్తంతా ఆతనికి స్వీయ - ఆభరణము వంటిదిగా అగుచున్నది. |
| **27. తస్య హైతస్య సామ్నోయః**<br>**ప్రతిష్ఠాం వేద ప్రతి హ తిష్ఠతి ।** | అట్టి సామ్నోయ ప్రతిష్ఠ ఎరిగినవాడు స్వరస్థానములను ప్రాణస్థానములను [ <u>(1) వక్షస్థలము, (2) కంఠము, (3) శిరస్సు, (4) జిహ్వా మూలము,</u> (కొండనాలుక మూలస్థానము), <u>(5) దంతములు, (6) ముక్కు, (7) పెదవులు, (8) దవడలు</u> - ఈ ఎనిమిది స్థానములను] వాక్ స్థానములుగా గుర్తించి, సవినియోగపరచుకుంటున్నాడు. |
| **తస్య వై వాగేవ ప్రతిష్ఠా।**<br>**వాచి హి ఖల్వేష।**<br>**ఏతత్ ప్రాణః ప్రతిష్ఠితో**<br>**గీయతే 'అన్న' ఇత్యుహైక ఆహుః॥** | ప్రాణము వాక్కు నందు సర్వదా సుప్రతిష్ఠితము. వాక్కు స్వయముగా ప్రాణస్వరూపమే. ఈ విధంగా ప్రాణ ప్రతిష్ఠను గానము చేయువాడు - అన్నము (అనుభవమగుచున్న సమస్తము)తో సహా ఆత్మ యొక్క ఏకత్వము, అఖండత్వము దర్శించగలడు. |

| | |
|---|---|
| 28. అథాతః "పవమానానామ్" ఏవ అభ్యారోహః। స వై ఖలు ప్రస్తోతా 'సామ', ప్రస్తౌతి। | ఇప్పుడు ఇక మనము **"పవమానము"** అనే మంత్రముయొక్క గానం చేసే రీతి గురించి చెప్పుకుంటున్నాము. **'సామ'** అనబడే ఆత్మగానము (ప్రస్తౌతి) చేయువాడు **"ప్రస్తోత"** |
| 'స యత్ర ప్రస్తుయాత్' – | ప్రాణమును ప్రస్థతించువాడు (ప్రాణోపాసన చేయువాడు) - **ఆత్మతత్త్వమును జపించువాడే అగుచున్నాడు.** ప్రస్తోత ప్రస్తుతి చేయు మంత్రముల పరమార్థము ప్రాణమే. (ప్రాణోపాసనయే సామోపాసన). |
| తత్ ఏతాని జపేత్। "అసతో మా సద్గమయ"। (సత్ గమయ) "తమసో మా జ్యోతిర్గమయ"। (జోతీః గమయ) "మృత్యోర్మా అమృతం గమయ।" (అమృతం గమయ)। ఇతి॥ | **జప మంత్రములు**<br>(1) **"అసతోమా సద్గమయ"**<br>(2) **"తమసోమా జ్యోతిర్గమయ"**<br>(3) **"మృత్యోర్మా అమృతంగమయ"**<br>[ ఓ పరమాత్మా! మమ్ములను<br>- అసత్తు నుండి (లేని దాని నుండి) సత్తుకు (ఉన్నదానికి) జేర్చండి.<br>- చీకటి (ignorance) నుండి వెలుతురుకు తీసుకుండి.<br>- "మార్పు" అను స్వభావముగల "మృత్యువు" నుండి (ఈవలికి తెచ్చి) అమృతస్థానమును ప్రసాదించండి.] |
| స యదా హా సతో మా సద్గమయేతి। | **అది ఎట్లా అంటే...,**<br>సత్తు సత్తుగానే సిద్ధించినదగు గాక।<br>అసత్తు (స్వతఃగా లేనిది, కల్పనచే ఉన్నట్లుగా అనిపించేది) - కల్పనగానే తెలియవచ్చును గాక। |
| **మృత్యుర్వా అసత్। – సత్ అమృతం।** | అసత్తు యే → మృత్యువు.<br>సత్తు యే → అమృతము. |
| మృత్యోః మా మృతం। గమయ – అమృతం। మా కుర్విత ఏవై – తదాహ। | మృత్యువు అమృతమయమయమగు గాక। అమృతత్వమును మేము స్వానుభవము చేసుకొనెదముగాక। (మారే తరంగములను మారని జలము యొక్క ప్రదర్శనముగా ఎరిగి ఉండటమువలె).<br>మృతమును అధిగమించి, అమృతము దర్శించెదము గాక। అమృతమును ఏమరచి మృతమునకు బద్ధులము కాకుండెదము గాక. |
| తమసో మా జ్యోతిర్గమయేతి :- మృత్యుర్వై తమో। జ్యోతిః అమృతం। | "మాయొక్క అంధకారము జ్యోతిర్మయము చేయండి"।<br>- మృత్యువే - తమస్సు (చీకటి)<br>- జ్యోతియే - అమృతము. |
| మృత్యోః మా అమృతంగమయ – అమృతం మా కురు ఇత్యేవై తదాహ। మృత్యోః మా అమృతం గమయేతి న అత్ర తిరోహితమివ అస్తి। | **"మృత్యువును అమృతరూపముగా తీర్చిదిద్దండి"** - అని నివేదిస్తున్నప్పుడు - మృత్యువును అమృతప్రాయంగా చేయమంటున్నాము. (మృత్యువుకు ఆవల ఏమాత్రము మార్పు చెందని స్వస్వరూపము ఆశ్రయించి ఉండెదము గాక।) మార్పులేని నేనే నాకు సర్వదా (ఈ సమస్తమునేనై) విషయమగు చుందునుగాక।<br>"చీకటిని తొలగించి వెలుతురు ప్రసాదించండి" - అన్నప్పుడు చీకటిని తీసిపారేయండి- అని అర్థం కాదు. వెలుతురు ఉన్నచోట చీకటి ఉండదు. అది తిరోహితము (చ్యుతి) లేని స్థానము. |

| | |
|---|---|
| | అమృతత్వము అనగా మార్పు - చేర్పులను తొలగించమని కాదు. అమృతత్వము సిద్ధిస్తే , అప్పుడు మృత్యువు కూడా అమృతప్రాయమే అవుతుంది. **సమస్తము సర్వదా అమృతస్వరూపమే అయి ఉన్నది.** |
| **అథ యాని ఇతరాణి స్తోత్రాణి**<br>**తేషు ఆత్మనే అన్నాది అమాగాయేత్।** | ఇక తదితర స్తుతులన్నీ కూడా - **అన్నమును** (అనుభవముగా అగుచున్న సమస్తమును) - **ఆత్మకు అనన్యముగా (ఆత్మమాధుర్యంగా)** గానము **చేయుచున్నాము.** |
| **తస్మాత్ ఉ తేషు వరం వృణీత**<br>**యం కామం కామయేత,**<br>**తగ్ం స ఏష ఏవం విదుః**<br>**ఉద్గాతాత్మనే వా యజమానాయ।** | ఉద్గాత **"అసతోమా సద్గమయ। తమసోమా జ్యోతిర్గమయ। మృత్యోర్మా అమృతంగమయ"** - అను త్రిమంత్రముల అర్థమునే తదితర తరువాతి మంత్రములకు అర్ధముగా - యజమాని కొరకై ఉద్గీథము చేస్తున్నదెందుకు? యజమాని యొక్క ఆత్యంతికమైన 'ఇష్టము' అగు ఆత్మానుభూతికై సంసిద్ధపరచటం కొరకే! |
| **వాయం కామం కామయతే**<br>**తమ్ ఆగాయతి।** | ఆ సందర్భములో - యజమాని కూడా తాను అజ్ఞానము నుండి ఆత్మానందస్థానమును గానము చేస్తూ మననము చేయాలి. |
| **తద్ధైతత్ (తత్ హి ఏతత్)**<br>**లోకజిదేవ న హైవ**<br>**అలోక్యతాయా ఆశాఽ స్తి।**<br>**య ఏవం ఏతత్ సామవేద॥** | అట్టి సామగానము ఎరిగినవాడు లోక జయమును నిర్వర్తించి లౌకికమైన ఉపకరణములచే (వస్తుజాలముచే), ఉద్గాత చూపుచున్న మార్గంగా **అలౌకికమగు అఖండ - ఆత్మానంద స్వానుభవ స్థానమును సిద్ధించుకొనగలడు.** |

**ఇతి బృహదారణ్యకోపనిషత్**
**తృతీయాధ్యాయః**
**తృతీయం బ్రాహ్మణమ్।**

**ఇతి బృహదారణ్యకోపనిషత్ - తృతీయాధ్యాయః**
**ఇతి-"ప్రాణానంద స్వరూపసిద్ధి" నామ -**
**తృతీయ బ్రాహ్మణమ్।**

## బృహదారణ్యకోషనిత్‌ తృతీయాధ్యాయః

## చతుర్థ బ్రాహ్మణము

# 4. ఆత్మోపమ్యేవ సర్వత్ర

| | |
|---|---|
| 1. ఓం। ఆత్మైవ ఇదమ్ అగ్ర ఆసీత్‌।<br>పురుషవిధః సో అనువీక్ష్య। | 'ఓం' అను అక్షరమునకు పంజ్ఞార్థమగు (జీవాత్మ-పరమాత్మల సమన్వయార్థమగు) ''ఆత్మ (The Absolute Self)'' యే ఈ దృశ్యవ్యవహారమునకంతటికీ మునుముందుగా ఏర్పడినదై ఉన్నది.<br>అట్టి ప్రప్రథమ కేవల సత్యమగు ఆత్మ నుండి పురుషకారము (Functional Tendency) బయలుదేరింది. |
| న అన్యత్‌ ఆత్మనో అపశ్యత్‌।<br>"సోఽహమ్‌ అస్మి" ఇతి అగ్రే<br>వ్యాహరత్‌। తతో అహన్నామ అభవత్‌॥ | అట్టి పురుషకారముతో కూడిన పురుషుడు తనకు వేరుగా ఏదీ కనిపించక "నాకు అన్యమే కనిపించని నేను ఎవరు?" అని వెతికి పరిశీలించసాగారు. తనకు వేరు ఏదీ ఉండనే లేదు, మరి! |
| తస్మాత్‌ అప్యే తర్హి ఆమంత్రితో<br>'అహమ్‌' అయమితి ఏవ అగ్ర ఉక్త్వా। | అప్పుడు యోచించి "నేనే సృష్టికి కర్తనవగల ప్రజాపతిని కదా!" - అని తనయొక్క పురుషకారమును తానై గమనించసాగారు. |
| అథ అన్యన్‌ నామ ప్రబ్రూతే యదస్య భవతి।<br>స యత్‌ పూర్వో అస్మాత్‌<br>సర్వస్మాత్‌ సర్వాన్‌ పాప్మన ఔషత్‌। | తనకు వేరుగా ఏది తాను కల్పన చేసుకొంటూ ఉన్నారో ఆ కల్పనా వ్యవహారమంతా తనకు అనన్యముగా దర్శించసాగారు. ఆ ప్రజాపతి - **అట్టి తనయొక్క ప్రప్రథమ ప్రజాపతి స్వరూపమును దర్శించువాడు సర్వ పాప దోష దృష్టులను దహించి వేయుచున్నాడు.** |
| తస్మాత్‌ పురుషః ఓషతి<br>హ వై స తం యో<br>అస్మాత్‌ పూర్వో బుభూషతి,<br>య ఏవం వేద॥ | అన్యమును కల్పించువాడే పురుషుడుగాను ప్రజాపతిగాను చెప్పబడు చున్నాడు. కల్పనకు ముందు ఉన్నది ఏకమగు ఆత్మయే.<br>**అట్టి పూర్వ - తత్పూర్వమును ఎరిగినవానికి ఈ సమస్తము తనకు భూషణముగా అగుచున్నది.** (All this tends to be an ornament to him) |
| 2. సో అభిభేత్‌। తస్మాత్‌ ఏకాకీ బిభేతి। | ద్వితీయమును కల్పించుకోవటం ప్రారంభించిన ప్రజాపతి - "అరె! నేను ద్వితీయమును పొందుచున్నానే" అని భయమును పొందసాగారు.<br>అందుచేతనే జీవుడు ఏకాకి అయినప్పుడు భయమును పొందుచున్నాడు. |
| సహోయమ్‌ ఈక్షాన్‌<br>చక్రేయన్‌ "మదన్యత్‌ నాస్తి"<br>కస్మాన్ను బిభేమి? ఇతి।<br>తత ఏవ అస్య భయం వీయాయ<br>కస్మాత్‌ హి అభేష్యత్‌।<br>ద్వితీయాద్వై భయం భవతి। | అయితే "నేను ఏకాకినైనప్పుడు ఇక నాకు ఎవరి వలన ఎందుకు భయము? అద్వితీయుడను కదా!" - అని తలచి భయమును వదిలివేశారు. అందుచేతనే ద్వితీయముచే భయము ఉంటుంది. ఏక భావనచే భయమునకుచోటు ఉండదు.<br>**"సమస్తము నేనే కదా!"** అని ఎరిగినప్పుడు భయమంతా మొదలంట్లా తొలగుతోంది. **ద్వితీయా ద్వై భయం భవతి।** |
| 3. సవై నైవరేమే, తస్మాత్‌ ఏకాకీ న రమతే।<br>స ద్వితీయమ్‌ ఐచ్ఛత్‌। (ద్వితీయమైచ్ఛత్‌)।<br>స హైతావాన్‌ ఆస యథా<br>స్త్రీ-పుమాగ్ంసౌ సంపరిష్వక్తౌ। | అయితే అద్వితీయమగు ఆ ప్రజాపతి ఒంటరి (ఏకాకి)గా ఉన్నప్పుడు 'తృప్తి'గా అనిపించలేదు. అందుచేత రమించటానికై "ద్వితీయము" పట్ల ఇచ్ఛను పొందసాగారు.<br>అప్పుడు ఆ ప్రజాపతి స్త్రీ - పురుష ఇత్యాది ద్వంద్వమును 'అనుభవి' (The Experiencer) గా అయి ధారణ చేయసాగారు. |
| స ఇమమేవ ఆత్మానం<br>ద్వేధాపాతయత్తతః।<br>- పతిశ్చ పత్నీ చ అభవతాం। | అనగా తనను తాను రెండు (జంట) రూపముగా వినోది అయి నిర్మించుకొన్నారు. ఇదియే **మిధునతత్త్వము.**<br>**"సతి-పతి"** (Female-Male) అను ఇద్దరుగా **వ్యక్తీకరణులు అయినారు.** |

| | |
|---|---|
| తస్మాత్ ఇదమ్ అర్థ బృగలమివ<br>'స్వ' ఇతి హ స్మాహ యాజ్ఞవల్క్యః। | ఈ సంఘటనను దృష్టిలోఉంచుకొని యజ్ఞవల్క్యమహర్షి **"కాబట్టే ఈ దేహములు సహము చీల్చిన వెదురుబొంగువలె ఉన్నాయి"** - అని విశ్లేషించారు. (వ్యాఖ్యానించారు) (స్వ-హ+స్మ). |
| తస్మాత్ అయమ్ ఆకాశః<br>స్త్రీయా పూర్యత ఏవ తాగ్ం సమ భవత్।<br>తతో మనుష్యా అజాయన్త। | అందుచేతనే పురుషునియందు గల అర్ధభాగము స్త్రీచే పూరించబడినదై 'అర్ధనారీశ్వరము' గా వర్ణించబడుతోంది. స్త్రీలో అర్ధభాగము పురుషుడు కూడా. చిదాకాశము 'ఏకమే' అయి ఉండి, ద్వంద్వమును క్రీడాగా స్వీకరించింది.<br>అట్టి స్త్రీ - పురుషులిద్దరి కలయికచే మనుష్యులు జన్మించసాగారు. |
| 4. సో హేయమ్ ఈక్షాన్ చక్రే<br>కథం ను మాత్మన ఏవ జనయిత్వా సంభవతి,<br>హన్త తిరో అసానీతి సా గౌరభవత్ ఋషభ<br>ఇతరస్తాగ్ం సమేవా భవతి।<br>తతో గావో అజాయన్త బడ బేతరా భవత్।। | అప్పుడు స్త్రీ విభాగము ప్రజాపతి గురించి "ఈ ప్రజాపతి తన నుండియే నన్ను పుట్టించి నాతో భోగించుచున్నారేమి?'' - అని తలంచింది. తిరోధానము (అంతర్ధానము) అయి గోవు (ఆవు) (Cow) రూపము దాల్చింది. అప్పుడు పురుషుడు ఎద్దు (Ox) రూపము దాల్చి భోగించసాగాడు. అప్పుడు గోజాతి పుట్టుకొచ్చింది. |
| అశ్వ వృష ఇతరో<br>గర్దభీతరా గర్ధభ<br>ఇతరస్తాగ్ం। | ఆ ఆవు ఆడు గుఱ్ఱము కాగా, పురుషుడు మగ గుఱ్ఱమై సంభోగించసాగారు. ఈవిధంగా గుఱ్ఱము, గాడిద, మేక జాతి జనించింది. తదితర జాతులన్నీ ఆ ప్రకారంగానే జనించాయి. |
| సమేవ అభవత్, తత ఏక శఫమ్<br>అజాయతా అజేతరాభవత్।<br>బస్త ఇతరో అవిః ఇతరామ్<br>ఏష ఇతరస్తాగ్ం సమేవ అభవత్।<br>తతో అజావయో అజాయ న్తైవమేవ<br>(అజాయన్తి ఏవమేవ) యత్ ఇదం కించ<br>మిథునమా పిపీలిక అభ్యస్తః సర్వం అసృజత। | ఆవిధంగా సృష్టిలోంచి పీలికము వరకు సమస్త జీవ - జంతుజాలములన్నీ "మిథునము'' (జంట-పరస్పరము) (Association) చే సృజించబడినాయి. ఒక్కటియే రెండుగా (జంటగా) ప్రదర్శనము కాసాగింది.<br>అట్టి 'జంట' అను సృష్టి కల్పనా సంఘటనయే ఈ సమస్త జీవసృష్టికి ఉత్ప్రేరణ కారణము. (Cause of Inclination). |
| 5. సా అవేత్ అహం వా వ<br>సృష్టిరస్మి అహగ్ం హీదగ్ం।<br>సర్వమ్ అసృక్షీతి – తతః 'సృష్టిః' అభవత్।<br>సృష్ట్యాగ్ం హాస్యై తస్యాం భవతి – య ఏవంవేద।। | అప్పుడు ఆ ప్రజాపతి "ఈ సృష్టిరూపముగా ఉన్నది నేనే। ఇదంతా నేనై ఉండగా, నాకు ఇదంతా అనుభవముగా అగుచున్నది'' - అని వినోదించసాగారు. ఈ విధంగా ప్రజాపతిచే అనన్యముగా కల్పించబడిన ఈ సమస్తము 'సృష్టి' శబ్దముచే చెప్పబడుతోంది. **ఈ రీతిగా తెలుసుకొన్నవాడు తాను కూడా ప్రజాపతివలెనే 'సృష్టికర్త' అవగలడు.** |
| 6. అథేతి అభ్యమన్థత్స ముఖాచ్చ యో నేః<br>హస్తాభ్యాం చ అగ్నిం అసృజత।<br>తస్మాత్ ఏతత్ ఉభయమ్<br>అలోమకమ్ అన్తరతో<br>అలోమకా హి యోనిః అన్తరతః। | ఆ తరువాత ప్రజాపతి సృష్టికి సంబంధించిన మథనమును ఈవిధంగా నిర్వర్తించారు.<br>(ముందుగా) ముఖము అనే యోని నుండి, చేతులనుండి అగ్నిని సృష్టించారు. అందుచేతనే మనిషికి ముఖము, అరచేతులు రెండింటిలో లోపల వెంట్రుకలు లేనివిగా ఉంటున్నాయి. వెచ్చదనం ఏర్పడి ఉంటుంది. |
| తత్ యత్ ఇదమ్ ఆహుః అముం<br>యజాముం యజేతి ఏకైకం దేవమ్ ఏతస్యైవ<br>సా విసృష్టిః ఏష ఉ హి ఏవ సర్వే దేవాః। | యజ్ఞకర్మయందు "యజమాని కొరకై అగ్నిని పూజిస్తున్నాము. ఇంద్రుని పూజిస్తున్నాము'' అను మంత్రములు, యజ్ఞవిధి, అగ్నీంద్రాత్మకము, - ఇవన్నీ ప్రజాపతిని ఉద్దేశించినవే.<br>**దేవతల రూపము ప్రజాపతియే। ప్రజాపతియే సమస్త కర్మ-శబ్దముల ముఖ్యార్థము.**<br>ఒక్కడగు ప్రజాపతియే సమస్త దేవతా స్వరూపుడు. ద్రవమైనదంతా ఆ ప్రజాపతియొక్క రేతస్సు (చిత్త చేతన తేజో) రూపమే. |

| | |
|---|---|
| **అత యత్కించ ఇదమ్ ఆర్ద్రం**<br>**తత్ రేతసో అసృజత।**<br>**తదు సోమ ఏతావద్వా**<br>**ఇదగ్ం సర్వం 'అన్నం' చ ఏవ।**<br>**అన్నాదశ్చ 'సోమ' ఏవ।** | ఆ విధంగా ప్రజాపతిచే సృష్టింపబడిన సమస్తము 'అన్నము' [ అనగా 'అనుభవమగునది' (That being experienced) ] రూపం దాల్చసాగింది. ఈవిధంగా **"అనుభవమయ్యేదంతా బ్రహ్మమునకు అనన్యమే"** (అన్నం బ్రహ్మ) అయి ఉన్నది. ఇదంతా ప్రజాపతియొక్క తేజోరూప రస విలాసమే। రేతసో ప్రదర్శనమే। ఈ సర్వము అన్నమే।<br>అన్నము (ఇంద్రియానుభవ విషయ - వస్తువులు) జనింపజేయువాడు సోమ (చంద్రుడు). |
| **అన్నమ్ అగ్నిః। అన్నాదః**<br>**సైషా బ్రాహ్మణో అతిసృష్టిః।**<br>**యత్ శ్రేయసో దేవా న సృజత।** | - అన్నము, అన్నము భావించువాడు (కల్పించువాడు) ఉభయులు అగ్ని స్వరూపులే।<br>- సృష్టికి ఆవల ఉన్నది బ్రహ్మము.<br>సమస్త దేవతలతో కూడిన విశేష సృష్టి అంతా ప్రజాపతియొక్క భావనా తరంగ చమత్కారమే. |
| **అథ యత్ మర్త్యః సన్**<br>**అమృతా న సృజత।**<br>**తస్మాత్ అతిసృష్టిః।**<br>**అతి సృష్ట్యాగ్ం హాస్యై**<br>**తస్యాం భవతి, య ఏవం వేద॥** | మర్త్యులు (మానవులు) ప్రజాపతికి అనుభవ స్వరూపములగు అన్నము రూపములే. అనగా అమృతమగు, ఆవలగల 'ఆత్మ యొక్క **సంకల్పితానుభవమే మానవులు, తదితర జీవులు కూడా.**<br>ఇదంతా ప్రజాపతియొక్క సృష్టియేనని కల్పనా వ్యవహారమేనని, వాస్తవానికి ఇది ఆత్మ స్వరూపమేనని ఎరిగినవాడు ఆత్మానుభవమును స్వానుభవము, స్వాభావికము చేసుకోగలడు. |
| **7. తత్ హి ఇదం (తద్ధేదం)**<br>**తర్హ్య అవ్యాకృతమ్ ఆసీత్।**<br>**తత్ నామ-రూపాభ్యామ్ ఏవ 'వ్యా' క్రియాత।**<br>**అసౌ నామాయమ్ ఇదగ్ం రూపం ఇతి।** | ఈ సమస్త సృష్టికి మునుముందుగానే 'అవ్యక్తము'గా ఉండి ఉన్నది.<br>అట్టి అవ్యక్తమే వ్యాక్రియ (విస్తరించు శక్తి, స్వభావములచే) నామ రూపాత్మకంగా వ్యక్తం కాసాగుతోంది. అనేక నామ రూపములు పరిఢవిల్లసాగుచున్నాయి.<br>అనగా "దీని నామము ఇది. రూపము ఇది" - అని అనేకంగా వ్యక్తం కాసాగుతోంది. |
| **తదిదం అప్యేతర్హి నామ-రూపాభ్యామ్ ఏవ వ్యాక్రియతే।**<br>**అసౌ నామ్ ఇదగ్ం రూపం ఇతి।**<br>**స ఏష ఇహ ప్రవిష్టః। ఆ నఖాగ్రేభ్యో,**<br>**యథా క్షురః క్షురధానే అవహితః స్యాత్।** | అందువలననే ఇక్కడ సమస్త వస్తువులు "నామము ఇది. రూపము ఇది" అని వ్యావహారిక వ్యాపక - క్రియగా సిద్ధిస్తోంది.<br>సృష్టికర్తయే ఈ సృష్టిలోను, సృష్టిగాను ప్రవిష్టులై (ప్రవేశించిన వారై) ఉన్నారు. ఈ శరీరములో కూడా నఖశిఖపర్యంతము - ఒరయందు కత్తివలె ప్రవేశితులై ఉన్నది సృష్టికర్తయే. ఆయనయొక్క కల్పనా చైతన్యమే। |
| **విశ్వంభరో వార్తా విశ్వంభర కులాయే।**<br>**తత్ న పశ్యన్తి అకృత్స్నో హీ స ప్రాణన్ ఏవ।**<br>**ప్రాణో నామ భవతి।** | ఒరలోనున్న కత్తివలె పరమాత్మ - విశ్వేశ్వరుడు, విశ్వంభరుడు అయి - జగద్వస్తువులన్నిటిలో నిండి ఉన్నారు. అకృత్యులు (అల్పబుద్ధిగలవారు) ఆయనను గమనించకున్నారు. కృతకృత్యులు సర్వదా దర్శిస్తూనే ఉన్నారు. **ప్రాణము ఆయన రూపమే.**<br>ఆయన ప్రాణరూపుడు కాదు. ప్రాణముగా ఆయనయే 'ప్రాణవాయువు యొక్క గమనవ్యాపారము నిర్వర్తించటం చేత 'ప్రాణము' అను పేరు గల వాడు అగుచున్నారు. అంతమాత్రమే। |
| **వదన 'వాక్'। పశ్యగ్ం చక్షుః।**<br>**శృణ్వన్ శ్రోత్రం।**<br>**మన్వానో మనస్తాని**<br>**అస్య ఏతాని 'కర్మ' నామ అన్యేవ।** | వదన్ (పలకటము) అను వ్యాపారముచే 'వాక్కు' రూపుడు. దర్శన క్రియచే చక్షురూపుడు. 'వినటము అనే వ్యాపారముచే శ్రోత్రరూపుడు. మననము చేయు ధర్మముచే మనోరూపుడు. ప్రజాపతియే ఇవన్నీగా ఉండి ఉంటున్నారు.<br>**అట్లాగే సమస్త తదితర కర్మలు ఆ ప్రజాపతికి చెందినవే.** |

| | |
|---|---|
| స యోత ఏకైకం ఉపాస్తే<br>న స వేద అకృత్స్నోహి। | అట్టి ప్రజాపతియొక్క (పరమాత్మయొక్క) **ఒకొక్కక్క అంశను మాత్రమే ఉపాసించువాడు పరమాత్మము సమగ్రముగా ఎరుగనివాడే అగుచున్నాడు.** |
| ఏషో అత ఏకైకేన భవతి<br>'ఆత్మ' ఇత్యేవ ఉపాసీత<br>అత్ర హి ఏతే సర్వ ఏకం భవన్తి।<br>తత్ ఏతత్ పదనీయమస్య సర్వస్య<br>యత్ అయం ఆత్మానేన హి<br>ఏతత్ సర్వం వేద। | "ప్రాణము - నేత్రములతో ఈ జీవుడుగా ఒక్కొక్కటి అగుచూ శ్వాసిస్తున్నాను. (మరొకడుగా అయి) నేను చూస్తున్నాను, వింటున్నాను, తాకుచున్నాను" - అను వేరువేరు ప్రవృత్తులు వేరు వేరు పురుషాకారముగా దృష్టిని కలిగి ఉంటున్నవరకు ఆత్మను సమగ్రంగా ఎరుగలేడు.<br>**వీటన్నిటిలోగల ఏకత్వము గమనించినప్పుడే ఆత్మ ఎరుగబడగలదు.**<br>కనుక "ఈ సమస్తము సర్వదా ఆత్మస్వరూపమే అయి ఉన్నది" అని సర్వేసర్వత్రా ఉపాసించబడుగాక। |
| యథా హ వై పదేన అనువిన్దేత్ ఏవం (అనువిన్దేదేవం)<br>కీర్తిం శ్లోకం విన్దతే, య ఏవం వేద।। | ఈవిధంగా తెలుసుకున్నవాడు నామరూపాత్మకమైనదంతా ఆత్మగా దర్శిస్తూ ఉండగలడు. ఆత్మను సిద్ధించుకొని ఆత్మానందము అనుక్షణికం చేసుకోగలడు. అట్టివాడు ఆత్మనే సర్వదా దర్శిస్తూ కీర్తిస్తూ ఉంటాడు. |
| **8.** తత్ ఏతత్ ప్రేయః।<br>పుత్రాత్ ప్రేయో। విత్తాత్ ప్రేయో।<br>అన్యస్మాత్ సర్వస్మాత్ అన్తరతరం<br>యత్ అయం ఆత్మా స యో । | ప్రతి ఒక్కరికీ కూడా - తమ సంతానము కంటే ధనము కంటే కూడా ఆత్మయే ప్రియాతిప్రియమై ఉన్నది. (Most lovable is ones own "self").<br>ఆత్మయే **శ్రేయము.** తదితర 'పుత్ర-ధన' మొ॥వన్నీ ప్రేయము మాత్రమే. తదితరములైన శ్రేష్ఠమైనవి ఏవేవి కలవో, వాటన్నిటికంటె ఆత్మయే ప్రియమైనది. ఆత్మయే అన్నిటికంటే, అందరికంటే అత్యంత సామీప్యమైనది. |
| అన్యమ్ ఆత్మనః<br>ప్రియం బ్రువాణం బ్రూయాత్ | **"ఆత్మకంటే** అన్యమైనవి ప్రియము **"-** అని చెప్పువారికి ఆత్మజ్ఞాని ఇట్లు చెప్పుచున్నారు. |
| ప్రియగ్ం రోత్స్యతీతి ఈశ్వరో<br>హ తథైవ స్యాత్ ఆత్మానమేవ।<br>ప్రియం, ఉపాసీత, స య ఆత్మానమేవ।<br>ప్రియం ఉపాస్తే న హాస్య (న హ అస్య) ప్రియం ప్రమాయుకం భవతి।। | **"ఆత్మ తప్పితే, తదితరమైనవన్నీ కూడా కాలముతో వచ్చి కాలానుగతంగా నశించేవే కదా? ఈశ్వరుడు ప్రియమా? "ఈశ్వరుడు ఆత్మయే" -** అనబడుతోంది. అందుచేత ఆత్మనే ప్రియముగా ఉపాసించెదరుగాక.<br>ఆత్మ ప్రియముగా కలవాడు ప్రియమును ఎన్నడూ పోగొట్టుకోడు. |
| **9.** తత్ ఆహుః యత్ బ్రహ్మవిద్యయా సర్వం<br>భవిష్యన్తో మనుష్యా మన్యన్తే।<br>కిము..తత్ 'బ్రహ్మ' వై<br>వై(వే)ద్యస్మాత్ తత్ సర్వం అభవత - ఇతి।। | బ్రహ్మవిద్యచే ఈ జీవుడు **"సమస్తము నేనే।** సర్వముగా కనిపించేదంతా నాయొక్క బ్రాహ్మీ స్వరూపమే।" - అని ఎరుగుచున్నాడు.<br>"బ్రహ్మము అనగా ఏమి?" అని ప్రశ్నిస్తే - **"నేను'తో సహా** - ఈ సమస్తము ఏది అయి ఉన్నదో, అదియే బ్రహ్మము" అని సమాధానము. |
| **10.** బ్రహ్మ వా ఇదమ్ అగ్ర ఆసీత్।<br>తత్ ఆత్మానమేవావై(వే)త్ - | ఈ సమస్త అనుభవరూప ప్రపంచమంతా కూడా మొదటగా, ఆ తరువాత కూడా బ్రహ్మమే అయి ఉన్నది. ఈవిషయం ఆత్మజ్ఞానియే స్వానుభవ పూర్వకం తెలుసుకోగలుగు చున్నాడు. ఇదంతా స్వస్వరూపానంద బ్రహ్మమే। |
| "అహం బ్రహ్మాస్మి" - ఇతి।<br>తస్మాత్ సర్వం అభవత్।<br>తత్యో దేవానాం ప్రత్య బుధ్యత। | బ్రహ్మజ్ఞాని "నేను బ్రహ్మము అయియే ఉన్నాను" అని తెలుసుకొని బ్రహ్మమే తాను అగుచున్నాడు.<br>దేవతలలో కూడా ఎవ్వరైతే బ్రహ్మమును తెలుసుకొంటారో, వారు (మాత్రమే) బ్రహ్మమే అవుతారు. |
| స ఏవ తత్ అభవత్।<br>తథా ఋషీణాం తథా మనుష్యాణాం। | అట్లాగే ఋషులుగాని, మానవులుగాని తాను బ్రహ్మమే అని తెలుసుకొన్నప్పుడు స్వాభావికంగా బ్రహ్మమే అగుచున్నారు. |

| | |
|---|---|
| **తత్ హి ఏతత్ (తద్ధైతత్) పశ్యన్ ఋషిః వామదేవః। ప్రతిపేదే, అహం 'మనుః' అభవగ్ం 'సూర్యశ్చ' ఇతి।** | ఈవిధంగా వామదేవ మహర్షి "సమస్తము బ్రహ్మమే" అని ఎరిగి "నేనే మనువును. నేనే సూర్యుడిని కూడా"। - అని ఎలుగెత్తి గానం చెసారు. **స్వస్వరూపమును సిద్ధించుకున్నారు.** |
| **తత్ ఇదమ్ అప్యేతర్హి య ఏవం వేద 'అహం బ్రహ్మాస్మి' – – ఇతి, స ఇదగ్ం సర్వం భవతి।** | ఇప్పుడు కూడా, ఎవ్వరైతే "నేనే బ్రహ్మమును" అని తెలుసుకుంటాడో, అట్టివాడు ఈ సమస్తము తానే అయి స్వానుభవముగా వెలుగొందు చున్నాడు. |
| **తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే। ఆత్మా హి ఏషాగ్ం స భవతి।** | అట్టివారితో దేవతలకు గాని, రాక్షసులకుగాని విరోధము కలిగి ఉండటానికి సిద్ధము కాలేరు. ఎందుకంటే దేవతలకు, రాక్షసులకు కూడా ఆతడే ఆత్మగా ప్రకాశమానుడగుచున్నాడు. |
| **అథ యో అన్యాం దేవతాం ఉపాసే (ఉపాసతే) "అన్యో అసావన్యో అహమస్మి" – ఇతి, న స వేద యథా పశురేవగ్ం స దేవానాం।** | ఎవరైతే అన్యదేవతను "ఆ దేవత మమాత్మయే" అని తెలుసుకోకుండా ఉపాసిస్తాడో, అట్టివాడు స్వస్వరూపమును గ్రహించక, - ఆవు యజమానికి పాలిచ్చి సేవిస్తున్నట్లుగా, - ఆ ఇష్టదేవతకు పాలిచ్చే ఆవు వంటివాడు మాత్రమే అగుచున్నాడు. |
| **యథా హ వై బహవః పశవో మనుష్యం భుఞ్జ్యుః ఏవం ఏకైకః పురుషో దేవాన్ భునక్తి। ఏకస్మిన్ ఏవ పశావాదీయమానే।** | పశువు ఇచ్చే పాలతో మనుష్యులు సేవించబడుచున్నారు కదా. అట్లాగే బ్రహ్మము ఎరుగనివాడు పశువువలె అన్యదేవతలను (అనన్యభావన సిద్ధించని కారణంగా) సేవించువాడగుచున్నాడు. బ్రహ్మోపాసకుడు **"ఇంద్రాది దేవతలకు నేను భృత్యువును. వారు ప్రభువులు"** అని తలంచుచు **"వీరిని సేవిస్తే వస్తుజాలము మొదలైనవి పొందగలను"** - **"ఉత్తమ లోకములు పొందగలను"** - అని భావిస్తూ ఉంటున్నాడు. |
| **అప్రియం భవతి। కిము బహుషు తస్మాత్ ఏషాం తత్ న ప్రియం యదేతత్ మనుష్యా విద్యుః॥ (10)** | అన్యోపాసకుడు దేవతలచే పరిపాలించువాడు అగుచున్నాడు. అట్టివాడు సేవా కర్మలు విడిచినప్పుడు దేవతలకు ఆ ప్రియుడే అగుచున్నాడు. అందుచేతనే దేవతలలో కొందరు - "ఈ మనుష్యులు పరబ్రహ్మతత్త్వము ఎరుగకయే ఉండెదరు గాక!" అని కోరుకొనువారై ఉంటున్నారు కూడా. **అయి కూడా, ఆత్మజ్ఞుడు దేవతలకు కూడా ఉపాసనా విషయుడే।** |
| **11. బ్రహ్మ వా ఇదమ్ అగ్ర ఆసీత్। ఏకమేవ తదేకగ్ం సన్ న వ్యభవత్।** | అనేక భేదములతో కనిపిస్తున్న ఈ దృశ్య జగత్తు మొదటగా 'ఏకము' అగు బ్రహ్మమే అయి ఉన్నది. అప్పుడు కర్మలు మొదలైనవేవి లేకయేపోయాయి. |
| **తత్ శ్రేయో రూపమ్ అత్య సృజత క్షత్రం యాని ఏతాని దేవత్రా। క్షత్రాణి ఇంద్రో వరుణః, సోమో రుద్రః, పర్జన్యో యమో మృత్యుః ఈశాన – ఇతి।** | **క్షత్రియ ప్రజ్ఞ:** అప్పుడు ఆత్మయొక్క సంకల్ప చమత్కారరూపుడగు ప్రజాపతి (బ్రహ్మ) - లోకక్షేమము, రక్షణ కొరకై 'క్షత్రము'ను జనింపజేసారు. దేవతలలో ఇంద్రుడు, వరుణుడు, సోముడు, రుద్రుడు, పర్జన్యుడు - మొదలైన క్షత్రియులను ఉత్పన్నం చేసారు. (క్షత్రము = క్షత్రియ గుణసంపన్నము). (Functioning oriented Divine Beings). |
| **తస్మాత్ క్షత్రాత్ పరం నాస్తి। తస్మాత్ బ్రాహ్మణః క్షత్రియం అధస్తాత్ ఉపాస్తే రాజసూయే క్షత్ర ఏవ। తత్ యశో దధాతి। సైషా క్షత్రస్య యోనిః యత్ బ్రహ్మ। తస్మాత్ యద్యద్యపి 'రాజా' పరమతాం గచ్ఛతి। బ్రహ్మైవాన్తత ఉపనిశ్రయతి।** | అందుచేత క్షత్రియునికంటే అధికులు ఎవ్వరు లేరు. కాబట్టే రాజసూయ యాగములో బ్రాహ్మణులు క్రింద నిలచి ఉండి క్షత్రియుని ముందుగా (ఎదురుగా) నిలబెట్టి క్షత్రియునిచే ఉపాసన చేయిస్తూ ఉంటారు. బ్రహ్మము క్షత్రమునందు (క్షత్రియునియందు) తన యశస్సును స్థాపిస్తున్నది. అయితే బ్రహ్మమే క్షత్రియునికి యోని కాబట్టి రాజు శ్రేష్ఠత్వము పొంది కూడా బ్రాహ్మణునే ఆశ్రయిస్తున్నాడు. బ్రాహ్మణుని ద్వారా బ్రహ్మమును ఉపాసిస్తున్నాడు. ఎందుకంటే, ఎవ్వరికైనా, ఎప్పటికైనా జీవులకు బ్రహ్మమునందే శాంతి కదా! |

| | |
|---|---|
| స్వాం యోనిం య ఉ ఏనగ్ం హినస్తి స్వాగ్ం<br>స యోనిమృచ్ఛతి। (యోనిం రుచ్ఛతి)। స పాపీయాన్ భవతి।<br>యథా శ్రేయాగ్ం సగ్ం హిగ్ంసిత్వా॥<br>(సంహింసిత్వా)। | ఎవరైతే బ్రహ్మజ్ఞుని తిరస్కారభావంతో చూస్తున్నారో, వారు తమయొక్క ఉత్పత్తి స్థానము చెడగొట్టుకొనినట్లు అగుచున్నారు. శ్రేష్ఠుని హింసించి విషపూరితమగు పాపమును మూటకట్టుకొన్నవాడు కాగలడు.<br>బ్రహ్మమును ద్వేషించువాడు శ్రేయస్సు కోల్పోయి పాపి అగుచున్నాడు. |
| **12.** స నైవ వ్యభవత్।<br>స విశమసృజత యాని<br>ఏతాని దేవ జాతాని గణశ,<br>ఆఖ్యాయన్తే వసవో రుద్రా ఆదిత్యా<br>విశ్వే దేవా మరుత – ఇతి॥ | సృష్టి పురుషుడు క్షత్రియమును కల్పించినప్పుడు, **అప్పటికీ జీవులచే కర్మలు నిర్వర్తింపజేయటానికి శక్తివంతుడు కాలేదు.**<br>అప్పుడు ఆయన దేవతలలో వసువు, రుద్రుడు, ఆదిత్యుడు విశ్వదేవుడు మొదలైన వైశ్య(శ్య) దేవతలను సృష్టించారు. **వారు విశ్వసృష్టికి నిర్మాణ నేతలు కాసాగారు.** |
| **13.** స నైవ వ్యభవత్।<br>స శౌద్రం వర్ణమ్ అసృజత<br>పూషణం ఇయం వై పూషేయగ్ం హీదగ్ం<br>సర్వం పుష్యతి యత్ ఇదం కించ॥ | అప్పటికీ కూడా పురుషుడు ఆయా కర్మలు నిర్వర్తించటానికి శక్తుడు కాలేడు. అప్పుడు పోషించువారిని (పోషక దేవతలను) సృష్టించారు. ఈ భూమి 'పూషము' అని చెప్పబడుతోంది. ఎందుకంటే ఈ భూమియే పోషణ చేయునది కదా! (శూద్రవర్ణము = పరిపోషణ చేయువారు) |
| **14.** స నైవ వ్యభవత్।<br>తత్ శ్రేయో రూపమ్ అత్య సృజత<br>'ధర్మం' తత్ ఏతత్<br>క్షత్రస్య, క్షత్రం యత్ ధర్మః।<br>తస్మాత్ ధర్మాత్ పరం నాస్తి। | **చాతుర్వర్ణ్య ధర్మము :** ఈ విధంగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను కల్పించి వారికి శ్రేయస్సు కొరకై నిర్వర్తించవలసిన **ధర్మములు** (Functions) కల్పించారు. అట్టి ధర్మము క్షత్రమునకే క్షేత్రము. ధర్మమును మించినది ఏదీ లేదు. వారి వారి ధర్మ నిర్వహణచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు ఆత్మతత్త్వము సంతరించుకోగలరు. స్వధర్మ నిరతిచే మోక్షము సిద్ధించుకోగలరు. |
| అథో అబలీయాన్ బలీయాగ్ం<br>స మాశగ్ం, సతే ధర్మేణ<br>యథా రాజ్ఞైవం యోవై స ధర్మః । | బలవంతుడు ఒక బలహీనుని భార్య బిడ్డలను అపహరించినప్పుడు ఆ బలహీనుడు రాజుగారిని ఆశ్రయించగా, రాజసైనికులు ఆ బలవంతుని జయించి, ఆ బలహీనుని భార్య బిడ్డలను రక్షిస్తున్న విధంగా - **ధర్మమును ఆశ్రయించి ధర్మ బలము సంపాదించుకొన్నవాడు 'సంసారము' అనే బలవంతుని జయించగలడు.** |
| సత్యం వై తత్। | ధర్మమే సత్యము కూడా। అందుచేతనే 'సత్యమ్ బ్రూయాత్' - అని వేద వాఙ్మయముచే బోధించబడుతోంది. ధర్మమే శాస్త్రీయమైన సత్యము. సత్యమే శాస్త్రీయమైన ధర్మము (సత్-యమ్=ఈ జీవుని సహజమగు ఎప్పటికీ యథాతథమగు సత్ (ఉనికి) స్వరూపము) |
| తస్మాత్ సత్యం వదన్తమ్<br>ఆహుః "ధర్మం వదతి" – ఇతి। | అందుకే లోకంలో సత్యము చెప్పువానిని **"ఇతడు ధర్మమే చెప్పాడురా!" -** అని అంటారు. |
| ధర్మం వా వదన్తగ్ం<br>"సత్యం వదతి" – ఇతి । | అట్లాగే 'ధర్మము' చెప్పువానిని చూచి **"ఈయన సత్యమే (నిజమే) చెప్పాడయ్యా!"** - అని కూడా అంటారు. |
| ఏతద్ధ్యేవై<br>తత్ ఉభయం భవతి। | పరమాత్మ సత్యమును, ధర్మమును కలిపి ఏకలిపిగా సృజించారు. సమస్తమును నియమించునది సత్య-ధర్మములే! |
| **15.** తత్ ఏతత్ బ్రహ్మ క్షత్రం విశ (వైశ్య)<br>శూద్రః తత్। | **ఈ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నలుగురు పరబ్రహ్మము యొక్క సంప్రదర్శనములే.** ఈ నలుగురిలో బ్రహ్మమునకు అన్యమైనది ఏదీ లేదు. (న్యూన అధికములు లేవు). |

| | |
|---|---|
| **(తత్) అగ్నినైవ దేవేషు బ్రహ్మ అభవత్।**<br>**బ్రాహ్మణో మనుష్యేషు।**<br>**క్షత్రియేణ క్షత్రియో।**<br>**వైశ్యేన వైశ్యః। శూద్రేణ శూద్రః।** | పరబ్రహ్మమే దేవతల మధ్యగా అగ్ని రూపమై- బ్రాహ్మణ స్వరూపముతో బ్రాహ్మణ జాతిగాను, క్షత్రియ స్వరూపముతో క్షత్రియజాతిగాను, వైశ్య (వైశ్వ) (వియస్వ) స్వరూపంతో వైశ్వజాతిగాను, శూద్ర స్వరూపంతో శూద్రజాతిగాను - అగుచున్నది. |
| **తస్మాత్ అగ్నావేవ దేవేషు**<br>**లోకమ్ ఇచ్ఛన్తే।**<br>**బ్రాహ్మణే మనుష్యేషు ఏతాభ్యాగ్ం**<br>**హి రూపాభ్యాం బ్రహ్మ అభవత్।** | **బ్రాహ్మణాగ్ని-** దేవతలగురించి కర్మ (పూజ, యజ్ఞము, యాగము మొదలైనవి) నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు అగ్ని వెలిగించి, ఆహుతులు మొదలైనవి సమర్పించి కర్మఫలములు కోరుకొంటున్నారు.<br>పరబ్రహ్మము బ్రాహ్మణాగ్ని రూపముతోనే పరబ్రహ్మము దర్శనమిస్తున్నది. **(బ్రహ్మతత్త్వజ్ఞానులగు బ్రాహ్మణులను 'భూసురులు' అంటున్నారు).** |
| **అథ యోహవా అస్మాత్ లోకాత్**<br>**స్వం లోకం అదృష్ట్వా ప్రైతి,**<br>**స ఏనమ్ అవిదితో న భునక్తి।** | అయితే, ఎవ్వరైనా సరే, బ్రహ్మమును తెలుసుకోకయే మరణము పొందుతాడో, అట్టివాడు కర్మఫలముల మార్గంలోనే ఉండి పోతాడు. అంతేగానీ బ్రహ్మము ఆతనిని రక్షించదు. అతనిలో బ్రహ్మజ్ఞానానుభవము ఉదయించదు. |
| **యథా వేదోవా అననుక్తో**<br>**అన్యద్వా కర్మా కృతం**<br>**యత్ ఇహ వా అప్యనేవం విత్ మహత్పుణ్యం**<br>**విన్మహత్పుణ్యం కర్మ కరోతి**<br>**తద్ధాస్యాన్తతః క్షీయత ఏవ।**<br>**ఆత్మాన మేవ లోకం ఉపాసీత।** | అధ్యయనము చేయని వేదము ఆ మనుజుని రక్షించజాలనట్లు, ఆత్మయొక్క స్వస్వరూప - సమస్త స్వరూప తత్త్వము ఎరుగనివాడు ఎంత పుణ్యం సంపాదించి, కూడా అది ఫలానుభోగం చేత తరిగిపోతోంది. సమస్త కర్మలు ఆత్మకు చెందినవే. కనుక, కర్మలకు అతీతమైన దృష్టితో కూడిన ఆత్మోపాసనచేతనే ఆత్మానందానుభవము సిద్ధించగలదు.<br>అందుచేత ఆత్మావలోకనమే సర్వదా ఉపాసించవలసిన విధి-విధానము. |
| **స య ఆత్మానమేవ**<br>**లోకం ఉపాస్తే,**<br>**న హా అస్య కర్మ క్షీయతే।** | ఎప్పుడైతే **"ఈ లోకమంతా ఆత్మ స్వరూపమే"** అను రూపంగా ఆత్మోపాసన చేయబడుతుందో, అప్పుడిక కర్మలు అట్టివానిని అంటవు. కర్మల ఫలానుభవ పరిమితులు క్షీణించగలవు. **(సమస్తము స్వస్వరూపానందములో అంతర్భాగమౌతోంది).** |
| **అస్మాత్ ధ్యేవాత్మనో (అస్మాత్ హి ఇవ ఆత్మనో)**<br>**యత్ యత్ కామయతే**<br>**తత్ తత్ సృజతే।। (15)** | ఆత్మోపాసనతో ఆత్మతో మమేకము సిద్ధించుకున్నవాడు తాను ఏఏ లోకములు కోరుకుంటాడో, అవన్నీ ఆత్మచేతనే అతని కొరకై సృజియింప బడగలవు. (ఆత్మ జ్ఞానములేనివాడో? లోకములకు, లోకానుభవములకు 'బానిస' అగుచున్నాడు). |
| **16. అథో అయం వా ఆత్మా**<br>**సర్వేషాం భూతానాం లోకః**<br>**స యత్ జుహోతి।** | ఈ జీవాత్మయే - సమస్త జీవరాసులలో సమస్త అనుభవములు తనవేగా అయి ప్రకాశమానమై ఉన్నది. (అనగా) ఆత్మజ్ఞునకు 'నేను' అనునది విశ్వమంతా ఆక్రమించినదై, విశ్వమంతా 'తానే' అయి ఉంటోంది. |
| **యత్ యజత – ఏతేన దేవానాం లోకో**<br>**అథ యత్ అనుబ్రూతే, తేన ఋషీణాం।**<br>**అథ యత్ పితృభ్యో నివృణాతి**<br>**యత్ ప్రజామ్ ఇచ్ఛతే, తేన పితృణామ్**<br>**అథ యన్ మనుష్యాన్ వాసయతే,**<br>**యదేభ్యో (యత్ ఏభ్యో) అశనం దదాతి తేన మనుష్యాణాం।** | (యజ్ఞ) కర్మపరులైన వారికి ఉపాసనావస్తువై - యజ్ఞము నిర్వర్తించు యజమానిచే దేవతలు, లోకములు ఆరాధించబడుచున్నాయి. స్తుతించ బడుచున్నాయి. అయితే వాస్తవానికి ఆత్మయే ఆ రీతిగా స్తుతించబడుతోంది - అని గుర్తుంచుకోబడు గాక।<br>- ఋషులు ఋక్కులు పలుకుచూ అట్టి ఆత్మనే అభివర్ణిస్తున్నారు.<br>- మరణించిన పితృదేవతలకు కుమారుడు పిండోదకములను ఆత్మను ఉద్దేశ్యించే సమర్పిస్తున్నాడు.<br>- గృహస్తుడు అతిథులకు ఆత్మను ఉద్దేశ్యించే అతిథి - అభ్యాగతులకు వసతి, అన్నము, మొదలైనవి సమర్పిస్తున్నాడు.<br>**ఇదంతా ఆత్మసంబంధమైన ఉపాసనయే।** |





| | |
|---|---|
| అథ యత్ పశుభ్యః తృణోదకం విన్దతి,<br>తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదా<br>వయాగ్ంస్యా పిపీలికాభ్య ఉపజీవన్తి। | ఆత్మను ఉపాసించే మార్గంలోనే<br>- పశువులకు గడ్డి, నీరు ఇవ్వటము<br>- పశువులకు, కుక్కలకు చీమలు, కాకులు మొదలైన వాటికి ఆహారము వేయటము ఇవన్నీ మానవులు కర్మపరంగా నిర్వర్తిస్తూ ఉండటము. (అదంతా ఆత్మోపాసనయే). |
| తేన తేషాం లోకో యథా<br>హ వై స్వాయ లోకాయాః ఇష్టిమ్ ఇచ్ఛేత్<br>ఏవగ్ం హైవం విదే సర్వాణి భూతాని<br>అరిష్టిం ఇచ్ఛన్తి, తద్వా ఏతత్<br>విదితం మీమాంసితమ్॥ | ఈ విధంగా మానవులు దేవతా ఋణము, ఋషి రుణము, పితృదేవతా ఋణము, భూత ఋణము తీర్చుకొంటున్నారు.<br>దేవతలు లోక ప్రయోజనప్రియులు. అందుచేత మనుష్యులు జ్ఞానులు అయి ఉన్నా కూడా కర్మలను త్యజించటమును దేవతలు ఇష్టపడరు.<br>ఇది దృష్టిలో ఉంచుకుని శాస్త్రములు పంచయజ్ఞప్రకరణములు (లేక) పంచయజ్ఞములు (**“దేవ, ఋషి , పితృ, అతిథి, భూత,”** తృప్తి రూప యజ్ఞములు) సూచిస్తూ ఉన్నాయి.<br>అగ్నియందు హోమములు మొదలైనవి గురించి సమస్తము ప్రసాదిస్తున్న దేవతల తృప్తి కొరకై మీమాంసము చేయబడు చున్నాయి. (వివరించబడు చున్నాయి). |
| 17. <u>ఆత్మైవ ఇదమ్ అగ్ర ఆసీత్।</u><br><u>ఏక ఏవ। - సో అకామయత -</u><br><u>“జాయా మే స్యాత్।”</u> | **<u>సకామయత</u>**<br>ముందుగా అఖండము ఏకము అగు ఆత్మపురుషుడే (పరమాత్మయే) ఉండి ఉన్నారు. ఆయన “నాకు సహధర్మచారిణ (పత్ని-భార్య) కావాలి” - అని ఇచ్ఛ పొందారు. |
| అథ ప్రజాయేయ, అథ విత్తం మే స్యాత్।<br>అథ కర్మ కుర్వీయేత్।<br>ఏతావాన్ వై కామో నేచ్ఛగ్ంశ్చనాతో భూయో విన్దేత్।<br>తస్మాత్ అప్యేతర్హి ఏకాకీ కామయతే। | అంతేకాకుండా ‘‘నాకు సంతానము, సంపద (విత్తము) కూడా వినోదించటానికై కావాలి’’ - అని అభిలషించారు. ఇంకా “నేను కర్మలు నిర్వర్తించువాడనుకూడా అవాలి’’ అని కోరుకున్నారు. ఏకాకిత్వము విడువకయే అవన్నీ ఆప్యాయతతో కోరుకున్నారు. అవన్నీ కల్పించుకొని ఆనందించతలచారు. అందుకే **“ఏకాకీ కామయతే”** అనబడుతోంది. |
| జాయా మే (అ)స్యాత్<br>అథ ప్రజాయేయ।<br>అథ విత్తం మేస్యాత్,<br>అథ కర్మ కుర్వీయేతి। | వాస్తవానికి మనస్సు ఆత్మయొక్క మనన రూపమే. వాక్కుయే భార్య. ప్రాణమే పుత్రుడు. అయితే “ఈ భార్య నాది. ఈ విత్తము నాది. ఈ ఈ కర్మలన్నీ చేస్తూ ఉన్నది నేనే” - అనేవన్నీ ఆత్మపురుషుడే జీవాత్మ అయి పొందుచున్నాడు. **అట్టి సందర్భములో ఏకత్వము దర్శించటము లేదు. అనేకత్వమును కల్పించుకొని ఆశ్రయించినవాడగుచున్నాడు.** |
| స యావత్ అప్యేతి ఏషామ్<br>ఏకైకం న ప్రాప్నోతి<br>“అకృత్స్న ఏవ”, -<br>తావత్ మన్యతే తస్యో కృత్స్నతా। | తాను పూర్ణుడు అయి ఉండి కూడా, తాను కోరుకున్న వాటిలో ఏ ఒక్కటి పొందకపోయినా కూడా అపూర్ణత్వముగా (అనగా) తనను తాను (జీవాత్మగా) భావిస్తున్నాడు. **‘మనస్సే తాను (ఆత్మ)’** అని పరిమితుడౌచున్నాడు.<br>దృశ్యము వేరైనది గాను, సహజీవులు వేరైన వారుగాను, తాను వాక్ పరిమితుడుగాను భావిస్తూ ఉంటున్నాడు. |
| మన ఏవ అస్యాత్ ఆత్మా - వాగ్జాయా।<br>ప్రాణః ప్రజా। చక్షుః మానుషం।<br>విత్తం చక్షుషా హి<br>తత్ విన్దతే శ్రోత్రం దైవగ్ం శ్రోత్రేణ హి। | ఆత్మను ఏమరచుటచే ఈ జీవునికి మనస్సే ఆతనికి స్వస్వరూపము అవుతోంది. వాక్కే భార్య. ప్రాణమే సంతానము (ప్రజా). చక్షువులే (కనబడేవే) ఆతనికి మానుష ధనము. ఎందుకంటే చక్షువులచేతనే సంపదను తెలుసు కుంటున్నాడు కాబట్టి. |
| తత్ శృణోతి ఆత్మైవ,అస్య కర్మాత్మనా హి కర్మ కరోతి।<br>స ఏష పాంక్తో యజ్ఞః। పాంక్తః పశుః।<br>పాక్తః పురుషః। పాంక్తం ఇదగ్ం సర్వం।<br>యత్ ఇదం కించ తత్ ఇదగ్ం<br>సర్వం ఆప్నోతి - య ఏవం వేద।<br><u>ఇతి - బృహదారణ్యకోపనిషత్</u><br><u>తృతీయాధ్యాయః చతుర్థబ్రాహ్మణమ్ సమాప్తమ్.</u> | “నేను ఆత్మనే” అని శ్రవణం చేసినప్పుడు, - జీవాత్మత్వమంతా ఆతనికి కర్మగా అగుచున్నది. జీవాత్మానుభవములు తనకు చెందినవై ఉంటూ కూడా తాను వాటికి వేరై (సాక్షి అయి) ఉంటున్నాడు.<br>ఇదియే **పాంక్త యజ్ఞము.** పంక్తితో కూడి చేయు యజ్ఞము, పాంక్తమే పశువులు, పురుషుడు కూడా. పాక్తమే ఈ సమస్తము.<br>ఇది ఎరిగినవాడు సమస్తము పొందినవాడు అగుచున్నాడు.<br>**- చతుర్థ బ్రాహ్మణమ్ ఇతి -** |

## బృహదారణ్యకోపనిషత్। తృతీయాధ్యాయః।
## పంచమం బ్రాహ్మణము
# 5. సప్తాన్న విశేషములు

| | |
|---|---|
| 1. యత్ సప్త (7) అన్నాని మేధయా।<br>తపసా జనయత్ పితా। | వినోదకల్పనామాత్రమగు "దృశ్యము" యొక్క ద్రష్ట దృశ్యానుభవముల కొరకై సృష్టికర్త **సప్త (7) అన్నములను** జనింపజేస్తున్నారు. |
| ☙ ఏకమస్య <u>సాధారణం</u>।<br>☙ ద్వే దేవాన <u>భాజయత్</u>।<br>☙ త్రీణి ఆత్మనే అకురుత।। | (1) సమస్త **సదేహ జీవుల** కొరకై **"ఆహారము"** అనబడే అన్నము.<br>(2,3) : అశరీర - సృష్టి నిర్మాణ దివ్య ప్రాజ్ఞులగు **దేవతలకొరకై 'ఆహుత-ప్రహుతములు'** అనబడే అన్నము.<br>(4,5,6) 'జీవాత్మ' యొక్క **జీవాధార ఆహారములైనట్టి "మనో వాక్ ప్రాణములు"** - అనే అన్నము. |
| పశుభ్య ఏకం ప్రాయచ్ఛ<br>తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం,<br>యచ్చ ప్రాణితి యచ్చన। | (7) పశువుల పరిపోషణము కొరకు చనువులలో (పాలిండ్లలో) 'క్షీరము' (పాలు) సమస్త పరిషోణా సూక్ష్మ పదార్థములు - పాలు యందు (క్షీరము, పయస్సునందు) ఉంచబడ్డాయి. (ప్రక్షిప్తము చేయబడుచున్నాయి).<br>[ దేహముయొక్క రక్షణా విధానము - అన్నము]. |
| కస్మాత్ తాని న క్షీయన్తే<br>అద్యమానాని సర్వదా। | ఈ ఏడు అన్నములు సృష్టించబడిన జీవులచే భుజింపబడుచూ కూడా, **అవన్నీ క్షీణించవు. తరగవు.** |
| యో వై తామ క్షితిం వేద<br>సో అన్నమత్తి, ప్రతీకేన। | ఎవ్వడైతే సృష్టిలోని ఈ సప్తాన్నముల అక్షయత్వము తెలుసుకుంటాడో అట్టివాడు క్రమంగా ఈ సమస్తము తనకు (ఆత్మకు) అభిన్నముగాను, ఆత్మ యొక్క ప్రతీకగాను గమనించి ఆత్మత్వము నిశ్చలపరచు కొనుచున్నాడు. |
| స దేవానపి గచ్ఛతి।<br>స ఊర్జమ్ ఉపజీవతి।<br>ఇతి శ్లోకాః। | ఆతనిని దేవతలు కూడా స్వయముగా ఆశ్రయించుచున్నారు. అతడు అమృతత్వము సంతరించుకుంటున్నాడు. దీని గురించి శ్లోకములుగా (శాస్త్రములచే) చెప్పబడుచున్నాయి. |
| 2. యత్ సప్త (7) అన్నాని<br>మేధయా తపసా అజనయతి। | అట్టి సప్తాన్నములు సృష్టికర్త యొక్క మేధస్సు, తపస్సు నుండియే సంప్రదర్శనము అవుతున్నాయి. జీవులకు కూడా మేధస్సు (తెలివి), తపస్సు (ప్రయత్నము)ల చేతనే ఆహారము లభించగలదు. |
| పితేతి మేధయా హి తపసా అజనయతి।<br>పిత్రైకమ్ అస్య సాధారణమ్ ఇతీదమ్ ఏవ।<br>అస్య తత్ సాధారణం 'అన్నం' యత్ ఇదమ్ అద్యతే। | అట్టి 'అన్నము' గురించియే బ్రాహ్మణములచే చెప్పబడుచున్నాయి. కాబట్టి జగత్ పిత నుండి సాధారణ అన్నము, అన్నాదులగు జీవులు, కర్మలు జనిస్తున్నాయి. అట్టి అన్నమును పొందువాడు అన్నముల నిర్మాణము కొరకై పరిశ్రమను సమర్పించాలి. తాను కూడా అన్నాదుడై ఉండాలి. |
| స య ఏతత్ ఉపాస్తే<br>న స పాప్మనో వ్యావర్తతే<br>మిశ్రగ్ంం హి ఏతత్।। | (1) అట్టి అన్నమును 'సమర్పణ' అను ఉపాసనచే సేవించువాడు (అన్నమును తదితర జీవులకు సమర్పించువాడు) పాపమును (ఋణమును) పొందడు. మానవుల సాధారణాన్నము గురించి ఈవిధంగా చెప్పుకుంటున్నాము. |
| ద్వే దేవాన భాజయత్। ఇతి।<br>(1) హుతం చ। (2) ప్రహుతం చ।<br>తస్మాత్ దేవేభ్యో జుహ్వతి,<br>ప్రచ జుహ్వతి అథో ఆహుః<br>"దర్శ పౌర్ణమాసా" – ఇతి। | (2-3) దేవతలకొరకై రెండు విధములైన (దేవతా) అన్న విభాగములను ప్రజాపతి సంకల్పించి నిర్మించారు.<br>**(1) హుతము (2) ప్రహుతము.** అందుచేతనే దేవతల కొరకై హోమములను, భూతతృప్తికొరకై బలిహరణములను (జుహ్వాము - ప్రతి జుహ్వాములను) చేస్తూ ఉన్నారు. ఈ హుత-ప్రహ్వుతములనే కొందరు **దర్శ, పూర్ణమాసములుగా** కూడా చెప్పుచున్నారు. |

| | |
|---|---|
| తస్మాన్నేష్టి యాజుకః స్యాత్ | దర్శపూర్ణ మాసములచే కొందరు యాజ్ఞీకులు దేవతల గురించి ప్రాయశ్చిత్తంగా హుతములను (దేవతలకు), ప్రహుతములను (సహజీవులకు, భూతములకు) సమర్పిస్తూ యజ్ఞపురుషుని అర్చిస్తున్నారు. |
| పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్<br>ఇతి తత్ పయః।<br>పయో హి ఏవ అగ్రే మనుష్యాశ్చ,<br>పశవశ్చ ఉపజీవన్తి। | పరమాత్మ పశువుల కొరకై పయస్స్వరూపమైన అన్నమును ముందుగా సృష్టించారు. అట్టి క్షీరము (పాలు) సర్వ జీవ పోషకము. కాబట్టి ముందుగా మానవులు ఉపయోగించుచున్నారు. పశువుల సంతానము కూడా ముందుగా క్షీరమే త్రాగుచున్నాయి. |
| తస్మాత్ కుమారం జాతం<br>ఘృతంవైవ అగ్రే ప్రతి లేహయన్తి<br>స్తనం వానుధాపయన్తి। | అందుచేతనే పుట్టిన పిల్లల పెదిమలకు పాలసారమగు నేయి (ఘృతమును) తాకిస్తారు. జాతక సంస్కార సమయంలో కూడా ముందుగా పిల్లల పెదవులకు నేయి తాకిస్తారు. ఆ సందర్భంలో తల్లిచేత పాలు కూడా పిల్లవానికి త్రాగింప జేస్తారు. |
| అథ వత్సం జాతమ్ ఆహుః<br>'అతృణాద' ఇతి।<br>తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం। | క్షీరమునందు దేహ పరిపోషక ఓషధులన్నీ ఇమిడి ఉన్నాయి. బాలుడు తల్లిపాలు తాగేంతకాలం 'అతృణాదుడు' అని పిలుస్తారు. |
| యచ్చ ప్రాణితి, యచ్చ నేతి,<br>పయసి హీదగ్ం సర్వం ప్రతిష్ఠితం।<br>యచ్చ ప్రాణితి యచ్చన।<br>తత్ యత్ ఇదమ్ ఆహుః<br>సంవత్సరం పయసా జుహ్వాతి<br>అప పునః మృత్యుం జయతి – ఇతి। | ప్రాణికి ప్రాణరూపమగు క్షీరము (పయసి) త్రాగి జీవించటానికి సర్వము ప్రతిష్ఠము. అట్టి ప్రాణశక్తి ప్రక్షిప్తమైయున్న క్షీరము (పాలు)తో పరమాత్మకు అభిషేకము (శివాభిషేకము మొ॥వి) సంవత్సరకాలం చేయువాడు జనన - మరణ చక్రమును (పునః పునః జన్మల పరిధులను) దాటివేస్తాడు. |
| న తథా విద్యాత్ యత్ అహరేవ జహోతి<br>తత్ అహః పునర్మృత్యుః అపజయతి। | ఎవడు క్షీరతత్త్వమును తెలుసుకొని అభిషేకము, నైవేద్యము మొదలైనవి నిర్వర్తించి, పాలతో సేవిస్తాడో అట్టివాడు, పునర్జన్మ దోషముల నుండి **అప్పటికప్పుడే** బయటపడగలడు. |
| ఏవం విద్వాన్ సర్వగ్ం హి దేవేభ్యో<br>అన్నాద్యం ప్రయచ్ఛతి। | ఈ రీతిగా తెలుసుకొని ఆహుత సమర్పణముతో అభిషేకము, ఘృత సమర్పణ చేయువాడు సర్వ దేవతా స్వరూపుడగుచున్నాడు. ఆర్తజనులకు సమస్తము తానే ప్రసాదించువాడు (అన్నాదుడు) కాగలడు. |
| కస్మాత్ తాని న క్షీయన్తే<br>అద్యమానాని సర్వదేతి। | ఈ తీరుగా క్షీరతత్త్వ వేదమును తెలుసుకున్నవాడు పండితుడు. వేదజ్ఞుడు. నిత్యానిత్య వివేకి. క్షీరమును ఉదయము, సాయంకాలము ఆహుత ప్రక్షేపణముతో హోమం చేయువాడు సర్వదేవతా స్వరూపుడు అగుచున్నాడు. |
| పురుషో వా అక్షితిః<br>స హీదమ్ అన్నం<br>పునః పునః జనయతే। | ప్రజాపతిచే సృష్టించబడిన సప్తాన్నములు ఆయా వేరు వేరు (Respective) భోక్తలు సర్వదా భక్షిస్తూ ఉన్నప్పటికీ అవి సృష్టిలో పునః పునః జనిస్తున్నాయి. తరగటం లేదు.<br>అట్టి 'అన్నమ్ బ్రహ్మ' ధర్మమును ఎరిగినవాడు మరల మరల అన్నము పొంది దృశ్యవ్యవహారమును జయించి ఆత్మత్వము సంతరించుకొనుటలో విజయుడు కాగలడు. |
| యో వై తామ్ అక్షితిం వేదేతి పురుషో వా అక్షితిః<br>స హీదమ్ – అన్నం ధియా ధియా జనయతే।<br>కర్మభిః యత్ హి ఏతత్ (యద్ధ్యేతత్)<br>న కుర్యాత్ క్షీయేత హ సో 'అన్నమ్' అత్తి। | సృష్టిలోని సప్తాన్నముల **'క్షీణము పొందని నిత్యజనయిత్వము'** ను ఎరిగిన ఘనుడు ఉత్తమ బుద్ధితో కూడిన బుద్ధి సంపన్నుడు కాగలడు.<br>**కర్మచేత అన్నము పొందుచూనే, అద్దాని నిత్యత్వమును ఉపాసించాలి.**<br>అట్టివాడు "అన్నము (దృశ్యానుభవము) తరుగునది కాదు" అని గ్రహించి అక్షయమును పొందగలడు. (దృశ్యము, దృశ్యానుభవము తరగనివే). |

| | |
|---|---|
| ప్రతికేనేతి (ప్రతీక ఏన ఇతి) ముఖం ప్రతీకం,<br>ముఖేనేతి ఏతత్ స దేవానపి గచ్ఛతి।<br>స ఊర్జమ్ ఉపజీవతీతి ప్రశగ్ంసా॥ | ఇట్లు తెలుసుకొనిన పురుషుడు - ముఖముతో అన్నము (దృశ్యానుభవము) ఆస్వాదిస్తూ, దేవతాస్వరూపుడు అగుచున్నాడు. అట్టివాడు సర్వదా బంధనములు త్యజించి పరమాత్మత్వము పుణికిపుచ్చుకోగలడు. ఆతడు ప్రశంస (Appreciation) కు అర్హమైన జీవనము పొందగలడు. |
| **3.** త్రీణి ఆత్మనే అకురుతేతి<br>మనో వాచం, ప్రాణం।<br>తాని ఆత్మనే అకురుత<br>అన్యత్ర మనా అభూవం నాదర్శనమ్। | పరమపిత అయినట్టి ప్రజాపతి (పితామహుడు, బ్రహ్మదేవుడు, సృష్టికర్త) - తనకొరకై ఇంకా '3' (మూడు) విధములైన అన్నములను నిర్మించుకొంటున్నారు. అవి - (1) మనస్సు (2) వాక్కు (3) ప్రాణము అను అన్నములు.<br>**"ఆత్మనగు నేను వేరొక స్థానము (స్థితి)లో మనస్సు కలవాడను అగుచున్నాను. మనస్సు చేతనే చూస్తున్నాను, వింటున్నాను, వాంఛిస్తున్నాను, సంకల్పిస్తున్నాను"** - అను స్వకీయ కల్పనను ఆశ్రయిస్తున్నారు. |
| అన్యత్రమనా అభూవం న అశ్రౌషమితి<br>మనసా హి ఏవ పశ్యతి।<br>మనసా శృణోతి। | ఆయనచే కల్పితము అగుచున్న మనస్సు-చేతనే ఆయన సమస్తము నిర్వర్తిస్తూ ఉన్నారు. మనస్సు లేనిచోట ఏదీ అనుభవము కాదు, చూడబడదు, వినబడదు. ఈవిధంగా మనస్సు చేతనే (1) దృశ్య సంబంధమగు **బంధము,** (2) ఆత్మ మనన సంబంధమగు **మోక్షము** కూడా రూపము దిద్దుకుంటున్నాయి. |
| కామ స్సంకల్పో, విచికిత్సా<br>శ్రద్ధా అశ్రద్ధా, ధృతిః అధృతిః<br>హ్రీః ధీః భీః – ఏతత్ సర్వం మనఏవ। | **"ఏదో కావాలి। అనే కామ సంకల్పము, దాని విచికిత్స, శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి (ధైర్యము), అధృతి (పిరికితనము), తక్కువగా (హ్రీ) భావించటము, బుద్ధి, భయము** - ఇవన్నీ కూడా మనో విన్యాస చమత్కారములే. |
| తస్మాత్ అపి పృష్ఠత ఉపస్పృష్టో<br>మనసా విజానాతి। | ఒకనికి వీపు ప్రదేశంలో ఏదో తాకింది. అది ఎట్లా తెలిసింది? కళ్లచేత కాదు కదా? మనస్సు చేతనే! |
| యః కశ్చ శబ్దో వాగేవ।<br>సా ఏషాహి అన్తమాయః త్తైషా హిన<br>(యత్ తేషాహిన) ప్రాణో అపానో<br>వ్యాన ఉదానః సమానో అన।<br>ఇత్యేతత్ సర్వం ప్రాణ ఏవ।<br>ఏవై తన్మయో వా అయమాత్మా వాఙ్మయో,<br>మనోమయః, ప్రాణమయః॥ | సమస్త శబ్దములు మనస్సుయొక్క 'వాక్' స్వరూపమే। **మనస్సే వాక్కుగా ప్రదర్శనమౌతోంది.** ప్రాణమే వాక్కు రూపముగా ప్రదర్శనమౌతోంది. మనస్సే ప్రాణ - ఇంద్రియ దృశ్యానుభవరూపం కూడా.<br>ప్రాణశక్తియే ప్రాణ-అపాన, వ్యాన, ఉదాన, సమాన ప్రాణశక్తిగా కూడా ప్రదర్శనమౌతోంది.<br>**ఈ అనుభవమగుచున్న సమస్తము ముఖ్య ప్రాణస్వరూపమే.** ఆత్మమయమగు జీవాత్మ ప్రాణమయము, వాక్‌మయము, మనోమయము, అగుచున్నది. |
| **4.** త్రయోలోకా ఏత ఏవ।<br>వాగేవ అయం లోకో।<br>మనో అన్తరిక్ష లోకః।<br>ప్రాణో అసౌ లోకః॥ | "భూ, భువర్, సువర్లోకములు" అనబడే త్రిలోకములు వాక్ - మనో - ప్రాణ రూపములే! **వాగేవ అయం లోకో। ఈ లోకము వాక్ స్వరూపమే। వాక్ నిర్మితమే।**<br>భూలోకమే - వాక్కు.<br>అంతరిక్షమగు భువర్లోకమే - మనస్సు.<br>సువర్లోకమే - ప్రాణము. |
| **5.** త్రయో వేదా ఏత ఏవ।<br>'వాక్' ఏవ ఋగ్వేదో।<br>'మనో' – యజుర్వేదః।<br>'ప్రాణః' – సామవేదః॥ | ఋక్-యజుర్-సామమములనబడే త్రిలోకములు వాక్ మనో ప్రాణములే.<br>వాక్కు - ఋగ్వేదము<br>మనో - యజుర్వేదము<br>ప్రాణము - సామవేదము |

| | |
|---|---|
| **6.** దేవాః పితరో మనుష్యా ఏత ఏవ।<br>'వాక్' ఏవ దేవా।<br>'మనః' పితరః।<br>'ప్రాణో' మనుష్యాః। | <u>దేవ, పితర, మనుష్యులు</u> - <u>వాక్, మనో, ప్రాణ</u> స్వరూపాలే.<br>వాక్కుయే- దేవత.<br>మనస్సు - పితృదేవత.<br>ప్రాణమే - మనుష్యులు. |
| **7.** పితా మాతా ప్రజైత ఏవ।<br>'మన' ఏవ పితా।<br>'వాక్' మాతా।<br>'ప్రాణః' – ప్రజా॥ | పితా మాతా ప్రజలు తత్ స్వరూపులే.<br>మనస్సుయే - పిత (తండ్రి)<br>వాక్కుయే - మాత (తల్లి)<br>ప్రాణమే - సంతానము |
| **8.** విజ్ఞాతం విజిజ్ఞాస్యమ్<br>అవిజ్ఞాతమ్ ఏత ఏవ। | **విజ్ఞానము, విజిజ్ఞాస్యము** (తెలుసుకొనునది / తెలుసుకోవాలనే ఇష్టము) అవిజ్ఞాతము ఆత్మయొక్క ఏమరపు-ఈ మూడు కూడా మనో ప్రాణస్వరూపములే। |
| యత్ కించ విజ్ఞాతం,<br><u>'వాచః'</u> తత్ రూపం,<br>వాగ్ఘి విజ్ఞాతా, వాగేనం<br>తత్ భూత్వా అవతి॥ | విజ్ఞాన స్వరూపమే - వాక్ రూపము. వాక్కే విజ్ఞాన స్వరూపము.<br>విజ్ఞాతయే - వాక్కు పలుకువాడు. వాక్కు విజ్ఞాన స్వరూపమై, ఆ వాగ్విభూతి తెలిసినవానిని రక్షిస్తోంది. |
| **9.** యత్ కించ విజిజ్ఞాస్యం<br>'మనసః' తత్ రూపం।<br>మనో హి విజిజ్ఞాస్యం।<br>మన ఏనం తత్ భూత్వా అవతి। | **విజిజ్ఞాస్యమే** ("తెలుసుకోవటము (knowing) తెలుసుకోవాలనే ఇష్టము" అనునదే) మనస్సు యొక్క రూపము.<br>మనస్సు యొక్క సహజ-నిజ-వాస్తవ రూపము పరమాత్మయే।<br>మనస్సే **"తెలుసుకోవటము" కూడా. మనస్సును విజ్ఞాతగా (తెలుసుకునే వాడుగా), విజ్ఞానముగా (తెలుసుకోవటముగా) విజిజ్ఞాస్యముగా (తెలుసుకొనబడే సమస్తముగా) ఎరుగువాడు 'ఆత్మ'ను ఎరుగగలడు.** |
| **10.** యత్ కించ అవిజ్ఞాతం<br>ప్రాణస్య తత్ రూపం। | ఏ కొంచము ఇంద్రియములకు విషయమై ఆత్మగా అవిజ్ఞాతమై యున్నదో (ఆత్మకాదు అని అనిపిస్తోందో) - అది కూడా ప్రాణస్వరూపమే. |
| ప్రాణో హి అవిజ్ఞాతః।<br>ప్రాణ ఏనం తత్ భూత్వా అవతి॥ | "తెలియబడదు" అనునది తెలియబడేది కాదు. తెలుసుకునేదే అది కదా! ప్రాణమే అవిజ్ఞాతము (తెలియబడే ఇంద్రియవిషయము వంటిది కాదు).<br>ఈ విధంగా తెలుసుకొనేవాడు ప్రాణేశ్వరుడే - అని తెలుసుకొన్నవానిని ప్రాణము వీడక సదా సంరక్షించునదై ఉండగలదు. |
| **11.** తస్యై వాచః పృథివీ శరీరం<br>జ్యోతీ రూపం అయం అగ్నిః। | వాక్కుకు పృథివియే శరీరము. ఇంద్రియములు జ్యోతి స్వరూపము. వాక్కే అగ్ని (జ్యోతి, తేజస్సు) కూడా. |
| తత్ యావత్ ఏవ వాక్తావతీ<br>పృథివీ తావా నయమగ్నిః। | (1) వాక్కు (2) జ్యోతి - ఈ రెండు ఎంతటి పరిణామము కలిగి ఉంటాయో, భూమి (Matter) కూడా అంతవరకు పరిణామము కలిగినదై ఉంటోంది. అగ్ని కూడా అంతే పరిణామము కలిగి ఉంటోంది. |
| **12.** అథ ఏతస్య (అథైతస్య)<br>మనసో – ద్యౌః శరీరం।<br>జ్యోతీరూప మనసావ ఆదిత్యః। | **ఇప్పుడిక మనస్సు యొక్క విభూతి గురించి చెప్పుకుంటున్నాము.**<br>మనస్సు యొక్క శరీరము ద్యులోకము. మనస్సు యొక్క జ్యోతి (Enlightenment) రూపమే - ఆదిత్యుడు. |
| తత్ ద్యావదేవ (తద్యావదేవ)<br>మనస్తావతీ।<br>ద్యౌః తావాన్ ఆసావాదిత్యః।<br>తౌ (స్తౌ) మిథునగ్ం। సమైతాం తతః ప్రాణో జాయత। | ద్యులోకము ఎంతటి పరిణామంగా (ఎంతవరకైతే) విస్తరించి ఉంటుందో, అంతటి పరిణామంగాను మనస్సు విస్తరించి ఉండగలదు. అంతవరకు ఆసావాదిత్యుడు (తేజస్సు) విస్తరించి ఉండగలదు.<br>వాక్కు మనస్సులు తల్లిదండ్రుల వలె కలయిక కలిగి ఉన్నంతవరకు ప్రాణము కూడా విస్తరించినదై ఉన్నది. వాక్కు - మనస్సుల వలన ప్రాణము ప్రవర్తనమును ప్రదర్శిస్తోంది. |

| | |
|---|---|
| స ఇన్ద్రః స ఏషో అసపత్నో<br>ద్వితీయో వై సపత్నో<br>న అస్య సపత్నో భవతి,<br>యం ఏవం వేద। | వాయు రూపంగా జనితమైన ప్రాణమే ఇంద్రుడు (లోకపాలకుడగు పరమాత్మ). అట్టి పరమాత్మ అసపత్నుడు. (ప్రకృతి అనబడు మరొకటి ఏదీ లేనివాడు).<br>**ఆత్మ పురుషుడు సపత్నుడు, అసపత్నుడు కూడా** . ఈవిధంగా ఆత్మగురించి తెలుసుకొన్నవాడు ఆత్మభావన సిద్ధించుకోగలడు. |
| **13.** అథై తస్య ప్రాణస్య – ఆపః శరీరం।<br>జ్యోతీరూపం అసౌ చంద్రః। | అట్టి ప్రాణ దేవతకు ఉదకము (జలము) శరీరము. ఆద్దాని జ్యోతిరూపమే చంద్రుడు. |
| తత్ ద్యావానేవ ప్రాణః, తావత్య<br>ఆపస్తావాన్ అసౌ చంద్రః।<br>త (తత్) ఏతే సర్వఏవ సమాః సర్వే అనన్తాః।<br>స యో హి ఏతాన్ అన్తవత<br>ఉపాస్తే అన్తవన్తగ్ం – స లోకం జయతి।<br>అథ యో హైతాన్ అనన్తాన్ ఉపాస్తే,<br>అనన్తగ్ం స లోకం జయతి॥ | అంతరిక్షము ప్రాణస్వరూపమే. అంతరిక్షము విస్తరించి ఉన్నంత వరకు జలము, చంద్రమసము (మనస్సు) - విస్తరించి ఉంటున్నాయి.<br>ఆత్మలాగానే ఉదకము కూడా అనంతమే।<br>ఎవడైతే ప్రాణశక్తిని, ఉదకమును 'అనంతము'గా గమనిస్తూ ఉపాసిస్తాడో, అట్టివాడు లోకములను జయించగలడు. జయించగలడు. తానే అనంతమగు ఆత్మస్వరూపుడై ప్రకాశించగలడు. |
| **14.** స ఏష సంవత్సరః<br>ప్రజాపతిః షోడశకలః।<br>తస్య రాత్రయ ఏవ। | **<u>షోడశ కళాత్ముడగు ఆత్మ పురుషుడు</u>**<br>షోడశ (16) కళలు తన అవయవములుగా కలిగియున్న ప్రజాపతియే కాలస్వరూపుడై, సంవత్సరరూపుడై కూడా ఉంటున్నారు. ఆయనకు 15 తిథులు - 15 కళలు. |
| పంచదశ కలా ధ్రువైవ అస్య షోడశీ కలా<br>న రాత్రిభి రేవాచ పూర్యతే అపచక్షీయతే। | అట్టి పంచదశ కళలకు ఆవలిగా 16వదగు అమావాస్యయే అన్నిటికీ స్థానమై శేషించియున్నట్టిది. అమావాస్యయందు శేషించి ఉండేదే శాశ్వతమైన కళ. |
| సో అమావాస్యాగ్ం రాత్రిం<br>ఏతయా షోడశ్యా కలయా సర్వం ఇదం<br>ప్రాణభృత్, (తదను) అనుప్రవిశ్య<br>తతః ప్రాతః జాయతే। | 16వదగు అమావాస్య నుండే తక్కిన 15 కళలు ప్రర్శనం అగుచున్నాయి. ఆ 16వ కళయే ప్రాణశక్తిని ధరించి, సమస్త జీవులలో ప్రాణము రూపంగా ప్రవేశింపజేసి జీవులందరి మెలకువకు, ఉదయమునకు కారణము అగుచున్నది. 16వ కళయే 'అమావాస్య' యందు ఉండి ఉదయము (ఉదయించటము) అను రెండవ కళతో జన్మిస్తోంది. |
| తస్మాత్ ఏతాగ్ం రాత్రిం<br>ప్రాణభృతః ప్రాణం న విచ్ఛిన్ద్యాత్<br>అపి కృకలా సస్తే ఏతస్యా (సస్యైతస్యా)<br>ఏవ దేవతాయా అపచిత్యై॥ | ఈవిధంగా శుక్ల-కృష్ణ తిథులలో ఒక్కొక్క కళతో వృద్ధి చెంది పౌర్ణమినాడు (పౌర్ణమసినాడు) **16 కళలతో పరిపూర్ణమగుచున్నది కూడా ఆత్మపురుషుడే.**<br>తిరిగి ఆయనయే కృష్ణపక్షంలో క్షీణిస్తూ అమావాస్యగా శాశ్వతమైన ఏక కళతో ప్రకాశిస్తున్నారు.<br>**జగత్తు యొక్క పరిణామహేతుత్వమే 'కర్మ'గా వర్ణించబడుతోంది.** అమావాస్యయందు పాపాత్ముని కూడా శిక్షించరాదు. జంతుహింస నిషేధము. ప్రజాపతి స్వరూపముగా చంద్రదేవతార్చన చేయతగినది. ( శ్రీ శంకరభాష్యము) |
| **15.** యో వై స సంవత్సరః ప్రజాపతిః।<br>షోడశకలో అయమేవ।<br>స యో అయమేవం విత్ పురుషః।<br>తస్య విత్తమేవ పంచదశకలా ఆత్మైవ। | సంవత్సర స్వరూపుడగు ప్రజాపతికి చెందినవే ఈ షోడశ కళలు.<br>ఆయనయే విత్త (సంపద) స్వరూప పురుషుడు. పంచదశ కళలు ఆ ఆత్మపురుషుని కళలే. షోడశ (16వ) కళతో ఆయన పూర్ణుడై ప్రకాశించు చున్నారు. ఆయనయే తిరిగి క్షీణ-వృద్ధి దశల చమత్కారము ప్రదర్శిస్తున్నారు. |
| అస్య షోడశీ కలా సవిత్తేనైవా చ, పూర్యతే అపచక్షీయతే।<br>తదేతత్ అన్నభ్యం యత్ అయమ్ ఆత్మా ప్రధిః విత్తం।<br>తస్మాత్ యద్యద్యపి సర్వ జ్యానిం జీయత,<br>ఆత్మనాచేత్ జీవతి ప్రధినాగాత్ ఇత్యేవ ఆహుః। | ఆత్మస్వరూపమే శాశ్వతకళ. ఆయన బండి చక్రమువంటివాడు. ఆయన యొక్క కాలచక్రములోని ఆకులు (15 కళలు) - ఆయనకు సంపద. బాహ్యమునగల శరీరము వంటి కాలాంతర విశేషాలు నశించునవి అయినప్పటికీ, ఆత్మ నిత్యము.<br>నిత్యము (At all times) 15 కళలు ప్రదర్శించి, తిరిగి జీవకళలు తనయందు అమావాస్య రూపంగా లయించుకొనుచున్నది - **ఆ ఆత్మపురుషుడే।** |





| | |
|---|---|
| **16.** **అథ త్రయో వావ లోకా** | **త్రిలోకములు** |
| **(1)మనుష్యలోకః, (2) పితృలోకో (3) దేవలోక ఇతి।** | **(1) మనుష్య (2) పిత్రు (3) దేవ** |
| **సో అయం మనుష్య లోకః**<br>**పుత్రేణైవ జయాయో (జయ్యో) న అన్యేన కర్మణా।**<br>**కర్మణా పితృలోకో। విద్యయా దేవలోకో।** | ఈ మనుష్యలోకము (ఆత్మవై పుత్రో నామాసి అనునట్లుగా) 'పుత్రుడు' అనబడు సాధనచే జయించబడుతోంది.<br>కర్మలచేత పిత్రులోకము, ఆత్మవిద్యచే దేవలోకము జయించబడగలదు. |
| **దేవలోకో వై లోకానాగ్ం శ్రేష్ఠః।**<br>**తస్మాత్ విద్యాం ప్రశగ్ంసన్తి॥** | త్రిలోకములలో దేవలోకమే శ్రేష్ఠమైనది. (ఆత్మ) విద్యచే జయించబడగల దేవలోకమే అన్నిటికన్నా ప్రశంసనీయము, ఈవిధంగా వేదజ్ఞులచే కీర్తించబడుతోంది. |
| **సంప్రత్తివ్రతము (సంప్రతి = లెక్కచూచుకొను)** | **సంప్రత్తి వ్రతము** |
| **17.** **అథ అతః సంప్రత్తిః యదా**<br>**ప్రైష్యన్ మన్యతే** | అందుచేత 'సంప్రత్తి'' లేక 'సంప్రదానము' అనే ఆత్మయజ్ఞము ఈవిధంగా నిర్వర్తింపబడుతోంది. **(సంప్రత్తి. సంప్రతి = లెక్కచూచుకొను)** |
| **అథ పుత్రమ్ ఆహ**<br>**"త్వం బ్రహ్మ। త్వం యజ్ఞః।**<br>**త్వం లోక" – ఇతి।**<br>**(ఇతి) స పుత్రః ప్రత్యాహ –**<br>**"అహం బ్రహ్మ। అహం యజ్ఞో।**<br>**అహం లోక" – ఇతి।** | **తండ్రి - పుత్రునితో :**<br>కుమారా! నేను సమస్తము త్యజించి వేయటము అని సంప్రత్తి యాగము నిర్వర్తిస్తూ ఉన్నాను. అందుకుగాను, నాకు- "నీవే బ్రహ్మమువు. నీవే యజ్ఞ స్వరూపుడవు. నీవే లోక స్వరూపుడవు కూడా।<br>**పుత్రుడు (ఆ యజ్ఞములో పలికే పలుకులు):**<br>**"అవును తండ్రీ! నేనే బ్రహ్మము. నేనే యజ్ఞమును. నేనే ఈ సమస్త లోకస్వరూపుడను" కూడా.** |
| **యద్వై కించానూక్తం**<br>**తస్య సర్వస్య బ్రహ్మేతి ఏకతా।** | ఏది 'ఇది' అని వాక్కుచే చెప్పబడజాలదో, అట్టి బ్రహ్మమే - **'ఏకము'** అయి, అనేకముగా (కల్పనాదృష్టికి) కనబడుచూ ఉన్నది. |
| **యే వై కేచ యజ్ఞాః**<br>**తేషాగ్ం సర్వేషాం "యజ్ఞ" ఇతి ఏకతాయేవ।** | ఏవేవి 'యజ్ఞములు' అని చెప్పబడుచూ ఉన్నాయో, అవన్నీ ఆత్మయొక్క అక్షరము నందు ఏకత్వము పొందుచున్నాయి. |
| **యే వై కేచ (ఏకేచ) లోకాః తేషాగ్ం**<br>**సర్వేషాం లోక ఇతి ఏకతా।** | ఏఏ లోకములు చెప్పబడుచూ ఉన్నాయో, అవన్నీ "లోకము'' అను శబ్దముచే ఏకత్వము పొందినవగుచున్నాయి.<br>"లోకము'' అను శబ్దార్థము విస్తరించి ఉన్నంతవరకు, ఆ రీతిగా ఆత్మయే విస్తరించినదగుచున్నది. |
| **ఏతావద్వా ఇదగ్ం**<br>**సర్వం ఏతత్ మా సర్వగ్ం**<br>**సత్–నయమితో అభునజత్ ఇతి।**<br>**తస్మాత్ పుత్రం అనుశిష్టం**<br>**లోక్యమ్ ఆహుః।** | సంప్రత్తివ్రతంలో **"నేను ఇతఃపూర్వము పూర్తి చేసిన, కొంత పూర్తి చేసిన, చేయాలనుకొని ప్రారంభించిన యజ్ఞములు నుండి అనుష్ఠానములనుండి, లోకముల నుండి, ధర్మముల నుండి ముక్తుడను అగుచున్నాను". సమస్తము పుత్రునకు అప్పజెప్పివేస్తున్నాను" - అని సంప్రత్తి వ్రతనిష్ఠునిగా పలుకుచున్నాడు. (అందుచేతనే - ఆత్మావై పుత్రనామాసి - అని వేదమంత్రము శ్లాఘిస్తోంది).** |
| **తస్మాత్ ఏనమ్ అనుశాసతి।** | ఈ విషయమై (వేదములు) ఈవిధంగా అనుశాసనము పలుకుచున్నాయి. |
| **స యద్దైవం విత్। (స యత్ ఏవం విత్)**<br>**అస్మాత్ లోకాత్ ప్రైత్యత్ హి అభిరేవ**<br>**(ప్రైత్యథైభిరేవ) ప్రాణైః సహ పుత్రమ్ ఆవిశతి॥** | తండ్రియొక్క సాధనా సంపద తండ్రిచే కుమారునికి - కొనసాగించటానికై సమర్పించబడుగాక। అప్పుడిక, మరణానంతరం కూడా ప్రాణములు, లోకానుభవములు కుమారునికి సమర్పించబడినవి అగుచున్నాయి. |

స యత్ అనేన కించిత్
దక్ష్ణయా అకృతం భవతి।
తస్మాత్ ఏనగ్ం సర్వస్మాత్ పుత్రో ముఞ్చతి।
తస్మాత్ పుత్రో నామ స పుత్రేణైవ।
అస్మిన్ లోకే ప్రతితిష్ఠతి
అథైనమ్ ఏతే దేవాః అమృతా ఆవిశన్తి॥

చేసినవి, చేయవలసినవి, చేయనివి, చేయకూడనివి కూడా పుత్రునికి సమర్పించి తండ్రి అకృతుడు (కర్మాతీతుడు) అగుచున్నాడు. ఈ విధంగా తండ్రి యొక్క లౌకిక ధర్మములు పుత్రుని చేరుచున్నాయి. పుత్రుని సహకారంతో తండ్రి లోకములను, కర్మసంబంధములను దాటివేయుచున్నాడు.

"విద్యా, అధ్యయన, కర్మ నిర్వహణ" మాత్రంచేత కర్మలతో సంగము జయించబడదు. 'సంప్రత్తి' కర్మ చేతనే తండ్రి మరణ ధర్మమును (పునరావృత్తులను) జయించిన, - వాక్-ప్రాణములను పొందుచున్నాడు.

---

18. పృథివ్యై చ ఏనమ్ అగ్నేశ్చ
దైవీ వాగావిశతి
సావై దైవీ వాగ్యయా
యద్యత్ ఏవ వదతి, తత్ తత్ భవతి॥

అట్టి సంప్రత్తి కర్మచే భూమివలన వాక్కు, అగ్నివలన ప్రాణము దివ్యత్వము పొంది యజమానిని తిరిగి చేరుచున్నాయి. అట్టి సంప్రత్తి కర్మలు ఎరిగినవాని వాక్కు సత్యవాక్కు అగుచున్నది. అట్టి వాక్కు దివ్య (దైవీ) సంబంధమైన పరిశుద్ధత పొందగలదు.

(ఇక్కడ జీవాత్మయే పరమాత్మకు పుత్రుడు - అవి కూడా విశ్లేషించబడుతోంది)

---

19. దివశ్చ ఏనమ్ ఆదిత్యాచ్చ
దైవం మన ఆవిశతి,
తద్వై దైవం మనో యేన
ఆనన్ద్యేవ భవతి,
అథో న శోచతి॥

ఈవిధంగా సంప్రత్తి కర్మచేత ఎవ్వడైతే దృశ్యముతో [లోకములతో జీవించినంతకాలం ఏర్పడిన సమస్త సంబంధ బాంధవ్యములను, కర్మ-యజ్ఞ వ్యావృత్తులను జయించివేస్తాడో, అట్టివాని మనస్సు పరిశుద్ధత పొంది తనకు అధిష్ఠానమగు సూర్యునియందు (ఆదిత్యుని యందు)] ప్రవేశము పొందగలదు. (తన జీవాత్మత్వమును జగత్తుకు సమర్పించి వేసి, పరమాత్మను సంతరించుకొన్నవాడు అగుచున్నాడు).

**ఏ మనస్సుచే - సమస్త జన్మ-కర్మ అనుబంధం బాంధవ్యములను పొందాడో, ఆ మనో విభాగమును పాము కుబుసము వలె అంతర్గతంగా విడచనివాడై ఎవడు ఉండి ఉంటాడో, అట్టివాడు సర్వవేదనలను విడచి ఆత్మానందుడై ఉండగలడు.**

---

20. అద్భ్యశ్చ ఏనం చంద్రమసశ్చ
దైవః ప్రాణ ఆవిశతి।
స వై దైవః ప్రాణో యః
సంచరగ్ంశ్చ – అసంచరగ్ంశ్చ న వ్యథతే।

ఈవిధంగా సమ్ప్రత్తి కర్మ నిర్వర్తించిన వాని విషయంలో ప్రాణశక్తి నిర్మలత్వము, లోక వ్యవహారిక అప్రమేయత్వము సంపాదించుకొన్నదగుచున్నది. అతని ప్రాణశక్తి ఉదకమును, చంద్రుని చేరుచున్నది.

అప్పుడు ఇక ఆ ప్రాణశక్తి - సంచార - అసంచారములు (తరంగ- జలముల వలె) కలిగి ఉంటూ కూడా, సమస్త వ్యథలు త్యజించినదై ఉంటుంది.

---

అథో న రిష్యతి స ఏవం విత్
సర్వేషాం భూతానాం 'ఆత్మా' – భవతి।
యథ ఏషా దేవతైవగ్ం (దేవతాఏవగ్ం)
సః యథా ఏతాం దేవతాగ్ం
సర్వాణి భూతాని అవన్తి।
ఏవగ్ం హైవం విదగ్ం
సర్వాణి భూతాని అవన్తి।

దుఃఖము, భయముల నుండి విడివడిన **అట్టి కేవల ప్రాణతత్త్వము ఎరిగినవాడు సమస్త భూతజాలముయొక్క ఆత్మ స్వరూపుడై వెలుగొందుచున్నాడు.** వాక్-మనఃస్వరూపుడై బ్రహ్మదేవుని వలె స్వయంప్రకాశమానుడగుచున్నాడు.

అట్టి నిర్మల (జగత్ విషయాతీత) ప్రాణమును సంప్రత్తి కర్మ నిష్ఠచే సిద్ధించుకొన్నవాడు సర్వజీవులకు పూజనీయుడు.

ఇంకా కూడా సర్వభూతజాల ఆత్మతత్త్వము ఎరిగినవాడగుచున్నాడు.

---

యదు కించ ఇమాః ప్రజాః శోచన్తి।
అమై వాసాం తత్ భవతి।
పుణ్యమేవ అముం గచ్ఛతి।
న హ వై దేవాన్ పాపం గచ్ఛతి।

అట్టి పురుషునిపట్ల ఇక ఎట్టి ప్రాపంచిక దుఃఖములు సమీపించవు. తత్ పరమాత్మ స్వరూపుడగుచున్నాడు. పుణ్యస్వరూపము సంతరించుకుని ఆనందమయ లోకములు చేరుచున్నాడు. **పాపదృష్టులు ఆతడిక కలిగి ఉండడు. సర్వే సర్వత్రా తన యొక్క ప్రాణాత్మనే దర్శిస్తూ ఉంటాడు.**

| ఇంద్రియవ్రత మీమాంస | **కర్మ (ఇంద్రియ) వ్రత మీమాంస - 'అధ్యాత్మము'** |
|---|---|
| **21.** అథాతో వ్రతమ్ ఇమాగ్ంసా। | ప్రాణఉపాసన తరువాత ఇప్పుడిక (కర్మ)వ్రతముల మీమాంస గురించి చెప్పుకుంటున్నాము. |
| ప్రజాపతిః హ కర్మాణి (ప్రజాపతిర్హ కర్మాణి)<br>స సృజేతాని సృష్టాని।<br>అన్యన్యోన్యేనా స్పర్ధన్త వదిష్యామ్యేవ<br>'అహమ్' - ఇతి॥ | ప్రజాపతి సృష్టినంతా ప్రజలతోను, (జీవులతోను), వాక్కు మొదలైన ఇంద్రియములతోను సృష్టించారు.<br>ఒకానొక సందర్భములో (చూపు, వినికిడి, స్పర్శ, రుచి, వాసన అనబడు) ఇంద్రియములు "మేమే, మేమే గొప్ప" అని చెప్పుకోవటం ప్రారంభించాయి. |
| 'వాక్' దధ్రే<br>ఈ(ద్ర) క్షామి "అహమ్"। - ఇతి<br>చక్షుః శ్రోష్యామి "అహమ్"। ఇతి॥ | ముందుగా వాక్ ఇంద్రియము "నాతో సమానమైన శక్తి ఎవరికీ కూడా లేదు" - అని పలుక సాగింది. అట్లాగే తదితర చూపు, వినికిడి మొదలైన ఇంద్రియములు కూడా "మేమే శ్రేష్ఠము" అని అహంకరించసాగాయి. |
| శ్రోత్రమేవ మన్యాని కర్మాణి। (శ్రోత్రమేవమ్ అన్యాని కర్మాణి)।<br>యథా కర్మ తాని మృత్యుః<br>శ్రమోభూత్వా పయేమే (పయేమ్ ఏతాని)<br>ఏతాని ఆప్నోతి అత్తాని ఆప్త్వా<br>మృత్యుః అవారుంధతిః।<br>తస్మాత్ శ్రామ్యత్యేవ।<br>వాక్ శ్రామ్యతి। చక్షుః శ్రామ్యతి।<br>శ్రోత్రమ్ అథేమమ్ ఏవ న<br>ఆప్నోద్యో అయం మధ్యమః<br>ప్రాణః తాని జ్ఞాతుం దధ్రిరే। | మృత్యుదేవత తన వినాశనశక్తితో వాక్కు మొదలైన ఇంద్రియములను తనలోనికి పొందసాగింది. అప్పుడిక ఇంద్రియ వ్యాపారములైనట్టి చూపు, వినికిడి, స్పర్శ, రస, గంధములు శ్రమను పొందుచూ నిరోధించబడసాగాయి.<br>మృత్యువు వాక్కు, చక్షువులు, చెవులు మొదలైనవన్నీ మ్రింగివేసి, ఆ తరువాత "శరీరము యొక్క మధ్యగా ఉన్న ముఖ్య ప్రాణమును కూడా మ్రింగివేస్తాను" - అని శరీరమధ్యస్థానమును సమీపించసాగింది.<br>మృత్యువు యొక్క చర్యలచే వాక్కు, చూపు, వినికిడి, స్పర్శ, రుచి - ఇవన్నీ శ్రామ్యము (Restlessness) పొందసాగాయి. ప్రాణము మాత్రము ప్రశాంతముగానే ఉండసాగింది. |
| (అయం) వై నః శ్రేష్ఠో యః సంచరగ్ంశ్చ,<br>అసంచరగ్ంశ్చ న వ్యథతే (అథో) న రిష్యతి। | అయితే మృత్యువు 'ఈ ప్రాణశక్తిని మింగాలి' అని సమీపించినప్పటికీ దేహములో సంచారములు 'ఉండి-లేక' యున్న ముఖ్య ప్రాణమును ఏమాత్రము నిరోధించలేక పోయింది. అట్టి ముఖ్య ప్రాణమే శరీరములో శ్రేష్ఠమైనది. మృత్యువుచే మ్రింగబడజాలనిది. |
| హన్తా అస్యైవ సర్వే రూపమ్ అసామేతి।<br>త ఏతస్యైవ సర్వే రూపమభవగ్ం<br>తస్మాత్ ఏత ఏతేన ఆఖ్యాయన్తే ప్రాణా ఇతి<br>తేన హ వావ తత్కులమ్ ఆచక్షతే। | అప్పుడు ఇంద్రియములన్నీ కూడా - "ప్రాణమే మనలో శ్రేష్ఠమైనది. కనుక మనము ప్రాణముతో ఏకమయి ఉండెదముగాక।" అని తలచి. తిరిగి ప్రాణరూపమునే ఆత్మగా పొందినాయి. అందుచేతనే "ఇంద్రియములన్నీ ప్రాణ స్వరూపములే" అని (విజ్ఞులచే) చెప్పబడుతోంది. |
| యస్మిన్ కులే భవతి<br>య ఏవం వేద। | "ఇంద్రియములన్నీ ముఖ్య ప్రాణాత్మకమైనవే। ముఖ్యప్రాణప్రదర్శనములే" - అని ఎరిగినవాడు తను జన్మించిన వంశమునకు యశస్సు కలిగించుచున్నాడు. |
| య ఉ హైవం విదా<br>స్పర్థతే అనుశుష్యతి। అనుశుష్యహైవ<br>(ఏ) అన్తతో మ్రియత।<br>ఇతి అధ్యాత్మమ్॥ | **ఇంద్రియములను ప్రాణాత్మకంగాను, ప్రాణములను మృత్యురహితంగాను ఎరుగనివాడు, ప్రాణములు మృత్యువుకు విషయము కాదు" అనునది గమనించనివాడు (లేక) ఈ పాఠ్యాంశ విషయము వ్యతిరేకించువాడు - ఈ దేహమునందు మూర్ఛ, మరణము చవి చూచుచున్నాడు.**<br>**ఇంద్రియములను ప్రాణాత్మకంగాను, ప్రాణస్వరూపం గాను, ప్రాణశక్తి ప్రదర్శనంగాను ఎరుగబడు గాక। ఇది 'అధ్యాత్మము'।** |

| <u>అధిదైవతము</u> | <u>అధి దైవతము – వాయువ్రతము</u> |
|---|---|
| **22.** అథ అధిదైవతం।<br>“జ్వలిష్యామి ఏవ అహమ్<br>ఇతి అగ్నేః దధ్రే।” | ఇప్పుడిక “అధిదైవతము” గురించి వివరించుకుంటున్నాము.<br>ఒక సందర్భములో...<br>అగ్ని “నాకు నేనే వస్తువులను కాలుస్తూ జ్వలించగలను” అని భావన చేయసాగింది. |
| “తప్స్యామి అహమ్ ఇతి ఆదిత్యో”<br>“భాస్యామి అహమ్ ఇతి చంద్రమా।” | సూర్యుడు (ప్రజ్ఞ) - “నాకు నేనే తపించుచున్నాను” అని తలంచసాగారు.<br>చంద్రుడు (మనస్సు) - “నాకు నేనే వెలుగుచున్నాను” - అని అనుకోసాగారు.<br>ఈ విధమైన భావంతో ధారణ చేయసాగారు. |
| ఏవమ్ అన్యా దేవతా<br>యథా దైవతగ్ం। | అట్లాగే తదితర దేహములోని అధిష్ఠాన దేవతలందరు (శబ్ద స్పర్శ గ్రంధ ఇత్యాది దేవతలు కూడా) “మాకు మేమే ఇదంతా నిర్వర్తిస్తున్నాము” - అని అహంకరించసాగారు. |
| స యథైషాం ప్రాణానాం<br>మధ్యమః ప్రాణ ఏవమ్<br>ఏతాసాం దేవతానాం వాయుః। | అయితే వాక్కు మొదలైన ఇంద్రియముల మధ్యగా ఉన్న ముఖ్య ప్రాణము మాత్రము ఎట్టి అహంకారము పొందకుండా తనయొక్క వాయు కదలికలచే దేహంలో ప్రవర్తిస్తూ మౌనంగా తన ప్రదర్శనలు కొనసాగించ సాగింది. తదితర దేవతా రూపములను తనవిగా కలిగి ఉండసాగింది. |
| మ్లోచన్తి హి అన్యా దేవతా। న వాయుః।<br>సైషా (స ఏషా) అనస్తమితా దేవతా యత్ వాయుః। | కాలానుగతంగా మృత్యువు యొక్క చర్యలచే అన్యదేవతలు వాడిపోసాగారు. అస్తమయము పొందసాగారు. ప్రాణము మాత్రము మ్లోచము (వాడిపోవటము, అలసిపోవటం) పొందలేదు. వాయువు అలసిపోలేదు. అప్పుడు దేహములోని అధ్యాత్మము, అధి దైవతము - ఈ రెండూ చర్చించుకొని “వాయు (ప్రాణ) స్వరూపవ్రతమే భంగము కానిది” - అని నిర్ణయించుకున్నాయి. |
| **23.** అథ ఏష శ్లోకో భవతి।<br>యతశ్చ ఉదేతి సూర్యో<br>అస్తం యత్ర చ గచ్ఛతి – ఇతి,<br>ప్రాణాద్వా ఏష ఉదేతి, ప్రాణే అస్తమేతి, | ఆ తరువాత ఈ విధమైన మంత్రము (నియంత్రణ) చెప్పబడ సాగుతోంది.<br>“ఎక్కడ సూర్యుడు ఉదయించటం, అస్తమించటం జరుగుతోందో, అట్టి ఉదయాస్తముల ప్రదర్శనము ప్రాణశక్తి ప్రదర్శనములే”. |
| తం దేవాః చక్రిరే ధర్మగ్ం<br>స ఏవ అద్య। స ఉశ్వ ఇతి।<br>యద్వా ఏతే అముర్హ్యధియన్త<br>తదేవాపి అద్య కుర్వన్తి॥ | అధ్యాత్మ స్వరూపములైనట్టి వాగింద్రియము, చక్షురింద్రియము, ఘ్రాణేంద్రియము, హస్తేంద్రియము మొదలైనవి, అధిదేవతా స్వరూపులైన అగ్ని, సూర్యుడు మొదలైన దేవతలు ప్రాణదేవత వ్రతమునే నిర్వర్తిస్తున్నారు. అందుచేత ఈ జీవులు “ప్రాణతత్త్వోపాసనచే మృత్యువు నన్ను సమీపించదు” - అని తెలుసుకొని, ప్రాణోపాసనా వ్రతమును మనసా వాచా నిర్వర్తించెదరు గాక। |
| తస్మాత్ ఏకమేవ వ్రతం చరేత్<br>ప్రాణ్యాచ్చైవ అపాన్యాచ్చ<br>నేన్మా పాప్మా మృత్యుః ఆప్నువదతి।<br>యత్ ఉచరేత్ సమాపి పయిషేత్ తేనో। | అట్టి ప్రాణ-అపాన ఏకోపాసన వ్రతము ఆచరించువానిని మృత్యువు, పాపము సమీపించవు. అట్టివాడు అమృతతుల్యుడు అగుచున్నాడు.<br>ప్రాణోపాసనను పూర్తిగా చేయకపోతే (సంతృప్తిగా చేయకపోతే) అది ప్రాణ తిరస్కారంతో సమానము. |
| ఏతస్యై దేవతాయై సాయుజ్యగ్ం<br>స లోకతాం జయతి।<br><u>ఇతి తృతీయాధ్యాయః పంచమ బ్రాహ్మణమ్।</u> | ప్రాణోపాసన (అధ్యాత్మ స్వరూప - అధి దేవతా స్వరూప ఉపాసన) అనబడే ప్రాణవ్రతము నిర్వర్తించటంచేత ప్రాణదేవతతో సారూప్య సామీప్య, సాలోక్య, సాయుజ్యానుభవము సిద్ధించగలదు.<br>**<u>3వ అధ్యాయము 5వ బ్రాహ్మణము సమాప్తము.</u>** |

# షష్ఠమ బ్రాహ్మణము

## 6. నామ రూప కర్మాత్మక శరీరమ్ (దేహమ్)

| | |
|---|---|
| వాక్కు బ్రహ్మమే | ఈ సృష్టి మొత్తము మూడు రూపములతో కూడి ఉన్నది. |
| 1. త్రయం వా ఇదం - నామ, రూపం, కర్మ। | (1) నామము (2) రూపము (3) కర్మ |
| **(1) నామ-వాక్ ఆత్మకము** | **నామాత్మకము** |
| తేషాం నామ్నాం 'వాక్' ఇత్యేతత్<br>ఏషామ్ ఉక్థమతో హి సర్వాణి నామాని ఉత్తిష్ఠన్తి।<br>ఏతత్ ఏషాగ్ం సామ<br>ఏతత్ హి సర్వైః నామభిః సమమ్ ఏ తత్।<br>ఏషాం బ్రహ్మైతద్ధి సర్వాణి నామాని బిభర్తి॥ | వాటిలో నామము అనునదే వాక్కు. నామములన్నీ వాక్కు నుండే ఉత్థిష్ఠత పొందుచున్నాయి. (వాక్కు నుండే నామము పుట్టుచున్నది)<br>సమస్త నామములకు వాక్కు సామాన్యము (common) అయి ఉన్నది. వాక్కు సమస్త నామములకు సమానమైనట్టిది. అందుచేత, 'వాక్కు' అనబడేది సమస్త నామములకు 'బ్రహ్మము' అయి ఉన్నది. |
| **(2) నేత్రేంద్రియము బ్రహ్మము - రూపాత్మకము** | **రూపాత్మకము** |
| 2. అథ రూపాణాం చక్షుః<br>ఇతి ఏతత్ ఏషామ్ ఉక్థమతో హి<br>సర్వాణి రూపాణి ఉత్తిష్ఠన్తి। | రెండవది అగు రూపము చక్షువులచే (కళ్లచే) చూడబడుతోంది. నేత్రేంద్రియము (లేక) చక్షురింద్రయమే సమస్త రూపములకు కారణము. సమస్త రూపములు నేత్రేంద్రియము నుండే జన్మిస్తున్నాయి. |
| ఏతత్ ఏషాగ్ం సామైతద్ధి<br>సర్వై రూపైః సమమేతత్।<br>ఏషాం బ్రహ్మై తద్ధి సర్వాణి రూపాణి బిభర్తి॥ | కాబట్టి సమస్త రూపములకు సంబంధించి చక్షురింద్రయము సమస్వరూపమై, సర్వరూపములలో సమానమై ఉన్నది. సమస్త రూపములు ధరిస్తోంది కాబట్టి చక్షురింద్రియము బ్రహ్మమే అయి ఉన్నది. |
| **(3) కర్మాత్మకము** | **కర్మాత్మకము** |
| 3. అథ కర్మాణాం ఆత్మా - ఇతి।<br>ఏతత్ ఏషామ్ 'ఉక్థమతో హి<br>సర్వాణి కర్మాణి ఉత్తిష్ఠన్తి।<br>ఏతత్ ఏషాగ్ం సామా<br>ఏతత్ హి (ఏతద్ధి) సర్వైః కర్మభిః సమమ్।<br>ఏతత్ ఏషాం బ్రహ్మ। ఏతత్ హి<br>(బ్రహ్మైతద్ధి) సర్వాణి కర్మాణి బిభర్తి। | ఇక సమస్త కర్మలకు జీవాత్మయే కారణము. జీవాత్మ దేహముతో కర్మలు నిర్వర్తిస్తున్నాడు. కనుక దేహమే సర్వ కర్మలకు జననస్థానము.<br>సర్వ కర్మలకు దేహమే సామము, సమానకారణము. ఈ దేహమే సమస్త కర్మలకు సమస్వరూపమై ఉన్నది. (అన్ని కర్మలకు శరీరము ఒక్కటే కారణము కదా)।<br>ఈ శరీరమే కర్మలను ధరిస్తోంది. కాబట్టి సమస్త కర్మలకు ఈ దేహమునకు 'దేహి' అగు జీవుడే భరిస్తున్నాడు. |
| తదేతత్ త్రయం సత్ ఏకమయమ్। | ఈ విధంగా 'నామము రూపము కర్మ' - ఈ మూడు కూడా ఏకమయము. |
| ఆత్మాత్మో ఏకః సత్। | **ఆత్మయే ఏకస్వరూపమై ఈ మూడుగా ప్రదర్శితమౌతోంది.** |
| న ఏత త్రయం తదేతత్<br>అమృతగ్ం సత్యేన ఛన్నం | అమృత స్వరూపమగు సత్యము (ఆత్మ) చేతనే ఈ నామ రూప కర్మలు కప్పబడినవై ఉన్నాయి. |
| ప్రాణో వా అమృతం నామ రూపే సత్యం।<br>తాభ్యాం అయ ప్రాణశ్ఛన్నః॥ | అవన్నీ ప్రాణముచేత (ప్రాణ శక్తి చేతనే) సర్వదా ఆవరించబడి ఉన్నాయి. |
| ఇతి-బృహదారణ్యకోపనిషత్<br>తృతీయాధ్యాయః। షష్ఠమ బ్రాహ్మణః॥ | బృహదారణ్యకోపనిషత్ తృతీయాధ్యాయము। సమాప్తము |

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

1

# బృహదారణ్యకోపనిషత్

## తృతీయ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### అధ్యయన పుష్పము



## 1. ప్రథమ బ్రాహ్మణము

### 'విశ్వము' అనబడు 'అశ్వమేధాశ్వము'

ఈ విశ్వమంతా ఒక **యజ్ఞము** (లేక)– **యాగము**తో పోల్చతగినది.

అట్టి విశ్వదృశ్యమును అశ్వమేధయాగములోని యజ్ఞాశ్వముగా అన్వయించి చెప్పబడుతోంది.



**మేధ** = బుద్ధి.

**అశ్వము** = మనోరూపుడగు జీవుడు.

**సంచరించే స్థానము** = పాంచభౌతిక జగత్తు.

**గెలువ వలసినది** = సోఽహమ్ లేక ఆత్మాహమ్ భావన.

❖ ❖ ❖

అట్టి 'విశ్వరచన' అనే యజ్ఞాశ్వమునకు

- ఉషోదయము (Dawn, బ్రహ్మముహూర్తము) – శిరస్సు
- సూర్యుడు – చక్షువులు
- వాయువు – ప్రాణము.

- అగ్నియే ఉష్ణము (వైశ్వానరము). సంవత్సరమే – ఆత్మ (జీవాత్మ).
- ద్యులోకము (దేవతా లోకము, స్వర్గలోకము) – వీపు.
- ఆకాశమే – ఉదరము (పొట్ట).
- పృథివి (భూమియే) – అద్దాని పాదస్థానము (పాదాస్యము).
- **తూర్పు దక్షిణ పడమర ఉత్తర – దిక్కులే** ఆ యాగాశ్వము యొక్క **పార్శ్వములు.**
- ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి, వాయువ్య అవాంతర దిక్కులే ఆ విశ్వయజ్ఞాశ్వము యొక్క **ప్రక్కటెముకలు.**
- "వసంత గ్రీష్మ వర్ష శరత్ శిశిర హేమంత" – '6' ఋతువులు ఆ అశ్వము (గుఱ్ఱము) యొక్క **అవయవములు.**
- చైత్ర వైశాఖ జ్యేష్ఠ ఆషాఢ శ్రావణ భాద్రపద ఆశ్వయుజ కార్తీక మార్గశిర పుష్య మాఘ ఫాల్గుణములనబడే 12 మాసములు – ఆ గుఱ్ఱము యొక్క సంధులు.
- ప్రతి మాసములోని శుక్ల – కృష్ణ పక్షములు అద్దాని పాదములు.
- రాత్రింబవళ్లే ఎముకలు.
- **నక్షత్రములే** అద్దాని ప్రతిష్ఠ (కాంతిపుంజములు).
- **ఆకాశములోని మేఘములే** – అద్దాని మాంసపుంజములు.
- **ఇసుక నేలయే** ఆ సృష్టియజ్ఞాశ్వము యొక్క అశనము (ఆకలి).
- **భూమిపై ప్రవహిస్తున్న నది – ఉపనదులే** అద్దాని నాడులు.
- పర్వతములే – ఆ గుఱ్ఱముయొక్క హృదయమునకు చెందిన దక్షిణ – ఉత్తర భాగములలోగల మాంసపిండములు.
- ఓషధి – వనస్పత వృక్షజాలము, ఆహార ధాన్యములు, (పెసలు, మినుములు మొ॥న) అపరములు – ఆ గుఱ్ఱము యొక్క వెంట్రుకలు (కేశములు, రోమము).
- ఉదయము నుండి మధ్యాహ్నము వరకు (6 AM to 12 Noon) ప్రకాశించు సూర్యుడు – ఆ గుఱ్ఱము యొక్క తూర్పు దిక్కు. మధ్యాహ్నము నుండి సాయంకాలము ( 12 Noon to 6 PM) వరకు ప్రకాశించు సూర్యుడు – అద్దాని ఉత్తరదిక్కు.
- విద్యుత్ (వెలుగుయే) ఆ గుఱ్ఱముయొక్క అంగముల విస్తరణ. వర్షమే అద్దాని మూత్రవిసర్జన.
- వాక్కు, సమస్త శబ్దములు ఆ గుఱ్ఱము యొక్క సకలింపులు.
- ఇంకా కూడా అహోరాత్రములు (రాత్రింబవళ్లు) – అశ్వమేథ యాగంలో అశ్వమును పూజించునపుడు అమర్చే బంగారు – వెండి మంగళ జలపాత్రలు.
- తూర్పు – పశ్చిమ సముద్రములు ఆ పాత్రలు ఉంచు స్థానములు.

ఈ విధంగా ఈ విశ్వ – అశ్వ మేధము (లేక) మేధాశ్వము (లేక) **ప్రజ్ఞా–విషయ సంచారము** – ధ్యానించబడు గాక!

ఈ సమస్తము కూడా అట్టి అశ్వమేధాశ్వము యొక్క (లేక) పరమాశయమగు పరమాత్మ యొక్క మహిమయే. ఈ విధంగా ప్రజాపతి (సృష్టికర్త) యొక్క అంగముగా గల ఈ దృశ్య జగత్తుకు **సముద్రమే ఉత్పత్తి స్థానము.**

అందుచేత ఆత్మధ్యాన సిద్ధికొరకై "ఈ దృశ్య జగత్తుకు సముద్రము పుట్టినిల్లు" అని ధ్యానించబడు గాక।

-----

## బృహదారణ్యకోపనిషత్ - 3వ అధ్యాయము

## ద్వితీయ బ్రాహ్మణము

## 2. మానసికాశ్వమేధ యాగము

మేధ = **బుద్ధి.** అశ్వము = **మనస్సు.**

సంచరించునది = **దృశ్య జగత్తులు.** ఆశయసిద్ధి = **సోఽహమ్, తత్త్వమ్ భావన.**

**ఓం। నైవ ఇహ కించన అగ్ర ఆసీత్। మృత్యునైవ ఇదమ్ ఆవృతమ్ ఆసీత్। (3-2-1)।**

ఏ నామరూపాత్మకమైన ప్రపంచము ఎదురుగా కనిపిస్తోందో ఇదంతా కూడా మొట్టమొదట ("సృష్టి"కి పూర్వం) కించిత్ కూడా లేనే లేదు. సృష్టిగాని, లయముగాని లేవు. భక్షించు ధర్మముగల (మార్పు-చేర్పుల ప్రదర్శనరూపమగు) మృత్యువు కూడా లేదు. మొట్టమొదట కేవలమగు పరమాత్మ (The All beyond Absolute Self) మాత్రమే అఖండమై, నిర్విషయమై ఉన్నది. అట్టి కేవలము నుండి లీలగా, క్రీడగా 'సృష్టి' యొక్క (కల్పనయొక్క, అన్యము యొక్క) అభిలాషగా ఒకానొక **పురుషకారము** (An inclination and Inspiration of workmanship) బయల్వెడలింది.

అనన్యము నుండి జనించిన అట్టి అన్యాభిమాన పురుషకారమే **'హిరణ్యగర్భుడు'** . ఆయనయే అన్యరూపమగు **ఈ సృష్టి అంతటికీ కర్త**. అట్టి హిరణ్యగర్భుడు **'సంకల్పము', 'భావన'** మరియు **'ఉత్సుకత'** లను సూక్ష్మతర దేహముగా కలిగిఉన్నారు.

**ఆయన నుండి మననరూపమగు 'మనస్సు' బయల్వెడలింది.**

అట్టి పరమాత్మ నుండి జనించిన హిరణ్యగర్భుడు - సృష్టియొక్క సామర్థ్యముకొరకై తనయొక్క జననస్థానమగు పరమాత్మను పూజించటానికై (అర్చించటానికై) ఉపయుక్తంగా ఉదకము (జలము) ను జనింపజేసారు. **అశ్వమేథ యాగ విధులలో గల జలముతో అభిషేక ప్రారంభము ఇదియే. య ఏవమ్ ఏతత్ అర్కస్య అర్కత్వం వేద।** పరమాత్మతత్త్వోపాసనా సహకారికముగా జలమును ఎరిగినవాడు జలముచే సుఖము పొందగలడు.

అట్టి ఉదకము (ఆపః) **సూర్యుని తేజోరూపము కూడా** అయి ఉన్నది. జలములో ఏ **రసతత్త్వము** స్థానము కలిగిఉన్నదో - అట్టి రసతత్త్వమే ఘనీభూతమై పృథివీరూపముగా కూడా దాల్చుచున్నది. హిరణ్యగర్భుడు శ్రమించినవాడై జలతత్త్వము నుండి పృథివీతత్త్వము జనింపజేస్తున్నారు.

తస్య శ్రాన్తస్య తప్తస్య తేజో రసో నిరవర్తత అగ్నిః। **(3-2-1)।** అట్టి సృష్టి సంకల్పియగు హిరణ్యగర్భుడు **శ్రమ, సంతాపములను** పొందినవారైనారు. అప్పుడు తన **'తేజస్సు'** యొక్క **'సారము'**గా **అగ్నిని సృష్టియందు ప్రవేశింపజేయసాగారు.**

❖ ❖ ❖

పరమాత్మయొక్క సృష్ట్యభిమానరూప తేజో ప్రదర్శనా రూపుడగు హిరణ్యగర్భుడు - **సృష్టి కల్పనా చమత్కారముయొక్క సంసిద్ధత** కొరకై తనను తాను **మూడు** విధములుగా విభజించుకొంటూ ప్రదర్శనము కలిగి ఉంటున్నారు. (1) **అగ్ని** (2) **ఆదిత్యుడు** (3) **వాయువు.**

((1) **త్రేతాగ్నులు** = ఆహవనీయాగ్ని, గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని

(2) **ఆదిత్య తృతీయః = ఆదిత్యుడు, మనువు, రుద్రుడు। సృష్టి, స్థితి, లయము.**

(3) **వాయుం తృతీయగ్ం** = నిశ్చలవాయువు, వాయుచంచలము (వాయుతరంగములు), వాయువుచే తదితరల వస్తువుల కదలికలు

ఇంకా కూడా..., త్రికరణములు = **మనో వాక్ కాయములు.**





{**త్రిపుటిత్రయము** = జ్ఞాతృ – జ్ఞాన – జ్ఞేయములు (తెలుసుకొనువాడు – తెలుసుకొనుట – తెలియబడునది)
– కర్తృ – కారణ – కార్యములు (The Doer, The Cause and The Doing)
– ద్రష్ట – దర్శన – దృశ్యములు} (The Perceiver, The Perception, The Context).

**పరమ పురుషుడగు ప్రాణేశ్వరుని ప్రాణశక్తియే** ఈఈ చెప్పబడుచున్న **రూపములన్నీ దాల్చుచున్నది.** అదియే ప్రాణ అపాన వ్యానములుగాను, వ్యష్టి – సమష్టి – కేవల ఆత్మతత్త్వముగాను, నామ–రూపములుగాను ధారణ చేస్తోంది.

ఈ విధంగా **ఏకమే అయి, (త్రి)విధములుగా ప్రదర్శనమగుచున్న ప్రాణాగ్ని** (లేక) **ప్రాణశక్తి**కి (లేక) **ప్రాణేశ్వరుడగు పరమాత్మకు** ఈ **విశ్వము ఒక ధారణా వస్తువు** వంటిది – అగుచున్నది. అట్టి ప్రాణశక్తియొక్క విశ్వరచనకు :-

- తూర్పు దిక్కు (East) – **శిరస్సు.**
- ఈశాన్య (North – East), ఆగ్నేయ(South – East) ములు – **రెండు బాహువులు.**
- పశ్చిమ దిక్కు (West) – **దేహముయొక్క క్రిందవైపు భాగము.**
- వాయువ్య (North – West) , నైరుతి(South – West) – **రెండు తొడలు.**
- దక్షిణ (South) ఉత్తరములు (North) – **ఉభయ పార్శ్వములు** (The two sides)
- ద్యు – స్వర్గ (దివ్య, దేవత, అశరీర ప్రజ్ఞా) లోకము – **వీపు.**
- అంతరిక్షము (ఆకాశము).
- ఇయమ్ (భూమి) – కనబడేదంతా ఆయన **ఉదరము (వక్షస్థలము).**

అట్టి ప్రాణశక్తి తనయొక్క అగ్నిరూపముచే జలస్వరూపమునందు ప్రతిష్ఠితమైనట్టిదగుచున్నది. పరమాత్మయే జలస్వరూపుడై (పౌరాణిక నామమగు వరుణుడై) ప్రదర్శనమగుచున్నారు.

ఎవ్వరైతే **"పరమాత్మయొక్క హిరణ్యగర్భ రూప ప్రాణశక్తియే సర్వత్రా అగ్నిరూపమున ప్రతిష్ఠితమై యున్నది"** – అని గమనిస్తూ ఉంటారో, అట్టివారు ప్రాణమును, అగ్నిని ఉపాసించిన ఫలము పొందుచున్నారు.

❖ ❖ ❖

పరమాత్మయొక్క స్వయం ప్రకాశాంశరూపుడు, హిరణ్యగర్భుడు అగు **బ్రహ్మదేవుడు** – తాను ఏకము, ఏకాత్మకము, అఖండము అగు ఆత్మయే అయి ఉండి కూడా, **"ఆత్మనగు నాకు ద్వితీయము (నాకు వేరుగా ఉన్నట్లు కనిపించేది, అనిపించేది) సిద్ధించును గాక।** అని ఇచ్ఛ, వేదన పొందసాగారు. **(అకామయత)**. అప్పుడు, "అన్యము గురించిన **మననమే తన రూపముగా (chanting of outer scenario) కలిగినట్టి మనస్సు"** జనించింది. మనస్సుతోబాటే మనస్సుకు, **వేరుకానట్టి [ (కానీ) మిధునము (జంట)గా ] 'వాక్కు'** జనించింది. మనస్సు–వాక్కుల కలయికయే **వేదవాఙ్మయముగా** ప్రదర్శితమవసాగింది.

ఆ ప్రజాపతిచే సృష్టించబడిన ఉదకములో ఆయన రేతస్సు (తేజస్సు) ప్రవేశించింది. ఇక ఆయన **బ్రహ్మాండములను తన గర్భము ధారణ చేయటం చేత "హిరణ్యగర్భుడు"** అయినారు. ఆయనయే సంవత్సరాత్మకుడు (కాలస్వరూపుడు) కూడా. ఆయన నుండి అండము ప్రదర్శనమవసాగింది. (అదియే బ్రహ్మాండము).

ఒక సంవత్సరము (బ్రహ్మవత్సరము) తరువాత ఆ అండమును ఛేదించి ఆయనయే తేజోరూపుడు (లేక) అగ్నిరూపడైనారు.

ఆ పరమాత్మ హిరణ్యగర్భ సృష్టికల్పనను స్వీకరించినవారై, **సృష్టియందు జీవాత్మ స్వరూపములు** ధరించసాగారు. ఆ జీవాత్మ తనయొక్క పరమాత్మత్వము ఏమరచునట్లుగా **'అజ్ఞానము'** – అప్పటికప్పుడే కల్పించబడింది.





**తం జాతమ్ అభివ్యాదదాత్, స 'భాణ్' అకరోతి। (3-4-4)। సైవ వాక్ అభవత్।** ఆ ప్రజాపతి యొక్క **'సృష్టి అంశజుడు'** - అప్పుడు 'భాణ్' - అను శబ్దమును ఒంటరితనమునకు సంబంధించిన భయముతో కూడి ఉచ్చరించారు. అట్టి "భాణ్" శబ్దమునుండి 'భూ' మొదలైన (త్రి) వ్యాహృతులు రూపము (Extended Form) దాల్చాయి.

"భూః" (Matter) (Physio-logical).

"భువః" (Thought) (Psycho-logical).

"సువః" (తేజోమయము) (Enlightenment logical).

అనే వ్యాహృతుల రూపమైన **క్షేత్రములు** (Fields), **వాక్కు** జనించాయి.

ఆ విధంగా వ్యాహృతులను ఎలుగత్తి పలుకుచున్న ఆ ప్రజాపతి సంకల్ప పుత్రుని (జీవుని) (ఏడుస్తున్న పుత్రుని తండ్రి సముదాయించుతీరుగా) సముదాయించటానికై **"అనుభవించబడుచున్నది"** రూపమగు **"అన్నము"** ను సంకల్పించారు. అప్పుడు శబ్దస్పర్శ రూప రస గంధములనబడే పంచేంద్రియ విషయ పరంపరలు కల్పించబడ్డాయి. [ అవియే 'అన్నము' అను శబ్దముచే (వేద వాఙ్మయముచే) చెప్పబడుచున్నాయి ].

*ఆ ప్రజాపతి తన యొక్క ఆత్మశక్తి నుండి బయల్వెడలిన వాక్కు నుండి :*

- ఋక్ యజుః సామ త్రివేదములు. (వేదమంత్రములు),
- ఛందస్సు (శబ్దము యొక్క విధానబద్ధము).
- దేవతాహ్వాన-ఉపాసనా రూపములగు యజ్ఞ వాఙ్మయము,
- ప్రజలు (మానవులు), జంతుజాలము,
- తదితర సమస్త సృష్టి విశేషములు - జనించాయి.

ప్రజాపతియే సంకల్పాత్మకంగా పాంచ **భూతాత్మికంగాను, సాకార విశేషములతో**ను, ఆయా **వస్తు ధర్మములతోను** 'అన్నము' అనబడు దృశ్యవిశేషములను సృజియించారు. **సమస్తమును సృజించిన ఆత్మ భగవానుడే సృష్టి సంకల్ప చమత్కారముగా →**

→ సమస్త జగత్ రూపము (అనుభవమగుచున్నది) (All that being experienced) గాను,

→ సమస్తమునకు అనుభవి (The Experiencer) గాను,

**అగుచున్నారు.**

సమస్త జగత్తు - ఆతనికి → **అన్నము.**

అదంతా తానే సంకల్పించుటచే ఆయనయే అన్నాదము (లేక) అన్నాదుడు (అన్నము సృజించువారు) కూడా।

ఈవిధంగా **"సమస్త సృష్టియొక్క (1) అన్నాదము (ప్రదాత) (2) అనుభవి - ఆ పరమాత్మయే"** అను రూపమగు అద్వితీయ తత్త్వము ఎరిగినవాడు **తానే సర్వాత్మకుడై ప్రకాశించగలడు.** అన్న-అన్నాదరూపముగా పూర్ణుడై ఉండగలడు.

❖ ❖ ❖

అప్పుడు ఆ ప్రజాపతి **"సృష్టియొక్క కార్యక్రమము కొరకై విశ్వయజ్ఞము నిర్వర్తించాలి"** అని కోరిక పొందారు. తపనరూపమగు తపస్సు ప్రారంభించారు. అట్టి తపస్సు చేస్తూ ఉండగా, ఆయనయొక్క పరిశ్రమ నుండి **యశో-వీర్యములు (కీర్తి బలములు)** అనబడేవి బయల్వెడలాయి. ఆ ఉభయము తపోశక్తి నుండి, ప్రాణశక్తి నుండి బయల్వెడలినట్టివే. అట్టి ప్రాణశక్తి నుండే -

- "ఇల్లు" వంటి భౌతికదేహము,
- ఆ భౌతిక దేహము నందు చూపు - వినికిడి - స్పర్శ - వాక్కు - సువాసన అనే పంచేంద్రియ (ప్రాణశక్తి) రూపములు **- రూపుదిద్దుకోసాగాయి.**

అట్టి ఈ భౌతిక శరీరములో ప్రాణశక్తి, ప్రాణశక్తి ప్రదర్శనా రూపములగు పంచేంద్రియములు ఏర్పడినప్పటికీ, **ఇది స్వయముగా ప్రవర్తించలేకపోయింది.** అప్పుడు పరమాత్మకు చెందిన తేజోవిభవమగు **మనన రూప "మనస్సు"** – శరీరమును ఆశ్రయించినదిగా అవసాగింది.

ఇప్పుడు – ప్రాణ, ఇంద్రియ, మనస్సులు 'సృష్టి' అనే క్రీడ సిద్ధించటానికై ఒకదానితో మరొకటి సంబంధము పొందసాగాయి. సృష్టి యజ్ఞభావము నుండి బాహ్యరూపముతో కూడిన బ్రహ్మాండము (విశ్వము) – జనించింది. అది **'అశ్వమేధ'**గా అభివర్ణితము అవుతోంది.

**అశ్వమేధ: మేధ = బుద్ధి. అశ్వ= మేధస్సు యొక్క సచేతన సముత్సాహము.**

ఇట్టి విశ్వరచనా అశ్వమేధమును ఎరిగినవాడే అశ్వమేధాయాగముయొక్క **వైదాంతికమైన అంతరార్థమును ఎరిగినవాడు.**

---

ఆ విధంగా ప్రజాపతి మనో అశ్వము చేతనే సృష్టియాగము నిర్వర్తిస్తున్నవారగుచున్నారు. సంవత్సరము తరువాత ఆ అశ్వమును ఛేదించారు. [ మనస్సును – (1) పదార్థ (అంతర్) విభాగంగాను (2) ప్రాపంచక (బాహ్య) విభాగంగాను ఛేదించారు.]

అప్పుడు ప్రజాపతి సృష్టిని ఈ విధంగా సంకల్పించసాగారు.

- ఇక ఈ నా సృష్టిలో అనేక లక్షణ – విలక్షణములతో కూడిన సదేహులగు జీవ–జంతు మానవ ప్రాణులను, వారివారి ఆశయములను, జీవనభృతులను, సుఖ దుఃఖ, బంధ మోక్షములను కల్పించెదనుగాక.
- అట్టి దేహ, జీవన, ఆహార, విహారములు జరగటానికి వీలుగా **అభౌతిక దేహులగు దివ్యప్రజ్ఞలను** (దేవతలను) సృష్టిస్తాను.
- అట్టి దివ్యప్రజ్ఞులగు అశరీరుల పోషణ, పాలనల కొరకై పాలు ఇవ్వగల పశువులు మొదలైన జంతుజాలమును కూడా సంకల్పిస్తాను.

❖ ❖ ❖

ఈవిధమైన **మానసికాశ్వ–ఛేదన విధానంగానే** అశ్వమేధయాగములో యాగాశ్వమును సంవత్సర కాలము సంచారము చేయించి, అది వెళ్ళు (మనస్సు వెళ్ళుచున్న) స్థానములను జయించి, సంవత్సర కాలము తరువాత అగ్ని – సూర్య – (తదితర) దేవతలకొరకై ఆ అశ్వమేధ యాగాశ్వమును ఛేదించు విధానము చెప్పబడుతోంది.

సృష్టిలో సూర్యప్రవేశ స్థానము, సూర్యుని సంచారముచే సంవత్సరము, తదితర కాల విభాగములు **కల్పించబడ్డాయి.**

❖ ❖ ❖

యజ్ఞంలో అంతర్లీన సాధనరూపమైయున్న యాగాగ్నికి – స్వర్గ మర్త్య, పాతాళ లోకములు **మూడు దేహములు.**

అగ్ని, సూర్యులకు (ఆదిత్యులకు) అశ్వమేధ యజ్ఞమునకు అంతటికీ **ఆత్మ – ప్రజాపతియే**. అగ్ని, సూర్యులు పరస్పరము ఆధార – ఆధేయములు.

ఎవరైతే **అగ్ని సూర్యులను, వారి పరస్పర నిజరూపములను, పరస్పర సాధనా రూపములను – సృష్టికర్త యొక్క సంకల్ప విశేషములుగా** గ్రహిస్తారో, అట్టివారు మృత్యువును, అపమృత్యువును జయించగలరు.

అమృతస్వరూపమగు కేవలాత్మతో మమేకమై ఉండగలరు. **మార్పుకే విషయముకానట్టి ఆత్మస్వరూప భావనను అనునిత్యంగా సిద్ధించుకొనగలరు.**

అట్టి అవగాహనతో ఈ జీవుడు దేహభావమును త్యజించి, "పరము (Beyond All)" అయి ఉన్న విదేహరూపమైనట్టి **"కేవలమగు దేహి"** భావమును సిద్ధించుకొనినప్పుడు, దేవతలలో ఒకడుగా అవగలడు.

## బృహదారణ్యకోపనిషత్ - 3వ అధ్యాయము

## తృతీయ బ్రాహ్మణము

## 3. ప్రాణానంద స్వరూప సిద్ధి

ఇప్పుడు మనము ప్రాణశక్తి యొక్క **విశేష ఔన్నత్యము** గురించి చెప్పుకుంటున్నాము. ప్రజాపతి తాను కల్పించ సృష్టికొరకై తనయొక్క **సంకల్ప రూప తేజస్సు** నుండి ఒకానొక చమత్కారమైన ద్వంద్వమును సృష్టించసాగారు.

**(1) దేవతలు** **(2) అసురులు.** (ఉభయులు ప్రజాపతిచే సృష్టించబడినవారే).

(ఇది ఒక కథా రచయిత కథలో మంచివారిని, చెడువారిని, కష్ట - సుఖ ద్వంద్వములను కథాగమనము కొరకై కల్పించటము వంటిది). రచయిత (ప్రజాపతి) అందులో -

- దేవతల సంఖ్య తక్కువగాను,
- అసురులు సంఖ్య అధికంగాను కల్పన చేయసాగారు.

అట్టి దేవతలు, రాక్షసులు ఒకరితో ఒకరు స్పర్థ పొంది కలహించుకోసాగారు. ఎందుకొరకు? దేవతలు ఆత్మ భగవానుని గురించిన అనుభవము పట్ల, **(ఏకముపట్ల)** అభిమానులు. రాక్షసులలో, ఇంద్రియసంబంధమైన దృశ్య విషయములపట్ల, **(అనేకముపట్ల)** అభిమానులు.

***(1) దేవతల ఆశయము :- ఏకమగు ఆత్మతత్త్వానుభవము వైపుగా (2) అసురుల ఆశయములు :- అనేక భేదయుక్తము అగు దృశ్యానుభవపరంపరల వైపుగా...***

❖ ❖ ❖

ఒక సమయంలో దేవతలు ఇట్లా అనుకున్నారు. **"మేము యజ్ఞములో ఉద్గాతము (యజ్ఞస్తోత్రములను, మంత్రములను) ఎలుగెత్తి గానము చేయుదము గాక। అట్టి ఉద్గీథములను (కార్యనిర్వహణములను) సర్వాత్మకుడు, సర్వతత్త్వ స్వరూపుడు అగు ఆత్మభగవానునికి ఆత్మతత్త్వస్తుతులుగా సమర్పించి, దృశ్యజగత్ పరిధులను అధిగమించివేసెదముగాక। సత్త్వగుణముచే సత్ స్వరూపుని ధ్యానము తపస్సు నిర్వర్తించి, ఆ తరువాత వారిని ఆశ్రయించెదము గాక"।**

ఈ విధంగా తలచి దేవతలు మొదటగా సృష్టిలోని వాక్‌ను (వాగ్దేవతను) సమీపించారు.

## వాక్కు - దైవాసురులు

**ఇంద్రుడు మొదలైన దేవతలు: ఓ వాక్ దేవతా! నీవు మా దేవతల సాత్విక ఆశయము కొరకై విశ్వ యజ్ఞములో ఉద్గాతకర్మను** (అనగా) **ప్రేమాస్పదమైన మాటలను, పరమాత్మ గురించిన స్తోత్రవిధులను నిర్వర్తించాలి.**

**వాక్‌దేవత :** ఓం! తప్పకుండా. మీరు కోరినట్లు విశ్వేదేవతల సాత్త్వికాశయముల కొరకు, **ఉద్గాత్రము చేస్తాను.**

❖ ❖ ❖

ఈ విధంగా పలికి వాక్ దేవత వేదమంత్రములను గానము చేయటం ప్రారంభించారు. అప్పుడు రాక్షసులు, **"ఏమిటిది? దేవతలు వాక్కును క్రమంగా తమ వశం చేసుకొంటున్నారు? ఇట్లాగే అయితే దేవతలు గొప్పవారనిపించుకొని, మమ్మలిని మించిపోతారే మరి?"** అని **అక్కస్సు, అసూయ, అభిమానము, అవమానము** పొందసాగారు. వారు కూడా తపస్సు మొదలైనవి నిర్వర్తించి, చివరికి వాక్కులో - **"పరదూషణ, మాటలతో ఇతరులను బాధించటము, మాటలతో సత్యమును మరుగునపరచటచము, అవమానించటము, అబద్ధములు పలకటము"** - మొదలైన వేదశాస్త్ర విరుద్ధమైన దుష్టవాక్ ప్రయోగమును ప్రవేశింపజేయసాగారు.

ఈవిధంగా వాక్కులో **'పాపము' రాక్షసులచే ప్రవేశింపజేయబడింది.** అప్పుడిక జీవుల సంభాషణలో "భీభత్సము, క్రోధ భాషణము, పరదూషణ, తనను తాను స్తుతించుకోవటము, దుష్ట శబ్దములు, తదితర పరాయి దేశ – జాతి – మత నిందలు" ఇవన్నీ సంభాషలో రూపము పొంది ప్రవర్తించసాగాయి.

## అఘ్రాణము – (సువాసన) – దైవాసురులు

అప్పుడు దేవతలు ఘ్రాణ ఉచ్ఛ్వాస – నిశ్వాస రూపమగు సువాసనా అభిమానదేవతను సమీపించారు.

***"ఓ ఘ్రాణ (వాసనా) అభిమాన ప్రాణదేవతా! మీరు దేవతల కొరకై దైవీగుణములు (సువాసనలు, త్యాగము, దయ, దాక్షిణ్యము, స్నేహము మొదలైన దైవీ సంపత్తి) – ఉద్గాతము (గానము) చేయండి".***

అప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రాణదేవత (ఇష్టరూపదేవత) – దైవీ సంపత్తి యుతము, కల్యాణగుణ ఆశయములు కలిగి ఉండసాగాయి. (ప్రాణాయామము మొదలైనవి ఆత్మతత్త్వానుభవముకొరకు, లోకకల్యాణముకొరకు దైవీగుణ సంబంధంగా మానవులచే నిర్వర్తించబడసాగాయి)

అప్పుడు రాక్షసులు దేవతల విజయము ఏమాత్రము అంగీకరించక, ఏదో రీతిగా ఘ్రాణము (ముక్కు)లో 'దుర్వాసనలు' అనే పాపమును ప్రవేశింపజేయసాగారు. ఇక జనులు "జాత్యహంకార–దుష్టశక్తుల ఆశ్రయం" మొదలైన పాప ఆశయముల కొరకై ఘ్రాణము (ముక్కు) ఆశ్రయించసాగారు. **అప్పుడిక సృష్టిలో సువాసనలతోబాటు దుర్వాసనలు కూడా వెంటనంటి ఉండసాగాయి.**

## చూపు – దైవాసురులు

అప్పుడు దేవతలు చక్షువులను సమీపించారు.

**"ఓ చక్షువులారా! మీరు దైవకార్యమగు ఆత్మయజ్ఞము (సర్వత్ర మధురమగు ఆత్మను దర్శించే యజ్ఞము)నకై సహకరించి, మన "ఆత్మసందర్శన – ఆత్మమేవాహమ్"** (తత్త్వమ్, సోఽహమ్) **దర్శన కార్యక్రమము నెరవేర్చండి. "ఉద్గాతృగానము చేయండి"** – అని అభ్యర్థన చేయసాగారు. అందుకు అంగీకరించినట్టి **చక్షువులు (చూపు) (చక్షు అభిమాన దేవత) – దైవీ సంపదతో కూడిన దృష్టితో ఉద్గాతృగానము చేయసాగాయి.** అప్పుడు కల్యాణదృష్టి (శుభదృష్టి) మాత్రమే సర్వత్రా వెలయసాగింది. శుభమగు సర్వత్రా సమదృష్టిని గమనించి రాక్షసులు అట్టి పవిత్ర – దివ్య దృష్టికి సంబంధించిన దేవతల కార్యములకు **విఘ్నము కలిగించే ఉద్దేశ్యముతో – పాప దృష్టి ప్రవేశింపజేసారు.** స్వల్పకాలం మాత్రమే కనిపించే పంచభూతాత్మక దృష్టులు పరిఢవిల్లాయి. **రూపదృష్టి, కామదృష్టి, రాగ–ద్వేష దృష్టి, మమకారదృష్టి,** కల్పితములైనట్టి **జాతి మత కుల ప్రాంత భాషాపరమైన** 'మావారు–కానివారు' అను **సంకుచిత దృష్టి** – వచ్చిపడి, ఆత్మదృష్టిని ధూళివలె కప్పివేయ సాగాయి. బంధు–అబంధు దృష్టి మొదలైన – **దోష , అల్ప, సంకుచిత భావాలను జనులు ఆశ్రయించసాగారు.** ఇంకేమున్నది? జీవులు పాపదృష్టి (అసురదృష్టి) కలిగి ఉండసాగారు. **"స్వ, పర, కామ, క్రోధ"** ఇత్యాది సంకుచితములన్నీ **ఆత్మదృష్టిని** (ద్రష్ట దృశ్యముల పరస్పర అనన్యత్వమును) **కప్పివేయసాగాయి. ఆత్మదృష్టి దూరంకాసాగింది.**

## శ్రోత్రము (వినికిడి) – దైవాసురులు.

అప్పుడు దేవతలు శ్రోత్రము (చెవులు–వినికిడి అనే దివ్యశక్తి)ని సమీపించి –

***"ఓ శ్రోత్రాభిమాన దేవతా! మీరు మన దేవతల కార్యక్రమమైనట్టి ఆత్మోపాసన (ఆత్మగురించిన శ్రవణ–మనన–నిదిధ్యాస సమాధుల) గురించి కార్యవర్తులు అవండి. ఉద్గీథగానము చేయండి"***

అందుకు శ్రోత్రదేవత సంతోషంగా అంగీకరించింది. ఓద్గాత్రకర్మ ఆత్మాత్మికంగాను, దైవీ లక్షణాత్మికంగాను, గుణాతీతాత్మికంగాను నిర్వర్తించ సాగింది. ఏది దేవతలకు భోగమో దానిని గురించి గానము చేయ ప్రారంభించింది. తదితర జనుల సుఖానుభవము ఉద్దేశించి, దేవతలకొరకై గానము (ఉద్గీథము, స్తుతి) చేయసాగింది. ఇది ఇట్లా ఉండగా, శ్రవణాభిమానదేవతయొక్క దైవీసంబంధమైన ఉద్గాత్రము (Singing / Performing Workmanship) అసురులు గమనించారు. అట్టి తాత్త్వికమైన, సాత్వికమైన, **దైవసంబంధమైన వినికిడిలో (శ్రవణములో) "చెడు వినటము, చెడు వినటములో అభిరుచి కలిగి ఉండటము" – అను పాపమును ప్రవేశింపజేయ**

**సాగారు.** ఇక అప్పటినుండి జనులు చెడునే శ్రద్ధగాను, అధికంగాను వినటము, మంచి విషయాలు అశ్రద్ధగాను, స్వల్పముగాను వినటము (లేదా) తిరస్కరించటము నిర్వర్తించసాగారు. అఖండాత్మ గురించి అశ్రద్ధగా వినటము చేయసాగాను. మంచి గురించి మాట్లాడబుద్ధి కాదు. చెడు గుణముల గురించే "వినటము" నందు అభిరుచి కలిగి ఉండసాగారు.

ꕥ ꕥ ꕥ

ఈ విధంగా **వాక్కు, ఆఘ్రాణము (వాసన), దృష్టి, శ్రవణములకు** సంబంధించిన అధిష్ఠాన దేవతల ఆత్మీయమగు కార్యక్రమములలో అసురులు పాపము ప్రవేశింపజేసారు. ఆ కారణంగా, **దోషము – పాపముతో కూడిన ప్రవర్తనము అధికం కాసాగింది.** అవన్నీ (అట్టి అభ్యాసములు) దైవీ సంబంధమైన గుణములను, అఖండాత్మ సంబంధమైన శాస్త్రజ్ఞానమును కప్పివేయసాగాయి. **జీవులు స్వస్వరూపాత్మను ఏమరచి, భేదదృష్టికి బద్ధులవసాగారు.**

అసురుల సంకల్పములు సృష్టిలో ప్రవేశించి ప్రవర్తమానమవటంచేతనే లోకంలో జనులు చెడు మాట్లాడడం, దుర్వాసన, వ్యసనములు, అల్ప – దోష దృష్టులు, చెడు గురించే ఎక్కువగా వినాలనే అభిరుచి అభిలాషలు – అధికంగా ఏర్పడి, కొనసాగుచున్నాయి. దుర్విషయములు, దుర్వ్యసనములు, దురాభ్యాసములు, దుష్ట సంస్కారములు మొదలైనవి బుద్ధులను కప్పి వేసి ఉంచటం చేత "ఆత్మబుద్ధి" అధిక అనేకులలో జీవులలో వికసించటమే లేదు. అనుభవమవటమే లేదు.

**అప్పుడిక దేవతలు మనో అభిమానదేవతను ఆశ్రయించతలచారు.**

## మనస్సు – దైవాసురులు

ఈవిధంగా శ్రవణ – దృష్టి – వాక్కులు అసురులకు వశమగుచున్నట్లు, తద్వారా ఆత్మజ్ఞాన – ఆత్మానందములు కొరవడుచున్నట్లు గమనించిన దేవతలు **"ఇక ఇట్లా కాదు. మనము మనో (మనన) అధిష్ఠాన (అభిమాన) దేవతను ఆశ్రయిద్దాం"** అని తలచి అట్లాగే ఈవిధంగా ఆశ్రయించసాగారు.

ꕥ ꕥ ꕥ

**దేవతలు : ఓ మనో అధిష్ఠాన దేవతా! నీవు మా కొరకు ఓద్గాత్రము (కార్యనిర్వహణ) చేయవలసిందిగా మా విన్నపము. అప్పుడు మనము అవ్యాజమగు అనునిత్య ఆత్మానందమును జీవాత్మకు సిద్ధింపజేయగలము.**

**మనో అధిష్ఠాన దేవత :** ఓc! తప్పకుండా! దేవతల కార్యక్రమమును నేను నెరవేరుస్తాను. అది నాకు ఆత్మానందదాయకమే.

ꕥ ꕥ ꕥ

ఇకప్పుడు మనస్సు దేవతల కార్యముల కొరకై ఔద్గాత్రము (గానము) చేయసాగింది. మనస్సు నుండి కల్యాణ – శుభ – శ్రేయో – సాత్త్విక – త్యాగ – అవ్యాజప్రేమ రూపమగు ఆలోచనలు జీవులలో బయల్వెడలసాగాయి. మధురమగు అఖండాత్మానందభావాలు జనించి, సర్వత్రా విస్తరించసాగాయి.

అసురులు ఇది గమనించారు. **"అయ్య బాబోయ్। దేవతలు మనో అధిష్ఠాన దేవతను వశం చేసుకొంటే ఇంకేముంది? మనగతి నిర్గతే। దేవతలు మనలను అతిక్రమించివేయగలరు"** – అని అనుకోసాగారు. తమయొక్క కామ – క్రోధ – లోభ – మోహ – మద – మాత్సర్య సాధనలతో ఎట్లాగైతేనేం, జీవుల మనసులలో తమ ఆసురీ భావములను ప్రవేశింపజేయసాగారు. అసురసంబంధమైన పాపమును ప్రవేశబెట్టి మనస్సులను కలుషితము, అపరిశుద్ధ్యము చేయసాగారు. శాస్త్ర నిషిద్ధమైనట్టి పాపపు ఆలోచనలు ప్రవేశింపజేయసాగటంచేత **మనస్సులలో విరోధము, ద్వేషము, పగ, జాత్యహంకారములు, పరమత ద్వేషము, ప్రాంతీయ కక్షలు, పరభాషా ద్వేషములు** – మొదలైన ఆలోచనలు **బలవత్తరం కాసాగాయి.** ఇంకేమున్నది? జనులలో ఆత్మ దృష్టి – ఆసురీ సంపదచే (అభిమానము, బలము, దర్పము, పౌరుషము, మొదలైన ఆలోచనలచే) కప్పివేయబడసాగింది. చెడు ఆలోచనలు, పాప కార్యములు వృద్ధి కాసాగాయి.

ꕥ ꕥ ꕥ

ఈవిధంగా సర్వేంద్రియములను, (మనోబుద్ధి చిత్త అహంకారములనే) అంతరంగ చతుష్టయమును **దేవతలు దైవీ సంపత్తి కొరకై ఆశ్రయించటము, అసురులు వచ్చి పాపమును ప్రవేశింపజేయటము కొనసాగింది.** ముఖ్యమైన మనస్సు శాస్త్ర నిషిద్ధమైన పాపధ్యాస – ఆలోచనలతో జీవులపట్ల కలుషితం కాసాగింది. అనగా, కలుషితమైన ఆలోచనలు సాత్త్వికమైన భావములను కప్పి ఉంచసాగాయి.

❖ ❖ ❖

ఇకప్పుడు దేవతలు "ఇప్పుడు ఏమి చేయాలి?" అని యోచించసాగారు. **"ఈ జీవులపట్ల, అసురులు ప్రవేశింపజేస్తున్న ఆసురీసంపద, తద్వారా ఏర్పడుచున్న సాంసారిక దుఃఖములు, పరస్పర రాగద్వేషముల వలన కలిగే వేదనలు తొలగేది ఎట్లా? వీరిపట్ల అవ్యాజము, స్వాభావికము అగు అనునిత్య - ఆత్మానందమును ఆవిష్కరించేది ఎట్లా?"** – అని మరికొంత సమాలోచన చేయసాగారు. అప్పుడు వారికి మరొక ఉపాయం తోచింది. వారు **ప్రాణ అధిష్ఠాన దేవతను ఆశ్రయించసాగారు.**

❖ ❖ ❖

**దేవతలు** : ఓ ముఖ్య ప్రాణ అధిష్ఠాన దేవతా! ప్రాణానందస్వరూపా! ప్రాణేశ్వరా! మేము వాక్కు – ప్రాణప్రసరణ – చక్షు – శ్రోత్ర – మనో అధిష్ఠాన దేవతలను ఆశ్రయించి దైవీ సంపత్తి, దైవ కార్యక్రమములపై ఓద్గాత్రకర్మ (Functioning on Divine lines) కొరకై అర్థించాము. వారు చక్కగా దైవీకార్యక్రమములను నిర్వర్తించటం ప్రారంభించారు కూడా. అయితే **అనన్యమును వ్యతిరేకించే అన్యాభిమానులగు అసురులు 'పాపము'ను ప్రవేశింపజేస్తున్నారు.** అప్పుడిక దేవతలమగు మాయొక్క ఆత్మయజ్ఞ కార్యక్రమము జీవులపట్ల భంగపడుతోంది.

ఇప్పుడు మిమ్ములను ఆశ్రయిస్తున్నాము. మీరు 'ఉద్గాత' అయి ఉద్గాతృగానమును మా దేవతల కార్యక్రమములకొరకై నిర్వర్తించండి. దేవతల కొరకై వేదగానము నిర్వర్తించండి. తద్వారా సమస్త జీవులకు శుభము, ఆత్మానందము చేకూరునుగాక! పంచ ప్రాణముల రూపముతో జీవుల ప్రాణాయామాది (అభ్యాస కుంభక, స్వాభావిక – సహజ కుంభకములచే) – దైవీ గుణములను, ఆత్మజ్ఞానానందానుభవ మార్గములను జీవులకు ప్రసాదించండి.

**ముఖ్యప్రాణ అధిష్ఠానదేవత:** ఓం! ఇంతే కదా! తప్పకుండా. దేవతల **ఆత్మయజ్ఞ దిగ్విజయము** కొరకై మేము పాల్గొంటాము. లౌకిక–పారలౌకిక **శుభప్రదముల** కొరకై ఉద్గాతనై, (జ్యోతిష్టోమము మొదలైన యజ్ఞములలో పఠించే మంత్రముల వంటి) ఉద్గీథము నిర్వర్తిస్తాము. **(యజ్ఞవాఙ్మయములలో ప్రాణమును స్తోత్రము చేయటము, రాక్షసుల క్రియలను అతిక్రమించటము గురించి స్తుతులు చెప్పబడుచున్నాయి. ఉదా : ఆగమార్థంతు, దేవానాం, గమనార్థంతు రాక్షసామ్ కురు ఘంటారవం తత్ర, దేవతాహ్వాన లాంఛనం। అపసర్పంతు ఏ భూతాః, ఏభూతాః విఘ్న సంస్థితాః ఏభూతాః విఘ్నకర్తారః, తే వశ్యంతు శివాజ్ఞయా। అపక్రామాతు భూతద్యా, ఏతేషే భూమిభారకాః ఏతేషాం అవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥)**

అప్పుడు దేవతల సుఖశాంతి ఐశ్వర్య ఆనంద కార్యక్రమ దిగ్విజయము కొరకై ముఖ్యప్రాణ అధిష్ఠాన దేవత ఉద్గీథము గానము చేయసాగింది. **ప్రాణాయామాది విశేషములచే ఆత్మయజ్ఞము ఆవిష్కరింపజేయసాగింది.**

అది గమనించిన అసురులు తమ సంబంధమైన **"సంకుచితత్వము, జాత్యభిమానము, దురహంకారము, తదితరులను లోకువ చేయటము"** మొదలైన ఉపకరణములతో **"పాపము"**ను ముఖ్య ప్రాణములో ప్రవేశింపజేయ యత్నించసాగారు. ఇతఃపూర్వంలాగానే ప్రాణవిభాగంలో కూడా దుఃఖము, ద్వేషము, పరిమితమైన అనురాగ–మమకారములు మొదలైనవి ప్రవేశింపజేయ యత్నించారు.

> ***అప్పుడు ఏమి జరిగింది? మట్టి పెళ్లతో కొండరాయిని కొట్టితే కొండరాయి పగులుతుందా? లేదు. మట్టి పెళ్ళయే ముక్కముక్కలుగా అవుతుంది. అట్లాగే ముఖ్య ప్రాణాధిష్ఠాన దేవతను దుష్టసంకల్పములతో సమీపించిన అసురులు తామే ఖండఖండాలుగా అయి, శిథిలమైపోసాగారు.***

ఎప్పుడైతే అసురుల ఆసురీగుణములు నశించటం ప్రారంభమైనాయో, వాక్ ఇంద్రియము, ఘ్రాణేంద్రియము చలనప్రాణేంద్రియము, చక్షురింద్రయము, శ్రోత్రేంద్రియము, మనస్సు మొదలైన బాహ్య – అంతర ఇంద్రియ గోళములలో **రాక్షసత్వము నశించి, దేవత్వము**

**(దివ్యత్వము, పవిత్రత) చోటుచేసుకోసాగింది. దైవీ సంపద ప్రవృద్ధమవసాగింది. ఈ విధంగా దేవతలు జయించారు. అసురులు అపజయం పొందారు.** జగత్తులో **స్వస్వరూపాత్మ యొక్క అఖండ, అమృతత్వాది లక్షణ విశేషములకు సంబంధించిన వేదవాఙ్మయము ప్రసిద్ధమవసాగింది.**

పై విధమైన ఆత్మ ప్రకాశరూప యజ్ఞ విధానము (ఆత్మయజ్ఞము) అనుష్ఠించువారు క్రమంగా దేహాభిమానమును జయించివేయగలరు. ఆత్మానంద సంపూర్ణఫలమును ఇక్కడే ఇప్పుడే పొందగలరు.

❖ ❖ ❖

అప్పుడు దేవతలు – "ఆహా! ముఖ్య ప్రాణ అధిష్ఠాన దేవతయొక్క **"దైవీ ఉద్గీథము"** వలన కదా మనము అసురులను జయించగలిగాము! సంతోషము. అయితే, ఏ ముఖ్యప్రాణము జీవులకు దైవ భావము పెంపొందిస్తోందో, **అట్టి ముఖ్యప్రాణము యొక్క ముఖ్యస్థానమేది?"** – అని జిజ్ఞాసతో అన్వేషణ చేయసాగారు. ముఖము మధ్యగాను, హృదయాకాశములోను గల ముఖ్య ప్రాణమున్న స్థానమును గమనించి, సమీపించి భక్తి ప్రపత్తులతో స్తుతించసాగారు. ప్రత్యక్షముగా ముఖ్యప్రాణము యొక్క సారూప్య, సామీప్య, సాయుజ్యమును పొందారు.

ఇట్టి ప్రాణయజ్ఞము (లేక) ఆత్మయజ్ఞమును దృష్టిలో పెట్టుకొని ముఖ్యప్రాణము – **"ఆయాస్యము"** అని, (కార్య – కారణములలో పాల్గొనుచున్నట్టి సమస్త అవయవములలో) **"సర్వశ్రేష్ఠము"** అని సిద్ధాంతీకరించబడుతోంది. "దేహావయవములలో రసరూపము శ్రేష్ఠమైనది" – అని నిర్వచిస్తూ **"ఆంగీరసము"** – అని ముఖ్య ప్రాణము స్తుతి ప్రసిద్ధమై, **వేదవాఙ్మయములో** ఎలుగెత్తి చాటబడుతోంది.

**శ్లో॥ సా వా ఏషా దేవతా 'దూర్' నామ దూరగ్ం హ్యస్యా**
**(హి అస్యా) మృత్యుః దూరగ్ం, హ వా**
**అస్మాత్ మృత్యుః భవతి – య ఏవం వేద॥ (3-3-9)**

ఆ ముఖ్య ప్రాణ అధిష్ఠాన దేవత **"దూర్"** అనే పేరుతో చెప్పబడుచున్నారు. ఎందుకంటే **సమస్తమును మ్రింగివేయగలిగే సామర్థ్యముగల మృత్యువుకు కూడా పట్టుబడక, ప్రాణదేవత దూరంగా ఉంటుంది కాబట్టి.**

ఈ విధమైన ప్రాణతత్త్వమును ఎరిగినవానిని మృత్యువు సమీపించదు. దూరంగా ఉండిపోగలదు. దేహ దేహాంతర సందర్భములలో కూడా **"సోఽహమ్ ఆత్మా, అప్రమేయమ్"** భావము చెక్కుచెదరదు.

ప్రాణాగ్ని సమస్తమును శుభ్రము, పవిత్రము చేయగలదు. ఇంద్రియ విషయ అజ్ఞాన–సంసర్గమంతా సమస్త ఇంద్రియముల నుండి మొదలంట్లా తొలగించివేయబడగలదు. అందుచేతనే **ఎవ్వరైతే ప్రాణోపాసన చేస్తూ ఉంటారో, అట్టివారిని అసురీ గుణముల – పాపప్రవేశ ప్రయత్నములేవీ ఫలించజాలవు.** అట్టివాడు కూర్చుని ఉన్న ప్రదేశమును అరిషట్ వర్గములు, నిందారోపణలు మొదలైన పాపములు ప్రదర్శనమవవు. ప్రాణదేవతయే తక్కిన పంచేంద్రియములను, ఆరవ ఇంద్రియమగు మనస్సును మృత్యువు నుండి రక్షించి, **అట్టి జీవుని అమృతతుల్యునిగా తీర్చిదిద్దగలదు.**

❖ ❖ ❖

ఉద్గీథ కర్మచేత (పరమాత్మను ఎలుగెత్తి గానము చేయు కర్మచేత) ప్రాణదేవత (ప్రాణశక్తి) జీవుని వాక్ మనో పరిధులను అధిగమింపజేయగలదు. వాక్కు మృత్యువును అధిగమించి అగ్ని (ఆత్మజ్ఞానాగ్ని) అయి శోభించుచున్నది. వాక్కు (అగ్ని) తేజో విభవమై ప్రకాశించుచున్నది.

ప్రాణదేవతోపాసనవలన ప్రాణవాయువు (ఆఘ్రాణము, దేహములో వాయు సంచలనము) **మృత్యురూపము విడచి, అమృతత్వము పొందసాగగలదు. నేత్రేంద్రియము (చూపు) ప్రాణోపాసన నిర్వర్తించటం చేత మృత్యువు యొక్క పరిధులను అతిక్రమించి సూర్యస్వరూపమై, అమృత స్వరూపమై విలసిల్లగలదు.** శ్రోత్రేంద్రియము (వినికిడి) ప్రాణోపాసనను ఆశ్రయించినదై మృత్యుస్వరూపమును విడచిపెట్టి మృత్యురహితమైన (అమృతరూపమగు) ప్రాణస్థానము చేరగలదు. మనస్సు ప్రాణదేవతా ఉపాసనకు ఉపక్రమించగలదు. అట్టి

ప్రాణోపాసన వలన మనస్సు మృత్యుస్వరూపమును విడచి (మృత్యు పరిమితులను అధిగమించి) కేవల **మనోరూపమై, ప్రాణశక్తిరూపమై ప్రకాశించగలదు.**

ప్రాణోపాసకునిపట్ల – వాక్కు, ఘ్రాణము, చక్షువులు, శ్రోత్రము, మనస్సు (మాట, వాయుచలనము, చూపు, వినికిడి, మననాభ్యాసము), వాటి వాటి అధి దైవిక రూపములైనట్టి అగ్ని–వాయు–ఆదిత్య–దిక్కులు–చంద్ర తేజోరూపములై ప్రాణములో ప్రదర్శితమై **అమృతత్త్వము ఆవిష్కరించుకొంటున్నాయి.**

**ప్రాణోపాసనను ఆశ్రయించిన జీవుడు దేహ పరిమితములను అధిగమించి క్రమక్రమంగా సర్వాత్మత్వము సంతరించుకోగలడు. సరి అయిన కాలములో 'సద్యోముక్తి' సిద్ధించుకోగలడు.**

❖ ❖ ❖

ముఖ్యప్రాణ అధిష్ఠాన దేవత తన నివాసము (Residing) కొరకై **"భౌతిక దేహము రూపము దిద్దుకొను గాక"** – అని సంకల్పించటం చేతనే ఈ పాంచభౌతిక దేహము నిర్మితమౌతోంది. అట్టి శరీరము "అన్నము" భక్షిస్తూ జీవనము కొనసాగిస్తోంది. అయితే అట్టి అన్నము (సమస్త ఇంద్రియ విషయానుభవములు) భక్షిస్తున్నది ప్రాణాధిష్ఠాన దేవతయే కాని, భౌతిక దేహము కాదు. పంచేంద్రియములు కాదు. మనస్సు కాదు. **పంచేంద్రియములు, మనస్సు మొదలైనవన్నీ ముఖ్య ప్రాణదేవత యొక్క సంప్రదర్శనా విస్తారములు మాత్రమే.**

ఈ విధంగా అన్నము, అన్నాదము (అన్నము నిర్మించి అనుభవించునది), అన్నాద్యుడు (అన్నమునకు నిర్మాత) – అంతా కూడా ప్రాణదేవతయే. (అన్నము = సర్వేంద్రియముల యొక్క మనస్సు యొక్క బాహ్య విషయములు).

అన్నాదము నుండే శరీరము "గాన (Like a song)" రూపంగా బయల్వెడలుతోంది. అన్నమును కోరుకొన్న ప్రాణేశ్వరునిచూచి (వాగింద్రయము, ఘ్రాణేంద్రియము, స్పర్శేంద్రియము, దర్శనము మొదలైన ఇంద్రియములకు చెందిన) దేవతలు (ఇంద్రియాధిష్ఠాన దేవతలు) ఆ ప్రాణదేవతను ఈ విధంగా స్తుతించసాగారు.

❖ ❖ ❖

**వాక్కు, చూపు మొదలైన (దేహములోని) అభిమానదేవతలు** : ఓ ప్రాణ దేవతా! ప్రాణేశ్వరా! ప్రాణపురుషుడా! ప్రాణాధిష్ఠాన మహనీయా! మీరు మాకంటే (అసురులపై) దిగ్విజయ పూర్వకంగా మీ ఉద్గీథగానము ద్వారా అన్నము (సమస్తానుభవమును) స్వాధీనపరచుకొన్నవారయ్యారు. కాబట్టి మా ఇంద్రియాభిమాన దేవతలను కూడా, (ఇంద్రియానుభవ విశేషములన్నీ కూడా) మీయొక్క అన్నము (That being Experienced) లో **భాగంగా** జేర్చుకోండి.

**ప్రాణధిష్ఠాన దేవత :** వాక్కు మొదలైన ఇంద్రియాభిమాన దేవతలారా! సంతోషం. మీరు నాలో అంతటా అభిముఖులై ప్రవేశించండి.

❖ 'వాక్' మొదలైన దేవతలు ప్రాణశక్తియందు ప్రవేశించి నిశ్చలము పొందసాగారు.

❖ 'వాక్' ఇత్యాది ఇంద్రియముల అన్నము (అనుభవమయ్యేదంతా) ప్రాణముయొక్క తృప్తి కొరకై సమర్పించసాగారు.

❖ ప్రాణశక్తి ఇంద్రియాధినేత అయి, సమస్త ఇంద్రియానుభవములను ప్రియము, అమృతతుల్యము చేయసాగింది.

❖ ❖ ❖

ఎవ్వరైతే ఈ రీతిగా ప్రాణస్వరూపతత్త్వమును ఎరుగుచున్నారో (1) అట్టివారు, (2) అట్టివారి సంబంధీకులగు జ్ఞాతులు మొదలైనవారు కూడా – తృప్తి (ప్రాణేశ్వరానందము, ప్రియానుభవము) పొందగలరు. అట్టివాడు అన్నాదుడై (అన్నమును జనింపజేయువాడై), అన్నము జ్ఞాతులకు అందజేయువాడై, **సమస్తమును భరించు సామర్థ్యము కలిగి ఉంటున్నాడు.** జ్ఞాతులందరిలో శ్రేష్ఠుడై, అందరినీ(ఆధ్యాత్మికంగా) ముందుకు నడుపువాడు, వ్యాధులు లేనివాడు, తదితరుల శారీరక, మానసిక, ఆధ్యాత్మిక రుగ్మతలను తొలగించు సామర్థ్యము కలవాడు అగుచున్నాడు. బంధువులను, సంబంధీకులను పరిపాలించువాడు కాగలడు.

ప్రాణతత్త్వము (పైవిధమైన విశేషములతో) ఎరిగినవాడు తదితర జనులను భరించువాడు, సానుకూలుడు, ఇతరులకు 'భరింపతగినవాడు' కాగలడు. ఇతరులకు ప్రాణస్వరూపుడు (ప్రియస్వరూపుడు) అగుచున్నాడు.





ఈ దేహములోని సమస్త ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు – **ప్రాణో వా అంగానాగ్ం రసః।** ప్రాణమే రస స్వరూపము. **అందుచేతనే అన్ని అంగములు ప్రాణశక్తి స్వరూపమే. కనుక రసస్వరూపమే.** అందుచేతనే **ప్రాణము దేహమునుండి తొలగిపోవుచున్నప్పుడు అంగములు నిస్తేజము, రసహీనము అగుచున్నాయి.** అనగా, ప్రాణశక్తితో అంతర్లీనమగుచున్నాయి. ఇంద్రియ మనో రస స్వరూపమై ప్రాణమే సమస్త అంగములలో వ్యాపించి ఉన్నది.

## ప్రాణమేవ బృహతీ। బృహస్పతిః। ఋగ్వేద ప్రభుః।

**ఏష ఉ ఏవ బృహస్పతిః, వాగ్వై బృహతీ।**

- ప్రాణమే **"బృహతః పతిః"। – బృహస్పతి** రూపమైన ఋక్కులతో కూడిన ఋగ్వేదమునకు **"పతి".**
- ప్రాణమే వాక్కు. వాక్కే బృహతీ ఛందస్సు. ఈ విధంగా **బృహతీ ఛందో రూపమైన ఋగ్వేదమునకు ప్రభువు ప్రాణమే.** అందుచేత ప్రాణమే **'బృహస్పతి'** అనబడుతోంది.

## ప్రాణమేవ వాక్। బ్రహ్మణస్పతి।। యజుర్వేద యజుః।

ప్రాణమే "వాక్కు" రూపమునకు అధిపతి. "వాక్" రూపముగా వేదోపాసన చేయబడే యజుర్వేదమునకు కూడా అధిపతి ప్రాణమే. వాక్కు బ్రహ్మమే। 'వాక్కు' రూప బ్రహ్మమునకు అధిపతి ప్రాణచైతన్యమే। **అందుకే ప్రాణము బ్రహ్మణస్పతి.**

(అశరీర దివ్య స్వర్గలోకవాసులగు దేవతల సహజానంద ప్రియస్వరూపము – దేవతల గురుస్థానాధిష్ఠానదేవతయగ బృహస్పతియే. ఎందుకంటే బృహస్పతియే ముల్లోకములకు ముఖ్య ప్రాణస్వరూపుడు).

## ప్రాణమేవ గానమ్। సామవేద సామః ।।

ప్రాణమే సామము (సామవేదగాన విన్యాసము).

వాక్కుయే సామము.

'సా" – "అమ్న" కలయికయే (సామ్నమే – ప్రాణము)

సామ = సమరసత్వము. **(సత్–అమ్న = సత్ బృహతీ చమత్కార మిదగ్ం సర్వమ్)**

ప్రాణము యొక్క సర్వేంద్రియ సమరసత్వమే. 'సామ'।. అణువణువు సమరస స్వరూపమై విరాజిల్లునదే సామ. తేనెటీగలోను, ఈగలోను, ఏనుగునందు, ఈ మూడులోకములలోని సమస్త జీవులలోను సమరస–స్వరూపమై వెలుగొందునదే 'ప్రాణము'.

అట్టి 'సామ' అనబడు ప్రాణశక్తి యొక్క **"సమస్తత్వము, సంస్థాపృత్వము"** తెలుసుకొన్నవాడు ప్రాణసాయుజ్య, ప్రాణసాలోక్యములను సిద్ధించుకోగలడు. సర్వత్రా తానే ప్రాణానందస్వరూపుడై విరాజిల్లగలడు. **"విశ్వప్రాణమహమేవ"** – అనునది గమనిస్తూ **నిత్యానందుడై ఉండగలడు.**

ఈవిధంగా ప్రాణమే వాక్కు. వాక్కే ఋక్కు. వాక్కే యజుస్సు. ప్రాణమే సామము. **ఈ కనబడేదంతా ముఖ్యప్రాణ సంప్రదర్శనా వినోదమే.**

## ఉద్గీథము

పరమాత్మ గురించిన గానమును ఉద్గీథము అంటారు. **వాక్కు, ప్రాణముల** సముదాయ సమవర్తన సంప్రదర్శనమే **ఉద్గీథము.**

"ఉద్గీథము' = ఉత్ +గీథము (ఉత్ = పరమైయున్న ఆత్మగురించిన. గీథ = సంగీతము, పాట. గానము)

**"ఉత్" = ప్రాణము. "గీథము" = 'వాక్కు'.**

ఉత్ – గాథము = ప్రాణము+వాక్కు కలసి 'ఉద్గీథము' అగుచున్నది.

ఉద్గీథము సామము (సామవేదములో) అంతర్విభాగ రసము. (నవలకు నవలారచయిత వలె), – ప్రాణశక్తియే (ప్రాణతత్త్వమే) ఈ సమస్త బ్రహ్మాండములకు రచయిత, రసస్వరూపము, రసానందమయము కూడా।

చికితాన కుమారుడు **బ్రహ్మదత్త చైకితానుడు** అనే ఋత్విక్కు ఒకప్పుడు యజమానికొరకై యజ్ఞము ప్రారంభించారు.

ఆ యజ్ఞములో సోమరసము స్వీకరిస్తూ యజ్ఞకర్త – ఋత్విక్కుతో హేళనగా (ఎగతాళిగా) **"ఆయాస్య - అంగీరసులను (వాక్కు-ప్రాణములను) పరస్పరము ఐక్యత లేకుండా వేదశబ్దములను (మంత్రములను) గానం చేయండి"** – అని పలికాడు.

అప్పుడు బ్రహ్మదత్త చైకితానుడు యజ్ఞకర్తతో **"ఓ సోమరాజా! ప్రాణశక్తి – వాక్కుల కలయికతో కాకుండా మరింకేవిధంగానైనా ఉద్గానము (మంత్రగానము) ఎవరైనా చేయగలగటము అసాధ్యము. అట్టి 'ప్రాణ–వాక్కు' సమ్మేళణం లేకుండా ఎవ్వరైనా ఉద్గానము నిర్వర్తించగలిగితే నా తల తెగి నేలకూలునుగాక।"** అని శపథము చేసారు.

(అనగా) ప్రాణ – వాక్కుల కలయికచేతనే ఉద్గీథగానము కుదురగలదు.

(**ప్రాణము** = ఇష్టము, ప్రియము, భక్తిరసము, అనుభూతి, ఆప్యాయతల కలయిక **వాక్కు** = శబ్దము, ఉచ్చారణ)

❖ ❖ ❖

సామగానము ఉద్గీథరూపమైన ప్రాణ – వాక్కు సమ్మేళనమే. సామగానమునకు మాధుర్య ధ్వనియే ధనము (సామవేద సంపద). ఋత్విక్కు యాగనిర్వహణలో తనయొక్క ఉద్గానము చేయుటకు సంసిద్ధుడయ్యేముందు వాక్కునందు **"ఓ ప్రాణ అధిష్ఠానదేవా! నాయొక్క స్వరములో మధుర రసస్వరూపులై ప్రవేశించెదరుగాక!"** అని ప్రాణతత్త్వమును తప్పక స్తుతిస్తున్నారు. ఏవిధంగా లోకంలో సంపదగలవానిని శ్రేష్ఠుడుగా అందరూ చూస్తు ఉంటారో, అట్లాగే **ప్రాణ వాక్కులను మధుర స్వరపూర్వకంగా పలుకు ఋత్విక్కులు (వేదగానజ్ఞులు) సమస్తజనులచే గొప్ప గౌరవ, ప్రపత్తి, ఆదరణలతో గౌరవించబడగలరు. (అర్థమాధుర్యము తెలిసి ఇష్టముగా వేదమంత్రములు పలకాలి** – అని కూడా పాఠ్యసారాంశము).

ఎవ్వరైతే **"సామమునకు (సామగానమునకు) ప్రాణ–వాక్కు దేవతల ఉపాసనా పూర్వకమైన మధుర స్వరమే ధనము"** అని తెలుసుకొంటారో, వారు **లోక – అలౌకిక ప్రసిద్ధమగు సంపదలకు అర్హులు కాగలరు.** 'సామ' శబ్దవాచ్యము యొక్క సువర్ణమును తెలుసుకొన్నవానికి, – సువర్ణము (ఉత్తమ సంపద) ప్రసిద్ధమై కలుగగలదు. (Let meaning be included while expressing sound of Veda sweetly)

– ప్రాణమునకు భూషణము(Ornament) స్వరమే।

అట్టి ప్రాణభూషణ స్వరతత్త్వము, తెలుసుకొన్నవాడు. (అన్ని ఖనిజములలోను "బంగారము" శ్రేష్ఠమైన రీతిగా) – **సర్వత్రా శ్రేష్ఠుడై వెలుగొందగలడు.**

❖ ❖ ❖

"సామ" అను శబ్దమునకు వాచ్యార్థము – ప్రాణమే. అట్టి ప్రాణమునకు ముఖ్య స్థానము ఎక్కడ? వాక్కే స్థానము. 'వాక్కు'కు స్థానము (1) వక్షస్థలము (2) కంఠము (3) శిరస్సు, (4) జిహ్వామూలము (5) దంతములు (6) ముక్కు (7) పెదవులు (8) దవడలు. ఈ **ముఖ్య ప్రాణమునకు కూడా ఈ ఎనిమిది వాక్‌జనస్థానములు. అనగా వాక్కుకు స్వగృహము వంటివి – అని చెప్పబడుతోంది. వాక్కుచేత ముఖ్య ప్రాణము గురించి చేయుగానమే "సామ" గానము.**

"ఈవిధంగా **ముఖ్య ప్రాణము వాక్కు స్థానములందు ముఖ్యనివాసము కలిగియున్నది"** – అని ఎరిగి ప్రాణోపాసన చేయువాడు ప్రాణతేజోసుసంపన్నుడై, తేజస్సుతో కూడిన ముఖము కలవాడై ప్రకాశించగలడు. **"ప్రాణ దేవతయే వాక్కు రూపంగా సమస్త జీవులలో ప్రదర్శనమగుచున్నది** – అని ఎరిగి ప్రాణోపాసన చేయువాడు – సమస్త ప్రాణులలో తానే ప్రాణస్వరూపుడై, సమస్త జీవులకు 'ప్రియము' అగుచున్నాడు.

## పవమానము – గానరీతులు

ఇప్పుడిక మనము **'పవమానము'** అని చెప్పబడే మంత్రముల **'గానతత్త్వము'** గురించి వివరించుకుంటున్నాము.

ప్రాణవిజ్ఞానము కొరకై ప్రాణతత్త్వోపాసనామార్గంగా ఈ విధమైన '3' మంత్రములు చెప్పబడుచున్నాయి.

*ఓ ప్రాణేశ్వరా! మా విన్నపములు వినండి।*

**"అసతో మా సత్ – గమయ" :** మాకు అనుభవమగుచున్న అసత్తు [ స్వతః లేనిది, మనో (సంసార) కల్పనచే మాత్రమే ఉన్నట్లు అనిపించేది ] **అసత్తుగా గమనించబడుగాక।** ఏది సర్వదా సహజము, వాస్తవము అయి ఉన్నదో – **అట్టి "సత్"ను స్వానుభవంగా తీర్చిదిద్దండి. మేము ఇప్పుడే ఇక్కడే "సత్" (కేవలమగు ఉనికి) స్వానుభవులము అగుదుము గాక!**

**"తమసో మా జ్యోతిః గమయ" :** మేము అనుభవిస్తున్న అజ్ఞాన నిబిడాంధకారమును ఆత్మ తేజోదీపకాంతిచే తొలగించి, ఆత్మజ్యోతి స్థానమునకు, మమ్ములను జేర్చండి. **"నామరూపాత్మక పరిమితమైన "దృష్టి" అనే మా కంటి దోషమును తొలగించి, మేము ఈ విశ్వదృశ్యమును స్వస్వరూపాత్మకమైన స్వయంజ్యోతీ తేజోవిలాసముగా దర్శించెదము గాక.** ఆత్మ స్వరూపులమగు మేము ఈ సమస్తమును మాయొక్క "ఆత్మజ్యోతి" యొక్క తేజో–విస్తార చమత్కారముగా చూచుచుండెదము గాక।

**"మృత్యోః మా అమృతం గమయ" :** మమ్ములను అనుక్షణిక మార్పు – చేర్పుల రూపమగు 'మృత్యువు' నుండి, మృత్యువుకు ఆవలి స్థానమగు "అమృతత్వము"నకు చేర్చండి. జన్మ దేహ మృత్యువు (మార్పుచేర్పులకు) సంబంధించని మా అమృతస్వరూపమగు ఆత్మను సర్వదా సర్వత్రా ధారణ చేయుచుండెదము గాక।

*అసత్తు నుండి సత్తుకు చేర్చండి.... అని మంత్రముగ్ధంగా పలుకుచున్నప్పుడు...,*

అసత్తే – మృత్యువు।

సత్తే – అమృతము।

మాయొక్క మృతమును 'సత్తు' యొక్క సిద్ధిచే అమృతమయం చేయండి.

**సత్** = "నేను ఉన్నాను" – (I am present, I exit) (**సత్** = ఉనికి. **చిత్** = ఎరుక. **ఆనందము** = అనుభూతి).

**మృతము** = బాహ్యములైనట్టి సంగతి సందర్భ సంబంధ అనుబంధ – ఇత్యాది వ్యవహారములలో తన్మయమై, మాయొక్క <u>అనునిత్యము, పరము </u>(Beyond) అగు ఉనికిని (ఆత్మను, సత్‌ను) ఏమరచి ఉండటము.

**అమృతము** = దేహముల రాకపోకలకు, తదితర అన్యవిషయములకు సంబంధించని, ఆధారపడని **సహజమగు స్వస్వరూప సంబంధమైన 'ఉనికి' యందు (ఆత్మయందు) నిశ్చలమై నిలకడ కలిగి ఉండటము.**

'మృత్యువు' నుండి విడివడి అమృతత్త్వమును (దేహముల రాకపోకలకు సంబంధించక, ఆవల, ఈవల కూడా ప్రకాశమానమైయున్న ఆత్మతేజస్సును) స్వాభావికమైన ధారణగా కలిగి ఉండటము – **అమృతత్వము.**

**"తమసోమా జ్యోతిర్గమయ"** – అనునప్పుడు కూడా......,
తమస్సు (ఆత్మగురించిన) – చీకటి. స్వస్వరూపము, సహజరూపము అగు – **ఆత్మయొక్క ఔన్నత్యమును ఏమరుచుటయే తమస్సు.** మృత్యువు కూడా అదియే

నన్ను అజ్ఞానము నుండి ఆత్మకు సంబంధించిన సుజ్ఞానమునకు చేర్చమని ఉపాసనకు ఉపక్రమిస్తున్నాము. ఫలశృతి పలుకుచున్నాము.

మృత్యువే అసత్తు। సత్తే అమృతము ।

మృత్యువే తమస్సు। సత్తే జ్యోతిర్మయము ।

అసత్తే తమస్సు। జ్యోతియే సత్తు ।

**సమస్త స్తోత్రముల యోగాభ్యాసముల, జ్ఞానమార్గముల, భక్తి – అనురక్తిల అంతిమ ఆశయము – ఈ మూడు మంత్రములైనట్టి – "అసతోమా సత్ గమయ। తమసోమా జ్యోతిః గమయ। మృత్యోః మా అమృతం గమయ"** – అయి ఉన్నది.

ఇక తక్కిన దేవతా స్తుతులు, ఆరాధనలు, ఉపాసనలు మొదలైనవన్నీ కూడా – **"అన్నమ్ బ్రహ్మ"** – అనురూపంగా అనుభవమగుచున్న సమస్తముకూడా – **బ్రహ్మముగా ఉపాసించు ప్రయత్నములే అయి ఉన్నాయి.**

**(అన్నం బ్రహ్మ। అహం బ్రహ్మ। భోక్తా చ బ్రహ్మ")**

బ్రాహ్మీ భావన కొరకే అన్యము యొక్క సమస్త స్తుతులు కూడా.

## ఉద్గాత - ఉద్గీథము - యజమాని

**ఉద్గాత :** 'యజ్ఞము' సందర్భములో ప్రాణస్తుతులు ఎలుగెత్తి గానము చేయటానికై యాజమానిచే ఎన్నుకోబడినవాడు ఉద్గాత. యజమాని యొక్క ఇష్టమును అనుసరించి ఉద్గానము (ఉత్-గానము) చేయటము ఆయనకు 'విధి' అయి ఉన్నది.

**యజమాని :** ఉద్గాత 'ఉత్' అను సప్రాణతత్త్వమును స్తుతిస్తూ ఉన్నప్పుడు – యజమాని యజ్ఞము యొక్క మంత్రార్థములను, **"అసతోమా సద్గమయ"** – మొదలుగాగల '3' మహావాక్యార్థములను, అధి – ప్రత్యధి దేవతా నామరూపాత్మకంగా భావన చేస్తూ ఉండాలి. అట్లాగే యజ్ఞశాలలోని తక్కిన సభాసదులందరు కూడా।

❖ ❖ ❖

పైన చెప్పుకొన్న ఉపాసనా విధులు ఉత్తమ లోకప్రాప్తికి, ఆత్మ తత్త్వానుభూతికి సాధనమార్గములై ఉన్నాయి.

ఎవ్వరైతే పైన చెప్పిన **"అసతోమా సద్గమయ"** ఆదిగా గల మంత్రార్థములను గురుముఖతః సశాస్త్రీయంగా ఉపాసిస్తారో, అట్టివారు **లౌకికమైన సమస్త ప్రయోజనములను అధిగమించి, ప్రాణతత్త్వము ఎరిగినవారై, పారలౌకికమగు ప్రాణేశ్వర స్థానమును సిద్ధించుకోగలరు. తామే సమస్త జీవులలో ప్రాణస్వరూపులై సప్రాణానందులు కాగలరు.**

# బృహదారణ్యకోపనిషత్ - 3వ అధ్యాయము

# చతుర్థ బ్రాహ్మణము

## 4. ఆత్మోపమ్యేవ సర్వత్ర।

ఈ శరీరముయొక్క నిర్మాణమునకు మునుముందుగా 'ఆత్మ'యే సర్వత్రా శ్రేష్ఠమై, సంప్రకాశమానమై, సర్వత్రా వేంచేసినదై ఉన్నది.

అట్టి ఆత్మపురుషుడు స్వయముగా 'భావన' అనే లీలను కల్పించుకొని, తనను తాను **పురుషకారముతో కూడిన పురుషుడుగా** రూపొందించుకొని, అన్యమును దర్శించసాగుచున్నారు. **"విరాట్ పురుషుడనగు నేను ఎట్టి లక్షణములు కలవాడను?"** – అని అనుకోసాగారు.

మొదటగా ఆత్మకు అన్యము అనునదేదీ లేనప్పుడు వినోదించటానికి ఏదీ లేకపోయింది. వినోదమునకై **"ప్రజాపతి స్వరూపుడను అయినాను"** అని భావించసాగారు. బ్రహ్మాండ స్వరూప – స్వభావుడగు పురుషునికి 'ప్రజాపతి' నామము శబ్దీకరణము అగుచుండగా, ఆ ప్రజాపతి నామ-రూపాత్మకత్వము (బ్రహ్మాండ స్వరూపుడుగా) సంతరించుకోసాగారు.

ఎవడు – **"కేవలమగు ఆత్మభగవానుడే ప్రజాపతి స్వరూపుడై, బ్రహ్మాండ స్వరూపుడుగా స్వసంకల్ప చమత్కారములచే ప్రదర్శనమగుచున్నారు"** అని ఎరుగుచున్నాడో, అట్టివాడు ప్రజాపతిత్వము గ్రహించి, **తానే ప్రజాపతిగా రూపుదిద్దుకొనుచున్నాడు.**

## భయము। భయమెందుకు?

కేవలమగు ఆత్మ భగవానుని నుండి (జలంలో ప్రప్రథమ తరంగంలాగా) సృష్టి సంకల్పుడగు ప్రజాపతి బయల్వెడలారు. అప్పటికి సృష్టి లేదు.

**సో అభిభేత్।** ఆ ప్రజాపతి ఏకాకి అవటం చేత 'భయము' పొందసాగారు. **అందుచేతనే – ఎవరైనా ఒంటరిగా ఉన్నప్పుడు భయము పొందటం జరుగుతూ ఉంటోంది.**

అప్పుడు ప్రజాపతి ఈవిధంగా ఆలోచించసాగారు. **"యత్ అన్యత్ నాస్తి, కస్మాన్ను బిభేమీతి?"**

**"అరెఁ! నాకు వేరైనది (అన్యమైనది) అంటూ ఏదీ ఏమాత్రము కూడా లేనేలేదు కదా? మరి నాకు దేనిని చూచి, ఎవరిని చూచి భయం? భయంతో పనియే లేదేఁ!" అని ప్రజాపతి తలచసాగారు.**

**ఆ వెనువెంటనే ప్రజాపతికి భయము అనునది పూర్తిగా తొలగిపోయింది.**

అందుచేత - **కస్మాత్ బిభేత్? ద్వితీయాద్వై భయం భవతి।** భయమెందుకు ఉండగలదు? అఖండము, సమస్తము అగు (లేక) ఏకమగుఆత్మ ద్వితీయమును కల్పించుకొని, ద్వితీయమును నమ్మి ఉండటంచేతనే 'భయము' అనేది కల్పించబడినది అవుతోంది. ద్వితీయమే లేని స్థానములో భయము ఉండదు. (భయము తొలగాలంటే మనము అద్వితీయులము కావాలి).

❖ ❖ ❖

ఆ ప్రజాపతికి **"నేను ఒంటరివాడిని. ద్వితీయము లేదు. కాబట్టి భయములేదు"** - అని తలచినప్పటికీ, - **స వై నో రమే।** - ఆయన రమించలేకపోయారు. (It was not becoming enjoyable). ఆనందము, తృప్తి లభించలేదు. **అందుచేతనే ఈ జీవుడు తాను ఒంటరిగా ఉన్నప్పుడు ఆనందించటం లేదు.**

అప్పుడు ఆ ప్రజాపతి **"నాకు రెండవది (ద్వితీయము-అనేది) నాచే ఊహించబడినదై ఉండును గాక!"** (Let me have some thing secondary / next) - అని కోరుకోసాగారు. అప్పుడు ఏక - అఖండ స్వరూపుడగు ప్రజాపతి - "స్త్రీ, పురుషుడు" - అను రెండు విభాగములుగా తనను తాను రూపింపజేసుకున్నారు.

అప్పుడు ఆతడు 'సతి-పతి' - అను జంట అయినారు. అట్టి జంటయే సర్వజీవరాసులలో కనిపిస్తూ ఉన్నది.

అందుకే - **ఈ మానవుడు రెండుగా చీల్చబడిన వెదురు బొంగువలె ఉంటున్నాడు.**

**భూమి - ఆకాశ సంగమము వలెనే స్త్రీ - పురుషులు పరస్పరం అర్ధ - అర్ధభాగములుగా ఉంటున్నారు** - అనునది **యాజ్ఞవల్క్యమహర్షి** చెప్పిన - సృష్టిలోని **స్త్రీ-పురుష సమ్మేళన సిద్ధాంతము.**

- పురుషునిలో అర్ధభాగము స్త్రీత్వముతోను,
- స్త్రీలో అర్ధభాగము పురుషత్వముతోను ఏర్పడినదై ఉంటున్నాయి (అర్ధనారి - ఈశ్వర సిద్ధాంతము)

అట్టి సతీ - పతులలో స్త్రీ ఈ విధంగా ఆలోచించింది.

**"ఇదేమి? ప్రజాపతి నుండి జనించిన 'స్త్రీ' ని నేను. అదే ప్రజాపతి నుండి పుట్టిన పురుషుడు నాతో భోగించు ఇచ్ఛ కొనసాగిస్తున్నాడు?** ఏమి చేయాలి?"

అప్పుడు ప్రజాపతి అంశ అగు స్త్రీ అంతర్ధానమై గోవు (ఆవు) (Cow) రూపము దాల్చింది. ఆ వెంటనే పతిరూపమున ఉన్న ప్రజాపతి అంశ ఎద్దు (Ox) రూపముదాల్చి గోవుతో సంభోగించసాగింది. ఈ విధంగా ఆవు జాతి జనించింది. ఇదే రీతిగా **"స్త్రీ అంశ నూతన స్త్రీ రూపము** (Female) **దాల్చటం, పురుష అంశ పురుషరూపము** (Male) **దాల్చటం"** అను సంఘటనలచే వివిధ జాతులలో స్త్రీ పురుష (Female and Male) అంశలతో జీవజాతి వృద్ధి జరుగసాగింది. పీలికము (పురుగు) పర్యంతము సృష్టి అంతా నిర్మితమై ప్రదర్శనమగుచు కొనసాగింది.

ఆవిధంగా ప్రజాపతి తన సంకల్పరూపమగు సృష్టిని చూస్తూ, **"ఆహాఁ! ఈ జగత్తుగా కనబడేదంతా కూడా నాయొక్క ఊహాభావన, కల్పన, అనుభూతి రూపమే. కనుక - ఈ సమస్తముగా అగుచున్నది నేనే"** అని ఆస్వాదించటం కొనసాగించ సాగారు. దృష్టాంతంగా ఒకడు తాను స్వప్నములో చూచినదంతా తనకు అభిన్నమని వివేచన చేసుకొంటున్నట్లుగా।

ఈ విధంగా **ప్రజాపతి - సృష్టిల పరస్పర అభేద - అనన్యత్వములను తత్త్వతః ఎరిగినవాడు జగత్ - సృష్టి సామర్థ్యము పొందగలడు.**

# ప్రజాపతి సృష్టి అంతర్గత విశేషాలు ।

స్త్రీ–పురుష విభాగములుగా భావన ధారణ చేసిన తరువాత ప్రజాపతి – ఇక "స్త్రీ, పురుష (Female – Male)" లతో కూడిన 'సృష్టి' అనే లీలా నాటకవినోదము కొరకై ఈవిధంగా పాంచభౌతిక సాకార దృశ్య కల్పనకు ఉపక్రమించి, మథనము చేయసాగారు. **అథ ఏత్యభ్య మన్థత్। (3-4-6)**

**ముఖాచ్చ యోనేః హస్తాభ్యాం చ – అగ్నిః అసృజత ।** (1) **ముఖము** (Fore Face) అనే 'యోని' నుండి – (2) అలాగే – చేతుల నుండి 'అగ్ని'ని కల్పించారు. అందుచేతనే ముఖము అఅచేతుల అంతర్విభాగములు అలోమకమలుగా (వెంట్రుకలు జనించనివై ఉండటము) జరుగుతోంది. వెచ్చగా కూడా ఉంటాయి.

యోని యొక్క అంతరమున కూడా 'అగ్ని' కల్పించబడటము చేతనే లోన వెంట్రుక స్థానములు ఉండవు.

అగ్ని తరువాత ఆ ప్రజాపతి ఇంద్రియాభిమాన అధిదేవత అగు ఇంద్రుని సృజించారు.

అందుచేతనే యజ్ఞములో యాజ్ఞీకుడు మొదటగా – **'అగ్ని'ని స్థాపించి, ఇంద్రుని** స్తుతి మంత్రమంత్రములతో **ఆహ్వానిస్తూ ఉంటారు.** యజమాని చేత **'అగ్నిని పిలుస్తున్నాము. నమస్కరిస్తున్నాము. ఇంద్రుని ఆహ్వానిస్తున్నాము. నమస్కరిస్తున్నాము'** అని ప్రార్థన చేయిస్తారు. ఈ విధంగా యజ్ఞరూపమగు ఈ సృష్టి అంతా అగ్ని–ఇంద్రాత్మకము. ప్రజాపతియే **అగ్నీంద్రాత్మకుడు.**

సమస్త దివ్యప్రజ్ఞాస్వరూప దేవతలతోను (అశరీరుల ప్రజ్ఞలతోను), సమస్త జీవజాతులతోను (సాకారుల ప్రజ్ఞలతోను) కూడిన విశేష సృష్టి అంతా కూడా **ప్రజాపతి యొక్క కల్పనా వైభవమే** – అని గ్రహించెదము గాక।

ప్రజాపతి సర్వదా ఏకస్వరూపుడు. అట్టి ఏకస్వరూపము నుండి ఈ అనేకత్వమంతా – ఒకే జలంలో అసంఖ్యాక తరంగాలవలె – కల్పించబడి, పరిపోషించబడి, తిరిగి జలమునందే లయము పొందుతోంది.

- సమస్తమునకు అన్నాదుడు (ప్రసాదించువాడు) ప్రజాపతి.
- ద్రవ్యస్వరూపమైనదంతా కూడా ప్రజాపతి యొక్క రేతస్సు (తేజో విభవము).
- అట్టి రేతస్సు నుండి సృష్టించబడి, అనుభవమయ్యేదంతా 'అన్నము'. ఆ అన్నమే (సంజ్ఞాపూర్వకంగా) 'చంద్రుడు'. (All that being experienced by 'Indrias')
- అట్టి అన్నమును భక్షించువాడు – అగ్ని / (ప్రాణము) / (The Experiencer).

***ఈ అగ్ని స్తోమాత్మకమయినట్టి (The Experiencer - Experinces combination) ఈ జగత్తు ఆత్మస్వరూపమే।***

ఎవ్వరైతే ఈ అగ్ని స్తోమాత్మక జగత్తు యొక్క సహజ – కేవలరూపమును అఖండాత్మగా గమనిస్తాడో, ఇక్కడి అనేకమంతా ఏకమగు ఆత్మగా దర్శిస్తాడో, – అట్టివాడు **అనేకము యొక్క ఎట్టి దోషముచే స్పృశించబడడు. ఆతడు స్వయముగా ప్రజాపతి లక్షణుడు అగుచున్నాడు.**

**ఇదగ్ం సర్వం అన్నం చ । – ఇదంతా అన్నము ।**

**ఏవాత్ అన్నాదశ్చ సోమ । – అన్నప్రసాదుడు చంద్రుడు ।**

**అగ్నిః అన్నాదః – అగ్ని కూడా అన్నప్రసాదుడే ।**

**స ఏషా బ్రహ్మణో అతిసృష్టిః । – ఇదంతా బ్రహ్మమునకు అనన్యమగు విశేషము.**

ఇక్కడ మర్త్యము – అమర్త్యము కూడా ఆత్మకు చెందిన విశేషములే। (మర్త్యము – కాలముచే మార్పు చెందునది. (Changes by Time Factor). **అమర్త్యము** = కాలముచే మార్పు చెందనిది. (Always remains as it is) .

# అవ్యక్తము - సృష్టి

ఈ అనుభవమగు సమస్త సృష్టి మొట్టమొదట "అవ్యక్తము" (Non Manifesting) గా ఉండి ఉన్నది. అట్టి అవ్యక్తము నుండి ఈ సమస్తము నామరూపాత్మకంగా వ్యక్తీకరణము అవసాగుతోంది. [ (ఉదాహరణకు ఒక "ఆట" (Say Cricket) ఆటగాడితో ఉండి, ఆ ఆటకు సంబంధించిన కళ ఆట ఆడుచున్నప్పుడు ప్రదర్శనమగుచుండటము వంటిది) ]

(నేను = అవ్యక్తము. నాదైన భావన, అనుభూతి = వ్యక్తము)

అట్టి వ్యక్తీకరణ (లేక) ప్రదర్శన విభాగములో **"అనేకము"** అనునది **రూపుదిద్దుకొనినదై ఉంటోంది.**

(1) ఇది దీని పేరు (2) ఇది దీని వస్తుతత్త్వము అను రూపకంగా **అసంఖ్యాక నామ రూపాత్మకమై వెలయుచున్న ఇదంతా కూడా ఏకమగు అవ్యక్తమునుండి ప్రదర్శనమగుచున్న "అనేక (నామ రూపాత్మకమైన) వ్యక్తీకరణమే".**

ఈ సృష్టి ఎవరికి (జీవాత్మగా వేంచేస్తూ ఉన్నవాడగు పరమాత్మకు) చెందినదో, - ఆయనయే ఈ **సమస్తములో, సమస్తముగా** ప్రవేశమానుడై ఉన్నారు.

ఈ దృశ్య వ్యవహారమంతటాయే కాకుండా, ఈ జీవుడు ఉపకరణముగా ఉపయోగిస్తూ ఉన్న ఈ శరీరమంతటా అణువణువూ, ఆమూలాగ్రము పరమాత్మయే ప్రవేశించి, విస్తరించి ఉన్నారు. వ్యాపించి ఉన్నారు.

ఒరలో ఉన్న కత్తి (ఖడ్గము) ఒరలో అంతటా విస్తరించి ఉంటుంది కదా। పరమాత్మయే 'జగద్దృశ్యము' అనే ఒరలో నిండుగా నిండియున్న ఖడ్గము. ఆయనయే విశ్వమంతా నిండియున్న **విశ్వంభరమూర్తి, విశ్వేశ్వరుడు, విశ్వపరుడు** కూడా. ఆ పరమాత్మ దృశ్యములో ఒక వస్తువు వంటివాడు కాదు. నాటకరచయిత నాటకములో ఒక పాత్రగా రంగములో (In the Scenary) కనిపించేవాడా? కాదు కదా।

అతడు సమస్త ద్రష్టలలో కేవలద్రష్ట (Concept of perceiver formation) గా వేంచేసి ఉన్నట్టివారు.

**'అవ్యక్తుడు'** అగు ఆ పరమాత్మయే స్వయముగా సమస్త దేహములందు ప్రవేశించినవారై ఉన్నారు. ఈ పంచ ప్రాణముల గమనము - ఆగమనము (పోక-రాక)ల వ్యవహారమంతా నిర్వర్తిస్తున్నారు. 'ప్రాణము' అను పేరు కలవాడగుచున్నారు. ప్రాణేశ్వరుడై వెలుగొందుచున్నారు.

- ఆత్మపురుషుడే **'చూడటము'** అను వ్యాపారము (Function) చేయుచు **'చూపు'**గా కళ్ల రంధ్రములనుండి బాహ్యమున ప్రసరించి, చూడబడుచున్నదిగా (అన్నముగా) తానే అగుచున్నారు. **చూచువాడు, చూడబడునదిగా** వెలుగొందుచున్నారు.
- **"వినడము"** - అను వ్యాపారము (Funation) చేయుచు, **"వినికిడి"**గా చెవులు రంధ్రముల నుండి బాహ్యమునకు ప్రసరించి, **"వినబడుచున్న సమస్తము (అన్నము)"** తానే అగుచు, **"వినువాడు-వినబడునది"**గా అయి వెలుగొందుచున్నారు.
- **"వాక్కు"** అను వ్యాపారము (Funation) చేయుచు, **'శబ్దము'**గా గొంతు - నాలుక - నోటిలో ప్రవేశించి, మాటలన్నీ (అన్నము) తానే అగుచు, **'మాట్లాడువాడు - మాటలు'** అయి వెలుగొందుచున్నారు.
- **"ఆలోచనలు"** అను వ్యాపారము (Funation) చేయుచు, భావన - ఆలోచనలుగా మనోనేత్రములో ప్రవేశించి, ఆలోచించబడుచున్నదంతా (అన్నము) తానే అగుచు **"ఆలోచించువాడు - ఆలోచించబడునది"**గా వెలుగొందుచున్నారు.

**ఈ విధంగా పరమాత్మయే ఏకసమయంలో !**

- ప్రాణేశ్వరుడుగా - (శరీరంలో) పంచప్రాణ చలన రూపములతో,
- చూచువాడుగా - చూడబడు సమస్తములతో,
- వినువాడుగా - వినబడు సమస్తముతో,
- పలుకువాడుగా - సమస్త శబ్ద - అర్థములతో కూడిన పలుకులతో, సమస్త ఇంద్రియధారిగా - ఇంద్రియ విషయానుభవముల

రూపములతో అన్నాదుడుగా (అన్నప్రసాదుడుగా) **"అన్నము"** తో – **సర్వత్రా వెలుగొందుచున్నారు. ఆయా ద్రష్ట, శ్రోత, ఆఘ్రాత, పలుకువాడు, ప్రాణస్వరూపుడుగా – మొదలైన సమస్త నామములు ఆత్మదేవుడివే.** ఆయనయే ఆయా కర్మలు (As per Respective Functions) గా పొందుచూ, ఆయా పేర్లతో పిలువబడుచున్నారు. **"పరమాత్మ కానిది, పరమాత్మలో లేనిది, పరమాత్మకు చెందనిది"** – అంటూ ఎక్కడా ఏదీ లేదు. ఉండబోదు.

## జీవాత్మ-పరమాత్మల గురించిన ఉపాసన

ఈ జీవాత్మ స్వతఃగా పరమాత్మ స్వరూపుడే। ఆత్మ (జీవ+పర) = జీవాత్మ-పరమాత్మ"।

> **వదన్ వాక్, పశ్యగ్ం – చక్షుః, శృణ్వన్ శ్రోత్రం ।**
> **మన్వానో మనః తాని అస్య ఏతాని కర్మనామాన్యేవ।**
> **స యోఽత ఏకైకం ఉపాస్తే, న స వేదాత్ కృత్స్నో హి**
> **ఏషోఽ త ఏకైకేన భవతి – "ఆత్మ' ఇత్యేవ ఉపాసీత।**
> **అత్ర హి ఏతే సర్వ ఏకం భవన్తి।** **(తృతీయ అధ్యాయః। చతుర్థ బ్రాహ్మణమ్ – మ॥శ్లో॥ – 7)**

పరమాత్మయే ఈ అసంఖ్యాక జీవాత్మలుగా వెలుగొందుచున్నారు. పరమాత్మయొక్క (జగత్‌రూప) అసంఖ్యాక ప్రదర్శనములలో ఒకానొక ప్రదర్శనము – **'ఈ జీవాత్మ'.**

అట్టి ఈ జీవాత్మ – **"వాక్కు, చూపు, ఆఘ్రాణ, శ్రవణ, స్పర్శ, మనో, ప్రాణములలో"** ఒక్కొక్కటిని వేరువేరుగా ఉపాసిస్తూ ఉంటే పరబ్రహ్మమును ఎరుగలేడు సుమా!

ఈ జీవుడు తనయొక్క ప్రాణము, నేత్రములు మొదలైన ఆయా – ఇంద్రియ మనస్సులతో కూడుకొని **"నేను ఇప్పుడు చూస్తున్నాను. ఇప్పుడు తాకుచున్నాను. ఇప్పుడు మాట్లాడుచున్నాను. ఇప్పుడు వినుచున్నాను"** – మొదలైన వేరు వేరు భావనలతో ప్రవృత్తులను (Multi Avocations) వేరువేరుగా ఆశ్రయిస్తూ ఉన్నంతకాలము **అసంపూర్ణ భావకుడే అవుతాడు.** సంపూర్ణమగు అఖండాత్మను తెలుసుకోలేడు. దర్శించలేడు. తన్మయుడు కాలేడు.

**<u>మరి ఈ జీవుడు "ఆత్మానుభవి" అయ్యేది ఎట్లా?</u>** ఎప్పుడైతే ఈ జీవుడు ఇంద్రియ – మనో – ప్రాణ వ్యాపారములతో సహా సమస్త వృత్తులను ప్రక్కకుపట్టి **"తనను తాను"** – స్వాభావికముగానే **సర్వాత్మకమగు పరమాత్మ స్వరూపముగా** దర్శించుచున్నాడో, అప్పుడు **ఆ మరుక్షణమే సంపూర్ణాత్మానంద స్వరూప స్వభావుడై విరాజిల్లగలడు.** ఆత్మ స్వానుభవమై విరాజిల్లగలదు.

అందుచేత **"ఆత్మయే ఈ సమస్తము! ఈ సమస్తము సర్వదా ఆత్మయే"** – అని శ్రద్ధగా, అనునిత్య భావనచే ఉపాసించబడునుగాక! అప్పుడిక **అనేక రీతులుగా నామరూపాత్మకమై కనిపించేదంతా పరబ్రహ్మమునందు ఐక్యమై, ఏకముగా అనుభవమవగలదు.**

అట్టి ఆత్మయే ధ్యానించవలసినది, ఆశ్రయించవలసినది, ఉపాసించవలసినది, సిద్ధించుకొనవలసినది కూడా.

**ఈ జగత్తు యొక్క వాస్తవ స్వరూపము ఆత్మయే।** సమస్తము తెలియవస్తున్నది కూడా ఆత్మకే।

*<u>దృష్టాంతానికి :</u>*

ఒక రైతుకు కొన్ని ఆవులు ఉన్నాయి. ఒకరోజు అర్ధరాత్రి ఆ రైతు గాఢంగా నిద్రిస్తున్న సమయంలో ఎవరో దొంగలు ఆతని ఆవులను తోలుకొనిపోయారు. తెల్లవారింది. ఆ రైతుకు నిండు సంఖ్యలోగల ఆవులు కనిపించలేదు. ఖాళీ కట్టుకొయ్యలు మాత్రం కనిపించాయి. ఇక ఆ రైతు, ఆతని కొడుకులు, కొందరు స్నేహితులు కలిసి – **"ఆవులు ఎత్తుకెళ్ళింది ఎవరు?"** – అని సమాలోచన చేయసాగారు. వెంటనే వారికి ఒక ఉపాయం తట్టింది. **"ఆవుల అడుగుల గుర్తులు ఎటువైపుగా కనిపిస్తూ ఉన్నాయో, అటువైపుగా అందరము**

**వెళ్లదాము. దొంగలు దొరకక ఏంచేస్తారు?"** – అని బయల్వెడలారు. ఆ విధంగా ఆవుడెక్కల గుర్తులను బట్టి వెతుకుతూ ఉండగా కొంత దూరంలో ఆవులు, దొంగలు దొరికిపోయారు.

అట్లాగే ఈ 'జీవాత్మ' యొక్క ఆనుపానులు విజ్ఞానదృష్టితో పరిశీలనాత్మకంగా అధ్యయనం చేసామా, అట్టి అధ్యయనముచే పరమాత్మను (పరమాత్మతత్త్వమును), జీవబ్రహ్మైక్యత్వ జ్ఞానమును, మోక్షమును పొందటము – తప్పకుండా సుసాధ్యమే।

**స యో అన్యం ఆత్మనః ప్రియం । అన్యమైన సమస్తము కంటే ఎవరికైనా ఆత్మయే ప్రియాతి ప్రియము।**

ఒకనికి అన్నిటికంటే అత్యంత ప్రియమైనది ఏదై ఉంటోంది?

పుత్రులా? ధనమా? ఇంకేవైనా – బంధుమిత్ర భార్య భర్త తల్లి తండ్రి – మొదలైనవా?

**మం॥శ్లో॥ తదేతత్ ప్రేయః పుత్రాత్, ప్రేయో విత్తాత్, ప్రేయో అన్యస్మాత్ –**
**సర్వస్మాత్ అన్తరతరం యదయమ్ 'ఆత్మా' । (మం॥శ్లో॥ 3-4-8)**

శ్రేష్ఠముగా భావించే బాహ్యమైన, అన్యమైన – దేనికంటే కూడా **ఆత్మయే, ఎవరికైనా ప్రియాతిప్రియము.** ఎందుచేత? పుత్ర ధన – బంధు మిత్ర కళత్ర ఇత్యాది సమస్త వ్యావహారిక సంబంధములు కాలగతికి చెందినవే. అందుచేత వాటి కంటే కూడా **ఆత్మయే అత్యంత సామీప్యమైనది కాబట్టి.** ఎంతగా దగ్గరదైనదంటే, **ఈ జీవుడు స్వయముగా ఆత్మయే అయి ఉన్నాడు.** ఆత్మ అంతగా దగ్గరైనది. అందుచేత పుత్ర-ధన-దృశ్య-దేహ మొ॥న ఇత్యాదులన్నిటికంటే – 'ఆత్మ'యే ప్రియమైనది.

అంతేకాదు. శరీరము, బంధువులు, తదితరులు కాలముచే వచ్చి, కాలముచేతనే నశిస్తాయి. (లేక) దేహము తొలగినప్పుడు ఈ జీవుడు వాటినన్నిటినీ వదలి వెళ్లాలి. స్వప్న సందర్భములో జాగ్రత్ సంబంధితమైన – అనుబంధ బాంధవ్యములేమీ ఉండవు. సుషుప్తిలో జాగ్రత్ – స్వప్న సంబంధితమైన అన్యమైనది ఏదీ ఉండదు. **అయితే జాగ్రత్ స్వప్న సుషుప్తి సందర్భములలో ఎవ్వడైనా తను తాను ఏమాత్రమైనా విడిచి ఉంటున్నాడా? లేదే! కనుక ఆత్మ ఒక్కటే సత్యము.** తదితరమైనదంతా **మనస్సుచే కల్పించబడి, మనస్సుతోనే పరిపోషింపబడుచు, మనస్సు చేతనే త్యజించివేయబడుతోంది కూడా!** మనస్సు మనన రూపము. **'మననము చేయవాడు' అయి ఉన్న ఆత్మ ఉంటేనే మనస్సుకు ఉనికి. అయితే, మనస్సుకు మునుముందే, మనస్సు లేనప్పుడు కూడా ఆత్మ ఉన్నది.**

**అనాత్మ దృష్టిచే** – స్వతఃగా అస్తిత్వములేనిది [ సాపేక్షిక భావముచే (Not originally true, but appears true by virtue of relative sense)] అగు అనాత్మ మాత్రమే **ఉన్నట్లు,** ఆత్మ స్వతఃగా **లేనిదైనట్లు** అనిపిస్తూ ఉంటుంది.

**ఆత్మదృష్టిచే** – సాపేక్షికంగా కనిపించేదంతా **సందర్భమాత్ర (పరిమిత) సత్యమని, ఆత్మ మాత్రమే సహజమగు నిత్య – పరమ సత్యమని తెలిసిపోతోంది.**

అయితే ఆత్మజ్ఞాని మాత్రమే అట్టి కాలగత (సందర్భ) సత్యములకు అతీతమగు ఆత్మదృష్టిని కలిగి ఉండగలడు.

అందుచేత, అవిద్యచే కనిపించేదంతా ప్రక్కకుపెట్టాలి. ఆత్మజ్ఞుడై – ఆత్మను మాత్రమే **ప్రియాతిప్రియముగా ఎరిగి సర్వత్రా ఉపాసిస్తూ దర్శించటము, ఆత్మకే నమస్కరించటము, ఆత్మనే మననము చేయటము** నిర్వర్తిస్తూ, క్రమంగా **ఆత్మయే తానై ప్రకాశించాలి.**

**తత్ ఆత్మానమేవ ప్రియం ఉపాసీత। స య ఆత్మానమేవ ప్రియం ఉపాస్తే, స హాస్య ప్రియం ప్రమాయుకం భవతి।** ఆత్మను ప్రియముగా ఉపాసించువాని ఇష్ట-ఆనందములు శాశ్వతమైనవి, తెంపులేనివి అగుచున్నాయి. బ్రహ్మవేత్త యొక్క పరా-ప్రేమ శాశ్వతమైనది.

-----

# బ్రహ్మమే నేనైనపుడు, బ్రహ్మమును తెలుసుకుంటున్నది ఎవరు?

**జిజ్ఞాసువు అగు విద్యార్థి** : బ్రహ్మమును ఎరిగియున్న మహానుభావా! ఇప్పుడు మీరు ఎవ్వరు?

**బ్రహ్మవేత్త** : సమస్తము బ్రహ్మమే అవటం చేత, **బ్రహ్మమే నేను అగుచున్నాను.** ఈ సమస్తము బ్రహ్మమే. కనుక ఈ సమస్తముగా ఉన్నది నేనే। **"నీవు బ్రహ్మమే। తత్ త్వమ్ అసి।"** అని ఎరుగుచున్నాను.

**జిజ్ఞాసువు** : ఓహో! ఈ సమస్తము బ్రహ్మమే అయి, మీరు బ్రహ్మమే కాబట్టి, మీరే ఇదంతానా? బాగానే ఉన్నది. మరి, "బ్రహ్మమును ఎరుగుటచే" అని ఎట్లా అంటున్నారు? సమస్తము పరబ్రహ్మమే అయినపుడు బ్రహ్మము దేనిని తెలుసుకుంటోంది? ఎవరు బ్రహ్మమును తెలుసుకుంటున్నారు?

**బ్రహ్మవేత్త** : మిత్రమా! వినండి. మొట్టమొదట ఈ విశ్వ దృశ్యము నాచే ఇంద్రియములకు (అందరిలాగానే) తెలియవస్తూ ఉంటోంది. అప్పుడు నేను కొన్ని ప్రశ్నలు వేసుకొన్నాను.

- **"నేను ఎవరు? ఈ విశ్వము ఎట్టిది?"**
- **"ఈ విశ్వము తారసబడకముందు నేను ఉన్నానా? ఎక్కడ ఉన్నాను?"**
- ఈ విశ్వములో అనేక క్షణ క్షణికమైన మార్పులు – చేర్పులు అగుపిస్తున్నాయి. **అట్టి ఈ విశ్వమంతా మొట్టమొదటగా ఉన్నదెక్కడ? ఇప్పుడున్నదెక్కడ? ఎందులో?** ముందు ముందు అనేక భేదములతో కూడిన ఈ విశ్వము **ఏమి కానున్నది?** ఎటన్నా పోతోందా? ఎటు?

ఈ విధంగా ప్రశ్నించుకొని, ఈ ప్రశ్నలకు సమాధానముల కొరకై

(1) తత్త్వజ్ఞులైన మహనీయులతో సంభాషణము, (2) తత్త్వశాస్త్ర పరిశీలనము (3) అధ్యయనపూర్వకమగు స్వానుభవసారము – ఈ మూడిటిని రంగరించి అధ్యయనము చేసి తెలుసుకోసాగాను. అప్పుడు నాకు తెలియవస్తున్నదేమిటో వినండి, చెపుతాను.

**బ్రహ్మ వా ఇదమ్ అగ్రఆసీత్ । (మం॥శ్లో - 11)।** ఈ సమస్త సృష్టికి, దాని గురించిన నాయొక్క "జ్ఞానము" నకు **మునుముందుగా ఇదంతా పరబ్రహ్మమే అయి ఉన్నది.** సమస్తము పరబ్రహ్మమే.

**తత్ ఆత్మానమేవా వై (వే) తత్।** : "సమస్తము" అనునప్పుడు – "నేను" కూడా సమస్తములో ఒకడిని కనుక, (జలములో ఒకానొక తరంగమువలె) **నాయొక్క ఆత్మ కూడా పరబ్రహ్మమే।**

- **తత్ త్వమ్ ।** ఈ విశ్వమంతా పరబ్రహ్మమే కాబట్టి, ఈ దృశ్యములో నాకు కనిపిస్తున్న **"నీవు" (త్వమ్) – పరబ్రహ్మ స్వరూపమే।**
- **అహంబ్రహ్మాస్మి ।** 'నీవు' అనేది తత్‌యే (తత్ త్వమ్) అయినప్పుడు ఇక నేనెవరు? నేను 'తత్' అనబడుచున్న పరబ్రహ్మస్వరూపుడనే।

ఈ విధంగా ఈ విశ్వముయొక్క పరబ్రహ్మ స్వరూపము తెలుసుకోవటమంటే, 'నీవు' గురించి, 'నేను' గురించి (త్వమ్, అహమ్‌ల గురించి) తెలుసుకోవటమే అగుచున్నది. 'బ్రహ్మము' అగు నేను బ్రహ్మము గురించి అధ్యయనము చేసి **'నేనే బ్రహ్మము'** అని ఎరిగి, **ఇక బ్రహ్మమే నేనై ఉంటున్నాను.** ఎందుకంటే **పరబ్రహ్మము (సమస్త జీవులకు) స్వస్వరూపమే అయి ఉన్నది – కనుక।**

**యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తత్ ।** దేవతలలోకెల్లా ఏ దేవత అయితే ఆ పరబ్రహ్మమును తెలుసుకుంటున్నారో, ఆ దేవత పరబ్రహ్మమే అగుచున్నారు.

***అట్లాగే ఋషులలోను, మునులలోను, మానవులలోను, జంతువులలోను మరెవరిలోను ఎవ్వరైనాసరే,– ఎవ్వరైతే పరబ్రహ్మమును తెలుసుకొంటున్నారో, ఆ "తెలుసుకోవటము" యొక్క ఫలితంగా, ఆ తెలుసుకొంటున్నావారు "నేనే బ్రహ్మమును" – అను స్వాభావికానుభవము సిద్ధించుకొంటున్నారు. బ్రహ్మమే అగుచున్నారు.***

# వామదేవమహర్షి - బ్రహ్మతత్త్వ సోఽహం సిద్ధి।

**స్మృతి :** వామదేవుడు అనే ఋషి. వీరు త్రేతాయుగంలో వసిష్ఠ మహర్షితో కూడుకొని అయోధ్యలో దశరథ మహారాజుకు పురోహితులై ఉండేవారు. అందుచేత **"శ్రీవసిష్ఠ, వామదేవాయ నమః"** అను గురుపూజ రఘువంశములో ప్రసిద్ధమై ఉండేది.

అట్టి వామదేవ మహర్షి ఒకానొకప్పుడు పరబ్రహ్మము గురించిన అధ్యయనము చేయసాగారు. **"ఈ సమస్తము పరబ్రహమే। కనుక నేను పరబ్రహ్మమునే"** – అను స్వస్వరూప – సమస్త రూప స్వానుభవమును పుణికిపుచ్చుకున్నవారై ఈ విధంగా గానం చేయటం ప్రారంభించారు.

- **"వామదేవుడు"** అను జీవుడుగా ఈ దృశ్యమునందు ప్రసిద్ధమై అనుభవమగుచున్న నేను **పరబ్రహ్మమునే.**
- ఈ విశ్వమంతా **పరబ్రహ్మ స్వరూపమే।**
- అందుచేత మానవజాతికి ఆదిరూపుడగు మనువును నేనే। మనువునై మానవత్వము, మానవులను ధారణ చేయుచున్న **పరబ్రహ్మమును నేనే.**
- ఆత్మపురుషుడే తనయొక్క తేజో రూపము చేత ఆకాశంలో సూర్యభగవానుడై ప్రకాశించుచున్నారు. ఆయనయే నాయందు 'నేను'గా కూడా ప్రకాశమానుడగుచున్నారు. అందుచేత **నేనే ఆకాశంలో సూర్యప్రకాశ చమత్కారమై వెలుగొందుచున్నాను.**

ఈ విధంగా ఆయన బ్రహ్మ–విష్ణు–మహేశ్వర–సమస్త దేవతా–సమస్త జీవజంతుజాల ప్రదర్శనముతో మమేకము పొంది **పరబ్రహ్మతత్త్వము సిద్ధించుకున్నారు.**

ఎవ్వరైనాసరే అట్టి పరబ్రహ్మతత్త్వమును వామదేవుల వారి మార్గంగా ఇప్పటికిప్పుడే **"పరబ్రహ్మము అనగా నేనే। పరబ్రహ్మమగు నేనే ఈ 'త్వమ్–తత్' లతో కూడిన సమస్తము అయి ఉన్నాను'** – అని అంటూ, తెలుసుకుంటూ ఉన్నాడో, అట్టివాడు ఇక్కడే ఇప్పుడే **సమస్తము తానై వెలుగొందుచున్నాడు.**

*(ఈ సందర్భములో 'భగవద్గీత'లోని **విభూతియోగము, విశ్వరూప సందర్శనయోగములో** శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్న 'నేను ఇది' – అనునది మనము – **"నేను ఇది" – అని నేను తెలుసుకోవాలి"** – అనే పరమార్థపూర్వకమైన బోధగా అధ్యయనం చేస్తే, మనకు సిద్ధించగలిగేదే <u>పరబ్రహ్మానందసిద్ధి</u>).*

## ఆత్మతో అనన్యము

**తదిదం అప్యేతర్హి య ఏవం వేద "అహం బ్రహ్మాస్మి" ఇతి, స ఇదగ్ం సర్వం భవతి। తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే॥ (మం॥శ్లో - 10).**

<u>"సమస్త లోకములతో కూడినదంతా - ఏ "పరబ్రహ్మస్వరూపమే" (సహజముగానే) అయి ఉన్నదో, అట్టి పరబ్రహ్మము నేనే"</u> – అను **"అహంబ్రహ్మాస్మి"**ని ఎవరైతే సిద్ధించుకుంటారో, అట్టివారి బ్రాహ్మీభావనను దేవతలు వచ్చి కూడా విరోధము కలిగించజాలరు. ఎందుకంటే దేవతలకు కూడా బ్రహ్మవేత్తయే ఆత్మగా అగుచుండబట్టి.

పరబ్రహ్మవేత్త **తాను తానుగా ఉంటూనే, ఈ సమస్తము అగుచూ,** ఆస్వాదిస్తూ ఉన్నాడు. ఇదంతా ఆతనికి స్వాభావికంగానే స్వస్వరూపమై స్వానుభవమౌతోంది. ఉపనిషత్ అధ్యయనము, ఆశ్రయముచే అట్టి స్వాభావికమగు స్వస్వరూప పరబ్రహ్మవేత్తత్వము సిద్ధించగలదు.

ఆత్మతో <u>అన్యభావన</u> కలవాడు ఏవిధమైన పరిమితభావన కలిగి ఉంటున్నాడో – అది కూడా సందర్భానుచితంగా ఇక్కడ చెప్పుకుందాము.

**అబ్రహ్మవేత్త**– "నేను వేరు–నా ఉపాసనా దైవము వేరు" అని, "దైవము నాకంటే వేరు – నేను వేరు"– అని ఈయన భావిస్తున్నాడు.





ఎవరైతే "తనయొక్క ఉపాస్య దైవము తనకంటే వేరు" – అను పరిధిలను దాటకుండా తన ఇష్టదైవముతో "మమేకము" అగు ఆవలి తీరమును దృష్టిలో కలిగి ఉండడో, – **అట్టి వానిపట్ల పరబ్రహ్మము స్వానుభవముగా సిద్ధించనిదే అవుతోంది.**

అట్టివాడు ('నేను వేరు – దైవము వేరు' అను పరిధులను, పరిమితభావమును అధిగమించు ఆశయము అంతరముగా కలిగి ఉండని వాడు) – మనుష్యత్వము నుండి, బ్రహ్మదేవత్వము (సృష్టికర్మ) వరకు **ఉత్కర్ష** (Mal - Inquisitiveness, thereby self imposition) **విడువలేనివాడే అయి ఉంటాడు.** అట్టివాడు ఆత్మ గురించిన **అఖండ – అప్రమేయ – నిత్యత్వ – సమస్తత్వ – సర్వత్వములను** అధ్యయనము చేస్తూ కూడా

యజమానికి పాలు ఇస్తూ ఉండే ఆవులవలె,
ఇంద్రుడు మొదలైన దేవతలకు భృత్యునివలె,

ఆరాధన చేస్తూ, లోక సంబంధమైన అభ్యుయద, నిశ్రేయ (క్షేమ) రూపఫలములను పొందగలననే అపేక్షకొనసాగించువాడగుచున్నాడు. అట్టి అపేక్షచే అన్యదేవతా పోషకుడు అగుచున్నాడు.

దేవతలకు గల అన్యదేవతల ఉపాసకులపట్ల 'అపేక్ష'చేత – మనుష్యులలో పరబ్రహ్మతత్త్వ ధ్యానము కలిగి ఉంటున్న వారి పట్ల కొంచెము ఉపేక్ష (ఆ దేవతలు) – కలిగినవారు అగుచున్నారు. అభిలాష చూపనివారగుచున్నారు.

అయితే దేవతలు కూడా క్రమంగా సర్వాత్మకమగు పరబ్రహ్మ తత్త్వజ్ఞానికి అనన్యులే అగుచు, దేవతలకు కూడా అనన్యోపాసకులు ప్రియము అగుచున్నారు. ఎందుకంటే ఆత్మయే అన్నిటికంటే ప్రియాతిప్రియము కాబట్టి. **దేవతలకైనా, మరెవ్వరికైనా ఆత్మోపాసకుని 'ఆత్మ'యే అమృతప్రాయము.**

## క్షత్రము – క్షత్రియ దేవతా సృష్టి – క్షత్రియత్ । (క్రియా దక్షత)

***క్షత్రము = కార్యక్రమము నిర్వర్తించు సామర్థ్యము.***

సమస్తమునకు పూర్వము ఇక్కడ బ్రహ్మము మాత్రమే **సర్వత్రా కేవల రూపంగా ఏర్పడినదై ఉన్నది.** తేజోరూపమై, అగ్ని ప్రభారూపమై ఉండి ఉన్నది. అట్టి కేవలమగు బ్రహ్మము ఎటువంటి క్రియా విశేషములు (Workmanship) కలుగకయే ఉన్నది.

ఒకప్పుడు అకారణంగా బ్రహ్మము నుండి క్రియ–ప్రతి క్రియా సంబంధితమైన అనుభూతి (భావన), ఆ భావన నుండి క్రియావిశేష సామర్థ్యరూపమగు **"క్షత్రము"** (workholic) బయల్వెడలుచున్నాయి. (అనగా) బ్రహ్మము క్షత్రమును (క్రియాభిలాష సామర్థ్యములను) లీలగా ధారణ చేయుచుండటం జరుగుతోంది. (అయితే, బ్రహ్మము స్వరదా యథాతథమే అయి ఉన్నది).

అట్టి క్షత్రము నుండి – **ఇంద్రుడు, వరుణుడు, సోమ (చంద్రుడు), రుద్రుడు, పర్జన్యుడు (వరుణుడు), ఋతు, మృత్యువు (మార్పుకు అధిదేవత), ఈశానుడు** మొదలైన క్షాత్రగుణ సంపన్నులగు క్షత్రియ దేవతలు **బయల్వెడలారు.** కాబట్టియే క్షత్రియులకంటే ఎక్కువ అయినదేదీ లేదు. **తస్మాత్ క్షత్రాత్ పరాం నాస్తి॥** అందుచేతనే "రాజసూయము" మొదలైన యాగములు జరుగుచూ ఉన్నప్పుడు బ్రాహ్మణులు క్రిందగా నిలుచుని, క్షత్రియుని ఎత్తైన చోట ఆపనములపై నిలబెట్టి **"యజ్ఞపురుష అంశ"** భావనతో ఉపాసన చేస్తూ **" క్షత్రాత్ పరం నాస్తి । క్షత్రఏవ తత్ యశో దధాతి। సైషా క్షత్రస్య యోనిర్యద్బ్రహ్మ"** – అను మంత్రమును **పలుకుచున్నారు. "బ్రహ్మము తన యశస్సును క్షత్రియునియందు స్థాపించుచున్నది"** అని వేదమంత్రము పలుకుచున్నారు.

క్షత్రియునికి యోని బ్రహ్మమే కాబట్టి రాజు శ్రేష్ఠత్వము పొంది, తనయొక్క రక్షించు దక్షత చేత ముందుగా బ్రహ్మమును (బ్రాహ్మణులను) ఆశ్రయిస్తున్నాడు. తాను కర్మ నిర్వర్తించటం ముగిసిన తరువాత సుక్షత్రియుడై **"బ్రహ్మార్పణమస్తు"** అని పలికి, చివరికి బ్రాహ్మణుని సగౌరవించుచున్నాడు. ప్రణామములు సమర్పిస్తున్నారు. ఎందుకంటే **బ్రహ్మము స్వానుభవముగా కలిగిన బ్రాహ్మణుడు సమస్త బ్రాహ్మీ స్థితి–సాధనపరులకు (ముముక్షువులకు) పూజ్యుడు.** సమస్త దేవతలకు 'బ్రహ్మము'గా ఆరాధ్యుడు కూడా.

**(ఇక్కడ 'బ్రాహ్మణుడు' అనగా 'బ్రాహ్మీ దృష్టి సిద్ధించుకున్నట్టివాడు' అని, క్షత్రియుడనగా బ్రాహ్మీదృష్టికి కావలసిన దైవీగుణసంపత్తి, భక్తి-జ్ఞాన-యోగ సంపదత సంపాదించుకొనువాడు - అనునది ప్రతీక).**

ఏ క్షత్రియాంశ సమన్వితుడైతే బ్రాహ్మణునిచే స్తుతించబడుచున్నప్పుడు, బ్రాహ్మణుని తక్కువగా చేసి భావిస్తాడో, అట్టివాడు తనయొక్క ఉత్పత్తి స్థానమగు 'బ్రహ్మము'ను అవమానించినవాడు అవుతాడు. లోకంలో అత్యంత ప్రశస్తము, పవిత్రము అయిన దానిని అవమానించిన, హింసించిన పాపము పొందగలడు.

[**దృష్టాంతము : నహుషుడు** అనేక క్రతువులు నిర్వర్తించి దేవత్వము పొందాడు. కాని మానుషత్వము కొనసాగించసాగాడు.

ఆతడు చంద్రవంశపు రాజు. స్వర్భానవి - ఆయువు ఆయన తల్లిదండ్రులు. పురూరవచక్రవర్తికి మనుమడు. ఆ నహుషుడు గొప్ప రాజాంశ గుణములు కలవాడు.

ఒక సమయంలో ఇంద్రునికి (విశ్వరూపుని చంపిన) బ్రహ్మహత్యాపాతకము అంటింది. నహుషుడు తనయొక్క క్షత్రియాంశ ప్రాశస్త్యముచే ఇంద్రస్థానములో **త్రిలోకపాలనాయోగ్యత** పొందారు. దేవతలు తమ తమ అంశలు నహుషునికి ఇచ్చారు. దేవరాజ్యము లభించగానే ఆతడు గర్వము పొందసాగాడు. అంతేకాదు. ఇంద్రుని భార్య శచీదేవి పొందును వాంఛించాడు. వేద నియమముల గురించి నిర్లక్ష్యముగా దూషించసాగాడు.

చివరికి బ్రాహ్మణదూషణ చేసి, ఋషులచే పల్లకి మోయించుకొని, అగస్త్యమహర్షిని అవమానించి భూమిపై పాముగా సంచరించే శాపము పొందారు. పాండవుల అరణ్యవాస కాలంలో ఆ నహుషుడు ధర్మరాజును కొన్ని వేద వేదాంతికమైన ప్రశ్నలను అడిగి సమాధానము పొంది శాపవిముక్తుడైనారు. - శ్రీమద్భాగవతము. శ్రీవిష్ణు పురాణము.]

❖ ❖ ❖

## విశమ్ అస్పృజత। (వైశ్వదేవ సృష్టి - వైశ్య శక్తి)

**బ్రాహ్మణ, క్షత్ర** కల్పన తరువాత కూడా బ్రహ్మముచేత **కర్మలకు సంబంధించిన క్రియా విశేషములతో కూడిన సృష్టి కల్పన** సంపూర్తికానే లేదు. **సృష్టి క్రియావంతము** కాలేదు. అప్పుడు పరమాత్మ (పరమపురుషుడు) 'వైశ్వము' అను తత్త్వమును కల్పించుచూ సృష్టి కల్పనా వ్యాసంగము కొనసాగించసాగారు. అప్పుడు దేవతలలో 'గణశ' అను శబ్దముతో చెప్పబడు దేవ వైశ్యగణమును సృష్టి కార్యక్రమము కొరకై సృష్టించారు. అట్టి దైవవైశ్యగణశ దేవతలే వసువు, రుద్రుడు, ఆదిత్యుడు, విశ్వేదేవుడు, మరుత్తు మొదలైనవారు. వీరు సృష్టి క్రియలో అనేక లోక చిత్ర - విచిత్ర విశేషాలు, పదార్థ ధర్మములు, మనోబుద్ధి చిత్త కల్పనలు రచించి సృష్టియందు ప్రవేశింపజేయసాగారు.

## శౌద్రం వరం అస్పృజత। (శౌద్రదేవ సృష్టి - శౌద్ర శక్తి - పోషణశక్తి )

ఆవిధంగా బ్రాహ్మణ క్షత్రయ వైశ్వ (వైశ్య) దేవతల సృష్టి పరమపురుషునిచే నిర్వర్తించబడింది. సృష్టి క్రియా సిద్ధిగా (Implementation of Functional Part of Creation) జరిగినప్పటికీ ఈ సృష్టి క్రియ - **స్వయం క్రియాత్మక శక్తి** పొందనే లేదు. సృష్టికి సంబంధించిన అనేక కార్యక్రమములు, క్రియా విశేషములు మిగిలియే ఉన్నాయి. అప్పుడు పరమాత్మ - సృష్టిపురుషుడు **'శౌద్రము'** అనే శక్తిని **క్రియావిశేషము కొరకై సంకల్పించారు.**

సృష్టి పురుషుడే బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య (వైశ్వ) శక్తిరూపుడు అయినట్లే, (ఆ పురుషుడే) **శౌద్రశక్తి స్వరూపుడు కూడా।**

**శూద్రము** = పోషణ. పోషించునది. 'పూష'.

ఈ పృథివి అంతా పూషము (పోషించునది). భూమియే కదా సమస్త జీవులను పోషించునది! **భూమియే (పోషణయే) సృష్టిలోని పోషణశక్తి.** సమస్త జీవ పోషణా విధానము, ఆహారాది విశేషముల కల్పన - ఇవి శౌద్రశక్తి యొక్క సృష్టికి సంబంధించిన పాత్ర.

# సత్య - ధర్మములు (సత్-విధి)

ఈవిధంగా సృష్టియొక్క రచనాసంవిధానము కొరకై పరమాత్మచే (లేక) పరమపురుషునిచే వేరువేరైన గుణ - కర్మల చాతుర్వర్ణ్యములు చతుర్ - పురుషకారవర్ణనములుగా కల్పించబడ్డాయి.

| బ్రాహ్మణ శక్తి | క్షత్రియ శక్తి | వైశ్వ (వైశ్య) శక్తి | శౌద్ర శక్తి |
|---|---|---|---|
| సత్తు / సత్యము / శాంతము ధర్మము | ఉగ్రము క్షాత్రము | గణము వైశ్యము | పోషణము శౌద్రము |

**బ్రాహ్మణము = ఉనికి.   క్షాత్రము = ఉగ్రము.   వైశ్వము = గణము.   శౌద్రము = పోషణ**

చాతుర్వర్ణ్యములు పరబ్రహ్మముచే వేరవేరు గుణకర్మ విభాగములుగా సృష్టిలో ఆయా విధుల కొరకై నాలుగు భాగములుగా కల్పించబడినప్పటికీ కూడా, - సృష్టిలో **"ఎవరి విధులు ఏమిటి?"**-అనునది అప్పటికి నిర్దేశము కాలేదు. (అనగా) ఉగ్రమైనట్టి క్షాత్రము (క్షత్రియజాతి) మొదలైనవారికి నియామకమగు విధులు నిర్వచించబడకపోయినాయి. అప్పుడు సృష్టికర్త కర్మలు (క్రియలు) జరగటానికై లోక ప్రశస్తమగు **చాతుర్వర్ణ్య ధర్మములు** కల్పించసాగారు. **తస్మాత్ ధర్మాత్ పరం నాస్తి।** ఈ విధంగా సృష్టిలో ధర్మము (Respective duty. Responsibility)కి మించిన వస్తువు మరేదీ లేదు.

**అథో అబలీయాన్ బలీయాగ్ం, స మాశగ్ం సతే ధర్మేణ యథారాజ్ఞైవం యోవై స ధర్మః।** (మం॥శ్లో॥ - 14)।

***ఒక గృహస్థుడు ఉన్నాడు. ఒకరోజు ఆ గృహస్థునికంటే గొప్ప అధికారబలము, ధనబలము, కండబలము కలవాడు వాళ్ల ఇంటికి వచ్చి ఆ గృహస్థుని భార్యను బంధించి బలవంతంగా తీసుకువెళ్లసాగాడు. ఆ గృహస్థుడు వెంటనే రాజుగారికి విన్నపము చేశాడు. వెంటనే రాజుగారు భటులను పంపి, ఆ బలవంతుని క్రూరంగా శిక్షించి ఆ గృహస్థుని భార్యను తిరిగి ఆతనికి అప్పచెప్పారు.***

స్వధర్మము ఆశ్రయించి, శ్రద్ధగా నిర్వర్తించువారు - ఆవిధంగా ధర్మముచే సదా రక్షించబడుచూ ఉంటారు.

**ఏది ధర్మమో,** అదియే సశాస్త్రీయమైన **సత్యము.** (సత్యము అనగా - అబద్ధాలు చెప్పకపోవటం - నిజమే చెప్పటం అనునది మాత్రమే అసలైన అర్థం కాదు). ఏది ధర్మమో అది **తప్పక నిర్వర్తించే** ప్రయత్నము, ఏది అధర్మమో అది **నిర్వర్తించకపోయే** ప్రయత్నము - **ఇదియే సత్యమును ఆశ్రయించటము.**

**తస్మాత్ సత్యం వదన్తమ్ ఆహుః "ధర్మం వదతి" - ఇతి।**
**ధర్మం వా వదన్తగ్ం - "సత్యం వదతి" - ఇతి।** (మం॥శ్లో॥ - 14)।

అందుచేతనే - "ఆయన సత్యధర్మ నిరతుడవటం చేత ఉత్తముడు" అని మనము చెప్పుకొనేదప్పుడు -

⌘ ఆయన ధర్మం చెప్పుతాడు కాబట్టి సత్యమే మాట్లాడుచున్నారు.

⌘ ఆయన సత్యమే చెపుతారు కాబట్టి ఆయన చెప్పేది ధర్మమే అయి ఉన్నది.

అని లోకంలో అనుకోవటం ప్రతీతి. ఈవిధంగా సత్యధర్మములు రెండింటిని కలిపి పరమాత్మయే సృజించారు. **అట్టి సత్యధర్మములే క్షత్రియజాతిని నియమించునట్టిది, క్షాత్రమును ప్రకటించునట్టిది.**

**ఈవిధంగా -** శాస్త్ర విషయములకు సంబంధించి -
బ్రాహ్మణము - సత్యము - బ్రాహ్మణులకు,
క్షత్రియము - సత్య ధర్మములు - క్షత్రియులకు,
వైశ్వము - సత్య ధర్మ న్యాయము-వైశ్వులకు,
శౌద్రము (శూద్రము) - సత్య ధర్మ న్యాయ సమర్పణలు శౌద్రులకు -

శాస్త్రీయ విద్యుక్త ధర్మములు, ప్రతీకలై, **మోక్ష మార్గములు అగుచున్నాయి.**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య (వైశ్య) శూద్ర చాతుర్వర్ణ్యములు పరమాత్మయొక్క తేజోవిభవములే. **నాలుగు వర్ణములవారు (జాతులవారు) ఏకమగు పరబ్రహ్మస్వరూపులే.**

దేవతల మధ్యగా **అగ్నిస్వరూపమై వెలుగొందు తేజోరూపమే 4 వర్ణములుగా ప్రదర్శనమౌతోంది.**

**పరబ్రహ్మమే** →

- బ్రాహ్మణములచే (వేద మంత్ర – స్వర – అంతరార్థ ఉపాసనలచే) – బ్రాహ్మణులుగాను,
- క్షత్ర (సామర్థ్య) ప్రదర్శనచే క్షత్రియులుగాను,
- (కృషి గోరక్షణ వంటి) వైశ్యకర్మలచే వైశ్యులుగాను,
- సేవ – పరిపోషణ విధులుచే శూద్రులుగాను–

అగుచూ, విశ్వధారణ చేయుచున్నది. చాతుర్వర్ణములు బ్రహ్మమే అయి ఉన్నాయి. **నిష్క్రియమగు బ్రహ్మము చేతనే సమస్తము కల్పితమౌతోంది.**

**(చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ।**
**తస్యకర్తారమపి మాం, విద్ధి అకర్తారం, అవ్యయమ్।** – భగవద్గీతాచార్యులవారు)

## కర్మలు ఎందుకు చేయాలి?

ఏ దివ్య ప్రజ్ఞా స్వరూపులగు దేవతల ప్రజ్ఞావిశేషములచే, క్రియలచే – ఈ దేహము, ఈ విశ్వము "నిర్మితము, సాకారము" అయి ప్రవర్తమానమవుతుందో, అట్టి దేవతలకు సమర్పణగా మానవులచే విద్యుక్తమైన కర్మలు నిర్వర్తించబడును గాక। బ్రాహ్మణ – క్షత్రియ – వైశ్య – శూద్ర చాతుర్వర్ణ్యజనులు వారి వారి సత్య–ధర్మముల ఆశ్రయముచే (నిర్వర్తించుటచే) **ఆయా వారివారి ధర్మములు వారివారి మోక్షసాధనములు. స్వధర్మములను ఉపకరణములుగా మలచుకోవటమే కర్మయోగము.**

అందుచేతనే అగ్నియందు ఆహుతుల సమర్పణ యజ్ఞవిధులందు వేదవాఙ్మయముచే–సంజ్ఞాపూర్వక–విధివిధానంగా సూచించబడుతోంది.

**విశ్వయజ్ఞమునందు స్వధర్మనిరతియే ఆహుతి.**

బుద్ధియందు **బ్రహ్మజ్ఞానాగ్నిని వెలిగింపజేయటము చేతనే** – అంతరంగములో పేరుకొని ఉన్న **"దృశ్యము వైపుగా సంధింపబడిన సంబంధ – అనుబంధ – ధ్యాస వ్యసనములపై"** ఈ జీవుడు విజయము సాధించగలడు. **స్వాభావికమగు ఆత్మజ్ఞాన – ఆత్మభావన – ఆత్మధ్యాసలను సిద్ధించుకోగలడు.**

'పరబ్రహ్మము' అనగా? **ఈ జీవునియొక్క స్వాభావికము, అప్రమేయము అగు త్రికాలాతీత స్వస్వరూపమే।** అదియే **'బ్రహ్మము'** అను శబ్దము చేతను, **'పరమాత్మ', 'ఆత్మ'** అను శబ్దము చేతను **"సహజము" 'కేవలము'** మొదలైన శబ్దములచేతను ఏకార్థంగా చెప్పబడుతోంది.

అట్టి స్వస్వరూపమగు **'ఆత్మ'** గురించి నిస్సందేహమగు ఎరుగకయే మహదాశయమగు గాక। 'జీవితము' అనే మహత్తర – సదవకాశమును అందుకు సద్వినియోగము చేసుకోవాలి. లేదా, ఆతని ఉత్తరోత్తర దుర్భర గతులనుండి ఆత్మ అతనిని రక్షించదు.

కాబట్టి ఒకడు ఆత్మను ఎరుగకుండా ఎన్ని పుణ్యకార్యములు నిర్వర్తించటం జరిగినప్పటికీ, అట్టి పుణ్యకార్యముల ఫలభోగము తరువాత వాటి సుఖమయ ప్రయోజనములన్నీ ఖర్చు అయిపోతాయి. **తిరిగి ఆ జీవునిపట్ల అజ్ఞాన – దుఃఖ పూరిత జన్మ– జన్మాంతరములు, దేహ – దేహాంతరములు అనివార్యము కాగలవు.** అందుచేత సర్వాత్మకమగు ఆత్మనే (అఖండాత్మనే , పరమాత్మనే) అధ్యయనం చేయాలి, ఉపాసించాలి, అభ్యాసపూర్వకంగా దర్శించాలి, **"తత్త్వమ్'** (తత్–త్వమేవ) అను (నీవుగా కనిపించేది పరమాత్మానంద స్వరూపమే అను) మహావాక్యార్థ నిత్యాభ్యాసము ద్వారా **"సోఽహమ్"ను – దేహము పడిపోకముందే** (Before the fall of the Body) **సిద్ధించుకోవాలి.**

ఄ సర్వాత్రా **ఆత్మదర్శనమును** (శ్రవణ – వినటం, తెలుసుకోవటం, మాట్లాడుకోవటం)

ఄ **మననము** (ఆత్మగా అనుకుంటూ ఉండటము).

ఄ **నిదిధ్యాస** (ఆత్మగా అనిపించే వరకు అనుకుంటూ, **మననము** చేయటము),

ఄ **సమాధి** (అదియే తానవటము)–

అనే సాధన చతుష్టయంచే) ఇక్కడే ఇప్పుడే ఆత్మాహం బుద్ధిని సిద్ధించుకొన్నవానికి కర్మలుగాని, కర్మఫలాలుగాని ఏమాత్రము అంటజాలవు.

**సమస్తమును ఆత్మయందు, ఆత్మగా సమస్తమును** దర్శించు యోగి, తాను ఏది ఇచ్ఛగిస్తే అదంతా ఆత్మచే ప్రాప్తించగలదు. ఆత్మజ్ఞానముచే సమస్తము సిద్ధించగలదు.

# గృహస్థ ధర్మములు

**("కర్మ సన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే"।)**

ఈ జీవుని స్వస్వరూపమగు ఆత్మయే సమస్త జీవుల ఆత్మగా వేంచేసినదై ఉన్నది. అందుచేతనే గృహస్థుడైనట్టి జీవుడు సమస్త జీవులకు ఉపకారము చేయుటచేతనే ఆత్మతృప్తి పొందగలడు. **ఆత్మజ్ఞాని స్వాభావికంగానే పరోపకారి అయి ఉంటున్నాడు.**

– **యజ్ఞ, యాగ**– ఇత్యాది కర్మలచేత **దేవతలకు,**

– **స్వాధ్యాయ** (పారాయణ) అధ్యయనములచేత **ఋషులకు,**

– **పిండోదకాలు** సమర్పిస్తూ **పితృదేవతలకు,**

– **వసతి, అన్నము** సమర్పించి **మనుష్యులకు,**

– **నీరు, గడ్డి** (ఆహారము) సమర్పించి **పశువులకు,**

– **బలి, భాండశేషాన్నములచే పురుగులకు,** పక్షి – జంతుజాలమునకు ఆహారము సమర్పిస్తూ – ఉపకరిస్తూ సంతోషము కలుగజేయునుగాక। దేవ ఇత్యాదులకు **"నేను వీరందరికి ఋణపడి ఉన్నాను"** అను భావనతో కర్మలు చేయాలి. అట్టి, కృతజ్ఞతాభావముతో (నేను పొందిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేస్తున్నాను కదా – అనే భావంతో) గృహస్థ కర్మలు నిర్వర్తించు జీవుని పట్ల సమస్తభూతములు **"ఈతనిని ప్రియముగా రక్షించాలి"** – అనే ఆప్యాయముతో కూడిన భావము కలిగి ఉంటాయి.

ఇవియే పంచ యజ్ఞములుగా (దేవ–ఋషి–పితృ–మనుష్య–భూతములకు సేవాభావముతో సమర్పించు యజ్ఞముగా) మానవులకు (వేదములచే, ఆర్యులచే) నియమించబడ్డాయి.

ద్వితీయ భావనను అధిగమించి ఏకము – అఖండము అగు ఆత్మభావన (అద్వితీయ భావనను) ఆశ్రయించు వానిని మొదట్లో దేవతలు "మహాత్ములను కొలవటము లేదు కదా!" అనే భావముతో అస్పష్టత కలిగి ఉండటం జరిగినా కూడా, **అందరికీ ఆత్మయే ఉపాసనా వస్తువు కాబట్టి, ఆత్మోపాసకులు త్వరలో ప్రేమ, గౌరవము, ఆశీర్వాదము మొదలైనవి దేవతలనుండి పొందగలరు.**

# ఆత్మ కామ - "పాంక్త యజ్ఞము"

**ఆత్మ కామమే ఇదంతా కూడా।** సృష్టికి పూర్వము ఆత్మయే నిర్విషయ – అద్వితీయమై ఉన్నది. అట్టి ఆత్మకు **"నేను ఏదైనా చేయాలి?"** – అనే పాంక్తము (Interest) బయలుదేరింది. 'అన్యము' యొక్క రూపముగా – **"నాకు ప్రజలు (అన్య ప్రజ్ఞాజీవులు), సంతానోత్పత్తి, వస్తు – ధన సంపద కావాలి. అవసరము"** – అని అనుకోసాగింది.

***"దృశ్యములో ఏవేవో సిద్ధించుకోవటానికై నేను కర్మలు నిర్వర్తించటము కోరుకొంటున్నాను".***

ఈ విధంగా భావించటం ప్రారంభించగానే ఆత్మ తనయొక్క ఏకత్వమును ఏమరచి అన్యత్వము, అన్యముతో అవినాభావత్వము (Inter - dependence) కల్పనారూపంగా పొందుతోంది.

అందుచేతనే ఒక్కడుగా ఉండువాడు తనయొక్క ఒంటరితనమును భరించజాలకపోవటము, ధనము, వస్తు సంపద, స్త్రీలు, పుత్రులు, స్నేహితులు మొదలైనవి కోరుకోవటము, వాటితో అవినాభావత్వము పొందటము జరుగుతోంది. **తోచకపోవటము, ఏదో ఒకటి చేయాలనే క్రియాభిలాష రూపుదిద్దుకోవటం జరుగుతోంది.**

ఆత్మ దేనికైనా "నాకు ప్రాప్తించాలి" అని కోరుకొంటున్నప్పుడు, అట్టిది ప్రాప్తించనంత కాలము ఆ **ఇచ్ఛయే మనోరూపము దాల్చి, ఆ కోరుకొంటున్నదే ఆత్మగా దాల్చబడుతోంది.**

***ఆత్మకు (జీవాత్మకు) –***

- కోరుకొనుచున్న ఆత్మావేశమే మనస్సు.
- వాక్కే ఆతని భార్య.
- ప్రాణమే కుమారుడు (పుత్రుడు).
- చూపుయే బుద్ధి – అనే ధనము. కంటి చేతనే చూచుకోవాలని కోరుకొంటున్నాడు.
- శ్రోంత్రేంద్రియమే దైవము. (వినికిడియే దైవము).
- జీవాత్మయే అధిదైవము.
- ఆత్మ నిర్వర్తించు కర్మయే ఈ దేహ ఇంద్రియ వ్యవహారమంతా।

"భూత భావన" (అన్య జీవులభావన) ఒకప్పుడు ఉద్భవింపజేసుకోవటం, మరొకప్పుడు విసర్జించివేయటమే – ఆత్మ చేసే **కర్మ చమత్కారము). (భూతభావ ఉద్భవకరో, విసర్గః కర్మసంగితః – అక్షర బ్రహ్మయోగం – భగవద్గీత)।**

## పాంక్తము

(1) ఆత్మ కర్మలను స్వీకరించటము, (2) తద్వారా దేహ దేహాంతరములను దృశ్య – దృశ్యాంతరములను కల్పించుకొనటము, (3) కొంత సమయము వినోదించటము, (4) మరల ఎప్పుడో అట్టి 'కర్మ' అను ఉబలాటము నుండి విరమించడము, (5) స్వస్వరూపమునందు సమస్తము లయం చేసి – 'మౌనము' వహించటము – మొదలైన వ్యవహారమంతా కలిపి – **"ఆత్మయొక్క పాంక్తము"** – అని చెప్పబడుతోంది.

- ఇదియే పాంక్త యజ్ఞము. పంచభూతములతో (ఐదు సంఖ్య)తో నిర్వర్తించేది కనుక పాంక్తము.
- యజ్ఞము, పశువు కూడా పాంక్తమే.
- పురుషుడు పాంక్తమే.
- సమస్తము (ఈ దృశ్య వ్యవహార రచన అంతా) పాంక్తమే.

ఈ విధంగా ఎవ్వరైతే, **'సమస్తము ఆత్మయొక్క, పాంక్తన కర్మయే'** – అని, ఇదంతా **"పాంక్తన యజ్ఞము"** అని తెలుసుకుంటాడో, అట్టి భావముతో ఈ విశ్వమును, విశ్వజీవులను ఉపాసనాభావంతో దర్శిస్తాడో, అట్టివాడు **"జగత్‌స్వరూపుడు, జగత్‌సాక్షి, జగదతీతుడు"** కూడా అయి ప్రకాశించగలడు.

# బృహదారణ్యకోపనిషత్ – 3వ అధ్యాయము

# పంచమం బ్రాహ్మణము

## 5. సప్తాన్నములు

సృష్టి సంకల్పాభిమాని, సృష్టికర్త, సృష్టికి అధిష్ఠానము అగు హిరణ్యగర్భుడు తనయొక్క తపో జ్ఞాన యోగములచే అనుభవికి ప్రసాదిస్తున్న 'సృష్టి' అనే అనుభవరూపమే 'అన్నము'. అయితే ఇక్కడ అనుభవమునకు విషయమయ్యేదంతా కూడా 7 రకములుగా వర్ణితము. ఇవియే 'సప్తాన్నములు' అని వేదవాఙ్మయముచే వర్ణించి చెప్పబడుచున్నాయి.

**(1). సాధారణాన్నము** – మానవులచే తినబడుచున్న షడ్రుచులు (ఉప్పు, పులుపు, కారము, చేదు, వగరు, తీపి అను రుచులు) తో కూడియున్న అన్నము (లేక) షడ్రసములతో (షడ్రుచులతో) కూడిన ఆహారము.

**(2). హుతాన్నము (దైవతాన్నము)** : యజ్ఞమునందు **అగ్నిలో వ్రేల్చబడే (లేక) హోమములో అగ్నికి సమర్పించే** నేయి మొదలైన ముఖ్య హోమద్రవ్యములు.

**(3). ప్రహృతాన్నము (దేవతాన్నము) :** (i) బలిహరణము. యజ్ఞమునకు ముందుగా భూతజాలమునకు 'బలి'గా సమర్పించబడునది. (ii) ప్రత్యేకమైన వస్తుజాలముగా హోమములో అగ్నికి సమర్పించునవి (నవధాన్యములు, నూతన వస్త్రములు, అనేక దినుసులు, వట్టి వ్రేళ్ళు మొదలైనవి)

**(4) మనో సూక్ష్మాన్నము (జీవాత్మన్నము)** – ఆత్మకు ఆహారము. మనన రూపము. మననము యొక్క సుదీర్ఘాభ్యాసముచే ఏర్పడే మనన సంస్కారములు (సూక్ష్మదేహము).

**(5) వాక్కు సూక్ష్మాన్నము (జీవాత్మాన్నము)** – ఆత్మకు ఆహారము. శబ్ద జనన స్థానము.

**(6) ప్రాణ సూక్ష్మాన్నము (జీవాత్మన్నము)** – ఆత్మకు శక్తి ప్రదర్శనారూప ఆహారము – పంచప్రాణములు, వాటి వాటి వ్యవహారములు.

**(7) క్షీరాన్నము** – పశువులకొరకు అన్నము. ఏది ప్రాణము కలది – లేనిదియో అట్టి గడ్డి మొదలైనవి జంతువులకు అగుచున్న ఆహారము.

ఈ సప్తాన్నములు కూడా ఎల్లప్పుడు సృష్టించబడినవగు సాధారణాన్నము, హుతాన్నము, భూతాన్నము, మనోసూక్ష్మాన్నము, వాక్ సూక్ష్మాన్నము, ప్రాణసూక్ష్మాన్నము, క్షీరాన్నము – ఇవన్నీ భక్షించబడుచున్నప్పటికీ, – **అవన్నీ సృష్టిలో అక్షయమై ఉంటున్నాయి.** క్షీణించవు.

ఎవ్వడైతే సృష్టిలో సృష్టికర్తచే సృష్టి చమత్కారము కొరకై 'అన్నములు'గా కల్పించబడిన సప్తాన్నములు 'అక్షయము' – అని తెలుసుకొంటాడో అట్టివాడు విశ్వముఖుడై **"సప్తాన్న– ఆస్వాదుడు"** కాగలడు. దేవతలను దర్శించగలడు. **మోక్షము సిద్ధించుకోగలడు.** ఈ విధమైన వివరణగా స్తుతి, శ్లోకములతో (వేద – వేదాంత) వాఙ్మయములో వర్ణించబడియే ఉన్నది.

❖ ❖ ❖

ఏవిధంగా అయితే జగత్పితయగు హిరణ్యగర్భుడు తనయొక్క తపస్సు, మేధస్సులచే (తపన, ప్రజ్ఞలను వినియోగించుటచే) సప్తాన్నములను సృజయించారో, అదే తపో మేధస్సులచే సాధారణాన్నముతో బాటుగా, అవి ఆహారము (అన్నము)గా పొందు జీవరాశుల సమూహములను కూడా సృజియించారు. అయితే **అట్టి అన్నమును పొందుటకై జీవుడు పరిశ్రమించియే పొందగలుగునట్లుగా కూడా కల్పించారు.** అన్నము (ఆహారము) ఊరకయే లభించదు. అందుకుగాక 'కర్మ' అనునది కూడా కల్పించారు.

అట్టి అన్నమును పొందుటకై చేయు పరిశ్రమ ధర్మ – అధర్మములతో కూడినదై, ద్వివిధానంగా సృష్టియందు కల్పించబడింది.

అట్టి అన్నము **'న్యాయార్జితాహారము – దైవార్పితాహారము'** అయినప్పుడు అది **ధర్మముతో కూడిన అన్నము**గాను, **"అన్యాయార్జితము, తనయొక్క వ్యక్తిగతంగా పరిమితమై (వ్యక్తి దేహ ధారణ కొరకై మాత్రమే) ఉపయోగించబడినది"** – అయినప్పుడు అది **అధర్మముతో**

**కూడిన ఆహారము**గాను చెప్పబడుతోంది. ధర్మముతో కూడిన అన్నము గురించిన శ్రమ – మోక్షమునకు మార్గము అగుచున్నది. అధర్మము గురించిన శ్రమ అనేక జన్మ – కర్మ పరంపరలకు కారణమగుచు, **"బంధము"**గానే పర్యవసానము (Eventuality) కలిగి ఉంటోంది.

## దేవతల ఆహారము – హుత, ప్రహృతములు

పరమాత్మ (ప్రజాపతి) – అశరీర దివ్య ప్రజ్ఞలగు (దేవతల తృప్తికొరకై) హుతములను, (భూత తృప్తికొరకై బలిహరణములగు) ప్రహుతములను – **"హోమ, బలిహరణము"**ల రూపంగా రెండు అన్నములను సృష్టించారు.

అందుచేతనే దేవతలను ఉద్దేశించి మానవులు హోమములను, బలిహరణములను నిర్వర్తిస్తూ ఉన్నారు. ఈ హోమ–బలిహరణ విశేషములగు హుత–ప్రహుతములను కొందరు విశ్లేషకులు (భాష్యకారులు) – 'దర్శ–పూర్ణమాసములు' అను శబ్దములచే కూడా చెప్పుచున్నారు.

అందుచేతనే కొందరు దర్శ పూర్ణ మాసములచే నిష్కామముగా దేవతలకు హుత–ప్రహుతములను సమర్పిస్తూ, **లోకకల్యాణము, మోక్షసిద్ధిలను ఆశయములుగా కలిగి నిర్వర్తిస్తూ ఉన్నారు.** అందుకు ప్రతిగా దేవతలు తమ అశరీర–దివ్యకర్మల ద్వారా మానవులకు (జీవులకు) ఆహారము, ప్రకృతి సానుకూల్యత, ఇంద్రియ ప్రదానము, దేహరక్షణ మొదలైనవి ప్రసాదించువారై ఉంటున్నారు.

## పయ (పాలు) స్వరూపమైన 'అన్నము'

పరమాత్మ (సృష్టికర్త) పశువుల కొరకై (పాంచభౌతిక శరీర వృద్ధికొరకై) "పయః (పాలు)" స్వరూపమైన అన్నము సృష్టిస్తున్నారు. జీవులదేహములన్నీ (మానవులతో సహా) మొట్టమొదటగా అట్టి రసరూపమగు పయస్సు చేతనే ప్రకృతిలో రూపాత్మకమౌతున్నాయి. ఈ పయస్సే 'క్షీరము' (పాలు) అను క్షీరసాన్నమై, **సకల జీవుల పట్ల పుట్టగానే** (Immediately after Birth) **ఆహారమగుచున్నది.**

> **పయో హి ఏవ అగ్రే మనుష్యాశ్చ పశవశ్చ ఉపజీవంతి।**
> **తస్మాత్ కుమారం జాతం ఘృతం వైవ అగ్రే**
> **ప్రతి లేహయన్తి స్తనం వా అనుధాపయన్తి॥ (మం॥శ్లో - 2)।**

క్షీరమే సర్వరసములకు (పదార్థములకు) ఆధారము అయి ఉన్నది. అందుచేతనే క్షీరమును మనుజులు (క్షీరజములుగా) మొట్టమొదట (పిల్లవాడు పుట్టగానే) అన్నముగా (ఆహారముగా) ఉపయోగిస్తున్నారు. అట్లాగే పశువులు (జంతువులు) కూడా పుట్టగానే క్షీరమును త్రాగి దేహము నిలచునట్లుగా మొట్టమొదటగా ఏర్పడి ఉన్నది. [అండజ (పక్షులు) శ్వేదజ (కీటక) ఇత్యాది కూడా అందించు పోషకాహారము 'క్షీరము' యొక్క రసతత్త్వముతో ఇమిడినవై ఉన్నాయి]

ఇందుచేతనే పుట్టిన బిడ్డకు జాతక కర్మ నిర్వర్తించేడప్పుడు పాల నుండి జనించే నేతిని (Ghee) మంత్రోచ్చారణాపూర్వకంగా ఆ బిడ్డయొక్క పెదిమలకు తండ్రిచేత తాకింపజేస్తున్నారు. ఆ సందర్భములో తల్లిచేత చనుపాలును బిడ్డకు త్రాగింపజేస్తున్నారు. (కుడిపింపజేస్తున్నారు). ఆపై ఆయురారోగ్య ఐశ్వర్యములు ఆశీర్వదించటానికి ఉపాసించు మంత్రములు చెప్పుచున్నారు.

ఈవిధంగా పశువులకు అన్నముగా (పశ్వన్నముగా) సృష్టించబడిన క్షీరము (పాలు/Milk) ను శిశువుయొక్క జాతక కర్మ సందర్భంలో ఉపయోగిస్తున్నారు. కనుక, ఈ మానవుని శిశువుస్థితిని గురించి చెప్పుకొంటున్నప్పుడు **'అతృణాదుడు'** అనే శబ్దమును (జాతకకర్మ మంత్రములలోను, తదితర సందర్భములలోను) ఉపయోగిస్తూ ఉన్నారు.

క్షీరము అమృతమయము. ఎందుకంటే క్షీరము (పాలు) లోనే స్థావర – జంగమాత్మకమైనట్టి (Non Moving and Moving beings of the Creation) సమస్త ప్రపంచము అంతర్గత రసరూపమై ఉన్నది.

**ఎవ్వరైతే క్షీరముతో (అనగా, సర్వాధారమైన పాలతో) ఇష్టదేవతకు ఒక సంవత్సరకాలము హోమము చేస్తాడో, అట్టివాడు భౌతిక దేహానంతరము భౌతికత్వమును అధిగమించినవాడై, దేవతలలో ఒకడుగా జన్మను సిద్ధించుకోగలడు.**

కానీ, బ్రాహ్మణముల గురించి విశదీకరించి వ్యాఖ్యానించు బ్రాహ్మణవాదులు కొందరు ఈ విధంగా అంటూ ఉంటారు.

*"క్షీరముతో హోమము చేయటము కర్మ ప్రాధాన్యమైనది. కనుక అది ఉత్తమ లోకములలో జన్మలకు, జన్మల వలన కర్మలకు కారణమేగాని, ఆది జన్మరాహిత్యమునకు ఉత్తమమైన త్రోవకాదు. జన్మరాహిత్యమునకు జ్ఞానమే మార్గము. అట్టి క్షీర హోమము అగ్నిరూప ప్రజాపతిని సిద్ధింపజేసి,* ***పునర్జన్మలను కలిగించునదే అగుచున్నది".***

అయితే,

క్షీరములో (పాలలో) సర్వతత్త్వములు ప్రక్షిప్తమై ఉండటంచేత పయోరూపమైన ఆహుతియొక్క వివరణాత్మక విశేషములచేత అట్టి ఆహుతులను సమర్పించు కర్త మోక్షమే ఆశయముగా కలిగి ఉన్నప్పుడు, – బుద్ధి నిర్మలము కాగలదు. **ఆతడు తప్పక జగత్తుకే ఆత్మ అయి ప్రకాశించగలడు.** ఎవ్వరైతే ఉత్తమాశయముతో (పరమాత్మతో మమేకమే మహదాశయముగా కలవాడై) **ఉదయము, సాయంత్రము కూడా క్షీర – ఆహుత ప్రక్షేపణముతో** హోమము నిర్వర్తిస్తూ ఉంటాడో, అట్టివాడు సంవత్సరకాలహోమముచే సర్వదేవతా స్వరూపుడు కాగలడు.

## సప్తాన్నముల అక్షయత్వము

మనము చెప్పుకున్న సప్తాన్నములు భోక్తల కొరకై పరమాత్మచేతనే సృజియింపబడుతోందని చెప్పుకున్నాము కదా! ఈ విధంగా

సాధారణాన్నము – **మానవులకొరకు,**

హుత – ప్రహుతాన్నములు – **దేవతల కొరకు,**

మనో–వాక్–ప్రాణాన్నములు – **జీవాత్మ కొరకు,**

క్షీరాన్నము – **పశువుల కొరకు–**

సృష్టించబడగా, అవన్నీ ఆయా వేరువేరు భోక్తలు అనుభవిస్తూ ఉన్నారు. ఆవిధంగా భక్షించబడుచుండగా, ఆ సప్తాన్నములు సృష్టిలో తరిగిపోతూ ఉన్నాయా? లేనేలేదు. ఎందుచేతనంటే...

<u>పరమాత్మయే...,</u>

**సృష్టికర్తగా** – సప్తాన్నములను సృష్టించి, సమస్త సృష్టికి 'తండ్రి' వంటివాడు అగుచున్నాడు. సృష్టికికర్త (The Creator) తానే అగుచున్నాడు. కర్మ (The Functioner) స్వరూపుడై నడిపిస్తున్నాడు. అంతేకాకుండా...

**"పాంక్తస్వరూప భోక్త"** (The User, The Enjoyer, The Consumer, The Experiencer) అగుచున్నాడు. సప్తాన్నములకు భోక్త అయి, సప్తాన్నములను తానే అనుభవిస్తున్నాడు.

<u>ఆ పరమాత్మ –</u>

**"అక్షర–అక్షయస్వరూపుడు"** అయి తనయొక్క అక్షయ లీలా వినోదము చేత ఆయా కాలములందు ఎప్పటికప్పుడు తనయొక్క తపోప్రజ్ఞాస్వరూపముతో సప్తాన్నములను సృష్టిలో అక్షయముగా సృష్టిస్తూనే ఉన్నారు. అనగా తనయొక్క వాక్కు – మనస్సు – కాయములతో సప్తాన్నములను ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ అక్షయంగా సృష్టిస్తూనే ఉంటున్నారు. అందుచేతనే పరమాత్మ **"అక్షరుడు", "అక్షయుడు", "అక్షయకారకుడు"** – అని వేదశబ్దములచే శ్లాఘించబడుచున్నారు. అట్టి అక్షయసప్తాన్న సృజకుడుగా పరమాత్మ అయి ఉండకపోతే, ఇక్కడి సప్తాన్నములు కొద్ది కాలములోనే నశించిపోయేవే, కానీ, అట్లా జరగటంలేదు. **ఈవిధంగా సప్తాన్నములు సర్వదా సర్వత్రా ఏమాత్రము క్షీణింపనివే' అయి ఉన్నాయి.**

❖ ❖ ❖

ఎవ్వడైతే **సప్తాన్నముల అక్షయత్వమును, పరమాత్మయొక్క అక్షరత్వమును** ఎరుగుచున్నాడో, అట్టివాడు సృష్టిలోని సప్తాన్నములకు తానే కర్త – కర్మ – భోక్త కూడా అయి, విశ్వతోముఖుడై, **తానే సమస్తము ఆస్వాదించు పరమాత్మ స్వరూపుడగుచున్నాడు.** దేవాత్మభావమును

నిశ్చలము, అనునిత్యము చేసుకొని **సర్వదేవతా స్వరూపుడగుచున్నాడు.** సర్వసాంసారిక సంబంధ – అనుబంధ శృంఖలముల నుండి (From all Bondages) విడివడి **'మోక్షస్వరూపుడు'** అగుచున్నాడు.

**స ఊర్జమ్ ఉపజీవతీతి ప్రశగ్ంసా।**

ఇవన్నీ మనము ఆత్మభగవానుని స్తుతి కొరకు చెప్పుకుంటున్నామేగాని, 'ఇతఃపూర్వము లేనిది – ఇప్పుడు క్రొత్తగా వచ్చుచున్నది' – అనే రూపంగా ఏదీ చెప్పుకోవటంలేదు. ఈ జీవుని పరమాత్మత్వము, సప్తాన్న కర్తా – కర్మ – భోక్తా చమత్కారము సర్వదా నిస్సంశయముగా ఏర్పడియున్న – సత్యమే అయి ఉన్నది. ఈ **"జీవుడు, అన్నము" కూడా పరమాత్మకు అంశరూప అభిన్నములే.**

## జీవాత్మాన్నములు – మనోవాక్ ప్రాణములు

ఆ ప్రజాపతి సప్తాన్నములలో మూడు రకములైన అన్నములను తనయొక్క స్వానుభవము కొరకే నిర్మించుకుంటున్నారు. అవి (1) **"మనస్సు"**, (2) **"వాక్కు"**, (3) **"ప్రాణము"**

### (1) మనస్సు

మననరూపమగు మనస్సును పరమాత్మయే సృష్టియొక్క లీలావినోదము కొర్కై కల్పించుకొనుచున్నారు. **"నేను వేరై–మనస్సు కలవాడను అగుచున్నాను"**–అను భావనను ఆశ్రయిస్తున్నారు. అట్టి మనస్సు చేతనే తాను "అనుభవి" (The Experiencer) అను **జీవాత్మరూపము**ను దాల్చుచున్నారు. ఆవిధంగా ధారణచేసి **మనస్సుతోనే**–చూస్తున్నారు, వింటున్నారు. సంకల్పిస్తున్నారు, వాంఛిస్తున్నారు. ఆయనయొక్క మనస్సే **హిరణ్యగర్భుడు, త్రిలోకములు,** (జాగ్రత్ స్వప్న సుషుప్తి) **త్రి అవస్థలు** కూడా.

**సంశయము** (Doubting), **సంశయజ్ఞానము** (The knowledge required for Doubting), **ఆస్తిక్యబుద్ధి** (The Wisdome regarding the sense of "I am / I am existent, and the sense of "Existence of Almighty/ God"), **అశ్రద్ధ** (Diversion, Non-Attention towards Self), ధారణ (Holding unmoved to a particular idea, Opinion, Casusation etc,), **అధృతి** (Non Holding any one Idea, Opinion, Causation etc) , **లజ్జ** (Adopting relativity and holding low opinion about ones own self etc), **ప్రజ్ఞ** (Analytical application of logic), భయము (Fear) – **ఇవన్నీ కూడా మనస్సే.** ఇవేవీ కూడా "మనస్సు" – అని **మనము పిలుస్తున్నదానికి ఈషన్మాత్రం కూడా వేరు కాదు.**

ఎవరైనా ఒకని వీపుమీద తాకగానే, ఆ స్పర్శ, ఆ స్పర్శించినవానిని ఆతడు మనస్సులోనే గుర్తించుచున్నాడు. ఈవిధంగా పంచేంద్రియములు మనస్సుకు ఐదుచేతి వ్రేళ్ళవంటివి.

### (2) వాక్కు

**పలుకుచున్న, వినుచున్న** సమస్తము కూడా వాక్కుయొక్క స్వరూపమే. వస్తు నిర్ణయమును అనుసరించి వాక్కు సారూప్యము పొందుతోంది. వాక్కుచే వస్తువు గుర్తించబడి గమనించబడుతోంది. అంతేగాని వాక్కు స్వయముగా వస్తువై ప్రకాశించేది కాదు. కాని 'వాక్కు' మనస్సుయొక్క **స్వ–అర్థముచే, మనస్సు సమక్షంలో** – వస్తువును **ప్రకాశింపజేస్తోంది.** మనస్సే వాక్కురూపము దాల్చుచున్నది. వాక్కును ఉపకరణంగా చేసుకొని వస్తువును అనుభవముగా పొందుతోంది. **వాక్కుకు సమస్తదృశ్యము అన్నస్వరూపమే. సమస్తమునకు వాక్కే అన్నాదము.**

### (3) ప్రాణము

పంచప్రాణములైనట్టి ప్రాణ–అపాన–వ్యాన–ఉదాన–సమాన ప్రాణములు (ప్రాణముయొక్క శరీరములోని వివిధ చేష్టలు), దేహ చేష్టా సంబంధమైన వృత్తులు – **సమస్తము ప్రాణమే.** ప్రాణమే మనస్సు. మనస్సే ప్రాణము కూడా. మనోప్రాణములు ఒకే శక్తి యొక్క ద్వివిధ చర్యలు / ప్రదర్శనలు – వంటివి.

> ఇతి ఏతత్ సర్వం ప్రాణఏవ ఏతన్మయో వా।
> **అయమాత్మా వాక్మయో, మనోమయః, ప్రాణమయః ॥ (మం॥శ్లో॥ - 3)**

**ఈ కనబడేదంతా ప్రాణమయమై, ప్రాణస్వరూపమే అయి ఉన్నది. ఈ జీవాత్మ కూడా వాక్–మనో–ప్రాణమయుడు.** ఈ మూడిటి చమత్కారమే జీవాత్మయొక్క ప్రదర్శనశీలత్వము.

మనో వాక్ ప్రాణములనే "అన్నము" యొక్క వికార రూపమే ఈ దేహము. అనగా ఈ దేహము మనో – వాక్ – ప్రాణ వికారరూపమే.

అట్లాగే, వాక్ – మనో – ప్రాణము లే – భూలోక భువర్లోక, సువర్లోకములు కూడా.

వాక్‌యే ఋగ్వేదము. మనస్సే యజుర్వేదము. ప్రాణమే సామవేదము. ఈవిధంగా **వాక్ మనోప్రాణములే త్రైయీ వేదములు.**

వాక్కే **దేవతలు.** మనస్సే పితృదేవతలు. ప్రాణ రూపములే **మనుష్యులు.** ఈ విధంగా **వాక్ మనో ప్రాణములే దేవ పితృ మనుష్యులు కూడా!**

మనస్సే పిత (తండ్రి). వాక్కే మాత (తల్లి) – ప్రాణమే సంతతి. **ఈవిధంగా తండ్రి తల్లి సంతతి – మనో ప్రాణ వాక్కులే అయి ఉంటున్నాయి.**

ఈ జీవునిపట్ల (1)విజ్ఞాతము (తెలుసుకొనబడినది), (2) విజిజ్ఞాస్యము (తెలుసుకోవాలని అనిపించేవి) (3) అవిజ్ఞాతము (ఇంద్రియములకు గోచరిస్తూ కూడా వాస్తవ స్వరూపము ఏమిటో తెలియరానిది) – అనే 3 విశేషాలు ఏర్పడినవై ఉంటున్నాయి.

అందులో

***I. తెలుసుకోబడినది (విజ్ఞాతము) –***

'వాక్' స్వరూపము. 'వాక్కు', 'విజ్ఞానస్వరూపం. వాక్కే విజ్ఞాన స్వరూపమై – **వాగ్విభూతి తెలిసిన వానిని రక్షిస్తోంది.**

***II. ఇంకా తెలుసుకోవాలి – అని ఇష్టంగా అనిపించేది – (విజిజ్ఞాతము మనస్సుకు ఇష్టమైనవి) –***

**'మనో' స్వరూపము.** తెలుసుకోవటానికి ఇష్టపడేదే మనోరూపములు. ఇష్టమే ప్రేమ. ప్రేమయే భక్తి. మనస్సే తెలుసుకోవటానికి ఇష్టపడు ప్రేమ. **మనస్సు ప్రేమరూపమై, మనోవిభూతిని తెలుసుకొన్నవానిని మధురపరచుచున్నది.**

***III. ఇంద్రియములకు గోచరమగుచున్న ఇంద్రియ విషయ పరంపర స్వరూపము ఆత్మగా అవిజ్ఞాతము –***

ఇంద్రియములకు గోచరిస్తున్న దృశ్య వ్యవహారమైన అజ్ఞానము కూడా 'ప్రాణ' స్వరూపమే అయి ఉన్నది.

**చివరికి ఈ ఇంద్రియ గోచరమైనదంతా ప్రాణస్వరూపముగా నిరూపణము అగుచున్నది.** అట్టి ప్రాణమహత్త్యము తెలిసినవానిని ప్రాణశక్తి సర్వదా కాపాడుచున్నది. దేహ–దేహాంతర సందర్భములలో కూడా జీవుని వీడక ఆతనిపట్ల సర్వదా సుఖమయమగుచున్నది.

**తస్యై వాచః పృథివీ శరీరం।** 'వాక్కు'కు ఈ పృథివియే శరీరము. శరీరములోని ఇంద్రియములు జ్యోతి (అగ్ని) స్వరూపము. పృథివి తేజస్సు (Solid and Heat Light) – ఈ రెండు ఎంతవరకైన పరిమాణము కలిగి ఉంటాయో, ఈ భూమి (Earth) కూడా అంతవరకు విస్తరించినదై ఉంటోంది. అగ్ని కూడా అంతవరకు విస్తరించినదై ఏర్పడి ఉంటోంది.

## మనస్సు - రెండు శరీరములు

**ఈ మనో విభూతికి – ద్యులోకము శరీరము.** అట్టి మనస్సుకు ఆధేయమగు (ఆధారము తనదైన) కారణము – **"సూర్యుడు".**

ద్యులోకము (అశరీరప్రజ్ఞాదేవతల లోకము) ఆధ్యాత్మముగాను, ఆదిత్య (తేజో/అగ్ని) స్వరూపమునందు అధిభూతము (భౌతికము) గాను ఉన్న మనస్సు ఎంత పరిమాణము (As extended) కలిగి ఉంటే, అంతవరకే **ద్యులోకము విస్తరించి ఉంటోంది.** అంతవరకే (Enlightenment **రూపుడగు) ఆదిత్యుడు కూడా విస్తరించి ఉంటున్నారు.** (సూర్యుడు కూడా అంతే పరిమాణము కలిగి ఉంటున్నారు)

**ఆధిదైవికములే వాక్కు – మనస్సులు.** ఆధిదైవికములకు తండ్రి సూర్యుడు. తల్లి అగ్ని. ఆ రెండిటి కలయిక (సంగమము) – **మిధునము** అనబడుతోంది. తల్లిదండ్రులగు అగ్ని–ఆదిత్యుల సంగమము నుండి వాయువు జనిస్తోంది. అట్టి వాయువు పరమేశ్వరరూపమే. **(సమస్తే వాయుః। త్వమేవ ప్రత్యక్షమ్ బ్రహ్మాసి।)** అట్టి పరమేశ్వరుడు తనకు సమానమైనదేదీ లేకపోవుటచే శత్రువు – (ప్రతిపక్షము) – ఆయనకు ఉండదు.

ఎవ్వరైతే "వాయువుకు (పరమాత్మకు) శత్రువులు ఉండరు" - అనే తత్త్వమును గ్రహిస్తారో, వారి దృష్టియందు ఈ దృశ్యజగత్తులో శత్రువులు ఉండరు.

**ప్రాణమునకు →**

దేహము - ఉదకము.

చంద్రుడే - ప్రకాశరూపమైన కరణము (అవయవము).

ప్రాణము ఎంతవరకు విస్తరించినదై ఉంటుందో, అంతవరకు ప్రాణముయొక్క దేహము అగు జలము కూడా విస్తరించి ఉంటుంది. చంద్రుడు (ఓషధగుణముతో కూడిన చంద్ర ప్రకాశము) కూడా అంతవరకు విస్తారితమై ఉంటుంది.

## ఏతే సర్వ ఏవ సమానః సర్వే అనన్తాః

(1) వాక్కు (2) మనస్సు (3) ప్రాణము - ఈమూడు కూడా సర్వదా సమానముగాను, అనంతముగాను అయి ఉన్నాయి.

ఎవ్వరైతే - "వాక్కు మనో ప్రాణములు" అనంతములు కావు. "అంతముగలవి" - అను భావము కలిగి యుండియే ఉపాసిస్తూ ఉంటాడో - అట్టివాడు **అంతము గల లోకములు మాత్రమే పొందటము జరుగగలదు.** ఎప్పటికప్పుడు వేరువేరైన జన్మ పరంపరలు పొందువాడుగా అగుచున్నాడు. **అనంతమగు ఆత్మను ధారణ చేయలేదు.**

**అథ యో హ ఏతాన్ 'అన్తవత్' ఉపాస్తే, అన్తవన్తగ్ం స లోకం జయతి।** ఎవడు వాక్ మనో ప్రాణములును 'ఆత్మవలెనే అనంతములు' అని ఉపాసిస్తున్నాడో, అట్టివాడు అన్తమే స్వభావముగాగల సమస్త లోకములను జయించి, **అనంతమగు ఆత్మను, అమృతస్థానమును స్వాభావికముగాను, నిస్సందేహముగాను సిద్ధించుకుంటున్నాడు.**

## కాల రూప ప్రజాపతి - షోడశకళలు।

సృష్టికర్తయగు ప్రజాపతియే కాలరూపమగు సంవత్సర ప్రదర్శకుడై ఉంటున్నారు. అట్టి ప్రజాపతికి పాడ్యమి నుండి పౌర్ణమి వరకు గల 15 తిథులు, 15 కళలు. **ఏ కళ అయితే అమావాస్యనందు (జగత్ రాహిత్యము నందు) శేషింటి ఉంటోందో, అదియే షోడశ (పదహారవ) కళ.** అట్టి అమావాస్య కళ (16వ కళ) - [ **అస్య షోడశీ కలా న రాత్రిభిః ఏవాచ పూర్యతే, అపచక్షీయతే। (మం॥శ్లో॥ - 14)** - రాత్రిచే పూరించబడేది కాదు. అట్టి అమావాస్య యందు శేషించే కళ సర్వదా సర్వత్రా శాశ్వతమైనట్టి 16వ కళ. ఆ అమావాస్య కళ రాత్రియందు మౌనంగా ఉండి, తెల్లవారగానే ప్రాణధారణచే ఈ సర్వముగా (అన్యముగా) అగుచున్నది. ఆ మరునాడు రెండవకళగాను, ఆ తరువాత మూడవకళగాను మరల 15 కళలుగా తనను తాను ప్రదర్శించుకొనుచున్నది.

అట్టి 16వదగు నిర్విషయము - కేవలము అగు కళ (అమావాస్య) చేతనే ప్రజాపతి జలపానము చేయుచు ఓషధులను రక్షించుచు, సమస్తమునందు వ్యాపించుచున్నారు. అమావాస్య కళ నుండి ఆ మరునాడు ప్రాతః కాలమునందు 'రెండవ కళ'గా ప్రారంభన్యాసము స్వీకరిస్తున్నారు. ఈ విధంగా ప్రజాపతియే →

- శుక్లపక్షము (పాడ్యమి నుండి పౌర్ణమి వరకు) ప్రతిరోజు ఒక్కొక్క కళగా వృద్ధి చెందుచున్నారు.
- 'పౌర్ణామాసి' యందు షోడశ కళా సమన్వితుడు అగుచున్నారు.
- తిరిగి కృష్ణ పక్షము (పాడ్యమి నుండి - అమావాస్య వరకు) ప్రతిరోజు ఒక్కొక్క కళను వదలుచు (క్షీణించుచుండగా) - "అమావాస్య" తిథి యందు 'ఏకకళ'గా శేషించినవారు అగుచున్నారు.

*ఈవిధంగా...,*

**సో అమావాస్యాగ్ం రాత్రిమ్ ఏతయా షోడశ్యా కలయా సర్వమ్ ఇదం ప్రాణభృత్ అనుప్రవిశ్య, తతః ప్రాతః జాయతే।** (మం॥శ్లో॥ - 14)। అమావాస్య నుండి ఒక్కొక్క రోజు తన 15 కళల ప్రదర్శనము, పౌర్ణిమినాడు సమగ్ర స్వరూపుడవటము, తిరిగి కృష్ణ పాడ్యమి

నుండి ఒక్కొక్క కళ ఉపసంహారము, అమావాస్యయందు 15 కళలకు ఆవల ఏకస్వరూపుడై విరాజిల్లటము - ఇదంతా కూడా ఆత్మభగవానునినుండి బహుచమత్కారంగా జరుగుతూ వస్తోంది.

అందుకే

- 'అమావాస్య' సందర్భము / సమయమునందు సమస్తము లయము అయి ఏకమగు, సర్వకళాతీతుడగు **16వ కళా స్వరూపుడై** ఉండటము జరుగుతోంది.
- ఈ జీవుడు శాశ్వతమగు ఏకకళగా శేషించినవాడగుచున్నాడు.
- చంద్ర సంబంధమైన కళలే జగత్ వికాసరూపమగు 'విత్తము'.
- కాలమునకు సంబంధితమై, కాలమునకు 'అవయవములు' గా ఉంటున్నదే జగత్తు. అట్టి జగత్ (జ +గత్ = జనించు, గతించు) పరిణామ హేతువే ఆత్మయొక్క 'కర్మ' - విశేషము. "పరమాత్మయొక్క అవయవము వంటిదే జీవాత్మ" - అని - ఆత్మజ్ఞులచేతను, కాలతత్త్వము ఎరిగిన కాలజ్ఞులచేతను చమత్కరిస్తూ వర్ణించబడుతోంది.

## పాంక్తకర్మలు - కర్మఫలములు

ఈవిధంగా స్వతఃగా కేవలుడగు (కేవలాత్మ స్వరూపుడగు) ప్రజాపతి -

- నాకు భార్య ఉండును గాక।
- సంతానము కలుగును గాక।
- ధనము ప్రాప్తించును గాక।
- కర్మలు చేయుదును గాక।

అనే రూపముగల వాంఛలు పొందుచున్నారు. "స్వయంకృతము" అయి ఉన్న జాగ్రత్ స్వప్న సుషుప్తులనబడే **పాంక్త కర్మల ఫలస్వరూపుడై, ఫలానుభవ స్వరూపుడై ఉంటున్నాడు.**

## పునః సవివరణ

సహజమగు ఆత్మయే స్వరూపముగాగల పరమపరుషుని నుండి - 'అన్యము' అను విస్తారణ రూపముగా ఏర్పడుచున్న 15 కళలే శుక్లపక్షము. అనన్య - అన్యముల పూర్ణాత్వమే 16వదగు **పూర్ణిమ.** (ఇది పూర్ణత్వము).

మరల ఆయా 15 కళలు స్వస్వరూపము వైపు ('అన్యము' నుండి అనన్యమగు ఆత్మవైపుగా) ఉపసంహారము చేయబడటమే పౌర్ణమి నుండి - అమావాస్య వరకు గల 15 కృష్ణపక్ష తిథులు.

అట్టి ఉపసంహారముచే ఏర్పడే నిర్విషయ చైతన్యము **16వదగు అమావాస్య. అది సమస్తము ఆత్మయందు మౌనము వహించినట్టి ఏక-ఏకాంత స్థానము.** (ఇది శూన్యత్వము).

**అమావాస్యయే శుక్ల-కృష్ణపక్ష (అన్యసంబంధమైన) వికాస - ఉపసంహారములకు జననస్థానము.**

అమావాస్యయందు అనేకమంతా ఏకమునందు అంతర్విభాగము, అప్రదర్శనశీలము అగుచున్నది. అట్టి పరమార్థమును దృష్టిలో పెట్టుకొనియే →

- అమావాస్య రోజు పాపులను కూడా హింసించరాదు.
- పిత్రుదేవతలకు సంతర్పణ మొదలైన ఉపాసనలు చేయబడుగాక.

అమావాస్య శూన్యమునకు ప్రతీక అయినట్లే, పౌర్ణమి - పూర్ణమునకు ప్రతీక।

ఈ ఈ మొదలైన నియమములను, విధి – విధానములను శాస్త్రములు సాధకజనులకు ఉపదేశిస్తున్నాయి.

**అహింసా పరమోధర్మః।** అహింసయే పరమధర్మము. అట్టి అహింసావ్రతమే దేవతలయొక్క, ప్రజాపతి యొక్క ఉపాసన. మానవులకు కూడా అదియే 'ధర్మము' అయి ఉన్నది.

❖ ❖ ❖

## అంతా ప్రజాపతి స్వయం ప్రదర్శనమే

ప్రజాపతియే కాలస్వరూపుడు. సంవత్సర స్వరూపుడు. శుక్ల–కృష్ణ స్వరూపుడు. ఆయనయే షోడశ (16) కళలు తనవై ఉన్నవాడు. **ఆయనయే జీవాత్మగా సమస్త దేహములందు వెలయుచున్నారు.**

**దృష్టాంతానికి :** నాటకములోని పాత్రల పరస్పర సంబంధములు, పాత్రలు, గుణగణములు – ఇవన్నీ కూడా నాటకరచనా ప్రదర్శనమే కదా!

అట్లాగే షోడశకళా చమత్కారములన్నీ ప్రజాపతియొక్క ప్రదర్శనా విశేషములే. ఈ విధంగా ప్రజాపతి సర్వాత్మక – సర్వవిశేష స్వయం తత్త్వము ఎరిగినవాడు – తానే ప్రజాపతి కాగలడు.

15 కళలు ప్రజాపతియొక్క సంపద వంటిది. **ఇక 16వ కళ వృద్ధి–క్షయము లేని పరమాత్మస్వరూపమే।** ప్రజాపతి భావనయొక్క వృద్ధి, – క్షయ (శుక్ల–కృష్ణ పక్షములు) చంద్రుని – విశేషములై, సంజ్ఞాపూర్వకముగా **కేవలము – సందర్భముల మధ్య చమత్కృతులగుచున్నాయి. ఆత్మస్వరూపమే శాశ్వతకళ.**

అదియే రథము యొక్క చక్రదృష్టాంతంగా కూడా చెప్పబడుతోంది. ఎట్లా గంటారా?

**అమావాస్యానంతరము**

శుక్ల పాడ్యమి
నుండి పౌర్ణమి వరకు
15 కళలు
16వ కళ **పౌర్ణిమ**
**(పూర్ణము)**



**పౌర్ణమి అనంతరం**

కృష్ణ పాడ్యమి నుండి అమావాస్య వరకు
15 కళలు
16వ కళ **అమావాస్య**
**(నిర్విషయకేవలము) (శూన్యం)**

- ఆత్మయొక్క స్వరూపమే శాశ్వతమైన కళ.
- ఆత్మయొక్క విన్యాసమే షోడశ కళా చమత్కారము. అదియే రథచక్ర దృష్టాంతము.

బండి చక్రమునకు ఆకులు, (రెక్కలు) (15+15) వలెనే, **ఆత్మకు ఇహము (అన్యము) అనబడేదంతా 'ధనము' (సంపద) వంటిది.**

ఈవిధంగా **బాహ్యముగా పొందబడేదంతా ఆత్మ (లేక జీవాత్మ) యొక్క స్వయం విభవరూపమగు సంపదయే అయిఉన్నది.**

అందుచేతనే – బాహ్యమున దేహముతో అలసిపోయినప్పటికీ, 'చక్రము' వంటి ఆత్మస్వరూపిగా **ఈ జీవుడు – అమృతుడు, జన్మ కర్మ రహితుడు, కాలమునకు ఆవల వాడు, మృత్యురహితుడు కూడా।**

బాహ్యదేహము, 'దృశ్యము' అనే విత్తము కాలానుగతంగా నశించవచ్చుగాక। బండిచక్రము అధిరోహించే ఆత్మకు నాశనముగాని, హానివృద్ధులుగాని లేవు. 'హానివృద్ధులు'గా కనిపించే దేహ దృశ్య వస్తు చమత్కారమంతా ఆత్మకు చెందినదే అయినప్పటికీ, కేవల –

ఆత్మస్వరూపుడగు పరమ పురుషునకు హాని వృద్ధులు లేవు. అయితే, ఆయన కల్పనాంశమాత్రమగు జీవాత్మానుభవి మాత్రం → అవన్నీ తనవిగా మనోగతంగా పొందటము జరుగుతోంది. (తనకు హాని వృద్ధులు ఉన్నట్లు జీవాత్మగా పొందబడుచున్నది)

❖ ❖ ❖

**అథ త్రయో వావ లోకా, మనుష్య లోకః పితృలోకో, దేవలోక - ఇతి।** – ఈ జీవునియొక్క లోకసంబంధమైన సమస్త అనుభవములు క్రోడీకరించి మూడు (3) లోకములుగా చెప్పబడుతోంది. ఈ మూడు జీవునిచే (ఆత్మభావనా సిద్ధికై) జయించబడవలసినట్టిది.

**(1)** మనుష్యలోకము : ఈ లోకము జీవునిచే **'పుత్రసంతానము – పుత్రునికి సమర్పించివేయటము'** – అను సాధన సహాయముతో జయించబడుచూ ఉంటోంది. మరింక దేనిచేతను జయించబడజాలదు. **పుత్రేణైవ జయ్యో, న అన్యేన కర్మణా। ("పుత్రునికి సమర్పించటము" - అనగా "జీవాత్మాంశకు సమర్పించటము"** అని కూడా అంతరార్థము**).**

**(2) పితృలోకము** : పితృలోకము (అగ్నిహోత్రము మొదలైన) ఆయా సశాస్త్రీయమైన కర్మలచే జయించబడగలదు.

**(3) దేవలోకము** : ఇది ఆత్మ గురించిన విద్యచే జయించబడగలదు. అంతేగాని, పుత్రుల సహాయంతోనో, కర్మల సహాయంచేతనో జయించబడజాలదు.

**అన్ని లోకముల జయముకంటే దేవలోక జయము శ్రేష్ఠమైనది.** అందుచేత **అన్ని** విద్యలకంటే **ఆత్మవిద్యయే జీవునిపట్ల శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన విద్య.** దేవలోక జయము గురించిన సాధన అగు **ఆత్మవిద్యయే విజ్ఞులచే 'అన్నిటికన్నా మహత్తరము'** – అని కీర్తించబడుతోంది.

## మనుష్యలోక జయము - సంప్రత్తి (లేక) సంప్రదానకర్మ (వ్రతము) ।

ఈ జీవుడు ప్రాపంచకమైన సమస్త సంబంధములనుండి, బాధ్యతా భావము నుండి విడివడటానికై ఒకానొక మార్గంగా శాస్త్రములు **"సంప్రదానకర్మ"** సూచిస్తూ ఉన్నాయి. అద్దాని విధానము గురించి ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

❖ ❖ ❖

తండ్రి పుత్రుని పిలచి **(పుత్రమ్ ఆహ) : త్వం బ్రహ్మ। త్వం యజ్ఞః। త్వం లోకః।**

"బిడ్డా! నీవే బ్రహ్మమువు. నీవే **యజ్ఞకర్మ** స్వరూపుడవు. నీవే ఈ **సమస్తలోక స్వరూపుడవు".**

**పుత్రుడు** అందుకు సమాధానంగా **తండ్రితో (పుత్రం ప్రత్యాహ) : అహం బ్రహ్మ। అహం యజ్ఞో। అహం లోక।**

"తండ్రీ! అవును. **నేనే బ్రహ్మమును. నేనే యజ్ఞమును. నేనే లోకమును"**

- ఈ విధంగా ఏదేది తండ్రి వివరంగా, విస్తారంగా పేరుపేరునా చెప్పలేదో అవన్నీ కూడా 'బ్రహ్మము' అనే పదముతో అన్నీ కలిపి చెప్పినట్లే – అవుతుంది (ఆ పదముతో ఏకత్వము కలిగినట్లే).
- ఏఏ యజ్ఞములు తండ్రిచే చేయబడినవై, చేయబడుచూ ఉన్నవై, చేయాలనుకొన్నవై, చేయబడనివై ఉన్నాయో, – అవన్నీ **'యజ్ఞము'** అనే పదముతో **ఏకత్వము** కలిగి ఉన్నట్లే,
- ఏయే లోకములు తండ్రిచే జయించబడినవై, ఇంకా జయించబడనివి అయి – ఉన్నాయో అవన్నీ 'లోకములు' అనే పదము (మాట)చే ఉద్దేశించబడినట్లే.

తండ్రి ఇంకా ఇట్లా సంప్రదానకర్మ నిర్వర్తిస్తూ చెప్పుచున్నారు

**ప్రియపుత్రకా!**

ఈ సంప్రదాన కర్మచేత నేను నిర్వర్తించవలసియున్న సమస్త కార్యక్రమములు, నిర్వర్తించిన కార్యములు, లోక ప్రయోజన వ్యవహారములు, ఇంకనూ చేయాలని అనుకుంటూ చేయని కార్యక్రమములు, బంధువుల పట్ల నిర్వర్తించవలసియున్నవి, వంశపారంపర్య-దైవకార్యక్రమములు – **అవన్నీ నీకు బాధ్యతాయుతంగా చేతికందిస్తున్నానయ్యా!**

(కుమారుడు అవన్నీ స్వీకరిస్తూ అంగీకారము పలుకుతాడు). (పరమాత్మ స్వరూపమునకు జీవాత్మ స్వరూపమే పుత్రుడు).

అంతేకాకుండా...,

"ఇతఃపూర్వము నేను వేదముల ఉపాసనగా అధ్యయనము చేసియున్నది, చేయతగిన యజ్ఞములు, తప్పక చేయవలసినవి, జయించవలసియున్న మనుష్య – పితృ – దేవలోకములు, అనివార్యంగా (వంశపారపర్యంగా) చేయవలసిన వ్రత – యజ్ఞ – యాగ – నోము – గురుసేవ వంటి ఆయా కొన్ని గురు ఆజ్ఞలు, ఉపాసక – వంశాచార కార్యక్రమములన్నీ (ఆత్మావై) పుత్రుడవగు నీకు అప్పజెప్పుచున్నాను.

కుమారా! ఈవిధమైన సంప్రదానకర్మచేత నేను విముక్తుడను (Relieved) అగుచున్నాను. ఇంతవరకూ సాంఘికంగా నేను భరిస్తున్న భారములన్నీ ఇక మీదట నీవు వహించి, నీయందు బాధ్యతా భావములు స్వీకరించి నాకు ఇప్పటివరకు చెందిన లోక వ్యవహారములన్నీ నీవు కొనసాగించెదవు గాక! నాకు 'విరమించటము, విరామము, విశ్రాంతి' – ఇస్తూ, వానప్రస్థమునకు (లేక) సన్న్యాస స్వీకారమునకు అంగీకరించెదవు గాక।"

ఇట్టి సంప్రదాన కర్మను సవివరంగా వర్ణిస్తూ శ్రుతులు ఇంకా ఈ విధంగా పుత్రుని గురించి స్తుతులు పలుకుచున్నాయి.

> ***శాస్త్రయుతంగా చక్కటి శిక్షణపొందిన పుత్రుడు తండ్రికి ఆత్మతో సమానమైన ప్రియత్వముచే శ్లాఘించ తగినవాడు. కుమారుడు → సదాచారుడై తండ్రియొక్క సాంఘిక, ఉపాసనాపూర్వక, బంధువుల సంబంధమైన, దైవతార్చన సంబంధమైన బాధ్యతలు స్వీకరించి, తల్లితండ్రులకు విముక్తి కలిగించగలడు. అట్టి పుత్రుడు ధన్యుడు.***

అప్పుడిక తండ్రియొక్క దృశ్య సంబంధమైన (జగత్ సంబంధమైన, సాంఘిక సంబంధమైన) వాక్ మనః ప్రాణములు తండ్రి నుండి కుమారునికి చేరుచున్నాయి. ఈవిధంగా **"సంప్రదాన కర్మ"** అను సశాస్త్రీయ వ్రత విధానముచే పుత్రుని – వలన మనుష్యలోకమును జయిస్తున్నాడు. వంశపారంపర్యమైన సంప్రదానకర్మచే పుత్రునికి బాధ్యతలు అప్పగించటము వలన మనుష్య లోకము జయించబడగలదు.

## ఇక పితృలోకము జయించే విధి

- దేవతా పూజల సందర్భములో దీపారాధనలు చేతను,
- దేవాలయములో దీపము, జ్యోతి మొదలైనవి వెలిగించటము చేతను,
- దైనందికంగాను, పరవడి సందర్భములోను చేయు అగ్నోపాసనలచేతను, అగ్నికార్యములచేతను,
- పేదలకు అన్నదానము వంటి వైశ్వానరోపాసన చేతను,

పితృలోకము జయించబడుతోంది. అందుచేత ముముక్షువైనవాడు వంశపారంపర్యమైన, పెద్దలచే నియమించబడిన అగ్నికార్యములు నిర్వర్తిస్తూ పితృలోకమును జయించునుగాక।

# దేవలోక జయము

దేవలోకమును జయించి, ఆవల అమృతరూపమై ప్రకాశించి, స్వస్వరూపాత్మానుసంధానమును ఈ జీవుడు సిద్ధించుకొనునుగాక. అందుకుగాను ఉపనిషత్తులు మొదలైన భౌమా విద్య (లేక) వేదాంతశాస్త్రమును (లేక) తత్త్వశాస్త్రమును అధ్యయనము చేసి తత్త్వము ('నీవు'గా కనిపించేది ఆ పరమాత్మయే) – అను ఆత్మవిద్యను అభ్యసించునుగాక। ఈ జీవుడు అందులకై "అధ్యయనము, మననము, (అనిపించే) స్వాభావికము (నిది ధ్యాస), అదే తానవటము (సమాధి) – లను ఆశ్రయించాలి.

**"నీవుగా కనిపించేది పరమాత్మయే (తత్ త్వమేవ)"** అను మననముచే, క్రమంగా ఈ సమస్తము ఆత్మకు అభిన్నంగా అనిపించటము ప్రారంభమవగలదు. అట్టి "జగత్తు ఆత్మ ప్రదర్శనమే" అను అభ్యాస, భావనా సిద్ధిలచే "సోఽహం" **(నేను సహజముగా స్వతఃగా**

**నిస్సంశయముగా, అనునిత్యంగా సర్వదా ఆత్మస్వరూపుడనే। అంతేగాని భౌతిక రూపనామ పరిమితుడను గాను) – అనే 'స్వానుభవము' రూపుదిద్దుకొని, నిశ్చలమవగలదు.**

## "మయా తతమ్ ఇదమ్ సర్వమ్"

ఎప్పుడైతే సంప్రదానము అనబడు సంప్రత్తి (అను పైన వివరించబడిన) కర్మ నిర్వర్తిస్తాడో, అట్టివాడు సృష్టికర్తయగు హిరణ్యగర్భునివలెనే మరణధర్మము (దోషము) లేనట్టి వాక్ – మనో – ప్రాణ నిజ – ధర్మములను సిద్ధించుకోగలడు.

❋ సంప్రత్తి కర్మల వలన (వాక్కుకు అధిష్ఠానమైనట్టి) భూమి, అగ్నిల బలం చేత – ఆధి దైవాత్మకమగు వాక్కు ఆ పండితుని చేరుతోంది. అట్టి విద్వాంసుడు తనకొరకుగాని, ఇతరుల కొరకుగాని ఏ వాక్కు పలుకుతాడో, అది అట్లే జరుగగలదు. ఆతని వాక్కు దోషరహితము, అబద్ధము (అనృతము) పొందదు. [(సత్యవాక్కు (లేక) వాక్ శుద్ధి).]

❋ సంప్రత్తి కర్మలవలన (మనస్సుకు అధిష్ఠాన దేవతలైనట్టి) ఆకాశము, సూర్యుల నుండి ఆధి దైవికమగు మనస్సు పరిశుద్ధము కాగలదు. అట్టి విద్వాంసుడు సమస్త మనోచాంచల్యములను, మనోరుగ్మతలను తొలగించుకోగలడు. **తద్వై దైవం మనో ఏన ఆనన్ద్యేవ భవతి। (మం॥శ్లో॥ - 19)। అథో న శోచతి।** అట్టి ఏ నిర్మలమైన మనస్సులో దుఃఖరహితుడై స్వాభావికమగు ఆత్మానందము పొందుతాడో అదియే ఆధిదైవికమగు నిర్మలమనస్సు. అట్టివాడు ఇక ప్రాపంచక విషయముల గురించి శోకించడు.

❋ సంప్రత్తి కర్మల వలన ప్రాణము – (ప్రాణమునకు అధిష్ఠాన దేవతలైనట్టి) ఉదకము, చంద్రుల నుండి బలము పొందుచున్నది. అట్టి ప్రాణము జంగమభూతజాలమునందు తిరుగాడుచు, స్థావరములందు తిరుగాడనిదై ఉంటుంది. అట్టి ప్రాణము వేసటగాని, దుఃఖము గాని, భయముగాని పొందనిదై 'అవినాశి' అయి ఉంటోంది.

అట్టి ప్రాణతత్త్వము తెలుసుకొన్న పురుషుడు హిరణ్యగర్భునివలెనె సర్వాత్మకుడు, సర్వతత్త్వజ్ఞుడు, సర్వబాహ్య–అభ్యంతరస్వరూపుడు – అయి విరాజిల్లుచున్నాడు. సృష్టికర్తతో సమానంగా సర్వత్ర వాక్ – మనో – ప్రాణస్వరూపుడై **'సర్వజ్ఞుడు'** అగుచున్నాడు.

ఈవిధంగా సర్వాత్మకత్వము సిద్ధించుకొన్నవాడు సమస్త భూతములకు (జీవులకు) పూజనీయుడగుచున్నాడు. సర్వభూతాత్మకుడై ఈశ్వర స్వరూపుడుగా ప్రకాశించుచున్నాడు. అట్టివానిని దుఃఖములు స్పృశించవు. పరిచ్ఛిన్నత్వము అనుభవముగాగల జీవులవలె ఆతడు మార్పు చేర్పులకు, కాలగతులకు బద్ధుడు, పరిమితుడు కాడు.

'సంప్రత్తి' కర్మ నిర్వర్తించువానికి ఇహపర లోకములలో దుఃఖము, వేదన మొదలైనవి దరిచేరవు. సర్వత్రా సర్వాత్మకుడై ఆత్మసుఖమును అనునిత్యము చేసుకోగలడు.

## ఇంద్రియములన్నీ ముఖ్యప్రాణముయొక్క తేజోవిభవములే।

ఇప్పుడు **"అమృత వ్రతము"** గురించి వివరించుకుంటున్నాము.

ప్రజాపతి **వాక్కు** మొదలైన **ఇంద్రియతత్త్వము**ను, వాటిని కలిగియుండు ఆయా ధర్మములలో కూడిన వివిధ **భౌతిక దేహములను,** ఆ దేహములనుఉపయోగించు (Users of Physical Bodies) **ప్రజలను (జీవాత్మలను)** సృజించారు. ఈవిధంగా **'సృష్టి' అనే జగన్నాటకమంతా అఖండాత్మయొక్క సమక్షములో లీలగా, క్రీడగా, వినోదముగా ఏర్పడసాగుతోంది.**

ఈ దేహముల, ఇంద్రియముల, ఇంద్రియధర్మముల సృష్టి, దేహి (శరీరి)ల కల్పన, అట్టి జీవాత్మల చమత్కారమైనట్టి పరస్పర సంబంధ, అనుబంధ, బాంధవ్య, స్పర్ధ వ్యవహారములన్నీ కొనసాగుచున్నాయి. ఇట్టి చిత్ర విచిత్ర సృష్టిలో ఒకానొక చమత్కార విశేషము గురించి ప్రాణతత్త్వ పరిజ్ఞానము కొరకై – ఇప్పుడు వివరించుకొంటున్నాము.

❖

ఒకసారి దేహములో **వివిధ ధర్మములు** నిర్వర్తించే **ఇంద్రియములు** – ఒకదానితో మరొకటి **"ఎవరుగొప్ప"**? అనే విషయంలో తగాదా, వాదోపవాదములు, స్పర్ధ పొందసాగాయి.

**వాక్ ఇంద్రియము :** నాతో సమానమైనది ఈ శరీరంలో మరేదీ లేదు. నేనే లేకపోతే ఈ జీవుడు మాట్లాడలేడు కదా! అందుచేత నేనే గొప్ప। సంగీతము, శబ్దము, నాదము లేకుంటే ఈ జీవుని జీవితం నిస్సారం. "మేమే ప్రధానస్వరూపులం" "స రి గ మ ప ద ని స" సప్తస్వరాలు, ఉదాత్త – అనుదాత్తములు (క్రింద–పై స్వరములు) మొ॥వి మా గొప్పతనమే కదా!

**చక్షు (చూపు) ఇంద్రియము :** ("సర్వేంద్రియానాం నయనం ప్రధానం" – అనికదా, ఆర్యసూక్తి)। చూపే లేకపోతే ఈ జీవుడు ఎందుకు పనికివస్తాడు? అందుచేత ఇంద్రియములన్నిటిలో మేమే అధికులము. ముఖ్యులము. ఇతర ఇంద్రియములు మా అంతగా ముఖ్యం కాదు.

**శ్రవణ–(చెవుల) ఇంద్రియము :** వినని వానికి విద్య ఏమి వస్తుంది? తెలుసుకోవాలన్నా, గురువులవద్ద అధ్యయనము చేయాలన్నాకూడా – వినికిడి (శ్రవణం) లేకపోతే ఎట్లా కుదురుతుంది? శ్రవణం లేనివాడు వేదమంత్రము, సంగీతములోని ఉదాత్త (ఊర్ధ్వ) అనుదాత్తములు సప్తస్వరములు, మొదలైనవన్నీ ఎట్లా నేర్చుకోగలడు?

అందుచేత సమస్త ఇంద్రియములలోకెల్లా మేమే శ్రేష్ఠము.

**స్పర్శేంద్రియము :** అవేమీ కావు. మేమే సమస్త ఇంద్రియములలో గొప్పవారము. స్పర్శ జ్ఞానము లేకపోతే ఈ జీవుని దేహములోని అంతర విభాగములు ఎట్లా రక్షించబడతాయి? జీవునికి స్పర్శ సుఖము మించిన సుఖమేమున్నది? **మేమే చర్మముగా శరీరమునకు రక్షణ కవచము.** మేమే లేకుంటే తదితర ఇంద్రియములు ఎందుకన్నా పనికివస్తాయా? లేవు. స్పర్శానందము, శరీరక్షణకవచము అగు మావలననే తదితర ఇంద్రియములు కూడా మన గలుగుచున్నాయి. కనుక మేమే ఇంద్రియములన్నిటిలో ముఖ్యాతి ముఖ్యము.

**రసేనేంద్రియము :** పదార్థముల 'రుచి' అనే మాధుర్యాన్ని జీవునికి అందించేది మేము. ఆహారమును శరీరములోనికి పంపేది మేము. మేమే లేకుంటే తదితర ఇంద్రియములు నిలువజాలవు. ఆహారం లేకుంటే దేహము మనలేదు కదా! కనుక మేమే గొప్ప.

**ఘ్రూనేంద్రియము :** ఈ జీవునికి సువాసన సుఖము అందించేది మేము. కనుక మేమే గొప్ప.

ఈవిధంగా ఇంద్రియములన్నీ వాదులాడుకుంటూనే తమతమ పనులను ఆ జీవుని దేహములో నిర్వర్తిస్తూ ఉండసాగాయి. ఒకానొకరోజు మృత్యుదేవత ఆ జీవుని జీవించి ఉన్న శరీరమును సమీపించి, ఇంద్రియ శక్తులను నిరోధిస్తూ మ్రింగివేయసాగింది. ఇంకేమున్నది? వాక్కు, శ్రవణము, చూపు, స్పర్శ, రసేంద్రియము మొదలైనవన్నీ నిరోధించబడుచూ నిస్తేజము అవసాగాయి. దుఃఖము, వినాశనము పొంద ప్రారంభించాయి.

అప్పుడు కూడా శరీరము జీవించియే ఉన్నది. అది గమనించి మృత్యువు శరీర మధ్యనగల ముఖ్యప్రాణమును కూడా గ్రహించ యత్నించింది. సమస్త ఇంద్రియములను నిరోధించి గ్రహించగలిగిన మృత్యువు ముఖ్య ప్రాణమును ఏమీచేయలేకపోయింది. అట్టి ముఖ్య ప్రాణము ఏమాత్రము కూడా దుఃఖము, నాశనము పొందలేదు. అప్పుడు ఇంద్రియములన్నీ సమావేశమై – **"మనందరిలో ప్రాణమే శ్రేష్ఠము. కనుక మనము ఈ మృత్యువు వలన నశించకుండా ఉండాలంటే ప్రాణమునే ఆత్మగా భావించి, ప్రాణములో ప్రవేశించి, ప్రాణ స్వరూపమును సంతరించుకోవలసిందే। వేరే త్రోవలేదు".**

ఆ విధంగా **వాక్కు చూపు మొదలైన ఇంద్రియములన్నీ ప్రాణముతో మమేకమై, ఆత్మరూపం సంతరించుకోసాగాయి.** అందువల్లనే **ఇంద్రియములన్నీ ప్రాణరూపములేనని, ప్రాణముయొక్క అంశలేనని, స్వతఃగానే ప్రాణమునకు, ఆత్మకు అభిన్నమని చెప్పబడుచున్నది.**

❖ ❖ ❖

ఈవిధంగా ఎవ్వరైతే దేహములోని ఇంద్రియములన్నీ కూడా ముఖ్య ప్రాణాత్మకమేనని, ముఖ్య ప్రాణముయొక్క తేజో విభవములని తెలుసుకొని ఉంటాడో – అట్టివాడు తాను జన్మించియున్న వంశమునకు యశస్సు తెచ్చి పెట్టగలడు. ప్రాణము సర్వాత్మకము. ప్రాణతత్త్వము గురించి ఎరిగిన విద్వాంసుని ఎవరు ద్వేషిస్తారో, అట్టివారు కష్టముల పాలు అవగలరు. ఉపద్రవములు పొందగలరు.

ఎందుకంటే అట్టివారు తమ ప్రాణమును ద్వేషించినవారే అవగలరు. తమ ప్రాణము బలహీనపరచుకొన్న వారౌతారు. అందుచేత ప్రాణతత్త్వము ఎరిగిన ప్రాణయోగయుక్తుని (వేత్తను) గౌరవించెదరుగాక! ప్రియముగా ఉండెదరుగాక. ఎందుకంటే ప్రాణము ప్రియరూపమే అయి ఉన్నది కాబట్టి. ఈవిధంగా ప్రాణాత్మ దర్శనము చేయుచుండెదరు గాక।

## దేహములో ముఖ్య - అధిదేవత ఎవరు?

### (ప్రాణ-వాయుదేవత యొక్క నిరహంకార వ్యాపారము)

ఇప్పుడిక మనము **"ముఖ్యాధిదేవత ఎవరు?"** - అనే విశేషమును గురించి వివరించుకుంటున్నాము.

❖

ఒక సందర్భములో అగ్ని, సూర్యుడు, చంద్రుడు తదితర దేవతలు "ఈ దేహములోను, ఈ విశ్వములోను కనబడేదంతా మా ప్రతాపమే" అని అహంకరించసాగారు.

**అధిదైవతం అహమేవ। "జ్వలిష్యామి అహమ్। ఇతి అగ్నే ద(ధ్రే)। (శ్లో॥ 22)।** *"అధి దేవతనగు నేను దేనినైనా సరే కాల్చి బూడిద చేయగలను" అని అగ్ని అహంకరించి ఎడతెగకుండా సర్వము దహించసాగింది.*

**"తప్స్యామి అహమ్" - ఇతి ఆదిత్యో।** *అప్పుడు సూర్యుడు అహంకరించి "ఇక నా గొప్పతనం చూడండి। సమస్తమును నా వేడిమితో తపింపజేస్తాను" అని అహంకరించి ఎడతెగకుండా తపింపజేయసాగారు. తన వేడిమితో సమస్తము ఎండింపజేయసాగారు.*

**"భాస్యామి అహమ్" ఇతి చంద్రమా। (మం॥శ్లో॥ - 22)।** - "నేనెంతవాడినో చూడండి. అన్నీ వెలిగించుచూనే ఉండగలను!" అని ఎడతెగకుండా చంద్రమసము ప్రకాశింప జేయసాగింది.

అట్లాగే దేవతలందరు కూడా అహంకారము పొందినవారై వారి వారి ప్రకృతి శక్తి ప్రదర్శనములను ఎడతెగకుండా అనువర్తింపజేయసాగారు.

అయితే ముఖ్య ప్రాణదేవత మాత్రం ఇదంతా చూస్తూ కూడా ఏమాత్రము అహంకారము పొందనేలేదు. వాక్కు మొదలైన సమస్త ఇంద్రియముల మధ్యగా వర్తించే ప్రాణశక్తిగా వాయుదేవత మాత్రం తన వ్యాపారమును (Its Functioning) ఎప్పటిలాగానే కొనసాగించింది. మౌనంగా, నిగర్వంగా, నిశ్శబ్దంగా, నిరహంకారముగా తనయొక్క విద్యుక్త ధర్మములను యథావిధిగా నిర్వర్తించసాగింది. వాయువు సమస్త ఇంద్రియ ప్రాణముల మధ్యగా ముఖ్య అధిదేవత అయి అహంకారము ఏమాత్రము పొందక చరించసాగింది.

అందుచేత "ఆధ్యాత్మము" "అధి దైవతము" అను రెండు సవివరణాత్మకంగా మీమాంస చేసి - వేదవాఙ్మయము (వేదమాత) - "వాయుస్వరూపము యొక్క వ్రతము భంగము కాదు?" - అని నిర్ణయిస్తూ స్తుతులను ప్రసాదిస్తోంది. **(నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వమేవ "ప్రత్యక్షం బ్రహ్మ" వదిష్యామి। ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తత్ మాం అవతు। తత్ వక్తారమ్ అవతు। - అను రూపంగా అనేకచోట్ల ప్రాణస్తుతులను, వాయుస్తుతులను వేదాధ్యాయనులకు అందిస్తోంది).**

## దేవతల వాయుదేవతా వ్రతము- (లేక) - "ప్రాణదేవతావ్రతము" । "అభగ్నవ్రతము"।

ప్రాణముయొక్క సంచలనశక్తియే వాయువు రూపంగా ఈ జగద్దృశ్యములో పరిఢవిల్లుతోంది.

"సూర్యుని ఉదయాస్తమయములు ఎక్కడినుండి? ఎక్కడివరకు?" అనే విశేషము వేదవేద్యులచే పరిశోధించబడగా, (అధ్యయనము చేయబడగా) **"సూర్యుడు అధిదేవతా స్వరూపుడై వాయునుండియే ఉదయిస్తున్నారు. వాయువునందే అస్తమిస్తున్నారు"** అని తెలుసుకొని (వారిచే) ప్రకటించబడుతోంది. ఇంద్రియములన్నీ "తాము ప్రాణ వాయు ప్రదర్శన రూపములే"- అని గమనించాయి.

ఇది ఎరుగుచూ ఉన్న వాక్కు, స్పర్శ, చూపు, రసము, గంధములకు సంబంధించిన అధి దేవతలంతా కూడా (అధి దేవతాస్వరూపులైన ఆకాశము, భూమి, సూర్యుడు, రసదేవత, గంధదేవత మొదలైన వారంతా) - **"వాయుదేవతా ఉపాసనవ్రతము"** - చేయుచుండసాగారు.

తదితర సమస్త దేవతలు కూడా **"వాయు దేవతా[వ్రతము"** (లేక) **"ప్రాణదేవతా వ్రతము"** నిర్వర్తిస్తూ ఉంటున్నారు.

మృత్యువు యొక్క పరిధులను అధిగమించి "అమృత స్వరూపులు" అయ్యే నిమిత్తమై దేవతలు కూడా ఇంద్రియ వ్యాపారములన్నీ 'ప్రాణము' నందు 'ఏకము' చేసి **'వాయుదేవతా వ్రతము'** లేక **'ప్రాణదేవతా వ్రతము'**ను అనునిత్యంగా నిర్వర్తిస్తూ, ఆత్మతో మమేకమై ప్రకాశించుచున్నారు. అట్టి దేవతావ్రతము **"అభగ్నవ్రతము"** అని కూడా చెప్పబడుతోంది. (మానవులకు కూడా ఇది మార్గదర్శకము).



అందుచేత "మృత్యువు నన్ను సమీపించకుండును గాక" – అని ఉత్తమాశయము గల యోగాభ్యాసులు (యోగులు) –

- ఇంద్రియ వ్యాపారములన్నీ ప్రాణదేవతా ప్రదర్శనముగా దర్శిస్తూ, ఆరాధిస్తూ, ఉపాసిస్తూ,
- ఇంద్రియ వ్యాపారములన్నీ అధిగమించినవారై అభగ్నమగు 'ప్రాణవ్రతము' (వాయు ఉపాసనావత్రము)ను ప్రాణాయామము మొదలైన వాటి ద్వారా నిర్వర్తించి అమృతత్వము సిద్ధించుకొనెదరు గాక। అట్టివాడు సర్వపాపముల నుండి విముక్తి పొందగలడు.

అట్టి **ప్రాణ వ్రతము**ను ప్రారంభించువాడు ఆ వ్రతమును తృప్తిగా చివరివరకు నిర్వర్తించి, పరిసమాప్తి చేయునుగాక। ఆత్మజ్ఞానము పొందుతూ, సర్వత్రా ఆత్మదర్శనము నిర్వర్తిస్తూ ఆత్మగా తన స్వరూపము సిద్ధించుకొనేవరకు ప్రాణోపాసన కొనసాగించునుగాక। మధ్యలో ఏర్పడే భంగములను (Hurdles) లెక్కచేయక శ్రద్ధా–భక్తులతో "సర్వత్రా ప్రాణతత్త్వదర్శనము" అనే ప్రాణవ్రతము నిర్వర్తించునుగాక. మధ్యలో కలిగే ఆయా ఇబ్బందులకు వశుడై ప్రాణోపాసనను ఆపరాదు. ఆవిధంగా ప్రాణోపాసన 'ఆత్మతృప్తి' పొందేవరకు కొనసాగించకపోతేనో? అట్టివాడు ప్రాణదేవతచే తిరస్కృతుడు కాగలడు.

కాబట్టి మానవుడు అట్టి "ప్రాణవ్రతము"ను పట్టుదలగా ఆచరిస్తూ, ప్రాణదేవతయొక్క అనుగ్రహముచేత **సారూప్య** (సర్వత్రా ప్రాణశక్తిగా దర్శనము), సాలోక్య (సమస్తలోకములుగా ప్రాణరూపముగా భావించటము), **సామీప్య** (స్వస్వరూపమును ప్రాణశక్తిగా ఎరిగి ఉండటము), **సాయుజ్య** (తానే ప్రాణ – ప్రాణేశ్వర స్వరూపముగా ప్రకాశించటము) లను ఇక్కడే సిద్ధించుకోగలడు.

## బృహదారణ్యకోపనిషత్ – 3వ అధ్యాయము

## షష్ఠమ బ్రాహ్మణము

# 6. నామ–రూప–కర్మ చమత్కారం

**(Name, Form and Functioning)**

**త్రయం వా ఇదం – 'నామ' 'రూప' 'కర్మ'।** ఈ అనుభవగుచున్న సమస్త సృష్టి కూడా మూడు విశేషములచే మూర్తీభవించినదై ఉంటోంది. (1) నామము (2) రూపము (3) కర్మ (Name, Form and Functioning)

### (1) నామము

**తేషాం నామ్నాం "వాక్"।** నామముగా ఉన్నది 'వాక్కు'యే. (అనగా) వాక్కే నామములకు కారణము. వాక్కు నుండే సమస్త నామములు జనిస్తున్నాయి. వాక్కు సమస్త నామములకు సామాన్యము(Common to all words) అయి ఉన్నది. వాక్కే సమస్త నామములకు సమానము. (Sound is equal to all speakings). వాక్కే అన్ని నామములను ధరిస్తోంది కూడా।

వాక్కే సమస్తమైన నామములకు బ్రహ్మము. బ్రహ్మస్వరూపము. వాక్కు ఉపాదానకారణము. నామము నిమిత్తకారణము.





## 2. రూపము

ఇక రూపము గురించి చెప్పుకుందాము. నామము రూపమునకు ఇవ్వబడిందే కదా। వస్తువు యొక్క తెలుపు, ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నీలము, లేతనీలము, నలుపు, ముదురు నలుపు మొదలైన రంగులన్నీ ఈ జీవునికి ఎట్లా తెలియవస్తున్నాయి? ఎట్లా గుర్తింప బడుచున్నాయి? నే(త్రేందియము చేత (కళ్లతో చూడటము చేత). అయితే, నే(త్రావయము స్వయముగా చూడగలదా? లేదు. కళ్లు (జీవునికి) ఉపకరణములు (Like a spectacle) మాత్రమే మరి? **కళ్లలో 'చూపు' అనే తేజస్సు ఉన్నది. నే(త్రేంద్రియ తేజస్సు ఎవరిది? జీవునిది. జీవుడు ఎవ్వడు? పరమాత్మయొక్క అంశరూపుడు. కనుక రూపాత్మకమైనదంతా కూడా పరమాత్మయొక్క తేజోవిభవమే.**

❖ ❖ ❖

సమస్త రూపములు నే(త్రము (కళ్లు) చేతనే **'తెలియబడినవి'** అగుచున్నాయి. అందుచేత కళ్లను 'నేం(త్రేం(ద్రియము' అని పిలుస్తున్నాము. అట్టి చక్షురిం(ద్రయమే సమస్త రూపానుభవములకు కారణముగా ఏర్పడి ఉంటోంది.

– సమస్త రూపములు చక్షురిం(ద్రియమునుండియే జనిస్తున్నాయి (పుట్టుకొస్తున్నాయి).

అట్టి చక్షురిం(ద్రయ (చూపు) తేజో విశేషమే సమస్త రూపములతో ఆ రూపములను గుర్తించటానికి కల్పించబడే నామములతో – ఏకము, సమానము, అద్వితీయము అగుచున్నది. <u>ఈవిధంగా నామరూపములు అన్నీ కూడా – 'చూపు' అనబడే తేజోవిభవమే.</u> ఈ చూడబడే సమస్తము కూడా (ద్రష్టకు చెందిన తేజోరూపమగు "చూపు"కు వేరు కాదు. వేరుగా లేదు.

చూపు, చూచువాడు, చూడబడునది – ఈ మూడు కూడా **ఆత్మయొక్క (త్రిమూర్తిత్వ ఏకకళా(ప్రదర్శనమే।** కనుక ఈ సమస్త దృశ్యము ఏకమగు ఆత్మయే. పర(బహ్మస్వరూపమే.

## (3) కర్మ

ఇక ఇప్పుడు జగద్దృశ్యముయొక్క మూడవ మూల పదార్థమగు **'కర్మ'** గురించి చెప్పుకుంటున్నాము.

'కర్మచేయాలి' అంటే–దేహము ఉండాలి. దేహమే కర్మలకు కారణము – అని చెప్పబడుతోంది. శరీరమునుండే సర్వకర్మలు పుట్టుచున్నాయి. ఇదియే సమస్త కర్మలపట్ల ఏకరూపము. చూడటం, వినటం, మాట్లాడటం మొదలైన కర్మలన్నిటికీ సామ్యరూపము ఈ శరీరమే.

సమస్త కర్మలను ధరిస్తున్నది ఈ శరీరమే కాబట్టి **"సమస్త కర్మలకు ~~ఈ~~ దేహమే ఆత్మస్వరూపము"** అని కూడా అభివర్ణించబడుతోంది. నామరూపములతో కూడి దేహము (ప్రకృతిలో అగుపిస్తున్నది. (ప్రకృతి ఆత్మయొక్క తేజో విభవమే।

❖

నామ రూప కర్మలు – ఈ మూడు కూడా ఒక్కటిగా అయి 'దేహము' అవటం జరుగుతోంది. దేహము 'దేహి' యొక్క విన్యాసము. దేహి సర్వదా ఆత్మస్వరూపుడే. **ఈ విధంగా సమస్తము అమృతమగు ఆత్మయే।**

**తదేతత్ అమృతగ్ం సత్యేనచ్ఛన్నం।** అమృత రూపమగు స్వస్వరూపాత్మ "సత్యము" చేతనే ఆవరించబడినదై ఉన్నది.

**(ప్రాణో వా అమృతం నామరూపే సత్యం। తాభ్యాం అయం (ప్రాణశ్ఛన్నః। (మం॥శ్లో॥ - 3)।** ఆత్మయొక్క చేతన స్వరూపము (ప్రాణము. అట్టి 'ఆత్మ–శక్తి' ఏకరూపము అయి ఉండి కూడా అనేకములగు నామరూపములచే చమత్కారంగా కప్పబడి ఉన్నది. (ప్రాణము నామరూపములకు చాటుగా, గుప్తముగా కప్పబడిఉన్నది.

**సత్యమే – ఆత్మ।**
**ఆత్మయే (ప్రాణము।**
**(ప్రాణమే ఈ సమస్తము కూడా। జీవాత్మ పరమాత్మయొక్క అంశయే।**

ఏకము అక్షరము అగు పరమాత్మయే లీలగా జీవాత్మగా కూడా అయి విరాజిల్లుచున్నారు.

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – తృతీయాధ్యాయ – షష్ఠమ (బ్రాహ్మణమ్।**

**తృతీయ అధ్యాయః సమాప్తము**

-----

శుక్లయజుర్వేదాంతర్గత

# బృహదారణ్యకోపనిషత్

9

## చతుర్థ అధ్యాయము

### శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ స యథా ఊర్ణనాభిః తన్తునా ఉచ్చరేత్, (ఉత్+చరేత్),
యథా అగ్నేః క్షుద్రా విస్ఫులింగాపి ఉచ్చరన్తి,
ఏవమేవ అస్మాత్ ఆత్మనః సర్వే ప్రాణాః
సర్వే లోకాః సర్వే దేవాః సర్వాణి భూతాని ఉచ్చరన్తి।
- ఇతి ఉపనిషత్ - (4-1-20)



సాలెపురుగు దేహమునుండి తంతువులు బయల్వెడలు చున్నట్లుగా, అగ్నినుండి చిన్న విస్ఫులింగములు బయలు దేరుచున్నట్లుగా - 'ఆత్మ' నుండియే పంచ ప్రాణములు, లోకములు, దేహములు, సమస్త జీవులు, పంచభూతములు బయల్వెడలుచున్నాయి, చరిస్తున్నాయి, లయిస్తున్నాయి.

## చతుర్థాధ్యాయః - ప్రథమం బ్రాహ్మణము

### అజాత శత్రుబ్రాహ్మణము

1) ఓమ్, దృప్త బాలాకిః హ
అనుచానో గార్గ్య ఆస।
స హ ఉవాచ అజాతశత్రుం
"కాశ్యం బ్రహ్మ తే
బ్రవాణి"। ఇతి।

'బలాక' అను ఒక యోగికి 'బాలాకి' అనే కుమారుడు ఉన్నారు. ఆయన గార్గ్యుడు అనే వ్యవహార నామము కలిగి ఉన్నారు. ఆయన బ్రహ్మము గురించి ఉపాసిస్తూ, అనర్గళముగా ఉపన్యసించగల గొప్ప వక్త. ఆ గార్గ్యముని తపశ్శాలి, శాస్త్రజ్ఞాని కూడా!

ఒకరోజు ఆయన ఆత్మతత్త్వమును మననము చేయదలచారు. కాశీరాజు అగు అజాతశత్రు మహారాజును సమీపించారు. మహారాజు ఆయనకు అతిథి మర్యాదలు సమర్పించారు. "అయ్యా! ఊరకరారు మహాత్ములు! ఏమి సేవ చేయగలను? ఆజ్ఞాపించండి!" అని పలికారు. అప్పుడు గార్గ్యముని **"ఓ మహారాజా! కాశీరాజా! పరబ్రహ్మము గురించి మనము చెప్పుకుందాము. బ్రహ్మోపాసన ఎట్లా చేయాలో వివరించుకుందాం"** - అని పలికారు.

---

సహోవాచ అజాతశత్రుం :
సహస్రం ఏతస్యాం
వాచి దద్మో జనకో।
జనక ఇతి వై జనా
ధావన్తి - ఇతి।

**అజాతశత్రు మహారాజు:** "హే బ్రహ్మన్! గార్గ్య మునీశ్వరా! బాలాకీస్వామీ! చాలా సంతోషము. మునులు, మహనీయులు, బ్రహ్మవేత్తలు అగు మహానుభావులు అనేక మంది "జనక మహారాజే గొప్ప శ్రోత! అందుచేత మిథిలా నగరానికి వెళ్లి బ్రహ్మోపాసన గురించి ఆత్మతత్త్వమును ఉపదేశించి వారిని ఒప్పించెదముగాక! వారి సన్మానము పొందెదము గాక!" అని జనక మహారాజును దర్శిస్తూ ఉంటారు. అటువంటిది, మీరు పరబ్రహ్మము గురించి చెప్పటానికి వచ్చి, నన్ను కూడా జనక మహారాజు వలె సన్మానించినట్లుగా చేస్తున్నారు. మీ వాక్కు మహాప్రసాదముగా భావిస్తూ, ముందుగా మీకు వేయిగోవులను గురుభక్తి పూర్వకముగా సమర్పిస్తున్నాను. దయచేసి స్వీకరించండి!"

| | |
|---|---|
| **2. స హ ఉవాచ గార్గ్యో :**<br>**య ఏవ "అసావాదిత్యే పురుష"**<br>**ఏతమ్ ఏవ అహం**<br>**'బ్రహ్మ' ఉపాస ఇతి।** | **గార్గ్యముని : మీరు ఈ విధంగా బ్రహ్మమును ఉపాసించండి.**<br>"ఏ పురుషుడైతే సూర్యునియందు పరిపూర్ణుడై ఉన్నారో", ఆయననే నేను ఈ నా ఈ దేహ - ఇంద్రియములతో పరబ్రహ్మతత్త్వము కొరకై ఉపాసిస్తున్నాను.<br>ఆ ఆసావాదిత్య పురుషుడే జగత్తుకంతటికీ పరమ పురుషుడు. ఆయనను మీరు ఉపాసిస్తే ఆ సూర్యభగవానుడు బ్రహ్మజ్ఞానము అనుగ్రహించగలరు. ఈ విధంగా సూర్యుని ఉపాసిస్తూ ఉంటే (ఆయన బోధనలచే) బ్రహ్మమును తెలుసుకోగలము. మీరు అట్లే ఉపాసించండి. |
| **సహోవాచ అజాతశత్రుః :**<br>**మామై తస్మిన్ (మాం ఏతస్మిన్) సంవదిష్ఠా।**<br>**అతిష్ఠాః సర్వేషాం భూతానాం**<br>**మూర్ధా రాజేతి వా,** | **అజాత శత్రువు :** అయ్యా! పరబ్రహ్మము అనునది సూర్యుని ఉపాసించి తెలుసుకోవాలని, బ్రహ్మోపాసన అనగా అంతమాత్రమేనని నేను **వ సంవదిష్ఠా।** అనుకోవడం లేదు. (ఇది నాకు ఇతఃపూర్వమే తెలియును. ఈ విషయమై తర్జనభర్జనలు అఖర్లేదు కూడా)।<br>-**'పరబ్రహ్మమే సూర్యునిగా కూడా ఉన్నది'** అను అనన్యోపాసనయే ఉపాయము.<br>(బంగారము అన్ని బంగారు ఆభరణములకు అధిష్ఠానమైన తీరుగా),<br>- సమస్త భూతజాలమును తనయందు కలిగి ఉండి, సమస్తమును అతిక్రమించి, సమస్త జీవులకు అధిష్ఠానము అయినవాడుగాను<br>- సమస్త జీవులకు మూర్ధము (శిరస్సు) అయినవారు గాను,<br>- సర్వ జీవులను పరిపాలించు రాజుగాను, →<br>నేను ఆ పరబ్రహ్మముగా ఉపాసన చేస్తున్నాను. |
| **అహం ఏతం ఉపాస ఇతి।**<br>**స య ఏతం ఏవం ఉపాస్తే అతిష్ఠాః**<br>**సర్వేషాం భూతానాం మూర్ధా రాజా భవతి।**<br>**(సంవదనమ్ = ఆలోచనవశమై ఉండటము)**<br>**సంవలితుడు = చుట్టుకొనబడినవాడు)**<br>**(సంవదిష్ఠము = అట్లాగే అనటము)** | **- సర్వ జీవులుగాను, సర్వజీవులను అతిక్రమించిన తత్త్వముగాను** ఎవ్వరు ఆ పరమాత్మను ఉపాసిస్తారో, అట్టివాడు సర్వ భూతజాలములకు శిరస్సు వంటివాడుగాను, ప్రధానుడుగాను, రాజాధిరాజుగాను కాగలడని నేను దర్శించుచున్నాను. అట్టి ఆ పరబ్రహ్మమే సూర్యునిలో - సూర్యమండలాభిమానిగాను, సూర్య తేజస్సుగా కూడా ఉన్నారని భావిస్తున్నాను. |
| **3. స హ ఉవాచ గార్గ్యో :**<br>**య ఏవ అసౌ "చన్ద్రే పురుష"**<br>**ఏతం ఏవ, అహం 'బ్రహ్మ'**<br>**ఉపాస ఇతి।** | **గార్గ్యముని :** అట్లాగా? సరే। మనమంతా ఆహారముపై ఆధారపడి ఉన్నాము కదా! ఇక నేను ఔషధరూపుడు, అన్నదాత, ప్రశాంత నిలయుడు అగు చంద్రునిలో గల పురుషతత్త్వమును **"పరబ్రహ్మము"** కొరకై ఉపాసించుచున్నాను. ఆ చంద్రలోకాభిమాన పురుషుని బ్రహ్మోపాసన కొరకై అర్చిస్తున్నాను. (మీరు అట్లే చేయండి). |
| **సహ ఉవాచ అజాతశత్రుః :**<br>**మాం ఏతస్మిన్ సంవదిష్ఠా।**<br>**బృహత్ పాణ్డరవాసాః**<br>**సోమో రాజేతి వా, అహం**<br>**ఏతం ఉపాస ఇతి।** | **అజాతశత్రువు :** అట్లు కాదు. ("బ్రహ్మోపాసన కొరకై చంద్రోపాసన కాదు - అని నాకు అనిపిస్తున్నది. సూచిస్తున్నాను. మీరు చెప్పునది ఇంతకుముందే నాకు తెలుసు. మనం ఈ విషయం వాదించుకోవలసిన పనిలేదు. నేను స్పష్టముగా ఎరుగుచున్నదానికి నేను వాదించి నమ్మించటమెందుకు?).<br>బృహత్స్వరూపమగు పరబ్రహ్మమే చంద్రునిలో ఓషధపురుషునిగా కూడా ఉన్నదని చూస్తూ, అట్టి సర్వే **సర్వత్రా ప్రకాశమానమై నిండి ఉన్న దానిని పరబ్రహ్మముగా ఉపాసిస్తున్నాను. చంద్రపురుషునిగా కూడా ఉన్న బ్రహ్మమును ఉపాసిస్తున్నాను.** |

| | |
|---|---|
| స య - ఏతం ఏవం<br>ఉపాస్తే అహరహర్వా<br>సుతః ప్రసుతో భవతి।<br>న అస్య అన్నం క్షీయతే ॥ | చంద్రమండలాభిమానిగా కూడా ఉన్న పురుషుడు అఖండమగు ఆత్మ పురుషుడే పరబ్రహ్మమే. ఏ పురుషుడు ప్రతిరోజు యజ్ఞమునందు సుత-ప్రసుత (ప్రకృతి-వికృతి) స్వరూపుడై ఉన్నారో, ఆ రీతిగా పరమపురుషుడే చంద్రునియందు చంద్ర మండలాభిమానిగా కూడా ఉన్నారని ఎరుగుచున్నాను. ఉపాసించు చున్నాను.<br>**("చంద్రుడే పరబ్రహ్మము" - అని ఉపాసించుట లేదు). పరబ్రహ్మమే చంద్రుడుగా కూడా ఉన్నారు"** అని బ్రహ్మమును ఉపాసించువారికి అన్నము (అనుభూతి- అనుభవము) కొనసాగుచూనే ఉంటుందిగాని, క్షీణించదు. |
| **4.** <u>స హ ఉవాచ గార్గ్యో।</u><br>య ఏవాసౌ "విద్యుతి పురుష"<br>ఏతం ఏవ అహం-<br>"బ్రహ్మ" ఉపాస ఇతి। | **గార్గ్యముని :** ఏ పురుషుడు మెరుపునందు (తేజస్సునందు) కాంతి స్వరూపుడై ప్రకాశిస్తున్నారో, ఆ విద్యుత్ అభిమాన పురుషుని నేను బ్రహ్మము కొరకై ఉపాసిస్తున్నాను. |
| <u>స హ ఉవాచ అజాతశత్రుః :</u><br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠాః।<br>తేజస్వీ ఇతి వా అహం ఏతం ఉపాస ఇతి। | **అజాతశత్రువు :** అట్లా అని నాకు అనిపించటము లేదు. అయితే, పరబ్రహ్మమే తన లీలా- క్రీడా-మహిమా విశేషము చేత తేజోరూపుడుగా, తేజస్విగా విశ్వమునందు సర్వత్ర ఉన్నారని ఉపాసిస్తున్నాను. విద్యుత్ (తేజస్సు) ఆత్మదేవుని పురుషకారమే। |
| స య ఏతం ఏవం ఉపాస్తే తేజస్వీ,<br>హ భవతి। తేజస్వినీ హాస్య ప్రజా భవతి। | ఎవ్వరైతే బ్రహ్మమే సూర్య-చంద్ర-అగ్ని తేజో (విద్యుత్) రూపమై జగత్తునందు ప్రకాశమానమగుచున్నారని ఉపాసించుచున్నాడో, అట్టివాడు తేజోవంతుడు అగుచున్నాడు.<br>అంతేకాదు. ఆతని సంతానము, శిష్యులు కూడా తేజోవంతులు కాగలరు. |
| **5.** <u>స హ ఉవాచ గార్గ్యో :</u><br>య ఏవ అయం "ఆకాశే పురుష"<br>ఏతం ఏవ అహం-<br>'బ్రహ్మ' ఉపాస ఇతి। | **గార్గ్యముని :** ఆకాశమునందు ఆకాశాభిమాని యగు ఏ పురుషుడు ఉన్నారో, సర్వము తనయందు కలిగి యున్నారో, ఆయనను బ్రహ్మము కొరకై నేను ఉపాసిస్తున్నాను. మీరూ ఆ ఆకాశభిమాన పురుషుడే పరబ్రహ్మమని ఉపాసించవచ్చు. |
| <u>స హ ఉవాచ అజాతశత్రుః :</u><br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠాః। | **అజాతశత్రువు : 'పరబ్రహ్మమనగా ఆకాశపురుషుడే'** - అనునది పరిమితిగా ఉపాసించటము అవగలదు. ఆ పరమ పురుషుని పరిమితము చేయటానికి కుదరదు. పరమ పురుషుని ఆకాశ పురుషునికి పరిమితము చేసి నేను ఉపాసించటము లేదు. |
| పూర్ణం అప్రవర్తి ఇతి వా<br>అహం ఏతం ఉపాస ఇతి। | పరబ్రహ్మము పరిపూర్ణుడని, క్రియాశూన్యుడని, అప్రవర్తి అని, ఆకాశస్వభాముచే పరిమితుడు కాడని, తన యందు ఆకాశాది తత్త్వలేమి లేనివాడని నేను ఉపాసించుచున్నాను. |
| స య ఏతం ఏవం<br>ఉపాస్తే పూర్యతే (హ)<br>ప్రజయా పశుభిః। న అస్య<br>అస్మాత్ లోకాత్ ప్రజోద్వర్తతే ॥ | ఎవ్వరైనా ఆయన ఆకాశరూపము అగుటలేదని, ఆయనయే ఆకాశముతో సహా సర్వము అయి ఉండినట్లు (అజ్ఞానముచే) కనిపిస్తున్నారని, అట్టి పరమాత్మను ఉపాసిస్తారో.., అట్టి పరమాత్మను పూర్ణముగా ఉపాసించువాడు తాను కూడా సంతానము - పశుసంపదతో పూర్ణుడుగా అగుచున్నాడు. అట్టి "పూర్ణమదః-పూర్ణమిదమ్"గా ఉపాసించువాని లోకములు విభేదము విభేదముకాదు. **లోకములన్నీ తనయందు కలిగి ఆతడు పూర్ణుడగుచున్నాడు.** |

| | |
|---|---|
| 6. <u>స హ ఉవాచ గార్గ్యో :</u><br>యః ఏవ అయం <u>"వాయౌ పురుష"</u><br>– ఏతం ఏవ అహం –<br>"బ్రహ్మ" ఉపాస ఇతి॥ | **గార్గ్యముని :** అయ్యా! అజాతశత్రు మహారాజా!<br>వాయువునందు ఏ వాయు అభిమాన దేవత ఉండి, వాయువు యొక్క చలనములకు కారణమగుచున్నారో, ఆయననే మనము పరమపురుషునిగా, బ్రహ్మముగా ఉపాసించాలి. ఈ ప్రపంచంలోని సర్వచలనములకు ఆవల, అందుకు కారణమగు ప్రజ్ఞారూపుడు - వాయుదేవుని 'బ్రహ్మము'గా ఉపాసిస్తున్నాను. (బ్రహ్మముయొక్క సిద్ధికై మీరూ ఇది నిర్వర్తించండి). |
| <u>స హ ఉవాచ అజాతశత్రుః</u><br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠా। | **అజాతశత్రువు :** పరమాత్మను వాయు ఇత్యాది అభిమానిగాను, వాయు చలనములకు కారకుడుగాన మాత్రమే చూడాలని, ఉపాసించాలని నేను ఒప్పుకోవటము లేదు. |
| ఇన్ద్రో వైకుణ్ఠో అపరాజితా<br>సవే(నే)తి వా<br>అహం ఏతం ఉపాస | "ఆ పరమ పురుషుడే (అఖండాత్మ భగవానుడే) ఇంద్రియములకు - త్రిలోకములకు అధిపతియగు ఇంద్రుడుగాను, ఈ సర్వజగత్తులో వాయు స్థితి-వాయు చలన కారకుడగు జిష్ణువుగాను, అపరాజిష్ణువుగాను (పరాజయము పొందనట్టి తత్త్వముగాను) ప్రదర్శనమగుచున్నారని నేను ఉపాసించుచున్నాను. |
| (ఇతి) స య ఏతం<br>ఏవం ఉపాస్తే జిష్ణుః హ<br>అపరాజిష్ణుః భవతి,<br>అన్యతస్త్య జాయీ। | **"పరమాత్మ ఇదియే" - అనే భావముతో ఉపాసించవలసిన పనేమున్నది? పరబ్రహ్మమే ఈ ఈ సమస్త విధములుగా ప్రకాశించుచున్నదని గమనిస్తూ ఉపాసించువాడు విజయశీలుడు, పరాజయము లేనివాడు, శత్రుజయమును సిద్ధించుకొనువాడు అగుచున్నాడు.** అన్యత్వమంతా మొదలంట్లా జయించినవాడగుచున్నాడు. **అనన్యత్వమునకు** చేరుచున్నాడు. |
| 7. <u>స హ ఉవాచ గార్గ్యో :</u><br>యః ఏవ అయం <u>"అగ్నౌ పురుష"</u><br>ఏతం ఏవ అహం–<br>'బ్రహ్మ' ఉపాస ఇతి। | **గార్గ్యముని :** సరే! ఇది వినండి. అగ్నియందు ఏ అభిమాన దేవతా పురుషుడు (అగ్ని దేవుడు), ఉన్నారో, ఆయననే నేను 'బ్రహ్మము'గా ఉపాసించుచూ ఉన్నాను. కనుక బ్రహ్మముకొరకై అగ్నిపురుషుని ఉపాసించ వలసినదిగా చెప్పుచున్నాను. మనము అగ్నిరూప ప్రజ్ఞాదేవతను ఉపాసిస్తూ ఆత్మతత్త్వము ఎరుగగలము. |
| <u>స హ ఉవాచ అజాతశత్రుః</u><br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠాః।<br>విషా సహిః ఇతి వా అహం<br>ఏతం ఉపాస ఇతి। స య<br>ఏతమ్ ఏవం ఉపాస్తే<br>విషా సహిః హాస్య (హ అస్య) ప్రజా భవతి। | **అజాతశత్రువు:** అయ్యా! అది కూడా నేను 'ఔను' అని అనటము లేదు.<br>(సర్వదా సిద్ధము, ప్రసిద్ధము అయిన) పరబ్రహ్మమును - "అట్లా సిద్ధించగలదు" అని ఎట్లా నిర్వచిస్తాము? లేదు. ఆ పురుషోత్తముడు (పరబ్రహ్మము) **సర్వ విషయములు తానే అయి, విషయములన్నిటికి అతీతుడై, సాక్షి అయి ఉన్నవారుగా** నాచే ఉపాసించబడుచున్నారు. అగ్ని యందు, వాక్కునందు, హృదయమునందు అభిమానిగా ఉన్నది. ఆ పరమాత్మయే - అని నేను ఉపాసించుచున్నాను. పరమాత్మను సర్వ విషయ స్వరూపుడుగాను, నిర్విషయునిగాను ఎవ్వరు ఉపాసిస్తారో, (పరమాత్మన విసాసహిగా.. సర్వము సహించువాడుగా ఉపాసిస్తాడో).. అట్టివాడు ఇతరులను సహించువాడగుచున్నాడు. ఆతని సంతానము కూడా అట్టివారే అగుచున్నారు. |
| 8) <u>స హ ఉవాచ గార్గ్యో :</u><br>యః ఏవ అయం 'అప్సు పురుష'<br>ఏతం ఏవ అహం–<br>'బ్రహ్మ' ఉపాస ఇతి॥ | **గార్గ్యముని :** అయితే రాజా! జలమునందు ఏ ప్రతిబింబ/ప్రతిరూప పురుషుడు గలరో ఆయననే నేను బ్రహ్మము కొరకై (ఆత్మీయభావనకై) ఉపాసించుచున్నాను. (మీరూ అట్లే ఉపాసించి బ్రహ్మమును సముపార్జించవచ్చును). |

| | |
|---|---|
| స హ ఉవాచ అజాతశత్రుః : <br> మాం ఏతస్మిన్ సంవదిష్ఠాః । <br> ప్రతిరూప ఇతి వా <br> అహమ్ ఏతం ఉపాస ఇతి। <br> స య ఏతం ఏవం <br> ఉపాస్తే ప్రతిరూపగ్ం, <br> హైవై నం ఉపగచ్ఛతి <br> న అప్రతిరూపం అథో <br> ప్రతిరూపో అస్మాత్ జాయతే ॥ | **అజాతశత్రువు** : అయ్యా! అదీ నేను ఒప్పుకోవటము లేదు. <br> ఆ పరమాత్మ యొక్క 'ప్రతిరూపము' అగు అప్పు పురుషుని ఉపాసించు వాడు శ్రుతి-స్మృతి- శాసనములచే చెప్పబడినట్టి ప్రతిరూప (ప్రతిబింబ) ఫలములను మాత్రమే (విషయానుగతమైన ఫలములనేగాని - అసలైన తత్త్వమును కాదు) పొందుచున్నాడని నా మనవి. జలాభిమాన పురుషుడు పరమాత్మయొక్క అంశయే అయి ఉన్నారు. <br> ఎవ్వరైతే మీరు చెప్పు **జలాభిమాన దేవతను ఆ పరబ్రహ్మము యొక్క ప్రతి రూప (అంశ) విశేషముగా ఉపాసిస్తారో,... అట్టివానివద్దకు అనురూపము (అప్రతిరూపము. original) వచ్చి చేరుతుందేగాని ప్రతిరూపము కాదు.** అనుకూలఫలమే చేరుతుంది. ప్రతిరూప ఫలములు కాదు. కాబట్టి బ్రహ్మమే జలమునందు సర్వజీవుల యొక్క త్రాణ-ప్రాణ రక్షక రూపము దాల్చినదై ఉన్నదని ఉపాసిస్తున్నాను. |
| **9.** స హ ఉవాచ గార్గ్యో : <br> య ఏవ అయం 'ఆదర్శే పురుష' <br> ఏతం, ఏవ-అహం- <br> 'బ్రహ్మ' ఉపాస ఇతి। | గార్గ్యముని : రాజా! నిర్మలమగు అద్దమునంద (దర్పణమునందు) ప్రతిబింబ స్వరూపుడై ఉన్న తత్-అభిమాన పురుషుని నేను 'బ్రహ్మము'గా ఉపాసించుచున్నాను. (నీవు కూడా అట్టి **ఆదర్శపురుషుని** ఉపాసించుచూ బ్రహ్మమును సిద్ధింపజేసుకొనవచ్చును). |
| స హ ఉవాచ అజాత శత్రుః <br> మాం ఏతస్మిన్ సంవదిష్ఠా। | **అజాతశత్రువు** : అది కూడా నేను ఒప్పుకోవటము లేదు. <br> నిర్మల దర్పణము (అద్దము) నందు ప్రతిఫలాత్మకుడైన ప్రాణ స్వరూప పురుషుని విషయమై అద్దాని గురించి నాకు ఇతః పూర్వమే తెలియును. **ఏ పురుషుడైతే నిర్మల దర్పణమునందు కూడా ప్రతిబింబిస్తున్నారో, ఆయనయే నేను - పరమాత్మగా ఉపాసించుచున్నాను.** <br> అంతేగాని ప్రతిబింబిస్తున్న ప్రతిబింబ రూపమును కాదు. బింబమును వదలి ప్రతిబింబ పురుషుని ఉపాసించటమెందుకు? **ఎవ్వరు బింబరూపుడై ఉన్నాడో అట్టి పరమాత్మయే పరమ సత్యము.** ప్రతిబింబములో సత్యమేమున్నది? |
| రోచిష్ణుః ఇతి వా <br> అహం ఏతం ఉపాస ఇతి। <br> స య ఏతం ఏవం <br> ఉపాస్తేః రోచిష్ణుః హ భవతి। <br> రోచిష్ణుః హాస్య (హ అస్య) ప్రజా భవతి। <br> యథో యైః సన్నిగచ్ఛతి <br> సర్వాగ్ం స్తానతి రోచతే॥ | పరబ్రహ్మమే రోచిష్ణువు అనబడు ప్రకాశము దీప్తి, కలవాడు. <br> ఎవరు ప్రతిబింబతత్త్వమును అధిగమించి కేవలదీప్తి స్వరూపుడగు పరబ్రహ్మమునే ఉపాసిస్తారో, అట్టివారు దీప్తి కలవారగుచున్నారు. వారి సంతానము, వారు ఎవరితో సమావేశమైతే వారు కూడా... దీప్తిమంతులగు చున్నారు. అందుచేత అద్దములో ఏ పురుషుడు కనిపిస్తున్నాడో ఆ ప్రతిబింబ ఉపాసన అనునది అన్యోపాసన, అనన్యోపాసనయగు బింబోపాసన ఆత్మోపాసన. ఆత్మను బింబోపాసనగా స్వీకరించి, ఈ జగద్దృశ్యమును ఆత్మయందు ఆత్మకు అభిన్నమైన ప్రతిబింబముగా దర్శిస్తున్నాను. |
| **10.** స హ ఉవాచ గార్గ్యో : <br> య ఏవ అయం యన్తం పశ్చాత్ <br> "శబ్దోః" అనూద్యేతమ్ ఏవ <br> అహం 'బ్రహ్మ' ఉపాస ఇతి॥ | **గార్గ్యుడు** : సరే! ఇంకొక బ్రహ్మోపాసనా విధానమును చెప్పుచున్నాను. ఒకడు నడిచి వెళ్ళుచూ ఉండగా, ఆతని వెనుకభాగమును అనుసరించి పుట్టుచున్న శబ్దమునే బ్రహ్మముగాను, ఆ బ్రహ్మమే దేహ-ఇంద్రియములు మొదలైన సముదాయమునందు పరబ్రహ్మముగా ఉన్నట్లు నేను ఉపాసిస్తున్నాను. మీరు ఆ నడుచువాని వెనుక నుండు శబ్దమును బ్రహ్మముగా భావించండి. <br> **మరొక అర్థము** : శబ్దమును (ఓం నమః శివాయ మొ॥వాటిని) ఉపాసించిన తరువాత నేను బ్రహ్మమును అనుదోతముగా (ప్రకాశించునదిగా) పొందగలను. |

| | |
|---|---|
| సహ ఉవాచ అజాతశత్రుః :<br>మామ్ ఏతస్మిన్ సంవదిష్ఠా।<br>'అసుర' ఇతి వా<br>అహం ఏతం ఉపాస ఇతి।<br>(అసురుసురు - శ్రమయందు ధ్వని అనుకరణము) | **అజాతశత్రువు** : అయ్యా! అట్లా అది పూర్ణ బ్రహ్మోపాసన కాదు. కనుక ఒప్పుకోవటం లేదు.<br>నేను - మీరుచెప్పుచున్నట్టి ఒకడు నడుచుచూ వెళ్ళుచున్నప్పుడు వినబడే 'ఉమ్-' హమ్..' శబ్దములను 'ప్రాణము' యొక్క (ప్రాణాత్మశక్తి యొక్క) ప్రదర్శనముగా ఉపాసించుచున్నాను. |
| స య ఏతం ఏవం ఉపాస్తే<br>సర్వగ్ం హైవ అస్మిగ్ం ల్లోక ఆయుః ఏతి।<br>నైనం పురా కాలాత్ ప్రాణో జహాతి। | ఎవ్వరైతే - ఈదేహముల కదలికల వలన, నడకలప్పుడు వినబడే శబ్దాలన్నీ (శ్రమయందు ధ్వని అగు) - ప్రాణతత్త్వ విభవముగా ఉపాసిస్తాడో..<br>అట్టివాడు పూర్ణాయుర్దాయము పొందగలడు.<br>ఆయుష్షుకంటే ముందుగా ప్రాణము ఆతనిని విడువదు. అర్థాయుష్కుడవడు! |
| **11** స హ ఉవాచ గార్గ్యో :<br>య ఏవ అయం "దిక్షు పురుష"<br>ఏతం ఏవ అహం "బ్రహ్మ" ఉపాస ఇతి | **గార్గ్యముని** : అయితే ఇంకొక ఆత్మ-ఉపాసన చెప్పుచున్నాను. వినండి. '8' దిక్కులయందు ఏ పురుషుడు దిక్షు అభిమాని అయి, (అశ్వనీదేవతా స్వరూపుడై) చెవులయందు, ఆకాశమునందు పరిఢవిల్లుచున్నాడో, ఆతడే పురుషుడుగా నేను ఉపాసిస్తూ ఉన్నాను. మీరూ ఆ దిక్షు పురుషుని ఉపాసించి బ్రహ్మమును పొందవచ్చును. |
| స హ ఉవాచ అజాతశత్రుః :<br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠా।<br>ద్వితీయో అనపగ ఇతి వా<br>అహం ఏతం ఉపాస ఇతి॥ | **అజాత శత్రువు** : అట్టి దిక్షు పురుష ఉపాసన కూడా నాకు ఒప్పుకోలు కాదు. ఆ పరబ్రహ్మమును→అట్టి దిక్షుపురుషుని కంటే ఆవలిది. రెండవది, దిక్షు పురుషునితో పరస్పరము విడిపోనట్టిదిగా ఉపాసన చేస్తున్నాను. సమస్తము ఆత్మయొక్క అంశమాత్రముగా దర్శిస్తూ ఉపాసిస్తున్నాను. బ్రహ్మోపాసన చేస్తున్నాను. |
| స య ఏతం ఏవం ఉపాస్తే<br>ద్వితీయవాన్ హ<br>భవతి। న అస్మాత్ గణః ఛిద్యతే॥ | ఎవ్వరైతే రెండవదగు ఆత్మ, దిక్షు పురుషుడుగా కూడా ప్రదర్శితము.. అగుచున్న బ్రహ్మమును ఉపాసిస్తాడో,... భృత్యువుల సహాయ - సంపదలు ఎల్లప్పుడు అట్టివానిని ఆశ్రయించినవై ఉంటాయి. ఆతనిని ఆతని అనుచరగణము విడిపోదు. |
| **12** సహ ఉవాచ గార్గ్యో :<br>య ఏవ అయం "ఛాయామయః పురుష"<br>ఏతం ఏవ<br>అహం "బ్రహ్మ" ఉపాస ఇతి। | **గార్గ్యముని** : అయితే మహారాజా! ఇది వినండి. (ఏ పురుషుడైతే నీడను కల్పించుకొను అభిమానముతో కూడి ఛాయాపురుషుడు అయి ఉన్నారో), ఆ **ఛాయా పురుషుని** ఈదేహేంద్రియ సముదాయమునందు గల పరబ్రహ్మముగా ఉపాసించుచున్నాను. మీరూ అట్లాగే ఉపాసించవచ్చును. |
| సహ ఉవాచ అజాతశత్రుః<br>మాం ఏతస్మిన్ సంవదిష్ఠా।<br>మృత్యుః ఇతి వా<br>అహం ఏతం ఉపాస ఇతి। | **అజాతశత్రువు** : అది కూడా మీతో ఏకీభవించలేకపోతున్నాను స్వామీ! ఆత్మకు ప్రకృతియే ఛాయ. ప్రకృతి. ఎల్లప్పుడూ మార్పు-చేర్పులు కలిగి ఉన్నట్టిది. అనగా 'మృత్యు' స్వరూపము. అందుచేత మీరు వర్ణించిన ఛాయాపురుషుడుగా ఉన్నది-మృత్యువు. మృత్యువు నిర్వికార పరబ్రహ్మమునందు దృష్టి విశేషమగు సవికార ఛాయారూపు కల్పనా జగత్తుగా అనుభవమగుచున్నది.<br>**జ్ఞానముచే ఈ ఛాయాపురుషుడుగా కనిపిస్తున్నది బ్రహ్మమేనని నేను భావిస్తున్నాను. ఉపాసిస్తున్నాను.** |
| స య ఏతం ఏవం ఉపాస్తే సర్వగ్ం<br>హై వ అస్మిన్ లోక ఆయురేతి।<br>నైనం పురాకాలాన్ మృత్యుః ఆగచ్ఛతి॥ | అట్లు "పరబ్రహ్మమే ఈ ఛాయామాయ పురుషుడు, (లేక) ఛాయా మయ పురుషుడైయున్నారు. అది బ్రహ్మము యొక్క చమత్కారమే".. అను ఛాయాపురుషావగాహనతో ఎరిగి ఎవ్వరు ఉపాసిస్తారో,... అట్టివాడు పూర్ణాయుర్దాయుడౌతాడు. అకాల మృత్యువు ఉండదు. మృత్యువు తన రూపమే అగుచున్నది. (మృత్యుః సర్వ హరశ్చ అహమ్). |

**13) సహ ఉవాచ గార్గ్యో :**

**య ఏవ అయం "ఆత్మని"**

**'పురుష' ఏతం ఏవ అహం**

**"బ్రహ్మ" ఉపాస ఇతి।**

**గార్గ్యముని :** ఓ అజాతశత్రు మహారాజా! ఈ (జీవుడుగా కనిపిస్తున్న) బుద్ధ్యాత్మనే 'పరమ పురుషుడు' అని - 'బ్రహ్మము' కొరకై నేను ఉపాసించుచున్నాను. మీరూ అట్లా అనుసరించవచ్చును.

---

**స హ ఉవాచ అజాతశత్రుః :**

**మాం ఏతస్మిన్ సంవదిష్ఠా।**

**ఆత్మన్వీతి వా 'అహం'**

**ఏతం ఉపాస ఇతి।**

**స య ఏతం ఏవం (ఏతమేవం) ఉపాస్తే ఆత్మన్వీహ।**

**భవతి। ఆత్మన్వినీ హాస్య ప్రజా భవతి।**

**స హ తూష్ణీమాస గార్గ్యః॥**

**అజాతశత్రువు :** మునీశ్వరా! అది కూడా నాకు ఒప్పుదలగాదు, నేను ఈ బుద్ధిసహితుడై కనిపించే జీవాత్మను - **మనస్సుకు ఆవల గల సర్వ స్వతంత్రుడగు పరబ్రహ్మముగా ఉపాసిస్తున్నాను.**

ఎవ్వరైతే బుద్ధి అభిమానియగు జీవాత్మగా కనిపిస్తున్నారో, అట్టి జీవాత్మను **"సందర్భములకు ఆవల ఉన్న పరబ్రహ్మమే".. అని ఉపాసించువాడు. ఆత్మన్వీహ-ఆత్మయే స్వరూపము కలవాడై ప్రకాశించుచున్నాడు. ఆతనికి సమస్త జనులు ఆత్మస్వరూపంగా సాక్షాత్కరించగలరు.**

*ఈ విధముగా పలికిన అజాతశత్రువు యొక్క తిరస్కార మాటలు వింటూ ఉన్న గార్గ్యుడు - "ఇంకేమి ఈయనకి మనము చెప్పాలి?" అని తలచి తూష్ణీభావముతో మౌనము వహించి ఉన్నారు.*

---

**14 సహ ఉవాచ అజాతశత్రుః**

**"ఏతావన్నూ" ఇతి। "ఏతావద్ధి" ఇతి।**

**నైతావతా విదితం భవతి ఇతి-**

అప్పుడు అజాత శత్రుమహారాజు ఇట్లా చెప్పసాగారు.

ఓ గార్గ్యమునీ! ఇంతేనా? లేక ఇంకా ఏమన్నా బ్రహ్మమునకు సంబంధించిన ఉపాసన విషయమై మీరు నిర్వర్తిస్తున్నది చెప్పదలచు చున్నారా?

---

**సహ ఉవాచ గార్గ్య :**

**ఉప త్వా యాని ఇతి॥**

**గార్గ్యముని :** అయ్యా! ఇప్పటివరకు బ్రహ్మమును ఉపాసించి ఎరుగుట కొరకై ఆయా విధములైన ఉపకరణ సంజ్ఞల గురించి చెప్పుకుంటూ వచ్చాను. మీరు అద్దానిని ఆత్మోపాసన దృష్ట్యా 'కాదు' అని ఖండిస్తూ వస్తున్నారు. ఇక నేను చెప్పేదేమీ లేదు. మీరు క్రమముక్తి దాటి సద్యోముక్తిని ఆశ్రయిస్తూ, చెప్పుచున్నారు. సంతోషము. **ఇప్పటి నుండి మీకు శిష్యుడనగుచున్నాను. ఇక మీరు బ్రహ్మము గురించి ప్రవచనము చేయండి! నాకు గురువులై బ్రహ్మమును ఎరుకపరచ ప్రార్థన!**

---

**15 సహ ఉవాచ అజాతశత్రుః :**

**ప్రతిలోమం (చై) వైతత్**

**యత్ బ్రాహ్మణః,**

**క్షత్రియం ఉపేయాత్ బ్రహ్మ మే వక్ష్యతి ఇతి।**

**వ్యేవత్వా జ్ఞాపయిష్యామి ఇతి।**

**అజాతశత్రువు** (తనలో) "ఈ గార్గ్యముని బ్రాహ్మణ వంశజుడు. నేను క్షత్రియవంశమునకు చెందినవాడను. ఈతడు 'బ్రహ్మము' గురించి చెప్పమని నన్ను వేడటము విపరీతమైన విషయము. అయినా కూడా, ఈతడు బ్రహ్మమునందు ఎంతో ఉత్సాహము కలిగి ఉన్నవాడు కాబట్టే "బ్రహ్మము గురించి వినండి" అని నన్ను సమీపించి సూచనలను చెప్పుతూ వస్తున్నాడు. ఇప్పుడు బ్రహ్మము గురించి అడుగుచున్నారు. ఈతడు అర్హుడే. కనుక చెప్పుతాను" - అని తలచారు.

**అజాతశత్రువు :** ఓ గార్గ్యమునీ! మీరు జన్మతః బ్రాహ్మణులే అయినప్పటికీ క్షత్రియుడనగు నేను ఒక సహ విద్యార్థి వలె బ్రహ్మము గురించి చెప్పబోవుచున్నాను. దయచేసి వినండి.

---

**తం ప్రాణావాదా యోః**

**తస్థౌ తౌహ పురుషగ్ం**

**సుప్తమా జగ్మతుః।**

**తం ఏతైః నామభిరామన్త్రయాన్**

**చక్రే, బృహన్ పాణ్డర వాసః**

**సోమరాజన్! ఇతి।**

**స నోత్తస్థౌతం।**

అప్పుడు అజాతశత్రు మహారాజు గార్గ్యమునిని సమీపించి తన ప్రియమగు స్నేహితునివలె చేతులు పట్టుకొని 'రండి!' అని తన వెంట తీసుకొని పోనారంభించారు.

ఆ ఇద్దరూ కలిసి సోమరాజు అనే ఒక వ్యక్తి యొక్క గృహములో ప్రవేశించారు.

ఆ సోమరాజు గాఢ నిద్రాపరవశుడై ఉన్నాడు.

అజాతశత్రు మహారాజు ఆ నిదురిస్తున్న సోమరాజును ఉద్దేశ్యించి "ఓ తెల్లటి వస్త్రములు (పంచ) ధరించిన సోమరాజా! మేము వచ్చాము. నిదురలే!.. అని సునిశితముగా, తీయగా పలికారు. గాఢనిద్రలో ఉన్న

**పాణినా పేషం బోధయాన్ చకార।**

**సహ ఉత్తస్థౌ॥**

సోమరాజు నిదురలేవలేదు. అప్పుడు రాజు ఆ నిదురిస్తున్న సోమరాజును రెండు చేతులతో గట్టిగా కదల్చుచూ **"ఓ మిత్రమా! సోమరాజా! నిదురలేవవయ్యా! నీతో ఒక పని ఉన్నది!"** అని పలికారు.

అప్పుడు సోమరాజు నిద్రలేచాడు. ఈ సందర్భము సహాయముతో ఆ రాజు అజాతశత్రువుకు బ్రహ్మము గురించి చెప్పతలచారు.

(నిదురలేచిన సోమరాజు మన అజాతశత్రుమహారాజును, గార్గ్యమునిని సుఖాశీనులుగా చేశారు. ప్రశాంతంగా వారు ఒకచోట కూర్చున్నారు)

---

16 **సహ ఉవాచ అజాతశత్రుః :**

**యత్ర ఏష ఏతత్ సుప్తో**

**అభూద్య ఏష విజ్ఞానమయః**

**పురుషః క్వ ఏష?**

**తదా భూత్ కుత ఏతత్ ఆగాత్ – ఇతి?**

**తదు హ న మేనే గార్గ్యః।**

**అజాతశత్రువు** : ఓ గార్గ్యమునీ! ఈ మన సోమరాజు ఎవరు? ఈ దృశ్యము గురించి, ఇందులోని సంబంధ బాంధవ్యముల గురించి- నేను మిత్రుడనని, రాజునని ఎరుక-ఇవన్నీ కలిగి ఉన్న **'విజ్ఞాన పురుషుడు'**- అయి ఉన్నారు. అంటే అన్నీ ఎరుగువాడై మనలో ఉండి ఉన్నాడు. ఇంటికి వచ్చి నిదురించాడు.

(1) ఏ సమయంలో ఈ మన స్నేహితుడు సోమరాజు నిదురిస్తూ ఉన్నాడో,.. ఆ సమయంలో ఈతడు ఎక్కడ ఉండి ఉన్నాడు? ఏ స్వరూపముతో ఉన్నాడు?

(2) మరల మనము నిదురలేపినప్పుడు ఏ స్వరూపముతో తిరిగి మన మధ్యకు వచ్చి మనతో ఈ దృశ్య విషయములలో పాల్గొనుచున్నాడు? **చెప్పండి!**

గార్గ్యముని ఆ ప్రశ్నలు విన్నారు. ఆ ప్రశ్నలేమిటో, వాటికి సమాధానమేమి చెప్పాలో గార్గ్యమునికి తెలియలేదు. **"అయ్యా! నాకు తెలియదు. నేను ఆలోచించనూ లేదు. మీరే దయచేసి వివరించండి!"** అన్నట్లుగా ముఖకవళికలు ప్రదర్శించారు, - ఆ ముని!

---

17 **సహ ఉవాచ అజాతశత్రుః :**

**యత్రైష ఏతత్ సుప్తో అభూత్**

**య ఏష విజ్ఞానమయః పురుషః।**

**తత్ ఏషాం ప్రాణానాం**

**విజ్ఞానేన విజ్ఞానం ఆదాయ**

**య ఏషో అంతః హృదయ ఆకాశః।**

**తస్మిన్ శేతే తాని**

**యదా గృహ్ణాతి।**

**అజాతశత్రువు** : మనమధ్యనే ఉంటూ మనతోబాటే అనేక ప్రాపంచిక విషయ - సంఘటన - సందర్భ-సంబంధ- అనుబంధ - బాంధవ్యములన్నీ ఎరిగి ఉన్న ఈ **'సోమరాజు' అని మనము పిలుస్తున్న విజ్ఞాన పురుషుడు** ఇంటికి వచ్చి, భోజనము చేసి నిద్రకు ఉపక్రమించారు.

అప్పుడు → తన యొక్క విజ్ఞానముతో ఇచ్చట ఈ జాగ్రత్ సంబంధమైన విజ్ఞాన విశేషాలను తనలో కలుపుకొన్నాడు. అట్లా కలుపుకొని ఉండియే **తన హృదయాకాశములో నిర్విషయుమౌన రూపముగు నిద్రను స్వీకరించారు.** అంతర్హృదయములో హృదయాంతరంగుడై ఉండి ఉన్నాడు.

---

**అథ హి ఏతత్ పురుషః**

**"స్వపితి" నామ, తత్ గృహీత ఏవ**

**ప్రాణో భవతి।**

**గృహీతా వాక్। గృహీతం చక్షుః।**

**గృహీతగ్ం శ్రోత్రం।**

**గృహీతం మనః॥**

అప్పుడు ఈతడు జాగ్రత్ జగత్ విషయాలను తన విజ్ఞానము (లేక) ప్రజ్ఞతో (లోన) దాచుకొని జాగ్రత్ జగత్ ధ్యాస లేకుండా నిదురిస్తున్నప్పుడు "స్వపితి స్థితి - తనయందు తానే ఉన్నవాడు" - అని పిలువబడుచున్నాడు.

అట్టి 'స్వపితి' స్థితిలో తన యొక్క **నామరూపాత్మకమైన అనుభవములన్నీ లోనికి గ్రహించి, అప్రదర్శితంగా 'విజ్ఞానము' నందు దాచుకొని ఉన్నాడు.** అప్పుడు ప్రాణమును, ఘ్రాణేంద్రియమును, మాట్లాడే వాక్కును చూచే చూపును, వినే వినికిడిని, ఇంద్రియములను ఉపయోగించే మనస్సును తనయందు (లోపలికి-హృదయాకాశములోనికి) గ్రహించి (పని చేయువాడు ఆ పనిని మానినప్పుడు పనితనమును తనయందు దాచుకొనువిధంగా) **దాచుకొని ఉంటున్నాడు.**

| | |
|---|---|
| **18** <u>స యత్ర ఏ తత్ స్వప్న్యయా</u> <u>చరతి,</u><br>**తే హాస్య లోకాః (తే హ అస్య లోకాః)**<br>**తదు తేవ మహారాజో భవత్యుత ఏవ**<br>**మహా బ్రాహ్మణ**<br>**ఉతేవోచ్చావచం నిగచ్ఛతి।** | ఈతడు ఒకప్పుడు (జాగ్రత్‌కు వేరైన మరొక సందర్భములో) నిదురించి, బాహ్యమును విడచి, హృదయాకాశములో అంతర్గతుడై, తనయందు తానే **'కల్పన'**కు ఉపక్రమించుచున్నాడు. స్వప్న సమయములో ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు, బాహ్యాభౌతిక జగదనుభవములకు పనిచెప్పకుండానే.., తన యొక్క **'తెలుసుకొనటము'** (The knowing) అనే ప్రజ్ఞను ఉపయోగించి స్వప్నానుభవములు పొందుచున్నాడు. ఆ స్వప్నములో ప్రసిద్ధములగు ఆయా అనేక లోకములలో ప్రవేశించుచున్నాడు.<br><br>అట్టి ఆ స్వప్నజగత్తులో మహారాజుగా అగుచున్నాడు. బ్రాహ్మణుడగు చున్నాడు. కుక్క-నక్క-పంది-దేవతా రూపములుగా కూడా అగుచున్నాడు. ఆ కలలో మహారాజు వలె ఇష్టారాజ్యము ఏలుచున్నాడు. తన ఇష్టం వచ్చిన రీతిగా అగుచున్నాడు. పొందుచున్నాడు. అనుభవించు చున్నాడు. |
| **స యథా మహారాజో**<br>**జానపదాన్ గృహీత్వా**<br>**స్వే జనపదే యథా కామం**<br>**పరివర్తత।** | ఏ విధంగా అయితే ఒక మహారాజు రాజ్యమంతా తన ఆధీనములో ఉంచుకొని తన సామ్రాజ్యములో తానే యధేచ్ఛగా అధికారయుక్తంగా (ఇష్టం వచ్చినట్లు) సంచరిస్తాడో, అట్లాగే, **స్వప్న ద్రష్ట తనయొక్క స్వకీయ కల్పిత స్వప్నసామ్రాజ్యంలో చరిస్తున్నాడు.** |
| **ఏవం ఏవ ఏష**<br>**ఏతత్ ప్రాణాన్**<br>**గృహీత్వా స్వే శరీరే**<br>**యథా కామం పరివర్తతే।** | ఈ విధంగా జాగ్రత్‌లో ఉన్నప్పటి బాహ్యేంద్రియ అనుభవములన్నీ ఉపసంహరించుకొని, అంతర హృదయములో ఈ జాగ్రత్ వంటి జగత్తునే కల్పనచే స్వప్నముగా కల్పించుకొనుచున్నాడు. జాగ్రత్ దృష్ట్యా తెలిసీ తెలియని అనేక విషయములను స్వప్నసీమలో కల్పించుకొని అనుభవములుగా పొందుచున్నాడు. స్వప్న సమయంలో కనిపించేదంతా ఆ సమయంలో జాగ్రదనుభవములాగానే **"నాపట్ల ఇదియే సత్యము"** - అని తలచియే అనుభవిస్తున్నాడు. (ఈ జాగ్రత్ కూడా అట్టి స్వకీయ కల్పనా విషయ సామ్రాజ్యము వంటిదే). |
| **19 అథ, యదా సుషుప్తో భవతి,**<br>**యదా న కస్యచ న వేద।**<br>**'హితా' నామ నాడ్యో ద్వాసప్తతి**<br>**సహస్రాణి (72,000) హృదయాత్**<br>**పురీతతమ్ అభి ప్రతిష్ఠన్తే।**<br>**తాభిః ప్రతి అవసృప్య (ప్రత్యవసృప్య)**<br>**పురీతతి శేతే।** | ఇక ఆ స్వప్నదశ నుండి ఈ జీవుడు జాగ్రత్-స్వప్న అనుభవ రహితమగు సుషుప్తిలో ప్రవేశించుచున్నాడు. అప్పుడేమౌతోంది? ఆతని సుషుప్తి అనుభవములో ఏదీ తెలుసుకోవటము లేదు. కానీ ప్రజ్ఞ ఉన్నది। అట్టి తెలివి (తెలియబడేదేదీ ఆస్వాదించక) కేవలీస్వరూపమై ఉన్నది.<br><br>''హిత'' అని పిలువబడే '72000'నాడులు హృదయము నుండి (హృదయాకాశము నుండి) నుండి దేహములో మూలమూలలకు విస్తరించి ఉన్నాయి. వాటి ద్వారా వెనుకకు వెడలి ఈ దేహధారి (జీవుడు) హృదయములో మౌనము వహించి సుషుప్తిని ఆశ్రయించి నిదురిస్తున్నాడు. ఆతడు నిదురించు హృదయాంతర్గత ప్రదేశమును **'పురీతతి'** అని అంటారు. ఆ పురీతతి యందు నిర్విషయుడై విశ్రాంతి తీసుకుంటున్నాడు. |
| **స యథా కుమారో వా మహారాజో వా**<br>**మహా బ్రాహ్మణో వా (అ)తిఘ్నీమ్**<br>**ఆనన్దస్య గత్వా**<br>**శయీతైవం ఏవైష ఏతచ్ఛేతే॥** | ఏ విషయవాసనలూ లేకయే - కొన్ని సందర్భాలలో ఒక బాలుడు, ఒక మహారాజు, ఆత్మజ్ఞానము గల ఒక మహాబ్రాహ్మణుడు.. ఆనంద స్థితిని పొందియుండు రీతిగా, ఈ జీవుడు కూడా **"విజ్ఞానమయ - నిర్విషయ పురుషుడై"** ప్రశాంతముగా నిదురిస్తున్నాడు. జాగ్రత్ స్వప్న సంస్కారములు అవ్యక్తరూపముగా కలిగియే, సుషుప్తియందు నిర్విషయ - మౌన రూప విశ్రాంతిని ఆస్వాదిస్తున్నాడు. |

**20 స యథా ఊర్ణనాభిః తన్తున్ ఉచ్చరేత్,**
**యథా అగ్నేః, క్షుద్రా విస్ఫులింగాపి ఉచ్చరన్తి,**
**ఏవం ఏవ అస్మాత్ ఆత్మనః సర్వే ప్రాణాః,**
**సర్వే లోకాః, సర్వే దేవాః,**
**సర్వాణి భూతాని ఉచ్చరన్తి।**
**తస్య ఉపనిషత్ సత్యస్య,**
**సత్యమితి, ప్రాణా వై సత్యం।**
**తేషాం ఏష సత్యం।**

***ఇతి బృహదారణ్యకోపనిషత్***
***చతుర్థ అధ్యాయో ప్రథమ బ్రాహ్మణము –***
***అజాత శత్రు బ్రాహ్మణము సమాప్తము.***

దృష్టాంతానికి :

- ఒక సాలెపురుగు తన దేహము నుండి తంతువులను బయటకు వెడలదీయు విధంగాను,
- అగ్ని నుండి అనేక చిన్న విస్ఫులింగములు (మిణిగురులు) నలువైపులా బయటకు వచ్చు విధంగాను,

**(ఆ విధంగా) ఆత్మ నుండియే**

- జాగ్రత్ స్వప్నసుషుప్తులు
- సకల ప్రాణులు,
- సకల లోకాలు,
- సర్వ దేవతలు,
- సర్వజీవులు అనేక రూప-గుణ-నామాలుగా→

"ఉచ్ఛరంతి"। ఉత్పన్నమై బయల్వెడలుచున్నాయి.

**సర్వప్రాణుల యొక్క పరమ సత్యస్వరూపము ఆత్మయే।** జీవులందరు ఉన్నది ఆత్మయందే!

జీవులందరు సర్వదా ఆత్మగానే ఉన్నారు.

- ప్రాణతత్త్వమే సత్యము।
- దానికి ఆధారమగు ఆత్మయే ప్రాణేశ్వర-ప్రాణశక్తిరూపముగా అగుపిస్తోంది.

ఉన్నసత్యము ఇంతే। మిగతాదంతా కల్పన. నాటకంలోని పాత్రల మధ్య గల సంబంధ కల్పన వంటిదే. ఇతి సత్యమ్।

***ఇతి బృహదారణ్యకోపనిషత్***
***చతుర్థ అధ్యాయో ప్రథమ బ్రాహ్మణము***
***అజాత శత్రు బ్రాహ్మణము సమాప్తము.***

# బృహదారణ్యకోపనిషత్ - చతుర్థాధ్యాయః - ద్వితీయం బ్రాహ్మణమ్

## శిశు బ్రాహ్మణము

### శిశు బ్రాహ్మణము

1) యో హ వై శిశుగ్ం
సాధానగ్ం, స ప్రత్యాధానగ్ం,
స స్థూణగ్ం, స దామం, వేద సప్త హ ద్విషతో,
భ్రాతృ వ్యానవరుణద్ధి। అయం వావ శిశుర్యో,

### శిశుబ్రాహ్మణము

ఎవ్వరైతే సావధాన చిత్తులై ఆధానము - ప్రత్యాధానము - స్థూణము - దామములతో కూడిన్నట్టి ఒకానొక 'శిశువు' గురించి నిశ్చయముగా తెలుసుకుంటారో, అట్టివారు - తమను బాధించు, ద్వేషించు ఏడుగురు సోదరపుత్రులతో సమానమైన శత్రువులను జయించివేయగలరు. అవి ఏమిటో వివరించబడుచున్నాయి.

---

అయం మధ్యమః ప్రాణః।
తస్య ఇదం ఏవ అధానం ఇదం ప్రత్యాధానం –
– ప్రాణః – స్థూణాన్నం
దామ।।

**శిశువు** → ఈ శరీరమునందు వర్తిస్తున్న **ముఖ్య ప్రాణము.** తానుగా ఏమీ తెలుసుకోదు. కాబట్టి - **శిశువు.**

**ఆధార(న)ము**→ ఈ శరీరమ్ (ప్రాణమునకు ఆధారము).

**ప్రత్యాధానము** : ఈ శరీరము - శిరస్సునందు వానివాని స్వరూపము కలిగి ఉన్నట్టి **జ్ఞానేంద్రియములు.** ఇవి ప్రాణము యొక్క ప్రత్యాధానము.

**స్థూనము / స్తంభము : ప్రాణశక్తియే** ఈ దేహములోని స్థంభము. స్థంభము ఆధారముగా కలిగి ఉన్న శిశువు వలె ప్రాణశక్తి ఈ శరీరమున ఉన్నది.

**బంధనము / దామము = అన్నము:** పంచేంద్రియములలో ఒక్కొక్క ఇంద్రియము యొక్క అద్దాని విషయానుభవములే **'అన్నము'.**

**శత్రువులు:** బాధించు శత్రువులు = ఇంద్రియానుభవములు
బాధించని శత్రువులు = ఇంద్రియములు, కల్పితములపట్ల ధ్యాసలు

---

2 తమ్ ఏతాః సప్తాక్షితయ ఉపతిష్ఠన్తే,
తద్యా ఇమా అక్షన్ లోహిన్యో రాజయస్తాభిః।
ఏనగ్ం –
(1) రుద్రో అన్వాయత్తో।
(2) అథ యా అక్షన్నాపస్తాభిః పర్జన్యోయా।
(3) (యా) కనీనికా, తయ ఆదిత్యో।
(4) యత్ కృష్ణం తేన అగ్నిః।
(5) యత్ శుక్లం తేన ఇంద్రో।
(6) (అ)ధరయైనం వర్తన్యా పృథివి అన్వాయత్తా।
(7) ద్యౌః ఉత్తరయా
న అస్య అన్నం క్షీయతే, య ఏవం వేద।

ఆ (ప్రాణ) శిశువును '7' అక్షయ కారణములగు దేవతలు స్తుతిస్తున్నారు. వారు **సప్తాక్షితులు** (సప్తాక్షితయ).

ఆ శిశువు = ఈ స్థూల దేహములో ప్రతిష్ఠితమైయున్న, అన్నముచే (అనుభవించబడుచున్నది, చూడబడుచున్నదిలచే) కట్టివేయబడుచున్న ఇంద్రియ ప్రదర్శితరూపమైన ముఖ్య ప్రాణము.

సప్తాక్షితులు = అక్షితులు = అక్షయముగా (క్షీణము లేని వారుగా) ఉండటంచేత 'అక్షితులు'.

ఆ సప్తాక్షితులు కంటిలో ఉండి ప్రాణదేవతా రూపమగు చూపును సేవిస్తున్నారు. ప్రాణదేవత యొక్క - సుషుప్త్యవస్థ నుండి బయల్వెడలి జాగ్రత్ స్థానములో చేరిన - ప్రాణ శిశువును సేవిస్తూ ఉన్న సప్తదేవతలను వివరించుకుంటున్నాము.

(1) మొదటి అక్షిత దేవత : "రుద్రుడు"→ కంటి యందు రక్తరేఖ రూపమును పొంది శరీరము మధ్యమున ఉన్న ప్రాణమును అధిరోహించి ఉంటున్నారు.

(2) రెండవ అక్షితదేవత 'పర్జన్యుడు" : → ఈ పర్జన్య అక్షిత దేవత కంటియందు ఉంటూ, జల స్వరూపుడై కంటిలో ప్రవేశించే దుమ్ము -

పొగ మొదలైనవాటిని (సమస్త కాలుష్యమును) బయటకు వెడలగొట్టుచూ ప్రాణశిశువును సేవిస్తూ ఉన్నారు. ఉపాసిస్తూ ఉన్నారు.

**(3) '3'వ అక్షత దేవత = 'ఆదిత్యుడు' (సూర్యుడు).**

నల్లగ్రుడ్డులో చూచే శక్తి రూపముగా ప్రాణశిశువును సేవిస్తున్నారు.

**(4)** నాల్గవ అక్షరదేవత అగ్ని : కంటిలోని "ధూమ" (నలుపు) రూపుడై అగ్ని దేవత ప్రాణ శిశువుకు సేవలు అందిస్తున్నారు.

**(5) ఐదవ అక్షత దేవత "ఇంద్రుడు"** : కంటిలోని ఏ తెలుపుగలదో, అద్దాని ద్వారా ఇంద్రుడు దేహమున గల మధ్య ప్రాణశిశువును లాలిస్తున్నారు.

**(6) ఆరవ అక్షయ దేవత "పృథివి":** పృథివీ, అక్షిత దేవత 'క్రింద కనురెప్ప' అయి ప్రాణ శిశువును ఉపాసించుచున్నారు. అనుసరిస్తూ సేవించు చున్నారు.

**(7) ఆరవ అక్షత దేవత "అంతరిక్షము"** : కంటి యొక్క పై రెప్ప రూపముగా ప్రాణ శిశువును సేవించుచున్నారు.

ప్రాణమునకు భోగ్యములు (అన్నము)గా ఉంటూ సేవించుచున్న ఈ ఏడు (7)గురు దేవతల ఉనికిని కంటిలో గమనించి ఎవ్వరైతే ఉపాసిస్తారో, వారి అన్నము (చూపు అనుభవము) క్షయము కాదు. వ్యర్థము కాదు.

---

3 **తత్ ఏష శ్లోకో భవతి।**
**అర్వాః బిలశ్చమస ఊర్ధ్వ బుధ్నః।**
**తస్మిన్ యశో నిహితం విశ్వరూపం।**

**ఇంకా ఇట్లా గానం చేయిబడుచున్నది.**

ఒక అర్వాకబిలము (యజ్ఞములో ఉపయోగించే చతురస్రంగా చేసే చెక్కతో చేసే యజ్ఞ-పాత్ర). (ఆ ఆర్వాకపాత్రకు క్రింద వైపు నోరు అనే బిలము), పైన మట్టు (దవడలు). (జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయముల) ప్రతీకయే యజ్ఞములో ఉపయోగించే చమసపాత్ర.

ఆ పాత్ర యందు ఈ 'విశ్వము' రూపమంతా యశస్సు అయి ఉన్నది. చమస (లేక) చెక్క పాత్రలో సోమరసమున్నట్లుగా, 'నోరు' అనే పాత్రలో విశ్వమంతా ఉన్నది.

---

**తస్య అసత ఋషయః సప్త।**

ఆ చమస పాత్రను : → **సప్తఋషులు** ఆశ్రయించి ఉన్నారు. వారు రెండు కన్నులు, రెండు చెవులు, ముక్కు, నోరు, నాలుకకు సంబంధజంచిన సప్త వాయు మరుత్తు రూపములు. సప్త వ్యాహృతులు.

---

**తీరే "వాక్" అష్టమీ!**
**బ్రహ్మణా సంవిదాన ఇతి।**
**అర్వాక్ బిలశ్చ 'మనః'।**
**ఊర్ధ్వ బుధ్నః।**

వాక్కు వేదము ద్వారా (బ్రహ్మమును) సంవిదానము చేస్తూ ఎనిమిదవది అగుచున్నది.

**బ్రహ్మ పలికిన ఆ వాక్కే ఎనిమిదవది.**

క్రింద వైపు నోరు- పైపైపుగా మట్టు ఉండే చమసపాత్ర (చెక్క పాత్ర) అంటే? - ఈ శిరస్సే!

---

**తస్మిన్ యశో నిహితం విశ్వరూపం-ఇతి।**
**ప్రాణా వై యశో నిహితం।**
**విశ్వరూపం ప్రాణాన్ ఏతదాహ (ఏతత్ ఆహ)**
**తస్యా సత ఋషయః**
**సప్త తీర ఇతి ప్రాణా వా ఋషయః।**

అందులో యశస్సు = చమసపాత్రలో సోవరసము వలె శిరస్సులో పంచజ్ఞానేంద్రియరూపములైన యశస్సు- పంచేంద్రియములు. అనగా కన్నులు, చెవులు, ముక్కు, నోరు, నాలుక - జ్ఞానేంద్రియ సామర్థ్యములు, విషయానుభవములే యశస్సు. ప్రాణమే యశసుగా నిహితము (ఉంచ బడినది). ఈ విశ్వము యొక్క రూపము ప్రాణశక్తియే।

ప్రాణాన్ ఏతదాహ।
వాక్ అష్టమీ।

**ఆ పంచజ్ఞానేంద్రియములు,** మనన రూపమగు (మననాత్ త్రాయతే) **మనస్సు, బుద్ధి** (బృహస్పతి)- ఇవియే సప్తఋషుల వర్తనములు. ప్రాణమే- సమస్త ఋషుల రూపము. ఎనిమిదవది = వాక్.

---

బ్రహ్మణా సంవిదాన
ఇతి వాగ్ఘ్యష్టమీ బ్రహ్మణా
సంవిధత్తే।

ప్రాణములే (పంచ ప్రాణములు) విశ్వరూపమైన **యశస్సు.**

శిరస్సులో వినికిడి - చూపు, శిరస్సులో వాసన - రుచి - స్పర్శ- శబ్దము చిత్తము. **ఈ ఏడు వాయువుల విస్తరణ వ్యాపారములు.**

వీటన్నిటినీ కలిపితే **'యశస్సు'** అనే మననరూప మంత్రము అగుచున్నది.

పాత్ర సమీపములో '7'గురు ఋషులే పై '7' కూడా. వాక్కు→ 8వది వాగింద్రియము, తినుట కూడా చేయుచున్నది. (పలుకుచున్న) మంత్రమును ఉచ్చరించుచున్నది. 'వేదము' ద్వారా సంవిదానము చేయుచున్నది. **అందుచేత వాగింద్రియము '8'వది అగుచున్నది.**

---

4 ఇమా వేవ గౌతమ।
భరద్వాజ అవయమేవ।
గౌతమో అయం
భరద్వాజ।
ఇమా వేవ విశ్వామిత్ర
జమదగ్నీ। అయమేవ
విశ్వామిత్రో అయం జమదగ్నిః
ఇమావేవ వసిష్ఠ
కశ్యపావయమేవ।
వసిష్ఠో అయం కశ్యపో।
వాగేవ అత్రిః।
వాచా హి 'అన్నమ్' అద్యతే।। (అన్నమద్యతే)
అత్తిః హవై నామై
తత్ యత్ అత్రిః ఇతి।
సర్వస్యాత్తా భవతి।
సర్వమ్ అస్య అన్నం భవతి–
య ఏవం వేద।
= ఇతి శిశు బ్రాహ్మణమ్ =

ఇతి – తృతీయ అధ్యాయః।
తృతీయ బ్రాహ్మణమ్।।

యజ్ఞములో సోమపానము చేయు సోమపాత్ర వంటి ఈ 'శిరస్సు' యొక్క సమీపమున ఉన్న సప్తర్షులు :

దక్షిణపు (కుడి) చెవి → గౌతమఋషి.
ఉత్తరపు (ఎడమ) చెవి → భరద్వాజ ఋషి.
దక్షిణ (కుడి) నేత్రము → విశ్వామిత్ర మహర్షి.
ఉత్తరపు (ఎడమ) నేత్రము → జమదగ్ని మహర్షి.
దక్షిణపు (కుడిముక్కు) పుట → వసిష్ఠ మహర్షి.
ఉత్తర (ఎడమ) పుట నాసా (ముక్కు) → కస్యప మహర్షి.
వాక్కుయే → అన్నము.
అనుభవమైయ్యేదంతా అన్నమే.
అనుభవమైయ్యేదంతా అత్రి ఋషియే!
**ఈ విధంగా అత్తిః హవై నామై తత్ యత్ అత్తిః।**
వాక్ ఇంద్రియము ద్వారా అన్నము తినబడుతోంది కదా!
అది అత్రి అని చెప్పబడుచున్నది
అనుభవరూపముగా ఉన్నదంతా 'అత్తి' (All being experienced)యే।

ప్రాణమే అంతా ఆస్వాదిస్తున్నది. అందుచేత ప్రాణమే అత్తి. అనుభవి (Experiencer) గూఢముగా 'అత్రి' అని కూడా పిలువబడుచున్నది. ప్రాణమునకు గల 'అత్రి' అనే పేరుతో అద్దాని అత్తి (Experiencing) (ఆవలి, సర్వాధార) తత్త్వము ఎవ్వడు గమనించి, దర్శిస్తూ ఉపాసిస్తాడో, ఆతడు ఈ సకలము (ఆత్మస్వరూపుడై) ఆస్వాదించువాడగుచున్నాడు. ఆతడు సర్వదా భోక్తభావమే పొందుతాడు. అంతేగాని భోగ్య (Iam being consumed by some body) భావమునకు పరిమితుడై ఉండడు.

**ప్రాణతత్త్వమే తానగుచున్నాడు.**

**ఇతి శిశు బ్రాహ్మణము సమాప్తమ్।**

**'3'వ అధ్యాయము - '3'వ బ్రాహ్మణము సమాప్తము**

# బృహదారణ్యకోపనిషత్ - చతుర్థాధ్యాయః - తృతీయం బ్రాహ్మణమ్

## మూర్తామూర్త బ్రాహ్మణము

1 ద్వే వావ బ్రహ్మణో రూపే।
'మూర్తం' చ వా, 'అమూర్తం' చ।
మర్త్యం' చ। 'అమృతం' చ; 'స్థితం' చ యత్ చ।
'సత్' చ, 'త్యత్' చ;॥

మూర్తం – అమూర్తం।
మర్త్యం – అమృతం।
స్థితం – యత్।
సత్ – త్యత్।

**పరబ్రహ్మమునకు రెండు రూపములు ఉన్నాయి.**

(1) మూర్తము - మార్పు చెందునది (2) అమూర్తము-మార్పు చెందనిది.

| | |
|---|---|
| మూర్తము (సాకారము) | అమూర్తము. (నిరాకారము). |
| మర్త్యము (నాషన సహితము) | అమర్త్యము (నాశన రహితము). |
| మృతధర్మము గలది | అమృతధర్మము గలది |

యత్ = కదిలేది. స్థితమ్ = కదలనిది (లేక) కదిలించేది.

ఈ జంటలన్నీ పంచభూతముల సంబంధము కలిగియున్నప్పటికీ - కూడా బ్రహ్మ యొక్క (సృష్టికర్త) యొక్క ద్విరూపములు.

**(1) మూర్తము** → కార్యకారణ సంఘాతము నుండి పుట్టిన వాసనలే రూపముగా కలిగియున్నట్టిది.

**(2) అమూర్తము** : సర్వజ్ఞము, "మాయ"ను తన ఉపాధిగా కలిగియున్నట్టి - బ్రహ్మము.

మార్పు చెందు బ్రహ్మము - మార్పు చెందని బ్రహ్మము.. అని రెండూ బ్రహ్మముగానే చెప్పబడుచున్నాయి. బ్రహ్మము సర్వదా ఏకము, సమస్తము కూడా।

---

**<u>తదేతత్ మూర్తం।</u>**

2 తత్, <u>ఏతత్ మూర్తం</u>
యత్ అన్యత్ వాయోశ్చ
అన్తరిక్షాత్ చ, స ఏతన్ మర్త్యమ్
ఏతత్ స్థితమ్, ఏతత్ సత్–తస్యై।
తస్య మూర్తస్య। ఏతస్య మర్త్యస్య।
ఏతస్య స్థితస్య।
ఏతస్య సత। ఏష రసో।
య ఏష తపతి, సతో హి ఏష రసః॥

అట్టి మూర్త-అమూర్తముల రెండింటిలో..,

**"మూర్త రూపము" = అమూర్తమగు వాయు ఆకాశముల కంటే వేరైనట్టి**

(1) భూమి (2) జలము (3) తేజస్సు (అగ్ని)

అవయము - సాకారముగా అయి ఉన్నప్పుడు మరణ (మార్పు) ధర్మము కలదియు, అవధి (End) కలదియు, ప్రత్యక్షముగా కనిపిస్తున్నదియు- అయి ఉన్నట్టిది. ఈ విధంగా ఆకారము కలిగి ఉన్నటిది, మరణ ధర్మము కలిగియున్నది, అవధులు (Limitations) కలిగి ఉన్నట్టిది. ప్రత్యక్షమై యున్నట్టిది అగు పృథివి, ఆపః, తేజములు ఈ లోకములను తపింప జేయుచున్న సూర్యమండలము నుండి ప్రభవములు.

- భూతతత్త్వమును ఆ మూడు విధములుగా చేయుచున్నది సూర్యమండల తేజస్సే!

ఏషః తపతి - అది తపింపజేయుచున్నది.

ఏది తపింపచేయుచున్నదో - అదియే రసస్వరూపము।

సూర్యమండలము తేజో రస స్వరూపమే।

---

**<u>తదేతత్ అమూర్తం।</u>**

3 <u>అథ అమూర్తం।</u> 'వాయు' శ్చ। 'అన్తరిక్షం' చ।
ఏతత్ 'అమృతం'।
ఏతత్ 'యది'। ఏతత్ 'యత్'।
తస్య, ఏతస్య అమూర్తస్య,
ఏతస్య అమృతస్య, ఏతస్య 'యత'।

**<u>ఇక అమూర్తము</u>**

(1) వాయువు (శ్వాస), (2) అంతరిక్షము (Space- ఆకాశము)

పంచభూతములలోని ఈ రెండూ రూపరహితము. సాకారము కాదు. కనుక అమృతము. ఇవి ఆకార రహితము. ఒక వస్తువుకు ఆకారమే లేనప్పుడు మరణ (మార్పు) ధర్మము లేదు. తక్కిన భూ-జల-అగ్నులవలె మార్పు-చేర్పులు ఉండవు.

## అధిదైవతమ్

ఏతస్య త్యస్య
ఏష రసోయ।
ఏష ఏతస్మిన్ మండలే పురుషః।
తస్య హి ఏష రస ఇతి 'అధిదైవతమ్'।

→ మరణ, రూపధర్మములు లేవు కాబట్టి వాయు, ఆకాశములు అనంతమై చెన్నొందుచున్నాయి. సర్వవ్యాపకములుగా ఉంటున్నాయి.

- సర్వ వ్యాకము కాబట్టి అదృశ్య రూపమై ఉంటున్నాయి.

- **యత్** - ఏ వాయు, అంతరిక్ష మండల పురుషుడు ఉన్నారో, ... ఆయన **'త్యత్'** - అధిదైవత పురుషుడు.

- వాయు - అంతరిక్షములు దేశ - కాలములకు బద్ధము కానివి.

త్యత్ = కంటికి కనిపించనట్టి విలక్షణత్వము.

హిరణ్యగర్భ పురుషుని సలక్షణ-విలక్షణములే పంచభూతముల మూర్త-అమూర్తములుగా ప్రదర్శనమగుచున్నాయి.

---

## అధ్యాత్మమ్

4 **అథ ఆధ్యాత్మం।**
'ఇదం' ఏవ మూర్తం,
'యత్' అన్యత్ ప్రాణాచ్చ
'యత్' చ అయమ్ అంతరాత్మన్
ఆకాశ ఏతత్ మర్త్యం
ఏతత్ 'స్థితం'। ఏతత్ సత్।
'తస్య' ఏతస్య మూర్తస్య।
ఏతస్య మర్త్యస్య।
ఏతస్య స్థితస్య। ఏతస్య సత।
ఏష రసో। యత్ చక్షుః।
సతో హి ఏష రసః॥

## మూర్తము - భౌతికశరీరము (స్థూల శరీరము)

***ఇప్పుడిక అధ్యాత్మము గురించి:***

వాయువు కంటే కూడా వేరై దేహమునందు 'ఆకాశము' ఉన్నది. అట్టి ఆకాశము కంటే భిన్నమైనది **అమూర్తము, అధ్యాత్మము.**

అట్టి అధ్యాత్మము ప్రాణముల కంటే కూడా భిన్నమైనది.

అంతరాత్మాకాశము నందే మూర్తివంతమగు ఈ సమస్త జగత్తు ప్రదర్శితమై ఉంటోంది. అట్టి జగత్తు స్థితిగల స్థానమే 'సత్'।

- అట్టి మూర్తీ (With form) స్వరూపములగు, మరణ ధర్మము (మార్పుచెందుస్వభావము, పరిచ్ఛేద (Multiple) స్వభావము) గలిగినట్టి పృథివి-ఆపః - తేజో (Solid-Liquid-fire) స్వరూపముల సారమే (స్వరూపమే) ఈ భౌతికమైన కళ్లు. అనగా, - ఈదేహమునందలి భౌతిక నేత్రములు.. అధ్యాత్మమునందు త్రిభూతముల (పృథివి, జలము, అగ్నిల) యొక్క సమ్మేళనమే ప్రదర్శనమౌతోంది.

- సూర్యమండలమే అధి దైవతమునందు **భూతత్రయసారము.**

| |
|---|
| స్థూల శరీరము = భూమి + జలము + అగ్ని |
| అధ్యాత్మయే భూతత్రయ స్వరూపపురుష నివాసుడు. |

---

## అమూర్తం

5 **అథ అమూర్తం।**
ప్రాణశ్చ 'యత్' చ, అయం అంతరాత్మన్,
ఆ (నా)కాశ ఏతత్ అమృతం।
ఏతత్ 'యది'। ఏతత్ 'త్యత్'।
తస్య ఏతస్య అమూర్తస్య।
(తత్) ఏతస్య అమృతస్య।
ఏతస్య 'యత'। ఏతస్య త్యస్య ।
ఏష రసో యో అయం దక్షిణే అక్షన్
పురుషః తస్య హి ఏష రసః॥

## అమూర్తము - లింగశరీరము

ఈ దేహములో (1) ప్రాణము (Energy) (2) ఆకాశము (Space).. ఈ రెండూ కూడా అమూర్తములు

- ఈ రెండింటికీ మరణ ధర్మము లేదు.

- ఈ రెండూ సర్వవ్యాపకమైనవి.

- భౌతిక రూపంగా ప్రత్యక్షము కానివి. కళ్ళకు కనిపించనివి.

ఈ విధంగా 'అమూర్తత్వము' అను ధర్మము (Feature)తో కూడిన వాయు + ఆకాశముల యొక్క సారమే **'లింగ శరీరము'.**

అనగా

లింగ శరీరము= (లేక) సూక్ష్మ శరీరము = ప్రాణవాయువు + ఆకాశము.

*'లింగశరీరము'లో దక్షిణ (కుడి) నేత్రములోని పురుషుడు → 'వాయు ఆకాశములు' అనే ఉభయభూతముల సారము. అధ్యాత్మయే భూతద్వయ స్వరూపపురుషుడు. పురుష నివాస స్థానము.*

= 'భూతద్వయ నిర్మిత లింగ శరీరము (భావనా శరీరము)నకు కుడికన్ను అధిష్ఠానము' అని.. శాస్త్రకారుల ప్రత్యక్షానుభవము. లింగశరీరమే **(వాయు-ఆకాశ)** ద్వైభూతసారము.

బ్రహ్మము- మూర్తామూర్తములకు **పరము** (ఆవల), **ఆధారము** కూడా.

- పరబ్రహ్మమునకు మూర్తము (స్థూల శరీరము) - అమూర్తము (సూక్ష్మ శరీరము) **'ఉపాధులు'** అయి ప్రవర్తిస్తున్నాయి.

- స్థూల సూక్ష్మ శరీరములను బ్రహ్మముగా భావించుటచే సర్వే సర్వత్రా బ్రహ్మ భావన సిద్ధించగలదు.

అట్టి వ్రతములలో సూక్ష్మ (లింగ), దేహోపాసన గురించి విధి (Procedure) సూచించబడుతోంది.

---

**6 తస్య హి ఏతస్య పురుషస్య రూపం।**
**యథా మహారజనం వాసో,**
**యథా పాణ్డ్వావికం,**
**యథా ఇన్ద్ర గోపో,**
**యథా అగ్న్యర్చి, యథా పుణ్డరీకం,**
**యథా సకృత్ విద్యుత్తగ్ం,**
**సకృత్ విద్యుత్ ఏవ హ వా**
**అస్య శ్రీః భవతి య ఏవం వేద।**
**అథాత ఆదేశో 'నేతి నేతి'**
**నహి ఏతస్మాత్ ఇతి।**

***ప్రసిద్ధుడగు లింగ శరీరాత్మక పురుషుని యొక్క రూపము ఎట్టిది?***

- లింగ శరీరము వాసన-సంస్కారములతో నిండి ఉన్నట్టిది.

-మూర్త - అమూర్త సంబంధములైన వాసనలతో, బుద్ధియే ప్రధాన ఉపకరణముగా గల భోక్త వాటివాటి సంయోగములతో ప్రవర్తించుచున్నది.

**లింగశరీరము** → వస్త్రముపై వేసిన ఎఱ్ఱటి-పచ్చటి రంగువలె విచిత్రముగా నానాత్వముతో కూడుకొను ఉన్నట్టిది.

**- మాయ** → కల్పన, కపటము, అసత్యములతో కూడినట్టిది. ఇంద్ర జాలమును, ఎండమావులను బోలినట్టిది!

భౌతికదృష్టి పరిమితంగా చూచే వారికి - ఈ లింగ శరీరమే ఆత్మగా తోచుచున్నది.

**"జీవుడనగా స్వభావమే"** - అనే భ్రమను కలిగింపజేయునది,

లింగ శరీరాత్మక (దృశ్య అభిమాని) పురుషుని యొక్క ఉపాసనారూపము.

→ ఎఱ్ఱని వస్త్రము వలెను, తెల్లటి కంబళి వలెను,

- చిమ్మచీకటిలో మెఱయుచున్న మిణుగురు పురుగువలెను,

- అగ్ని జ్వాలవలెను, శుక్లము మెరుపులతోను **ప్రకాసిస్తోంది. వర్ణించ బడుతోంది.**

ఎవడు అట్టి లింగ శరీరము యొక్క పైపూత- పైపై మెఱుపు వంటి తత్త్వమును **- ఆత్మయందు స్వయం కల్పితముగాను, ఆయతనముగాను గ్రహిస్తాడో, అట్టివాని శోభ ప్రసిద్ధమై** సర్వత్రా ప్రకాశించుచున్నది.

**బ్రహ్మము యొక్క ఉపదేశమును మించి మరొకటిది ఏదీ లేదు.**

---

**నేతి అన్యత్ 'పరమ్' అస్తి।**
**అథ నామధేయగ్ం సత్యస్య,**
**సత్యమితి। ప్రాణా వై సత్యం।**
**తేషాం ఏష సత్యమ్॥**

**॥ ఇతి మూర్తామూర్త బ్రాహ్మణమ్॥**
**ఇతి – చతుర్థాధ్యాయః తృతీయ బ్రాహ్మణమ్॥**

'నేతి-నేతి'.. అనే రెండు 'న'కారముల చేతనే పరబ్రహ్మము యొక్క నిర్వచనమంతా చెప్పబడుచున్నది. పరబ్రహ్మము "సత్యమునకు సత్యము"... అని చెప్పబడుతోంది. (నామధేయముతో పిలువబడుతోంది). బ్రహ్మముగా శ్రోత్రింద్రియములు, తదితర ఇంద్రియములు, ప్రాణములు, విజ్ఞానాత్మ, ప్రత్యగాత్మ.. అంతా ఆత్మయే కాబట్టి సత్యస్వరూపమే!

**"ఇతి మూర్తామూర్త బ్రాహ్మణమ్"**

# బృహదారణ్యకోపనిషత్ చతుర్థాధ్యాయః - చతుర్థ బ్రాహ్మణమ్

## మైత్రేయీ బ్రాహ్మణము

1 మైత్రేయి ఇతి హ ఉవాచ యాజ్ఞవల్క్యః :
"ఉద్య అస్యన్ వా
ఆరే అహం అస్మాత్
స్థానాత్ అస్మి। హన్త! తే అనయా
కాత్యాయన్యా అన్తం కరవాణి" ఇతి।

ఒకానొప్పుడు ఒక సంఘటన।

యాజ్ఞవల్క్యమహర్షి తన భార్యయగు మైత్రేయుని పిలిచి ఈ విధంగా అన్నారు.

"ఓ మైత్రేయీ! నేను ఈ గృహస్థాశ్రమమునుండి విరమించి సన్న్యాసాశ్రమమును స్వీకరించదలచుకున్నాను.!

అందుకుగాను నా గృహస్థాశ్రమములోని అర్ధాంగిగా, భాగస్వామిగా నీ యొక్క అనుమతిని కోరుచున్నాను.

నా యొక్క రెండవ భార్య అగు కాత్యాయనికి, నీకు నా సంపదను విభజించి ఇచ్చివేస్తాను. నా వలన మీ ఇరువురికి కలిగిన సవతి సంబంధ బంధమును కూడా త్రెంచివేస్తాను (లేక) తెగత్రెంపులు చేస్తాను. ఆ ధనముతో మీ ఇరువురు మీ మీ జీవితాంతము సంతోషముగా ఉండెదరు గాక!"

మైత్రేయీ దేవి యాజ్ఞవల్క్యుని మాటలు సాదరంగా విన్నది.

---

2 సా హ ఉవాచ మైత్రేయీ :
'యన్ను మ ఇయం భగోః (భోగోః)
సర్వా పృథివీ విత్తేన పూర్ణాస్యాత్
కథం తేన అమృతాస్యాం'?
ఇతి। (నేతి।)।

**మైత్రేయి:** స్వామీ! ప్రాణనాథా! భగవాన్! మీరు ధనమును విభజించి మాకు ఇస్తామన్నారు. సంతోషమే. అయితే, సప్త సముద్రాలతో అలవాలమైన ఈ భూమినంతా ఇస్తేకూడా అదంతా పొంది నేను ముక్తురాలను అవుతానా? పూర్ణత్వము పొందగలనా? **"పొందవలసినదేదైతే ఉన్నదో, అదంతా పొందాను" - అనే తృప్తి నాకు లభిస్తుందా? నేను అమృతత్వమును పొందుతానని మీరు భావిస్తున్నారా?**

---

(నేతి) హ ఉవాచ యాజ్ఞవల్క్యో :
యథైవ ఉపకరణవతాం జీవితం।
తథైవ తే జీవితగ్ంస్యాత్
అమృతత్వస్య తు
నాశాస్తి విత్తే నేతి।

**యాజ్ఞవల్క్యుడు** : లేదు. ధనముచే మోక్షము, అమృతత్వము పొందలేవు. అయితే లోకంలో సమస్త సంపద - సాధనములు కలవారు ఎటువంటి సుఖ జీవితము అనుభవించగలరో, అదంతా నీకు సిద్ధించగలదు. "భోగసంపదలు" - అనే ఉపకరణాలతో భౌతికంగా సుఖము లభిస్తుందేమో. అంతవరకే। విత్తము వలన, తదితర సంపదల వలన అమృతత్వము లభిస్తుందన్న ఆశయే పెట్టుకోవద్దు. ధనము చేత మోక్షము యొక్క ఊసుకూడా ఊహించటానికి కుదరదు.

---

3. సా హ ఉవాచ మైత్రేయీ :
"యేన అహం న అమృతాస్యాం
కిం అహం తేన కుర్యాం?
యత్ ఏవ, -
భగవాన్! వేద,
తదేవ మే బ్రూహి" ఇతి॥

**మైత్రేయి** : దేనిచే అమరత్వము లభించుట లేదో, అట్టి సంపదలు నాకెందుకు?

హే ప్రాణేశ్వరా! యాజ్ఞవల్క్య మహర్షీ! మహానుభావన్! ఏ ధనము, సంపదలచే నాకు శాశ్వత సుఖమగు మోక్షము లభించదో, అట్టి పైపై మెరుగుల వంటి వాటి వలన నాకేమీ ప్రయోజనము కనిపించటల్లేదు స్వామీ!

అందుచేత మహాత్మా! పరమ పూజ్యులగు మీరు ఎద్దానిని ముక్తి సాధనముగా ఎంచి గృహము నుండి సన్న్యసించాలనుకొంటున్నారో, అట్టి

| | | |
|---|---|---|
| | | సన్న్యాసమార్గమును నేను కూడా అనుసరించునట్లు అనుగ్రహించండి. ఆ మార్గము నాకు కూడా చూపండి. **అమృతస్థానము కొరకై నాకు ఏది బోధించాలో - అది ఇప్పటికిప్పుడే నాపై దయతో బోధించండి.** |
| 4 | స హ ఉవాచ యాజ్ఞవల్క్యః<br>ప్రియా బతారే నః<br>సతీ ప్రియం భాషస<br>ఏహ్యాః స్వ వ్యాఖ్యాస్యామి,<br>తే వ్యాచక్షాణస్య తు<br>మే నిదిధ్యాసస్వ ఇతి॥ | **యాజ్ఞవల్క్యుడు :** ఓ మైత్రేయీదేవీ! నీవు అట్లా పలకటము నాకు చాలా సంతోషమును కలుగజేస్తోంది. ఇతః పూర్వము నాకు నీవు ఎంతగా నీ అణకువ- ప్రేమ- సేవలచే నాకు ఇష్టురాలవైనావో, అదేవిధంగా ఇప్పుడు కూడా ఈ విధముగా అమృతత్వమును ఆశయముగా పలుకుటచే ప్రేమాస్పదురాలవగుచున్నావు. ఇటు వచ్చి కూర్చొనుము. **నీవు అభిలషించిన తీరుగా మోక్ష సాధనము అగు బ్రహ్మజ్ఞానము గురించి చెప్పుకుందాము.** నేను చెప్పు విశేషముల పట్ల నిదిధ్యాస కలదానవై, అట్టి వాక్యార్థములను ధ్యానించుచు, అట్టి స్థానమును చేరెదవుగాక! |
| 5 | స హ ఉవాచ :<br>న వా అరే పత్యుః కామాయ<br>పతిః ప్రియో భవతి।<br>ఆత్మనస్తు కామాయ<br>పతిః ప్రియో భవతి। | ఈ జీవునికి కనిపించే ప్రియమైన వస్తువులు ఏమేమి? భార్య, భర్త, సంపద, సంతానము.. మొదలైనవి కదా! అట్టి 'ప్రియత్వము' గురించి ఇప్పుడు కొంచెము విచారణ చేద్దాము.<br>- ఒక స్త్రీకి తన భర్త ప్రియమైన వస్తువుగా ఉంటున్నాడు. ఎందుకు? భర్తయొక్క శరీరములో ప్రత్యేకత చేతనా? లేక, భర్తయొక్క సుఖ-సంతోషాల కొరకా? కానే కాదు. ఆత్మకు 'భర్త' అనునది ప్రియము. కాబట్టి ఇక్కడ భర్త ప్రియముగా అనుభూతమగుచున్నాడు. |
| | న వా అరే జాయాయై<br>కామాయ జాయా ప్రియా భవతి।<br>ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి। | ఒకనికి భార్య ప్రియమైన వస్తువు అగుచున్నది. అది ఆ భార్య యొక్క ప్రయోజనము కొరకా? కాదు. ఆత్మకు "భార్యను కోరుకొనుట" అనునది ప్రియము. అయినప్పుడే సందర్భానుసారముగా భర్తకు భార్య ప్రియమైన వస్తువుగా అనుభవమవటం లోకంలో జరుగుచున్నది. |
| | న వా అరే పుత్రాణాం<br>కామాయ పుత్రాః ప్రియా భవన్తి।<br>ఆత్మనస్తు కామాయ<br>పుత్రాః ప్రియా భవన్తి॥ | అట్లాగే సంతానములోని ఏదో ప్రత్యేకత చేతనో (లేక) వారి యొక్క ప్రయోజనము కొరకై సంతానము ప్రియము అవటంలేదు. మరి?<br>ఆత్మ 'సంతానము కోరుకొనుట' అను ప్రియత్వము - కలిగి ఉండటము చేత, ఆత్మకు సంతానము ప్రియముగా అగుచున్నది. అట్లా కనిపించుచున్నది. అనిపించుచున్నది. |
| | న వా అరే విత్తస్య కామాయ<br>విత్తం ప్రియం భవతి।<br>ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి। | విత్తము (ధనము) యొక్క ప్రయోజనము కొరకై విత్తము (ధనము) ప్రియముగా ఉండటము లేదు. మరి? ఆత్మ యొక్క అభిలాషచే "విత్తము నాకు ప్రియము" అని అనుకోబట్టి, విత్తము ప్రియముగా అనిపించటము జరుగుతోంది. అంతేగాని ధనసంపద స్వయముగా ప్రియమైనది కాదు. |
| | న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవతి।<br>ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి। | బ్రాహ్మణుని యొక్క ప్రయోజనము కొరకై ఒకనికి బ్రాహ్మణుడు ప్రియముగా అవటం లేదు. మరి ఎందుచేతనంటే, ఆత్మకు బ్రాహ్మణుడు ప్రియము అయినప్పుడే ఈ ఎదురుగా గల బ్రాహ్మణుడు ప్రియముగా అనుభూతమగుచున్నాడు. |
| | న వా అరే క్షత్రస్య<br>కామాయ క్షత్రం ప్రియం భవతి।<br>ఆత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి। | క్షత్రియుని ప్రయోజనము కొరకై ఒకనికి క్షత్రియుడు ప్రియము అగుట లేదు. ఆత్మ తన నిమిత్తము క్షత్రియుని ప్రియముగా భావించుచుండటం చేత, ఇక్కడ ఎదురుగా కనిపిస్తున్న క్షత్రియుడు ప్రియముగా పొందబడుచున్నాడు. ఆత్మయొక్క ప్రియముచేత క్షత్రము (కార్యదక్షత) ప్రియము అవుతోంది. |

| | |
|---|---|
| న వా అరే <u>లోకానాం</u><br>కామాయ లోకాః ప్రియా భవన్తి।<br>ఆత్మవస్తు కామాయ లోకాః ప్రియా భవన్తి। | ఈ ఎదురుగా గల లోకముల ప్రయోజనము కొరకై లోకములు ప్రియము అవటంలేదు.<br>ఆత్మకు 'లోకములు' అనునవి కోరుకోవటము ప్రియమైనప్పుడు లోకములు ప్రియరూపములుగా పొందబడుచున్నాయి. |
| న వా అరే <u>దేవానాం</u><br>కామాయ దేవాః ప్రియా భవన్తి।<br>ఆత్మనస్తు కామాయ దేవాః<br>ప్రియా భవన్తి। | దేవతలు ఆ దేవతల ప్రయోజనము కొరకై ప్రియముగా అగుచున్నారా? కానేకాదు. తనకు దేవతలు ప్రియము అయినప్పుడు తన ఆత్మయొక్క ప్రయోజనము కొరకే దేవతలు ప్రియమైనవారుగా అగుచుండటము జరుగుతోంది. |
| న వా అరే <u>భూతానాం</u> కామాయ<br>భూతాని ప్రియాణి భవన్తి।<br>ఆత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి। | (నిశ్చయముగా) సహప్రాణుల ప్రియము కొరకై ప్రాణులు ప్రియము అవటం లేదు. ఆత్మకు సహప్రాణుల పట్ల ప్రియము రూపము పొంది ఉన్నప్పుడు సహప్రాణులు ప్రియమైనవారుగా ప్రియభావన పొందటము ఇక్కడ జరుగుతోంది. |
| న వా అరే <u>సర్వస్య</u><br>కామాయ సర్వం ప్రియం భవతి।<br>ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి। | సర్వమూ కూడా ఆ సర్వము యొక్క ఉపయోగము (లేక) ప్రయోజనము కొరకై ప్రియముగా అవటము లేదు. ఆత్మకు ఈ సర్వము ప్రియముగా అనిపిస్తోంది. అప్పుడిక ఈ సర్వము ప్రియముగా అనిపిస్తోంది. |
| <u>ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో</u><br><u>నిదిధ్యాసితవ్యో, మైత్రేయీ!</u><br>ఆత్మనో వా అరే దర్శనేన<br>శ్రవణేన మత్యా విజ్ఞానేన<br>ఇదగ్ం సర్వం విదితమ్। | సమస్తము ఆత్మకొరకేగాని, అన్యము కొరకు (మరెవరినో ఉద్ధరించటానికి) కాదు. అందుచేత, ఓ మైత్రేయీ! ఆత్మయే దర్శించతగినది, వినతగినది, మననము చేయుతగినది, ధ్యాస కలిగి ఉండవలసినదీ కూడా!<br>అంతేగాని ఆత్మకు అన్యమైనదేదీ స్వతఃగా ప్రియమైనదీ కాదు. సుందరమైనది కాదు.<br>ఓ ప్రియురాలా! |

ఆత్మ యొక్క దర్శనముచే (సర్వము ఆత్మగా దర్శించు అభ్యాసముచే), శ్రవణముచే (వినబడేదంతా ఆత్మవిన్యాసముగా భావించుటచే), ఆత్మను ఎరుగుటచే (ఈ కనబడేదంతా ఆత్మగా ఎరుగుచుండుట చేత).. ఈ సర్వము వాస్తవానికి ఏమై ఉన్నదో తెలిసిపోవుచున్నది.

| | |
|---|---|
| **6** బ్రహ్మ తం పరాత్ ఆదో్య।<br>అస్య అత్ర ఆత్మనో బ్రహ్మ వేద।<br>క్షత్రం, తం పరాత్ ఆదో్య।<br>అన్యత్ర ఆత్మనః క్షత్రం వేద।<br>లోకాస్తం (లోకాః తం) పరా దుర్యో। అన్యత్ర<br>ఆత్మనో లోకాన్ వేద। దేవాస్తం<br>పరాదుర్యో, అన్యత్ర ఆత్మనో దేవాన్ వేద।<br>భూతాని, తం పరాదుర్యో।<br>అన్యత్ర ఆత్మనో భూతాని వేద।<br>సర్వం తం పరాదుర్యో। అన్యత్ర ఆత్మనః<br>సర్వం వేద – ఇదం బ్రహ్మ। ఇదం క్షత్రమ్।<br>ఇమే లోకా। ఇమే దేవా।<br>ఇమాని భూతాని। ఇదగ్ం సర్వం –<br>యత్ అయం ఆత్మా। | అఖండమగు ఆత్మయే బ్రాహ్మణ- క్షత్రియ - వైశ్య - శూద్రాది చాతుర్వర్ణ్యములు గాను, లోకములుగాను, దేవతలుగాను, జీవులుగాను, సమస్తముగాను ఉన్నది. ఎవ్వరైతే బ్రాహ్మణులనుగాని, క్షత్రియులను గాని, వైశ్యులనుగాని, శూద్రులనుగాని, లోకములనుగాని, దేవతలనుగాని, భూతములనుగాని - "ఆత్మకంటే - వేరు" అనే అనుభవముతో చూస్తాడో,.. అట్టి వాడు - (ఎవరిని ఆత్మకు వేరుగా చూస్తే → వారిచే) "అన్యము"గా చూడబడగలడు! ఈ కనబడే పై వివరములతో కూడా **"సర్వము ఆత్మ కంటే వేరు"** - అను పరాభవ (అవమానించు) దృష్టితో చూస్తే, సర్వము చేత ఆతడు పరాభవించబడుచున్నాడు. అనాత్మదృష్టిగానే అనుభవము పొందుచున్నాడు.<br>కనుక **"ఇక్కడ ఎదురుగా కనిపిస్తున్న బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, లోకములు, దేవతలు ఇవన్నీ కూడా, ఆత్మ స్వరూపములే! ఆత్మకు అభిన్నము"** అను భావనతో చూడబడుగాక। దేనిని ఆత్మకు వేరుగా చూస్తావో, అద్దానిచే **"ఓహో! ఈతడు నన్ను** ఆత్మకు వేరుగా చూస్తున్నాడే"…. అని ఆతనిని అది అవమానించుచున్నది. <u>అట్టి దర్శనము 'చ్యుతి', 'అసమాధి' కూడా!</u> |

**7** **స యథా దుందుభేః హ(అ)న్యమానస్య**
**న బాహ్యాఞ్ఛబ్దాన్ (బాహ్యాన్ శబ్దాన్)**
**శక్నుయాత్ గ్రహణాయ,**
**దున్దుభేస్తు గ్రహణేన,**
**దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః॥**

గొప్ప దుందుభి (యుద్ధంలో మ్రోగించే నగారా)ను పెద్దగా మ్రోగిస్తున్నప్పుడు ఇక తదితర శబ్దములు వినపడవు. ఆ దుందుభి యొక్క 'ఢాం' "ఢాంభాం" శబ్దములు వినపడనంతగా తదితరజనుల మాటలు, తదితర వాయిద్యాలు వినబడవుకదా!అట్లాగే 'ప్రజ్ఞ'యొక్క (లేక, ఎరుక యొక్క) ప్రదర్శనమే జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో భాసిస్తోంది.

అట్టి కేవల ప్రజ్ఞారూపమగు పరబ్రహ్మమును తెలుసుకొన్న తరువాత, జాగ్రత్-స్వప్న-సుషుప్త విషయాలన్నీ (ఆ కేవల ప్రజ్ఞలో ఇమిడిపోయినవై)- ప్రజ్ఞకు వేరుగా కనిపించవు. ఆత్మను ఎరిగినప్పుడు సర్వము ఆత్మగా స్వభావసిద్ధంగా అనుభూతమౌతుంది.

---

**8** **స యథా శంఖస్య ధ్మాయమానస్య**
**న బాహ్యాన్ శబ్దాన్**
**శక్నుయాత్ గ్రహణాయ,**
**శంఖస్య తు గ్రహణేన**
**శంఖధ్మస్య (వా) శబ్దో గృహీతః॥**

పెద్దగా శంఖానినాదము మ్రోగుతూ ఉండగా బయట జనించే పిల్లి కూతల వంటి శబ్దాలు వినబడతాయా? లేదు కదా! తదితర శబ్దాలన్నీ శంఖనినాదములో కలిసిపోయి, శంఖానాదమే వినబడునట్లుగానే -

సర్వభేదములు ఆత్మదర్శనములో ఏకమైపోతున్నాయి. "వారు అటువంటి వారు - వీరు ఇటువంటివారు. వారు గొప్పవారు. వీరు కాదు. అది అట్లా! ఇది ఇట్లా! ఇంకేదో ఎట్లు?" - ఇవన్నీ ఆత్మభావనయందు లయించిపోయి ఆత్మకు అద్వితీయమౌతాయి.

---

**9** **స యథా వీణాయై**
**వాద్యమానాయై న బాహ్యాన్**
**శబ్దాన్ శక్నుయాత్**
**గ్రహణాయ, వీణాయై తు**
**గ్రహణేన వీణా వాద్యశ్య వా**
**శబ్దో గృహీతః॥**

పెద్దగా వీణ మ్రోగుతూ ఉంటే, అది వినుచుండగా, తదితరంగా జనించే శబ్దాలను వినము. వీణావాద్య శబ్దము మాత్రమే చెవులకు వినబడుతుంది కదా.

**బ్రహ్మమును గురించి వినుచున్నవానికి చాతుర్వర్ణ్యభేదములు, 14 లోకముల భేదములు, కాలభేదములు, వస్తు భేదములు, గుణ భేదములు, ఆకార భేదములు కనబడవు**. ఆతడు బ్రహ్మమును మాత్రమే దర్శించుచూ, వినుచూ, స్వీకరిస్తూ ఉంటాడు. తదితర లోక సంబంధమైన వింత విశేషాలన్నీ (వీణానాదము - ఆస్వాదిస్తూ ఉన్నప్పుడు అల్లంత దూరం నుండి వినబడే పక్షుల కలకలము వలె) - బహుచిన్న విషయాలవుతాయి.

---

**10** **స యథార్ద్రైధాగ్నేః**
**అభ్యాహితాత్ పృథక్**
**ధూమా వినిశ్చరన్తి,**
**ఏవం వా అరే అస్య మహతో**
**భూతస్య నిశ్వసితం।**
**ఏతద్యత్ ఋుగ్వేదో,**
**యజుర్వేదః, సామవేదో,**
**అథర్వ అఙ్గిరస ఇతిహాసః**
**పురాణం విద్యా ఉపనిషదః,**
**శ్లోకాః, సూత్రాణి, అనువ్యాఖ్యానాని, వ్యాఖ్యానాని**
**యస్యైవ ఏతాని సర్వాణి నిశ్వసితాని॥**

తడికట్టెలను మండిస్తున్నప్పుడు పొగ ఏకమై బహిర్గత మగుచున్న రీతిగా, ఇక్కడి భూతముల భేదమంతా ఆత్మతత్త్వము సమక్షంలో ఏకము మాత్రమే! (పొగ ఒక్కటే అయినట్లు, ఆత్మ ఏకమే అయి ఉన్నది).

అట్లాగే ఋుగ్వేద-యజుర్వేద, సామవేద- అథర్వణ వేదములు, అఙ్గిరసములు (నాట్యము సంగీతము మొదలైన వేద ఉపశాఖలు), ఇతిహాసములు, పురాణములు, ఉపనిషత్తులు ఆత్మతత్త్వ శ్లోకములు, సకల విద్యలు, బ్రహ్మసూత్రములు, వాటి గురించిన వ్యాఖ్యానములు.. ఇవన్నీ కూడా 'తత్త్వమ్' రూప 'ఆత్మచైతన్యము' యొక్క ఉచ్ఛ్వాస-నిశ్వాసలు మాత్రమే!

**ఈ సమస్తము సర్వదా సర్వత్రా పరబ్రహ్మమే!**

(కనుక ఆత్మనే తెలుసుకొంటూ, దర్శిస్తూ ఆత్మయే నీవై ఉండుము).

| | |
|---|---|
| 11) స యథా సర్వా సామపాగ్ం<br>'సముద్ర' ఏక – ఆయనమ్ ఏవగ్ం,<br>సర్వేషాగ్ం స్పర్శానాం 'త్వక్'<br>ఏకాయనం ఏవగ్ం, | ఏవిధంగా నదులలోని, కాలువలలోని, నూతులలోని జలములన్నిటికి చిట్టచివరకు సముద్రమే జనన స్థానము - గమ్యస్థానము కూడా అయి ఉన్నదో<br>→ - మృదు-కఠిన స్పర్శలన్నిటికీ చర్మమే ఏకైక జనన విలీనస్థానము (గమ్యస్థానము) అగుచున్నదో..., |
| సర్వేషాగ్ం రసానాం 'జిహ్వా'<br>ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం గన్ధానాగ్ం<br>నాసికా ఏకాయనం ఏవగ్ం;<br>సర్వేషాగ్ం రూపాణాం 'చక్షుః'<br>ఏకాయనమ్ ఏవగ్ం;<br>సర్వేషాగ్ం శబ్దానాగ్ం 'శ్రోత్రం' ఏక ఆయనమేవగ్ం; | → - సమస్త రుచులకు నాలుకయే ఏకాయన స్థానము.<br>- సర్వరకములైన సువాసన - దుర్వాసనలకు జనన- లయస్థానము నాసిక (ముక్కు)యే అయి ఉన్న తీరుగా,<br>సర్వ రూపానుభవములకు ఏకైక జనన లయస్థానము కళ్లే అగుచున్న విధంగా,<br>సర్వశబ్దములకు చెవులే జనన లయ ఏకైక స్థానము అయి ఉన్నట్లుగా.<br>→ ఆత్మయే సమస్తమునకు జనన - లయస్థానము. |
| సర్వేషాగ్ం సంకల్పానాగ్ం<br>'మన' ఏకాయనం ఏవగ్ం,<br>సర్వాసాగ్ం విద్యానాగ్ం<br>'హృదయం' ఏకాయనం ఏవగ్ం,।<br>సర్వేషాగ్ం కర్మణాగ్ం 'హస్తవ' ఏకాయనమేవగ్ం।<br>సర్వేషాం ఆనన్దానామ్, 'ఉపస్థ' ఏకాయనమేవగ్ం,<br>సర్వేషాగ్ం విసర్గాణాగ్ం 'పాయుః' ఏకాయనమేవగ్ం,<br>సర్వేషామ్ అధ్వనాగ్ం 'పాదావ' ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం వేదానాగ్ం 'వాక్' ఏక అయనమ్। | సర్వ సంకల్పములకు మనస్సే ఏకైక జనన - లయస్థానము.<br>సర్వ విద్యలకు (For all Learnings) హృదయమే ఏకైక జనన - గమ్యస్థానము.<br>సర్వకర్మలకు ఈ ఉభయ హస్తములే (చేతులే) ఏకైక జనింపజేయు - లయమగు స్థానము.<br>సర్వ శృంగారానందములకు 'ఉపస్థ'యే ఏకైక జనన-లయ స్థానము.<br>సర్వ విసర్జనలకు 'పాయువు' యే ఏకైక జనన స్థానము.<br>సర్వ నడకలకు పాదములే ఏకైక జనన స్థానము, గమ్యము కూడా!<br>సర్వవేదమంత్రములకు వాక్కుయే ఏకైక ప్రారంభ, లయస్థానము. |
| 12 స యథా సైన్ధవఖిల్య<br>ఉదకే ప్రాస్త,<br>ఉదకమేవ అనువిలీయేత, | జలము వలననే పుట్టిన సైంధవలవణ స్ఫటికము తిరిగి జలములో పడవేయగానే కరిగిపోయిన తరువాత, అద్దానిని వెనుకకు ఎవ్వరూ మరల్చలేరు కదా! అప్పుడు ఆ లవణము కరిగిపోయిన నీరు ఎచ్చట రుచిచూస్తే అక్కడ ఉప్పగా ఉంటుంది కదా!<br>ఇప్పుడు ఆ లవణము యొక్క ఆకారము ఎక్కడున్నది? జలమంతా నిండి ఉన్నది కదా! |
| న హాస్య (హ అస్య) ఉద్గ్రహణాయేవస్యాత్।<br>యతో యతస్త్వాదదీత లవణమేవైవం<br>వా అర ఇదం మహత్ భూతం<br>అనన్తం అపారం<br>విజ్ఞాన ఘన ఏవ।<br>ఏతేభ్యో భూతేభ్యః<br>సముత్థాయ తాన్యేవాను<br>వినశ్యతి। న ప్రేత్య సంజ్ఞాస్తి।<br>ఇతరే బ్రవీమీతి<br>– హ ఉవాచ యాజ్ఞవల్క్యంః।। | అట్లాగే ఓ మైత్రేయా! ఈ జగత్‌దృశ్యమంతా వాస్తవానికి 'తెలుసుకొనుట' అను తత్త్వమగు విజ్ఞానఘన స్వరూపమే! తెలియబడేదంతా,.. తెలుసుకొను ప్రజ్ఞారూపమే! **తెలుసుకొనుచున్నదే - తెలియబడుచున్న సమస్తముగా అగుచున్నది.** తెలుసుకొనువాడు, తెలియబడునది కూడా ఏమగు - **అనంత అపార విజ్ఞానఘనమే!**<br>అసంగుడగు (Unattatched) పరమాత్మకు ఉపాధి మాత్రము (ఉపకరణ మాత్రము) అగు ఈ దేహ-ఇంద్రియములు విషయ రూపములుగా జనించినవై నామరూపాత్మకంగా వ్యవహరించుచున్నాయి. 'పరమాత్మ అనే జలములో అవన్నీ కూడా (నదులన్నీ సముద్రమును జేర్చుచున్నట్లు) - తిరిగి లయము పొందుచున్నాయి. **పరమాత్మ నుండి జీవాత్మ బయల్వెడలి, ఆయా ఉపాధులలో ప్రయాణించు నదీ జలము వలె, తిరిగి పరమాత్మయందే** లయిస్తున్నది. - **అని యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి వివరించారు.** |

13 సహ ఉవాచ మైత్రేయి :
యత్రైవ మా భగవాన్। అమూముహన్
న ప్రేత్య సంజ్ఞా అస్తి, ఇతి।
సహ ఉవాచ యాజ్ఞవల్క్యో :
న వా అరే అహం మోహం
బ్రవీమి, అలం వా అర ఇదం
విజ్ఞానాయ॥

**మైత్రేయి** : హే భగవాన్! పాణేశ్వరా! పూజ్యులగు మీరు ఇప్పుడు చెప్పుచున్నది నాకు కొంచెము భ్రమను కలుగజేస్తోంది. స్వామీ! పరబ్రహ్మమునందు నేను లయించినప్పుడు, ఇక ఆపై "నేను - నీవు- ఆతడు - ఇది".. మొదలైన సంజ్ఞలన్నీ లేనివిగా అగుచున్నాయని, ఉప్పు స్పటికమువలె కరిగిపోతాయనీ నన్ను భయపెట్టుచున్నారు. నేను మోహమును పొందుచున్నాని నాకు అనిపిస్తోంది.

**యాజ్ఞవల్క్యుడు** : సర్వదా పరబ్రహ్మ స్వరూపమగు ఓ మైత్రేయీ! నేను మోహబెట్టి నిన్ను భ్రమింపజేయటము లేదు. విజ్ఞాన ఘనస్వరూపము గురించి నీవు తెలుసుకొనుటను ఉద్దేశిస్తున్నాను. ఇంకా నీవే ఆత్మయందు 'పరిచ్ఛేదనము' అను విరుద్ధ ధర్మము గ్రహిస్తున్నావు.

---

14 యత్ర హి ద్వైతం ఇవ భవతి।
తదితర ఇతరం పశ్యతి।
తదితర ఇతరం జిఘ్రతి।
తదితర ఇతరగ్‌ం శృణోతి।
తదితర ఇతరం అభివదతి।
తదితర ఇతరం మనుతే।
తదితర ఇతరం విజానాతి।

ఎప్పుడు ఎక్కడ ద్వైతము భావించబడుతుందో..,

- అక్కడ అప్పుడు ఇతరుడు (జీవుడు) తదితరమును దర్శిస్తున్నాడు.
- తదితరమును వాసన చూస్తున్నాడు.
- తదితరమైనది మాట్లాడుచున్నాడు.
- తదితరమైన ఇతరమును తలంచుచున్నాడు.
- తదితరమైన ఇతరమును తెలుసుకుంటూ ఉన్నాడు.

దృష్టాంతానికి,.. చూస్తూ ఉన్నప్పుడు, వాసన అనుభవిస్తూ ఉన్నప్పుడు, మాట్లాడుచూ ఉన్నప్పుడు, ఆలోచిస్తూ ఉన్నప్పుడు నీవు వేరువేరుగా అగుచున్నావా? లేదు కదా! అట్లాగే జీవాత్మ యొక్క అనేక సందర్శనముల సందర్భములో కూడా పరమాత్మ వేరువేరుగా అగుటలేదు. సర్వత్రా అఖండాత్మయే సర్వదా వెల్లివిరుస్తోంది.

---

యత్ర వా అస్య సర్వం
ఆత్మైవ ఆభూత్,
తత్ కేన కం జిఘ్రేత్?
తత్ కేన కం పశ్యేత్?
తత్ కేన కగ్‌ం శృణుయాత్?
తత్ కేన కం అభివదేత్?
తత్ కేన కం మన్వీత?
తత్ కేన కం విజానీయాత్? –
– యేన ఇదగ్‌ం సర్వం
విజానాతి,
తం కేన విజానీయాత్?
విజ్ఞాతారమ్,
అరే కేన విజానీయాత్? ఇతి॥

ఇతి బృహదారణ్యకోపనిషత్
చతుర్థోధ్యాయే, చతుర్థ బ్రాహ్మణమ్
"మైత్రేయీ బ్రాహ్మణమ్" సమాప్తమ్

- "సర్వము ఎల్లప్పటికీ ఆత్మయే అయి ఉన్నది। ఆత్మకు భిన్నమై నేను - నీవు - జగత్తు - మొదలైనవేవీ లేవు। (మట్టియే అనేక కుండలు మొదలైన పాత్రలుగాను, బంగారమే అనేక ఆభరణములు గాను, కనుపించురీతిగా).. ఆత్మయే అజ్ఞాన దృష్టిచే నేను - నీవు-జ్ఞాని - అజ్ఞాని ఇత్యాది అనేక అసంఖ్యాక భేదములు ఉన్నట్లుగా దర్శిస్తోంది. దర్శనమౌతోంది. ఆత్మ జ్ఞానదృష్టిచే ఇదంతా అఖండమగు అద్వితీయ పరమాత్మ స్వరూపముగా తెలియవచ్చుచున్నది" - అని ఎవరికి అనిపిస్తోందో.. **ఆతడే ఆత్మను ఎరిగినవాడు.**

- అట్టి ఆత్మ గురించి ఎరిగినవాడు - ఇక దేనిచేత దేనిని వాసన చూస్తాడు? దేనితో దేనిని చూస్తాడు? దేనితో దేనిని వింటాడు? దేనితో దేనిని మననం చేస్తాడు? దేనితో దేనిని తెలుసుకుంటాడు?

ఆ చూస్తున్నవాడు - చూడబడునది,
ఆ వాసన చూచువాడు - వాసనా విషయము,
ఆ వింటున్నవాడు - వినబడునది,
ఆ మననము చేయువాడు - ఆలోచించబడునది,
ఆ తెలుసుకొనుచున్నవాడు - తెలియబడునది..

అంతా అఖండ బ్రహ్మమే అయి ఉన్నది! ఎద్దాని చేత ఇదంతా తెలియబడుచున్నదో, అట్టిది దేని చేత తెలియబడగలదు?

ఓ మైత్రేయీ! **తెలుసుకొనుచున్నది, తెలియబడునది, ఆ తెలుసుకొనుచున్న దానిని తెలుసుకొనుచున్నది - అంతా కూడా విజ్ఞానాత్మయే! మరింకేదీ ఎక్కడా ఎప్పుడూ లేదు!**

-ఇతి మైత్రేయీ బ్రాహ్మణమ్-

# బృహదారణ్యకోపనిషత్ - చతుర్థాధ్యాయః - పఞ్చమం బ్రాహ్మణమ్

## మధు బ్రాహ్మణము

1 **ఇయం <u>పృథివీ</u> సర్వేషాం**
**భూతానాం మధు।**
**అస్యై పృథివ్యై సర్వాణి**
**భూతాని మధు**
**యశ్చ అయమ్ అస్యాం పృథివ్యాం**
**తేజోమయో, అమృతమయః పురుషో।**

ఈ పృథివియే సర్వ జీవులకు వారి వారి భౌతిక దేహముల ఉత్పత్తి స్థానము కదా! అందుచేత, ఒక పసిబిడ్డకు అమ్మ-అమ్మపాలు ఎంత ఇష్టమో, జీవులందరికి ఈ భూమి అంతటి మధురమైనది.

తల్లికి బిడ్డలంటే ఎంతగానో ఇష్టము కదా! అట్లాగే పృథివికి ఈ జీవులు కూడా అంతటి మధురము.

→ ఈ పృథివి యందు ఏ తేజోమయుడు - అమృతమయుడు అగు పురుషుడు ఉన్నాడో (లేక, ఏ పురుషకారము - Functioning Intellect సర్వదా ప్రకాశించుచున్నదో)..

---

**యశ్చ అయమ్ అధ్యాత్మగ్ంం**
**శారీరః తేజోమయో అమృతమయః పురుషో**
**'అయమేవ స యో,**
**అయమ్ ఆత్మా ఇదం। అమృత మిదం।**
**'బ్రహ్మ' ఇదగ్ం సర్వమ్॥**

→ అట్లాగే ఆధ్యాత్మికంగా ఈ శరీరమును ఆశ్రయించి ఏ తేజోమయుడు - అమృతమయుడు అగు పురుషుడు ఉన్నారో - ఈ **<u>రెండూ ఒక్కటే!</u>**

**ఆ భూమి యందు (ప్రకాశించు) పురుషుడే ఈ దేహమునందు కూడా ప్రకాశమానుడగుచున్నాడు.**

(ఏ తెలుసుకుంటూ ఉన్నవానిని తెలుసుకొంటూ ఈ దేహమున ఉన్నదని, అద్దానిని దర్శించమని మైత్రేయీకి యాజ్ఞవల్క్యుడు మైత్రేయీ బ్రాహ్మణములో చెప్పటం జరిగిందో) ఆ పరమ పురుషుడే ఈ **"పృథివియందు - దేహభూమి యందు"**.. కూడా సర్వదా ప్రకాశించు చున్నారు.

- ఈ జీవుడు సర్వదా అమృతమగు ఆత్మ స్వరూపుడే। ఆత్మయే ప్రతి ఒక్క దేహమునందు సర్వదా వేంచేసియున్న విజ్ఞాన ఘనము. భూమిలోను - సర్వ జీవులలోను అత్యంత మధుర రసమైయున్నదే 'పరబ్రహ్మ స్వరూపము'. ఆత్మయే అమృతస్వరూపము।

-తేనె టీగలు 'మధువు'ను పూవు-పూవు తిరిగి తిరిగి తెచ్చుకొని 'తేనె తుట్టె'ను నిర్మించుకొను తీరుగా, ఈ జీవులు తమ కర్మలచే భూమిని నిర్మించుకొనుచున్నారు. అందుకే జీవునికి భూమి ప్రియమగుచున్నది. భూమియే జీవులకు ఉత్పత్తి స్థానము కూడా।

---

2 **ఇమా <u>ఆపః</u> సర్వేషాం భూతానాం**
**మధ్వా సామపాగ్ం।**
**సర్వాణి భూతాని మధు।**
**యశ్చ అయమాసు అప్సు**
**తేజోమయో అమృతమయః పురుషో**
**యశ్చ అయం**
**అధ్యాత్మగ్ం రై (రే) తసః తేజోమయో,**
**అమృతమయః పురుషో అయమేవ।**
**స యో అయం ఆత్మా ఇదమ్।**
**అమృతం ఇదమ్। 'బ్రహ్మ' ఇదగ్ం సర్వమ్॥**

ఇక్కడి ఆపః (జలము) సకల జీవులకు మధురమైనట్టిది. ఈ జలములకు సర్వ ప్రాణులు కూడా మధుర స్వరూపులు.

→ జలము నందు ఏ తేజోమయ- అమృతమయుడగు ఆత్మపురుషుడు మధురముగా ప్రకాశించుచున్నారో..., ఆ మధురమగు పరమ పురుషుడే సకల ప్రాణులకు మధురస్వరూపుడు. (మాధుర్యమగు స్వస్వరూపుడు).

దేహ-ఇంద్రియ సముదాయము యొక్క కర్త యందు గల రేతస్సంపన్నుడు, తేజోమయుడు, అద్భుత స్వరూపుడు ఆయనయే।

జలమునందు - దేహేంద్రియములందు ఏ పరమ తేజోసంపన్న పురుషుడు ప్రకాశించుచున్నాడో, ఆతడే ఆత్మపురుషుడు. **అట్టి ఆత్మ స్వరూపమే అమృతస్వరూపము.**

ఆయనయే పరబ్రహ్మస్వరూపము। ఆయనయే సర్వదా సర్వమైయున్నారు।

| | |
|---|---|
| 3 **అయం <u>అగ్నిః</u> సర్వేషాం భూతానాం మధు। అస్య అగ్నిః సర్వాణి భూతాని మధు। యశ్చ అయమ్ అస్మిన్ అగ్నౌ తేజోమయో అమృతమయః పురుషో। యశ్చాయం అధ్యాత్మం వాఙ్మయః, తేజోమయో అమృతమయః పురుషో** | - ఈ అగ్నియే సమస్త భూతములయొక్క (జీవుల యొక్క) మధుర స్వరూపము. - సమస్త భూతములు అట్టి అగ్ని యొక్క మధురస్వరూపులే. ❑ అగ్నియందలి తేజోమయుడు, అమృతమయుడు అగు **పురుషుడు,** ❑ ఈ దేహ-ఇంద్రియ సంఘాతకర్తయందు ఉన్న వాక్‌మయుడు (వాక్కును జనింపజేయు పురుషకారము) అగు అమృతమయుడగు **పురుషుడు- <u>ఈ ఇద్దరూ ఒక్కటే.</u>** - ఈయనయే ఆయన। ఆయనయే ఈయన కూడా। |
| **అయమేవ। స యో అయం ఆత్మా ఇదమ్। అమృతం ఇదం। 'బ్రహ్మ' ఇదగ్ంం సర్వమ్॥** | ఆ ఉభయరూపములతో ఉన్నది అమృతమయమగు ఆత్మయే। మధురము - అమృతరూపము అగు ఆత్మయే ఇదంతా। -నోటి యందు శబ్దము పలుకు శక్తి రూపుడగు పురుషకారము, - మాట్లాడబడుచున్న వాక్ స్వరూపము, మాట్లాడబడుచున్న విషయము, - మాట్లాడుచున్నట్టి ప్రత్యగాత్మ పురుషుడు, ఇవన్నీ ఆత్మయే। పరమాత్మయే। పరబ్రహ్మమే। |
| 4 **అయం <u>వాయుః</u> సర్వేషాం భూతానాం మధు। అస్య వాయోః సర్వాణి భూతాని మధు।** | ఈ వాయువే సమస్త భూతజాలము యొక్క మధురమగు సారాంశరూపము. -సమస్త భూతజాలము వాయువునకు కూడా మధురమగు సారాంశ రూపమే। |
| **యశ్చ అయం అస్మిన్ వాయౌ తేజోమయో అమృతమయః పురుషో, యశ్చ అయం అధ్యాత్మం ప్రాణః తేజోమయో। అమృతమయః పురుషో అయమేవ। స యో। అయం ఆత్మేదం। అమృతం ఇదం। 'బ్రహ్మ' ఇదగ్ంం సర్వమ్॥** | వాయువునందున్న తేజోమయుడగు అమృతపురుషుడు,... దేహ ఇంద్రియ సంఘాతము యందు ఉన్నటువంటి ప్రాణరూపుడగు తేజోమయ పురుషుడు - **<u>ఇద్దరూ ఒక్కటే.</u>** - అమృతరూపులగు ఈ ఇరువురు పురుషులు **ఆత్మస్వరూపులే!** అఖండాత్మయే ఉభయ అమృతరూప పురుషులుగా రూపము కలిగి ఉన్నది. ఈ విధంగా వాయువు నందు తేజోమయ అమృత రూపుడు, సర్వజీవులయందలి తేజోమయ పురుషుడు - కూడా అయి ఉన్న ఆత్మయే పరబ్రహ్మము. ఈ సర్వము పరబ్రహ్మమే. |
| 5 **అయం <u>ఆదిత్యః</u> సర్వేషాం భూతానాం మధు। అస్య ఆదిత్యస్య సర్వాణి భూతాని మధు। యశ్చ అయం అస్మిన్ ఆదిత్యే తేజోమయో – అమృతమయః పురుషో। యశ్చ అయం అధ్యాత్మం చాక్షుషః** | ఆ ఆదిత్యుడే సకల ప్రాణుల మాధుర్య స్వరూపమగు మధువు. సర్వ ప్రాణులు ఆదిత్యునికి మాధుర్య స్వరూపములే. ఏ తేజోమయ- అమృతమయ పురుషుడు ఆదిత్యునియందు ప్రకాశించు చున్నారో, ఆ తేజోమయ - అమృత పురుషుడే సర్వ ప్రాణుల యందు కూడా తేజోమయ అమృత పురుషుడై మధురముగా వెలుగొందుచున్నారు. ఆదిత్యుని యందు గల తేజోమయ అమృతరూపుడగు పురుషుడే → దేహేంద్రియ సంఘాతకర్తయందు ఉన్నట్టి నేత్ర సంబంధితుడు అయిన అమృతరూప పురుషుడు కూడా। |

| | |
|---|---|
| తేజోమయో, అమృతమయః పురుషో<br>అయం ఏవ। | **కళ్ళలోను - కనిపించేదాని యందు ఉన్న పురుషుడే ఆత్మ।**<br>- ఆ ఆత్మయే పరమాత్మ।<br>- ఆ పరమాత్మయే పరబ్రహ్మము। |
| స యో అయం ఆత్మేదం<br>అమృతం ఇదం।<br>"బ్రహ్మ" ఇదగ్ం సర్వమ్॥ | - ఈ సర్వము పరబ్రహ్మమే। అమృతమయమే।<br>కళ్ళలోని 'చూపు' అను తేజస్సు, కళ్ళతో చూడబడే 'దృశ్య తేజస్సు', కళ్ళతో చూస్తున్న 'ద్రష్టరూపతేజస్సు' - అన్నీ కూడా ఒకే పరబ్రహ్మము యొక్క వేరువేరు ప్రదర్శనములే!<br>సర్వదా ఇదంతా ఏకమే గానీ అనేకము కాదు. ఈ సమస్తము బ్రహ్మమే. |
| **6** ఇమా దిశః సర్వేషాం<br>భూతానాం మధ్వాసాం। (మధు)।<br>అసాం దిశాగ్ం సర్వాణి భూతాని మధు। | - ఈ దిక్కులన్నీ కూడా సకల ప్రాణులకు మాధుర్యమగు అనుభూతి వస్తువు.<br>- అట్లాగే దిక్కులకు ఈ సకల ప్రాణులు మాధుర్యమగు రూపములు. |
| యశ్చ అయమాసు దిక్షు<br>తేజోమయో - అమృతమయః పురుషో।<br>యశ్చ అయం అధ్యాత్మగ్ం।<br>శ్రౌత్రః ప్రాతిశ్రుత్కః<br>తేజోమయో - అమృతమయః పురుషో అయమేవ। | ఏ తేజోమయ అమృతమయ పురుషుడు దిక్కుల నిండా వెలుగుచున్నారో, **ఆ తేజోమయ-అమృత పురుషుడే సకల ప్రాణులందు దిక్కుల రూపముగా కూడా వెలుగొందుచున్నారు.** అంతేకాకుండా, అధ్యాత్మమున చెవి అనే ఇంద్రియము నందు శబ్దము వినే సకల సందర్భములలో ఉండి ఉన్న తేజోమయ- అమృతరూపురుషుడు కూడా ఆయనే. శబ్దము ఆయనయే. వినేది ఆయనయే. |
| స యో అయమ్ ఆత్మా ఇదం అమృతం ఇదమ్।<br>బ్రహ్మ ఇదగ్ం సర్వమ్॥ | ఈ పురుషుడుగా ఏ ఆత్మ ఉన్నదో,.. అదియే అమృతము। పరబ్రహ్మము। సర్వము అయి ఉన్నది కూడా ఆ మధుబ్రహ్మమే।<br>- చెవులలోని వినికిడి,<br>- వినబడుచున్నట్టివి,<br>**- వినువాడు - అంతా కూడా పరబ్రహ్మమే। అమృతమయమే। బ్రహ్మమే ఇదంతా।** |
| **7** అయం చన్ద్రః సర్వేషాం<br>భూతానాం మధు।<br>అస్య చన్ద్రస్య సర్వాణి భూతాని మధు। | ఈ చంద్రుడు సర్వప్రాణులకు మధురమైనవాడు (మనస్సే మధురము).<br>ఈ చంద్రునకు సకల ప్రాణులు మధురము. |
| యశ్చ అయం అస్మిగ్ం<br>చన్ద్రే తేజోమయో<br>అమృతమయః పురుషో యశ్చ<br>అయం అధ్యాత్మం మానసః<br>తేజోమయో అమృతమయః పురుషో<br>అయం ఏవ। | చంద్రునియందు ఏ తేజోమయ- అమృతమయ స్వరూపుడు స్థానము పొందియుండి ప్రకాశమానుడగుచున్నాడో,<br>- అట్లాగే అధ్యాత్మముగా (సర్వజీవుల) మనస్సు యందు ఏ తేజోమయ- అమృతమయ రూపుడు గలడో - ఆ ఇరువురు ఒక్కటే.<br>- ఆ చంద్రునిలోని మనో పురుషుడే ఈ జీవులలోని మనో పురుషుడు.<br>- ఈ జీవులలో ఏ మనోమయ పురుషుడు ప్రకాశించుచున్నాడో,.. ఈతడే చంద్రుని యందు ప్రకాశమానుడగుచున్నాడు. |
| స యో అయం ఆత్మా-<br>ఇదం అమృతం।<br>ఇదం 'బ్రహ్మ'। ఇదగ్ం సర్వమ్॥ | **- ఆ చంద్రునిలోను జీవులలోను ప్రకాశించుచున్న మధురతత్త్వమే ఆత్మ!**<br>అట్టి ఆత్మయే పరమాత్మ. మనస్సుగాను, ఆలోచనలుగాను, ఆలోచించువాడుగాను, ఆలోచింపబడునదిగాను ఏద్వైతే ఉన్నదో, **అంతా కూడా ఆ పరమాత్మయే। బ్రహ్మమే। పరబ్రహ్మమే।** |

8 ఇయం విద్యుత్ సర్వేషాం భూతానాం మధు।
అస్యై విద్యుతే సర్వాణి భూతాని మధు।
యశ్చ అయం అస్యాం విద్యుతి
తేజోమయో అమృతమయః పురుషో।
యశ్చ అయం "అధ్యాత్మం తైజసః"
తేజోమయో అమృతమయః పురుషో।
అయం ఏవ స యో

ఇక్కడి విద్యుత్ (మెఱుపు/కాంతి) సర్వ భూతజాలమునకు 'మధురమైనది.
అట్టి విద్యుత్తుకు సర్వ జీవులు తాను ప్రకాశింపజేయు ప్రియమైన రూపము.
విద్యుత్‌నందు (తేజస్సునందు) అమృతమయుడగు ఏ పురుషుడు ఉన్నాడో,
- (అట్లాగే) అధ్యాత్మికంగా చర్మము యొక్క కాంతియందు ఏ తేజోమయుడు - అమృతమయుడు అగు పురుషుడు కలడో - **ఆ ఇద్దరు ఒకే ఆత్మానంద స్వరూపులు.**
ఆతడే ఈతడు।
ఈతడే ఆతడు।

---

అయం ఆత్మా ఇదం అమృతం।
ఇదం "బ్రహ్మ"। ఇదగ్ం సర్వమ్॥

ఆ పురుషుని రూపముగా ఉన్నది అమృతరూపమగు ఆత్మయే!
అదియే బ్రహ్మము।
ఆ బ్రహ్మమే ఈ కనబడే సర్వము కూడా। విద్యుత్ - వెలిగించబడేది కూడా బ్రహ్మమే।

---

9 అయగ్ం స్తనయిత్నుః
సర్వేషాం భూతానాం మధు।
అస్య స్తనయిత్నోః
సర్వాణి భూతాని మధు।
యశ్చ అయం అస్మిగ్ం
స్తనయిత్నౌ తేజోమయో,
అమృతమయః పురుషో
యశ్చ అయం "అధ్యాత్మగ్ం శాబ్దః"
సౌవరః తేజోమయో
అమృతమయః పురుషో
అయమేవ। స యో
అయం ఆత్మా ఇదం అమృతం।
ఇదం బ్రహ్మ। ఇదగ్ం సర్వమ్॥

సర్వప్రాణులకు మేఘము ఇష్టము. మధురము.
అదేవిధంగా మేఘములకు సర్వభూతములు (సర్వప్రాణులు) ఇష్టము కూడా!
మేఘము నందు ఒకానొక తేజోమయము - అమృతమయము అగు పురుషుడు (లేక, పురుషకారము) ఉన్నారు.
ఆ పురుషకారమే (పురుషుడే) అధ్యాత్మమగు శబ్దము రూపమున అమృతమయుడై, సర్వజీవులలో వేంచేసి ఉన్నారు.

- స్వరము నందు శబ్దము.
- ఆ శబ్దము యొక్క జగత్తులోని అర్థము,
- ఆ అర్థము తనదైన జీవాత్మ,
- **... ఇవన్నీ బ్రహ్మమే!**

ఏ పురుషుడు మేఘమునందు ఉన్నాడో,
ఆతడే అమృత-తేజోసంపన్నుడై సర్వమునందు సర్వముగా వేంచేసియున్న పరబ్రహ్మ।
ఆ పరబ్రహ్మమే - ఇహముగా ఇక్కడ ఏదేది కనిపిస్తోందో, అదంతా కూడా అయి ఉంటోంది. ఇదంతా బ్రహ్మమే। అమృతమయమే।

---

10 అయం ఆకాశః సర్వేషాం
భూతానాం మధు।
అస్య ఆకాశస్య సర్వాణి భూతాని మధు।
యశ్చ అయం అస్మిన్
ఆకాశే తేజోమయో
అమృతమయః పురుషో।
యశ్చ అయం అధ్యాత్మగ్ం హృద్యాకాశః
తేజోమయో,

ఈ ఆకాశము సమస్త జీవుల యొక్క మధుర స్వరూపము.
ఆకాశమునకు సమస్త జీవులు మధుస్వరూపులు.
ఆకాశమునందు ఉన్న తేజోమయుడు, అమృతమయుడు అగు పురుషుడే అధ్యాత్మంగా **'హృదయము'నందు కూడా తేజోమయుడై, అమృత స్వరూపుడై ఉన్నారు.**
భూతాకాశమునందు ఉన్న పురుషుడే హృదయాకాశమున కూడా ప్రకాశమానుడై ఉన్నారు.

**ఈతడే → ఆతడు।**
**ఆతడే → ఈతడు।**

అమృతమయః పురుషో।
అయం ఏవ స యో అయం ఆత్మా।
ఇదం అమృతం।
ఇదం 'బ్రహ్మ' । ఇదగ్ం సర్వమ్॥

ఆ పురుషుడు ఆత్మ సమన్వితమైయున్నాడు. (ఆయనయమే ఆత్మ పురుషుడు).

అట్టి ఆత్మయే మధురాతిమధురము। అమృతము। బ్రహ్మము।

**అట్టి పరబ్రహ్మమే ఈ సర్వము సర్వదా అయి ఉన్నది!**

11 అయం <u>ధర్మః</u> సర్వేషాం
భూతానాం మధు।
అస్య ధర్మస్య సర్వాణి భూతాని మధు।
యశ్చ అయం అస్మిన్
ధర్మే తేజోమయో అమృతమయః పురుషో,
యశ్చ అయం అధ్యాత్మం
ధార్మః తేజోమయో
అమృతమయః పురుషో, అయమేవ
స యో అయం ఆత్మా ఇదం। అమృతం ఇదం।
'బ్రహ్మ' ఇదగ్ం సర్వమ్।

[ (**ధర్మము** = కనులకు చూపు, చెవులకు వినికిడి; చర్మమునకు స్పర్శ; కాళ్లకు నడక; చేతులకు పుచ్చుకొనటము, మనస్సుకు ఆలోచన, బుద్ధికి విచక్షణ, చిత్తమునకు ఇష్టము, పంచభూతములకు ఆయా ధర్మములు, సాంఘిక జీవునికి సంఘముపట్ల ధర్మము - ఇవన్నీ **'ధర్మము'** యొక్క అర్థముగా చెప్పబడుచున్నాయి. (ధర్మో రక్షతి రక్షితః)].

ధర్మము సకల ప్రాణుల యొక్క అత్యంత మధురమగు విషయము. సారము. అట్టి ధర్మమునకు ఈ భూతజాలమంతా అత్యంత మధురసారము. (కాబట్టే పంచభూతములు తమతమ ధర్మములు నిర్వర్తిస్తూ జీవుని సదా రక్షిస్తున్నాయి).

ధర్మమునందు గల అమృత తేజోమయ పురుషుడు, సర్వ భూతముల రూపుడు, సమస్త జీవుల రూపుడు కూడా మధురాత్మయే।

సర్వ భూతములు ఆ అమృత-తేజోరూపమగు ధర్మమే రూపములుగా కలిగి ఉన్నారు.

ఈ భూమి-జలము-అగ్ని-వాయు-ఆకాశము అనబడు పంచభూతముల యందు, తదితర వివిధ ప్రకృతి విశేషయములందు **'సామాన్యధర్మము'**గా, ఏ తేజోమయ-అమృత స్వరపుడైతే ఉన్నారో, ఆ తేజోమయ-అమృతమయ స్వరూప పురుషుడే ఈ ఇంద్రియ సంఘాతమగు భౌతిక దేహమునందు కూడా ప్రకాశించుచున్నారు.

**ఆ పరమ పురుషుడే → ఈ జీవాత్మ పురుషుడు.**

**ఈ జీవాత్మ పురుషుడే → ఆ పరమ పురుషుడు కూడా।**

ఇద్దరు పురుషులూ ఆత్మస్వరూపులే! ఆత్మసర్వదా ఏకము.

అట్టి ఆత్మయే అమృతస్వరూపమగు పరబ్రహ్మము.

ఆ పరబ్రహ్మమే → ఈ సర్వము కూడా. ఈ సమస్తము బ్రహ్మమే.

12 ఇదగ్ం <u>సత్యగ్ం</u> సర్వేషాం
భూతానాం మధు।
అస్య సత్యస్య సర్వాణి భూతాని మధు।
యశ్చ అయం అస్మిన్
సత్యే తేజోమయో
అమృతమయః పురుషో,
యశ్చ అయం అధ్యాత్మగ్ం సాత్యః
తేజోమయో అమృతమయః పురుషో,
అయం ఏవ స యో
అయం ఆత్మా ఇదం।
అమృతం ఇదం।
"బ్రహ్మ" ఇదగ్ం సర్వమ్॥

ఈ దృశ్యము నందు ఏ (పరమ) సత్యము వెలుగొందుచున్నదో, ... అదియే సమస్త ప్రాణుల యొక్క శివస్వరూపమాధుర్యసారము కూడా।

అట్లాగే సమస్త భూతములు (జీవులు) సత్యమునకు ప్రియము, శివము, మధురము, సారము కూడా।

సత్యమునందు ఏ తేజోమయుడగు, అమృతమయుడగు పురుషుడు ఉన్నారో, ఆ తేజోమయ-మనోమయ పురుషుడే అధ్యాత్మికంగా (Individually speaking) ఈ దేహ ఇంద్రియ సంఘాతమునందు 'సత్య' స్వరూపుడై తేజోమయ అమృతరూపంగా వెలుగొందుచున్నారు.

- ఇరువురు (విశ్వసత్యమునందు వెలుగొందువాడు, దేహేంద్రియ సంఘాతమునందు వెలుగొందువాడు కూడా) - ఒకే ఆత్మస్వరూపుడు.

ఆ ఆత్మయే అమృతము, తేజోమయము అగు పరబ్రహ్మము. ఆ బ్రహ్మమే ఈ సర్వము। ఈ సమస్తము బ్రహ్మమే।

**13** ఇదం <u>మానుషగ్ం</u>
**సర్వేషాం భూతానాం మధు।**
**అస్య మానుషస్య సర్వాణి**
**భూతాని మధు।**
**యశ్చ అయం అస్మిన్ మానుషే తేజోమయో,**
**అమృతమయః పురుషో,**
**యశ్చ అయం అధ్యాత్మం**
**మానుషః తేజోమయో**
**అమృతమయః పురుషో అయం ఏవ।**
**స యో అయం ఆత్మా ఇదం। అమృతం ఇదం।**
**"బ్రహ్మ" ఇదగ్ం సర్వమ్॥**

ఈ మానుష జాతి పంచ భూతములకు, పంచ ప్రాణములకు మాధుర్యమైన మధువు. పంచభూతములు, పంచప్రాణములు - మానవునకు మధురము.

సమస్త ప్రాణులు ఈ మానుష జాతికి మాధుర్య సారము.

ఈ మనుష్యజాతియందు (మానవునియందు) ఏ **'తేజోమయుడు-అమృతమయుడు'** అగు పురుషుడు కలడో, ఆయనయే పంచభూత - ప్రాణసముదాయము నందు ఏకాత్మ అయి వెలుగొందుచున్నారు.

పంచభూత-పంచ ప్రాణ సంబంధుడైనటువంటి తేజోమయ-అమృతమయ పురుషుడు ఉన్నారు. ఆ ఇరువురలోను పురుషులు ఏకరూపులే.

- **ఈ ఇరువురు పురుషులు పరమాత్మ స్వరూపులే।**

- **ఆ పరమాత్మయే జీవులందలి, పంచభూతములందలి అమృతమయ-తేజోమయ స్వరూపము కూడా।**

- ఆ అమృతమయ- తేజోమయ 'పరమాత్మ'అనబడు **పరబ్రహ్మ స్వరూపమే ఈ కనబడే సర్వమూ కూడా। ఇదంతా కూడా ఆయనయే.**

---

**14** అయం <u>ఆత్మా</u>
**సర్వేషాం భూతానాం మధు।**
**అస్య ఆత్మనః సర్వాణి భూతాని మధు।**
**యశ్చ అస్మిన్ ఆత్మని తేజోమయో**
**అమృతమయః పురుషో,**
**యశ్చ అయం ఆత్మా తేజోమయో**
**అమృతమయః పురుషో,**
**– అయం ఏవ।**
**స యో అయం ఆత్మా ఇదం। అమృతం ఇదం।**
**'బ్రహ్మ' ఇదగ్ం సర్వమ్।**

ఈ జీవాత్మకు పంచభూతజాలము అత్యంత ప్రియమైన, మధురమైన వస్తువు.

అట్టి జీవాత్మ తత్త్వము - సర్వభూతజాలముతో కూడిన పాంచభౌతిక దృశ్యమునకు అత్యంత ప్రియమైనది. మధురమైనట్టిది.

❑ ఈ జీవ జాలమునందు భౌతికంగా ఏ తేజోమయ-అమృతమయ మగు పురుషుడు ఉన్నాడో,

❑ అట్లాగే సమస్త పంచభూతములందు **ఆధిదైవికంగా** ఏ తేజోమయ - అమృతమయ పురుషుడు ప్రవర్తమానుడై ఉన్నారో.... **ఆ ఇరువురు ఒక్కటే!**

ఆతడే ఈతడు। విశ్వపురుషుడే జీవాత్మ।

ఈతడే ఆతడు। జీవాత్మ విశ్వపురుషుడే పాంచభౌతిక స్వరూపుడు.

జీవ జాతియందు తాదాత్మ్యమయముగా తేజోమయుడు, సర్వభూతము లందు (పంచభూతములందు) తేజోమయ- అమృతమయుడు అగు పురుషుడే **"ఆత్మ".**

ఆతడే పరమాత్మ। పరబ్రహ్మము। ఆతడే ఇదంతా। ఈ సర్వమును।

---

**15** స వా అయం <u>ఆత్మా</u>
**సర్వేషాం భూతానాం అధిపతిః।**
**సర్వేషాం భూతానాగ్ం రాజా।**
**తత్ యథా రథ నాభౌ చ**
**రథనేమౌ చారాః సర్వే సమర్పితా।**
**ఏవం ఏవ అస్మిన్ ఆత్మని**
**సర్వే ప్రాణాః, సర్వే లోకాః, సర్వే దేవాః,**
**సర్వాణి భూతాని,**
**సర్వ ఏత ఆత్మానః సమర్పితా॥**

ఈ ఆత్మ సర్వభూతజాలములకు అధిపతి. సకల భూతములకు రాజు.

అజ్ఞానముచే నిర్మితమైన 'దేహ-ఇంద్రియ సంఘాతము' అనే ఉపాధితో తన్మయుడై, అద్దానితో కూడుకొనియున్నవాడే 'జీవుడు' (జీవాత్మ). ఈతడు బ్రహ్మజ్ఞానమునందు ప్రవేశబెట్టబడినప్పుడో? **'బాహ్య-అభ్యంతరములు' - అనే విభాగము లేనివాడు, పూర్ణుడు, ఏకరసమగు 'ఎరుక'యే** స్వరూపముగా **కలవాడు - అగుచున్నాడు.** 'పరమాత్మ' **అనబడుచున్నాడు.**

సర్వప్రాణులు ఉపాసించేది ఆత్మనే. కనుక, ఆత్మయే సర్వులకు అధిపతి!

అందరూ ఆత్మకు అంతఃరతులే! అందరి స్వరూపముగా ఉన్నదీ - అఖండమగు ఆత్మయే।

రథము యొక్క నాభియందు, కడ్డీలయందు, తూము (మధ్య భాగము) నందు, చక్రముల చివర వరకు చక్రపు ఆకులు గ్రుచ్చబడి ఉంటాయికదా!

అట్లాగే.. ఈ ఆత్మయందే ఆయా విభాగములతో సహా సర్వ భూతజాలములు, సకల దేవతలు, సకల ప్రాణులు, సకల జీవాత్మ ప్రజ్ఞలు (కూర్చబడినవై) ఉన్నాయి. ఆత్మయందే (సమష్టిగత) సకల ఆత్మలు, సకల ఆత్మలలో వ్యష్టిగతమైనదంతా అమర్చబడి ఉన్నాయి. **ఆత్మయే ఈ సమస్తము.**

---

**16 ఇదం వై తత్ మధు**
**దధ్యన్ అథర్వణో**
**అశ్విభ్యాం ఉవాచ।**
**తత్ ఏతత్ ఋషిః**
**పశ్యన్ నవోచత్।**
**తద్వాం నరా సనయేదగ్ం (స నయ ఇదగ్ం)**
**స ఉగ్రం ఆవిష్కృణోమి**
**తన్యతుః న వృష్టిం।**
**దధ్యన్ హ యన్మధ్వ**
**అథర్వణో వామశ్వస్య**
**శీర్ష్ణా ప్రయదీం ఉవాచ ఇతి॥**

ఒకానొకప్పుడు అశ్వినీ దేవతలు ఇరువురూ మానవాకారము పొందిన వారై అథర్వణవేదవేత్తయగు దధ్యన్ అను పేరు గల మహర్షిని సమీపించారు.

అశ్వినీదేవతలు : ఓ దధ్యన్ మహర్షీ! అతిరహస్యమగు పరమాత్మయొక్క మధుతత్త్వమును మాకు బోధించండి.

దధ్యన్‌మహర్షి : అశ్వనీ దేవతలారా! ఆత్మతత్త్వమగు మధుబ్రాహ్మణమును భక్తితో ఆశ్రయించి బోధించమని ఎవ్వరైనా ఆశ్రయించినప్పుడు తప్పక బోధించాలి. ఇది ఋషి సంప్రదాయము. ఓ దేవతలారా! మీ కొరకై **'దంసము'** అను పేరు గల ఆత్మతత్త్వ మధుబ్రాహ్మణమును వర్షమువలె మీపై వర్షింపజేస్తాను. అయితే ఇందులో ఒక చిక్కు ఉన్నది.

అశ్వినీదేవతలు : ఏమిటో ఆ చిక్కు? మహర్షీ! శలవీయండి!

దధ్యన్‌మహర్షి : 'మధువు' అనే పేరు గల ఈ బ్రహ్మవిద్యను నాకు ఇంద్రభగవానుడు గురువై బోధించి ఉన్నారు. అట్లా బోధించేముందు, **"ఈ మధువిద్యను ఎవ్వరికైనా నీవు బోధిస్తే అప్పుడు నీ శిరస్సును నేను వజ్రాయుధముతో ఖండిస్తాను"..** అని ప్రతిజ్ఞ చేసి, నాకు అంగీకారము అయిన తరువాత బోధించారు. (అందుచేత వెనకాడుచున్నాను).

అశ్వినీదేవతలు : ఓ అథర్వణా! దధ్యన్ మహర్షీ! మీకు ఆ భయమే అవసరం లేదు. ఎందుకంటారా? మేము ఇప్పుడు మీ శిరస్సును ఖండించి ఎక్కడో దాచి 'గుర్రము' యొక్క శిరస్సును ఆ స్థానములో ఉంచుతాము. మీరు మాకు ఆత్మ యొక్క మధుతత్త్వము (మధు విద్య)ను బోధించండి. ఇంద్రుడు ఒకవేళ వచ్చి మీ శిరస్సు ఖండిస్తే, అప్పుడు ఆ ఖండించిన స్థానములో మీ ఇప్పటి శిరస్సును యథాప్రకారము ఉంచుతాము.

ఈ ప్రకారముగా ప్రతిజ్ఞ చేసి అశ్వినీ దేవతలు 'మధుబ్రాహ్మణ-బ్రహ్మవిద్యను దధ్యన్‌మహర్షి నుండి బోధగా పొందసాగారు.

---

**17 ఇదం వై తత్ (తన్) మధు దధ్యన్**
**అథర్వణోః అశ్విభ్యాం ఉవాచ।**
**తత్ ఏతత్ ఋషిః**
**పశ్యన్ నవోచత్।**
**అథర్వణాయ అశ్వినౌ**
**దధీచే అశ్వ్యగ్ం**
**శిరః ప్రత్యైరయతమ్।**

ఆ విధంగా అథర్వణవేత్త అగు దధ్యన్‌మహర్షి → తన గురువగు ఇంద్ర భగవానుడు తనకు బోధించిన - **'జీవాత్మ-జగత్తులు ఆత్మ యొక్క మాధుర్యమే"** అను సుప్రసిద్ధ తత్త్వమును దేవతల వైద్యులగు అశ్వినీ దేవతలకు బోధించటము జరిగింది. **ఇదియే 'మధువిద్య'.**

ఈ విధంగా అశ్వినీదేవతల వలన దధ్యన్‌మహర్షికి అశ్వశిరస్సు లభించటము, అప్పుడు ఆ మహర్షి ఆ అశ్వ శిరస్సుతో తన వాగ్దానమును అనుసరించి ఆత్మయొక్క ద్రష్ట-దర్శన-దృశ్య అఖండ పరస్పర మధుతత్త్వమును, అంతర్లీన ఏకత్వమును బోధించటము జరిగింది. ఆయన సత్యపరిపాలన యందు ఇచ్ఛకలవారై "ప్రవర్గకర్మాంగ భూతము"..

**స వాం మధు ప్రవోచత్**
**ప్రవోచదృతాయన్ (ఋతాయన్) త్వాష్ట్రం**
**యద్దస్రావపి కక్ష్యం**
**వాం ఇతి।**

అయినటువంటి శిరచ్ఛేదన - శిరస్సంధాన రూపమగు కర్మను స్వీకరించి పరమాత్మ సంబంధమైన మధువిద్యను అశ్వినీ దేవతలకు ప్రసాదించారు.

ఈ విధంగా దధ్యఙ్ మహర్షి 'జీవించి ఉండటము' కంటే కూడా చాలా గొప్పదైనట్టి త్వాష్ట్ర సత్యమును పరిపాలించారు. (త్వష్టా=ఆదిత్యుడు ఇతి త్వాష్ట్రము). **ఇది ఆదిత్యునికి సంబంధించిన ఉపాసన కూడా.** శత్రుమర్దనులగు అశ్వినీ దేవతలిరువురికి త్వాష్ట్రమధువిద్యను (సూర్య భగవానునికి చెందిన ఆత్మ విద్యను (లేక) [స్తామితమ్ విశ్వరూపవిద్య (లేక) మధుబ్రాహ్మణ సారవిద్యను] బోధించారు.

---

**18 ఇదం వై తన్ (తత్) మధు**
**దధ్యంగౌ అథర్వణో**
**అశ్విభ్యాం ఉవాచ।**
**తత్ ఏతత్ ఋషిః**
**పశ్యన్ నవోచత్।**
**పురశ్చక్రే ద్విపదః।**
**పురశ్చక్రే చతుష్పదః।**
**పురః స పక్షీ భూత్వా**
**పురః పురుష అవిశత్ ఇతి।**
**స వా అయం పురుషః సర్వాసు**
**పూర్షు పురిశయోనై**
**నేనకించన అనావృతం।**
**నైనేన కించన అసంవృతమ్।**

'మధువిద్యాబ్రాహ్మణము'ను సారవిశేష పూర్వకంగా' అథర్వణవేదవేత్త అగు ఆ దధ్యన్ మహర్షి అంగపూర్వకంగా వివరించారు. అశ్వినీ దేవతలకు సవివరణ - సదృష్టాంత - ససంవిధాన - పూర్వకంగా సకర్మ విధులతో సహా బోధించగా అది ఆత్మజ్ఞానుల వాఙ్మయములో ప్రసిద్ధి పొందినది.

ఆత్మతత్త్వమును మధువిద్యగా దర్శించిన ఆ ఋషి 'మంత్రసిద్ధి'గా ప్రవచనము చేసి అశ్వినీ దేవతలకు సమస్త విశేషాలు బోధించారు. - అందులో కొన్ని విశేషాలు →

- ఏకమగు పరబ్రహ్మమే రెండు పాదములు (జీవాత్మ - పరమాత్మ భావన) గల వారిని (మనుష్య శరీరములను) సృజించారు.
- అదేవిధానంగా ఆ తరువాత నాలుగు పాదములు కలవారిని (పశువులను; దృశ్యము - దేహము - జీవాత్మ - పరమాత్మ భావము విడివిడిగా గల వారిని) కూడా సృజించారు.
- ఆ ఈశ్వరుడు ముందుగా పక్షి (లింగ శరీరధారుడు-మనోశరీరుడు)గా మారి అన్ని శరీరములలోను జీవరూపుడుగా ప్రవేశించారు.

ఆ విధంగా పరమాత్మ → పురుషుడై (జీవాత్మ పురుషకారము అధరించిన వారై) సర్వదేహములందు ఉండసాగారు. 'పురము' లేక 'పుర' లేక 'పురి' (Township) అనే శబ్ద వాచ్యములగు దేహములందు వసించసాగారు. పురుష స్వరూపుడై దేహమంతా నిండి ఉండసాగారు. కానీ, ఈ దేహములలో ఈశ్వరుడై నిండి ఉండినా కూడా ఆ పరమాత్మ ఈశ్వరత్వముచే దేహములలో నిండి ఉండనూ లేదు. దేని చేతనూ కప్పబడియూ లేరు. పరమాత్మ బాహ్య- అభ్యంతర స్వరూపుడై ఉన్నప్పటికీ, ఆయనకు బాహ్యము లేదు అంతరమూ లేదు.

ఈ విధంగా - బాహ్య అభ్యంతరము, నామరూపాత్మకము అగు దేహేంద్రియ రూపముతో ఉన్నట్టి **ఈశ్వరుని చేత నిండి ఉండనిది- ఎక్కడా ఏదీ కొంచెమైనా లేదు. అందుచేత పరమాత్మ పూర్ణపురుషుడు. ఈ జీవాత్మ పరమాత్మయే. ఈ జీవాత్మ సహజంగా పూర్ణపురుషుడే కూడా। (పూర్ణమదః। పూర్ణమిదమ్)।**

---

**19 ఇదం వై తన్ మధు**
**దధ్యంగౌ అథర్వణో**
**అశ్విభ్యాం ఉవాచ-**

అట్టి ఈ "ఇంద్రియములు - ఇంద్రియ విషయాలు, మనోబుద్ధి చిత్త అహంకారాలు - వాటి వాటి విషయాలు, జీవాత్మలు, అఖండాత్మ.. ఇవన్నీ బ్రహ్మము యొక్క మధుర విశేషాలే! ఆయా విశేషాలన్నిటికీ మాధుర్యము బ్రహ్మమే".. అను మధుగీత (మధుబ్రాహ్మణ వైశిష్ట్యము) - అథర్వణ

| | |
|---|---|
| **తత్ ఏతత్ ఋషిః<br>పశ్యన్ న (అ) వోచత్।** | వేత్త యగు దధ్యన్‌మహర్షి అశ్వినీదేవలకు గానం చేస్తూ అర్థతత్త్వమును బోధించసాగారు.<br><br>అట్టి ఈ మధుతత్త్వమును దర్శించిన దార్శనికుడగు ఋషి మంత్ర పూర్వకంగా (భాషాయుక్తంగా) ఇంకా ఇట్లా పలుకసాగారు. |
| **రూపగ్ం రూపం<br>ప్రతిరూపో బభూవ।<br>తదస్య రూపం ప్రతిచక్షణాయ।** | ఆ పరమేశ్వరుడు అన్ని రూపములు తనవే అయి ఉన్నవారు. ఆయన ఆత్మరూపమును బోధించుట కొరకై దధ్యన్ మహర్షి (లేక) గురువు అనే మరొక రూపమును (ప్రతిరూపమును) కూడా ధరించుచున్నారు.<br><br>పరమేశ్వరుడు తన యొక్క మాయ+ప్రజ్ఞలచే అనేక రూపములు కలవాడుగా అగుచున్నాడు. |
| **ఇన్ద్రో మాయాభిః<br>పురురూప ఈయతే<br>యుక్తా హి అస్య హరయః<br>శతా దశ ఇతి।<br>అయం వై హరయో।<br>అయం వై దశ చ। సహస్రాణి బహూని చ।<br>అనన్తాని చ।** | ఆ పరమేశ్వరుడు మాయా వినోదంగా శరీరములందు అంతటా ఇంద్రుడై (ఇంద్రభగవానుడై) → ఆస్వాదిస్తున్న - ఆస్వాదించబడుచున్న 'పురు' (పురము, దేహము) రూపము దాల్చుచున్నారు. ఆ ఇంద్రియ రూపధారణయే లక్షల కోట్ల రూపములుగా అనంతమై ప్రదర్శితమగు చున్నాయి.<br><br>కనుక ఆ పరమేశ్వరుడే - సర్వ ఇంద్రియములు. ఆ ఇంద్రియములతో ఆయన పదిగాను, పదివేలుగాను, అనేకములుగాను, అంతములేని రూపములుగాను - అగుచున్నారు. |
| **తత్ ఏతత్<br>బ్రహ్మ, పూర్వమన, పరమ్ అనన్తరమ్।<br>అబాహ్యం <u>అయమాత్మా బ్రహ్మ</u> ।<br>సర్వానుభూః ।<br><br>ఇతి అనుశాసనమ్** | అట్టి బ్రహ్మము (లేక) ఆత్మ అపూర్వము. కాలముచే బద్ధము కాని దానికి పూర్వమేమి? పరమేమి? అది పూర్వాపరాలు లేనిది. అంతరము - బాహ్యము ఆత్మయే కాబట్టి అనంతరమ్। **అబాహ్యమ్ ఇతి బ్రహ్మ।** బాహ్యము, అభ్యంతరము లేనిది బ్రహ్మము.<br><br>సర్వస్వరూపముతో సమస్తము అనుభవిస్తూ ఉన్నదే ఆత్మ। ఆత్మయే పరబ్రహ్మము। ఓ జీవాత్మా! నీవు బ్రహ్మమే అయి ఉన్నావు. **ఇతి అను శాసనమ్।** |
| **ఇతి చతుర్థాధ్యాయః<br>"మధుబ్రాహ్మణమ్"<br>నామ పంచమ బ్రాహ్మణమ్॥** | **ఇతి- బృహదారణ్యకోపనిషత్।<br>నాలుగవ అధ్యాయములోని<br>'మధుబ్రాహ్మణము' అను ఐదవ బ్రాహ్మణము॥** |

# బృహదారణ్యకోపనిషత్ - చతుర్థాధ్యాయః - షష్ఠమ బ్రాహ్మణమ్

## వంశ బ్రాహ్మణము

అట్టి పరబ్రహ్మము ఒకరిచే మరొకరికి తరతరములుగా ప్రవచించబడుచూ, బోధించబడుతూ వస్తోంది. వంశపారంపర్యముగా, గురు-శిష్య పరంపరంగా ఈ లోకమునందు బ్రహ్మజ్ఞానము దేదీప్యమానముగా ప్రకాశమానము అగుచున్నది. అట్టి ఆచార్య పరంపర, గురుశిష్యపరంపరకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించుకుంటున్నాము.

1 **అథ వగ్ంం శః। పౌతిమాష్యో**
**గౌపవనాత్, గౌ పవనః।**
**పౌతిమాష్యాత్ పౌతిమాష్యో।**
**గౌసవనాత్ గౌపవనః।**
**కౌశికాత్ కౌశికః।**
**కౌణ్డిన్యాత్ కౌణ్డిన్యః।**
**శాణ్డిల్యాత్ శాణ్డిల్యః।**
**కౌశికాచ్చ గౌతమాచ్చ గౌతమః॥**

**(1) మధుకాండ వంశపరంపర**

ఓం నమో శ్రీ గురోభ్యో!

శ్రీ పౌతిమాష్యుడు తన గురువగు శ్రీ గౌపవనుని నుండి, శ్రీ గౌనుడు శ్రీపౌతిమాష్యుడి నుండి,

- ఆ పౌతిమాష్యుడు శ్రీగౌపవనుని నుండి,
- ఆ గౌరువనుడు శ్రీకౌశుకుని నుండి,
- ఆ కౌశుకుడు శ్రీ కౌణ్డిన్యుని నుండి
- ఆ కౌణ్డినుడు శ్రీ శాండిల్యుని నుండి,
- ఆ శాండిల్యుడు శ్రీ కౌశికుని నుండి, గౌతముని నుండి,

శ్రీ గౌతముడు శ్రీ అగ్నివేశ్యుని నుండి

ఆత్మవిద్యను, "సర్వము మధురమే" అనే మధుగీతను పొందారు. వారందరికి సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తూ వారి పాదరజమును శిరస్సుపై భక్తిపూర్వకంగా ధరిస్తున్నాము.

---

2 **అగ్నివేశ్యాత్ ఆగ్ని వేశ్యః।**
**శాణ్డిల్యాత్-శ్లానభిమ్లాతాచ్చ**
**శానభిమ్లాత ఆనభిమ్లాతాచ్చ।**
**ఆనభిమ్లాతాత్ ఆనభిమ్లాతో గౌతమాత్।**
**గౌతమాత్, గౌతమః**
**గౌతమాత్-సైతవ ప్రాచీన యోగ్యాభ్యాగ్ం।**
**సైతవ ప్రాచీనయోగ్యా - పారాశర్యాత్।**
**పారాశర్యో భారద్వాజాత్।**
**భారద్వాజో భారద్వాజాచ్చ। గౌతమాత్।**
**గౌతమాచ్చ గౌతమో।**
**భారద్వాజాత్ శ్రీపారాశర్యః।**
**శ్రీపారాశర్యో శ్రీ బైజవవాపాయనః।**

**(2) ఆ గౌతముడు శ్రీ అగ్నివేశ్యుని నుండి,**

- ఆ అగ్నివేశ్యుడు శ్రీ శాండిల్యుని నుండి, (మరియు) శ్రీ ఆనభిమ్లాతుని నుండి,
- ఆ ఆనభిమ్లాతుడు శ్రీ గౌతముని నుండి,

→ ఆ గౌతముడు → శ్రీ సైతవుని నుండి (మరియు అనేక మంది యోగులగు మహనీయుల నుండి)

ఆ సైతవుడు ప్రాచీన యోగ్యుడగు శ్రీపారాశర్యుని నుండి

ఆ పారాశర్యుడు శ్రీ భారద్వాజుని నుండి,

ఆ భారద్వాజుడు → శ్రీ భారద్వాజ గౌతముల నుండి

ఆ గౌతముడు శ్రీ భారద్వాజుని నుండి,

ఆ భారాద్వాజుడు శ్రీ పారాశర్యుని నుండి,

ఆ పారాశర్యుడు శ్రీ బైజవాపాయనుని నుండి,

బైజవాపాయనాత్, - బైజవాపాయనః
కౌశికాయనేః కౌశికాయనిః॥

ఆ బైజవాపాయనుడు → శ్రీ కౌశికాయనుని నుండి,
(ఘృతకౌశుకుని నుండి)
బ్రహ్మ విద్యను నేర్చుకున్నవాయ్యారు.

అట్టి బ్రహ్మ విద్యను తరతరములుగా, వంశ పారపర్యంగా, గురు-శిష్య అనుగతంగా బోధిస్తూ, బోధింపబడుచూ, గ్రంథస్థం చేస్తూ వస్తున్న గౌతమ పారాశర్య భారద్వాజ బైజపాయన మొదలైన మహామనీయులందరికీ త్రిప్రదక్షణ పూర్వక- సాష్టాంగ దండ ప్రణామములు. రెండు చేతులు జోడించి నమస్కరిస్తున్నాము.

---

3 (కౌశికాయనః) ఘృత కౌశికాత్।
ఘృతకౌశికః పరాశర్యాయణాత్।
పారాశర్యాయణః పరాశర్యాత్।
పరాశర్యో జాతూకర్ణ్యాత్।
జాతూకర్ణ్యః ఆసురాయణాచ్చ, యాస్కాచ్చ।
ఆసురాయణ, స్త్రైవణే। స్త్రైవణిః రౌపజన్ధనే।
రౌపజన్ధనే రేపజన్ధనిరాసురే।
ఆసురిః భారద్వాజాత్।
భారద్వాజ ఆత్రేయాత్। ఆత్రేయో మాణ్డేః।
మాణ్డిః గౌతమాత్। గౌతమో గౌతమాత్।
గౌతమో వాత్స్యాత్।
వాత్స్యః శాణ్డిల్యాత్।
శాండిల్యః కైశోర్యాత్। కాప్యాత్ కైశోర్యః।
కాప్యాత్ కైరార్యో - కాప్యాత్।
కాప్యః కుమార హరితాత్।
కుమార హారితో గాలవాత్।
గాలవో, విదర్భీ కౌణ్డిన్యాత్।
విదర్భీ కౌణ్డిన్యో వత్సనపాతోబాభ్రవాత్।
వత్సనపాద్బాభ్రవః పధాస్సౌరభరాత్।
పన్థాస్సౌరభరో- అయాస్యాత్-అంగిరసాత్
యాస్య ఆఙ్గిరస ఆభూతే
స్త్వాష్ట్రాత్। ఆభూతిస్త్వాష్ట్రాత్।
విశ్వరూపస్త్వాష్ట్రో అశ్విభ్యాం।
అశ్వినో దధీచ అథర్వణాత్, అధ్వఙ్జాత్।
అధ్వఙ్జాత్ - అథర్వణోదైవాత్।

ఆ కౌశికాయనుడు శ్రీఘృత కౌశికుని నుండి,
ఆ ఘృత కౌశికుడు → శ్రీ పారాశర్యాయణుని నుండి
ఆ పారాశర్యాయణుడు → శ్రీ పారాశర్యుని నుండి,
ఆ పారాశర్యుడు → శ్రీ జాతూకర్ణ్యుడి నుండి,
ఆ జాతూకర్ణ్యుడు → యాస్కురాయుణుని నుండి, (మరియు), యాస్కులుని నుండి,
ఆ యాస్కురాయణుడు శ్రీ త్రైవణి నుండి,
ఆ త్రైవణి → శ్రీ ఔపజంధనుని నుండి
ఆ ఔపజంధనుడు శ్రీ భారద్వాజుని నుండి,
ఆ భారద్వాజుడు → శ్రీ ఆత్రేయుని నుండి,
ఆ ఆత్రేయుడు → శ్రీ మాండవ్యుని నుండి,
ఆ మాండవ్యుడు → శ్రీ గౌతముని నుండి,
ఆ గౌతముని → శ్రీగౌతమ ఋషి నుండి,
ఆ గౌతముడు → వాత్స్యుని నుండి,
ఆ వాత్స్యుడు → శ్రీ శాండిల్యుని నుండి,
ఆ శాండిల్యుడు → శ్రీ కైశోర్యకాప్యుని నుండి,
ఆ కైశోర్యకాప్యుడు →శ్రీ కుమారహారితుడి నుండి,
కుమారహారితుడు →గాలవుని నుండి,
ఆ గాలవుడు → శ్రీ విదర్భీ కౌండిన్యుడి నుండి,
ఆ విదర్భీకౌండిన్యుడు → శ్రీ వత్సనపాత్ బాభ్రవుని నుండి,
ఆ వత్సనపాత్ బాభ్రావుడు → శ్రీ విదర్భీ కౌణ్డిన్యుని నుండి,
ఆ విదర్భీ కౌణ్డిన్యుడు → శ్రీ వత్సనపాతో బాభ్రవుని నుండి
ఆ వత్సపాత్ బాభ్రవుడు → శ్రీ పంథా సౌభరునుని నుండి
ఆ పంథా సౌభరుడు → శ్రీ అయాస్య అంగిరసుని నుండి,
అయాస్య అంగిరసుడు → ఆభూతే త్వాష్టుని నుండి,

**అథర్వణాద్దైవో - మృత్యోః।**
**మృత్యోః ప్రాధ్వగ్ం।**
**సనాన్మృత్యుః ప్రాధ్వగ్ం**
**సనః ప్రధ్వగ్ం**
**సనాత్ ప్రధ్వగ్ంసన ఏకఋషేః।**
**ఏక ఋషిః- విప్రచిత్తేః।**
**విప్రచిత్తిః వ్యష్టేః। వ్యష్టిః సనారో।**
**సనారుః సనాతనాత్।**
**సనాతనః సనకాత్।**
**సనకః పరమేష్ఠినః।**
**పరమేష్ఠీ బ్రహ్మణో।**
**బ్రహ్మ స్వయమ్భు బ్రహ్మణే నమః।**

ఆ ఆభూతిత్వాష్ట్రుడు → శ్రీ విశ్వరూపత్వాష్ట్రుని నుండి,
ఆ విశ్వరూపత్వాష్ట్రుడు అశ్వినీ దేవతల నుండి,
ఆ అశ్వినీదేవతలు దధీచి(దధ్యన్) అథర్వణుని నుండి,
అధ్యాత్మ విద్యా పరంపరగా శ్రుతముచేయబడుతూ వస్తోంది.
అథర్వణః దైవుని నుండి మృత్యుప్రాధ్వసనుడు,
ఆ మృత్యు ప్రధ్వసనుడు ఏకర్షి నుండి,
ఆ ఏకర్షి విప్రచిత్తి నుండి,
ఆ విప్రచిత్తి వ్యష్టి నుండి,
ఆ వ్యష్టి సనారువు నుండి
ఆ సనారువు సనాతనముని నుండి,
ఆ సనాతనుడు సనకుని నుండి,
ఆ సనకుడు పరమేష్ఠి నుండి,
పరమేష్ఠి బ్రహ్మనుండి,

ఈవిధంగా బ్రహ్మ విద్యను గ్రహించటం జరుగుతూ వచ్చింది.
బ్రహ్మ స్వయంభువు. తన ఉనికికి తానే కారణమై ఉన్నట్టివాడు.
స్వయంభువు అగు బ్రహ్మదేవునికి, భక్తిపూర్వకంగా ప్రణమిల్లుచున్నాము.

**ఇతి బృహదారణ్యకోపనిషత్**
**చతుర్థాధ్యాయః**
**"వంశఋషి బ్రాహ్మణం" నామ షష్ఠం బ్రాహ్మణమ్॥**

ఇతి బృహదారణ్యకోపనిషత్
చతుర్థాధ్యాయః
"వంశఋషి బ్రాహ్మణం" నామ షష్ఠం బ్రాహ్మణమ్॥

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 9 బృహదారణ్యకోపనిషత్

## చతుర్థ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### అధ్యయన పుష్పము



## చతుర్థ అధ్యాయము-ప్రథమ బ్రాహ్మణము

### అజాతశత్రు బ్రాహ్మణము

బలాకి అనే మునీశ్వరుని కుమారుడు బాలాకి. ఆయన వ్యావహారిక నామము గార్గ్యుడు! ఆ గార్గ్యునికి తన బ్రహ్మోపాసనాపరిజ్ఞానమును పాత్యాంశముగాను, ఉపాసనావిధిగాను ఒక మహారాజుకు బోధించి, తద్వారా తన ఆశ్రమమునకు గోవులను సంపాదించుకోవాలనే యోచన వచ్చింది.

ఒకానొకరోజు ఆ గార్గ్యుడు కాశీరాజు అగు అజాతశత్రువును చూడటానికి వెళ్ళారు. రాజు ఆ మునిని సాదరముగా ఆహ్వానించి అతిథి మర్యాదలు సమర్పించారు.

**అజాతశత్రురాజు :** ఓ బలాక మునిపుత్రా! బాలాకీ! గార్గేయా! మీకు సుస్వాగతము. ఆశ్రమవాసులగు మీసేవ చేయుటకు సిద్ధముగా ఉన్నాను. దయచేసి నేను ఏమి సేవ చేయగలనో.. ఆజ్ఞాపించండి.

**గార్గ్యముని :** మహారాజా! మీరు జ్ఞానదృష్టి కలవారు. కనుకనే ఇంతటి నిరహంకారము కలిగి ఉన్నారు. ఆశ్రమవాసులమగు మా పట్ల ఆప్యాయత ప్రదర్శించుచున్నారు. మా పిత్రుదేవులగు బలాక మునీంద్రుల వద్ద మేము ఎరిగిన పరబ్రహ్మము, ఆత్మోపాసనావిధి – విధానము విషయమై మీతో కొన్ని విషయాలు సూచనలుగా ముచ్చటించాలనుకుంటున్నాను. జ్ఞానదృష్టితో ఆత్మతత్త్వము గురించి సంభాషించుకోవటము సర్వశ్రేయము కదా!

**అజాతశత్రురాజు :** ఓ ముని కుమారా! మహనీయా! గార్గ్య మునీ! అవును! పరబ్రహ్మము గురించి చెప్పుకోవటము కంటే శ్రేయోదాయకము మరింకేముంటుంది? తప్పక చెప్పండి. నేను వినటానికి సిద్ధముగా ఉన్నాను స్వామీ!

ఇంకొక విషయము కూడా! అనేక మంది ఆశ్రమవాసులగు మునులు, తత్త్వజ్ఞులు, వింధ్య-హిమాలయాలలోను, [పవిత్ర ప్రదేశములలోను నివసించు (తపస్సు చేసుకొను) ] తదితర మహనీయులు చాలామంది **"మేము కర్మయోగియగు జనక మహారాజును దర్శిస్తాము"** అని జనకుని సభకు వేంచేస్తూ ఉంటారు. వారి ఆత్మతత్త్వానుభవ విశేషాలను ప్రవచిస్తూ సభలో ఉపన్యసిస్తూ ఉండటము, శ్రీ జనక మహారాజు సత్సంగ సభలను జరిపిస్తూ ఉండటము (మామూలుగా) పరిపాటి. ఈ రోజు ఈ కాశీరాజ్యానికి వచ్చి **'పరబ్రహ్మము'** నకు సంబంధించిన ఉపాసన గురించి సంభాషించ సిద్ధపడటము – నాకు చాలా సంతోషము. మీరు నన్ను విదేహరాజగు జనకునితో

సమానముగా-శ్రోతగా, దాతగా కూడా-సన్మానిస్తున్నట్లుగా భావిస్తున్నాను. ఈ సంతోష సమయములో మీ ఆశ్రమమునకు '1000' గోవులను భక్తిపూర్వకంగా సమర్పణ చేస్తున్నాను. దయతో స్వీకరించప్రార్థన.

ఇప్పుడిక సుఖాసీనులై పరబ్రహ్మతత్త్వము యొక్క తత్త్వోపాసన గురించి మీరు చెప్పాలనుకొన్న విశేషాలు మాపై దయతో సెలవియ్యండి. నేను, మా మంత్రివర్యులు, సభికులు – మేమందరము వినటానికి సముత్సాహులమై ఉన్నాము.

⌘⌘⌘

**గార్గ్యుడు :** ఓ రాజా! నేను చెప్పుచున్న విషయమునకు ఏమైనా అనుబంధముగా చెప్పదలచుకొంటే, మీరుగాని, మీ మంత్రులుగాని మీమీ ఉపాసనల గురించి కూడా చెప్పవచ్చును. ఇక వినండి. నేను ఎవరిని ఏమని ఉపాసిస్తున్నానో చెప్పుతాను. మీరు ఏరీతిగా ఉపాసిస్తున్నారో కూడా మీరు చెప్పండి. ఇది మనపట్ల అత్యుత్తమమగు సత్సంగమగుగాక।

## ఆదిత్య పురుష బ్రహ్మము

**య ఏవ ఆసావాదిత్యే పురుష, ఏతమేవ అహం బ్రహ్మోపాస ఇతి।** ఓ అజాతశత్రు మహారాజా! ఏ **'పురుషకారము'** (లేక) పురుషుడు ఆదిత్య మండలమంతా తన తేజస్సుతో నింపి ఉంచుచున్నారో, ఆ మహామహనీయుడే జగత్తునంతా వెలుగుతో నింపుచున్నారు కాబట్టి, నేను **'బ్రహ్మము'**ను సిద్ధించుకోవటానికై ఆ సూర్యభగవానుని ఉపాసిస్తున్నాను.

ఎందుకంటారా? వినండి.

ఆ సూర్యమండలము నందు, ఈ కంటియందు కూడా **– ఏవ ఆసావాదిత్యే చక్షుషి చ ఏకో అభిమానీ–** ఉన్న అభిమాని ఒక్కడే! ఆయనయే కంటిద్వారా హృదయంలో కూడా ప్రవేశించి **"నేను భోక్తను! నేను కర్తను"**.. అను భావన కలిగి ఉన్నారు కూడా। అందుచేతనే నేను ఆయనను **'బ్రహ్మము' కొరకై ఉపాసించటము** జరుగుతోంది. మీరు కూడా అట్టి ఆదిత్య పురుషుడినే బ్రహ్మోపాసనగా ఆశ్రయించమని సూచిస్తున్నాను. ఆదిత్యుని స్తుతించెదము గాక।

**అజాతశత్రురాజు :** అయ్యా! బ్రహ్మము విషయములో వాదోపవాదములు వద్దని పెద్దల సూచన కదా! పరబ్రహ్మమే సూర్య మండల పురుషుడుగా ఉన్నారు. సూర్యమండలముతో సహా సర్వదేహములలోను సర్వతత్త్వ స్వరూపునిగా నేను పరబ్రహ్మమును ఉపాసిస్తున్నాను. అట్టి బ్రహ్మము సకల ప్రాణులకు – అధిష్ఠానము. సమస్తమును అతిక్రమించినట్టివారు. ఆయనను సకల ప్రాణులకు శిరస్సు వంటి వానినిగా ఆరాధిస్తున్నాము. సకల దేహ-ఇంద్రియములకు కర్త-భోక్త, సర్వ ఇంద్రియ సంఘాతములకు కారకుడు కూడా! సర్వమును వెలిగించువాడుగా దర్శిస్తున్నాము. "బ్రహ్మమే సూర్యబింబముగా, సూర్య తేజస్సుగా కూడా ప్రదర్శనమగుచున్నారు" – అను భావనతో మేము సూర్యోపాసనకు ఉపక్రమిస్తున్నాము.

సకల ప్రాణులకు తలవంటివాడుగా, దీప్తిమంతుడుగా **ఎవ్వరు బ్రహ్మమును ఉపాసిస్తాడో,** పరమ పురుషుడుగా దర్శిస్తారో, – అట్టివాడు సకల ప్రాణులను అతిక్రమించినవాడుగాను, సకల ప్రాణులలో జ్ఞానజ్యోతి వెలిగించువాడుగాను **'దీప్తిమంతుడు'** గాను అగుచున్నాడు. పరబ్రహ్మమే సూర్య తేజస్సుగాను, కంటిలో 'చూపు' అను తేజస్సుగాను వెలుగొందుచూ, దర్శించబడేదంతా (కనబడుచున్నదంతా) పరమాత్మయే అని మేము ఉపాసిస్తున్నాము.

> *పరబ్రహ్మమును సర్వజీవులుగాను, సర్వజీవులలోను ఉపాసించటమే మేమిప్పుడు చేస్తున్నాము. ఇప్పుడిక సూర్యునిలోను, **తేజస్సుగాను, కంటిలోగాను, చూపుగాను, చూడబడునదిగాను** కూడా ఉపాసిస్తున్నవారమగుచున్నాము.*

## చంద్రమస బ్రహ్మము

**గార్గ్యుడు :** అట్లాగా? అయితే ఇది వినండి. చంద్రునిలో ఏ పురుషుడు ఉన్నాడో, ఆయనను నేను **పరబ్రహ్మము యొక్క సిద్ధికొరకై** ఉపాసించుచున్నాను. మీరూ అట్లాగే ఉపాసించవచ్చునని గుర్తుగా చెప్పుచున్నాను. చంద్రుని గురించిన స్తోత్ర మంత్రములచే మనము ఉపాసించెదము గాక।

**అజాతశత్రురాజు :** స్వామీ! మేము ఉపాసిస్తున్నట్టి ఆ పరమపురుషుడు మహత్తరము (మరియు) బృహత్ (పెద్ద) పరిణామము కలవాడు. తెల్లటి వస్త్రములు ధరించినవాడు (శుద్ధసాత్వికము) అగు బ్రహ్మమే చంద్రునిగాను, చంద్రుని ప్రసాదితములగు ఓషధులుగాను, సర్వే సర్వత్రా ప్రకాశించువాడుగాను ఉన్నారని మేము ఉపాసించుచున్నాము. యజ్ఞవిధులలో సోమలతను దంచుటచే లభ్యమగు 'సోమరసము'గా ఉన్నదీ ఆ బ్రహ్మమే! చంద్రునితో సహా, ఓషధులతో సహా, సోమలతతో సహా, చంద్రుని అమృతకిరణములతో సహా ఉన్నది బ్రహ్మమే। చంద్రమండలాభిమానిగా ఉన్నది కూడా పరబ్రహ్మమేనని ఎరిగి ఉంటున్నాము. దృశ్యములో హసుత-ప్రసుత (ప్రకృతి-వికృతి) స్వరూపుడై కూడా ఆ పరబ్రహ్మమే వేంచేసిఉన్నారు. (హసుత = పెద్ద, దొడ్డ)

"→ చంద్రుడు మాత్రమే పరబ్రహ్మము కాదు।

→ చంద్రుడుగా కూడా ఉన్నది పరబ్రహ్మమే । అయ్యది అనన్యము సమస్తము, సమగ్రము కూడా।"

అని ఉపాసించువారి యొక్క అన్నము (అనుభూతి, అనుభవము) క్షీణము పొందదు. అట్టి బ్రహ్మావలోకానుభవము సర్వదా సర్వత్రా కొనసాగుతూనే ఉండగలదు.

## విద్యుత్ బ్రహ్మము

### (వెలుగు, తేజోపుంజము)

**గార్గ్యుడు :** ఏ పురుషుడైతే విద్యుత్ (వెలుగు, తేజస్సు) నందు ఉండి ప్రకాశించుచున్నారో, ఆయనను **బ్రహ్మముయొక్క స్వానుభవము కొరకై** నేను ఉపాసించుచున్నాను.

**అజాతశత్రురాజు :** పరబ్రహ్మమే తన యొక్క లీలా-క్రీడా-మహిమా విశేషాలచేత, మెరుపునందు తేజోరూపుడై కూడా వెలుగొందుచున్నారని నేను ఉపాసిస్తున్నాను. అంతేగాని, పరబ్రహ్మము మెరుపురూపులు (తేజోపుంజములు) ద్వారా అట్టి విద్యుత్ ఉపాసనాఫలంగా ఎప్పటికో సిద్ధించునది - అని మేము తలచటము లేదు.

ఎవ్వడైతే బ్రహ్మమే జగత్తునందు తేజోరూపముగా కూడా వెలుగొందుచున్నదని ఉపాసిస్తాడో, అట్టివాడు తేజో స్ఫూర్తి కలవాడగుచున్నాడు. **ఆతని సంతానము, ఆతనిని ఆశ్రయించినవారు కూడా తేజోస్ఫూర్తిసమన్వితులగుచున్నారు.**

**తథా విద్యుతి త్వచి హృదయే చ ఏకా దేవతా।** విద్యుత్తు నందు, త్వక్ ఇంద్రియమునందు స్పర్శనుభమముగా అగు వస్తువునందు గల చైతన్యము ఒక్కటే. **"తేజోమయముగా కనిపించేదంతా పరబ్రహ్మమే"** అని భావించుటచే సర్వ సహజీవులు తేజోమయ స్వరూపులై అనుభవమగుచున్నారు. ఆత్మను ప్రాణతేజో విద్యుత్ రూపముగాను, సమస్త జగత్తును ఆత్మతేజోమండలముగాను మేము ఉపాసిస్తున్నాము.

## ఆకాశ బ్రహ్మము

**గార్గ్యుడు :** ఆకాశమునందు ఏ ఆకాశ పురుషాభిమాని ఉన్నారో, ఆయనయే శరీర - ఇంద్రియ సముదాయము నందు కూడా ఉన్నట్టి పరబ్రహ్మము. అట్టి ఆకాశపురుషుని నాయొక్క **చిదాకాశానుభవ సిద్ధి కొరకై** నేను ఉపాసించుచున్నాను. మీరు కూడా అట్టి ఆకాశాభిమాన పురుషుని ఉపాసించుటచే పరబ్రహ్మమును సిద్ధించుకో గలుగుతారు. **"ఆకాశాత్ వాయురిత్యేవ ఏతి"** – ఇట్టి స్తోత్రములతో ఆకాశ పురుషుడు ఆత్మగా ఉపాసించబడుగాక!

**అజాతశత్రురాజు :** పరమపురుషుని విషయములో అట్లా కూడా పూర్ణము కాదు. ఆ పరమ పురుషుని మేము **"పూర్ణుడు. సర్వక్రియాశూన్యుడు సర్వక్రియాతీతుడు. నిష్క్రియుడు. కర్మలకు అవిషయుడు"..** అని ఉపాసిస్తున్నాము.

ఆకాశము నందు, హృదయమునందు, హృదయాకాశమునందు ఏకైక పురుషుడే ఉన్నారు. పూర్ణము - అప్రవర్తి (ప్రవర్తనమే లేనివాడు) అనునవి పరబ్రహ్మమునకు స్వభాతః ఉండిఉన్న లక్షణాలు.

**'పూర్ణుడవటం చేత అకర్తకూడా'** అని ఎవ్వరు పరబ్రహ్మమును ఎరిగి ఉపాసిస్తారో, వారి సంతానము లోకము నందు విచ్ఛిన్నము పొందదు. అవిచ్ఛిన్నముగా కొనసాగగలదు.

ఆకాశమునందంతటా పరబ్రహ్మము నిండి ఉండవచ్చు గాక! పరబ్రహ్మము నందు ఆకాశము లేదు. పరమాత్మను పూర్ణుడుగా ఉపాసించువాడు తానూ సంతానము మొదలైన వాటితో కూడి 'పూర్ణుడు' అగుచున్నాడు. ఆతనికి లోకములతో విభేదము ఉండదు. లోకములన్నీ కూడా తానే అయి ఉండగా, ఇక ఆత్మకు విభేదము ఎందుకు? ఎద్దానితో విభేదము? **లోకములన్నీ ఆత్మయందే ఉండి ఉన్నట్లు, ఆత్మ సర్వదా లోకాతీతమై ఉండి ఉన్నట్లు – మేము ఉపాసిస్తున్నాము.**

## వాయు బ్రహ్మము

**గార్గ్యముని :** వాయువు నందు ఏ చేతన పురుషుడు సర్వదా సర్వ కదలికలకు, స్పందనలకు కారకుడై వేంచేసిఉన్నారో, ఆయననే నేను **పరమాత్మ స్వరూప సిద్ధికొరకై** ఉపాసించుచున్నాను. **"నమస్తే వాయుః। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి–"** ఇత్యాది మంత్రములతో బ్రహ్మము కొరకై వాయుదేవుని ఉపాసిస్తున్నాను.

**అజాతశత్రురాజు :** వాయువు నందు, ప్రాణము నందు, హృదయము నందు ఒకే ఆత్మదేవత (దివ్యత్వము) వేంచేసి ఉన్నది. ఆ దేవత (దివ్యత్వము) విషాసహిత (విషమును కూడా సహించగలుగునది)... అని వర్ణించబడుచున్నది.

అట్టి సమస్తము తానైన ఆ పరమ పురుషుడే – విషయములు అగుచున్నవాని గాను, పంచేంద్రియ విషయరూపుడుగాను,

- – ఇంద్రియములకు, త్రిలోకములకు అధిపతిగాను, ఇంద్రుడు గాను,
- – జగత్ సృష్టికర్త (లేక) జగత్ భావకుడు అగు బ్రహ్మ గాను,
- – ఈ జగత్తులకు స్థితికారకుడగు వైకుంఠుడు శ్రీమన్నారాయణుడు గాను,
- – లయకారుడగు రుద్రుడుగాను,
- – అపరాజితుని, (పరాజయము అనునదే లేనట్టి తత్త్వముగాను) **ఆరాధిస్తున్నాము.**

ఆత్మను – అపరాజితమగు ప్రాణ రూప పురుషునిగా నేను ఉపాసించుచున్నాను. అట్టి ఉపాసనచే ఆ ఉపాశించువాడు – జయశీలుడు, పరాజయము లేనివాడు, శత్రువులను జయించువాడు అగుచున్నాడు.

## అగ్ని బ్రహ్మము

**గార్గ్యముని :** అగ్నియందు ఏ పురుషుడు (పురుషకారము) (అగ్న్యభిమాన దేవతాపురుషుడు) వేంచేసి ఉన్నారో, ఆయననే నేను/ **బ్రహ్మముకొరకై ఉపాసించుచున్నాను.** అగ్నినే పరమాత్మగా స్తోత్రాదులు సమర్పిస్తున్నాను. **'అగ్నిర్తేజసో బహ్మాధారణం'** – అని తేజోబ్రహ్మముకొరకు ఉపాసిస్తున్నాను.

**అజాతశత్రువు :** ఆ పరబ్రహ్మమును **"అగ్నిరూపుడు మాత్రమే"** గా మేము ఉపాసించటంలేదు. పరబ్రహ్మమూర్తి **సర్వవిషయములు తానే అయి, సర్వ విషయములకు వేరైనట్టి** విషాసహిగా (విషయములను సహించువాడుగా) నాచే ఉపాసించబడుచున్నారు. ఎవ్వరైతే పరమాత్మను **సర్వ విషయాతీతుడుగాను, సర్వ స్వరూపుడుగాను, నిర్విషయుడుగాను, విషాసహిగాను** ఉపాసిస్తారో, అట్టివాడు ఇతరులను సహించువాడగుచున్నాడు. ఆతని సంతానము, శిష్యులు, స్నేహితులు కూడా ఆతనిపట్ల సహనము కలవారగుచున్నారు.

## అప్పుబ్రహ్మము

**గార్గ్యముని :** అయితే రాజా! ఇంకా నా ఉపాసన ఇట్లున్నది. జలమునందు (ఉదకము నందు) ఏ ప్రాణ స్వరూపుడగు పురుషుడు ఉన్నారో, ఆయనను నేను ఈ దేహ– ఇంద్రియములలో గల **పరబ్రహ్మముకొరకై ఉపాసించుచూ** బ్రహ్మమును చేరుటకు ఆశయముగా కలిగి ఉంటున్నాను. (**"ఆపోవా ఇదగ్ంం సర్వమ్। విశ్వభూతాన్యాపః। అన్నమాపో! సమ్రాట్ ఆపో! విరాట్ ఆపో!"**... ఇత్యాది శ్లోకాల ద్వారా) జలదేవతను స్తోత్రం చేయగా, బ్రహ్మము లభించగలదు.

**అజాతశత్రువు :** మిత్రమా! గార్గ్యమునీ! ఉదకము నందలి ప్రాణరూపుడైన పురుషుడు మాత్రమే పరబ్రహ్మము కాదు. పరమాత్మ యొక్క ఒకానొక రూపమును తీసుకొని ఇదియే పరమాత్మ యొక్క పూర్ణ రూపము" అని పూజించుటచే అది **"సమగ్రము-పూర్ణము అగు ఆత్మోపాసన"** ఎట్లా అవుతుంది? "జలాభిమాన పురుషుడు పరమాత్మ యొక్క ఒకానొక అంశరూపుడే" అను భావనను ఆశ్రయించి, అప్పుపురుషుని (జలదేవతను) ఉపాసిస్తున్నాము.

ఎవ్వరు మీరు చెప్పు జలాభిమానదేవతను ఆత్మకు ప్రతిబింబ రూపముగాను, ఆత్మను బింబరూపముగాను, ఉపాసిస్తున్నారో, ఆ ఉపాసించునది ఆత్మయొక్క కళయే। జలమునందుగల సర్వజీవుల దాహము తీర్చే త్రాణరూప దేవతగా ఉన్నది కూడా ఆత్మ యొక్క ఒక విశేష సంప్రదర్శనమే। ఈవిధంగా ఉపాసించువానిని ప్రతికూల ఫలములు సమీపించవు. పైగా ఆతని ప్రతిబింబరూపమే ఆతనికి పుత్ర సంతానముగా అగుచున్నారు.

నీరు, రేతస్సు-హృదయము నందు ఒకే దేవత. ఆ దేవతకు **'ప్రతిరూపుడు'** అనేది గుణము. **సర్వత్రా సమరూపుడైయున్న పరమాత్మను జలమునందుకూడా ఉపాసిస్తున్నాం.**

## ఆదర్శ పురుషుడు

**గార్గ్యుడు :** అద్దములో ఏ ప్రతిబింబపురుషుడు కనిపిస్తూ ఉంటాడో, ఆయనను నేను **పరబ్రహ్మోపాసన కొరకై** ఉపాసించుచున్నాను. (నిజాత్మకాకుండా, ఒక దేవతను (లేక) అవతార పురుషుని (లేక) గురువును ఉపాసించటము).

(1) నిర్మలమగు అద్దమునందు (2) తదితరములగు ఖడ్గము మొదలైనవాటియందు (ఇనుములో లేని లక్షణము ఖడ్గమునందు 'పదును' రూపముగా అగుపించురీతిగా) - ప్రతిబింబించు స్వభావముతో కనిపించు పురుషుడే పరమపురుషుడు. పరమాత్మ బింబపురుషునిగాను, ***'జగత్తు'*** అనే దర్పణములోని ప్రతిబింబమే ***'జీవాత్మ'*** అని పరాతత్త్వ సిద్ధికై ప్రతిబింబ (అంశా) పురుషుని ఉపాసిస్తునాము.

**అజాతశత్రువు :** అద్దము నందు ప్రతిఫల (Reflecting) స్వరూపుడైనవాడు ఆత్మయగు ప్రాణస్వరూప-సమగ్రము కాదు. **ప్రతిబింబము యొక్క కారణ స్వరూపుడగు బింబస్వరూప ఆత్మభగవానుని నేను పరమాత్మగా ఉపాసించుచున్నాను.** అట్టి పరమాత్మయే రోచిష్ణువు (సర్వమును ప్రకాశింపజేయువాడు)। స్వయం ప్రకాశకుడు। స్వీయ ప్రదీప్తి కలవాడు।

ఎవరు ప్రతిబింబమగు జీవుని అధిగమించి, అద్దానికి ఆధారమగు పరమాత్మను ఉపాసిస్తారో, అట్టివారు దీప్తి కలవారగుచున్నారు.

- ప్రతిబింబమును (ఒక వ్యక్తినో, ఒక దేవతనో) ఉపాసించువాడు → **అన్యోపాసకుడు!**
- బింబమును (సర్వ అంతర్యామిని) ఉపాసించువాడో → **అనన్యోపాసకుడు.**

బింబోపాసన ఆశ్రయించువాడు ప్రతిబింబమాత్ర రూపమగు ఈ దృశ్యజగత్తును ఆత్మయందు ఆత్మకు అభిన్నముగా దర్శించుచున్నాడు.

## అంతం పశ్చాత్ (వెళ్ళుచున్న వ్యక్తి వెనుక గాలి వలన పుట్టు) శబ్దము।

**గార్గ్యుడు :** సరేః! నేను నిర్వర్తించే మరొక ఉపాసన గురించి చెప్పుచున్నాను. వినండి. ఒకడు నడచి వెళ్ళుచూ ఉన్నప్పుడు గాలి వలన ఏ 'ష్ష్' శబ్దము (జుయ్ జుయ్) - పుట్టుచున్నదో, అట్టి అంతం పశ్చాత్ వాయుజనిత శబ్దమును **'బ్రహ్మము'**గా భావించి నేను ఉపాసన చేయుచున్నాను. ఆ శబ్దమున దేహేంద్రియాది సముదాయమునందు **పరబ్రహ్మము కొరకై** ఉపాసిస్తున్నాను. కదిలే దేహములను ప్రక్కకుపెట్టి, కదిలించేవానిని ఆత్మగా ఉపాసించి, ఆ ఉపాసనా ప్రయోజనముగా ఆత్మదర్శనం చేస్తున్నాము.

**అజాతశత్రువు :** మహనీయా! మీరు చెప్పినట్టి అంతం పశ్చాత్ శబ్దమును (*"ఒకడు నడిచి వెళ్ళుచున్నప్పుడు వెనుకగా వినబడుచున్న ఊపిరిశబ్దము"*)ను నేను ప్రాణశక్తి యొక్క ఒక క్రియాప్రదర్శనముగా మాత్రమే భావిస్తున్నానుగాని, సమగ్రమగు ఆత్మస్వరూపముగా కాదు.

ఎవ్వరైతే ఈ దేహము యొక్క కదలికలు, శబ్దములు విభవములు, - ఇవన్నీ కూడా ప్రాణశక్తి యొక్క ప్రదర్శనములే - అని గమనిస్తూ.. ప్రాణశక్తిని **"ఆత్మ యొక్క సంప్రదర్శనము"**గా దర్శిస్తాడో, **"ఇదంతా ప్రాణతత్త్వప్రదర్శన"**గా దర్శిస్తాడో, అట్టివాడు పూర్ణాయుర్దాయము కలవాడగుచున్నాడు. **అట్టివాడు అర్థాయుష్కుడు అవడు.**

## దిక్షు పురుష ఉపాసన

**గార్గ్యముని! :** ఓ అజాతశత్రు మహారాజా! దిక్కులందు, వినికిడి యందు (శ్రోత్రములందు) హృదయమునందు అభిమానము కలిగియున్న నాయొక్క మరొక పురుషుని గురించిన ఉపాసన గురించి చెప్పుచున్నాను. 8 దిక్కులందు ఏ **"అష్టదిక్ అభిమాన పురుషుడు - దిక్ దేవత"**గా ప్రవర్తించుచున్నారో, అట్టి దిక్షు అహంకారిని పరబ్రహ్మముకొరకై ఆరాధిస్తున్నాను. అట్టి అష్టదిక్ పాలక అభిమాన దేవత బ్రహ్మముగా మీరు ఆరాధించవలెను. ("ఓం ప్రాక్చై - దక్షిణాయై - ప్రదీచ్యై - ఉదీచ్యై- ఊర్ధ్వ - అధో దిశాయాశ్చా దేవతా - ఏతస్యాం ప్రతివసంతి" - అని ఉపాసించాలి).

**అజాతశత్రువు :** ఎవడు రెండవ వాడుగా అగుటయే లేదో,.. అట్టి ఆత్మ పురుషుని నేను ఉపాసిస్తూ ఉండటము చేత, మీరు చెప్పుచున్న దిక్షు - పరిమిత ఉపాసనను పూర్ణమగు పరమ పురుషుని ఆత్మభగవానుని సమగ్రముగా మేము భావించటము లేదు. సర్వాంతర్యామి, సర్వ తత్త్వ స్వరూపుడు అగు - ఆత్మపురుషుని అద్వితీయముగా ఉపాసించుటచే ఆతడు సర్వదా తోడు అయి ఉంటాడు.

## ఛాయామయ పురుషోపాసన

**గార్గ్యుడు :** నీడ (ఛాయ)లో తాదాత్మ్యము అగుచున్న ఏ పురుషుడున్నాడో (ఛాయపురుషుడై ఉన్నాడో), - ఆతనే పరబ్రహ్మముగా నేను ఉపాసిస్తూ వస్తున్నాను. **'ఛాయామాత్రము'** అనతగిన దేహ - ఇంద్రియ సముదాయమును బ్రహ్మముగా భావన చేస్తూ **బ్రహ్మము కొరకై** ఆరాధిస్తున్నాను.

**అజాతశత్రువు :** నేను పరమపురుషుడే **'మృత్యువు'**గా (మార్పు చేర్పులు పొందునదిగా) కూడా ఉన్నట్లు ఉపాసిస్తున్నాను. ఆత్మ యొక్క ఛాయయే ప్రకృతి. ప్రకృతిలోనిదంతా మార్పుచేర్పులు చెందున్నట్టిది. స్వతఃగా సర్వదా ఏదైతే నిర్వికార స్వరూపమగు తత్త్వము యొక్క ప్రదర్శనమైయున్నదో,.. అద్దానిని పూజించుచున్నాము. సవికారమగు ఛాయారూప జగత్తు నిర్వికారమగు బ్రహ్మముయొక్క ఒకానొకవిశేషంగా మాచే దర్శించబడుచూ, ఉపాసించబడుతోంది.

ప్రతి జీవునిలోను జ్ఞానము ఉండియే ఉన్నది. అది అజ్ఞానముచే కప్పి ఉంచబడి ఉంటోంది. ఆ అజ్ఞానమే ఛాయ.

(1) దేహము యొక్క ఛాయ (నీడ) రూపములో ఉండే చీకటి యందును,

(2) 'అధ్యాత్మము' అనబడు వ్యష్టి యొక్క మనస్సులో వివేకమును కప్పి ఉంచే అజ్ఞానము నందును,

(3) హృదయాకాశమునందును, -

**ఈ '3' స్థానములలోను ఒక్కటే ఆత్మదేవత!** అనగా మృత్యువు కూడా ఆత్మయొక్క ప్రదర్శనాచమత్కారమే! ఆ మృత్యు దేవతను (మార్పు-చేర్పులను) ఆత్మకు అభిన్నముగా, ఆత్మకళా విశేషముగా ఎవ్వడూ దర్శిస్తూ ఉపాసిస్తాడో, **అట్టివాడు పూర్ణమగు ఆయుర్దాయము కలిగి ఉండగలడు.**

## బుద్ధియేవ బ్రహ్మమ్ - ఉపాసన

**గార్గ్యుడు :** ఓ మహారాజా! నేను ఆయా విశేషములను ఆత్మోపాసనకై ఉపకరణములుగాను, ఆత్మ గురించిన అన్వేషణలకు మార్గదర్శకములుగాను సూచిస్తూ వస్తున్నప్పటికీ మీరు ఏదో విధిగా అద్దానిని 'లేదు- లేదు' అని ఖండిస్తూ వస్తున్నారే!

సరేఁ! ఇది వినండి.. బుద్ధి స్వరూపమైన ప్రజాపతియందలి పురుషుని (అయమ్ ఆత్మని పురుష ఏవ) నేను అఖండాత్మభావన కొరకై ఉపాసిస్తున్నాను.

అంతేకాకుండా ఈ 'జీవాత్మ'ను **పరమాత్మ స్వరూపము సిద్ధించుట కొరకై** పరబ్రహ్మమును బుద్ధిదేవతారాధనా పూర్వకంగా ఉపాసించుచున్నారు.

**అజాతశత్రువు :** బుద్ధి సహితుడై కనిపించే జీవాత్మను నేను బుద్ధి రూపునిగా గాని, జీవాత్మగా గాని ఉపాసించటము లేదు. మరి? **"జీవాత్మ – పరమాత్మల అభేదమగు పరబ్రహ్మమే జీవాత్మ వలె అజ్ఞాన (చీకటి) దృష్టికి అగుపిస్తున్నారు"** – అను భావనచే నేను ఉపాసిస్తున్నాను.

అనగా, ఎవ్వడైతే బుద్ధియందు అభిమానముగల జీవాత్మగా కనిపిస్తున్నాడో, ఆతడు జీవాత్మ అయి ఉండటము సందర్భమాత్ర సత్యమని, **సహజముగా** (Factually speaking, Originally speaking) ఈ జీవాత్మయే సదా పరబ్రహ్మమని (సదాశివ బ్రహ్మమని) నేను ఎరిగి ఉపాసిస్తున్నాను. ఈ బుద్ధి పురుషుని (లేక, జీవాత్మ పురుషుని) **"ఆత్మన్వి"** → సహజంగానే మనస్సుకు బద్ధుడు కానట్టి మనో బుద్ధుల అతీతుడైనట్టి (లేక) మనో–బుద్ధులకు ఆవల సర్వదా వేంచేసియున్నట్టి **"పరబ్రహ్మతత్త్వమే"** – అని భావనోపాసన కలిగి ఉంటున్నారు.

ఎవ్వరు ఈ జీవాత్మతో 'పురుషుడు'గా కనిపించే తత్త్వమును పరమానంద రూపమగు 'బ్రహ్మము'గా ఉపాసిస్తాడో,... అట్టివాడు స్వయముగా **"ఆత్మన్వి (ఆత్మను ఎరిగి, ఆత్మయే తన స్వరూపముగా ధరించినవాడు)"** అగుచున్నాడు. ఆతని సంతానము, ఆతనిని ఆశ్రయించు శిష్యులు, ఆతనిని పరిప్రశ్నలతో సమీపించువారు కూడా **ఆత్మన్యులు** [ ఆత్మయే తనువుగా (స్వరూపముగా) ధరించి ఉన్నట్టి ఎరుక గలవారు] అగుచున్నారు.

– – –

ఈవిధంగా గార్గ్యుడు– "ఆత్మకొరకై సంజ్ఞాపూర్వక ఉపాసన చేయాలి–అని చెప్ప,– సూచనకు అజాతశత్రురాజు– **"ఆత్మగా దర్శించటము, ఆత్మకు అభేదముగా చూడటము, ఆత్మ యొక్క విశేషణముగా, చిత్కళగా భావించటము, ఆత్మను ఈ కనబడే అంతటికీ అద్వితీయమని – (ఈ కనబడే అంతా కూడా ఆత్మకు అద్వితీయమని), అభేదమని ఉపాసించటము"** అనే ప్రతిపాదనతో–ఖండిస్తూ రాసాగారు. అప్పుడు ఆ గార్గ్యుడు – **"ఇక ఈతని ముందు ఆత్మోపాసన గురించి (బాహ్యమైన ఒక విశేషమును ఆలంబనముగా తీసుకోవటము గురించి) ఇంకేమి ప్రతిపాదించగలను?"**.. అని తలచి మౌనము వహించారు. **'తుష్ణీభావము'**చే మాటలు రానివానివలె ఉండిపోయారు.

**అజాతశత్రువు :** మిత్రమా! మునికుమారా! గార్గ్య మహాశయా! ఆత్మను సిద్ధించుకొనే మార్గముగా మీరు చెప్పాలనుకొన్నది ఇంతవరకేనా? ఇంకా ఏమన్నా ఉన్నదా? **ఏతావన్నూ ఇతి?** ఇంతేనా?

**(కిమ్) ఏతావత్ బ్రహ్మ మరిజ్ఞాతమ్ ఇతి?** ఇంతకుమించినది బ్రహ్మము గురించిన పరిజ్ఞానము దృష్ట్యా మీ దృష్టిలో ఇంకేమైనా ఉన్నదా?

**అహోస్విత్ అధికమ్ అస్తీతి?** ఇంతకన్నా మరేమన్నా అధికంగా బ్రహ్మము గురించి ఉన్నదని చెప్పదలుస్తున్నారా?

**గార్గ్య ముని :** ఓ రాజా! **ఏతావతాధీ ఇతి।** నాకు ఇంతవరకే తెలుసు. **నైతావతా విదితే, న 'బ్రహ్మ' విదితం భవతి – ఇతి।** ఇంతకుమించి బ్రహ్మము గురించి చెప్పటానికి నాకు తెలియదు.

అవును. **"ఇంతమాత్రము తెలియుటచే బ్రహ్మము నాకు తెలిసినట్లు కాదు"** – అని కూడా తలచుచున్నాను.

**అజాతశత్రువు :** ఇంతమాత్రమే మీరు ఎరిగి ఉంటే, అప్పుడు మీరు బ్రహ్మమును పూర్తిగా ఎరిగినట్లు కాదని, **మరొక కోణము నుండి బ్రహ్మమును పరిశీలించి తీరాలని** నేను తలచుచున్నాను. క్షమించెదరు గాక।

**గార్గ్యముని :** అవును! ఓ ప్రియ అజాతశత్రూ! నేను బ్రహ్మము గురించి పూర్తిగా ఎరిగి ఉండలేదని, మీ యొక్క (సద్యోముక్త) వివరణలచే మరికొంత నేర్చుకోగలనని ఇప్పుడు నాకు అనిపిస్తోంది. తెలియవస్తోంది. అందుచేత, **నేను మీచే బోధించబడుటకై మిమ్ములను శిష్యుడనై శరణు వేడుచున్నాను. మీరు నాకు బ్రహ్మము గురించి బోధించ వేడుకొనుచున్నాను. గురువుగా మిమ్ములను అర్థిస్తున్నాను.**

**అజాతశత్రువు :** ఓ గార్గ్య మహాశయా! మీరు జన్మతః బ్రాహ్మణకుల సంజాతులు. శ్రీ బలాకి ఋషిపుత్రులు. ఆశ్రమవాసులు. రాజులమగు మాకు పూజనీయులు. అనుసరణీయులు. మరి, నేనో? ఒక సామాన్య రాజును. మీ అంతటివారికి–బ్రాహ్మణ కులజునకు,

ఒక సామాన్య రాజునగు నేను బ్రహ్మమును ఎట్లా బోధించటము? క్షత్రియుడనగు నన్ను మీ వంటివారు బ్రహ్మజ్ఞానము కొరకై శరణు వేడటమా? ఇది విపరీతమైన విషయము కాదా? లోక మర్యాద కాదే!

**బాలాకి – గార్గ్యముని :** ఓ రాజా! అజాతశత్రూ! ఒకడు జ్ఞానముచేత ఉన్నతుడుగాని, జన్మచేత కాదు కదా! బ్రాహ్మణ్యము మొదలైన సర్వ లౌకికమైన (లోకసంబంధమైన) విశేషాల యొక్క మహదాశయము బ్రహ్మజ్ఞానమే కదా! బ్రహ్మజ్ఞానమును అనుసరించి మాత్రమే ఒకానొకడు బ్రాహ్మణుడు. అంతేగాని, కర్మలచేత, జన్మ చేత బ్రాహ్మణుడు (ఉత్తమార్థము దృష్ట్యా) కాజాలడు కదా! **మీరు బ్రహ్మము గురించి అధికముగా** ఎరిగి ఉన్నట్లుగా అగుపిస్తున్నారు. అందుచేత ఆత్మజ్ఞానార్థినై మిమ్ములను శరణువేడటము **సముచితము, శాస్త్ర సమ్మతము** కూడా। అందుచేత **"ఈ జీవుడు మరణించి ఎక్కడికి వెళ్లుచున్నాడు? తిరిగి జన్మ ఎట్లా పొందుచున్నాడు?"** – ఈ విషయమునకు సంబంధించిన జ్ఞానము నాకు ప్రసాదించండి.

అందుచేత నేను మిమ్ములను గురువుగా భావిస్తూ, శిష్యుడనై శరణు వేడుచున్నాను. దయతో ఆత్మజ్ఞానమును బోధించండి.

**అజాతశత్రువు :** మిత్రమా! అట్లాగే! అయితే **సహపాఠకునిగా** (Like a Co-Student) నేను ఎరిగి ఉన్నంతవరకు మీకు విశదపరుస్తాను. మరల అడగండి.

**గార్గ్యముని :** గురువర్యా! అజాతశత్రుమహారాజా! నేనుఉపాసిస్తూ మీకు వివరించి చెప్పుకొస్తున్న "**అదిత్యపురుష** బ్రహ్మోపాసన, **చంద్రపురుష** బ్రహ్మోపాసన, **విద్యుత్ (తేజ)** బ్రహ్మోపాసన, **అకాశరూప** బ్రహ్మోపాసన, **వాయు–అగ్ని–అప్పు (జల) – భూ** బ్రహ్మోపాసన, **ప్రతిబింబ పురుష** బ్రహ్మోపాసన, **వాయుసంచలనరూప** బ్రహ్మోపాసన, **దిక్‌బ్రహ్మోపాసన, ఛాయాపురుష** బ్రహ్మోపాసన, **బుద్ధిపురుష** బ్రహ్మోపాసన– ఇవన్నీ కూడా పరబ్రహ్మోపాసనతో సమానము అవటం లేదని తమ ఉద్దేశ్యమా? మరి బ్రహ్మోపాసన విధి ఏది?

**అజాతశత్రురాజు :** అవన్నీ గొప్ప ఉపాసనలే। అనుమానంలేదు. అయితే, ఇవన్నీ సమగ్రమగు 'బ్రహ్మోపాసన' అని అధ్యాత్మ శాస్త్ర హృదయము దృష్ట్యా అనిపించుకోవు. అవి 'అన్యోపాసన' అని అనిపించుకుంటాయి. అనన్యోపాసన అనిపించుకోవు. అన్యోపాసనను అనన్యోపాసనగా తీర్చిదిద్దుకోవాలి, మరి।

**గార్గ్యముని :** ఓహో! "సమస్తము బ్రహ్మమే" అను ఉపాసనకు నాకు దారి చూపుచున్నారుకదా?

**అజాతశత్రురాజు :** మిత్రమా! సోపాధిక (స ఉపాధిక) బ్రహ్మము గురించిన ఉపాసన – క్రమంగా **"నిరుపాధిక (సమస్త ఉపాధి భావములకు, నామ – రూపములకు ఆవలగల) – సర్వాధార బ్రహ్మోపాసన"గా పరివాక్యమగుగాక –** అనురూపముగల **'సమగ్రబ్రహ్మోపాసన'** గురించి మీముందు ప్రస్తావించటం జరిగింది. అంతవరకే।

**గార్గ్యముని :** గురుదేవా! మంచిది. అయితే ఈ జీవుడు ఎవడు? ఎట్టివాడు?

**అజాతశత్రురాజు :** ఉపాసన చేస్తున్న నేను, మీరు, ఈ సమస్త జీవులు – **అఖండము, అప్రమేయము, నిత్యము, సత్యము, అమృతరూపము అగు బ్రహ్మమే** అయి ఉన్నాము. అట్టి అనునిత్య, స్వాభావిక సందర్శనమే 'పరబ్రహ్మోపాసన' అని వేదవరేణ్యుల ఉద్దేశ్యము. అదియే **"తత్ త్వమేవ"** – అనబడు **తత్త్వోపాసన.**

**గార్గ్యముని :** అట్టి బ్రహ్మము గురించి నాకు ఉపదేశించండి.

**అజాతశత్రురాజు :** స్నేహితుడా! మీరు బలాకి మహర్షిపుత్రులు. జన్మ–కర్మల చేత బ్రాహ్మణకుల సంజాతులు. ఇక నేనంటారా? క్షత్రియ కులంలో పుట్టి రాజధర్మము నిర్వర్తిస్తూ ఉన్నవాడను. బ్రాహ్మణుడు క్షత్రుయుని గురువుగా బ్రహ్మజ్ఞానము చెప్పమనటము సంప్రదాయం కాదని అనుకున్నాం కదా! అయినా కూడా, బ్రహ్మము గురించిన జ్ఞానము కొరకు మీరు మీ సాధనలచే అర్హులు. అందుచేత, పదండి. మనము బ్రహ్మము గురించి అధ్యయన – నిరూపణలను నిర్వర్తించుకుందాము. నేను సహపాఠకునివలె (Like a co-student) నాకు తెలిసినది వివరించి చెపుతాను.

❖ ❖ ❖

అజాతశత్రురాజు లేచి నిలుచున్నారు. కొంచము సిగ్గుపడుచున్న గార్గ్య మునిని సమీపించారు. – **తం గార్గ్యం సలజ్జమానస్య విశ్రంభజనాయ, పాణౌ హస్త ఆదాయ గృహీత్వా, ఉత్తస్థే ఉత్థితవాన్!** ఆ మునికి కొంచము విశ్వాసము, ఉత్సాహము కలిగించటానికై తన అరచేయితో వారి చేయి పట్టుకున్నారు.

అజాతశత్రు మహారాజు గార్గ్యముని చేయి పట్టుకొనగా అప్పుడు వారిద్దరు అక్కడి నుండి బయలుదేరారు. రాజప్రాసాదము నుండి ఆరాజు యొక్క సేవకుడు, బాల్యమిత్రుడు అయిన **'సోమరాజు'** అనువాని ఇంటికి చేరారు. ఒకానొకచోట నిద్రిస్తూ ఉన్న ఒకానొక వ్యక్తిని చూచారు. రాజుగారు ఆమునికి ఆ నిదురిస్తున్న వ్యక్తికి దగ్గిరగా తీసుకువెళ్లారు. [ సోమరాజు' అనునది జీవాత్మ. మనస్సు (లేక) చిత్తమునకు సంజ్ఞ ప్రతీక].

అజాతశత్రు మహారాజు ఆ నిదురిస్తున్న సోమరాజును ఉద్దేశించి – ఇట్లా పలుకసాగారు.

**"బృహన్!** పెద్దవ పరిమాణము కలవాడా! బ్రహ్మమే స్వస్వరూపముగా కలవాడా! స్నేహితుడా!
**పాండరవాసన్!** తెల్లటి వస్త్రము కట్టినవాడా! నిర్మలమైన సేవక భావములు కలవాడా!
**సోమరాజన్।** ఓ సోమరాజా! "దయచేసి నిద్రలేవయ్యా!"

అప్పుడు,... **ఏవం ఆమంత్ర్యమాణోఽపి స సుప్తో న ఉత్తస్థౌ।** ఆ విధంగా మహారాజుచే పిలిచినా కూడా ఆ సోమరాజు అనే వ్యక్తి నిదురలేవలేదు. నిదురపోతూనే ఉన్నాడు. గాఢనిద్రానుభవంలో ఉన్నాడు. అప్పుడు అజాతశత్రువు ఆ నిదురించువానిని చేతితో కదిపి, తట్టి, గట్టిగా కుదిపి నిద్రలేపసాగారు. ఆతడు (సోమరాజు) తటాలున నిదురలేచాడు. కాశీరాజును గుర్తించి నమస్కరించాడు.

**అజాతశత్రురాజు :** స్నేహితుడా! బాలాకిమునీ!ఇప్పుడు నిద్ర లేచిందెవరు? దేహమా? దేహియా?

శరీరము తనకు తానే నిదురలేవలేదు. శరీరి శరీరమును స్పందింపజేయుటచే–కళ్లు, చెవులు, ముక్కు మొ॥వి ప్రవర్తించసాగుతాయి. అవునా?

- నిదుర లేచినప్పుడు ఇంద్రియములు తమకు తామే స్పందించలేదు. కనుక **న ఇతి.** అవి బ్రహ్మము కాదు. ఆత్మ కాదు.
- నేను నిద్రలేపటాన్ని **అంగీకరించి, దేహమంతా తన తేజోమయ తత్త్వముతో ఉత్తేజపరచినదే – ఈ 'జీవుడు'.**

సోమరాజుకు సంబంధించిన సహజరూపము – ముఖ్యబ్రహ్మము. కేవల సాక్షి. అట్టి 'దేహి' (లేక) 'శరీరి' ఇంకా ఎట్టివాడు? సాక్షి అయి, దేహ మనో స్పందనలకు అనుమతించి ప్రవర్తింపజేయువాడు కదా।

'సాక్షి' (ఆత్మ) → (సేవకుల మధ్య రాజు వలె) ఇంద్రియముల మధ్య → ప్రత్యక్షమై ఉంటున్నది. ప్రాణములు కూడా అట్టి సాక్షిరూప బ్రహ్మము యొక్క చేతిలో ఉపకరణములు వంటివి. దేహములోని సాక్షి చైతన్య – ఆత్మప్రభువుకు ప్రాణములు దేహ గృహములో గల పరిచారికల (Servants) వంటివారు.

❖ ❖ ❖

ఓ స్నేహితుడా! గార్గ్యమునీ! ఈ సోమరాజు గాఢ నిద్రలో ఉండటంచేత – మొదటగా మన పిలుపుకు నిదుర లేవకపోవటము, మనము గట్టిగా కదల్చినప్పుడు లేచి కూర్చొవటము గమనించాము కదా!. ఇప్పుడు మనము కొన్ని ప్రశ్నలను, వాటికి సమాధానము పరిశీలించబోతున్నాము. సోమరాజు, **"మనస్సు, ఆ మనస్సు నిద్ర లేవటం, మనస్సు తన జనన స్థానమగు ఆత్మను గమనించటము"** గురించి వివరించుకుందాము.

సోమరాజు అనబడు ఈ జీవుడు నిదుర లేవగానే ఈ ఇంద్రియ ప్రపంచమును ఎరుగుచూ విజ్ఞానమయ పురుషుడై ఉండసాగాడు కదా! (He started operating his awareness and then also started operating his feelings, thoughts and limbs there after).

- **యత్రైష ఏతత్ సుప్తో అభూద్య,... ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదా అభూత? (4-1-16).**
  *ఈ విజ్ఞానమయ పురుషుడగు జీవుడు నిదురించబోతూ ఉన్నప్పుడు ఎక్కడి నుండి ఎక్కడికి వెళ్ళి ఉన్నాడు?*
  **క్వైష తదా అభూత్?**
  *గాఢనిద్రలో ఆతడు ఉన్నదెక్కడ?*
  **కుత ఏతత్ ఆగాత్–ఇతి?**
  *నిదుర లేపినప్పుడు ఎక్కడి నుండి ఈతడు ఈ జాగ్రత్ ప్రపంచానికి వచ్చాడు? –*

**గార్గ్యుడు :** గురుదేవా! అజాతశత్రూ!

- నిద్రపోగానే 'సోమరాజు' అని మనం పిలుస్తున్న ఈ జీవుడు ఇక్కడి నుండి ఇంకెక్కడికన్నా వెళ్ళాడా? ఎక్కడి నుండి ఎక్కడికి వెళ్ళాడు?
- నిద్రా సమయములో ఈతడు ఎక్కడ ఉండి ఉన్నాడు? ఏమి చేస్తూ ఉన్నాడు?
- నిద్ర లేచినప్పుడు ఎక్కడి నుండి ఇక్కడికి వచ్చాడు?

అను మూడు ప్రశ్నలే నాకు అర్థము కాలేదు. ఇక సమాధానము నాకు తెలియటం లేదని వేరే చెప్పాలా? అందుచేత మిమ్ములను మరొక్కసారి శిష్యుడనై శరణవేడుచున్నాను. దయచేసి వివరించండి.

## జాగ్రత్ - జాగ్రత్ ఉపసంహారము

**అజాతశత్రువు :** మిత్రమా! వినండి! **ఈతడు స్వతఃగా విజ్ఞానమయ పురుషుడు.** (A Knower who can execute and - Perform). ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని ఉపయోగించి, **ఇది ఈ తీరు। అది ఆవిధమైనది। నేను అది। వారు ఇట్టివారు। నేను ఇక్కడ ఉన్నాను. నీవు అక్కడ ఉన్నావు..** మొదలైన విశేషాలన్నీ తెలుసుకొని, అనుభవముగా మరల్చుకొనగలిగి ఉన్నారు. అందుకే ఈయనను **'విజ్ఞానమయ పురుషుడు'** అని అన్నాము. ఇప్పుడు ఈయన గాఢ నిద్రలోనికి వెళ్లారు. అప్పుడేమైనది?

**"ప్రాణముతో కూడి విషయములను తెలుసుకొనగలిగినట్టి సంవేదన సామర్థ్యము"** – ఈతని హృదయాకాశములో విషయరహితము కాసాగుతోంది. అప్పుడీ జీవుడు **'తెలుసుకోవటము'** అనే శ్రమ నుండి **విరామము** (Break) ఆశ్రయించాడు.

ఈతని తెలుసుకోగలిగేశక్తి 'కారణాకారము' (As cause prior to effect)గా ఘనీభవించి హృదయాంతర్గతమైన ఆకాశములో **"అనేకత్వమునను వదలి, ఏకత్వము"**ను ధరించినప్పుడు **"ఈతడు గాఢనిద్రలో ఉన్నాడు"**... అని అంటున్నాం. అట్టి సమయంలో ఈ కార్యరూపజగత్తు ఆతనిచే పొందబడటము లేదు. ఆతనిలో ఇక్కడి **కార్య-కారణ-కర్తృత్వాలు మౌనము వహించి ఉన్నాయి.** జాగ్రత్ సమయములో ఇంద్రియముల ద్వారా బహిర్గతమగుచూ ఉండి ఉన్న ప్రాణము – (ప్రాణశక్తి) – **గాఢ నిద్రా సమయములో లోపలికి (హృదయములోనికి) → గ్రహించబడుతోంది. సమస్త దృశ్యవిశేషముల నుండి ఉపశమించి, ఆత్మయందు మౌనము వహించి ఉంటోంది.**

అప్పుడు వాక్కు – కళ్ళు– చెవులు – మనస్సు మొదలైన విజ్ఞాన సామర్థ్యము (Knowing ability) గల ఇంద్రియములన్నీ వాటివాటి కార్యక్రమముల నుండి ఉపసంహరించబడినవగుచున్నాయి. **ఈ విధంగా ... విజ్ఞానాత్మ (తెలివి – ఎరుక) నిద్రాసమయంలో..,**

→ సర్వ ఇంద్రియానుభవములనుండి, ఇంద్రియముల నుండి వెనుకకు మరలి, ఉపరతి పొందినదై..,

→ బాహ్య విశేషత్వమును బాహ్యముననే వదలినదై, స్థూలానుభవము వదలి,

→ సూక్ష్మదేహ సంబంధమైన (వస్తువు లేకుండా ఊహ) అనుభవముతో,

→ అవిశేషమైన (విషయరహితమైన) స్వాభావికతను సంతరించుకొని,

- ఒకప్పుడు తన యందు **స్వప్న దృశ్యము** కల్పించుకొని అనుభవముగా పొందుచున్నది.
- ఇంకొకప్పుడు తనయందు తానే **'కేవలమగు మౌనము'** వహించినదై **గాఢనిద్రను** ఆస్వాదిస్తోంది.

<u>తనయందు = తన హృదయాకాశమునందు</u>

[ హృదయాకాశము = యోగాభ్యాసముచే అనుభవమయ్యే అంతరంగ స్థానము. Zone of Inner Self made up of Absolute factors viz. (1) Experiencing (2) Feeling ].

హృదయ అంతరాకాశము = ఈ వ్యక్తి యొక్క → దేహ – ఇంద్రియములకు అతీతమైన → స్వరూపము.

– ఆత్మ యొక్క **దివ్య చైతన్య ప్రదర్శనస్థానము.**

– **కర్తృత్వ – భోక్తృత్వములతో కూడుకొనిన సూక్ష్మదేహము మౌనము వహించి ఉన్నప్పుడు కూడా శేషించి ఉండు స్థానము.**

గాఢ నిద్రయందు.. దృశ్య సంబంధమైన విశేషాలేమీ ఉండవు. అట్టి **నిర్విషయ స్థితి ఈ జీవుని యొక్క** సర్వదా **వాస్తవమైన రూపము.** అదియే **"ఆత్మ"**। **"పరమాత్మ"**। **"బ్రహ్మము"**। ఇక విషయములంటావా? అవన్నీ ఆత్మకు **స్వయం కల్పిత విహార స్థానములు.**

ఎప్పుడైతే ఈ జీవుడు శరీర–ఇంద్రియములను → దాటివేసిన స్థానము ఆశ్రయిస్తాడో, అప్పుడు అద్వితీయమగు **స్వస్వరూపమున ప్రవేశించువాడగుచున్నాడు.** అట్టి స్వస్వరూప నిర్విషయస్థానము (లేక స్థితిని) **'స్వపితి' స్థితి** అంటారు.

**గాఢ నిద్ర** = ఆత్మ ఆత్మయందే నిలచి జాగ్రత్ – స్వప్న సంస్కారములను అప్రదర్శితంగా అంతర్గత ఆకాశములో దాచివేసి కొన్న స్థితి. ద్వితీయము లేనట్టి స్థితి. (స్వపతి = స్వకీయ నిర్విషయ స్థానము).

**స్వప్నావస్థ** → (1) జగత్ పదార్థ రహితమైనట్టిది (2) బాహ్యేంద్రియ విషయ రహితమైనట్టిది. కానీ, (3) హృదయాకాశములో వాసనాజాల కల్పితమైనట్టిది. అప్పటి దృశ్యమే **స్వప్న సంఘటన (లేక) స్వప్న దృశ్యము.** ఇంద్రియములు – దృశ్య పదార్థాలు లేకపోయి కూడా, సంసార స్వభావము వదలకపోవటముచే ఏర్పడుచున్న స్వానుభవము. **వస్తు రహిత ఊహామాత్ర దృశ్య కల్పనము.**

→ **జాగ్రత్ అవస్థలో లాగానే స్వప్నములో కూడా..**

- బంధువుల సంయోగ – వియోగములు,
- సుఖ – దుఃఖములు
- వ్యామోహములు; భయ– ఉద్వేగములు

**– ఇవన్నీ జీవుడు పొందుచూనే ఉంటున్నాడు.**

**ఇక్కడ ఒక చమత్కారం। జాగ్రత్ స్వప్నములు ఉభయములోను కూడా...** జీవునికి శోక– మోహములు, భయ–ఉద్వేగములు మొదలైనవి స్వగతమైన – **స్వకీయమైన లక్షణములేగాని,... దృశ్యము కారణంగా జనించుచున్నవి కావు**. అనగా తన నుండియే అవి బయల్వెడలుచున్నాయి. **అంతరంగమే నిమిత్తకారణం!** (Original cause). **దృశ్య జగత్తు ఉపాదాన కారణము మాత్రమే** (Outer world is merely helping factor). విజ్ఞానమయ స్వరూపుడగు ఈ జీవుడు తన హృదయాకాశములో జాగ్రత్ – స్వప్న కల్పనలను తనకు తానై పొందుచున్నాడు.

- కర్మఫలములని చెప్పబడు లోకములు,
- ఆ లోకములలో మహారాజత్వము, బ్రాహ్మణత్వము, దేవతా జన్మలు, జంతుజన్మలు,

... ఇవన్నీ పొందుచున్నాడు. ఒక కథారచయిత (Auto Biography) వలె, తన స్వప్న సామ్రాజ్యమునకు తానే రచయిత అయి, తన ఇష్టమును అనుసరించి పాలించుచున్నాడు.

- ఇష్టము వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు. సంచారములు చేస్తున్నాడు.

ఈ విధంగా మాంసమయ బాహ్య ఇంద్రియముల నుండి ఉపసంహారము పొందిన ప్రజ్ఞతో తన దేహాకాశమునందు జాగ్రత్ వంటి వస్తువులనే భావనా మాత్రంగా స్వప్నము నందు కల్పించుకొని, **"ఇవన్నీ సత్యమే కదా!"**... అని జాగ్రత్ వలెనే ఒక **వ్యసనమువలె** అనుభవిస్తున్నాడు.

- జాగ్రత్‌లో జాగ్రత్ "సత్యము" వలెను, స్వప్నము **"అసత్య కల్పనానుభవము"**వలెను అనిపిస్తున్నట్లే..,
- స్వప్నానుభవ సమయ – సందర్భములప్పుడు స్వప్నానుభవము **"సత్యము"**గాను, జాగ్రత్ వ్యవహారమంతా **"అసత్యకల్పనానుభవ భ్రమ"**గాను అనిపిస్తూ ఉంటోంది.

## సుషుప్తి

**'సుషిప్తి'** అను స్థితిలో, ఆ ద్రష్టకు రెండవ వస్తువు యొక్క అనుభవమే ఉండదు. **'నేను ఒక్కడినే'** అనే భావముచే రెండవ వస్తు కల్పన అంతా త్యజించి ఉంటాడు. (లేక) ప్రక్కపెట్టి ఉంటాడు. (Side-Lined).

ఈ జీవుడు హృదయము నుండి కేవలమగు ప్రజ్ఞారూపి (Absolute knowing without issues of being known) అయి బయలుదేరి నాడులందు ప్రవేశిస్తున్నాడు.

**'హిత'** అనబడే 72000 నాడులు గల హృదయము నుండి దేహమంతా వ్యాపించి ఉన్నాయి.

ఆతడు ఆ 72000 నాడులలో ప్రవేశించి నిర్విషయ ప్రజ్ఞాస్వరూపమును ఆస్వాదిస్తున్నాడు. ఏ విధంగా అయితే ఒక బాలుడో లేక

ఒక మహారాజో (లేక) ఒక బ్రహ్మతత్త్వము ఎరిగి బ్రాహ్మణుడో – అన్నీ వదలి, హాయిగా అత్యంత ఆనంద స్థితిలో **ఏకాంతమును ఆస్వాదిస్తాడో** → ఆ విధంగా ఈ జీవుడు **'సుషుప్తిస్థితి'** యందుంటున్నాడు.

ఓ మిత్రమా! గార్గ్యమునీశ్వరా!

→ తరంగాలు సముద్రమునందు బయల్వెడలి, సంచరించి, లయించురీతిగా – ఈజీవుని ఆత్మస్వరూపము నందే జీవాత్మ–జగత్తులు (అనుభవి–అనుభవముగా సిద్ధిస్తున్న సమస్తము) **బయల్వెడలి ఉండి, లయిస్తున్నాయి.**

– జాగ్రత్‌గాని, స్వప్నముగాని, సుషుప్తిగాని **బయల్వెడలుచున్నది, ఉండి ఉంటున్నది, లయించుచున్నదీ కూడా ఆత్మయందే!**

– సర్వ ప్రాణులు ఆత్మస్వరూపులే।

– మహాసముద్రములో అసంఖ్యాక ఆకారాలు గల తరంగాలు బయల్వెడలుచున్నట్లు, **ఆత్మయందు అసంఖ్యాక జీవులు – వారివారి సంస్కారాలతో సహా బయల్వెడలుచున్నారు.** అసంఖ్యాక జాగ్రత్ – స్వప్న–సుషుప్తి దృశ్య పరంపరలు ఆత్మసాగరమునందు బయల్వెడలుచున్నాయి, సంచారములు చేస్తున్నాయి, లయిస్తున్నాయి.

– ఒక సాలెపురుగు తన దేహము నుండి అసంఖ్యాక తంతువులను (దారములను) బయల్వెడలదీయువిధంగా, అగ్ని నుండి అనేక విస్ఫులింగాలు (మిణిగురులు) బహిర్గతమగు రీతిగా……,

ఆత్మ నుండి..

- (బాహ్యంగా ఉన్నట్లు కనిపిస్తూ ఉన్నట్టి) సకల లోకాలు, సకల ప్రాణులు,
- సర్వదేవతలు, సర్వజీవులు,
- రూప–నామ–గుణ–స్వభావాలు, = **ఉచ్చరంతి!** బయల్వెడలుచున్నాయి (ఉత్+చరంతి)! [ (లేక) **'ఉదంతి'**)]
- **చరంతి!** ఆత్మయందే సంచారాలు చేస్తున్నాయి.
- **లయంతి!** లయిస్తున్నాయి.

ఆత్మయే, అటు బ్రహ్మాండములోను, ఇటు జీవాత్మదేహము నందు **"ప్రాణశక్తి– ప్రాణేశ్వరుడు"** రూపముగా – తేజోరూపమై వెలుగొందుచున్నది.

**ఆత్మఒక్కటే సత్యము। నిత్యము। అఖండము। తదితరంగా కనిపించేదంతా మనస్సు చేస్తున్న** కల్పనా వ్యవహారము మాత్రమే। **(కల్పితము).**

– వాస్తవానికి ఆత్మయందు లోకాలు జనించటములేదు. ఉండటము లేదు. లయించమూ లేదు.

ఒక నాటకములో కథ, పాత్రలు, సంఘటనల పరస్పర సంబంధము వంటిదే– ఈజగత్ దృశ్యము–స్వప్నదృశ్యము కూడా!

రచయతలోంచే–**నాటకము, పాత్రలు, సంఘటనలు, పాత్రలపరస్పర సంబంధములు** బయల్వెడలుచున్నాయి. కానీ రచయితలో నాటకమూ లేదు. పాత్రలూ లేవు. అట్లాగే ఆత్మయందు జగత్తులు బయల్వెడలుచూనే, **ఆత్మ నిర్విశేషమైయున్నది. నిర్విషయమైయున్నది.**

– **సర్వమునకు ఆధారమై, ప్రతి ఒక్క జీవుని పరమసత్యస్వరూపమై ఆత్మయే వెలుగొందుచున్నది.**

– నీ యొక్క – నాయొక్క పరమ సత్యమగు అస్తిత్వమే ఆత్మ. ("I am Present" is the sense of Athma)

– ఇదియే ఆత్మయొక్క 'సత్' స్వరూపమే!

– అట్టి 'అస్తి–భాతి' స్వరూపమగు ఆత్మను దేనితో వెతికి పట్టుకోవాలి?

అనుభవమయ్యేదంతా ఆత్మయొక్క ఎరుక రూపమే! చిదానందరూపమే। ఆత్మయొక్క ప్రకాశ (భాతి) స్వరూపమే।

తెలియబడేదంతా ఆత్మ యొక్క ఎరుకయే! ఇదియే ఆత్మయొక్క ఆనందము!

| |
|---|
| – ఆత్మయొక్క ప్రకాశమే జగత్తు. |
| – ఆత్మకు వేరుగా జగత్తు లేదు. |
| – (అద్దంలో వస్తువులు లేనట్లే) ఆత్మయందు 'జగత్తు' అనబడేదేదీ లేదు. |

**ఇతి చతుర్థాధ్యాయము – ప్రథమ బ్రాహ్మణము**

***"అజాతశత్రు బ్రాహ్మణము"***

# చతుర్థ అధ్యాయము – ద్వితీయ బ్రాహ్మణము

## 2. శిశు బ్రాహ్మణము

**అజాత శత్రువు :** ఓ గార్గ్యముని మహాశయా! ఇంకా వినండి.

ఈ శరీరమునందు ఒక శిశువు వేంచేసినదై ఉంటోంది. అట్టి ఆ సూక్ష్మ దేహరూప శిశువు నాలుగు విశేషములు కలిగి ఉంటోంది. [ (శిశువు = లింగ శరీరము, సూక్ష్మశరీరము). (శిశువు = ప్రాణము)– అను రెండు అర్థాలు చెప్పబడ్డాయి ].

(1) **స సాధానగ్ం। ఆధానము** = (జీవాత్మగా) –దేహము మధ్యలో (శరీరము మధ్యగా) ఊయలలోని బిడ్డవలె ఉండటము.

(2) **స ప్రత్యాధానగ్ం। ప్రత్యాధానము**= (ప్రాణశక్తిగా) – శిరస్సు–ఇంద్రియ రంధ్రములలో **ప్రాణశక్తి** చలనపూర్వకంగా ప్రదర్శితమై నిండి ఉండటము.

(3) **స స్థూణగ్ం। (స్థూనము/బలము)** = (బలముగా) – దేహమునకు ప్రాణమే బలము అయి ఉండటము. ప్రాణము – బలమునకు గల అవినాభావత్వము. బలము లేకుంటే ప్రాణము నిలువకపోవటము.

(4) **సదామగ్ం। దామము** = (అనుభవమయ్యేదిగా) అనుభవమైనదంతా కల్పించుకొని ఆస్వాదించటము. అనుభూతిగా అనుభవమును కలిగి ఉండటము. అన్నము అనుభూతి అనుభవము అనుభవించబడుచున్నదంతా దామమే! (ఆహారము, అనుభవము),

**సావధానము, ప్రత్యాధానము, స్తంభము, దామము (మొలత్రాడు) అనబడే** 4 ధర్మములతో కూడిన 'ప్రాణము' అనే శిశువు గురించి ఎవ్వరు క్షుణ్ణంగా నిశ్చయంగా తెలుసుకుంటారో, అట్టివారు – "తనను 'ద్వేషిస్తున్న ***'7' గురు శత్రువులను నశింపజేసుకోవటము"*** – అను ఉత్తమ ప్రయోజనమును పొందుచున్నారు.

శత్రువులు రెండు రకములు (1) ద్వేషించువారు (2) ద్వేషించనివారు

ద్వేషించని శత్రువులు = శిరస్సులోని '7' ఇంద్రియములు – (స్వయం శోభాయమానములు).

(1) '2' కన్నులు (2) '2' చెవులు (5) ముక్కు (6) నోరు (7) చర్మము

ద్వేషించే శత్రువులు = విషయముల (శబ్ద స్పర్శ రూపరస గంధముల) పట్ల రాగద్వేషములు.

**ఎందుకు ఆ '7' కూడా శత్రువులు?**

శబ్ద– స్పర్శ – రూప–రస– గ్రంథములు, వాటి పట్ల రాగ – ద్వేషములు ఈ జీవుని 'వ్యక్తి' స్వభావము నందు అంతర్విభాగములై ఉంటున్నాయి. వీటిని **'భ్రాతృవ్యులు'** – (సహోదరులు, అన్నదమ్ములు) అని కూడా పిలుస్తారు.

ఈ ఏడుగురు ఈ జీవుని యొక్క దృష్టిని (లేక మనస్సును) స్వస్వరూపమగు చైతన్యము నుండి మరల్చి భోగవాసనలవైపు, ఇంద్రియ అనుభవములవైపు తీసుకుపోవుచున్నాయి. ఈ జీవుడు తన ఆత్మ చైతన్యతత్త్వమును ఎరిగి ఆస్వాదించకుండా అడ్డుగా ఉంటున్నాయి. **అందుకే ఇష్ట అయిష్టములతో కూడిన శబ్ద స్పర్శ రూప రస గంధ – ద్వేషించు సహోదరులు.**

**దేహమున మధ్య ప్రాణమే** → 'శిశువు'

- ప్రాణమునకు సాకారమై కనిపిస్తున్న ఈ శరీరమే → ఆధానము. (ప్రాణము ఉంచబడిన పాత్రవంటిది – ఈ శరీరము).
- ఈ శరీరములోని జ్ఞానేంద్రియములు – (చూపు–వినికిడి–రుచి–స్పర్శ–వాక్కు → ఈ పంచజ్ఞానేంద్రియములు). **ప్రత్యాధానము.**
- ప్రాణశక్తియే **స్తంభము.**
- ఇంద్రియములకు బాహ్య విషయములే → **అన్నము, దామము.**

**అయం వావ శిశుః** – శరీరమునకు మధ్యగా–ఆత్మ చైతన్యమును తనయందు ప్రతిబింబిస్తూ ఉన్నది లింగశరీరము. సూక్ష్మశరీరము.

(4–2–1) – అదియే ప్రాణచైతన్యము. ప్రాణస్పందనచే శక్తి పొందునది.

– **'భావన'**యే ఆ శిశువు యొక్క **సంప్రదర్శనము.**

**ఆధానము। శిశు సాధ్యామియుక్తమ్** → శిశువుతో పోల్చబడిన సూక్ష్మ శరీరము – ఎందులో ఉంచబడినదో, అట్టి (శిశువు పరుండిన) ఊయల వంటిది ఈ శరీరము. ప్రాణమునకు కూడా ఈ శరీరము అధిష్ఠానము. ఈ శరీరములో అధిష్ఠితములైనవి – ఇంద్రియములు. ఆ ఇంద్రియములు శబ్ద – స్పర్శ– రూప – రసగంధముల అనుభవములకు ద్వారములు.

**ప్రత్యాధానము। ప్రత్యాధానం శిరః** → ఈ తలయే ప్రత్యాధానము. ఇందులో చెవులు – కళ్ళు – ముక్కు (3×2=6) – నోరు అనే వేరువేరు గోళములున్నాయి. అట్టి ఈ శిరస్సులోని ప్రతి రంధ్రము ప్రాణశక్తితో నింపబడి ఉన్నది. (లేక) ప్రాణము ప్రత్యాధానము చేయబడినది. **అన్నపాన జనితాః శక్తిః।।** అన్నపానములచే ఉత్తేజమగు శక్తియే ప్రాణము.

**ప్రాణః స్థూణః స్థంభాః** → అన్నము తిని, నీటిని త్రాగుట వలన వచ్చే బలము.

**"ప్రాణో" – "బలమ్" ఇతి పర్యాయః** → ప్రాణము – బలము (శక్తి) ఈ రెండూ కూడా పర్యాయపదములు. ఒకదాని అర్థము – రెండవది కూడా అయియే ఉన్నది.

**బలావత్ స్తంభోహి ప్రాణో అస్మిన్ శరీరే!** → బలమే స్థూనము లేక స్తంభము. ఎందుకంటే శరీరములో ప్రాణము బలమును (బలము అనే స్తంభమును) ఆశ్రయించుకొని ఉంటోంది. బలము తరిగితే ప్రాణమునకు పట్టుదొరకక, అది శరీరమునందు హీనపడనారంభిస్తోంది. శరీరము బలహీనమైతే, ప్రాణము దేహము నుండి తొలగుతోంది కూడా. ఒక దూడ కట్టుకొయ్యకు కట్టివేయబడిన తీరుగా ప్రాణశక్తి 'శరీరము' అనే కట్టు కొయ్యకు కట్టివేయబడి ఉన్నది.

ఈ శరీరములో **ఉచ్ఛ్వాస–నిచ్ఛ్వాసలే ప్రాణశక్తి యొక్క ప్రదర్శనము.** ఇదియే శరీరమునకు (ఒక 'పాక'కు నిట్టాడు స్థంభము వలె) ఆధారస్థంభము.

**అన్నము :** అన్నమే 'ప్రాణము' అనే దూడను శరీరములో కట్టి ఉంచు **కట్టుత్రాడు.**

తిన్న అన్నము శరీరములో ప్రవేశించి మూడు విభాగములుగా అగుచున్నది.

**(1) అన్నములోని స్థూలభాగము :** ఇది 'మలము–మూత్రము'.. అను ఈ రెండిటి రూపములలో శరీరము నుండి విసర్జకావయవముల ద్వారా విసర్జించబడి, భూమిలో కలిసిపోవుచున్నది.

**(2) అన్నములోని మధ్యమ భాగము – రస విభాగము :** ఇది ఆహారములోని రస విభాగము.

- **'అన్నసారము'** అని కూడా అంటారు.
- ఈ రస విభాగము (లేక) **అన్నసారము** [ (1) చర్మము(త్వక్కు), (2) రక్తము, (3) మాంసము, (4) క్రొవ్వు(మేధస్సు), (5) కండరములు(నాడులు/ నరములు), (6) ఎముకలు, (7) శుక్రము (రేతస్సు) అని పిలువబడే ] **'సప్తధాతువులు'**గా అగుచున్నది.
- ఈ విభాగము స్థూల దేహమును ధాతురూపముగా వర్ధిల్లజేస్తూ ఉన్నది.

**భౌతిక దేహము** = అన్నముచే నిర్మితము. అన్నమయము. అందుకే, అన్నము లభించగానే దేహము వర్ధిల్లుతూ ఉంటుంది. (లేదా) అన్నము లభించకపోతే దేహము క్షీణిల్లుచున్నది.

**(3) అన్నములోని సూక్ష్మ విభాగము :** ఈ అన్నము యొక్క సూక్ష్మ భాగమునకే 'అమృతము', 'ఊర్జము', 'ప్రభావము'.. మొదలైన పేర్లు కూడా ఉన్నాయి. ఈ సూక్ష్మ విభాగము ముందుగా హృదయమును చేరి, హృదయము నుండి అన్ని వైపులుగా ప్రసరిస్తున్న 72000 నాడులలో ప్రవేశిస్తోంది.

- 'స్తంభము' అనే బలమును ఉత్పన్నం చేస్తోంది.
- ఈ స్థూల శరీరములో 'శిశువు' అని మనం పిలుస్తున్న లింగ శరీరము (మరియు) ప్రాణము యొక్క స్థితికి కారణము.

అన్నములోని సూక్ష్మమగు అమృత రూపమే (లేక) ఊర్జమే – **ప్రాణత్రాణ.**

**లింగశరీరము** = ఇంద్రియములన్నిటి యొక్క (ఇంద్రియార్ధములగు శబ్ద స్పర్శ రూప రస గంధములయొక్క) సముదాయము.
**ప్రవర్తయతేతి ప్రాణః।** శరీరములోని 'ప్రవర్తన' అనునదే **'ప్రాణ స్పందన'.**

ఈ విధంగా అన్నము (All that being experienced) - అనే త్రాడుచే ఇటు శరీరము, అటు ప్రాణము కట్టివేయబడుచూ ఉన్నాయి. మరల శరీర ప్రాణములు పరస్పరము (ఒకటి మరొకదానిని) కట్టి ఉంచుచున్నాయి కూడా।

## సప్త(7) అక్షరకారణ దేవతల – ప్రాణదేవతా స్తుతులు

**'ప్రాణము'** అనే శిశువు **సుషుప్తి నుండి** → **జాగ్రత్ అవస్థ** యందు **"అక్షి–నేత్రము"**ను పొందుచున్నది.

అనగా **'దేహము'** అనే **'ఊయల'**లో ఊగుచున్న ప్రాణరూప లింగ శరీర శిశువు → (7) **సప్త అక్షితయ ఉపతిష్ఠంతే।।** – ఏడుగురు దేవతలతో కూడి, వారి చేత ఎల్లప్పుడు సేవించబడుచున్నది. **కాస్తా అక్షితయః?** ఆ లక్షితులు (దేవతలు) ఎవరెవరు?

**(1) రుద్రుడు :** అను ప్రధమాక్షయ దేవత→ కంటియందలి ఎర్రటి రేఖలుగా ఉండి, – దేహమధ్యలోని ప్రాణరూప లింగదేహ శిశువును వెంటనంటి ఉంటున్నారు. **"అన్వాయత్తో"।** → స్తుతిస్తున్నారు.

**(2) పర్జన్యుడు :** కంటిలో జల(ద్రవ) స్వరూపుడై ఉండి, జలముఅవ వర్తించుచూ, ప్రాణ శిశువును ఆహ్లాదపరచుచున్నారు. శరీర మధ్యలోని ప్రాణశిశువును సేవిస్తున్నారు.

**(3) ఆదిత్యుడు :** కళ్ళలోని 'నల్లగుడ్డు' ద్వారా ప్రాణశక్తిని (లింగదేహ శిశువును) పొందుచున్నారు. "చూచే శక్తి" ద్వారా – మధ్యమ ప్రాణము శరీరములోని లింగదేహమును (నల్లగుడ్డుతో చూచుట అను పరికరమును) ప్రాణశిశువుకు అందిస్తున్నారు.

**(4) అగ్ని :** నేత్రములోని 'నల్లనికాంతి' ద్వారా ప్రాణశిశువుకు **అన్నివైపులా చూడగలుగు** సేవను (ఉపకరణమై) అందిస్తున్నారు.

**(5) ఇంద్రుడు :** కంటిలోని 'తెలుపు గుడ్డు' అయి, తెల్లటి కాంతి పుంజములతో 'ప్రాణశిశువు'ను సేవకుడై సేవిస్తున్నారు.

**(6) పృథివీ దేవత :** కంటికి 'కింది రెప్ప'గా అయి, పై కంటిరెప్ప రూపమగు ద్యు (ఆకాశ)లోకమును స్పృశించటం ద్వారా ప్రాణ శిశువుకు సేవలు అందిస్తోంది.

**(7) అంతరిక్ష దేవత :** నేత్రము యొక్క 'పై రెప్ప'గా అయి క్రింది రెప్పను స్పృశించుచూ ప్రాణ–లింగదేహ శిశువుకు **"రెప్పలు వ్రాల్చుచుండుట – తెరచుచుండుట"** – అను సేవలు అందిస్తోంది.

ఈ విధంగా అన్నస్వరూపులై ఈ **రుద్రుడు – పర్జన్యుడు – ఆదిత్యుడు – అగ్ని – ఇంద్రుడు – పృథివి – అంతరిక్షము..** అను సప్త దేవతలు ప్రాణ రూపశిశువుకు ఎల్లప్పుడు తమ సేవలు అందిస్తూ ఉన్నారు. ప్రణతులు సమర్పిస్తున్నారు.

ఈ 'దేహము' అనే దేవాలయములో – (ప్రాణేశ్వర శిశువుకు (లేక లింగదేహ శిశువుకు) సప్త అధిష్ఠాన దేవతలు అందిస్తున్న సేవలను తన సూక్ష్మ బుద్ధితో (లేదా గురు ముఖతః) పఠనము – శ్రవణము చేసి ఎరిగినవాడు – అన్నమును సర్వదా సమృద్ధిగా పొందుచున్నాడు.

## తదేష శ్లోకో భవతి
## మంత్రో భవతి

ఈ విషయము గురించి (భావమును విశదీకరిస్తూ)

**"అర్వా బిలః"** అనే మాటతో ప్రారంభమగు **తస్మిన్ యశః – ఆయశోః** మంత్రము అర్ధరూపముగా ఇట్లా విశదీకరిస్తోంది.

**శ్లో।। అర్వాక్ బిలః చమస ఊర్ధ్వ బుధ్నః,**
**తస్మిన్ యశో నిహితం 'విశ్వ'రూపం। ఇతి ప్రాణా వై యశో నిహితం విశ్వరూపం।**
**ప్రాణానేత దాహ తస్యా సత ఋషయః సప్తతీర, ఇతి ప్రాణావా ఋషయః ప్రాణానేతత్ ఆహ।**
**'వాక్' అష్టమీ.. బ్రహ్మణా సంవిదానేతి।। (4–2–3)**

యజ్ఞములో ఉపయోగించే చెక్కతో చేసిన “చమస పాత్ర” వంటి - అర్వాక బిలము । (అర్వాక = అధమ, క్రింద) కలది.

- ఈ ‘శిరస్సే’ అది!

- చమస పాత్ర [ చెక్కతో చేసిన - చతురస్ర ఆకారము కలిగిన యజ్ఞ పరికరమగు పాత్ర (చెంబు) ] అనే **ముఖము.**
- ఆ చమసపాత్రకు క్రిందవైపు రంధ్రము **(నోరు).**
- పై వైపు లావు - గట్టి - మట్టు **(కపాలము).**
- ఈ పాత్రయందు అన్ని రూపములైన, విశ్వరూపముతో కూడిన **“యశస్సు” - (చూపు, వినికిడి, స్పర్శ మొదలైనవన్నీ) ఉంచబడి ఉన్నది.**
- యజ్ఞములోని చమసపాత్రలో ‘సోమరసము’ ఉంచబడే విధంగా ఈ దేహము యొక్క **‘శిరస్సు’** అనే పాత్ర **యందు చూపు, వినికిడి, వాసన, స్పర్శ, రుచి** - ఇవన్నీ ఉంచబడుచున్నాయి.

**“రెండు కళ్ళు” - “రెండు చెవులు” - “రెండు ముక్కుపుటలు” +స్పర్శ = ‘7’**

(2) (2) (2) + 1 = 7

మరియు 8వది వాక్కు. ఇవన్నీ శిరస్సు అనే చమస పాత్రలోని యశస్సు (యశోవిషయాలు - ఈ ప్రపంచమును ఆస్వాదించే ఉపకరణాలు).

ముఖములోని ఇంద్రియాలన్నీ పనిచేయటానికి ఇంధనము ఏది? ప్రాణమే।

వాస్తవానికి..

**ప్రాణశక్తియే** →

- కన్నులు- చెవులు మొదలైన ఇంద్రియములన్నీగా కూడా అయి, తన వేరువేరు కళలను (శక్తులను) వేరువేరుగా తానే ప్రకటితము చేసుకుంటోంది.
- ఏడు విభాగములుగా ముఖము నందు ఉనికి కలిగి ఉంటోంది. వీరే 7గురు ఋషులు.
- అట్టి ప్రసరణ శీలమగు ప్రాణము ‘7’ జ్ఞానేంద్రియములుగా ప్రవర్తనము కలిగి ఉంటోంది.

**ప్రాణశక్తి యొక్క అంశలే**- చూపు, వినికిడి, వాసన, స్పర్శ, మొదలైన **జ్ఞానేంద్రియములుగా పరిస్పందన రూపములు కలిగి ఉంటోంది.**

ఆ ఇంద్రియ ద్వారములే సప్తఋషులు. జీవులకు ప్రసాదిస్తున్న ఇంద్రియ పరిస్పందనలు. అవి ఈవిధంగా ఋషులచే దర్శించబడ్డాయి.

సప్త ఇంద్రియములు సప్త ఋషులు అయితే, **8వది → వాక్ ఇంద్రియము.** వేదమంత్రమును ఉచ్చరించు వక్త (Expression; out ward articulation).

వాక్కువేదము ద్వారా **‘సంవాదము’** నిర్వర్తిస్తూ ఉన్నది. ఎనిమిదవదిగా, ఇంద్రియములన్నిటితో కలిసి ఉంటోంది.

**‘సోమపానపాత్ర వంటి ఈ శిరస్సుకు సమీపము నందు ఉండి, ఇంద్రియ స్థానములకు అధిపతులై, ప్రాణశక్తిని ఇంద్రియశక్తిగా మరల్చుచున్న ప్రజ్ఞలు అగు సప్తఋషులు ఎవరెవ్వరు? వివరించుకుంటున్నాము.**

## సప్త ఋషులు

**ప్రాణశక్తిని వినికిడి-చూపు-స్పర్శ-వాసన-రుచి భావన-అనుభూతులుగా మలచుచున్న ఋత్‌రూప (సత్య ద్రష్టలగు) దివ్య ప్రజ్ఞలు - ఇమావేవ గౌతమ - భరద్వాజ అవయవమేవ। గౌతమో అయం భరద్వాజ**

కుడిచెవిలోని ప్రజ్ఞ → **గౌతమ ఋషి.**

ఎడమ చెవిలోని ప్రజ్ఞ → **భరద్వాజుడు.**

- ఆ ఇరువురి దివ్య ప్రజ్ఞలే రెండు చెవులలో వినికిడి రూపముగా ఉన్నాయి.
- ఆ ఇరువురు (గౌతమ-భరద్వాజ మహర్షులు) ఈ కుడి - ఎడమ చెవుల స్థానములో నివాసము కలిగి ఉన్నారు.

**ఓం నమో గౌతమ భరద్వాజ మహర్షే ప్రజ్ఞయో।**

---

**విశ్వామిత్ర - జమదగ్ని। అయమేవ। విశ్వామిత్రో - ఇయమేవ జమదగ్నిః।**

ఉత్తర (కుడి) నేత్ర → విశ్వామిత్ర మహర్షి

దక్షిణ (ఎడమ) నేత్ర → జమదగ్ని మహర్షి

వారి ప్రజ్ఞలే రెండు కళ్లలోను ప్రాణశక్తిని చూపు శక్తిగా తీర్చిదిద్దుచున్నాయి. అందుచేత ఆ విశ్వామిత్ర - జగమదగ్నులకు ఈ కుడి - ఎడమ కళ్ళకు (Respectively) నివాసయోగ్యము అగుచున్నాయి.

**ఓం నమో విశ్వామిత్ర, జమదగ్ని మహర్ష ప్రజ్ఞయో।**

---

**ఇమావేవ వసిష్ఠ - కశ్యపా అవయవమేవ।**
**వసిష్ఠో అయం కశ్యపో।**

దక్షిణ (కుడి) ముక్కు పుటము → వసిష్ఠ మహర్షి ప్రజ్ఞ.

ఉత్తర (ఎడమ) ముక్కు పుటము → కశ్యప ఋషి ప్రజ్ఞ.

- ఆ వసిష్ఠ - కశ్యపుల ప్రజ్ఞలే నాసా (ముక్కు) పుటములలో ప్రాణశక్తిని వాసన గమనించు శక్తి రూపముగా తమ ప్రజ్ఞచే రూపమును ప్రసాదించుచున్నారు.
- అందుచేత ముక్కు పుటములు వసిష్ఠ - కశ్యప ఋషుల నివాసస్థానముగా ఉపాసించబడుచున్నాయి.

**ఓం నమో వసిష్ఠ కశ్యప మహర్షి ప్రజ్ఞయో।**

## వాక్ ఇంద్రియములు - అత్రిమహర్షి

ఈ వాక్కు అత్రి మహర్షి రూపము. ఆ మహర్షి యొక్క ప్రజ్ఞారూపము.

- వాగింద్రియము ద్వారా 'అన్నము' తినబడుచున్నది కూడా. నోరు మాట్లాడుతోంది. అన్నము తింటోంది.
- ఏది అత్రి అంటున్నామో అదియే 'అత్తి'
- వాగింద్రియమును 'అత్తి' అని మంత్ర శాస్త్రములో (వేదములలోని స్తోత్ర - మంత్ర విభాగములలో) పేర్కొనుచున్నారు.

అద = తినుట

తినేది కాబట్టి = అత్తిః

ప్రత్యయముగా అత్తి (తినునది) అయి ఉండి, కొంత రహస్యము కొరకై **(పరోక్షముగా) 'అత్రి' → అని పిలువబడుతోంది.**

వాక్కే → అత్రి ఋషి.

ప్రాణమే → వాక్కుగా, అత్రి ఋషి కృతంగా ప్రవర్తితమగుచున్నది.

ఎవ్వరైతే - ఈ 'వాక్కు'ను అత్రి ఋషి యొక్క ఉనికి - ప్రసాదిత రూపముగా తెలుసుకొంటాడో, - ప్రాణమునకు ఉన్న 'అత్రి' అనే పేరు యొక్క నిర్వచనము ఎరిగి వాక్కు యొక్క ప్రదర్శనమును - గమనిస్తారో, (అనగా..) →

- తాను పలుకునది,
- తాను వినునది,
- సర్వ శబ్ద సరళి

**ఋషి ప్రాణయుత ప్రసాదముగా, దర్శిస్తాడో,** ఆతడు సర్వదా సర్వత్రా తనకు తానై భోక్తగా (Experiencer) కొనసాగుతాడు.

అనగా.. **సర్వస్య అత్త భవతి। సర్వమస్య అన్నం భవతి।** ఆతడు ఈ దేహము నశించినప్పుడు కూడా "భోక్త (Active Voice State) (అనుభవించువాడువాడు)"గానే స్వయంకృత-భావన కలిగి ఉంటాడు. అనగా,

→ నన్ను ఎవ్వరో అనుభవింపజేయుచున్నారు.

→ నేను ఎవ్వరి చేతనో భోగించబడుచున్నాను.

(- I am being created and being enjoyed by somebody)" → **అనే భ్రమ** (Passive Voice State) **ఆతడు ఇక పొందడు.**

**ఓంనమో అత్రిమహర్షి ప్రజ్ఞయో।**

## ఫలశృతి

**సర్వమస్య అన్నం భవతి య ఏవం వేద।**

- ప్రాణమే పంచన్మాత్రలుగా (శబ్ద స్పర్శ రూప రస గంధములుగా) అగుచున్నదని,
- *ప్రాణమే జగత్తులోని పంచేంద్రియములు - వాటి వాటి విషయములుగా అత్రి మహర్షి (అత్తి) ప్రసాదముచేత అగుచూ, తనకు ప్రసాదించబడుచున్నది - అని గమనించి, అత్రి ఋషి ఉపాసన నిర్వర్తించువాడు →*

- అట్టివాడు సకల అన్నసముదాయమునకు తనకు తానై 'అత్తి' (తినువాడు) అగుచున్నాడు.
- **"ఈ దేహము-దృశ్యము-లోకములు-ఇవన్నీ నాచే స్వకీయ భావనాపూర్వకంగా ఆస్వాదించబడుచున్నవి"-** అని గ్రహించి, దర్శిస్తాడు. అంతేగాని "ఎవ్వరో నన్ను పుట్టించి, ఇక్కడ పడవేసి నన్ను తానే అనుభవించుచున్నారు" - అనే భ్రమ పొందడు.
- ఇహ-పరాలలో ఆతడు భోక్త భావముతో ప్రాణాదులను, శరీరాదులను, జగదాదులను పొందుతాడు. ఇతరులకు తాను భోగ్యముగా అవడు.

ఆ విధంగా వాక్కును (తాను పలుకుచున్నది- వినుచున్నది కూడా).. ప్రాణతత్త్వముగా భావించి, ప్రాణదేవత యొక్క యథార్థ రూపమును ఉపాసించువాడు →

→ మధ్యమ ప్రాణ స్వరూపుడగుచున్నాను.

→ ఆధాన - ప్రత్యాధానములను (ప్రాణకదలికలను - ప్రాణ శక్తి ప్రదర్శనములగు పంచేంద్రియములను) అనుభవించు యజమానిగా (భోక్త)గా అగుచున్నాడు.

→ ఆతడు భోగ్యము (నేను ఇంద్రియములచే, దేహములచే, సందర్భములచే - లోకములచే, లోక పాలకులచే భోగించబడుచున్న వస్తువును).. అను అస్వతంత్ర-భావమును జయించి వేయగలడు. సమస్త లోకములను తన భోగ్యరూపముగా ఆస్వాదించగలడు.

→ "భోజ్య వస్తువులపై ఆధారపడటము" - అనే రుగ్మత నుండి నివృత్తుడగుచున్నాడు.

**తనను తాను "దేహ - ప్రాణ - ఇంద్రియ - అంతరంగ చతుష్టయములకు స్వామిత్వము వహించుచున్నవానిగా" గమనిస్తున్నాడు. ఆత్మపురుషుడై ప్రకాశిస్తున్నాడు.**

***ఇతి ద్వితీయ బ్రాహ్మణము।***

***శిశు బ్రాహ్మణము సమాప్తము।***

***ఓం శాంతిః శాంతిః శాంతిః।***

# చతుర్థాధ్యాయము - తృతీయ బ్రాహ్మణము

## మూర్త-అమూర్త బ్రాహ్మణము

పరబ్రహ్మము రెండు విధములుగా (లేక) రూపములుగా **అనుభూతమవటము, తెలిసి రావటము, దర్శించబడటము** జరుగుతూ ఉన్నది.

**(1) మూర్తము - సాకారము:** (With Form)

స్థూలంగా కంటికి కనిపించే, ఇంద్రియములకు అనుభవము, అనుభూతము అగుచూ ఉన్న విభాగము.

ఉదా : దేహము - అద్దాని రాకపోకలు;

**(2) అమూర్తమ్ - నిరాకారము** : (Without Form)

- సూక్ష్మము. ఆకారమే లేనిది. గుణములు. స్వభావములు.
- కంటికి, తదితర ఇంద్రియములకు విషయము అనుభూతము కానట్టిది.

ఉదా : **దేహి.**

- దేహమును కదల్చువాడు.
- దేహముల రాకపోకలకు సాక్షి అయినట్టి - ఎరుగుచూ ఉన్నట్టి క్షేత్రజ్ఞుడు.
- గుణములు, స్వభావములు తనవి అయినట్టివాడు.

మూర్త-అమూర్తములను (భౌతిక-మానసములను) ఏకంచేస్తూ ఈ దేహి - జగదనుభవములను కల్పించుకొని వర్తించుచున్నాడు.

## మర్త్యమ్ - అమృతమ్

**మూర్తమ్ మర్త్యమ్ : దృశ్యరూపము.** దృశ్యములో సాకారమై దృశ్యముగా కనిపిస్తున్నది (యత్ దృశ్యమ్, తత్ నస్యమ్) - **దృశ్యముగా కనిపించేదంతా ఒకనాటికి నశించవలసిందే।** కాలముతో జీవించేది - కాలము చేతనే నశింపజేయబడుచున్నది.

అందుచేత ఇది మర్త్యము (మారునది. నశించునది)- (That which is going to invariably get distroyed by Time) అగుచున్నది.

**అమూర్తము :** ద్రష్ట స్వరూపము. దేహమును కదల్చువాడు. ఆలోచనలు చేయువాడు. **ఆకారము లేనట్టిది. నిరాకారము.** అందుచేత నాశనము పొందనట్టిది. జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములు తనవైనట్టివాడు.

**అవినాశి :** మృతము లేనట్టిది అవటము వలన **'అమృతము'.**

## సంఘాతము

మూర్తము → కార్య - కారణ సంఘాతము నుండి జనించినట్టిది. **(The Relative). అమూర్తము = సహజము.**
**ఈ రెండిటి కలయికయే ఈ శరీర కృతము.**

## కేవలము

**అమూర్తము** - అకారణము. అనన్యమైనది. అద్దానికి వేరైనదీ లేదు. **అంతటి మహత్తరము మరొకటి ఏదీ లేదు.** అందుకే 'బ్రహ్మము' అని పిలువబడుతోంది. అట్టి బ్రహ్మము **తాను సర్వదా తానుగానే తానై ఉంటోంది.** కార్య కారణ సంఘాతము కాదు కాబట్టి కేవలము. **(The Absolute).**

బ్రహ్మము కానిది ఏదీ లేదు. బ్రహ్మము మరొకటిగా అవటమూ లేదు. కాబట్టి క్రొత్తగా కాగలిగినదేదీ లేదు. అందుచేత **అమృతము.**

## కించిత్‌జ్ఞము / అల్పజ్ఞము - సర్వజ్ఞము

**మూర్తము** → జీవాత్మ రూపము, దేహ సంబంధమైనది కనుక కించిత్‌జ్ఞము. అద్దాని ఎరుక ఒక ఉపాధికి సంబంధితము. పరిమితము.

**అమూర్తము** → అనేక దేహములకు సాక్షి! సర్వజ్ఞము. దేహము రాకముందు - వచ్చిన తరువాత కూడా దేహమునకు భిన్నమైన **"స్వస్థానము"**ను స్వానుభవముగా, అపరిమిత రూపముగా ఎరిగి ఉన్నట్టిది.

## స్థితము - యత్

**మూర్తము (జీవాత్మ సంజ్ఞ)** → స్థితము. ఒకచోటకు పరిమితమై ఉండునది. పరిచ్ఛిన్నమై దేశ- కాలములకు పరిమితమై ఉండేది.

**అమూర్తము = యత్** → ఏదైతే సర్వవ్యాపకమైయున్నదో అయ్యది. ఈ జీవాత్మకు ఆవల - (నాటకంలో నటుని పాత్రకు ఆవల రూపము వలె) - వెలుగొందు **పరస్వరూపము.** దృష్టాంతంగా - (The original self prior to the 'Role' in a Drama as well as the 'Art of Acting' even).

**యత్ :** ఏదైతే అంతటా నిండి ఉన్నదో! ఉదా : పాత్ర రంగస్థలముపై కనిపిస్తుంది. కానీ నాటకరచయిత పాత్ర వంటివాడా? కాదు. నాటకంలోని అన్ని పాత్రలకు, స్వభావాలకు, సంభాషణలకు, సంఘటనలకు కారణమైనవాడు. పాత్రలు, వాటి పరస్పర సంబంధములు తనవే అయి, తాను అవేవీ కాకయే - వేరై ఉన్నవాడు. అట్టి స్వస్వరూప విభాగమే ఈ దృశ్యానుభవమునకు 'యత్'।

అన్నీ ఆయనే కనుక ఆ పరమాత్మను 'యత్' (ఏదైతే ఇదంతా అయి ఉన్నదో) - అని వర్ణించుకోబడుచున్నది. (యతః సర్వాణి భూతాని ప్రతిభాంతి, స్థితాని చ, యత్రైవ ఉపశమం యాన్తి)॥

## సత్ - త్యత్

**మూర్తము / సత్** = ఉనికి కలిగి ఎదురుగా కనిపిస్తున్నది. దేహము, దృశ్యము. ఇంద్రియములకు ఉన్నట్లుగా కనిపిస్తున్నది, వ్యక్తము.

**అమూర్తము / త్యత్ =** ఒక సమయంలో మాత్రమే ఉండేది కాదు. త్రికాలములలోనూ కూడా ఉన్నట్టిది. సమస్తమును వ్యక్తీకరిస్తూ, తాను వ్యక్తీకరణమునకు ఆవల అవ్యక్తమై ఉన్నట్టిది.

**అట్టి అమూర్తము :**

- అమృతరూపము (Always 'As it is' with no change).
- మూర్త రూపము కంటే భిన్నమైది. (Beyond Form).
- వాయువు వంటిది కాదు. ఆకాశము వంటిది కాదు. (ఆత్మాకాశ స్వరూపము).

(అట్టి మూర్తము → జీవాత్మ రూపము.

**అమూర్తము** → పరమాత్మ రూపము. నశించనిది. సర్వత్రా వ్యాపకము. అపరిచ్ఛిన్నము.

---

**మూర్తము** → మర్త్యము (నశించునది)

స్థితము (ఒకచోట మాత్రమే ఉండునది) సత్ (ఉనికి కలిగి ఉన్నట్టిది

- మిళితమైన (వ్యక్తము) అవయవములు కలిగి ఉన్నట్టిది. ఒకదానితో మరొకటి సంబంధము కలిగి ఉన్నట్టిది.
- పృథివి - జలము - అగ్ని రూపము.
- మరియొక పదార్థముతో సర్వదా సంబంధము కలిగి ఉన్నట్టిది.
- తదితరముల కంటే విడిగా కనబడుచున్నట్టిది.
- పరిచ్ఛిన్నము.

'మూర్తము' అగుటచే మర్త్యము, మర్త్యము అగుటచే అస్థితము. సాకారము.

**→ ఈ కనబడేదంతా మూర్త - అమూర్తములు ఒకదానిలో మరొకటి చొచ్చుకుపోయిన స్థితి!**

## పంచభూతములు – మూర్తామూర్తత్వము

**మూర్తము :** పంచభూతములలోని ఆకాశ – వాయువులకు వేరైనట్టి మిగిలిన "భూమి–జలము–అగ్ని".. అను మూడు మూర్తములు. ఎందుచేతనంటే,

**(1) సాకారము :** అవయవములతో కూడి సాకారము అయి (ఆకారము కలిగినవై) ఉంటున్నాయి.

**(2) మర్త్యము :** ఎప్పటికప్పుడు వేరైన మరొక ఆకారముగా పొందు ధర్మము కలిగి ఉంటున్నది. అట్టి మార్పు పొందటమే మృతధర్మము, సాకారము కాబట్టి కాలబద్ధము. ఆకారము అనునిత్యము మార్పు పొందుతూనే ఉంటోంది.

**(3) మిళితము :** ఈ భూమి–జల–అగ్ని–వాయువుల మిళితము చేతనే ఈ దృశ్యములోని వస్తు సముదాయమంతా తయారగుచున్నము. మరల ఆ 'మిళితము' విడిపోవు ధర్మము కలిగి ఉండటం చేత – **ఆ విడిపోవటమే దృశ్య వస్తువుల యొక్క నాశన ధర్మము అగుచున్నది.** ఇదే 'మర్త్యము' అనబడు మూర్తము యొక్క ధర్మము.

**(4) దేశ – కాల అంతర్గత పరిచ్ఛిన్న స్థితము :** దేశ కాలములయందు స్థితి కలిగి ఉంటోంది. దేశ కాలములచే స్థితిపొంది, తిరిగి దేశకాలములచే నాశనము పొందుచున్నది.

ఉదా : గోడ / ఇల్లు / స్తంభము / కుండ / బల్ల / దేహము.... ఇవన్నీ కూడా – ..... ఇవి మరొక దానితో సంబంధము కలిగి ఉంటాయి. They are experienced because of Relativity.) పరిచ్ఛిన్న స్వభావము కలిగి ఉంటాయి.

అనగా, ఈ పదార్థములు.. ఒకదాని చేరికచే ఒక స్వభావము కలిగి ఉండి, మరొక దాని చేరికచే వేరైన స్వభావము కలిగి ఉంటాయి.

ఉదా : ఈ పాంచభౌతిక దేహము.. ఇది ఒక ప్రదేశములో మనుచున్నది. మంచు ప్రదేశములోనో, ఉష్ణమండలములోనో ఉంచితే మనజాలదు.

**స్థితమ్ సత్ –** ఈ మూర్తము ఒకచోట వ్యక్తము అగునది. వ్యక్తము కాబట్టి పరిచ్ఛిన్నము. ఇతరములకు వేరుగా కనిపిస్తుంది.

ఈ విధంగా 'మూర్తము' అగు బ్రహ్మము యొక్క విభాగము... **సాకారము, మర్త్యము సమ్మిళితము, స్థితము సత్..** అను ధర్మములు ఎల్లప్పుడు కలిగి ఉంటోంది.

## అమూర్తము – అమూర్త ధర్మములు 'దేహి' తత్త్వము

అమూర్త ధర్మములు ఈ విధంగా ఉంటున్నాయి. పంచభూతములలోని భూ–జల–అగ్నులకు వేరై వాయు– ఆకాశ తత్త్వము అయి ఉన్నది. **ఇవి పంచభూత సంబంధమైన అమూర్త విభాగపు అంశాలు.** ఇక దేహి? ఈ జీవుడు కూడా అమూర్తమే.

**(1) నిరాకారము :** పాంచ భౌతికమగు ఆకాశానికి, వాయువుకు ఆకారమే ఉండదు కదా! దేహమునకు ఆకారమున్నదిగాని, 'దేహి'కి మాత్రం ఆకారమెక్కడిది? లేదు. ఆకారమే లేదు కనుక ఈ బ్రహ్మము యొక్క అమూర్త విభాగము అగు 'దేహి'కి కూడా ఆద్యంతాలు లేవు.

**(2) ఏతత్ అమృతమ్ :** ఈ బ్రహ్మము యొక్క అమూర్త విభాగము అగు దేహి సాకారము కాదు కాబట్టి దేశ–కాలములచే పరిమితము కాదు. అనగా 'మర్త్యము (మార్పు)' అనే ధర్మము ఉండదు. పాంచభౌతిక దేహము మర్త్యము. దేహియో? **దేహమును కదలించువాడు.**

దేహము పాంచభౌతికము. జనన – బాల్య–కౌమార–యౌవన–వార్ధక్య – మరణములు పొందు మృత ధర్మము కలిగి ఉంటోంది. దేహికి ఆ ధర్మములు ఉండవు. అందుచేత **అమర్త్యము, అమృతము.**

**(3) అమిళితము :** వాయు–ఆకాశములు మరొక దానితో మిళితమవవు. సర్వదా విడిగానే ఉంటాయి. అట్లాగే 'దేహి' కూడా దేహ–దృశ్య ధర్మములతో మిళితము (Mixed up) కాదు. బ్రహ్మము యొక్క అమూర్త విభాగము మూర్త ధర్మములను [ జన్మ–కర్మ–లోకముల (ఇత్యాది) ధర్మములను ] పొందదు. దేనితోనూ విరోధము లేదు. సమ్మిళితము కాదు.

**(4) యత్ :** బ్రహ్మము యొక్క అమూర్త విభాగము, అద్దాని అంశలగు వాయు – ఆకాశములు ఒకచోట స్థిరముగా ఉండునని కావు. అందుచేత మార్తతత్త్వము వలె స్థితము కాదు. అంతటా వ్యాపించు ఉండు ధర్మము కలిగియున్నది. అందుచేత సర్వవ్యాపకము.

- వాయువు ఇక్కడ ఈ ఊరులోనో, ఆ ప్రదేశములోనో మాత్రమే ఉంటుందని అంటామా? అనము. సర్వవ్యాపకము కదా!
- ఆకాశము ఎక్కడ ఉంటుంది? 'ఇక్కడ' – అక్కడ' అనునదేమీ లేదు. సర్వవ్యాపకము కదా!

అట్లాగే బ్రహ్మము యొక్క అమూర్త విభాగము సర్వవ్యాపకము. స్థితమునకు వ్యతిరేకము. బ్రహ్మము యొక్క అమూర్తత్వమును – **'యత్'** – (అంతటా విస్తరించి, 'ఒకచోటు' అనునది లేనిది) అని అనబడుతోంది.

**త్యత్ :** వాయు–ఆకాశములకు ఇతర భూతముల నుండి విడదీసి చూపుటకు ఏమీలేదు. ఘనము (Solid) ఉష్ణముచే ద్రవీపింపజేయవచ్చు. కానీ భూ–జల–ఉష్ణ స్పర్శలచే వాయువు మరొకటిగా అవదు. అట్లాగే భూ–జల–వాయు స్పర్శలచే ఆకాశము మార్పుచేర్పులు పొందదు. అట్లాగే మూర్త రూపమగు ఇహ స్వరూపమునకు ఆవలగల అమూర్త పరస్వరూపము దేహములతోగాని, భూ–జల–ఆకాశములతోగాని ఐక్యత పొంది మరొకటి అయ్యే ధర్మము లేదు. అందుచేత త్యత్ → త–యత్. **"తాను ఏమైఉన్నదో,.. ఎప్పటికీ అట్లాగే"** అనునది ఆకాశ–వాయు ధర్మములు. అట్లాగే, బ్రహ్మముయొక్క అభౌతికరూపమగు దేహి స్వరూపము – సర్వదా యథాతథము.

బ్రహ్మము యొక్క అమూర్తము – దేనితోనూ ఏకమవక, మార్పు చెందక ఎల్లప్పుడూ విడిగానే ఉంటుంది. కనుక – 'త్యత్'

ఈ విధంగా (1) అమూర్తము (2) అమృతము (3) యత్ (4) త్యత్.. ఈ నాలుగు పరమాత్మ – జీవాత్మ యొక్క వాస్తవ రూపముల సారము. అమూర్తమే → సృష్టికర్తయగు హిరణ్యగర్భుడు. వాయు – ఆకాశములు హిరణ్యగర్భుని రస స్వరూపములు.

**మూర్త ధర్మములు** = మూర్త – మర్త్య 'స్థిత–సత్‌లు'

**అమూర్త ధర్మములు** = అమూర్త – అమృత – వ్యాపి–త్యత్‌లు

## అధ్యాత్మము

**శరీరములోని మూర్తము** → శరీరములో వాయువు కంటే, ఆకాశము కంటే వేరుగా ఉన్న విభాగము.

→ మూర్తమే మర్త్యము; స్థితి, సత్ (ఉన్నది)గా కనిపించేది కూడా.

ఉదా : కన్ను → మూర్తము. ఆకార సహితము.

→ **మర్త్యము :** ఎప్పటికో అప్పటికి నశించటం అనివార్యము.

– **స్థితము :** ఒకచోట మాత్రమే స్థితి కలిగి ఉండేది. దేశ కాలములకు పరిమితమై ఉండేది.

– కనుక ఈ భౌతికమైన కన్ను మూర్తము.

**– (చూపు అమూర్తము. నశించదు, తరగదు, పెరగదు కాబట్టి.**

---

పృథివి + ఆపః + తేజముల సారము → **దేహములోని 'కన్ను' ।**

→ విశ్వములో అది అధిదైవతము → **చూపు! 'సూర్యగోళము' ।**

## అమూర్తము గురించిన మరికొన్ని విశేషాలు

**అమూర్తము** = (1) ప్రాణము (మరియు) (2) శరీరములోని ఆకాశము – ఇవి అమృతము, యత్, తత్ **త్యత్** చూపుయే। కంటిలోని రసస్వరూపము – చూపు

బ్రహ్మమునకు మూర్త –అమూర్తములు రెండూ ఉపాధి రూపములు. **స్థూలదేహము** (స్థూలము), **లింగదేహము** (చూపు– వినికిడి – స్పర్శ –రుచి గుణములు గల దేహము) – రెండూ బ్రహ్మముకు ఉపాధి రూపములు. **బ్రహ్మమున బ్రహ్మము యొక్క స్వీయకల్పనా వినోదములు కూడా.**

# పురుష రూపము

***జీవుడు (లేక) పురుషుడు*** **:** ఇంద్రియముల 'సంఘాతము'గా కనిపిస్తూ ఉన్నవాడు. శబ్ద - స్పర్శ-రూప-రస-గంధ అనుభవములు, సంస్కారములు లింగ శరీరము (లేక) అంతఃకరణమును ఉపాధిగా కలిగి ఉండువాడు. అట్టి పురుషుని రూపము గురించి (జీవుని యొక్క రూపము గురించి) ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

**వాసనారూపుడు :** వాసనలు, (Tendincies) 'రూపముగా కలవాడు. (Tends to see, smell taste, hear, speak, think, feel etc.,)

**మూర్త - అమూర్తముల సంస్కారి :** దేహముతో కూడి, విషయ భోగముల ధ్యాస, అభ్యాసము కలవాడు.

బుద్ధి ప్రధానుడు అగు ఆత్మ యొక్క సంయోగము వలన జనించినవాడు.

**గోడపై రంగులలో కథా దృశ్యము వలె - 'నానాత్వము' అనే కల్పనా దృష్టులను హృదయమునందు పేర్చుకొని ఉన్నవాడు.** విచిత్రపు రంగులుగా కనిపించువాడు.

**వ్యామోహ జనకుడు :** ఎండమావులవలె 'ఇదియే సత్యము! ఈతడే ఆత్మ' అనురూపంగా బాహ్యమున భ్రమ కలిగించువాడు.

**సగుణ రూపుడగు నిర్గుణి :** గుణాతీతుడై ఉండి కూడా గుణబద్ధునివలె, గుణపరిమితునివలె అగుపించువాడు.

*అట్టి ప్రసిద్ధమైన లింగాత్మకము (సంస్కార భూయిష్టము) అయినట్టి* ***పురుషుని యొక్క రూపము..,***

- ❊ తెల్లటి వస్త్రముపై ఎఱ్ఱటి, పచ్చటి రంగు అద్దటము వలెను,
- ❊ తెల్లటి కంబళి (గొర్రె ఊలు కంబళి) వలెను,
- ❊ మిణుగురు పురుగు (ఆరుద్రపురుగు) వలెను ,
- ❊ అగ్నిజ్వాల వలెను,
- ❊ శుక్లము వలె, తెల్లటి కలువ వలెను,
- ❊ మేఘములోని మెఱుపువలెను →

**- (పై రీతులుగా) పరమాత్మయందు ఆ పరమాత్మ యొక్క స్వయం తేజో విభవముగా, స్వయంప్రదర్శితాంశగా జీవాత్మ ప్రదర్శితమగుచున్నది.** అట్టి జీవాత్మ గురించి (లేక) లింగాత్మక పురుషుని గురించి తెలుసుకొనువాడు - **శోభచే సర్వత్రా ప్రకాశించగలడు.** జీవాత్మను పరమాత్మ యొక్క శోభగా దర్శించువాడు సర్వే సర్వత్రా శోభాయమానుడై వెలుగొందగలడు. **శ్రీర్భవతి య ఏవం వేద।**

❊ ❊ ❊

ఈ జీవాత్మ యొక్క తత్త్వము. పరిశీలించుచూ రాగా, "నేతి - నేతి - ఇది బ్రహ్మము కాదు - ఇది బ్రహ్మము కాదు".. అను ఉపదేశ సారమును ఆశ్రయించుటయే **బ్రహ్మమును ఎరుగుమార్గమగుచున్నది.**

- **"పరబ్రహ్మమే పురుషుడుగాను, దృశ్యముగాను కనిపించుచున్నది"** అని - నిర్ధారణమగుచున్నది.
- **"ఈ 'పురుషుడు' అనబడునది సందర్భ సత్యమై యున్నది. <u>పరమ పురుషుడు' లేక 'పరమాత్మ' లేక 'పరబ్రహ్మమే'</u>.. ఈ జీవుని సహజసత్యము"** - అనునది **సత్యస్య సత్యము అగుచున్నది, అయి ఉన్నది.**

ప్రాణమే సత్యము. ప్రాణము పరబ్రహ్మము యొక్క శక్తి స్వరూపము. **ప్రాణ స్వరూపమగు ఈ జగత్తు పరబ్రహ్మమే కాబట్టి సత్యమే। పరబ్రహ్మమే సర్వమునకు ఆధారమై సత్యసత్యమై** ప్రకాశించుచున్నది.

***ఇతి ॥బృహదారణ్యకోపనిషత్॥ చతుర్థ అధ్యాయము-***
***తృతీయ బ్రాహ్మణము - మూర్తామూర్త బ్రాహ్మణము సమాప్తము.***

# చతుర్థ అధ్యాయము - చతుర్థ బ్రాహ్మణము

## మైత్రేయీ బ్రాహ్మణము

యాజ్ఞవల్క్యుడు – లోక ప్రసిద్ధుడు, లోక కల్యాణమూర్తి, తత్త్వజ్ఞుడు అగు మహర్షి. ఆయనకు ఇద్దరు భార్యలు. :

(1) మైత్రేయి (2) కాత్యాయని

ఒక రోజు...,

యాజ్ఞవల్క్య మహర్షి తన పెద్ద భార్యయగు మైత్రేయీదేవిని పిలిచారు. ప్రశాంతముగా ఎదురుగా కూర్చున్న తరువాత ఇట్లా సంభాషించసాగారు.

**యాజ్ఞవల్క్య మహర్షి : ఉద్యాస్యన్ (ఉత్ య అస్యన్) వా అరే అహమ్ అస్మాత్ స్థానాత్ అస్మి। (4-4-1)**

ఓ మైత్రేయీ! ఈ జన్మ-కర్మల ప్రవాహరూప సంసారము నుండి బయటపడటానికై నేను ఈ ఆశ్రమము నుండి మరొకటి అయినట్టి (సన్న్యాస) ఆశ్రమమును ఆశ్రయించాలని నిశ్చయించుకున్నాను.

అందుకు నా అర్ధాంగులగు <u>నీ యొక్క</u> (రెండవ పత్ని అగు) **<u>కాత్యాయని</u>** యొక్క అనుజ్ఞను తీసుకోదలచుచున్నాను. మీ ఇరువురికి నా గృహస్థాశ్రమ సంబంధమైన సంపదను సరిసమానంగా విభాగించి ఇచ్చివేయదలచుచున్నాను. భర్తనగు నా వలన కదా మీ ఇద్దరికి సంబంధము। ధనము ఇద్దరికి పంచి ఇచ్చుటచే మీ మీ యొక్క సహపత్నీ సంబంధమునకు ముగింపు అవగలదు కూడా కదా।

**మైత్రేయి :** ఓ మహనీయా! భగవాన్! అస్మత్ ప్రాణేశ్వరా! మీరు అన్యథా భావించకపోతే, ఒక చిన్న విషయం మిమ్ములను అడుగుతాను.

**యత్ ను మ ఇయం భోగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణాస్యాత్, కథం తేన అమృతాస్యామ ఇతి? (4-4-2)**

మీరు ఇవ్వాలనుకొన్న సంపదయే కాకుండా, ఒకవేళ ఈ భూమి అంతా కూడా, – ఇక్కడి సర్వ ధన– వస్తు సంపదలతో సహా నాకు సొంతముగా మీరు చేశారనుకోండి. అప్పుడు అమృతస్వరూపమగు మోక్షమును నేను పొందగలనంటారా? ముక్తురాలను అవుతానా? చెప్పండి. **కథమ్? మోక్షము ఎట్లా నేను పొందగలను?**

**యాజ్ఞవల్క్యుడు :** నేతి। లేదు. ఒకడికి చాలా విలువైన – దుర్లభమైన కొన్ని ఉపకరణముల పట్ల (ఉదా.. ఖరీదైన భవనము మొ॥వి) ఎంతో అభిలాష ఉన్నదనుకో! కానీ పేదరికం వలన అవన్నీ లభించలేదు. **"మనకా రాత లేదు! మన గతి ఇంతే! ఏదో, ఇట్లాగే బ్రతుకుదాం! మరి ఏంచేస్తాం?"** అనుకుంటూ రోజులు గడుపుచున్నాడనుకో! వింటున్నావా ప్రాణేశ్వరీ, మైత్రేయీ?

ఇంతలో ఆతనికి గొప్ప ధనం లభించి, ఆతడు ఆశించిన ఉపకరణములు (గృహములు మొదలైనవి) లభిస్తే ఎట్లా ఉంటుందో,.. నీవు చెప్పిన ఈ పృథివి ధన సంపదతో సహా లభిస్తే ఆ విధమైన కొంత సంతోషము ఉంటుంది.

అటువంటి భౌతిక సంపదా వ్యవహారాలన్నీ కూడా

→ (1) **'ఇది అంతు'** అనునదేమీ కలిగి ఉండవు. కనుక **"ఇక సంతృప్తియే"**.. అనునది ఏమీ ఉండదు.

(2) భౌతిక సంపదలు ఆత్మజ్ఞానదృష్టి లేనివారికి దుఃఖ మిశ్రమములే అగుచున్నాయి.

ఇప్పుడు ధనవంతులకు ఏ మాత్రం నిజమైన సుఖ-దుఃఖ-శాంతి – అంశాతులు ఉన్నాయో, అవన్నీ కూడా నీకు సంపద లభించిన తరువాత కూడా కొనసాగుచూనే ఉంటాయి.

ఏది ఏమైతేనేం! ఒక్క విషయం మాత్రం నిజము.

**అమృతత్వస్య తు నాశాస్తి విత్తేనేతి (4-4-2)। !** ధన సంపదచేత ఈ జీవుడు అమృతత్వము (లేక) మోక్షమును సముపార్జించలేడు. అమృతత్వము అనునది విత్తము వలన గాని, సంతానము వలనగాని, సేవకవర్గము - బంధువర్గము వలనగాని, అధికారము, జన సన్మానములు, శాస్త్ర పాండిత్యము, లౌకికమైన తెలివితేటలు మొదలైన ఇత్యాదుల వలన గాని లభించేది కాదు.

అందుచేత ఓ ప్రాణేశ్వరీ! నేను పంచి ఇస్తానన్న - గృహ-ధన ఇత్యాది సంపదలకు, - జన్మ-కర్మలను, జన్మ-జన్మాంతరములను అమృతతుల్యము చేయు **'మోక్షము'** అనుదానికి కించిత్ కూడా సంబంధమే లేదు.

**మైత్రేయి : యేన అహం న అమృతాస్యాం కిమ్ అహం తేన కుర్యాం? (4-4-3)।** స్వామీ! దేనిచే నేను జన్మ-మృత్యుపరిధులను అధిగమించి అమృతత్వమును పొందలేనో, ఇకప్పుడు మీరు పంచి ఇవ్వదలచిన సిరి-సంపదలను నేను ఏమి చేసుకుంటాను? అవన్నీ నాకు వద్దు. హే భగవాన్! మీరు ఏ జ్ఞానయోగము చేత అమృతత్వము ప్రసాదించు ఏకైకమార్గంగాను, సాధనగాను దర్శిస్తూ ఉన్నారో, అద్దాని గురించి బోధించవలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తున్నాను. శిష్యభావముతో మిమ్ముల శరణు-వేడుచున్నాను. ప్రాణేశ్వరులగు మీరు గురువులై నాకు తత్త్వజ్ఞాన విశేషాలు ప్రసాదించండి.

**యాజ్ఞవల్క్యుడు:** ఓహ్! బత! ఓ ప్రియ మైత్రేయీ! **ప్రియా! బతారే నః సతీ ప్రియం భాషస।** ఇతః పూర్వమే నీవు నీ సేవ - సాత్విక -సౌమ్య గుణములచే నాకు అర్ధాంగిగా ఎంతో ప్రియమైన దానవయ్యావు. ఎంతో సేవించావు. నాకు ఇష్టురాలవు. అట్టి నీవు ఇప్పుడు చెప్పిన మాటలచే, (నా నుండి వినాలని అడిగిన విషయముచే) మరింకా కూడా ఎంతో ఎంతెంతో ఇష్టురాలవయ్యావు. రమ్ము!

ఇటు వచ్చి కూర్చో! **ఏహి యాస్స్వ వ్యాఖ్యాస్వామి!** నీవు అడిగిన విషయమగు **"అమృత స్వరూపసిద్ధి"** లేక **'మోక్ష స్థానము'** గురించి తప్పక చెప్పుకుందాము. అయితే బ్రహ్మతత్త్వము గురించి వ్యాఖ్యానిస్తూ ఉండగా ఒక నియమము పాటించాలి.

**తే వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాసస్వ - ఇతి॥** (4-4-4). నేను వ్యాఖ్యానిస్తున్నప్పుడు నీవు "శ్రవణ - మనన - నిదిధ్యాస" అను ధారణ చేసినదానవై వినుచుండెదవు గాక! అర్థమును సుస్పష్టముగాను, కచ్చితముగాను, పరమసత్యార్థ పూర్వకముగాను గ్రహించి, మననము చేసెదవు గాక। అట్టి బ్రహ్మతత్త్వార్థ జ్ఞానముతో మమేకము, అద్వితీయము, అఖండము అగు స్థానమును ఆశ్రయించిన దానవయ్యెదవు గాక! (శ్రవణము = వినటము, మననము = అనుకోవటము, నిదిధ్యాస = అనిపించటము, సమాధి = అదే మనమవటము)

**మైత్రేయి :** అత్యంత ప్రియమగు పతిదేవా! గురువర్యా! మీరు ఆజ్ఞాపించిన రీతిగా **ప్రణిపాతేన,** ధ్యాసను ఏకాగ్రం చేసి వినటానికి సిద్ధముగా ఉన్నాను స్వామీ!

**యాజ్ఞవల్క్యుడు :** ఇక విను. ఇప్పుడు నన్ను **"పతిదేవా?"** అని ప్రియముగా సంబోధిస్తూ పలుకుచున్నావు కదా! నేను నీకు ప్రియముగా ఎందుకు ఉన్నాను?

**మైత్రేయి :** మీరు నాకు ప్రాణేశ్వరులు. పైగా మీరు మహనీయులు. భర్త అయి నాపై **"ఆప్యాయత, అనుగ్రహము"** కురిపించటము చేతనే మీరు నాకు ప్రియులగుచున్నారు. పైగా మీకు సేవ చేసి సంతోషింపజేయుచూ, మీకు ప్రియము అగు ప్రయత్నము చేయుచూ వస్తున్నాను. **భర్త యొక్క ప్రయోజనములగు సుఖ-శాంతుల కొరకై సేవించటము నాకు ధర్మమైయున్నది కదా.**

మీ విశేష లక్షణములచేతనే మీరు నాకు ప్రియము.

**యాజ్ఞవల్క్యుడు : కాదు. కానే కాదు. న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి। ఆత్మవస్తు కామాయ పతిః ప్రియో భవతి। (4-4-5)**

ఒక భార్యకు తన భర్త - భర్తయొక్క ప్రత్యేకత చేతనో ఆ భర్త యొక్క ప్రయోజనము కొరకో ప్రియమై ఉండటము లేదు సుమా? మరి! ఆత్మకు (తనకు) 'పతి' అనునది ప్రియము అగుటచే ఇక్కడ 'భర్త' అనునది (ఆత్మకొరకే) ప్రియముగా అగుచున్నది.

అట్లాగే, **న వా అరే జాయాయై కామయ జాయా ప్రియాభవతి। ఆత్మవస్తు కామాయ జాయా ప్రియా భవతి। (4-4-5).**

ఒక పురుషుడు తన భార్య కొరకై (భార్య యొక్క ప్రయోజనము కొరకై) భార్య పట్ల ప్రియముగా ఉండటం లేదు. ఆత్మకు 'భార్య' అనునది ప్రియము అయినప్పుడు 'భార్య' - ప్రియముగా కనబడటం జరుగుతోంది. ఆత్మకొరకే భార్య ప్రియమగుచున్నది.

కొందరు "నా పుత్రుని కోసము నేను ఎంత శ్రమించి ఇదంతా సంపాదించానో! అది చేశాను! ఇది చేశాను! కానీ వాడూ...?" అంటూ ఉంటారు. అయితే

**న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవంతి।**
**ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి॥ (4-4-5)**

సంతానము (పుత్రుని) ప్రయోజనము కొరకై ఒక తండ్రికి పుత్రుడు ప్రియము అగుట లేదు. ఆత్మకు 'పుత్రుడు' అనునది ప్రియమైనది అగుచుండటముచేత, - పుత్రుడు ఆత్మకొరకే ప్రియమైన వస్తువుగా అనుభవమగుచున్నాడు.

విత్తము కొరకై విత్తము ప్రియమగుట లేదు. ఆత్మకు విత్తము ప్రియమగుచున్నప్పుడు, విత్తము ఆతనికి ప్రియముగా అనిపించటము జరుగుతోంది. ఆత్మకొరకే విత్తము ప్రియమగుచున్నది.

ఒకనికి వేద-వేదాంత విధులు, శాస్త్రములు మరియు అవి ఎరిగిన బ్రాహ్మణుడు - అంటే ఎంతో ఇష్టము!

**"బ్రాహ్మణుడు అట్టి వేదకోవిదుడు. బ్రాహ్మణములు - అంతగా ఇష్టమవటం"** → ఇదంతా ఆ బ్రాహ్మణుల కొరకా? కాదు. తన కొరకే। ఆత్మకు వేదాధ్యయనము - వేదాంత శాస్త్ర పరిజ్ఞానము గల **బ్రాహ్మణత్వము ఇష్టమగుటచే,** ఆ లక్షణములు గల ఒకానొక వ్యక్తి ఇష్టుడు, ప్రియము అగుచున్నాడు. ఆత్మకొరకే బ్రాహ్మణ్యము ప్రియము అవుతోంది.

ఒకనికి సామర్థ్యముగల క్షత్రియుడు ఇష్టమయినవాడుగా అగుచున్నాడు. ఎంతగానో రాజభక్తి కలవాడై ఉంటున్నాడు. ఎందుకు? రాజుగారి ప్రియముకొరకా? కాదు. తనకు (ఆత్మకు) రాజభక్తి - యుద్ధ సామర్థ్యము అనునవి కోరుకునే ప్రియ వస్తువులు కాబట్టి. **ఆత్మకు ప్రియమగుటచే తనే ఆతడు రాజు పట్ల రాజభక్తి (లేక దేశము పట్ల దేశభక్తి) కలిగియున్నవాడై ఉంటున్నాడు.**

ఇంకొకనికి తన గ్రామమో, రాష్ట్రమో, దేశమో, ఈ లోకమో, (స్వర్గము మొదలుగా గల) మరొక లోకమో ప్రియముగా అగుచున్నది. అందుకొరకై ఏమైనా చేయ సిద్ధపడుచున్నాడు. ఎందుచేత? తన గ్రామము యొక్క (లేక) ఈ లోకము యొక్క (లేక) స్వర్గము మొదలైన మరొక లోకము యొక్క ప్రయోజనము కొరకా? కాదు. **తనకు (ఆత్మకు) గ్రామమో, రాష్ట్రమో, దేశమో, లోకమో, స్వర్గమో ప్రియము కాబట్టే - ఆయా విశేషము తనకు ప్రియమై అనుభూతమగుచున్నాయి.**

ఒక భక్తునికి ఒకానొక దేవతంటే అత్యంత ప్రియముగా అగుచున్నారు. ఎవ్వరి ప్రయోజనము కొరకు? ఆ దేవత యొక్క ప్రయోజనము కొరకా? కానే కాదు. ఆత్మకు (తనకు) దేవత ప్రియమైనవారుగా అగుటచే, ఇప్పుడు ఆ దేవత తాను కోరుకొన్న - ప్రియమైన విషయముగా అగుచున్నారు.

(దేవతలు = అశరీరులై, ప్రకృతి యందు ఉనికి కలిగి, తమ ధర్మము నిర్వర్తిస్తూ **"దేహములను, ప్రకృతిలోని తత్త్వములను"** పరిపోషిస్తూ ప్రవర్తింపజేయువారు)

ఇంకా కొందరు సహజీవులపై (భూతానాం) అవ్యాజమైన ప్రేమ కురిపిస్తూ ఉంటారు. ఎందుకొరకు? ఆ సహజీవుల నిమిత్తమై, వారి ప్రయోజనము కొరకై అట్లా ప్రియత్వమును వర్షింపజేస్తున్నారా? కానేకాదు. మరి? **ఆత్మకు 'సహజీవులు' ఇష్టము - ప్రియము కనుక ఈ జీవులు ఆతనికి ప్రియమై పొందబడుచున్నారు.**

ఈ విధంగా ఆయా సమస్తము ప్రియము అవటానికి కారణము ఆ సమస్తము కొరకు, అద్దాని ఉపయోగము కొరకు (ప్రయోజనము కొరకు) కాదు. **ఆయా సమస్తము ఆత్మకు ప్రియము కాబట్టి సమస్తము ప్రియమై ప్రాప్తిస్తోంది.**

ఓ మైత్రేయీ! దీనిని బట్టి మనము తెలుసుకోవలసినదేమిటి?

- ఆత్మకు ఏది ప్రియమైతే, అది మాత్రమే ఒకనికి ఇక్కడ ప్రియమగుచున్నది.

- ఆత్మకు ప్రియము కానిది ప్రియమే అవజాలదు.

ఒకనికి భర్తగాని, భార్యగాని, సంతానముగాని, ధనము గాని, బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణులుగాని, వేదములుగాని, క్షత్రియులుగాని, వ్యవహార– సామర్ధ్యములు గాని, దృశ్యముగాని, లోకములుగాని, దేవతలుగాని (ఇష్ట దైవముగాని), సహజనులు గాని, సర్వము కూడా ఇవన్నీ – స్వతఃగా ప్రియములు కావు. <u>ఆత్మ ఏవి ప్రియమని అనుకొంటే అవియే ప్రియమగుచున్నాయి.</u>

ఆత్మకు వేరైనదంతా కూడా 'అనాత్మ'. మార్పు చెందునది. ఆత్మకు అన్యమైన దేనితోనూ ప్రియత్వము శాశ్వముగా ఉండజాలదు. అది సంగతి – సందర్భము– అనుభవము – అనుబంధములను అనుసరించి ఒకప్పుడు ప్రియము, ఇంకొకప్పుడు అప్రియము – ఇత్యాదులుగా అగుచున్నది.

**ఇదంతా దృష్టిలో పెట్టుకొని పరిశీలించినప్పుడు "అన్నిటికంటే కూడా ఆత్మయే ప్రియమైనది. – ఆత్మకొరకు మాత్రమే అనాత్మ ప్రియమగుచున్నది" అని తెలియవచ్చుచున్నది. ఆత్మయొక్క ఇష్టమును అనుసరించే ఏదైనా కూడా ఇష్టము అవటం ఇక్కడ జరుగుతోంది.**

కనుక ఓ దేవీ! మైత్రేయీ!

**ఆత్మా వా అరే ద్రష్టవ్యః** → ఆత్మయే దర్శించవలసినది. (తెలుసుకోవలసినది)। **సమస్తము 'ఆత్మగా చూస్తూ ఉండాలి.**

**శ్రోతవ్యో।** → ఆత్మ గురించే ఎప్పుడూ మాట్లాడుకోవాలి। ఆత్మ గురించి చెప్పు (సోఽహమ్, తత్త్వమ్ ఇత్యాది) మహావాక్య వివరణలు వినాలి.

**మంతవ్యో।** → ఆత్మ గురించే ఎల్లప్పుడు మననము చేయాలి! 'అనాత్మ' గురించి కాదు. నాకు కనబడుచున్నదంతా ఆత్మానంద స్ఫురణ చమత్కారమే – అని అనుకుంటూ, అనుకుంటూ ఉండాలి.

**నిదిధ్యాసితవ్యో।** → ఆత్మ గురించే ఎప్పుడూ ధ్యానము చేయాలి. "అంతా ఆత్మయే" అనే ధ్యాసను ప్రవృద్ధం చేసుకోవాలి। "ఆత్మనగు నేనే ఇదంతా అయి ఉన్నాను" – అను అనుభూతి, అనుభవములను అనుక్షణికం చేసుకోవాలి.

**ఓ ప్రియ మైత్రేయీ!**

<u>**ఆత్మనో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా, విజ్ఞానేన ఇదం సర్వం విదితం (భవతి)। (4-4-5)**</u>

- ఇదంతా ఆత్మగా భావన చేస్తూ, ఆత్మగా దర్శిస్తూ ఉండగా..,
- ఆత్మ గురించి వేదాంత వాఙ్మయము, ఉపనిషత్ మహావాక్యములు, సత్యద్రష్టల స్వానుభవములు – ఇవన్నీ.. వినుచూ, వినుచూ ఉండగా,
- ఆత్మగురించే → **"నా భర్య, పిల్లలు – మిత్రులు – శత్రువులు.. దేవతలు, జంతువులు, నేను, నీవు.. అంతా ఆత్మయే స్వరూపముగా కలిగి ఉన్నాము కదా"** – అని అనుకుంటూ అనుకుంటూ ఉండగా, **"ఆత్మగా అనిపించుగాక!"** – అని మననము చేస్తూ ఉండగా..,
- **విజ్ఞానేన.. "ఆత్మ గురించియే నేను తెలుసుకోవాలి. తదితరము నందు నేను తెలుసుకోవలసింది ఏదీ లేదు"** అను నిర్ణయముతో తెలుసుకొంటున్నదానిని తెలుసుకొనుచుండగా (Knowing about the knower) **– ఆత్మయే నాయొక్క స్వరూపము. స్వభావము" – అని తెలియబడుచున్నది.**

(మట్టి గురించి తెలిస్తే మట్టి బొమ్మలన్నిటి గురించి తెలియు రీతిగా) – ఇదం సర్వం విదితమ్। **(1) ఈ కనబడేది, (2) చూస్తున్నది, (3) చూస్తున్న దానిని చూస్తున్నది,** – అంతా కూడా ఏదై ఉన్నదో, ఏమిటో (ఆత్మ గురించి ఎరిగినవానికి) – తెలిసిపోగలదు.

**సమస్తము యొక్క సత్యరూపము అనుభవమునకు రాగలదు. సర్వాత్మక స్వస్వరూపము స్వానుభవము కాగలదు. (అహమ్ సర్వస్య ప్రభవో। మత్తః పరతరం నాస్తి। మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి, గణా ఇవ) – నేనే ఇదంతా అనునది కళ్లకు కట్టినట్లు సుస్పష్టమవగలదు.**

---





ఓ మైత్రేయీ! ఈ కనబడేదంతా ఆత్మయే! ఆత్మకు భిన్నమైనది ఎక్కడా ఏదీ లేదు. ఒకడు కల కంటూ ఉంటే.., కలలో కనిపించేదంతా ఆ కల కనువాని.. స్వప్న చైతన్య స్వరూపమే కదా! అట్లాగే ఈ జాగ్రత్తులో అనుభవమయ్యేదంతా జాగ్రత్ చైతన్య స్వరూప ప్రదర్శనమే! ఇక్కడి జాగ్రత్ – స్వప్న–సుషుప్తులు, అందులో అంతర్ – దృశ్య విశేషపరంపరలు, జాగ్రత్ – స్వప్న– సుషుప్తి ద్రష్ట (లేక) ద్రష్టలు, ఆ ద్రష్టను తన కల్పనగా గల కేవలసాక్షి – **అంతా కూడా సర్వదా ఏకము, అక్షరము – అగు ఆత్మయే। బ్రహ్మమే। బ్రహ్మమే అయి ఉన్న నేనే।**

**మైత్రేయి :** మహనీయా! మహర్షీ! అంతా ఆత్మయే అయినప్పటికీ లోకంలో – మీవలె సర్వము ఎరిగిన ఆత్మజ్ఞులు, నావలె ఆత్మ గురించి కొంత తెలిసి – కొంత తెలియనివారు, ఆత్మను పరోక్ష వస్తువుగా చూచువారు, ఇష్టదైవమును అన్యభావనతో (నాకు వేరు – అనుభావనతో) కొలచువారు – **ఇత్యాది అయా భేదములుకూడా ఉన్నాయి కదా!** బ్రాహ్మణులు (బ్రహ్మమును పరిశోధిస్తూ పరిశీలించి ఎరుగుచుండు వారు), క్షత్రియులు (కార్య సామర్థ్యముతో రక్షణ కలిగించు వారు), వైశ్యులు (పశుసంపద – వ్యాపార దక్షత కలవారు), శూద్రులు (సేవా సామర్థ్యము కలవారు.) – ఈ ఈ భేదములు లేవని అనగలమా? అనలేమేమో కదా?

**శ్రీయాజ్ఞవల్క్యుడు : "ఆత్మకు వేరైనదంతా కల్పిత–సందర్భములకు చెందిన ప్రదర్శనమేగాని – సహజము, వాస్తవము అగు సత్యము కాదు"** – అనునది **మహావాక్యసారము, వేదాంత శాస్త్ర పరాకాష్ఠ నిర్ణయము.** ఆత్మజ్ఞుల అనుభవము కూడా. **"ఆత్మకు అన్యముగా దర్శించటము"**.. అనునదంతా **'అనాత్మ దర్శనమే'** అగుచున్నది. అందుచేత..,

→ **బ్రహ్మ తం పరాత్ ఆద్యో అన్యత్ర ఆత్మనో 'బ్రహ్మ' వేద। (4-4-6)।** ఎవ్వడైతే "బ్రాహ్మణుడు ఆత్మకంటే వేరు" అని భావిస్తాడో ఆతడు బ్రాహ్మణునిచే (బ్రహ్మము యొక్క బ్రాహ్మణత్వపు అంశచే) పరాభవము పొందుచున్నాడు. **అనాత్మగా దర్శించబడుచున్నాడు.**

→ **క్షత్రం తం పరాత్ ఆద్యో అన్యత్ర ఆత్మనః క్షత్రం వేద।** ఎవ్వడు "క్షత్రియుడు ఆత్మకంటే భిన్నము" అని భావిస్తాడో **ఆతడు క్షత్రియునిచే (క్షత్రియముచే) పరాభవించబడుచున్నాడు.**

→ ఎవ్వడు లోకములను "ఆత్మ కంటే భిన్నము" – అని భావిస్తాడో, ఆతడు లోకములచే అనాత్మగా చూడబడుచున్నాడు. **లోకముచే పరాభవించబడుచున్నాడు.**

→ ఎవ్వడు – "దేవతలు ఆత్మకంటే వేరైనవారు" – అని భావిస్తాడో వానిని దేవతలు **ఆత్మకంటే తక్కువ చేసి అవమానించుచున్నారు.**

– **భూతాని తమ్ పరాత్ ఆద్యో అన్యత్ర ఆత్మనో భూతాని వేద।** ఈ జీవులను ఎవ్వడు **"మీరు ఆత్మ కంటే వేరు"** అని 'త్వం' తలుస్తాడో, అట్టివాడు జీవులచే (భూతములచే) అవమానించబడువాడు – అగుచున్నాడు.

– **సర్వమ్ తమ్ పరాత్, ఆద్యో, అన్యత్ర ఆత్మనో సర్వమ్ వేద।** – ఎవ్వడు ఈ సర్వమున' తమ్ 'ఆత్మకు' వేరు అని భావిస్తాడో, అప్పుడు ఆతడు ఈ సర్వముచే **'ఈతడు అనాత్మవంటివాడు'**.. అని **అవమానించబడుచున్నాడు.**

అనగా ఓ మైత్రేయీ! దీని అర్థమేమిటి?

**ఇదం – 'బ్రహ్మ', ఇదం క్షత్రం,**
**ఇమే లోకా, ఇమే దేవా, ఇమాని భూతాని,**
**ఇదగ్ం సర్వమ్ – యత్ – అయమ్ ఆత్మా। (4-4-6)**

ఇక్కడి బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు.. అనబడే చాతుర్వర్ణ్యములు, ఈ '14' లోకములు, ఆ లోకముల వ్యవహారమంతా తమ ప్రజ్ఞలచే నడిపిస్తున్న అశరీరులగు దేవతలు, ఈ లోకములలో నివసిస్తున్న సర్వ భూతజాలము.. **అంతా – బ్రహ్మమే.** అయితే, **భ్రమ దృష్టి కలవారికి బేధములతోను, ఆత్మ దృష్టికలవానికి ఆత్మగాను అగుపిస్తోంది. ఈ 'అనేకము'లో అంతర్లీన గానంగా వినబడే 'ఏకమే' – సత్యము.**

– ఎవ్వరు దేని పట్ల 'బ్రాహ్మీదృష్టి' – కాకుండా, బ్రహ్మమునకు వేరైన దృష్టి కలిగి ఉంటారో, అట్టి వారికి – ఈ దృశ్యమంతా కూడా – "వాస్తవమే కదా!" – అని అనిపిస్తూ వస్తోంది. ఇక్కడ ఉన్నది దృష్టి భేదమేకాని, సృష్టిభేదము లేనే లేదు.

– అంతేకాకుండా... **"ఇదంతా బ్రహ్మమే"** అను దృష్టి **"సుదృఢముగా, సునిశ్చితముగా, నిశ్చలానుభవముగా, అచ్యుతముగా"..** కలిగి ఉన్నవాని విషయంగా – ఈ అంతటికీ ఆతడు **ఆత్మీయుడు గానే అనుభవమగుచున్నాడు.**

**మైత్రేయి :** అయితే మహాత్మా! **నా యొక్క జాగ్రత్,** ఆ జాగ్రత్‌లోని భూత (జీవ) జాలము, జాగ్రత్‌లోని **"నేను",**

– నాయొక్క స్వప్నము, ఆ స్వప్నములోని భూతజాలము, స్వప్నములోని **"నేను",**
– నా యొక్క సుషుప్తి, ఆ సుషుప్తిలోని నిర్విషయానుభవము, సుషుప్తిలోని **"నేను" –**
– నేను – నాకు కనిపించే లోకము – ఇవన్నీ కూడా,.. **ఒకదానికొకటి వేరుగాను, ఒకదాని కంటే మరొకటి ప్రత్యేకమైన దానివలెను** కనిపిస్తున్నాయే! ఎందుచేత? **'అంతా కూడా ఏకమగు ఆత్మయే' అను అవగాహన, అనుభవము నా పట్ల సిద్ధించేది ఎట్లా?**

**యాజ్ఞవల్క్య ఋషీశ్వరుడు :** ఒకచోట పెద్దగా దుందుభీ (శంఖము) (లేక) భేరీ (నగారా) నినాదము వినబడుచున్నది. ఆ ప్రక్కన చిన్న చిన్న మద్దెల, వీణ, ఇత్యాది శబ్దములు కూడా వెలువడుచున్నాయనుకో.

– పెద్దగా శబ్దీకరణమగుచున్న దందుభి నాదమే ప్రత్యేకమై వినిపిస్తుంది గాని, ఆ ప్రక్కన గల తదితర శబ్దములు వినిపించవు.
– ఆ దుందుభి నాదముతో ఏకము చేసి చూస్తే తదితర శబ్దములూ ఏకమై వినబడతాయి.

అట్లాగే **"అంతా ఆత్మయే"..** అను వేద – ఉపనిషత్ – ఆత్మజ్ఞుల వీరొమ్యేషము (పెద్దకేక)లో, ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు, జీవుల మధ్య కనిపించే భేదాలు చిన్న చిన్న శబ్దములై కలిసిపోతున్నాయి. పెద్ద డప్పు శబ్దమును వెంటనంటి ఉండే మందస్వర భేదములు వంటివి ఈ జీవుల – లోకముల భేదములన్నీ – (ఆత్మ సమక్షంలో చిన్నచిన్న విషయాలు).

**ఆత్మను ఎరిగిన వానికి ఇక్కడి సర్వ భేదములు (ఆత్మకు అభిన్నమైనట్టి) ఆత్మాంతర్గత మంద్ర శబ్దాలుగా అగుచున్నాయి.**

'ప్రజ్ఞ' (ఎరుక) అనే దుందుభి (యుద్ధం ప్రారంభంలో వినిపించే తారా శబ్దము – ఢాఢాం శబ్దము) సమక్షములో – ఈ తెలియబడే తదితరములైన జాగ్రత్ – స్వప్న– సుషుప్తులు, జీవుల భేదములు.. ఇవన్నీ **తెలియబడు విషయములై, కేవల ప్రజ్ఞ యొక్క విన్యాస ప్రదర్శనములు మాత్రమే** అగుచున్నాయి. ఆత్మ చైతన్యమునకు, ప్రజ్ఞకు వేరై ఎక్కడా ఏదీ లేదు.

**'చిత్'** కంటే వేరుగా చిత్తము లేదు. దృశ్యము లేదు. (శంఖము పూరించబడుచూ ఉంటే, బయట జనించే తదితర శబ్దములు వినిపించని రీతిగా, స్వీకరించబడని విధంగా) – ఆత్మ యొక్క ప్రజ్ఞాన తత్త్వమును ఎరిగినవాడికి ప్రజ్ఞకు వేరుగా మరేదీ కనిపించదు. వినిపించదు.

**శ్లో॥ స యథా వీణాయై వాద్యమానాయై**
**న బాహ్యాన్ శబ్దాన్ శక్నుయాత్ గ్రహణాయ,**
**వీణాయైతు, గ్రహణేన వీనావాదస్య వా శబ్దో గృహీతః। (4-4-9)**

ఒకడు తెల్లవారుఝామున లేచి మృదుమధురంగా వీణను వాయించుచూ, ఆ వీణానాదమందు లీనమై ఉన్నాడు. అయితే, వాకిట పక్షులు అదే సమయంలో కిలకిలారావాలు చేయచున్నాయి. అప్పుడేమౌతుంది? ఆ బయట కిలకిలారావాలు వచ్చి కూడా మధురవీణా నాదములో కలసిపోతాయి కదా! ఆత్మను బుద్ధితో దర్శించి ఆనందించువాని అనుభవములో – ఈ జాగ్రత్ – స్వప్న– సుషుప్తి – లోక – లోకాంతర – దేవత – మానవ.. ఇత్యాది భేదాలన్నీ **పిల్ల శబ్దములవలె ఆత్మానందాస్వాదనలో కలిసి పోవుచున్నాయి.**

**ఓ మైత్రీయీ!** వేరువేరైన తడికట్టెలు కాలుస్తూ ఉంటే, అన్ని కట్టెల సంబంధమైన పొగ ఏకమై వేరువేరు తరంగాల వలె బయల్వెడలుచూ ఉంటుంది చూచావా?

అట్లాగే ఆద్యంత రహితము– అఖండము – అప్రమేయము – అనునిత్య సత్యము అగు **'పరమాత్మ'** యొక్క నిట్టూర్పులు వంటివే ఇక్కడి ఋక్ – యజుర్ – సామ– అధర్వణ వేదనాదములు, అందలి సంహిత – బ్రాహ్మణములు, ఇతిహాసములు, పురాణములు, విద్యారూపములగు ఉపనిషత్తులు, అందలి వివిధ శ్లోకములు, స్తోత్రములు, బ్రహ్మసూత్రములు, వ్యాఖ్యానములు మొదలైనవన్నీ కూడా।

ఈ సమస్తము పరబ్రహ్మమే। ఇదియే సమస్త వేద – ఉపనిషత్ – పురాణాదుల సారము.

తటాకములలోను, సరస్సులలోను, నదీ–నదములలోను, సముద్రములోను, – **జలమంతా ఒక్కటే కదా!** సముద్రజలమే బయల్వెడలి, తటాక – సరస్సు –నదీ– ప్రవాహములై, తిరిగి వర్ష–నదీ ప్రవాహ రూపంగా సముద్రము చేరుతోంది కదా! (నదీనాం సాగరో గతిః). అదేవిధంగా ఈ సర్వము ఆత్మకు అభిన్నమై, ఆత్మ నుండి బయల్వెడలి, ఆత్మ యందు సంచరిస్తూ, **ఆత్మయందే లయించుచున్నది. "నీవు–నేను" మొదలైనవన్నీ ఆత్మయందు ఆత్మగానే విరాజిల్లుచున్నాయి.**

- మృదువు – కఠినముల భేదముగా కనిపించే, స్పర్శానుభవముగా అనుభవమయ్యేదంతా చర్మము నుండి స్పర్శరూపంగా బయల్వెడలి **ఆ చర్మము నందే 'స్పర్శ' అను ఏకరూపముగా తిరిగి అగుచున్నది.**
- "ఇది తీపి.. ఇది చేదు.. ఇది కారము.. ఇది ఉప్పు.. ఇది కమ్మతనము".. ఇటువంటి వేరు వేరు రుచులన్నీ నాలుక యందు 'రుచి' అను తత్త్వము నందు బయల్వెడలి, తిరిగి తత్త్వము నందు ఏకరూపమై, నాలుకయందే స్థానము పొందుచున్నాయి. **వేరువేరు రుచులన్నీ నాలుకలో గల 'రుచి'యందు ఏకరూపము పొందినవై ఉంటున్నాయి.**
- రకరకాల వాసనలన్నీ ఆఘ్రాణము (ముక్కు) నందు **'వాసన' అను అనుభవము నందు ఏకరూపమై, స్థానము కలిగి ఉంటున్నాయి.**
- అనేక ఆకారములు కనిపిస్తున్నాయి. కాని కంటిలోని చూపు ఒక్కటే। ఆయా అనేక కంటికి కనిపించే భేద దృశ్యములన్నీ కంటిలోని 'చూపు' అను ఏకైక తత్త్వము యొక్క వివిధ ప్రదర్శనలుగా బయల్వెడలి, **చివరికి 'చూపు' నందు ఏకరూపము పొందుచున్నాయి.**
- చెవులతో అనేక స్వరాలు, అనేక నాదాలు, అనేక ప్రియ–అప్రియ, ఉద్వేగ – అనుద్వేగ శబ్దాలు.. ఇవన్నీ వింటున్నాం. వీటన్నిటికీ జనన స్థానము, లయస్థానము చెవులలోని శబ్దతత్త్వమే! శబ్దాలన్నీ ప్రదర్శనమగుచూ, **తిరిగి శబ్ద తత్త్వమునందే 'లయము' పొందుచున్నాయి.**
- అనేక సంకల్పాలు – ఆలోచనలు చేస్తున్నాము. అందులో కొన్ని తనకు, ఇతరులకు ఆనంద – ఆహ్లాదకరంగాను, మరికొన్ని తనకు, తదితరులకు దుఃఖ–ఉద్వేగకరంగానూ ఉండవచ్చు గాక! అయితే **సర్వేషాగ్ం సంకల్పానాం 'మన' ఏకాయన మేవగ్ం!**

  రకరకములైన సమస్త సంకల్పాలు, ఆలోచనలు కూడా మనస్సు నందు "సంకల్పము".. అనుచోట ఏకరూపమే కలిగి ఉంటున్నాయి.
- అనేక విద్యలు ఉన్నాయి. వేరువేరైన విద్యలన్నీ కూడా (పౌరాణికం, ఆధ్యాత్మికం, ప్రకృతి సంబంధము, దేహసంబంధము, వ్యవహారిక సంబంధము అగు విద్యలన్నీ కూడా).. **విద్యానాగ్ం 'హృదయం' ఏకాయనమేవగ్ం..** హృదయమునందు 'ఎరుగుట' అను ఏకరూపమే (ఎరుక ఒక్కటే). **అవన్నీ మొదలు మధ్య చివరి కూడా 'ఎరుక'** (Awareness) **రూపమే!**
- చేతులతో– అనేక కదలికలు, అనేక పనులు నిర్వర్తించబడుచూ ఉండవచ్చు గాక! అవన్నీ చేతుల యొక్క క్రియాశక్తి (లేక) కదలిక శక్తియందు ఏకరూపమై బయల్వెడలటము, తిరిగి చేతుల కదలిక శక్తియందు లయించటము.. జరుగుచూ ఉన్నది! చేతలు అనేకం కావచ్చు. **చేతలు ఒక్కటే. అంతా ఏకైక కదలిక తత్త్వమే!**
- అనేకసార్లు శృంగారానందము ఈ జీవులు పొందుచూ ఉండవచ్చు గాక! కానీ ఉపస్థయందలి ఆనందానుభూతి ఒక్కటే అయి ఉండి, **ఆ ఆనందములన్నీ ఏకరూపమే చెందినవై ఉంటున్నాయి.**
- అన్ని విసర్జనములకు పాయువు – నందలి **విసర్జన శక్తి యందు ఏకరూపము** వహించి ఉంటున్నాయి.
- ఈ కాళ్ళతో నడుస్తూ నడుస్తూ అనేక గమ్యములు రోజూ చేరుతూ ఉండవచ్చు గాక। అట్టి నడకలకు గమ్యము రెండు పాదములలోని ఒకే చలనశక్తి తత్త్వమే! పాదముల కదలికలన్నీ పాదములలోని చలన శక్తి నుండి బయల్వెడలి, పాదములందే (నడకకు సంబంధించిన స్థిరశక్తి యందు) లయిస్తున్నాయి.

- వేదోచ్చారణలన్నిటికీ వాక్ ఇంద్రియమే బయల్వెడలు స్థానము, కొనసాగు స్థానము, గమ్యస్థానము కూడా అయి ఉన్నది.
- గానము చేయు శబ్దము గొంతు నుండి బయల్వెడలి తిరిగి గొంతునందు శబ్ద తత్త్వముగా ఏకస్వరూపము పొందుచున్నది.

***ఈ దృశ్యవ్యవహారమంతా అదేతీరుగా ఆత్మ నుండి బయల్వెడలి, ఆత్మకు అభిన్నమై, ఆత్మయందే ప్రదర్శితమై, ఆత్మయందే లయించుచున్నది.***

***(ఆత్మ సముద్ర జలమువంటిదనుకుంటే, ఇక్కడి జీవాత్మ-జగత్-బంధ-మోక్ష-జన్మ-కర్మ వ్యవహారమంతా జలతరంగము వంటిదే. ఆత్మయందు (స్వస్వరూపాత్మానంద సాగరమునందు లయము కాబోవుచున్నట్టిదే)।***

**మైత్రేయి :** ఈ దృశ్యమంతా ఆత్మయందు లయించిన తరువాత ఇద్దాని రూప-నామములు, గుణ వ్యవహారములు, పరస్పర సంబంధ విశేషములు, ఈ లోకములు.. **ఇవన్నీ ఏ రూపము పొందుచున్నాయి?** ఆత్మయందు ఏర్పడినవై ఉండి, మరల మరెప్పుడో బయల్వెడలుచున్నాయా?

**యాజ్ఞవల్క్య మహర్షి :** ఉప్పు జలము నుండి బయలుదేరుతుంది కదా! ఇప్పుడు ఆ ఉప్పు స్ఫటికమును మరల జలములో వేస్తే, ఆ (ఉప్పు) స్ఫటికము యొక్క పొడవు- వెడల్పు - మందములు ఏమి అగుచున్నాయి? జలములో కరిగిపోతున్నాయి కదా! ఇప్పుడు ఆ ఉప్పు ఎక్కడున్నది?

**మైత్రేయి :** ఆ ఉప్పా! నీటిలో కరిగిపోతుంది. నీటి నిండా ఉంటుంది. "అది జలములో ఈ మూల ఉన్నది".. అనునదేమీ ఉండదు. జలమంతా ఆ ఉప్పు కరిగినదై ఉంటుంది.

**యాజ్ఞవల్క్య మహర్షి :** ఔను కదా! ఇప్పుడు ఆ ఉప్పును ఆ నీటి నుండి తిరిగి ఇదివరకటి స్ఫటిక రూపముగా బయటకు తీయటము సాధ్యమా? కాదుకదా! అయితే నీరు ఎక్కడ నుండి తీసినా కూడా ఉప్పగానే ఉంటుంది కదా!

**యతో యత స్వాదదీత లవణమేవ ఏవం వా, అర,**
**ఇదమ్ మహత్ భూతమ్ → అనంతమ్, అపారమ్, విజ్ఞాన ఘన ఏవ। (4-4-12)**

అదేవిధంగా దృశ్యమునకు ముడి పదార్థములగు మహాభూతము ఇదంతా కూడా - అనంతము, అపారము అగు విజ్ఞాన ఘనమే।

**తెలివియే → తెలియబడుచున్న సమస్తముయొక్క రూపముగా బయల్వెడలి, తెలివియందు తేలియాడుచు, తిరిగి 'తెలివి' యందు లయించుచున్నది.**

ఇదంతా సర్వదా విజ్ఞాన ఘనమే అయి ఉన్నది. **ఇదంతా 'బ్రహ్మము'గా** బ్రహ్మజ్ఞానముచే అనుభూతమవటమే - **"బ్రహ్మము తెలియబడటము".** అదియే జగత్ **లయము కూడా.**

అజ్ఞానముచే మహాపంచ భూతాత్మకము గాను, జ్ఞానముచే 'ఆత్మ'గాను తెలియబడటమే సృష్టి - స్థితి - లయ చమత్కారము.

**"భూత"** - భూత శబ్దమునకు (నిఘంటు) ఒక అర్థము - 'పరమ సత్యము'.

**పరమాత్మ** = మహత్ (మరియు) పరమార్థము. పరమసత్యము. ఈవిధముగా ఉభయము ఏకమే।

**మైత్రేయి :** వాస్తవానికి ఆత్మ **"అద్వితీయము - రెండవది అనునది లేనట్టిది - దోషరహితము"**.. అని చెప్పబడుతోంది కదా! అట్టి ఆత్మను సంసార దుఃఖము స్పృశించనైనాలేదుకదా! మరి అటువంటప్పుడు ఖిల్యభావము [ (న్యూనతాభావము). (నేను పుట్టితిని. మరణిస్తున్నాను. సుఖ - దుఃఖములు పొందువాడను. నేను - నాది.. అనువాటిచే కప్పబడ్డవాడను... అనునది)] అగు 'సంసారము' ఆత్మకు ఎందుకు వచ్చిపడుతోంది? ఎవరి కారణంగా? ఎవరి యొక్క ప్రయోజనము కొరకు?

**యాజ్ఞవల్క్యుడు :** ఆత్మయే స్వీయ చమత్కారముచే లీలగా, క్రీడగా తన అప్రమేయత్వమును, నిర్గుణత్వమును కించిత్ ఏమరచి - **(నాటకము చూస్తూ తన్మయుడగు ప్రేక్షకునివలె)** - "జీవుడు (Experiencer)" అనబడు ఒకానొక విభాగమును **సందర్భయుతంగా తెచ్చిపెట్టుకొంటోంది.** నాటకము ముగిసిన తరువాత నాటకము చూచు కథన సంబంధమైన దృష్టి అంతా - ఆ ద్రష్టలోనే లయించు తీరుగా,.. ఆ జీవుడు అనబడు జీవత్వము మరల ఎప్పుడో తిరిగి ఆత్మయందే లయమును పొందుచున్నది.

**దేహభావము నుండి విముక్తుడైనవాడు ఆత్మ స్వరూపుడై ప్రకాశించుచున్నాడు.** అటు తరువాత (ఆత్మజ్ఞానము పొందినప్పుడు) అంతకుముందటి అనుభవములగు నామ–రూపాత్మక భావోద్రేకములు స్వస్వరూపము నందే లయించి, బయటగా కనబడకుండా పోతున్నాయి. ఊహించువాని 'ఊహ' – తిరిగి ఆ ఊహించువానియందు లయించు తీరుగా, **సర్వదా ఆత్మ ఆత్మగానే శేషించుచున్నది! వాస్తవానికి సర్వదా ఆత్మగానే ఉన్నది.** ఆత్మ ఆత్మగానే ప్రదర్శనమౌతోంది. అందులో దృశ్యము లేదు. ద్రష్టయు లేదు. ఇప్పుడూ లేవు. ఇతఃపూర్వమూ లేవు. ఇకముందూ ఉండబోవు.

꧁꧁꧁

**మైత్రేయి :** భగవాన్! **"దేహము మొదలైనవాటితో ఏర్పడిన సంఘాతమునకు ఈ జీవుడు అతీతుడైనప్పుడు, ఇక వాటిని గురించిన సంజ్ఞ కూడా మిగిలి ఉండదు"** – అని మీరు సిద్ధాంతీకరించి చెప్పుచున్నప్పుడు.. **"ఇప్పుడున్నదంతా పోగొట్టుకుంటాను కదా!"..** అను రూపము గల ఏదో **చెప్పరాని మోహము** నాయందు మరింతగా అధికమగుచున్నది. స్వామీ! మీతో ఏర్పడే ఆప్యాయతతో కూడిన మధుర భావనా సంబంధమంతా (అనుబంధమును) ఆత్మ జ్ఞానముచే పొందినప్పుడు – నేను పోగొట్టుకుంటానంటారా? ఈ విధమైన అనుమానము చేతనే కాబోలు, **నా మోహము అధికాధికమగుచున్నదనిపిస్తోంది.**

**యాజ్ఞవల్క్యుడు :** కలగంటున్న నీవు–నిదురలేచిన తరువాత కలలో కనిపించిన వస్తువులు పోగొట్టుకొంటున్నట్లా? కాదు కదా। నేను నీకు ఏదో మోహము గురించిగాని, మోహము కల్పించటానికిగాని ఇదంతా చెప్పటము లేదు. మరి? నీకు మోహము కలిగించటము నా ఉద్దేశ్యము ఏమాత్రము కాదు. నీకు నీవే అద్వితీయమగు విజ్ఞానఘనము నందు **"ద్రష్ట – దృశ్యము"..** అను మొదలే లేనట్టి రెండు విషయాలు కల్పన చేసుకొని మోహము చెందుచున్నావు. **'తెలివి' అను నీ యొక్క కేవలీ తత్త్వమునందు ద్రష్ట – దృశ్యముల కల్పన స్వకీయమైనదని, మరల మరొకప్పుడు నీవే త్యజించుచున్నావని, మనము సర్వదా విజ్ఞాన ఘన స్వరూపమగు ఆత్మ స్వరూపమే అయి ఉన్నామని.. వేదవాఙ్మయ సారవాక్యము (తత్త్వమ్)..ను గుర్తు చేస్తూ ఉన్నాను.** నీ మోహమును తొలగించుచున్నాను.

**ఇంద్రియ తాదాత్మ్యముచే నీకు నీవే నీ స్వరూపము పట్ల "జీవాత్మ, జగదనుభవము" – అనబడే "పరిచ్ఛిన్నత్వము"** కల్పించుకొనుచున్నావని గమనించెదవుగాక! అట్టి పరిచ్ఛిన్నత్వము స్వకీయమైన అవిద్యచే ఏర్పడినది మాత్రమే గాని, **అది ఆత్మస్వరూపివగు నీకు సహజము అయినది కాదు.**

స్వకీయ కల్పితదృష్టికి అన్యముగా కనిపించేదంతా అద్వితీయ ఆత్మస్వరూపిణివగు నీపట్ల **అసహజమే.** ఒక దర్పణము (అద్దము)లో చంద్రబింబము ప్రతిబింబిస్తోందనుకో! ఆ దర్పణము అక్కడి నుండి తొలగిస్తే ఏమౌతుంది? ప్రతిబింబము అక్కడ కనిపించదు. మరి అప్పుడు ప్రతిబింబము నశించినట్లా? తటాకములోని నీరు ఎండిపోయి, చంద్రుని ప్రతిబింబము తొలగితే ఆకాశములోని చంద్రునికి ఏర్పడు భేదమేమి? న్యూనత ఏమున్నది? **అట్లాగే నీ జీవాత్మ భావన తొలగినప్పుడు ఆత్మస్వరూపివగు నీకు వచ్చే లోటు ఏమీ ఉండదు. దర్పణములో దృశ్యము ప్రతిబింబించినంత మాత్రముచేత దర్పణమునకు లోటేముంటుంది? ప్రతిబింబము వలన క్రొత్తగా వచ్చేదేమున్నది? మనస్సు అనబడేది దర్పణము వంటిదే।**

**స ఆత్మా సర్వస్య జగతః।**

- బ్రహ్మము సకల జగత్తుకు ఆత్మ!
- బ్రహ్మమే ఉన్నది. జగత్తు అనబడునది. ఏర్పడనూ లేదు. నశించనూ లేదు. **(బ్రహ్మ సత్యమ్! జగత్ మిథ్యా)।** దర్పణములో ప్రతిబింబము వంటి నీ వర్తమాన జీవాత్మ సంబంధితమైన **"సంబంధ, అనుబంధ, బాంధవ్యములు – ఇవేమీ లేవు"** అని తెలియవచ్చుటచే **ఉన్నదేదీ పోదు. క్రొత్తగా ఏదీ రాదు సుమా! ఉన్నది ఉన్నదౌతుంది. లేనిది లేనిదౌతుంది.**

ఓ మైత్రేయీ! ఆత్మయే నిశ్చితమగు పరమార్థ సత్యము। అది మాయా ఆవరణచే నశించటములేదు. మాయా ఆవరణము తొలగుటచే క్రొత్తగా జనించునదీ కాదు.

అందుచేత అనంత – అపార మహాభూతతత్త్వము ఆత్మయందు లయించుటచే నీవు ఆత్మగా ప్రకాశించుచున్నావు! **ఇప్పుడు కూడా నీ యొక్క ఆత్మ ప్రకాశమే అనంత – అపార మహాభూతత్త్వముగా నీకు నీయొక్క అభ్యాసపూర్వక దృష్టిచే అనుభవమగుచున్నది.**

– స్వప్నము నాదైన నేను – స్వప్నములోని నేను వేరు వేరా? ఒక్కటే కదా! **'పరమాత్మ, జీవాత్మ'** ఏక అఖండాత్మ స్వరూపులే।

– దర్పణమునకు ఎదురుగా నిలచినప్పటి నీయొక్క రక్తమాంస దేహము దర్పణములో కనిపించే ప్రతిబింబ దేహము.. అని రెండు వేరువేరుగా ఉన్నాయా? లేవు కదా! **ఈ జగత్తు జగత్తును స్వానుభవముగా కలిగి ఉన్న జీవాత్మ, ఆ జీవాత్మనుస్వానుభవముగా కలిగి ఉన్న పరమాత్మ** – వేరువేరుగా లేవు.

అనగా..

- నీ పరస్వరూపమే → **ఇహ స్వరూపముగా ఉన్నది.**
- నీ ఇహ స్వరూపము → **పరస్వరూపమే అయి ఉన్నది.**
- నీ పరస్వరూపమునకు వేరుగా → **ఇహ స్వరూపానుభవమగు జగత్తు లేదు.**
- నీ ఇహ స్వరూపానుభవ జగత్తు – **నీ పరస్వరూపమునకు వేరుకాదు.**

**ఈ విధంగా పరమాత్మకు – జీవాత్మకు అద్వైతమే సర్వదా సిద్ధించుచున్నది.**

- నీ ఇహ స్వరూపము నీ కల్పనయే కాబట్టి, దానికి ముక్తి లేదు. ఉండదు కూడా. ఒకడు ఒక కథరాస్తూ ఉంటే, అందులో ఒక పాత్రకు 'ముక్తి' అనునదేముంటుంది?
- పరస్వరూపమునకు బంధమే లేదు. ఇక ముక్తి యొక్క ఆవస్యకత ఏమున్నది? కథా రచయితకు కథలోని కొన్ని పాత్రల వలన బంధమేముంటుంది? బంధమే లేనిచోట ముక్తి ఎక్కడిది?

ఈ విధముగా పరమాత్మ స్వరూపుడవగు నీకు – జీవాత్మగాని, ఆ జీవాత్మ యొక్క జగదనుభవము గాని బంధము ఎట్లా అవుతాయి? అవి నీ నుండి వేరే కానప్పుడు అవి నీకు బంధమవటమెక్కడిది? బంధమే అవజాలదు. తరంగములు జలమునకు బంధమా?

**"జీవాత్మ నా కంటే వేరై, బంధము అనుభవిస్తోంది!"** అని అనదలచుకొన్నావా? నీకంటే జీవాత్మగాని, ఆ జీవాత్మయొక్క జగదనుభవముగాని వేరు – అని అనటము ఎటువంటిదంటే...,

*"నేను వేరు! నాలోని నవలా రచయితవేరు! నవలలోని సంఘటనలు వేరు! నవలలోని పాత్రలు వేరు"*

*"నేను వేరు ! నా స్వప్నములోని ద్రష్ట వేరు! ఆ స్వప్నములో కనిపించే జనులు వేరు".*

*"నేను వేరు ! దర్పణములోని నా ప్రతిబింబము వేరు! ఆ ప్రతిబింబము యొక్క గుణగణములు వేరు"*

అని చెప్పటము వంటిది! **'వాచారంభమ్! వికారో నామధేయమ్'.** "మాటవరకే, వికారమును పేరు పెట్టి పిలవటము వంటిది! బంగారపు ఉంగరములో బంగారము – ఉంగరము ఒక్కటే అయినా,.. ఆ విధంగా మనము బంగారపు ఉంగరము–అని పిలుస్తూ ఉన్న తీరుగా ఇదంతా.. అగుచున్నది!

ఓ మైత్రేయా! **బ్రహ్మము (పరమాత్మ)–జీవాత్మ–జగత్తు ఏకరూపమే గాని వేరువేరు కాదు! ఇదియే బ్రహ్మ జ్ఞానము! అద్వైత జ్ఞానము.**

**యత్ర హి ద్వైతమివ భవతి..,**

ఎప్పుడైతే అవిచారణచే **'ద్వైతము'** అంగీకరించబడి, నమ్మిక పొందినదై ఉంటుందో, **అప్పుడు అక్కడ మాత్రమే..,**

- **తదితర ఇతరమ్ జిఘ్రతి।** ఇతరుడు ఇతరమును (ఒకడు) **వాసన చూచుచున్నాడు.**
- **తదితర ఇతరమ్ పశ్యతి।** అప్పుడు ఆ ఇతరుడు ఇతరమును **చూచుచున్నాడు.**
- **తదితర ఇతరగ్ం శృణోతి।** అప్పుడు ఆ ఇతరుడు ఇతరమును **వినుచున్నాడు.**
- **తదితర ఇతరమ్ అభివదతి।** ఆ ఇతరుడు ఇతరముతో (ఒకడును ఒకనితో) **పలుకుచున్నాడు.**
- **తదితర ఇతరమ్ మనుతే।** ఆ ఇతరుడు ఇతరమును (ఒకడు మరొకరి గురించి) **మననము చేయుచున్నాడు.** తలపోయుచున్నాడు.
- **తదితర ఇతరమ్ విజానాతి।** ఆ ఇతరుడు ఇతరమైన దానిని తెలుసుకొనుచున్నాడు.

**అద్వైతము సిద్ధించేచోట అవన్నీ సంఘటనమవవు.**

పరమాత్మ –జీవాత్మ – జగత్తులు (స్వప్నము తనదైన పరమ పురుషుడు, స్వప్నములో అంతర్గతుడైయు స్వప్నాంతర్గత ద్రష్ట, స్వప్నదృశ్యము వలె).. ఇవన్నీ వేరు వేరు → అనునదంతా చెల్లుచున్నచోట మాత్రమే **'వేరు వేరు'** అనే **అనేకము** రాజ్యమేలుతోంది. (దర్శించువాడు – దర్శించుచున్నట్టిది – దర్శనము (Perceiver - Objects being perceived - perception) - వేరు వేరుగా భావించుచోట మాత్రమే).. పై రీతిగా **తదితరము** (Some thing different) అనేది చెల్లుబాటు అగుచున్నది.

ఎక్కడ వాటి యొక్క ఏకత్వ నిరూపణా రూపమగు ఆత్మజ్ఞానము వెల్లివిరిస్తోందో, అట్టిచోట.., సర్వము పరమాత్మమయముగా అనుభవమవగలదు. నీవు–నేనుగా ఉన్నది పరమాత్మయే। మనము పరమాత్మ స్వరూపులమే।

**సర్వము "సోఽహమ్ రూప పరమాత్మగా" తెలియవచ్చుచుండగా..,**

**తత్ తేన కథం జిఘ్రేత్?** – వాసన చూచున్నదెవ్వరు? వాసన జనించి ఆ రెండవ వస్తువు ఎక్కడిది?

(1) చూడబడునది (2) చూస్తూ ఉన్నది (3) దృష్టి ఏక స్వరూపము సంతరించుకొనుచుండగా **ఏది దేనిని (వేరుగా) చూస్తోంది?**

అట్లాగే వినువాడు – వినికిడి – వినబడునది, పలుకువాడు – పలుకబడునది – పలుకుచున్నట్టిది, ఆలోచన చేయువాడు – ఆలోచించబడునది – ఆలోచించు విషయము ఏకస్వరూపమగుచుండగా, **ఎవడు ఏది వినుచున్నాడు?**

ఆత్మజ్ఞాని – దేనితో దేనిని వింటాడు? దేనితో దేనిని చూస్తాడు? దేనితో దేనిని పలుకుతాడు? దేనితో దేనిని ఆలోచిస్తాడు? దేనితో దేనిని తెలుసుకుంటాడు? కలలో ఇద్దరి మధ్య జరిగే సంభాషణ – ఆ కల తనదైనవానికంటే వేరా?

**దేనితో ఈ సర్వము తెలుసుకొనుచున్నామో, అద్దానిని దేనితో తెలుసుకోగలం?**

**విజ్ఞాతను (తెలుసుకొనుచున్నదానిని) తెలుసుకోవటానికి ఏ తెలివి పనికి రాగలదు?**

**యేన ఇదగ్ం సర్వం విజానాతి, తం కేన విజానీయాత్ ఇతి॥**

ఈ సర్వము తెలుసుకొంటున్న విజ్ఞాన స్వరూపమును దేనితో తెలిసికోగలం? **ఆ తెలుసుకోవలసినది తెలుసుకొనుచున్నవాడే అయి ఉన్నాడు కదా మరి!**

**ఇతి చతుర్థ అధ్యాయః – చతుర్థ బ్రాహ్మణము**
**మైత్రేయీ బ్రాహ్మణము**

# చతుర్థ అధ్యాయము – పంచమ బ్రాహ్మణము

## మధుబ్రాహ్మణము

**యాజ్ఞవల్క్యుడు : ఓ మైత్రేయీ! ఇయం పృథివీ – సర్వేషాం భూతానాం ఆత్మమాధుర్యమేవ।**

**ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధ్వః** (4–5–1)। ఈ పృథివి (భూమి) – సమస్త ప్రాణులకు నివాస స్థానము. ఆహారము–ఔషధులు ప్రసాదించు ఆప్త బంధువు. కాబట్టి **ప్రాణులందరికి అత్యంత మధురమగు, ప్రియమగు స్థానము.**

**"మధువు = తేనే టీగలు కారణమై, కష్టపడి తెచ్చి దాచుకొన్న కార్యరూపము!"** అట్లాగే, **అస్య పృథివ్యై సర్వాణి భూతాని మధుః। (4–5–1) ఈ పృథివి జీవుల కర్మఫలములచేతనే నిర్మించబడినదవటం చేత,** ఈ పృథివికి **సకల ప్రాణులు మధురమైనవారు.** అనగా ఈ పృథివీ అభిమాన దేవతకు జీవులంతా మధురము. జీవులకు పృథివి మధురము.

ఈ పృథివియందు ఏ తేజోమయ – అమృతమయ అభిమాన పురుషుడు ఉన్నాడో. ఆతడే

- ఈ ఆధ్యాత్మకమైన భౌతిక దేహమనందు అభిమాని అయి, తేజోమయ– అమృత పురుషుడుగా ప్రదర్శితుడు.
- **యశ్చ అయమ్ – సయో అయమ్!** – ఆ భూమియందలి అభిమాన పురుషుడే, ఈ దేహముల యందు వేంచేసినవాడై, ప్రదర్శితుడై ఉన్నారు. [ భూమియందు, సమస్త జీవుల దేహములందు మధుర (ప్రియ) స్వరూపుడై ఉన్నాడు].

అనగా, సుప్రసిద్ధమగు భూమి, – సమస్త ప్రాణుల యొక్క కారణము. సమస్త ప్రాణులు – ఈ భూమి యొక్క కార్యము. ఉభయము పరస్పరము కార్య – కారణ సంబంధములు కలిగి ఉన్నారు.

**భూమి, కారణము అయితే, జీవులు కార్యము. జీవులు కారణమైతే భూమి కార్యము.**

ఈ భూమి యందు ఏ తేజో – అమృత స్వరూపుడు 'భూమి అభిమాని' అయి వెలుగొందుచున్నాడో, ఆతడే ఈ దేహ – ఇంద్రియ సముదాయకర్త కూడా అయి ఉన్నారు. (1) **"భూమి యందలి తేజోరూపుడు, (2) అమృత స్వరూపుడగు ఈ జీవుడు"** ఈ ఇరువురు అఖండమగు ఆత్మస్వరూపులే। **ఆత్మగా చెప్పబడునది ఆ రెండింటి ఏకరూపమే।**

అట్టి ఆత్మ స్వరూపమును ఎరుగుటయే అమృతత్వసాధన రూపమగు ఆత్మ విజ్ఞానము। ఇదియే **'పరబ్రహ్మ స్వరూపము'** కూడా। ఆ పరబ్రహ్మమే ఈ కనబడే సర్వముగా అనుభవమగుచున్నారు.

## ఇమా ఆపః – సర్వేషాం భూతానాం మధ్వాసామపాగ్ం।

ఇక్కడి జలము – సమస్త జీవుల కార్యభూత సారాంశము. సమస్త జీవులకు మధువు. (తేనె టీగ తేనె పోగుచేసుకొనునట్లు జీవులు కర్మలచే పెంపొందింపజేసుకొన్నట్టిది).

ఇక్కడి సమస్త జీవులలో – జలము యొక్క కార్యభూత సారాంశము.

జీవులు కారణమై ... జలము కార్యమగుచున్నది.
జలము కారణమై... జీవులు కార్యమగుచున్నారు.

జలములో ఒకానొక తేజోమయ అమృతమయ పురుషుడు **'జలస్వరూపాభిమాని'** (వరుణదేవుడు) అయి వెలుగొందుచున్నారు.

ఆయనయే ఈ దేహేంద్రియములన్నిటి యొక్క సముదాయకర్త అయి, **తేజోమయ అమృతమయ పురుషుడు**గా కూడా వెలుగొందు చున్నారు.

జలములోని (తేజోమయ – అమృతమయ) పురుషుడే జీవుల దేహేంద్రియములలో ఉన్నారు. జీవుల దేహ– ఇంద్రియములలోని పురుషుడే జలమునందు ఉన్నారు. ఆ ఏకైక రేతస్సు సంబంధితుడగు తేజో – అమృత పురుషుడే పరబ్రహ్మము అయి ఉన్నారు. ఆ పరబ్రహ్మమే ఈ సర్వము అయి ఉన్నది. **అయమ్ అధ్యాత్మగ్ం శారీరః తేజోమయో అమృతమయః పుతుషో – అయమేవ। సయో అయమ్ ఆత్మా। (4–5–1).** ద్రష్ట – దృశ్యముల ఉభయములోని ఏక పురుషుడే ఆత్మ! ఆత్మా ఇదగ్ం। ఈ సర్వము ఆత్మయే। **బ్రహ్మేదగ్ం సర్వమ్!** ఈ సర్వము పరమాత్మ స్వరూపమే। బ్రహ్మమే।

## అగ్ని – వాక్ స్వరూపము

**అయమ్ అగ్నిః సర్వేషాం భూతానాం మధ్వస్య। (4–5–2)।** అగ్ని – సర్వజీవుల దేహములలో మాధుర్యముగా ఉండి ఉన్నది.

**అగ్ని** → సమస్త జీవుల కార్యస్వరూపము.

అట్లాగే సమస్త జీవులు కూడా **'అగ్ని'** అను కారణము యొక్క → కార్య స్వరూపము. (తేనటీగ కారణము – తేనె కార్యము అయినట్లుగా) **"దేహ–ఇంద్రియముల సంఘాతకర్త అగు వాఙ్మయ తేజోపురుషుడు, అగ్ని యందున్న తేజోమయ పురుషుడు"** ఒక్కటే। వారిరువురు వేరువేరు కాదు. వారు పరస్పర కార్య–కారణ స్వరూపులు. ఉభయము బ్రహ్మానంద స్వరూపమే।

## వాయువు – ప్రాణ స్వరూపము (4–5–4) ।

**అయం వాయుః సర్వేషాం భూతానాం మధ్వస్య।** వాయువు – సర్వజీవుల దేహములలోని మాధుర్యము. సర్వజీవులు వాయువుయొక్క మాధుర్యము కూడా।

**వాయువు** → సమస్త జీవుల – కార్యస్వరూపము.

**సమస్త జీవులు** → వాయువు యొక్క కార్యస్వరూపము. పరస్పరము కార్యకారణ స్వరూపులే.

(కారణము = Doer Maker, కార్యము = The resultant making)

**"దేహ–ఇంద్రియ సంఘాతకర్త యందున్న "ప్రాణ" తేజోరూపుడు–వాయువునందున్న తేజోరూపుడు"** ఒక్క పురుషుడే (ఏకస్వరూపుడే)।

## ఆదిత్యుడు (సూర్యుడు) – 'చూపు' స్వరూపుడు

**(1) అయం ఆదిత్యః సర్వేషాం భూతానాం మధ్వస్య।** సూర్యుడు సర్వ దేహములలోని మాధుర్యము.

– సమస్త జీవుల కారణ స్వరూపము (Executant of their formations making) – **ఆదిత్యుడు. ఆదిత్యుడు కారణస్వరూపుడు** (Maker).

**(2) జీవులలోని చూపు → కార్యస్వరూపము.**

– ఆదిత్యుత్యుని కారణ స్వరూపము సర్వజీవులు. **(1) సర్వజీవులలోని నేత్ర సంబంధితుడగు చూపు రూప తేజోపురుషరూపుడు,** (2) **ఆదిత్యునిలోని తేజో పురుషుడు** – ఈ ఇద్దరిలోని అమృతరూపుడు ఒక్కడే। **ఆయనయే ఆత్మ! ఆత్మపురుషుడు।**

## దిక్ పురుషుడు – వినికిడి స్వరూపము

**ఇమా దిశః సర్వేషాం భూతానాం మధ్వః।** (4-5-6)। ఈ 10 దిక్కులు సమస్త జీవుల సారాంశము।

- పైన–క్రిందతో సహా ఈ దశ దిక్కులు సమస్త జీవుల కారణస్వరూపము
- సమస్త జీవులు దశదిక్కుల కారణస్వరూపము. ఉభయము పరస్పరము మాధుర్యముతో కూడిన కార్య–కారణరూపములు.
- **(1) "దిక్కులలోని తేజో రూప పురుషుడు, (2) 'చెవులలో వినికిడి' కర్తృత్వము వహిస్తున్న తేజోమయ– అమృతరూప పురుషుడు"** ఒక్కడే! **ఆయనయే – 'బ్రహ్మము'। ఆయనయే 'ఆత్మ'।**

## చంద్రుడు – మనోస్వరూపము

**అయం చంద్రః సర్వేషాం భూతానాం మధ్వస్య। (4-5-7)।** ఈ చంద్రుడు సర్వ భూతముల మనో సారాంశ విశేషము.

- ఈ చంద్రుడు సర్వభూతముల మధురమైన కార్యస్వరూపము.
- సమస్త భూతములు (జీవులు) → చంద్రుని యొక్క మధురమైన కార్యస్వరూపము.

ఈవిధంగా **చంద్రుడు, సమస్త జీవులు పరస్పరము మాధుర్యభావనతో కూడిన కార్యకారణ రూపములు.**

ఏ పురుషుడు చంద్రుని యందుండి భూమికి ఔషధులు – ఆహారము అందించుటకు, కారణమగుచున్నారో, ఏ పురుషుడు అధ్యాత్మ ధారణచే **'మనోరూపుడై'** జీవుల యందు తేజో–అమృతమయస్వరపుడై ప్రకాశించుచున్నాడో – **ఆ ఉభయులు ఏకపురుషుడగు ఆత్మయే! బ్రహ్మమే!**

## విద్యుత్ (తేజస్సు) – (మెరుపు) – చర్మములోని స్పర్శ స్వరూపము।

**ఇయం విద్యుత్ సర్వేషాం భూతానాం మధ్వస్య। (4-5-8)।** విద్యుత్‌యే (వెలుగుయే) సర్వజీవులలోని సారాంశము.

- సమస్త జీవులు 'కారణము' అయితే → తేజస్సు (మెరుపు) కార్యము.
- తేజస్సు కారణము అగుచుండగా → సమస్త జీవులు కార్యము అగుచున్నారు.

**విద్యుత్తులోని తేజో–అమృతమయ పురుషుడు, దేహములలోని "చర్మమును ఆశ్రయించి ఉండే 'స్పర్శానుభవ' సంబంధ" తేజో అమృతమయ పురుషుడు** ఒక్కరే। **ఆయనే బ్రహ్మము।**

## మేఘగర్జనా తేజో పురుషుడు - దేహేంద్రియ సంఘాతకర్త యగు శబ్ద రూప తేజోపురుషుడు

**అయగ్ం స్తనయిత్నుః సర్వేషాం భూతానాం మధ్వః (4-5-9)।**

'మేఘ గర్జనలోని పురుషకారము' అను కార్యనకు ఈ జీవులు కారణము.

'సర్వజీవులు' అను కార్యమునకు మేఘగర్జనములోని (మెఱుపురూపమగు) తేజోతత్త్వము కారణము అయి ఉన్నది కూడా!

→ 'మేఘగర్జన' యందలి తేజో - అమృత రూప పురుషుడు,

→ దేహ - ఇంద్రియ సంఘాతములో 'శబ్ద' రూప పురుషుడు,-

**... ఈ ఇరువురు ఒకే ఆత్మ యొక్క రెండు క్రియావిశేషములు.**

## విశ్వ - ఆకాశ తేజోపురుషుడు - హృదయాకాశ పురుషుడు

ఆకాశమే సర్వజీవుల మధు స్వరూపము. సర్వజీవులు ఆకాశము యొక్క మధుర స్వరూపులే! **విశ్వాకాశ తేజో అమృత అభిమాన పురుషుడే హృదయంలోని హృదయాకాశ తేజో అభిమాన పురుషుడు కూడా! ఆత్మయే ఉభయ స్వరూపమై ఉన్నది.**

## విశ్వధర్మము - దేహములోని ఇంద్రియ మనో బుద్ధి ధర్మములు

**విశ్వాంతర్గతమైన ధర్మము - కారణముగా అగుచుండగా, - అద్దాని కార్యము సర్వజీవులు.**

సర్వజీవులు కారణమైతే వారి కార్యము → విశ్వాంతర్గతమైన ధర్మము (Functional Feature).

[ **ధర్మము** = దేహధర్మము = జనన - బాల్య - యావన - వార్ధక్య - వినాశనములు.

**ఇంద్రియ ధర్మములు** → చూపు - వినికిడి - ఆఘ్రాణము - స్పర్శ - రుచి - నడక - ధారణన... విసర్జన మొదలైన ఆయా వేరువేరై ఇంద్రియముల క్రియా విశేషములు.

మనో ధర్మము → ఆలోచన

బుద్ధి ధర్మము → నిర్ణము చేయటం

చిత్త ధర్మము → ఇష్ట-అయిష్టములు

అహంకార ధర్మము → జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో వేరువేరు రూపాలు కలిగి ఉండటము]

**"భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములందు వాటివాటి ధర్మములు తన దేహముగా భాసించు (పాంచభౌతిక ధర్మముల) అభిమాన పురుషుడు, దేహములో ఇంద్రియ ధర్మమును తన ప్రదర్శనముగా భాసించు ఇంద్రియ ధర్మాభిమాన పురుషుడు** - ఈ ఇరువురు ఒకే ఆత్మ యొక్క రెండు స్వరూపములు - (ఒకే లోహము యొక్క రెండు బొమ్మల వలె). (ఒకే నాణెము యొక్క రెండు వైపుల వలె).

## సత్యము - సర్వభూతములు

సర్వజీవులు కారణమైతే.. 'సత్యము' అనునదే కార్యము.

సత్యము కారణమైతే.. సర్వభూతములు కార్యము.

(1) సత్యములోని తేజోమయ - అమృతపురుషుడు - (యమ్ సత్)।

(2) జీవులలోని, దేహ-ఇంద్రియ సంఘాతములో కనిపించు - అధ్యాత్మ (Micro level) తేజోమయ (సత్) అమృత పురుషుడు - ఈ రెండు పురుషకారములూ ఒకే ఆత్మ స్వరూపములు. **అదియే అఖండ - అద్వితీయ బ్రహ్మము। అదియే పరమాత్మ।**

| **(బుద్ధ్యభిమాన)** |
|---|
| **విశ్వభిమాన పురుషుడు. మానవులలోని దేహేంద్రియ సంఘాతములోని మానవ సంబంధిత అభిమాన పురుషుడు.** |

ఈ మానుష (బుద్ధి) అభిమాన పురుషుడు కార్యమైతే సమస్త భూతముల సారము కారణము.

సమస్త భూతములలోని బుద్ధి పురుష కారము కార్యమైతే – జగత్తులోని బుద్ధి కారణము.

**(1) "సృష్టిలోని బుద్ధ్యాత్మాభిమాన తేజో – అమృతరూప పురుషుడు, (2) సర్వే దేహేంద్రియ సంఘాతములో కనిపించే బుద్ధి తేజో అమృత రూప పురుషుడు"** ఒక్కటే। **అఖండాత్మ స్వయం– సంప్రదర్శన స్వరూపులే।**

## జగత్తులోని విజ్ఞానాత్మాభిమాని – దేహములలోని విజ్ఞానాత్మాభిమాని

సృష్టిలోని విజ్ఞానాత్మభిమాన పురుషుడు (వ్యష్టి విజ్ఞానము) కార్యమైతే – సకల భూతములలోని విజ్ఞానాత్మ (సమష్టి విజ్ఞానము) కారణము.

(విజ్ఞానాత్మాభిమాన) సకల భూతముల విజ్ఞానాత్మభిమాని – కార్యమైతే, సకల దేహములలోని విజ్ఞానాత్మ – కారణము.

**(1) "సృష్టిలోని విజ్ఞానాత్మాభిమాని (2) దేహములలోని విజ్ఞానాత్మాభిమాని"** ఒక్కటే! **ఆత్మ యొక్క రెండు విధములైన విన్యాసములే! ఆ ఉభయములోని ఏకస్వరూపులే పరమాత్మ। బ్రహ్మము। పరబ్రహ్మము।**

ఈ విధంగా...ఓ మైత్రేయా!

- **సమష్టిలో "పృథ్వీ" అభిమానియే** – ఆధ్యాత్మమగు దేహములోని పృథ్వీ తత్త్వాభిమానిగా ఉన్నారు.
- **ఈ సమస్తములోని "జల" రసాభిమాన అమృత పురుషుడే** – దేహములోని జలాభిమాన రేతస్సు రూప అభిమాని!
- **బ్రహ్మాండములోని "వాక్" అభిమాన అగ్నిరూప అమృతపురుషుడే** – అధ్యాత్మమగు దేహములో వాక్ స్వరూపమై ఉన్నారు.
- **దృశ్యములో నిండియున్న "ప్రాణశక్తి" పురుషుడే** – దేహములలో ప్రాణ స్వరూపాభిమాని కూడా।
- **సృష్టిలోని "తేజోమయ ఆదిత్యపురుషుడే"** – ఆధ్యాత్మమగు దేహములలో 'చూపు' అనే తేజోరూపుడై వెలుగొందుచున్నాడు.
- **సృష్టిలోని "దిక్" అభిమానియే** – అధ్యాత్మమగు దేహములో వినికిడి రూపమై ప్రవర్తిస్తున్నారు.
- **జగత్తులోని చంద్రరూప అభిమాన పురుషుడే** – ఆధ్యాత్మమగు దేహములలో మనోరూప (ఆలోచనా రూప) పురుషుడై సంప్రదర్శితుడగుచున్నాడు.
- **జగత్తులోని విద్యుత్‌రూప అమృత – తేజో పురుషుడే** → దేహములో చర్మ సంబంధ – స్పర్శరూప అమృత పురుషుడై ప్రకాశిస్తున్నారు.
- **జగత్తులోని స్నయత్నుడే (మేఘగర్జన పురుషాభిమానియే)** → దేహేంద్రియ సంఘాతమునందు శబ్దస్వరూప పురుషుడు.
- **విశ్వములోని ఆకాశరూప తేజో అమృత పురుషుడే** – దేహములో హృదయాకాశ పురుషుడై ప్రకాశమానుడగుచున్నాడు.
- **జగత్ దృశ్యములోని వస్తు ధర్మాభిమాన తేజో అమృత పురుషుడే** – దేహములోని సర్వ ఇంద్రియముల, రక్తమాంసాది వస్తు ధర్మముల **అమృత తేజో అభిమాన పురుషుడు.**
- **విశ్వములోని "సత్యము" యొక్క అభిమానము పురుషుడే** – దేహములోని **సత్యాభిమాన అమృత తేజోపురుషుడు.**

  [సత్యమ్ = యమ్‌సత్ (ఉనికి. అనుభవము)]

ఈవిధంగా విశ్వములోని తోజోమయ – అమృత అభిమాన పురుషుడే దేహములోని తేజోమయ– అభిమాన పురుషుడు కూడా। ఆ పురుషుడే – **అయమాత్మా అమృత మిదమ్।**

**బ్రహ్మైవ ఇదగ్ం సర్వమ్!**

*ఇదంతా కూడా,*

– ద్రష్ట – దర్శన – దృశ్యములతో సహా..,
– భూత– వర్తమాన – భవిష్యత్‌లో ఉన్నదంతా కూడా..,

– అనుభజ్ఞుడు.. అనుభవము.. అనుభూతమగునది.. అంతా కూడా.

– సర్వదా **"బ్రహ్మమే"।**

**బ్రహ్మము కానిదంటూ ఏదీ లేదు। బ్రహ్మము ఏదీగా అవటమూ లేదు।**

# దధ్యనమహర్షి – అశ్వినీ సంవాదము
# మధు బ్రహ్మవిద్య

ఒకానొకప్పుడు దేవతల భిషజులు (వైద్య గురువులు) అగు అశ్వనీదేవతలు ఇరువురు **"మనము ఇప్పుడు వేదాంత శాస్త్రములోని ఒకానొక 'మహత్తర' సార విషయమగు 'మధుతత్త్వ విద్య'ను శ్రవణం చేయుటకై ఆత్మతత్త్వజ్ఞుడగు సద్గురు వరేణ్యుని ఆశ్రయించెదముగాక!"...** అని నిర్ణయించుకున్నారు. అట్టి 'మధుబ్రాహ్మణ విద్య' యందు లోకప్రసిద్ధుడగు దధ్యనమహర్షిని సమీపించారు. ప్రణామములు సమర్పించారు. తమ యొక్క అభిలాషయగు **'మధు' అను ఆత్మవిద్య**ను బోధించుటకై ఈ విధముగా అభ్యర్ధన చేయసాగారు!

❖❖❖

**అశ్వనీ దేవతలు :** గురువర్యా! అథర్వణ మహర్షి కుమారా! బ్రహ్మతత్త్వజ్ఞులుగా లోకప్రసిద్ధులగు దధ్యన మహర్షీ! మీరు ఆత్మ జ్ఞాన విశేషమగు 'మధువిద్య'ను ఎరిగిన మహనీయులుగా ఋషిలోకములోను, దేవలోకములోను శ్లాఘించబడుచూ ఉన్నారు. అట్టి మహనీయులగు మీ పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పిస్తూ, ఆధ్యాత్మ విద్యలలో మహత్తరమని చెప్పబడే **'మధువిద్య'**ను బోధించమని వేడుకొనుచున్నాము.

**దధ్యనమహర్షి :** జీవులకు – దేవతలకు శారీరక, మానసిక రుగ్మతలను తొలగించి ఆరోగ్యము ప్రసాదిస్తూ ఉన్నట్టి లోక కల్యాణమూర్తులగు ఓ అశ్వనీ దేవతలారా! సుస్వాగతం! మీరాకచే మేము, మా ఆశ్రమవాసులు చాలా సంతోషము పొందుచున్నాము. ఒకానొక సందర్భములో ఇంద్ర భగవానుడు నాకు బోధించిన **'మధువిద్య'**ను విశదీకరించి మీకు చెప్పటము నాకు సంతోషము. అయితే నేను గురు నియమబద్ధుడను. గురు ఆజ్ఞను మీరలేము కదా!

**అశ్వనీదేవతలు :** హే భగవాన్! మహర్షీ! తమ గురువు యొక్క నియమము – నిష్ఠ ఏమిటో సెలవు ఇవ్వండి. మేము తప్పక పాటిస్తాము.

**దధ్యనమహర్షి :** మీ యొక్క లాభము కొరకై **'దంసము'** అను పేరు గల సింహము వంటి ఆత్మ విద్యను (లేక) వేదాంతర్గతమగు **"మధు బ్రాహ్మణము"**ను బోధించటానికి అత్యంత ఉత్సాహముతో నేను సిద్ధుడనై ఉన్నాను. కానీ, అస్మత్ గురువరేణ్యులగు ఇంద్ర భగవానుడు నా అభ్యర్ధనపై ఈ విద్యను నాకు బోధించేముందు ఈ విధంగా పలికి ఉన్నారు.

> *"ఓయీ! దధ్యన్! నేను బోధిస్తున్న ఈ మధువిద్యను లేక 'దంసము'ను నీవు ఎవ్వరికైనా బోధించటం జరిగిందా, అప్పుడు నేను నా వజ్రాయుధముతో నీకంఠమును ఖండిస్తాను. అందుకు అంగీకరామేనా?"*

నేను అందుకుగాను అస్మత్ గురువర్యులగు ఇంద్ర దేవునికి నా హృదయపూర్వకమైన అంగీకారము తెలిపాను. ఇప్పుడేమో అర్హులగు శిష్యుల రూపమున మీరు నన్ను సమీపిస్తున్నారు. మునులమగు మేము **"అర్హులగు శిష్యులు ఆశ్రయించినప్పుడు మేము ఎరిగియున్న అధ్యాత్మశాస్త్ర రూప ఉత్తమ విశేషములను తప్పక చెప్పాలి"** – అను నియమము కలిగి ఉంటాము.

ఇప్పుడేమి చేయాలి?

– చెప్పి ఆ తర్వాత ఇంద్రుని ఆహ్వానించి ఈ శిరస్సు సమర్పించాలా?

– చెప్పకుండా మహర్షులచే నియమించబడిన స్వధర్మమును అతిక్రమించాలా?

ఇటువంటి చిక్కులోపడి కించిత్ ఏం చేయాలో మీమాసంగా యోచిస్తున్నాను.

**అశ్వనీ దేవతలు :** అట్లాగా గురుదేవా! ఆథర్వణా! దధ్యన మహర్షీ! మీకు ఆ మీమాంస అక్కర్లేదు. మీరు గురు ఆజ్ఞను శిరసా వహించటము – ఋషిధర్మమైనట్టి సత్యమగు "(ఆత్మ) → మధుబ్రాహ్మణ → విద్యాతత్త్వబోధ"ను నిర్వర్తించటము, – ఈ రెండింటినీ కూడా సిద్ధింపజేయగల ఉభయ తారకమైన ఒక ఉపాయము ఉన్నది. చెప్పమంటారా స్వామీ!

**దధ్యనమహర్షి :** ఉభయము సిద్ధింపజేయు ఉపాయమా? ఏమిటది?

**అశ్వనీదేవతలు :** మహాత్మా! వినండి. మొట్టమొదట మీ శిరస్సును ఖండించి మాకు తెలియున్న ఒక రహస్య ప్రదేశములో దాచి ఉంచుతాము. ఒక గుఱ్ఱము యొక్క శిరస్సు తీసుకొచ్చి మీ ఖండించబడిన స్థానములో అమర్చుతాము. మీరు అట్టి అశ్వ శిరస్సుతో మాకు **'మధువిద్య'** లేక **'మధు బ్రాహ్మణము'**ను బోధించండి. అటు తరువాత మీరు మీ సద్గురువరేణ్యులగు ఇంద్ర భగవానుని ఆహ్వానించి ఆ గుఱ్ఱపు శిరస్సును సమర్పించి వేయండి! మరుక్షణమే మేము మీ ఈ సహజ శిరస్సు తీసుకొచ్చి అమర్చగలము. తమ ఆజ్ఞ అయితే అతీరుగా చేద్దామా, మహాత్మా?

**దధ్యచమహర్షి :** బాగు బాగు! అట్లాగే చేద్దాము.

ఈ విధంగా ప్రతిజ్ఞ చేసి ఆ అశ్వనీ దేవతలు దధ్యనమహర్షి యొక్క శిరస్సును ఖండించి, రహస్య ప్రదేశములో దాచి ఉంచి, అశ్వశిరస్సు (గుర్రపు తల)ను అమర్చారు. అప్పుడు దధ్యనమహర్షి ఈ **'మధు బ్రాహ్మణము'ను** అశ్వనీదేవతలకు బోధించటము జరిగింది.

❖

- పరమాత్మయొక్క స్వకీయకల్పనగా 'జీవాత్మ' అనే అనుభవి బయల్వెడలుచున్నాడు. కనుక "జీవాత్మ" అనబడేది 'కేవలాత్మ' యొక్క ఒకానొక **'మధురమైన భావన'.**
- తేనెటీగ తేనెను అనేక పుష్పముల నుండి తేనెను తెచ్చి తేనె పట్టు నందు దాచి ఉంచుకొను రీతిగా చూడటము– వినటము – అఘ్రానించటము – స్పర్శ – రసము – మనస్సు – బుద్ధి – జీవాత్మ మొదలై విశేషములకు సంబంధించి మధువును తెచ్చి 'చిత్తము' అనే తేనెతుట్టలో దాచుకొని ఉండటము జరుగుతోంది.
- వినుచున్నవాడే.. వినబడే విషయాలన్నీగాను,
- చూచుచున్నవాడే.. చూచుచున్నవన్నీగాను,
- స్పర్శించువాడే.. స్పర్శానుభవ విషయములుగాను,
- ఆఘాణించువాడే.. ఆఘ్రాణ విశేషములుగాను,
- మనస్సు తనదైనవాడే.. ఆలోచించబడే విశేషాలుగాను,
- ఇష్టము తనదైన వాడే.. ఇష్టమైన వస్తువుల రూపంగాను..,

మొదలైనవన్నీగా మాధుర్య ప్రదర్శనంగా అగుచూ, అవన్నీ తనకు వేరైనవిగా మాయచే దర్శించటము, ఆస్వాదించటము జరుగుతోంది.

- ఆత్మయే ద్రష్ట–దర్శన – దృశ్యరూపములను కల్పించుకొనుచు ఆస్వాదించుచున్నది.

(దృష్టాంతానికి – స్వప్నము తన దైనవాడే స్వప్నములోని స్వప్నాంతర్గత ద్రష్టగాను, స్వప్న దృశ్యముగాను అయి, స్వప్నమును ఆస్వాదిస్తూ ఉన్నాడు. స్వప్నదృశ్యముగా నాగురించి నేను అనుకోవటమే – స్వప్నానుభవము. ఈ జాగ్రత్ వ్యవహారము కూడా అట్టిదే.)

-----

**యాజ్ఞవల్క్యుడు :** ఓ మైత్రేయీ! ఇటువంటి వివరణలతో కూడిన **"మధువిద్యా బ్రాహ్మణము"**ను రసాత్మకంగాను, సారవిశేష పూర్వకంగాను దధ్యన్ మహర్షి బోధించసాగారు. ఆత్మభగవానుని **'మధుబ్రాహ్మణవిద్య'**గా దర్శించు విశేషాలను మంత్ర – మంత్రార్థపూర్వకంగా ప్రవచనము చేస్తూ దేవతావైద్యులగు అశ్వనీదేవతలకు వివరించసాగారు. 'నేను' అను అర్థము యొక్క మాధుర్యముతో కూడిన పరమార్థమును సుస్పష్టపరచసాగారు.





పరమాత్మ తన వినోదము కొరకు తనను తానే రెండు పాదములు కలవానినిగా దర్శిస్తూ ఉంటున్నారు. వారే **(1) "నేనే పరమాత్మను! (2) నేనే జీవాత్మను కూడా!"** అను రెండు స్వరూపములు.

పరమాత్మ యొక్క కల్పన నుండి, పరమాత్మయే '4' పాదములు గల జీవులుగా కూడా బయల్వెడలుచున్నారు.

*(1) నేను పరమాత్మను।* *(2) నేను జీవాత్మను।*

*(3) నేను దేహము కలవాడను।* *(4) నేను దృశ్యము కూడా కలవాడను।*

ఆ ఈశ్వరుడే లింగ శరీరధారుడుగా – (సూక్ష్మశరీరి గాను, స్థూల శరీరధారుడుగాను) వెలుగొందుచున్నారు.

"స్వకీయమధురాస్వాదన" అనతగు – తన కల్పనయందు "మానవులు – పశువులు – పక్షులు".. మొదలైన అసంఖ్యాక దేహములన్నీ కల్పించుకొని వాటియందు ప్రాణరూపముగాను, మనోరూపముగాను ప్రవేశించి, స్వకీయమగు ఈ జగత్ దృశ్య కల్పనను ఆస్వాదిస్తున్నారు.

ఈ విధంగా పరమాత్మ 'పుర' లేక 'పురి' అని పిలువబడుదేహములందు పురుషకారముతో ప్రవర్తించుచూ, **"పురుషుడు"**–అని పిలువబడు చున్నారు. అఖండుడై ఉండియే అనేక దేహములందు దేహిగా ప్రకాశించుచున్నారు. కలలోలాగా సర్వము తానే అయి కూడా, దృశ్యములోని ఒక్కొక్క శరీరములో వేరువేరుగా కనిపించే ప్రాణ – మనో–చిత్త–అహంకార రూపుడై అణువణువు నిండి ఉన్నారు. ఈశ్వర స్వరూపులై (అంతటా విస్తరించి ఉన్నవారై) ప్రతి జీవుని యొక్క బాహ్య – అభ్యంతరములందు తానే ప్రదర్శనుడగుచున్నారు.



ఆ విధంగా దేహ–దృశ్యములలో శబ్ద – స్పర్శ–రూప–రస –గంధ శక్తులతో, అసంఖ్యాత అనుభవములతో, దృశ్య విషయ కల్పనలతో అంతటా ఈశ్వరుడుగా విస్తరించి ఉంటూనే అనేక విషయ–సందర్భ–సంగతి – సంబంధ– అనుబంధ – బాంధవ్య – భావాభవములతో ఒకవైపు కప్పబడుతూ ఉంటోంది. అయితే కూడా,

**– స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురుషయోనై న ఏన కించ నానావృతమ్। న ఏనేన కించనా సంవృతమ్। (4–5–18)**

పరబ్రహ్మ స్వరూపమగు 'ఆత్మ'.. దేనిచేతనో కప్పి ఉంచబడటమూ లేదు. కప్పి ఉంచబడకపోవటమూ ఉండదు.

అన్నీ తానే అయి, ఆత్మ ఏదీ కాకయే ఉన్నది.

బంగారపు ఉంగరమునకు→

– 'ఉంగరము' అయి ఉన్నదీ లేదు। 'ఉంగరము' అనేది బంగారమును కప్పి ఉండటము లేదు।

– ఉంగరముగా అయినది బంగారము కాకపోనూ లేదు।

బాహ్య – అభ్యంతర స్వరూపమంతా ఆత్మయే అయి ఉండి కూడా...,

ఆత్మకు బాహ్యము లేదు! అంతరమూ లేదు.

ఆత్మకానిదేదీ బాహ్యము గానూ లేదు.

అభ్యంతరముగానూ లేదు. దృశ్యముగా కనిపించేదంతా, ద్రష్టతో సహా– **'ఆత్మయే'** కాని క్షణమే లేదు.

**ఈ బాహ్య–అభ్యంతరములలో దేహ–ఇంద్రియ–మనో–బుద్ధి–చిత్త – అహంకార రూపములలో ఉన్నదంతా అఖండమగు ఆత్మయే।**

– ఆత్మ యొక్క ఈశ్వరత్వముచే నిండి ఉండనట్టిది ఎక్కడా ఏ లోకములోనూ అణువంత కూడా లేదు.

ఆత్మకు వేరుగా అయినదేదీ లేదు. వేరుగా కనిపిస్తూ ఉన్నదంతా – ఆత్మగా అవనిది కూడా ఏదీ లేదు. అందుచేతనే..,

***పరమాత్మ ఎల్లప్పుడు పరిపూర్ణుడు. సదాశివ స్వరూపుడు।***

పరిపూర్ణుడగు పరమాత్మకు వేరుగా 'దధ్యన్ మహర్షి' అనబడేదే, (మీచే 'గురువర్యా' అనబడుచూ) నేనూ లేను. శిష్యులగు దేవతా వైద్యులు – అశ్వనీ దేవతలగు మీరు వేరుగా లేరు.

పరమాత్మకు వేరుగా 'నీవు' గాని 'నేను'గాని ఉండి ఉంటే.. అప్పుడు పరమాత్మ పరిపూర్ణుడెట్లా అవుతాడు?

ఈ విధంగా..,

ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, మనో–బుద్ధి– చిత్త – అహంకారాలు, వాటివాటి విషయాలు, జీవాత్మలు, అఖండాత్మ.. **ఇవన్నీ కూడా బ్రహ్మము యొక్క మధుర విశేషాలే!** ఆయా విశేషాలన్నిటికీ కూడా మధురమైనది బ్రహ్మమే! ఇదియే మనము చెప్పుకుంటున్న 'మధుబ్రాహ్మణ' విద్యాసారము!

✠ ✠ ✠

ఆ పరమేశ్వరుడు అన్ని రూపములు తానే అయి ఉన్నారు. గురువుగా ఆత్మతత్త్వ మాధుర్యమును ప్రవచిస్తూ, శిష్యుడుగా ఆస్వాదిస్తూ పరమానందము పొందుచున్నదీ ఆయనే! ఇంద్రుడై ఇంద్రియములన్నీ ఆక్రమించి ఉంటున్నది ఆయనయే।

ఒకడు కలకంటూ కలలో అనేక రూపాలుగా తానే అయి, కానీ అవన్నీ తనకు వేరైనట్లు అనుభూతి– అనుభవము పొందుచున్నాడు చూచారా! అట్లాగే, పరమాత్మ కూడా తనకు అభిన్నమగు 'సృష్టి' అనే స్వీయకల్పనా దృష్టి'లో తదితర జీవులు, స్వభావములు, దృశ్యములు, – లోకములు .. మొదలైనవన్నీ మాధుర్యపూర్వకంగా కల్పించుకొని, అవన్నీ తనకు భిన్నమైనట్లుగా భావించి, తనయొక్క మధురభావనతో ఆస్వాదిస్తున్నారు. బంధములను కల్పించుకొని, కొనసాగించి, మరింకెప్పుడో అన్నీ తనయందు 'లయము' చేసి వేసుకొనుచున్నారు. ఆయన తన ప్రజ్ఞ+మాయల సమన్వయముచే అనేక రూపములు తానై రూపుదిద్దుకొన్నవారుగా అగుచున్నారు.

మనకు స్వానుభవమగుచున్న ఈ దృశ్యమంతా కూడా మనయొక్క మాధుర్య విస్తారమే। 'పురు – పురము – పురుషుడు'గా అనేక రూపములుగా అవటమంతా **క్రీడా వినోదమే! స్వకీయ ఆత్మానంద లీలావినోదమే।**

**అందుచేతనే "ఈ జీవుడు తాను దర్శించు దృశ్య వ్యవహారమంతా మధురమగు స్వకీయ లీలా – క్రీడా వినోదముగా చూచునుగాక!"..** అనునదే మనం చెప్పుకొనుచున్న **'మధు విద్యాబ్రాహ్మము'** (లేక) **'ధంసము'** అనబడే **ఆత్మవిద్యాప్రబోధము.**

పరమేశ్వరుడే సర్వ ఇంద్రియముల రూపము. ఇంద్రియములతో ఆయన పదిగాను, పదివేలుగాను,, అనేకములుగాను, అనంతములుగాను, అసంఖ్యాక రూపములుగాను అగుచున్నారు. ఒకడు కనే స్వప్నములకు, ఆ స్వప్నములో చూడగలుగు జీవుల సంఖ్యా తతంగములకు నియమమేమున్నది? అంతేమున్నది?

**ఈ జాగ్రత్‌లో కనిపించే 'తదితరము' అంతా కూడా – స్వప్నములోని స్వప్నద్రష్టయొక్క స్వయంకల్పిత తదితరము వంటిదే.**

అట్టి మీ యొక్క – నాయొక్క సహజ రూపమగు బ్రహ్మమునకు పూర్వమేమున్నది? పరమేమున్నది? పూర్వాపరాలు లేవు!

**అందుకే 'ఆత్మ అపూర్వము' అని చెప్పబడుతోంది.**

- ఆత్మకు అంతరము (Inner side) లేదు! బాహ్యము (External side) లేదు!
- 'అనంతరము' (Afterwards) అనునదీ లేదు.
- సర్వస్వరూపమై సర్వము ఆత్మయే అనుభవించుచున్నది। సంభావించుచున్నది। మధురముగా కల్పించుకొని వినోదిస్తూ ఉన్నది.

**ఆత్మయే బ్రహ్మము। ఇతి అనుశాసనమ్। ఆత్మయే మధురాతి మధురమ్। ఇతి సత్యమ్।**

**ఇతి బృహదారణ్యక ఉపనిషత్**
**చతుర్థ అధ్యాయము – పంచమ బ్రాహ్మణము**
**మధుబ్రాహ్మణము – సమాప్తః**

# చతుర్థాధ్యాయము - షష్టమ బ్రాహ్మణము

## వంశబ్రాహ్మణము

అట్టి పరబ్రహ్మము గురుశిష్య పరంపరగాను, వంశ పారంపర్యముగాను ఆత్మతత్త్వ వాఙ్మయంగా భాషించబడుచు, సంబోధించబడుచూ వస్తోంది. బ్రహ్మజ్ఞాన సమాచారము దేదీప్యమానమై పరంపరగా ప్రపంచములో ప్రకాశమానమగుచున్నది.

అట్టి ఆచార్యవర్యులను, ఆచార్య పరంపరలను కృతజ్ఞతగా స్మరిస్తూ నమస్కరించుచున్నాము.

**ఓం నమో శ్రీ గురుభ్యోంన్నమః।**

| | | |
|---|---|---|
| **శ్రీ గౌతిమాష్యుడు** | → | గౌపవనునకు, |
| **శ్రీ గౌపవనుడు** | → | శ్రీ పౌతమాష్యునికి |
| **శ్రీ పౌతమాష్యుడు** | → | శ్రీ కౌశికునికి |
| **శ్రీ కౌశికుడు** | → | శ్రీ కౌణ్డిన్యునికి |
| **శ్రీ కౌణ్డిన్యుడు** | → | శ్రీ శాండిల్యునికి |
| **శ్రీ శాండిల్యుడు** | → | శ్రీ కౌశికాచ్చ గౌతమునికి, |
| **శ్రీ గౌతముడు** | → | శ్రీ అగ్నివేశ్యునికి, అగ్నివేశ్యునికి, శిష్యపరంపరగా - ఆత్మ విద్యయగు మధుబ్రాహ్మమును బోధించటము, గ్రహించటము జరుగసాగింది. |

*అట్టి గురువరేణ్యులకు **గురు నమస్కారములు.***

| | |
|---|---|
| శ్రీ అగ్నివేశ్యగురవే నమః । | శ్రీ శాండిల్య గురవే నమః। |
| శ్రీ అనభిమ్లాతాయ నమః। | శ్రీ శేతావాయు నమః। |
| శ్రీ పారాశర్యాయ నమః। | శ్రీ భారద్వాజాయ నమః। |
| శ్రీ బైజవాపాయాయ నమః। | శ్రీ కౌశికాయని నమః। |
| శ్రీ ఘృత కౌశికాయ నమః। | శ్రీ జాతూ కర్ణ్యాయ నమః। శ్రీ ఆసురాయ నమః। |
| శ్రీ యాస్కారాయ నమః। | శ్రీ త్రైవణి నమః। |
| శ్రీ రౌపజంధనాయ నమః। | శ్రీ ఆసురినే నమః। |
| శ్రీ ఆత్రేయాయా నమః। | శ్రీ మాణ్డినే నమః। |
| శ్రీ వాత్సునినే నమః। | శ్రీ కైశోర్య కాప్య నమః। |
| శ్రీ కుమార హరితాయ నమః। | శ్రీ గాలవాయ నమః। |
| శ్రీ విదర్భీ కౌండిన్యే నమః। | శ్రీ వత్సనపాత్ బాభ్రవే నమః। |

శ్రీ పంథా సౌభారునే నమః।  శ్రీ ఆయాస్య అంగిరసాయ నమః।

శ్రీ అభూతి తాష్టన్యాయ నమః।  శ్రీ విశ్వరూపతాష్టనివే నమః।

శ్రీ అశ్వినీ దేవతాయ నమః।  శ్రీ అధర్వణాయ నమః।

శ్రీ మృత్యు ప్రాధ్వసనే నమః।

శ్రీ ఏక ఋషిభ్యోం నమః।  శ్రీ విప్రచిత్తే నమః।

శ్రీ వృష్టినే నమః।  సనారువే నమః।

శ్రీ సనాతనాయ నమః।

**ఇత్యాది గురుంపరాయాయై - నమో నమో నమో నమః।**

**శ్రీ సనకాయ నమః।**

**శ్రీ సనందనాయ నమః।**

**శ్రీ బ్రహ్మ దేవ పరమేష్టినే నమః।**

**స్వయంభువు పితామహ బ్రహ్మదేవాయ నమః।**

**(ఓం నమో బ్రహ్మాదిభ్యో, బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో, వంశ ఋషిభ్యో, మహద్భ్యో గురుభ్యో నమః)**

**ఇతి**

**బృహదారణ్య కోపనిషత్ - చతుర్థ అధ్యాయః।**
**"వంశ బ్రాహ్మణమ్" నామ షష్టమ బ్రాహ్మణమ్ సమాప్తః॥**

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## పంచమ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ న అన్యో, అతో అస్తి ద్రష్టా। న అన్యో అతో అస్తి శ్రోతా।
న అన్యో అతో అస్తి మన్తా। న అన్యో అతో అస్తి విజ్ఞాతా॥
ఏష ఆత్మా। అన్తర్యామి। అమృతో। అతో అన్యత్ ఆర్తం।

అట్టి అంతర్యామియగు ఆత్మకు వేరుగా ద్రష్ట లేడు. అద్దానిక వేరుగా శ్రోతయూలేడు. ఆలోచించు వాడు లేడు. విచారణ చేయువాడూ లేడు (విజ్ఞాత లేడు)! అవన్నీ ఎవ్వరై ఉన్నారో...ఆతడే ఆత్మ। అమృత స్వరూపుడు। అట్టి అంతర్యామికి వేరుగా - చూచువాడు లేడు; వినువాడు లేడు; సంకల్పించువాడు లేడు; విచక్షించువాడు లేడు.

## పఞ్చమాధ్యాయః - ప్రథమం బ్రాహ్మణము

### యాజ్ఞవల్కీయ కాండము - అశ్వల బ్రాహ్మణము

| | | |
|---|---|---|
| 1 | జనకో హ వైదేహో।<br>బహుదక్షిణేన యజ్ఞేన ఏజే।<br>తత్ర హ కురు, పాంచాలానాం<br>బ్రాహ్మణా అభి సమేతా బభూవుః।<br>తస్య హ జనకస్య వైదేహస్య<br>విజిజ్ఞాసా, బభూవ కస్స్విత్ (ఇతి)।<br>ఏషాం బ్రాహ్మణా నామ (అ)నూచానతమ? ఇతి।<br>స హ గవాగ్ం సహస్రం అవరు రోధ।<br>దశ దశ పాదా ఏకైకస్యాః<br>శృఙ్గయోః ఆబద్ధా బభూవుః। | విదేహ దేశరాజు జనకుడు. ఆయన కర్మయోగి. తత్త్వమును విద్యార్థిగా ఉపాసిస్తూ, తత్త్వ శాస్త్ర అధ్యయనముయొక్క ప్రచారమును నిర్వర్తిస్తూ **మానవాళికి మహత్తరమగు శ్రేయమును కలుగజేయు మహనీయుడు.** ఆయన ఒక యాగము ప్రారంభించారు. కురు - పాంచాల ఇత్యాది అనేక దేశాల నుండి అనేకమంది బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణులు ఆ యజ్ఞమును సందర్శించటానికి విచ్చేశారు. వారికి దక్షిణలు సమర్పించారు. **"నేను ఆహ్వానించిన వారందరిలో బ్రహ్మజ్ఞులగు మహనీయులు ఎవ్వరో నిశ్చయించెదముగాక।"**.... అని ఆ జనకుడు భావించారు. వేయి గోవులను ఒక్కొక్క గోవుకు పది - పది బంగారు నాణములవంతున, ఒక్కొక్క గోవు వ్రేళ్ళకు బంగారు తొడుగులతోను, కొమ్ములను బంగారు శంఖాకారములతోను అలంకరింపజేయించి సిద్ధం చేశారు. |
| 2 | తాన్ హ ఉవాచ : (జనకౌవాచ)।<br>"బ్రాహ్మణా భగవన్తో!<br>యో వో బ్రహ్మిష్ఠః,<br>స ఏతా గా ఉదజతాం ఇతి। | **జనకమహారాజు (రాజ సభలో) :** ఓ బ్రాహ్మణోత్తములారా! భగవత్స్వరూపులారా! సుస్వాగతం!<br>మీ అందరిలోకెల్లా ఎవ్వరైతే మహత్తర బ్రహ్మనిష్ఠులో, వారు ఈ గోవులను తమ ఆశ్రమమునకు గొనిపోవచ్చును. |
| | తే హ బ్రాహ్మణా<br>న దధృషురథ హ। | అప్పుడు ఎవ్వరూ కూడా "నేను బ్రహ్మనిష్ఠుడను"....అని స్వకీయ నిర్ణయం చేసుకోవటానికి ముందుకు రాలేదు. వారికి ధైర్యము చాలలేదు. శక్తి లేకపోయింది. పైగా, బ్రహ్మనిష్ఠులు నిగర్వులై ఉంటారు కదా! **కొద్దిసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది.** |
| | యాజ్ఞవల్క్యః స్వమేవ<br>బ్రహ్మచారిణమ్ ఉవాచ, -<br>"ఏతాః సోమ్యా! ఉదజ సామశ్రవ!" ఇతి॥ | అప్పుడు యాజ్ఞవల్క్యుడు లేచినిలబడ్డారు. తన శిష్యుడగు ఒక బ్రహ్మచారిని పిలచి **"శిష్యా! సామశ్రవా! ఈ గోవులను మన ఆశ్రమమునకు తోలుకొని వెళ్ళుము"**....అని ఆజ్ఞాపించారు. |

**తా హ ఉదాచకార,**
**తే హ బ్రాహ్మణాశ్చు కృధుః ।**
**"కథం నో బ్రహ్మిష్ఠో బ్రవీతేతి?"**

ఆ యాజ్ఞవల్క్యశిష్యుడగు సామశ్రవుడు అట్లాగే గోవులను యాజ్ఞవల్క్య ఆశ్రమమునకు తోలుకు పోవటానికి సంసిద్ధుడైనాడు.

ఇదంతా చూస్తూ ఉన్న అక్కడి కొందరు బ్రాహ్మణులకు కొంచము కోపము వచ్చింది.

ఇదేమిటి? **"ఇందరిలో నేనే బ్రహ్మిష్ఠుడను"** - అని ఎట్లా ఈ యాజ్ఞవల్క్యుడు అనగలరు?" అని కోపం పొందసాగారు.

---

**అథ హ జనకస్య వైదేహస్య హోతా –**
**అశ్వలో బభూవ :**
**స హై ఏనం ప్రప్రచ్ఛ! త్వం ను ఖలు నో యాజ్ఞవల్క్య!**
**బ్రహ్మిష్ఠో అసీ 3 ఇతి?**

ఆ విదేహరాజగు జనకుని కొలువులో **అశ్వలుడు** అనే ఆస్థాన హోత (ఋత్విజుడు) ఉన్నారు.

**ఆ అశ్వలుడు ఇట్లా అడుగసాగారు :**

"అయ్యా! యాజ్ఞవల్క్యా! **మీరే ఈ సభలోనివారందరి కంటే గొప్ప బ్రహ్మిష్ఠుడనని, బ్రహ్మవేత్తని - అని ఎట్లా అనగలరు?"** - అని ప్రశ్నించారు।

---

**స హ (యాజ్ఞవల్క్యో) ఉవాచ:**
**నమో వయం బ్రహ్మిష్ఠాయ!**
**కుర్మో గో కామాఏవ వయగ్ం స్మ ఇతి,**
**తగ్ం హ తత**
**ఏవ ప్రష్టుం దధ్రే హోతా అశ్వలః॥**

యాజ్ఞవల్క్యుడు : ఓ అశ్వల ఋత్విజమహాశయా! మేము బ్రహ్మవేత్తలకు (బ్రహ్మిష్ఠులకు) **నమస్కరించువారము మాత్రమే** అయి ఉన్నాము. మాకు గోవులతో అత్యవసరము ఉన్నది. అందుచేత **"బ్రహ్మవేతృత్వము"ను పణంగా పెట్టి గోవులను మా ఆశ్రమమునకు జేర్చాము.** అంతేగాని **బ్రహ్మవేతృత్వ-ఆధిక్యత పట్ల అభిమానముతో కానేకాదు.** అందుచేత మేము గోవులను ఆశ్రమముయొక్క అవసరము నిమిత్తమై త్రోలుకు పోయాము.

అశ్వలుడు : ఓహో! అట్లాగా! అయితే మేము కొన్ని ప్రశ్నలు అడుగుతాము. మీరు దయచేసి సమాధానం చెప్పాలి. ఈ సభలోని మహనీయులు బ్రహ్మనిష్ఠ- జ్ఞానముల గురించి మిమ్ములను ప్రశ్నించబోవుచున్నారు.

యాజ్ఞవల్క్యుడు : ఓ తప్పకుండా। అడగండి।

---

**3 యజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :**
**అశ్వల: యదిదగ్ం సర్వం మృత్యున ఆప్తగ్ం।**
**సర్వం మృత్యున అభిపన్నం।**
**కేన యజమానో మృత్యోః ఆప్తిమ్**
**అతిముచ్యత? ఇతి।**

అశ్వలుడు : ఓ యాజ్ఞవల్క్యా! ఒకడు గొప్ప యజ్ఞములు ఎరిగినవాడై **యాజ్ఞవేత్త** అయితే అయి ఉండవచ్చునుగాక। కానీ ఈ కనబడే సర్వము ఏ మృత్యువు చేత వ్యాపించబడినదై, అట్టి సమస్తము మృత్యువుకు మొదలంట్లా అధీనము అయి ఉండగా..., **అట్టి ఆ యజమానుడు (యజ్ఞము నిర్వర్తించు వాడు) దేనిచే మృత్యువును అధిగమించగలడు? దేనిచే మృత్యువు నుండి విముక్తుడు కాగలుగుతాడు?** కర్మఫలము మృత్యువుచే మ్రింగబడు చుండగా, ఏ కర్మచే ఒకడు మృత్యువును దాటి వేయగలడు? ఏ అనుష్ఠానము ఆతనిని మృత్యువు నుండి రక్షిస్తుంది? **(యజ్ఞ శాస్త్రీయ ప్రశ్న).**

---

**యాజ్ఞవల్క్యో వాచ:**
**హోత్రర్త్విజ అగ్నినా వాచా।**
**వాగ్వై యజ్ఞస్య।**
**హోతా తద్యేయం వాక్ సో అయమగ్నిః।**
**స హోతా।**
**స ముక్తిః। స అతిముక్తిః।**

యాజ్ఞవల్క్యుడు : హోత యొక్క (యజ్ఞము చేయువానియొక్క) వాక్కే అగ్ని. అగ్నియే హోతయొక్క వేద వాక్కు। అనగా యజ్ఞములోని హోత అనే - **ఋత్విక్కుయే అగ్నిస్వరూపుడు.** మంత్రము అగ్నిశిఖ. ఈ రెండిటినీ తెలుసుకొని, హోత మంత్రోచ్చారణలను అగ్నిరూపముగా చూడటమే ముక్తి. అగ్ని భావన స్వాభావికమై సిద్ధించటము 'అతిముక్తి'। అప్పుడు యజమాని మృత్యువును అధిగమించుచున్నాడు.

అట్టి హోత కూడా -మంత్ర అగ్నిరూపోపాసనచే తానే అగ్ని స్వరూపుడై వెలుగొందుచూ, **సర్వ సంసార భేదములను అధిగమిస్తున్నాడు.**

4 **<u>యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ ।</u>**
**<u>అశ్వలుడు :</u> యత్ ఇదగ్ం సర్వం**
**అహోరాత్రాభ్యాం ఆప్తగ్ం,**
**సర్వం అహోరాత్రాభ్యాం అభిపన్నం।**
**కేన యజమానో అహోరాత్రయోః**
**ఆప్తిం, 'అతిముచ్య'? ఇతి।**

అశ్వలముని : ఓ యజ్ఞవల్క్యా మహానుభావన్! ఈ ఎదురుగా కనిపిస్తున్నదంతా కూడా పగలు - రాత్రిలచే (అహోరాత్రములచే) వ్యాపించబడియున్నది. అనగా ఇదంతా కూడా పగలు - రాత్రికి వశమై ఉనికి కలిగి ఉన్నట్లే కదా! (Everything is bound by and influenced by Time Factor).

మరప్పుడు యజమానుడు ఏఏ సాధనలచే **అహోరాత్రములు పొందుచూ కూడా వాటిని అధిగమించి ఉండగలడు?**

ఏ విధంగా అహోరాత్రములనుండి **విముచ్యుడు** (Relieved) కాగలడు?

---

**<u>యాజ్ఞవల్క్యుడు :</u> (ఇతి) అధ్వర్యుణ ర్త్విజా చక్షుషా**
**ఆదిత్యేన చక్షుర్వై,**
**యజ్ఞస్య అధ్వర్యుః। తత్ (సత్)**
**యదిదం చక్షుః। సో అసావాదిత్యః।**
**సో అధ్యర్యుః। స ముక్తిః।**
**స అతిముక్తిః।**

**యాజ్ఞవల్క్యుడు :**

(1) అధ్వర్యుడు - అనే **ఋత్విజునిచేతను,**

(2) నేత్రరూపుడైనట్టి **ఆదిత్యుని చేతను** యజమానుడు రాత్రింబవళ్ళ పరిధులను (The Range of Time Factor) అధిగమిస్తున్నాడు.

'చూపు' → యజ్ఞముయొక్క అధ్వర్యుడు.

నేత్రము → ఆదిత్యుడు

ఇట్టి ఎరుకయే ముక్తి, అతిముక్తి కూడా!

ఈ విధంగా

- కన్ను → ఆదిత్యునిగాను,
- చూపును → మంత్రమును చెప్పు అధ్వర్యునిగాను,
- కనబడేదంతా → చూపు యొక్క విస్తరణగాను,

కన్ను - చూపులను కర్మసాధనములుగాను - (అధిదేవతా రూపమగు సూర్యునితోసహా) చూచుటయే మోక్షము/మోక్ష మార్గము.

---

5 **<u>యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :</u>**
**<u>అశ్వలుడు :</u> యదిదగ్ం సర్వం పూర్వపక్షా**
**పరపక్షాభ్యాం ఆప్తగ్ం।**
**సర్వం పూర్వపక్షా పరపక్షాభ్యాం**
**అభిపన్నం, కేన యజమానః**
**పూర్వపక్షాః పరపక్షయోః**
**ఆప్తిమ్ అతిముచ్యత? ఇతి।**

అశ్వల ఋత్విక్ : ఈ కనబడేదంతా పూర్వ - పర (శుక్ల - కృష్ణ) పక్షములచే వ్యాపించి ఉన్నది. ఆ (పూర్వ-పర) శుక్ల - కృష్ణపక్షములు ఇదంతా తమవశమునందు కలిగినవై ఉంటున్నాయి. అట్టి ఈ శుక్ల - కృష్ణ పక్షముల వ్యాప్త శృంఖములను (బంధములను) యజమానుడు ఏ సాధనచే దాటివేయగలుగుతాడు? ఆ రెండిటినుండి మోక్షము ఎట్లా పొందగలడు? (How to Cross the Progress - Regress Factors?)

దాటివేసిన మతిని (బుద్ధిని) ఎట్లా పొందగలడు?

---

**<u>యాజ్ఞవల్క్యుడు :</u> (ఇతి) ఉద్గాత్రర్త్విజా వాయునా,**
**ప్రాణేన ప్రాణో వై యజ్ఞస్య ఉద్గాతా।**
**తత్ యో అయం ప్రాణః।**
**స వాయుః। సాతిముక్తిః। (స అతిముక్తిః)।**

యజ్ఞవల్క్యుడు : ఓ! తప్పకుండా అధిగమించివేయగలడు. తనయొక్క ప్రాణశక్తితో వాయువును 'ఉద్గాతాయనము' చేయుట చేత పూర్వాపర పక్షములను (శుక్ల-కృష్ణ-పక్షకాల ధర్మములను) అధిగమించగలడు.

ప్రాణమే - యజ్ఞముయొక్క ఉద్గాత.

ప్రాణమే - వాయువు। ప్రాణశక్తికి చెందిన చేతనమే (Vibration) - వాయువుయొక్క రూపము.

వాయువు - ప్రాణముల అభేదతత్త్వమును గుర్తించటం చేత మోక్షము సిద్ధించగలదు. **వాటి ఏకత్వమే ముక్తి।**

---

6 **<u>యజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :</u>**
**<u>అశ్వలుడు :</u> యత్ ఇదం అన్తరిక్షం అనారమ్భణం ఇవ,**
**కేన ఆక్రమేణ యజమానః**
**స్వర్గం లోకం ఆక్రమత? ఇతి।**

**అశ్వలఋత్విజుడు** : ఓ యాజ్ఞవల్క్యా! ఇక్కడ మనకు ఎదురుగా అంతరిక్షము (ఆకాశము) కనిపిస్తోంది. అట్టి ఆకాశము ఏ ఆధారములేని దానివలె అగుపిస్తోంది. మరి యజమానుడు [ యజ్ఞము మొదలైనట్టి (స్వర్గలోకమునకు) అర్హములగు కర్మలు నిర్వర్తించువాడు] దేనిని ఆధారముగా చేసుకొని కర్మ ఫల ప్రాప్తియగు స్వర్గ లోకమునకు వెళ్ళుచున్నాడు? (కర్మఫలములు సిద్ధించుమార్గము ఏమై ఉన్నది?)

| | | |
|---|---|---|
| | <u>యాజ్ఞవల్క్యుడు :</u> బ్రహ్మణర్త్విజా మనసా చన్ద్రేణ।<br>మనో వై యజ్ఞస్య బ్రహ్మా।<br>తత్ యత్ ఇదం మనః। సో అసౌ చంద్రః।<br>స బ్రహ్మా। స ముక్తిః! స అతిముక్తిః!<br>ఇతి మోక్షా। అథ సమ్పదః। | **యాజ్ఞవల్క్యుడు** : ఆ యజమాని ఈ సృష్టికి కర్తయగు బ్రహ్మదేవుని **ఋత్విక్‌స్వరూపునిగా** భావిస్తున్నాడు. మనోరూపుడగు చంద్రుని ప్రసాదితంగా కర్మఫలములగు 'స్వర్గలోకము' మొదలైనవి చేరుచున్నాడు.<br>→ **యజమాని యొక్క మనస్సే 'బ్రహ్మ' అనబడు ఋత్విక్కు.**<br>→ ఆ మనస్సుయొక్క అధ్యాత్మస్వరూపము - బాహ్యప్రదర్శనా దేవత (అధిదేవత)యే **చంద్రుడు.**<br>→ ఈ చంద్రుడే 'బ్రహ్మ' అను ఋత్విక్కు. (మనస్సే బ్రహ్మము).<br>ఈ విధంగా మనస్సు యొక్క రూపమే సృష్టియొక్క సంభావనగా గమనించి ఆ యజమాని సృష్టి నుండి అతిముక్తుడు అగుచున్నాడు. |
| 7 | <u>యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :</u><br><u>అశ్వలుడు :</u> కతిభిః అయం అద్యర్గ్భిః హోతా<br>అస్మిన్ యజ్ఞే కరిష్యతి? ఇతి। | అశ్వ ఋత్విజుడు : ఓహో! అట్లాగా? ఇప్పుడు ఈ యజ్ఞమునందు ఋత్విజుడు ఎన్ని ఋక్ మంత్రములచే 'హోత్రము' చేస్తున్నాడు? |
| | <u>యాజ్ఞవల్క్యుడు :</u> తిసృభిః ఇతి।<br>కతమా స్తాస్తిస్ర ఇతి।<br>"పురో", "అనువాక్యా" చ<br>"యాజ్యా" చ। (తస్యైవ చ।) శస్యైవ చ | యాజ్ఞవల్క్యుడు : మూడు హోత్రములచేత!<br>ఆ '3' "హోత్రములు ఏవేవి? ఈ క్రింది వాటితో ఋత్విక్కు శంశనము (దేవతాస్తోత్రములు) చేయుచున్నాడు.<br>**(1) పురో - అనువాక్య (2) యాజ్య (3) శస్య"**<br>(1) పురో అనువాక్య = **కాలముకంటే ముందు ఉన్న తత్త్వము.**<br>(2) యజ్య = **యాగము కొరకై పలికే ఋక్కులు.**<br>(3) శస్య = **దేవతా ప్రజ్ఞల దివ్యత్వము గురించిన స్తుతులు.** |
| | <u>అశ్వలుడు :</u> తృతీయా కిం, తాభిః జయతీతి-?<br><u>యాజ్ఞవల్క్యుడు :</u> యత్ కించిత్ ఇదం ప్రాణభృత్। ఇతి। | అశ్వలుడు : ఆ మూడిటి సహాయముతో యజమాని దేనిని జయించుచున్నాడు?<br>యాజ్ఞవల్క్యుడు : '3' ఋగ్జాతులను జయిస్తున్నాడు. యజమాని, ఋత్విక్కు కూడా - **'పురో'** అను వాక్యమునందు **'భూలోకమును'**, **'యాజ్యము'**చే **'అంతరిక్షమును'**, **'శస్య'**యందు **"ద్యు (స్వర్గ) లోకమును"** జయించుచున్నాడు. సకల ప్రాణులను అధిగమించుచున్నాడు. సమస్తము బ్రహ్మముగా దర్శించటంలో దిగ్విజయుడు అవుతున్నాడు. |
| 8 | <u>యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :</u><br><u>అశ్వలుడు :</u> కత్యయం అద్య అధ్వర్యుః అస్మిన్ యజ్ఞ ఆహుతీః హోష్యతి ఇతి?<br><u>యాజ్ఞవల్క్య :</u>తిస్ర ఇతి?<br><u>అశ్వలుడు :</u> కతమాస్తాః తిస్ర ఇతి?<br><u>యాజ్ఞవల్క్య:</u> యా హుతా ఉజ్వలన్తి, యా హుతా అతినేదన్తే, యా హుతా అధిశేరతే। | అశ్వల ఋత్విక్కు : ఈ రోజు ఈ యజ్ఞమునందు ఎన్ని ఆహుతులను హోమము చేయుచున్నారు? అవి ఏవేవి?<br>యాజ్ఞవల్క్యుడు: '3' ఆహుతులను (1) హోమము చేయబడి ప్రజ్వరిల్లునవి (2) హోమము చేయబడు **శబ్ద జాలములు** (3) హోమము చేయబడి **విలీనమైపోవునవి.** |
| | <u>అశ్వలుడు :</u> కిం తాభిః జయతి? ఇతి।<br><u>యాజ్ఞవల్క్యుడు :</u> యా హుతా ఉజ్వలన్తి<br>దేవలోకమ్ ఏవ తాభిః జయతి,<br>దీప్యత ఇవ హి దేవలోకో।<br>యా హుతా అతినేదన్తే పితృలోకమేవ, తాభిః జయతి।<br>అతీవ హి పితృలోకో। య ఆహుతా అధి శేరతే।-<br>మనుష్య లోకం ఏవ తాభిః జయతి, -<br>అథ ఇవ హి మనుష్య లోకః॥ | అశ్వలుడు : వాటిచే యజమాని ఏమేమి జయించుచున్నాడు?<br>యాజ్ఞవల్క్యుడు : ప్రజ్వలితమగు ఆహుతులచే దేదీప్యమానములగు **దేవలోకములను,** శబ్దజాలరూప ఆహుతులచే శబ్దరూపములగు **పితృలోకములను,** నేలయందు విలీనములగు ఆహుతులచే క్రిందదగు **మనుష్య లోకమును** జయించుచున్నాడు.<br>దేవలోకము → దీప్యత। పితృలోకము → శబ్దము।<br>మనుష్యలోకము → భూమియందు విలీనము చేయు సమర్పణ।<br>ఈ విధముగా మూడు ఆహుతులచే మూడు జయించినవాడై దేవ - పితృ - మానవ లోకములను జయించి (బ్రహ్మముగా దర్శిస్తూ) ముక్తుడు అగుచున్నాడు. |

9 యాజ్ఞవల్క్యా – ఇతి హ ఉవాచ :

అశ్వలుడు : కతిభిః అయం అద్య బ్రహ్మా యజ్ఞం దక్షిణతో దేవతాభిః గోపాయతీతి।

యాజ్ఞవల్క్యుడు : ఏక యేతి।

అశ్వలుడు : కతమా స ఏక–ఇతి?

మన ఏవ, యత్ అనన్తం వై।

మనో అనన్తా।

విశ్వే దేవా అనన్తమేవ।

స తేన లోకం జయతి॥

**అశ్వల ఋత్విక్కు** : ఈరోజు జరుగుచున్న యజ్ఞములో 'బ్రహ్మ' అనే ఋత్విక్కు కుడివైపు ఆసీనులైఉండగా ఏఏ దేవతల సహాయముతో ఈ 'సృష్టి' అనబడే యజ్ఞమును నడిపిస్తున్నారు? రక్షిస్తున్నారు?

**యాజ్ఞవల్క్యుడు** : ఒకే ఒక్క దేవత యొక్క సహకార సంపత్తిచే ఈ సృష్టి మహాయజ్ఞమును పరిరక్షిస్తున్నారు.

**అశ్వల ఋత్విక్కు** : ఒకేఒక్క దేవతచే (సృష్టి) యజ్ఞమును రక్షిస్తున్నారా? ఎవ్వరా దేవత?

**యాజ్ఞవల్క్యుడు : మనస్సే ఆ దేవత।**

- మనస్సు అనంతము.
- విశ్వేదేవతలు కూడా అనంతమే.

మనస్సుచే అనంత లోకములు జయించబడుచున్నాయి. బ్రహ్మమయ ఋత్విక్కును సృష్టికర్త గాను, విశ్వేదేవతా రూపుడుగాను, అనంతమగు మనోతత్త్వముగాను ధ్యానించువాడు అనన్తలోకములను జయించుచున్నాడు. లోకములన్నిటినీ సస్వరూపాత్మకు 'అనన్యము'గా దర్శిస్తున్నాడు.

---

10. యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :

అశ్వలుడు : కత్యయం అద్య ఉద్గాతా అస్మిన్ యజ్ఞేః స్తోత్రియాః తోష్యతీతి?

అశ్వల ఋత్విక్కు : ఓ యాజ్ఞవల్క్యా! మరల చెప్పండి! ఈ రోజు ఈ యజ్ఞములో ఉద్గాత ఎన్ని స్తోత్రములు గానము చేసి సంతోషము పొందుచున్నాడు.

---

యాజ్ఞవల్క్యుడు : తిస్ర ఇతి।

అశ్వలుడు : కతమాస్తాసి?

యాజ్ఞవల్క్యుడు : తిస్ర ఇతి పురో, అనువాక్యా చ, యాజ్యా చ? శస్యైవ చ తృతీయా।

అశ్వలుడు : కతమస్తా యా?

యాజ్ఞవల్క్య : అధ్యాత్మం ఇతి।

ప్రాణఏవ పురో అనువాక్యా। అపానో యాజ్యా। వ్యానశ్శస్యా।

**యాజ్ఞవల్క్యుడు** : మూడు! (1) పురోనువాక్య (2) యాజ్య (3) శస్య

అశ్వల ఋత్విక్కు : ఆ మూడూ కూడా ఈ భౌతికదేహములో ఏఏ రూపములు కలిగినవై ఉన్నాయి?

**యాజ్ఞవల్క్యుడు** : ఆ పురోవాక్య యాజ్య - శస్యములు దేహములో ఏర్పడినవై ఉన్నాయి.

(1) ప్రాణమే → పురోనువాక్యము.

(2) అపానమే → యాజ్యము.

(3) వ్యానమే → శస్యము.

ఉద్గాత ఈ మూడిటికి ఉద్గాతము సమర్పిస్తున్నారు.

---

అశ్వలుడు : కిం తాభిః జయతీతి?

**అశ్వల ఋత్విక్కు** : వాటి సహాయముతో ఈ యజమాని ఏమేమి జయించివేయుచున్నాడు?

---

యాజ్ఞవల్క్యుడు: పృథివీలోకం ఏవ పురో అనువాక్యయా, జయతి। అన్తరిక్షలోకం, యాజ్యయా। ద్యులోకగ్ం శస్యయా।

**యాజ్ఞవల్క్యుడు** : ప్రాణరూపమైన 'పురోనువాక్య'చే భూలోకమును,

**- 'యాజ్య' అను అపాన తత్త్వముచే అంతరిక్ష లోకమును,**

**- 'శస్య' అను వ్యానతత్త్వముచే ద్యులోకమును జయించుచున్నాడు.**

---

తతో హ హోతా ఆశ్వల ఉపరరామ।

ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయః

"అశ్వలబ్రాహ్మణం" నామ ప్రథమమ్ బ్రాహ్మణమ్

ఈ విధంగా అశ్వల ఋత్విక్కు అడిగిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుడు ఇచ్చిన సమాధానము విని అశ్వల మహాశయుడు తృప్తిపొంది మౌనము వహించారు.

***ఇతి 'ఆశ్వల బ్రాహ్మణమ్' నామ – బృహదారణ్యకోపనిషత్ – పంచమోధ్యాయే ప్రథమ బ్రాహ్మణము।***

# పఞ్చమాధ్యాయః - ద్వితీయం బ్రాహ్మణము

## ఆర్త భాగ బ్రాహ్మణము

1 అథ హైనం జారత్కారవ
ఆర్త భాగః పప్రచ్ఛ।
యాజ్ఞవల్క్యేతి హో వాచ :
ఆర్తభాగుడు : కతి గ్రహాః? కతి అతిగ్రహాః? ఇతి।
యాజ్ఞవల్క్యుడు : అష్టౌ గ్రహా, అష్టావ అతిగ్రహా ఇతి।
ఆర్తభాగుడు : య ఏతే అష్టౌ గ్రహా అష్టా అతిగ్రహాః
కతమే, త? ఇతి।

అప్పుడు 'జారుత్కార' వంశోద్భవుడు, ఋతభాగుని కుమారుడు అగు **శ్రీ ఆర్తభాగుడు** యాజ్ఞవల్క్యుని ఇట్లా ప్రశ్నించసాగారు!

ఆర్తభాగుడు : ఓ యాజ్ఞవల్క్యా మహాశయా! గ్రహములు ఎన్ని? అతిగ్రహములు ఎన్ని? (మరియు) జ్ఞానసాధనములు ఎన్ని? వాటికి సంబంధించిన సహకారిక జ్ఞానసాధ్యములు ఎన్ని? చెప్పండి!

యాజ్ఞవల్క్యుడు : '8' గ్రహములు అనబడే జ్ఞానసాధనములు, మరొక '8' సహకారిక (లేక) ఉప - జ్ఞాన సాధనములు ఉన్నాయి.

ఆర్తభాగుడు : అవి ఏమేమి అయి ఉన్నాయి?

2 యాజ్ఞవల్క్యుడు : ప్రాణో వై గ్రహః।
సో అపానేన అతిగ్రాహేణ గృహీతో,
అపానేన హి గన్ధాన్ జిఘ్రతి॥

యాజ్ఞవల్క్యుడు :

**ప్రాణము - అపానము**

**ప్రాణమే** దేహముతో కనిపించుచున్న గ్రహము. అట్టి ప్రాణము - 'అతిగ్రహము' అగు అపానముచే కప్పబడినది (Encompassed) అగుచున్నది. ఎందుకంటే ప్రాణము అపానము ద్వారా 'గంధము'ను ఆస్వాదిస్తోంది.

[ ఈ జీవుడు గంధమునకు సంబంధించిన ఆకర్షణలకు బద్ధుడగు చున్నప్పుడు... ప్రాణ-అపాన జనిత గన్ధము ఈతని పట్ల 'గ్రహము'గా అగుచున్నది].

3 వాగ్వై గ్రహః। స నామ్నా
అతిగ్రాహేణ గృహీతో।
వాచా హి నామాని అభివదతి॥

**వాక్ ఇంద్రియము** (లేక) వాక్ సాధనమే → **"గ్రహము"**

ఆ వాక్‌చే పలుకబడుచున్న విషయము → **'అతిగ్రహము'**

'వాక్కు' అనబడు గ్రహము - చెప్పబడుచున్న విషయముగా (వక్తవ్యము రూపముగా) గ్రహించబడునదై - అన్నివైపులా వ్యాపించబడి ఉన్నది.

అట్టి వాక్కు యొక్క వ్యక్తీకరణమే లోకములో నామములన్నీ ధరించినదై ఉంటోంది.

(వాక్కు శరీరములో భాగము. ఆసక్తితో కూడిన శబ్దములే - విషయములు, మాటలు. ఇరులను బాధించే అసత్యము, బాధ కలిగించని అనృతము, ఏవగింపు మాటలు, పరుషపు మాటలచే ఈ జీవుడు పరవశించి ఉంటున్నాడు. అందుచేత వాక్ ఇంద్రియము గ్రహముగా చెప్పబడుతోంది).

4 జిహ్వా వై గ్రహః।
స రసేన అతిగ్రాహేణ గృహీతో।
జిహ్వయా హి రసాన్ విజానాతి।

**జిహ్వ (నాలుక)** → ఇంకొక గ్రహము. జిహ్వకు విషయమగు రసము (రుచి) అతిగ్రహము. ఈ నాలుక అనే గ్రహము 'రసము' అనే 'అతిగ్రహము'చే గ్రహించబడి దృశ్యమునందు వ్యాపించినదై ఉంటోంది.

అట్టి నాలుకచే రుచులు (రసము) తెలియబడుచూ తీపి, కారము, చేదు-పులుపు,... ఒగరు, ఉప్పు → అనుష్టదుచులు ఇత్యాది రసముల రూపమున లోకముగా వ్యాపించి ఉంటోంది. (రుచికి మనస్సు ఆకర్షితమగుటచే జిహ్వ కూడా గ్రహమగుచున్నది. రుచి యొక్క ఆకర్షణ "విషయములు" - అనునది 'అతిగ్రహము' అనబడుతోంది).

**5** **చక్షుః వై గ్రహః।**
**స రూపేణ అతిగ్రాహేణ గృహీతః।**
**చక్షుషా హి రూపాణి పశ్యతి।**

ఈ చక్షువులే → 'గ్రహము'!

రూపములు → అతిగ్రహణము (రూపాత్మకంగా కనిపించేదంతా అతిగ్రహము).

'నేత్రము' అనే గ్రహము → 'రూపములు' అను అతిగ్రహమును గ్రహించుచున్నది.

⚜ 'నేత్రము' అనే గ్రహము చేతనే లోకమున 'రూపము' అను దర్శనము (అతిగ్రహము) సిద్ధిస్తూ ఉంటోంది.

⚜ అట్టి రూపములు సుందరము, భయానకము, విరూపము...ఇత్యాది కనులయొక్క వివిధ గ్రహణములే **'లోకము'** అను పేరుతో చెప్పబడుచూ, వర్ధిల్లుచు - **'గ్రహము'** అగుచున్నాయి.

---

**6** **శ్రోత్రం వై గ్రహః।**
**స శబ్దేన అతిగ్రాహేణ గృహీతః।**
**శ్రోత్రేణ హి శబ్దాన్ శృణోతి।**

ఇంద్రియసాధనవస్తువు వంటిదగు చెవులు → గ్రహము.

వినబడు శబ్దములు → అతిగ్రహణము.

'శ్రోత్రము' అనబడే గ్రహము శబ్దము అను అతిగ్రహణము రూపముగా వ్యాపించినదై ఉంటోంది. అందుచేత శ్రోత్రముచేత లోకము శబ్దములను వినుచున్నది. అట్టి వినబడు శబ్దములు **కర్కశము, విషాదము, మధురము, ఆనందము, గౌరవము, అవమానము** మొదలైన వివిధ రూపములుగా అనుభవమవటమే లోకానుభవము. (అది శ్రోత్రగ్రహణ రూపమగుచున్నది)

---

**7** **మనో వై గ్రహః।**
**స కామేన అతిగ్రాహేణ గృహీతో।**
**మనసా హి కామాన్ కామయతే।**

మనస్సు - గ్రహము.

"కామము (కావాలి)" - అనుకామన → అతిగ్రహము.

మనస్సు అనే గ్రహముచే → 'ఏదో కావాలి'...అనే కామము (భావన) గ్రహించబడుచున్నది.

అందుచేత మనస్సుచే లోకమునకు సంబంధించిన పరిధిలలోని కామములను కోరుకొనుట జరుగుతోంది. "అది పొందాలి - ఇది ఇట్లా ఉండాలి - అది అట్లా ఉండకూడదు"...ఇత్యాది రూపములుగా....మనస్సే 'లోకము' రూపము పొందుతోంది. అందుచేత మనస్సు ద్వారా లోకము కామనములను (I want this and that) పొందటము జరుగుతోంది.

---

**8** **హస్తౌ వై గ్రహః।**
**స కర్మణా అతిగ్రాహేణ గృహీతో,**
**హస్తాభ్యాగ్ం హి కర్మ కరోతి।**

చేతులు...గ్రహము. చేయు పని (లేక) కర్మలు - అతిగ్రహము. **'చేతులు'** అను గ్రహము - **'కర్మలు'** అను అతిగ్రహమును గ్రహించుచూ ఉన్నది. అందుచేత చేతులతో చేస్తున్న పనులు 'కర్మలు' రూపముగా లోకముగా స్థితిపొంది వర్ధిల్లుచున్నాయి. (జీవుడు నిషిద్ధకర్మల వైపు ఆకర్షితుడగుటచే చేతులు అతిగ్రహరూపమగుచున్నవి).

---

**9** **త్వక్ వై గ్రహః।**
**స స్పర్శేన అతిగ్రాహేణ గృహీతః।**
**త్వచా హి స్పర్శ అన్వేదయత।**
**ఇతి – ఏతే అష్టౌ గ్రహా।**
**అష్టాః అతిగ్రహాః॥**

చర్మము → గ్రహము.

స్పర్శ → అతిగ్రహము.

స్పర్శ అనే అతిగ్రహము → 'చర్మము' అను గ్రహమును ఉపకరణముగా తీసుకొని రకరకములైన స్పర్శానుభవములు రూపమై 'లోకము'గా ప్రసిద్ధిపొందుచున్నది. స్పర్శాకర్షణలకు లోను కావటమే **'అతిగ్రహణము'**.





| | |
|---|---|
| | అనగా లోకము → చర్మము అనుగ్రహము ద్వారా స్పర్శ అనే అతిగ్రహరూపముయొక్క వివిధ అనుభవములుగా (వేడి - చల్లన - నున్నగా - రేఖలుగా అనుభవముగా) - ఏర్పడినది అగుచున్నది. (జీవుడు మనస్సుచే స్పర్శానుభవమునకు బద్ధుడగుచుండుటచే,...'స్పర్శ' గ్రహముగా అగుచున్నది). స్పర్శానుభవముగా పొందబడేదంతా 'అతిగ్రహము' అవుతోంది. |
| **10 యాజ్ఞవల్క్య ఇతి హో వాచ :**<br>**ఆర్తభాగుడు : యత్ ఇదగ్ం సర్వం మృత్యోః అన్నం।**<br>**కాస్విత్, సా దేవతా**<br>**యస్యా మృత్యుః అన్నం? ఇతి।** | ఆర్తభాగుడు : ఓ యాజ్ఞవల్క్యా మునీంద్రా! ఈ సమస్తము కూడా 'మృత్యువు' అనబడుదానికి భోజనముగా (అన్నముగా) అగుచున్నది కదా! మరి **ఈ మృత్యువు దేనికి భోజనముగా (ఆహారముగా, అన్నముగా) అగుచున్నదో, అది ఏది? ఏ దేవతకు మృత్యువే అన్నముగా అగుచున్నదో.... ఆ దేవత ఎవరు?** |
| **యాజ్ఞవల్క్యుడు : అగ్నిః వై మృత్యుః**<br>**సో అపాం అన్నం**<br>**అప పునః మృత్యుం జయతి॥** | యాజ్ఞవల్క్యుడు : అగ్నియే మృత్యువు. **అట్టి అగ్ని...ఉదకమునకు భోజనము (అన్నము) అగుచున్నది.** ఇది గమనించి ఎవడు అగ్నిని-మృత్యువుగాను, అట్టి అగ్ని ఉదకమునకు ఆహారముగా అగుచున్నదని ఎవడు ఉపాసిస్తూ ఉంటాడో,... అట్టివాడు అపమృత్యువును జయిస్తాడు. మృత్యువుకు ఆవల తాను ఉండి ఇదంతా దర్శిస్తాడే గాని, మృత్యువుకు విషయము కాడు. |
| **11 యాజ్ఞవల్క్య ఇతి హో వాచ :**<br>**ఆర్తభాగుడు : యత్ర అయం పురుషో మ్రియత?**<br>**ఉత్ అస్మాత్ ప్రాణాః**<br>**కామన్న్యాహో 3 (ఉ) నేతి నేతి? (న-ఇతి। న-ఇతి)।** | ఆర్తభాగుడు : ఓ యాజ్ఞవల్క్యా! ఈ పురుషుడు (జీవుడు) మరణించిన సమయమునందు **ప్రాణములు ఈ జీవుడి నుండి విడచి ఎటుపోతున్నాయి? జీవుడు ఎటుపోవుచున్నాడు? ప్రాణములు జీవునివెంట పోవుచున్నాయా?** ప్రాణములు మరొకచోటికి పోవుచున్నాయా? ఎటువైపుకు? యాజ్ఞవల్క్యుడు : లేదు. ఎటూ పోవటం లేదు. |
| **హో వాచ యాజ్ఞవల్క్యః**<br>**అత్రైవ సమవనీయన్తే।**<br>**స ఉచ్ఛ్వయత్యాధ్మా**<br>**యత్మాధ్మాతో మృతః శేతే।** | యాజ్ఞవల్క్యుడు : ప్రాణములు ఎటూ పోవటము లేదు. అవి అక్కడే అప్పుడే **జీవునియందు** (లేక) **పరబ్రహ్మమునందు** (లేక) **పురుషునియందు** విలీనము అగుచున్నాయి. ఇక ఆపై ఈ జీవుడు గాఢనిద్ర పొందినవానివలె బాహ్య విషయరహితమగు స్తబ్దత పొందుచున్నాడు. బాహ్యవాయువుచే నింపబడి నిశ్చేష్టితుడు అగుచున్నాడు. **బంధనాశే** ముక్తిస్య న క్వచిత్ గమనమితి వాక్యార్థః। ('ముక్తి' అనగా, "ఆత్మ ఎటూ వెళ్లదు. ఎటునుంచీ రాదు" - అని గమనించగలగటమే).<br><br>ఈ జీవుడు ఎక్కడికి వెళ్ళుటలేదు. ఎక్కడినుండి రావటములేదు. బంధము లేనివాడే అయి ఉండి కూడా మరల మరల **బంధములను కల్పించుకొనుచున్నాడు.** ఎవ్వరి దృష్టిలో బంధములన్నీ మొదలంట్లా నశించుతాయో, అట్టివాడు **బంధములన్నీ నశించగా, ముక్తుడై సర్వత్రా ఉన్నవాడై, సర్వము తానై** వెలుగొందుచున్నాడు. |
| **12 యాజ్ఞవల్క్యేతి హో వాచ :**<br>**ఆర్తభాగుడు : యత్ర అయం పురుషో**<br>**మ్రియతే కిమ్ ఏనం**<br>**న జహాతి ఇతి?** | **ఆర్తభాగుడు** : స్వామీ! యాజ్ఞవల్క్యా! ఈ పురుషుడు మరణము పొందిన తరువాత ఏమి మిగులుచున్నది? మరణించిన తరువాత కూడా ఈతనిని ఏది వదలక వెంటనంటియే ఉంటోంది? |
| **యాజ్ఞవల్క్యుడు : నామేతి అనన్తం। హ వై నామ అనన్తా।**<br>**విశ్వే దేవా అనన్తమేవ।**<br>**స తేన లోకం జయతి॥** | యాజ్ఞవల్క్యుడు : ధ్యాస. ఈ పురుషుడు అజ్ఞానిగా ఉన్నంతవరకు ఒక దేహము తరువాత మరొకటిగా స్వీకరిస్తూనే ఉంటాడు. **మరణానంతరము పూర్వదేహముతో ఉండి ఉన్న సంస్కారములను, కామనములను, భావావేశములను నూతన దేహముతో కొనసాగిస్తున్నాడు.** |

ఇక - జ్ఞాని విషయంలో?

ఆతనిపట్ల నామమే శేషిస్తోంది. అట్టి నామము నిత్యత్వ-అనంతత్వ లక్షణములు కలిగి ఉన్నది. ఈ పురుషు జ్ఞానముచే అనంత విశ్వదేవరూపుడై, నామ-రూపాత్మకమైనదంతా అధిగమిస్తున్నాడు. [**"లోకాలలో నేను"**... అనునదంతా అధిగమించి **"లోకములన్నీ నాలో"**... అను సంస్థానము పొంది లోకములను జయించినవాడగుచున్నాడు].

---

13 <u>యాజ్ఞవల్క్యేతి హో వాచ :</u>

<u>ఆర్తభాగుడు :</u> యత్ర అస్య పురుషస్య మృతస్య
అగ్నిం వాగప్యేతి।
వాతం ప్రాణః।
చక్షుః ఆదిత్యం।
మనః చన్ద్రం।
దిశః శ్రోత్రం।
పృథివీగ్ం శరీరం। ఆకాశం ఆత్మా।
ఔషధీః లోమాని।
వనస్పతీన్ కేశా। అప్సు లోహితం చ।
రేతః చ (రేతశ్చ) - నిధీయతే।
క్వ అయం తదా
పురుషో భవతి। ఇతి?

ఆర్తభాగుడు : ఓ యాజ్ఞవల్క్యా! **మనము కొంతసేపు ఆత్మజ్ఞానము ఎరుగని పురుషుని గురించి మాట్లాడుకుందాం.** ఆతడు మరణించిన తరువాత....

'వాక్' ఇంద్రియము → అగ్నిని పొందుచున్నది.

'ప్రాణములు' → వాయువులో లీనమగుచున్నాయి (అనంత వాయువులలో కలిసిపోతున్నాయి).

నేత్రములు (చూపు) → సూర్యునియందు ప్రవేశము పొందుచున్నాయి.

మనస్సు → చంద్రునిలో ప్రకాశిస్తోంది.

శ్రోత్రములు (వినికిడి) → దిక్కులందు లయమగుచున్నాయి.

భౌతిక శరీరము → భూమియందు కలసిపోతోంది.

జీవుడు (జీవాత్మ) (Role in the world) → హృదయాకాశంలో విలీనమగుచున్నాడు.

శరీరరోమములు → ఓషధీతత్త్వములోనికి నిష్క్రమిస్తున్నాయి.

రేతస్సు - రక్తము → జలతత్త్వము నందు లయిస్తోంది.

....ఇవన్నీ ఆయా మూలతత్త్వములయందు విలీమగుచున్నాయి కదా! మరి అప్పుడు (కర్మలపట్ల అభిమానము గల) ఈ పురుషుని మాట ఏమిటి? ఎక్కడ ఉంటున్నాడు? ఏ ఆశ్రయమును పొందుచున్నాడు? ఆ పురుషుడు మరల కార్య-కారణ సంఘాతమగు దేహమును ఎట్లా మరలా స్వీకరిస్తున్నాడు?

---

<u>యాజ్ఞవల్క్యుడు :</u> ఆహర, సోమ్య!
హస్తమ్ ఆర్త భాగావామ్
ఏవైతస్య వేదిష్యావో
న నావేతత్ సజన ఇతి।
తౌ హోత్క్రమ్య।

**యాజ్ఞవల్క్యుడు :** ఓ సౌమ్యా! నీ చేతులను నా చేతితో కలుపు. మనము ఆ విషయము అనేకమంది మధ్యలో చెప్పుకునే విషయము కాదు. ఏకాంతంగా మనమిద్దరమే ఉన్నచోట చెప్పుకొనెదము. మనమిద్దరమే ఆ విషయమును సంభాషించుకొనటము ఉచితము. పదిమందితో కూడి కాదు.

ఇట్లా పలికి, యాజ్ఞవల్క్యుడు ఆర్తభాగుని ఒక ఏకాంత ప్రదేశమునకు తీసుకొని వెళ్ళారు. అక్కడ ఆ ఇద్దరు విచారణ చేయసాగారు.

---

మన్త్ర య అన్వక్రాతే తౌ హ యదూ చతుః।
కర్మ హైవ తదూచతు రథ
యత్ ప్రశశగ్ం సతుః।
కర్మహైవ (కర్మ హి ఏవ) తత్ ప్రశశగ్ం సతుః।

అక్కడ ఏకాంతంగా వాళ్ళు ఆ నిమంత్రించుకుని చెప్పుకున్నదేమిటి?

**యాజ్ఞవల్క్యుడు : నీవు అడిగిన ప్రశ్న కర్మల పరిధిలోనిదేగాని ఆత్మకు సంబంధించి కాదు.** అంతా ఆత్మయే అయి ఉండగా దేహముయొక్క రాక పోకలు విషయములే కావు. మట్టితో బొమ్మ తయారుచేసి, ఆ

తరువాత మట్టిని ముద్దగా చేస్తే, అదంతా మట్టికేమి సంబంధము? సర్వదా మట్టి యథాతథము కదా!

ఇక కర్మల విషయానికి వస్తేనో? కర్మలను అనుసరించి ఈ జీవునికి దేహాలు వస్తూ ఉంటాయి. పోతూ ఉంటాయి. **ఇక కర్మల గురించి సందర్భ పరిమితమాత్రంగా మనము ప్రశంసించుకొనెదము గాక!** అవన్నీ పరమ సత్యమగు ఆత్మ సమక్షంలో 'అవిషయత్వము' సంతరించుకోగలవు. (శంకర భాష్యము)।

---

**పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి।**
**పాపః పాపేన ఇతి।**

కర్మలు ఎట్లా ఉంటే దేహముల రాకపోకలు ఆ తీరైనవిగా ఉంటాయి. **పుణ్యకర్మల వలన లోకసంబంధమైన సుఖము, పాపకర్మల వలన లోకసంబంధమైన దుఃఖములకు సంబంధించిన సంగతి - సందర్భ - సంఘటనలు వచ్చి పోతూ ఉంటాయి. కర్మలు - కర్మఫలాలు మనస్సుకేగాని ఆత్మకు లేవు! ఉండజాలవు!** ఆత్మకు అన్యము కానట్టి నీయొక్క (స్వయం కల్పిత) వినోద విశేషమే ఇదంతా!

---

**తతో హ జారత్కారవ**
**ఆర్తభాగ ఉపరరామ॥**

***ఇతి బృహదారణ్యకోపనిషత్ పంచమాధ్యాయే।***
***"ఆర్తభాగబ్రాహ్మణం" నామ ద్వితీయం బ్రాహ్మణమ్॥***

ఈ వాక్యములు విన్న జాగత్కారు గోత్రీయుడగు ఆర్తభాగుడు - ఇక ఏమీ ప్రశ్నించక చిరునవ్వుతో మౌనము వహించిన వారయ్యారు. యాజ్ఞవల్క్యుని సమాధానముచే తృప్తి పొందారు.

ఆ తరువాత యాజ్ఞవల్క్యుడు, ఆర్తభాగుడు తిరిగి యథాప్రకారముగా జనక మహారాజు సభలో ప్రవేశించారు.

ఆర్తభాగుడు - **"గ్రహ అతిగ్రహముల గురించి, అజ్ఞానుల సుజ్ఞానుల జీవన్-మరణ సంబంధమైన అవగాహన - అనుభూతుల గురించి శ్రీ యాజ్ఞవల్క్యులవారు ప్రవచించిన సమాధానముతో తృప్తి పొందుచున్నాను"** - అని పలికి, శాంతించి సభలో మరల సుఖాసీనులైనారు.

***ఇతి బృహదారణ్యకోపనిషత్ పంచమాధ్యాయే।***
***"ఆర్తభాగబ్రాహ్మణం" నామ ద్వితీయం బ్రాహ్మణమ్॥***

# పఞ్చమాధ్యాయః - తృతీయం బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - భుజ్యు సంవాదము

| | |
|---|---|
| 1) అథ హైనం భుజ్యుః<br>లాహ్యాయనిః పప్రచ్ఛ।<br>యాజ్ఞవల్క్య – ఇతి హో వాచ :<br>భుజ్యుడు : మద్రేషు చరకాః పర్య వ్రజామ,<br>తే పతంజ(చ)లస్య కాప్యస్య గృహానైమ।<br>తస్య ఆసీత్ దుహితా,<br>గన్ధర్వ గృహీతా। తమ పృచ్ఛామ:<br>"కో అసి ఇతి?" | లాహ్యాని కుమారుడగు భుజ్యుపు : మహాత్మా! యాజ్ఞవల్క్యా! మరొక్క విషయం! మేము కొంతకాలం క్రితం వేదములను అధ్యయనం చేస్తూ మద్రదేశంలో తిరుగాడుతూ ఉండేవారము. ఒకరోజు కపిగోత్రజుడు అయినట్టి 'పతంజలుడు' అనే వేదపండితుని ఇంటికి వెళ్ళటము జరిగింది. ఆ పతంజలునికి ఒక కుమార్తె. ఆమె గంధర్వ గ్రహముచే గ్రహించబడి ఉండింది. అనగా, ఎవ్వరో ఒక గంధర్వుడు ఆమెలో ప్రవేశించి ఉండేవారు. **(దయ్యము పట్టడము" అనే లోక రీతి వంటిది).**<br>ఆ గంధర్వుని "నీవు ఎవరివి?" అని మేము అడిగాము. |
| సో అబ్రవీత్ : సుధన్వా ఆఙ్గీరసః ఇతి। | అప్పుడు ఆ కుమారిని ఆవేశించియున్న గంధర్వుడు...<br>***"నేను ఆంగిరస గోత్రము నందు పుట్టినవాడను. నా పేరు సుధన్వుడు"*** |
| తం యదా లోకానామ్<br>అన్తాన పృచ్ఛామ – అథై నమ బ్రూమ।<br>క్వ పారిక్షితా అభవన్ ఇతి।<br>క్వ పారిక్షితా అభవన్ స త్వా పృచ్ఛామి।<br>యాజ్ఞవల్క్య! క్వ పారిక్షితా అభవన్? ఇతి। | **మేము (భుజ్యుడు మొ॥వారు) :**<br>ఓ సుధన్వా!<br>(1) ఈ లోకములయొక్క అంతమున (ఆవల) ఉన్నదేమిటి?<br>(2) పారిక్షితులు (అశ్వమేథయాగము మొ॥వి చేసినవారు) తమ పాపములన్నీ పోగొట్టుకొన్నవారై చేరుస్థానము ఏమిటి?<br>అప్పుడు పారిక్షుతులు ఎక్కడ ఉంటారో, **ఏమో ఆయా వివరములు** మాకు ఆ గంధర్వుడు చెప్పటం జరిగింది. తద్వారా మేము ఆ రెండు ప్రశ్నలకు సమాధానము తెలుసుకొన్నాము. |
| 2 స హ ఉవాచ: ఉవాచ వై<br>సో అగచ్ఛన్ వై తే తద్య<br>అత్ర అశ్వమేధ యాజినో గచ్ఛన్తి ఇతి।<br>భుజ్యుడు : క్వన్వ (కృత)<br>అశ్వమేధ యాజినో గచ్ఛన్తి ఇతి? | ఓ యాజ్ఞవల్క్య మహానుభావా? ఆ గంధర్వుని అడిగిన ప్రశ్నలనే మిమ్ములను కూడా అడుగుచున్నాము.<br>(1) ఈ లోక పరిమాణము ఎట్టిది? దీనికి ఆవల ఏమున్నది?<br>(2) అశ్వమేధ యాగము మొదలైన ఉత్తమోత్తమ కర్మలు నిర్వర్తించి సర్వ పాపములను తొలగించుకొన్న పారిక్షితులు చేరు స్థానము ఏది? |
| యాజ్ఞవల్క్యుడు : ద్వాత్రిగ్ంశతం (32) వై<br>దేవ రథాహ్నే అన్యయం<br>లోకస్తగ్ం సమన్తం (సమస్తం)<br>పృథివీ, ద్విస్తావత్ పర్యేతి।<br>తాగ్ం సమస్తం పృథివీం<br>ద్విస్తావత్ సముద్రః పర్యేతి।<br>తత్ యావతీ క్షురస్య ధారా,<br>యావత్ వా మక్షికాయాః పత్రం,<br>తావత్ అనన్తరేణ ఆకాశ(తాని)। | **యాజ్ఞవల్క్యుడు** : ఈ లోకము 32 దేవరథా - ఆహ్న్యముల విస్తారము కలిగి ఉన్నది. (దేవరథాహ్న్యము = సూర్యుని రథము ఒకరోజు ఎంతదూరము ప్రయాణించునో .... అంత విస్తీర్ణము).<br>అట్టి ఈ (భూ) లోకము చుట్టూ లోకాలోక పర్వతములు. అట్టి ఈ బ్రహ్మాండమే విరాట్ పురుషుని శరీరము. ఈ భూమికి చుట్టువైపులంతా భూమికి '2' రెట్లు అధిగమగు సముద్రము విస్తరించి ఉన్నది.<br>పదునైన కత్తియొక్క చిట్టచివరి కొనవలె, ఈగ రెక్క వలె ఆకాశము అంతటా అంతరమున ఆకాశమే వ్యాపించి ఉన్నది. ఈ బ్రహ్మాండము రెండు చిప్పల మధ్యవలె ఆకాశమునందు ఉన్నది. |

| | |
|---|---|
| **(తాని) ఇంద్రః సుపర్ణో భూత్వా వాయవే**<br>**ప్రాయచ్ఛత్తాన్ వాయుః**<br>**ఆత్మని ధిత్వా తత్ర ఆగమయద్య అత్ర**<br>**ఆశ్వమేధ యాజినో అభవన్ (త్)।**<br>**ఇతి ఏవం ఇవ (ఇత్యేవమివ)** | అశ్వమేధ యాగమునందు (తదితర ఉత్తమోత్తమ కర్మలయందు) ఉపాసించబడిన విరాట్ పురుషుడు రెండు రెక్కల పక్షివలె అయి, **ఆ పారిక్షితులను వాయువుకు అప్పజెప్పుచున్నారు.** బ్రహ్మాండమునకు ఆవల సామాన్య జీవులకు ప్రవేశ ప్రదేశములేదు.<br>ఎక్కడైతే ఇతఃపూర్వపు అశ్వమేధ యాగకర్తలు (తదితర పుణ్యకర్మలు) నివసిస్తున్నారో అట్టి ఆకాశాంతర్గత ప్రదేశమును యజ్ఞకర్త చేరుచున్నాడు. |
| **వై స వాయుమేవ ప్రశశగ్ం।** | ఈ విధంగా ఆ గంధర్వుడు - వాయుతత్త్వమునే పొగిడి, **"వాయువే అంతరిక్షములో యాజ్ఞకర్తల స్థానము చేర్చుచున్నది"**- అని స్తుతిస్తూ మీకు చెప్పి ఉండాలి. |
| **స తస్మాత్ వాయుః ఏవ వ్యష్టిః।**<br>**వాయుః సమష్టిః।**<br>**అప పునః మృత్యుం జయతి–**<br>**య ఏవం వేద।** | **వాయువే వ్యష్టి - సమష్టి రూపము కూడా।** ఈ జీవులంతా ప్రాణతత్త్వము నందు ప్రాణవాయు తరంగాలవంటి వారు. **వాయువుయొక్క వ్యష్టి - సమష్టితత్త్వము గ్రహించినవాడు మృత్యువును జయిస్తున్నాడు.**<br>**ఇదంతా వాయు స్వరూపమే.** |
| **తతో హ భుజ్యుః**<br>**లాహ్యాయనిః ఉపరరామ॥** | ఈ విధంగా యాజ్ఞవల్క్యుడు సమాధానం చెప్పగా విని, లాహ్యాని కుమారుడగు భుజ్యుడు తృప్తి పొంది మౌనము వహించారు. |

**ఇతి బృహదారణ్యకోపనిషత్।**
**పంచమాధ్యాయః। తృతీయ బ్రాహ్మణమ్।**
**యాజ్ఞవల్క్య - భుజ్యు సంవాదమ్ ॥**

**ఇతి బృహదారణ్యకోపనిషత్।**
**పంచమాధ్యాయః। తృతీయ బ్రాహ్మణమ్।**
**యాజ్ఞవల్క్య - భుజ్యు సంవాదమ్ ॥**

# పఞ్చమాధ్యాయః - చతుర్థ బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - ఉషస్త సంవాదము

1 **అథ హి ఏనం ఉషస్తః**
**చాక్రాయణః పప్రచ్ఛ:**
**యాజ్ఞవల్క్యః ఇతి హోవాచ :**
**ఉషస్త : యత్ సాక్షాత్, అపరోక్షాత్ బ్రహ్మ**
**య ఆత్మా సర్వాంతరస్తంమేవ ఆచక్ష్వేతి,**
**ఏష త ఆత్మా సర్వాన్తరః క తమో?**

**చక్రుని కుమారుడగు ఉషస్తముని : పరబ్రహ్మము అనునది ద్రష్టకు అత్యంత సమీపము.** ద్రష్టకు ఎదురుగా ఉన్నదంతా కూడా పరబ్రహ్మమే। అట్టి పరబ్రహ్మము సమస్తమునకు అంతరమున ఆత్మస్వరూపమై యున్నది కూడా! అది సాక్షాత్‌గాను, అపరోక్షముగాను కూడా అయి ఉన్నదని చెప్పబడుచున్నది కదా!

(1) సాక్షాత్ బ్రహ్మము అనగా ఏమి?

(2) అపరోక్షబ్రహ్మము అనగా ఏమి?

(3) ఆత్మసర్వమునకు అంతర్-స్వరూపము - అంటే ఏమిటి?

(4) అట్టి ఆత్మ ద్రష్టయందే ద్రష్టకు అత్యంత సామీప్యమై ఉండి కూడా, సర్వమునకు అంతర్యామి కూడా అయి ఉన్నతీరేమిటి? ఎట్లా ఏ రూపంగా ఉన్నది? ఈ విషయములు విశదీకరించి సుస్పష్టపరచండి!

---

**యాజ్ఞవల్క్య : సర్వాన్తరో అయః**
**ప్రాణేన ప్రాణితి। స త**
**ఆత్మా సర్వాన్తరో**
**యో అపానేన అపానితి।**
**స త ఆత్మా సర్వాన్తరో,**
**యో వ్యానేన వ్యాన–ఇతి ।**
**స త ఆత్మా సర్వాన్తరో**
**య ఉదానే న ఉదాన ఇతి।**
**స త ఆత్మా సర్వాన్తర,**
**ఏష త ఆత్మా సర్వాన్తరః।**

**యాజ్ఞవల్క్యుడు** : మిత్రమా! ఉషస్తమునీ! **దేహ - ఇంద్రియ సంఘాతమునకు సాక్షిగా వెన్నొందుచున్న నీ ఆత్మయే సమస్తమునకు అంతర్యామిగా అధారమై ఉన్నది.**

ఉషస్తముని : సమస్తమునకు అంతర్యామిగా ఉన్న నా ఆత్మ ఎక్కడ, ఎందులో ఏ రూపమున ఉన్నది?

**యాజ్ఞవల్క్యుడు** : ఆత్మ స్వరూపుడవగు ఓఉషస్తమునీ! దేనిచేతైతే నీ ముఖము, ముక్కులయందు సంచారముగల ప్రాణవాయువు కదలించబడుచున్నదో, దేహములో ప్రాణవాయు వ్యాపారత్వము పొందుచున్నదో - అదియే విజ్ఞానమయమగు ఆత్మ.

దేనిచే వాయువు అపానత్వము పొంది అపానవాయువుగా సంచరిస్తోందో, దేనిచే ప్రాణము వ్యాపకత్వమును నిర్వర్తించుచూ, శరీరమంతా చరింపజేస్తోందో... **అదియే సర్వాంతర్యామి అగు ఆత్మ।**

ఏది తన ఉదానత్వముచే వాయువును ఉదానవాయువుగా ఆయా విధులను నిర్వర్తింపజేస్తోందో, అదియే సర్వాంతర్యామియగు ఆత్మ!

కదిలే పంచప్రాణములను కదల్చుచున్న చైతన్యమే ఆత్మ. కారణ, కార్యము, సర్వము అయినది ఆత్మ। అదియే సర్వాన్తరము కూడా!

---

2 **సహ ఉవాచ ఉషస్త చాక్రాయణో।**
**ఉషస్త : యథా విబ్రూయాత్,–**
**అసౌ గౌర సావశ్వ**
**ఇతి ఏవం ఏవై తత్ వ్యపదిష్టం భవతి,**
**య దేవ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ।**
**(అపరోక్షాత్ బ్రహ్మ) య ఆత్మా**
**సర్వాన్తరస్తం మే వ్యాచక్ష్వా ఇతి।**
**ఏష త సర్వాన్తరః కతమో?**

**చక్రాయణుని కుమారుడగు ఉషస్తుడు** : ఓ యాజ్ఞవల్క్యా! "ఇదిగో ఇది ఆవు! అదిగో అది గుఱ్ఱము"....అని జనులు అనురీతిగా నీవు, "ఆత్మ సర్వాంతర్యామి" - అని ఆత్మగురించి చెప్పుచున్నావు. ఈ మాత్రము చెప్పినంత మాత్రంచేత చాలదు।

సర్వసాక్షి, ప్రతి ఒక్కరికి అపరోక్షము, సర్వస్వరూపము అగు ఆత్మగురించి మరికొంత విపులము, వివరముగా చెప్పండి. **మేమంతా శ్రవణ మననములు నిర్వర్తిస్తాము.**

| | |
|---|---|
| యాజ్ఞవల్క్య: సర్వాన్తరః।<br>న దృష్టేః ద్రష్టారం పశ్యేః। | **యాజ్ఞవల్క్యుడు** : నీవు **ఆత్మ స్వరూపుడవు**. నీ ఆత్మయే సర్వమునకు అంతరాత్మ। **సర్వాంతర్యామియే నీ ఆత్మయొక్క స్వరూపము**. కళ్ళకు కనిపించేవన్నీ నీవు చూడగలుగుచున్నావు కదా! కళ్ళతో చూచేవాడిని నీ కళ్ళు చూడగలవా? లేదు కదా! ఆత్మ చూచేవాడుగా ఉన్నది. మరి నీకు ఎట్లా ఒక వస్తువువలె చూపాలి చెప్పు? కనుక ఆత్మ దృశ్యములో ఏ వస్తువు కాదు!<br>**ద్రష్టకు ఆవలివాడు. ద్రష్టకంటే వేరూ కాదు. దృశ్యము కాకపోనూ లేదు. అందుచేత నీ ఆత్మ-అపరోక్షము, సర్వాంతర్యామి కూడా।** |
| న శృతేః శ్రోతారగ్ం, శృణుయాత్।<br>న మతేః మన్తారం మన్వీథా। | అనేక శబ్దములను నీ చెవులు వినగలవు కదా! అయితే ఆ చెవులను **ఎవ్వరు ఉపయోగించి వినుచూ ఉన్నారో,.. ఆతనిని చెవులు వినగలవా? లేదు!**<br>నీవు అనేక విషయాల మనస్సుతో ఆలోచిస్తున్నావు కదా! **అట్టి మనస్సు ఆలోచన చేయువానిని ఒక విషయము వలె ఆలోచించుచున్నదా? లేదు.** |
| న విజ్ఞాతేః విజ్ఞాతారం విజానీయాః। | అనేక విషయాలు విజ్ఞాతవై తెలుసుకుంటున్నారు కదా! ఆ తెలుసుకొనే తెలివి తెలుసుకొనుచున్న వానిని తెలుసుకొనుచున్నదా? లేదు. **తెలివితో తెలివి తనను తాను తెలుసుకోలేదు.** |
| ఏష త ఆత్మా సర్వాన్తరో అతో అన్యదార్తం। | ఏది కళ్ళు ఉపయోగించి చూచుచున్నదో, చెవులు ఉపయోగించి వినుచున్నదో, మనస్సును ఉపయోగించి ఇష్టాఇష్టములు పొందుచున్నదో, ఏది తెలియబడేవన్నీ తెలుసుకొనుచున్నదో, - **అదియే ఆత్మ**। అట్టి నీయొక్క ఆత్మ కేవలము వ్యష్టి శరీరములో మాత్రమే లేదు! **నీవు అనుభవముగా పొందబడుచున్న దానికంతటికీ అంతరముగా అంతర్యామిగా కూడా ఉన్నది. (ఒక రచయిత నవలలోని వ్రాతలన్నీ నిండి ఉన్నట్లుగా)-**<br>- సర్వమునందు ఉన్న నీ ఆత్మ స్వరూపమే - **పరమాత్మ**. అది **నీయొక్క సహజ రూపము. తదితరమైనదంతా కూడా - సందర్భమాత్రము, కేవలము కల్పితము కూడా।**<br>- దేహమునందు ద్రష్టకు పరిమితమైన నీ ఆత్మ స్వరూపమే - **జీవాత్మ. ఇది సందర్భమాత్రము. 'సమస్తము నేనైన నేనే'- సహజము.**<br>ఆత్మయే బ్రహ్మము! **నీవు - నేను బ్రహ్మమే అయి ఉన్నాము.** |
| తతో హ ఉషస్తః చాక్రాయణ ఉపరరామ । | ఇది విని, చక్రాయణుని కుమారుడగు ఉషస్తుడు,....ఆత్మసమాచారము విషయమై విన్న దానికి సంతోషించినవాడై మౌనము వహించారు. |

ఇతి బృహదారణ్యకోపనిషత్ పంచమాధ్యాయే
“యాజ్ఞవల్క్య-ఉషస్త సంవాద” నామ చతుర్థం బ్రాహ్మణమ్॥

ఇతి బృహదారణ్యకోపనిషత్ పంచమాధ్యాయే
“యాజ్ఞవల్క్య-ఉషస్త సంవాద’ నామ చతుర్థం బ్రాహ్మణమ్॥

# పఞ్చమాధ్యాయః - పంచమం బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - కహోల సంవాదము

1 అథ హైనం కహోళః
కౌషీతకేయః పప్రచ్ఛ :
యాజ్ఞవల్క్య ఇతి హ ఉవాచ :
కహోళుడు: యత్ ఏవ "సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ",
య ఆత్మా సర్వాన్తరస్తం మే
వ్యాచక్ష్వేతి, ఏష త
ఆత్మా సర్వాన్తరః కతమో? యాజ్ఞవల్క్య!

**కుషీతకముని కుమారుడగు కహోళుడు (కౌషీతకేయుడు) :** ఓ యాజ్ఞవల్క్య మహాన్! ఈ రెండు విషయాలూ నాకు విడమర్చి సుస్పష్టము చేయండి।

(1) సన్నిహితము - ప్రత్యక్షముగా ఉన్నట్టి (సాక్షాత్) పరబ్రహ్మము యొక్క **రూపము, తత్త్వము**-ఏమిటి?

(2) సర్వమునకు అంతరము, ప్రత్యగాత్మము అగు ఆత్మ (లేక) పరబ్రహ్మము యొక్క **తత్త్వము** ఏమిటి? ఈ రెండిటియొక్క విశేషములు వివరించండి. ఈ రెండిటి **భేద ఏకత్వములు** ఏమిటి? సర్వాంతర్గతమగు ఆత్మ ఎటువంటిది? **అద్దానిని ఎరుగుటవలన ప్రయోజనం ఏమిటి?**

---

యాజ్ఞవల్క్యుడు : సర్వాన్తరో
యో అశనాయా పిపాసే శోకం, మోహం,
జరాం మృత్యుమ్ అత్యేతి। ఏతం వై
తమ్ ఆత్మానం విదిత్వా బ్రాహ్మణాః
పుత్రైషణాయాశ్చ,
విత్తైషణాయాశ్చ
లోకైషణాయాశ్చ
వ్యుత్థాయ।

**యాజ్ఞవల్క్యుడు :** ఓ ప్రియ కహోళుడా! నీ ఆత్మయొక్క సహజరూపమే సర్వాంతర్యామిత్వము కలిగినదై ఉన్నది.

**కహోళుడు** : 'సర్వాంతరము' అగు నా ఆత్మయొక్క స్వరూప - లక్షణములు ఏమేమి?

**యాజ్ఞవల్క్యుడు** : అద్దానికన్నా ముందుగా **'సంసారసాగరము'** అనగా ఏమో వినండి.

**ప్రాణము** → ఆకలి - దాహము (క్షుత-పిపాస) కలిగి ఉంటోంది.

**మనస్సు** → శోక - మోహములు ప్రదర్శిస్తోంది.

**శరీరము** → జరా - మరణములు కలిగి ఉంటోంది.

ఈ విధంగా ప్రాణ-మనో-శరీరములను అధికరణముగా గల క్షుత్-పిపాసలు, శోక-మోహములు, జరా-మరణములు ఇవన్నీ కూడా ప్రాణులపట్ల రాత్రింబవళ్ళుగా సముద్ర తరంగములవలె కొనసాగుచున్నాయి. ఇదియే సంసారసాగరము.

అయితే, **అవన్నీ కూడా - ఆత్మస్వరూపమును స్పృశించటంలేదు.**

తరంగములు జలమును ఏమి చేయగలవు? జలమును బంధిస్తున్నాయా? అటువంటిదేమీ లేదు కదా! **ప్రాణ, క్షుత పిపాస మొ॥న వాటిచే ఏ ఆత్మ దోషము పొందటము లేదో, అదే అపరోక్షాత్మ!**

అట్టి ఆత్మయొక్క నిత్య నిర్మలత్వము, అప్రమేయత్వము, శుద్ధ-బుద్ధత్వము ఎరిగినప్పుడు ఈ జీవుడు అట్టి బ్రహ్మజ్ఞానముచే, పుత్రైషణ - విత్తేషణ - లోకైషణ - అనబడు **ఈషణత్రయము** నుండి విముక్తడగుచున్నాడు.

---

అథ భిక్షాచర్యం చరన్తి।
యా హి ఏవ పుత్రైషణా, సా విత్తైషణా।
యా విత్తైషణా, సా లోకైషణా।
ఉభేహ్యే తే ఏషణే ఏవ భవతః॥

ఈ విధంగా బ్రహ్మజ్ఞానము, ఆత్మజ్ఞానము సంపాదించుకున్నవారై కర్మలను, కర్మసాధనములను విడచి కొందరు సన్న్యసించుచున్నారు. భిక్షాటనను ఆశ్రయిస్తున్నారు.

ఈషణత్రదయ రహితులై "భి" (అజ్ఞానాంధకారము)ను
"క్ష" (క్షయింపజేసుకొని)
**'భిక్షకుడు'** అను యోగయుక్త స్థానమును సిద్ధింపజేసుకొనుచున్నారు.

| | |
|---|---|
| **తస్మాత్ బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్।** | అందుచే, - బ్రహ్మము గురించిన పాండిత్యము కొరకై బాల్యము నుండి బ్రహ్మోపాసన చేయాలి. అవిద్యను జయించే ప్రయత్నం చేయాలి. |
| **బాల్యం చ పాణ్డిత్యం చ, నిర్విద్యా అథ, మునిః।** | ప్రయత్నశీలురు-ఆచార్యులను సేవించి, ఆత్మజ్ఞానమును సముపార్జించి, **బ్రహ్మవేత్త** అయి సర్వసందేహములను **'నిశ్శేషము'** చేసుకొనుచున్నారు. సమస్తమైన లౌకిక విషయములపట్ల దృష్టిని తిరస్కరించివేయుచున్నారు.<br>అనాత్మజ్ఞాన దృష్టులను త్యజించుచూ ఆత్మను విశేషముగా తెలుసుకొన్న వాడు లోక విషయముల పట్ల మౌని (మౌనము వహించినవాడు) అగుచున్నాడు. |
| **అమౌనం చ మౌనం చ నిర్విద్యా అథ బ్రహ్మణః, స బ్రాహ్మణః।** | మౌనముచే 'ముని' అని పిలువబడుచున్నాడు. **అమౌని**-సంసారబద్ధుడగు చున్నాడు.<br>"సమస్తము పరబ్రహ్మస్వరూపమే" - అనుజ్ఞానముచేత మౌనము సిద్ధించుకుంటూ **'బ్రాహ్మణుడు'** అగుచున్నాడు. |
| **కేనస్యాత్ ఏనస్యాత్ తేనే దృశ ఏవాతో అన్యదార్తం।** | అట్టి బ్రాహ్మణునిపట్ల (పుత్ర-విత్త-లోక) ఈషణత్రయము తనకు తానే నశించినదిగా అగుచున్నది! ఏవిధంగా "స్వప్నములో వస్తుజాలము, మాయలో కల్పనా సహితమైనది, యండమావులలోనీరు పరిశీలనచే వాస్తవానికి లేవు"...అనునదే సిద్ధిస్తోందో, ఈషణత్రయము కూడా అట్లే ఎరుకచే నాశనము పొందుచున్నది.<br>శేషించిన వస్తువే సన్నిహితము, ప్రత్యక్షము- అగు ఆత్మ!<br>అదియే ప్రత్యక్షము, పరోక్షము కూడా కానట్టి **అపరోక్షము** కూడా!<br>అఖండాత్మకు ఆ తేడాయే లేకుండాపోతోంది. |
| **తతో హ కహోళః కౌషీతకేయ ఉపరరామ।**<br><br>**ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయః "కహోల బ్రాహ్మణం" నామ పంచమం బ్రాహ్మణమ్।** | ఇది విని కహోలముని సంతోషము పొంది మౌనము వహించారు.<br><br>**ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయః "కహోల బ్రాహ్మణం" నామ పంచమం బ్రాహ్మణమ్।** |





# షష్ఠమాధ్యాయః - షష్ఠమ బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - గార్గీదేవీ సంవాదము

1 అథ హైనం గార్గీ
వాచక్నవీ పప్రచ్ఛ - యాజ్ఞవల్క్య ఇతి
హోవాచ:
గార్గి : యదిదగ్ం సర్వం
అప్సు ఓతం చ
ప్రోతం చ కస్మిన్ను
ఖలు ఆప ఓతాశ్చ - ప్రోతాశ్చ ఇతి।

శ్రీ వచక్నుని పుత్రిక (వాచక్నవి) అను గార్గి అద్భుతమైన విద్యావంతురాలు. ఆమె లేచి నిలుచుని ఇట్లా ప్రశ్నించసాగారు.

గార్గి : అయ్యా! యాజ్ఞవల్క్యులవారు! ఈ సమస్త వస్తు జాతము అంతా కూడా "జలము"నందు ఓతప్రోతము అయి ఉన్నది కదా! అటువంటి 'ఉదకము'నకు ఆధారము ఏదై ఉన్నది? దయచేసి వివరించి చెప్పండి.

**(ఓత-ప్రోతము = వస్త్రములో దారము నిలువుగాను - అడ్డముగాను అమర్చబడగా వస్త్రము అనునది దూది, 'దారము' తప్ప మరింకేమీ కానట్టితీరుగా?)**

---

యాజ్ఞవల్క్యుడు :
వాయౌ, గార్గి! ఇతి।

యాజ్ఞవల్క్యుడు : అమ్మా! గార్గీ! జలము...వాయువునందంతటా ఓత-ప్రోతమైయున్నది. (అగ్ని-అని ఎందుకు అనలేదు? అగ్నికి భూ-జలములతో సంబంధములేని స్థితియే లేదు కాబట్టి - **శంకరభాష్యము)**

వాయువునందు జలము - అగ్ని కూడా ఓత - ప్రోతమై యున్నది.

---

గార్గి : కస్మిన్ను ఖలు వాయుః
ఓతశ్చ ప్రోతశ్చ? - ఇతి।

గార్గి : స్వామీ! యాజ్ఞవల్క్యా! అట్టి వాయువు దేనియందు ఓత-ప్రోతమైన యున్నది?

---

యాజ్ఞవల్క్యుడు : అన్తరిక్ష లోకేషు, గార్గి! ఇతి।
గార్గి : కస్మిన్ను ఖలు అన్తరిక్ష లోకా ఓతాశ్చ
ప్రోతాశ్చ? ఇతి॥
యాజ్ఞవల్క్యుడు : గంధర్వ లోకేషు, గార్గి! ఇతి।
గార్గి : కస్మిన్ను ఖలు గన్ధర్వ లోకా
ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?
యాజ్ఞవల్క్యుడు : ఆదిత్య లోకేషు, గార్గి! ఇతి।
గార్గి : కస్మిన్ను ఖలు ఆదిత్యలోకా
ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?
యాజ్ఞవల్క్యుడు : చన్ద్ర లోకేషు, గార్గి! ఇతి।
గార్గి : కస్మిన్ను ఖలు చన్ద్ర లోకా
ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?
యాజ్ఞవల్క్యుడు : నక్షత్ర లోకేషు, గార్గి! ఇతి।

**యాజ్ఞవల్క్యుడు** : వాయువు అంతరక్షమునందు ఓత-ప్రోతమైయున్నది. మరి అంతరిక్షమో? గంధర్వలోకమునందు ఓత-ప్రోతము!

గంధర్వలోకము → ఆదిత్యలోకమునకు ఓత-ప్రోతము!

(ఓతప్రోతము = మట్టితో తయారైన బొమ్మ లోపల బయట మట్టియే అయి ఉన్నట్లుగా కూడా).

ఆదిత్యలోకము చంద్రలోకమునందు ఓత-ప్రోతము.

గార్గి : చంద్రలోకము దేనియందు ఓత - ప్రోతము?

**యాజ్ఞవల్క్యుడు** : చంద్రలోకము నక్షత్రలోకమునందు ఓత-ప్రోతము.

---

గార్గి : కస్మిన్ను ఖలు నక్షత్ర లోకా
ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?
యాజ్ఞవల్క్యుడు : దేవ లోకేషు, గార్గి! ఇతి।
గార్గి : కస్మిన్ను ఖలు దేవలోకా
ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?
యాజ్ఞవల్క్యుడు : ఇన్ద్ర లోకేషు, గార్గి! ఇతి।

ఓ గార్గీ!

నక్షత్రలోకము దేవ లోకమునందు, దేవలోకము ఇంద్రలోకమునందు

ఇంద్రలోకము ప్రజాపతి లోకమునందు,

ప్రజాపతిలోకము బ్రహ్మలోకమునందు ఓత - ప్రోతము.

**గార్గి: కస్మిన్ను ఖలు ఇన్ద్రలోకా**
**ఓతాశ్చ ప్రోతాశ్చ? ఇతి।**
**యాజ్ఞవల్క్యుడు : ప్రజాపతి లోకేషు, గార్గి! ఇతి।**
**గార్గి : కస్మిన్ను ఖలు ప్రజాపతి లోకా**
**ఓతాశ్చ ప్రోతాశ్చ ఇతి?**
**యాజ్ఞవల్క్యుడు : బ్రహ్మ లోకేషు – గార్గి! – ఇతి।**
**గార్గి : కస్మిన్ను ఖలు**
**బ్రహ్మలోకా ఓతాశ్చ**
**ప్రోతాశ్చ, ఇతి?**
**యాజ్ఞవల్క్యుడు : (సహ ఉవాచ), గార్గి!**
**మ అతి ప్రాక్షీః। మా తే మూర్ధా**
**వ్యపప్తదనతి। ప్రశ్న్యాం వై**
**దేవతాం అతిపృచ్ఛసి। గార్గి!**
**"మ అతి, ప్రాక్షీః" ఇతి।**

గార్గి : మరి బ్రహ్మలోకము ఎద్దానియందు ఓత ప్రోతము?

**యాజ్ఞవల్క్యుడు : బ్రహ్మలోకము ఎందులో ఓత ప్రోతము - అనునది మాత్రం నన్ను అడుగవద్దు.** ఇంతవరకు అడిగినది మాత్రము బాగుగానే ఉన్నది. అంతటితో చాలు కూడా!

ఎందుకంటే, **"అంతటికీ అతీతమై అంతా తానై అయి"** - బ్రహ్మము **సర్వే సర్వత్రా వెలుగొందుచున్నది.** బ్రహ్మమునకు వేరుగా అటూ - ఇటూ మరేమీ లేదు.

సర్వమ్‌ఖిల్విదమ్ బ్రహ్మ।

సర్వము సర్వదా బ్రహ్మమే।

ఇక బ్రహ్మముతో మరొకటి గాని, మరొకటి బ్రహ్మముతోగాని ఓత ప్రోతమయ్యే ప్రసక్తియే కాదు.

---

**తతో హ గార్గీ**
**వాచక్నః ఉపరరామ॥**

ఇది విన్న తరువాత వచక్నుని పుత్రిక వాచక్ని అనబడు గార్గి.... యాజ్ఞవల్క్యుడు ఇచ్చిన సమాధానమునకు తృప్తి పొందినవారై, **మౌనము వహించారు.**

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయే**
**"గార్గీ బ్రాహ్మణో" నామ షష్ఠం బ్రాహ్మణః**

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయే**
**"గార్గీ బ్రాహ్మణో" నామ షష్ఠం బ్రాహ్మణః**

# పఞ్చమాధ్యాయః - సప్తమం బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - ఆరుణి (ఉద్దాలక) సంవాదము

| | |
|---|---|
| 1 అథ హైనం (హి ఏనం) ఉద్దాలక ఆరుణిః పప్రచ్ఛ :<br>యాజ్ఞవల్క్య ఇతి, హో వాచ<br>ఉద్దాలకుడు : మద్రేషు అవసామ, పతంజలస్య<br>కాప్యస్య గృహేషు।<br>(కిం త)యజ్ఞం అధీయానాః। | అరుణి కుమారుడు అగు ఆరుణి అయినట్టి ఉద్దాలకుడు ఇట్లా అడిగారు.<br>"ఓ యాజ్ఞవల్క్య తత్త్వజ్ఞా! ఈ మధ్య ఒక సందర్భములో జరిగిన సంఘటన.<br>ఒకప్పుడు మేము మంద్ర దేశములో 'కపి'గోత్రుడు (కాప్యుడు) అగు పతంజలిని గృహములో ఉండి **కల్ప సూక్తము** అనబడు యజ్ఞశాస్త్రమును నేర్చుకొనుచూ ఉండేవారము. |
| తస్య అసీత్ భార్యా గంధర్వ గృహీతా।<br>తమ పృచ్ఛామ– "కో అసీత్?" – ఇతి।<br>సో అబ్రవీత్, "కబన్ధ ఆథర్వణ ఇతి।" | మా గురువుగారగు పతంజలుని భార్య (గురుభార్య)ను ఒక గంధర్వుడు ఆవహించటము జరిగింది. (ప్రేతము ఆవహించటము వంటిది).<br>ఒక రోజు మేము ఆ గంధర్వునితో ఇట్లా సంభాషించాము.<br>మేము : ఓయీ! మా గురుపత్నిని ఆవహించినట్టి ఎవరవయ్యా నీవు?<br>గంధర్వుడు : నేనా! అథర్వణుడు అను వాని పుత్రుడను. 'కబంధుడు' అను పేరు గలవాడను. |
| గంధర్వ సో అబ్రవీత్: "పతంజలం<br>కాప్యం! యాజ్ఞికాగ్ంశ్చ వేత్థ ను త్వం<br>కాప్య! తత్ సూత్రం, –"యేన అయం చ లోకః,<br>పరశ్చ లోకః, సర్వాణి చ భూతాని<br>సన్దృబ్ధాని భవన్తి ఇతి?" | మేము : ఎందుకు మా గురుపత్నిని ఆవహించారు?<br>గంధర్వుడు : ఓ పతంజలీ! ఓ తదితర యాజ్ఞీకులారా! మిమ్ములను ఒక ప్రశ్న అడుగుచున్నాను. తెలిస్తే సమాధానము దయచేసి చెప్పండి! ఇదంతా కూడా 'సూత్రే మణిగణా ఇవ' అని సూత్రీకరించబడుచున్నది కదా! **ఈ లోకము, పరలోకము, అట్లాగే ఈ సర్వభూతములు - ఇవన్నీ కూడా ఏ సూత్రముచే పరస్పరము గ్రుచ్చడిఉన్నాయి? కట్టబడి ఉన్నాయి? మీకు తెలుసా?** |
| సో అబ్రవీత్ పతంజలః కాప్యో–<br>"న అహం తం, భగవన్! వేద।" – ఇతి। | పతంజలి : అయ్యా! ఈ లోకం - పరలోకం - ఈ జీవులు మొదలైనదంతా ఏ సూత్రముచే కట్టబడి ఉన్నారో - అది మాకు తెలియదు। |
| గంధర్వుడు : సో అబ్రవీత్, – "పతంజలం। కాప్యం!<br>యాజ్ఞికాగ్ంశ్చ<br>వేత్థ ను త్వం, కాప్య!<br>తం అన్తర్యామిణం, య ఇమం చ లోకం<br>పరం చ లోకగ్ం సర్వాణి చ భూతాని<br>యో అన్తరో యమయతీతి। | గంధర్వుడు : తెలియదా? సరే! పతంజలి కాప్యా! పోనీ, ఎవ్వడు ఈ లోకమును, పరలోకములను, సమస్త భూతజాలమును అంతర్యామి అయి నియామకము చేయుచున్నాడు? అట్టి అంతర్యామి ఎవ్వరో మీకు తెలుసా? ఇదన్నా చెప్పండి! నియామకుడై (One who is appointing), అదే సమయంలో (At the same time) 'అంతర్యామి' (Inner Participant) అయిఉన్నది ఎవరు? ఏది? |
| సో అబ్రవీత్ పతంజలః కాప్యో–<br>పతంజలి : "న అహం తం, భగవన్! వేద।"– ఇతి॥ | **పతంజలి :** హే భగవాన్! గంధర్వా! అథర్వణ పుత్రంకబంధుడా! ఇది కూడా నాకు తెలియదు. నాకు అందరినీ కట్టి ఉంచే ఏకసూత్రమూ తెలియదు, ఏకైక అంతర్యామి గురించి తెలియదు? మీకు తెలిస్తే దయతో మాకు బోధించండి! |
| గంధర్వుడు : సో అబ్రవీత్, పతంజలం కాప్యం<br>యాజ్ఞికాగ్ం శ్చ యో వై | **కబంధుడు (గంధర్వుడు) :** ఓ పతంజలు కాప్యా! తదితర యజ్ఞశాస్త్రమును పఠిస్తున్న శిష్యబృందములారా! మీకు ఒక విషయము గుర్తు చేయదలచు కొన్నాను. యజ్ఞవిధులను - యజ్ఞ మంత్రములను - ఉచ్చారణలయొక్క |

| | |
|---|---|
| **తత్ కాప్య! సూత్రం**<br>**విద్యాత్తం చ అన్తర్యామిణం**<br>**ఇతి, స బ్రహ్మవిత్।**<br>**స లోకవిత్। స దేవవిత్।**<br>**స వేద విత్। స భూతవిత్।**<br>**స ఆత్మవిత్। స సర్వ విత్। ఇతి॥**<br>**తేభ్యో అబ్రవీత్ –**<br>**<u>యాజ్ఞవల్క్యుడు :</u> "తత్ అహం – వేద।"** | ఆరోహణ-అవహరోణ క్రమములు గురించి తెలుసుకొన్నంత మాత్రంచేత సరిపోదు. ఎవడు - సర్వజీవులను, లోకములను, లోకపాలకులను **కలిపి ఉంచు సూత్రమును, సర్వుల అంతర్యామిని** తెలుసుకుని ఉంటాడో ఆతడే బ్రహ్మమును, దేవతలను, లోకములను, వేదములను తెలుసుకొన్నవాడు - అని గమనించండి. ఎరిగి ఉండండి.<br><br>**ఓ యాజ్ఞవల్క్యా!**<br><br>అటువంటి సూత్రాత్మజ్ఞానమును (మరియు) అంతర్యామి తత్త్వమును ఆతనివద్ద మేము సవివరంగా విని ఉన్నాము. లోకవిత్, దేహి విత్, వేదవిత్, భూతవిత్ అయ్యాము। **<u>యాజ్ఞవల్క్యుడు :</u> అది నాకు తెలుసు.** |
| **<u>ఉద్దాలకుడు :</u> తత్ చేత్ త్వం**<br>**యాజ్ఞవల్క్య! సూత్రం**<br>**అవిద్వాగ్ం స్తం చ**<br>**అన్తర్యామిణం బ్రహ్మగవీ**<br>**రుదజసే మూర్ధా**<br>**తే విపతిష్యతి। ఇతి।** | **<u>ఉద్దాలకుడు :</u>** ఓ యాజ్ఞవల్క్యా! అటువంటి సూత్రము ఏమిటో, అంతర్యామి ఎవ్వరో తెలుసుకోకుండా కేవలము **"నేనుఆత్మను ఎరిగాను"** అని భావించి, ఆత్మజ్ఞానులకు మాత్రమే చెందవలసిన గోవులను మీకు మీరే మీ గృహమునకు తీసుకొనిపోవటము ఉచితమా? కాదు కదా! జ్ఞానివి కాకుండా, జ్ఞానులకు మాత్రమే చెందవలసిన గోవులను తీసుకొనిపోతే మీ శిరస్సు పగిలి ముక్కలుగా అవగలదు సుమా! |
| **<u>యాజ్ఞవల్క్యుడు :</u>** వేద వా అహం, గౌతమ!<br>**తత్ సూత్రం, తం చ అన్తర్యామిణం ఇతి।** | **యాజ్ఞవల్క్యుడు :** ఓ గౌతమ ఉద్దాలకా! మాకు ఆయొక్క సూత్రాత్మ గురించి, అంతర్యామి గురించి మేము వినియే ఉన్నాము. అందుచేత మాకు తెలుసు. |
| **<u>ఉద్దాలకుడు :</u> యో వా ఇదం**<br>**కశ్చిత్ బ్రూయాత్ వేద,**<br>**వేదేతి యథా వేత్థ బ్రూహి। ఇతి॥** | ఉద్దాలకుడు : **'మాకు తెలుసు - మాకు తెలుసు'** అని చాలామంది అంటూ ఉంటారు. అనగలరు కూడా। **మరి ఆత్మ తెలిసినట్లు అనిపిస్తూనే తెలియనిదై ఉంటోంది కూడా.** మీకు ఏమేమి తెలుసో అదంతా చెప్పండి. అప్పుడు **"మీకు తెలుసా? తెలియదా?"....** అనునది మేము నిర్ణయించెదము గాక! |
| **2. <u>స హ (యాజ్ఞవల్క్యో) ఉవాచ :</u>**<br>**వాయుః వై, గౌతమ!**<br>**తత్ సూత్రం వాయునా వై, గౌతమ!**<br>**సూత్రేణ అయం చ లోకః,**<br>**పంశ్చ లోకః। సర్వాణి చ భూతాని**<br>**సన్దృబ్ధాని భవన్తి।** | **యాజ్ఞవల్క్యుడు :** ఓ గౌతమా! ఉద్దాలక మహాశయా! మీరు అడిగిన "ఇహలోకములను - పరలోకములను - సర్వభూతములను సూత్రముగా కలిపి ఉంచుచున్నది వాయువే। వాయువుచేతనే (ప్రాణముచేతనే) ఈ జన్మ - క్రితం జన్మ - రాబోయే జన్మ, సమస్త భూతములు, సమస్త లోకములు కట్టుబడి ఉన్నాయి. వాయువు-ప్రాణశక్తి ప్రదర్శనము.<br><br>ప్రాణశక్తియే ఈ సర్వమునకు **'త్రాణ సూత్రము'**. పూదండతోని అనేక పూలను ఒకదానితో ఒకటి దారమే కట్టి ఉంచుచున్నట్లుగా, వాయువే (ప్రాణమే) జన్మలను, దృశ్యాంతర్గత జీవులను, ఇహ-పరలోకములను కట్టి ఉంచుతోంది. |
| **తస్మాత్ వై, గౌతమ!**<br>**పురుషం ప్రేతం ఆహుః।**<br>**వ్యస్రగ్ం సిషత అస్య**<br>**అంగాని ఇతి।** | అందుచేతనే ఓ గౌతమా! ప్రాణమే లేకపోతే జీవుడు లేడు. సర్వభూతములను కలిపి ఉంచే ప్రాణమును ప్రక్కకు బెడితే, ఈ పురుషుడు (జీవుడు) శవముతో (ప్రేతముతో) సమానమే - అని చెప్పబడుచున్నది-కూడా। |

| | |
|---|---|
| **వాయునా హి, గౌతమ!**<br>**"సూత్రేణ సన్నృబ్ధాని భవన్తి।" ఇతి** | అట్టి వాయువు చేతనే ఈ దేహములోని అంగములన్నీ నిలబెట్ట బడుచున్నాయి.<br>అందుచేత ఓ గౌతమా! **"వాయువే సర్వమునకు సూత్రము"** అనునది నా సమాధానము. (జల-తరంగములవలె - ప్రాణమే వాయుతరంగ రూపము). |
| **ఉద్దాలకుడు : ఇత్యేవం ఏవై తత్ యాజ్ఞవల్క్య!**<br>**'అన్తర్యామిణం' బ్రూహి, ఇతి।।** | **ఉద్దాలకుడు :** ఓ యజ్ఞవల్క్యా! సరే! ఇప్పుడు 'అంతర్యామి' ఎవ్వరై ఉన్నారో... అది కూడా వివరించండి! |
| **3. యాజ్ఞవల్క్యుడు : యః పృథివ్యాం తిష్ఠన్,**<br>**పృథివ్యా అన్తరో,**<br>**యం పృథివీ న వేద,**<br>**యస్య పృథివీ శరీరం**<br>**యః పృథివీమ్ అన్తరో**<br>**యమయతి ఏష త ఆత్మాం**<br>**'అన్తర్యామి'। అమృతః।** | **అంతర్యామి**<br>**యాజ్ఞవల్క్యుడు :** ఓ ఉద్దాలక మహాశయా! ఇప్పుడిక అంతర్యామి గురించి మరికొన్ని వివరణలు చెప్పుకుంటున్నాము.<br>→ ఏది భూమి అంతటా తిష్ఠితమై యున్నదో,<br>→ ఏది భూమియొక్క అంతరమున సంచారము కలిగి యున్నదో,<br>→ ఎద్దాని గురించి భూమికి తెలియనే తెలియటములేదో,<br>→ ఏది ఈ భూమిని తన శరీరముగా కలిగి ఉన్నదో,<br>→ ఏది ఈ భూమిని నియమించుచున్నదో -<br>- అదియే నీయొక్క, నాయొక్క, సర్వభూతములయొక్క, సర్వలోకముల యొక్క **'అంతర్యామి'** అగు అఖండ అమృతరూప ఆత్మ।<br>**కనుక నీ ఆత్మయే సర్వమునకు అంతర్యామి।** |
| **4. యో అప్సు తిష్ఠన్, అద్భ్యః అంతరో,**<br>**యమ్ ఆపో న విదుః,**<br>**యస్య ఆపః శరీరం,**<br>**యో అపాం అన్తరో యమయతి, ఏష**<br>**త ఆత్మా। అన్తర్యామి। అమృతః।** | → ఏది ఉదకమునందు అంతటా ఉన్నదో, ఉదకమునకు ఆధారమై వేరుగా కూడా ఉన్నదో,<br>→ ఏది ఉదకము తెలుసుకోలేకపోవుచున్నదో,<br>→ ఈ ఉదకము ఎద్దానికి భౌతికరూప శరీరము కూడా అయి ఉన్నదో,<br>→ ఏది ఉదకమును నియమించుచున్నదై ఉన్నదో,<br>...అదియే సర్వాంతర్యామి లక్షణ సమన్వితమగు నీ ఆత్మ స్వరూపము. **కనుక ఆత్మస్వరూపుడుగా నీవే సర్వమునకు అంతర్యామి అయి ఉన్నావు.** |
| **5. యో అగ్నౌ తిష్ఠత్,**<br>**అగ్నేః అన్తరో,**<br>**యం అగ్నిః న వేద,**<br>**యస్య అగ్నిః శరీరం**<br>**యో అగ్నిం అన్తరో**<br>**యమయతి, ఏష**<br>**త ఆత్మా। → 'అన్తర్యామి'। అమృతః।** | → ఎవ్వరైతే అగ్నియందు అంతటా (మట్టిబొమ్మలో మట్టివలె) తిష్ఠించిన వారై ఉన్నారో,<br>→ ఏది అగ్నికి అంతర్యామియై, ఆధారమై ఉన్నదో,<br>→ ఏది అగ్నిచే **'తన అంతర్యామి'** అని గమనించబడటము లేదో,<br>→ ఈ అగ్ని ఎద్దానికి శరీరమే అయి ఉన్నదో,<br>→ ఏది అగ్నికి నియామకమైన అంతర్‌శక్తి అయి ఉన్నదో (అగ్నిని నియమించుచున్నదో),<br>**ఆతడే నీ ఆత్మ! నీ ఆత్మ ఆతడే! ఆతడే నీవు! ఆతడే నేను!**<br>ఆత్మగా **నీవే** సర్వమునకు, (అనగా) నాకు, సర్వభూతములకు, సర్వ ఇహ-పరలోకములకు **"అంతర్యామివి"** అయి ఉన్నావు. **అట్టి నీ ఆత్మయే అమృత స్వరూపము.** |

**6. యో అన్తరిక్షే తిష్ఠత్**
**అన్తరిక్షాత్ అన్తరో,**
**యం అన్తరిక్షం న వేద,**
**యస్య అన్తరిక్షగ్ం శరీరం,**
**యో అన్తరిక్షం అన్తరో**
**యమయతి,**
**ఏషత ఆత్మా। → "అన్తర్యామి। అమృతః"।**

→ ఏదైతే అంతరిక్షము (ఆకాశము)నందు అంతటా నిండినదై ఉన్నదో,

→ అంతరిక్షమునకు అంతరమై ఆధారమై ఉన్నదో,

→ ఏదైతే అంతరిక్షము మాత్రం "నాకు ఆధారమై ఉన్నది కదా!"....అని (ఆత్మను) గమనించటమే లేదో,

→ ఈ అంతరిక్షమంతా ఎద్దానికి శరీరము అయి ఉన్నదో,

అదియే అంతరిక్షమునకు అంతర్యామి। అదియే అంతరిక్షమును నియమించుచున్నట్టిది।

అదియే నీ ఆత్మ। నా ఆత్మ అయ్యదియే। (అనగా) ఆత్మగా నీవే అమృతస్వరూపమగు అంతర్యామివి. సర్వాంతర్యామివి. పృథ్వి - ఆపో - అగ్ని - వాయు - అంతరిక్షాత్మ స్వరూపుడవు కూడా.

---

**7. యో వాయౌ తిష్ఠన్,**
**వాయోః అన్తరో,**
**అయం వాయుః న వేద,**
**యస్య వాయుః శరీరం,**
**యో వాయుం అన్తరో**
**యమయతి, ఏష**
**త ఆత్మా। → అన్తర్యామి। అమృతః।**

→ ఏదైతే వాయువునందు అంతటా తిష్ఠించినదై ఉన్నదో,

→ ఏది వాయువుయొక్క అంతరమై ఉన్నదో,

→ ఏది వాయువుచే "నాకు అంతర్యామి - ఆధారము ఇది కదా!"...అని గమనించబటమే లేదో,

→ ఏది వాయువును తనయొక్క శరీరముగా కలిగి ఉన్నదో,...అదియే ఆత్మ। అదియే నీ ఆత్మ। అదియే ఏకాక్షరాత్మ।

→ నీ ఆత్మయే సర్వమునకు అంతర్యామి. పంచభూతాత్మకము.

→ నీ ఆత్మయే వాయువు - వాయుచలనములకు, సర్వభూతములకు, లోకములకు ఆధారము. అంతరాంతరమగు 'అమృతస్వరూప అంతర్యామి। అంతర్హృదయము।

---

**8. యో దివి తిష్ఠన్,**
**దివో అన్తరో, యం ద్యౌః న వేద,**
**యస్య ద్యౌః శరీరం,**
**యో దివం అన్తరో,**
**యమయతి ఏష (యమయత్యేష)**
**త ఆత్మా। → అన్తర్యామి। అమృతః।**

→ ఏది దివి (ద్యులోకము) నందు అంతటా ఆక్రమించుకొని తిష్ఠించుకొనినదై ఉన్నదో,

→ ఏది దివికి (దేవతాలోకమునకు, స్వర్గలోకమునకు) అంతరాంతరమో,

→ ఏది దివిలోకము చేతకూడా - తనకు ఆధారముగా ఉన్నట్లుగా ఎరుగబడటము లేదో,

→ ఎద్దానికి ద్యులోకమంతా తన శరీరమే అయి ఉన్నదో,

→ ఏది ద్యులోకమును నియమించుచున్నదో,

అదియే నీ ఆత్మ। నా ఆత్మ। సర్వమునకు అంతర్యామి। అదియే నీయొక్క - నాయొక్క అమృతరూపము।

(అనగా), **నేను - నీవు ఈ సర్వమునకు అంతర్యామి స్వరూపులము.**

నీవే ఆ అంతర్యామివి! తత్ త్వమ్! నేనూ అట్టి అంతర్యామి రూపమునే। (సోఽహమ్)।

**9. య ఆదిత్యే తిష్ఠన్,**
**ఆదిత్యాత్ అన్తరో,**
**(యమ్) ఆదిత్యో న వేద।**
**యస్య ఆదిత్యః శరీరం,**
**య ఆదిత్యం అన్తరో యమయతి,**
**ఏష త ఆత్మా। అన్తర్యామి। అమృతః।**

→ ఏది ఆదిత్యునియందు (సూర్యునియందు) నిండియున్నదో, సు-తిష్ఠితమో,

→ ఏది సూర్యునికి కూడా అంతరాంతరమగు ఆధారముగా ఉన్నదో,

→ ఏది ఆదిత్యునిచే గమనించబడటమే లేదో,

→ ఎద్దానికైతే ఆదిత్యుడు (సూర్యుడు) తన శరీరమే అయి ఉన్నారో,

→ ఏది ఆదిత్యుని అంతరమున ఉండి ఆదిత్యుని నియమించు చున్నదో **- అదియే నీ ఆత్మ। అట్టి నీ ఆత్మయే ఈ సర్వమునకు అంతర్యామి। అదియే నీ - నా అమృతమగు అంతరాంతర స్వరూపము.**

---

**10. యో దిక్షు తిష్ఠన్,**
**దిగ్భ్యో అంతరోయం,**
**యం దిశో న విదుః,**
**యస్య దిశః శరీరం**
**యో దిశో అంతరో - యమయతి,**
**ఏష త → ఆత్మా।**
**అన్తర్యామి। అమృతః।**

→ ఏది దిక్కులు యందు అంతటా నిండినదై ఉన్నదో,

→ ఏది అంతరాంతరంగా దిక్కులన్నిటికీ - ఆధారము కూడా అయి ఉన్నదో,

→ తమకు ఆధారమై ఉండి కూడా, ఏది దిక్కులచే గమనించబడటమే లేదో,

→ ఏది దిక్కులను తనయొక్క శరీరముగా కలిగియున్నదో,

→ ఏది దిక్కులను నియమించునదై ఉన్నదో,

అదియే నీయొక్క ఆత్మ। సర్వము తానే అయి, సర్వమునకు వేరైన **అంతరాత్మ।** నీ ఆత్మయే దిక్ స్వరూపమై విరాజిల్లుచున్నది। **అది అమృత స్వరూపము।** (మార్పు చేర్పులచే స్పృజించబడని-మన అఖండ రూపము).

---

**11. యః చంద్ర తారకే తిష్ఠగ్ం**
**చంద్ర తారకాత్ అన్తరో,**
**యం చన్ద్రతారకం న వేద, -**
**యస్య చన్ద్రతారకగ్ం శరీరం**
**యః చన్ద్రతారకం అన్తరో యమయతి,**
**ఏష త ఆత్మా। అన్తర్యామి। అమృతః।**

→ ఏది చంద్రునియందు నక్షత్రములయందు తిష్ఠించినదై ఉన్నదో,

→ ఏది చంద్ర - నక్షత్రములకు వేరుగా ఉండి, చంద్ర నక్షత్రములందు సర్వత్రా వ్యాపించి ఉన్నదో,

→ ఏది చంద్ర - నక్షత్రములచే **"తమకు ఆధారముగా ఉన్నది కదా"** అని ఏమాత్రము తెలియబడటమే లేదో....,

- ఎద్దానికి చంద్రుడు - నక్షత్రాలు...ఇవన్నీ శరీరముగా ఉన్నాయో,

- ఏది చంద్ర - నక్షత్రములను నియమించుచున్నదో -

**అదియే సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపము, సర్వము - అగు మన యొక్క అమృతానంద స్వరూప ఆత్మ।**

**నీవే** ఈ సర్వమునకు **ఆధారమైయున్న, సర్వము అయిఉన్న అంతర్యామి యగు ఆత్మ।** తత్ త్వమ్। సో<sub></sub>ఽహమ్।

---

**12 య ఆకాశే తిష్ఠన్,**
**ఆకాశాత్ అంతరో,**
**యం ఆకాశో న వేద,**
**యస్య ఆకాశః శరీరం,**
**య ఆకాశం అన్తరో యమయతి,-**
**ఏష త → ఆత్మా। అన్తర్యామి। అమృతః।**

→ ఏది ఆకాశమునందు అంతటా తిష్ఠించినదై ఉన్నదో...,

→ ఏది ఆకాశమునకు వేరై ఉండి, ఆకాశమునకు అంతర్యామిగా ఉన్నదో,

→ ఏది ఆకాశముచే గుర్తించబడటము లేదో....,

→ ఎద్దానికి ఆకాశము తన శరీరమే అయి ఉన్నదో...,

→ ఏది ఆకాశమును నియమించునదై ఉన్నదో...,

**అదియే నీ ఆత్మ। అదియే నీవు। అదియే నేను। అదియే అంతరాత్మ। అదియే అంతర్యామి। అది అమృత స్వరూపము।**

13. **యః తమసి తిష్ఠగ్ం, తమసో అన్తరో,**
**యం తమో న వేద ।**
**యస్య తమః శరీరం,**
**యః తమో అంతరో,**
**యమయతి, ఏష త → ఆత్మా-**
**అన్తర్యామి। అమృతః।**

→ ఏది తమస్సు (చీకటి) యందు అంతటా ఏర్పడినదై ఉన్నదో...,
→ ఏది చీకటికి వేరై చీకటికి ఆధారమై, అంతర్యామి అయి ఉన్నదో...,
→ ఏది తమస్సుచే ఏమాత్రము ఎరుగబడుటయే లేదో,
→ ఎద్దానికి చీకటి తన శరీరమే అయు ఉన్నదో,
→ ఏది తమస్సుకు నియమించునదై ఉన్నదో,
..... **అదియే సర్వాంతర్యామి।**
**అదియే నీ ఆత్మ। అమృత స్వరూపముగు సర్వతత్త్వ స్వరూపము।**

---

14. **యః తేజసి తిష్ఠగ్ం,**
**తేజసో అన్తరో**
**అయం తేజో న వేద।**
**యస్య తేజః శరీరం,**
**యః తేజో అన్తరో,**
**యమయతి, ఏష త ఆత్మా-**
**అన్తర్యామి। అమృతః।**
**ఇతి అధిదైవతం। (అథ అధిభూతమ్।)**

→ ఏదైతే తేజస్సునందు తిష్ఠ కలిగినదై ఉన్నదో (seated in the light),
→ ఏది తేజస్సుకు ఆధారమై ఉండి కూడా, తేజస్సు అద్దానిని ఎరుగుటయే లేదో,
→ ఏది తేజస్సుకు అంతరమున ఉండి తేజస్సును నియమించుచున్నదో,
ఎద్దానికి తేజస్సు శరీరమై ఉన్నదో -
**అదియే అమృతస్వరూపము.** అదియే తేజస్సును ప్రసాదించునది కాబట్టి **అధిదైవతము।** తేజస్సు అద్దాని శక్తి తేజస్సు అద్దాని శరీరము। అదియే నీ ఆత్మ। నీ - **నా వాస్తవ స్వరూపము అదియే।**

---

### అథ అధిభూతమ్

15 **యః సర్వేషు భూతేషు తిష్ఠన్,**
**సర్వేభ్యో భూతేభ్యో అన్తరోయగ్ం**
**సర్వాణి భూతాని న విదుః,**
**యస్య సర్వాణి భూతాని శరీరం,**
**యః సర్వాణి భూతాని**
**అన్తరో యమయతి,**
**ఏష త → ఆత్మా। అన్తర్యామి। అమృత। -**
**ఇత్యధిభూతం।** (అథ అధ్యాత్మం।)।

### అథ అధి భూతమ్

→ ఏదైతే సర్వభూతజాలములందు సర్వదా వేంచేసి (ఆభరణములో బంగారమువలె, కుండలో మట్టివలె) ఉన్నదో,
→ (14 లోకాలలోని) సర్వ జీవులకు అంతరమై, ఏకమై, అఖండమై ఉన్నదో... (సర్వభూతాంతరాత్మా), **భౌతాత్మికమైన సాకారమంతా 'తానే'-అయి ఉన్నదో,**
→ ఎద్దాని అఖండ-అప్రమేయ నిత్యత్వ-సత్యత్వములను ఈ భూతజాలమంతా...**"ఇది కదా నా సహజరూపము"**....అని గమనించటము లేదో...,
→ సర్వభూతములకు (జీవులకు)- ఏదైతే "అంతరంగము - అంతరాత్మ" అయి ఉన్నదో,
→ ఏది ప్రతి ఒక్క జీవుని మార్పుచేర్పులు లేని స్వస్వరూపమే అయి ఉన్నదో,
**అదియే అంతరాత్మ। అఖండాత్మ। పరబ్రహ్మము। అధిభూతము, అధ్యాత్మము కూడా ఆ ఆత్మయే।**

---

### అథ అధ్యాత్మమ్

16 **యః ప్రాణే తిష్ఠన్,**
**ప్రాణాత్ అన్తరో,**
**యం ప్రాణో న వేద।**
**యస్య ప్రాణః శరీరం,**
**యః ప్రాణం అన్తరో,**
**యమయతి ఏష, త → ఆత్మా-**
**అన్తర్యామి। అమృతః॥**

### అథ అధ్యాత్మమ్

- ఏది ప్రాణమునందు ప్రతిష్ఠితమై ఉన్నదో,
→ ప్రాణమునకు అన్తరముగా, ఆధారమై ఉన్నదో,
→ ఏది ప్రాణమునకు ఆధారమై ఉండి ఉంటున్నప్పటికీ, ప్రాణము అద్దానిని తెలుసుకోవటమే లేదో.,
- ఏది విశ్వప్రాణమంతా తన శరీరముగా కలిగి ఉన్నదో,
- ఏది ప్రాణముగా కూడా అయి ఉంటోందో, ప్రాణమునకే ప్రాణమో, **అదియే ఆత్మ।** అట్టి మనందరి ఆత్మ **అమృతము।** ప్రాణమునకు **అంతర్యామి నీ ఆత్మయే!** (మృత ధర్మము లేనిది = అమృతము).

**17 యో వాచి తిష్ఠన్, వాచో అన్తరో,**
**యం వాక్ న వేద।**
**యస్య, వాక్ శరీరం,**
**యో వాచం అన్తరో, యమయతి,**
**ఏష త ఆత్మా అన్తర్యామి, అమృతః॥**

→ ఏది వాక్కునందు ఉనికి కలిగి ఉన్నదో సు-తిష్ఠితమో,

→ ఏది వాక్కును తన శరీరముగా కలిగి ఉన్నదో....,

→ ఏది వాక్కును నియమించుచున్నదై అంతరమున ఉన్నదో,

→ వాక్కు తనకు ఆధారమై ఉన్నట్టి దేనిని ఎరుగుటయేలేదో, అదియే **ఆత్మ।** అదియే అమృత స్వరూపమగు **అంతర్యామి।**

---

**18 యః చక్షుపి తిష్ఠగ్ం,**
**చక్షుషో అన్తరో,**
**యం చక్షుః న వేద।**
**యస్య చక్షుః శరీరం,**
**యః చక్షుః అన్తరో యమయతి,**
**ఏష త → ఆత్మా అంతర్యామి। అమృతః॥**

→ ఏది నేత్రములలో ఉన్నదో,

- నేత్రముల అంతరముగా 'చూపు' అనే తేజో విలాసరూపమో,

- తనయందే అంతరమున ఉన్నట్టి ఎద్దానిని ఈ చక్షువులు (కనులు) చూడటము లేదో, తెలుసుకోవటమూ లేదో,

- ఏది చక్షువులకు అంతరాంతరమున ఉండి చక్షువులను నియమించుకొనుచున్నదో...

అదియే సర్వతత్త్వ స్వరూపము, సర్వాంతర్యామి అగు అమృతరూప ఆత్మ।

---

**19 యః శ్రోత్రే తిష్ఠన్, శ్రోత్రాత్ అన్తరో,**
**యగ్ం శ్రోత్రం న వేద।**
**యస్య శ్రోత్రగ్ం శరీరం,**
**యః శ్రోత్రం అన్తరో యమయతి,**
**ఏష త → ఆత్మా। అన్తర్యామి। అమృతః।**

- ఏదైతే చెవులయందు, చెవులకు అభ్యంతరముగానూ కూడా ఉన్నదో...

- ఏది చెవులకు తెలియబడుటలేదో, వినిపించుటలేదో,

- ఏది ఈ చెవులను (శ్రోతమును, వినికిడిని) తన శరీరముగా కలిగి ఉన్నదో...

- ఏది చెవులను నియమించుచూ, శ్రోత్రేంద్రియమునకు, వినబడు సమస్తమునకు సొంతదారు అయిఉన్నదో...,

**అదియే ఆత్మ। అదియే అంతర్యామి। అది అమృత స్వరూపము।**

---

**20 యో మనసి తిష్ఠన్,**
**మనసో అన్తరో,**
**యం మనో న వేద,**
**యస్య మనః శరీరం,**
**యో మనో అన్తరో**
**యమయతి,**
**ఏష త → ఆత్మా। అన్తర్యామి। అమృతః।**

- ఏది మనస్సునందు ప్రతిష్ఠితమై యున్నదో...,

- ఏది మనస్సుకు అంతరమై మనస్సుకు ఆధారముగా కూడా అయి - ఉన్నదో...,

- మనస్సు తనయొక్క ఆధారభూతము, జననస్థానము అగు అట్టి ఆత్మ గురించి ఎరుగుటయే లేదో...,

- ఈ 'మనస్సు' అనబడునదంతా దేనికి శరీరమాత్రమైయున్నదో,

- ఏది మనస్సుకు అంతరముగా ఉండి మనస్సును నియమించునదై ఉన్నదో,

...ఈ మనస్సు స్వతఃగా ఏది అయిఉన్నదో - అదియే **అమృతస్వరూపము.**

- సర్వాంతర్యామి అగు అదియే ఆత్మ। పరతత్త్వస్వరూపాత్మ।

---

**21 యః త్వచి తిష్ఠగ్ం,**
**త్వచో అన్తరో,**
**యం త్వక్ న వేద।**
**యస్య త్వక్ శరీరం,**
**యస్తు వచమ్ అన్తరో యమయతి,**
**ఏష త ఆత్మా। అన్తర్యామి। అమృతః॥**

ఏది త్వక్ (స్పర్శ) ఇంద్రియము యొక్క లోపల బయట కూడా స్పర్శరూపము ధరించి ఉన్నదో,

- స్పర్శకు విషయములుగా కూడా ప్రతిష్ఠితమై ఉన్నదో,

- ఎద్దానిని తన వాస్తవ స్వరూపముగా కలిగి ఉన్నప్పటికీ, త్వక్ ఇంద్రియము (చర్మము) అద్దానిని ఎరుగుటయే లేదో,

-ఏది త్వక్‌కు అంతర్యామి అయి ఉండి, త్వక్ ఇంద్రియమును నియమించుచున్నదో...

స్పర్శకే పురుషకారుడగు అట్టి ఆతడే ఆత్మ। ఆతడే అంతర్యామి। ఆతడే నీవు। నీవే ఆ ఆత్మవు।

సమస్తము ఆత్మకు **అనన్యము.** ఆత్మ **అద్వితీయము.**

| | |
|---|---|
| **22 యో విజ్ఞానే తిష్ఠన్,<br>విజ్ఞానాత్ అన్తరో,<br>యం విజ్ఞానం న వేద।<br>యస్య విజ్ఞానగ్ం శరీరం,<br>యో విజ్ఞానం అన్తరో,<br>యమయతి ఏష త → ఆత్మా-<br>అంతర్యామి। అమృతః॥** | - ఏది విజ్ఞానము (బుద్ధి - విచక్షణ) రూపమున ప్రతిష్ఠితమైయున్నదో...,<br>- ఏది బుద్ధికి ఆధారమై అంతరమున వేంచేసినదై ఉన్నదో...,<br>- ఎద్దానిని బుద్ధి తన సహజరూపముగా కలిగి ఉండి కూడా, అద్దానిని ఏమాత్రము ఎరుగుచుండుటయే లేదో,<br>- ఎద్దానికి ఈ 'విజ్ఞానము' అనునది తన శరీరమే అయి ఉన్నదో,<br>- ఏది విజ్ఞానమునకు అంతరమునుండి నియమించుచున్నదై ఉన్నదో...,<br>**- అదియే అమృతమగు ఆత్మ। ఆత్మయే సర్వమునకు అంతర్యామి।** |
| **23 యో రేతసి తిష్ఠన్, రేతసో అన్తరో,<br>అయగ్ం, రేతో న వేద,<br>యస్య రేతః శరీరం<br>యో రేతో అన్తరో యమయతి<br>ఏష త → ఆత్మా। అన్తర్యామి। అమృతో।** | - ఏది రేతస్సునందు (వీర్యమునందు, వెలుగు నందు) స్థానము పొంది తిష్ఠితమైయున్నదో...,<br>- రేతస్సు (Inclination)కు అంతరంగా ఉండి కూడా ఆ రేతస్సు ఎరుగుటయే లేదో,<br>- ఏది రతేస్సును నియమించుచున్నదై ఉన్నదో...,<br>- రేతస్సుకు అంతర్ - బహిర్ రూపమైయున్నదో - అదియే **అమృతము అగు సర్వాంతర్యామి। అదియే నీ ఆత్మ।** |
| **అదృష్టో ద్రష్టా। అశ్రుతః శ్రోతా।<br>అమతో మన్తా। అవిజ్ఞాతో - విజ్ఞాతా।<br>న అన్యో, అతో అస్తి ద్రష్టా।<br>న అన్యో అతో అస్తి శ్రోతా।<br>న అన్యో అతో అస్తి మన్తా।<br>న అన్యో అతో అస్తి విజ్ఞాతా॥<br>ఏష ఆత్మా। అన్తర్యామి। అమృతో।<br>అతో అన్యత్ ఆర్తం।** | అట్టి అంతర్యామి స్వరూపమైనట్టి ఆత్మ - భౌతికమైన దృష్టికి దృశ్యముగా కనబడనిదై, కేవలము చూచుచూ ఉన్నట్టి 'దృక్' స్వరూపముగా వెలుగొందుచున్నది. చెవికి వినబడనిదై **వినుచున్న రూపమే తానై ఉన్నది.** ఆలోచనకు విషయము కానిదై, ఆలోచన **చేయుచున్నదై ఉన్నది.** బుద్ధికి విషయము కానిదై, **బుద్ధి తనదైనట్టిదై ఉన్నది.**<br>అట్టి అంతర్యామియగు ఆత్మకు వేరుగా ద్రష్ట లేడు. అద్దానిక వేరుగా శ్రోతయూలేడు. ఆలోచించు వాడు లేడు. విచారణ చేయువాడూ లేడు (విజ్ఞాత లేడు)!<br>అవన్నీ ఎవ్వరై ఉన్నారో...ఆతడే ఆత్మ। అమృత స్వరూపుడు। అట్టి అంతర్యామికి వేరుగా - చూచువాడు లేడు; వినువాడు లేడు; సంకల్పించువాడు లేడు; విచక్షించువాడు లేడు.<br>**ఎవ్వరికి వేరుగా ఎక్కడా ఏదీ లేదో అదియే ఆత్మ! అదియే అమృతము। అదియే అఖండము।**<br>(- నవలా రచయితకు వేరైనదంటూ నవలలో ఎక్కడ ఏముంటుంది?<br>- స్వప్నద్రష్టకు వేరుగా స్వప్నంలో ఏ ఒక్కటైనా ఉంటుందా?) |
| **తతో హి ఉద్దాలక ఆరుణిః<br>ఉపరరామ॥** | **ఈ వాక్యములను విన్న అరుణి కుమారుడు ఉద్దాలకుడు తృప్తి పొంది మౌనం వహించారు.** |

***ఇతి బృహదారణ్యకోపనిషత్ - పంచమ అధ్యాయస్య సప్తమం బ్రాహ్మణం। "అంతర్యామి బ్రాహ్మణం"।***

***ఇతి బృహదారణ్యకోపనిషత్ - పంచమ అధ్యాయస్య సప్తమం బ్రాహ్మణం। "అంతర్యామి బ్రాహ్మణం"।***

# పఞ్చమాధ్యాయః - అష్టమం బ్రాహ్మణమ్

## అక్షర బ్రాహ్మణము

1 అథ హ వాచక్నః ఉవాచ :
"బ్రాహ్మణా భగవన్తో! హన్త! -
అహం ఇమం ద్వౌ ప్రశ్నౌ ప్రక్ష్యామి।
తౌ చేత్ ఇమే వక్ష్యతి,
న వై జాతు యుష్మాకం
ఇమం కశ్చిత్ బ్రహ్మోద్యం-జేతేతి।

అప్పుడు వచల్కుని కుమార్తెయగు గార్గి లేచి నిలుచున్నారు.

గార్గి : భగవత్ స్వరూపులు, పూజనీయులు అగు ఓ బ్రాహ్మణులారా! సభికులారా! ఇప్పుడు మీరు మరొక్కసారి అనుజ్ఞ ఇస్తే ఈ మన యాజ్ఞవల్క్యులవారిని రెండు ప్రశ్నలు అడుగతలచుకున్నాను. ఆ నా రెండు ప్రశ్నలకు వీరు సరి అయి సమాధానము ఇస్తే, - ఇకప్పుడు బ్రహ్మము సంబంధమై ఈయనను జయించువారు లేరని మనము అనుకోవచ్చునని నా అభిప్రాయము.

'పృచ్ఛ గార్గీ!' - ఇతి।

అప్పుడు అక్కడి బ్రాహ్మణులు "అమ్మా! గార్గీ! అట్లాగే లేవండి! అడగండి!".... అని సాదరముగా పలికారు.

2. సా హోవాచ : (గార్గ్యోవాచ) :
"అహం వై త్వా, యాజ్ఞవల్క్య! యథా కాశ్యో వా
వైదేహో వోగ్ర పుత్ర ఉజ్జ్యం ధనుః
అధిజ్యం కృత్వా ద్వౌ బాణవన్తౌ, సపత్నాతి వ్యాధినౌ,
హస్తే కృత్వోపా ఉత్తిష్ఠేత్,
ఏవమేవ అహం త్వాం ద్వాభ్యాం
ప్రశ్నాభ్యాం ఉపోదస్థామ్
తౌ మే బ్రూహీతి।
యాజ్ఞవల్క్యుడు : "పృచ్ఛ గార్గీ!" - ఇతి।

గార్గి : ఓ యాజ్ఞవల్క్య మహాశయా! వీరులైనటువంటి (Heroic persons) కాశీరాజుగాని, మన ఈ విదేహ చక్రవర్తిగాని రెండు బాణములు సంధించి విడచిపెట్టినప్పుడు అవి ఏ విధంగా శత్రువులకు గ్రుచ్చుకుంటాయో, ఆ తీరుగా మిమ్ములను ఇదిగో...., **ఈ రెండు ప్రశ్నలు సంధిస్తున్నాను.** దయతో జాగరూకులై, సంసిద్ధులై సమాధానము చెప్పెదరుగాక.

యాజ్ఞవల్క్యుడు : కేవలానంద ఆత్మ స్వరూపిణీ! గార్గీ! మీరు అడగదలచిన రెండు ప్రశ్నలు నిరాఘాతంగా అడుగవచ్చును. నేను సిద్ధముగా ఉన్నాను. ఓ పవిత్ర హృదయులగు సభికులారా! తత్త్వదర్శులారా! ఈ గార్గి ఇక తన ప్రశ్నలేమిటో సంధించవచ్చును.

**(గార్గి :** మహాత్మా! నా ప్రశ్నలు వినండి!)

3 సా హ ఉవాచ (సా హైూవాచ) : (గార్గ్యోవాచ) :
యత్ ఊర్ధ్వం, యాజ్ఞవల్క్య! దివో
యత్ అవాక్ పృథివ్యా,
యత్ అన్తరా ద్యావా - పృథివీ,
ఇమే యత్ భూతం చ భవచ్చ, భవిష్యత్ చ యత్ ఆచక్షతే
కస్మిగ్ం తత్ ఓతం చ - ప్రోతం చ? ఇతి।

గార్గి : (1) ఆకాశమునకు (ద్యులోకమునకు) **ఆవలగాను,** ఈ సమస్త భౌతిక సృష్టిరూపమగు భూమికి **క్రిందగాను** ఉన్న వస్తువేది?

(2) భూతకాలంలో, వర్తమానకాలంలో భవిష్యత్ కాలంలో ఉన్నట్టి ఈ సమస్తము ఎద్దానియందు **ఓత - ప్రోతమైయున్నది?**

ఈ రెండు విషయాలు స్పష్టంగా నిస్సందేహముగా వివరించండి!

4. స హో ఉవాచ : (యాజ్ఞవల్క్యోవాచ) :
యత్ ఊర్ధ్వం గార్గి!
దివో యదవాక్ పృథివ్యా,
యత్ అన్తరా, ద్యావా పృథివీ ఇమే,
యత్ భూతం చ,
భవచ్చ, భవిష్యచ్చేత్ చ ఆచక్షతే 'ఆకాశే'
-తత్ "ఓతం చ ప్రోతం చ" - ఇతి॥

యాజ్ఞవల్క్యుడు : ఓ గార్గీ! ఆకాశమునకు ఆవల, భూమికి క్రిందుగా, మధ్యయందు, ఇతఃపూర్వము, ఇప్పుడు, ఇకముందు కూడా కనబడుచున్న జగత్తు-అంతాకూడా **'అవ్యాకృత ఆకాశము'**. అందులోనే, ఇదంతా **ఓతప్రోతమై** ఉన్నది.

(వ్యాకృతము = ఒక చోట నుండి ఇంకొకచోటికి విస్తరించి ఉన్నట్టిది. అవ్యాకృతము = అంతటా తానై నిండి ఉన్నట్టిది. ఓత-ప్రోతమ్ = మట్టి బొమ్మయందు అంతటా మట్టిచే నిండి ఉన్నట్టి తీరుగా। మంచుగడ్డ యందు అంతటా జలమే స్వభావతః ఉన్నట్లు। వస్త్రమునందు నిలువుగాను - అడ్డముగాను తుది నుండి వచ్చిన దారమే ఆక్రమించి ఓతప్రోతమై ఉన్నట్లు!).

| | |
|---|---|
| **5.** సా హోవాచ : (గార్గ్యావాచ):<br>నమస్తే అస్తు యాజ్ఞవల్క్య!<br>యో మ ఏతం వ్యవోచ<br>ఉపరస్మై ధారయస్వ। ఇతి। | గార్గి : మహాత్మా! యాజ్ఞవల్క్యా! మీ సమాధానము నాకు నచ్చినది సంతోషము కలిగిస్తోంది. అందుకు మీకు నమస్కరిస్తున్నాను.<br>స్వామీ! మరొక ప్రశ్న అడగటానిక అనుగ్రహించి అనుజ్ఞ ఇవ్వండి! |
| యాజ్ఞవల్క్యుడు : "పృచ్ఛ, గార్గీ!" ఇతి। | **యాజ్ఞవల్క్యుడు :** ఓ గార్గీ! తప్పక అడగండి. నేను సంసిద్ధుడనై ఉన్నాను. |
| **6.** సా హోవాచ : (గార్గ్యావాచ) :<br>యత్ ఊర్ధ్వం యాజ్ఞవల్క్య! దివో,<br>యత్ అవాక్ పృథివ్యా,<br>యత్ అన్తరా(త్) ద్యావా పృథివీ ఇమే,<br>యత్ భూతం చ, భవచ్చ<br>భవిష్యత్ చ, ఏతి ఆచక్షతే,<br>కస్మిగ్ం తత ఓతం చ, ప్రోతం చ? ఇతి॥ | **గార్గి :**<br>- ద్యులోకము కంటే (ఆకాశముకంటే)<br>- ఆవల...<br>- భూమికంటే (క్రిందుగా....)<br>- బ్రహ్మాండ కపాలము యొక్క మధ్యగాను<br>- భూత - వర్తమాన - భవిష్యత్తులలోను....<br>ఏదైతే సూత్రము (పూలదండలో దారము వంటిది) అని చెప్పుచున్నారో....<br>అట్టి ఆ **"సూత్రము"** → దేనియందు **"ఓతప్రోతము"** అయి ఉన్నది?<br>పూలదండలో దారము పూలన్నిట్టినీ ఒక వరుసలో నిలిపి ఉంచునట్లు **ఏ సూత్రము (దారము)చే ఈలోకములు, లోకులు, జీవులు ఒకే దండవలె గ్రుచ్చబడి ఉన్నారు?** |
| **7.** స హ ఉవాచ : (యాజ్ఞవల్క్యోవాచ) :<br>యత్ ఊర్ధ్వం, గార్గి!<br>దివో, యత్ అవాక్ పృథివ్యా,<br>యత్ అన్తరా ద్యావా పృథివీ-ఇమే,<br>యత్ భూతం చ,<br>భవచ్చ, భవిష్యత్ చ,<br>ఏత్యాచక్షతే ఆకాశ ఏవ।<br>తత్ ఓతం చ,<br>ప్రోతం చ, ఇతి। | యాజ్ఞవల్క్యుడు : బ్రహ్మాండమునకు ఆవల, క్రింద భాగమునందు, మధ్యభాగమునందు, త్రికాలములందు ఏది సూత్రరూపముగా ఉన్నదో అట్టి సమస్తమూ కూడా **అవ్యాకృత ఆకాశమునందు ఈడుగు పేకల ఆకారమువలే కల్పించబడుతోంది.** (పేకలతో ఒక ఆకారము ఇల్లువంటిది - నిర్మించబడినప్పటికీ అక్కడ 'ఇల్లు' అనునదేమీ ఉండదు కదా!)<br>ఈ విధంగా ఇదంతా కూడా అవ్యాకృత ఆకాశమునందు ఓత - ప్రోతమై ఉన్నది.<br>**(ఉదా:** ధాన్యపు రాశి ఆకారము ధాన్యపు గింజలచే నిర్మించబడి కనబడురీతిగా). |
| గార్గి : కస్మిన్ ను ఖలు ఆకాశ-ఓతశ్చ ప్రోతశ్చ ఇతి? | గార్గి : అవ్యాకృత ఆకాశము మాటలతో చెప్పజాలని అవాచ్యము కదా! అవ్యాకృత ఆకాశము దేనియందు పడుగు పేకల (Form formed by play cards) వలె కల్పించబడి ఉంటోంది? |
| **8.** స హ ఉవాచ (యాజ్ఞవల్క్యోవాచ) :<br>ఏతత్ వై తత్ అక్షరం, గార్గి!<br>బ్రాహ్మణా అభివదన్తి -<br>అస్థూలం। అనణ్వ।<br>అహ్రస్వం। అదీర్ఘం।<br>అలోహితం। అస్నేహం।<br>అచ్ఛాయం। అతమో। | యాజ్ఞవల్క్యుడు : అవ్యాకృతాకాశము ఎందులో ఓత -ప్రోతమై ఉన్నదో అది **'అక్షరపరబ్రహ్మము'** అని బ్రహ్మజ్ఞులు పిలచుచున్నారు అనగా **ఇదంతా అక్షరమునందు (నాశనము లేని దానియందు) ఓత-ప్రోతమై యున్నది.** అట్టి అక్షర పరబ్రహ్మము...<br>→ **అస్థూలమ్** = స్థూలము కాదు.<br>→ **అనణ్వమ్** = అణువు వలె -సూక్ష్మము కాదు.<br>→ **అహ్రస్వమ్** = పొట్టిది కాదు.<br>→ **అదీర్ఘం** = పొడవైనది కాదు. |

| | | |
|---|---|---|
| | అవాయుః। అనాకాశం। అసంగం।<br>అరసం। అగన్ధం।<br>అచక్షుష్కం। అశ్రోత్రమ్। అవాక్। అమనో।<br>అతేజస్కం। అ ప్రాణం।<br>అముఖం। అమాత్రమ్।<br>అనన్తరం। అబాహ్యం।<br>న తత్ అశ్నాతి కించన। న తత్ అశ్నాతి కశ్చన।। | → **అలోహితమ్** = లోహ సంబంధమైనది, సాకారమైనది కాదు.<br>→ **అస్నేహమ్** = దేనితోను స్నేహ సంబంధము కలిగి ఉన్నది కాదు.<br>→ **అచ్ఛాయం** = 'నీడ' అనునది లేనట్టిది.<br>మనస్సు కాదు. భూమి - అగ్నిజాలము కాదు. వాయువు కాదు. ఆకాశము కాదు. దేనితోను సంగము కలిగినది కాదు. రసము - గన్ధము - చూడబడేది - వినబడేది - మాట్లాడబడేది - ఆలోచించబడేది - తేజోరూపము - ప్రాణరూపము- కాదు। నోరు లేనిది। పరిణామము అనునది లేనిది (అమాత్రమ్)। అంతరమైనది కాదు। బాహ్యము కాదు। అద్దానికి బాహ్య - అభ్యంతరములు లేవు। అంతటా ఉన్న దానికి ఏది బాహ్యము? ఏది అంతరము? అది ఎద్దానిని భుజించదు. అద్దానిని భుజించునదంటూ ఏదీ లేదు. |
| **9.** | ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే, గార్గి!<br>సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః।<br>ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే, గార్గి!<br>ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః।<br>ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే,<br>గార్గి! నిమేషా ముహూర్తా అహోరాత్రాణి,<br>అర్థమాసా, మాసా, ఋతవః సంవత్సరా ఇతి,<br>విధృతాః తిష్ఠన్తి। | ఓ గార్గీ! అట్టి అక్షరమగు ఆత్మయొక్క సంకల్పము - ఆజ్ఞ చేతనే సూర్య - చంద్రులు ఆకాశములో సంచారములు చేయుచున్నారు. అద్దానినుండి భూమి - అంతరిక్షములు శక్తి సంపన్నములు అగుచున్నాయి.<br>అక్షరమగు అద్దాని ప్రశాసనము (ఆజ్ఞ) చేతనే కాలము నియమించ బడినదై- నిమేషములు, ముహూర్తములు, రాత్రింబవళ్లు, పక్షములు '12' నెలలు, '6' ఋతువులు, సంవత్సరముల శతాబ్దములు, యుగములు, మహాయుగములు - ఇత్యాది రూపముగా ప్రదర్శితము అగుచున్నది. |
| | ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే,<br>గార్గి! ప్రాచ్యో నద్యః<br>స్యన్దన్తే శ్వేతేభ్యః,<br>పర్వతేభ్యః, ప్రతీచ్యో,<br>అన్యా యాం యాం చ దిశం<br>అన్య ఏతస్య వా। | అట్టి అక్షరమగు ఆత్మయొక్క సంకల్ప - ఆనుజ్ఞానుసారమే (లేక) ప్రశాసమును అనుసరించియే గంగ మొదలైన నదులు ప్రాఙ్ముఖము (తూర్పు వైపు) గాను, మరికొన్ని నదులు (సింధునది మొదలైనవి) పడమరముఖముగాను హిమవత్ ప్రదేశమునుండి ప్రారంభమై ప్రవహిస్తున్నాయి. నదుల దిశలు, ఉపనదుల దిశలు, సముద్రములో కలియుటము, ఋతుపవనాలు, వర్షపాతములు, మండుటెండలు, భూసారములు మొదలైనవన్నీ కూడా ఆత్మయొక్క ఆజ్ఞచేతనే నిర్వర్తించబడినవి అగుచున్నాయి. దిక్కులు, ఆ దిక్కులలో ప్రకృతి విశేషాలు...అంతా ఆత్మయొక్క సంకల్ప - వికల్పముల విశేషాలే!<br>అంతేకాదమ్మా గార్గీ! |
| | అక్షరస్య ప్రశాసనే,<br>గార్గి! దదతో మనుష్యాః<br>ప్రశగ్ంం సన్తి యజమానం<br>దేవా దర్వీం పితరో అన్వాయత్తాః।। | అట్టి అక్షరముయొక్క ప్రశాసనము చేతనే మానవుల - జంతువుల - రాక్షసుల-దేవతల వివిధ స్వభావాలు, పితృదేవతల తర్పణములు, పితృదేవతలను జేరి సంతానప్రాప్తులుగా వర్షించటము, దర్వీహోమములు ద్వారా యజ్ఞములు, దేవతల వర్షింపజేయు మానవ శ్రేయస్సులు - ఇవన్నీ ఫల - ప్రతిఫలములుగా అగుచున్నాయి! |
| **10.** | యో వా ఏతత్ అక్షరం గార్గి! అవిదిత్వా,<br>అస్మిన్ లోకే జుహోతి, యజతే, తపః తప్యతే,<br>బహూని వర్ష సహస్రాణి అన్తవత్<br>ఏవ అస్య తత్ భవతి।<br>యో వా ఏతత్ అక్షరం గార్గి!<br>అవిదిత్వా, అస్మాత్ లోకాత్ ప్రైతి। | ఓ గార్గీ! ఎవ్వడు అట్టి అక్షర పరబ్రహ్మమును ఎరిగి లోకములో హోమము చేయుచున్నాడో, యాగము చేయుచున్నాడో, తపస్సుచేయుచున్నాడో.... **అట్టివాడు ఆ పరబ్రహ్మతత్త్వస్వరూపమే తానై ప్రకాశించుచున్నాడు.** అది ఎరుగక అనేక సంవత్సరములు తపస్సు, యజ్ఞము, యాగము - క్రతువులు నిర్వర్తించువాడు పొందే ఫలప్రదములన్నీ కాలము చేతనే వచ్చి, కాలము చేతనే నశించినవగుచున్నాయి. అనగా, -<br>ఎవ్వడు ఆ బ్రహ్మమును ఎరుగకుండా యజ్ఞ - యాగ - క్రతు - తపస్సులను నిర్వర్తిస్తాడో, అట్టివాడు **లోకసంబంధము, నాశన - అనివార్యము, కాలపరిమితము అగు ఫలములను మాత్రమే పొందుచున్నాడు.** |

| | | |
|---|---|---|
| | స కృపణో అథ య ఏతత్ అక్షరం, గార్గి!<br>విదిత్వా, అస్మాత్ లోకాత్ ప్రైతి, స బ్రాహ్మణః॥ | ఓ గార్గీ! అందుచేత అక్షర బ్రహ్మమును ఎరుగు మహదాశయము కలిగి ఉండియే, - మనందరిచేత కూడా- వేదసంబంధమైన, లోకసంబంధమైన స్వధర్మమునకు సంబంధించిన కార్యక్రమములు నిర్వర్తించబడునుగాక! లేదా, కర్మల ప్రయోజనములు కాలముచే జనించి, కాలముచేతనే క్షీణించి నశించిపోగలవు!<br>**బ్రహ్మమును ఎరుగుచూ జీవితము సాగించువాడు, బ్రహ్మమును సర్వదా సర్వత్రా దర్శించువాడు.... ఆతడే బ్రాహ్మణుడు।**<br>బ్రహ్మమును ఎరుగుటచేతనే, బ్రహ్మముగా ఈ సర్వము దర్శించుటచేతనే ఈ సభలో అనేకులు '**బ్రాహ్మణులు**' అని కీర్తింపబడుచున్నారు! |
| **11.** | తద్వా ఏతత్ అక్షరం, గార్గి!<br>అదృష్టం ద్రష్టృ।<br>అశ్రుతగ్ం శ్రోత్రమ్। అమతం మన్తృ।<br>అవిజ్ఞాతం విజ్ఞాతృ। | ఓ గార్గీ! ఆ అక్షర బ్రహ్మమును ఎవ్వరు కంటితో చూడలేరు. కానీ అయ్యది **అందరినీచూచుచునే ఉన్నది.** అద్దానిని ఎవ్వరూ వినజాలరు. **కానీ అందరి శబ్దములను అయ్యది వినుచూనే ఉన్నది.**<br>అది ఎవ్వరూ మనస్సుతో పొందలేరు. **కానీ అందరి మనస్సులను అది పొందుచూనే ఉన్నది.**<br>అందరూ అద్దానిని తెలుసుకొనలేరు. **కానీ అందరినీ ఆ అక్షర పరబ్రహ్మము ఎరుగుచూనే ఉన్నది.** |
| | న అన్యత్ అతో అస్తి-'ద్రష్టృ'।<br>న అన్యత్ అతో అస్తి - 'శ్రోతృ'।<br>న అన్యత్ అతో అస్తి - 'మన్తృ'।<br>న అన్యత్ అతో అస్తి 'విజ్ఞాతృ'।<br>ఏతస్మిన్ను ఖలు అక్షరే, గార్గి!<br>ఆకాశ ఓతః చ, ప్రోతః చ ఇతి॥<br>(ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ - ఇతి)॥ | అద్దానిని చూచువారు, వినువారు, ఆలోచించువారు, తెలుసుకొనువారు అద్దానికి వేరుగా లేరు. **ఎందుకంటే ఆత్మ సర్వదా అనన్యము, అద్వితీయము కూడా।**<br>అద్దానికి వేరై ఏదీ అనుభవమగుట లేదు. **అనుభవముగా పొందబడేది కూడా అద్దానికి ఏమాత్రము వేరుకాదు!** ఆ అక్షరబ్రహ్మము చూచినదే చూడబడుచున్నది. అయ్యది వినునదే వినబడుచున్నది. ఆలోచించినదే ఆలోచించబడుచున్నది. ఆ అక్షరము తెలుసుకొనుచున్నదే తెలియ బడుచున్నదగుచున్నది. అద్దానికి వేరుగా చూచువారు లేరు, వినువారు లేరు, ఆలోచించువారు లేరు, తెలుసుకొనువారు లేరు.<br>ఓ గార్గీ! ఆ అక్షరపరబ్రహ్మమునందే ఆకాశము మొదలుకొని సర్వము ఓత-ప్రోతమై (బంగారమే ఆభరణములవలె, జలమే తరంగములవలె) చెన్నొందుచున్నది. |
| **12.** | <u>సా హో ఉవాచ :</u> <u>(గార్గ్యోవాచ) :</u><br>బ్రాహ్మణా భగవన్తః!<br>తదేవ బహు మన్యేధ్వం<br>యత్ అస్మాన్ నమస్కారేణ ముచ్యేధ్వం। | **గార్గీ :** ఓ పూజ్యులగు సభికులారా! భగవత్ స్వరూపులగు బ్రాహ్మణులారా!<br>ఈ యాజ్ఞవల్క్య మహానుభావుని సమాధానము ఆమూలాగ్రము విన్నాము కదా! వారి సమాధానము నాకు ఎంతో తృప్తిని, ఆనందమును కలుగజేస్తోంది. **స్వస్వరూప ఔన్నత్యమును గుర్తుచేస్తోంది।** వారికి హృదయపూర్వకముగా నమస్కరించుచున్నాను. |
| | న వై జాతు యుష్మాకమ్<br>ఇమం కశ్చిత్<br>బ్రహ్మోద్యం జేతేతి।<br>తతో హ వాచక్నః ఉపరరామ॥<br>(వాచక్నవ్యుపరరామ)।<br><u>ఇతి బృహదారణ్యకోపనిషత్ - పంచమోధ్యాయః</u><br><u>అష్టమం - అక్షర బ్రాహ్మణః॥</u> | వారితో వాదనకంటే, అట్టి వాదనలనుండి మనము విరమించటమే మంచిదని నేను అనుకుంటున్నాను. మనము బ్రహ్మవిద్య యందు వారిని కాదనలేమని, జయింపలేమని నేను తలచుచున్నాను. యాజ్ఞవల్క్యుల వారికి, ఈ సభలోని బ్రహ్మజ్ఞులకు, సద్గురువులకు హృదయపూర్వక నమస్కారము!<br>ఇట్లా పలికి వచక్నుని పుత్రికయగు గార్గి శాంతము ధరించి మౌనము వహించినవారయ్యారు.<br>**ఇతి బృహదారణ్యకోపనిషత్ - పంచమో అధ్యాయః - అష్టమం బ్రాహ్మణమ్॥** |

# పఞ్చమాధ్యాయః - నవమం బ్రాహ్మణమ్

## యాజ్ఞవల్క్య - శాకల్య సంవాదము

| | |
|---|---|
| 1 అథహైనం విదగ్ధః<br>శాకల్యః పప్రచ్ఛ: | 'విదగ్ధుడు' అను శకల్యుని కుమారుడగు శాకల్యుడు<br>(లేచి నిలుచుని) ఈవిధంగా అడుగసాగారు. |
| కతి దేవా? యాజ్ఞవల్క్య! ఇతి? | ఓ యాజ్ఞవల్క్య మహానుభావన్! నమస్కారము. మీరు చెప్పినదంతా ఇంతవరకు వింటూ వస్తున్నాను. సంతోషమే। అయినా కూడా మీముందు కొన్ని ప్రశ్నలు ఉంచదలచుచున్నాను. వేద వాఙ్మయమును అనుసరించి సమాధానం చెప్పండి! **దేవతలు ఎంతమంది?** |
| యాజ్ఞవల్క్యుడు : సహై తయైవ నివిదా ప్రతిపేదే<br>యావంతో వైశ్వ దేవస్య నివిద్య ఉచ్యన్తే। | యాజ్ఞవల్క్యుడు : ఓ శకల్యముని కుమారా! వైదగ్ధా! వినండి! 'వైశ్వదేవ' అనే శాస్త్రమునందు ఎంతమంది దేవతలు వర్ణించబడ్డారో వారందరు దేవతలై ఉన్నారు. వైశ్వదేవ నివిద్య మంత్రములచే ఎంతమంది దేవతలు చెప్పబడుచున్నారో, అది చెప్పుకోవచ్చును.<br>శాకల్యుడు : అట్లాగా? 'నివిద్య' అను మంత్రముచే ఎంతమంది దేవతలుగా చెప్పబడుచున్నారు? అది కూడా చెప్పండి. |
| త్రయశ్చ (3) త్రీ చ శతాత్రయశ్చ (303)<br>త్రీ చ సహస్రేతి (3003) 'ఓం' ఇతి।<br>హోవాచ (శాకల్యోవాచ) :<br>కత్యేవ దేవా యాజ్ఞవల్క్య! ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : త్రయఃత్రిగ్ం శదిత్యోమితి। (33) | యాజ్ఞవల్క్యుడు : '3' '303' అని '3003' అని దేవతల సంఖ్యగా 'నివిద్య' శాస్త్రము చెప్పుచున్నది. మొత్తం 3606. మరల మరొక విభాగముగా '33' అని కూడా వివరించబడ్డారు. |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కత్యేవ (కత ఏవ) దేవా యాజ్ఞవల్క్య! ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు :షట్ ఇతి 'ఓం' ఇతి।। (6) | శాకల్యుడు : ఓ యాజ్ఞవల్క్యా! వారు తిరిగి ఎన్ని భాగములుగా వివరించబడ్డారు?<br>యాజ్ఞవల్క్యుడు : '6' విభాగ దేవతలుగా చెప్పబడ్డారు. |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కత్యేవ దేవా యాజ్ఞవల్క్యా! ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'త్రయ' ఇత్యోమితి (3)। | **శాకల్యుడు** : ఔను. అయితే ఆ ఆరువిభాగ దేవతలు ఏ విధంగా తిరిగి విభజించబడ్డారు?<br>యాజ్ఞవల్క్యుడు : అతి ముఖ్యముగా '3' (మూడు) అని చెప్పబడుచున్నారు. |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కత్యేవ దేవా యాజ్ఞవల్క్యా! ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : ద్వావిత్యోమితి (2)। | శాకల్యుడు : మరి కొంతగా వారు ఎట్లా విభజించబడ్డారు?<br>యాజ్ఞవల్క్యుడు : ('2') ఇద్దరుగా! |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కత్యేవ దేవా యాజ్ఞవల్క్య! ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'అధ్యర్థ' ఇత్యోమితి ($1\frac{1}{2}$)। | శాకల్యుడు : మరికొంత విశేషంగా, దృష్టముగా ఎందరుగా చెప్పబడ్డారు? యాజ్ఞవల్క్యా! చెప్పండి.<br>యాజ్ఞవల్క్యుడు : '$1\frac{1}{2}$' (ఒకటిన్నర) దేవతలుగా చెప్పబడుచున్నారు. |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కత్యేవదేవా యాజ్ఞవల్క్యేతి ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'ఏక' ఇత్యోమితి (1)। | శాకల్యుడు : బాగు బాగు। ఇంకా కూడా ఆ '1 1/2' దేవతలు ఎంతగా నిర్వచించబడ్డారు?<br>యాజ్ఞవల్క్యుడు : ఒక్కటిగా - 'ఓం' అని చెప్పబడ్డారు. |
| హోవాచ : (శాకల్యోవాచ) :<br>కతం ఏతే త్రయశ్చ త్రీచ శతా త్రయశ్చ<br>త్రీ చ సహస్రేతి? (3/303/3003/2/$1\frac{1}{2}$/1)। | శాకల్యుడు : ఔను! చాలా బాగా చెప్పారు. అయితే, ఇప్పుడు చెప్పండి! ఆ '303' / '3003' మొదలైనవి ఏమిటో,.. అవి విశదీకరించండి. |

| | |
|---|---|
| 2 సహ ఉవాచ : (యాజ్ఞవల్క్యోవాచ) :<br>మహిమాన ఏవైషాం ఏతే<br>త్రయః త్రిగ్ంశత్త్వేవ (33) దేవా ఇతి।<br>శాకల్యుడు : కతమే తే త్రయః త్రిగ్ంశత (33) ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : అష్టౌ వసవః ఏకాదశ రుద్రాః (8+11)।<br>ద్వాదశ ఆదిత్యాస్త (8+11+12)।<br>ఏక త్రిశగ్ంశతః - "31"।<br>ఇన్ద్రశ్చైవః ప్రజాపతిశ్చ (2)।<br>త్రయ త్రిశగ్ంశావితి। (మొత్తము - 33)। | యజ్ఞవల్క్యుడు : ఈ "33" దేవతల విభూతులే... ఇంతకుముందు మనము చెప్పుకున్న '303' మరియు '3003' దేవతా ప్రదర్శనములు. పరమార్థంగా (As a fine meaning) → దేవతలు ముప్పది ముగ్గురే (33). **తక్కిన సంఖ్య అంతా వారివారి విభూతి విశేషములు.**<br>శాకల్యుడు : ఆ '33' దేవతలు ఎవ్వరెవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : వినండి!<br>అష్టవసువులు 8<br>ఏకాదశ రుద్రులు 11<br>ద్వాదశ ఆదిత్యులు 12<br>ఇంద్రుడు 1<br>బ్రహ్మ. (ప్రజాపతి) 1<br>మొత్తము 33 దేవతలు |
| 3. శాకల్యుడు : కతమే వసవ ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : అగ్నిశ్చ, పృథివీ చ, వాయుశ్చ,<br>అన్తరిక్షం చ, ఆదిత్యశ్చ,<br>ద్యౌః చ, చన్ద్రమాశ్చ, నక్షత్రాణి చ<br>ఏతే 'వసవః' ఏతేషు హీదం, వసు సర్వగ్ం<br>హితం ఇతి। తస్మాత్ - "వసవ" ఇతి॥ | శాకల్యుడు : 'అష్ట వసువులు' అనగా ఎవ్వరెవరు?<br>యాజ్ఞవల్క్యుడు :<br>(1) అగ్ని (2) పృథివి (3) వాయువు (4) అన్తరిక్షము (5) ఆదిత్యుడు (6) ద్యులోకము (దేవలోకము) (7) చంద్రుడు (8) నక్షత్రములు<br>- వీరే అష్టవసువులు....అని చెప్పబడుచున్నారు.<br>ఈ సృష్టిఅంతాకూడా ఈ అష్ట వసువులయందు ఉంచబడినది. అందుచేత 'వసువులు' అని చెప్పబడుచున్నారు. |
| 4. శాకల్యుడు : కతమే రుద్రా ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : దశేమే పురుషే 'ప్రాణాః' 'ఆత్మా' ఏకాదశః।<br>తే యత్ అస్మాత్ శరీరాత్ మర్త్యాత్<br>ఉత్క్రామన్త్య అథ రోదయన్తి,<br>తత యత్ రోదయన్తి<br>తస్మాత్ 'రుద్రా' ఇతి॥ | శాకల్యుడు : "ఏకాదశ రుద్రులు" అని ఎవరెవరిగురించి అంటున్నారు?<br>**యాజ్ఞవల్క్యుడు** : పంచప్రాణములు+ పంచ ఉపప్రాణములు+ జీవుడు.<br>మరొకవిధంగా - (1) ఈ పురుషునియందు నిలచియున్న పంచ ప్రాణములు, మనస్సు, జీవాత్మ.... ఇవన్నీ చేరి ఒక్కటి.<br>(2) పంచకర్మేంద్రియముల (కాళ్ళు, చేతులు, గుదము, శిశ్నము, నాలుక) తేజస్సు.<br>(3) పంచజ్ఞానేంద్రియముల (కళ్లు, చెవులు, ముక్కు, నోరు, చర్మము) తేజస్సు<br>ఈ 1+5+5 ఏకాదశ రుద్రులు. పంచ ప్రాణములు+పంచ ఉప ప్రాణములు జీవాత్మను సేవిస్తున్నాయి. మనస్సే జీవాత్మ. జీవాత్మయే 11వ వాడు.<br>ఈ "11' (పంచప్రాణ - పంచ ఉపప్రాణ - జీవాత్మలు) జీవుని శరీరము విడచి వెళ్ళునని చెప్పగానే ఈ జీవుడు దుఃఖితుడు అగుచున్నాడు. ఈ విధంగా "మర్త్యా అథ రోదయన్తి తస్మాత్ రుద్రా ఇతి". స్వీకరించునప్పుడు వదలునప్పుడు (తొలగునప్పుడు) కూడా దుఃఖింపజేస్తాయి కాబట్టి 'రుద్ర' అనబడుచున్నాయి. |
| 5. శాకల్యుడు : కతమ ఆదిత్యా ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : ద్వాదశ వై మాసాః సంవత్సరస్య,<br>ఏత 'ఆదిత్యాః' ఏతేహీదగ్ం<br>సర్వం ఆదదానాయన్తి,<br>తే యత్ ఇదగ్ం సర్వం ఆదదానాయన్తి,<br>తస్మాత్ "ఆదిత్యా" ఇతి॥ | శాకల్యుడు: బాగున్నది. మరి 'ద్వాదశ ఆదిత్యులు' అని ఎవరిని అంటారు?<br>యాజ్ఞవల్క్యుడు : సంవత్సరముయొక్క '12' మాసములు- '12' ఆదిత్య దేవతలు. ఈ 12 నెలలు (ఆదిత్య దేవతలు) ఆయా సమయములలో పరివర్తనము చెందుచూ, మరల మరల తిరుగాడుచూ, చక్రమువలె పరిభ్రమిస్తూ, ప్రజలయొక్క ఆయుష్షును హరిస్తూ ఉంటారు. కర్మఫలములను ఫలదీకరింపజేస్తూ ఉంటారు. ఆదదానాయన్తి....ఆదిత్యః॥ సర్వము ఎండించి హరింపజేస్తూ ఉండటముచేత 'ఆదిత్యులు' అని పిలువబడుచున్నారు! (ఆద = ఆరాటము. విచారము). |

| | |
|---|---|
| 6. శాకల్యుడు : కతమ ఇన్ద్రః? కతమః ప్రజాపతిః? ఇతి।<br>యాజ్ఞవల్క్యుడు : స్తనయిత్నుః ఏవ ఇంద్రో।<br>యజ్ఞః ప్రజాపతిః ఇతి। | శాకల్యుడు : మంచిది! బాగుబాగు! మరి ఇంద్రుడు ఎవ్వరు? ప్రజాపతి ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : స్తనయిత్నుము (మెరుపు) → **ఇంద్రుడు.** యజ్ఞము → **ప్రజాపతి।** |
| శాకల్యుడు : కతమః స్తనయిత్నుః? ఇతి।<br>యాజ్ఞవల్క్యుడు : అశనిః ఇతి।<br>శాకల్యుడు : కతమో 'యజ్ఞ' ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : పశవ ఇతి। | శాకల్యుడు : **'మెరుపు'** అనగా ఏమి?<br>యాజ్ఞవల్క్యుడు : **పిడుగు (అశనిపాతము)**...ఇదియే మెరుపుయొక్క భౌతిక ప్రదర్శనము. ఇదియే **'వజ్రపాతము'** అని కూడా అంటారు. దృశ్య-ఇంద్రియ సంబంధమైన తేజస్సే ఇంద్రుని శరీరము-ఇతి గూఢార్థమ్।<br>**శాకల్యుడు** : యజ్ఞము అనగా?<br>**యాజ్ఞవల్క్యుడు** : యజ్ఞ పశువులు (జీవులు) యజ్ఞరూపము. (యజ్ఞము = జీవులు, జీవాత్మలు). (జీవులతో కూడిన ఈ విశ్వమే యజ్ఞము). |
| 7. శాకల్యుడు : కతమే షట్ (6) ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : అగ్నిశ్చ, పృథివీ చ, వాయుశ్చ, అన్తరిక్షం చ, ఆదిత్యశ్చ,<br>దౌశ్చ। ఏతే షట్ (6)–<br>ఏతే హీదగ్ం సర్వగ్ం షట్ (6) – ఇతి। | **శాకల్యుడు** : ఇందాక 'షట్ దేవతలు' అన్నారు కదా! వారు ఎవరెవరు?<br>యజ్ఞవల్క్యుడు : **(1) అగ్ని (2) పృథివి (భూమి) (3) వాయువు (గాలి) (4) అంతరిక్షము (ఆకాశము) (5) ఆదిత్యుడు (సూర్యుడు) (6) ద్యులోకము (స్వర్గలోకము).** వీరు షట్ దేవతలు - అని యజ్ఞశాస్త్రములో సుప్రసిద్ధులై ఉన్నారు.<br>సర్వము ఈ ఆరే!<br>(అందుకే వేదమంత్రములలో "సర్వగ్ం షట్ దేవతాయ నమః" అను వాక్యము ప్రసిద్ధి పొందినదై ఉన్నది). |
| 8. శాకల్యుడు : కతమే తే త్రయో (3) దేవా? ఇతి।<br>యాజ్ఞవల్క్యుడు : ఇమ ఏవ త్రయో లోకా<br>ఏషు హీమే సర్వే దేవా ఇతి। | **శాకల్యుడు** : '**త్రయీ దేవతలు**' అని (వేదవాఙ్మయములో) ఎవ్వరిని పిలుస్తున్నారు.<br>**యాజ్ఞవల్క్యుడు** : ఈ '3' లోకములే ముగ్గురు దేవతలు.<br>(1) పృథివి + అగ్ని → మొదటి లోకము/దేవత.<br>(2) అంతరిక్షము + వాయువు → రెండవ దేవత.<br>(3) ద్యులోకము + సూర్యుడు → మూడవ దేవత.<br>"ఈ దేవతలందరు ఈ లోకములకు మూలపదార్థములు కాబట్టి త్రయీ దేవతలు. సర్వదేవతలు వీరి రూపములే. వీరిని మూలదేవతలు" అని కూడా పిలుస్తారు. |
| శాకల్యుడు : కతమౌ తౌ ద్వౌ (2) దేవావిత్?<br>యాజ్ఞవల్క్యుడు: "అన్నం" చ ఏవ, "ప్రాణశ్చ"–ఇతి। | **శాకల్యుడు** : ద్వే (ఇద్దరు) దేవతలు ఎవ్వరెవ్వరు?<br>**యాజ్ఞవల్క్యుడు** : (1) **అన్నము** → (అనుభవముగా అగుచున్నది).<br>(2) **ప్రాణము** → (అనుభవముకొరకై శక్తి). |
| శాకల్యుడు : కతమో అధ్యర్థ ($1^1/_2$) ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : యో – 'అయం' పవత। ఇతి॥ | **శాకల్యుడు** : 'ఒకటిన్నర' దేవతలు ఎవ్వరు?<br>**యాజ్ఞవల్క్యుడు** : ఏ వాయువు వీచుచున్నదో అదియే ఒకటిన్నర దేవత। |

| | |
|---|---|
| **9. <u>శాకల్యుడు :</u> తత్ ఆహుః,**<br>**యత్ అయం ఏక ఇవైవ పవతే,**<br>**అథ కథం అధ్యర్ధ ఇతి?** | **శాకల్యుడు** : 'వాయువు' అనునది ఒక్క దేవతకదా! మరి '$1^{1}/_{2}$ దేవత' అని అంటున్నారేం? ఇందులో మీ ఉద్దేశ్యము ఏమిటి? |
| **<u>యాజ్ఞవల్క్యుడు :</u> యత్ అస్మిన్ ఇదగ్ం**<br>**సర్వం అధ్యార్ధ్నోత్**<br>**తేన అధ్యర్ధ ఇతి।** | **యాజ్ఞవల్క్యుడు** : ఓ శాకల్యమునీ! అట్లా అనటానికి కారణం వినండి. సర్వము వాయువునుండే వృద్ధి పొందుతోంది. వాయువు + వృద్ధి (చలనము) (వాయువు నుండి తరంగ వృద్ధి పొందు అర్ధభాగము) = $1\ ^{1}/_{2}$ అని అంటున్నారు. |
| **<u>శాకల్యుడు :</u> కతమ ఏకో దేవ ఇతి?**<br>**<u>యాజ్ఞవల్క్యుడు :</u> ప్రాణ ఇతి।**<br>**స 'బ్రహ్మ'।**<br>**'తత్' – ఇతి ఆచక్షతే।** | **శాకల్యుడు** : మరి 'ఏకమగు దేవత' అని మీరు అన్నారు కదా? ఆ ఏకైక దేవత ఎవ్వరు?<br>**యాజ్ఞవల్క్యుడు** : **"ప్రాణమే"** ఆ ఏకైక దేవత! ఆ ప్రాణదేవత నుండే సమస్తము ప్రాణశక్తికి అభిన్నమై ప్రకటనమగుచున్నది. అంతా సర్వదా ప్రాణశక్తియే. ఇదంతా ప్రాణము యొక్క సంప్రదర్శనమే. ప్రాణము నుండి ఇదంతా వస్తోందని అనటానికే ప్రాణమును **"త్యత్"** (సమస్తమును వదలుచున్నది) అని పిలుస్తున్నారు. ఏది ఈ జగత్తును ఇటు వదులుతోందో అది 'త్యత్'. **(Eg: Electricity and its different Energy Manifestations).** |
| **10 <u>శాకల్యుడు :</u> పృథివి ఏవ యస్య**<br>**ఆయతనం। అగ్నిః లోకో।**<br>**మనో జ్యోతిః। యో వై తం పురుషం విద్యాత్।**<br>**సర్వస్య ఆత్మనః పరాయణగ్ం,**<br>**స వై వేదితాస్యాత్? (ఇతి)।** | **శాకల్యుడు** : ఓ యాజ్ఞవల్క్య మహానుభావన్!<br>→ ఈ భూమి ఎవ్వనికి అధిష్ఠానమో,<br>→ ఈ అగ్ని ఎవ్వరియొక్క దర్శన (కన్ను) చమత్కారమో,<br>→ ఈ మనస్సు ఎవరియొక్క దీప (జ్యోతి) స్వరూపమో...<br>ఆతడే ఆ **"పరమపురుషుడు"** అగు ఆత్మ. ఇది ఎవడు ఎరుగుచున్నాడో, ఆతడే సర్వ వస్తువులకు అధిష్ఠానము → అగు ఆత్మను తెలుసుకొన్న వాడగుచున్నాడుకదా!<br>అట్టి సర్వతత్త్వ స్వరూపమగు ఆత్మయే సర్వదా పారాయణము చేయతగినట్టిది. **అట్టి ఆత్మను మీరు ఎరిగియే ఉన్నారా?** చెప్పండి! |
| **<u>యాజ్ఞవల్క్యుడు :</u> వేద వా అహం తం పురుషగ్ం**<br>**సర్వస్య ఆత్మనః పరాయణం య మాత్థ**<br>**య ఏవాయగ్ం శరీరః**<br>**పురుషః స ఏష వదైవ।** | **యాజ్ఞవల్క్యుడు** : ఓ శాకల్య మహాశయా! అవును! అట్టి పరమ పురుషుని నేను ఎరిగియే ఉన్నాను. **ఆయన సర్వాత్మకుడు.** ఈ నా శరీరమునందు, సమస్త శరీరములందు కూడా నిండి ఉన్నది సర్వదా ఆయనయే. ఇంకా కూడా సర్వమునకు అధిష్ఠానమై, మమస్వస్వరూపమై, సహజరూపమై అనునిత్యముగా వెలుగొందుచున్నారు. ఆయనయే దేవదేవుడు. ఆయన మీకన్నా వేరు కాదు! మీ నా సహజరూపుడే ఆయన! కనుక నాకు కూడా వేరు కాదు! **"సమస్తము తానే"** - అయినవాడు.<br>ఓ శాకల్యా! ఇంకాఏమైనా ప్రశ్నించాలనుకుంటున్నారా? |
| **<u>శాకల్యః</u> తస్య కా దేవతా? ఇతి।**<br>**<u>యాజ్ఞవల్క్యుడు :</u> అమృతమ్ ఇతి। – హోవాచ।** | **శాకల్యుడు** : మీ-నా శరీరమంతా నిండియున్న ఆ దేవదేవుడగు ఆత్మభగవానుడు ఎట్టివాడు? ఏ దేవతారూపుడై ఉన్నాడు?<br>**యాజ్ఞవల్క్యుడు** : **అమృతస్వరూపుడు.** మార్పు - చేర్పులు పొందనిది ఆత్మ ఒక్కటే। అంతటా **"ఏక-అక్షర-అమృత స్వరూపుడు"**గా వేంచేసి ఉన్నది **ఆయనయే।** |

| | |
|---|---|
| 11 హోవాచ। (శాకల్యోవాచ) :<br>'కామ' ఏవ యస్య ఆయతనగ్ం।<br>హృదయం లోకో। మనో జ్యోతిః।<br>యో వై తం పురుషం విద్యాత్ -<br>సర్వస్య ఆత్మనః<br>పరాయణగ్ం, స వై వేదితాస్యాత్? | శాకల్యుడు : ఏ దేవదేవుని కామ (ఇచ్ఛ)చే ఇదంతా ఏర్పడుచున్నదో, అందుచేత ఇదంతా కూడా ఆయనయొక్క కామశరీరమే అయి ఉన్నదో...,<br>- ఎవ్వనికి ఈ లోకములన్నీ హృదయస్థానము అయి ఉన్నదో....,<br>- ఎవ్వని మనస్సు జ్యోతి స్వరూపమై ఉన్నదో,<br>అట్టి పురుషునియందే ఈ దేహ - ఇంద్రియముల సముదాయమంతా స్థానము కలిగి ఉన్నదని ఎవడు తెలుసుకుంటారో, ఆతడే ఆత్మను ఎరిగినవాడు. ఓ యాజ్ఞవల్క్యా! అట్టి దేహ ఇంద్రియములకు ఆశ్రయమైన పరమపురుషుని మీరు ఎరుగుదురా? వారిని మీరు గుర్తిస్తున్నారా? |
| యాజ్ఞవల్క్యః<br>వేద వా అహం తం పురుషగ్ం<br>సర్వస్య ఆత్మనః, పరాయణం।<br>యమాత్థ (యమ్ ఆత్థ) య ఏవ<br>అయం కామమయః పురుషః<br>స ఏష వదైవ, | యాజ్ఞవల్క్యుడు : సర్వకామ రూపుడగు (ఇదంతా తన ఇష్టరూపమే అయి ఉన్న) ఆ పరమాత్మయే మీచేత అడుగబడుచున్న **పరమపురుషుడు.**<br>**ఆత్మయే ఆతడు. ఆత్మయే నీవు, నేను, ఈ సభలోని ప్రతిఒక్కరము కూడా. ఆయన సర్వజీవుల స్వరూపుడు.**<br>ఓ శాకల్యా! ఇంకనూ ఏమైనా విశేషములు అడుగదలచుకున్నారా? |
| శాకల్యః<br>తస్య కా దేవతా? ఇతి?<br>'స్త్రీ' య ఇతి। -<br>హోవాచ।। | శాకల్యుడు : అవును. అడుగదలచుకున్నాను. ఆ కామపురుషుడగు పురుషునికి దేవత ఎవరు?<br>యాజ్ఞవల్క్యుడు : స్త్రీయే ఆయనకు దేవత! (స్త్రీ నిమిత్తమే కామము జనితము కదా!) (సత్-రతీతి స్త్రీః. సత్‌యొక్క రతించు స్వభావమే స్త్రీ). [ స్త్రీ = అనగా → ఇష్టము (Interest). ఇష్టమే కామమై సృష్టి రూపము పొందుచున్నది]. **(సత్ + త్రీ = త్రిగుణ సంబంధముతో కూడిన సత్-అని శబ్దార్థము).** |
| 12 శాకల్యుడు : రూపాణి ఏవ యస్య ఆయతనం।<br>చక్షుః లోకో। మనో జ్యోతిః।<br>యో వై తం పురుషం విద్యాత్।<br>"సర్వస్య ఆత్మనః" పరాయణగ్ం।<br>స వై వేదితాస్యాత్ ? | శాకల్యుడు : ఓ యాజ్ఞవల్క్యా! ఏ దేవ దేవునికి ఈ కనబడే రూపములన్నీ ఆశ్రయములు అయి ఉన్నాయో,<br>- ఈ లోకములన్నీ ఆయన చక్షువులే (చూపులే) అయి ఉన్నాయో,<br>- ఎవని మనోజ్యోతిచే జగత్తులో సంకల్ప వికల్పములన్నీ నిర్వర్తించ బడుచున్నాయో, మనస్సే ఆయన యొక్క వెలుగు అయి ఉన్నదో,<br>- ఈ దేహ ఇంద్రియ సంఘాతమునకు కార్య-కారణ స్వరూపుడుగా ఎవరిని ఎరుగుచున్నారో, ఆయనను మీరు ఎరుగుదురా? |
| యాజ్ఞవల్క్యః వేద వా అహం తం<br>పురుషగ్ం సర్వస్య ఆత్మనః<br>పరాయణం యమాత్థ య<br>ఏవా అసావాదిత్యే (ఆసావత్ ఇత్యే) పురుషః ।<br>స ఏష వదైవ। | **యాజ్ఞవల్క్యుడు :** ఆయనను సర్వులయొక్క అఖండాత్మ స్వరూపుడుగా సర్వదా ఎరుగుచున్నాను. ఆదిత్యునియందు ఏ ఆత్మ పురుషుడు ప్రకాశించు చున్నాడో, ఆయనయే ఈ 'జీవాత్మ' కూడా. ఆయనయే నిశ్చయముగా సర్వస్వరూపుడగు దేవదేవుడు. ఆయనయే మనందరి **'స్వాభావిక స్వస్వరూపుడు'.**<br>- ఈ నామ - రూపములన్నీ ఆయనయొక్క **'చూపు'** రూపమే! |
| శాకల్యః<br>తస్య కాదేవతా ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : "సత్యమ్" - ఇతి। - హోవాచ।। | శాకల్యుడు : అట్టి పరమ పురుషునికి దేవత ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : సత్యమే ఆయనకు దేవత! (సత్ = ఉనికి).<br>యమ్ సత్ = ఏది **'నేను ఉన్నాను'** అను భావన కలిగి ఉన్నదో, ఆ భావమే (సత్యమే) ఆ దేవదేవుని దేవతారూపము. **సత్యమితి దేవతా।** |

| | |
|---|---|
| 13 <u>హెూవాచ (శాకల్యోవాచ) :</u><br>**ఆకాశ ఏవ యస్య ఆయతనగ్ం।**<br>**శ్రోత్రం లోకో। మనో జ్యోతిః।**<br>**యో వై తం పురుషం విద్యాత్,**<br>**"సర్వస్య ఆత్మనః పరాయణగ్ం",**<br>**స వై వేదితాస్యాత్?** | శాకల్యుడు : ఓ యాజ్ఞవల్క్యా! ఏ దేవునికి ఆకాశము ఆశ్రయమో, వినటము (చెవి) స్వీయలోకమో, మనస్సు జ్యోతియో- ఆయనయే పురుషుడు. ఎవ్వడైతే అట్టి పురుషుని సర్వులయొక్క ఆత్మగా గమనించి పరాయణుడు (ఉపాసకుడు)గా ఉంటాడో,....అట్టివాడే ఆత్మను ఎరిగినట్లు। ఆ తీరైన మహిమాన్వితమగు ఆత్మను ఎరుగుచున్నారా? వినుచున్నారా? మీచే ఆయన ఎక్కడ వినబడుచున్నారు? |
| <u>**యాజ్ఞవల్క్య :**</u><br>**వేద వా అహం తం పురుషగ్ం**<br>**సర్వస్య ఆత్మనః**<br>**పరాయణం, యమాత్థ య**<br>**ఏవాయగ్ం శ్రౌత్రః**<br>**ప్రాతిశ్రుత్కః పురుషః। స ఏషః వదైవ।** | యాజ్ఞవల్క్యుడు : మీరు చెప్పుచున్న పరమ పరాయణుడగు సర్వాత్మకుని ఈ కనబడు సమస్తమునకు ఆత్మగా ఎరుగుచున్నాను. **వినుచున్నవాడు-వినబడునది ....అను రెండు రూపములు ఆయనవే।**<br>ఆతడు కార్య-కారణ-కర్తృత్వములన్నిటికీ ఆవలి పురుషుడు. వినుటకు ఆధారరుడుగా ఏ ప్రాతిశ్రుత్క (వినటానికి మును ముందుగానే ఉన్న) పురుషుడు కలడో, ఆతడే ఆత్మపురుషుడు. ఆతడే దేవాది దేవుడు. **అందరిలో వినువాడు ఆతడే। అందరికీ వినబడుచున్నది ఆయనయే।** |
| <u>**శాకల్య:**</u><br>**తస్య కా దేవతేతి? (కా దేవతా–ఇతి?)**<br><u>**యాజ్ఞవల్క్యుడు :**</u> **'దిశ' ఇతి। –**<br>**హోవాచ।** | శాకల్యుడు : అట్టి **"ఆకాశాశ్రయ - శృతలోక - మనోజ్యోతి"** స్వరూపుని దేవత ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : '8' దిశలు (దిక్కులు) ఆయన యొక్క దేవతా స్వరూపము. (ఎందుకంటే జీవుడు దిశలందే తన 'ఉనికి'ని ప్రదర్శించుచున్నాడు కాబట్టి). |
| 14 <u>శాకల్య :</u> **తమ ఏవ యస్య ఆయతనగ్ం,**<br>**హృదయం లోకో। మనో జ్యోతిః,**<br>**యో వై, తం పురుషం విద్యాత్,**<br>**సర్వస్య ఆత్మనః పరాయణగ్ం।**<br>**స వై వేదితాస్యాత్? (ఇతి)।** | శాకల్యుడు : ఓ యాజ్ఞవల్క్యా!<br>- ఏ దేవునికి **తమస్సు** (చీకటి) కూడా **ఆశ్రయమో** (ఆశ్రయించినదై ఉంటుందో),<br>- **హృదయమే** ఆతని **లోకమో...,**<br>- మనస్సు ఆయనయొక్క జ్యోతి (వెలుగు) అయిఉన్నదో,<br>- ఎవ్వడైతే **తమస్సును కూడా ఆత్మగా ఎరుగుచున్నాడో**, అట్టివాడే ఆత్మను ఎరిగినవాడు. ఆతనిని ఎరిగినప్పుడే మీరు ఎరుగవలసినది ఎరిగిన వారగుచున్నారు. అది మీకు తెలియునా? ఏమని తెలియును? |
| <u>**యాజ్ఞవల్క్య:**</u><br>**వేద వా అహం తం పురుషగ్ం, –**<br><u>**"సర్వస్య ఆత్మనః పరాయణం"।**</u><br>**యమాత్థ య ఏవ అయం**<br>**ఛాయా మయః పురుషః**<br>**స ఏష వదైవ।** | యాజ్ఞవల్క్యుడు : ఓఁ! తెలియును! ఆతడే సర్వాత్మకుడుగా నాచే ఉపాసించబడుచున్నారు. **ఆ ఛాయామయుడగు పురుషుడే** దేవాది దేవుడు.<br>**ఆత్మయే ఆ ఛాయామయ పురుషుడు.**<br>ఆతడు **సర్వాత్మకుడు.** కాబట్టి అందరూ ఎరిగియున్నవారే। అందుచేత ఆయన నాకు నిశ్చయముగా తెలియును. అందరికీ తెలియునని కూడ తెలుసు. |
| <u>**శాకల్య:**</u><br>**తస్య కా దేవతేతి?**<br><u>**యాజ్ఞవల్క్యుడు :**</u> **'మృత్యుః' ఇతి। –**<br>**హోవాచ।** | శాకల్యుడు : మరి ఆయనకు దేవత ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : మృత్యువు (అజ్ఞానమయమగు దానికి మృత్యువే అనుభవము కాబట్టి. 'పుట్టుక' అనుదానికి కూడా అజ్ఞానమే కారణము కనుక). మృత్యువు ఆయన యొక్క దేవతా స్వరూపము. ఆయనయొక్క మాయా కల్పిత రూపమే **మృత్యుదేవత।**<br>ఓ శాకల్యా! ఇంకా ఏమైనా అడుగుతారా? |

| | |
|---|---|
| 15 హెూవాచ (శాకల్యోవాచ):<br>'రూపాణి' ఏవ యస్య ఆయతనం। చక్షుః లోకో।<br>మనో జ్యోతిః। యో వై తం పురుషం విద్యాత్,<br>సర్వస్య ఆత్మనః పరాయణగ్ం।<br>స వై వేదితాస్యాత్? | శాకల్యుడు : ఏ దేవునికి ఈ రూపాత్మకమైనదంతా (రూపములన్నీ) ఆశ్రయవస్తువులై ఉన్నాయో...,<br>- కన్నులు అన్నీ ఉపకరణములు అయి ఉన్నయో,<br>- మనస్సు 'వెలుగు' స్వరూపమై ఉన్నదో,<br>ఆయనయే ఇక్కడి కార్య - కారణములన్నిటికీ సర్వోత్కృష్టమైన ఆశ్రయమైయున్నారు కదా!<br>ఆ దేవుడెవ్వరో చెప్పండి!<br>ఆయనను ఎరిగితేనే ఆతడు పండితుడు. మీరు అది ఎరిగినవారేనా? |
| యాజ్ఞవల్క్య: వేద వా అహం<br>తం పురుషగ్ం సర్వస్య ఆత్మనః పరాయణం।<br>యమాత్థ య ఏవ అయం "ఆదర్శే పురుషః"।<br>స ఏష వదైవ। | యాజ్ఞవల్క్యుడు : ఈ రూపములన్నిటికీ ఏది ఆశ్రయమో ఆయనను నేను ఎరుగుదును. సర్వాత్మకుడవటంచేత మీరూ ఎరుగుదురు. ఈ రూపాలన్నీ ఆ దివ్యమగు ఆత్మపురుషునికి తన ప్రతిబింబములు వంటివి.<br>**ఆయననే ఎల్లప్పుడూ మనము ఉపాసించుచున్నాము.**<br>దర్పణములో బింబము-ప్రతిబింబమువలె, ఏ బింబపురుషుడున్నారో ఆయనయే ఆత్మ। ఆ పరమపురుషునియందే ఈ కార్య-కారణ సంఘాతవ్యవహార మంతా స్థానము కలిగియున్నది. ఆయనయే దేవాది దేవుడు. (మనో దర్పణములో ఆయన జగత్తుగా ప్రతిబింబిస్తున్నారు). |
| శాకల్య : తస్య కా దేవతేతి?<br>యాజ్ఞవల్క్య : 'అసుః' ఇతి। -<br>హోవాచ। | శాకల్యుడు : అట్టి సర్వరూపుడగు ఆత్మకు దేవత ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : అట్టి రూపాశ్రయ పరమపురుషునికి (లేక) ప్రతిబింబ రూపుడైన పురుషునికి కారణమైనట్టి అసువు ((ప్రాణము)యే దేవత।<br>మిత్రమా! శాకల్యా! ఇంకా అడగదలచినది ఏమైనా ఉన్నదా? |
| 16 హెూవాచ (శాకల్యోవాచ):<br>'ఆప' ఏవ యస్య ఆయతనగ్ం। హృదయం లోకో।<br>మనో జ్యోతిః। యో వై తం పురుషం విద్యాత్,<br>సర్వస్య ఆత్మనః పరాయణగ్ం"।<br>స వై వేదితాస్యాత్? | శాకల్యుడు : ఏ దేవునకు జలమంతా కూడా ఆశ్రయమో, హృదయము లోకస్థానమో (అనుభవస్థానమో) మనస్సు వెలుగు స్వరూపమో,<br>అట్టి కార్య - కారణ సంఘాతమంతటికీ ఆశ్రయుడగు పురుషుడే తెలుసుకొనవలసినవాడు. ఆయన సర్వాత్మపరాయణుడు. ఆయన మీకు తెలిసినవారే కదా! ఎవరాయన? |
| యాజ్ఞవల్క్య :<br>వేద వా అహం తం పురుషగ్ం<br>"సర్వస్య ఆత్మనః పరాయణం"।<br>యమాత్థ య ఏవాయం 'అప్సు పురుషః'<br>స ఏషవదైవ। | యాజ్ఞవల్క్యుడు : ఆయన **సర్వకార్య కారణ సంఘాతమునకు స్థానమగు ఆత్మ**గా నేను ఎరుగుచున్నాను.<br>జలమునందు ఏ పురుషుడు రుచి మొదలైన కళలు ప్రదర్శిస్తున్నాడో, ఆతడే ఆత్మ! ఇది ఎరిగి మనము ఆత్మపరాయణులమగుచున్నాము!<br>ఈ జలరూప పురుషుడే ఆత్మ! ఇంకా ఏమైనా అడుగుతారా? |
| శాకల్య : తస్య కా దేవతేతి? (కా దేవతా ఇతి)?<br>యాజ్ఞవల్క్యుడు : "వరుణ" ఇతి। - హోవాచ। | శాకల్యుడు : వారికి దేవతారూపమెవ్వరు?<br>**యాజ్ఞవల్క్యుడు : వరుణుడు।** |
| 17 శాకల్యోవాచ : రేత (ఏత) ఏవ యస్య ఆయతనగ్ం।<br>హృదయం లోకో। మనో జ్యోతిః।<br>యో వై తం పురుషం<br>విద్యాత్ - 'సర్వస్య ఆత్మనః । పరాయణగ్ం'।<br>స వై వేదితస్యాత్? | శాకల్యుడు : ఏ పురుషునికి రేతస్సు (తేజస్సు Inspiration) ఆశ్రయమో, హృదయము దర్శన స్థానమో (లోకమో - చూచే స్థానమో), మనస్సు ఆయనకు వెలుగై ఉన్నదో, - **ఆతడే ఆ సర్వమునకు అధిష్ఠానమగు ఆత్మ**. ఆయననే కదా తెలుసుకోవలసింది? **ఆయన గురించి మీరు ఏమని ఎరుగుచున్నారు?** |

| | |
|---|---|
| యాజ్ఞవల్క్యః: వేద వా అహం<br>తం పురుషగ్ం సర్వస్య ఆత్మనః పరాయణం।<br>యమాత్థ య ఏవ అయం పుత్రమ్।<br>అయః పురుషః స ఏష వదైవ।<br>శాకల్య : తస్య కా దేవతేతి? (కా దేవతా–ఇతి?)<br>యాజ్ఞవల్క్యుడు : 'ప్రజాపతిః' ఇతి। –<br>హోవాచ॥ | యాజ్ఞవల్క్యుడు : అవును కదా! ఆయనను మనమందరము ఎరుగుచూనే ఉన్నాము. ఆయనయే ఈ సర్వ దృశ్యవ్యవహారమునకు సంకల్పస్రష్ట సర్వ వస్తువులకు ఏది అధిష్ఠామైనయున్నదో, అట్టి ఆత్మగురించే మీరు మరల మరల అడుగుచున్నారు. మాట్లాడుచున్నారు. అంతేకాకుండా 'పుత్రుడు' రూపముగా ఉండి తండ్రికి ఎవడు అత్యంత ప్రియము కలిగించుచున్నాడో, అది కూడా పరమ పురుషుడే! (రేతస్సే పుత్రుని రూపము కదా)।<br>ఓ శాకల్యా! ఇంకా ఏమైనా అడగాలనుకుంటున్నారా?<br>శాకల్యుడు : అట్టి రేతో రూప ఆత్మకు దేవత ఎవ్వరు?<br>యాజ్ఞవల్క్యుడు : ప్రజాపతి! |
| 18 శాకల్యా! ఇతి – హోవాచ।<br>యాజ్ఞవల్క్యః: త్వాగ్ం<br>స్విదిమే బ్రాహ్మణా<br>అఙ్గారావక్షయణమ్<br>అక్రతా 3(ఉ) ఇతి। | (అప్పుడు శాకల్యుడు తన శిష్యులు - మిత్రులు కొందరితో రహస్యంగా మాట్లాడసాగారు).<br>యాజ్ఞవల్క్యుడు : ఓ శాకల్యా! కొందరు బ్రాహ్మణ సభికులు మిమ్ములను అంగరా వక్షయణము (నిప్పుకణములు పట్టుకొనే పట్టకారువలె) పట్టుకొని ఆడించుచూ, ఈ విధంగా మీ ప్రశ్నల ద్వారా నన్ను ఓడించాలని ప్రయత్నిస్తున్నారా ఏమి?<br>(అంగరా వక్షయనము = నిప్పులను నొక్కి తీసే పట్టకారు)<br>దయచేసి సర్వ చర్చల - సందేహములు త్యజించి ప్రశాంతచిత్తులై ఆత్మయందు శాంతించండి. (ఎందుకంటే దీపముయొక్క కాంతిని నిరూపించటానికి ఉపమాన, ఉపమేయాలెందుకు)? |
| 19 యాజ్ఞవల్క్యా! ఇతి హోవాచ।<br>శాకల్యోః: యదిదం<br>కురు పాఞ్చాలానాం బ్రహ్మణా<br>సత్యవాదీః కిం బ్రహ్మ విద్వాన్ ఇతి? | శాకల్యుడు : ఓ యజ్ఞవల్క్యా! భలేవారే! "ఓహో! నాకు బ్రహ్మము తెలుసుకదా!"…..అని తలచి, కురు - పాంచాలి దేశీయులగు మా బ్రాహ్మణులను తక్కువ చేసి మాట్లాడుచున్నారు కదా? వారందరినీ అతిక్రమించి వాదములు చేస్తున్నారు. మీరు బ్రహ్మవేత్తయా! బ్రహ్మ విద్వాన్ అయి ఉన్నారా? |
| యాజ్ఞవల్క్య : "దిశో వేద" సదేవాః,<br>స ప్రతిష్ఠా ఇతి।<br>యత్ దిశో వేత్థ, స దేవాః।<br>స ప్రతిష్ఠాః॥ | యాజ్ఞవల్క్యుడు : అయ్యా! శాకల్యమునివరా! నేను దేవతలతో కూడియున్నట్టివి, మరియు ప్రతిష్ఠలతో (ఆశ్రయములతో) కూడుకున్నట్టివి అగు దిక్కుల గురించి కూడా గుర్తు ఎరిగి ఉన్నాను. అన్ని దిక్కులందు నేనే సకల దేవతా స్వరూపుడనై ప్రకాశిస్తున్నాను. ఎందుకంటే **అఖండాత్మయే నా నిజ స్వరూపము కూడా కాబట్టి.**<br>**శాకల్యుడు** : ఓహో, అదా! మీరు అధిష్ఠానదేవతలతోను, స్థితులతోను కూడుకొనియున్న దిక్ విషయకమైనట్టి జ్ఞానమును ఎరిగి ఉన్నారా? సంతోషం. అవన్నీ తెలుసుకొని ఉండి ఉంటే అవేమియో వివరించి చెప్పండి? దిక్కులలోగల ఆత్మపురుషుని రూపమేమిటి?<br>యాజ్ఞవల్క్యుడు : అన్ని దిక్కులలోను వెలుగొందుచున్నది - నాయొక్క **ఆత్మపురుషత్వమే.** |
| 20 శాకల్యుడు : కిం దేవతో అస్యాం ప్రాచ్యాం దిశ్య అసీత్?<br>యాజ్ఞవల్క్యుడు : 'ఆదిత్య దేవత' – ఇతి।<br>శాకల్యుడు :స ఆదిత్యః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'చక్షుషి' ఇతి। | **శాకల్యుడు** : అన్ని దిక్కులందు మీయొక్క ఆత్మపురుషుడే ఆయా దేవతారూపుడై వెలుగొందుచున్నారా? ఆత్మయే దేవతా రూపములతో కూడి ప్రకాశిస్తున్నదా? అయితే 'తూర్పు దిశ'యందు ఏ దేవతా రూపముతో మీయొక్క ఆత్మ ప్రకాశిస్తోంది? |

| | |
|---|---|
| | యాజ్ఞవల్క్యుడు : మమాత్మయే తూర్పు దిక్కునందు ఆదిత్య దేవతా రూపముతో **ప్రకాశించుచున్నది. ఆదిత్యుడినై వెలుగొందుచున్నాను.** |
| **శాకల్యుడు : కస్మిన్ను చక్షుః ప్రతిష్ఠితమ్ ఇతి?**<br>**యాజ్ఞవల్క్యుడు: రూపేషు ఇతి। చక్షుషాహి రూపాణి పశ్యతి।** | శాకల్యుడు : ఆ ఆదిత్యుడు దేనియందు ప్రతిష్ఠితుడైయున్నారు?<br>**యాజ్ఞవల్క్యుడు** : సమస్త జీవులలో కళ్ళయందు (చూపుగా) |
| **శాకల్యుడు : కస్మిన్ను రూపాణి ప్రతిష్ఠితాని ఇతి?** | శాకల్యుడు : కళ్ళు దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నాయి? (లేక) చూపు ఎద్దానియందు ప్రతిష్ఠితమై ఉన్నది?<br>యాజ్ఞవల్క్యుడు : **కళ్ళు (చూపు) రూపములయందు ప్రతిష్ఠితమై ఉన్నాయి.** ఎందుకంటే ఈ జీవుడు కళ్ళతో కదా (చూపుతోనే కదా) రూపములను చూస్తున్నాడు।<br>శాకల్యుడు : ఈ చూడబడుచున్న రూపములన్నీ దేనియందు ప్రతిష్ఠితము అయి ఉన్నాయి? |
| **యాజ్ఞవల్క్యుడు : 'హృదయ' ఇతి। హోవాచ ।**<br>**యస్మాత్ హృదయేన హి**<br>**రూపాణి సర్వో లోకో జానాతి।**<br>**తస్మాత్ హృదయే హి ఏవ**<br>**రూపాణి ప్రతిష్ఠితాని భవన్తి।** | యాజ్ఞవల్క్యుడు : హృదయమునందు. ఎందుకంటే ఈ జీవుడు హృదయముతోనే, హృదయంలో రూపములను చూస్తున్నాడు, అనుభవములుగా పొందుచున్నాడు కదా!<br>సర్వ రూపములు, సర్వలోకములు హృదయమునందే ప్రతిష్ఠితమై ఉన్నాయి. హృదయమునందే లోకములు జనిస్తూ హృదయమునందే ప్రవర్తిస్తున్నాయి. తిరిగి హృదయమునందే లయిస్తున్నాయి.<br>కనుక **రూపములన్నీ కూడా హృదయమునందే ప్రతిష్ఠితములై ఉన్నాయి. నా హృదయమునందే లోకములన్నీ ప్రతిష్ఠితమై ఉన్నట్లు, హృదయము ఆత్మయందు, ఈ సమస్తము ఆత్మకు అభేదమై ఉన్నట్లు గమనిస్తున్నాను.** |
| **శాకల్యుడు: ఇత్యేవం ఏవైతత్,**<br>**యాజ్ఞవల్క్య!** | శాకల్యుడు : ఔను! ఓ యాజ్ఞవల్క్యా! మీరు చెప్పునది సరియేనని నేను ఒప్పుకుంటున్నాను. |
| **21 శాకల్యుడు : కిం దేవతో అస్యాం**<br>**దక్షిణాయాం దిశ్యసి ఇతి?**<br>**యాజ్ఞవల్క్యుడు : 'యమ దేవత' ఇతి।** | శాకల్యుడు : మీరు దక్షిణ దిక్కుయందు ఏ దేవతా రూపులై ఉన్నారు? ఏ దేవతారూపము దక్షిణ దిక్కునందు వేంచేసినవారై ఉన్నది? **(లేక)** దక్షిణ దిక్కునందు ఏ దేవతతో కూడి ఉన్నారు? ఏ దేవతను చూస్తున్నారు? ఏ దేవతను ఉపాసిస్తున్నారు?<br>యాజ్ఞవల్క్యుడు : **యముడు.** యమధర్మరాజును నాయొక్క దక్షిణ దిక్కునందు దేవతగా కలిగి ఉన్నాను. |
| **శాకల్యుడు : స యమః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?** | శాకల్యుడు : ఓహో! మీరు ఆత్మగా దక్షిణ దిక్కుతో తాదాత్మ్యమును చెందినప్పుడు యముడు దేవతయా? మరి ఆ యముడు ఎద్దానియందు ప్రతిష్ఠితులై ఉన్నారు? |
| **యాజ్ఞవల్క్యుడు : 'యజ్ఞ' ఇతి।**<br>**శాకల్యుడు : కస్మిన్ను యజ్ఞః ప్రతిష్ఠిత ఇతి? –**<br>**యాజ్ఞవల్క్యుడు : దక్షిణాయాం ఇతి।** | యాజ్ఞవల్క్యుడు : యజ్ఞమునందు యముడు దక్షిణ దిక్కుతో తనకు కారణము అయినట్టి యజ్ఞమునందు ప్రతిష్ఠితులై ఉన్నారు.<br>శాకల్యుడు : ఆ యజ్ఞము దేనియందు ప్రతిష్ఠితమైయున్నది?<br>యాజ్ఞవల్క్యుడు : యజ్ఞము 'దక్షిణ' యందు ప్రతిష్ఠితమైయున్నది. (దక్షిణ = Sacrifice. What is being given to others & system). |

శాకల్యుడు : కస్మిన్ను దక్షిణా ప్రతిష్ఠిత-ఇతి?
యాజ్ఞవల్క్యుడు : "శ్రద్ధాయాం" ఇతి।
యదా హి ఏవ శ్రద్ధత్తే అథ దక్షిణాం దదాతి।
శ్రద్ధాయాగ్ం హి ఏవ దక్షిణా ప్రతిష్ఠితేతి।

శాకల్యుడు : యజమాని యజ్ఞముకొరకై ఋత్విక్కుకు దక్షిణ సమర్పిస్తున్నాడు. యజ్ఞమంత్రములను, విధి విధాన నిర్వహణను ఋత్విక్కు నుండి (దక్షిణ ఇచ్చి) పొందుచున్నాడు. సరే! దక్షిణ దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నది?

యాజ్ఞవల్క్యుడు : 'శ్రద్ధ'యందు!

(శ్రద్ధ = ఇవ్వాలనే కోరిక. భక్తితో కూడిన ఆస్తిక్య బుద్ధి. శ్రద్ధతో చేసినదే దక్షిణ. శ్రద్ధతో ఇచ్చినదే దక్షిణ. ఇతరుల కొరకై నిర్వర్తించినదంతా దక్షిణయే!)

---

శాకల్యుడు : కస్మిన్ను శ్రద్ధా ప్రతిష్ఠిత-ఇతి?
యాజ్ఞవల్క్యుడు : హృదయ ఇతి। హోవాచ:
హృదయేన హి శ్రద్ధాం జానాతి।
హృదయే హి ఏవ
శ్రద్ధా ప్రతిష్ఠితా భవతి।

శాకల్యుడు : శ్రద్ధ దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నది? శ్రద్ధ - దక్షిణ ఉంటున్నది ఎక్కడ? ఎద్దానియందు ఉనికి కలిగి ఉంటున్నాయి?

యాజ్ఞవల్క్యుడు : శ్రద్ధ, శ్రద్ధతో కూడిన దక్షిణ - ఈ రెండూ కూడా **హృదయమునందు స్థితి కలిగినవై ఉంటున్నాయి.**

ఎందుకంటే ఈ జీవునికి గల శ్రద్ధ హృదయమును అనుసరించే తెలియవచ్చుచున్నది.

అందుచేత హృదయమునందే శ్రద్ధ ప్రతిష్ఠితమై ఉన్నదని తెలియ వచ్చుచున్నది. **హృదయమే ఈ జీవుని రూపము, లోకముల రూపము కూడా!**

---

శాకల్యుడు: ఇతి ఏవం ఏవైతత్,
యాజ్ఞవల్క్య!

శాకల్యుడు : ఓ యాజ్ఞవల్క్యా మహనీయా! చాలా చక్కగా విశదీకరించి సమాధానము ఇచ్చారు. మీ ఈ సమాధానమును నేను ఒప్పుకుంటున్నాను.

---

22 శాకల్యుడు:కిం దేవతో అస్యాం ప్రతీచ్యాం దిశ్యసీఇతి?
యాజ్ఞవల్క్యుడు : 'వరుణదేవత' ఇతి।

శాకల్యుడు : మీయొక్క ప్రతీచీ దిశయందు (పడమర దిశయందు) ఏ దేవతారూపులై ఉన్నారు? ఏ దేవతను కలిగి ఉన్నారు? ఎవరిని ఉపాశిస్తున్నారు?

యాజ్ఞవల్క్యుడు : పడమర దిక్కునందు నేను కలిగియున్న (- నేనైయున్న) అధిష్ఠానదేవత **'వరుణుడు'**.

---

శాకల్యుడు : స వరుణః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?
యాజ్ఞవల్క్యుడు : 'అప్పు'-ఇతి।

శాకల్యుడు : అట్టి వరుణదేవుడు ఎద్దానియందు ప్రతిష్ఠితులై ఉన్నారు?

యాజ్ఞవల్క్యుడు : జలమునందు వరుణ దేవుడు ప్రతిష్ఠితులై ఉన్నారు. వరుణుడు జలముల కారణస్వరూపుడు. జలము కార్య స్వరూపము.

---

శాకల్యుడు : కస్మిన్ స్వాపః (కస్మిన్ సు అపః) ప్రతిష్ఠితా ఇతి?
యాజ్ఞవల్క్యుడు : "రేతసీ" ఇతి।

శాకల్యుడు : జలము ఎద్దానియందు ప్రతిష్ఠితమైయున్నది?

యాజ్ఞవల్క్యుడు : జలము రేతస్సునందు ప్రతిష్ఠ కలిగియున్నది.

(రేతస్సు = సృష్టియొక్క కల్పనా ఉత్సాహము. Inclination enthusiasm to create ).

---

శాకల్యుడు : కస్మిన్ను రేతః ప్రతిష్ఠితం ఇతి?
యాజ్ఞవల్క్యుడు : హృదయ ఇతి।

శాకల్యుడు : అట్లాగా? బాగున్నది! మరి రేతస్సు ఎందులో ప్రతిష్ఠితమై ఉన్నది?

యాజ్ఞవల్క్యుడు : **రేతస్సు హృదయమునందు ప్రతిష్ఠితమై ఉన్నది.** ఎందుకంటే రేతస్సు హృదయముయొక్క కార్యము. 'కామన' (Desire) - అనునది కూడా హృదయముయొక్క వృత్తియే. అందుచేతనే "ఈ

| | |
|---|---|
| తస్మాత్ అపి ప్రతిరూప జాతమాహుః<br>హృదయాదివ సృప్తో<br>హృదయాదివ, నిర్మిత ఇతి।<br>హృదయే హి ఏవ రేతః ప్రతిష్ఠితం భవతి।<br>శాకల్యుడు: ఇత్యేవం ఏవైతత్, యాజ్ఞవల్క్య! | బిడ్డడు తండ్రి నుండి ఊడిబడ్డాడు'' అని జనులు అంటూ ఉంటారు కదా!<br>కుమారుడు తండ్రి హృదయములోంచే బయలుదేరుచున్నాడు. (**"ఆత్మావై పుత్ర నామాసి।"** అంటారు కదా!)<br>తండ్రివంటివాడే పురుషుడు అగుచున్నాడు.<br>రేతస్సు హృదయమునందే బయల్వెడలి, హృదయమునందే ఉంచ బడినదిగా అగుచున్నది.<br>రేతస్సు హృదయమునందే ప్రతిష్ఠితమైయున్నది.<br>సమస్తము హృదయమునందే ఉన్నది! |
| | శాకల్యుడు : స్వామీ! యాజ్ఞవల్క్యా! చాలా చక్కగా చెప్పుకొచ్చారు! మీరు చెప్పినది తప్పక యుక్తియుక్తము. నేను ఒప్పుకొంటున్నాను. |
| 23 శాకల్యుడు : కిం దేవతో అస్యాం<br>ఉదీచ్యాం (ఉత్తర దిక్కుగా) దిశ్యసి ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'సోమ దేవత' ఇతి। | శాకల్యుడు : హే యాజ్ఞవల్క్య మహాశయా! ఇంకా కూడా చెప్పండి! ఉత్తర దిక్కునందు మీరు ఏ దేవతా రూపము కలిగి ఉన్నారు? ఏ దేవతా రూపులై ఉన్నారు?<br>యాజ్ఞవల్క్యుడు : సోముడు అను దేవతను ఉత్తర దిశయందు కలిగి ఉన్నాను. (లేక) ఆత్మనగునేను ఉత్తర దిక్కుయందు సోమ దేవతా స్వరూపముగా ప్రదర్శనమగుచున్నాను. **సోముడు = చంద్రదేవత.** |
| శాకల్యుడు : స సోమః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : 'దీక్షాయాం' ఇతి। | శాకల్యుడు : ఆ సోముడు ఎద్దానియందు ప్రతిష్ఠితమై ఉన్నారు?<br>యాజ్ఞవల్క్యుడు: దీక్ష (పట్టుదల) రూపమునందు ప్రతిష్ఠితులై ఉన్నారు. (నా దీక్షయే సోముడు). |
| శాకల్యుడు : కస్మిన్ను దీక్షా ప్రతిష్ఠితేతి? | శాకల్యుడు : దీక్ష ఎద్దానియందు ప్రతిష్ఠితమై ఉన్నది? |
| యాజ్ఞవల్క్యుడు : 'సత్య' ఇతి।<br>తస్మాదపి దీక్షితం ఆహుః సత్యం వదేతి।<br>సత్యే హి ఏవ దీక్షా ప్రతిష్ఠితా ఇతి। | యాజ్ఞవల్క్యుడు : దీక్ష సత్యము (యమ్ సత్) నందు ప్రతిష్ఠితమైయున్నది. అందుచేతనే విద్వాంసులు 'దీక్ష' కలవానిని చూచినప్పుడు "సత్యము" నందు దీక్షితుడై ఉన్నాడు - అని అంటూ ఉంటారు. కారణం? "కారణము" అయిన సత్యము జారిపోతే 'దీక్ష' కూడా జారిపోతుంది. 'దీక్ష' అనునది 'సత్యము'నందే ప్రతిష్ఠితమైయున్నది. |
| శాకల్యుడు : కస్మిన్ను సత్యం ప్రతిష్ఠితం ఇతి? | శాకల్యుడు : అట్లా అయితే సత్యము దేనియందు ప్రతిష్ఠితమైయున్నది? |
| యాజ్ఞవల్క్యుడు : హృదయ ఇతి – హోవాచ ।<br>హృదయేన హి సత్యం జానాతి।<br>హృదయే హి ఏవ<br>సత్యం ప్రతిష్ఠితం భవతి ఇతి। | యాజ్ఞవల్క్యుడు : **సత్యము హృదయమునందే ప్రతిష్ఠితమైయున్నది।** ఎందుచేతనంటే ఈ జీవుడు ''సత్యము''ను తెలుసుకునేది హృదయముతోనే కదా!<br>కాబట్టి సత్యము → హృదయమునందేచోటు కలిగియున్నది.<br>హృదయమే సత్యమునకు స్థానము. ఈ సమస్తము ఉన్నది నా హృదయము నందే। |
| శాకల్యుడు : (ఇతి) ఏవం ఏవైతత్, యాజ్ఞవల్క్య! | శాకల్యుడు : మీరు చెప్పిన వివరాలు **నాకు సంతోషము కలుగజేస్తున్నాయి.**<br>హే యాజ్ఞవల్క్యా! మీరు చెప్పినది **నేను హృదయపూర్వకముగా ఒప్పుకొంటున్నాను.** |

| | |
|---|---|
| 24 **శాకల్యుడు :** కిం దేవతో అస్యాం ధృవాయాం దిశ్యసి ఇతి?<br>**యాజ్ఞవల్క్యుడు : "అగ్ని" దేవత ఇతి।** | శాకల్యుడు : మహనీయా! యాజ్ఞవల్క్యా! ధృవనక్షత్రము మొదలైన నక్షత్ర మండలములతో కూడిన ఊర్ధ్వదిక్కునందు ఏ దేవతను మీరు ఏ దేవతను మీరు ఉపాసిస్తున్నారు? ఏ దేవతా రూపులై ఉన్నారు?<br>యాజ్ఞవల్క్యుడు : ఊర్ధ్వదిక్కు (సూర్యమండల ప్రభావముతో నిరంతరము మండుచూ ఉండటంచేత) ....'ధృవము' అని పిలువబడుతోంది. అట్టి ఊర్ధ్వదిక్కునందు **అగ్నిస్వరూపుడనై, అగ్ని దేవుని దేవతగా కలిగి యున్నాను.** |
| **శాకల్యుడు :** సో అగ్నిః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?<br>**యాజ్ఞవల్క్యుడు : 'వాక్' చ ఇతి।** | శాకల్యుడు : ప్రకాశ స్వరూపమగు **'అగ్ని'** దేనియందు ప్రతిష్ఠితమై ఉన్నది?<br>యాజ్ఞవల్క్యుడు : అగ్ని వాక్కునందు ప్రతిష్ఠితమైయున్నది. |
| **శాకల్యుడు :** కస్మిన్ను వాక్ ప్రతిష్ఠితేతి?<br>**యాజ్ఞవల్క్యుడు : "హృదయ" ఇతి।** | శాకల్యుడు : ఓహో! బాగు! అయితే వాక్కు ఎద్దానియందు ప్రతిష్ఠితమై యున్నది?<br>యాజ్ఞవల్క్యుడు : **వాక్కుకు స్థానము హృదయమే. వాక్కు హృదయమునందు ప్రతిష్ఠితము అయిఉన్నది.** |
| **శాకల్యుడు :** కస్మిన్ను హృదయం ప్రతిష్ఠితం ఇతి? | శాకల్యుడు : హే మహానుభావా! యాజ్ఞవల్క్యా! మీరు **"ఇదంతా హృదయములోనే ఉన్నది!"** → అని పలుకుచూ వస్తున్నారు కదా! ఇంతకీ హృదయము ఎక్కడ ఉన్నది? ఎద్దానియందు ఉన్నది? హృదయము అనుదానికి స్థానమేది? (గుండెలోనా? లేక, ఇంకెక్కడన్నానా?) మరొక వేరైనదానిలోనా? 'హృదయము' అనేది ఉన్నదా? |
| 25 **యాజ్ఞవల్క్యుడు : అహల్లికేతి! హోవాచ ।**<br>**యాజ్ఞవల్క్యః:** యత్ర ఏతత్<br>**అన్యత్ర అస్మన్ (త్) మన్యాసై**<br>**యద్ధ్యేతత్ (యత్ హి ఏతత్) అన్యత్ర-**<br>**అస్మత్స్యాచ్ఛ్వానో వైన దద్యుః**<br>**వయాగ్ంసి వై నద్వి మధ్వీరన్। ఇతి।** | యాజ్ఞవల్క్యుడు : ఓ శాకల్య మహాశయా! పగలు త్రాగి వుండే ఓ ప్రేతము వలె మూఢత్వము వహించి ఉండకండి. హృదయము ఈ శరీరమునకే ఆత్మ! అట్టి హృదయము మరొకచోట ఎక్కడో ఉన్నదని అనుకుంటున్నారా ఏమి? ఒకవేళ ఈ హృదయము మరొకచోట ఉన్నదని తలచితే అప్పుడిక ఈ మీ భౌతిక శరీరము<br>→ కుక్కలుచే పీక్కు తినబోవునదిగా,<br>→ (లేక) పక్షులు ముక్కలు ముక్కలుగా చేసి పలహారము చేయునదిగా అనుకోవలసి వస్తుంది.<br>కనుక హృదయము మీకు వేరుగా మరొక్కచోట ఉన్నట్టిది కాదు. మీకు వేరుగా ప్రతిష్ఠితమై లేదు. మీయందే → హృదయమున్నది. మీ హృదయమునందే శరీరము ఉన్నది. **అనుభవమయ్యేదంతా హృదయమే అధిష్ఠానముగా కలిగి ఉన్నది.** ఆలోచనలు, భావనలు బయలుదేరుచున్న స్థానమే 'హృదయము'. |
| 26 **శాకల్యుడు :** కస్మిన్ను త్వం చ ఆత్మాచ ప్రతిష్ఠితౌ స్థ ఇతి?<br>**యాజ్ఞవల్క్యుడు : "ప్రాణ" ఇతి।**<br>**శాకల్యుడు :** కస్మిన్ను ప్రాణః ప్రతిష్ఠిత ఇతి?<br>**యాజ్ఞవల్క్యుడు : "అపాన" ఇతి।** | శాకల్యుడు : మీరు, మీ ఆత్మ ఎందులో ప్రతిష్ఠితమై ఇప్పుడున్నారో,... అది చెప్పండి!<br>యాజ్ఞవల్క్యుడు : **ప్రాణమునందు** నేను, నా ఆత్మ ప్రతిస్థాపితమై (లేక) ప్రతిష్ఠితమై ఉన్నాము.<br>శాకల్యుడు : ప్రాణము ఎందులో ప్రతిష్ఠితమై ఉన్నది.<br>యాజ్ఞవల్క్యుడు : ప్రాణము **అపానము**నందు ప్రతిష్ఠితమైయున్నది. |

**శాకల్యుడు :** కస్మిన్ అపానః ప్రతిష్ఠిత ఇతి?
**యాజ్ఞవల్క్యుడు :** "వ్యాన" ఇతి।
**శాకల్యుడు :** కస్మిన్ను వ్యానః ప్రతిష్ఠిత ఇతి?
**యాజ్ఞవల్క్యుడు :** "ఉదాన" ఇతి॥
**శాకల్యుడు :** కస్మిన్ ఉదానః ప్రతిష్ఠిత ఇతి?
**యాజ్ఞవల్క్యుడు :** 'సమాన' ఇతి॥

శాకల్యుడు : మరి అపానము ఎందులో ప్రతిష్ఠితమైయున్నది?
యాజ్ఞవల్క్యుడు : వ్యానమునందు ప్రతిష్ఠితమై ఉన్నది.
శాకల్యుడు : ఇక **'వ్యానము'** ఎందులో ప్రతిష్ఠితమైయున్నది?
యాజ్ఞవల్క్యుడు : **ఉదానము**నందు.
శాకల్యుడు : అట్లాగా! సరే! మరి ఉదానము ఎందులో ప్రతిష్ఠితమై యున్నది?
యాజ్ఞవల్క్యుడు : సమాన ప్రాణమునందు

---

**స ఏష "న ఇతి। న ఇతి।" (నేతి, నేతి) ఇతి।**
**ఆత్మా అగృహ్యో నహి గృహ్యతే।**
**అశీర్యో నహి శీర్యతే।**
**అసంగో నహి సజ్యతే।**
**అసితో న వ్యథతే, న రిష్యతి।**
**ఏతాని అష్టావాయతనాని, అష్టౌ లోకా,**
**అష్టౌ దేవా, అష్టౌ పురుషాః**
**స యస్తాన్ పురుషాన్ నిరూహ్య ప్రత్యూహ్య**
**అత్యక్రామ తత్ ఔపనిషదం పురుషం**
**పృచ్ఛామి, తం చేత్-మే**
**న వివక్ష్యసి, మూర్థాతే విపతిష్యతి ఇతి।**

ఓ శాకల్యా! (1) ఈ శరీరము, (2) హృదయము → ఈ రెండూ కూడా పంచప్రాణములచేత ఒకదానిలో మరియొకటి ఉంచబడినవై, **'ఎరుగుట'** అనురూపముగల **'విజ్ఞానము'** యొక్క ఉపయుక్తము కొరకై నియమితములుగా ప్రవర్తిస్తున్నాయి. ఇప్పుడు మనము - ఈ సమస్తము ఎవనిచేత నియమితమై ఉన్నాయో, ఎవనియందు వస్త్రపు మడతలో కాగితమువలె ఈ సమస్తము ఉన్నదో... అట్టి నిరుపాధిక బ్రహ్మము గురించి **"ఇది కాదు! ఇది!"** అని నిర్ణయము చేసుకోవలసియున్నది సుమా! 'నేతి నేతి' అను వాక్యములచేత **ఈ కనబడే స్వానుభవమంతా దృశ్య - దేహ - మనో - బుద్ధి - చిత్తములతో సహా దాటివేస్తేనే ఆత్మ స్వానుభవముగా సిద్ధించగలదు.**

ఆత్మ → గ్రహించబడుచున్న ఏ వస్తువూ కాదు కనుక గ్రహింపశక్యము కానిది. శిథిలము కానట్టిది కాబట్టి అశిథిలము. అది అసంగము కనుక సంగమునకు (ఎట్టి సంబంధమునకు) విషయం కాదు! సర్వదా ఏ వ్యధను పొందనిది కనుక దుఃఖరహితము. బద్ధరహితము.

**అట్టి ఆత్మ**
→ 'పృథివి' మొదలైన '8' (అష్ట) స్థానములను,
→ అగ్నిలోకము మొదలైన '8' లోకములను,
→ '8' దేవతలను,
→ '8' పురుషులను

కల్పించుకొని 'వినోదము' ఆస్వాదిస్తోంది. ఈ ఈ 8మంది పురుషుల తత్త్వమును (కల్పనగా) తెలుసుకొని ఎవ్వరు హృదయంలో సమస్తము ఉపసంహారం చేసుకొని అతిక్రమిస్తారో, అట్టి ఉపనిషత్తులతో ప్రతిపాదించుచున్న **పరమపురుషుడు ఎవరు?** ఓ శాకల్యా! అట్టి **పరమాత్మ**గురించి నేను మిమ్ములను **ప్రశ్నిస్తున్నాను. అట్టి పరమాత్మ గురించి మీరు చెప్పాలి।** అది నీవే - అని నీకు తెలియకపోతే నీతల తెగగలదు. మీరు ఎవరు? ఆ పరమాత్మ ఎవరు? నేనెవరు?-చెప్పండి!

---

**తగ్ం హ న మేనే**
**శాకల్య, తస్య హ మూర్ధా విపపాతాపి।**
**హాస్య పరిమోషిణో, అస్థి-అన్య పజహ్రుః।**
**అన్యన్ మన్య మానాః।**

శాకల్యుడు ఆత్మ స్వరూపమును స్వాభావికమగు స్వస్వరూపముగా ఎరిగి ఉండకపోవటంచేత తిరస్కారభావం వహించారు. అప్పుడు ఆతని శిరస్సు నిజంగానే భిన్నమై పడిపోయింది. అప్పుడు ఆతని శిష్యులు బ్రాహ్మణ శాపగ్రస్తుడైన శాకల్యుని భౌతిక దేహమును అగ్నికి సమర్పించారు. ఊర్ధ్వలోకగతులకై ఆతని అస్తికలను నిమజ్జనముకై తీసుకొనిపోసాగారు. అప్పుడు కొందరు దొంగలు ఆ శిష్యుల వద్ద ధనముతోబాటు అస్తికలను దొంగిలించటము జరిగింది. అందువల **"బ్రహ్మవేత్తలను అవమానించు వారికి ఇహపరలోకములు రెండూ ఉండవు"**....అని చెప్పబడుతోంది!

**27** అథ హో వాచ: (యాజ్ఞవల్క్యోవాచ) :
బ్రాహ్మణా భగవన్తో!
యోవః కామయతే
స మా పృచ్ఛతు।
సర్వే వా మా పృచ్ఛత।
యోవః కామయతే
తం వః పృచ్ఛామి।
సర్వాన్వావః పృచ్ఛామి ఇతి।
తేహ బ్రాహ్మణా న దధృషుః।

యాజ్ఞవల్క్యుడు : పూజ్యులగు బ్రహ్మోణోత్తములారా! ఇంకా కూడా మీలో ఎవ్వరు ఏమి కోరుకుంటారో అది మీరు తప్పకుండా అడుగవచ్చు.

లేదా మీరందరూ కలసి నన్ను మీరు కోరుకొన్నట్లుగా ప్రశ్నించనూవచ్చు కూడా!

(లేక) మీలో మీరందరూ కలసిఎవరిని ఎన్నుకుంటారో, వారిని ప్రశ్నించగలను.

(లేదా) మిమ్ములను అందరినీ కలిపి కూడా ప్రశ్నించటానికి నేను సిద్ధముగా ఉన్నాను.

అప్పుడు ఆ సభలోని బ్రాహ్మణులు ఎవ్వరూ యాజ్ఞవల్క్యుని ప్రశ్నించటానికి ఉద్దేశ్యము చేయలేకపోయారు!

---

**28** తాన్ హైతైః శ్లోకైః పప్రచ్ఛ।
యథా వృక్షో వనస్పతిః
తథైవ పురుషో అమృషా।
తస్య లోమాని పర్ణాని।
త్వక్ అస్య ఉత్పాటికా బహిః।
త్వచ ఏవ అస్య రుధిరం,
పస్యన్ది త్వచ ఉత్పటః
తస్మాత్ తదా తృణ్ణాత్ ప్రైతి రసో
వృక్షాది వాహతాత్।
మాగ్ంసాని యస్య (అస్య)
శకరాణి కినాటగ్ం
స్నావ తత్ స్థిరమ్।
అస్థీని అన్తరతో దారూణి, మజ్జా।
మజ్జోపమా కృతా।

ఓ సభలో ఉన్నట్టి ఆత్మానంద స్వరూపులారా! నా ప్రశ్న వినండి. ఏ విధంగా ఒక మహావృక్షము విశాలమైన విశేషములతో కూడుకొని ఉంటోందో, ఆ విధంగా **ఈ పురుషుడు (జీవుడు) సత్యస్వరూపుడు**. వృక్షమునకు ఆకులువంటివే ఈ పురుషుని దేహము, రోమము. ఈ దేహము (చెట్టుకు బెరడువలె) బాహ్యమున చర్మముతో కప్పబడి ఉన్నది. (అనగా ఈ దేహముయొక్క చర్మము వృక్షముయొక్క బెరడువంటిది).

చర్మమును గిల్లితే రక్తము స్రవిస్తుంది. వృక్షముయొక్క బెరడునుండి జిగురు స్రవిస్తూ ఉంటుంది. గాటుపెట్టబడిన చెట్టునుండి జిగురు స్రవిస్తున్నట్లే, గాటు పెట్టబడిన శరీరమునుండి రక్తము స్రవిస్తోంది.

శరీరములో మాంసము - చెట్టు బెరడులోపలిగుజ్జు।

నరములు - కినాటము (చెట్టు లోపలి వస్త్రము వంటి పొర)।

బొమికలు - కాండము లోపలి గట్టి పదార్థములు।

శరీరంలో మజ్జ - చెట్టులో గుజ్జు వంటిది।

ఈ విధంగా వృక్షమునకు ఈ భౌతిక శరీరమునకు తేడా లేదు.

---

యత్ వృక్షో వృక్ణో రోహతి
మూలాన్ (న) అవతరః (నవతరః) పునః।

చెట్టును నరికిన తరువాత కూడా మరల చిగుర్లు చిగురిస్తున్న తీరుగా మృత్యువుచే నరకబడి దేహము నశించగా, జీవుని దేహతత్త్వ భావననుండి మరల మరొక దేహము చిగురిస్తోంది. మరణించినవాడు (దేహి) తిరిగి మరొక శరీరముతో జనిస్తున్నాడు. ఇత్యేవ పునర్జన్మః! అవునా?

---

మర్త్యః స్విన్ మృత్యునా వృక్ణః
కస్మాన్(త్) మూలాత్ ప్రరోహతి। రేతస ఇతి।
మా అవోచత। జీవతస్తత్
ప్రజాయతే ధానారు హ ఇవ వై వృక్షో
అంజసా ప్రేత్య సమ్భవః।
యత్ సమూలం ఆవృ హేయుః,

ఇప్పుడు ప్రశ్న!
మృత్యువుచే శరీరము నాశనము చేయబడగా, అప్పుడు ఆ వ్యక్తి ఏ మూలమునుండి మరల మరొక శరీరములో ఆవిర్భవిస్తున్నాడు?

"రేతస్సు నుండి" - అని ఎవ్వరైనా అంటారా?

సభలో కొద్దిమంది : అవును. రేతస్సు నుండే కదా!

యాజ్ఞవల్క్యుడు : "రేతస్సు నుండి" (శుక్లమునుండే) అని ఎట్లా అంటారు? 'రేతస్సు' అనునది బ్రతికి ఉన్నవారి దేహమునకు సంబంధించినది మాత్రమే కదా! మరణించినవాడికి 'రేతస్సు' అనునదేమున్నది?

**వృక్షం న పునః ఆభవేత్।**

చెట్టు నరకబడినప్పటికీ మరల చిగురించటం కనిపిస్తోంది. చెట్టు కాండమునుంచే కాకుండా విత్తనమునుండి కూడా మొలకెత్తుచున్నది కదా! చెట్టును వ్రేళ్ళతో సహా పెకలించివేస్తే.... **ఇక మరల చిగురించదు.**

---

**మర్త్యః స్విన్ మృత్యునా వృక్ణః**
**కస్మాన్(త్) మూలాత్ ప్రరోహతి।**
**జాత ఏవ, న జాయతే।**
**కోన్వేనం జనయేత్ పునః।**
**<u>విజ్ఞానం ఆనన్దం బ్రహ్మరాతిః।</u>**
**దాతుః పరాయణమ్।**
**తిష్ఠమానస్య తత్ విద ఇతి॥**

మరి మరణించిన మానవుడు (జీవుడు) ఏమూలానుండి (ఏమూలమునుండి) మరల (మరొక దేహముతో) ఉత్పన్నమగుచున్నాడు?

"ఈ పురుషుడు పుట్టియే ఉన్నాడు కదా!" అనునది సమాధానము కాజాలదు. "ఈ జీవుడు మరల ఎక్కడినుండి పుట్టుచున్నాడు"....అనునదే ఇక్కడి ప్రశ్న. చెప్పండి! జన్మకు గాని, పునర్జన్మకుగాని జననస్థానము ఏది? ఆత్మజ్ఞులైన సభికులందరికీ నమస్కరిస్తూ, నేను చెప్పు సమాధానము దయచేసి వినండి.

ఈ దేహములకు ఈ ఇంద్రియములకు, ఈ ఇంద్రియానుభవజగత్తుకు, ఈ అనుభవమగు జీవునకు (To be experiencer) **జననస్థానము విజ్ఞాన - ఆనందములే!** (knowing and Experiencing).

**ఆ విజ్ఞాన ఆనందములు బ్రహ్మముచే సంపదలుగా (సృష్టి-అనే వినోదము కొరకై) ప్రసాదించబడినవి.**

**బ్రహ్మమును ఎరిగినవాడు బ్రహ్మమే. నేనే బ్రహ్మమును। అహం బ్రహ్మాస్మి। తత్త్వమసి। నీవు బ్రహ్మమే అయి ఉన్నావు।**

**సర్వమునకు పుట్టీ, తాను పుట్టని స్థానముగా బ్రహ్మము గమనించబడును గాక!**

**(మనమందరము సర్వదా అయి ఉన్న బ్రహ్మమునకు బ్రహ్మాంజలి।)**

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమోధ్యాయః</u>
<u>శాకల్య బ్రాహ్మణం (నామ)</u>
<u>నవమ బ్రాహ్మణమ్ సమాప్తం</u>

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమోధ్యాయః</u>
<u>శాకల్య బ్రాహ్మణం (నామ)</u>
<u>నవమ బ్రాహ్మణమ్ సమాప్తం</u>

# ఇతి పంచమోధ్యాయః

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## పంచమ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### అధ్యయన పుష్పము



## పంచమ అధ్యాయము – ప్రథమ బ్రాహ్మణము

### యాజ్ఞ వల్కీయ కాండము - అశ్వల బ్రాహ్మణము

విదేహ దేశ జనక మహారాజు లోకప్రసిద్ధుడగు కర్మయోగి. **"కర్మణేవహి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః"**....అని అవతారమూర్తి అగు శ్రీకృష్ణ భగవానుడు స్తుతించినట్టి మహనీయుడు. తత్త్వమును తత్త్వశాస్త్ర విశేషాలను మహనీయులచే పలికించుచూ, మహత్తర జ్ఞానయజ్ఞమును నిర్వర్తించినట్టి లోకకళ్యాణమూర్తి.

ఆ జనక మహారాజు ఒకప్పుడు సర్వమానవ శ్రేయస్సును ఉద్దేశ్యించి ఒక యజ్ఞమును తలపెట్టారు. అనేక ప్రదేశములనుండి విచ్చేసిన వేదజ్ఞులగు బ్రాహ్మణుల మంత్రోచ్ఛారణతో యజ్ఞము ప్రారంభమైనది. అనేకమంది వేదవేత్తలు, వేదాంగవేత్తలు, తత్త్వజ్ఞులు, మునులు, ఆశ్రమవాసులు ఆహ్వానితులై యజ్ఞమునందు పాల్గొనటానికి విచ్చేశారు. యజ్ఞము ఒక పండుగవలె ప్రారంభమైనది.



యజ్ఞము జరుగుచున్నన్ని రోజులు సాయం సమయంలో వేద వేదాంత విశేషాలతో కూడిన సత్సంగము–వేద విహితమైనట్టి, నియమమైనట్టి ఆచారమై ఉన్నాది. అందుచేత జనక మహారాజు ఇట్లు తలచారు.

> *"ఆహాఁ! కురు – పాంచాల – కాశి – మొదలైన అనేక దేశములనుండి వేదవేత్తలగు మహనీయులెందరో వచ్చారు కదా! ఈ సందర్భములో పరబ్రహ్మముగురించిన నిర్వచనములను ప్రకటించగల పండిత సభను జరిపించెదనుగాక! వీరు పరస్పరము సంవాదము నిర్వర్తిస్తూ ఉంటే అది బ్రహ్మభగవానుడు వేంచేసిన సభయే కాగలదు."*

మరియు **"వేదము యొక్క ఉపదేశము** (Message) **+ యుక్తి (ఉపాయము) కలిపి, ఆత్మయొక్క అద్వితీయత నిరూపించబడుచూ, ఆత్మతత్త్వమును కరతలామలకము చేయుటయే, అన్ని కార్యక్రమముల సదుద్దేశ్యము! శాస్త్ర తాత్పర్యము పరిశీలనా పూర్వకముగా నిర్ధారించటానికై ఈ పండిత సభ ఉపయుక్తము అగుగాక!"**...అని కూడా తలచారు.



సత్సంగ సభ ప్రారంభించబడి అనేక ప్రాంతముల నుండి వచ్చిన మహనీయులు, తదితర యజ్ఞదర్శనార్థమై వచ్చిన ఔత్సాహికులు సత్సంగసభలో ఆశీనులైనారు. కురు–పాంచాల ఇత్యాది ఆయా దేశములనుండి వచ్చిన వేద – వేదాంగ వరేణ్యులు, ప్రవక్తలు సభలో

ముందరగా కూర్చోబెట్టబడ్డారు. అనేకమంది వేదవేత్తలలో అత్యంత శ్రేష్ఠుడెవ్వరో (సర్వశ్రేష్ఠుడనతగినవారు ఎవరో) తెలుసుకోవాలని మహారాజుకు కించిత్ కుతూహలము.

అయితే సత్సంగమే ముఖ్యోద్దేశ్యము. శ్రీ జనక మహారాజు లేచి నుంచుని సభను ఉద్దేశ్యించి ఇట్లు ప్రసంగించసాగారు.

---

**శ్రీ జనక మహారాజు :** ఈ సభకు విచ్చేసిన సభికులందరికి ఆత్మభావనాపూర్వకంగా నమస్కరిస్తూ సుస్వాగతము పలకుచున్నాను! కురు–పాంచాల ఇత్యాది అనేక దేశములనుండి (మరియు) ఈ విదేహ రాజ్యములో అనేక ప్రాంతములనుండి వచ్చిన పండితవరేణ్యులు, మునులు, జ్ఞాన వృద్ధులు, వేద – వేదాంగ ప్రావీణ్యులు, ఆబాల –గోపాలము, – మీరంతా విచ్చేయుటచే ఈ యజ్ఞము సఫలము.

ఆత్మ తత్త్వమునందు విజ్ఞానము కలవారిని కలుసుకోవటము, అట్టి మహనీయులు ప్రశ్న – ప్రతివచనములతో సంభాషించుకొనుచుండగా వినటము – ఇది ఆత్మజ్ఞానము పొందుటకు ఉపాయము – అని తర్కశాస్త్రము చెప్పుచూ ఉన్నది.

తత్త్వజ్ఞానవరేణ్యులు ఒకచోట సమావేశమైనప్పుడు శ్రోతలయందు విజ్ఞానము వృద్ధి పొందటము లోకానుభవము కూడా।

ఈ సభలో విచ్చేసిన బ్రహ్మవేత్తలగు వారికి, జ్ఞానవృద్ధులకు, దేశ విదేశమునుండి వచ్చిన ప్రముఖులకు మేము సమర్పిస్తున్న వసతులు, దక్షిణలు మొదలైనవి చక్కగా మా కార్యకర్తలచే అందింపజేయబడుచున్నాయి కదా? **మిథిలా నగరమునకు మీ అందరి రాక మీకు సుఖప్రదమగు గాక। మాకు, మా రాజ్యమునకు శుభము, మంగళప్రదము అగుగాక।**

ఆహ్వానితులగు అనేకమంది జనులు ఈ సభను అలంకరించి ఉండటము మాకు చాలా సంతోషము.

వేదవేత్తలు అనేకమంది ప్రవచన సామర్థ్యము కలవారేనని మనందరికీ తెలిసినదే!

అయితే,

**"అట్టి ఈ సభకు వేంచేసిన వేదవేత్తలలో సర్వశ్రేష్ఠుడు ఎవ్వరు?**...ప్రత్యేకించి ఇది తెలుసుకోవాలని ఒక చిన్న కుతూహలము కలుగుతోంది. అయితే అది తెలుసుకోవటము ఎట్లా? అందరిలో దిట్ట ఎవ్వరో తెలుసుకొనుటకు ఒక ఉపాయము ఆశ్రయించబడుతోంది.

ఇక్కడికి దగ్గరలోని గోశాలయందు మా మంత్రులు వేయి (1000) వయస్సులో ఉన్న గోవులను సంసిద్ధము చేసి ఉంచారు. ఒక్కొక్క గోవుకు రెండు కొమ్ములకు, నాలుగు కాళ్ల గిట్టలకు బంగారముపు తొడుగులు కట్టబడ్డాయి.

బ్రహ్మతత్త్వమును ఎరిగియున్న పూజనీయులగు బ్రాహ్మణులారా! బ్రహ్మజ్ఞులారా! మీరందరూ బ్రహ్మవేత్తలే. ఇందులో సందేహము లేదు. అందుచేత మీ అందరికీ హృదయపూర్వకంగా మరల మరల నమస్కరిస్తున్నాము.

తర్కశాస్త్రమును అనుసరించి **"ఎక్కడ బ్రహ్మవేత్తలు సమావేశమై బ్రహ్మము గురించి విశ్లేషణపూర్వకంగా తర్కించుకుంటూ, చర్చించుకుంటూ సంభాషించుకుంటూ ఉంటారో, అక్కడి శ్రోతలకు బ్రహ్మతత్త్వము కరతలామలకము కాగలదు"**....అను సిద్ధాంతము సర్వజన విదితము.

అందుచేత మావంటి అర్ధజ్ఞుల జ్ఞానవృద్ధిని పూర్ణీకరించుకొను యత్నముగా ఇక్కడి బ్రహ్మవేత్తలు చర్చా పూర్వకంగా బ్రహ్మము గురించి చెప్పుకొనుచుండగా విని, మేము కూడా పునీతులము కావాలనే ఉద్దేశ్యముతో, ఇదిగో – ఇప్పుడు ఈ ప్రకటన చేయుచున్నాను. ఆత్మజ్ఞానవేత్తలగు మీరందరూ దయతో ఈ **సత్సంగ సభ**ను **ఆత్మతత్త్వ సమాచారము**నకు సంబంధించిన ప్రశ్న – సమాధానములతో సభికులందరికి వీనుల విందు చేసెదరుగాక. ఈ ప్రయత్నము ఏ ఒక్కరిని తక్కువగా చేయాలని కాదని ముందుగా నా మనవి. సత్సంగము – ఆత్మశాస్త్ర పరిశీలనయే ముఖ్యోద్దేశ్యము. అందుచేత మరల వినండి.

**మీ అందరిలో ఎవ్వడైతే అతిశయించిన బ్రహ్మవేత్తయో, బ్రహ్మనిష్ఠుడో, "నేను బ్రహ్మమును ఎరిగియున్నాను"....అని ప్రతిజ్ఞ చేస్తారో, శపథము చేసి ఘంటాపథంగా చెప్పుతారో,... వారు మా గోశాల నుండి వేయి గోవులను తమ గృహమునకు (లేక) ఆశ్రమమునకు తోలుకొనిపోవచ్చును.**

అట్టి ప్రతిజ్ఞతో ముందుకు వచ్చిన వారితో సంభాషించదలచువారు, (లేక) తర్కించదలచువారు బ్రహ్మము విషయముగా ప్రశ్న - సమాధానముల పూర్వకముగా తర్కించవచ్చును కూడా! ఎవ్వరి మాట పైచేయి అయితే వారే గోవులను అంతిమంగా గెలుచుకోగలరు. ఇప్పుడిక **"నేను బ్రహ్మనిష్ఠుడను!"**....అని పలికి మా గోశాలలోని గోవులను స్వీకరించటానికి, ఎవ్వరైన ముందుకు రావచ్చును.

ఈ విధముగా పలికి జనక మహారాజు మౌనము వహించారు.

జనక మహారాజు పండిత - బ్రాహ్మణ్యులగు అక్కడి జనులను ఉద్దేశ్యించి ఇట్లా పలుకగా,... **"మేము బ్రహ్మమును ఎరుగుదుము. బ్రహ్మ నిష్ఠులము, బ్రహ్మిష్ఠులము"** అని శపథము చేసి చెప్పుటకు ఎవ్వరూ ధైర్యము చేయనేలేదు. కొద్ది క్షణములు ఆ విధంగా (మౌనంగా/నిశ్శబ్దంగా) గడచిన తరువాత,... **యాజ్ఞవల్క్యుడు**....అను ఆయన లేచి నిలుచున్నారు. చిరునవ్వుతో జనకమహారాజువైపు, సహా సభికులవైపు కలియచూచారు. సభకు సరస్వతీ ఉపాసనాపూర్వకంగా నమస్కరించారు. తనదగ్గిర వేదము చదువుకుంటున్న ఒక విద్యార్థియగు బ్రహ్మచారిని చూచి **"ఓయీ! ప్రియదర్శనుడవగు సామశ్రవసా! జనకమహారాజు గారు ప్రకటించినది విన్నాము కదా! నీవు వెంటనే లేచి బయట ఉంచబడి, నిరీక్షించు గోవులను మన ఆశ్రమమునకు తోలుకొని వెళ్ళుము"**...అని ఆజ్ఞాపించారు. వెనువెంటనే యాజ్ఞవల్క్య శిష్యుడగు సామశ్రవుడు లేచి నిలుచుని **"గురువర్యా! అట్లాగే। ఇదిగో! మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను"** ....అని పలికి అక్కడి సభకు బయటగా వేచి ఉన్న గోవులనన్నిటినీ యాజ్ఞవల్క్య ఆశ్రమమునకు చేరవేయటానికి సంసిద్ధుడు అయినాడు.

ఇక అక్కడి పండితులు, శాస్త్రవేత్తలలో కొందరు - "ఇది ఏమిటి? మనము మహారాజు ప్రకటనను విని కూడా **"మేము బ్రహ్మిష్ఠులము! బ్రహ్మమును ఎరిగి, బ్రహ్మమే అయి ప్రకాశించుచున్నాము"**....అని ఆయన కోరినట్లు శపథం చేయలేదు. ఎందుకు? బ్రహ్మము గురించి తెలియకనా? నిష్ఠ లేకా? కాదే! (**"యతోవాచో నివర్తింతే అప్రాప్య మనసాసహ"** అనునట్లుగా) వాక్కుతో ప్రకటించలేము. అయినా కూడా **"ఇదంతా బ్రహ్మమేనని మేము నిరూపించగల వక్తలమే కదా!"**....అని అనుకోసాగారు. ఆ సభలోగల కొందరు ఋత్విక్కులు కూడా **"మేము వేద -వేదాంగ ఉపనిషత్తువాణి పలుకగలమే! మాకన్నా కూడా నిష్ఠగలవాడినని ఈ యాజ్ఞవల్క్యుడు నిండు సభలో ప్రకటన ఎట్లా చేస్తాడు? ఈ విషయమేదో ఈతనితో మనం తేల్చుకోవలసినదే!"**....అని, కించిత్ ప్రసంగపూర్వకంగా గుసగుసలాడుకో సాగారు.

అప్పుడు.....

అక్కడి జనకమహారాజు రాజ్యములో విదేహ పట్టణ నివాసియగు **'అశ్వలుడు'** అనే ఋత్విక్ బ్రాహ్మణుడు లేచి నిలుచున్నారు. గంభీరమైన వేదవరేణ్య పాండిత్యముతో నిండు కట్టు - బొట్టులతో స్ఫురద్రూపి. ఆయన జనకమహారాజు చేత అనేక యజ్ఞములను చేయించుటచే రాజుకు అత్యంత ప్రియమైన వారు. వేదమంత్రములను అధ్యయనము చేసియున్నవారు. అనర్గళముగా అనేక యజ్ఞముల సంబంధమైన మంత్రములను తాళపత్రములు చూడకుండా గానము చేయగల దిట్ట. వేద వేదాంగములగురించి జనకమహారాజు సభలో అనేకసార్లు ఉపన్యసించి రాజుగారి మెప్పు పొందినట్టివారు. అట్టి అశ్వల ఋత్విక్కు **లేచి నిలుచున్నారు.**

**అశ్వలుడు (ఋత్విక్కు) :** అయ్యా! యాజ్ఞవల్క్యులవారు! అందరికంటే **త్వం ను ఖలు నో, యాజ్ఞవల్క్య! బ్రహ్మిష్ఠోఽసి?** (5-1-2) **"బ్రహ్మ నిష్ఠుడను నేనే!"**... అని చెప్పీ - చెప్పకుండా గోవులను తోలుకొనిపోయి ఒక్కసారిగా ప్రకటిస్తున్నారే? ఏమీ? మీరు మాత్రమే బ్రహ్మిష్ఠులా? మేమంతా కామా? మాకన్నా శ్రేష్ఠులైన బ్రహ్మిష్ఠులా, మీరు? దయచేసి వివరించి చెప్పమని ప్రార్థన।

**యాజ్ఞవల్క్యుడు :** అయ్యా! అశ్వల ఋత్విక్ మహాశయా! ఈ సభలో వేంచేసియున్న అనేకమంది బ్రహ్మవేత్తలకు, తత్త్వజ్ఞులకు, యజ్ఞ-యాగాదులందు అత్యంత ప్రావీణ్యులైన ఋత్విక్కులకు, జ్ఞానులకు, అధ్యాత్మ శాస్త్ర వక్తలకు హృదయపూర్వకముగా నమస్కరిస్తున్నాను.

**నమో వయం బ్రహ్మిష్ఠాయ।**

ఓ జనకమహారాజా! అనేక ఆధ్యాత్మికమైన సిద్ధాంతములను, ప్రవచనములను మహనీయులచే పలికిస్తూ కర్మయోగిగా ప్రసిద్ధి పొందినట్టి (లోకప్రసిద్ధులైన) మీకు చేతులు ఎత్తి హృదయపూర్వకముగా నమస్కరిస్తున్నాను!

బ్రహ్మమే స్వరూపులై, అస్మత్ ఆత్మ స్వరూపులే అయిఉన్న సభలోని వారందరికీ నమస్కారము.





ఓ అశ్వల మహాశయా! మేము బ్రహ్మవేత్తలకు సర్వదా దాసానుదాసులమై నమస్కరించువారము మాత్రమే! **"మనమంతా నిస్సంకోచంగా సర్వదా బ్రహ్మమే అయి ఉన్నాము"** – అనేది నిస్సంశయ సత్యమే. ఇందులో అనుమానమే లేదు కదా।

మరి ఇప్పుడు ఈ జనక మహారాజు ప్రకటనను ఆమూలాగ్రము విని కూడా గోవులను ఎందుకు స్వీకరించామని ప్రశ్నిస్తున్నారా? ఎందుకో వినండి! **కూర్మో గో కామా ఏవ వయంగ్ం స్మ ఇతి। (5-1-2)।**

→ **మేము గోవులను ఆశ్రమము యొక్క – అవసరముల కొరకై కోరువారము మాత్రమే.**

మా ఆశ్రయములోని అనేకమంది విద్యార్థులకు, శిష్యులకు ఇది పరిపోషణ కాగలదు.

→ **బ్రహ్మవేత్తత్త్వమును పణముగా (పందెముగా) ఉంచి గోవులను స్వీకరించుచున్నాము.**

అంతేగాని (కించిత్ చిరునవ్వుతో) బ్రహ్మవేతృత్వమునందు అభిమానముతో కాదు. 'నేను అధికుడను' – అను అహంకారముతో కాదు!

**అశ్వలుడు :** ఓహో! బ్రహ్మవేతృత్వమును పణము (Pledge - As security)గా పెట్టి గోవులను తోలుకుపోతున్నారా? ఏమి చమత్కారము! అయితే, ఈ విదేహ రాజ్యములో జనక మహారాజుగారి యజ్ఞ కార్యక్రమములలో ఋత్విక్కుగా సేవించుచున్న ఈ అశ్వలుని (నాయొక్క) కొన్ని ప్రశ్నలకు మీరు సమాధానము చెప్పవలసియున్నది. అందుకు మీరు సంసిద్ధులేనా!

**యాజ్ఞవల్క్యుడు :** అయ్యా! అశ్వల ఋత్విక్ మహాశయా! తప్పక ప్రశ్నించండి. నాకు అనుభవమైనదంతా, ఎంతవరకు వాక్కుతో వివరించగలనో, – అంతవరకు చెప్పటానికి సంసిద్ధుడనై ఉన్నాను.

## మృత్యువునకు సాక్షిగా అయి, మృత్యువును జయించటం

**అశ్వల ఋత్విక్ :** ఋత్విక్కులమగు మేము అగ్ని మొదలైన ఆయా అనేక సాధన వస్తువులను ఉపయోగించి 'పాంక్త కర్మ' (యజ్ఞ–యాగ కర్మ) యజమానునిచే చేయిస్తూ ఉన్నాము కదా!

ఈ ప్రపంచములోని వస్తు సముదాయమంతా మృత్యువుచే వ్యాపించబడి ఉన్నది.

అంతేకాదు. కర్మరూపముగా ఉన్నది, కర్మ సాధన వస్తువులు...మొదలైనవన్నీ కూడా **'ఆసక్తి'తో, 'ఆవేశము'తో ఉండి ఉంటున్నాయి. అవన్నీ మృత్యువుచే వ్యాపించి ఉండుటయే కాకుండా,.....** మృత్యువుకు వశమై కూడా ఉన్నాయి కూడా! **(యత్ దృశ్యమ్ తత్ నశ్యమ్!)**

అవునా? కాదా?

అటువంటప్పుడు కర్మ నిర్వర్తించుచ్ను యజమానుడు మృత్యువుకు 'ఎర' అగుచున్న ఆయా వస్తు సముదాయమును ఉపయోగించి నిర్వర్తించు క్రియా (కర్మ) వ్యవహారములచే **ఎట్లా మృత్యువును జయించగలడు**? మృత్యువుయొక్క వ్యాప్తిని అధిగమించి, మృత్యువుకు వశము కాకుండా **మృత్యువునుండి విముక్తుడై స్వతంత్రుడై ఉండగలడా? అమృతతుల్యుడు కాగలడా?**

(లేక) యజమాని నశించబోవుచున్న వస్తువులను పణముగా పెట్టి (లేక) ఉపయోగించి 'నాశనము' అను మృత్యువును వశం చేసుకొని, మృత్యువును (మార్పుచేర్పులను) అధిగమించి విముక్తుడై....అమృత స్వరూపుడు ఎట్లా అవగలడు? ఇది చెప్పండి!

**యాజ్ఞవల్క్యుడు : హోత్రర్త్విజా అగ్నినా వాచా వాగ్వై యజ్ఞస్య। (5-1-3)।** వాక్కుచేత యజమాని మృత్యువును అధిగమిస్తున్నాడు. పరికరములు నాశన ధర్మము కలిగి ఉండవచ్చు గాక! కాని **'యజ్ఞవాటిక'**లో కాలుచున్న అగ్నిమాత్రమే అగ్ని కాదు. 'వాక్కు' అగ్నియొక్క అధిదైవ (దేవతా –దివ్య) స్వరూపము. అదియే వేదమంత్రోచ్చారణ. ఆ వేదమంత్రమును యజమానియొక్క పలుకులుగా పలుకుచున్నవాడే – హోత (లేక) ఋత్విక్కు.

- యజమాని యజ్ఞముయొక్క 'వాక్' రూపము – అని కూడా సిద్ధాంతీకరించబడుతోంది.
- యజమాని కోరికపై హోతయొక్క మంత్ర శబ్ద రూప వాక్కుయే **అధియజ్ఞము.**
- ఆ మంత్రము యజమాని కొరకై పలుకువాడు హోత.

- యజ్ఞరూపుడై యజమాని వాక్కు పలకటము - అనబడే **అధిదైవతము (దేవతా వర్గముయొక్క పరిధి)** నందు ప్రసిద్ధమైయున్నది **అగ్నియే.**
- వాక్ రూపుడగు అగ్నియే యజ్ఞమునందు **'హోత'**గా ఉపాసించబడుచున్నారు.

**స ముక్తిః। స అతి ముక్తిః।**

**ముక్తి = హోతను, అగ్నిదేవునిగా** *(హోత రూపములో ఉన్న అగ్నిగా) దర్శించుటయే ముక్తి.* ***"అగ్నిదేవుడే యజ్ఞమునకు హోత"*** *- అని భావించుటయే సంసారబంధ విముక్తి మార్గము.*

ఎప్పుడైతే యజ్ఞముయొక్క యజమాని వాక్కు+హోతలను అగ్నిరూపముగా ఉపాసిస్తూ-దర్శిస్తాడో, ఆ వెనువెంటనే అజ్ఞానము నుండి పుట్టిన **ఆసక్తి** (Inquisitieness, expectation).... అను **అధ్యాత్మిక మృత్యువు** నుండి క్రమేపి విముక్తుడౌతాడు.

అంతేకాదు.

ఆ యజమాని 'దేహము + దృశ్యము' అను రెండిటియొక్క దేశకాలముల (Place factor and Time factor) ఆధారరూపమగు దృశ్య సంబంధమైన మృత్యువునుండి కూడా 'విముక్తి'ని పొందుచున్నాడు. **మార్పు చెందని వస్తువు (ఆత్మ)తో మమేకమే** - మృత్యువును దాటి పోవటము (లేక) **అమృతత్వమును సిద్ధించుకోవటము.** ఇంక వేరే త్రోవ లేదు.

**హోత + వాక్కులను అగ్నిరూపముగా** ఉపాసించటమే **యజమానికి ముక్తిసాధనము. అదియే అతిముక్తి కూడా!**

**"నేను దేశ - కాలములకు, దేహ - దృశ్యములకు బద్ధుడను కాను"**....అని హోత పలుకుచున్న సారాంశ వాక్ స్వరూపములను అగ్నిరూపముగా ఉపాసించుటచే యజమానియందు యజ్ఞపురుషత్వము రూపుదిద్దుకున్నప్పుడు ఇక **"బంధము ఉన్నది"**... అను ప్రసక్తియే ఉండదు. **కనుక అదియే 'అతిముక్తి'. అదియే (ఏకాగ్ని రూపముగా ఉపాసించుటయే) అధిదైవోపాసన కూడా।**

## 'బంధము' అనగా ఏమి?

ఆధిభౌతికమైన - **నశించు (పరిచ్ఛిన్నములగు) విషయభోగములపట్ల ఏర్పడు ఆసక్తియే బంధము.** అనగా, అధిభూతములందు (శబ్ద-స్పర్శ- రూప-రస- గంధములకు విషయములుగా కనిపిస్తున్నవాటియందు) **వేదనయే మృత్యువు.** ఎందుకంటే **అవన్నీ కూడా** దేశ-కాలములకు సంబంధించినవై, దేశ -కాలముల ప్రభావముచే మార్పు చేర్పులు చెందటము జరుగుచుండటం చేత. **ఆసక్తులు** తీవ్ర వేగము సంతరించుకొని బంధముగా అనుభూతమౌతున్నాయి. నిజానికి, యజ్ఞపురుషుడగు యజమానియొక్క స్వస్వరూపాత్మకు బంధమెక్కడిది?

ఇప్పుడు, యజమాని అధ్యాత్మములందు [ పరిచ్ఛిన్న విషయ భోగములందు, ఆధిభూతముల యందు (అనగా) దేహ - దృశ్య పదార్థములందు] ఏర్పడు **'ఆసక్తి'**ని విరమింపజేసుకొనుచూ, వాక్-హోతలను (అనుభవము - యజ్ఞములను) ఏకము చేసి అగ్నిరూపముగా ఉపాసించుటయందు **ధ్యాసద్వారా ఆసక్తిని** పెంపొందించుటయే అతిముక్తి కూడా! **అట్టి ప్రయత్నమే ఆత్మోపాసన.**

ఇకప్పుడు దేహములోని వాక్కు, కనులు, చెవులు, నాలుక మొదలైనవన్నీ కూడా, వాటివాటి విషయములతో సహా - ఆ యజమానిపట్ల ఆదిత్యరూపమును (లేక అగ్నిరూపమును) సంతరించుకొనగలవు.

# యజమాని ఆదిత్య స్వరూపుడై అహోరాత్రములను జయించటం।

**అశ్వల బ్రాహ్మణుడు : సంతోషము.** అయితే, ఓ యాజ్ఞవల్క్యా! ఇక్కడ కనబడుచున్నదంతా కూడా **'పగలు - రాత్రి'**లచే వ్యాపించినదై ఉన్నది. అంతేకాదు. ఇదంతా కూడా అహోరాత్రములచే (పగలు- రాత్రులచే) తమ వశముగా చేసుకొనబడినదై ఉన్నది. (కాలోఽస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధో।) అనగా,-

→ ఈ రాత్రి ఏమి జరగబోవుచున్నదో, అది రాత్రికి వశమై ఉన్నది.

→ ఈ పగలు ఏమి జరగబోవుచున్నదో, అదంతా కూడా పగలుకు వశమైయన్నది.

ఇప్పుడు నా ప్రశ్న?

**కేన యజమానో అహోరాత్రయోః ఆప్తి ఉచ్యాత ఇతి? (5-1-4)।**

**యజ్ఞము నిర్వర్తించు యజమాని దేని సహాయముతో అహోరాత్రముల వ్యాప్తి నుండి అతిక్రమించి విముక్తుడు కాగలడో**, అది వివరించండి!

**యాజ్ఞవల్క్యుడు :** పగలు – రాత్రి యొక్క పరిమితత్వమును మూడింటి సహాయముచే యజ్ఞము నిర్వర్తించు యజమాని అధిగమించగలడు.

(1) ఆధ్వర్యుడు → యజ్ఞము చేయించువాడు. ఋత్విక్కు.

(2) కన్ను (చూపు).

(3) ఆదిత్యుడు.

ఆధ్వర్యుడే నేత్రము. **నేత్రము (చూపు)గా ఉన్నది ఆదిత్యుడే.**

ఆధ్వర్యుని నేత్రముగాను, ఆదిత్యునిగాను ఉపాసించువాడు పగలు – రాత్రులను అధిగమించగలడు. పగలు – రాత్రిలను గుర్తిస్తున్నదెవరు? చూపు కదా? ఆ చూపు ఎక్కడి నుండి ప్రభవించి దేహములో సిద్ధిస్తోందో, అదియే ఆదిత్యుడు।

→ 'కన్ను' అనగా అందలి చూపుశక్తి.

→ చూపుశక్తియే– **"చూచునది– చూపబడునది"** అగు ఆధ్వర్యుడు. (లేక) ఆ చూపును సకల దేహములలో ప్రతిక్షేపించే దివ్య దేవతా శక్తి!

→ దివ్యశక్తి అనగా అందుకు అధిదేవతయగు ఆదిత్యుని రూపమే!

ఈ **"కన్ను, చూపు, ఆధ్వర్యుడు, ఆదిత్యుడు – సర్వదా ఏకరూపులే"**...అను జ్ఞాపకముతో కూడిన జ్ఞానమే ముక్తి! **"అట్టి ఏకత్వముయొక్క చమత్కారమే ఆత్మయొక్క ప్రదర్శనము"** అనునది **అతిముక్తి!** అట్టి ఏకత్వ ఉపాసనచే **యజమాని ఆదిత్యస్వరూపుడగుచున్నాడు.** ఆదిత్య స్వరూపునకు పగలు, రాత్రీ ఉండవు కదా! **ఆ విధముగా యజమాని అహోరాత్రములను జయించినవాడగుచున్నాడు.** ఎందుకంటే, నిత్యస్వయం ప్రకాశకుడగు సూర్యునికి పగలు రాత్రి ఏమి ఉంటాయి? ఏకత్వోపాసకుడగు యజమాని పట్ల చీకటి రూపమగు సంసారము స్వభావపూర్వకంగా పటాపంచలగుచున్నది. (Sun has no Dawn and no Dust).

## *యజమాని ప్రాణ(వాయు) ఉపాసనచే ప్రాణస్వరూపుడై → కాలమునుండి 'అతిముక్తి'*

**అశ్వల ఋత్విక్కు :** ఓ యాజ్ఞవల్క్యా! ఈ కనబడే సర్వము **పూర్వ పక్షము – పరపక్షము** యొక్క ఆధీనములో ఉన్నది కదా! (శుక్లపక్షము – కృష్ణపక్షముల ఆధీనముకదా!). ఇదంతా కూడా శుక్ల–కృష్ణ పక్షములచే విస్తరించి, వాటియొక్క వశమునందు ఉన్నది. లేక కాలమునకు వశమై ఉన్నది. కాలముచే జనిస్తోంది, కాలముచే వృద్ధి చెందుతోంది, కాలముచే నశిస్తోంది.

– కాలముచే వ్యాపించక, కాలమునక వశమై ఉండనిది ఇక్కడ **త్రిలోకములలో** ఏదైనా ఉన్నదా? ఏ ఒక్కటీ లేదు కదా!

దృశ్యములో కనిపించే సాధన వస్తువులు కూడా కాలగతికి ఎర అయి, శుక్ల–కృష్ణ పక్షములకు వశమై ఉంటున్నాయి. అటువంటప్పుడు **సాధకుడు ఏ సాధనములను స్వీకరించి శుక్ల – కృష్ణ పక్షముల వ్యాప్తిని అధిగమించి ముక్తిని పొందగలడు?**

సర్వము రాత్రింబవళ్ళు వలననే పుట్టుచున్నాయే! రాత్రింబవళ్లు పెరిగి నశిస్తున్నాయి కూడా. యజ్ఞసాధనములు అయినట్టి హవిస్సు, కర్మ, కర్మఫలములు, – ఇవన్నీ కూడా కాలముచే వృద్ధి చెంది, కాలముచే నశించేవే కదా! మరి యజమాని ఏ ఉపాసనచే శుక్ల – కృష్ణ గతులను దాటి అమృతత్వము పొందగలడు? కాల–కర్మగతులను అధిగమించగలడు?

**యాజ్ఞవల్క్యుడు :** ఆదిత్యుని వలన పగలు – రాత్రి కలుగుచున్నప్పటికీ, ఆదిత్యుడు అవి పొందడు కదా? అట్లాగే శుక్ల – కృష్ణ పక్షములు చంద్రునివలన కలుగుచున్నప్పటికీ, (పాడ్యమి–విదియ–తదియ మొదలైనవి కలగటానికి కారణము చంద్రుడే అయినప్పటికీ) చంద్రుడు వాస్తవానికి వృద్ధి – క్షయములు పొందువాడుకాడు. **యజమాని మార్పు – చేర్పులకు అందని కాలమునకు ఆవలగల చంద్రోపాసనచే ఏకతత్త్వమును సంతరించుకొన్నప్పుడు** స్వభావంగానే శుక్ల–కృష్ణ పక్షములను (లేక) వృద్ధి క్షయములను అధిగమించుచున్నవాడగుచున్నాడు. పూర్ణచంద్రభావముచే శుక్ల–కృష్ణ–నక్షత్రభావములను అతిక్రమించి ముక్తి, అతిముక్తి పొందుచున్నాడు. (చంద్రుని వృద్ధి క్షయములు భూమి – చంద్ర – సూర్య–జ్యోతిర్మండల స్థానములు కారణంగా కల్పితమౌతున్నవి మాత్రమే)।

అది ఎట్లో చెప్పుచున్నాను, వినండి!

- ఈ యజమాని యొక్క ప్రాణమే → వాయువు.
- ఆ వాయు స్వరూపమగు ప్రాణమే → ఉద్గాతము (స్వరము – గానము – స్తోత్రము).
- వాక్కు + ప్రాణశక్తిచే స్వరము (శబ్దము, ఉద్గాతము) ఏర్పడుచున్నది.
- ప్రాణమునకు జలము త్రాణ. కనుక ప్రాణమునకు జలము ఆశ్రయమై ఉన్నది.
- **ఇంద్రియములను ప్రకాశింపజేయునది చంద్రశక్తి.**

**"ఈ వాయువు – ప్రాణము – వాక్కు – చంద్రుడు – జలము ఏకరూపమే"** అని భావించుటచే యజమాని శుక్ల–కృష్ణ పక్షముల భేదము జయించుచున్నాడు.

వాయువే జగద్వ్యాపకమగు ప్రాణశక్తి! ఆ వాయు సంబంధము చేతనే చంద్రునికి వృద్ధి క్రమములు. అనగా....

- తిథి, పక్షము మొ॥వి భోగములకు కారణము చంద్రుడు.
- ఆ చంద్రునిచే అట్లు విభాగము చేయించునది ప్రాణశక్తి.

ప్రాణమును తిథి – శుక్ల కృష్ణ పక్షములను చంద్రుని రూపముగా (లేక) **ఏకరూపముగా దర్శించుటచే యజమాని మార్పు – చేర్పులు పరిధిగాగల మృత్యువును జయించి 'ముక్తి', 'అతిముక్తి'** పొందుచున్నాడు.

***"ప్రాణమే వాయువు. వాయువే యజ్ఞములో స్తోత్రము। చంద్రుడే ప్రాణ ఉద్గాతము। ఇవన్నీ ఏకస్వరూపమే। అనేకము కాదు!"...అను ఉపాసనయే ముక్తి.***

**అశ్వల ఋత్విక్ :** ఓ యజ్ఞవల్క్యా మహాశయా! **అస్తు.** (It is so). ఇంకొక ప్రశ్న. ఈ ఆకాశము (అంతరక్షము) ఏ ఆధారము లేని దానివలె (దేనిపైనా ఆధారము లేని దానివలె) కనిపిస్తోంది కదా! **యత్ ఇదమ్ అన్తరిక్షమ్ అనారంభణమివ, ... కేన ఆక్రమేణ యజమానః స్వర్గం లోకం ఆక్రమిత ఇతి**? మరి దేనిని ఆధారముగా ఉండి యజమాని ఊర్ధ్వలోకములు అగు 'స్వర్గము' ఇత్యాదులను తన కర్మఫలములుగా పొందుచున్నాడు? దేనిని సాధనముగా పట్టుకొని యజమాని ఆకాశమును అతిక్రమించి కర్మఫలమైన స్వర్గము పొంది అతిముక్తుడు అగుచున్నాడు?

**యాజ్ఞవల్క్యుడు : బ్రహ్మా ఋత్విజో – మనసా చంద్రేణ – మనోవైయిజ్ఞస్య। (5–1–6)।**

→ బ్రహ్మ (సృష్టికర్త) → అను ఋత్విక్కునిచే।

→ మనస్సే – యజ్ఞము।

ఈ ఈ **సృష్టి కల్పన + మనస్సులను ఉపయోగించుకొని – స్వర్గలోకము, అతిముక్తి ఈ జీవుడు పొందుచున్నాడు.**

యజమాని → **'అధ్యాత్మ'** స్వరూపుడు.

మనస్సు → **'అధిదైవతము'** అగు చంద్రుడు

చంద్రుడే → **'బ్రహ్మ'** అనే ఋత్విక్కు

ఈ (1) ఆధ్యాత్మరూపమైన మనస్సు, (2) కర్మ సాధనములైనటువంటి **'బ్రహ్మ'** అనే ఋత్విక్కు, (3) మనోస్థానమగు చంద్రుడు. ఈ మూడు ఏకరూపముగా (ఒకేరూపముగా) చూచుటయే ముక్తి.

***మనస్సుతోనే కదా లోకాలు పొందేది!***

***కనుక లోకముల రూపము మనస్సే.***

*లోకసాధనములు కూడా మనస్సే। లోకములను సిద్ధింపజేసే ఋత్విక్కు కూడా మనస్సే।*

*ఏకత్వదర్శనముచే ఏర్పడుచున్నదే అతిముక్తి। అనేకముగా కనిపిస్తూ ఇదంతా ఏకముగా అనిపించటమే 'అతిముక్తి'।*

**అశ్వల ఋత్విక్కు :** స్వామీ! యాజ్ఞవల్క్యా! సరేః! (It is correct). ఇదిగో ఇది చెప్పండి! **కతిభిః అయమ్ అద్యర్భిః హోతా అస్మిన్ యజ్ఞే కరిష్యతి? (5-1-7)।** ఇప్పుడు ఈ యజ్ఞమునందు హోత ఎన్ని ఋక్‌మంత్రములచే హోత్రము చేయుచున్నాడు? (లేక) ఎన్ని ఋక్కులతో శంసనము (దేవతల గుణములను స్తోత్రము) చేయుచున్నాడు?

**యాజ్ఞవల్క్యుడు : త్రి స్రుభారితి।** '3' రకములైన ఋక్కులతో (ఋక్ మంత్రములచే) యజ్ఞమునందు యజమాని దేవతా గుణములను స్తోత్రము చేయుచున్నాడు. (Broadly speaking, Three types of RUKs)

**అశ్వలుడు :** ఆ మూడు ఋక్కులు ఏవేవి?

**యాజ్ఞవల్క్యుడు :**

(1) **పురోనువాక్య :** ఏవైతే హోమము చేయబడినవై ప్రజ్వలిస్తూ ఉంటాయో, అని – **పురోనువాక్య. దేదీప్యమానమగు దేవలోకమును జయింపజేసేవి.** (సమిధలు, నేయి, నూతన వస్త్రశకాలములు మొ॥వి). (Introductory Welcome Stanzas).

(2) **యాజ్యము :** ఏవైతే హోమము చేయబడి పెద్దశబ్దమును చేస్తాయో, అవి **యాజ్యము**. పిత్రులోకమును జయింపజేసేవి. ఎందుకంటే పిత్రులోకము అధికమైన శబ్దము చేస్తున్నట్లుగా ఉంటాయి కాబట్టి. (మాంసము, వండిన అన్నము మొదలైనవి)

(3) **శస్య :** ఏ ఆహూతులైతే హోమము చేయబడినవై నేలలోకి ఇంకిపోతాయో – అవి మానవలోకం క్రింద ఉండి ఉన్నది కనుక! (పాలు, సోమలతనుండి పిండగా వచ్చిన సోమరసము, పెరుగు మొదలైనవి).

వీటివలన మానవలోకం జయించబడుతోంది. (మానవలోకముగా కనిపించేది కూడా ఆత్మయే అనిపించగలదు). పై మూడిటిచే – సమస్తమగు ప్రాణికోటి (ప్రాణి సముదాయము)ను ఆ యజమాని జయిస్తున్నాడు. (అనగా) సమస్త ప్రాణులను అఖండాత్మగా దర్శించగలడు.

**అశ్వలుడు :** ఈ మూడిటి హోమముచేత యజమాని ఏమేమి ఇంకా జయిస్తున్నాడు? యజ్ఞమునందు ఎన్ని ఆహుతులను హెూమము చేస్తూ ఉన్నాడు?

**యాజ్ఞవల్క్యుడు :** వినండి.

<u>పైకి ఎగబ్రాకు ఆహుతులు :</u>

**ప్రజ్వరిల్లు హోమద్రవ్యములు (సమిధలు, నేయి, నూతన వస్త్రపు ముక్కలు)** → ఈ ఆహూతులు 'దేవలోకము' అనే కర్మఫల రూపములు అగుచున్నాయి. **దేవలోకము ఆత్మభావముచే జయించబడగలదు.** దేవలోకము ప్రకాశవంతమైనది. (Enlightenment).

<u>ఎక్కువ శబ్దము చేసే ఆహుతులు :</u>

**శబ్దముచే హోమద్రవ్యములు మాంసము, వండిన అన్నము మొదలైనవి** → పిత్రులోకము కర్మ ఫలమగుచున్నది. యజమాని యమ బాధలనుండి గట్టెక్కగలడు. (పిత్రు లోకము శబ్దములతో నిండినది). (Workers of Universe / Mental Zone Stanzas about the creation and the creator).

<u>క్రింద భాగమునకు పోవు ఆహుతులు :</u>

**నేలను ఇంకు హోమద్రవ్యములు పాలు, సోమరసము, పెరుగు మొదలైనవి**→యజమాని మనుష్యలోకము జయిస్తున్నాడు. అనగా, యజమాని మనుష్యలోకమును ఆత్మగా దర్శించగలడు. (రెండు పైలోకములకు క్రిందది). (Mandana Zone / The Worldly)

*పై '3' ఆహుతులచే త్రిలోకములు ఆత్మభావన యందు ఉపశమించగలవు.*

**అశ్వలుడు: కతిభిః అయం అద్య బ్రహ్మా యజ్ఞం దక్షిణతో దేవతాభిః గోపాయతీతి?** (5-1-9)। 'బ్రహ్మ' అనే ఋత్విక్కు దక్షిణ దిశ నుండి (కుడివైపుగా) ఎందరు దేవతలచే రక్షింపబడుచున్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** ఒకే దేవత. 'మనస్సు'యే ఆ ఒకే దేవత. అట్టి మనస్సు అనంతస్వరూపము (There is no limitation to Thought).

బ్రహ్మయే ఋత్విక్కు. హోమము చేసే అగ్ని గుండమునకు ఎడమవైపుగా **"బ్రహ్మ ఋత్విక్కు యొక్క ఆసనము"** నిర్దేశించబడింది. ఆయన ఆ ఆసనము మీద కూర్చుని ఉండి యజ్ఞమును రక్షిస్తూ ఉంటారు.

ఆయన **'మనస్సు'** అనే (ఆయనకు కుడివైపునగల) దేవత ద్వారా యజ్ఞగుండమును పర్యవేక్షిస్తూ ఉంటారు.

మనస్సు 'ధ్యానము' (Avocation) అనే వ్యాపారము (Function) చేస్తుంది కదా!

యజ్ఞమునకు → **(1) మనస్సు (2) వాక్కు** అనునవి రెండు మార్గములు. (ముఖ్య ఉపకరణములు).

వాక్కును ఋత్విక్కు మనస్సుతో సంస్కరిస్తూ, రక్షిస్తూ ఆశీనులై ఉంటున్నారు. ఇక యజమాని చేయవలసినది ఏమిటి? **తన మనస్సును ఏకాగ్రం చేసుకుంటూ ఉండాలి. మంత్రోచ్ఛారణ, అర్థము, తాత్త్వికార్థములపై నియమించుకోవాలి.**

కాబట్టి **మనస్సే దేవత.** మనస్సు ద్వారా యజ్ఞము రక్షింపబడుతోంది. మనస్సు యొక్క వృత్తులకు అంతము ఉండదు. అందుకే మనస్సు అనంతము, "ఒక నవలారచయిత ఎన్ని నవలలు వ్రాయగలడు? ఎన్నెన్ని పాత్రలు కల్పించగలడు?"... అనుదానికి సమాధానము ఏముంటుంది? "ఇన్నే!"...అనునది ఏమున్నది?

ఆ మనస్సుకు అధిష్ఠాన దేవతలు 'విశ్వేదేవతలు'. వారు కూడా అసంఖ్యాకులే!

ఇంద్రియ దేవతలందరు మనస్సునందే ఏకరూపము సంతరించుకుంటున్నారు.

కనుక **మనస్సే ఋత్విక్కుకు కుడివైపు ఉండి యజ్ఞమును రక్షించు దేవత!**

**అశ్వలుడు :** ఓ యాజ్ఞవల్క్య మహానుభావన్! ఈనాడు ఈ యజ్ఞములో ఉద్గాత (దేవతా స్తోత్రములను చేయువారు) ఎన్ని ఋక్కులను (లేక) గానములను స్తోత్రము చేయుచున్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** '3' స్తోత్రములు (లేక) ఋక్కులు – (లేక) మంత్రములతో ఋత్విక్కు (లేక ఉద్గాత) స్తోత్రము చేయుచున్నారు.

**(1) పురోనువాక్య – ప్రాణము.** ప్రాణమే పురోనువాక్య. **"ప్రాణమును స్తుతించు ఋక్కులు – ప్రాణ ఉద్గాతము"** చే ఋత్విక్కు భూమిని (భూలోకమును) శుభ్రపరచి, జయిస్తున్నారు!

**(2) యాజ్య → అపానము.** అపానమే 'యాజ్య'. అపానమును స్తుతించు **"ఋక్కులు – అపాన ఉద్గాతము"** చే ఋత్విక్కు అంతరిక్ష లోకమును శుభ్రపరచి, జయిస్తున్నారు!

**(3) శస్య → వ్యానము.** వ్యానమే 'శస్య'. **"వ్యానమును స్తుతించు ఋక్కులు – వ్యాన ఉద్గాతము"** చే ద్యులోకములను (జ్యోతిర్మయ-దివ్యలోకములను) జయిస్తున్నారు!

***యాజ్ఞవల్క్యుడు తన ప్రశ్నలకు ఇచ్చిన సమాధానములను విన్న జనకమహారాజు యొక్క యజ్ఞక్రియల ఋత్విక్కు అగు అశ్వలుడు తృప్తి పొంది శాంతించారు.***

## పంచమ అధ్యాయము - ద్వితీయ బ్రాహ్మణము

## ఇంద్రియములు-గ్రహత్వము-అతిగ్రహత్వము

జరత్కార వంశజుడు, ఋతుభాగుని కుమారుడు జరత్కారుడు అగు **ఆర్తభాగుడు** లేచి నిలుచున్నారు. తన వంశ గోత్ర నామములు సభకు నివేదించి, **"సభాసదుల అనుజ్ఞతో ఈ యాజ్ఞవల్క్యులవారిని ప్రశ్నించుచున్నాను"** అని పలికారు. సభాసదులు "అటులే జరుగు గాక।" – అని ప్రోత్సహించారు.

**ఆర్తభాగుడు :** ఓ యాజ్ఞవల్క్య మునివరా! ఇదిగో, ఈ ప్రశ్న మీముందు ఉంచుచున్నాను.

**కతి గ్రహాః? కతి అతిగ్రహా?** జ్ఞాన సాధనములు, వాటి సహాయక సాధనములు ఎన్నెన్ని? (అనగా) గ్రహములెన్ని? అతిగ్రహములెన్ని? అవి ఏవేవి?

**యాజ్ఞవల్క్యుడు :** గ్రహములు – (జ్ఞాన) సాధనములు – '8'. (గ్రహించు ఇంద్రియములు)

అతిగ్రహములు (జ్ఞాన) సహాయకములు – '8' (గ్రహించబడు విషయములు)

[ గ్రహించునది కాబట్టి గ్రహము (ఇంద్రియములు)]

అట్టి అష్ట గ్రహములు అష్ట అతిగ్రహములు (1) గ్రహించుచున్నట్టి ఇంద్రియములు, (2) గ్రహించబడుచున్న ఇంద్రియ విషయములు) గురించి చెప్పుకుంటున్నాము. వినండి.

**(1) ప్రాణేంద్రియము (లేక) ఘ్రాణేంద్రియము : ప్రాణోవై గ్రహః॥**

గంధము గ్రహించునది ఘ్రాణేంద్రియము. ఇది మొదటి గ్రహము. ఈ ఘ్రాణేంద్రియము వాయవు (ప్రాణము)తో కూడి ఉంటోంది. ఈ ఘ్రానము – అపానవాయువుచే గంధము స్వీకరిస్తూ కూడా ఉంటోంది.

గంధము ఆ ఘ్రాణమును (ఇంద్రియమును) అతిక్రమించి ఉంటుంది. ఘ్రాణేంద్రియమును తన వశంలో అపానవాయువుగా (గంధముగా) ఉంచుకొని ప్రవర్తిస్తుంది. అందుచేత అపానవాయువు (లేక) గంధమును 'అతిగ్రహము' అని అంటున్నారు. పీల్చే గాలికి గంధము (వాసన) తోడుగా ఉంటోంది. కాబట్టి అద్దానిని అపానము (పీల్చబడునది) అని అంటున్నారు. సకల ప్రాణులు పీల్చే గాలితోబాటుగా గంధమును కూడా ఆస్వాదిస్తున్నారు కదా! (అపానము....అనునది బయటకువెళ్ళు గాలి – అని ఇక్కడ తీసుకోకూడదు). **అపాన్ గంధాన్ జిఘ్రుతి** – పీల్చుగాలితో బాటు జీవుడు వాసన (గంధము)ను కూడా తీసుకొనుచున్నాడు కాబట్టి :-

(1) పీల్చు గాలి (ప్రాణమ) → గ్రహము.

(2) గాలిని అనుసరించి ముక్కు → అతిగ్రహముతో ప్రవేశించు గంధము.

జీవుడు **పీల్చబడు వాసనలకు ప్రియ – అప్రియ భావనలచే వశుడగుచున్నాడు. అందుకే వాసనానుభవము గ్రహము. ఇష్ట-అయిష్ట వాసనలు అతిగ్రహము.**

**(2) వాక్ వై గ్రహః॥** : ఇది రెండవ గ్రహము – వాక్కు।

వాక్ ఇంద్రియమే → గ్రహము (సాధనము)।

పలుశబ్దములు → అతిగ్రహము (వక్తవ్యము)।

**వాక్కు** – నామములు, నామోచ్చారణచే నియమించబడుచున్నది. అందుచేతనే వాక్ ఇంద్రియములో ఈ జీవుడు లోకములో నామములు పలుకుచున్నాడు. (అనేక మాటలు మాట్లాడుచున్నాడు).

నోరు – గ్రహము.

మాట్లాడబడునది – అతిగ్రహము.

శబ్దము – ఆసక్తికి ఆశ్రయమగు పేర్లు, పలుకులు మొదలైనవి.

ఆసక్తి కారణం చేత ఈ జీవుడు వాక్కుతో,

= **అసత్యము** → ఇతరులను పీడించే – సత్యము కాని మాటలకు,

= **అనృతము** → ఇతరులను పీడించని – కానీ సత్యము కాని మాటలకు – వశుడు అగుచున్నాడు.

**తన వాక్కుకు తానే వశుడై ఈ జీవుడు వాక్ ఇంద్రియమునకు దాసుడగుచున్నాడు.** అసత్యము, పరుషమైన మాటలు, ఏవగింపు మాటలు పలుకుచూ ఈ జీవుడు పరవశుడై ఉంటున్నాడు. కాబట్టే వాక్ ఇంద్రియము 'గ్రహము'గా వర్ణించబడింది. మాటలు–అతిగ్రహము.

**(3). జిహ్వో వై గ్రహః॥** : సాధన వస్తువే అయి ఉన్న జిహ్వ మూడవ గ్రహము – రుచి.

**నాలుక** – (3)వ గ్రహము.

**రసము** – రుచి ('3'వ) అతిగ్రహము

అతిగ్రహమగు రసము (రుచి)చే పట్టుబడినట్టిది. జీవుడు **'రుచి'కి దాసుడై ఉంటున్నాడు.** మత్తు – ఆవేశము – నిద్ర – బద్ధకము కలిగించు పదార్థముల రుచికి దాసుడు అగుట జరుగుతోంది. కాబట్టి జిహ్వ గ్రహము అగుచున్నది. రసము అతిగ్రహమగుచున్నది.

**(4) చక్షుర్వైగ్రహః॥ (నేత్రము):** – ఇది (నాలుగవ) గ్రహము.

**నేత్రము** – చూపు.....గ్రహము.

**రూపము** (చూడబడునది)...అతిగ్రహము.

చూడబడునవి చూపును ఆక్రమించి, అతిక్రమించి వేయటంచేత చూడబడేవన్నీ **'అతిగ్రహము'** అగుచున్నది. ఈ జీవుడ రూపాత్మకమైన **అనేక విషయములకు బద్ధుడై, బానిస అగుచు** సత్యము –నిత్యము అగు తత్త్వమును గమనించక, జీవితావకాశములను వృధాపరచుకొనుచున్నాడు. అందుచేతనే **"నేత్రము గ్రహము – రూపము అతిగ్రహము"**గా ప్రాప్తిస్తున్నాయి.

**(5) శ్రోత్ర వై గ్రహః॥** (నాలుగవ గ్రహము): సాధన వస్తువగు చెవులు – వినికిడి కూడా 'గ్రహము' అగుచున్నది. వినబడుచున్న శబ్ద విషయములు అతిగ్రహము. శ్రోత్రము (వినికిడి) వినబడుచ్ను శబ్ద విషయములచే చుట్ట చుట్టబడుచున్నది. అందుచేతనే జీవుడు శబ్ద విషయములను పొందుచున్నవాడగుచున్నాడు **వినబడు విషయములలో దోషభావములు, నిందించటము, అపశబ్దములు** – వినడంచేత శ్రోత్రము 'గ్రహము'గా అగుచున్నది. (ఇతరుల తప్పులను వినుటలో వినోదము పొందటము అతిగ్రహముగా ఏర్పడుచూ ఉన్నది).

**(6) మనో వై గ్రహః॥** మనస్సుయే గ్రహము. మనస్సు కోరుకొనుచున్న విషయములు, వస్తువులు, స్థితి – గతులు – ఇవన్నీ మనస్సును చుట్టుకొని ఉండుటంచేత ఆలోచన చేస్తున్న విషయములే అతిగ్రహము. అతిగ్రహము – **'కామము'** చేత గ్రహించబడిన మనస్సు జీవునిపట్ల దృశ్యమునందు **'కోరికలు'** గా ప్రవర్తనమగుచున్నది. ధ్యాసలన్నీ శాశ్వతమైనదానిని ప్రక్కకు పెట్టి, అశాశ్వత వస్తు– విషయములవైపు మరలటము జరుగుతోంది.

**(7) హస్తే వై గ్రహః॥** ఈ హస్తములు (చేతులు) గ్రహము (సాధన పరికరములో). ఈ చేతులచే నిర్వర్తించు క్రియలు (కర్మలు) **అతిగ్రహము**. నిర్వర్తించు కర్మలచే (అతిగ్రహముచే) చేతులు గ్రహించబడుచున్నాయి. **చేతులచే ఇతరులకు బాధ కలిగించు కర్మలు నిర్వర్తించబడుచున్నప్పుడు** ఈ చేతులు **'గ్రహము'** అని అనిపించుకుంటున్నాయి. ఇతరులను బాధించువాడు ఆ చేతులతో తన బాధలను నిర్మించుకుంటూపోతున్నాడు. **(స్వకర్మణాత్ భవేత్ దుఃఖమ్)।**

**(8) త్వక్ వై గ్రహః॥** త్వక్ ఇంద్రియము (స్పర్శ) గ్రహము (సాధనము). స్పర్శానుభవముచే ఈ చర్మము పట్టుకొనబడుచున్నది. జీవుడు త్వక్ ఇంద్రియముతో స్పర్శను ఎరుగుచున్నాడు. **అద్దాని ప్రియ – అప్రియములచే బద్ధుడు అగుచుండుటచే త్వక్కు గ్రహముగాను, స్పర్శ విశేషములు అతిగ్రహము అగుచున్నాయి.**

ఈ విధంగా ఈ జీవుని భౌతిక దేహములో **అష్ట గ్రహములు** (సాధన వస్తువులు). **అష్ట అతిగ్రహములు** (అనుభవములగు విషయములు) చోటుకలిగినవై ఉంటున్నాయి.

**ఆర్తభాగుడు** : ఓ యాజ్ఞవల్క్యా! **యత్ ఇదగ్ం సర్వం మృత్యోః అన్నం కాస్విత్ సా దేవతా యస్యా? (5–2–10)?** మీరు చెప్పిన అష్టగ్రహములు, అష్టఅతిగ్రహములు.... ఈ సమస్తము కూడా (నామరూపాత్మకమైనదంతా కూడా) మృత్యువుకు అన్నము (భోజనము)

అయి ఉన్నాయి కదా! **అట్టి మృత్యువు ఏ దేవతకు అన్నము (ఆహారము) అగుచున్నది?** ఆ ముఖ్య దేవత ఎవరు? మృత్యువుకు మృత్యువు ఎవరు? ఈ "గ్రహ-అతిగ్రహ" సముదాయమును భక్షిస్తున్న మృత్యువును భక్షిస్తున్నది ఎవ్వరైనా ఉన్నారా?

**యాజ్ఞవల్క్యుడు** : మృత్యువుకు అగ్నియే మృత్యువు. **మృత్యుః అగ్నిమ్ ఇతి అగ్నిః।** అగ్నియే ఉదకమునకు భోజనము.

**ఈ విధముగా గ్రహ అతిగ్రహములు మృత్యువుకు అన్నమని, మృత్యువు అగ్నికి అన్నమని, అగ్ని జలమునకు అన్నమని- "ఆపోవా ఇదగ్ం సర్వమ్" - అని గ్రహించువాడు అపమృత్యువును జయించుచున్నాడు. ఆత్మజ్ఞానము ఉదయించగా మృత్యువును తిరస్కరించుచున్నాడు. అధిగమిస్తున్నాడు.**

**ఆర్తభాగుడు** : బాగున్నది. ఓ యాజ్ఞవల్క్య మహాత్మా! ఇప్పుడొక ప్రశ్న మీముందు ఉంచుచున్నాను.

**యత్ర అయం పురుషో మ్రియత ఉదస్మాత్ ప్రాణాః క్రామన్త్యాహో 3 నేతి నేతి? (5-2-11)।**

ఎప్పుడైతే పురుషుడు మరణిస్తున్నాడో అప్పుడు వీనియొక్క పంచప్రాణములు ఈ జీవుని వదలి పైకి (ఎటన్నా) పోవుచున్నాయా? (లేక) ఎటూ పోవటంలేదా?

**యాజ్ఞవల్క్యుడు**: లేదు లేదు. ప్రాణములు ఎటూ పోవు. ఇచ్చటనే విలీనమగుచున్నాయి. ఎందులో? ఎందులోంచి ప్రాణములు బయల్వెడలుచున్నాయో, అట్టి **పరబ్రహ్మ తత్త్వమునందే** లీనమగుచున్నాయి. **జీవునియొక్క సహజ స్వస్వరూపమే అది!** ఆ తరువాత ఆ జీవుడు గాఢనిద్రపోవుచున్నవానివలె బాహ్యవాయువులచే నిండినవాడై 'నిశ్చేష్టితుడు' అగుచున్నాడు. భౌతికదేహము శిధిలం అవుతోంది.

దృశ్య భావావేశము గల జీవుడు మరొక గర్భములో ప్రవేశించుటలో నిమగ్నమగుచున్నాడు.

**బంధము నశించిన జీవుడో అప్పటికే బంధము తొలగుటచే ఇక ఎటూపోకుండా అంతటా నిండి 'పరిపూర్ణుడు' అగుచున్నాడు.**

అనగా, **ఆత్మజ్ఞానముచే పరిపూర్ణుడై ఉన్న జీవుడు గ్రహ -ప్రతిగ్రహ బంధనరూపమగు మృత్యువును నశింపజేసుకున్నవాడగుచున్నాడు. వాక్కు** మొదలైన గ్రహములు, **నామము** - శబ్దము మొదలైన అతిగ్రహములు **ఆత్మజ్ఞానాగ్నిచే** దహించివేయబడగా, అట్టివాడు **'పరమాత్మ'తో అభేదము** పొందుచున్నాడు. సర్వమునకు మూలకారణమగు పరబ్రహ్మస్వరూపమునందు సర్వ విషయములు విలీనమగుచున్నాయి. బ్రహ్మముతో ఏకత్వము పొందుచున్నాయి. వేరు వేరు నదులు సముద్రములో విలీనమగు విధంగా పైన చెప్పిన గ్రహ - అతిగ్రహములు పరమాత్మభావనా సముద్రంలో కలిసిపోయి ఏకత్వం చెందుచున్నాయి.

***ఇక ఆత్మజ్ఞాని కాని జీవుని విషయంలో....? (అజ్ఞాని విషయంలో)?***

ఒకవేళ గ్రహ - అతిగ్రహ చేష్టలకు మూలమగు అజ్ఞానము - ఆవేశము...ఇటువంటివి నశించని పక్షములో..., అప్పుడు జన్మలకు (దేహముల రాకపోకలకు) కారణములు మిగిలియే ఉంటాయి కాబట్టి, .....మరల **'ఇంద్రియముల చేష్టలు'** అనే జన్మ మరణములు (పునర్జన్మలు) కొనసాగుతూనే ఉంటున్నాయి.

## ఆత్మజ్ఞాని మరణానంతరము...,

**ఆర్తభాగుడు :** అయ్యా! యాజ్ఞవల్క్యా! ఈ జీవుడు ఆత్మజ్ఞాని, పూర్ణాత్మానుభవి అయిన తరువాత కాలగతిని అనుసరించి ఒకానొకప్పుడు దేహపరిత్యాజ్యము (మరణము) అందరిలాగానే చేస్తున్నాడు కదా। మరణము పొందుతాడనుకోండి. అప్పుడు అట్టి జ్ఞానిపట్ల దేహానంతరము కూడా **వదలక శేషించి వెంటనంటి ఉండేదేది? యత్ర అయం పురుషో మ్రియతే, కిమ్ నం న జహాతి ఇతి? వదలి వెళ్లనది ఏది?**

**యాజ్ఞవల్క్యుడు** : మిగిలి ఉండేది (నామవాచకము. 'I' 'నేను' అగు) నామము. ఎందుకంటే నామము అనంతమైనది. విశ్వేదేవులు అనంతసంఖ్యా విశేషంగా అనంతమైనవారు. ఆతనిపట్ల **'నామకః'** అన్నట్లుగా **'నామము'** (నేను అనునది) మాత్రమే మిగులుచున్నది. అనగా, **'నేను'** అనునది శేషించి, **'నాది'** అనునదంతా **'నేను'** అను నామమునందు లయించినదగుచున్నది. **అట్టి నామము నిత్యత్వము, అనంతత్వము, అప్రమేయత్వము, సర్వత్వము మొదలైన ఆత్మవర్ణనా విశేషములు స్వభావ లక్షణములుగా కలిగి ఉంటోంది.**

**"నేను" యొక్క తత్త్వము ఎరిగినవాడు** - సమస్త లోకములను దాటివేసినవాడు, జయించినవాడు, మ్రింగివేసినవాడు - అగుచున్నాడు. **బ్రహ్మమే తానై బ్రహ్మైక్యము పొందుచున్నాడు.** సమస్తము అధిగమిస్తూనే, సర్వత్రా తానై ఉంటున్నాడు.

**అవధులు లేని 'నేను'ను సంతరించుకొనుచున్నాడు.**





# అజ్ఞాని - మరణానంతరము....,

**ఆర్తభాగుడు** : స్వామీ! **మీ సమాధానము బాగున్నది.** అయితే చివరిగా ఇప్పుడు ఆత్మజ్ఞానము విషయమై **'అజ్ఞాని'**గా ఉన్నవానియొక్క మరణానంతర విశేషము గురించి మరికొంతగా వివరించండి.

మరణించిన తరువాత...ఆ మరణము పొందిన అజ్ఞానియొక్క →

❊ 'వాక్' ఇంద్రియము వాక్ ఇంద్రయాధిష్ఠాన దేవతయగు అగ్నిని పొందుచున్నది.

❊ ప్రాణము (లేక) ఘ్రాణము → ప్రాణతత్త్వ అధిష్ఠానదేవతయగు 'వాయువు'ను పొందుచున్నది.

❊ చూపు → సూర్యునిలో విలీనమగుచున్నది.

❊ మనస్సు → చంద్రునియందు ఏకమగుచున్నది.

❊ శ్రోతము (వినికిడి) → తన అధిష్ఠానమగు దిక్కులయందు లీనమగుచున్నది.

❊ భౌతికదేహము → నిజతత్త్వమగు భూమియందు కలిసిపోవుచున్నది.

❊ జీవుడు → హృదయాకాశమునందు లీనమగుచున్నాడు.

❊ శరీర రోమములు → ఓషధులలో కలిసిపోతున్నాయి.

❊ రేతస్సు - రక్తము → జలముతో ఒకటిగా అగుచున్నాయి.

.... ఇదంతా కూడా జరుగుచున్నది. ఇంత వరకు నాకు అధ్యయన విషయమే. **ఇప్పుడు నా ప్రశ్న.** ఆ పురుషుడు ఎక్కడ ఉండి ఉంటున్నాడు? పైన మనం చెప్పుకొన్నవన్నీ ఒకడు చేతిలోని తాను వాడుచున్న వస్తువులను ప్రక్కకు పారవేయటము వంటిదే కదా! ఏపనిని చేయుటకు చేతకానట్టి (ఇంద్రియములను అదిష్ఠానదేవతలకు తిరిగి అప్పగించినట్టి) ఆ మృతుడు ఇక స్థూలదేహము కలిగిలేడు కదా!

**క్వాయం తదా పురుషో భవతి ఇతి? (5-2-13)**। ఆ మరణించినవాడు ఉండుచోటు ఏది? **కిం ఆశ్రితః తదా పురుషో భవతి?** ఇప్పుడు (మరణానంతరము) ఆ పురుషుడు దేనిని ఆశ్రయించి ఉంటాడు?

- ఆ పురుషుడు ఏ ఆశ్రయముయొక్క సహాయముచే మరల దేహ - ఇంద్రియ - మనస్సుల సంఘాతమును (Association) స్వీకరిస్తున్నాడు? ఆతనికి దేనిచేత, దేనికారణంగా గ్రహ - అతిగ్రహరూపమగు బంధము తిరిగి కలిగినదౌతోంది?

❖

**యాజ్ఞవల్క్యుడు తనలో ఈ విధంగా యోచించారు.**

మరణానంతరసంగతుల విషయమై వేరు వేరు సిద్ధాంతాలు ప్రచారములో ఉన్నాయి.

**హేతువాదులు** = మరణానంతరము కార్య - కారణ రహిత స్వభావముచేత జడమువలె జీవుడు కట్టె రాయివలె జడరూపమే అగుచున్నాడు. ఇంతకుమించి **మరేమీ ఉండదు. శేషించదు.**

**జ్యోతిర్వేత్తలు** : ఈ జగత్తంతా కాలముచే నిర్మించబడుతోంది. కాలము తనకు ఏరూపము అవసరమో...అద్దానిని అనుసరించి జీవులు పునఃగా దేహములు పొందుచున్నారు. **దేహముల రాక - ఉనికి - పోకలు మొదలైనదంతా కాల నిర్ణయం.**

**క్షణికులు** : అంతా క్షణికం. క్షణంలో దేహాలు వస్తాయి. పోతాయి. క్షణికం కానిదేమీ లేదు. ప్రవాహమువలె ఈ క్షణము ఉన్నది. మరుక్షణం ఉండదు. ఒకదానితో మరొకదానికి ఏ సంబంధమూ లేదు. **క్షణక్షణం క్షణమొక విధంగా. ఇంతకుమించి ఎక్కడా ఏదీ లేదు. ఇదంతా కూడా ఒక్క క్షణంలో కనిపించే తరంగ ఆకారముల వంటిది.**

**మీమాంసకులు** : ఆగామి - సంచిత - ప్రారబ్ధ **కర్మలను అనుసరించి దేహాలు వస్తూ పోతూ ఉంటాయి.**

**బౌద్ధులు** : ఇదంతా **విజ్ఞానముయొక్క ఉత్పత్తి - వినాశన క్రీడా చమత్కారము** మాత్రమే!

ఈ విధంగా వివిధ వాదములు ఈ జీవుని మరణానంతర స్థితి గతుల గురించి సిద్ధాంతీకరించుకుంటూ వస్తున్నాయి. ఈ ఈ సిద్ధాంత

కల్పనలు ప్రతిపాదించు గురువులు, అట్లే నమ్మియుండు శిష్యులు, – ఇదంతా **సర్వకాలములయందు ప్రపంచములో ఏర్పడియే ఉంటున్నాయి.**

అయితే జన్మలకు ముందే ఉండేదేది? పరమ్ ఆత్మ। జన్మలకు ఆవల ఉన్నది కాబట్టే అది **'పరమాత్మ'**! అట్టి పరమాత్మను ఎరిగినవాని దృష్టిలో **'జన్మలు'** స్వప్నములవంటివి. ఆత్మకు కార్యకారణ కర్తృత్వాలు లేవు. **కార్యకారణకర్తృత్వాలు కేవలము ఆత్మయొక్క భావనా కల్పితము.** ఆత్మకు జన్మ – కర్మల దోషము అంటజాలదు. ఈ జీవుడు సర్వదా ఆత్మస్వరూపుడే। సదాశివుడే। జన్మ – కర్మలు భవనా **కల్పన అయినప్పుడు, "అవి ఎందుకు వస్తున్నాయి?" అనునది కూడా భావనాకల్పనయే కదా!** ఆత్మ సర్వదా నిత్యము, సత్యము. తదితరమంతా స్వప్నమువలె కల్పితము. ఆత్మకు వేరుగా నమ్మే సిద్ధాంతాలు అట్టివే!

→ **"రాత్రి నిదురించినప్పుడు ఇదియే కలగా వస్తుంది।"** అని ఏమి చెప్పగలం? ఎందుకంటే స్వప్నము కల్పనయే కదా! అట్టి కల్పనలో –

- ఆ రోజులోని ఒక సంఘటన (లేక) జ్ఞాపకము – ఆ రాత్రి స్వప్నములో 'సందర్భము' రూపముగా పాల్గొనవచ్చు.
- కొన్ని రోజుల క్రితం విన్నవి, చదివినవి – నమ్మినవి, పొందినవి, సందర్భపడినవి, ఊహించినవి, చూచినవి కూడా – స్వప్నదృశ్యముగా రూపుచెందవచ్చు.
- కొన్ని సంవత్సరముల క్రితం జరిగిన, ఊహించిన ఏవేవో విషయాలు, విశేషాలు కావచ్చు. కొన్ని జన్మలలో ఎప్పుడో ఎక్కడో జరిగినవి కావచ్చు.

ఎందుకంటే అంతా ఊహయేగా! అట్టి స్వప్నములో కలుగబోయేవి సిద్ధాంతీకరించి **"ఈ విధి విధానంగా ఈఈ కారణాల చేత ఈ స్వప్నదృశ్యము ఏర్పడుచున్నది"**...అని హేతుబద్ధం చేసి ఏమి అనగలం?

***అట్లాగే జగత్తు. అట్లాగే జన్మ – జన్మాంతరములు కూడా!***

జన్మ – జన్మాంతరములుగా – (ఇతఃపూర్వపు అనేక జన్మలుగా) – ఈ తతంగమంతా సాగుతూ వస్తోంది. స్వతఃగా నిర్మలాత్మ స్వరూపుడగు ఈ జీవుడు అనేక జన్మల సంకలనమునుండి కొన్ని భావావేశములను ఆశ్రయించుచూ ఆయా **వర్తమాన, తదనంతర ఉపాధి పరంపరలను** పొందుచున్నాడు.

- **ఆత్మ** అంతటా ఏర్పడి సంకల్పమాత్రముచే **సర్వము సిద్ధింపజేయగల సర్వసామర్థ్యము** కలిగినదై ఉన్నది.
- **ఈ జీవుడు ఆత్మస్వరూపుడే।**
- అట్టి ఆత్మ స్వరూపుడగు **జీవుని మనోకల్పనయే** జగత్తులు, **జన్మ–కర్మలు** కూడా।
- జీవుడు తన ఆత్మ స్వరూపమును ఏమరచి మనస్సు – మనో కల్పనలతో మమేకమై, ప్రాణశక్తి – ఊహల మేళవింపుగా **కల్పనా దేహములను, కల్పనా–ఇంద్రియ దృశ్యములను పరంపరగా పొందుచున్నాడు.**
- మనస్సుగా జన్మలు పొందుతూ, ఆత్మగా ఏమీ పొందనివాడై ఉన్నాడు.

పైన చెప్పుకొన్న **"జన్మరహితమగు ఆత్మ – మనో కల్పితములగు జన్మలు"** ....అను రెండిటిని ఒకచోటకు తెచ్చి యథార్థతత్త్వమును నిర్వచించి **"ఈ ఈ జన్మలు ఈ ఈ కారణాల వలన వస్తాయి. ఈ ఈ కారణాల వలన రావు"** అని అందరికి అంగీకారం అయ్యేటట్లుగా నిర్ధారించి చెప్పటము, సభలో ప్రకటించటము కుదిరేది కాదు. ఆత్మకు జన్మలే లేనప్పుడు 'తరువాతి జన్మ' అనునది కల్పన అయినప్పుడు, వర్తమాన జన్మ కూడా కల్పనయే అయినప్పుడు, **ఇక కల్పనల గురించిన సిద్ధాంతములు కూడా కల్పనయే కదా!** అట్టి కల్పనా సిద్ధాంతాలు **"అందరికీ ఇట్లే ఉంటుంది"** అను నిరూపణ ఎందుకు?

**మాయ–మాయ కలిసి మరియేమీ లేకపోయే! మాయె తానాయె! మాయి తానాయె!**

**ఈ విధంగా తలచి యాజ్ఞవల్క్యుడు ఇక ఇట్లు ఆర్తభాగునితో సంభాషించసాగారు.**

అయ్యా! ఆర్త భాగా! ఆత్మజ్ఞానిపట్ల దేహానంతరము ఇంద్రియ ప్రపంచములు, ఇంద్రియానుభవములు ఆత్మయందు – జలములో ఉప్పుగడ్డ యొక్క ఆకారమువలె, లయించగా, **ఆతడు సర్వే సర్వత్రా వేంచేసియున్న ఆత్మతత్త్వమై వెలుగొందుచున్నాడు.**

ఇక ఇంద్రియ విషయ జగత్ సంబంధమైన భావ – ఉద్వేగములతో కూడిన (ఆత్మజ్ఞానము పరిశీలించని) అజ్ఞాన జీవుని మరణానంతరము అప్పటిస్థితి ఆ తదనంతర గతుల గురించి మీరు అడిగారు.

**అవామే వై తస్య త్వత్ పృష్టస్య వేదితవ్యం యత్ తత్ వేదిష్యానో నిరూప యిష్యావః** (శం॥భాష్యం). ఈ విషయంలో అనేక కల్పనలు చేయబడి సిద్ధాంతీకరించబడింది. జన్మయే కల్పన కాబట్టి జన్మంతరముల స్థితి–గతుల సిద్ధాంతాలు కూడా కల్పనయే. అట్టి వేరు వేరు సిద్ధాంతములు సిద్ధాంతీకరించు మహనీయులు, వారి వారి శిష్యబృందము ఈ సభలో వేంచేసి ఉన్నారు. అందుచేత జన్మాంతర స్థితిగతుల గురించి వాదోపవాదములకు దోహదపడే కల్పనారూప చర్చలు **ఈ జనక మహారాజు సభలో సభాముఖంగా చెప్పసాగటం ఇప్పుడు అసంగతము, అసందర్భము అని నేను తలచుచున్నాను.**

**న నే ఆవయోః ఏతత్ వస్తు స జనే జన సముదాయే నిర్ణేతుం శక్యతా॥** సుజనుల మధ్య కూర్చుని దేహానంతర స్థితి గతుల గురించి ఎరిగి కూడా నిర్ణయించి చెప్పలేం!

అందుచేత ఓ సోమ్యా! ఆర్తభాగా! **అహర సోమ్య! హస్తం ఆర్తభాగావా ఆవామైవై తస్య! (5–2–13)।** మీ చెయ్యి ఇటు ఇవ్వండి. మనము ఏకాంత ప్రదేశమునకు వెళ్ళుచున్నాము! ఓ ప్రియదర్శనా! మీ ప్రశ్నకు సమాధానము మనమిద్దరమే తెలుసుకొనెదము గాక! జనం సమూహం మధ్యలో నిర్ణయించలేనిది ఏకాంత ప్రదేశమే ఉపాయం కదా! రండి. **అత ఏకాంతం గమిష్యావో విచారణాయ।**



ఆ విధంగా అప్పటికప్పుడు వారిద్దరు ఒక ఏకాంత ప్రదేశము చేరారు. ఇద్దరు కొంతసేపు సంభాషించుకొన్నారు. వారిద్దరు చెప్పుకున్న సారవిశేషం ...

→ కర్మలను – భావములను అనుసరించి ఉత్తమ – అధమ జన్మలు.

→ కర్మలు – సాధనములు జీవుడు **జాగరూకతతో నిర్వర్తిస్తూ ధర్మమును ఆశ్రయించాలి**. పరమాత్మ ఉపాసనను అవలంభించాలి. ఆత్మజ్ఞానము సముపార్జించాలి.

→ **'నాకు జన్మలులేవు–కర్మలులేవు'** అను స్థితిని సంపాందించుకొన్నవానికి దేహముల రాకపోకలు వస్త్రధారణ–విసర్జన వంటిది!

**– ఆదౌ లౌకికవాది పక్షాణామ్ ఏకం పరిగృహ్య విచారితవంతే।** ముందుగా లౌకికవాదులు (ఈ లోకము సత్యము అను భావనతో మరణానంతర విశేషాలను పరిశీలించి చెప్పువారి) వేరువేరు సిద్ధాంతములను, ఒక్కొక్కటిగా వాటివాటి పరిమితార్థములను సంభాషించుకున్నారు. వాటి లౌకికార్థములను విచారణచేసి పూర్వపక్షము చేసి (బుద్ధుల) శూన్యవాదము, కణవాదము, మరణానంతరము ఏమీ మిగలదనే నాస్తికవాదములు – విచారణచే తిరస్కరించారు (లేక) నిరాకరించారు. చివరికి మరణించినవాడు దేహ–ఇంద్రియ–మనో సంఘాతము తిరిగి స్వీకరించుటకు దేహ మానసిక కర్మలే కారణము అగుచున్నాయి" – **"కర్మ ఏవ తత్ ప్రశసగ్ః సతః"** అని కర్మల విషయములన ప్రశంసించారు.

> **కర్మహి ఏవ ఆశ్రయః పునః కార్య కారణ ఉపాదాన హేతుం తత్ తత్ర ఊచతు ఉక్తి వంతౌ।**
> **అంతేకాకుండా.... (న కేవలమ్).....**
> **కాల – కర్మ – దైవ ఈశ్వరేషు అభ్యుప గతేషు హేతుషు యత్ ప్రశశం సతుః। (శంకరభాష్యము).**

**(1) కాలము (2) కర్మ (3) దైవము** (దైవీ సంబంధమైన జగత్ నాటక సంఘటనలు) **(4) ఈశ్వరుడు**....ఈ నాలుగు కూడా దేహము – పరిస్థితులు మొదలైనవి సందర్భమవటానికి నిమిత్తహేతువులు (Incidentally causing)గా కూడా చెప్పుకోబడ్డాయి. అవి కూడా కర్మలను అనుసరించే ఏర్పడుచున్నవగుచున్నాయని అనుకోబడింది. చిట్టచివరగా...

> *జీవుడు పూర్వకర్మలచే ప్రేరితుడై గ్రహ (ఇంద్రియ) – పతిగ్రహ (దృశ్య)రూపమగు కార్య – కరణ సంఘాతమును మరల మరల తనకు తానై స్వీకరిస్తూ ఉన్నాడు. కర్మ ఉన్నప్పుడే "కాలము, జీవుడు" మొదలైనవి భిన్న – భిన్న గతులు కల్పించగలవు – అని ఆ ఇరువురు...అభిప్రాయపడసాగారు.*





**(1) పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి :** ఇతః పూర్వపు పుణ్యకర్మల చేత జీవుడు పుణ్యఫలములగు విజ్ఞానయుతమైన ఉపాధులను, సుఖములను పొందటం జరుగుతోంది.

**(2) పాపః పాపేనేతి :** శాస్త్ర విరుద్ధమై పాపకర్మలు కారణంగా అజ్ఞాన - అవివేకముతో కూడిన ఉపాధులను దుఃఖములను పొందుచున్నాడు.

**(3) ఆత్మ జ్ఞానముచే :** ద్వంద్వ మోహము నుండి విడివడి జన్మ - కర్మలకు సాక్షిగా సర్వదా వెలుగొందుచున్న ఆత్మయందు ఆత్మత్వము సంతరించుకొనుచున్నాడు.

**"ఆత్మజ్ఞానానుభవి దృష్టిలో జన్మలు లేవు. కర్మలు లేవు. ఏకమగు స్వస్వరూపాత్మయే సర్వత్రా వేంచేసి ఉన్నది"** - అని వారిద్దరు చర్చను ముగించుకొని తిరిగి సభకు వచ్చేశారు.

**అప్పుడు 'జరత్కార' గోత్రీయుడగు ఆర్తభాగుడు - "ఇక ఇప్పుడు ఈ యాజ్ఞవల్క్యునితో వాదము చేయునది ఏమీ లేదు"**....అని ప్రకటించి మౌనము వహించారు. యాజ్ఞవల్క్యునికి, సభకు నమస్కరించి సుఖాసీనులైనారు.

**ఇతి - పంచమ అధ్యాయో "ఆర్తభాగబ్రాహ్మణమ్" - నామ ద్వితీయో బ్రాహ్మణమ్॥**

## పంచమ అధ్యాయము - తృతీయ బ్రాహ్మణము
## యాజ్ఞవల్క్య - భుజ్య సంవాదము
## 'అపరోక్షాత్మ'। ఆత్మకు బంధము లేదు

ఆ విధంగా ఆర్తభాగుడు మౌనము వహించిన తరువాత లహ్య మహాముని కుమారుడగు భుజ్యుడు అను వేదవేత్త (మరియు) ఋత్విక్కు లేచి నిలుచున్నారు. మహారాజుకు, సభకు, యాజ్ఞవల్క్యునకు నమస్కరించి తన ఋషులను, గోత్రమును, తండ్రి పేరును తన పేరును (ప్రవరను) పలుకుచూ **"అహంభో అభివాదయే।"**....అని శిరసా - మనసా అభివందనము చేశారు.

**"ఓ జనక చక్రవర్తీ! ఓ విజ్ఞులగు సభాసదులారా! ఓ యాజ్ఞవల్క్య మహాశయా! నేను ప్రశ్నించుటకు మీరందరూ అంగీకరించెదరు గాక!"**....అని సంభాషించ ప్రారంభించారు.

**భుజ్యువు** : ఓ యాజ్ఞవవల్క్య మహనీయా! సభాసదులారా! ఒక సందర్భమును, అప్పటి విశేషములను ఇప్పుడు మీముందు ఉంచు చున్నాను. వినండి.

మేము ఒకానొక వ్రతము ఆచరిస్తూ ఒకసారి వేదాధ్యయనము కొరకు మాద్ర ప్రాంతమునందు (మద్ర దేశములో) పరివ్రాజకులమై చరకులుగా తిరుగుచూ ఉండేవారము. (చరకులు = యజుర్వేద అధ్యయనము చేయు ఋత్విక్కులు). అట్లా సంచరిస్తూ ఒకరోజు కపిగోత్రీకుడైనట్టి (కాప్యస్య) పతంజలుడు అనే ఆయన ఇంటికి అతిథులమై, శిష్యులమై వెళ్ళటం జరిగింది. ఆ పతంజలికి ఒక కుమార్తె ఉన్నది. ఆమె ఒక గంధర్వగ్రహము (పిశాచము)చే ఆవేశించబడి ఉన్నదని, ... ఆ గృహములోని వారు మాకు చెప్పటం జరిగింది. "సరే!"....అని తలచి మేము ఆ పతంజలియొక్క కుమార్తెను (గంధర్వగ్రహావిష్టమైన కన్యను) ఒకచోట సుఖాశీనురాలనుగా చేసి ఇట్లా అడుగసాగాము.

**మేము (భుజ్యుడు మొ॥వారు)** : అయ్యా! మీరెవ్వరు? మీ స్వరూపము ఎట్టిది? ఎందుకు మీరు ఈ కపిగోత్ర పతంజలుని కుమార్తెను ఆవహించారు? ఏదీ! మీ గోత్ర - నామాలు చెప్పండి!

**గంధర్వుడు** : అయ్యవారు! నేను ఆంగీరస గోత్రీకుడను. సుధన్వుడు అనుపేరుగల వాడను.

**భుజ్యుడు** : మీ కథ ఏమిటి?

**సుధన్వుడు** : నేను అశ్వమేధయాగము యొక్క శాస్త్రీయ – తాత్త్విక రహస్యమును తెలిసిన ఋత్విజుడను. అశ్వమేధ శాస్త్ర విద్యచే ఈ సమస్త లోకములకు సంబంధించిన పాండిత్యము సంపాదించుకొని ఉన్నాను.

**భుజ్యుడు** : ఓహో! లోకముల గురించి తెలుసా? మంచిది. అయితే రెండు ప్రశ్నలు వేస్తున్నాము. ఎందుకంటే మేము ఈ బ్రహ్మాండము యొక్క పరిణామము తెలుసుకొనుటకై ఉబలాటపడుచున్నాము.

(1) ఈ లోకముల అంతమేమి? ఆవల ఏమై ఉన్నది?

(2) అశ్వమేధ యాగము నిర్వర్తించి పాపములను పోగొట్టుకొన్న యాగకర్తలను **'పారిక్షితులు'** అంటారు కదా! అట్టి పారిక్షితులు చేరు స్థానము ఏది? వారు ఏచోట (లేక) ఏలోకము చేరుచున్నారు? ఏ మార్గములో చేరుచున్నారు.

❖

ఓ యాజ్ఞవల్క్యా! అప్పుడా గంధర్వ గ్రహరూపుడగు సుధన్వుడు అనేక వివరాలు, విశేషాలు, శాస్త్రీయ సమాధానాలు మాకు వివరించి చెప్పటం జరిగింది. ఆ విధంగా మేము గంధర్వునినుండి అనేక విశేషాలు తెలుసుకున్నాం.

ఆ తరువాత మా శ్రవణమునకు ఆనందించి, మా శాంతి వచనములకు తృప్తపడి, పంతంజలుని కుమార్తె శరీరమును వదలి, ఆ పిశాచ గంధర్వుడు యథేచ్ఛగా ఎటో వెళ్ళిపోయాడు.

సరేం అదంతా అట్లా ఉంచండి।

**ఇప్పుడు మిమ్ములను ప్రశ్నిస్తున్నాను.**

అశ్వమేధయాగ కర్తలగు పారిక్షితులు (యాగకర్తలు) ఈ 14 లోకములలో ఏ స్థానము చేరినవారై ఉంటున్నారు? మీరు ఎరుగుదురా? తెలిస్తే చెప్పండి!

**యాజ్ఞవల్క్యుడు** : అశ్వమేధయాగము చేసినవారు చేరు చోటికే ఋత్విక్కు అగు మీరు వెళ్లెదరని కూడా ఆ గంధర్వుడు చెప్పేఉంటారే! ఈ మానవులు నివసించుచున్న భూలోకము '32' దేవరథాహ్న్యములుగా విస్తరించి ఉన్నది.

→ **దేవరథాహ్న్యము** = సూర్యుని రథము ఒకరోజు కాలములో ఎంత దూరము నడుచునో అంతటి విస్తీర్ణము.
భూవిస్తీర్ణము = 32 × దేవరథాహ్న్యము

- ఈ భూమికి చుట్టూ లోకాలోక పర్వతాలు.
- ఈ భూమి 1/3వ వంతు అయితే, 2/3వ వంతు సముద్రము భూమిని చుట్టి ఉన్నది.
- ఈ భూమండలమునకు ఆవల కత్తియొక్క వాడి కొనభాగమంత (లేక) ఈగయొక్క రెక్క పరిణామమంతగా పలుచని ఆకాశము ఉన్నది.
- ఈ బ్రహ్మాండమునందు ప్రాణులు కర్మఫలములను అనుభవించుచూ ఉంటున్నారు.
- ఈ బ్రహ్మాండమునకు పైన ఆవల సూర్యకాంతి చొరజాలని ప్రాణిశూన్యమగు అలోకము.
- ఆ అలోకము ఈ లోకమునకు రెట్టింపు పరిణామములో చుట్టూ వ్యాపించి ఉన్నది.

అశ్వమేధయాగమునందు ఉపాసించబడిన విరాట్ పురుషుడగు ఇంద్రుడు సుపర్ణుడై (రెక్కల పక్షి అయి) పారిక్షితులను (అశ్వమేధయాగము నిర్వర్తించిన వారిని) ఈ భూమండలమునకు ఆవలగల 'వాయువు'కు వశము (Handing over) చేస్తున్నారు.

వాయువు పారిక్షితులను తనయందు లీనము చేసుకొని బ్రహ్మాండముయొక్క రెండు కపాలముల మధ్యగా (ఆకాశ-భూమండలమధ్యగా) ఎక్కడైతే గడచినకాలంలో అశ్వమేధయాగము చేయువారు ఆనందంగా ఉంటున్నారో – ఆచోటికి తీసుకొనిపోవుచున్నది.

❖

అందుచేత ఓ లహ్యుని కుమారుడవగు ఓ భుజ్యమునీ! మీరు చెప్పిన సుధన్వగంధర్వుడు – **"వాయువే పారిక్షితులు ప్రయాణము చేయు ఆయనము"** అని వర్ణించి ఉంటారు. ప్రశంసించి ఉంటారు.

వాయువే వ్యష్టి – సమష్టి స్వరూపము. ప్రాణము బయట – లోపల ఉన్నది వాయువే। వాయువే కదలని – కదిలే ప్రాణులకు అంతర్యామి. **వాయువు ప్రాణ శక్తి స్వరూపమే!**





ఎవ్వరైతే...వాయువును (లేక) ప్రాణశక్తిని

→ యాగకర్తలను ఊర్ధ్వలోకములు జేర్చుయానముగాను,

→ వృష్టి – సమష్టిరూపుడుగాను,

→ సర్వప్రాణుల అంతర్యామిగాను, కదలే – కదలని సర్వ వస్తుజాలములందు అంతరమున – బాహ్యమున ఉన్నవారుగాను, **ఉపాసిస్తారో**...., అట్టివారు వాయువును ప్రత్యక్షముగా కనిపించే బ్రహ్మముగా ఎరిగినవారై మృత్యువును జయించగలరు! (నమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి॥)

**"నేను ఒక దేహమునుండి మరొక దేహమునకు వాయువుచే నడిపించబడుచూ వాయు వాహకుడనై ప్రయాణిస్తూ వాయు స్వరూపుడనై ఉన్నాను. అయితే పరముగా ఆత్మస్వరూపుడను"**....అని తత్త్వవేత్తలు గమనించి ఉంటున్నారు.

ఈ వాక్యములు విన్న లహ్యాని పుత్రుడగు భుజ్యుడు, **"నాకు సరి అగు సమాధానము లభించినది"** అని సభయందు ప్రకటించి మౌనముగా ఆసీనులైనారు.

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమాధ్యాయము।**

**"భుజ్యుబ్రాహ్మణము" (లేక) "యాజ్ఞవల్క్య–భుజ్యుసంవాదం" నామ తృతీయ బ్రాహ్మణము.**

## పంచమ అధ్యాయము - చతుర్ధ బ్రాహ్మణము
## యాజ్ఞవల్క్య – ఉషస్త సంవాదము
## (అపరోక్షాత్మ)

అప్పుడు చక్రాయణుని కుమారుడగు ఉషస్తుడు లేచి నిలుచున్నారు. తన 'ప్రవర'ను సభకు నివేదించి, సభకు నమస్కరించి, జనక మహారాజు అనుజ్ఞపొంది ఇక ఇట్లు యాజ్ఞవల్క్యుని అడుగసాగారు.

**ఉషస్తముని** : అయ్యా! యాజ్ఞవల్క్య మహాశయా!

**యత్ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరస్తం మే వ్యాచక్ష్వ ఇతి॥ (5-4-1)।** బ్రహ్మము ఎదురుకుండా సాక్షాత్‌గానే ఉన్నది అని అంటున్నారు.

***"ఆత్మ ప్రత్యక్షమై కనిపిస్తూ ఉండే పంచభూత వికారాలు కాదు. కానీ, ప్రత్యక్షంగా కనిపించేదంతా బ్రహ్మమునకు వేరుకాదు. కనుక బ్రహ్మము 'సాక్షాత్' యే గాని పరోక్షాత్ (ఎక్కడో ఉన్నది కాదు)"*** – అని అంటూ ఉంటారు.

బ్రహ్మము కళ్ళకు కనబడేది కాదు కాబట్టి **ప్రత్యక్షము కాదు.** మరెక్కడో ఉండి ఉన్నదా? కాదు. కనుక **పరోక్షము కాదు.** కనుక ఆత్మ (బ్రహ్మము) – **అపరోక్షము.**

సాక్షాత్ అపరోక్షమై, అనుక్షణిక అనుభవ – అనుభూత విషయమై, ఏ బ్రహ్మముకలదో, సర్వమునకు లోపల (సర్వమునకు అంతరస్థమై) ఏ ఆత్మ ఉన్నదో, అద్దానిగురించి వివరించండి. దయచేసి మా కొరకై వ్యాఖ్యానించండి.

**యాజ్ఞవల్క్యుడు** : తత్త్వమసి। నీ ఆత్మయే జీవాత్మగా మాకు కనబడుచూనే, సర్వమునకు అంతరాత్మగా కూడా (ఒకేసారి) (All the same time) అయి ఉన్నది! **ఏష త ఆత్మా సర్వాంతరః (4-4-1)।** సర్వమునకు అంతరమున ఉన్నది నీ ఆత్మయే! అందరి ఆత్మయే నీయందు ఆత్మగా వేంచేసి ఉన్నది కూడా।

**నీ ఆత్మయే** – నీకు తదితరంగా అనిపించేదంతా – **తనయొక్క విశేషణముగా కలిగియున్నది.** నీ ఆత్మయందే నీవు **'నీవు–నేను'**....అను **అభిమానమును** కల్పించుకొని ఉంటున్నావు. ఈ నీ దేహమును, ఈ దృశ్యమును స్వరూపముగా పొందుచున్నది ఆత్మస్వరూపుడుగా – నీవే।

**ఉషస్తుదు : "నా ఆత్మ సర్వమునకు అంతరముగా ఉన్నది"**...అని మీరు అంటున్నారు కదా। నా దగ్గర ఈ దేహము - మనస్సు - సూక్ష్మ శరీరము-బుద్ధి-బుద్ధికి సాక్షి....ఇవన్నీ ఉన్నాయి. వీటి అన్నిటిలో దేనికి నా ఆత్మ అంతస్తము? ఈ చర్మము, కళ్ళు, చెవులు, ముక్కు, కాళ్ళు, చేతులు వీటికి కూడా అంతస్తమేనా? కళ్ళకు కనిపించేదానికి, చెవులకు వినిపించేదానికి, వాసనలుగా పొందేదానికి, కాళ్ళు నడిచే చోట్లకు, చేతులు పట్టుకొను వస్తువులకు - మొదలైన వాటికి కూడా అంతరమా? లేక కనబడే జీవులందరికీ నా ఆత్మయే అంతరమా? అంతస్తమా? **"నా ఆత్మ సర్వాంతరము"** అన్నప్పుడు మీ ఉద్దేశ్యము ఏమిటి? వీటిలో నా ఆత్మ దేనికి ఎట్లా అంతస్తము? దేనికైనా బాహ్యస్తమా? వివరించ ప్రార్థన! దయతో వ్యాఖ్యానించండి! (How Iam internally placed in all?).

**యాజ్ఞవల్క్యుడు : యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాన్తరో। (5-4-1)।** ఏదైతే ప్రాణములకు వేరై ప్రాణమును ఒక ఉపకరణమువలె ధరిస్తూ, నోరు - ముక్కు - గుండె మొదలైనచోట్ల అంతటా **సంచరిస్తూ, ప్రాణములచే ప్రాణ వ్యాపారము చేయించుచున్నదో,** అదియే నీ **ఆత్మ।**

ఏది ప్రాణముల ద్వారా నీ శ్వాస వ్యాపారములను నిర్వర్తిస్తోందో,....అదియే దేహేంద్రియ సంఘాతరూపమగు **ఆత్మ।**

ఏ ప్రాణములచే ఇంద్రియములు విధి నిర్వహణ నిర్వర్తిస్తున్నాయో, అట్టి ప్రాణములకు ఈశ్వరుడు (నియామకుడు) అగు ప్రాణేశ్వరస్వరూపుడు **ఆత్మ।**

ఏది బుద్ధిని తన ఉపాధిగా కలిగి ఉన్నదో అదే **ఆత్మ।**

అట్లాగే ఎద్దానివలన నీ ఈ దేహములో అపాన - వ్యాన - ఉదానములు, వాటివాటియొక్క పంచప్రాణ - పంచ ఉపప్రాణ వ్యాపారములు జరుగుచున్నవగుచున్నాయో, అదియే విజ్ఞానమయమగు నీయొక్క ఆత్మస్వరూపము.

నీ ఆత్మ దేహ-ఇంద్రియములకు విలక్షణమై, దేహ-ఇంద్రియములు తమ వ్యాపారములు నిర్విర్తించటానికి ఆధారభూతమై యున్నది. అట్టి నీఆత్మ **సర్వాంతరము** (All extended, All Inwardly placed) కూడా.

ఆత్మ చైతన్యము చేత అధిష్ఠితమై ఉండటముచేతనే అద్దాని బుద్ధి ఉపాధి ద్వారా, చెక్క మట్టి యంత్రము వంటి ఈ భౌతిక దేహము గాలిని పీల్చటము, ఒకచోటు నుండి ఇంకొక చోటకి కదలటము, జీవించి ఉండటము... ఇవన్నీ నిర్వర్తిస్తోంది.

నీవు **'దేహాంతర్యామి'**వే కాకుండా, **'సర్వాంతర్యామి'**వి కూడా.

**చక్రుని కుమారుడగు ఉషస్తుడు : యథా విబ్రూయాత్ అసౌ గౌర సావశ్వ ఇత్యేవమ్, ఏవై తత్ వ్యపదిష్టం భవతి -యదేవ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ - య ఆత్మా సర్వాన్తరస్తం మే వాచక్ష్వ। (5-4-2)।** అయ్యా! యాజ్ఞవల్క్యుల వారు! మీరు చెప్పినది విన్న తరువాత కూడా **"ఆత్మ ఇది... ఇట్టిది"**.... అని నాకు సుస్పష్టము కావటములేదు. ఒక గ్రామమునకు వెళ్ళి గ్రామస్థుని, **"అయ్యా ఇది ఏమిటి? అది ఏమై ఉన్నది?"...అని అడిగితే, "బాబూ! ఇది ఆవు। అది గుఱ్ఱము। ఆ ప్రక్కన ఉన్నది గోడ। ఇది ఇల్లు। అది వాకిలి। ఇది చాట"**.....అని సుస్పష్టముగా చూపిస్తూ స్పష్టము చేస్తాడు చూచారా? ఆ రీతిగా మీరు సర్వసాక్షి, అపరోక్షము, సర్వాంతర్యామి అగు ఆత్మ (బ్రహ్మము) గురించి మరల వివరించి చెప్పవలసినదిగా మీకు విన్నపము చేస్తున్నాను! మీ సమాధానము నాకు మరింతగా హృదయస్థమగు గాక!

**యాజ్ఞవల్క్యుడు :** మరల చెప్పుచున్నాను. నీ **ఆత్మయే సర్వమునకు, సర్వులకు అంతరాత్మ। అంతరుడు। అంతరాంతరుడు।** కదిలే అన్ని దేహాలను కదల్చు **చైతన్యస్ఫూర్తి।** ఏది సర్వులకు అంతర్యామియో, **అదియే నీ ఆత్మ।** అయితే, ఇప్పుడు మీరు అడుగుచున్నదేమిటి? ఒక ఆవును, గుఱ్ఱమును, గోడను, మనిషిని చూపించినట్లుగా నీకు నీ ఆత్మను చూపించమని అడుగుచున్నారు. బాగానే ఉన్నది. అట్లా చూపించాలని నాకూ ఉన్నది. అయితే ఇందులో ఒక చిక్కు. వినండి.

→ **న దృష్టే ద్రష్టారం పశ్యేత్।** : నీ కళ్ళు ఎదురుగా ఉన్న గోవును, గుఱ్ఱమును, గోడను, ఎదుటి మనిషిని చూడగలవు. ఏదైతే నీ కళ్ళలో ఉండి, కళ్ళ ద్వారా ఈ తదితరమైనదంతా చూస్తోందో, అద్దానిని [ఆ దృక్ తత్త్వమును (లేక) చూచువానిని] **నీ కళ్ళు చూడగలవా? కళ్ళతో చూచే వాడిని కళ్ళు చూడలేవుకదా! ఆ దృక్స్వరూపమే (ఏది కనబడేదంతా చూస్తూ ఉన్నదో) - అదియే ఆత్మ!**

→ **న శ్రుతేః శ్రోతారగ్ం శృణుయాత్।** : నీ చెవులు నేను ఉచ్చరించు శబ్దములను మాత్రమే వినగలవు. ఎవ్వరైతే నీ ఈ చెవులను

ఉపయోగించి వినుచున్నారో,....ఆయనను ఈ చెవులు వినగలవా? వినలేవు. కనుక ఆత్మ చెవులలో ఉండి వినుచున్న తత్త్వము. అంతేగాని చెవులు వినగలుగు కొన్ని శబ్దములు కాదు. **ఆ వినుచున్నదే ఆత్మ!**

→ **న మతేః మన్తారమ్ మన్వీథాః** : నీవు నీ విచారణశక్తిచే అనేక విషయాలు విచారణ (Analysis) చేయగలవు. అయితే ఏది నీయందు ఉండి విచారణ శక్తిని ఉపయోగించి విషయములను విచారణ చేస్తోందో, మననము చేస్తోందో,-అద్దానిని నీ విచారణతత్త్వము విచారణ (లేక) మననము చేయగలదా? లేదు. (You may be able to analyse and understand many things. But how can your own Analystical Ability analyse **the one who is analysing?**). **ఆ విచారణ చేయుచున్నదే ఆత్మ!**

→ **న విజ్ఞాతే విజ్ఞతార విజ్ఞానీయాః** : తెలుసుకొను తెలివిచే అనేక విషయాలు నీవు తెలుసుకొనవచ్చును గాక। ఆ నీ తెలివితో తెలుసుకొనుచున్నట్టి దానిని తెలుసుకొనగలవా? లేదు. **ఆ తెలుసుకొనుచున్నదే ఆత్మ।** అంతేగాని తెలియబడుచున్నది కాదు. (The one who is knowing is Athma i.e. the SELF of all).

**ఈ విధంగా కళ్ళలోంచి చూస్తున్నది, చెవులలోంచి వింటున్నది, విచారణ చేయుచున్నట్టిది, తెలుసుకొనుచున్నది అయి ఉన్నది- నీ యొక్క, నాయొక్క "ఆత్మ". అంతేగాని అది -**

- ⌘ **కంటికి కనబడుచున్నది కాదు.**
- ⌘ **చెవులకు వినబడుచున్నది కాదు.**
- ⌘ **విచారణ చేయబడుచున్నది కాదు.**
- ⌘ **తెలియవచ్చుచున్నదీ ఏదీ కాదు.**

- అట్టి నీ ఆత్మయే **సర్వమునకు అంతరముగా ఉన్నది.**

- సర్వమునకు ఏది అంతరముగా ఉన్నదో, అదియే నీ ఆత్మ.

ఇక మిగతాదంతా కూడా ముత్యపుచిప్పలో వెండిలాగా మొదలే లేనట్టిది. భ్రాంతి మాత్రమే. పైగా వినాశన శీలము కూడా.

- **నాటకములోని పాత్రల గుణములకు, వారివారి పరస్పర సంబంధ బాంధవ్యములకు - నాటక రచయితయే "అంతర్యామి" అయినట్లుగా నీకు జగత్తుగా అనుభవమగుచున్నదంతటికీ నీవే "అంతర్యామివి".**
- **'ఊహ'లో కనిపించే అనేక నామ-రూపములకు ఊహించువాడే అంతరముగా ఉన్నట్లు, - దృశ్యమునకు ద్రష్టయే అంతరాంతరుడు.**

**ఇది విని చక్రాయణ కుమారుడు శాంతించి మౌనం వహించారు.**

## పంచమ అధ్యాయము - పంచమ బ్రాహ్మణము
## యాజ్ఞవల్క్య - కహోల సంవాదము
## ఆత్మవేత్తత్త్వము

ఇక ఇప్పుడు కుషీతకముని కుమారుడగు కహోళుడు లేచి నిలుచున్నారు. సభకు నమస్కరించి పెద్దల అనుజ్ఞను కోరుతూ, ఇట్లు అడగసాగారు.

**కుషీతకముని కుమారుడగు కహోళుడు** : హే యాజ్ఞవల్క్య మహానుభావన్!

(1) ఈ జీవునికి అత్యంత సన్నిహితమై, ప్రత్యక్షమై (సాక్షాత్ - అపరోక్షాత్) యున్న **పరబ్రహ్మము యొక్క స్వరూపము.**

(2) సమస్తమునకు అంతరముగా ప్రత్యగాత్మ స్వరూపముగా ప్రకాశించుచున్న ఆత్మ స్వరూపము. (ప్రత్యగాత్మ = ఈ ఈ బాహ్య - అభ్యంతరములుగా కనిపించే సమస్తమునకు వేరై ఉన్నట్టిది).

ఈ రెండిటి భేదము గురించి వివరించండి. ఎందుకంటే ఆత్మ గురించి తెలుసుకొనటంచేత మాత్రమే ఈ జీవుడు సంసారబంధమునుండి విడివడుచున్నాడని చెప్పబడుతోంది కదా। **మరికొంతగా శ్రవణ భాగ్యం మాకు కలిగించండి.**

**యాజ్ఞవల్క్యుడు** : మరలా చెప్పుచున్నాను. ఆత్మ సర్వమునకు అంతర్యామి.

**కహోళుడు** : సర్వమునకు లోపల ఉండే ఆత్మ ఏది? **కతమో సర్వాంతరో?** స్థూల – సూక్ష్మ – సాక్షి దేహములలో అది ఎయ్యది?

**యాజ్ఞవల్క్యుడు : సముద్రతరంగాలవలె, రాత్రి, పగలు వలె –** ప్రాణమునకు ఆకలి దప్పికలు, మనస్సుకు శోక–మోహములు, భౌతిక శరీరమునకు జన్మ జరామరణములు → ఇవన్నీ ఎప్పటికప్పుడు 'ఒకటి తరువాత మరొకటి ఏర్పడటం ఈ ప్రాణులపట్ల జరుగుతోంది. ఇదియే **'సంసారము'** అని చెప్పబడుతోంది.

ఆత్మ అశన (ఆకలి), పిపాస (దాహము)లను అతిక్రమించినదై ఉన్నది. అయితే ఏ విధంగా ఆకాశమునకు ఏ రంగూ లేకపోయినప్పటికీ 'లేతనీలము' కనిపిస్తున్నదో, ఆ తీరుగా, **"నాకు ఆకలి! నాకు దాహము!"**....అను మాటలతో ఆత్మకు గుణములు, స్వభావములు ఆపాదించబడుచున్నాయి. **ఆకాశము నిత్యనిర్మలమైయున్న తీరుగా ఆత్మ నిత్యనిర్మలము.** ఇక దుఃఖము ఎందుకు ఉంటోంది?

**లోక దుఃఖములు =** అజ్ఞానముచే **ఆత్మకు గుణములు ఆపాదించటమే** 'దుఃఖము' యొక్క రూపము.

ఆత్మకు ప్రాణ సంబంధమైన ఆకలి – దప్పికలు ఆపాదించలేము. మనో సంబంధమైన శోకము, మోహము మొదలైనవి, భౌతిక దేహమునకు సంబంధించిన జన్మ – బాల్య – యౌవన – వార్ధక్య – మరణములు మొదలైనవి కూడా ఆపాదించలేము. బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యములలో 'నేను' అనునది యథాతథమై, ఏకరూపమై ఉండటమే – ఇందుకు 'దృష్టాంతము'.

ఎవ్వరైతే అట్టి బ్రహ్మమును ఎరుగుతారో, ఉపాసిస్తూ మమేకమౌతారో, అట్టి బ్రాహ్మణుని బుద్ధి **"పుత్రైషణ–విత్తేషణ – లోకైషణ"**....అను త్రి–ఈషణములను స్వయముగా స్వభావసిద్ధముగా దాటివేయుచున్నది.

ఏది పుత్రైషణయో...., అదియే విత్తైషణము!

ఏది విత్తైషణమో....అదియే లోకైషణము!

అట్లాగే ఈషణ త్రయమును అధిగమించినవాడు బ్రహ్మజ్ఞాని అయి, ఆత్మజ్ఞానమును సముపార్జించుకుంటూ కర్మలను, కర్మ సాధనములను కూడా దాటివేయుచున్నాడు. సర్వమును సన్యసించి భిక్షాచరణ పరుడు అగుచున్నాడు. (భి = అంధకార రూపమగు అజ్ఞానమును, క్ష = క్షయింపజేసుకొనువాడు)

కాబట్టి ఓ మిత్రమా! కహోళా! **బ్రహ్మవేత్త అయినప్పుడే ఈ జీవునికి శాంతి.** ఆత్మజ్ఞానముచే పండితుడు అవాలి. ఆచార్యులవద్ద వేదాంత శాస్త్ర విశేషాలను శ్రవణం చేసి ఆత్మజ్ఞానమును నిరవశేషంగా సముపార్జించుకోవాలి. త్రి–ఈషణములనుండి బుద్ధిని సంస్కరించి ఉద్ధరించుకోవాలి. ఓ జీవుడా! నిన్ను నీవే 'సర్వాంతర్యామిత్వము' వైపుగా ఉద్ధరించుకోకపోతే, – నిన్ను ఎవరైనా (గురువుగాని, దైవముగాని) వచ్చి ఉద్ధరించగలరా? లేనే లేదు.

ఆత్మజ్ఞానము ఆశ్రయించనంతకాలము, ఈ జీవుడు కర్మసాధనములను ఆశ్రయిస్తూనే ఉండవల్సివస్తోంది. కర్మల వెంట ఫలములు, ఫలముల కారణంగా పునఃగా కర్మలు.... **ఒకానొక కర్మచక్రము జీవునిపట్ల అనివార్యమగుచున్నది.**

ఆత్మజ్ఞానము ప్రవృద్ధమగుచుండగా కర్మవ్యవహారముల బలాధిక్యత తనకు తానుగా బలహీనపడుచూ, తరుగుతూ రాగలదు. అప్పుడు **కర్మఫలముల కంటే విలక్షణమైన ఆత్మయోగ విజ్ఞానబలము చేకూరుతూ వస్తుంది.** క్రమంగా ఈ **'ఇంద్రియములు'** అనే ఉపకరణములు ఆ ఆత్మజ్ఞానియగు జీవుని **'ఈషణములు'** అను పరిధిలోనికి **ఈడ్చుకుపోగల శక్తి కోల్పోతూ వస్తాయి.** అనగా, ఇంతవరకు ఈ జీవుని దుఃఖమునకు కారణమగుచున్న ఇంద్రియములు, కర్మలు ఇప్పుడు స్వస్వరూప బ్రహ్మానందమును చేకూర్చగల ఉపకరణములుగా అగుచున్నాయి.

జ్ఞానబలములేని వానిని ఇంద్రియములు ఎప్పుడో ఇట్టే ఏమరపించి మట్టి కరిపిస్తున్నాయి. ఈ జీవునికి తెలియకుండానే ఈతనిని ఈషణములలోనికి (Into inquisitively deep attachments like - Physical pleasures, Relationship pleasures and Possession pleasures) బలవంతముగా ఈడ్చుకొని పోవుచున్నాయి – అని కూడా గమనించబడుగాక!

పుత్రైషణవలన విత్తైషణ, విత్తైషణవలన లోకైషణలు ఆత్మజ్ఞానమునకు ప్రతిబంధకాలౌతున్నాయి.

**ఆత్మజ్ఞానము** = ఈ మనస్సు → బాహ్యనామ – రూపములవైపుకు, ఇంద్రియ విషయములవైపుకు ఆకర్షించబడకుండా – **అన్నిటిలోను, అందరుగాను ఆత్మను దర్శించు మార్గమువైపుగా ఆకర్షించబడి, అడుగులు వేయుచుండటమే – ఆత్మజ్ఞానము.**

**(నాయమాత్మా బలహీనేన లభ్యః!** బలహీనుడు ఆత్మవిద్యను పొందలేడు. అందుచేత).

**తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్! (5-5-1)**

బాలురు ఏ విధంగా పుత్ర-విత్త-లోక ఈషణములకు ఆకర్షితులు కారో, సులభముగా విద్యను నేర్చుకుంటారో, ఆ రీతిగా బాల్యభావము ఆశ్రయించి, ఆత్మవిద్యను నేర్వాలి. బాల్యమునుండే నేర్వాలి. బ్రహ్మజ్ఞానముచే "బ్రాహ్మణుడు" కావాలి.

**బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యా, అథ మునిర మౌనం చ। మౌనం చ నిర్విద్యా అథ బ్రాహ్మణః।(5-5-1)**

ఆత్మ జ్ఞానమును సద్గురు ముఖతః ఎరిగి ఆత్మబలము, ఆత్మభావము - ఆత్మ శాస్త్ర పాండిత్యమును చిన్నప్పటి నుండి పెంపొందించుకోవాలి. **"అట్టి మననశీలుడగు సాధకుడు క్రమంగా అనాత్మకు చెందిన మనోవృత్తులన్నీ నిరాకరించడము"** - అనునదే బ్రహ్మవేత్తకు సాధన, ఉపాసన కూడా। **బ్రహ్మవేత్తకు అనాత్మవృత్తులను త్యజించుట మాత్రమే 'సాధన' అగుచున్నది.** అట్టి సాధనచే ఆతడు కృతకృత్యుడు అగుచున్నాడు.

**పాండిత్యము =**

**(1) అమౌన పాండిత్యము =** (1) ఆత్మజ్ఞానము సముపార్జించటము. (2) బాల్యచాపల్యము అగు అనాత్మ వృత్తులను శ్రవణ - మననముల ద్వారా త్రోసి పుచ్చటము.

**(2) మౌన పాండిత్యము** = అనాత్మ వృత్తులను త్రోసిపుచ్చుటచే లభించు ఫలములు అయినట్టి శాంతి - నిదిధ్యాసలను పెంపొందించుకోవటము.

బాలుడు త్వరత్వరగా మాటలు - పాటలు నేర్చుకొను రీతిగానే, బ్రహ్మతత్త్వమును కూడా శ్రవణ-మనన-నిదిధ్యాసల ద్వారా నేర్పబడుగాక।

అప్పుడు ఆ మార్గమునందు ఎవ్వనికైతే **"ఈ సమస్తము,** ("నాది, నేనుతో సహా") **- సర్వదా పరబ్రహ్మమే!"**....అనే స్వభావసిద్ధమగు నూతన జ్ఞానము ఉదయిస్తోందో....,

**ఆతడే బ్రాహ్మణుడు। ఆతడే బ్రహ్మవేత్త। ఆతడే కృతార్థుడు। ఆతడే కృతకృత్యుడు।**

<u>కహోళుడు :</u> **స బ్రాహ్మణః కేనస్యాత్, ఏనస్యాత్ తేన ఈదృశ, ఏవ అతో అన్యదార్తం?** అట్టి బ్రాహ్మణుడు ఎటువంటి ఆచరణము కలిగి ఉంటాడు? ఏ ఆచరణముచే ఆతడు 'బ్రాహ్మణుడు' అని గుర్తించబడుతాడు?

<u>యాజ్ఞవల్క్యుడు :</u> దీనికి సమాధానము వినండి.

**"బ్రహ్మవేత్త ఈ ఆచరణమును ఇట్టివిధంగా మాత్రమే కలిగి ఉంటారు!"** అని ఖచ్చితంగా (Admeasurably) మనమేమీ చెప్పలేము. విధి - విధాన - నియమములు చెప్పలేము. ఆచరణ లోకజీవిత సంబంధమైనది. ఆత్మజ్ఞానమో? **మనన - మౌనములకు, అమౌన-మౌన బుద్ధి వివేకములకు సంబంధించినది. హృదయాంతరంగమునకు సంబంధించినది.**

బ్రహ్మవేత్త యొక్క బుద్ధి సంబంధించిన అతీత - స్థితి ఏమిటో, అది శ్రుతి, స్మృతులచే స్తుతించబడుచున్నది. అట్లు శ్రుతుడు స్తుతించటమును **'ఆచరణము గురించి అనాదరణ'**.... అను అర్థముతో చూడరాదు.

**"బ్రహ్మ జ్ఞానిమార్గంలో సదాచారముతో పనియే లేదు" అనే నిర్ణయానికి రాకూడదు సుమా।**

ఈవిధంగా బ్రహ్మమును ఎరిగిన బ్రహ్మవేత్త **- ప్రాణ సంబంధములు మాత్రమే అయిన** ఆకలి - దప్పికలకు, **మనస్సుకు సంబంధించినవి మాత్రమే అయిన** సుఖ-దుఃఖములకు, **దేహమునకు మాత్రమే సంబంధించిన** జీవన్మరణములకు అందని ఆత్మను దర్శించుచూ సర్వకాల, సర్వావస్థలలోను **'సంతృప్తుడు'** అయి ఉంటున్నాడు.

ఆత్మదర్శనమునకు భిన్నమైన భావ-ఆవేశములన్నీ కల్పనా విభాగమునకు, అజ్ఞాన దశకు చెందినవే। అజ్ఞాన స్థితులకు చెందిన కోరికలు నెరవేరటము (లేక) నెరవేరకపోవటము.... ఉభయము దుఃఖమిశ్రితములే। కలలోని వస్తువులవలె, ఇంద్రజాలములోని కల్పనలవలె, ఎండమావులలో నీరు వలె... **కల్పితము, భ్రమాత్మకము కూడా।**

ఎవని దృష్టిలో ఆత్మకు వేరుగా ఎక్కడా ఏ ద్వితీయ పరిచ్ఛేదము లేనేలేదో, ఆతడు ఆ దృష్టియొక్క నిర్మలత్వముచే, ఇక దృశ్య - కర్మ -జన్మ బంధములన్నీ - ఒక సన్నటి దారమువలె అతి తేలికగా త్రెంచి వేయగలడు.

**తతో హ కహోళః కౌషీతికేయ ఉపరామ।** యాజ్ఞవల్కునియొక్క ఈ సమాధానము విని కుషీలోకముని కుమారుడగు కహోళుడు సంతోషము - సంతృప్తులతో చిరునవ్వు ప్రకటించినవారై మౌనము వహించారు.

**ఇతి**

***బృహదారణ్యకోపనిషత్ - పంచమో అధ్యాయే***

***యాజ్ఞవల్క్య కహోళ సంవాదరూపక "ఆత్మవేత్తత్వము".***

## పంచమ అధ్యాయము-షష్ఠమ బ్రాహ్మణము
## యాజ్ఞవల్క్య - గార్గీ సంవాదము
## లోకాతీతమ్ పరంబ్రహ్మ।

అప్పుడు వచక్న ముని కుమార్తెయగు గార్గి లేచి నిలుచుని సభకు, యాజ్ఞవల్క్యునికి హృదయపూర్వకంగా నమస్కారములు సమర్పించి, ఇక ప్రశ్నించసాగారు.

**గార్గి** : అయ్యా! యాజ్ఞవల్క్య మహాత్మా! ఈ పృథివీ (Material) వికారముతో కూడి ఏదేది కనిపిస్తోందో, భౌతికమైన ఇదంతా కూడా (All that is physical) అప్పు (నీటి) యందు ఓతప్రోతమై ఉన్నది కదా! (యో ఆపః మాం యతనం వేద, ఆయాతనవాన్ భవతి - ఇతి శ్రుతివాక్యమ్).

ఓతము = వస్త్రములోని నిలువు దారమువలె।

ప్రోతము = వస్త్రములోని అడ్డపు దారమువలె।



**ఓతప్రోతము = నిలువు అడ్డ దారములచే నిర్మితము.**

ఈ విధంగా ఈ కనబడే పదార్థాలన్నీ కూడా లోపల - బయట కూడా అంతటా నీటిచే వ్యాపించబడి ఉన్నాయి.

ఈ విధంగా నీటిచే వ్యాప్తము కానిచో విడివడి పడిపోయేవే మరి!

మరి జలములు దేనిలో పడుగు పేకలవలె వ్యాప్తములై, ఓత-ప్రోతములై ఉన్నాయి? జలమునకు అధిష్ఠానము ఏది?

**యాజ్ఞవల్క్యుడు** : జలము వాయునందు వస్త్రములోని నిలువు - అడ్డదారములవలె ఓత-ప్రోతమై ఉన్నది.

**వాయువో?** అంతరిక్షమునందు ఓత-ప్రోతమై యున్నది. అనగా పంచభూతములు పరస్పరము కలిసిపోయి అంతరిక్షలోకములు (ఆకాశ లోకములు) అగుచున్నాయి.

అంతరిక్ష రూపములైనట్టి భూతములు గంధర్వలోకములయందు ఓతప్రోతమై యున్నాయి. (లేక) వ్యాపించి ఉన్నాయి.

- గంధర్వ లోకము → ఆదిత్యలోకములయందు వ్యాపించి ఉన్నది.
- ఆదిత్య లోకము → చంద్రలోకమునందు వ్యాపించి ఉన్నది.
- చంద్ర లోకము → నక్షత్ర లోకమునందు ఓత-ప్రోతమై (వ్యాపించి) ఉన్నది.
- నక్షత్ర లోకము → దేవలోకమునందు విస్తరించినదై ఓతప్రోతముగా ఉన్నది.
- దేవ లోకము → ఇంద్ర లోకమునందు వ్యాపించినదై - ఓతప్రోతమై - ఉన్నది.
- ఇంద్ర లోకము → ప్రజాపతి లోకమునందు,
- ప్రజాపతి లోకము → బ్రహ్మలోకమునందు ఓతప్రోతమై వ్యాపించి ఉన్నది.

**గార్గి** : మరి బ్రహ్మలోకమో? ఎద్దానియందు ఓతాశ్చ - ప్రోతాశ్చ ఇతి? - ఓత-ప్రోతమై యున్నదని మీ అధ్యయనము?

**యాజ్ఞవల్క్యుడు** : అమ్మా! గార్గీ! మీరు మీ ప్రశ్నను ఆవేశముతో కూడిన అలవాటుగాను, లోకరీతి అయిన విధంగాను అడుగుచున్నట్లు నాకనిపిస్తోంది. ఇది 'అతిప్రశ్న' అని అంటారు. **స్వం ప్రశ్నమ్ న్యాయప్రకారమ్ అతీత్య ఆగమేన ప్రష్టవ్యాం। దేవతామ్ అను మానేన మా ప్రాక్షీః।** సృష్టికి ఆవలగల బ్రహ్మము గురించిన వివరణకై అడుగుచున్నప్పుడు లౌకికమైన న్యాయశాస్త్రపద్ధతిలో అడగటము పద్ధతి కాదు. శాస్త్ర ఉపదేశములు ఏమి చెప్పుచున్నాయో, అద్దానిని ఎరిగి, దృష్టిలో పెట్టుకొని ఆత్మశాస్త్ర న్యాయవిధిగా ప్రశ్నించాలమ్మా!

ఉదాహరణకు **"కుండలన్నీ మట్టినుండే ప్రదర్శనమగుచున్నాయి. అదే రీతిగా బ్రహ్మము నుండి ఈ సర్వము ప్రదర్శితమగుచున్నది"**.... అని బ్రహ్మజ్ఞుడగు గురువు చెప్పుచున్నప్పుడు **"మరి మట్టి ఎన్ని కుండల నుండి బయల్వెడలింది? ఎక్కడి నుండి వచ్చింది?"** అని అడుగము. మట్టి కుండ లోనుంచి రానట్లే, బ్రహ్మము ఏదో స్థానమునుండో, పదార్థమునుండో వచ్చేది కాదు! మరల చెప్పుచున్నాను. **"బంగారము వేరు – ఆభరణము వేరు కాదు. అట్లాగే బ్రహ్మమే ఈ సమస్తము"**.... అని శాస్త్రములు దృష్టాంతపూర్వకంగా చెప్పునప్పుడు **"మరి బంగారు ఖనిజము ఎక్కడి నుండి బయల్వెడలింది?"**.... అని అడగటము శాస్త్ర అధ్యయన విషయంలో విధివిధానము కాదు.

**"బ్రహ్మమునందే ఈ సర్వము ఓత ప్రోతమైయున్నది – వస్త్రమంతా దారము అడ్డము, నిలువుగా ఓత ప్రోతమైనట్లు"**.... అని కూడా సమాధానముగా చెప్పలేము. **"సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ"**.... అను మహావాక్యముచే మనము పృథివి నుండి బ్రహ్మలోకముగా చెప్పుకొన్నవన్నీ బ్రహ్మమునకు అభిన్నము. ఎందుకంటే బ్రహ్మము అద్వితీయము కాబట్టి। **బ్రహ్మమునకు అన్యమైనట్టి దృష్టియే సృష్టి.**

**"ఇదంతా బ్రహ్మమే। బ్రహ్మము అద్వితీయము"** అనునది వేదాంత సిద్ధాంతము. అద్దాని నిరూపణగా మీ ప్రశ్న ఉండాలి. లేదా **"జగత్తు బ్రహ్మము కంటే వేరుగా ఉన్నది"** అని మహావాక్య వ్యతిరిక్తంగా ఉంటే, చర్చించవచ్చు. **'ఇదంతా బ్రహ్మమే'** అనునది వేదవాక్య ప్రమాణం। తర్కించటానికి విషయం కాదు. **శాస్త్రవాక్య – సద్గురు స్వానుభవములే అందుకు ప్రమాణం.**

అందుచేత **"బ్రహ్మలోకము ఎద్దానియందు విభాగమై ఉన్నది?"**.... అనునది అడుగవద్దు! బ్రహ్మము లోకములుగా అజ్ఞాన దృష్టికి కనిపిస్తున్నప్పటికీ, **"బ్రహ్మజ్ఞాన దృష్టికి సర్వము బ్రహ్మమే"** అనునది మీరు శ్రుతం చేస్తున్న వేదవాక్యమేకదా! వేదవాక్యమునకు ప్రమాణము కావాలంటే అడగండి। **బ్రహ్మలోకము బ్రహ్మానుభావుల (బ్రాహ్మీభావన కలవారి) నివాసస్థానముగా గ్రహించెదరుగాక.** (భౌతిక దృష్టి కలవారికి భౌతిక లోకములే నివాసయోగ్యములగుచూ ఉన్న తీరుగా...)

꧁

పరమోత్కృష్టమగు మహావాక్యమును లౌకిక దృష్టాంతముల – లోకరీతుల పరధిలోకి త్రోసుకురాకూడదు. ఉపమానములన్నీ బ్రహ్మముగురించి తెలియజేయటానికి విజ్ఞులు వాడే ఉపకరణములవంటివి మాత్రమే! లోకముల తీరు కూడా బ్రహ్మము గురించి చెప్పటానికి ఉపకరణము మాత్రమే!

ఒకవేళ, మహావాక్యార్థములను, ఆత్మజ్ఞానుల అద్వైతానుభవమును తిరస్కరించి లోకసంబంధముగా వ్యతిరేకిస్తూ పోదలచుకొన్నామా? బ్రహ్మమును ఎరుగటము ఆశయము కాకుండా, కేవలము **"వారికి అది తెలియదు! వీరికి ఈ అనుభవము లేదు"**.... ఇట్టి నిరూపణలకై సంభాషించదలచారా? అది మహావాక్యములను ప్రశ్నించు ప్రశ్నగా పరిణమించగలదు. **సత్యమును చేరలేము.**

అందుచేత ఓ గార్గీ! నీవు బ్రహ్మతత్త్వన్యాయమును అతిక్రమించి ప్రశ్నించటం కొనసాగించటమే ఆశయముగా కలిగి ఉంటే....(లేక) "బ్రహ్మము ఎట్టిదో తరువాత చూద్దాం! ముందుగా బ్రహ్మముగా ఎరిగినవారిని – ఎరుగనివారుగా చెప్పుకోవటము ఆశయము" – అనునది మీ అభిప్రాయమైతే, **"సత్యమేవ జయతే। న అనృతః।"** అను పరమసిద్ధాంతము మీ శిరస్సును త్రెంచి నేలమీద పడవేయగలదు. అందుచేత భౌతిక ప్రపంచవిశేషములను పాండిత్య ప్రకర్షణగా కలిగి ఉండటమును (బ్రహ్మజ్ఞానము కొరకై) త్యజించాలేగాని, కొనసాగించరాదు.

꧁

అందుచేత మీరు బ్రతికి ఉండదలచుకొంటే (శిరస్సు కలిగి ఉండదలదుకొంటే, బ్రహ్మతత్త్వాధ్యయనులు కాదలచుకొంటే) బ్రహ్మమునకు – బ్రహ్మలోకమునకు ముడిపెట్టకుండెదరు గాక! **బ్రహ్మమును లోక సంబంధంగా ఎంతగా చర్చించినా, అఖండజ్యోతి స్వరూపము అనుభవమునకు రాదు.**

꧁

**ఆ సమాధానము విని వచక్నుని పుత్రికయగు గార్గి తృప్తి చెందినవారైనారు. ఇక మరొక ప్రశ్న వేయకుండా, కూర్చుని మౌనము వహించారు.**





## పంచమ అధ్యాయము-సప్తమ బ్రాహ్మణము
## యాజ్ఞవల్క్య - ఆరుణి సంవాదము
## సూత్రాత్మ - సూత్రమునకు అంతర్గతమైన అంతర్యామి

అప్పుడు అరుణిముని కుమారుడగు ఉద్దాలకుడు లేచి ఇట్లు పలకసాగారు.

సభికులారా! సభలోని విజ్ఞులగు మహనీయులారా! ఓ జనక మహారాజా! అరుణి పుత్రుడనగు **'ఉద్దాలకుడు'** (ఆరుణి) అను వ్యావహారికనామముగల నేను సభలోని వారందరికి **ప్రపత్తి పూర్వకంగా** నమస్కరిస్తున్నాను. మీ అందరి అనుజ్ఞతో ఈ యాజ్ఞవల్క్యులవారి ముందు కొన్ని ప్రశ్నలు ఉంచబోవుచున్నాను.

ఓ యాజ్ఞవల్క్య మహాశయా! **నమస్కారము.** నేడు అడుగబోయే నా ప్రశ్నకు ఒక సంఘటనకు సంబంధము ఉన్నది. అది చెప్పుచూ, మీ సమక్షములో ఆ ప్రశ్నను ఉంచబోవుచున్నాను.

❖

మేము కొంతమంది వేదాధ్యయన విద్యార్థులము ఒకానొకప్పుడు యజ్ఞశాస్త్రమును అధ్యయనము చేస్తూ 'మద్రదేశము'లో కపి గోత్రీయుడగు **'పతంజలుడు'** అని వేదపండితుని ఇంటిలో కొంతకాలము నివసించటం జరిగింది.

ఆ పతంజలుని భార్యను ఒక సమయములో ఒక గంధర్వుడు ఆవేశించియుండియున్నారు. ఒకరోజు యజ్ఞశాస్త్ర విద్యార్థులమగు మేము, పతంజలుడు – మేమందరము కలసి ఆ ఆవహించిన గంధర్వుని కొన్ని మంత్రములతో స్తోత్రము చేసి, మాతో సంభాషించునట్లు చేసి, ఇట్లా మాట్లాడసాగాము.

**ఉద్దాలకుడు మొదలైన శిష్యులు** : ఈ ఇంటి ఇల్లాలిని ఆవహించిన ఓ గంధర్వ మహానుభావా? మీరు ఎవరు? ఎందుకు ఈమెను ఆవహించారు? మీకు ఏమికావాలి?

**పతంజలుని ఇల్లాలిని ఆవహించిన ఆ గంధర్వుడు** : ఓ యజ్ఞశాస్త్రమును అభ్యసించుటకై ఈ మద్రదేశము వచ్చి, ఈ గృహములో నివశించుచున్న ఉద్దాలకుడు మొదలైన విద్యాధ్యయనులారా! ఓ పతంజల మహాశయా! మీరంతా మంత్రయుక్తంగా కోరినట్లు, నాగురించిన వివరాలు చెప్పుచున్నాను వినండి!

నేను **'అధర్వణుడు'** అను ఆయన కుమారుడను. నా పేరు **కబంధుడు.**

**మేము** : ఓ కబంధ మహాశయా! మీరు – ఈ ఇంటి ఇల్లాలిని ఏ ప్రయోజనము ఆశించి ఆశ్రయించారు?

**కబంధుడు** : నాకు వేద–వేదాంత శాస్త్రములకు సంబంధించిన కొన్ని సందేహాలు ఉన్నాయి. అవి మరణానంతరము కూడా నన్ను పట్టి పీడిస్తున్నాయి. ఈ పతంజలుడు యజ్ఞశాస్త్రములో బహుప్రావీణ్యుడని లోకప్రసిద్ధి. నాకున్న కొన్ని సందేహములు తొలగించుకోటానికే ఈ జీవితభాగస్వామిని పిశాచినై ఆశ్రయించాను. అంతేకాకుండా, నాకు తెలిసి విజ్ఞతను పంచుకోవాలని కూడా, నా ఆశయము. అది సత్సంగపూర్వకమైనట్టి ఉద్దేశ్యము.

**పతంజలుడు** : అట్లాగా? ఓ అధర్వణ విప్రోత్తమా! గంధర్వా! మీ సంశయములేమిటో ప్రశ్నలుగా అడగండి. మాకు తెలిస్తే తప్పక సమాధానము చెప్పుతాము.

**కబంధుడు** : యాజ్ఞకుని శిష్యులారా! (యజ్ఞశాస్త్రమును నేర్చుకొనుచున్న విద్యార్థులారా!) ముఖ్యంగా కపిగోత్రీయుడగు పతంజల మహాశయా!

**జానూషే తత్ సూత్రమ్? – కిం తత్?** మీకు 'తత్ సూత్రము' గురించి తెలుసునా?

**మేము** : మీరు అడిగేది ఏ సూత్రము (దారము) గురించి? మరికొంత వివరణగా అడగండి!

**అధర్వణకుమారుడగు (పూర్వాశ్రమ) కబంధ నామధేయ (వర్తమాన) గంధర్వుడు : యేన సూత్రేన అయం చ లోకః, ఇదం (జన్మ), పరశ్చ లోకః పరంచ ప్రతిపత్తవ్యం (జన్మ)....., సర్వాణి చ భూతాని, బ్రహ్మాది - సందృబ్ధాని, సంగ్రధితాని - స్రగివ? సూత్రేన విష్టబ్ధాని భవంతి యేన, - తత్కింసూత్రేణ వేత్థ? (5-7-1).**

కపిగోత్రీయుడగు పతంజలా! ఏ సూత్రము (దారము)తో అయితే.....

→ ఈ వర్తమాన లోకము,

→ ఈ వర్తమాన జన్మ,

→ దేహానంతరము సిద్ధించబోవు లోకము (పరలోకము),

→ రాబోయే మరొక దేహము,

→ ఆ దేహముతో అనుభవమవబోవు లోకము,

....ఇవన్నీ (పూదండలో దారమునకు వలె) గ్రుచ్చడి ఉన్నాయి?

ఏ సూత్రముచే బ్రహ్మదేవుని నుండి → ఒక గడ్డిపోచ వరకు సకల ప్రాణులు 'దారము'చే 'పుష్పమాల' వలె గ్రుచ్చబడి ఉన్నారు? ఆ **'ఏకసూత్రము'** లేక **'తత్ సూత్రము'** ఏదై ఉన్నది?

ఓ పతంజలుడా! అది మీకు తెలుసా? తెలిస్తే దయచేసి చెప్పండి!

**పతంజలుడు** : **న అహం తత్, భగవాన్ వేదేతి!** పూజనీయుడవగు ఓ కబంధ నామధేయ గంధర్వా! మీరు అడిగిన ఆ 'తత్‌సూత్రము' గురించి నాకు తెలియదు! **తత్ సూత్రం న అహం జానే, హే భగవాన్! ఇతి సంపూజనీయన్ ఆహ।** మీరు అడిగిన ప్రశ్న బహుశః తత్త్వార్థసారమగు ప్రశ్న అయి ఉంటుంది కాబట్టి మీరు నాకు పూజనీయులు! భగవాన్! మీరు అడిగిన **తత్‌సూత్రము** ఏమిటో నేను ఎరిగి ఉండలేదు. అందుచేత మీకు సమాధానము ఇవ్వలేకపోతున్నాను. (I am sincerely unable to provide details of what you would like to know or listen to).

**గంధర్వుడు (కబంధుడు)** : హే ఉపాధ్యాయన్! పతంజలా! ఓ యజ్ఞశాస్త్ర పఠణ విద్యార్థులారా! సరేం! **"సూత్రాత్మ గురించి నాకు తెలియదు"** అని ఈ మీ ఉపాధ్యాయుడు అంటున్నారు. అయితే, మరొక ప్రశ్న అడుగుతాను మరి!

**వేత్థ ను త్వం, కాప్య! తమ్ అంతర్యామిణమ్?**

ఓ కావ్య గోత్రుడగు పతంజలా! **'అంతర్యామి'** అనగా ఎవ్వరో మీకు తెలుసా?

**పతంజలుడు** : ఏ అంతార్యమి? ఎవరి అంతర్యామి గురించి మీరు అడుగుచున్నారు? ఈ శరీరమునకు సంబంధించిన అంతర్యామియా! ఈ లోకానికి సంబంధించిన అంతర్యామియా? అంతరంగమునకు చెందిన అంతర్యామియా?

**గంధర్వుడు** : **య ఇమం చ లోకం, పరం చ లోకగ్ం**
**సర్వాణి చ భూతాని, యో అంతరో, అభ్యంతరస్సన్**
**యమయతి, నియమయతి దోహయంత్రమివ**
**భ్రామయతి స్వం స్వముచి వ్యాపారం కారయతీతి॥ (5-7-1)**

ఎవ్వరైతే....

- ఈ లోకమును, పరలోకమును కూడా **తనయందు తానే లోన ఉన్నవాడై** ఈ కనబడుచున్న **సర్వమును నియమించుచున్నారో**.....,

* ఇదంతా కూడా తనయొక్క 'మాయ' చే చెక్క యంత్రమును యంత్రరూఢుడై త్రిప్పుచున్నట్లుగా – త్రిప్పుచున్నారో,
* ఈ ఇంద్రియ – మనో – బుద్ధి – చిత్త అహంకారములను తమతమ అర్హమగు వ్యాపారములను చేయించుచూ పర్యవేక్షిస్తున్నారో....?

....... అట్టి **'అంతర్యామి'** గురించి నేను మిమ్ములను అడుగుచున్నాను. ఓ పతంజల మహానుభావా! అట్టి అంతర్యామిగురించి మీకు తెలుసా?

**పతంచలుడు** : ఓ పూజనీయా! మహాశయా! గంధర్వా! మీరు అడుగుచున్న వివరములతో కూడిన **'అంతర్యామి'** గురించి కూడా, ఆయన ఎవ్వరో నాకు తెలియదు. నేను అద్దాని గురించి వినలేదు. వివేచన చేయలేదు.

**గంధర్వుడు** : ఓ ప్రియశ్రోతలారా! మిత్రులారా! (1) సూత్రాత్మ యొక్క (2) ఆ సూత్రమునకు అంతర్గతమైయున్న అంతర్యామియొక్క...విజ్ఞానమే – ఈ మీరు, నేను చూస్తున్న ప్రపంచంలో మహత్తరమైన తెలుసుకోవలసిన విషయము, విశేషము కూడా।

* ఎవ్వడైతే అట్టి సూత్రాత్మను సుస్పష్టంగా తెలుసుకొని ఉపాసిస్తాడో....,
* అట్టి సూత్రాత్మకు అంతర్గతమైయుండి సూత్రాత్మను నియమించుచున్న అంతర్యామిని కూడా నిర్దుష్టముగా కరతలామలకమువలె ఎరుగి ఉంటాడో....

**అట్టివాడు నిశ్చయంగా బ్రహ్మవేత్త!** పరబ్రహ్మతత్త్వము గురించి, పరమాత్మత్వము గురించి ఎరిగినట్టివాడు. ఇక ఆతడు – "అంతర్యామిచే నియామకము చేయబడుచున్న **'భూ–భువర్–సువర్'** లోకముల స్వరూప స్వభావములు ఎరిగినవాడగుచున్నాడు. మట్టి బొమ్మలను తయారుచేయువాడు మట్టి – మట్టి బొమ్మ – మట్టి బొమ్మలో మట్టి ఎరిగియే ఉంటాడు కదా। అదీ అంతే.

అంతర్యామిని ఎరుగుటచే అగ్ని, వరుణుడు, వాయువు యముడు మొదలైన దిక్పాలకుల స్వరూప – స్వభావములను కూడా ఎరిగినవాడగుచున్నాడు. ఆ మహనీయుడే ఆస్తికులకు, జ్ఞానులకు కూడా 'ప్రమాణము' (A Standard Example) గా అగుచున్నాడు. అందరికి ప్రమాణములగుచున్న వేదములకే ఆతడు ప్రామాణికము (An example to quote for various finest theories) అగుచున్నాడు.

అంతేకాదు. అట్టి సూత్రాత్మను ఎరిగినవాడు...,

– సూత్రాత్మచే సమష్టి రూపముగా కలిపి ఉంచబడుచూ, సూత్రమునకు లోపల ఉండే అంతర్యామిచే నియమించబడుచున్న, నియంత్రించబడుచున్న ఆబ్రహ్మాది పిపీలికాంతము వరకు (సృష్టికర్తయగు బ్రహ్మదేవుని నుండి ఒక పురుగు, గడ్డి పరక వరకు) గల **సకలప్రాణుల తత్త్వార్థ స్వరూపము తెలుసుకున్నవాడు, ఎరిగినవాడు అగుచున్నాడయ్యా!**

ఇంకా కూడా, అట్టివాడు సర్వదా పరస్వరూపుడై తనయొక్క జాగ్రత్–స్వప్న–సుషుప్తిల యందు సంచరించుచున్న ఇహా స్వరూపమును (లేక) **"ఈ జీవాత్మను, ఈతని కర్తృత్వ – భోక్తృత్వ లక్షణములతో సహా – కల్పించుచున్నది నేనే కదా!"** అని ఎరుగుచున్నాడు. **పరస్వరూపమునందు సంస్థితుడై, ఇహాస్వరూపమును (జీవాత్మను) పర్యవేక్షిస్తూనే, నిర్విషయుడై ప్రకాశించుచున్నాడు. జగత్తును స్వీయకల్పనా విభాగములోని ఒక చిన్న సంగతి, సందర్భముగా చూడగలుగుచున్నాడు.**

❖

**ఉద్దాలకుడు :**

**ఓ యాజ్ఞవల్క్య మహాశయా!** ఆ గంధర్వుడు సూత్రాత్మ–అంతర్యామిల గురించి పతంజలుని ఇంటి ఇల్లాలి ఉపాధి ద్వారా గంగా ప్రవాహముగా అనేక విశేషాలు మాట్లాడుతూ ఉండగా మేము ఉత్సాహంగా విన్నాము. పరమానందము పొందాము. ఆత్మ విషయమై జాగృతమైనాము. అదంతా తెలుసుకొని ఉన్నాము. ఇదీ సంఘటన.





ఇప్పుడు ఈ వర్తమానానికి వద్దాము. మీకు ఆ **"తత్ సూత్రము - సూత్రమునకు అంతర్గతమైయున్న పదమునకు అంతర్యామి"** ....ఈ రెండిటి గురించి తెలుసా? తెలిసియుంటే,....నాకు, ఇక్కడి సభాసదులకు విశదపరచమని నా అభ్యర్థన.

ఒకవేళ, మీరు ఆ సూత్రాత్మగురించిగాని, ఆ సూత్రాత్మయొక్క అంతర్లీనమైయున్న అంతర్యామి గురించి గాని తెలియకపోతే మాత్రం సరికాదేమో। బ్రహ్మిష్ఠునకు చెందిన గోవులను మీ ఇంటికి (ఆశ్రమమునకు) తోలికొని వెళ్ళినందుకు దుష్ప్రతిఫలంగా మీ తలతెగి నేలపడగలదు సుమా! ఎందుకంటే మీరు బ్రహ్మవేత్త కానట్లే, బ్రహ్మవేత్తలకు చెందవలసిన సొత్తు దొంగతనముగా తీసుకొనిపోయినట్లే అవుతుంది. ఆ కారణంగా ఆ శాపము మిమ్ములను దహించివేస్తుంది. మీ తల నేలకూలక తప్పదు. బ్రాహ్మణ ద్రవ్యమును దొంగిలించిన దోషము ఎట్టిదో - మీకు వేరే వివరించి చెప్పాలా? శాస్త్రములను ఎరిగినవారే కదా!

**యాజ్ఞవల్క్యుడు : వేద వా అహం, గౌతమ! "తత్‌సూత్రం" చ, తం చ "అంతరాయమినమ్" ఇతి।। (5-7-1)।**

ఓ గౌతమా! ఆ గంధర్వుడు చెప్పిన 'సూత్రాత్మ' గురించి నాకు తెలుసు. 'అంతర్యామి' గురించి నేను ఎరిగియే ఉన్నాను.

**ఉద్దాలకుడు : యోవా ఇదం కశ్చిత్ బ్రూయాత్ "వేద! వేద!" - ఇతి!** "నాకు తెలుసు। నాకు తెలిసియే ఉన్నది।" అని ఎవరైనా కూడా అనగలరు. అట్లా అనటానికి 'బ్రహ్మిష్ఠుడను నేను" అని నిండు సభలో ఎలుగెత్తి చెప్పినవారే అక్కర్లేదు.

మీకు అద్దాని గురించి ఏమి తెలియునో, అది దయచేసి చెప్పండి. మేమందరమూ వింటాము! విని, మీకు తెలుసో, తెలియదో ఇక్కడి ప్రజ్ఞావంతులగు సభాసదులు నిర్ణయించగలరు.

**యాజ్ఞవల్క్యుడు** : ఓ గౌతమా! "తత్ సూత్రము" అనునదే వాయువే అయి ఉన్నది! **తత్ సూత్రమ్ వాయునా వై। (5-7-2)**

**సూత్రేణ అయం చ లోకః పరశ్చ లోకః**
**సర్వాణి చ భూతాని సంన్దృబ్ధాని భవంతి।     (సన్ధితము = కూర్చబడినది).**
**సిషతాస్య అంగానీతి వాయునా। (5-7-2)**

సూత్రరూపుడగు **'వాయవు'** చేతనే ఈ ఇహలోకము, పరలోకము, (అంతేకాకుండా) సకల ప్రాణులు కూడా సమష్టిరూపముగా కలిపి (కూర్చబడి) ఉంచబడుచున్నారు. అందుకే ఒక మానవుడు మరణించినప్పుడు-"ఈతడు ఊపిరి పీల్చటం లేదు. అనగా, **ఈతని అవయవములు ఈతని నుండి విడిపోయాయి"**..... అని జనులు పదప్రయోగంగా అంటూ ఉంటారు..."**ఈతనితో అవయవములు వాయువుచే కలిపి ఉంచబడినవి"**....అని చెప్పటమే అందలి గూఢార్థము. ఆ వాయువే లింగ శరీరీ రూపము కూడా. (5) కర్మేంద్రియము + ('5') జ్ఞానేంద్రియములు + (5) పంచప్రాణములు + మనస్సు + బుద్ధి = 17 - ఈ '17' కూడా లింగశరీరమని, **లింగశరీరము ప్రాణములచే (వాయువుచే) నిర్మితములు అగుచున్నాయని చెప్పబడుతోంది.** '3' నిముషముల కాలము గాలిని శరీరములో ప్రవేశించటమును నిరోధిస్తే, ఆ శరీరము నిస్తేజము పొందటము, మరణించటము జరుగుతుందని అందరికీ విదితమే కదా। కర్మఫలములకు, **'కామము-కోపము'** మొదలైన వాసనలకు స్థానము కూడా వాయు (ప్రాణ) నిర్మిత స్థానమే అయిఉన్నాయి. ప్రాణమే అటు సమష్టి (సృష్టికర్త హిరణ్యగర్భుని) రూపముగాను, ఇటు వ్యష్టి (జీవులు) రూపముగానూ ఉన్నది. అవన్నీ ఒకే వాయువుయొక్క ముఖ్యవీచిక - వివిధ ఉపవీచికలు వంటిదే। వాయువు యొక్క ప్రసరణము దృష్ట్యా '49' రకములైన విశేష వాయువీచికలు ఉన్నాయి. ఇవియే **'మరుత్-గణము'** అని చెప్పబడుతోంది.

ఈ విధంగా ఓ గౌతమా! ఇహలోకములోను, పరలోకములోను సర్వప్రాణులను కలిపి ఉంచే దారము వాయువే। "ఈ సర్వము కూడా సూత్రరూపమగు వాయువుచే గ్రుచ్చి, కలుపబడి ఉన్నది - అని లోక ప్రసిద్ధము కూడా। **అస్థి చ లోకే ప్రసిద్ధిః, యస్మాత్ వాయునా సూత్రమ్।**

**వాయునా విధృతమ్ సర్వమ్।** మణులమాల దారముచే గ్రుచ్చబడి, దారము తెగగానే మణులన్నీ చెల్లాచెదురు అవుతాయి కదా! శరీరము యొక్క అంగములన్నీ **'వాయువు'** అను దారమునకు మణులవలె గ్రుచ్చబడి ఉన్నాయి.

వాయువు తొలగగానే అవయవములన్నీ (శబ్ద స్పర్శ రూప రస గంధ-పంచతన్మాత్రలన్నీ) వేరువేరుగా అయి, శిథిలగమగుచున్నాయి.

కనుక **'వాయువు'** అను సూత్రపు తాడుచే శరీరములోని అవయవములన్నీ గ్రుచ్చబడి కనిపిస్తున్నాయి. అట్లాగే దేహ-దేహాంతరములు, లోక-లోకాంతరములు కూడా।

**ఉద్దాలకుడు** : ఓ యాజ్ఞవల్క్యా! మీరు చెప్పినది యథార్థమే! మీరు చెప్పినతీరుగానే ఆ అథర్వణ పుత్రుడగు కబంధ(పూర్వ) నామధేయ గంధర్వుడు కూడా చెప్పి ఉన్నారు.

సరేc! **తత్ సూత్రం అంతర్గతం తు ఇదానీం తస్యైవ సూత్రస్య నియంతారం బ్రూహి।** ఆ సూత్రమునకు అంతర్గతముగా ఉండి సర్వము నియంత్రిస్తున్న అంతర్యామిగురించి చెప్పండి. మేము సవివరంగా వినదలచుకున్నాము.

**యాజ్ఞవల్క్యుడు** : ప్రియ ఉద్దాలక మహాశయా! వినండి, చెప్పగలిగినంతవరకు చెప్పుతాను.

❖

**పృథివీ అంతర్యామి :** **యః పృథివ్యాం తిష్ఠన్,**
**పృథివ్యా అంతరో, అయం పృథివీ న వేద। (5-7-3)।**

- ఎవ్వరైతే పృథియందు అంతటా నిండి ఉన్నారో, పృథివియందు అభ్యంతరమున వేంచేసి ఉన్నారో,
- **యం అంతర్యామిణం పృథివీ దేహవతాపి న వేద।** - ఎవ్వరిగురించైతే పృథివి → **"నాయందు ఉన్నారు కదా"** అని ఎరుగుచుండుటయే లేదో....
- ఎవ్వనికి పృథివి అంతా తన శరీరమే అయిఉన్నదో, **అదియే ఆ అంతర్యామి!** పృథివి యొక్క విభాగములగు ఇంద్రియములు మొదలైనవన్నీ కూడా ఆ అంతర్యామికి ఇంద్రియ విభాగములు అగుచున్నాయి.
- ఆ అంతర్యామియే పౌరాణికముగా **నారాయణుడు** అని చెప్పబడుచూ ఉన్నారు. ఆయనయే భూమిని నియమబద్ధముగా చేస్తూ నియమించువారై ఉన్నారు.
- అట్టి అంతర్యామి ఎవ్వరు - ఎక్కడున్నారు....అని అడుగుతారా? అయితే వినండి!

- **ఆ అంతర్యామి మీ ఆత్మయే।**
- **అట్టి మీ ఆత్మ అమృతస్వరూపమై, మార్పు - చేర్పులు లేనిదై వెలుగొందుచున్నది.**
- **దేహములో ఇంద్రియములకు, దేహ-దేహాంతరములకు, సమస్తలోక-లోక పాలకులకు మీ ఆత్మయే సూత్రము। అందుకే సూత్రాత్మ అంటారు.**

## జలస్వరూపోహి।

→ ఏతత్త్వమైతే జలములందు అంతటా వేంచేసి జలమునకు అంతరమంతా నిండి ఉన్నదో,

→ ఎద్దానికి జలము తన శరీరమే అయి ఉన్నదో....,

→ తాను ఎద్దానికైతే శరీరమై అయి ఉండి కూడా,....జలము అద్దానిని ఎరుగుట లేదో....,

→ ఏది జలమునకు అంతర్యామి అయి జలమును నియంత్రించుచున్నదో....,

అది **అమృతమగు నీ ఆత్మయే.** నీ ఆత్మయే జలస్వరూపనియామకమై, అంతర్యామియై, అప్రమేయమై కూడా ఉండి ఉన్నది.

## అగ్ని స్వరూపోహి - ఇత్యాదయః

**యో అగ్నౌ తిష్ఠన్,** ....ఏదైతే అగ్నియందు అంతటా అంతరమున నిండి ఉన్నదో....,

**యో అంతరిక్షే తిష్ఠన్,** ....ఏదైతే అంతరిక్షమునందు అంతయూ నిండి ఉన్నదో...,

**యో వాయౌ తిష్ఠన్,** ....ఏదైతే వాయువునందు అంతటా నిండియున్నదో....,

**యో దివి తిష్ఠన్,** ....ఏదైతే దివిలోకము (దేవలోకము, ద్యులోకము)నందు అంతటా నిండి ఉన్నదో...,

**యో ఆదిత్యే తిష్ఠన్,** ....ఏదైతే సూర్యునియందు అంతటా నిండి ఉన్నదో....,

**యో దిక్షు తిష్ఠన్,** ....ఏదైతే దిక్కులంతా నిండి ఉన్నదో....,

**యః చంద్ర తారకే తిష్ఠగ్ం,** ....ఏది చంద్రునియందు నిండి ఉన్నదో,...నక్షత్రములందు అంతటా నిండి ఉన్నదో....,

**య ఆకాశే తిష్ఠన్,** – ఏది ఆకాశమునందు తిష్ఠితమైయున్నదో,

**యః తమసి తిష్ఠగ్ం,** ....ఎవ్వరైతే చీకటియందు అంతటా అంతరము నిండియున్నారో,

**యః తేజసి తిష్ఠగ్ం,** ....ఎవ్వరైతే తేజస్సునందు అంతటా నిండి ఉన్నారో,

**యః సర్వేషు భూతేషు తిష్ఠన్,** ....ఎవ్వరైతే సర్వభూత (జీవ) జాలమునందు **అంతటా అన్నిటా** నిండి ఉన్నారో,

**యః ప్రాణే తిష్ఠన్,** ....ఎవ్వరైతే పంచప్రాణములయందు నిండి ఉన్నారో...,

**యో వాచి తిష్ఠన్,** ....ఎవ్వరైతే సర్వ వాక్కులయందు, శబ్దములందు నిండి ఉన్నారో...,

**యః చక్షుసి తిష్ఠగ్ం,** .....ఎవ్వరైతే కన్నుయందు చూపునందు నిండి ఉన్నారో....,

**యః శ్రోత్రే తిష్ఠన్,** .....ఎవ్వరైతే చెవులయందు, వినికిడియందు నిండుగా నిండియున్నదో....,

**యో మనసి తిష్ఠన్,** ....ఎవ్వరైతే సర్వ జీవుల మనస్సునందు, మీ – నా మనస్సునందు నిండి ఉన్నారో....,

**యః త్వక్చి తిష్ఠగ్ం,** ....ఎవ్వరైతే చర్మమునందు స్పర్శగా నిండియున్నారో.....,

**యః విజ్ఞానే తిష్ఠన్,** ....ఎవ్వరైతే 'తెలివి' అనబడు విజ్ఞానమునందు (As that which is knowing) నిండి ఉన్నారో....,

**యో రేతసి తిష్ఠన్,** ....ఎవ్వరు 'రేతస్సు' రూపుడై రేతస్సు (జనన చైతన్యము – ప్రత్యుత్సాహమునందు) నిండి ఉన్నదో....,

**అదియే అమృతమయమగు నీ ఆత్మ స్వరూపము!**

**ఎవ్వరైతే–**

**అగ్నికి, అంతరిక్షమునకు, వాయువునకు, ఆదిత్యునికి దిక్కులకు, చీకటికి,తేజస్సుకు, సర్వభూతజాలములకు, ప్రాణములకు, వాక్కుకు, చూపు– కళ్ళకు, వినికిడి–చెవులకు, మనస్సు – ఆలోచనలకు, స్పర్శ–చర్మమునకు, తెలివి–విజ్ఞానమునకు, రేతస్సుకు**....అంతర్గతుడై, అంతర్హితుడై, అంతరాత్మ అయి, అంతర్యామి అయి ఉన్నారో...,

....ఎవ్వరి గురించైతే అగ్ని అంతరిక్షము మొదలైన పైవన్నీ **తమయొక్క ఆధారముగా ఉన్నట్లు గమనించటమే లేదో....,**

...ఈ అగ్ని – అంతరిక్షము – వాయువు – ఆదిత్యుడు, దిక్కులు, చీకటి, తేజస్సు, సర్వభూతజాలములు, పంచప్రాణములు, వాక్కు, చూపు, వినికిడి, ఆలోచనలు, స్పర్శ, ఎరుక, రేతస్సు....ఇవన్నీ కూడా ఎవ్వానికి శరీరమే అయి ఉన్నాయో....,

వాటన్నిటియందూ సర్వదా సంచారాలు చేస్తూ అంతరహృదయుడు, అభ్యంతరంగుడు అయి ఉన్నారో.., ఆయనయే – 'అంతర్యామి' అగు అమృత స్వరూప ఆత్మపురుషుడు।

**ఆ అమృతస్వరూప ఆత్మ నీవే।** నీవు అట్టి ఆత్మపురుషడవే అయి ఉన్నావు.

నీవే ఆత్మవై...., వాటన్నిటియందు నిండి ఉండి, వాటన్నిటికీ అంతర్గతమై, వాటికి ఆధారమై, వాటన్నిటికి తెలియబడనివాడవై, అమృత స్వరూపుడవై అన్నిటినీ ఆత్మగా వెలిగించుచున్నావు, **ద్యోతకం చేస్తున్నావయ్యా!**

ఆత్మగా ఇదంతా చూచేదీ నీవే। చూడబడేదీ నీవే। (స్వప్న ద్రష్ట – స్వప్నములోని విశేషాలే ఇందుకు దృష్టాంతము)।

**ఉద్దాలకుడు** : యాజ్ఞవల్క్యా! చాలా చక్కగా అంతర్యామియగు ఆత్మగురించి ప్రవచిస్తూ నిర్వచిస్తూ, వస్తున్నారు. చాలా సంతోషము. ఆ గంధర్వుడు చెప్పిన వివరణతో మీరు చెప్పుచున్నది సరితూగుతోంది. సరేc! ఇప్పుడు చెప్పండి.

*__అట్టి సర్వాంతర్యామియగు నా ఆత్మను నేను ఎట్లా దర్శించగలుగుతాను__? అది వివరించండి. ఎక్కడ ఆత్మకొరకై వెతకాలి? ఎట్లా వెతకాలి? ఎట్లా లభిస్తుంది?*

**యాజ్ఞవల్క్యుడు : (నేతి, నేతి)। (ఆత్మ అనగా - ఇది కాదు. అది).**

**అదృష్టో ద్రష్టా** : అట్టి అంతర్యామి కంటికి ఎదురుగా ఒక గోడ – నీడవలె విషయమై కనిపించేవారు కాదు. కంటి ద్వారా మనస్సుకు ఏర్పడుచున్న ఒక దృశ్యవృత్తి కాదు. కాబట్టి దర్శనమునకు అగోచరుడు. అయితే కంటియందు 'చూపు'కు ప్రసాదించువాడై, అధికారి అయి, సాక్షియై విరాజిల్లుచున్నారు. చూచువాడై ప్రకాశించుచున్నారు. **చూపు అనేది బాహ్య వస్తువులను చూడగలదు గాని, "చూచువానిని" ఎట్లా చూడగలదు?** ఆ ద్రష్టను నియోగించు దృక్ స్వరూపుడే ఆత్మ। ఆతడే సర్వాంతర్యామి కూడా। **"చూడబడేది - చూచుచున్నది"** కూడా సర్వాతీతుడగు ఆత్మయే। **ఆతడు నీ విజ్ఞతచే మాత్రమే నీచే ఎరుగబడుచున్నారు. ఆత్మ అనుభవైకవేద్యము మాత్రమే!** అంతేగాని, కంటికి సాకారముగా కనిపించేది కాదు. (You have to blossom up your own common sense to experience and to be that).

**అశ్రుత శ్రోత** : నీ సర్వంతార్యామియగు ఆత్మ చెవులకు వినబడే ఒక శబ్దము వంటిది కాదు. "వినుచున్నవాడు" (one who is hearing) రూపమున చెవులయందు ప్రత్యక్షమై 'వినికిడి'ని నియమించుచూ, వినుచున్నదంతా తానే అయి, సర్వార్థములకు అర్థము, పరమార్థము తానే అయి ప్రకాశించుచున్నట్టిదే నీ ఆత్మ. **అట్టి నీ ఆత్మ అమృత (మార్పు - చేర్పులు లేని) స్వరూపము. అత్యంత మాధుర్యమైనది.** అంతేగాని ఆత్మ చెవులకు వినబడు శబ్దము వంటిది కాదు.

**అమతో మంతా।** మనస్సు దేనిని ఇష్టపడుతోందో, (లేక) సంకల్పిస్తోందే అది అంతర్యామియగు ఆత్మకాదు. ఏది మనస్సును ఉపయోగించి 'ఇష్టము'ను ఆస్వాదించుచున్నదో, అదీ **'ఆత్మ'।** ఇష్టస్వరూపములు, సంకల్పములు ధారణ చేస్తున్నది కూడా ఆత్మయే! అంతేగాని ఆలోచన చేయబడగల ఒక విషయము వంటిది కాదు.

**అవిజ్ఞాతో విజ్ఞాతా।** బుద్ధి దేనిని తెలుసుకొనుచున్నదో అదంతా ఆత్మకాదు. ఏదైతే - బుద్ధిని ఉపయోగించి విషయములను తెలుసుకొనుచున్నదో,... అది **'ఆత్మ'!** ఈ బుద్ధి ఏ చైతన్యము కారణంగా తెలుసుకొనుచూ ఉన్నదో అది కూడా ఆత్మస్వరూపమే. అంతేగాని బుద్ధి పొందుచున్న ఒక వివేచనా విశేషము మాత్రమే ఆత్మ కాదు.

అనగా....

చూచుదానిని, వినుదానిని, సంకల్పించుదానిని, తెలుసుకొనుచున్నదానిని, వివేచించుదానిని → చూచునది, వినునది, సంకల్పించునది, తెలుసుకొనుచున్నది, వివేచించునది → 'ఆత్మ'యే అని గ్రహించండి! (That which is seeing etc., is 'Athma').

నీ ఆత్మయే అటు చూస్తూ → **ఇటు చూడబడుదానిగాను**, వింటూ → **వినబడుదానిగాను**, సంకల్పిస్తూ → **సంకల్పించబడుదానిగాను** తెలుసుకొంటూ → **తెలుసుకొనబడుదానిగాను,** వివేచిస్తూ, → వివేచన చేయబడుదానిగాను కూడా **అగుచున్నది.**

ఇంకొకరీతిగా చెప్పుకోవాలంటే....**యస్మాత్ పరోనాస్తి ద్రష్టా ఇత్యాదిః॥**

**న అన్యో అతో అస్తి ద్రష్టా।** → అంతర్యామికంటే (లేక బ్రహ్మముకంటే, లేక ఆత్మకంటే) వేరుగా (అన్యముగా) మరొక ద్రష్టలేదు. చూడబడునదీ లేదు. ఆత్మ సర్వదా అనన్యము కాబట్టి।

**న అన్యో అతో అస్తి శ్రోతా।** → అంతర్యామికి వేరుగా వినువాడు మరొకడెవ్వడూ అయి ఉండలేదు. వినబడునదీ వేరుగా లేదు.

**న అన్యో అతో అస్తి మన్తా।** → అంతార్యమికి వేరుగా మరొకడూ ఆలోచించువాడు లేదు. ఆలోచించబడునదీ అంతర్యామికి వేరుగా లేదు. **ఆత్మకు వేరుగా 'మనస్సు' అనబడేది లేదు. మనో యోచనా విషయములు లేవు.**

**న అన్యో అతో అస్తి విజ్ఞాతా।** → అంతర్యామికి వేరుగా మరొకడెవడూ తెలుసుకొనువాడు లేడు. తెలియబడునది ఏదీ అంతర్యామికి వేరుగా లేదు.

**ఉద్దాలకుడు** : బాగు బాగు। మరి నా స్వరూపము ఎట్టిది?

**యజ్ఞవల్క్యుడు** : ఏ అంతర్యామి అయితే....

- చూచువాడేగాని – చూడబడువాడుగా అగుటలేదో, కానీ–చూడబడేదంతా తానే అయి ఉన్నారో,
- వినువాడే గాని – వినబడువాడుగా అవటం లేదో, కానీ–వినబడేదంతా తానే అయి ఉన్నారో,
- సంకల్పించువాడేగాని – సంకల్పించునవిగా అవడో, కానీ – సంకల్పించబడేదంతా తానే అయి ఉన్నారో,
- తెలుసుకొనువాడేగాని – తెలియబడునదేదీగా అవటంలేదో, కానీ, తెలియబడేదంతా తానే అయి ఉన్నారో,

అట్టి ఆత్మ పురుషుడే (లేక) ఆత్మ భగవానుడే నీవు. **అదియే నీ సహజ స్వరూపము. ఆ నీ ఆత్మస్వరూపము సర్వదా అచ్యుతము (చ్యుతి లేనట్టిది).**

ఎద్దానికైతే మరణ – జనన ధర్మములు లేనేలేవో, సకల సంసార వ్యవహారములు, విషయములు ఏమాత్రము స్పృశించవో –

ఏదైతే సకల ప్రాణులకు ప్రాణ – మనో – బుద్ధి – చిత్త – అహంకారాలు, వాటి వాటి విషయ పరంపరలు ప్రసాదించునదో –

- **అట్టి ఆత్మయే నీ స్వరూపము। నా స్వరూపము। మనందరి స్వరూపము।**
- నీవు–అమృత స్వరూపుడవు। 'నాశనము' అనునది లేని వాడవు। ఆత్మగా మార్పు చేర్పులు ఉండని వాడవు। ఆత్మగా నీవు కాలాతీతుడవు। లోకాతీతుడవు।
- అంతర్యామి స్వరూపుడవు। సమస్తమునకు సర్వదా అద్వితీయుడవు।

**అట్టి అంతర్యామికి భిన్నమైనదంతా నాశన స్వభావము కలిగి ఉన్నది.**

- నీవే నా ఆత్మవు. నేను నీకు ఆత్మను. ఆత్మగా ఇరువురము అఖండులము. 'నీవు–నేను'ల కంటే విశిష్టమైన అప్రమేయ స్వరూపులము. **మనయొక్క కేవలమగు నిత్య సత్యమే ఆత్మ।**
- నీవు – నేను భేదము లేని అఖండమగు (Indivisible) ఆత్మస్వరూపులమే, మనమిరువురము, మనందరము కూడా పరానందాత్ములమే। ఎందుకంటే, **ఆత్మ సర్వదా ఏకమేగాని, అనేకము కాదు.**
- అట్టి అంతర్యామియే నీవు – నేనుగా అగుచూ, సమస్తమును నియమించుచూ, సర్వమును ఆస్వాదించుచూ, సర్వత్రా అప్రమేయమై **అమృతస్వరూపమై** వెలుగొందుచున్నది.

ఓ ఉద్దాలకా! ఓ వర్తమాన, భవిష్యత్ శ్రోతలారా! మనమంతా కూడా సర్వదా ఏకము – అక్షరము అగు అఖండాత్మ స్వరూపులం। ఏమరచిన అట్టి అప్రతిహత సత్యమును అనుక్షణిక స్వానుభవము చేసుకోవటానికే – తదితర విధి–విధాన ప్రయత్నమంతా।

ఈవిధంగా – **"అంతర్యామి నీ స్వరూపమే। అట్టి నీ నిజస్వరూపము అమృతము। ఆత్మస్వరూపుడగు నీకంటే భిన్నమైనదంతా స్వతఃగా లేనిది".**

**అట్టి యాజ్ఞవల్క్య ఈ ప్రవచనము విని ఉద్దాలకుడు సంతృప్తిని పొందినవాడై మౌనము వహించారు.**

***ఇతి బృహదారణ్యకోపనిషత్ – పంచమో అధ్యాయ 'అంతర్యామి బ్రాహ్మణమ్' నామ సప్తమ బ్రాహ్మణము।***

## పంచమ అధ్యాయము-అష్టమ బ్రాహ్మణము
## అక్షర బ్రాహ్మణము
## నిర్గుణబ్రహ్మము

అప్పుడు వాచక్నవ్యముని కుమార్తెయగు గార్గి మరల లేచి నిలుచుని, సభకు నమస్కరించి ఇక ఈ తీరుగా ప్రశ్నించసాగారు.

**గార్గి** : పూజనీయులగు సభలోని బ్రహ్మవేత్తలారా! మీరు అనుమతిస్తే, నేను మరొక్కసారి ఈ యాజ్ఞవల్క్యులవారిని కొన్ని ప్రశ్నలు అడగదలచాను. నా కొరకై వీరు ఆ రెండు ప్రశ్నలకు సమాధానము ప్రసాదించమని నా విన్నపము. సరి అయిన సమాధానము ఇవ్వగలిగితే, అప్పుడు **"మనమెవ్వరమూ కూడా పరబ్రహ్మమునకు సంబంధించి విద్యాచర్చలో ఈ యాజ్ఞవల్క్యులవారిని నిశ్చయముగా జయించలేము"** అని నిర్ణయించుకోవచ్చునేమో కూడా।

**సభలోని విప్రవర్యులు** : ఓహో అతి ప్రశ్నలు వేయవద్దని, అడిగితే తల తెగిపోగలదని **ఈ యాజ్ఞవల్క్యుడు** (ఆకాశము నుండి వాయువు వచ్చినట్లుగా బ్రహ్మలోకము దేనిలోనుంచి వచ్చింది? – అని అడిగినప్పుడు) **అన్నారు కదా!** సరేఁ! మీరు తలచినట్లు ఏమి ఇంకా ముఖ్యమైన ప్రశ్నలని అనుకుంటున్నారో – అవి అడగండి!

**గార్గి** : ఓ యాజ్ఞవల్క్య మహాశయా! నమో నమః। ఏ విధంగా అయితే ఈ మన విదేహరాజ్య జనక మహారాజుగారుగాని, (లేక) కాశీ నగర మహారాజుగాని వారి వారి వంశజులగు పూర్వీక మహారాజులుగాని నారి సారించి, బాణము సంధించి వదలితే, ఆ బాణపు కొనలు శత్రువులకు గ్రుచ్చుకొని, వారిని బాధించగలవో,.... **ఆ విధంగా నేను రెండు ప్రశ్నలను సూటిగా మీ ముందు ఉంచబోవుచున్నాను.**

**యాజ్ఞవల్క్యుడు** : అట్లాగా? అమ్మా! గార్గీ! తప్పక అడగండి. నేను కూడా మీ ప్రశ్నలు ఏమిటో వినటానికి తెలిసినంతవరకు సమాధానము ఇవ్వటానికి సంసిద్ధుడనై ఉన్నాను.
(I am very much alert to listen to and give answer to the extent I know).

**గార్గి** : నాయొక్క మొదటి ప్రశ్న వినండి.

- ఈ 'బ్రహ్మాండము'నకు **"ఊర్ధ్వఅర్ధభాగము"** అయి ఉన్న ద్యులోకము (దేవతాలోకములకు) **ఆవల** (పైన)ను, ఈ బ్రహ్మాండమునకు క్రింద అర్ధభాగమగు భూలోకమునకు ఇంకా కూడా **క్రిందుగాను**, ఆ రెండు అర్ధభాగముల **మధ్య ప్రదేశము** ను ఆక్రమించి ఏదైతే ఉన్నదో.....
- ఏది అటు ద్యులోకము – ఇటు భూలోకము కూడా అయి ఉన్నదో,... **అన్ని లోకములుగా ప్రదర్శనమగుచూ ఉన్నదో**...,
- ఏది **ఇప్పుడు, ఇక్కడ** – తన **ప్రదర్శన వ్యాపారమును** నిర్వర్తించుచూ **ఎదురుగా అంతటా నిండి ఉన్నదో,**
- ఏది ఇతః పూర్వము – ఇక మందు కూడా **యథాతథంగా** ఉంటోందని **ఊహించబడుచున్నదో**....,
- **"ఈ కనబడు సర్వము అదే!"**.... అని ఏదైతే మహాత్ములచే నిర్వచించబడుచున్నదో,.. మహాత్ములు శాస్త్ర ప్రమాణంగా నిరూపించి చెప్పుచున్నారో...,
- (పేకలతో నిర్మించిన 'మేడ' (A Tower Shaped up by Play Cards) వాస్తవానికి పేకల అమరికయేగాని, 'మేడ' అనునదేమీ కాని తీరుగా), – ఈ ద్యులోక-భూలోక-మధ్యప్రదేశం ఈవల ఆవల భేదరూపమగు సముదాయమంతా **ఏకరూపమై** ఏది వ్యాపించి ఉన్నదో, **అది ఏమై ఉన్నది? ఎక్కడ ఉన్నది? ఎవరి వలన నిర్మితమైయున్నది?**

**యాజ్ఞవల్క్యుడు** : అమ్మా! గార్గీ! మీ ప్రశ్నకు సమాధానము అత్యంత సంక్లిష్టమైనది కానీ, అత్యంత సులభము, అనుక్షణికము, సర్వదా స్వానుభవము, మధురము అయినది కూడా।

మీరు చెప్పిన **"ద్యులోకము-ద్యులోకమునకు ఈ భూలోకము, ఆ రెండింటి మధ్యలోకము – భూమికి క్రింద పాతాళాది లోకములు, వర్తమానములో ఉన్నది, భూతకాలములో కనిపించినది, భవిష్యత్తులో అనుభవము కాబోవుచున్నది"**.... ఇవన్నీ కూడా **"సూత్రము"** (దారము వంటిది) అని వర్ణిస్తున్నారు. దారమును నిలువుగా అడ్డముగా అల్లుటచే వస్త్రము తయారగుచున్నట్లే–ఈ బ్రహ్మాండము తయారగుచున్నది.

- దూది, దారము ఏకమేగాని అనేకము కాదు!
- ఆ దారముతో అల్లిన వస్త్రము – **దూది రూపంగా గాని, దారము రూపంగా గాని – పైకి అగుపించదు కదా!**

"అవ్యాకృత ఆకాశము" (Not at all different from itself) - అనే దారముతో రకరకములైన ఆకారములుగల వస్త్రములవలె ఈ పైక్రింద లోకములు, ఈవల – ఆవల, భూత – వర్తమాన భవిష్యత్ వస్తుభేదములు కల్పించబడుచున్నాయి. అవన్నీ కూడా బ్రహ్మాండ వస్త్రములో దారపు అల్లికలవంటివి. **"మీరు చెప్పిన బ్రహ్మాండ భేద అభేద విశేషాలన్నీ అవ్యాకృత ఆకాశమునందు (వస్త్రములో దారమువలె) ఓత-ప్రోతమై ఉన్నాయి"** – అనునదే మీరు అడిగిన ప్రశ్నకు నా సమాధానము. ఇదంతా సర్వత్రా, సర్వదా ఏకసూత్రమే! ఏకమగు 'అవ్యాకృతాకాశము' నందు ఈ అనేకముగా కనిపించేదంతా వస్త్రములో దారమువలె వేరువేరుగా అనిపిస్తున్నాయి. ఆత్మగురించి ఎరిగినవారికి అనేకముగా **కనిపిస్తూనే, ఇదంతా ఏకముగా అనిపిస్తోంది. అనేకముగా కనిపించేదంతా నిస్సందేహముగా ఏకమగు ఆత్మయే.**

**గార్గి** : ఓ యాజ్ఞవల్క్య మహాత్మా! నా మొదటి ప్రశ్నకు మీ సమాధానము నాకు సంతోషము కలుగజేస్తున్నది. మీకు గౌరవపూర్వకముగా శిరస్సువంచి నమస్కరిస్తున్నాను. మీ **"సూత్రము"** అను సమాధానము సరి అయినదే. అయితే,

*నా ఇంకొక ప్రశ్న వినండి.*

> ***"ఇదంతా ఏక సూత్రమే"****.....అని మొదటిప్రశ్నకు సమాధానంగా ఇచ్చి ఉన్నారు కదా।*
>
> *ద్యులోకముకంటే పైన, భూమి కంటే క్రిందగా, అండకపాలముయొక్క మధ్య విభాగమునందు, భూమి – అంతరిక్షములందు, భూమి – అంతరిక్షములుగాను – ఏది "సూత్రము (దారము)" అని మీరు ఆత్మజ్ఞుల అనుభవంగా చెప్పటం జరిగిందో....,*
> ***ఆ సూత్రము దేనియందు ఓత-ప్రోతమై ఉన్నది?****.....అని మరల ప్రశ్నిస్తున్నాను.*

**యాజ్ఞవల్క్యుడు** : ముందు చెప్పినదే నా సమాధానము అయిఉన్నది. ఈ సమస్తము, **ఈ సర్వము 'అవ్యాకృతఆకాశము' నందే ఓత – ప్రోతమై ఉన్నది. (వ్యాకృతము = వేరుపరచునది. విశదపరచునది. అవ్యాకృతము = సమస్తముగా వికాసమగుచు, వేరుకాకుండు నట్టిది. 'ఇదంతా అదే' అయినట్టిది.)**

**గార్గి**: 'అవ్యాకృత ఆకాశము' అని మీరు అంటున్నారు కదా! అట్టి అవ్యాకృతాకాశముగా ఏది కలదో అది మాటలతో చెప్పరానిది – అని అనబడుతోంది కదా! అవాచ్యమైనది ఒకవేళ మాటలు ఉపయోగించి చెప్పవలసి వస్తే...అద్దానికి రెండు దోషములు వెంటనంటి ఉంటాయి.

**అప్రతిపత్తి** → లేనిది – అని అనలేము (తార్కిక సమాధానము తోచదు)
**విప్రతిపత్తి** → ఉన్నది – అనలేము (పరాజయము కలుగజేసే యుక్తి)

వాక్కుకు అందనిది ఏ తీరుగా చెప్ప ప్రయత్నించినా, అది విరుద్ధమే అవగలదు. ఇప్పుడు **'అవ్యాకృతాకాశము'** అని దేనిని అంటున్నారు. అది ఎద్దానియందు ఓత ప్రోతమైయున్నది?

**యాజ్ఞవల్క్యుడు :** అవును. అవ్యాకృత ఆకాశమును వాక్కుచేత 'ఇది' అని అనలేము. అందుకే **'అవాక్-మానస గోచరము'** అని శాస్త్రములచే చెప్పబడుచున్నది. అయినా కూడా అద్దాని గురించి వేదాంత వాఙ్మయము సూచిస్తూ వర్ణిస్తున్నది. ఆత్మజ్ఞులు ఎలుగెత్తి గానము చేస్తూనే ఉన్నారు. **విజ్ఞులు చెప్పు వాక్యములను శిష్యజనులు సమన్వయించుకొని తప్పక తమయందే అనన్యముగా అనుభూతపరచుకొనుచున్నారు కూడా।** కనుక **వాక్కు అద్దానిపట్ల నిష్ప్రయోజనమవటంలేదు.**

వాక్కుతో ఏవిధంగా చెప్పవలసి వచ్చినా కూడా, కొన్ని ప్రశ్నలు అద్దానిగురించి చెప్పటానికి **అప్రతిపత్తి దోషము** ఉంటుంది. అనగా – సమాధాము ఏమి చెప్పాలో స్ఫురించని దోషము అది. అనుభవము పొందువాడు, తానై ఉన్న 'అనుభవి' గురించిన అనుభవమును ఎట్లా మాటలలో చెప్పగలడు?

తన నిజస్వరూపము గురించి తానే ఏమీ చెప్పలేడు.

లౌకిక విషయాలైనా అంతే! **"ఈ పదార్థము బహు రుచిగా ఉన్నది!"**....అని ఒకడు అనగానే **"బహురుచి – అనగా?"** అని ప్రశ్నిస్తే? ఆ పదార్థము రుచి చూచినవాడు తీపి అనాలా? కమ్మగా ఉన్నదనాలా? ఏది ఏమని చెప్పినా 'బహురుచి' అనునది చెప్పటానికి మాటలు సరిపోవు. **అప్రతిపత్తి =** ఏమి చెప్పాలో తోచని స్థితి – చెప్పువానికి ఏర్పడుచున్నది.

అట్లాగే విప్రతిపత్తి కూడా!

**"అయ్యా! బహురుచిగా ఉన్నది!"** అన్నప్పుడు బహురుచి గురించి ఎవ్వరన్నా ప్రశ్నిస్తే? "తీయగా ఉన్నది" అని అంటాడనుకోండి! **"తీయగా అంటే రుచిగా ఉన్నట్లా? నాకు తీపి సరిపడదు! కనుక బహురుచి నేను ఒప్పుకోను!"**–అని, ఎదుటివాడు రుచి చూచినవానిని పరాజయము చేయవచ్చు। ఈ విధంగా మాటలలో చెప్పేడప్పుడు విప్రతిపత్తిదోషము (మీరు చెప్పినట్లు) ఉంటుంది.

ఇది పెద్ద చిక్కే మరి। ఎందుకంటే,

- **అనుభవజ్ఞుడు చెప్పితేనే మనము 'ఆత్మ' అనబడు (లేక) 'అవ్యాకృతాకాశము' అనబడు మహత్తరము – అఖండము అగు కేవలసాక్షీ–కేవల దృక్–కేవల సత్ వస్తువు గురించి తెలుసుకోగలము. (అవ్యాకృతము=వ్యాకృతము అనే ధర్మము లేనట్టిది).**
- **ఆ అనుభవజ్ఞుడు మనకు మాటలతో మాత్రమే చెప్పగలడు.**
- **ఆత్మానుభూతి ఏమిటో చెప్పటానికి మాటలు సరిపోవు. పైగా మాట్లాడుతూ ఉంటే అప్రతిపత్తి – విప్రతిపత్తి దోషాలు ఉంటాయి.**

అయితే తత్త్వజ్ఞులు **ఆత్మతత్త్వము పట్ల విద్యార్థిత్వము కలవానిపట్ల సర్వదోషరహితమగు ఆత్మతత్త్వ జ్ఞానమును తప్పకుండా ఆవిష్కరిస్తున్నారు. వెలిగిస్తున్నారు.'స్వస్వరూపము'గా అనుభవైక వేద్యము చేస్తున్నారు.**

అందుచేతనే వేదాంత వాఙ్మయము ఇంతగా విస్తారమై విరాజిల్లుచున్నది.

**తద్వై తత్ 'అక్షరం' గార్గి! బ్రాహ్మణా అభివదంతి। (5-8-3)**

తాను అభేదమై, త్రికాలబాధ్యమై (Indivisible by Past or Present or Future) ఉన్నట్టి ఆ అవ్యాకృతాకాశమును బ్రహ్మవేత్తలు **'అక్షరము'** అని అభివర్ణిస్తున్నారు.

అక్షరము → క్షరము కానిది. క్షయించు ధర్మము లేనట్టిది. సర్వదా యథాతథము. (Ever As it is).

**భాషాయుక్తంగా....**

*అక్షరములచే భాష।   భాషచే వాక్యములు।   వాక్యములచే భావములు।*

...ఇవన్నీ ఏర్పడుతూ ఉండగా కూడా, **అక్షరము సర్వదా యథాతథము కదా!** ఒకడు ఒక కథ వ్రాస్తే, అప్పుడు అక్షరములకు సంబంధించిన కొంత సొత్తు తరుగుచున్నదా? లేదు కదా? అక్షరముల అక్షరత్వము సర్వదా యథాతథము కదా!

అందుచేత ఓ గార్గీ! (వాక్యములలో అక్షరములవలె) **అవ్యాకృతాకాశము 'అక్షరము'నందు ఓత ప్రోతమై ఉన్నది** – అని అనబడుతోంది. ఈ కనబడేదంతా అక్షరమునందు ఓత–ప్రోతమై ఉండవచ్చుగాక! 'అక్షరము' → తరగదు, పెరగదు! (అక్షరము వాక్యములలోను, రచనా గ్రంథములోను ఓత ప్రోతమై ఉన్నది).

**అక్షరము** = ఏది ఏమాత్రము **భూత–భవిష్యత్–వర్తమాన కాలములచే క్షీణత పొందదో....,**

ఏది ఏమాత్రము **మార్పు చేర్పులు పొందుటలేదో,** అది **అక్షరపరబ్రహ్మము** అని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు.

"బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు" ....అని అనునప్పుడు "నాకు తెలియదు! వారికి మాత్రమే తెలుసు".....అనిచెప్పటము వారి ఉద్దేశ్యము కాదు!

- అది నాకూ తెలియనిది కాదు! 'తెలియదు' అనుకునేవారికెవ్వరికీ తెలియనిదీ కాదు.
- ఈ సభలో పండితులనుకొనువారికి గానీ, పామరులు అనుకొనువారికి గానీ తెలియనిది కాదు. మనందరికి సర్వదా ఎఱుక, అనుభవములలో ఏర్పడి ఉన్నట్టిదే!

నేను దేనితో చూపును ఉపయోగించి దృశ్యమును చూస్తూ ఉన్నానో, అట్టి ఆత్మ నాకు వేరు కానప్పుడు నాకెందుకు తెలియదు? అయితే బ్రహ్మజ్ఞులు అద్దాని (మన ఆత్మయొక్క) **ఖండత్వము తొలగించి అఖండత్వమును గుర్తు చేస్తున్నారు.** అఖండజ్యోతిని వెలిగిస్తున్నారు. స్వీయానుభవమును రంగరించి వేదవాక్యములతో ఏకం చేసి మనకు గుర్తు చేస్తున్నారు.

**న అహమ్ అవాచ్యం వక్ష్యామి।**
**న చ న ప్రతిపద్యేయమ్।**
**ఇత్యేవం దోష ద్వయం పరిహరతి।**

ఏ ఆత్మయందు ఈ త్రిజగత్తులు, ఆవల-ఈవల ఇదంతా ఓతప్రోతమై యున్నదో, అది మనందరి స్వస్వరూపమేకదా! అద్దాని అఖండత్వమును ప్రమాణముల ద్వారా అంగీకరించువానిపట్ల అప్రతిపత్తి – విప్రతిపత్తి దోషాలు తమకు తామే తొలగుతాయి.

**"నీవు ఏమైనా చెప్పు. నేను ఖండుడను। జీవుడను। పరమాత్మ నాకు వేరుగా మరెక్కడో ఉన్నారు"** – అనునది పరిరక్షించుకోవటమును ఆశయముగా నిర్ణయించుకొన్నవారిపట్ల అప్రతిపత్తి-విప్రతిపత్తి దోషములు తొలగించగలవారెవ్వరూ ఉండరనునది నా మనవి.

అందుచేత ఓ గార్గీ! ఈ సర్వము ఏ నీ ఆత్మయందు ఓత-ప్రోతమైయున్నదో అది :-

- **అఖండము** (జీవాత్మ-పరమాత్మల విభజనము లేనట్టిది).
- **నిత్యము** (ఇదివరకు ఉన్నది. ఇప్పుడు ఉన్నది. ఇక ఎప్పటికీ ఉండబోవునది)
- **నిత్యము కాబట్టి అమృతము**. మృతము కానిది. మార్పు లేనిది.
- క్షరము లేనట్టిది కాబట్టి **అక్షరము.** అట్టి అక్షర పరబ్రహ్మమును ఎరుగుటకై – **ఇత్యేక దోషద్వయం పరిహరతి।** నీ యొక్క సత్య నిష్ఠతో నీవే అప్రతిపత్తి – విప్రతిపత్తి దోషములను తొలగించుకొని వేదవాఙ్మయ మహావాక్యముల అర్ధమును, గురు అనుభవ వాక్యములను జ్యోతి రూపముగా వెలిగించుకొని, అఖండ జ్యోతి స్వరూపివై **'ఖండత్వము' అనే అహంకార రూప అంధకారమును తొలగించుకోవటానికి సిద్ధపడాలి సుమా।**

**గార్గి** : మహాత్మా! అవ్యాకృతాకాశము కూడా ఓతప్రోతమైయున్న ఏ 'అక్షరము' గురించి బ్రహ్మవేత్తలు అభివర్ణిస్తున్నారో, అట్టి అద్వితీయమగు **'అక్షరము'** ఎట్టిది? దయతో వర్ణించి చెప్ప ప్రార్ధన!

**యాజ్ఞవల్క్యుడు** : నీ స్వస్వరూపము, నీయొక్క సహజ (నిజ) స్వరూపము, అఖండము, నిత్యము, సర్వమునకు ఓత ప్రోతము – అయి ఉన్న **'అక్షరము'** గురించి చెప్పుచున్నాను. విను. ఆత్మ ఎట్టిదో విను।

**అస్థూలమ్। –** అది స్థూలమై కంటికి కనిపించేది, స్పర్శకు విషయమయ్యే వస్తువు కాదు. (5-8-8). (It is not like a solid).

**అనణ్వమ్। -** అణు ప్రమాణము (లేక) సూక్ష్మము కాదు. చూపు – స్పర్శ – వినికిడి – రుచి మొదలైనవన్నీ దేహములో సూక్ష్మరూపములై ఆత్మయొక్క చిత్కాళా విశేషాలై ఉన్నాయి. ఆత్మయో? **చిత్కళను ప్రదర్శించు చిత్-ఆనందరూపము.** (It is not like a subtle matter).

**అహ్రస్వమ్। – అదీర్ఘమ్ :** ఆత్మ పొట్టిదీ కాదు. పొడుగుదీకాదు. చిన్నది కాదు. పెద్దది కాదు. వస్తు ధర్మాలు – **ద్రష్టకే ద్రష్టయగు 'దృక్'** కు – ఎట్లా ఆపాదిస్తాం? (Neither short nor long).

**అలోహితమ్। –** లోహధర్మముగల భౌతికమైనదేదీ కాదు. ఎరుపు కాదు. మరే రంగు కాదు. రూపము లేనిదానికి గుణమెక్కడిది? అగ్నివలె రంగు కలది కాదు. (It is not a metal with Physical and Chemical features).

**అమూర్తమ్।** – సాకారమై నామరూపములకు **పరిమితైనదేదీ కాదు.** (It is not bound by form).

**అస్నేహమ్। :** దేనితోను స్నేహసంబంధము కలిగి ఉన్నట్టిది కాదు. (It is not bound by relativity / relatedness).

**అచ్ఛాయమ్। :** అక్షర బ్రహ్మము నీడ వంటిదా? కాదు. నీడను కలిగి లేదు కూడా। వస్తువుకు నీడ ఉంటుంది. వస్తువు + వెలుగు వలన నీడ। **వస్తువే కానిది నీడ ఎట్లా కలిగి వుంటుంది?** (It is neither shadow nor has shadow).

**అతమో। =** అది చీకటి రూపము కాదు. చీకటికి కూడా సాక్షి అయిన నీ ఆత్మ చీకటి రూపము ఎట్లా? (It is not dark).

**అవాయుః। =** అది వాయురూపముకాదు. వాయువును తరంగములుగా కదల్చు చైతన్యము వాయు రూపము ఎట్లా? (Not Air or Air waves).

**అనాకాశమ్। =** అది ఈ భౌతికమైన ఆకాశము కాదు. నీ ఆత్మాకాశములో భౌతికాకాశము స్వయం కల్పన మాత్రమే! (It is not like a space).

**అసంగమ్। =** ఆత్మదేనికీ సంబంధించినది కాదు. ఎవ్వరి సొత్తూ కాదు. దేనితోనూ సంబంధము లేనట్టిది. మనస్సు వలె దేనితోనూ సంగము లేనేలేదు. సమస్తము తానే అయి ఉన్నట్టిది సుమా। (Has no attatchment).

**అరసమ్‌।** = అది రుచికి విషయము కాదు. పరమాత్మ రస స్వరూపుడు కావచ్చు గాక। దేహమునకు దేహివలె రసమునకు వేరై ఉన్నారు. **రసమును స్వకీయమైన ఆస్వాదనగా కలిగి ఉన్నవారు.** (It is not like a taste or liking).

**అగంధమ్‌।** = అక్షరమగు ఆత్మ వాసనకు సంబంధించినది కాదు. స్వీయకల్పనచే వాసనను ఆస్వాదించునట్టిది. మరి అది సువాసన, దుర్వాసన ఎట్లా అవుతుంది? గంధగుణము లేవీ అద్దానికి లేవు. (It is not like a 'small').

**అచక్షుమ్‌ :** అది కనులు కాదు. చూపుకాదు. సర్వమును తమ చూపును ప్రసరింపజేసి **"చూచుచున్నట్టిది" – చూపు ఎట్లా అవుతుంది? ఉకరణము ఉపయోగించువాడు – ఉపకరణముగాని, ఉపయోగముగాని అయి ఉండదు కదా!** (It is not like a form of 'Seeing').

**అశ్రోత్రమ్‌।** = ఆ అవ్యాకృతాకాశము సమస్తమునకు ఓత – ప్రోతమైయున్నది. అక్షరమగు ఆత్మ చెవులుగా అవటంలేదు. వినికిడి కాదు. అద్దాని సమక్షంలో స్వీయకల్పనానుసారంగా చెవులు, వినికిడి, వినబడునని – ప్రవర్తించుచున్నాయి. (It is not a form of 'Hearing').

**అవాక్‌। :** అది వాక్ రూపముకాదు. వాక్కును ప్రదర్శనము చేయు దివ్యచైతన్య స్ఫూర్తిరూపము. (It is not a form of 'Talking').

**అమనో। :** అది ఇష్టబడు ఏ ఒక్కటీ కాదు. మనస్సు కాదు. ఇష్టము అద్దానికి చెందినది. మనస్సు పరమాత్మ యందు జనించి, ప్రవర్తిస్తూ, పరమాత్మను **స్వీయ భావనా వైచిత్ర్యముగా** సేవించుచున్నట్టిది మాత్రమే. మననమునుంచే నిర్మితమైనది మనస్సు. మననము తనయొక్క ఒకానొక కళావిశేషమైనట్టిదే – ఆత్మ। (It is not a form of 'Thinking').

**అతేజః। :** అది తేజస్సు కాదు. అగ్ని, సూర్యగోళము మొదలైన వస్తువుల వలె అది తేజోరూపము కాదు. తేజస్సు ఆత్మ యొక్క సంప్రదర్శనము (Appearence) మాత్రమే! ఎందుకంటే అక్షరము – అమృతము అగు నీ ఆత్మ సహస్ర సూర్యతేజోవిలాసము తేజస్సు అద్దానిదే గాని, అది తేజస్సు కాదు. (It is not a form of Light).

(దృష్టాంతంగా: ఒకని ముఖములో కనిపించే సంతోషము, తృప్తి, ఆనందము, విషాదము మొదలైనవి **'దేహి'** యొక్క భౌతికమైన శరీరములో ప్రదర్శనములు (లేక) ముఖ కవళికలు. అంతేగాని దేహి **"ఆయా ముఖ కవళికలుగా"** అవటములేదు కదా!).

**అప్రాణ। :** నీ ఆత్మ ప్రాణరూపము కాదు. ప్రాణమంటే? భౌతికదేహములో అనేక గతులుగా సంచరించుచున్న వాయురూపము. దేహి దేహము కంటే ముందే ఉండి, దేహమును తన చైతన్యతత్త్వముచే వాయు కదలికల ద్వారా ఉజ్జీవింపజేసేది. ప్రాణము శక్తిరూపము. **పరమాత్మయో? శక్తి తనదైనట్టివాడు.** (It is not a form of Energy).

**ఆధ్యాత్మికో వాయుః ప్రతిషిధ్యతే అప్రాణమితి।** వాయువును కదల్చుచున్నది ఆత్మ. అంతేగాని, ఆత్మ కదలు ప్రాణవాయువులు కాదు. **దేహమును–వాయువులను (ప్రాణమును)–ఆలోచనలను తనచేతనా శక్తితో కదల్చుచూ కారణ – కారణముగా ఉనికి కలిగి ఉన్నట్టిది ఆత్మ.** అందుచేత అది **"అప్రాణము"** అనబడుతోంది. (It is neither living nor non-living factor).

**అముఖమ్‌। :** పోనీ ఆత్మ ఈ దేహ ఇంద్రియాలకు, జగదనుభవములకు, హావభావాలకు ద్వారము (ముఖద్వారము) వంటిదా? ఆత్మ యొక్క భావనయే జగదనుభవము. అనుభవము అనుభవజ్ఞునికి భిన్నం కాదు. ఎందుకంటే అనుభవమనునదంతా అనుభవజ్ఞుని స్వీయ నిర్ణయ–కల్పనయే। **ఈ దృశ్య–జగత్తు ఆత్మకు భావనారూపమే।** అభిన్నమే। కనుక ఇదంతా 'ఆత్మ నుండి వచ్చింది' అని కూడా అనలేము. **ఆత్మకు అభిన్నమైన స్వకీయ కల్పనా విశేషమే జగదనుభవం కాబట్టి, ఆత్మ అముఖము. (It is not a face to some thing).**

**అమాత్రము। :** మాత్రము = కొలవబడునది. ఆత్మ దేనిచేతా కొలవబడేది (Measurable) కాదు. సూర్యుని నుండి బయలుదేరిన అనేక కిరణాలతో కొన్ని సూర్యుడిని కొలువ (To admeasure) ప్రయత్నిస్తాయా? లేదు కదా! దృశ్య – దేహ– మనో–బుద్ధి – అహంకారాలు ఆత్మసూర్యుని కొన్ని కిరణాలు వ్రాలుటచే ఉత్తేజితమయినట్టివి। కనుక మనో బుద్ధి మొదలైనవి ఆత్మను కొలవగలవా? లేదు. (It is immeasurable).

(How can thought and logic measure the Absolute Self while both are like 'Rays' emitted by and emenating from "SELF" itself?) కనుకనే నీ ఆత్మ అమాత్రము. అది దేనినీ కొలవటానికి ఉపకరణ కాదు. ఏదీ అద్దానిని కొలవటానికీ (To Measur) వీలు కాదు! **మాత్రా రూపం తత్ న భవతి। అమాత్రమ్ ఇతి భవతి।। తేన కించిత్ నమీయతే!** అతి కొలువటానికి ఉపకరణము కాదు. కొలవబడేదీ కాదు.

**అనన్తరమ్। :** నీ ఆత్మ మరొక దానికి (దేహము – మనస్సు – బుద్ధి – అహంకారము – సంస్కారములు – భావాలు మొదలైనవాటికి) అన్తరముగా(లో) ఉన్నది కాదు. దేనికీ అనన్తరము (తరువాత) కాదు. అద్దాని కల్పనా జగత్తు అద్దాని యందే ఉన్నదని అనక తప్పదు. ఊహించువాడిలోనే ఊహ ఉన్నది కదా। అయితే, **స్వప్నము పొందుచున్నవాడు స్వప్నములో ఉన్నాడా? లేదుకదా।** స్వప్నమే అతనియందు ఉన్నది. స్వప్నమే ఆతనిది కదా! ఈజగత్తు అంతా తానే అయి ఉన్న నీ ఆత్మ – దేహ, జగత్తులలోని వస్తువు కాదు. కనుక అనన్తరము. అద్దానికి లోపల జగత్తు – జీవాత్మ – మనో – బుద్ధి – అహంకారాలు వగైరా లేవు. సదా నిర్మలము. కథారచయితలో – కథలోని పాత్రలన్నీ ఉన్నాయి – అని అనము కదా। (It is not next to any thing? It is not in any thing).

**అబాహ్యమ్ :** పోనీ నీ ఆత్మ దేహమునకో, మనో బుద్ధి చిత్త అహంకారాలకో, బాహ్యంగా ఉన్న వస్తువా? కాదు. అక్షరము – **అప్రమేయము, కేవలము, సర్వము, సర్వస్వము అయినట్టి నీ ఆత్మ ఈ దేహమునకు బాహ్యమున ఉన్నదని ఎట్లా అంటాము?** ("వాహనము – నడుపువాడు వాహనములోనే ఉన్నాడు కదా! (As Drivar)"... అన్నది భౌతికంగా కనిపించినా కూడా, ఆతని వ్యక్తిత్వ – హావ-భావ-సంబంధ బాంధవ్య విశేషాలన్నీ – 'కారు నడుపుచున్నవాడు (Driver)' అనుదానిలో ఇమడవుకదా!) ఆత్మ దేనికీ బాహ్యము కాదు. అంతటా నీ ఆత్మయే స్వభావంగా ఆక్రమించి ఉండటము చేత (పూర్ణమ్), అద్దానికి బాహ్యము లేదు. అందుచేత నీ ఆత్మ నబాహ్యమ్। అక్షరమ్। సత్యమ్। నిత్యమ్। బాహ్య- అభ్యన్తర స్థితమ్। (Neither placed outside nor placed inside).

**న తత్ అశ్నాతి కించన, కుతత్ అశ్నాతి కశ్చన। (8-8-8)**

**అఖండమగు నీ అక్షర స్వరూపము దేనినీ భక్షించదు. దేని చేతనూ భక్షింపబడుదు.** ఆత్మ విషయములను భక్షించక (పొందక) నాటక దీపమువలె సాక్షి అయి వెలుగొందుచున్నది. ఇంద్రియములకు అది విషయమే కాదు కాబట్టి దేని చేతనూ అనుభవించబడటము లేదు. (Neither consumes not gets consumed).

## ప్రశాసనము (Command)

***ఓ గార్గీ! ఆత్మ (లేక) మనయొక్క అక్షర స్వరూపము గురించి మరికొన్ని విశేషణాలు చెప్పుచున్నాను. వినండి.***

అట్టి అక్షరము యొక్క "ప్రశాసనము (Command)" చేత సూర్యచంద్రులు విశేషముగా నియమించబడి, ధరించబడి స్థిరముగా ఆకాశమున ప్రకాశించుచున్నారు.

– ఆ 'అక్షరము' అగు ఆత్మ (లేక) పరబ్రహ్మము యొక్క 'ప్రశాసనము' నందు (In the Zone of Command) ద్యులోకము (దేవతాలోకము) ధరించబడి జీవుల రాకపోకలకు రంగస్థలముగా (As platforms for the Beings to visit and go) స్థిరముగా కొనసాగుచున్నది.

అట్టి అక్షర పరబ్రహ్మము యొక్క 'ప్రశాసనము' (In the zone of commanding) నందే క్షణములు, నిముషములు, ముహూర్తములు, పక్షములు, మాసములు, సంవత్సరములు, ఋతువులు, యుగములు, మహాయుగములు – మొదలైనవన్నీ విశేషములుగా సంకల్పించి **నియమించబడగా,** స్థిరముగా దృశ్య విభాగమునందు **ప్రవర్తించుచున్నవగుచున్నాయి.**

ఆత్మయొక్క **'ప్రశాసనము'** నందు మాత్రమే మంచువర్షించే తెల్లని (హిమవత్) పర్వతముల నుండి కొన్ని నదులు గంగ, బ్రహ్మపుత్ర నదులు) తూర్పువైపుగాను, మరికొన్ని నదులు (సింధు-నర్మద నదులు) పడమరవైపుగాను, మరికొన్ని వేరువేరు దిక్కులుగాను → నదీ- ఉపనదీ ప్రవాహములు విస్తరించి ఉంటున్నాయి.

ఆ అక్షరము యొక్క ప్రశాసనము చేతనే – మానవులు ప్రదానము చేయు దేవతలపైన, దేవతలు యజ్ఞములు చేయువారిపైన, పిత్రుదేవతలు **"దర్వీహోమము"** చేయువారిపైన-పరస్పరము ఆధారపడి ఉండటము, సృష్టి తతంగమంతా సుదీర్ఘకాలముగా కొనసాగటము జరుగుతూ వస్తోంది. **అట్టి అక్షరమును తెలుసుకోకపోతే జాడ్య రూపమగు దృశ్య తాదాత్మ్య రూప 'సంసారము' అనే బురద వదలదు.**

**'అక్షరము'** యొక్క అజ్ఞానము కారణంగానే ప్రవృత్తి, ప్రవృత్తి వలన సంసార బంధము ఏర్పడుచున్నాయి.

**'అక్షరము'** యొక్క జ్ఞానముచే సంసారము నుండి **'విముక్తి'** స్వభావసిద్ధమై అనుభవమౌతోంది.



**గార్గి :** హే మహనీయా! 'సంసారము' అనే 'పంకము' ఎట్లా తొలగుతుంది. అందుకు కర్మలు మార్గము అగుచున్నాయా? లేదా?

**యాజ్ఞ వల్క్యుడు** : ఓ గార్గీ! ఈ లోకంలో ఎవ్వరైనా సరే, అక్షరము అగు పరబ్రహ్మమును తెలుసుకోవాలనే ఆశయము లేకుండా,– **"మేము హోమము, యజ్ఞము ఇట్లా మరల మరల చేస్తూ ఉంటాము"**.. అనియో, (లేక) **"మేము ఇట్లాగే ఈ నిర్జన ప్రదేశములలో కూర్చుని తపస్సు చేస్తూనే ఉంటాము"**.. అనియో (కాక) **"విశ్రాంతి లేకుండా అనేక తీర్థయాత్రలను నిర్వర్తిస్తాము"**.. అనియో అంటే? అవన్నీ కర్మ ఫలములకు మాత్రమే కారణమౌతాయి. స్వయముగా జ్ఞానఫలము ప్రసాదించలేవు. బుద్ధికి ఆవల సర్వదా వేంచేసియున్న ఆత్మ– బుద్ధిచేత మాత్రమే తెలుసుకొనబడుచున్నది.

జీవులు కర్మ ఫలములను అనుభవిస్తూ ఉండగా, అవి ఆ అనుభవముచే నశిస్తూ వస్తాయి. అనగా కర్మ ఫలముల ఒక అంతము ఉండనే ఉంటుంది. కాలక్రమంగా అక్షరమగు ఆత్మ యొక్క జ్ఞానమును దృష్టిలో కలిగి ఉండకుండా, **కేవలము కర్మలయందే నిమగ్నుడగుచున్న వాడి పట్ల కర్మఫల సిద్ధి కాలస్వరూపునిచే ఫలానుభవముల రూపంగా మ్రింగివేయబడుచున్నాయి.**

**యో వా ఏతత్ అక్షరం హే గార్గి! అవిదిత్వా అస్మాత్ లోకాన్ ప్రైతి స కృపణో। (8-8-10)**

**ఓ గార్గీ!** ఎవ్వడైతే తన అక్షర పరబ్రహ్మ స్వరూపమును, తన ఆత్మయొక్క సర్వతత్త్వ స్వరూపమును, సర్వాత్మకత్వమును **తెలుసుకోకుండానే**..

– అనేక హోమములు, యజ్ఞములు, తదితర కార్యక్రమములు సుదీర్ఘముగా కొనసాగిస్తూ ఉన్నప్పటికీ..,
– అనేక వేల సంవత్సరములు ఎక్కడో అడవిలోనో, మరెక్కడో కూర్చుని తపస్సు చేసినప్పటికీ..,

**(యో వా ఏత దక్షరం అవిదిత్వా, అవిజ్ఞాయ అస్మిన్ లోకే జుహోతి, యజతే, తపః తప్యతే యద్యపి బహూని వర్ష సహస్రాని, అంతవత్ ఏవా తత్ ఫలం భవతి)। –** అట్టి ప్రయత్నమంతా కాలగతిచే ఫలము జనించి, ఆ కర్మఫలము కాలగతిచే నశించేదే అగుచున్నది.

కర్మఫలముల ప్రయోజనము కాలముచే పరిమితమేగాని, **అనంత ప్రయోజనము సిద్ధింపజేయలేవు.**

అంతేకాదు. **తత్ ఫల ఉపభోగాంతే క్షీయంత ఏవ అస్య కర్మాణి!** కర్మఫలము యొక్క అనుభవము పూర్తికాగానే ఆ నిర్వర్తించిన కర్మల ఫలములు క్షీణము కాక తప్పదు. అనివార్యము. (మరల మొదటికి రాక తప్పదు).

**ఇక అక్షరమునకు సంబంధించిన విజ్ఞానము యొక్క ప్రభావము ఎంతటిదంటారా?**

> **అథ య ఏతత్ అక్షరం విదిత్వా, అస్మాత్**
> **లోకాత్ ప్రైతి, స బ్రాహ్మణః। (8-8-10)**

ఎవ్వడైతే ఈ మానవ దేహము నేలకూలక ముందే (ప్రాక్ శరీర విమోక్షణాత్) తన స్వస్వరూమును సర్వజగత్ స్వస్వరూపముగాను, సర్వలోక స్వరూప చమత్కారముగాను, సర్వాత్మకముగాను – తెలుసుకుంటాడో, అట్టి భావముతో దేహభావమును అధిగమిస్తాడో, **ఆతడే బ్రాహ్మణుడు। బ్రహ్మీభూతుడగు ఆతడే ముక్తుడు।**

**తత్ విజ్ఞానాత్ కార్పణ్యాత్ యయః సంసార విచ్ఛేదః।**

తన యొక్క అక్షర – అప్రమేయ–నిత్యత్వమును తెలుసుకొన్నవాడు ఇంద్రియ విషయములందు, దృశ్య వ్యవహారములందు కార్పణ్యత్వము (దీనత్వము) తొలగించుకున్నవాడగుచున్నాడు.

**'అక్షరము'** యొక్క జ్ఞానము లేనప్పుడు, అట్టివాడు నిరంతరము అనివార్యంగా కర్మలు కొనసాగించువాడై, కర్మ ఫలములకు మాత్రమే పరిమితుడగుచున్నాడు. పుట్టుక –చావు (జనన – మరణ) పరంపరలో చిక్కుకున్నవాడై సంసారములో కొట్టుమిట్టాడుచూనే ఉండవలసి వస్తోంది.

అట్టి అక్షరమగు పరబ్రహ్మము నిత్యప్రకాశ – ప్రకాశకమై ఉన్నది. అది మనందరి యొక్క **వాస్తవ – సహజ స్వతత్త్వమైయున్నది.**

- అజ్ఞానమే → దీనత్వమునకు హేతువు.
- జ్ఞానమో → జీవన్ముక్తికి హేతువు.

అక్షర పరబ్రహ్మము ఎరుగనివాడు కృపణుడు. (జాలిపడ తగినవాడు).

ఇంద్రియ విషయపరంపరలకు అమ్ముడుపోయినట్టి కూలివాడు (Slavery).

అక్షర పరబ్రహ్మమును తెలుసుకొని దేహాభిమానమును అధిగమించినవాడు ధన్యుడు। సిద్ధ సిద్ధుడు। బ్రహ్మవేత్త। బ్రాహ్మణుడు.

**అట్టి అక్షరము:**

**చూచుచూ ఉన్నదానిని గమనిస్తూ ఉన్నట్టిది।** దృష్టి అంతటికీ ద్రష్ట। దృష్టికి విషయం కాదు। **ద్రష్టకు కూడా ద్రష్ట।** అట్టి ద్రష్టకే ద్రష్టను దర్శించు.

**వినుచున్న దానిని వినునట్టిది.** వినబడునదేదీ కాదు. **వినికిడిని చేతనము చేయు చైతన్య స్వరూపము.**

**ఆలోచించుచున్న వాని గురించి ఆలోచించునది.** మనస్సు నీది. మనస్సుకు మాత్రం నీవు విషయం కాదు కదా! **మననము చేయు మనస్సు నీదైనట్టి – నీవే ఆ అక్షరము. సమస్త మననములకు ఆవలగల నీ స్వరూపమే ఆత్మ।**

– నీలో **తెలుసుకొనుచూ ఉన్నట్టిది** ఏదైతే ఉన్నదో, – **అద్దానిని గమనించు.** అదియే.. అక్షరము। అదియే తెలుసుకోవలసినట్టిది.

అక్షర బ్రహ్మము కంటే వేరుగా → చూచుచున్నదేదీ లేదు. వినుచున్నదీ లేదు. యోచన చేయుచున్నదీ లేదు. తెలుసుకొనుచున్నదీ లేదు. సకల ప్రాణులలో **చూచుచూ ఉన్నది, వినుచూ ఉన్నది, తెలుసుకొనుచున్నది – ఆ అక్షరమే!**

ఇక చూడబడేది, వినబడేది, మనసుపడేది, తెలుసుకొనబడేది.. అదంతా కూడా స్వతఃగా ఒక గోడ, రాయివలె జడము మాత్రమే!

**ఏదైతే..,**

- స్వయముగా, స్వతః సిద్ధమో, సాక్షాత్ అపరోక్షము అగు బ్రహ్మమో,
- మనందరిలోపల ఆత్మ స్వరూపమై ఉన్నదో..,
- సర్వ సంసార ధర్మములకు అతీతమై ఉన్నదో..,
- వస్త్రములో నిలువు – అడ్డదారములవలె ఈ దృశ్యజగత్తు, త్రిలోకములు, అవ్యాకృత ఆకాశముగా ఓతప్రోత భావముచే వ్యాపించి ఉన్నదో..,

అదియే నీవు పొందవలసినది! **అద్దానిని నీ స్వస్వరూపముగా గుర్తించి, గమనించి, ఆస్వాదించటమే జ్ఞానము యొక్క ఫలము.** భక్తి యొక్క పరాకాష్ఠ। యోగము యొక్క సిద్ధి। అదియే సత్యము। నిత్యము। చైతన్యము।

అట్టి **"అక్షరము, బ్రహ్మము, ఆత్మ, స్వస్వరూపము"** అగు నిత్యమైన దానిని ఆశ్రయించక, అసత్యము – కల్పన – కర్మ కాల బద్ధము అగు తదితరమైన దానిని ఆశ్రయించినంతకాలము సంసారరూప బంధము అనివార్యము. అక్షరమును ఆశ్రయించామా, ఇప్పుడే, ఇక్కడే.. బంధముక్తి భేదములన్నీ మొదలంట్లా త్యజించివేయబడగలవు!

ఈ విధంగా పలికి, మహనీయుడగు యాజ్ఞవల్క్యుడు ప్రశాంత – ఆనందమైన బ్రాహ్మీ దృష్టితో కూడిన చిరునవ్వు ముఖముతో గార్గివైపు చూచారు.

అప్పుడు వచక్నుని కుమార్తెయగు గార్గి నెమ్మదిగా లేచి భగవంతుడగు యాజ్ఞవల్క్యుని పాదములు స్పృశిస్తూ నమస్కారము సమర్పించారు.

**గార్గి :** యోగపుంగవుడగు జనక మహారాజుసభలో వేంచేసియున్న పూజనీయులగు బ్రహ్మవేత్తలారా! ఈ మన యాజ్ఞవల్క్యుడు **ప్రవచించిన అమృత రూపమగు అక్షర బ్రహ్మ స్వస్వరూపము పరమ సత్యముగా, వేదసారముగా, బ్రహ్మణ్యుల గానముగా మనము ఒప్పుకోక తప్పదు** – అని నేను అర్థము చేసుకుంటున్నాను.

ఈ యాజ్ఞవల్క్యుల వారికి నమస్కరించుటచే మనమంతా సమస్త సంసార బంధములనుండి విముక్తులము కాగలమని భావించుచున్నాను. పరబ్రహ్మము గురించిన చర్చయందు ఈయన అజేయుడు.

**'ఈయన జయింపబడలేదు'** అని ముందు చెప్పినట్లుగా నేను నిశ్చయించుకొనుచున్నాను.

– – –

ఇట్లా పలికి వచక్నుని కుమార్తె అగు గార్గి ప్రశాంతమగు చిరునవ్వు చిందించు ముఖముతో మౌనము వహించారు.

***ఇతి – బృహదారణ్య కోపనిషత్ – పంచమ అధ్యాయము।***

***"అక్షర బ్రాహ్మణము" అను అష్టమ బ్రాహ్మణము ॥***

# పంచమ అధ్యాయము-నవమ బ్రాహ్మణము
# యాజ్ఞవల్క్య - శాకల్య సంవాదము
# ఉపాసకుడు - ఉపాస్యముల ఏకత్వము

ఇకప్పుడు శకలుని పుత్రుడగు శాకల్యముని లేచి నిలబడ్డారు. సభకు నమస్కరించారు.

**'విదగ్ధ' నామధేయ శాకల్యముని:**

***సభాసదులారా!***

శకలుని పుత్రుడను, 'విదగ్ధ' అను వ్యవహార నామధేయుడనగు నేను ఈ సభలోని విజ్ఞుల అనుజ్ఞతో కొన్ని ప్రశ్నలను ఈ యాజ్ఞవల్క్య మునీంద్రులవారి ముందు ఉంచ తలచుచున్నాను. నా వాదములతో వీరిపై తప్పక విజయము సాధిస్తాను-అని అనుకుంటున్నాను.

ఓ యాజ్ఞవల్క్య మునిసత్తమా! ఇదిగో, ఈ ప్రశ్నను మీ ముందు ఉంచుచున్నాను.

దేవతలు ఎంతమంది?

**యాజ్ఞవల్క్యుడు** : "వైశ్వదేవ శస్త్రము" అనే స్తోత్రమును దృష్టిలో పెట్టుకొని దేవతా సంఖ్యను తెలుపు మంత్రములో ఎందరు దేవతలు చెప్పబడ్డారో.. అది వారి సంఖ్యగా భావించబడుతోంది.

అట్టి వైశ్వదేవ స్తోత్రములో దేవతల సంఖ్య చెప్పుచున్న మంత్ర పదములందు ('నివిదము' యందు) (1) '303' (2) '3003' అని చెప్పుతోంది. (త్రయశ్చత్రీచశతా। త్రయశ్చత్రీ చ సహస్రేతి।

- మరల ముఖ్య విభాగ దేవతలు - 33 - (త్రయ స్త్రిగ్ంశ - ఇతి ఓం)।
- ఇంకొంత విభాగంగా - 6 (షట్ ఇతి ఓం - ఇతి)।
- మరల శ్రేష్ఠ ముఖ్య దేవతలు = 3 (త్రయ ఇతి ఓం - ఇతి)।
- మరల శ్రేష్ఠాతిశ్రేష్ఠ = 2 (ద్వావితి ఓం ఇతి)।
- మరల అత్యంత శ్రేష్ఠ దేవతలు = $1^1/_2$ (అధ్యర్ధ - ఇతి ఓం ఇతి)।

మరల అత్యంతిక దేవతలో = ఒక్కరే! (ఏక ఇతి ఓం ఇతి)।

అయితే

'303' మరియు '3003' దేవతలు.. అనునది దేవతల విభూతులు. ఈ రెండూ కలిసి 3306 విభూతులు. '303' దేవతల విభూతులను పరమార్ధమున సంగ్రహముగా కుదించగా 33, 6, 3, 2, $1\ ^1/_2$ మరియు '1' అని శాస్త్ర ప్రవచనము.

**విదగ్ధనామధేయ శాకల్యుడు :** సరేc! ఇప్పుడు '3306' దేవతలు ఎవ్వరు?

**యాజ్ఞవల్క్యుడు :** ముఖ్యదేవతలు "33' మాత్రమే!

**మిగతావన్నీ ఆ '33' దేవతల విభూతులు.** అట్టి 33 దేవతల ప్రసిద్ధ గుణవర్ణనా విశేషములకు సంబంధించిన అంశలు.

**విదగ్ధుడు :** అవును. పరమార్ధమున '33' దేవతలే. ఆ '33'రు దేవతలు ఎవ్వరెవ్వరు?

# 33 దేవతలు

**(1) అష్ట వసువులు (8) :**

(1) అగ్ని, (2) పృథివి (3) వాయువు (4) అంతరిక్షము (5) ఆదిత్యుడు (6) ద్యులోకము (ద్రైశ్చ), (7) చంద్రుడు (8) నక్షత్రములు. ప్రాణుల కర్మలకు వీరే ఆశ్రయం. **ఏతే వసవ – ఏతేషు హీదం వసు సర్వగ్ం హితమ్ – ఇతి తస్మాత్ 'వసవ' ఇతి। (5-9-3)।**

ఈ అష్ట వసువులు **"దేహ+ఇంద్రియ+ మనస్సు"** సంఘాతరూపంగా పరిణామము చెంది, ప్రాణులందరికీ **'నివాసము'**గా అగుచున్నారు. జగత్తునంతా వీరు ఒకవైపు 'నివాస యోగ్యము'గా తీర్చిదిద్దుచున్నారు. అంతేకాకుండా మరొకవైపు తాము కూడా జగత్తు నందు నివాసము కలిగి ఉంటున్నారు. సర్వము ఈ అష్ట వసువులయందు ఉంచబడింది. అందుచేత 'వసువులు'– అనే పేరు వచ్చింది. **(8).**

**(వసనం ప్రసాదిత – ఇతి వసవః)।**

**2. ఏకాదశ రుద్రులు (11) : I. పంచ ప్రాణములు, పంచ ఉపప్రాణములు, మనోవ్యాపారములు (11).**

**II.** '5' కర్మేంద్రియములు : చేతులు; కాళ్లు; గుదము; గుహ్యము; నాలుక;

'5' జ్ఞానేంద్రియములు = చెవులు; కళ్ళు; ముక్కు; నోరు; చర్మము (1) మనస్సు। **యత్ అస్మాత్ శరీరాత్ మర్త్యాత్ ఉత్క్రమన వ్యాధ రోదయంతి। – (లేక) జీవుడు (11).**

ఈ ఏకాదశ రుద్రాంశరూప జ్ఞాన+కర్మేంద్రియములు + మనస్సు→ ఇవన్నీ కూడా మరణించు స్వభావము (మార్పు పొందబోవు స్వభావము) కలిగినవై ఉంటున్నాయి. ప్రాణుల ప్రారబ్ధకర్మల వలన, సుఖ–దుఃఖానుభవముల వలన దేహము క్షీణించినపుడు ఇవన్నీ కూడా క్షీణత పొందుచున్నాయి. ఈవిధంగా బంధు–మిత్రులను మరణ స్వభావముచే దుఃఖింపజేస్తూ ఉండుటచేత కూడా ఏకాదశ – రుద్రులు (ఏడిపించునవి) అనునది సార్థక నామము. **తద్యత్ రోదయన్తి తస్యాత్ 'రుద్రా' ఇతి। (11)**

**3. ద్వాదశ ఆదిత్యులు (12) :**

**ద్వాదశ వై మాసాః సంవత్సరస్య ఏతత్ 'ఆదిత్యా'।** సంవత్సరములోని '12' నెలలను **'ద్వాదశ ఆదిత్యులు'** అని పిలుస్తున్నారు. సంవత్సర దేవతకు 12 నెలలు 12 భుజములు (లేక) 12 అవయవములు. ఇవి కాలచక్రమై మరల మరల తిరుచూ ఉంటున్నాయి. ప్రాణుల యొక్క శక్తి, స్మృతి, ప్రజ్ఞ, శరీర శోభ–వీటన్నిటి ఇచ్చి, తిరిగి తమవెంట తీసుకుపోతూ ఉంటున్నాయి. **(12).**

ఆయర్దాయమును తపింపజేస్తున్నాయి. ఈ విధంగా ఆయుష్షును, కర్మఫలములను ఇవ్వటము, తమ వెంట లాగుకొని పోతూ ఉండటం చేత 'ఆదిత్యులు' అను సార్థక నామము కలిగి ఉంటున్నాయి. **ఏతే హీదగ్ం సర్వం ఆదానా యన్తి తస్మాత్ 'ఆదిత్యా' – ఇతి।।**

**1) ఇంద్రుడు (2) ప్రజాపతి (సృష్టియజ్ఞము)। (2):**

మెరుపు ఇంద్రునిరూపముగా చెప్పబడుతోంది. వజ్రముతో ప్రాణులను హింసించువాడు, కాబట్టి ఇంద్రుడు. జీవులను ఇంద్రియములను ప్రసాదించటమును పర్యవేక్షించువాడు కాబట్టి ఇంద్రుడు. **అశనిః** – వజ్రబలము కలవాడు కాబట్టి కూడా ఇంద్రుడు.

**ప్రజాపతి : యజ్ఞమే ప్రజాపతి.** ఈ సృష్టి – సృష్టికర్త యొక్క యజ్ఞముగా చెప్పబడుచున్నది. పశువులు యజ్ఞమునకు సాధన వస్తువు. ఈ జీవులంతా సృష్టి యజ్ఞమునకు సాధన వస్తువులే. ఈ జీవుడు సృష్టి యజ్ఞమునకు పరికరము వంటివాడు.

**యజ్ఞస్య అరూపత్వాత్ పశుసాధనా శ్రయత్తాత్ చ, పశవో యజ్ఞ – ఇతి ఉచ్యతే।** యజ్ఞము రూపరహితము. విజ్ఞులు పశువులను యజ్ఞ సాధనములుగా ఉపాసిస్తూ ఉన్నారు. పశువులు (జీవులు) యజ్ఞ రూపము – అని చెప్పబడుతోంది.

ఈ విధంగా..,

| | |
|---|---|
| అష్ట వసువులు | 8 |
| ఏకాదశ రుద్రులు | 11 |
| ద్వాదశ - ఆదిత్యులు | 12 |
| ఇంద్రుడు+యజ్ఞము | 2 |
| | 33 |

ఈ 33 దేవతలు జగత్ చక్రమును నడుపుటకు కారణమగుచున్నారు.

## షట్ (ఆరుగురు) విశేష దేవతలు (5-9-7)।

**(1) అగ్ని (2) పృథివి (3) వాయువు (4) అంతరిక్షము (5) ఆదిత్యుడు (6) ద్యులోకము ।**

ఈ ఆరు షట్ దేవతలు (అష్ట వసువులలో చంద్రుడు - నక్షత్రములు ఇందులో కలుపబడలేదు). ఈ సర్వము కూడా ఆ ఆరుయే అయి ఉన్నాయి. ఇదివరకు చెప్పిన '33' దేవతలలో విశేష (అంతర్లీన) దేవతలు. **ఈ సమస్తము ఈ ఆరుగురే అగుచున్నారు.**

## ముగ్గురు దేవతలు (5-9-8)।

మూడు లోకములే ముగ్గురు దేవతలు

(1) **పృథివి + అగ్ని** కలిపి **మొదటి దేవత.**

(2) **అంతరిక్షము + వాయువు** కలిపి రెండవ **దేవత.**

(3) **ద్యులోకము + సూర్యుడు** కలిపి **మూడవ దేవత.**

ఈ త్రి దేవతలలోను సకల తదితర దేవతలు అంతర్గతమై ఉన్నారు. అంతర్భావము రూపముగా కలిగి ఉన్నారు.

## ఇద్దరు దేవతలు

(1) అన్నము (అనుభవము పొందబడుచున్నదంతా).

(2) ప్రాణము (శక్తి. ఎవరి అనుభవమో ఆతనిదే ప్రాణశక్తి)

ఈ విశ్వమంతా రెండుగా విభజిస్తే

→ అనుభవించబడుచున్నది - That which is being experienced,

→ అనుభవించుచున్నవాడు - The Experiencer,-

- ఈ రెండే విభాగములుగా కూడా చెప్పబడుచున్నది.

## ఒకటిన్నర ($1^1/_2$) దేవత

వాయువు + వాయు వీచికలు

సమస్త దేవతలు వాయువు - వాయు వీచికలో సమర్పితులై ఉన్నారు.

**శాకల్యుడు :** వాయువు- వాయు వీచిక ఒక్కటే కదా! మీరు "$1\ ^1/_2$ దేవత" అని అంటున్నారే?

**యాజ్ఞవల్క్యుడు :** సర్వము వాయువు నందే సమృద్ధిని పొందుతోంది. ఈ సమస్తము వాయుతరంగముల చేతనే అభివృద్ధి పొందింపజేయబడుతోంది కూడా. అందుచేత వాయువు+చలనము - ఈ రెండింటిని కలిపి (సృష్టికర్త - సృష్టివలె) - '$1^1/_2$' దేవతగా చెప్పటం జరుగుతోంది. **'అధ్యర్థ'** అంటారు.

# ఒక్క దేవుడు - ప్రాణదేవత

**ఒకే ఒక దేవుడు – ప్రాణము : ఏకో దేవ ఇతి ప్రాణ।** అంతేకాదు. **ప్రాణ ఇతి స బ్రహ్మ! "ప్రాణమే సృష్టింకతటికీ మూలము"** అని నిర్ణయించబడుతోంది. [ **త్యత్ (అది) ఇతి బ్రహ్మ – త్యత్ ఇతియా చక్షతే)**]।

త్యత్ = **కేన పరోక్షాధాయ।** – దేనిచే పరోక్షమైన వస్తువు బోధించబడుచున్నదో, అదియే **త్యత్!**

**స ప్రాణో సర్వదేవాత్మకత్వాత్ – మహత్ బ్రహ్మ।** ఆ ప్రాణశక్తి ఏకైక దేవతయే. ఎందుకంటే సర్వ దేవాత్మకత్వము కాబట్టి. సర్వ దేవాత్మకత్వము యొక్క మహాత్మ్యమును అనుసరించి **"మహత్ బ్రహ్మ"..** అని కూడా చెప్పబడుచున్నది.

ఓ శకల్యుని కుమారుడవగు శాకల్యా! విదగ్ధా! మనము ఇప్పుడు చెప్పుకొన్న రీతిగా దేవతలు.. ఒక్కరు అయి ఉన్నారు. అనేక మంది కూడా అయి ఉన్నారు. దేవతలు అనంతము కూడా. **'నివిన్మంత్రము'**ను అనుసరించి 3306 దేవతలయందు అంతర్గతమై '33' దేవతలు. ఆ 33లో అంతర్గతమై '6'గురు దేవతలు.

*ఆఖరికి ప్రాణమే ఏకైక దేవత! ప్రాణమే హిరణ్యగర్భుడు (సృష్టికర్త). ప్రాణమే సమస్త దేవతలు కూడా।*

మిగతా దేవతలందరు ప్రాణశక్తికి గర్భస్థమై యున్నారు కాబట్టే ఏకైక దేవతను 'హిరణ్యగర్భుడు' అని కూడా అంటారు. అనంతమగు దేవతలందరూ కూడా ఒకే ప్రాణ దేవతయొక్క విస్తారము (Extension) అయి ఉన్నారు. ఈ విధంగా, ఒకే ఒక్క దేవత, 33 దేవతలు, 303 దేవతలు, 3306 దేవతలు, అనంత దేవతలు.. ఇవన్నీ కూడా **ప్రాణదేవత** (ఏకైక దేవత) యొక్క **విస్తారములు (లేక) విభూతులు** అని చెప్పబడుతోంది. ఎందుచేతనంటారా? **ఒకే ఒక్క ప్రాణ దేవత యందు (లేక) సృష్టికర్తయగు హిరణ్యగర్భునియందు ఆయా సృష్ట్యవసరము – అధికారముల భేదమును బట్టి పేరు – రూపము – గుణము – కర్మ – శక్తిల భేదముచే అనేక మంది దివ్యశక్తి రూపములగు దేవతలు ప్రవర్తిస్తూ, నిర్వర్తిస్తూ ఈ విశ్వజగత్ స్థితి – పరిణామములను నడుపుచున్నారు.** దేవతలంతా సృష్టికర్తయగు హిరణ్యగర్భుని **'సంకల్పము'** అనే ముడి పదార్థముతో తయ్యారైనవారే! సర్వజీవులు, సర్వద్రష్టలు, సర్వదృష్టులు, సర్వలోకము కూడా ప్రాణరూప పురుషుడగు హిరణ్యగర్భుని భావనా ప్రదర్శనా చమత్కారమే। భావనాశక్తి రూపములే। ప్రాణరూపములే। ప్రాణేశ్వరుని ప్రాణాకృతిక చమత్కారములే।

**శాకల్యుడు :** ఓ యాజ్ఞవల్క్యా! ఏ విధంగా అయితే **'వైశ్వదేవము'** అనే స్తోత్రమునందు దేవతల సంఖ్యను చెప్పుచున్న **'నివిదము'** అనే మంత్రముగా చెప్పబడినదో, ఆ పదములను (శాస్త్రమును) దృష్టిలో ఉంచుకొని చక్కగా ఇదంతా చెప్పుకుంటూ వచ్చారు. **అవన్నీ నేను ఒప్పుకుంటున్నాను.**

**అయితే..,**

- ఏ దేవునికి – **పృథివ్యేవయస్య ఆయతనం (5-9-10),** – ఈ పృథివి (ఈ భూమి అంతా కూడా) ఆశ్రయమై ఉన్నదో (లేక) అధిష్ఠానమై ఉన్నదో, (ఆయతనమై ఉన్నదో)..,
- ఎవ్వనికైతే – అగ్నిః లోకో– అవలోకనము (లేక) చూపు – అగ్నిలోకరూపము అయి ఉన్నదో..,
- మనోజ్యోతిః – మనస్సు ఎవ్వని యొక్క జ్యోతిస్వరూపమై యున్నదో.., **ఆయనయే ఈ జీవుడు పరాయణము (ఆశ్రయము) చేయవలసియున్నట్టి దేవాదిదేవుడు. (పరాయణము = తత్పరత్వము)**

అట్టి పురుషుని ఎవ్వరైతే ఎరుగుతారో (తెలుసుకుంటారో), అట్టి ఎరుక గలవాడు **"సర్వ వస్తువుల అధిష్ఠానము"** – అగు ఆత్మను ఎరిగినవాడగుచున్నాడు. **సర్వుల ఆత్మయగు సర్వాత్మకుడు అగుచున్నాడు.**

స్వామీ! అట్టి పురుషుని మీరు ఎరిగియే ఉన్నారా?

చూచారా? అనుభవమేనా? కాదా? ఎక్కడ చూచారు? ఎట్లా ఉంటారు?

**యాజ్ఞవల్క్యుడు : వేద వా అహం తం పురుషగ్ం సర్వాత్మనః పరాయణం। (5-9-10)।** సర్వజీవులకు, సర్వ వస్తుజాలమునకు మీకు, నాకు స్థానమైయున్న ఏ అధిష్ఠానాత్మ గురించి మీరు అడుగుచున్నారో, ఆ సర్వాత్మకమగు **'మమాత్మ –త్వమాత్మ – తత్ ఆత్మ'** అగు దానిని నేను ఎరిగియే ఉన్నాను. మీరూ ఎరిగియే ఉన్నారు. మనమందరము ఎరిగి ఉన్నవారమే। ఆతడు మరెక్కడో లేదు.

ఈ దేహములో పురుషకారముతో కూడి (Accompanying ability to function) వేంచేసి ఉన్నారు. (He is the main functioner in us all).

శరీరమంతా నిండియున్న పురుషుడు ఆయనయే! ఓ శాకల్యా! అశబ్దుడు – అరూపుడు – సర్వుడు – సర్వము అయి, ఈ మీ–నా దేహములను **తన ఉనికిచే నింపివేసి ఉంటున్న ఆ పరమ పురుషుని** గురించి ఇంకా కూడా ఏమైనా అడగదలచుకున్నారా? అడగండి! ఆయన గురించి సంభాషించటమే **పరమ పురుషోపాసన కదా!**

ఆ ఆత్మ దేవుడు **'పృథివియే తాను'** అను అభిమానముతో, అగ్నియే అవలోకనముగా, సంకల్పములే జనన స్థాన జ్యోతిగా– **దేహేంద్రియ సంఘాతరూపుడై** ఉంటున్నారు.

సమస్త శరీరములలోని – ఈ 'శరీరి'యే ఆ ఆత్మ భగవానుడు। పురుషుడు। పరమ పురుషుడు।

ఓ శాకల్యా! ఆ పురుషుని గురించి ఇంకా కూడా ప్రశ్నించండి. చెప్పుకుందాము.

**శాకల్యుడు :** ఓహో! అయితే ఇది చెప్పండి! ఈ దేహముతో వేంచేసియున్న ఆ పురుషునకు 'దేవత' ఎవ్వరు?

(ఏది దేనినుంచై పుట్టుచున్నదో,.. అట్టి పుట్టే వికారమునకు 'దేవత'.. అని ఈ సందర్భములో దేవత → అనుదాని అర్థముగా ఉద్దేశ్యించబడినది – శంకర భాష్యం)।

**యాజ్ఞవల్క్యుడు :** ఆ పురుషుని నుండి దేవతగా బయల్వెడలినది – **'అమృత స్వరూపము'**

**శాకల్యుడు :** స్వామీ! ఏ దేవ దేవునికైతే..,

→ **కామఏవ యస్య ఆయతనగ్ం। (5–9–11)।** ఎవరి కామమే ఇదంతటికీ ఆశ్రయమో, ఎవ్వరి ఇష్టము – కోరికను అనుసరించియే ఇదంతా ప్రవర్తమానమగుచున్నదో, ఇక్కడ దృశ్యములో ఏర్పడవలసినదంతా ఏర్పడుచున్నదో..,

(ఇక్కడ కామము అనగా స్త్రీ–పురుష సంబంధము కాదు. ఇష్టమును అనుసరించి బ్రహ్మాండము అంతర్గత విశేషాలు ఏర్పడుచుండటము. ఉదా : అమ్మవారు 'కామాక్షి'గా ఉపాసిస్తున్నాం కదా! అమ్మవారి ఇచ్ఛాశక్తి ప్రదర్శనమే ఈ విశ్వ – విశ్వాంతర విశేషాలు – అని సిద్ధాంతము).

→ **హృదయమ్ లోకో।** .. హృదయమే స్వకీయ ఇచ్ఛారూప (కామరూపమునకు) రంగ స్థలమో..,

→ **మనో జ్యోతిః।** .. మనస్సు హృదయరంగస్థలములో గల వస్తువులన్నీ వెలిగించు దీపమై యున్నదో..,

ఆ పురుషుడే ఇక్కడి కార్య – కారణ (Happening & Causation for Happenings of all events) సంఘాతమునకంతటికీ ఆశ్రయమై ఉన్నారు. సర్వాత్మకుడు, సర్వపరాయణుడు అగు అట్టి సర్వోత్కృష్టమైన పురుషుని తెలుసుకొన్నవాడే పండితుడు। వివేకి। అట్టి పాండిత్యము తమకు ఉన్నదని తలచుచున్నారా? **ఆ పురుషుని గుర్తెరిగి తెలుసుకొనగలమా?**

**యాజ్ఞవల్క్యుడు :** సర్వము ఎవ్వరి యొక్క పరాయణమో (ఆశ్రయమో), (Song sung by whome), అట్టి అంతః శరీరుడగు సర్వాత్మకుని నేను ఎరుగుచూనే ఉన్నాను. నాచే ఎరుగుబడేదంతా ఆయన స్వరూపమే। ఎవ్వని కామము (కోరిక)ను అనుసరించి జగత్తులు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు, బ్రహ్మాండములు, జీవులు. జీవుల పరస్పర సంబంధాలు, జన్మ కర్మలు– ఇవన్నిటితో కూడిన దృశ్యమంతా ఏర్పడి ప్రవర్తిస్తోందో, ఆ పురుషుని నేను తెలుసుకొనియే ఉన్నాను.

**శాకల్యుడు : తస్య కా దేవతా?** ఆ పురుషునికి (ఆయన నుండి బయల్వెడలినట్టి) దేవత ఎవరు?

**యాజ్ఞవల్క్యుడు :** భావన–ఊహ – స్వభావి – ప్రకృతి అను అర్థము గల శబ్దమగు స్త్రీయే.. ఆ దేవత! (సత్+రతీ)।

**శాకల్యుడు :** ఏ పురాణ పురుషునకు..,

– **రూపణ్యేవ। యస్య ఆయతనం,** – ఈ రూపాత్మక మైనదంతా స్వకీయ ఆశ్రయమై ఉన్నదో..,

– **చక్షుర్లోకో (ఆలోకన)। –** సాధనమగు కన్ను ఉపకరణమో..,

– **మనో జ్యోతిః।** ఎవని మనస్సు ఆ రూపాత్మకమైనదంతా **"తెలియబడటము"** అనే కాంతిని వెదజల్లుచూ తెలుసుకొనుచున్నదో..

ఆతడే – **సర్వస్య ఆత్మనః।** సర్వులకు ఆత్మస్వరూపుడు. ఆయన ఎరుకయే ఈ రూపత్మకమైన అనుభవము యొక్క ఉనికి. అట్టి పురుషోత్తముని మీరు తెలుసుని ఉన్నారా? మీకు తెలిస్తే.. ఆయన యొక్క దేవతా రూపము ఎట్టిదో దయచేసి వివరించండి.

**యాజ్ఞవల్క్యుడు :** ఆయన నాకు తెలుసు. ఆయనను ఇక్కడి **కార్య**(రూపము) – **కారణ** (చూచువాడు) **సంఘాతము**గా ఎరుగుచూ సందర్శించుచున్నాను. **"ఈ రూపాత్మకమైన దానికంతటికీ సర్వోత్కృష్టమగు 'ఆశ్రయము' అయి ఉన్నారు"–** అను నిశ్చయము కలిగి ఉన్నాను. ఆయన **'ఆదిత్యుడు'** అని కూడా పిలువబడుచున్నారు. ఆదిత్యునిలోని పురుషుడే (లేక) ఆ ఆదిత్య పురుషుడే దేవుడు. ఆయనకు దేవత సత్యము (యమ్–సత్= ఉనికి స్వరూపము). సమస్తమునకు 'ఆది' స్వరూపుడు.

**శాకల్యుడు :** ఏ దేవునికి →

→ **ఆకాశ ఏవయస్య ఆయతనగ్ం – (5-9-13)** ఆకాశమంతా తనకు ఆశ్రయించుచున్న స్థానము అయి ఉన్నదో..,

→ **శ్రోత్రం లోకో –** వినికిడి (Hearing) అవలోకనము అయి ఉన్నదో..,

→ **మనోజ్యోతిః–** ఆ వినుచున్నదానిని విషయార్థమును (ఇది విషయము–అని) వెలిగించున్నది ఆతని మనస్సే అయి ఉన్నదో..,

→ ఎవ్వడైతే సర్వదా సర్వత్రా సర్వము ఎరుగుచు సర్వమునకు పరాయణుడు (experiencer) అయి ఉన్నారో...

ఆ పురుషుడే ఈ కార్య – కారణ సంఘాతము అంతటికీ ఆశ్రయమని మీరు ఎరుగుదురా? లేకుంటే మీరు ఏమీ తెలియని వారేకదా! ఆ దేవునకు దేవత ఎవ్వరో కూడా చెప్పండి!

**యాజ్ఞవల్క్యుడు :** అట్టి సర్వోత్కృష్ట – సర్వాశ్రయుడగు పురుషుడి గురించి నాకు తెలుసు. ఆయనయే **ప్రాతిశ్రుత్కః** (వినినాదని మొదలుపెట్టు) – ప్రాతిశ్రుత్క పురుషుడు. (మొట్టమొదటగా **'వినటము'** అను పురుషకారము తనదైనవాడు).

**ఆయన యొక్క దేవత (స్త్రీ) – దిక్కులు** (All Dimentions of each and every thing are his Divinity - manifestations)

ఏ ఆది దేవునికైతే..,

- చీకటి (తమస్సు)కు ఆశ్రయమై ఉన్నదో.., **తమ యేవ యస్య ఆయతనగ్ం...,**
- ఆయన హృదయమే ఆయన అవలోకించుదానికంతటికీ సర్వదా స్థానమై ఉన్నదో..,
- మనస్సు ఆ తమస్సును 'తెలుకోవటము' – అనే వెలుగు (జ్యోతి) రూపమై యున్నదో,

ఆ మీరు చెప్పుచున్న పురుషుడు నాకు ఎరుకయే! ఆ ఛాయామయ పురుష దేవునికి దేవత 'మృత్యువు'. ఎందుకంటే మృత్యు దేవత కూడా ఆ జ్ఞాన మయపురుషుని 'వీచిక' కాబట్టి

(మృత్యువు = మార్పు పట్ల అభినివేశము. ఏదో క్రొత్తగా పొందవలసియున్నదను 'తపన'।)

**శాకల్యుడు :** ఏ దేవునకు రూపములన్నీ కూడా ఆశ్రయములయి ఉన్నాయో, కళ్ళు – కనబడేవి.. ఇవన్నీ ఆయన యొక్క ఉనికి – అవలోకనము అయి ఉన్నదో, చూడబడేదంతా **'ఎరుక'** అనే మనోజ్యోతితో ఆయనయే వెలిగించుచున్నారో, ఆయనయే ఈ దృశ్యములో కనిపించే కార్య కారణ సంఘాతానికి స్థానము కదా। ఆయన ఇంకా ఎట్టి చమత్కార శీలురు? ఆయనను ఇంకా ఏమేమని ఎరుగుచున్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** ఆ పురుషుడు నాకు నిశ్చయముగా ఎరుకయే! ఆయనయే ప్రకాశవంతములగు సర్వ పదార్థములకు ప్రకాశము ప్రసాదించువారు. ఆయన పరాయణుడగు సర్వుల యొక్క ఆత్మగా ఎరుగుచున్నాను. **సర్వస్య ఆత్మనః పరాయణం।**

ఓ శాకల్యా! ఆయనయే ప్రాణ స్వరూపుడగు **"ఛాయా పురుషుడు (జీవాత్మ)"** కూడా అయి ఉన్నారు. అద్దమునందలి **"ప్రతిబింబము"** వంటిదగు ఈ జగత్తు (మరియు) జీవాత్మలను ఆ పరమ పురుషునికి అభిన్నమని, **"బింబ"** – స్వరూపమని గమనిస్తున్నాను.

అట్టి తేజోమయ దృక్ రూప పురుషుడే దేవుడు। ఇక **'ప్రాణము'** ఆయన యొక్క దేవతా రూపము.

ఓ శాకల్యా! ఇంకా ఏమైనా అడగదలచుకొన్నారా! అడగండి.

**శాకల్యుడు :** ఏ దేవునకు జలములే ఆశ్రయమో, (జలమంతా ఆశ్రయించినవారై ఉన్నారో), హృదయమే ఆ జలమును ఆశ్రయించిన స్థానమో, తన మనస్సే జలము యొక్క అనుభూతిని వెలిగించునదై ఉన్నదో, ఆయనయే కార్య – కారణ సంఘాతమునకు ఆశ్రయమై ఉన్నారు కదా! తెలుసా? ఆ దేవునికి చెందిన దేవత ఎవరు?

**యాజ్ఞవల్క్యుడు :** స్వామీ! ఆ పురుషుని నేను సర్వాత్మకుడుగా (అనగా), **మీ స్వరూపముగా, నా స్వరూపముగా, సర్వాంతర్యామిగా, సర్వతత్త్వస్వరూపుడుగా** ఎరుగుచున్నాను. అట్టి జలమునకు దేవత **'వరుణుడు'.** ఓ శాకల్యమునిసత్తమా! ఇంకా కూడా ఏమైనా అడగ వచ్చును.

**శాకల్యుడు :** ఓ యాజ్ఞవల్క్యులవారూ!

- ఏ దేవునకు రేతస్సు ఆశ్రయమైయున్నదో..,
- ఏ రేతస్సు హృదయము చూచు సాధనమో..,
- మనస్సు జ్యోతియో (రేతస్సే జ్యోతియో),

–ఎవ్వరైతే కార్యకారణ సంఘాతకముకు సర్వోత్కృష్టమగు ఆశ్రయము అయినట్టి అట్టి తత్త్వము తెలుసుకుంటాడో, ఆతడే వివేకి. ఎరిగినప్పుడే కదా, పండితుడు! ఆ దేవత ఎవరు? ఆ దేవత పేరేమిటి?

**యాజ్ఞవల్క్యుడు :** ఆయన ఇతః పూర్వము చెప్పినట్లు **సర్వాత్మకునిగా** ఎరిగి ఉన్నాను. పుత్రుని (స్వస్వరూపాంశ) రూపమున ఉన్న ఆ పురుషుడే దైవము. అద్దానికి దేవత ప్రజాపతి!

(హాస్యంగా) ఈ ప్రశ్నలన్నీ ఒకదాని తరువాత మరొకటిగా మాకు అందిస్తున్న ఓ శాకల్య మహానుభావా! ఈ సభలో గల మీ మిత్రులు కొందరు –కురుపాంచాల బ్రాహ్మణులు – నిప్పులు బయటకు తీసే పటకారు వంటిదిగా చేసుకొని ఉపయోగిస్తూ ఉండగా, నేను నా సమాధానములతో మిమ్ములను కాల్చివేయుచున్నానేమో కదా! అయితే ఆ విషయము మీరు గమనించటము లేదేమోనని కూడా నేను అనుకుంటున్నాను. కాస్త శాంతించండి! మీకు శుభమగుగాక!

**శాకల్యుడు :** (కించిత్ కోపంగా) మిత్రమా? యాజ్ఞవల్క్యా!

ఎగతాళి చేయుచున్నారా? ఏమి? కొంచెము విర్రవీగి మాట్లాడుచున్నారేఁ! మీరే బ్రహ్మము తెలిపిన ఆత్యంతిక బ్రహ్మిష్ఠుడనని గర్వించి కదా, ఇక్కడి మా కురు – పాంచాల దేశముల నుండి వచ్చిన బ్రాహ్మణులను 'అసత్యవాదులు' అన్నట్లుగా తక్కువగా చేసి మాట్లాడారు? తిరస్కరించి పలుకుచున్నారు. మీ ప్రత్యేక ఏమిటని మీరు అనుకుంటున్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** అయ్యా, శకలముని కుమారా! నాకైతే ఈ బ్రహ్మ విజ్ఞానము కలదు. అది ఏమంటే, నేను దేవతలు మరియు ఆశ్రమముతోను ప్రతిష్ఠతోను కూడుకొనియున్న నా చుట్టూ దిక్కుల గురించి నేను ఎరిగి ఉన్నాను. (దిక్కుల గురించే కాకుండా) దిక్కులలో ప్రతిష్ఠితులై ఉన్న నా యొక్క స్వరూప – స్వభావముల గురించి కూడా నేను ఎరిగి ఉన్నాను. దిక్ రూపుడనై దిక్కులందు దేవతా రూపముగా ప్రతిష్ఠింతుడనై ఉన్నాను. **సమస్త సహజీవులను ఆత్మస్వరూపులుగా ఉపాసిస్తున్నాను.**

**శాకల్యుడు :** ఓహో! దేవతలు – ఆశ్రయములతో కూడిన మీ యొక్క దిక్కుల గురించి మీరు ఎరిగి ఉన్నారా? **యత్ యది దిశోవేత్థ – స దేవా, సప్రతిష్ఠా ఇతి.., సఫలం యది విజ్ఞానం త్వయం ప్రతిజ్ఞాతమ్।** దిక్కులలోని దేవతల – ప్రతిష్ఠతల – సఫలముల గురించి మీరు ఎరిగి ఉంటే.. అవి మాకు వివరించి చెప్పండి. చూద్దాం.

**కిం దేవతో అస్యాం ప్రాచ్యాం దిశ ఆసీత్ ఇతి? (5-9-20)।**

ఇప్పుడు మీరు దిక్ రూపులై **తూర్పు దిక్కున** ఏ రూపముగా ఉన్నారు? ఏ దేవతతో కూడి ఉన్నారు? (లేదా?) ఆ దిక్కులో ఆ దేవతను ఏరూపముగా ఉపాసిస్తున్నారు? (లేక) తూర్పు దిక్కునందు మీరు ఏ దేవతచే సేవించబడుచున్నారు? అట్టి వివరాలేమైనా ఉంటే మన ఈ సభకు వినిపించండి!

**యాజ్ఞవల్క్యుడు :** నా యొక్క తూర్పు వైపు నందు నేను **'ఆదిత్య దేవత'**ను ఉపాసిస్తున్నాను. అయితే వేదవాఙ్మయములో ఒక మాట గుర్తు చేస్తున్నాను.

**సర్వత్రా హి వేదే యాం యాం దేవతాం ఉపాస్తే,**
**ఇహైవ తత్ భూతస్తాం తాం ప్రతి పద్యత ఇతి।**

**"ఈ పురుషుడు ఏఏ దేవతను ఉపాసిస్తాడో, ఆతడు ఆ ఉపాసన ఫలించినప్పుడు ఇక్కడే ఆ దేవతా రూపమును సంతరించుకొనగలడు"** అని చెప్పబడుతోంది కదా! అందుచేత **నేను నా తూర్పు దిక్కునందు ఆదిత్య దేవతను ఉపాసిస్తూ, ఆదిత్య దేవతా స్వరూపుడనై అఖండమగు ఆత్మతత్త్వముగా** ప్రకాశించుచున్నాను. **(నా రుద్రో రుద్ర మర్చత ఇతి।)**

***"ఆ ఆదిత్యుడు (సూర్యుడు) దేనియందు ప్రతిష్ఠితుడై యున్నాడు?"*** అని అడుగుతారా? నేత్రమునందు (చూపు స్వరూపుడై)!

**శాకల్యుడు :** ఓహో! నేత్రమునందు ఆదిత్యుడు ఉన్నారా? నేత్రము అనగా? 'చూపు' (Vision) యే కదా! అట్టి మీ చూపు ఎద్దానియందు ప్రతిష్ఠితమై ఉన్నది?

**యాజ్ఞవల్క్యుడు:** నా యొక్క తూర్పునందు ఆదిత్యుని అధిష్ఠాన దేవతగా కలిగియుండి, ఆదిత్యుని ఉపాసించువాడనై, ఆదిత్య అధిష్ఠాన దేవతను **నేనే అయి,** ఆ **నాకు అనన్యమగు** ఆదిత్యుడే చూపుగాను, ఆ చూపుయే కనబడే సమస్తరూపములుగాను **ప్రతిష్ఠితమై ఉన్నాను.**

నా ఆదిత్య చైతన్యమే ఈ దృశ్యములోని సర్వ రూపములందు ప్రతిష్ఠితమై యున్నది. (లేక) అస్మత్ ఆదిత్య చైతన్యమే సర్వరూపాత్మకంగా నాచే పొందబడుతోంది. **ఈ సమస్తము నాయొక్క ఆదిత్య స్వరూప ప్రదర్శనా విన్యాసమే।**

**శాకల్యుడు :** 'ఆహాఁ'! మరి ఈ దృశ్యములో కనబడే రూపములన్నీ ఎందులో ప్రతిష్ఠితమై ఉన్నాయి?

**యాజ్ఞవల్క్యుడు :** హృదయము నందు. **చూచువాడు, చూపు, చూడబడేది,** ఆ చూపు నందు ప్రతిష్ఠితుడైన అధిష్ఠాన దేవతయగు **ఆదిత్యుడు** – ఇవన్నీ **నా హృదయమునందే ప్రతిష్ఠితం అయి ఉన్నాయి.** అద్దములో దృశ్యములుగా ఈ సమస్తము నాయందే ప్రతిబింబరూప ప్రదర్శనంగా ఏర్పడి ఉన్నది.

ఎందుకంటే – రూపములను స్మరించేది వాసనలే కదా! మరియు,

– వాసనలే స్వరూపముగా గల రూపములను స్మరించేది హృదయమేకదా।

– కాబట్టి **హృదయమునందే ఈ రూపములు, ఆ రూపములను సిద్ధింపజేస్తున్న సంస్కారములు ప్రతిష్ఠితమై ఉన్నాయి.**

అంతేకాదు. హృదయమే రూపాకారములుగా పరిణమిస్తోంది. కాబట్టి ఈ జగత్ ఆకార రూపము, అధిష్ఠాన దేవత ఆదిత్యుడు... అట్టి ఆదిత్య దేవత – ఇవన్నీ కూడా నా హృదయము నందు, ఆ హృదయము ఆత్మయందు → ప్రతిష్ఠితమై ఉన్నాయి.

**అవన్నీ నాకు అనన్యము. వాటికి నేను అనన్యము.**

## దక్షిణ దిక్కు – యమోపాసన – యమో–ఆత్మాహమ్! (5-9-21)

**శాకల్యుడు: ఏవమ్ ఏతత్వై యాజ్ఞవల్క్య!** మీరు చెప్పినది సరియే! మరి మీ దక్షిణ దిక్కునందు మీరు ఏ దేవతతో కూడుకున్నవారై ఉన్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** యమదేవతను **ఉపాసించువాడను**, యమదేవతతో **కూడుకున్నవాడను**, యమదేవతా **స్వరూపుడనుగా** కూడా అయి ఉంటున్నాను. అనగా..

- 'దక్షిణ దిక్కు'తో తాదాత్మ్యము చెంది ఉన్న నాకు యముడు దేవత.
- ఆ యముడు ఆ దక్షిణ దిక్కుతో సహా తనకు కారణమైయున్న సృష్టి వ్యవహార సంబంధమైన 'మరణము'నకు (మార్పుకు) అధిదేవతగా, 'సృష్టి' అనే 'యజ్ఞము' నందు ప్రతిష్ఠితుడై ఉన్నారు.

యజ్ఞ యాగ వాఙ్మయపరముగా మనము ఇక్కడ చెప్పుకోవాలంటే :

- ఋత్వికులు 'యజమాని' చేత యజ్ఞము చేయించటానికి ప్రారంభిస్తారు కదా।

– అప్పుడు దక్షిణ దిక్కు యజ్ఞమునకు కార్యక్రమ స్థానము కాబట్టి ఆ యమదేవుని స – అంగ, స–పరివార, స–పత్నీ, స–ఆయుధ సమేతంగా ఆహ్వానించి, పూజించి ఋత్విక్కులకు 'దక్షిణ' ఇచ్చి, అప్పుడు దక్షిణ దిక్కులో యజ్ఞ పరికరాల వినియోగము కొరకు, యజ్ఞవిధుల నిర్వహణ కొరకు కూర్చోబెడతారు.

ఓ శాకల్యా! ఇప్పుడు తర్వాతి ప్రశ్నకు వద్దాము. **కస్మిన్ను యజ్ఞః ప్రతిష్ఠితః?** ఆ యజ్ఞము ఎందులో ప్రతిష్ఠితమై యున్నది?
దక్షిణ యందు! ఎందుకంటే 'దక్షిణ'తో ఆ యజ్ఞమును యజమాని ఋత్విక్కుల నుండి "నిర్వహణ"ను కొనుగోలు చేయుచున్నాడు కాబట్టి. మరి 'దక్షిణ' యొక్క కార్యక్రమమంతా ఎందులో ప్రతిష్ఠితమైయున్నది? "శ్రద్ధ" (Interest + Involvement + Respect to Task) యందు.

'శ్రద్ధ' అంటే మరొక్క మాటగా చెప్పుకోవాలంటే →

(1) **'నేను ఇవ్వాలి'** అనే కోరిక (A Temptation to give to others, to the world and to Almighty)

(2) **సమాధానము** → భక్తి, ప్రేమ.

(3) **ఆస్తిక్యబుద్ధి.** వేదవచనములందు వేదవాక్యములందు, వేద విధి విధానములందు విశ్వాసము.

ఈ విధంగా శ్రద్ధ దక్షిణయందు కూడా ప్రతిష్ఠితమై యున్నదని అంటారు. ఒకడు శ్రద్ధ ఉంటే కదా, 'దక్షిణ' ఇచ్చేది! శ్రద్ధయే అసలైన దక్షిణ.

'శ్రద్ధ'కు ఉత్పత్తి – ఉనికి స్థానము ఏది? **హృదయము.** 'శ్రద్ధ' అనేది ఈ జీవునికి కాలు–చేయి–ముక్కు వలె బాహ్యమైన అంగము వంటిది కాదు. మరి? **హృదయములో బుద్ధిచే ఏర్పడే వృత్తియే 'శ్రద్ధ'. బుద్ధి వృత్తి + మనస్సుతో ఇష్టము + నిర్వర్తించాలనే తపన** – ఈ మూడు కలిసి హృదయములో ఏర్పడు హృదయాకాశాంతర్గత వీచికలు. అవియే 'శ్రద్ధ' యొక్క రూపము.

మరి హృదయము ఎక్కడున్నది? ఆత్మ యందు. ఆత్మ అనగా ఎవ్వరు? **త్రికాములకు – జాగ్రత్– స్వప్న – సుషుప్తి రూప త్రిదశలకు సాక్షినగు నేనే।**

కనుక **"దక్షిణ దిక్ దేవత యగు యముని అధిదేవతగా ఉపాసిస్తూ, అధి దేవతను నేనే అయి, దక్షిణ దిక్కును ఆత్మగా ఆక్రమించిన వాడనై"** ఉంటున్నాను.

**శాకల్యుడు :** చాలా బాగా నిర్వచించి చెప్పుచున్నారు. మీరు చెప్పినది యదార్థమే। **'అద్దానిని ఎట్లా విమర్శించాలి'** అనుదానికి తరువాత వద్దాము.

## ప్రతీచీ (పడమర) దిక్కు – వరుణదేవో పాసన – వరుణ దేవోఽహమ్

మీకు పడమర దిక్కుగా మీరు ఏ దేవోపాసన చేస్తున్నారు?

ఓ యాజ్ఞవల్క్యా! మీరు మీకు చెందిన ఏ దేవతతో కూడుకున్నారు? ఆ దేవత ఎద్దాని యందు ప్రతిష్ఠితమై ఉన్నారు?

**యాజ్ఞవల్క్యుడు :** పడమర దిక్కునందు నాకు వరుణ దేవుడు **'అధిష్ఠాన దేవత'** అయి ఉన్నారు. జలములందు వరుణ దేవుడు కార్యస్వరూపులై ఉన్నారు.

ఆధ్యాత్మికంగా చెప్పుకోవాలంటే – జలము → **"శ్రద్ధ + నిశ్చయము"లకు ప్రతీక.**

జలము ఎందులో ప్రతిష్ఠితమై యున్నది? **సృష్టికర్త (ప్రజాపతి) యొక్క రేతస్సు నందు.** "రేతస్సు నుండే ఆయా ధర్మములతో కూడిన జలములు సృష్టించబడుచున్నాయి" – అనునది శ్రుతివాక్యం. అందుకే జల సంప్రోక్షణతో ఆధ్యాత్మిక – దైవిక – ఉపాసనా కార్యక్రమములు జనులు ప్రారంభిస్తున్నారు. (రేతస్సు – ఉత్సాహము. ఇంద్రియములను నడిపించు ప్రోత్సాహకము).

మరి రేతస్సు దేనియందు ప్రతిష్ఠితమైయున్నది?

**'హృదయమునందు' :** రేతస్సు హృదయము యొక్క కార్యము (Execution) అయి ఉన్నది. సృష్టి పట్ల సంకల్పాభిలాష. హృదయము యొక్క వృత్తియే. అందుకే 'పుత్రుడు తన స్వరూపమే' అని తండ్రికి శ్రుతులచే చెప్పబడుచున్నది. **(ఆత్మా వై పుత్రః।)**, బంగారము నుండియే బంగారపు కుండలము రూపుదిద్దుకుంటున్నట్లుగా, తండ్రి నుండి పుత్రుడు రూపుదిద్దుకుంటున్నాడు.

(**"జీవాత్మ-పరమాత్మయొక్క అంశయే"**- అనునది రహస్యార్థము).

అట్టి రేతస్సు హృదయము నందే ప్రతిష్ఠితమైఉన్నది. హృదయము ఆత్మస్వరూపమే అయిఉన్నది. కనుక **జలదేవత యగు వరుణుని మమాత్మ స్వరూపముగా భావిస్తూనే, అధిష్ఠాన దేవతగా కూడా ఉపాసన చేస్తూ ఉన్నాను.**

## ఉత్తర దిక్కు - సోమదేవత - సోమదేవో౽హమ్

**యాజ్ఞవల్క్యుడు :** ఓ శాకల్యమునీ! ఇక నా ఉత్తర దిక్కు గురించి వినండి.

ఉత్తర దిక్కు నందు సోముడు (చంద్రుడు) నాకు **"మమాత్మస్వరూపుడు, ఆరాధ్య దేవత"** కూడా అగుచున్నారు. అట్టి అధిదేవతయగు ఉత్తర దిక్ దేవత "దీక్ష (Determination)" నందు ప్రతిష్ఠితుడైయున్నాను. నా యొక్క దీక్ష అయినట్టి దైవీరూపమే సోముడు.

*(యజ్ఞములో సోమదేవత - చంద్రుడు కలిపి మంత్రములు చెప్పబడుచున్నాయి).*

దీక్షను స్వీకరించిన (యజ్ఞము చేయు) యజమాని యొక్క మనస్సు చంద్రాధిదేవతా (దివ్య) రూపము. 'దీక్ష'యే నాకు ఉత్తర దిక్కుగా ఆత్మయందు విస్తారితమైయున్నది.

దీక్ష దేనియందు ప్రతిష్ఠితమైయున్నది? **సత్యమునందు।**

దీక్ష యొక్క ఆశయము, ఉద్దేశ్యము సత్యమును ఆశ్రయించటమే అయి ఉన్నది. విజ్ఞులు - 'నాయనలారా! సత్యమునే పలకాలిసుమా!".. అని జనులందరినీ నిర్దేశిస్తున్నారు. ఎందుకు? 'కారణరూపము' అయినట్టి సత్యము చేయిజారిందా,... కార్యరూపమైన దీక్ష కూడా చేయి జారగలదని వారి ఉద్దేశ్యము కాబట్టే। అట్లా కాకుండా ఉండాలనే, **"దీక్షను విడవకండి"** అని చెప్పుచున్నారు.

సరే! ఇక **"సత్యము ఎద్దానియందు ప్రతిష్ఠితమైయున్నది?"** అనునది మేము గమనించాము. **"హృదయమునందు"** అను సమాధానము పొందాము. ఎందుకంటే ఈ పురుషుడు (జీవుడు) సత్యమును తెలుసుకొనేది హృదయముతోనే కదా! ఆ హృదయమునకు స్థానము? ఆత్మయే. **ఆత్మ మీకు - నాకు కూడా స్వస్వరూపమే.**

ఆత్మయగు నేను **'సోమదేవుని అధిష్ఠానదేవత'**గా ఉపాసిస్తూనే, ఆ సోమదేవతను **ఆత్మకు అభిన్నముగా (లేక) 'నేనే' అని కూడా దర్శిస్తున్నాను!** నా **ఉపాసనా దైవము నేనే అయి ఉన్నాను కూడా.** అనగా, **నాయొక్క సహజ - నిజాత్మయే నాకు ఉపాసనావస్తువుగా అగుపిస్తున్నది, అగుచున్నది కూడా।**

## ఊర్ధ్వదిక్ - అగ్ని ఉపాసనాదేవత - అగ్ని దేవాహమ్

**శాకల్యుడు :** ఓ యాజ్ఞవల్క్యా! **మీరు ఇప్పటి దాకా చెప్పుచున్నదంతా యథార్థమే!**

ఇంకా కూడా చెప్పండి!

మీ యొక్క ఊర్ధ్వదిక్కుగా మీరు ఏ దేవతను కలిగియున్నారు? ఆ దేవత ఎద్దానియందు ప్రతిష్ఠితమైయున్నది?

**యాజ్ఞవల్క్యుడు :** నా యొక్క ఊర్ధ్వమున (పైన) ఊర్ధ్వ దిక్కునందు అగ్నిదేవుని ఉపాసనా దైవముగా కలిగియున్నాను. అట్టి అగ్ని "వాక్కు" నందు ప్రతిష్ఠితమైయున్నది. అగ్ని యొక్క తేజస్సు చేతనే వాక్కు ప్రవర్తిస్తోంది. అందుచేతనే దేహమునందు ఉష్ణము పడిపోవుచుండగా, ముందుగా నోటి మాట బలహీనమైపోవటము, మాట పడిపోవటము జరుగుతూ ఉంటుంది. అగ్నిదేవుని శక్తి చేత మనము వేద శబ్దములను, స్తోత్రములను పలుక గలుగుచున్నాము.

ఇక వాక్కు ఎద్దాని యందు ప్రతిష్ఠితమై యున్నది? బుద్ధి యందు. బుద్ధియో? హృదయ రూపము। హృదయమునందు. హృదయమో? ఆత్మయందు. ఈ విధంగా నేను ఉపాసించే అగ్నిదేవుడు ఊర్ధ్వ రూపమున ఉండి నేను సమర్పించు స్తోత్రములు స్వీకరిస్తూ ఉన్నారు. ఆయన నా ఆత్మయే. ఆత్మకు అభిన్నుడనై, అగ్ని స్వరూపుడనై విరాజిల్లుచున్నది నేనే. అగ్ని దేవునిగా ఊర్ధ్వమున (ఆత్మగా)

ప్రకాశమానమగుచున్నాను. అట్లు ఆత్మగా భావిస్తూ, ఆత్మదేవునిగా కూడా ఉపాసిస్తున్నాను. 'ఉపాసన' సహాయంగా అగ్నితో స్వాభావికమగు మమేకత్వము సిద్ధించుకుంటున్నాను.

**తత్ర యాజ్ఞవల్క్య సర్వాసు దిక్షు విప్రసృత్, ఏన హృదయేన సర్వాదిశ ఆత్మత్యేన అభిసంపన్నః।**

ఇట్లా పలుకుచూ పలుకుచూ, ఆ యజ్ఞ వల్క్యుడు దిక్కుల నిండా బుద్ధి రూపహృదయమును వ్యాపింపజేశారు. హృదయము ద్వారా ఎనిమిది దిక్కులందు, ఊర్ధ్వ-అధో భాగములందు తన యొక్క **'సోऽహమ్ ఆత్మ రూపము'**తో నింపివేసారు.

- **ఈ నామరూపాత్మకమైనదంతా** తన ఆత్మత్వముతో మమేకము చేసి, **పూర్ణము** చేసివేశారు.
- లోకములు, లోకస్థులు, లోకేశులు, ఆలోకములు, విలోకములు.. **అన్నీ తానై,** తాను వాటికి **మూలవిరాట్టు అయి ఆత్మ - ఘనీభూతత్వము ఆస్వాదించసాగారు.**
- ఇప్పుడు ఆదిత్య - యమ - వరుణ - వాయు - అగ్ని.. ఇత్యాది **దేవతలు,** వారి వారి **ప్రతిష్ఠలతో సహా ఆత్మరూపములై విలాసిల్లారు.** వారు తనకు, తాను వారికి - "ఆత్మ అయి", ఆయన "అఖండాత్మ స్వరూపుడు" అయ్యారు.
- తూర్పు వైపుగా ఉన్నదంతా యాజ్ఞవల్క్యునికి ఆతని హృదయరూపము అయింది. దేవతలు వారి మహిమలు, కార్యక్రమములు - వారివారి ప్రతిష్ఠా స్థానాలు.. **అంతా యాజ్ఞవల్క్యునికి స్వహృదయమై, స్వస్వరూపాత్మ అయి, కేవలమై, పరమై, దివ్యమై ఆస్వాదించబడసాగాయి.**
- **దిక్కులన్నీ ఆయన హృదయరూపములే అయ్యాయి.** హృదయగము (హృదయమునందే అవన్నీ ఉండినవి) అయి కూడా ఉండసాగాయి!
- ఊర్ధ్వ దిక్కుతో సహా దిక్కులన్నీ వాటివాటి సమస్త నామములతో సహా ఆయన యొక్క ఓంకారోచ్చారణా రూపమగు 'వాక్-ఇంద్రియము' ద్వారా హృదయరూపమును, బుద్ధిరూపమును, ఆత్మరూపమును సంతరించుకున్నాయి.

**"ఆహాఁ! ఈ జగత్తంతా కూడా నామము+రూపము+ కర్మ... ఇంత మాత్రమే కదా,"**.. అని ఎరుగుచూ, ఆ సభలోని యోగ-జ్ఞానజ్ఞులగు ఆత్మజ్ఞులు ఆ **యాజ్ఞవల్క్యుని పూర్ణాత్మానుభవమంతా మౌనముగా గమనిస్తూ,** ఆనందముతో కూడిన ఆశ్చర్యము పొందసాగారు. లోకముల - లోకస్థుల - లోకేశుల స్వస్వరూపానుభవమును గమనిస్తూ ఆశ్చర్యము పొందసాగారు! ఆయనపట్ల **లోకముల - లోకస్థుల - లోకేశుల ఏకత్వమును గమనించసాగారు!**

ఇది ఇట్లా ఉండగా, శాకల్యుడు యాజ్ఞల్క్యుని ఒక భౌతికరూపధారునిగా మాత్రమే చూస్తూ ఇట్లా ప్రశ్నించ సాగారు.

**శాకల్యుడు :** ఓ యాజ్ఞవల్క్యా! ఇప్పుడు మిమ్ములను ఒక అతిముఖ్యమైన విషయము గురించి ప్రశ్నిస్తున్నాను.

- యాజ్ఞవల్క్యుడుగా మీరు ఇప్పుడు ఉన్నదెక్కడ?
- మీ యొక్క తూర్పు-పడమర-ఉత్తర-దక్షిణాలు, ఈశాన్య - వాయువ్య నైఋతీ- ఆగ్నేయాలు, ఊర్ధ్వ - అధో - ఈఈ దిక్కులన్నీ ఎక్కడున్నాయి?
- మీ అధిష్ఠాన దేవతలు ఏఏ మూలలలో ఉన్నారు?
- ఆ అధిష్ఠాన దేవతల కర్మ - క్రియా విశేషాలన్నీ ఎక్కడెక్కడ జరుగుచున్నాయి?
- మీ హృదయము ఏ స్థానము ఆక్రమించుకొని ఉన్నది?
- ఆత్మ ఉన్నది ఎక్కడ?
- మీరు ఎక్కడున్నారు?

ఇవన్నీ ఒక్కొక్కటిగా వివరించి చెప్పండి.

**యాజ్ఞవల్క్యుడు :** అతి మూఢము, కూపస్థమండూకము (నూతిలో కప్ప వంటిది) – అగు భౌతిక భావనతో కూడిన దేహదృష్టిని మూర్ఖముగా పట్టుకొని ఉండి వదలుటకు సిద్ధము కానట్టి ఓ అతిమూఢుడా! అహల్లికా! దున్నపోతు స్వభావుడా! మరొక్కసారి చెప్పుచున్నాను! విను.

**– యత్ర యస్మిన్ కాలే ఏతత్ హృదయం ఆత్మస్య – శరీరస్య అన్యత్ర → క్వచిత్ దేశాంతరే అస్మత్**

**అస్మత్తో వర్తత ఇతిమన్యాసై మన్యసే, – యద్ధి య దేహి ఏతత్ హృదయం అన్యత్రా అస్మత్యాత్ భవేత్,**

**– శ్వానో వైనత్ శరీరం తదా అద్యుః వయాంసి వా పక్షిణో వైనద్విమథీరన్ విరోదయః ఉర్వి కర్త్వేరన్ ఇతి॥**

ఏ సమయంలో నీవు **"హృదయము ఈ నాశరీరమునకు వేరొక్క చోట ఎక్కడో ఉన్నది"..** అని తలుస్తావో, ఆ మరుక్షణం నీ భౌతిక దేహము కుక్కలకు, నక్కలకు, పక్షులకు ఫలహారముగా అవటానికి మాత్రమే అర్హమగుచున్నది.

కాబట్టి మిత్రమా! హృదయము శరీరమునందే ప్రతిష్ఠితము అయి ఉన్నదయ్యా! ఈ శరీరము → పేరు + ఆహారము + కర్మలు.. ఈ మూడే స్వరూపముగా కలిగి ఉన్నది సుమా! అందుచేత

→ శరీరమునందే హృదయమున్నది.

→ హృదయమునందే శరీరము ఉన్నది. ఏ భావనకైనా కూడా, – దాని జనన స్థానము హృదయమే.

→ శరీరము అనగా **'శరీర భావన'** – అని గమనించు.

**శాకల్యుడు :** సరేః! అవన్నీ ఒప్పుకున్నాంలెండి! అసలు విశేషానికి వద్దాము.

– మీ శరీరము – హృదయము దేనిలో ప్రతిష్ఠితమై ఉన్నాయి? **యాజ్ఞవల్క్యుడు :** – ప్రాణవాయువు నందు.

| **శాకల్యుని ప్రశ్న** | **యాజ్ఞవల్క్య సమాధానము** |
|---|---|
| ప్రాణ వాయువు? | అపానవాయు నందు ప్రతిష్ఠితమై ఉన్నది। |
| అపాన వాయువు? | వ్యాన వాయువునందు। |
| వ్యానవాయువు? | ఉదానవాయువునందు। |
| ఉదానవాయువు? | సమానవాయువునందు॥ **ఎందుకొరకు?** |

**యాజ్ఞవల్క్యుడు**

శరీరము, హృదయము, పంచ ప్రాణములు – ఇవన్నీ కూడా ఒకదాని యందు మరొకటి ప్రతిష్ఠితమై, కలిసి యుండి విజ్ఞానమయుడగు జీవుని **'అనుభవము'** అను ప్రయోజనము కొరకై.. **ఒకానొక నియమబద్ధమైన తీరుగా ప్రవర్తిస్తున్నాయి.**

***"ఇక బ్రహ్మము అనగా ఏది?"..*** అనే ప్రశ్నకు వస్తే..,

→ ఆకాశము, వాయువు ఇత్యాది పంచభూతములు దేని కారణంగా (Because of what) నియమబద్ధములై ఉన్నాయో,

→ అవన్నీ దేనియందు 'పడుగుపేక' వలె ప్రతిష్ఠితమై వ్యాపించియున్నాయో, అది ఆత్మ – (లేక) బ్రహ్మము అని మనము నిర్ధారించుకోవలసి వస్తుంది. **చెప్పుకోవటానికి ఆత్మ–విషయమే కానప్పట్టికీ, చెప్పుకొని మమేకము కాగలిగినట్టిది ఆత్మ।**

→ బ్రహ్మమునకు వాస్తవానికి దేహ – ఇంద్రియ – ప్రాణ – మనో వ్యాపారములతో (With Physical and Thought related functions) సంబంధము లేదని [నటుడి వ్యక్తిగత (బయట) వ్యక్తిత్వము – నాటకములోని పాత్ర యొక్క వస్త్ర – భావ – సంబంధములు, ఇత్యాదుల వలె] మనము గమనించాలి.

అప్పుడిక **'బ్రహ్మము'** గురించి ఇట్లా వివరించుకోవచ్చును.

## బ్రహ్మము యొక్క విలక్షణ లక్షణములు

- 'ఇది కాదు! ఇది కాదు! నేతి నేతి" వాక్యముచే సర్వము నిషేధించబడగా, ఇక ఈ జీవుని విషయమై నిషేధించబడజాలక, శేషించి ఉన్నట్టిది. జన్మలకు కర్మలకు మొట్టమొదటయే ఉండినట్టి కాబట్టి – **"ఆది శేష్యము'.**
- శరీర ధర్మములనున్నీ అధిగమించి 'ఆత్మ' అను పేరుతో చెన్నొందుచున్నట్టిది।
- దృశ్య విషయము వలె ఇంద్రియములతో ఒక విషయముగా గ్రహింపలేనట్టిది।
- శరీరము వలె శిధిలముకానట్టిది. అతిసూక్ష్మమైనట్టిది.
- శరీరమువలె ఆకారము లేనట్టిది! **(కదిలే దేహమునకు ఆకారము ఉన్నది కాని, కదిలించే దేహికి ఆకారమెక్కడిది?)**
- ఆత్మ నిరవయము. అందుచేత దేనితోనూ **'సంగము' లేనట్టిది.**
- మనస్సు సుఖదుఃఖములు పొందుచుండవచ్చుగాక. ఆత్మ **సుఖదుఃఖములతో సంబంధములేనట్టిది।**
- ఆత్మకు 'పట్టుకోబడటము, శిధిలమవటము, తగుల్కొనటము – **అనే ధర్మాలు లేవు.**

  కాబట్టి ఆత్మ హింసనుగాను, వినాశనముగాని పొందదు.
- ఉపనిషత్తులు → శ్రుతి, ప్రశ్న, ప్రతివచనము, గాథ మొదలైనవి చెప్పుచూ, క్రమంగా ప్రక్కన ఉంచి, చిట్టచివరిగా – **ఆత్మను సాక్షాత్తుగా సుస్పష్టము చేయుచున్నాయి.**

ఆత్మ సర్వదా...,

| | |
|---|---|
| ఈ భూమి ఆకాశము మొదలైన | '8' స్థానములను, |
| అగ్నిలోకము, వాయులోకము మొదలైన | '8' లోకములను, |
| అమృతము మొదలైన | '8' దేవతలను, |
| శరీరము మొదలైన | '8' పురుషులను, |

స్వస్వరూపమును, **ఆత్మరూపముగా – అధిగమించినదై ఉన్నది. "తత్ త్వమేవ। అట్టి ఆత్మవే నీవై ఉన్నావయ్యా। అందుకు నీ సందేహాలను ఆయా ఉపాయములచే తొలగించుకో!।" – అనునదే ఉపనిషత్ వాఙ్మయసారము. ఉపనిషత్ వాణి।**

----

ఓ శాకల్య మునీ! ఇప్పుడు మిమ్ముల ఉపనిషత్తులచే ప్రవచనము చేయబడుచున్న 'ఆత్మ' గురించి కొన్ని విషయాలు అడుగుచున్నాను. మీరు సమాధానము చెప్పండి.

మీ స్వస్వరూపమగు ఆత్మ సర్వదా **అమృతము, అఖండము, అప్రమేయము, సర్వము, నిత్యము, సర్వదేవతా స్వరూపము, అనంతము** – అని మీరు ఎరిగి ఉన్నారా? లేదా?

**శాకల్యుడు :** మీరు చెప్పే మాటలన్నీ ఎవరికి తెలియదు? మేము చాలాసార్లు వల్లించినవే। క్రొత్తగా మీరు చెప్పేదేమున్నది?

**యాజ్ఞవల్క్యుడు :** మీ ఆత్మ యొక్క తత్త్వమేమిటో మీరు ఇప్పుడే, ఇక్కడే గమనించండి. కేవలము ప్రశ్నలు అడుగుట కొరకే ప్రశ్నలు అడుగుచున్నారా? ఆత్మ గురించి తెలుసుకోవటానికి కాకుండా కేవలము **"ఎదుటివారిని ఆత్మ గురించి తెలియదు"**.. అని పది మందికి చెప్పటానికి ఉద్దేశిస్తున్నారా?

- "నాకు ఆత్మ గురించి తెలియదు! (లేక) అనుభవమవటం లేదు.

  నాకు చెప్పే వారికి కూడా ఏమీ తెలియదు। వారికే అనుభవమవటం లేదు" – అని ఊరుకోదలచుకొన్నారా?
- ఎవ్వరినైనా సరే ఈ విషయములో "వీరిని బ్రహ్మము గురించి తెలియదు" అని నిరూపించి పరిహాసము చేయాలని ఆశయము దృఢంగా కలిగి ఉంటాను" – **అని భావిస్తూ ఉన్నారా?**

ఆత్మజ్ఞానము కలిగి ఉండక, ఆత్మ జ్ఞానమును ఆత్మజ్ఞులను తక్కువ చేయటమే మీ బుద్ధి లక్ష్యముగా కలిగి ఉంటే మాత్రం ఈ దేహము బంధమే।

**శాకల్యుడు :** అవును! నేను ఎంతటివారినైనా సరే "పరబ్రహ్మము గురించి వారు చెప్పేది తప్పు".. అని నిరూపించగలిగాను. ఈ విషయంలో నాతో ఎవ్వరు సాటిరారు. బ్రహ్మము గురించి తెలియదు. తెలిసేది కాదు కూడా। అందుకే బ్రహ్మజ్ఞానులుగా చెప్పబడేవారిలో లోపములు గమనిస్తూ ఉంటాను.

**యాజ్ఞవల్క్యుడు :** అట్లాగా? **మీ యొక్క సర్వాత్మత్వము పట్ల మీరు విద్యార్థి అయి ఉద్యమించే యత్నములో ఉండనప్పుడు ఏమి పఠించి ఏమి ప్రయోజనము?** "ఎవరికీ ఏమీ తెలియదు" – అని చెప్పుచూ, కేవలము తర్క–వితర్కములకే సిద్ధమగుచు, సత్యమును ఎరుగుటకు సంసిద్ధులవనప్పుడు పఠించేవి, వినేవి వృధా। అట్టి మూర్ఖత్వమునకు ప్రతిగా – తలతెగి నేల కూలగలదు సుమా। ఇది సత్యము। పరమాత్మపట్ల, ఇష్టదైవము పట్ల "నాకు వేరు" అను భావన (అన్యము – అను భావన) ఉంటే, అది క్రమముగా మమేకత్వమునకు దారి తీయు గాక। ఇప్పటికీ దైవము వేరు – గురువు వేరు, దేహము వేరు, నేను – వేరు – నీవు వేరు.. అనునది వదలకపోతే, జీవబ్రహ్మైక్యమును – స్పృశించకపోతే, – **అసత్యమును ఆశ్రయించుటచే తల తెగగలదు. గమనించెదరు గాక।**

శాకల్యుడు ఆ మాటలను తిరస్కార – ఎగతాళి ముఖ కవళికలతో వింటూ ఉండసాగారు.

**యాజ్ఞవల్క్యుడు –** ఈ వాక్కు ప్రకటించగా ఆత్మ స్వరూపము గురించి జీవబ్రహ్మైక్యత్వము గురించి ఏ మాత్రము పరిశీలించనివాడు అవటంచేత, శాస్త్ర పాండిత్యమునకు మాత్రమే పరిమితమవటంచేత ఆ శాకల్యుని తల అందరూ చూస్తూ ఉండగా, నిజంగానే ప్రమాదవశంగా తెగి నేలవాలింది.

భిన్నమైపోయిన శాకల్యుని శరీరమును చూచిన ఆతని శిష్యులు ఆతని శరీరమును శ్మశాన వాటికకు తీసుకుపోయారు. ఊర్ధ్వలోకము కలుగటానికిని ఆయన అస్థికలను నిమజ్జనము కొరకై తీసుకొనిపోవుచుండగా, కొందరు దొంగలు ఆ శిష్యుల ధనముతోబాటు అస్థికలను కూడా దొంగిలించుకు పోయారు.

**"అవును! బ్రహ్మజ్ఞులను అవమానించరాదు కదా! ద్వేషము ప్రకటించి ఈ మూర్ఖుడగు శాక్యుడు కుతిక్కాయ మీదకు తెచ్చుకొన్నాడే. పాపము"** అని అక్కడి వేద వేదాంగవేత్తలు తమలో తాము అనుకున్నారు.

**యాజ్ఞవల్క్యుడు :** ఓ పూజనీయులగు బ్రాహ్మణులారా బ్రహ్మతత్త్వజ్ఞులారా! ఆత్మతత్త్వమును ఎరిగిన మహనీయురాలా!

ఆత్మతత్త్వమును (అక్షర బ్రహ్మతత్త్వమును) తిరస్కారభావముతో చూడకూడదని ఈ శాకల్యముని స్వయముగా నిరూపించినట్లైనది.

అయ్యలారా! ఇంకనూ బ్రహ్మము గురించి ప్రశ్నించ తలచారా! దయచేసి ప్రశ్నించ వచ్చును. మీలో ఏ ఒక్కరైనాగాని, అందరూ కలిసిగాని కూడా ప్రశ్నించవచ్చు. అట్టివారిని నేను కూడా పరబ్రహ్మము గురించి ప్రశ్నించెదను. ఆ ప్రశ్నించువారు స్వస్వరూప సంబంధమైన అవగాహనను, అనుభూతిని సమాధానముగా చెప్పెదరు గాక! లేదా, నేను చెప్పిన దానిలో దేనినైనా అంగీకరించకపోతే, ఆత్మజ్ఞానమునకు, సత్యమునకు మీ దృష్టిలో వ్యతిరేకంగా కనబడితే మీరు ముందుకు వచ్చి మాట్లాడవచ్చును. నేను వినమ్రుడనై లోపములను సరిదిద్దుకోవటానికి సంసిద్ధము.

యాజ్ఞవల్క్యుని ఆ మాటలు సభలోనివారందరూ విన్నారు. ఎవ్వరూ ఏ సమాధానము చెప్పక అందరూ మౌనము వహించారు.

**యాజ్ఞవల్క్యుడు : ఈ సభలోని వారందరూ కూడా,.. వారు ఎరిగినా, ఎరుగకున్నా.. సర్వదా పరబ్రహ్మస్వరూపులే.** ఇది మీరంతా ఎరిగిన విషయమే। అంతేకాదు. ఈ సభలో మహనీయులెందరో ఆత్మానంద స్వరూపులై ప్రకాశించుచు, నిరహంకారులై,– ఈ కార్యక్రమమునకు మౌనము, ఆనందముగా చిద్విలాసముగా దర్శించుచున్నారను విషయము నేను ఎరిగియే ఉన్నాను.

ఈ సభలోని వారందరికీ పేరుపేరునా ఆత్మభావనతో నమస్కరిస్తున్నాను. నాకంటే ఎంతగానో ఆత్మతత్త్వానుభవమును ఆస్వాదించుచూ వేంచేసియున్న ఈ సభాసరస్వతికి త్రిపదక్షిణ పూర్వక నమస్కారములు.

ఈ జనక మహారాజు **"బ్రహ్మతత్త్వము"**ను మరింతగా నిరూపించటానికే ఈ సభను ఉద్దేశ్యించారు. అందుచేత నేను వారికి, ఈసభలోని వారందరికీ నమస్కరిస్తూ, మమాత్మస్వరూపులుగా భావించి ఆనందిస్తున్నాను. మీ అందరిని **మా ఆశ్రమమునకు గోవులను దానము చేసిన యజ్ఞకర్తలుగా మాత్రమే భావిస్తున్నాను. మీ అనుజ్ఞ అయితేనే ఆ గోవులు మా ఆశ్రమునకు చెందినవవుతాయి!**

**"బ్రహ్మము గురించి ప్రశ్నించండి!"** అని మిమ్ములను అందరినీ అడిగాను. కాని ఎవ్వరూ ప్రశ్నించటము లేదు. ఇంత మాత్రముచేత మీరు అక్షర పరబ్రహ్మమును ఎరుగరని నేను భావించటము లేదు.. అది **తర్క-వితర్కములకు విషయము కాదని గురువుల వాక్యము** కదా! అందుచేత మీరు మౌనం వహించారు. **అందుచేత మీరంతా నాచే నమస్కరించబడుచున్నారు.**

మీ అందరికీ మరల మరల ఆత్మస్వరూప నమస్కారములు సమర్పిస్తూ, విషయసారముగా ప్రశ్నపూర్వకమైన ఆత్మతత్త్వ చమత్కారమును ఈ చెప్పబోవు విశేషములతో సమీక్షిస్తున్నాను. వినండి!

---

**యాజ్ఞవల్క్యోవాచ:**

భౌతిక-శరీరాకృతి కలిగినట్టి **ఈ పురుషుడు (జీవుడు) స్వతఃగా పరబ్రహ్మ స్వరూపమే। పరబ్రహ్మమే సర్వదేహములలో 'దేహి'గా ప్రకాశించుచున్నది.** ఇది బ్రహ్మజ్ఞులందరికి అనుభవైకవేద్యమగు వాక్యమే!

ఇక...,

ఈ భౌతికదేహము ఒక ఫలవృక్షముతో పోల్చవచ్చును.

- వృక్షమునకేమో బెరడు, తొక్క, రసము, బంక, నార, చేవ, కొయ్య... ఇవన్నీ ఉంటాయి.
- దేహములో చర్మము, రక్తము, మాంసము, నరములు, మజ్జ, బొమికలు-మొదలైనవన్నీ ఉంటాయి!

ఒక వృక్షమును ఖండించామనుకోండి! అప్పుడు మరల ఆ మొదలు నుండి క్రొత్త కొమ్మలు పుట్టుకొస్తున్నాయి. కానీ, మృత్యువుచే శరీరము మ్రింగబడిందనుకోండి. అది నశించిపోతోంది.

మరి ఈ జీవుడు మరణానంతరము ఏ మొదలు నుండి తిరిగి పునర్జన్మ పొందుచున్నాడు? మీలో ఎవ్వరైనా పలుకవచ్చును.

**సభికులలో ఎవ్వరూ ప్రత్యుత్తరమీయలేదు. అప్పుడు యాజ్ఞవల్క్యుడే సంభాషణ కొనసాగించ సాగారు!**

**యాజ్ఞవల్క్యుడు :** ఆ మరణించిన శరీరములోనించి మరొక శరీరం వస్తోందా? లేదు కదా! జీవించి ఉన్నవానిలో రేతస్సు ఉంటుంది కాని, మరణించినవానిలో ఉండదుకదా! మరి తదనంతర దేహము ఆ జీవునికి ఎట్లా లభిస్తోంది?

కనుక ఓ మిత్రులారా! అస్సలు ఈ సమస్తమునకు మూలము ఏది?

"మరణించిన ప్రాణి (జీవుడు) తిరిగి పుట్టడు" అని ఎవ్వరైనా అంటారా? "జీవులందరు మరణించిన తరువాత ఇక మరల పుట్టరు"-అని అనదలుచుకుంటే, అప్పుడు అందరి పట్ల మృత్యువు సమానమే కాబట్టి చేసిన పుణ్య పాపములు నశిస్తాయని, చేయని పుణ్య-పాపములు ఫలిస్తాయని అనవలసి వస్తుంది. అట్లా ఎవ్వరైనా (మరణానంతరము పుణ్యపాప ఫలములు కూడా నశిస్తాయి - అని) అనలేరు కదా! (అవస్యమ్ అనుభోక్తవ్యమ్ కృతం కర్మ శుభ-అశుభమ్' - అని కదా నానుడి)।

ఒకడు ఒక వస్త్రము (చొక్కా) త్యజించి, మరొక వస్త్రము ధరిస్తూ ఉన్నాడు కదా। అదే రీతిగా, **మరణించినవాడు - తన పుణ్య-పాపఫలములు అనుభవించటానికి మరల జన్మిస్తున్నాడు**- అని అందరము ఒప్పుకోక తప్పదు. లేదా, కర్మసిద్ధాంతములనే తిరస్కరించాలి.

మరణించిన మనుష్యుడు ఏ మూల నుండి తిరిగి పుణ్యపాపఫల భోగముల కొరకై జన్మిస్తున్నాడు? ఇది మనలో ఎవ్వరైనా చెప్పవచ్చును. మరణించిన పురుషుని తిరిగి పుట్టించుచున్నదెవ్వరు? - ఇది నా ప్రశ్న!

"పుట్టియే ఉన్న నా గురించి - ఎవరి వలన - అని ప్రశ్నించటమెందుకు?" అంటారేమో! **పుట్టబోవువాళ్ళు ఎవ్వరితో పంపబడి పుట్టుచున్నారో చర్చనీయాంశమే కదా!** మరణానంతరము ఏమి అగుచున్నదో, మరొక దేహము ఎట్లు వస్తున్నదో మనమంతా పరిశీలించవల్సిందే కదా!

---





అక్కడి సభలోని వారు యాజ్ఞవల్క్యుని ప్రశ్నలు విన్నారు. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. మౌనంగా ఉండిపోయారు. **"మరణించినవాడు తిరిగి దేనివలన – ఎక్కడి నుండి పుట్టుచున్నాడు?"** – అనే ప్రశ్ననుగాని, ఆ ప్రశ్నకు సమాధానముగాని వారిలో కొందరు పరిశీలించి యుండలేదు. మరికొందరు **"ఆత్మోపమ్యేవ సర్వత్రా"..** అని ఎరిగియే, **"చెప్పనిచ్చెదము గాక!"..** అని మౌనము కొనసాగించారు. ఇంకొందరు యాజ్ఞవల్క్యుని సమాధానము కొరకై ఉత్సుకతతో వేచిఉన్నారు.

సమస్తమునకు కారణము ఏ విధంగా పరబ్రహ్మమో.. చెప్పటానికి సభికులెవరూ సిద్ధముగా లేకపోయిరి. జన్మ-కర్మలకు ఆవల గల జీవుని యొక్క పరస్వరూపము గురించి వారు చెప్పటం జరగనే లేదు.

అప్పుడు యాజ్ఞవల్క్యుడు – **"సమస్తము స్వస్వరూపాత్మ యొక్క క్రీడా రూపమగు భావనా విలాసమే।"** – అని సిద్ధాంతీకరించారు. అప్పుడు...,

**అతో బ్రహ్మిష్ఠత్వాత్ ధృతా గావః।**

**యాజ్ఞ వల్క్యేన జితా బ్రాహ్మణాః।**

**సభలోని బ్రహ్మవేత్తలను యాజ్ఞవల్క్యుడు జయించిన వాదగుటచే గోవులను గెలుచుకున్నారు.**

– ఇతి అఖ్యాయికా –

**విజ్ఞానం ఆనందం బ్రహ్మ।**

**బ్రహ్మము యొక్క విజ్ఞాన – ఆనందములే సర్వమునకు కారణము.**

**సమస్తమునకు మూలము ఆ బ్రహ్మ వస్తువే. ఈ జీవుడు స్వతఃగా బ్రహ్మమే।**

ఆ పరబ్రహ్మమే కర్మలు చేయువారికి కర్మ ఫలప్రదాత కూడా! బ్రహ్మనిష్ఠుడైన **బ్రహ్మవేత్తకు బ్రహ్మమే.. సర్వము, సర్వోత్కృష్టమయిన ఆశ్రయము కూడా!**

**విజ్ఞాన – ఆనందమయ బ్రహ్మమే విధి – విధానము – నిషేధములను కల్పించుకొని కథారచయిత వలె జగత్ కథను వ్రాసి వినోదించుచున్నది. తిరిగి ఉపసంహరించుకొని, తనయందే లయింపజేసుకొంటోంది.**

❖ ❖ ❖

**॥ ఇతి నవమో బ్రాహ్మణమ్ ॥**

**ఇతి – బృహదారణ్యకోపనిషత్**

**పంచమ అధ్యాయము సమాప్తము.**

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## షష్ఠాధ్యాయః

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ మన ఏవ ఆయతనం ఆకాశః,
ప్రతిష్ఠా ఆనన్ద ఇతి। ఏనత్ ఉపాసీత।

"మనస్సు ఆనందస్వరూపమగు బ్రహ్మముయొక్క శరీరమే! మనస్సు బ్రహ్మమునందే (జలంలో తరంగంలాగా) జనిస్తోంది, లయిస్తోంది!"... అను దృష్టి భావనలచే మనస్సును బ్రహ్మముగా ఉపాసించాలి.

## షష్ఠమాధ్యాయః - ప్రథమం బ్రాహ్మణము

### యాజ్ఞ వల్క్యీయకాండము - షడాచార (షట్-ఆచార) బ్రాహ్మణము

| | |
|---|---|
| 1 ఓం జనకో హ 'వైదేహ', ఆసాఇ్చక్రే। | ఒకానొకరోజు.... విదేహ దేశాధిపతియగు జనకమహారాజు రాజ సింహాసనముపై ఆసీనులై ఉన్నారు. సర్వజనులకు సందర్శనార్థమై కొలువు తీరి ఉన్నారు. |
| అథ హ యాజ్ఞవల్క్య ఆవవ్రాజ।<br>తగ్ం హోవాచ యాజ్ఞవల్క్యః। | ఆ సమయములో యాజ్ఞవల్క్య మహర్షులవారు జనక మహారాజు సభలో ప్రవేశించారు. జనకుడు వారికి స్వాగతము పలికి ఉచితాసనముతో సత్కరించారు. అంతా సద్దుమణిగిన తరువాత, జనక చక్రవర్తి చిరునవ్వుతో ఇట్లా యాజ్ఞవల్క్యుని పలుకరించసాగారు! |
| జనకౌవాచ : యాజ్ఞవల్క్య మహాన్ భావన్!<br>కిమర్థం ఆచారీః, పశూన్?<br>ఇఛ్చన్ అణ్వన్తాన్। ఇతి॥ | **జనకమహారాజు:** ఓ యాజ్ఞవల్క్య మహాశయా! సుస్వాగతము. కుశలమే కదా! మహాత్ములు ఊరక రారుకదా! తమ ఆగమునకు ఉద్దేశ్యము ఏమి? ఆచార్యా! మునీంద్రా! మీ ఆశ్రమ ఆచారములకు గోవుల ఆవస్యకత అయి వచ్చారా? లేక, ఏవైనా మీకు ఇష్టమైన ఆచారీ (శాస్త్ర) విషయాలు సంభాషించాలని అనుకున్నారా? పరబ్రహ్మము గురించి మాకు జ్ఞానవిశేషాలు ఈ రోజు ప్రసాదించటం మీ అనుగ్రహామా? |
| యాజ్ఞవల్క్యోవాచ : ఉభయం ఏవ సమ్రాట్!<br>ఇతి హోవాచ। | **యాజ్ఞవల్క్యుడు :** హే సమ్రాట్! యోగి పుంగవా! జనక చక్రవర్తీ! మీరు చెప్పిన రెండు ప్రయోజనములు దృష్టిలో ఉండియే, ఈ శుభదినమున మీ దర్శనార్థమై వచ్చాను. |
| 2 యాజ్ఞవల్క్యుడు: యత్ తే కశ్చిత్ అబ్రవీత్,<br>తత్ శృణవామ ఇతి। | **యాజ్ఞవల్క్యుడు :** మీరైతే ఈ సభలో ప్రతిరోజు అనేకమంది బ్రహ్మవేత్తల సంభాషణలు వింటూ ఉంటారు కదా। అట్టి ఆచార్యులు మీకు పరబ్రహ్మము గురించి చెప్పిన ఈ మధ్యకాలములోని ప్రవచన విశేషాలు మీరు చెప్పండి! |
| జనకౌవాచ : అబ్రవీత్ మే జిత్వా శైలినిః,<br>"వాక్ వై బ్రహ్మేతి"। | **జనకమహారాజు :** ఈమధ్య శిలిని కుమారుడగు 'జిత్వ'...అనే ఆచార్యులు ఈ సభకు విచ్చేశారు. **"వాక్ వై బ్రహ్మేతి! వాక్కుయే బ్రహ్మము అయి ఉన్నది"**...అని ఆయన ప్రకటనపూర్వకంగా అనటము, ఆ తరువాత వివరించటము జరిగింది. |

| | |
|---|---|
| యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ బ్రూయాత్,<br>తథా తత్ శైలినో అబ్రవీత్– | **'వాక్కుయే బ్రహ్మము'** అని ఆ జిత్వ అని ఉన్నారు. వారి తల్లిదండ్రులు, ఆచార్యులు ఆయనకు అట్లా బోధించినట్లు చెప్పారు. |
| **యాజ్ఞవల్క్యుడు : "వాక్ వై బ్రహ్మేత్యవదతో" హి।**<br>**కిగ్ంం స్యాత్ ఇతి అబ్రవీత్తుతే**<br>**తస్య ఆయతనం ప్రతిష్ఠాం?** | **యాజ్ఞవల్క్యుడు : 'వాక్ వై బ్రహ్మేతి'** - అని ఆయన అనటము - ప్రమాణవాక్యమే. వాక్కు బ్రహ్మమే।<br>అయితే, జనక యోగేశ్వరా! ఆ శిలుని కుమారుడగు జిత్వ - 'వాక్' రూపమైన బ్రహ్మమునకు "ఈ భౌతిక శరీరమే ఆశ్రయము" - అనిగాని, శరీరమునందే ప్రతిష్ఠమైనదని గాని అన్నారా? వాక్కుకు ఆశ్రయము ఎక్కడ, ఎందులో ప్రతిష్ఠితమైనదో చెప్పారా? |
| **జనకుడు : న మే, అబ్రవీత్। – ఇతి।**<br>**యాజ్ఞవల్క్యుడు: (ఇతి) ఏక పాద్యా ఏతత్ సమ్రాట్! ఇతి।** | **జనకుడు :** ఆయన అట్లా ఏమీ అనలేదు. 'వాక్' యొక్క ప్రతిష్ఠ గురించి చర్చించలేదు.<br>**యాజ్ఞవల్క్యుడు :** అట్లాగా! ఆ జిత్వా చెప్పిన **'వాక్ వై బ్రహ్మేతి'...** అనునది ఏకపాదవాక్యము. అనగా నాలుగవ వంతు సత్యము మాత్రమే. మొత్తములో ఇంకనూ మూడు పాదములు (3) కూడా చెప్పవలసినవై ఉంటాయి కదా! |
| **జనకుడు : స వై నో బ్రూహి, యాజ్ఞవల్క్య!** | జనకుడు : మీరు అంటున్న మిగిలిన పాదములు కలిగిన 'ఏకరూప బ్రహ్మము' గురించి నాకు దయచేసి వివరించండి. |
| **యాజ్ఞవల్క్యుడు : వాక్ ఏవ ఆయతనం ఆకాశః।**<br>**ప్రతిష్ఠా ప్రజ్ఞేతి–ఏవత్ ఉపాసీత।** | **యాజ్ఞవల్క్యుడు :** ఆ "ఏకపాదస్వరూపము" అయినట్టి 'వాక్' రూప బ్రహ్మము - **అవ్యాకృత ఆకాశమే ఆశ్రయముగా కలిగి ఉన్నది.**<br>'వాక్' + 'ఇంద్రియ' అధిష్ఠాన రూపమగు బ్రహ్మముకు వాక్కుయే ఆయతనము. (వాక్కుయే శరీరము) [ అవ్యాకృత ఆకాశము = ఉత్పత్తి, స్థితి లయములు జరుగుచూ ఉండే **కేవలరూపస్థానము**].<br>వాక్కుకు ఉత్పత్తి స్థానము ప్రజ్ఞయే। (ప్రజ్ఞ = సమిష్ఠి విజ్ఞాన శక్తికి బీజము).<br>**ప్రజ్ఞయే బ్రహ్మయొక్క రూపమని, వాక్కుకు స్థానమని ఉపాసించాలి.** |
| **జనకుడు : కా ప్రజ్ఞతా, యాజ్ఞవల్క్య!**<br>**యాజ్ఞవల్క్యుడు : వాక్ ఏవ, సమ్రాట్! ఇతి।**<br>**హోవాచ : వాచా వై సమ్రాట్! బన్ధుః।** | జనకుడు : 'ప్రజ్ఞ' అనగా ఏమి? మరికొంత వివరించండి.<br>**యాజ్ఞవల్క్యుడు :** ఓ సామ్రాట్! వాక్కు చేతనే ఒకనికి మరొకడు "ఆతడు నాకు బంధువు" అని తెలియజేయబడుచున్నది. ప్రజ్ఞ (తెలివి) యొక్క ప్రదర్శనమే వాక్కు. 'తెలివి' నుండియే అర్థముతో కూడిన వాక్కు భయలు దేరుతోంది. |
| **ప్రజ్ఞాయతే ఋగ్వేదో,**<br>**యజుర్వేదః, సామవేదో,**<br>**అథర్వ, అఙ్గిరస, ఇతిహాసః,**<br>**పురాణం, విద్యా ఉపనిషదః, శ్లోకాః,**<br>**సూత్రాణి అనువ్యాఖ్యానాని, వ్యాఖ్యానాని, ఇష్టగ్ంం,**<br>**హుతమ్ ఆశితం, పాయితమ్**<br>**అయం చ లోకః, పరశ్చ లోకః,**<br>**పరశ్చ లోకః,**<br>**సర్వాణి చ భూతాని వాచైవ,**<br>**సమ్రాట్! జ్ఞాయతే।** | అంతేకాకుండా - 'వాక్కు' చేతనే **ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము,** (రామాయణము, మహాభారతము మొదలైన) **ఇతిహాసములు,** (విష్ణుపురాణము, బ్రహ్మపురాణము, అగ్నిపురాణము, భాగవతము మొదలైన) **పురాణములు, చతుష్షష్ఠి (64) కళావిద్యలు, ఉపనిషత్తులు, శ్లోకములు** (భాష్య-వ్యాఖ్యానములు), (బ్రహ్మసూత్రము - భక్తిసూత్రములు -యోగసూత్రములు మొదలైన) **సూత్రములు, అను వ్యాఖ్యానములు, భాష్యవ్యాఖ్యానములు, భక్షణ నిమిత్తమైన ధర్మములు, పాననిమిత్తమైన ధర్మములు,** ఇహపరలోక విశేషాలు - విషయాలు - ఇవన్నీ రూపుదిద్దుకున్నవగుచున్నాయి. (తెలియచెప్పుకోబడుచున్నాయి).<br>అంతేకాకుండా.....,<br>వాక్కుకు స్థానమగు **ప్రజ్ఞవలననే** సమస్త సహజీవుల గుణములు, ప్రవర్తనములు - ఇవన్నీ ఈ జీవునికి **తెలియవస్తున్నాయి.**<br>'వాక్కు' సహాయముచేతనే వేదాంతవాఙ్మయము విస్తారముగా గ్రంథములై విరాజిల్లుచున్నది. వాక్కు చేతనే అన్నీ ఒకరినుండి మరొకరికి తెలియవస్తున్నాయి. **వాక్కు ప్రజ్ఞకు ఉపకరణము.** |

| | |
|---|---|
| **వాక్ వై, సమ్రాట్! పరమం బ్రహ్మ నైనం వాక్ జహాతి।** | కనుక ఓ సమ్రాట్! జనక మహారాజా! వాక్కుయొక్క ఉత్పత్తి స్థానమే బ్రహ్మము. ఎవ్వరు వాక్కు-శబ్దములను బ్రహ్మము రూపంగా ఉపాసిస్తారో, అట్టి వారిని వాక్కు ఎన్నడూ విడచివెళ్ళదు. అధ్యయనము చేసిన విద్యను ఎన్నడూ మరువడు. |
| **సర్వాణి ఏనం భూతాని అభిక్షరన్తి।**<br>**దేవో భూత్వా దేవాన్ అప్యేతి।**<br>**య ఏవం విద్వాన్ ఏతత్ ఉపాస్తే।** | బ్రహ్మము నుండియే వాక్కు బయల్వెడలుతోంది. వాక్కును బ్రహ్మముగా ఉపాసించువానిని సర్వభూతములు (తదితర జీవులు)-తన లేగదూడను ఆవువలె- ప్రేమాస్పదంగా చూస్తూ ఉంటాయి.<br>**"ప్రతి ఒక్కరి వాక్కు బ్రహ్మమునుండే ప్రదర్శితమగుచున్నది"** - అను భావముతో కూడి ఉపాసించుచున్నవాడు ఇక్కడనే దేవతా స్వరూపుడు అగుచున్నాడు.<br>వాక్కును బ్రహ్మము యొక్క ప్రదర్శన విశేషంగా ఉపాసించువాడు **'విద్వాంసుడు'**గా పరిగణించబడుచున్నాడు. |
| **<u>జనకుడు</u> : హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి ఇతి।**<br>**హోవాచ - జనకః వైదేహః।** | **జనకమహారాజు :** వాక్కుయొక్క జనించు స్థానమును బ్రహ్మముయొక్క రూపముగా ఉపాసించటమును ప్రకటించిన మీకు ఏనుగులవంటి వేయి (1000)గోవులను సమర్పించుకొనుచున్నాను. దయచేసి స్వీకరించండి. |
| **సహ ఉవాచ యాజ్ఞవల్క్యః।**<br>**<u>యాజ్ఞవల్క్యుడు</u> : <u>"పితామే అమన్యత</u>**<br>**<u>అనుశిష్య హరేతి, ఇతి।"</u>** | **యాజ్ఞవల్క్యుడు** : ఓ జనకా! **"శిష్యుని కృతార్థుని చేయకుండానే శిష్యునినుండి గురుదక్షిణగాని, ఇంకేవిధంగానైనా 'ధనము'ను గాని తీసుకోరాదు"** - అని మా తండ్రి గారి అభిప్రాయపడేవారు. వారి సూచన నాకు అనుసరణీయము. కనుక మీరు దక్షిణగా ఇచ్చు గోవులను తీసుకోవటము లేదు. ('వాక్కు మాత్రమే బ్రహ్మము' - అనునది బ్రహ్మము గురించిన సమగ్రమైన వాక్యము) కాదు-అని ఉద్దేశ్యము). |
| **3. <u>యాజ్ఞవల్క్యుడు</u> : యదేవ తే కశ్చిత్ అబ్రవీత్, తత్ శృణవామ। - ఇతి।** | **యాజ్ఞవల్క్యుడు** : ఓ జనక చక్రవర్తీ! ఇంకా ఎవరైనా ఆచార్యులు మీకు ఇంకేమైనా విశేషాలు చెప్పారా? చెప్పి ఉంటే, ఆ వాక్యములు వినిపించండి. మనము సంభాషించుకుందాము. |
| **<u>జనకుడు</u> : అబ్రవీత్ మ ఉదఙ్కః శౌల్బాయనః**<br>**<u>"ప్రాణో వై బ్రహ్మేతి"</u>।**<br>**యథా మాతృమాన్, పితృమాన్,**<br>**ఆచార్యవాన్, బ్రూయాత్।**<br>**తథా తత్ శౌల్బాయనః అబ్రవీత్।** | **జనకమహారాజు** : ఈ మధ్య శౌల్బుడు అను మునియొక్క కుమారుడు ఉదంకుడు (శౌల్బాయనుడు) ఇక్కడికి రావటం జరిగింది. ఆయనను **'బ్రహ్మము అనగా ఏమి?'** - అని అడిగినప్పుడు **"ప్రాణమే బ్రహ్మము"** అని సిద్ధాంతీకరించి చెప్పటం జరిగింది.<br>శౌల్బాయన ఉదంకుడు తన తల్లిదండ్రులు, గురువులు నేర్పియున్న **'ప్రాణమే బ్రహ్మము'** అనే మాటనుమాకు వివరించారు. |
| **<u>యాజ్ఞవల్క్యుడు</u> : ప్రాణో వై బ్రహ్మేతి।**<br>**అప్రాణతో హి కిగ్ంస్యాత్ ఇతి।**<br>**అబ్రవీత్తు తే, తస్య ఆయతనం ప్రతిష్ఠాం?** | **యాజ్ఞవల్క్యుడు** : ఔను. శౌల్బ్యాయనుడు చెప్పినది నిజమే. **"ప్రాణమే బ్రహ్మము"**...అని అంటున్నప్పుడు ఈ భౌతిక ప్రపంచములో ప్రాణములు లేనివాడు చెయ్యగలిగినది ఏమీలేదు కాబట్టి అట్లా చెప్పి ఉంటారు. మంచిదే.<br>ప్రాణము లేని శరీరము కట్టెతో సమానమే కాబట్టి ఆయన అట్లా అంటున్నారు. అయితే, **అట్టి ప్రాణము ఎక్కడ నివాసస్థానము,** ప్రతిష్ఠ కలిగి ఉన్నది? ఇది చెప్పారా? |
| **<u>జనకుడు</u> : న మే అబ్రవీత్।**<br>**<u>యాజ్ఞవల్క్యుడు</u>: ఇతి ఏక పాద్వా ఏతత్, సమ్రాట్! ఇతి।** | **జనకమహారాజు** : అట్లా అని అది వివరించి చెప్పలేదు.<br>యాజ్ఞవల్క్యుడు : ఓ సామ్రాట్! 'ప్రాణము' అనునది పరబ్రహ్మమునకు సంబంధించిన నాలుగు పాదములలో ఒకటి (1/4వంతు వివరణ) మాత్రమే. |

| | |
|---|---|
| జనకుడు : స వై నో బ్రూహి। | **జనకమహారాజు** : ఓ యాజ్ఞవల్క్యా! 'ప్రాణము బ్రహ్మమునకు ఒక పాదము' అను మీ అభిప్రాయమును మరింత వివరించండి. |
| యాజ్ఞవల్క్య: ప్రాణఏవ ఆయతనం<br>ఆకాశః ప్రతిష్ఠా ప్రియం<br>ఇతి ఏనత్ ఉపాసీత। | **యాజ్ఞవల్క్యుడు** : పరబ్రహ్మమునకు ప్రాణమే శరీరము. ప్రాణమునకు పరబ్రహ్మమే జనన-సంచార స్థానము (ఆయతనము).<br>- ఆ ప్రాణశరీరమునకు అవ్యాకృత ఆకాశము ఉత్పత్తి - స్థితి లయముల సంబంధమైన ఆశ్రయం. (లేక) ప్రాణమునకు ప్రతిష్ఠ - ఉత్పత్తి స్థానము అవ్యాకృత ఆకాశమే. అట్టి ప్రాణరూప పరబ్రహ్మమును **"ప్రియము"** అను రూపంగా ఉపాసించాలి. |
| జనకుడు : కా ప్రియతా? | **జనకుడు** : ఎవరికి ఏమని ప్రియము? |
| యాజ్ఞవల్క్య :<br>ప్రాణ ఏవ, సమ్రాట్! ఇతి।<br>హోవాచ । ప్రాణస్య వై, సమ్రాట్!<br>కామాయా యాజ్యం యాజయత్య<br>ప్రతిగృహ్యాస్య ప్రతిగృహ్ణాతి।<br>అపి తత్ర వధాశఙ్కం భవతి।<br>యాం దిశమేతి ప్రాణస్యైవ, సమ్రాట్!<br>కామాయ। | **యాజ్ఞవల్క్యుడు** : సమ్రాట్! ప్రాణమే ప్రియము. ఎందుకంటే, ఏ జీవుడికైనా అన్నిటికన్నా ప్రియమైనది ప్రాణమే కదా! ప్రాణము కొరకై ఒక యాజ్ఞీకుడు యజ్ఞమునకు అర్హత లేనివాని చేత యజ్ఞము చేయిస్తున్నాడు. అర్హతలేని యాగము చేయిస్తున్నారు.<br>ప్రాణము యొక్క ప్రియము కొరకే మరొకడు స్వీకరించకూడని దానములను స్వీకరిస్తున్నాడు.<br>ప్రాణమును పోషించటం కోసమే చావు భయమున్నచోట్లకు కూడా (సంపద కొరకై) ఇంకొకడు పోవుచున్నాడు.<br>వెళ్ళకూడదనుకున్న చోట్లకు కూడా ప్రాణము పై తీపిచేతనే జనులు వెళ్ళుచున్నారు. ప్రాణము యొక్క ప్రీతికొరకే ఒకడు కామములు (కోరికలు) కలిగి ఉంటున్నాడు. **'నీవంటే నాకు ప్రాణము'** అని ఇష్టమైనవారి గురించి జనులు పలుకుచున్నారు కదా। |
| ప్రాణో వై, సమ్రాట్!<br>పరమం బ్రహ్మ। నైనం ప్రాణో జహాతి।<br>సర్వాణి ఏనం భూతాని అభిక్షరన్తి।<br>దేవో భూత్వా దేవాన్ అప్యేతి।<br>య ఏవం విద్వాన్ ఏతత్ ఉపాస్తే। | అన్నిటికంటే ప్రియమైనది ప్రాణము. "ప్రాణమే పరబ్రహ్మము" - అని ఎవ్వడు ప్రాణమును పరబ్రహ్మముగా ఉపాసిస్తాడో, ఆతనిని ఆతని ప్రాణము- విడచి ఎటూ వెళ్ళదు!<br>ప్రాణమును పరబ్రహ్మముగా ఉపాసించుచున్నవానితో సర్వభూతములు ప్రేమగా ఉంటాయి. (తల్లి బిడ్డను రక్షించుకొనుచున్నట్లు) ఆతనిని సర్వభూతమములు రక్షించుకుంటూ ఉంటాయి.<br>ప్రాణబ్రహ్మోపాసన చేయువాడు దేవతా స్వరూపుడై దైవలోకమును ప్రవేశించుచున్నాడు.<br>ప్రాణమును అధిబ్రహ్మముగా భావించి ప్రాణోపాసన చేయువానిని వేద-వేదాంగములు తెలిసినవారు కూడా ఉపాసిస్తున్నారు. |
| జనకుడు : హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి ఇతి।<br>– హోవాచ జనకః వైదేహః। | జనకుడు: చక్కగా చెప్పారు. ఏనుగువంటి యుక్తవయస్సులోని '1000' ఆవులను మీకు సమర్పించుకొనుచున్నాను. స్వీకరించండి! |
| సహోవాచ యాజ్ఞవల్క్యః : పితా మే<br>అమన్యత, నాననుశిష్య హరేత ఇతి।<br>(నాననుశిష్య హరేతేతి)। | **యాజ్ఞవల్క్యుడు** : అయ్యా! క్షమించాలి! శిష్యుని పూర్తిగా కృతార్థుని చేయకుండా శిష్యుని వద్దనుండి 'దక్షిణ'ను స్పృశించరాదని మా తండ్రిగారి నిర్ణయము - అని చెప్పాను కదా!<br>నేను ఇంకా కూడా అట్లే నిర్ణయము కలిగి ఉంటున్నాను. **('ప్రాణము మాత్రమే బ్రహ్మము' అనునది బ్రహ్మముయొక్క సంపూర్ణ నిర్వచనము కాదు).** |
| **4.** యాజ్ఞవల్క్యుడు : యదేవ తే కశ్చిత్<br>అబ్రవీత్, తత్ శృణవామి ఏత్య। | **యాజ్ఞవల్క్యుడు** : ఓ మహాత్మా! జనకమహారాజా! ఇంకెవరైనా ఆచార్యులు మరింకేమైనా విశేషముగా బ్రహ్మము గురించి సూత్రీకరించి చెప్పటం జరిగిందా? అయితే అదేమో చెప్పండి. నేను వింటాను. |

| | |
|---|---|
| <u>జనకుడు</u> : బ్రవీత్ మే బర్కుర్వార్వరష్ణః,<br>"చక్షుర్వై బ్రహ్మేతి"। (చక్షుః వై బ్రహ్మ-ఇతి)। | **జనకుడు** : బర్కుని కుమారుడు బర్కు-ర్వార్ష్ణుడు, అనే పేరుగల ఆచార్యులు మరొకమాట అన్నారు. **"చక్షుర్వైర్‌ష్ణ బ్రహ్మేతి। కనులు (చూపు)యే బ్రహ్మము"** - అని. |
| యథా మాతృమాన్,<br>పితృమాన్, ఆచార్యవాన్।<br>బ్రూయాత్, తథా తత్ వార్ష్ణో అబ్రవీత్! | తల్లిదండ్రులు, గురువులు చెప్పినదే వల్లెవేసినతీరుగా ఆ వార్‌ష్ణువు (బర్కాచార్యులు) చెప్పటం జరిగింది. |
| <u>యాజ్ఞవల్క్యుడు</u> : చక్షుర్వై బ్రహ్మేతి। | **యాజ్ఞవల్క్యుడు : "చూపు బ్రహ్మమే"**...అని పలకటం ఉచితమే. |
| అపశ్యతో హి కిగ్ంస్యాత్<br>ఇతి బ్రవీత్-తు,<br>-తే తస్య ఆయతనం ప్రతిష్ఠా? | బ్రహ్మము యొక్క దేహమే **'చూపు'**, (మరియు) **'కబడేదంతా'** - అని కూడా ఆయన వివరించి ఉంటారు కదా!<br>ఎందుకంటే చూపులేనివాడు ఏదీ కూడా చూడలేడు కదా! అందుకే ఆయన అట్లా అని ఉంటారు. మంచిదే! అయితే ఆ చూపు ఎందులో జనించి - చరించి, లయిస్తోంది? దేనియందు చూపు ప్రతిష్ఠితమై ఉన్నది? ఈ విషయము ఆయన చర్చించారా? లేదా? |
| <u>జనకుడు</u> : న మే, అబ్రవీత్ ఇతి।<br><u>యాజ్ఞవల్క్యుడు</u> : ఏక పాద్వా, ఏతత్, సమ్రాట్! ఇతి। | **జనకమహారాజు** : లేదు ఆ బర్కాచార్యులవారు అంతకుమించి **"చూపు జనించి - లయించు స్థానము"** గురించి ఏమాత్రము చర్చించలేదు.<br>**యాజ్ఞవల్క్యుడు** : అయితే ఆయన బ్రహ్మము గురించిన నాలుగింటిలో ఒకవంతు మాత్రమే చెప్పినట్లు అవుతుంది. |
| <u>జనకుడు</u> : స వై నో బ్రూహి। | **జనకమహారాజు** : అట్లాగా? మరి, ఆతడు చెప్పి ఉండవలసిన **"బ్రహ్మము యొక్క పూర్ణార్థము"** ఏమిటో దయతో మీరు వివరించండి. |
| <u>యాజ్ఞవల్క్య</u> :<br>"చక్షుః" ఏవ ఆయతనం ఆకాశః।<br>ప్రతిష్ఠా సత్యమితి।<br>ఏనత్ ఉపాసీత। | **యాజ్ఞవల్క్యుడు** : బ్రహ్మమునకు నేత్రము (లేక) చూపు శరీరమై యున్నది. అట్టి చూపు దేనిని ఆశ్రయించి ఉన్నది? అవ్యాకృత ఆకాశము నందు ప్రతిష్ఠమై (స్థానము కలిగినదై) ఉన్నది. అందుచేత ఈ 'చూపు'ను **సత్యమగు బ్రహ్మముగా ధ్యానించాలి.**<br>**"చూచువాడు + చూపు + చూడబడునది"** - ఈ మూడిటి ఏకత్వమును సత్యముగా ఉపాసించాలి. చూపుయే చూడబడుచున్న రూపముకూడా. |
| <u>జనకుడు</u> : కా సత్యతా? | **జనకమహారాజు** : సత్యము అనగానేమి? (లేక) ఏది సత్యము? యజ్ఞవల్క్య భగవన్! చెప్పండి. |
| <u>యాజ్ఞవల్క్య</u> : 'చక్షుః' ఏవ, సమ్రాట్! ఇతి।<br>హోవాచ। చక్షషా వై సమ్రాట్ -<br>పశ్యన్తమ్ ఆహు అద్రాక్షీః ఇతి।<br>స ఆహా (అ)ద్రాక్షమితి। తత్ సత్యం భవతి।<br>చక్షుః వై, సమ్రాట్!, పరమం<br>బ్రహ్మనైనం చక్షుః అహాతి। (చక్షురహాతి)।<br>సర్వాణి ఏనం భూతాని అభిక్షరన్తి।<br>దేవో భూత్వా దేవాన్ అప్యేతి,<br>య ఏవం, విద్వాన్ ఏతత్ ఉపాస్తే। | **యాజ్ఞవల్క్యుడు** : హే సమ్రాట్! వినండి. చూపు సత్యమే. ఎందుకంటారా? ఒకనిని 'నీవు ఆ గోడను చూచితివా?" అని అడిగితే "ఆ! ఆ గోడను చూచితిని!"...అని అన్నాడనుకోండి. గోడ కనబడటం వాస్తవమే అయినప్పుడు చూపువాస్తవమే కదా!<br>ఈ చూపుతో చూడబడేది వాస్తవమేకదా! కనుక చూపు సత్యమే। సత్యమైనది పరబ్రహ్మమే। ఎవ్వడేతై **చూపును,** (The seeing) **(మరియు) ఏది చూచుచున్నదో అద్దానిని** (The seer) **బ్రహ్మముగా ఉపాసిస్తాడో, ఆతనిని చూపు ఎన్నడూ విడువడు.** అట్లు బ్రహ్మమును ఉపాసించువానిని సర్వభూతములు (జీవుడు) ఉపాసనాభావంతో ప్రేమాస్పదముగా చూస్తారు. ఎందుకంటే జీవులంతా పరబ్రహ్మస్వరూపులే కాబట్టి!<br>జీవులందరిలోని చూపును పరబ్రహ్మముగా భావించి ఉపాసించువాడు దేవతా దివ్యరూపుడై దేవలోకమునందు ప్రవేశించుచున్నాడు. **బ్రహ్మమును ఎరిగి, బ్రహ్మము నందు ప్రవేశించి, బ్రహ్మమే తానగుచున్నాడు.** |

| | |
|---|---|
| <u>జనకుడు:</u> హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి ఇతి। హోవాచ – జనకో వైదేహః । | జనకమహారాజు : అయ్యా! యాజ్ఞవల్క్యా! చాలా చక్కగా చెప్పారు. ఇప్పుడిక ఏనుగువంటి ఆకారములో యౌవనములో ఉన్న '1000' గోవులను సమర్పిస్తున్నాను. స్వీకరించండి. |
| సహ ఉవాచ యాజ్ఞవల్క్యః। <u>యాజ్ఞవల్క్యుడు :</u> పితా మే అమన్యత నాననుశిష్య హరేతేతి॥ | యాజ్ఞవల్క్యుడు : జనక మహారాజా! విదేహ దేశ చక్రవర్తీ! "శిష్యునియందు పరమ సత్యమును పూర్తిగా ప్రతిక్షేపించకుండా, కృతార్థునిగా చేయకుండా దక్షిణ తీసుకోకూడదు" అను - మా పితృదేవుల ఆజ్ఞ పాలిస్తున్నాను. ("నేత్రము మాత్రమే బ్రహ్మము" అనునది - బ్రహ్మముయొక్క సంపూర్ణార్థము కాదు). |
| **5.** యదేవ తే కశ్చిత్ అబ్రవీత్, తత్ శృణవామ–ఇతి। | **యాజ్ఞవల్క్యుడు :** ఇంకెవరైనా ఆచార్యులు వచ్చి 'బ్రహ్మము' గురించి ఇంకేమైనా చెప్పారా? అది ఇంకా ఏమైనా ఉంటే వినిపించండి! |
| <u>జనకుడు :</u> అబ్రవీత్ మే గర్దభీవిపీతో భారద్వాజః <u>"శ్రోత్రం వై బ్రహ్మేతి",</u> యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ బ్రూయాత్, తథా తత్ భారద్వాజో అబ్రవీత్। | **జనకుడు :** అవును. మరొకసారి భరద్వాజ గోత్రీకుడు, భరద్వాజమహర్షి వంశీయుడు గర్దభివిపీతముని తల్లి-తండ్రి-గురువుల వద్ద పఠించి వల్లించిన తీరుగా (సభకు వచ్చినప్పుడు), బ్రహ్మము గురించి, **"అయ్యా! మహనీయులగు ఆత్మజ్ఞులు చెప్పుచుండగా మాత్రమే... బ్రహ్మభావన శిష్యుడగు శ్రోతలో సిద్ధిస్తోంది కనుక శ్రవణము** (Hearing) **(చెవులు +వినికిడి) యే బ్రహ్మము। ఇది సత్యము" అని పలికినారు.** ఆ విషయమే ఆ మునివర్యుడు అనేక దృష్టాంతాలలో చెప్పుకొంటూ వచ్చారు. |
| <u>యాజ్ఞవల్క్యుడు : శ్రోత్రం వై బ్రహ్మేతి।</u> అశృణ్వతో హి కిగ్ంస్యాత్ ఇతి అబ్రవీత్ తు తే తస్య ఆయతనం ప్రతిష్ఠాం? | యాజ్ఞవల్క్యుడు : అవును. వినటము చేతనే బ్రహ్మము తెలియవచ్చు చున్నది. అనుభవజ్ఞులు అంతరంగ సాక్షిని ఎలిగెత్తి వినిపించున్నారు. శ్రుతులు రూపంగా మనకు తెలియవచ్చుచున్నది. అయితే ఆ 'వినికిడి' ఎందులో ప్రతిష్ఠితమైయున్నది? ఈ శ్రోతము (వినికిడి) దేనికి శరీరము? ఆ విషయం బోధించారా? |
| <u>జనకుడు :</u> న మే అబ్రవీత్ ఇతి। | జనకమహారాజు : అద్దాని గురించి ఆయన మాట్లాడలేదు. |
| <u>యాజ్ఞవల్క్యుడు :</u> ఏక పాద్వా ఏతత్, సమ్రాట్! ఇతి। | యాజ్ఞవల్క్యుడు : సమ్రాట్! ఆయన చెప్పింది బ్రహ్మము గురించిన నాలుగింటిలో ఒక పాదమునకు పరిమితము మాత్రమే. |
| <u>జనకుడు :</u> స వై నో బ్రూహి। యాజ్ఞవల్క్య! | జనకమహారాజు : మిగతా వివరాలు దయయుంచి నాకు మీరు చెప్పండి! |
| <u>యాజ్ఞవల్క్యుడు :</u> శ్రోత్రమేవ ఆయతనం ఆకాశంః। ప్రతిష్ఠాని అనన్తో – ఇతి ఏనత్ ఉపాసీత। | యాజ్ఞవల్క్యుడు : శ్రోత్రము (వినికిడి) బ్రహ్మమునకు శరీరము అయి ఉన్నది. అవ్యాకృతాకాశమే ఆ శ్రోత్రమునకు **జనన - స్థితి - లయ స్థానమై ఉన్నది.** ఈ నాలుగవ భావమగు శ్రోత్రము (వినికిడి)ను **బ్రహ్మముగా** ఉపాసించాలి. **శ్రవణమంతా (వినబడేదంతా) బ్రహ్మము నందు ప్రతిష్ఠితమైనట్లు భావించాలి.** అనన్తముగా ఉపాసించాలి! |
| <u>జనకుడు :</u> కా అనన్తతా? | జనకుడు : శ్రోత్రమును **'అనన్తము'**గా ఉపాసించటము అనగా? |
| <u>యాజ్ఞవల్క్యుడు :</u> దిశ ఏవ, సమ్రాట్! ఇతి। | యాజ్ఞవల్క్యుడు : **దిక్కులలో వినికిడి జనిస్తోంది.** దిక్కులు అనన్త రూపములై ఉన్నాయి. |
| హోవాచ । తస్మాత్ వై, సమ్రాట్! అపి యాం కాం చ దిశం గచ్ఛతి, నైవ అస్యా అన్తం గచ్ఛతి। | ఎందుకంటే ఒకడు **"ఈ దృశ్యము యొక్క అన్తమేమి"** ...అని పరిశీలించటానికై తూర్పు-పడమర ఇత్యాది దిక్కులో ప్రయాణించినా కూడా, వాటి వాటి అన్తము లభించదు. ఆతడు సృష్టియొక్క అన్తమును చేరజాలడు. |

| | |
|---|---|
| అనన్తా హి దిశో। దిశో వై, సమ్రాట్!<br>శ్రోతగ్ం। శ్రోత్రం వై-<br>సమ్రాట్!, పరమం బ్రహ్మ।<br>వైనగ్ం శ్రోత్రం జహాతి సర్వాణ్యేనం<br>భూతాని అభిక్షరన్తి।<br>దేవో భూత్వా దేవానప్యేతి,<br>య ఏవం విద్వాన్ ఏతత్ ఉపాస్తే। | అందుచేత, దిశదిశలుగా వ్యాప్తించియున్న శ్రోతము కూడా అనంతము. అనంతము కాబట్టి పరబ్రహ్మత్వము వహించి ఉన్నది. ఎవ్వరైతే **శ్రోత్రమును అనన్తమగు పరబ్రహ్మముగా ఉపాసిస్తారో,** ఆతనిని ఆ వినికిడి శక్తి విడువక సర్వదా సేవిస్తూనే ఉంటుంది. **శబ్దతత్త్వమంతా ఆత్మయందే అధిష్ఠితమై ఉన్నదని ఉపాసించువానిని సర్వభూతజాలము తమ ప్రియవస్తువువలె భావించి ప్రేమిస్తాయి.** ఆతడు దేవతా స్వరూపుడై శబ్దతత్త్వమును ఎరిగి ఉపాసించటముచే విద్వాంసుడుగా కీర్తించబడతాడు. |
| జనకుడు : హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి ఇతి।<br>– హోవాచ : జనకో వైదేహః। | జనకుడు : అయ్యా చక్కటి సమాధానం చెప్పారు. ఇదిగో! నేను సిద్ధము చేసియే ఉండి - సమర్పించుకుంటానన్న, ఏనుగువలె దృఢముగా యుక్తవయసులో ఉన్న - వేయి గోవులను ఇప్పటికైనా స్వీకరించండి. |
| స హోవాచ యాజ్ఞవల్క్యః।<br>యాజ్ఞవల్క్యుడు : పితా మే అమన్యత నాననుశిష్య<br>(న అనుశిష్య) హరేతేతి। | **యాజ్ఞవల్క్యుడు :** ఇప్పటికీ స్వీకరించలేను. నా పితృదేవుల నియమానుసారం శిష్యుడు కృతార్థుడు కాకుండా 'దక్షిణ' స్వీకరించరాదను నియమము నేను కూడా అనుసరిస్తున్నానే మరి! (ఇంతవరకు చెప్పుకొన్నది ఇంకాకూడా బ్రహ్మముయొక్క పూర్ణార్థము కాదు). |
| 6. యాజ్ఞవల్క్యుడు : య దేవ తే కశ్చిత్ అబ్రవీత్,<br>తత్ శృణవామేతి। | యాజ్ఞవల్క్యుడు : జనక మహారాజా! ఇంకా కూడా ఎవరన్నా ఆచార్యులు బ్రహ్మము గురించి మీకు నిర్వచించి చెప్పటము జరిగిందా? చెప్పండి! వింటాను! |
| జనకుడు : అబ్రవీత్ మే సత్యకామో జాబాలో,<br>"మనో వై బ్రహ్మేతి।"<br>యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్,<br>బ్రూయాత్, తథా తత్ జాబాలో అబ్రవీత్ । | జనకుడు : ఔను! మరొక ఆచార్యులవారు చెప్పినది వినండి. ఒక రోజు సత్యకామ జాబాలుడు వేంచేశారు. వారు **'మనస్సే బ్రహ్మము'**- అని వివరించారు. వారి తల్లి - తండ్రి - గురువు చెప్పినది వల్లెవేస్తున్న తీరుగా పలికారు. |
| యాజ్ఞవల్క్యుడు : మనో వై బ్రహ్మేతి।<br>అమనసో హి కిగ్ంస్యాత్<br>ఇతి అబ్రవీత్ తు,<br>తే తస్య ఆయతనం ప్రతిష్ఠాం? | **మనస్సే బ్రహ్మము. మనస్సు లేకపోతే ఎవ్వడేం చేయుగలడు? మనస్సువాలితే కదా, ఏదైనా తెలియవచ్చేది!"**<br>మనస్సే బ్రహ్మమని సోదాహరణంగా సత్యకామ ఆచార్యులవారు చెప్పి ఉంటారు. అది నిజమే।<br>అవును. మనస్సే ఉండకపోతే అనుభవం ఎక్కడిది? అనుభవమే లేకపోతే బ్రహ్మము తెలియవచ్చేది ఎట్లా? అది సరే! ఆ మనస్సు **ఏద్దానికి శరీరమో,** మనస్సు అనేది **ఎక్కడ ప్రతిష్ఠితమై యున్నదో....** అది చెప్పారా? లేదా? |
| జనకుడు : న మే అబ్రవీత్ ఇతి।<br>యాజ్ఞవల్క్యుడు : ఏక పాద్వా ఏతత్ సమ్రాట్! ఇతి।<br>జనకుడు : స వై నః బ్రూహి యాజ్ఞవల్క్య! | జనకుడు : ఆ విషయం ఆయన చెప్పనే లేదే!<br>యాజ్ఞవల్క్యుడు : అయితే చతుష్పాదంలో ఒక పాదమే చెప్పినట్లు అవుతుంది సుమా!<br>జనకుడు : తక్కిన విశేషమేమిటో మనోబ్రహ్మము గురించి చెప్పండి. |
| యాజ్ఞవల్క్యుడు : మన ఏవ ఆయతనం ఆకాశః-<br>ప్రతిష్ఠా ఆనన్ద ఇతి। ఏనత్ ఉపాసీత। | **యాజ్ఞవల్క్యుడు : "మనస్సు ఆనందస్వరూపమగు బ్రహ్మముయొక్క శరీరమే. మనస్సు బ్రహ్మమునందే (జలంలో తరంగంలాగా) జనిస్తోంది, లయిస్తోంది!"** - అను దృష్టి, భావనలచే మనస్సును బ్రహ్మముగా ఉపాసించాలి. (అద్దము లాగానే మనస్సు కూడా "అన్నీ కలిగి ఉండి, ఏమీ లేనిదై ఉంటోంది). |
| జనకుడు : కా ఆనన్దతా? | జనకుడు : స్వామీ! ఈ మనస్సు ఆనంద రూపమగు బ్రహ్మమేనని మనము ఎట్లా నిర్ణయించుకోగలము? (జీవుడు మనస్సుచే దుఃఖము, బంధము పొందుచున్నాడు కదా!) |

| | |
|---|---|
| **యాజ్ఞవల్క్యః మన ఏవ,సమ్రాట్! ఇతి।**<br>**హోవాచ। మనసా వై, సమ్రాట్! స్త్రియం**<br>**అభిహార్యతే। తస్యాం ప్రతిరూపః పుత్రో జాయతే।**<br>**స ఆనన్దో మనో వై, సమ్రాట్!** | **యాజ్ఞవల్క్యుడు :** హే సమ్రాట్! మనస్సు చేతనే ఈ మానవుడు జాగ్రత్ స్వప్న సుషుప్త త్రిదశలు పొందుచున్నాడు. స్త్రీవాంఛ కలిగి ఉంటున్నాడు. తద్వారా తన ప్రతిరూపమగు పుత్రుని పొందుచున్నాడు. ఆతనివలన మనస్సు మరింత ఆనందము పొందుచున్నది. మనస్సు ఆనందరూపమే. **'మనస్సు దేనిదేనిని ఇష్టపడుతోంది?"...** అనునది ఆ ప్రక్కనబెట్టి, **'మనస్సు సహజ రూపంగా ఆనందరూపమగు బ్రహ్మమే!"....** అని ఉపాసించెదవు గాక! (కేవలమగు మనస్సు). |
| **సమ్రాట్! పరమం బ్రహ్మ నైనం,**<br>**మనో జహాతి।**<br>**సర్వాణి ఏనం భూతాని అభిక్షరన్తి।**<br>**దేవో భూత్వా దేవానపి ఏతి**<br>**య ఏవం విద్వాన్ ఏతత్ ఉపాస్తే।** | ఎవ్వరైతే మనస్సును బ్రహ్మముయొక్క అంతర్వస్తువుగాను, పరబ్రహ్మము రూపముగానూ ఉపాసిస్తారో, వారిని మనస్సు ఎన్నటికీ వీడి ఉండదు. సర్వ సహజీవులచే ఆతడు సర్వదా ప్రేమించబడుతాడు. అట్టివాడు దివ్యత్వము పొంది దేవతాలోకము ప్రవేశించుచున్నాడు.<br>ఎవ్వడు మనస్సును బ్రహ్మముగా ఉపాసిస్తాడో, ఆతడు తెలుసుకొనవలసినది తెలుసుకొన్న విద్వాంసుడు. |
| **<u>జనకుడు</u> : హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి।**<br>**–ఇతి హోవాచ జనకః వైదేహః।** | **జనకుడు :** అయ్యా! యాజ్ఞవల్క్యా! మీ సమాధానము నాకు సంతోషము కలుగజేస్తోంది. ఇక ఇప్పటికైనా నేను 'దక్షిణ'గా సమర్పిస్తున్న ఏనుగువలె ఎత్తైన - వయస్సులో ఉన్న వేయి (1000) ఋషభములను (ఎద్దులను) స్వీకరించండి. |
| **స హోవాచ యాజ్ఞవల్క్యః।**<br>**<u>యాజ్ఞవల్క్యుడు</u> : పితా మే అమన్యత నాననుశిష్య**<br>**(న అనుశిష్య) హరేతేతి।** | **యాజ్ఞవల్క్యుడు :** లేదు. శిష్యుడు కృతార్థుడు కాకుండా దక్షిణ స్వీకరిస్తే అది నా తండ్రిగారి అభిమతమును అనుసరించినదై ఉండదు. ("మనస్సు బ్రహ్మము" అనునది బ్రహ్మము గురించిన సమగ్రమైన బోధ కాదు). |
| **7. <u>యాజ్ఞవల్క్యుడు</u> : యదేవ తే కశ్చిత్**<br>**అబ్రవీత్, తత్ శృణవామ ఏతి।** | **యాజ్ఞవల్క్యుడు :** హే జనకచక్రవర్తీ! ఇంకా కూడా చెప్పండి. ఇంకెవ్వరైనా ఆచార్యులు వచ్చి **'బ్రహ్మము ఏదై ఉన్నది?'** అనే విషయంలో ఇంకేమైనా చెప్పటం జరిగిందా, వింటాను? |
| **<u>జనకుడు</u> : అబ్రవీత్ మే విదగ్ధః శాకల్యో,**<br>**<u>"హృదయం వై బ్రహ్మేతి।"</u>**<br>**యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్**<br>**బ్రూయాత్, తథా తత్ శాకల్యో అబ్రవీత్।** | **జనకమహారాజు :** శకల్యుని కుమారుడైనటువంటి శాకల్య విదగ్ధుడు అనే ఆచార్యులవారు వచ్చారు. ఆయన **'హృదయమే బ్రహ్మము'** అని సిద్ధాంతముగా వివరించారు.<br>తన తల్లి, దండ్రి, గురువులు ఏవిధంగా వివరించారో....అదంతా ఆయన వర్ణించుకుంటూ వచ్చారు. |
| **<u>యాజ్ఞవల్క్యుడు</u> : హృదయం వై బ్రహ్మేతి।**<br>**య హృదయస్య హి కిగ్ంస్యాత్,**<br>**ఇతి అబ్రవీత్తు। తే తస్య ఆయతనం ప్రతిష్ఠాం?** | **యాజ్ఞవల్క్యుడు :** అవును. హృదయము బ్రహ్మమే కదా! హృదయము లేనివాడు ఏదీ తెలుసుకోలేడు. బాగానే ఉన్నది. ఆ హృదయము పరబ్రహ్మముయొక్క శరీరమేనని కూడా చెప్పారా? హృదయము ఎద్దాని యందు ఉనికి కలిగి ఉంటోందో, అది కూడా వివరించారా? |
| **<u>జనకుడు</u> : న మే, అబ్రవీత్। – ఇతి।** | **జనకమహారాజు :** లేదు! "హృదయము ఎద్దానియందున్నది?" - అనే ప్రతిష్ఠ-విషయం ఆయన స్పృశించనేలేదు. |
| **<u>యాజ్ఞవల్క్యుడు</u> : ఏక పాద్వా ఏతత్, సమ్రాట్! ఇతి।**<br>**<u>జనకుడు</u> : స వై నో బ్రూహి।** | **యాజ్ఞవల్క్యుడు :** అట్లా అయితే ఆయన నాలుగిటిలో ఒక్క పాదము గురించే మాట్లాడినట్లు అవుతుంది కదా మరి?<br>**జనకమహారాజు :** అదంతా మీరు దయతో వివరించండి. |
| **<u>యాజ్ఞవల్క్యః</u> హృదయం ఏవ ఆయతనం।**<br>**ఆకాశః ప్రతిష్ఠా। స్థితిః।**<br>**ఇతి ఏనత్ ఉపాసీత।** | **యాజ్ఞవల్క్యుడు :** హృదయమే బ్రహ్మమునకు శరీరము. హృదయము ఆత్మాకాశమునందు ప్రతిష్ఠితమైయున్నది. హృదయమును బ్రహ్మము గాను, బ్రహ్మము యొక్క సంప్రదర్శనముగాను ఉపాసించబడు గాక! బ్రహ్మమునందే హృదయము తనయొక్క స్థితి, స్థానము కలిగి ఉన్నది. |

| | |
|---|---|
| జనకుడు : కా స్థితతా? | జనకుడు : 'హృదయముయొక్క స్థితి' అనగా మీ ఉద్దేశ్యము ఏమి? |
| యాజ్ఞవల్క్య : హృదయమేవ, సమ్రాట్! ఇతి।<br>హోవాచ, –<br>హృదయం వై, సమ్రాట్!<br>సర్వేషాం భూతానాం అయతనగ్ం।<br>హృదయగ్ం వై, సమ్రాట్!<br>సర్వేషాం భూతానాం ప్రతిష్ఠా। | యాజ్ఞవల్క్యుడు : హే సమ్రాట్! హృదయమే స్థితి। హృదయమే సర్వభూతములకు సర్వ లోకములకు ఆశ్రయము - అయి ఉన్నది.<br>సర్వభూతజాలము, సర్వతత్త్వములు, సర్వదేవతలు, సర్వదృష్టులు, సర్వద్రష్టలు, సర్వదృశ్యములు... ఇవన్నీ **హృదయమునందే** ప్రతిష్ఠితమై ఉన్నాయి. అందుచేత హృదయము బ్రహ్మమే. అయితే, **హృదయము పరబ్రహ్మమునందే సమస్త జీవుల రూపంగా ప్రతిష్ఠితమై ఉన్నది.** |
| హృదయేహి ఏవ, సమ్రాట్!<br>సర్వాణి భూతాని ప్రతిష్ఠితాని భవన్తి।<br>హృదయం వై, సమ్రాట్!<br>పరమం బ్రహ్మ నైనగ్ం హృదయం జహాతి।<br>సర్వాణి ఏనం భూతాని అభిక్షరన్తి,<br>దేవో భూత్వా, దేవానపి ఏతి య ఏవం విద్వాన్,<br>ఏతత్ ఉపాస్తే। | **పరబ్రహ్మమే హృదయముగా ఉన్నది.** సర్వ జీవులు తనయందే గల హృదయమును పరబ్రహ్మముగా ఎవ్వరు ఉపాసిస్తున్నారో, అట్టి వారిని హృదయము ఎన్నటికీ వీడదు! అట్టివాడు దివ్యస్వరూపుడై, దేవతా లోకములలో స్వయముగా ప్రవేశము పొందుచున్నాడు. అది ఎరిగినవాడు తత్ స్వరూప పరమాత్మను ఎరిగినవాడు అగుచున్నాడు. అందుచేత ఓ సమ్రాట్! బ్రహ్మమే హృదయముగా ఉన్నదని ఉపాసించబడుగాక। |
| జనకుడు : హస్త్య ఋషభగ్ం సహస్రం దదామి ఇతి।<br>హోవాచ జనకో వైదేహః। | జనకుడు : మహత్తరమగు సత్యమును చెప్పారు. దయతో 1000 గోవులను దక్షిణగా స్వీకరించండి. |
| సహ ఉవాచ యాజ్ఞవల్క్యః :<br>పితా మే, అమన్యత, 'న అనుశిష్య హరేతేతి'॥ | యాజ్ఞవల్క్యుడు : సంపూర్ణ విద్యను గ్రహించనంతవరకు మేము గోవులను దక్షిణగా స్వీకరించకూడదు. అది మా పితృ దేవుల ఆజ్ఞ. మాకు వ్రతము. |

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ –</u>
<u>"షష్ఠమాధ్యాయే – షడాచార బ్రాహ్మణం"</u>
<u>(షట్ – *6* ఆచార బ్రాహ్మణమ్)</u>
<u>– నామ ప్రథమం బ్రాహ్మణమ్–</u>

***<u>(బృహదారణ్యకోపనిషత్ - షష్ఠమ అధ్యాయము</u>***
***<u>ప్రథమ బ్రాహ్మణ - షడాచార బ్రాహ్మణమ్-ఇతి)</u>***
***<u>(షట్ – 6 ఆచార బ్రాహ్మణమ్)</u>***

# షష్ఠమాధ్యాయః - ద్వితీయం బ్రాహ్మణమ్

## కూర్చ బ్రాహ్మణము

| | |
|---|---|
| 1. జనకో హ వైదేహః<br>కూర్చాదుపావ సర్పన్ (ను) ఉవాచ :<br>నమస్తే అస్తు యాజ్ఞవల్క్య!<br>అను మా శాధీతి। | జనకమహారాజు : (సింహాసనమునుండి లేచారు. వినమ్రుడై యాజ్ఞవల్క్యుడు ఆశీనులై ఉన్న ఆసనమును సమీపించారు. భక్తితో ప్రణమిల్లారు). ఓ యాజ్ఞవల్క్య మహాత్మా! నమస్తే!<br>నాకు మరికొంతగా బ్రహ్మ విద్యను దయతో బోధించండి. |
| సహోవాచ : (యాజ్ఞవల్క్యోవాచ): యథా వై, సమ్రాట్!<br>మహాన్తమ్ అధ్వానమేష్యన్<br>రథం వా, నావం వా,<br>సమాదదీతి, ఏవమ్। | యాజ్ఞవల్క్యుడు : హే సమ్రాట్? ఒకానొకడు సుదూరంగా ఉన్న ఒక దేశమునకు వెళ్ళాలనుకున్నాడనుకోండి. రథమునో, నావనో సిద్ధము చేసుకుంటాడు కదా! అట్లాగే బ్రహ్మమును పొందువాడు ముందుగా బ్రహ్మజ్ఞానమును సంపాదించుకుంటాడు.<br>మీరు బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొనియే ఉన్నారు. మీరు పూజనీయులు. సర్వము ఎరిగినవారు. సమర్థులు, ప్రజ్ఞాసమన్వితులు. |
| ఏతాభిః ఉపనిషద్భిః సమాహితాత్మా<br>అస్యేవం బృన్దారక ఆఢ్యః।<br>సత్ న దీతి (సన్నదీత) వేద ఉక్తా। ఉపనిషత్<br>క ఇతో విముచ్యమానః?, క్వ గమిష్యసి?-ఇతి। | బ్రహ్మ జ్ఞానము కొరకై ఉపనిషత్తు చెప్పు ఆత్మవిద్యను నేర్చుకొనియే ఉన్నారు. ఆచార్యులచేత సర్వ ఉపనిషత్ విశేషాలను వ్యాఖ్యానింపజేయించి విన్నారు. వేదములు అధ్యయనము చేశారు. వేద వేదాంగవేత్తలు. మీ అంతటివారికి కొత్తగా చెప్పవలసినది ఏముంటుంది?<br>అయినా ఆత్మజ్ఞానము గురించి వినాలని కోరిక ప్రకటిస్తున్నారు కాబట్టి ఒక చిన్న ప్రశ్న వేస్తున్నాను.<br>**ఈ శరీరము విడిచిన తరువాత మీరు ఎక్కడికి పోవటము జరగనున్నది? మీకు తెలిసియే ఉన్నదా?** |
| జనకుడు : న అహం తత్, భగవన్!,<br>వేద, యత్ర గమిష్యామి ఇతి। | జనకమహారాజు : ఈ విషయము నేను ఎరిగిఉండలేదే! భగవాన్। **"దేహానంతరము నా ప్రయాణము ఎటు? ఎక్కడికి వెళ్ళుచున్నాను"**...ఈ విషయం మరికొంతగా విశదపరచండి. |
| యాజ్ఞవల్క్యుడు : అథవై తే అహం తత్ వక్ష్యామి,<br>యత్ర గమిష్యసి, ఇతి। | యాజ్ఞవల్క్యుడు : మీరు పొందగల వస్తువు ఏమిటో, (దేహానంతరము ఏమి పొందబోవుచున్నారో) అధ్యయనముగా వివరించుకుందాము. |
| జనకుడు : బ్రవీతు భగవాన్! ఇతి। | జనకమహారాజు : హే భగవాన్! దయతో నాకు బోధించండి. నేను వినుటకు సంసిద్ధుడనై ఉన్నాను. |
| 2. యాజ్ఞవల్క్యుడు : ఇన్ధో హ వై నామైష యో<br>అయం దక్షిణే అక్షన్ పురుషః।<br>తం వా ఏతమ్ ఇన్ధగ్ం సన్తమ్ 'ఇన్ద్ర',-ఇతి ఆచక్షతే।<br>పరోక్షేణైవ పరోక్ష ప్రియా<br>ఇవ హి దేవాః ప్రత్యక్ష ద్విషః। | యాజ్ఞవల్క్యుడు : ఓ జనక మహారాజా! వినండి! దివ్యశక్తి ప్రదర్శన స్వరూపులగు దేవతలు ఇంద్రియములు ప్రసాదించువారుకాబట్టి పరోక్షముగా ప్రీతికలవారుగా ఉంటున్నారు. నీ కుడి కంటిలో ఏ దేవతాపురుషుడు 'చూపు' రూపముగా ప్రకాశించుచున్నారో, ఆయనయే సూర్య మండలములో కూడా ప్రకాశించుచున్నారు. **ఆయన ఇంధనములుగా వెలుగుచున్నారు కనుక 'ఇన్ధుడు' అని పేరు.** ప్రకాశించుగుణము కలవారు కనుక కూడా 'ఇన్ద్రుడు'. ఈతడే 'జాగ్రత్ అవస్థ'లో దక్షిణ (కుడి) నేత్రమునందు ప్రకాశించు పురుషుడు ఈ జాగ్రత్‌ను వెలిగిస్తూ విశ్వుడు. (విశ్వమును అనుభూతరూపంగా వెలిగించుచున్నవారు).<br>అట్టి విశ్వమును **"ఏరుక"** అనే అగ్నిచే వెలిగించుచున్న 'విశ్వుడు'గా అగుచున్నది **ఆత్మయే!** |

| | |
|---|---|
| **3. అథ ఏతత్ వా మే (అథైతద్వామే)**<br>**అక్షిణి పురుష రూపమ్।**<br>**ఏషా అస్య పత్నీ విరాట్ ।** | ఓ జనకమహారాజా! ఇంకా వినండి.<br>- కుడికంటిలోని ప్రకాశమానుడగు పురుషుడే- **భోక్త, భర్త, ఇంద్రియపతి, అనుభవి.** (The Experiencer), **ఆ అనుభవియొక్క పత్ని (భార్య) - ఈ విరాట్ విశ్వము.** |
| **తయోః ఏష సగ్ంస్తావో య ఏషో**<br>**అంతర హృదయ ఆకాశో**<br>**అథైన యోః ఏతత్ అన్నం।**<br>**య ఏషో అంతర్హృదయే**<br>**లోహిత పిణ్డో।** | - **ధరించబడునది,** ప్రకాశమానమగుచున్నది, **'భోగించబడునది',** భరించబడునది - **ఇంద్రాణి. పత్ని. 'అన్నము' - అనికూడా అనబడుతోంది.**<br>**<u>విశ్వుడు - విశ్వమునకు</u>**<br>**"విరాట్ పురుషుడు - విరాట్"నకు స్థానము → హృదయము.**<br>అనుభవియే - జాగ్రత్తునందు **'విశ్వుడు'** అనే పేరుతో చెప్పబడుచున్నట్టి పురుషుడు. ఇది కుడి-ఎడమ కన్నులలోని స్త్రీ-పురుష దాంపత్యరూప జగత్తు! ఈ స్త్రీ పురుష ద్వంద్వరూపజగత్తునకు హృదయమునందలి మాంస పిండము యొక్క మధ్యయందున్నట్టి చిదాకాశమే పుట్టినిల్లుగా ఉంటోంది. |
| **అథైనయోః ఏతత్ ప్రావరణం ।**<br>**యదేతత్ అన్తర హృదయే**<br>**జాలకమివ। అథైనయోః ఏషా సృతిః సంచరణీ।** | **<u>జగత్ (జగత్ సంభోగరూప) అనుభవము.</u>**<br>'ఈ పిండ హృదయమునందలి పై భాగపు నాడీమార్గము'గా కూడా అనుభవమయ్యేదంతా (విశ్వము) ఏర్పడినదై ఉన్నది.<br>ఈ నాడీమార్గమే - 'జాలకము'వలె (మాయానాటకము వలె)<br>జాగ్రత్ నుండి → స్వప్నమునకు, స్వప్నమునుండి → జాగ్రత్‌కు **పోవుచూ - వచ్చుచూ ఉండుమార్గము కూడా।** |
| **ఏషా హృదయాత్ ఊర్ధ్వా**<br>**నాడీ ఉచ్చరతి**<br>**యథా కేశః**<br>**సహస్రథా భిన్న।** | తలవెంట్రుకలో వెయ్యి (1/1000) అంతటి సూక్ష్మమై **'హిత'** అను పేరుచే పిలువబడునాడులు అంతర్హృదయములో ప్రతిష్ఠితములై ఉన్నాయి. అనుభవించబడునది (That which is being Experienced) .... అనునదంతా **అన్నము** రూపముగా ఈ నాడుల నుండియే వెలువడుచున్నది. ఆ అనుభవమయ్యేదే ఈ విశ్వము. |
| **ఏవం అస్యైతా "హితా" నామ నాడ్యో**<br>**అన్తర హృదయే ప్రతిష్ఠితా భవన్తి।** | ఈ విధంగా 'హితా' అనబడునాడుల అన్తరమునగల హృదయాకాశమున ఇంద్రుడు, ఇంద్రాణి అనబడే (1) 'అనుభవము తనదైన చైతన్యము' (The Experiencer) (2) 'అనుభవరూప జగత్తు' (The Experiences) ప్రతిష్ఠితమై ఉన్నాయి. |
| **ఏతాభిర్వా ఏతదా స్రవదా స్రవతి।**<br>**తస్మాత్ ఏష ప్రవివిక్త ఆహారతర ఇవైవ భవతి,**<br>**అస్మాత్ శారీరాత్ ఆత్మనః।** | అనుభవము (The being experienced) ఈ 'హిత' నాడుల ద్వారా వెలువడుచున్నది.<br>ఆ భోక్త ఈ భౌతికదేహమునకు సంబంధించిన ఆహారముకంటే కూడా **సూక్ష్మతరమగు భావనారూప ఆహారము (అన్నము) చే ఈ 'దృశ్యము'ను పొందుచున్నాడు.**<br>- ఆత్మ - సూక్ష్మాతి సూక్ష్మములకంటే ఎంతో **ఎంతో సూక్ష్మాతి సూక్ష్మము.**<br>- ఆత్మయొక్క అనుభవరూప తత్త్వమంతా కూడా అంతే సూక్ష్మాతి సూక్ష్మము. (All that being experienced is also equally so subtle). |

| | |
|---|---|
| **4. తస్య ప్రాచీ దిక్ ప్రాఞ్చః ప్రాణా।**<br>**దక్షిణా దిక్ దక్షిణే ప్రాణాః।**<br>**ప్రతీచీ దిక్ ప్రత్యఞ్చః ప్రాణా।**<br>**ఉదీచీ దిక్ ఉదఞ్చః ప్రాణా।**<br>**ఊర్ధ్వా దిక్ ఊర్ధ్వాః ప్రాణా।**<br>**అవాచీ దిక్ అవాఞ్చః ప్రాణాః।**<br>**సర్వా దిశః సర్వే ప్రాణాః।** | - అట్టి **అమృత స్వరూపుడగు ఆత్మ పురుషుడు** అన్నివైపులా సర్వదా తనయొక్క **విస్తారమును** ఆస్వాదించుచూ ఉన్నాడు.<br>- తూర్పుదిక్కు → ఆతనికి తూర్పుప్రాణములు.<br>- దక్షిణదిక్కు → ఆతనికి దక్షిణ ప్రాణములు.<br>- పడమరదిక్కు → ఆతనికి పడమర ప్రాణములు.<br>- ఉత్తర దిక్కు → అతని ఉత్తరదిక్ ప్రాణములు,<br>- క్రింద పైన - (క్రింద- పై) ప్రాణములు అన్ని దిక్కులందు తనయొక్క ప్రాణతత్త్వముచే నింపివేసి ఉంచుతున్నది **ఆత్మయే!** నీ ఆత్మయే అన్ని ప్రాణముల రూపము. దిక్కుల సంప్రదర్శనమంతా కూడా ఆత్మపురుషునికి చెందిన సప్రాణానంద మాధుర్య విస్తారమే। ఇక్కడి సంప్రదర్శనమంతా ఆత్మకుచెందినదే! |
| **స ఏష న ఇతి న ఇతి**<br>**(నేతి-నేతి)**<br>**ఆత్మా అగృహ్యో**<br>**న హి గృహ్యతే।**<br>**అశీర్యో నహి శీర్యతే।**<br>**అసఙ్గో నహి సజ్యతే।**<br>**అసితో న వ్యథతే, న రిష్యతి।** | 'నేతి - నేతి' అని విడుచుచూ పోగా, ఏది స్వస్వరూపమునుండి విడదీయుటకు శక్యము కానిదిగాను, - దేనిచేత బంధింప అలవికానిది గాను ఉన్నదో, **అదియే - ఆత్మ।** ఆత్మ **ఏదీ స్వీకరించనిదై, సర్వముతానే అయి,** తన స్వీకారము చేతనే తదితరమంతటికి ఉనికిని ప్రసాదించునదై ఉన్నట్టిది. **'ఆత్మను నేనే'** అని తెలుసుకొన్నవాడే ఆత్మను తెలుసుకొన్న వాడు. ఆత్మ అనన్యము! ఆత్మ క్షీణించేది కాదు. దేనినీ క్షీణింపజేసేదీ కాదు!<br><br>**దేనితోనూ ఆత్మకు ఆసక్తి , సంగము లేదు. ఏదీ ఆత్మచే బంధింపబడదు. ఆత్మ నశించదు. వ్యథచెందదు.** |
| **అభయం, వై జనక!**<br>**ప్రాప్తో అసీతి!**<br>**- హోవాచ యాజ్ఞవల్క్యః ।** | ఓ జనకమహారాజా! అట్టి అభయపదమును మీరు పొందియే ఉన్నారయ్యా! **అభయంవై జనకా! ప్రాప్తో అసీతి।**<br><br>ఏది ప్రాప్తింపజేసుకొనవలసిన స్థానమో, అది మీరు ప్రాప్తింపజేసుకొన్నారను దానికి సందేహము లేదు! |
| **సహోవాచ జనకః వైదేహా:**<br>**<u>జనకుడు</u> : అభయం త్వా గచ్ఛతాత్ యాజ్ఞవల్క్య!**<br>**యో నో భగవన్।**<br>**అభయం వేదయసే।** | **విదేహ దేశ చక్రవర్తి యగు జనకుడు:**<br><br>ఓ యాజ్ఞవల్క్యా! మీరు అభయప్రదముగా పరబ్రహ్మతత్త్వమును విశదీకరించి సుస్పష్టము చేశారు. అభయప్రదులగు భగవన్! మీ బోధ చేతనే మేమంతా అభయులమగుచున్నాము. |
| **నమస్తే అస్తు। ఇమే విదేహా-**<br>**అయం అహం అస్మి 3 ఇతి।**<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠాధ్యాయే</u>**<br>**<u>'కూర్చబ్రాహ్మణమ్' నామ ద్వితీయం బ్రాహ్మణమ్।</u>** | మీరు మాకు పూజనీయులయ్యారు. **జ్ఞానముచే మా జ్ఞానమును కప్పి ఉంచిన అజ్ఞానమును తొలగించారు.** సాక్షాత్ ఆత్మజ్ఞానమునే ప్రసాదించ గలిగిన మహనీయునకు మేము ఇవ్వగల విలువైనది మా దగ్గర ఏమున్నది? ఏమీ ఉండజాలదు! మీకు నమస్కరిస్తున్నాము. ఈ విదేహారాజ్యమును మీరు యధేచ్ఛగా అనుభవించవచ్చును దయతో స్వీకరించండి. నన్ను నేను మీ సేవకొరకై సమర్పించుకుంటున్నాను.<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠాధ్యాయే</u>**<br>**<u>'కూర్చబ్రాహ్మణమ్' నామ ద్వితీయం బ్రాహ్మణమ్।</u>** |

# షష్ఠమాధ్యాయః - తృతీయం బ్రాహ్మణమ్

## జ్యోతిర్బ్రాహ్మణము

1. జనకగ్ం హ వైదేహం-
యాజ్ఞవల్క్యో జగామ।
స మేనేన వదిష్య ఇత్యథ హ।

ఒకానొకరోజు

యాజ్ఞవల్క్య మునీంద్రుడు విదేహరాజు జనకమహారాజు దర్శనార్థమై శిష్య బృందముతో సహా బయల్వెడలారు. అలా వెళ్ళుచూ **"స మేనే న వదిష్య ఇతి!"** "ఈ మాటు నేను ఆత్మవిషయమై జనకుని సమక్షములో నోరు తెరువను. వారినే పలుకనిచ్చెదనుగాక"। - అని అనుకుంటూ రాసాగారు.

---

యత్ జనకశ్చ చ వైదేహో, యాజ్ఞవల్క్యశ్చ
అగ్నిహోత్రే సముదాతే,
తస్మై హ యాజ్ఞవల్క్యో వరం దదౌ,-
-"సహ కామ ప్రశ్నం
ఏవ వవ్రేతగ్ం హాస్మై దదౌ తగ్ం",
"హ సమ్రాట్!" ఏవ పూర్వం పప్రచ్ఛ।

యాజ్ఞవల్క్యుడు జనక సభలో ప్రవేశించారు. జనకమహారాజు యాజ్ఞవల్క్యునికి సుస్వాగతము పలికి సభలో గురుపీఠముపై (గురువు సభలో కూర్చోవలసిన సభలోని ఉన్నత ఆసనముపై) ఆసీనులను చేశారు.

జనకమహారాజు లేచి నిలుచి నమస్కరించి **"గురవర్యా! మిమ్ములను ఈరోజు ఒక ప్రశ్న అడిగి మీరు చెప్పు వచనామృతముచే పునీతుణ్ణి అగుటకు వేడుకొనుచున్నాను. అనుజ్ఞ ప్రసాదించండి!"** అని పలికారు.

అది విని యాజ్ఞవల్క్యుడు తనలో - **"నేను తాత్త్విక విషయాలు ఏమీ ఉపన్యసించనని, సభలో జనకుడు గాని, తదితర జ్ఞానులుగాని చెప్తుతూ ఉంటే వినటము మాత్రమే నిర్వర్తిస్తానని అనుకున్నానే! ఇది ఏమో, ఈ జనకమహారాజు ప్రశ్న అడగుతానంటున్నారు. ఏమిటి చెయ్యటం?"** అని తలచారు.

అప్పుడు యాజ్ఞవల్క్యునికి కొంత కాలం క్రితం జరిగిన ఒక సంఘటన గుర్తుకొచ్చింది. యాజ్ఞవల్క్యుడు యజ్ఞము చేస్తూ ఉన్నారు. ఆ సందర్భంలో జనకమహారాజు యాజ్ఞవల్క్యుడు తత్త్వవిషయాలు సంభాషించు కొంటున్నారు. అప్పుడు **అగ్నిహోత్రుని విషయమై కర్మ, విధివిధానాలు వాటియొక్క తాత్త్వికార్థాలు, అగ్నిహోత్రుడు దేవతలకు ఆహూతులను జేర్చువిధి, వాటికి సంబంధించిన మంత్రముల అంతరార్థములు** - మొదలైనవి జనకమహారాజు యాజ్ఞవల్క్యుని యజ్ఞసభలో విస్తారముగా, సుస్పష్టముగా వివరించారు.

అందుకు సంతోషించిన యాజ్ఞవల్క్యుడు "ఓ జనకమహారాజా! మీరు చెప్పిన తత్త్వార్థ విశేషాలు మాకు చాలా సంతోషము కలుగజేసాయి. చాలా స్పష్టత ప్రసాదించాయి" - అని ప్రసంశించి, వరం కోరుకోమన్నారు.

అప్పుడు జనకుడు **"నేను అడిగినప్పుడు తత్త్వమును బోధించండి. ఇదే నేను కోరుకొనేది"** అని పలికాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు **"మీరు నన్ను తత్త్వశాస్త్ర సంబంధమైన విశేషాలు గాని, వివరణలుగాని, సందేహనివృత్తికై, ఎప్పుడు ఏది అడిగినా, తెలిసినంతవరకు చెప్పటానికి నేను సంసిద్ధుడను!"** అని ప్రతిజ్ఞ చేసారు. అది గుర్తు చేసుకొని-

**"అయ్యా! జనకా! అడగండి!"** అని యాజ్ఞవల్క్యుడు పలికారు.

---

2. జనకుడు: యాజ్ఞవల్క్యం! కిం జ్యోతిః
అయం పురుష, ఇతి?

జనకమహారాజు : గురువర్యా! యాజ్ఞవల్క్యా! ఒకచోట ఈ దృశ్యములో ఆయా వస్తువులు కళ్ళకు కనిపిస్తున్నాయి కదా। ఈ మానవుడు దేహ-ఇంద్రియ-మనోసంఘాతముచే చూచుట - వినుట ఇవన్నీ నిర్వర్తిస్తున్నాడు. **ఏ జ్యోతి సహాయముతో, ఏ వెలుగులో ఈ జీవుడు అన్నీ చూస్తూ, తెలుసుకుంటూ, క్రియలన్నీ నిర్వర్తిస్తున్నాడు?**

| | |
|---|---|
| యాజ్ఞవల్క్యుడు : ఆదిత్య జ్యోతిః, సమ్రాట్! ఇతి।<br>హోవాచ : ఆదిత్యేనైవ జ్యోతిషాస్తే పల్యయతే।<br>కర్మ కురుతే, విపల్యేతి। | యాజ్ఞవల్క్యుడు : హే సమ్రాట్! ఈ జీవునకు (శరీరధారికి) జ్యోతిస్సు ఆదిత్యుడే (లేక) సూర్యుడే. సూర్యుని తేజస్సు (లేక) వెలుగు చేతనే ఈ మానవుడు జగత్తులో ఇటూ అటూ సంచారాలు చేయగలుగుచున్నాడు. ఇంద్రియములతో ఆయా పనులు చేయగలుగుచున్నాడు. కనులు సూర్యకాంతిలో అన్నీ చూస్తూ ఉంటే తదితర ఇంద్రియములు కూడా ఆయా పనులు చేస్తున్నాయి. కనుక ఆదిత్యుని తేజస్సే మానవుడు కర్మలు నిర్వర్తించటానికి జ్యోతి. సూర్యుడే ఆ జ్యోతి (లేక) తేజస్సు. |
| జనకుడు : ఇత్యేవం ఏవైతత్, యాజ్ఞవల్క్య! | జనకుడు : యాజ్ఞవల్క్యా! మీ సమాధానమును నేను ఒప్పుకుంటున్నాను. |
| 3. అస్తమిత ఆదిత్యే, యాజ్ఞవల్క్య!<br>కిం జ్యోతిః ఏవ అయం పురుష ఇతి? | బ్రహ్మాజ్ఞా! యాజ్ఞవల్క్యా! అయితే మరొక సందేహం। **సూర్యుడు అస్తమించిన తరువాత అప్పుడు ఏ తేజస్సు సహాయంతో** ఈ జీవుడు పనులు (ఇంద్రియములతో) నిర్వర్తిస్తూ ఉన్నాడు? దేనితో దృశ్యమును చూడగలుగుచున్నాడు? |
| యాజ్ఞవల్క్యుడు: చన్ద్రమా ఏవ అస్య జ్యోతిః భవతి ఇతి।<br>చన్ద్రమసైవ అయం (చంద్రమస ఏవ అయం)<br>జ్యోతిష అస్తే పల్యయతే।<br>కర్మ కురుతే విపల్యేతి।<br>జనకుడు : ఇత్యేవం ఏవై తత్, యాజ్ఞవల్క్య! | యాజ్ఞవల్క్యుడు : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రుడే ఈ జీవునిపట్ల జ్యోతి అగుచున్నాడు. చంద్రుని కాంతిలో ఈతడు కూర్చోవటము, పల్యంకము (సంచరించటము), చూడటము, మొదలైనవన్నీ చేస్తున్నాడు. వస్తువులను గుర్తించటము...ఇవన్నీ నిర్వర్తించ గలుగుచున్నాడు.<br>**(పల్యంకము** = మంచము, **పల్యత** = మంచముపై కూర్చోవటము)<br>జనకమహారాజు : స్వామీ! సరే! ఇదీ ఒప్పుకుంటున్నాను. |
| 4. అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య!<br>చన్ద్రమస అస్తమితే, కిం జ్యోతిః<br>ఏవ అయం పురుష ఇతి? | జనకమహారాజు : **సూర్యుడు-చంద్రుడు ఉభయులు అస్తమించినప్పుడు ఏ జ్యోతియందు** ఈ జీవుడు (పురుషుడు) ఇంద్రియ వ్యాపారములు నిర్వర్తిస్తున్నాడు. |
| యాజ్ఞవల్క్యుడు: "అగ్నిః" ఏవ అస్య జ్యోతిః భవతి ఇతి।<br>అగ్నినైవ అయం జ్యోతిష అస్తే పల్యయతే।<br>కర్మ కురుతే। విపల్యేతి। | యాజ్ఞవల్క్యుడు : **సూర్యుడు - చంద్రుడు కూడా అస్తమించియున్న సమయములో** ఈ పురుషునిపట్ల 'అగ్ని'యే జ్యోతి స్వరూపమై ఉంటోంది.<br>'అగ్ని' అనే జ్యోతి సహకారము చేతనే (మంచము) కూర్చోవటం, నిలుచోవటం, నడవటము, చూడటము మొదలైనవన్నీ ఈ పురుషుడు నిర్వర్తించ గలగటం జరుగుతోంది. (దీపపు కాంతిలో అన్నీ చూస్తున్నాడు). |
| జనకుడు : ఇత్యేవం ఏవైతత్, యాజ్ఞవల్క్య! | జనకమహారాజు : ఔను! ఒప్పుకుంటున్నను. |
| 5. జనకుడు : అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య!<br>చన్ద్రమస అస్తమితే, శాన్తే అగ్నౌ, –<br>–కిం జ్యోతిః ఏవ అయం పురుష ఇతి?<br>యాజ్ఞవల్క్యుడు : "వాక్" ఏవ అస్య జ్యోతిః భవతి। ఇతి।<br>'వాచ' ఏవ అయం, 'జ్యోతిష' అస్తే పల్యయతే।<br>కర్మ కురుతే। విపల్యేతి। ఇతి।<br>తస్మాత్ వై సమ్రాట్!<br>అపి యత్ర స్వః పాణిః న వినిరాయతే<br>అథ యత్ర వాక్ ఉచ్చరతి ఉపైవ తత్ర అన్యేతి। | జనకమహారాజు : సరే! ఇప్పుడు సూర్యచంద్రులు అస్తమించిన తరువాత, అగ్ని శాంతించినప్పుడు (దీపము లేనప్పుడు) **ఏ జ్యోతి చేత ఈ పురుషుడు (జీవుడు) వ్యవహారశీలుడు కాగలుగుచున్నాడు?**<br>యాజ్ఞవల్క్యుడు: వాక్కు (లేక) శబ్దము ఆతనిపట్ల సహకరించు ఉపకరణ మగుచున్నది. జ్యోతి అగుచున్నది. వాక్ సహాయముతో ఈ పురుషుడు ప్రవర్తించగలుగుచున్నాడు. తిరుగగలుగుచున్నాడు. కర్మలు నిర్వర్తిస్తున్నాడు. అటు ఇటు తిరిగివచ్చుచున్నాడు.<br>అందుచేతనే ఓ సమ్రాట్!<br>ఎక్కడకు చేతులు వెళ్ళలేవో, చేతులతో తెలియబడదో,..... అక్కడ వాక్కు ఉచ్చరించబడుటచే ఆతడు ఆ వాక్కుకు (పిలుపుకు) స్పందించి శబ్దమునుబట్టి నడుచుకుంటూ వెళ్లగలుగుచున్నాడు. |
| జనకుడు : ఇత్యేవమ్ ఏవైతత్ యాజ్ఞవల్క్య! | జనకమహారాజు : మీరు చెప్పింది యుక్తియుక్తమే! |

| | |
|---|---|
| **6. జనకుడు : అస్తమిత ఆదిత్యే, యాజ్ఞవల్క్య!**<br>**చన్ద్రమస అస్తమితే, శాన్తే అగ్నౌ,**<br>**శాన్తాయాం వాచి,**<br>**కిం జ్యోతిః ఏవ అయం పురుష ఇతి?**<br>**యాజ్ఞవల్క్యుడు : 'ఆత్మ' ఏవ (ఆత్మైవ)**<br>**అస్య జ్యోతిః భవతి, ఇతి।**<br>**ఆత్మనైవ అయం 'జ్యోతిష' అస్తే।**<br>**పల్యయతే। కర్మ కురుతే। విపల్యేతి ఇతి।** | జనకుడు : యాజ్ఞవల్క్యా! **సూర్య-చంద్ర-అగ్ని-వాక్కులు కూడా లేని సందర్భములలో** ఈ జీవుడు **ఏ జ్యోతియందు ఆయా క్రియలన్నీ** నిర్వర్తిస్తున్నాడు. అప్పటికీ ఈతనికి తోడుగా ఉంటున్న జ్యోతి ఏది?<br>**యాజ్ఞవల్క్యుడు** : మీరు అడుగుచున్నట్లు సూర్యుడు-చంద్రుడు-అగ్ని-వాక్కు లేనప్పుడు కూడా ఈ పురుషుడు జ్యోతి సహాయము కలిగియే ఉన్నాడు. **'ఆత్మ'యే ఆ జ్యోతి!** 'ఆత్మ' అను జ్యోతి వెలుగునందు (లేక) ఆత్మతేజోప్రకాశమునందు ఈ జీవుడు చరిస్తున్నాడు. కర్మలు నిర్వర్తిస్తున్నాడు. తిరిగి వెనుకకు వస్తున్నాడు. ఆత్మ చేతనే ఈతడు క్షేత్రములలో (శరీరములలో) ప్రవేశించటము, నిష్క్రమించటము కూడా చేస్తున్నాడు. ఈ జీవుడు సర్వదా స్వస్వరూప సంబంధమైన "ఆత్మజ్యోతి" యందే, జన్మ-జన్మాంతరములతో సహా-సమస్తము నిర్వర్తిస్తూ ఉన్నాడు. |
| **7. జనకుడు : కతమ ఆత్మేతి?** | జనకుడు : ఈ దేహము- ఇంద్రియములు-బుద్ధి మొదలైన విజ్ఞానమయ (అనుభవమునకు వచ్చుచున్న విశేషములలో) ఆత్మ ఏదై ఉన్నది? |
| **యాజ్ఞవల్క్యుడు : యో అయం విజ్ఞానమయః**<br>**ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః,**<br>**స సమానసన్ ఉభౌ**<br>**లోకావనుసఞ్చరతి। (లోకః అనుసంచరతి)।**<br>**ధ్యాయతీవ, లేలాయతి ఇవ।**<br>**స హి స్వప్నో భూత్వేమం**<br>**లోకం అతిక్రామతి మృత్యో రూపాణి॥** | **యాజ్ఞవల్క్యుడు** : ఈ దేహమునందు, ఇంద్రియములయందు, హృదయమునందు ఏ **విజ్ఞానమయపురుషుడు (ఎరుక అనురూపముగల పురుషకారము) ప్రకాశించుచున్నారో... ఆయనయే ఆత్మ!**<br>ఆ ఆత్మ పురుషుడే మానస స్వరూపుడై ఉభయలోకములలో (ద్రష్ట-దృశ్యములలో) సంచరించుచున్నారు. చేష్టలు చేయువానివలె ఉన్నారు.<br>అట్టి విజ్ఞాన స్వరూపుడగు ఆత్మదేవుడు → ధ్యాసకలవానివలె, ధ్యానించు వానివలె, బుద్ధి వెంట - ధ్యాసల వెంటవెళ్ళుచున్నవానివలె అగుచున్నాడు. బుద్ధితో "సమానము" అయిన రూపమును దాల్చి సమస్త ప్రాణరూపమై, ఇహ-పర లోకములలో తిరుగాడుచున్నాడు.<br>ఆత్మయే-స్వప్నము కనువానివలె అయి, - స్వప్నమువంటి ఈ జాగ్రత్ జగత్ దర్శనము చేయుచున్నది. మృత్యురూపమై త్యజిస్తోంది. అమృతరూపమై ఈవల దృశ్యమును, ఆవల ద్రష్టను అతిక్రమించినదై కూడా ఉంటోంది. |
| **8. స వా అయం పురుషో జాయమానః**<br>**శరీరం అభి సంపద్యమానః పాప్మభిః**<br>**సగ్ంసృజ్యతే, స ఉత్క్రామన్**<br>**మ్రియమాణః పాప్మనో విజహాతి।** | అట్టి ఆత్మపురుషుడు ఇక్కడ దృశ్యమునందు దృశ్యాంతర్గత పురుషుడై భౌతిక దేహమును ధరించు కోరికతో దేహములతో ప్రవేశించినవానివలె అగుచున్నాడు. శరీర-అభిసంసర్గము (Deep Relatedness) చేత శరీరముతో పుట్టుచున్నవానివలె అగుచున్నాడు. అనేక దోషపూరితమైన - పాపభూయిష్టమైన అల్పదృష్టులను, పాపకర్మలను నిర్వర్తించుచున్నాడు. ఒక దేహమునుండి మరొక దేహమునకు ఈ పురుషుడు బయల్వెడలు చున్నప్పుడు, పాపరూపములైన దేహ-ఇంద్రియ సంసర్గమును విడుచు చున్నాడు. (వాటిలో ఏర్పడిన సంస్కారములను తనవెంటకొని పోవుచున్నాడు) |
| **9. తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవ స్థానే భవతః**<br>**– ఇదం చ, పరలోక స్థానం చ।**<br>**సన్ధ్యం తృతీయగ్ం – స్వప్న స్థానం॥** | ఈ జీవుడు అనబడు పురుషునకు రెండు లోకములు స్థానములుగా ఉంటున్నాయి.<br>(1) **ఇహలోక స్థానము** - (ఇక్కడ దృశ్యములో) → (జాగ్రత్ అనుభవము)<br>(2) **పరలోకస్థానము**-(ఆవల ద్రష్టత్వమునందు) → (సుషుప్తి అనుభవము)<br>ఈ ఇహ-పరలోక (ఈ జన్మ-వచ్చే జన్మల) మధ్య మూడవది - (ఇహ-పరలోకముల మధ్య సంధిస్థానమగు) **'స్వప్నము'.**<br>**(జాగ్రత్ - సుషుప్తుల మధ్యగా → స్వప్నము)** |

| | |
|---|---|
| తస్మిన్ 'సన్ధ్యే' స్థానే తిష్ఠన్ ఏతే ఉభే స్థానే<br>పశ్యతి ఇదం చ పరలోక స్థానం చ।<br>అథ యథాక్రమో<br>అయం పరలోక స్థానే భవతి।<br>తమ్ ఆక్రమమ్। ఆక్రమ్య ఉభయాన్<br>పాప్మ, న ఆనన్దాగ్ంశ్చ పశ్యతి। | అట్టి ఆ ఆత్మ పురుషుడు 'సంధి' యందు (స్వప్నస్థానమునందు) నిలచి ఉండి ఇటువైపు ఇహమును (దేహ సందర్భమును), అటువైపు పరమును - (దేహము ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా)- చూచుచూనే ఉన్నాడు.<br>ఇహలోకములో ఎట్టి కర్మలు - ఆలోచనలు - భావావేశములు కలవాడో, అవన్నీ కూడా పరలోక స్థానమునకు (మరణించిన తరువాత పొందు మరొక దేహము ఉన్న స్థానమునకు) వచ్చి చేరుచున్నాయి. ఆ పరలోకములో పాపఫలితములగు దుఃఖములను, పుణ్యఫలితములైనట్టి ఆనందములను అనుభవములుగా దర్శిస్తున్నాడు. |
| స యత్ర ప్రస్వపితి అస్య లోకస్య<br>సర్వావతో మాత్రామ్ అపాదాయ<br>స్వయం విహత్య, స్వయం నిర్మాయ,<br>స్వేన భాసా, స్వేన జ్యోతిషా ప్రస్వపితి<br>అత్ర అయం పురుషః 'స్వయం జ్యోతిః' భవతి॥ | ఆ పురుషుడు నిద్రకు ఉపక్రమిస్తున్నప్పుడు **జాగ్రత్**లోని లోకములన్నీ పాలిస్తున్న తనయొక్క **'తత్ అంశవిభాగము'**ను విడదీసి, తనయందు గుప్తముగా దాచుకొనుచున్నాడు. ఈ దేహమును పరుండజేయుచున్నాడు. ఇంద్రియములను మౌనము వహింపజేయుచున్నాడు. తనయందు తానే (1) స్వప్నదేహము (2) స్వప్నానుభవరూప స్వప్నదృశ్య వ్యవహారమును కల్పించుకొనుచున్నాడు.<br>ఈ రెండిటిని తనయందు తానే వినోదముగా కల్పించుకొనుచున్నాడు.<br>తన జ్యోతిత్వమును ఉపయోగించి తనయందు తానే 'దృశ్యము' అనే కలను కనుచున్నాడు.<br>స్వప్న సమయములో కూడా ఈ పురుషుడు **"స్వయం జ్యోతీ-స్వయంప్రకాశ రూపుడు"** అయియే కొనసాగుచున్నాడు. |
| 10. న తత్ర రథా, న రథ యోగా,<br>న పన్థానో భవన్తి।<br>అథ రథాన్ రథ యోగాన్ పథః సృజతే,<br>న తత్ర ఆనన్దా ముదః ప్రముదో భవన్తి।<br>అథ ఆనన్దాన్ముదః ప్రముదః సృజతే। | ఒకడు నిదురించకముందు ఆతనివద్ద రథము లేదు. రథము ప్రయాణించు మార్గము లేదు. రథమునకు పూన్చబడిన గుఱ్ఱాలు లేవు.<br>అయితే మాత్రం ఏం? కల కనేటప్పుడు రథమును, గుఱ్ఱములను రథమార్గమును సృజియించుకొనుచున్నాడు. ఆత్మప్రకాశము సహాయముతో మనస్సే అన్నీ నిర్మించుకొంటోంది.<br>'జాగ్రత్'కు మునుముందుగా - ఆతనికి ప్రియము - ప్రియమైన వస్తువు - మోదము, ప్రమోదము... మొదలైనవి లేకపోవచ్చు గాక. కానీ, వాటినన్నిటినీ ఆత్మ తేజస్సుచే **ఆత్మపురుషుడే మనస్సుయొక్క స్పందన ద్వారా కల్పించుకొనుచున్నాడు.** |
| న తత్ర వేశాన్తాః పుష్కరిణ్యః<br>స్రవన్త్యో భవన్తి। అథ వేశాన్తాః<br>పుష్కరిణ్యః స్రవన్త్యః సృజతే।<br>స హి కర్తా। | ఆ నిదురించువానివద్ద నీటిగుంటలు లేవు. సరస్సులు లేవు. నదులు లేవు. కానీ ఈ జీవుడు స్వప్నమునందు కాలువలు, తటాకములు, సెలయేళ్ళు, పుష్కరిణులు... ఇవన్నీ కల్పించుకొనుచున్నాడు. అన్నిటికీ ఆ స్వప్నము తనదైనట్టి పురుషుడే కర్త, భోక్త కూడా। అంతేగాని మరొకరు ఎవ్వరో ఎక్కడో ఉండి జీవుని స్వప్నములో స్వప్న దృశ్యపరంపరలు కల్పించి చూపించటము లేదు. బాహ్యమగు మరొక వస్తువుయొక్క పాత్రయే లేదు. |
| 11 తత్ ఏతే శ్లోకా భవన్తి।<br>స్వప్నే న శారీరమభి ప్రహత్యా<br>"అసుప్తః సుప్తాన్ అభిచాకశీతి।<br>శుక్రమ్ ఆదాయ పునరేతి<br>స్థానగ్ం హిరణ్మయః<br>పురుష ఏక హగ్ం సః। | ఓ జనకమహారాజా! ఇదియే బ్రహ్మజ్ఞులచే శ్లోకముల రూపమున గానము చేయబడుచున్నది కూడా! మంత్రములుగా చెప్పుచున్నారు.<br>'ఆత్మ' అనునది జాగ్రత్ స్వప్నములను, ఇహ-పరలోకములను - రెండిటినీ కూడా స్వకీయ కల్పనగా పొందుచున్నట్టిది. **ఏకైకముగు స్వయం జ్యోతి రూపమైనట్టిది.** అట్టి ఆత్మయే జాగ్రత్ దృష్ట్యా నిదురించుచున్నదై, **'స్వప్నావస్థ'** అను పరికరము ద్వారా ఈ భౌతిక దేహములోని ఇంద్రియములను 'నిశ్చేష్టితము' చేయుచున్నది. ఆ తరువాత ఇంద్రియములలో **"శుద్ధ ప్రకాశము"**ను ప్రవేశింపజేసి ఇంద్రియ విషయములను ప్రవర్తింపజేయుచూ, స్వప్న దృశ్యమును పొందుచున్నది. |

| | |
|---|---|
| 12 ప్రాణేన రక్షన్నవరం (రక్షన్ అవరం) కులాయం<br>బహిష్కులాయాత్ అమృతశ్చ రిత్వా।<br>స ఈయతే అమృతో యత్ర<br>కామగ్ం హిరణ్మయః<br>పురుష ఏక హగ్ంసః॥ | **ఈ జీవుడు- "సుప్రసిద్ధుడు, అమృతస్వరూపుడు, అనంత తేజోమయుడు, ఏకస్థుడు, జాగ్రత్-స్వప్న-సుషుప్తులను, ఇహ-పరలోకములను స్వయముగా రచించువాడు, స్వయం ఆత్మపురుషుడు"** - అయి ఉన్నాడు. అయి ఉండి కూడా, ఒక సందర్భములో తన శక్తిరూపమగు ప్రాణవాయువుచే అల్పము, నీచము అగు (శరీరము అనబడే) గూటిని పోషించుకొనుచూ, కాపలాకాయుచు, కాలము గడుపుచూ ఉన్నాడు. జాగ్రత్‌లో ఇంద్రియములకు విషయములగు వస్తుజాలముపట్ల **"కావలెను। పొందాలి।"** అనే కోరికల పరంపరలను (కామమును) పెంపొందించుకొని, **మనస్సుతో శరీరమునకు బాహ్యముగా ఎక్కడెక్కడో సంచారాలు చేయుచున్నాడు. భోగ్య పదార్థములకొరకై ఆరాటముతో వెతకుచున్నాడు.** |
| 13 స్వప్నాన్తే ఉచ్చావచమ్<br>ఈయమానో రూపాణి<br>దేవః కురుతే బహూని।<br>ఉతేవ స్త్రీభిః సహ మోదమానో<br>జక్షదుతేవ అపి భయాని పశ్యన్॥ | అంతమాత్రమే కాకుండా **'స్వయంజ్యోతి స్వరూప ఆత్మపురుషుడు'** అగు ఈ జీవుడు స్వప్నములో ప్రవేశించి దేవతల - జంతువుల - మానవుల... తదితర లెక్కలేనన్ని ఉచ్చనీచములైన స్వప్నాంతర్గత విశేష రూప పరంపరల అనుభవాలన్నీ పొందుచున్నాడు. అనేకమంది స్త్రీ రూపములతో, పురుషరూపములతో అనుబంధ కల్పన పొంది ఆనందించుచున్నాడు. దుఃఖిస్తున్నాడు. అనేక వాసనల ప్రయోజనంగా కొందరిలో కూడి నవ్వటము, మరికొందరిని చూచి ద్వేషించటము, భయపడటము, భయము కొలిపే వాటిని చూడటము - ఇవన్నీ పొందుచున్నాడు. **వస్తువు లేకుండానే స్వప్నములో వస్తు - విషయములను, విషయపరంపరలను పొందుచున్నాడు.** |
| 14 ఆరామమం అస్య పశ్యన్తి<br>న తం పశ్యతి కశ్చన ఇతి॥ | జనులు నిద్రించుచున్న ఈ జీవుని క్రీడా సామాగ్రివంటి బాహ్యవస్తువులను (దేహమును) చూచుచున్నారేగాని, స్వప్నము చూచుచున్న ఆతడు ఏరూపము కలిగి అదంతా చూచుచున్నాడో, అది ఎవ్వరూ చూడలేరు. |
| తం న ఆయతం బోధయేత్ ఇత్యాహుః।<br>దుర్భిషజ్యగ్ం హాస్మై భవతి<br>యమేష న ప్రతిపద్యతే॥ | అందుకే, **"నిద్రపోవువానిని లేపకూడదు"** అని అంటారు. స్వప్నమును చూస్తూ - చూస్తూ ఉన్నవానిని బలవంతముగా వెనుకకు మరల్చుటము అవుతుంది కదా మరి! హఠాత్తుగా లేపుటచే ఇంద్రియగోళములను పట్టుకొనలేక జీవుడు పరిశ్రమిస్తాడు కాబట్టి!<br><br>ఏ ఇంద్రియగోళముల ద్వారా ఈ జీవుడు జాగ్రత్ నుండి బయల్వెడలినాడో, వాటిని అకస్మాత్తుగా నిద్రలేపితే, ఇంద్రియ ద్వారములను దొరకపుచ్చుకోలేక పోవచ్చును. లేక అది శ్రమ అవగలదు. జాగ్రత్తునుండి పోయి తిరిగి వచ్చే మార్గము కష్టతరం అవగలదు. అందుకే నిద్రపోవువానిని మధ్యలో లేపితే విసుగు. |
| అథో ఖలు ఆహుః జాగరితదేశ ఏవ<br>అస్య ఏష ఇతి।<br>యానిహ్యేవ (యాని హి ఏవ) జాగ్రత్ పశ్యతి,<br>తాని 'సుప్త'।<br>ఇతి అత్ర అయం పురుషః<br>"స్వయం జ్యోతిః" భవతి॥ | కొందరు "స్వప్నము - జాగ్రత్ అనుభవముతో సమానమైనదే!" - అని కూడా అంటూ ఉంటారు.<br><br>**"జాగ్రత్ అవస్థయే ముఖ్య స్థానము. ఆ జాగ్రత్ అవస్థలో స్వప్నము మరొక స్థానము" అయి ఉన్నది. కనుక స్వప్నము జాగ్రత్‌తో సమానమే. మెలకువగా ఉన్నప్పుడు చూచినదానినే స్వప్నంలో చూస్తున్నాడు. కనుక రెండు అవస్థలూ ఒక్కటే!"**... అని కూడా అంటూ ఉంటారు. అయితే - స్వప్నములో ఈ పురుషుడు **'స్వయంజ్యోతి'** అగుచున్నాడు. **దిక్పాలకుల - దిక్ దేవతల కారణము లేకుండానే స్వస్వరూపమునందు స్వప్న ప్రపంచమును పొందుచున్నాడు.** |
| జనకుడు : సోఽహమ్ భగవతే<br>సహస్రం దదామి,<br>అత ఊర్ధ్వం విమోక్షాయ బ్రూహి ఇతి। | **జనకమహారాజు** : ఓ యాజ్ఞవల్క్య యతీంద్రా! భగవన్! మీకు వేయి గోవులను గురుదక్షిణగా సమర్పించుకొంటున్నాను. **నాకు "బంధము నుండి బయల్వెడలగల మోక్షమార్గము"ను దయతో ఉపదేశించండి।** |

15 స వా ఏష ఏతస్మిన్ సమ్ప్రసాదే
రత్వా, చరిత్వా దృష్ట్వైవ
పుణ్యం చ పాపం చ।
పునః ప్రతిన్యాయం
ప్రతియోన్యా ద్రవతి స్వప్నాయైవ।।
సయత్ తత్ర కించిత్ పశ్యతి
(అ)నన్వా ఆగతః తేన భవతి।

**యాజ్ఞవల్క్యుడు : 'మోక్షము'నకు వ్యతిరేక శబ్దము 'బంధము' కదా! బంధము ఎవరికి? జీవాత్మకా? పరమాత్మకా? ఉభయాత్మకా?**

ఆత్మ స్వయంజ్యోతి స్వరూపము. అద్దానికి బంధమేలేదు. బంధమే లేనిదానికి 'ముక్తి-ముక్తి మార్గముల ప్రసక్తి' ఏమున్నది? స్వయంజ్యోతి స్వరూపమగు ఆత్మ తనయొక్క 'అనురాగము' అను విశేషముచే స్వప్నస్థానమును దర్శించి, కొంతసేపు సంచారములు చేసి, పుణ్యాపాప (సుఖ-దుఃఖ) అనుభవములను పొంది మరల జాగరిత స్థానమునకు వచ్చి చేరుచున్నది. ఆ ఆత్మజ్యోతిస్వరూపుడగు పురుషుడు ఏ ఏ సుఖ-దుఃఖములను స్వప్నములో దర్శించుచున్నాడో, ఆతడు వాటిచే బద్ధుడగుచున్నాడా? లేదే! న్యాయానుసారము (In Its functional sequence) స్వప్నము నుండి సుషుప్తికి, సుషుప్తి నుండి స్వప్నమునకు, స్వప్నమునుండి జాగ్రత్‌కు వచ్చుచున్నాడు. వాటిలో దేనిచేతనూ ఆతడు బంధించబడటం లేదు.

---

అసఙ్గో హి అయం పురుషః।

ఓ జనకమహారాజా! ఈ పురుషుడు (లేక జీవుడు, లేక, జీవాత్మ) దేనిదేనిని జాగ్రత్‌లోను, స్వప్నములోను, సుషుప్తిలోను చూచుచున్నాడో, అవి ఆయా వేరు వేరు సందర్భములలో చూస్తూ **"ఇదియే నా పట్ల సత్యము"** ...అని, **"నేను ఈ స్థితికి బద్ధుడను"** అని అనుకుంటున్నప్పటికీ, - ఆతడు వాటిచే బద్ధుడు కాడు. **ఈ పురుషుడువాస్తవానికి ఏ ఆత్మస్వరూపమై ఉన్నాడో... అది సర్వదా అసంగమే।**

---

జనకుడు : ఇత్యేవం ఏవై తత్ యాజ్ఞవల్క్య!
సో౾హమ్, భగవతే! సహస్రం దదామి।
అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి ఇతి।

జనకమహారాజు: మీరు చెప్పుచున్నట్లుగా **"ఆత్మ జాగ్రత్ - స్వప్న- సుషుప్తులలో బద్ధము కావటము లేదు!"**....అనునది నేను ఒప్పుకుంటున్నాను. అయితే, **జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు సంబంధించని మా స్వరూపము యొక్క అప్రమేయతత్త్వానుభవము మాకు సిద్ధించాలికదా!** అందుచేత గురుదక్షిణగా వేయి గోవులను స్వీకరించండి.

నాకు మోక్ష రూపమగు **'ఆత్మవిద్య'** లేక **'బ్రహ్మవిద్య'**ను బోధించండి. మోక్షమార్గము సూచించండి.

---

16 యాజ్ఞవల్క్యుడు : స వా ఏష ఏతస్మిన్
స్వప్నే రత్వా, చరిత్వా,
దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ,
పునః ప్రతిన్యాయం ప్రతియోన్యా ద్రవతి,
బుద్ధాన్తాయైవ సయత్ తత్ర కించిత్ పశ్యతి।
అనన్వ ఆగతః తేన
భవతి, "అసఙ్గోహి అయం పురుష"।

యాజ్ఞవల్క్యుడు : స్వయంజ్యోతిస్వరూపమగు ఆత్మ సుషుప్తినుండి బయల్వెడలి....

❋ స్వప్నావస్థయందు కొంతసేపు అనురాగముతో కూడి సంచరించి, పుణ్య-పాప (సుఖదుఃఖ) అనుభవములను పొంది, అటు తరువాత ఆ స్వప్నానురాగమును విరమించుకొనుచున్నది.

❋ మరల స్వీయప్రకాశముగా (In its routine sequential enlightenment) జాగ్రత్ స్థానమునందు ప్రతిష్ఠ పొందుచున్నది.

❋ అట్టి జాగ్రత్ స్థానములో అనురాగముతో ప్రవేశించి, ప్రతిష్ఠపొంది, పుణ్య పాపఫలములను (సుఖ-దుఃఖములను) అనుభవిస్తోంది.

❋ అయితే అట్టి జాగ్రత్ అనుభవములచే ఆత్మ (జీవాత్మ) బద్ధము అవుతోందా? లేదే! జాగ్రత్తుకు బద్ధుడు అయితే ఆత్మకు మరల స్వప్న సుషుప్తులు ఉండేవే కావు. కానీ స్వభావసిద్ధంగా జాగ్రత్‌లోంచి విరమించి ఆ ఆత్మజ్యోతి స్వప్నదశలో ప్రవేశించు బుద్ధిని పొందిన తరువాత, జాగ్రత్‌లోంచి స్వప్నములో ప్రవేశించుచున్నది. స్వప్నములో ప్రవేశించుచున్నప్పుడు 'జాగ్రత్' బంధమగుచున్నదా? లేదే! నిద్రపోబోయేవాడిపట్ల జాగ్రత్ స్వయముగానే ప్రక్కకు తొలగుతోంది.

ఆత్మ సర్వదా జ్యోతి స్వరూపము. ఏవిధంగానూ, జాగ్రత్ చేతగాని, స్వప్నము చేతగాని, సుషుప్తి చేతగాని బంధింపబడునది కాదు. జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు వేరైనదై, అసంగరూపమై, ఆ మూడిటికి సాక్షి అయి, (ఇంకా కూడా) ఆ మూడు తనయొక్క ఆత్మజ్యోతి కిరణ విశేషములై చెన్నొందుతోంది. ఈ పురుషుడు ఆత్మజ్యోతిస్వరూపుడే. ఇక బంధమెక్కడిది? ఎవరికి?

---

<u>జనకుడు</u> : ఇత్యేవం ఏవైతత్। యాజ్ఞవల్క్య!
సోఽహం, భగవతే!
సహస్రం దదామ్యత।
ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి।

జనకమహారాజు : మహాత్మా! భగవాన్! అట్టి ఆత్మ జాగ్రత్- స్వప్న- సుషిప్తులలో విహరించుచున్నది కదా! స్వాత్మకు చెందిన త్రివిధ స్వకీయ కల్పనా ప్రదేశములుగా సందర్శించుచున్న ఊర్ధ్వ - మోక్షస్థానము పొందు మార్గము (తురీయ స్థానము) దయతో ఉపదేశించండి. గురుదక్షిణగా సహస్ర గోవులను సమర్పించుటకొరకై కూడా అనుజ్ఞ ఇవ్వండి.
**నాకు మోక్ష మార్గము ఉపదేశించండి.**

---

**17** స వా ఏష ఏతస్మిన్
బుద్ధాన్తే రత్వా చరిత్వా
దృష్ట్వైవ పుణ్యం చ, పాపం చ,
పునః ప్రతిన్యాయం
ప్రతియోన్యా ద్రవతి స్వప్నాన్తాయైవ॥

యాజ్ఞవల్క్యుడు : ఓ జనక మహారాజా! మరల చెప్పుచున్నాను. ఈ పురుషుడు జాగరిత (జాగ్రత్) స్థానములో ప్రవేశించి, బంధుమిత్రాదులతో అనురాగము మొదలైనవి ఆస్వాదించి, క్రీడించి, పుణ్య-పాపముల ఫలములను పొంది...అనుభవించుచూ కూడా, **ఒక్క క్షణంలో అవన్నీ త్యజించి వేస్తున్నాడు. సర్వమునకు అసంగుడై స్వప్నములో ప్రవేశిస్తున్నాడు.** స్వప్నములో అన్నీ అదేవిధంగా (జాగ్రత్-అంత ఆవేశంగానూ) అనుభవిస్తూ స్వప్నము ముగిసిన తరువాత ఏదీ స్వీకరించకుండానే, ఏదీ తనకు బంధము కాకుండా స్వప్నస్థానము నుండి బయల్వెడలుచున్నాడు.

---

**18** తద్యథా (తత్ యథా) – మహామత్స్య
ఉభే కూలే అనుసఞ్చరతి
పూర్వంచాపరం చ (పూర్వంచ, అపరంచ)।
ఏవమ్ ఏవ అయం పురుష,
ఏతా వుభావన్తావను సఞ్చరతి
స్వప్నాన్తం చ బుద్ధాన్తం చ॥

ఒక పెద్ద తిమింగలము ఈవైపు ఒడ్డు నుండి ఆ వైపుకు, ఆ వైపు ఒడ్డు నుండి ఈ వైపుకు తిరుగాడుచూ,..ఇటువైపు పరిసర విశేషములను ఇటు, అటువైపు పరిసర విశేషములను అటు-తాకి **వదులు విధంగా,**

పురుషుడు (జీవాత్మ లేక ఆత్మ) జాగ్రత్ - స్వప్నములందు ఇటునుండి - అటు, అటువైపు నుండి ఇటు సంచారములు నిర్వర్తిస్తూ జాగ్రత్‌లోని విషయాలను జాగ్రత్ స్థానములోను, స్వప్నములోని విషయాలను స్వప్న స్థానములోను విడచుచున్నాడు. **అటువంటప్పుడు బంధమెక్కడిది? బంధమేలేని ఆత్మస్వరూపుడవగు, నీకు ఎవరో మోక్షము ఇవ్వటమునునది ఎక్కడిది?**

---

**19** తత్ యథా అస్మిన్ ఆకాశే శ్యేనో వా
సుపర్ణోవా విపరిపత్య శ్రాన్తస్సగ్ం హత్య పక్షౌ
సల్లయాయైవ ధ్రియత।

**సుషుప్తి** : ఆకాశములో ఎగురుతూ ఎగురుతూ చాలాసేపు గడిపిన డేగ (లేక) గ్రద్ద అలసిపోయి **"సరే! ఇక నా గూటికి నేను వెళ్లెదనుగాక!"**...అని తలచి రెక్కలు ముడుచుకొని ప్రశాంతంగా తన గూటిలో ప్రవేశించి విశ్రాంతి తీసుకుంటుంది చూచారా!

---

ఏవం ఏవ అయం పురుష
ఏతస్మా అన్తాయ ధావతి, యత్ర సుప్తో–
న కంచన కామం కామయతే।
న కంచన స్వప్నం పశ్యతి॥

'జాగ్రత్తు-స్వప్నము' అనే రెండు విశేషములతో, విషయములతో కూడిన రెండు రెక్కలతో విహరించి, విహరించి, ఈ జీవుడు (పురుషుడు) కొంత సమయమైన తరువాత, **"ఇక విశ్రాంతి పొందెదను గాక!"**...అని తలచి, **సొంతగూడువంటి, స్వస్థానము** అగు సుషుప్తి (గాఢనిద్ర)లో ప్రవేశించి, **ప్రశాంతమును ఆస్వాదిస్తున్నాడు.** అట్టి సుషుప్తి స్థితి యందు దేనిపట్ల <u>"ఇదికావాలి! వద్దు! ఇది ఇట్లా ఉన్నదేం? ఇది నా కర్మ! ఇవి దుఃఖాలు! ఇవి ఆనందాలు! -</u> మొదలైన జాగ్రత్‌లో ప్రదర్శించిన ఏ స్వభావాలు - లక్షణాలు - గుణాలు **ప్రదర్శించడు.** (ఆ గాఢనిద్రా సమయంలో) ఏదీ కలిగి ఉండడు. అట్లాగే స్వప్న సమయంలో కల్పించుకొని పొందిన ఊహ-అపోహలకు సంబంధించిన సుఖ-దుఃఖ-భయ- ఆందోళనభావాలు కూడా కలిగి ఉండడు. ఆతడు - జాగ్రత్ - స్వప్న - రహితుడై, సుషుప్తియందు అనన్యమగు **"ఏకాంత - మౌన- నిర్విషయానందము"** ఆస్వాదించుచున్నాడు.

| | |
|---|---|
| **20 తావా అస్యైతా "హితా" నామ నాడ్యో యథా కేశః<br>సహస్రధా భిన్నః తావతా అణిమ్నా తిష్ఠన్తి।<br>శుక్లస్య, నీలస్య, పింగళస్య,<br>హరితస్య, లోహితస్య పూర్ణాః॥<br>అథ యత్రైనం ఘ్నన్తి ఇవ, జినన్తీవ,<br>హస్తీవ, విచ్ఛాయయతి। గర్తమివ పతతి।** | **స్వప్నసమయంలో** - వెంట్రుకలో 1/1000వ విభాగమంత - అని చెప్పగలిగినట్టి శక్తిస్వరూపమగు 'హితా' (అని యోగ శాస్త్రముచే పిలువబడుచున్న) నాడులు "శుభ్రవర్ణము (తెలుపు-నిర్మల) లేక శుక్ల (తెలుపు వర్ణము, నీలవర్ణము), పింగళ (గోరోజన) వర్ణము, హరిత (ఆకుపచ్చని) వర్ణము...గల రంగులతో నిండి ఉన్నాయి. ఆ హితానాడులలో ప్రవేశించి, స్వప్నరంగమున కల్పించుకొని, ఈ పురుషుడు సంచారములు చేయుచున్నాడు.<br>స్వప్నములో ప్రవేశించి - "ఈతడు కనిపిస్తున్నాడు. ఆతడు పట్టుకొని వశం చేసుకుంటున్నాడు. అదిగో - అది నా ఇల్లు. నేను ప్రవేశించుచున్నాను. వీరంతా నా గృహంలో సభ్యులు. అయ్యా బాబోయ్! ఈ ఏనుగు నన్ను తరుముతోంది. ఇప్పుడు గోతిలో పడుచున్నాను''.....<br>- ఇటువంటివన్నీ **స్వీయ కల్పిత స్వప్న ప్రపంచంలో స్వీయానుభవాలుగా (కానీ) ఎవ్వరో కల్పిస్తున్న రీతిగా - పొందుచున్నాడు. అవిద్యచే అదంతా ఆ రీతిగా చూస్తున్నాడు.** |
| **యదేవ జాగ్రత్ భయం పశ్యతి,<br>తదత్రా అవిద్యయా మన్యతే।<br>అథ యత్ర దేవ ఇవ, రాజేవాహమ్-ఏవ<br>ఇదగ్ం సర్వో అస్మి-ఇతి మన్యతే,<br>సో అస్య పరమో లోకః॥** | జాగ్రత్‌లో ఏఏ భయములను, ఉద్వేగములను, ఆవేదనలను, ఆవేశములను, సుఖ-దుఃఖ భావములను పొందుచున్నాడో, -అవన్నీ కూడా అట్టి రూపముగానే, (కానీ స్వయం మనో కల్పితంగానే)... స్వప్నములో (అవిద్యచే) పొందుచున్నాడు.<br>మరల ఆ స్వప్న కల్పనను చేతిలోని ఒక వస్తువు వదలినట్లు వదలివేసి, **'జాగ్రత్'లో ప్రవేశించుచున్నాడు. అప్పుడు స్వప్నములోని ఏదేని విశేషము అడ్డువచ్చి - "నీవు జాగ్రత్‌కు వెళ్ళకుండా నేను బంధిస్తున్నాను"** ....అని ఆపుచున్నదా? లేదే! ఇక జాగ్రత్‌లో ప్రవేశించిన ఆ పురుషుడు జాగ్రత్‌లో "నేను ఇప్పుడు దేవతను। మానవుడను। పక్షిని। రాజును।''..... అనునది పొందుచున్నాడు.<br>ఈ విధముగానే పురుషుడు ఒక దేహము వదలి మరొక దేహమును ఆశ్రయించు తతంగమంతా కూడా జరుగుతోంది. ఇది ఈ జీవుని పట్ల **ఒక సుదీర్ఘమైన పరంపరగా** జరుగుతూపోతోంది. ఇదియే జన్మల - పునర్జన్మల ప్రహసనం. 'ఎప్పుడైతే ఒక వనదేవత-వనమువలె, ఒక రాజు-రాజ్యము వలె **'ఇదంతా నేనే'**... అని ఎరుగుచున్నాడో, అదియే జీవుని **పరమోత్కృష్ట ధామము.** |
| **21 తద్వా అస్యైతదత్ (అస్య ఏత దత్)<br>ఇచ్ఛన్దా, అపహత పాప్మా<br>అభయగ్ం రూపం॥<br>తత్ యథా ప్రియయా స్త్రియా<br>సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద।<br>న అన్తరమ్ ఏవమేవ<br>అయం పురుషః ప్రాజ్ఞేన ఆత్మనా<br>సంపరిష్వక్తో, న బాహ్యం కించన వేద।<br>న అన్తరమ్।** | **తత్ ఏతత్ వా స్వరూపమ్।** సర్వాత్మకత్వమే ఈ జీవుని సహజరూపము. **ఆత్మజ్ఞానముచే ఈ పురుషుడు (జీవుడు) ఆత్మస్వరూపుడే!** సర్వకామములు త్యజించగా, ధర్మాధర్మ వివర్జితుడై, సర్వభయరహితుడై... స్వయముగానే అట్టి ఆత్మ స్వరూపమును పొందుచున్నాడు.<br>దృష్టాంతానికి, ఒక ప్రియుడు తన ప్రియురాలితో పరిష్వంగసుఖమును పొందుచున్నప్పుడు ఏవిధంగా బాహ్య - అభ్యంతరములన్నీ, మరచి ప్రియురాలితో ఏకత్వస్థితి మాత్రమే కలిగి ఉంటాడో, **ఈ పురుషుడు కూడా ఆత్మను ఎరిగినప్పుడు ఇక తనకు ఆత్మ వేరు కానట్టి, తనకు** బాహ్య-అభ్యంతరములలో (ఆత్మకు వేరుగా) ఏదీ లేనట్టి- **"ఆత్మతదాత్మ్య స్థితి"**ని పొందుచున్నాడు. తనకు బాహ్యముగా జాగ్రత్-స్వప్న-సుషుప్తులు ఏరూపముగానూ **"స్వతఃగా లేనివి"** అని గమనిస్తున్నాడు. |

**తద్వా (తత్ వా) అస్యై తత్ ఆప్తకామం।**
**ఆత్మకామం అకామగ్ం**
**రూపగ్ం శోక అన్తరమ్। (శోకాన్తరమ్)।**

అప్పుడు ఆ పురుషుడు తన ఆత్మతత్త్వమును గమనించి, ప్రవేశించి 'ఆప్తకాముడు' అగుచున్నాడు.

అట్టి ఆప్తకామునికి ఈ దృశ్య ఇంద్రియ జగత్తునుండి ఏకించిత్ కూడా కోరుకొనవలసినది ఉండదు.

**ఆత్మయే** → సర్వకామములు కలిగి ఉన్నట్టిదిగాను,
→ ఎట్టి కామములు లేనట్టిదిగాను,
→ విషయములకు ఆవల సర్వమునకు ఆధారమై ఉన్నట్టిదిగాను,
→ శోక శూన్యమైనట్టిదిగాను, విషయములచే స్పర్శించబడనిదిగాను **ఈ పురుషుడు తెలుసుకొనుచున్నాడు.**

**అట్టి ఆత్మయే తానై ఉంటున్నాడు.**

---

**22 అత్ర పితా, అపితా భవతి।**
**మాతా అమాతా। లోకా అలోకా.**
**దేవా అదేవా। వేదా అవేదాః।**
**అత్ర స్తేనో అస్తేనో భవతి।**
**భ్రూణహా అభ్రూణహా।**

ఈ పురుషుడు 'సుషుప్తి' యందు తనకు వేరైనదేదీ లేనివాడై ఏక-ఏకాంత స్వరూపుడగుచున్నాడు కదా!

అట్టి స్థితిలో తండ్రి తండ్రి కాదు. తనకు వేరుగా 'జన్మ' అనునదే లేనప్పుడు ఇక 'తండ్రి' ఎక్కడ ఉంటాడు.

- అట్లాగే తల్లి తల్లి కాదు. దృశ్యమే లేనప్పుడు దేహమెక్కడిది? దేహమే లేనప్పుడు తల్లి ఎక్కడున్నది?

- లోకాలన్నీ సుషుప్త స్థితిలో (గాఢనిద్రలో) "అలోకములు" అగుచున్నాయి.

దేవతలు - అదేవతలు అగుచున్నారు. తెలిసినదంతా - తెలియబడనిదిగా అగుచున్నది. ఆతనికి జాగ్రత్ గురించిగాని, స్వప్నము గురించిగాని ఏమీ తెలియని వాడగుచున్నాడు. వేదములు ఎరుగనివాడగుచున్నాడు.

ఒక దొంగ అయినవాడు కూడా సుషుప్తియందు 'నేను దొంగను కదా!' అని ఎరుగుటలేదు.

- భ్రూణహత్య చేసినవాడు "తప్పు చేశానే?" అని జ్ఞాపకము ఉండదు.

---

**చణ్డాలో అచణ్డాలః।**
**పౌల్కసో అపౌల్కసః।**
**శ్రమణో అశ్రమణః।**
**తాపసో అతాపసో।**
**అనన్వాగతం పుణ్యేన।**
**అనన్వాగతం పాపేన।।**
**తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్**
**హృదయస్య భవతి।।**

చండాలుడు "నేను చండాలునికదా!" అనిగాని, విప్రుడు "నేను విప్రుడను కదా!"...అని గాని తెలుసుకొని ఉండటము లేదు.

పౌల్కసుడు (క్షత్రియునికి చండాల స్త్రీ సంబంధము వలన కలిగినవాడు)...'నేను పౌల్కసునికదా"...అనేదేదీ (గాఢ నిద్రాసమయంలో) ఎరిగి లేడు.

అన్నీ వదలి వాన ప్రస్థము చేరినవాడు కూడా ఆ గాఢనిద్రలో వానప్రస్థుడు (శ్రవణుడు) కాడు.

గొప్ప తపస్సంపన్నుడు కూడా **"నేను గొప్ప తపో సంపదకలవాడను. ఆతడు కాదు"...** ఇటువంటిదేమీ గాఢనిద్రయందు కలిగియుండటం లేదు.

"నేను పుణ్యశీలుడను - పుణ్యకర్మలు చేయువాడను. (లేక) పాపకర్మలు చేయువాడను"... అనేవన్నీ కూడా గాఢనిద్రాస్థితిలో విషయములు కావు.

హృదయములో అనుభవమగుచున్న సర్వ శోకములు (All worries, All types of meloncholy) దాటివేసినవాడు, అతిక్రమించినవాడు అయి ఉంటున్నాడు.

| | |
|---|---|
| **23 యద్వై తత్ న పశ్యతి।**<br>**పశ్యన్వై తత్ న పశ్యతి।**<br>**న హి ద్రష్టుః దృష్టేః**<br>**విపరిలోపో విద్యతే –**<br>**అవినాశిత్వాత్।।**<br>**న తు తత్ ద్వితీయమస్తి, (ద్వితీయమ్ అస్తి),**<br>**తతో అన్యత్ విభక్తం యత్ పశ్యేత్।।** | **అన్నీ ఉండియే ఏమీ లేనివాడు**<br>వింటున్నారా, జనకమహారాజా!<br>**"గాఢనిద్రలో ఆతడు ఏదీ చూచుట లేదు!"** అని గమనిస్తున్నాము. అయితే,- ఆతడు **చూడలేనివాడై** ఉన్నాడా? లేదే! అన్నీ చూడకలిగియే ఉండి, ఏదీ చూడని వాడై ఉంటున్నాడు. **(Can see, but not seeing).**<br>ఆ సుషుప్తి పురుషుడు దేనినీ దర్శించటము లేదు. ద్రష్టత్వము వహించటము లేదు. అయితే అంతమాత్రంచేత ఆతని 'ద్రష్టత్వము' నశించినదా? లేనేలేదు. ద్రష్టత్వము అప్పుడు యథాతథముగానే ఉన్నది. మరి? ఆతడు అప్పుడు ద్రష్టత్వము దాచిపెట్టుకొన్నాడు. అనగా, **"ద్రష్టత్వము వహిస్తే జాగ్రత్-స్వప్నాలు ఉంటాయి. లేకుంటే ఉండవు"...** అనేగా, - దీని అర్థము!<br>ఎందుచేత? ఈ పురుషుడు, ఆత్మస్వరూపుడు. స్వతఃగా **'అవినాశి'** అయి ఉన్నాడు. అట్టి అవినాశి దృష్టిని ఆహ్వానించినపుడు ఆతని నుండి ద్రష్ట - ద్రష్టత్వము - దృశ్యము బయల్వెడలుచున్నాయి. **ఆత్మపురుషుని దృష్టియే దర్శించబడు జాగ్రత్ స్వప్నదృశ్యముల రూపము సంతరించుకొని,** ఆ ఆత్మపురుషదేవుని సేవించుచున్నాయి.<br>సుషుప్తిలో దర్శన - ద్రష్టత్వములు వహించనందువల్ల దృశ్యమే లేదు. ద్రష్టత్వము వహించిన మరుక్షణం దృశ్యము వచ్చిపడుతోంది. కనుక 'ద్రష్టత్వము, దృశ్యము' అనునవి ఆత్మరూపుడగు పురుషుని స్వకీయ పురుషకార కల్పనలే। అనగా, ఈ జీవునిపట్ల మరెవ్వరో కల్పించుచున్నవి కానే కావు.<br>సుషుప్తునియందు ఆత్మకు ద్వితీయమేలేదు. సర్వసామర్థ్యములు కలిగి, ఏదీ లేనివాడై, తన సామర్థ్యమునుండి దృశ్యమును ఆ తరువాత ఎప్పుడో తన ఇచ్ఛానుసారం 'జాగ్రత్'గా - కల్పించుకొంటున్నాడు. |
| **24 యత్ వై తత్ (యద్వైతత్) న జిఘ్రతి।**<br>**జిఘ్రన్ వై తత్ న జిఘ్రతి।**<br>**న హి ఘ్రాతుః ఘ్రాతేః**<br>**విపరిలోపో విద్యతే।**<br>**అవినాశిత్వాత్। న తు తత్ ద్వితీయమస్తి।**<br>**తతో అన్యత్ విభక్తం యత్ జిఘ్రేత్।** | ఎవ్వడైతే గాఢనిద్రలో వాసనచూచుట లేదో, ఆతడు వాసన చూడకలిగిన వాడై ఉండియే ఆఘ్రాణించటము లేదు. (పురుషునియొక్క, ఆత్మయొక్క) వాసనచూచు శక్తి అవినాశనము. ఈ పురుషుడు జీవుడుగా అవినాశి. వినాశము లేనట్టి అద్వితీయుడు. ఆతని శక్తి కూడా అవినాశియే।<br>(1) వాసనచూచువాడు, (2) వాసనచూడబడునది ... అను ఈ రెండూ ఆత్మకు వేరుగాలేవు. ఉభయము-**ఏకముగు ఆత్మస్వరూపమే!** ఆత్మకు వాసన చూచుటకై (ఆత్మకు) **భిన్నమైనదంటూ ఏదీ లేదు.** అందుచేత ఆత్మ అభిన్నము, అవిభక్తము. ఆ పురుషునికి వేరుగా రెండవ పదార్థమే లేదు. |
| **25 యద్వై తత్ న రసయతే।**<br>**రసయన్ వై తత్, న రసయతే।**<br>**నహి రసయితూ రసయతే**<br>**విపరిలోపో విద్యతే,**<br>**అవినాశిత్వాత్। న తు తత్ ద్వితీయమస్తి,**<br>**తతో అన్యత్ విభక్తం యత్ రసయేత్।।** | "(సుషుప్తియందు) ఈ పురుషుడు రుచి చూడలేనివాడై ఉన్నాడు"...అని అనటానికి వీలులేదు. **రుచి చూచే సామర్థ్యము కలిగిఉండియే ఆతడు రుచి చూడటములేదు.** అంతే। రుచి చూచు సామర్థ్యము ఏమాత్రమూ పోలేదు. ఎందుకంటే ఈ పురుషుడు (లేక జీవుడు) ఆత్మస్వరూపుడే అయి ఉన్నాడు. ఆత్మకు వేరుగా రెండవ వస్తువే లేదు. కనుక ఆత్మకు వేరుగా రుచించుటకు ఎక్కడా ఏదీ లేదు! **"రుచి చూచువాడు - రుచి చూడబడునది"** - ఈ రెండూ కూడా ఒకే అఖండాత్మయొక్క ద్వివిధములైన ప్రదర్శనా-చమత్కారములే.<br>ఆత్మకు భిన్నమైనదేదీ ఆత్మకు రుచించుటకు ఎక్కడా ఏదీ లేదు. **ఆత్మయే రుచించు సమస్త వస్తురూపములు. ఆత్మయే రుచిచూచువాడు కూడా. ఆత్మయే తిరస్కరించువాడు కూడా.** |

26 యద్వై తత్ న వదతి।
వదన్ వై, తత్ న వదతి।
నహి వక్తుః వక్తేః
విపరిలోపో విద్యతే,
అవినాశిత్వాత్। న తు తత్ ద్వితీయమ్ అస్తి।
తతో అన్యత్ విభక్తం యత్ వదేత్॥

**"సుషుప్తిలో ఉన్న పురుషుడు మాట్లాడుటలేదుకదా!"**...అంటాం. అవును మాట్లాడటం లేదు. అయితే **మాట్లాడగలిగినవాడే మాట్లాడకుండా ఊరుకోగలడు.** మాట్లాడలేనివాడు "మాట్లాడటంలేదు''....అనము కదా గాఢనిద్రలో ఉన్నవాడు పలుకకపోవచ్చుగాక। కానీ పలికేశక్తి నశిస్తోందా? లేదు.

**"పలుకు పలికే శక్తి"**కి వినాశనము అనునది లేదు. అవినాశి!

అవినాశి - ఆనందము అయిన అద్దానికి - ద్వితీయము (పలుకబడునది) విడిగాగాని, వేరుగాగాని లేదు. అద్దానికి విభక్తమైనది (వేరుపడినది) అంటూ ఏదీ లేదు. **(1) పలుకువాడు (2) పలుకబడునది (3) పలుకు - ఈ మూడూ కూడా అఖండాత్మయొక్క వివిధ ప్రదర్శనములే!**

---

27 యత్ వై తత్ న శృణోతి।
శృణ్వన్ వైతత్, న శృణోతి। నహి శ్రోతుః శృతేః।
విపరిలోపో విద్యతే,
అవినాశిత్వాత్। న తు
తత్ ద్వితీయం అస్తి।
తతో అన్యత్ విభక్తం
యత్ శృణుయాత్।

సుషుప్తిలో ఉన్న జీవుడు (పురుషుడు) శబ్దమును వినటము లేదు. వినగలిగినవాడే, వినుచున్నవాడే **'వినకపోవటము'**ను నిర్వర్తించుచున్నాడు. శ్రవణేంద్రియము ఉపయోగించకపోయినంత మాత్రముచేత 'వినటము' అనే శక్తి నశించునది కాదు. **వినుచున్నట్టి ఆత్మకంటే వేరుగా 'వినుచున్నట్టిది' గాని, 'వినబడునట్టిది' గాని వేరుగా లేదు.** ఆత్మకు వినగలుగునట్టి శక్తి చెవులతో జనించేది కాదు. చెవులు ఉపయోగించ నప్పుడు నశించేదీ కాదు. ఆత్మకు భిన్నముగా ఎక్కడా ఏదీ లేదు. ఆత్మకు 'వినటము' అనే కళ ప్రదర్శించు చున్నప్పుడు చెవులు (వాయిద్యము అనే కళకు మద్దెలవలె) - ఉపకరణములు మాత్రమే।

---

28 యద్వై తత్ న మనుతే।
మన్వానో వై తత్ న మనుతే।
నహి మన్తుః మతేః విపరిలోపో
విద్యతే, అవినాశిత్వాత్।
న తు తత్ ద్వితీయం అస్తి।
తతో అన్యత్ విభక్తం యత్ మన్వీత॥

గాఢనిద్ర అనుభవించు పురుషుడు దేనిని గురించీ కూడా ఆలోచించుట లేదు. అనగా? ఆతడు ఆ సమయంలో తన ఆలోచనాశక్తి కోల్పోవుచున్నాడని అర్థమా? కానేకాదు. **"ఆతడు ఇప్పుడు ఆలోచనలు చేయక ఉన్నాడు. కానీ ఆలోచించే శక్తి కలిగి ఉండటము నశించిపోలేదు"** - అని మాత్రమే అర్థము. ఎప్పుడు తాను ఆలోచించాలనుకొంటే అప్పుడు తిరిగి ఆలోచనాశక్తిని ఉపయోగించగలడు!

అనగా, ఆతని ఆలోచనాశక్తి 'లేకపోవటము' లేదు. **ఇక్కడ రెండు విషయాలు :**

(1) ఆత్మయొక్క ఆలోచన చేయు శక్తికి వినాశనమనునది లేదు. సంకల్ప శక్తి ... నశించేది కాదు.

(2) సంకల్ప శక్తియొక్క **విస్తారిత రూపమే** సంకల్పించు విషయముల రూపము కూడా! (అనగా) ఆ విస్తారితమే ఈ జగత్తు.

---

29 యద్వై తత్ న స్పృశతి।
స్పృశన్ వై, తత్ న స్పృశతి।
నహి స్పృష్టుః స్పృష్టేః।
విపరిలోపో విద్యతే,
అవినాశిత్వాత్। న తు
తత్ ద్వితీయమస్తి। తతో
అన్యత్ విభక్తం యత్ స్పృశేత్॥

గాఢనిద్రపోవు పురుషుడు 'స్పర్శ' యొక్క అనుభవం పొందటంలేదు. దేనినీ తాను స్పృశించటంలేదు. అంతకుముందు జాగ్రత్‌లో స్పృశించు శక్తికలవాడే ఇప్పుడు దేనినీ స్పృశించనివాడై ఉన్నాడు. అయితే స్పర్శజ్ఞానము (స్పృశించుటచే తెలుసుకొను జ్ఞానము) నశించిపోయిందా? లేదు. **స్పృశించువాడు నశించువాడు కాదు. అట్లాగే స్పృశించుజ్ఞానము కూడా నశించదు. నశించునది కాదు.** స్పృశించుశక్తి స్పృశించుచున్న ఆత్మయొక్క శక్తియే. అట్లాగే, స్పర్శించు విషయానుభవరూపము (స్పర్శ-స్పృశించబడునది) ఆత్మనుండి విడివడటము లేదు. ఆత్మ స్వరూపముగా, **"స్పృశించువాడు - స్పృశించుబడునని"** కూడా ఆత్మను ఆశ్రయించి, **ఆత్మకు అభిన్నమై ఉన్నాయి.**

30 యద్వై తత్ న విజానాతి।
విజానన్ వై తత్, న విజానాతి।
నహి విజ్ఞాతుః విజ్ఞాతేః॥
విపరిలోపో విద్యతే॥
అవినాశిత్వాత్ ।
న తు తత్ ద్వితీయం అస్తి।
తతో అన్యత్ విభక్తం యత్ విజానీయాత్॥

గాఢనిద్రలో ఉన్నవాడు విషయములను తెలుసుకొనటము లేదు. ఎవ్వడైతే విషయములను తెలుసుకొనుచున్నాడో ఆతడే **తెలుసుకోవటమును మానినవాడై ఉన్నాడు.** తెలుసుకోగలిగినవాడే తెలుసుకోవటమును మానుచున్నాడు. అట్టి తెలుసుకుంటూ ఉన్నవాని తెలివి గాఢనిద్ర సందర్భములో నశించుచున్నదా? లేదు.

తెలుసుకొనుచున్నవాడు ఆత్మస్వరూపుడే. ఆత్మ- విజ్ఞానము...రెండూ అవినాశనమే! ఆత్మకు వేరుగా తెలియబడుచున్నదీ లేదు. తెలుసుకొనుచున్నట్టిదీ లేదు. **(1) తెలుసుకొనువాడు (2) తెలియ బడునది- ఉభయమూ అవిభక్తమగు ఆత్మస్వరూపమే!**

---

31 యత్ర వా అన్యత్ ఇవస్యాత్, తత్ర →
అన్యో అన్యత్ పశ్యేత్।
అన్యో అన్యత్ జిఘ్రేత్।
అన్యో అన్యత్ రసయేత్।
అన్యో అన్యత్ వదేత్ ।
అన్యో అన్యత్ శృణుయాత్ ।
అన్యో అన్యత్ మన్వీత।
అన్యో అన్యత్ స్పృశేత్ ।
అన్యో అన్యత్ విజానీయాత్॥

ఆత్మకు అన్యమైనదేదైనా మరొకటి ఉంటే...., అప్పుడు

ఆత్మ రెండవ వస్తువును చూడటము, వినటము, స్పృశించటము, రుచి చూడటము, ఇవన్నీ జరుగుగలవేమో! కానీ **ఆత్మ సర్వదా అనన్యమైనది. అనుభవము అనుభవజ్ఞునికంటే ఏమాత్రము వేరు కాదు.** అట్టి ఆత్మకు వేరుగా ఏదైనా ఉంటే, అప్పుడు ఒకటి రెండవదానిని చూడటము, వినటము, మాటలాడటము, స్పృశించటము, తెలుసుకోవటము జరుగగలదు.

- ఆత్మ సర్వదా, "సమస్తముతో కూడినది" అయి,- **ఏకమేగాని అనేకము కాదు.**

- కలలో ఉన్నదంతా కల తనదైనవానియొక్క కల్పనా స్పందనమే అయినట్లు, జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు తదంతర్గత విశేషాలు ఆత్మకల్పనకు వేరు కాదు. ఆత్మయొక్క స్వయం స్పందనా విశేషములే.

---

32 సలిల ఏకో ద్రష్టా, అద్వైతో భవతి।
ఏష బ్రహ్మలోకః, సమ్రాట్! ఇతి।
హైనమ్ అనుశశాస యాజ్ఞవల్క్యః।

ఓ సమ్రాట్! జనక మహారాజా! ఒక తటాకమునందు నిండుగా నీరు ఉండి ఉన్నప్పుడు...నీరంతా ఏకమే అయి ఉంటుంది. అంతేగాని కుడివైపు నీరు, ఎడమవైపు నీరు, పైన నీరు, లోపల నీరు - అను భేదములు జలమునకు ఉంటాయా? ఉండవు. **బ్రహ్మము ఎరిగినప్పుడు ఆ సమయంలో కేవలము ద్రష్టమాత్రమే ఏక-అద్వైతస్వరూపుడై ఉంటున్నాడు.** దృశ్యము తన రూపభావనయే। ఏకము-నిర్మలము అగు బ్రహ్మానుభవమే బ్రహ్మలోకము (లేక) బ్రహ్మావలోకనము - **అని యాజ్ఞవల్క్యుడు అనుశాసనంగా బోధించారు. ఇంకా ఇట్లా చెప్పసాగారు.**

---

<u>యాజ్ఞవల్క్యుడు</u> : ఏషా అస్య పరమా గతిః।
ఏషా అస్య పరమా సంపత్।
ఏషో అస్య పరమో లోక।
ఏషో అస్య పరమ ఆనన్ద।
ఏతస్యైవ ఆనన్దస్య –
అన్యాని భూతాని మాత్రాం ఉపజీవన్తి॥

**<u>యాజ్ఞవల్క్యుడు</u> :** అట్టి నిర్మలము - ఏకము - అద్వితీయము అగు బ్రహ్మావలోకనమే ఈ జీవునికి (ఈ పురుషునికి) పరమాగతి। చేరవలసిన స్థానము। అదియే పరమసంపద। అదియే పరమలోకము। అదియే పరమానన్దము।

బ్రహ్మానందము అనే మహాసముద్ర జలముయొక్క ఒక లేశమాత్రమే ఈ జీవులందరియొక్క జీవనము. ఆ ఒక్క బ్రహ్మానందలేశమాత్రము చేతనే ఈ జీవులందరూ జీవనము సాగించుచున్నారు. (జీవించటము అను ఆనందము - **'బ్రహ్మము'** అను ఆనంద సముద్రములోని ఒక బిందువు వంటిది). **దృష్టాంతముగా చెప్పుకోవాలంటే** →

---

33 స యో మనుష్యాణాగ్ం
రాద్ధః సమృద్ధో భవతి।
అన్యేషాం అధిపతిః
సర్వైః మానుష్య, ఏకైః భోగైః సంపన్న తమః।
స "<u>మనుష్యాణాం పరమ ఆనన్దో</u>"।

**మనుష్యానందము** = ఒకడు సక్రమమైన - పరిపుష్ఠి అయిన అవయవములు కలిగిఉండి, భోగ్యవస్తువులన్నీ కలిగిఉన్నవాడై, సర్వ సహజనులపై ఆధిపత్యము కలవాడై, మానవలోకములోని భోగము లన్నిటితో కూడుకొన్నవాడై, అందరిలోకి సర్వశ్రేష్ఠుడై, ఏదీ కొఱతలేకుండా ఉన్నప్పుడు-ఆ మనుష్యునకు లభించు ఆనందము→ **"మనుష్యానందము".**

| | |
|---|---|
| అథ యే శతం మనుష్యాణాం ఆనన్దాః,-<br>స ఏకః "పితౄణాం జితలోకానాం ఆనన్దో।" | అట్టి మనుష్యానందమునకు **వందరెట్లైనది** - పితృలోకము జయించినప్పటి (చేరినప్పటి) **'పితృలోకానందము'**. |
| అథ యే శతం పితౄణాం జితలోకానాం ఆనన్దాః<br>స ఏకో "గంధర్వలోక ఆనన్దో"॥ | అట్టి పితృలోకము జయించినప్పటి ఆనందమునకు - **వందరెట్లైన** ఆనందము ఒక **'గంధర్వలోకానమందము'**తో సమానము. |
| అథయే శతం గన్ధర్వలోక ఆనన్దాః<br>స ఏకః "కర్మదేవానామ్ ఆనన్దో"॥<br>యే కర్మణాదేవత్వం అభి సంపద్యన్తే॥ | అట్టి గంధర్వలోకానందమునకు **నూరురెట్లైనది** - ఒక **'కర్మ దేవతల ఆనందము'**. |
| అథ యే శతం కర్మదేవానాం ఆనన్దాః<br>స ఏక "అజాన దేవానామ్ ఆనన్దో"।-<br>యశ్చ శ్రోత్రియో అవృజినో, అకామహతో। | అట్టి కర్మదేవతల ఆనందమునకు **నూరు రెట్లైనది**...ఒక్క **'అజానదేవతానందము'**. |
| అథ యే శతం అజానదేవానాం ఆనాన్దాః<br>స ఏకః "ప్రజాపతిలోక ఆనన్దో"।<br>యశ్చ శ్రోత్రియో, అవృజినో, అకామహతో।<br>అథ యే శతం ప్రజాపతిలోక ఆనన్దాః<br>స ఏకో బ్రహ్మలోక ఆనన్దో,<br>యశ్చ శ్రోత్రియో, అవృజినో, అకామహతో॥ | అజానదేవతానందమునకు **నూఱు అంతలు** వేదాధ్యయనము చేసినవాడు (శ్రోత్రియుడు), వృజినుడు (సర్వపాపములనుండి విముక్తిపొందినవాడు), నిష్కాముడు (కోరికలు హృదయమునందు లేకుండా చేసుకొన్న) అగు **ప్రజాపతి ఆనందము.** అట్టిది నిర్మల శ్రోత్రియుడు, సర్వకామములు తొలగించు కొన్నట్టి వేదవేత్త కూడా పొందుచున్న ఆనందము. ప్రజాపతి ఆనందము వందరెట్లు అయినది - ఒక **బ్రహ్మలోకానందము.** |
| అథైష ఏవ పరమ ఆనన్దః<br>ఏష బ్రహ్మలోకః, సమ్రాట్! ఇతి॥ | అట్టి ఏ శ్రోతియ - వృజిన - కామరహిత, పరమానంద రూపమగు ప్రజాపతి ఆనందమునకు **నూఱు రెట్లైనది బ్రహ్మానందము.** జనకమహారాజా! కేవలమగు బ్రహ్మానందమే బ్రహ్మముయొక్క విలక్షణ లక్షణము. (అది సోఽహమ్-తత్త్వమ్ భావనలచే స్వస్వరూపము యొక్క ఔన్నత్యమును ఎరుగుచున్న స్థానము). |
| జనకుడు : (ఇతి) హోవాచ। యాజ్ఞవల్క్యః,<br>"సోఽహమ్ భగవతే<br>సహస్రం దదామ్యత, ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి।" | **జనకమహారాజు** : స్వామీ! యాజ్ఞవల్క్యా! నేను మీకు వేయి గోవులను దక్షిణగా సమర్పించుకొంటాను. **ఇక నాకు మోక్షస్థానమును నేర్పించండి!** |
| అత్ర హ యాజ్ఞవల్క్యో భిభయాఇచకార। | అట్లు జనకుడు కోరగా విని, యాజ్ఞవల్క్యుడు 'భయము' పొందారు. |
| మేధావీ రాజా<br>సర్వేభ్యో మా అంతేభ్య<br>ఉదరౌత్సీతి। ఇతి॥ | **"ఆహా! ఈ జనకచక్రవర్తి మహామేధావి. సర్వ ప్రశ్నలను అంతముచేసి వేయగల అంతిమ సమాధానముకొరకై నన్ను కట్టివేయుచున్నారు. నేను ఏఏ నిర్ణయములను చెప్పటం జరుగుతూ వస్తోందో, అవన్నీ కోరికల పరిధిలోనివేకదా? - ..అని ఈయన గుర్తిస్తున్నారు. మరల ఆత్మ విజ్ఞానముయొక్క పరాకాష్ఠకై ప్రేరేపించుచున్నారే?"**...అని తలచారు. |
| **34** స వా ఏష ఏతస్మిన్<br>స్వప్న - అన్తే రత్వా, చరిత్వా<br>దుష్ట్వైవ పుణ్యం చ పాపం చ,<br>పునః ప్రతిన్యాయం ప్రతియోన్యా ద్రవతి<br>బుద్ధాన్తాయైవ॥ | **యాజ్ఞవల్క్యుడు** : ఓ జనక మహారాజా! ఈ పురుషుడు స్వప్నములో ప్రవేశించినప్పుడు అట్టి స్వప్నసీమలో పుణ్య పాపములు అనుభవించి తిరిగి జాగరిత స్థానములో ప్రవేశించుచున్నాడు.<br><br>జాగరిత స్థానము నుండి బయల్వెడలి స్వప్నాకాశములో ప్రవేశించి, సుఖ-దుఃఖములను అనుభవించి, "ఇక చాలు!" అనుకొంటున్నాడు. తిరిగి తాను బయల్వెడలిన అదే - మార్గముననే వెనుకకు మరలి జాగ్రత్ ఆకాశములో ప్రవేశించుచున్నాడు. |





**35 తత్ యథా అనస్సుసమాహితం**
**ఉత్సర్జద్యాయా దేవమ్ ఏవాయగ్ం శరీర**
**ఆత్మా ప్రాజ్ఞేన ఆత్మన**
**అన్వారూఢ ఉత్సర్జన్యాతి**
**యత్ర ఏతత్ ఊర్ధ్వ ఉచ్ఛ్వాసీ భవతి॥**

ఈ పురుషుడు ఏవిధంగా అయితే స్వప్నము నుండి జాగరితము (From Dream to Awakened state) పొందుచున్నాడో,... అదేతీరుగానే ఆతడు ఇతః పూర్వపు దేహమునుండి, ఈ దేహమును పొందుచున్నాడు.

అనేక వస్తువులతో నింపబడిన ఒక బండి ధ్వనిచేస్తూ, బండి వానిచే నడుపబడుచు ఒక స్థానము నుండి మరొక స్థానము చేరుచున్నది చూచారా? ఒక పట్టణము నుండి మరొక పట్టణము చేరుచున్నది కదా! అట్లాగే, "లింగశరీరము (భావనా పరంపరలు)" అనే సామాను మోసుకొని ఈ పురుషుడు (జీవుడు) ఒక దేహమునుండి మరొక దేహములోనికి ప్రవేశించుచున్నాడు.

అట్టి ఈ దేహము ఒకప్పటికి శిధిలమైనప్పుడు ఈ భౌతికదేహమునుండి ఉచ్ఛ్వాస ఎగశ్వాస (పైకిపోవు శ్వాస) పొందుచూ ఈ దేహము నుండి దేహి (జీవుడు) ఉపసంహారము పొందుచున్నాడు.

---

**36 స యత్ర అయమ్ అణిమానంన్యేతి**
**జరయా వో ఉపతపతవా,**
**'అణి' మానం నిగచ్ఛతి, -**
**తత్ యథా ఆమ్రం వా**
**ఉదుమ్బరం వా, పిప్పలం వా,**
**బన్ధనాత్ ప్రముచ్యతే, - ఏవమేవ**
**అయం పురుష ఏభ్యో అంగేభ్యః సంప్రముచ్య,**
**పునః ప్రతి న్యాయం ప్రతియోన్యా ద్రవతి ప్రాణాయైవ॥**

ఎప్పుడైతే ఈ దేహము వార్ధక్యము (ముసలితనము) కారణంగా చిక్కిశల్యమైపోతుందో, (లేక) అనారోగ్యము కారణంగా కృంగి కృశించి పోతుందో,.. అప్పుడిక ఇది (ఈ దేహము) ఊర్ధ్వశ్వాస పొందటం ప్రారంభిస్తోంది. ఇక పండిన ఆమ్రం (మామిడిపండు), ఉదంబరం (మేడిపండు) లేక పిప్పలం (రావిపండు) - ఏ విధంగా అయితే చెట్టుయొక్క తొడిమనుండి వీడిపోతుందో, ఆ విధంగా ఈ భౌతికదేహము నేలకూలుతోంది. **అప్పుడు ఈ పురుషుడు ఎక్కడినుండి ప్రాణములతో వచ్చి ఈ దేహములో ప్రవేశించటము జరిగిందో, ఆ స్థానమునకు (చోటికి) చేరుచున్నాడు.** అదే విధంగా ఈతడు మరొక శరీరమునందు ప్రాణముల స్వానుభవము కొరకై (ఇంద్రియానుభవముల కొరకై) ప్రవేశము పొందుచున్నాడు.

---

**37 తత్ యథా రాజానం**
**ఆయాన్తం ఉగ్రాః ప్రతి ఏనసః (ప్రత్యేనసః),-**
**సూత గ్రామణ్యో అన్నైః పానైః,**
**ఆవసథైః, ప్రతికల్పన్తే -**
**"అయం ఆయాత్యయం ఆగచ్ఛతి"**
**- ఇతి ఏవగ్ం హైవం(నం)**
**విదగ్ం సర్వాణి భూతాని**
**ప్రతికల్పన్త॥ ఇదం బ్రహ్మ ఆయాతి॥ -**
**ఇదం ఆగచ్ఛతి॥ ఇతి॥**

ఓ జనకమహారాజా! ఈ జీవుడు ఒక దేహమును త్యజించిన తరువాత మరొకచోటు మరొక పాంచభౌతికదేహము ఎట్లా సంసిద్ధమగుచున్నదని అడుగుతారా? వినండి!

ఒకానొక దేశంలో ఒక మహారాజు దేశ పర్యటన చేస్తూ, ఒక గ్రామానికి వస్తున్నారు. ఆ గ్రామములోని (గ్రామములో ప్రజలెవ్వరన్నా తప్పు చేస్తే శిక్షించే అధికారమును రాజు నుండి పొందియున్న) గ్రామాధికారులు, ఉగ్రకర్మలు చేయు స్వభావముగల వారు, తదితర గ్రామ జనులు మొదలైనవారంతా - "ఇదిగో మహారాజు గారు వస్తున్నారు. ఆయనకు భక్ష్య భోజ్యములు అందించాలి. పానక ద్రవ్యాలు సిద్ధం చేయాలి. బస చేయటానికి మేడ మొదలైనవి సిద్ధపరచాలి!"....అని తలచి, అంతా సిద్ధము చేసి ఎదురుచూస్తూ ఉంటారు.

అదేవిధంగా కర్మఫలములు అనుభవించటానికై దేహములోనికి వేంచేస్తున్న జీవుని రాకకై ఎదురుచూస్తున్న ఇంద్రియతత్త్వములు - **"ఇదిగో! జీవ-బ్రహ్మము వచ్చుచున్నది! బ్రహ్మమే జీవుడుగా వచ్చుచున్నది!"** అని వేచి ఉంటున్నాయి.

**38.** తద్యథా రాజానం
ప్రయియాసన్తం ఉగ్రాః ప్రత్యేనసః
సూత గ్రామణ్యో అభిసమాయన్తి,
ఏవమే వే నమ ఆత్మానం అన్తకాలే
సర్వే ప్రాణా అభిసమాయన్తి,
యత్ర ఏతత్ ఊర్ధ్వ ఉచ్ఛ్వాసీ భవతి।

ఇతి బృహదారణ్యకోపనిషత్ – షష్ఠాధ్యాయః
"జ్యోతిర్బ్రాహణమ్" నామ తృతీయ బ్రాహ్మణమ్॥

ఏవిధంగా అయితే ఒక మహారాజుగారు సేనా సమేతుడై ప్రయాణమునకై బయల్వెడలుచుండగా, ఆతని సైనికులు, అంగరక్షకులు, సేవకులు, గ్రామాధికారులు...మొదలైనవారంతా రాజుగారి మంది - మార్బలమై వెంటబయలుదేరుచున్నారో,..ఆ విధంగానే

**పురుషుడు ఒక దేహమును త్యజించి మరొక దేహమునకు బయలుదేరుచున్నపుడు, క్రితం దేహము నుండి పైకి లేచి ప్రాణములు, సంస్కారాలు, ఇంద్రియశక్తులు, అనుభవ విశేషాలు, అభ్యాసాలు మొదలైనవి (మంది - మార్బలమువలె) నిర్మల ఆత్మస్వరూపుడగు పురుషుని [ శేషించిన సంస్కారముల (వాసనల) రూపంగా ] అనుసరించు చున్నాయి.**

ఇతి బృహదారణ్యకోపనిషత్ – షష్ఠాధ్యాయః
"జ్యోతిర్బ్రాహణమ్" నామ తృతీయ బ్రాహ్మణమ్॥

# షష్ఠమాధ్యాయః - చతుర్థ బ్రాహ్మణమ్

## శారీరక బ్రాహ్మణము

1. స యత్ర అయం ఆత్మా అబల్యం నేత్య
సమ్మోహమివ, నేత్యథైనమ్ ఏతే
ప్రాణా అభి సమాయన్తి॥
స ఏతాః తేజో మాత్రాః
సమభ్యా దదానో, హృదయమేవ
ఆన్వవక్రామతి॥
స యత్రైష చాక్షుషః పురుషః
పరాఙ్పర్య ఆవర్తతే,
తథా అరూపజ్ఞో భవతి॥

ఈ శరీరస్థుడగు జీవాత్మ తాను అవధరించిన శరీరము దృష్ట్యా (శరీర సంబంధముగా) దుర్బలుడు అయినప్పుడు, మూర్ఛ (సమ్మోహితము) పొందినప్పుడు ఆతనికి మరణము సంభవిస్తోంది. అట్టి మరణకాలము నందు - పంచప్రాణములు భౌతిక దేహమునుండి ఉప సంహారము పొంది జీవాత్మను (Individual state of one's own SELF) చేరుచున్నాయి.

ఇతః పూర్వము కళ్లు - చెవులు - చర్మము - నాలుక - ముక్కు మొదలైన దేహస్థానములందు ఆక్రమించినిండియున్న తేజస్సును ఈ జీవాత్మ (పురుషుడు) తన స్వస్వరూపము వైపుగా ఆకర్షించి తన హృదయాంతరమున ప్రవేశించుచున్నాడు. **ఆ హృదయమునందే భవిష్యత్ దేహవిజ్ఞానరూపము ప్రకటనమగుచున్నది.**

ఎప్పుడైతే హృదయస్థమగు చక్షురింద్రియ దేవత ఇంద్రియ గోళమునకు చూపును ప్రవహింపజేయటము **మానివేస్తోందో,** అప్పుడు ఆ పురుషుడు చూచుటయందు విముఖుడై **(హృదయమునందు) అంతటా వ్యాపించినవాడగుచున్నాడు.** అప్పుడు ఆ దేహ-కంటిగోళములలో ఆ పురుషుడు బాహ్య రూపజ్ఞానము లేనివాడగుచున్నాడు. (ఆ కళ్ళతో చూడనివాడగుచున్నాడు). అయితే, చూడటము అనే 'శక్తి' ఆ పురుషుని వెన్నంటినదై ఉంటోంది. అనగా, చూచే శక్తి నాశనము పొందటం లేదు.

---

2. "ఏకీభవతి। న పశ్యతి" ఇతి ఆహుః।
"ఏకీభవతి, న జిఘ్రతి" ఇతి ఆహుః।
"ఏకీభవతి న రసయత" ఇతి ఆహుః।
"ఏకీభవతి న వదతి" – ఇతి ఆహుః।
"ఏకీభవతి న శృణోతి" ఇత్యాహుః।
"ఏకీభవతి న మనుత" ఇత్యాహుః।
"ఏకీభవతి, న స్పృశతి" ఇత్యాహుః।
"ఏకీభవతి, న విజానాతి" ఇత్యాహుః।

**ఆ భౌతికదేహమునకు సంబంధించిన బంధువులు మరణించుచున్న ఆ పురుషుని దేహమును చూస్తూ...,**

- ఈతడు కళ్లతో చూడటము లేదు. ఈతని 'చూపు' అను శక్తి ఆత్మతో ఏకత్వము పొందింది.

- ఈతడు వాసన (smell) గుర్తించటము లేదు. ఈతని ఘ్రాణశక్తి ఆత్మతో ఏకత్వము పొందినదైనది.

- ఈతని నాలుక రుచి చూడటం లేదు. రుచి చూచు శక్తి ఆత్మతో (జీవాత్మతో) ఏకత్వము పొందినట్లైనది.

- ఈతడు నోటితో మాట్లాడటము లేదు. మాట్లాడు ఈతని శక్తి ఈతని ఆత్మతో ఏకత్వము పొందినదైనది.

- ఈతని చెవులు శబ్దమును వినటము లేదు. ఈతడు చెవులకు ప్రసాదించిన వినికిడి శక్తి తిరిగి ఆత్మయందు లీనమై ఏకత్వము పొందినది.

- ఈతడు ఈ దేహముతో ఇప్పుడిక సంకల్పించటము లేదు. ఈతని సంకల్ప శక్తి దేహమును **వీడి దేహస్వరూపమగు** ఆత్మతో ఏకత్వము పొందినది.

- ఈతని దేహము నుండి వస్తువులను స్పృశించు స్పర్శజ్ఞానము దేహమునుండి తొలగి ఆత్మతో ఏకత్వము పొందుచున్నది.

- ఈతడు ఏదీ తెలుసుకోవటము లేదు. ఈతని 'ఎరుగుట' అనే శక్తి ఆత్మతో ఏకీభూతమైనది. The 'Knowing' is placed back in the 'Knower'.

తస్య హైతస్య హృదయస్య అగ్రం ప్రద్యోతతే
తేన ప్రద్యోతేన ఏష ఆత్మా నిష్క్రామతి।
చక్షుషో వా, మూర్ధ్నో వా,అన్యేభ్యో వా,
శరీర దేశేభ్యః తం ఉత్క్రామన్తం
ప్రాణోః అనుత్క్రామతి। (ప్రాణోనూత్క్రామతి)।
ప్రాణమ్ అనూత్క్రామనగ్ం
సర్వే ప్రాణా అనూత్క్రామన్తి,
స విజ్ఞానో భవతి।
స విజ్ఞానమేవ అన్వవక్రామతి।
తం విద్యా కర్మణీ
సమన్వ ఆరభేతే పూర్వ ప్రజ్ఞా చ॥

ఈవిధంగా మరణించుచున్న వాని గురించి బంధువులు 'ఈతడు వెళ్ళిపోయాడు' అని చెప్పుకుంటున్నారు. క్రమంగా సర్వేంద్రియ ప్రదర్శనములు జీవాత్మ చైతన్యము నందు ప్రవేశిస్తున్నాయి. గొప్ప ప్రకాశముతో వాసనారూపమగు లింగ శరీరము హృదయాంతర్గతంగా నిష్క్రమించుచున్నది. ఈ విధంగా ఇంద్రియములు విజ్ఞానాత్మతో కూడుకొన్నప్పుడు, హృదయ రంధ్రము యొక్క జీవనిర్గమస్థానమగు నాడీమార్గము ద్వారా ఆత్మ తేజస్సులో ప్రవేశిస్తున్నాయి.

ఇక లింగ శరీరము (Thought & Feeling Body) యొక్క ఉపాధిధారుడగు విజ్ఞానమయాత్మ (Conscious Self) కళ్ళ ద్వారాగాని, శిరస్సు (బ్రహ్మరంధ్రము) ద్వారాగాని, శరీరములోని ఇతర ప్రదేశముల ద్వారాగాని బయటకు పోవుచున్నది. ఇదియే ప్రాణములు దేహమును వీడటము అగుచున్నది.

**విజ్ఞానమయాత్మ** (Conscious Controller of Physical Body) దేహము - ఇంద్రియములకు 'సర్వాధికారి' అయినట్టి ప్రాణములను (Energy) తనవెంట కొనిపోవుచున్నది. వాక్ మొదలైన ఇంద్రియములు ప్రాణములను అనుసరించుచున్నవగుచున్నాయి.

లింగదేహము విజ్ఞానరూపముగానే (As consciously knowing factor) ఉంటున్నది. విజ్ఞానముతో ప్రకాశించుచూ గమ్యము (తాను ఉండ దలచిన తర్వాతి స్థితి - స్థానములు) వైపుగా ముందుకు సాగుచున్నది.

ఇతః పూర్వము ఆచరించిన విధి-నిషేధములు, కర్మలు, అనుభూతులు, అనుభవములు, అనుభవించిన స్థితులు...ఇవన్నీ **విషయ వాసనల రూపమున** పరలోకము (మరొకస్థితికి) వెళ్ళుచున్న ప్రాణములను అనుసరించుచున్నాయి. (Accompanying as Tendencies).

---

3. తత్ యథా తృణజలాయుకా,
తృణస్య అన్తం గత్వా,
అన్యమ్ ఆక్రమమ్, ఆక్రమ్య
ఆత్మానం ఉపసగ్ం హరతి, –
ఏవం ఏవ అయం, <u>ఆత్మా ఇదగ్ం</u>
<u>శరీరం నిహత్య, అవిద్యాం</u>
<u>గమయిత్వా, అన్యం</u>
<u>ఆక్రమమ। ఆక్రమ్య, ఆత్మానం ఉపసగ్ంహరతి।</u>

**ఈ దేహి వర్తమాన దేహమును విడచి మరొక దేహమును ఎట్లా ప్రవేశిస్తున్నాడు? వినండి!**

జెలగవంటి ఒక గడ్డి పురుగు - ఒక గడ్డిపోచ కొనను వదలుచూ, మరొక గడ్డిపోచను ఆశ్రయించి, క్రమంగా క్రితం గడ్డిపోచను దాటివేసి ముందుకు పోవుచున్నది కదా! అదే విధంగా ఈ పురుషుడు శిధిలమగుచున్న శరీరమును క్రిందపడవైచి, ఆ శరీరమును 'నిశ్చేష్టితము' కాగా, మరొక శరీరమును పొందుచు, **మొదటి శరీరము నుండి ఉపసంహారము** పొందుచున్నాడు. వేరొక దేహమును పొంది **"నేను ఇక ఈ శరీరమునకు చెందినవాడను మాత్రమే"** అని భావిస్తూ ఆ నూతన దేహము పట్ల ఆత్మభావన పొందుచున్నాడు. **ఇతఃపూర్వపు భౌతిక శరీరపు విశేషములన్నీ 'జరిగిపోయిన కల' వలె 'సత్యము కాదు' - అను భావన పొందుచున్నాడు.**

అవిద్యచే పూర్వపు శరీరముతో పొందిన సంబంధ - బాంధవ్యములను (స్వప్నమును త్యజించినట్లు) త్యజించి నూతన శరీరము మాత్రమే తనకు సంబంధించినట్లు, తాను ఆ నూతన శరీరమునకు మాత్రమే సంబంధించినట్లు, పరిమితమైనట్లు ఈ దేహి అనుభూతి పొందుచున్నాడు. పూర్వవాసనలే నూతన శరీరముతో కూడా **"ఉపకరణ వినియోగము'**వలె (As Instrumental) కొనసాగించబడు చున్నాయి. మాయకు లోనై ఆ పురుషుడు తన శరీరముల రాకపోకలకు, వేరైన **తనయొక్క అప్రమేయమును, అసంబధత్వమును** (Non-concerned and Non-related part of one's own self) **గమనించటమే లేదు.**

4. తద్యథా పేశస్కారీ పేశసో మాత్రామ్
ఉపాదాయాన్యన్ నవతరం
కల్యాణ తరగ్ం రూపం తనుత ఏవం,
ఏవ అయం ఆత్మా ఇదగ్ం శరీరం
నిహత్యా, అవిద్యాం గమయిత్వా, అన్యన్ నవతరం
కల్యానతరగ్ం రూపం కురుతే, పిత్ర్యం వా,
గాన్ధర్వం వా, దైవం వా, ప్రాజాపత్యం వా
బ్రహ్మం వా, అన్యేషాం వా భూతానామ్॥

ఓ జనక మహారాజా! ఒక స్వర్ణకారుడు (Gold Smith) శోభనుకోల్పోయిన బంగారు ఆభరణమును కరిగించి, ముద్దచేసి, తిరిగి ఆ బంగారు ముద్దతో నూతన శోభగల సుందరమైన మరొక ఆభరణమును తయారు చేయుచున్నాడు కదా! అట్లాగే ఆత్మస్వరూపుడగు ఈ పురుషుడు శిధిలము అయిన పూర్వ శరీరమును వదలి ప్రాణశక్తియుతుడై-సుందరమైన, నూతన శక్తి-ఉత్సాహములతో కూడిన - **నూతన శరీరమును నిర్మించుకొనుచున్నాడు. (నవయేవ మహోత్సవః- యోగవాసిష్ఠము)**

ఆ నూతన శరీరముతో అవిద్య కారణముగా తాదాత్మ్యము చెందుచూ **"నేను ఇప్పుడు మానవుడను. జంతువును. గంధర్వుడను. పితృదేవుడను. దేవతను"**...అనే **అన్యమైన భూతభావన** ను ఆశ్రయించుచున్నాడు. ఈ విధంగా శరీరముల పరంపరలలో వ్యవహరించుచు **"నేను ఈ అంతటికీ పరమైనట్టి (వేరైనట్టి) పరమపురుషుడను కదా" అనుదానిపై దృష్టి సారించటము లేదు.**

---

5. స వా అయమ్ ఆత్మా బ్రహ్మ విజ్ఞానమయో,
మనోమయః, ప్రాణమయః,
చక్షుర్మయః, శ్రోత్రమయః,
పృథివీమయ, ఆపోమయో,
వాయుమయ, ఆకాశమయః,
తేజోమయో, అతేజోమయః,
కామమయో, అకామమయః,
క్రోధమయో, అక్రోధమయో,

సర్వత్రా, సర్వదా, సర్వమునందు ప్రసిద్ధి కలిగినట్టి ఈ పురుషుడు (జీవుడు) విజ్ఞానస్వరూపుడగు పరబ్రహ్మమే। **పరబ్రహ్మత్వమే స్వస్వరూపముగా కలిగి ఉండియే ఈ పురుషుడు →**

- మనో స్వరూపుడుగాను, ప్రాణస్వరూపుడుగాను, నేత్ర (చూపు) స్వరూపుడుగాను,
- చెవుల (వినికిడి) స్వరూప పురుషుడుగాను,
- భూ(భౌతిక) స్వరూపుడుగాను,
- ఉదక స్వరూపుడుగాను
- వాయుమయ స్వరూప పురుషుడుగాను,
- ఆకాశమయ స్వరూపుడుగాను,
- తేజో సహిత రూపుడుగాను,
- తేజో రహితరూప పురుషుడుగాను,
- కామమయ పురుషుడుగాను,
- అకామమయ పురుషుడుగాను,
- క్రోధమయ పురుషుడుగాను,
- అక్రోధమయ పురుషుడుగాను,

---

ధర్మమయో, అధర్మమయః, సర్వమయః
తద్యత్ ఏతత్ ఇదం మయో, అథోమయ ఇతి॥

- ధర్మమయ పురుషుడుగాను,
- అధర్మమయ పురుషుడుగాను,
- సర్వ స్వరూపుడుగాను, ప్రత్యక్షముగా కనిపించే ఈ సమస్తముగాను అగుచున్నాడు.

**ఆత్మయే** - (1) ప్రత్యక్షముగా ఇంద్రియములకు గోచరమగుచున్న సర్వరూపముగాను, (2) అప్రత్యక్షరూపములగు శరీరములోని శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ - శక్తులుగాను, (3) మనోబుద్ధి చిత్త అహంకార అంతఃకరణ చతుష్టయముగాను - అగుచున్నది.

యథాకారీ, యథాచారీ – తథా భవతి।
సాధుకారీ సాధుః భవతి।
పాపకారీ పాపో భవతి।
పుణ్యః పుణ్యేన కర్మణా భవతి।
పాపః పాపేన।
అథో ఖలు ఆహుః।
కామమయ ఏవ అయం పురుష ఇతి।
స యథా కామో భవతి, తత్ క్రతుః భవతి।
యత్ 'క్రతుః' భవతి,
తత్ 'కర్మ' కురుతే।
యత్ కర్మ కురుతే, తత్ అభిసమ్పద్యతే।

**ఆత్మ ఏ కారణమును ఆశ్రయిస్తే ఆ ఆకారణముగా ఉన్నట్లు, ఏ ప్రవర్తనను ఆచరిస్తే, అది అద్దాని ప్రవర్తనగాను, అద్దాని స్వభావమైనట్లు గాను** అగుచున్నది.

ఆత్మయే జీవరూపమును తనయొక్క ప్రతిబింబము వలె (లేక- 'అంశ' వలె) కల్పించుకొని, సాధు ఆచరణముచే సాధువుగాను, పాపపు ఆచరణలచే పాపిగాను కూడా అయినట్లు అగుచున్నది.

పుణ్యకర్మలచే పుణ్యశీలిగాను, పాపకర్మలచే పాపశీలిగాను కూడా, (కథలోని పాత్రవలె) అగుచున్నది. పుణ్యకర్మలచే ఉత్కృష్టుడుగాను పాపకర్మలచే నికృష్టుడుగాను- **అగుపించుచున్నది.**

ఇంకా కూడా ఈ పురుషుడు అనేక దృశ్య సంబంధమైన కోరికలు (కామనలు) కలిగి ఉంటున్నాడు. ఎట్టి కోరికలుంటే అట్టి సంకల్పములనే కలిగి ఉంటున్నాడు. ఎట్టి క్రతువు ((క్రియాభావన)లను కలిగి ఉంటే,- అట్టి కర్మలనే నిర్వర్తించుచున్న వాడగుచున్నాడు. అట్టి కర్మలయందే ఆసక్తి కలిగి ఉంటున్నాడు.

ఎట్టి కర్మలను ఏ ఉద్దేశ్యముతో నిర్వర్తిస్తూ ఉంటే అట్టి ప్రయోజనములనే పొందుచున్నాడు.

---

6 తత్ ఏష శ్లోకో భవతి।
తదేవ సక్తః సహ కర్మణైతి।
లింగం మనోయత్ర నిషక్తమ్ అస్య (నిషక్తమన్య)
ప్రాప్యాన్తం కర్మణః తస్య యత్కించ
ఇహ కరోతి అయం॥
తస్మాత్ లోకాత్ పునః ఏతస్మై లోకాయ
కర్మణ ఇతి తు (ను) కామయమానో।

**ఈ అర్థమే శ్లోకములుగా (శాస్త్రములచే) ఈవిధంగా గానము చేయబడుతోంది.**

ఈ పురుషుడు ఏ ఆసక్తి కలిగి ఉండి కర్మను నిర్వర్తిస్తాడో, అట్టి ఫలమునే పొందుచున్నాడు. ఆతని మనస్సు దేనియందు ఆసక్తి, అభినివేశము కలిగి ఉంటోందో, అదియే ఆతనిచే కర్మగా నిర్వర్తించబడుచున్నది. అద్దాని స్వభావమే (లింగమే) తానై, ఆ కర్మ ఫలము అనుభవించుటకై ఆ లోకము నుండి ఈ లోకమునకు, ఈ లోకమునుండి ఆలోకమునకు తిరిగి - తిరిగి వచ్చుచున్నాడు.

కామములతో కర్మము చేయువాని (కామ్యకర్మలను నిర్వర్తించువాని, కర్మఫలకామియొక్క) గతి - ప్రయాణములు ఈ తీరుగానే అంతులేనివై ఉంటున్నాయి. ('సకామ కామి' - అనబడుచున్నాడు).

---

అథ అకామయామానో,
యో అకామో నిష్కామ,
ఆప్తకామ, ఆత్మకామః,
న తస్య ప్రాణా ఉత్క్రామన్తి।
బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి॥ (బ్రహ్మ–అప్యేతి)॥
(య ఏవం వేద)॥

**ఎవ్వడైతే 'అకామకామి' అయి దృశ్యసంబంధమైన కోరికలు లేనివాడై ఉంటాడో, అట్టి అకామి (లేక) నిష్కామి (లేక) ఆప్తకామి (లేక) ఆత్మకామి యొక్క ప్రాణములు మరణానంతరము మరొక శరీరము కొరకై పరుగులు తీయుటలేదు.** మరి? అతని ప్రాణములు విశ్వప్రాణమునందు లీనమై ఆతడు ఆత్మగా సర్వే సర్వత్రా ఆక్రమించుకొనినవాడై, 'బ్రహ్మము'గా అగుచూ, 'బ్రహ్మము'గా వేంచేసి ఉంటున్నాడు. పరబ్రహ్మమే తానగుచున్నాడు. విశ్వరూపుడై విహరిస్తున్నాడు.

విశ్వప్రాణి అయి, బ్రహ్మవేత్తగా **'బ్రహ్మమే తాను'**- అని ఆస్వాదిస్తున్నాడు.

---

7. తత్ ఏష శ్లోకో భవతి।
యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే,
అస్య హృదిశ్రితాః,
అథ మర్త్యో అమృతో భవతి।
అత్ర బ్రహ్మ సమశ్నుతి (త) ఇతి॥

**ఇది ఇట్లు ఇంకా గానము చేయబడుచున్నది.**

ఎవ్వనియందైతే హృదయమునందలి దృశ్య విషయములపట్ల- సర్వ కోర్కెలు **నశించిపోయినవో, రహితమైనవో,** ఎవ్వని హృదయము సర్వ కోర్కెలనుండి విముక్తి పొందుచున్నదో, ఆ పురుషుడు ఇక్కడే మరణరహితుడగుచున్నాడు. ఆతనికి దేహ-దేహాంతరముల ప్రాణప్రయాణము అనావస్యకమగుచూ, ఆతడు **ఇక్కడే అమృతుడు అగుచున్నాడు. జన్మ-కర్మలకు అతీతుడై ప్రకాశిస్తున్నాడు.**

**తత్ యథా, – అహి నిర్ల్వయనీ**
**వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమ్ ఏవ,**
**ఇదగ్ం శరీరగ్ం శేతే**
**అథాయమ్ అశరీరో, అమృతః ప్రాణో**
**బ్రహ్మైవ తేజ ఏవ।**

పాము తన పుట్టపై తాను విడచిన కుబుసమును చూచి "ఆహా! ఇది నా మృతరూపమగు నేనే!"....అని అనుకుంటుందా? లేదుకదా। కుబుసమును వీడి పాము ప్రశాంతముగా పుట్టలో పండుకొని ఉంటుంది కదా। అట్లాగే సర్వ కోర్కెలను దాటివేసిన, త్యజించిన జీవన్ముక్తుడగు **ఆత్మయోగి శరీరము మొదలే లేనివాడు, కాబట్టి మరణము లేనట్టివాడు అగుచున్నాడు. అవన్నీ ఉండికూడా, - ఆతనివట్ల ఏ సమయంలోనూ 'లేనివే' అగుచున్నాయి.**

కేవల ప్రాణస్వరూపుడై సప్రాణముగా అంతటా నిండి ఉంటున్నాడు.

**"కేవల తేజోమయ బ్రహ్మము"** అయి వెలుగొందుచున్నాడు. ఈ విధంగా బ్రహ్మవేత్తలు జీవించి ఉన్నప్పుడే, దేహము ఉండగానే ఆత్మస్వరూపులై విరాజిల్లుచున్నారు.

---

**జనకుడు : సోఽహం, భగవతే! సహస్రం దదామి।**
**– ఇతి హోవాచ జనకో వైదేహః। –**

జనకమహారాజు : హే భగవాన్! యాజ్ఞవల్క్యా! మీరు ప్రవచించుచున్న 'శారీరక బ్రాహ్మణము'ను విని నేను మహదానందము పొందుచున్నాను. **గురుదక్షిణగా వేయి గోవులను సమర్పించుకుంటున్నాను. దయతో స్వీకరించుటకు అంగీకరించండి.**

---

**8. యాజ్ఞవల్క్యుడు : తత్ ఏతే శ్లోకా భవన్తి।**
**అణుః పన్థా వితతః పురాణో మాగ్ం**
**స్పృష్టో అనువిత్తో మయైవ।**
**తేన ధీరా అపి యన్తి బ్రహ్మవిదః**
**స్వర్గం లోకమిత ఊర్ధ్వః విముక్తాః॥**

**యాజ్ఞవల్క్యుడు : ఆత్మకాముడగు బ్రహ్మవేత్తకు మోక్షము స్వభావసిద్ధమే అగుచున్నది.** (అది పొందబడటము వంటిది కాదు) - అని శాస్త్రకారులు గానము చేయుచున్నారు.

ఓ జనకమహారాజా! ఆత్మతో ఏకీభూతానుభవము-అత్యంత సూక్ష్మతరమైన **మార్గము, స్థానము,** (14 లోకములను ఆక్రమించివేయు) **అత్యంత విస్తారము** కూడా. **జన్మ - కర్మల కంటే మునుముందే ఉన్నప్పటి అప్పటి స్థితి, ఇప్పటి స్థితి కూడా.** కాబట్టి అట్టి సనాతన పురాణ మార్గమును, స్థానమును నా హృదయము పొందినది. నేను స్పృశిస్తున్నాను. ఆస్వాదిస్తున్నాను!

వివేకవంతులగు ధీరులు, బ్రహ్మవేత్తలు ఈ దృశ్యమునుండి ఇప్పుడే ఇక్కడే విముక్తులగుచున్నారు. ప్రజ్ఞావంతులగు ఆ బ్రహ్మతత్త్వజ్ఞులు జీవించి ఉండగానే, ఈ దేహ - ఇంద్రియ - ఇంద్రియ జగత్తులు ఇట్లా ఎదురుగా ఉండినా కూడా (జీవించి ఉన్నప్పుడే, దేహము ఉన్నప్పుడే)- **వారు అంతటా ఆత్మచే నింపివేసి మోక్షస్వరూపులగుచున్నారు.**

---

**9. తస్మిన్ శుక్ల ముత నీలమ్ ఆహుః,**
**పింగళగ్ం, హరితం లోహితం చ।**
**ఏష పన్థా బ్రహ్మణా హ అనువిత్తః**
**తేనైతి బ్రహ్మవిత్ పుణ్యకృత్ తైజసశ్చ।**

ఓ జనక యోగీంద్రా! జ్ఞానమార్గము విషయమై,

- కొందరు శుక్ల (తెలుపు) నాడీ మార్గమని,

- మరికొందరు కృష్ణ (నలుపు) నాడీమార్గమని,

- ఇంకొందరు పచ్చని - ఎర్రని నాడీ మార్గములని అభివర్ణిస్తూ ఉన్నారు.

బ్రహ్మ విద్యాస్వరూపమైన మోక్షమార్గము బ్రహ్మమును ఎరిగి బ్రాహ్మణునికి (పరమాత్మతత్త్వముగా) ఇప్పుడే ఇక్కడే తెలియవచ్చు చున్నది.

బ్రహ్మవిద్యాస్వరూపమైనట్టి అట్టి ఆ మోక్షమార్గము పుణ్యకర్మల ప్రభావంగా పరమాత్మ స్వరూపము ధారణ చేస్తున్న బ్రహ్మజ్ఞాని ఇక్కడే, ఇప్పుడే పొందుచున్నాడు.

ఓ జనకమహాత్మా! ఈ ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, దేహములు - ఇవన్నీ **ఆత్మకు అనుబంధములని గాని, ఆత్మకు వీటితో బంధము - సంబంధము ఉన్నదని గాని అనుకోవటమే అజ్ఞానము.** ఈ జీవుని ఆత్మగా గమనించకపోవటమే తమస్సు. ఈ పురుషుడు పురుషోత్తముడే (ఉత్తమ పురుష) అయి ఉన్నాడు। (ఈ నరుడు నారాయణుడే।) **ఆత్మయే నీవై ఉండగా ఆత్మను పొందటమెక్కడిది?**

**10.** **<u>అన్ధం తమః ప్రవిశన్తి యే-</u>**
**<u>అవిద్యాం ఉపాసతే।</u>**
**తతః భూయ ఇవ తే తమో**
**య ఉ విద్యాయాగ్ం రతాః।**

ఎవ్వరైతే అవిద్యయగు దృశ్య - జన్మ - కర్మలను ఉపాసిస్తూ జీవితమంతా గడిపివేస్తారో, ఆత్మకు వీటితో బంధము ఆపాదిస్తూ బంధమునకే పరిమితమౌతారో, (లేక) ఇంద్రియానందలోకములను పొందటానికే యజ్ఞయాగాదులను ఉద్దేశ్యిస్తారో , - అట్టివారు అంధకారబంధురమగు అజ్ఞాన లోకములను పొందుచున్నారు. తెలియబడుదానిలో తెలుసుకుంటున్న ఆత్మను ఎవ్వరు వెతుకుతారో, అట్టివారు విద్యావంతులయి కూడా, **విద్యకు వ్యతిరిక్తమైన అవిద్యయందే అధికాధికముగా సంచరించుచున్నవారగుచున్నారు.**

**11** **అనన్దా నామ తే లోకా,**
**అన్ధేన తమస ఆవృతాః।**
**తాగ్ంస్తే (తాగ్ం తే) ప్రేత్య అభిగచ్ఛన్తి**
**అవిద్వాగ్ం సో అబుధో జనాః।**

ఓ జనక మహారాజా! ఆత్మతో మమైక్యము పొందు ప్రయత్న శీలత్వము **ఆశ్రయించనివారికి,** - దేహానంతరము అజ్ఞానావృతము లైన, అనేక దుఃఖములతో కూడిన లోకములు వేచిఉంటున్నాయి. మరణానంతరము ఈ జనులు తమస్సుతో నిండిన అవిద్యాయుత లోకములలో అవిద్యచే ప్రవేశించుచున్నారు. తెలివి తక్కువగా సంసార దుఃఖములను కొనితెచ్చిపెట్టుకుంటున్నారు.

**12** **ఆత్మానం చేత్ విజానీయాత్ -**
**"అయం అస్మి" - ఇతి పూరుషః।**
**కిం ఇచ్ఛన్ కస్య కామాయ**
**శరీరం అనుసన్ జ్వరేత్?**

ఎవ్వడైతే **"నేను స్వతఃగాను, సహజముగాను ఆత్మనే కదా!"**...అని సుస్పష్టము - నిర్దుష్టముగా, సంశయరహితంగా ఎరిగి ఉంటాడో, అట్టి పురుషుడు ఇక **"ఈ దృశ్య జగత్తులో ఏదో, ఏ లోకమో పొందాలి కదా!"... అని కోరుకొని, శారీరక కష్టము పొందవలసిన అవసరమేముంటుంది?** ఏమీ ఉండదు!

**13** **యస్య అనువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా,**
**అస్మిన్ సన్దేహ్యే గహనే ప్రవిష్టః।**
**స విశ్వకృత్।।**
**స హి సర్వస్య కర్తా।**
**తస్య లోకః, స తు లోక ఏవ।।**

ఈ పురుషుడు (జీవుడు) అనేక సందేహములతో నిండిన సంసార రూప కీకారణ్యములో ప్రవేశించి ఎటువైపుగా ఏమున్నదో తెలియక, ఏది త్రోవయో - ఎటుపోవాలో అర్థము కాక, దిక్కు తోచక ఉన్నాడు. ఎవ్వరైతే ఉపనిషత్, సత్‌గురు - బ్రహ్మజ్ఞాన వాక్యాలు విని, **'తత్‌త్వమ్'** ఇత్యాది మహావాక్యముల అర్థమును **ఎరిగి - "నేను స్వయముగా - సహజముగా ఆత్మను కదా!"**...అని **ప్రబుద్ధుడై** ఆత్మ తత్త్వమును **ఎరుగుతాడో,** ఆత్మ సాక్షాత్కారము పొందుతాడో, అట్టివాడే →

- విశ్వకర్త ("ఈ విశ్వమునకు నా భావనచే నేనే కర్తను") - అను ఎరుక గలవాడు అగుచున్నాడు. (I am the Executant of this Scinario).

- **సర్వకర్త** అగుచున్నాడు. (I am the executant of all).

- సమస్త లోకములు ఆతనివే అగుచున్నాయి. (All Levels are mine).

- ఆతని ఆత్మయే సర్వలోకములుగాను, సర్వము ఆతనికి ఆత్మగాను అగుచున్నది. (I am all this and this is all in me).

అందుచేత **అద్వితీయము - ఏకము అగు పరమాత్మనే ఎల్లప్పుడు భావన చేయాలి!**

14 ఇహైవ సన్తో అథ విద్మః తత్ వయం।
నచేత్, అవేదిః, – మహతీ వినష్టిః।
య ఏతత్ విదుః అమృతాస్తే (అమృతాః తే) భవన్తి।
అథ ఇతరే దుఃఖమేవ అపి యన్తి।

ఓ జనక చక్రవర్తీ! హే మహాన్! ఒక ముఖ్య విషయము శ్రోతలందరికీ గుర్తుచేస్తున్నాను. ఈ మానవ జన్మయందే - ఈ దేహ దేవాలయములో **సర్వదా వేంచేసియున్న అద్వయుడగు ఆత్మభగవానుని తనకు తానై గుర్తించకపోతే, ఆత్మజ్ఞానికాపోతే** - ఈ జీవుడు చాలా నష్టపోగలడు.

ఎవ్వరు ద్రష్ట-దర్శన-దృశ్య **అఖండరూపమగు, అద్వితీయమగు, సర్వమునకు పరమగు స్వస్వరూప- ఆత్మతత్త్వమును ఎరుగుచున్నారో...** అట్టివారు జనన-జరా-మృత్యు పరిధులను దాటిపోయి, **అమృతస్వరూపులగుచున్నారు.**

ఆత్మస్వరూపము ఎరుగనివానిని దుఃఖము (Worry) తొలుగదు. దుఃఖము తొలగాలంటే ఉన్నత్రోవ ఒక్కటే! అది 'ఆత్మను ఎరుగుటయే'! **(తరతి శోకమ్ ఆత్మవిత్).**

---

15 యద్వైతం అనుపశ్యత్య
ఆత్మానం దేవమంజసా। (దేవమ్ అంజసా)।
ఈశానం భూత భవ్యస్య,
న తతో విజుగుప్సతే॥

ఎప్పుడైతే ఈ పురుషుడు (జీవుడు) ఆత్మశాస్త్రమును, గురుబోధలను ఆశ్రయించి భూత - వర్తమాన - భవిష్యత్తులకు ఆవల తేజోస్వరూపుడై (సర్వమును వెలిగించువాడై), తానై వెలుగుచున్న స్వస్వరూపాత్మను **తెలుసుకొని, దర్శించి, మమేకమౌతాడో,** అట్టివాడు **'ఇది నాకు ఇట్లా ఉండాలి -ఇట్లాగే ఉండాలి-అట్లా ఉండకూడదు'**-ఇట్టి రూపమైన సంగతి, సందర్భములపై కూడా **ఆధారపడి ఉండడు.** (ఏది ఎట్లాగైనా తాను "ఆత్మాఽహమ్" కారుడై ఉంటాడు). దేనిని పొందాలనిగాని, కోల్పోవాలని గాని కోరుకోవలసిన అవసరము అట్టివానికి కనిపించదు. విజుగుప్స (అసూయ, భయము) పొందడు.

---

16 యస్మాత్ అర్వాక్ సంవత్సరో
అహోభిః పరివర్తతే॥
తత్ దేవా జ్యోతిషాం జ్యోతిరాయుః
హ ఉపాసతే అమృతమ్॥

**"ఈ రోజులు - నెలలు - సంవత్సరములు - యుగములు - కల్పములతో కూడిన కాలచక్రమంతా కూడా ఏ పరబ్రహ్మముయొక్క క్రింద భాగమున కల్పనగా కొనసాగటం జరుగుతోందో,... అట్టి జ్యోతులకే జ్యోతియగు ఆత్మయే నేను...."** అని ఎరిగి, అట్టి ఆత్మను ఉపాసిస్తాడో, - అట్టివాడు **మృత్యుపరిధులను జయించివేసి, కాలాతీతస్వరూపుడై, అమృతస్వరూపుడై ప్రకాశించుచున్నాడు. "నేనే కాలాత్మను కూడా।" అని ఆతడు ఎరుగుచున్నాడు.**

---

17 యస్మిన్ పఞ్చ పఞ్చజనా
ఆకాశశ్చ ప్రతిష్ఠితః,
తమేవ మన్య – ఆత్మానం విద్వాన్
బ్రహ్మాఽమృతో అమృతమ్॥

"ఎవ్వనియందైతే పంచభూతములు, పంచజనులు (గంధర్వులు - పితరులు - దేవతలు - అసురులు - రాక్షసులు... వీరందరూ) ఏ అక్షరరూపముగా **కల్పనా రూపమై** ఉంచబడినారో, (అట్టి ఆకాశము **ఎందులో ఉన్నదో) - అట్టి ఆత్మాకాశము నేనే!"**...అని ఆత్మవిద్యచే ఎరిగి, **ఏతత్ దృష్టి అవగాహనలతో** మౌనముగా దర్శిస్తాడో, ఆతడే ఆత్మను ఎరిగినవాడు. **అట్టి బ్రహ్మమును ఎరిగినవాడు అమృతస్వరూపమగు బ్రహ్మమే తానై, 'బ్రాహ్మీస్వరూపుడు' అగుచున్నాడు.**

---

18 ప్రాణస్య ప్రాణమ్ ఉత,
చక్షుషః చక్షుః ఉత,
శ్రోత్రస్య శ్రోత్రమ్।
మనసో యే మనోవిదుః।
తే నిచిక్యుః బ్రహ్మ పురాణం అగ్ర్యమ్॥

ఏది ప్రాణమునకే ప్రాణమైయున్నదో, చూపుకే చూపై ఉన్నదో, వినికిడికే వినికిడి అయి ఉన్నదో,...ఏది ప్రాణము - చూపు - వినికిడి - తనయందు స్థానములుగాను, లీలా కల్పితముగాను కలిగి ఉన్నదో, ఏది మనస్సుకు కూడా మనస్సు అయి ఉన్నదో...**అదియే ఆత్మ।** ఎవ్వరైతే అట్టి స్వస్వరూప, సర్వస్వరూప అఖండాత్మను ఎరుగుదురో,.. **అట్టివారే సనాతనము - సర్వకారణము అగు బ్రహ్మము తామై ప్రకాశించుచున్నారు.**

| | |
|---|---|
| 19 మనసైవ అను ద్రష్టవ్యం<br>నేహ నానాస్తి కించన। (న ఇహ నానా అస్తి కించన)। | మనస్సుతో ఆత్మనే దర్శించాలి! (అనగా) **మనస్సు సర్వదా సర్వత్రా సమస్తమును 'ఆత్మ'గా మననము కలిగి ఉండును గాక। (ఎందుకంటే, మనస్సే బంధము, మోక్షము కూడా).**<br>ఇక్కడ అనేకముగా కనిపించేదంతా, **మనస్సే (స్వీయ భావనయే) అట్లు అనేకముగా దర్శిస్తోంది.** ఆత్మజ్ఞులకు ఇదంతా అనేకంగా **కనిపిస్తూ కూడా ఏకము అనిపిస్తోంది.** అంతా అఖండాత్మయే - అయి ఉండటముచేత ఇక్కడ 'నానాత్వము' కించిత్తు కూడా లేదు. |
| **మృత్యోః స మృత్యుం ఆప్నోతి**<br>**య ఇహ నానేవ (నానా-ఇవ) పశ్యతి॥** | స్వకీయ - మననము, స్వకీయ ఆలోచనల అభ్యాసరూపమగు మనస్సుకు ఏ నానాత్వము కనిపిస్తోందో, అట్టి నానాత్వ దృష్టిగా కలవారు ఒక దేహమునుండి ఇంకొక దేహమునకు కర్మ - జ్ఞానానుసారంగా ప్రయాణిస్తూనే ఉంటారు. ఒక మృత్యువునుండి ఇంకొక మృత్యువునకు అవిశ్రాంతంగా పరుగులు తీస్తూ ఆయాస పడుచూనే ఉంటారు. ఒక చావు తరువాత మరొక చావు కొనసాగుచూనే ఉంటుంది. |
| 20 ఏకధైవ అనుద్రష్టవ్యం<br>ఏతత్ అప్రమేయం ధ్రువం।<br>విరజః, పర ఆకాశాత్, అజ,<br>ఆత్మా మహాన్ ధ్రువః॥ | ఓ జనక మహారాజ యోగపుంగవా! ఆత్మ సర్వదా ఏకముగానే ఉన్నదిగాని అనేకముగా అగుటయే లేదు. అందుచేత 'అనేకము'నందు 'ఏకము' వాస్తవమైనదిగా చూస్తూ ఉండాలి.<br>అట్టి ఆత్మయొక్క తత్త్వానుభవము ప్రత్యక్ష - అనుమానములనే ఉప కరణములకు లభ్యమయ్యేది కాదు. (బుద్ధిచే గ్రహించవలసినది).<br>ఆత్మ సర్వదా **అప్రమేయము. ధ్రువము. నిత్యము. మాలిన్యరహితము. ఆకాశము కంటే సూక్ష్మము. జన్మ-జరా రహితము. సర్వశ్రేష్ఠము. అట్టి స్వభావ సిద్ధగుణములు గల ఆత్మనే ఉపాసించాలి.** |
| 21 తమ్ ఏవ ధీరో విజ్ఞాయ<br>ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః॥ | అట్టి బ్రహ్మమునందు ధ్యాసతో ధీరుడై ఒకానొకడు ప్రజ్ఞతో అర్థానిని ఎరిగి, స్వభావము చేసుకొని **'బ్రాహ్మణుడు'** అగుచున్నాడు. అట్టి బ్రాహ్మణుడు బ్రహ్మమునందే నిష్ఠ కలిగినవాడై ఉంటున్నాడు. ఈ జీవుడు బ్రహ్మమును ఎరిగి 'బ్రాహ్మణుడు' కావాలి. |
| నానుధ్యాయాత్ (న అనుధ్యాయాత్) బహూన్ శబ్దాన్।<br>(కింతు) వాచో విగ్లాపనగ్ం హి తత్-ఇతి॥ | అంతేగాని తదితర అనాత్మ శబ్ద-వ్యవహార జాలములకు పరిమితము కారాదు. భేదములను ఉపాసించ రాదు. ఎందుకంటే తదితరమైన శబ్దజాల వ్యవహారమంతా కూడా వృధాశ్రమయే. **ఆత్మకు (నేనే ఆత్మను-అనుదానికి) అన్యమైన భావనంతా కూడా ఈ పురుషుని (జీవుని) పట్ల అనవసరమైన, వ్యర్థమైన - వేసటయే!** |
| 22 స వా ఏష మహాన్ అజ ఆత్మా,<br>యో అయం విజ్ఞానమయః ప్రాణేషు<br>య ఏషో అన్తర హృదయ ఆకాశః । | అట్టి ఆత్మ **మహాన్**। మహత్తరమైనది। **అజమ్**। పుట్టుకలేనిది। ఇంద్రియములందు **విజ్ఞాన (ఎరుక) రూపముగా** వెలుగొందు చున్నది. ప్రాణరూపమై దేహములను పాలించుచున్నది. అంతర్ - హృదయా కాశమునందు పరమ ప్రశాంత రూపముగా శయనించుచున్నది. |
| (తస్మింఛేతే) తస్మిన్ చ ఏతే సర్వస్య వశీ<br>సర్వస్య ఈశానః। సర్వస్య అధిపతిః। | అట్టి ఆత్మ సర్వమును తన వశమునందు కలిగి ఉన్నది. సర్వమును శాసించుచున్నది. సర్వము 'తానే' అయి ప్రదర్శనమగుచూ, ఈశ్వరత్వము ప్రదర్శించు చున్నది. **సర్వమునకు అధిపతి అయి ఉన్నది.** |
| స న సాధునా కర్మణా భూయన్।<br>న ఏవ అసాధునాం కనీయాన్। | ఆత్మ - సాధుకర్మలచే (శాస్త్రములచే చెప్పబడు యజ్ఞ - యాగ-ప్రాణాయామ ఇత్యాదులచే) **వర్ధిల్లునది కాదు.** శాస్త్రములచే నిషేధించ బడిన కర్మలు నిర్వర్తించువానిపట్ల **క్షీణించేది కూడా కాదు.** |
| ఏష సర్వేశ్వరః। ఏష భూతాధిపతిః।<br>ఏష భూతపాలః। ఏష సేతుః విధరణః।<br>ఏషాం లోకానాం అసంభేదాయ॥ | ఆత్మ సర్వమునకు ఈశ్వర శాసనమైనయున్నది. సర్వమును శాసించునది. సర్వమునకు సొంతదారు. సర్వమునకు అనుభవదారు.<br>ఆత్మ **'జనన-జన్మ'**లకు, **'జీవుడు - ఈశ్వరుడు'**లకు సేతువు. ఈ **'జగత్తు'** అనే కల్పన పడిపోకుండా నిలబెట్టు **మూలస్థంభము.** |

| | |
|---|---|
| తం ఏతం వేద అనువచనేన (వేదానువచనేనే)<br>బ్రాహ్మణా వివిదిషన్తి।<br>యజ్ఞేన, దానేన, తపసా,<br>అనాశకేన ఏతమేవ<br>విదిత్వా "మునిః" భవతి॥ | వేదవేత్తలు అట్టి ఆత్మను ఎరుగుటకై మహదాశయమును ఆశ్రయిస్తున్నారు. అట్టి ఆశయ సిద్ధిని దృష్టిలో కలిగి ఉండియే యజ్ఞ-దాన-తపస్సులు నిర్వర్తించుచున్నారు. మరికొందరు నిష్కామకర్మిష్ఠులై, తాము చేయు సమస్త కర్మలను **'బ్రహ్మార్పణమ్'** అని సమర్పించి **బ్రాహ్మణులగుచున్నారు.** సర్వ జగత్ విషయములపట్ల అంతరంగమున మౌనము వహించినవారై **'ముని'** లేక **'మౌని'** అగుచున్నారు. |
| ఏతమేవ ప్రవ్రాజినో<br>లోకమ్ ఇచ్ఛన్తః ప్రవ్రజన్తి॥ | ఆత్మ యొక్క మహిమను ఎరిగి **"ఆత్మసాక్షాత్కారము"** కొరకై కొందరు సర్వవిషయములతో సంగమును త్యజించివేయుచున్నారు. ఏది అనాత్మయో, ఏది ఆత్మయో **అభ్యాసపూర్వకంగా ఎరిగి, వర్తిస్తున్నారు.** |
| ఏతద్ధస్మ (ఏతత్ హ స్మ) వై తత్పూర్వే విద్వాగ్ంస<br>సః ప్రజాం న కామయన్తే॥<br>కిం ప్రజయా కరిష్యామః?<br>ఏషాం నో అయం ఆత్మా,<br>అయం లోక – ఇతి॥ | మరికొందరు ఆత్మశక్తికొరకై, ఆత్మత్వము సిద్ధింపజేసుకొనుటకై భార్యేషణ- పుత్రేషణ-విత్తేషణములను త్యజించి సన్న్యాసాశ్రమమును స్వీకరించు చున్నారు.<br>"మేము ఆత్మను సాక్షాత్కరించుకోవాలి. అంతేగాని పుత్రులు...మొదలైనవి మమ్ములను ఉద్ధరిస్తారా? లేదు కదా!"...అని సన్న్యసించుచున్నారు.<br>**"మాకు ఆత్మయే సర్వస్వము అయిఉన్నది. ఆత్మయే మా లోకము!"** అను నిర్ణయమును వారు కలిగి ఉంటున్నారు. |
| తే హ స్మ పుత్రైషణాయాశ్చ,<br>విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ,<br>వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరన్తి॥ | ఇంకొందరు పుత్రైషణ-విత్తేషణ-లోకేషన పట్ల (అట్టి ఈషణ త్రయముల పట్ల) సర్వ మమకారములను త్యజించి అహంకారముపై యుద్ధము ప్రకటించి, ఆత్మానుభవసిద్ధికొరకై **భిక్షాటణము** స్వీకరించుచున్నారు. ("భి"= చీకటిని, "క్ష" = క్షయింపజేయు జీవనవిధానము). |
| యా హి ఏవ పుత్రైషణా, సా విత్తైషణా।<br>యా విత్తైషణా, సా లోకైషణో।<br>ఉభేహ్యే తే ఏషణే ఏవ భవతః।<br>స ఏషనేతి। (స ఏషణ ఇతి)॥ | ఈషణ త్రయము జీవునికి ఆత్మానుభవమార్గముతో అజ్ఞానదృష్టి కారణంగా అడ్డంకులుగా అగుచున్నది.<br>- పుత్రుల కొరకే ఒకడు చెడ్డ పనులు చేయుచుండటము లోకంలో చూస్తూ ఉంటాము. కనుక **పుత్రేషణ**యే **విత్తేషణ**గా అగుచున్నది. "ధర్మము కొరకై విత్తము" అని మరిస్తే ఎట్లా?<br>- విత్తము సంపాదించుటకై ఈ లోకంలో లౌకిక సంబంధమైన వ్యవహారములలో తలదూర్చి, క్షణక్షణము పొందుటయే **'లోకేషణ'**. ఈ విధంగా ఈషణములను (విత్తేషణ-పుత్రేషణ-లోకేషణలను) పాముకుబుసము వలె త్యజించి **'నేతి - నేతి' - ఇవన్నీ కాదు - కాదు"** అని ఆత్మస్వరూపము విషయములో సునిశ్చితుడై పరమ ప్రశాంతుడై ఉండటమును అభ్యసించాలి. |
| నేతి ఆత్మా అగృహ్యో। నహి గృహ్యతే।<br>అశీర్యో, నహి శీర్యతే।<br>అసంగో నహి సజ్యతే।<br>అసితో న వ్యథతే। న రిష్యతి।<br>ఏతము హైవైతే (హి ఏవ ఏతే)<br>న తరత ఇతి। | **ఆత్మపురుషుడు ఎట్టివాడు?**<br>**అగ్రాహ్యుడు** : కర్మేంద్రియములకు, జ్ఞానేంద్రియములకు ఆత్మ భగవానుడు విషయము కాదు. వాటిచే గ్రహించబడగలిగేవాడు కాదు.<br>కానీ ఇంద్రియములతో సర్వము **గ్రహించునది ఆయనయే. గ్రహించబడుచున్నదీ ఆయనయే.**<br>ఆయన అవినాశి. ఎట్టి మార్పు - చేర్పులు చెందక, సర్వ మార్పు - చేర్పులకు తానే కారకుడై ఉన్నాడు.<br>ఆత్మదేవుడు దేనిచేతను **బద్ధుడు కాడు.** ఎట్టి సంగము లేనివాడు. దేనియందు **అభినివేశము ఉండనివాడు.** బద్ధుడు కానివాడు.<br>ఆత్మ ఎటువంటి వ్యథ పొందటము లేదు. **నిత్యనిర్మలము.** |

**అతః పాపం అకరవం ఇత్యతః**
**కల్యాణం అకరవం ఇతి ఉభే,**
**ఉ హ్యై వైష ఏతే తరతి।**
**నైనం కృతాకృతే (కృత-అకృతే) తపతః॥**

ఆత్మ దేనిచేతనూ స్పృశించబడదు. కప్పబడదు. ఆత్మను తరింపజేసేదేదీ లేదు. 'మోహము' మొదలైన వాటినుండి ఆత్మ కొత్తగా తరించునది కాదు. **నిత్య నిర్మలము.**

ఆత్మను పాప - పుణ్యములు అంటవు. సమస్త **ద్వంద్వములకు అతీతమైనది.**

ఆత్మ సర్వదా నిత్యకల్యాణ - శుభప్రదస్వరూపము. అంతేగాని, మరొకరిని **బాధించునది కాదు.**

ఈ విధంగా **బ్రహ్మవేత్త బ్రహ్మమును ఎరిగినవాడై** పాప-పుణ్యములు-మొదలైన ద్వంద్వమోహములన్నీ అతిక్రమించివేయుచున్నాడు.

ఆతనికి విహితకర్మచే పొందవలసినదిగాని, అవిహితకర్మలచే పోగొట్టుకొనునదిగాని ఉండవు. అవి రెండూ బ్రహ్మవేత్తకు ఏమాత్రము కూడా కలత కలిగించలేవు. ఆతనికి కృత - అకృతములు ఆటలలో విశేషాలవలె వినోదచమత్కారాలగుచున్నాయి.

---

**23 తత్ ఏతత్ 'ఋచ' అభ్యుక్తం।**

**ఏష నిత్యో। మహిమా బ్రాహ్మణస్య।**
**న వర్థతే కర్మణా, నో కనీయాన్।**
**తస్యైవస్యాత్ పదవిత్తం విదిత్వా**
**న లిప్యతే కర్మణా పాప కేనేతి।**

అట్టి 'ఆత్మ' గురించి ఋక్ - వేదఋక్కులు(వేదములు) ఇంకా ఇట్లా గానము చేస్తున్నాయి సుస్పష్టము, నిర్దుష్టముగా ఎలుగెత్తి చెప్పుచున్నాయి.

**పరబ్రహ్మము సర్వకాల - సర్వావస్థలయందు ఏకస్వరూపమై 'నిత్యమై' ఉండునది.**

**'ఆత్మ' - అనునది బ్రహ్మవేత్తయొక్క స్వకీయమైన మహిమయే అయి ఉన్నది. బ్రహ్మవేత్త ఈ దృశ్యము, ఈ బ్రహ్మాండము తానే అయి వెలుగొందుచున్నాడు.**

**ఆత్మ వర్ధనము (వృద్ధి) పొందటంలేదు. క్షీణించటంలేదు.**

అట్టి ఆత్మయొక్క మహిమను ఈ జీవుడు గ్రహించినప్పుడే దుఃఖము తొలగుతుంది. కనుక **తప్పక తెలుసుకోవాలి.** అట్లు ఆత్మను ఎరిగినవాడు తానే ఆత్మగా అగుచున్నాడు.

ఆత్మ ఎట్టిదో ఎరిగినవాడు - **కర్మలతో సంబంధమే లేనివాడగుచున్నాడు.** ఇక పాపుపుణ్యములేమి ఉంటాయి? ఆతని పట్ల ఉండవు.

---

**తస్మాత్ ఏవం విత్ శాన్తో దాన్త ఉపరతః,**
**తితిక్షుః సమాహితో భూత్వా,**

ఆత్మను ఎరిగినట్టివాడు స్వభావసిద్ధంగానే అంతరంగమున **పరమశాంతుడు,** ఇంద్రియములను తన వశము చేసుకొని ఉండుటచే **ఇంద్రియ నిగ్రహము కలవాడు,** సర్వ ప్రాపంచక భేద వ్యవహారములనుండి మనస్సును విరమింపజేసినట్టి **ఉపరతుడు,** ప్రాపంచక కష్ట-సుఖములు అతి చిన్న విషయాలుగా చూచుటచే **తితీక్ష సిద్ధించుకున్నట్టివాడు, ఏకాగ్రత** సంతరించుకొన్న **చిత్తము కలవాడు,** సర్వత్రా సమరూపము దర్శించు **'సమాహితుడు'** అగుచున్నాడు.

---

<u>**ఆత్మన్యేవ ఆత్మానం పశ్యతి।**</u>
<u>**సర్వం ఆత్మానం పశ్యతి।**</u>
**నైనం పాప్మా తపతి ।**
**సర్వం పాప్మానం తరతి।**

ఆ మహనీయుడు **తనయందే ఆత్మను, తానే ఆత్మగాను** దర్శించు చున్నాడు. **తానే ఈ సర్వమై ఉంటున్నాడు.**

ఈ సర్వము ఆత్మస్వరూపంగాను, తానే ఆత్మస్వరూపుడుగాను తెలుసుకొనియున్న ఆత్మ తత్త్వజ్ఞాని పాపముచే స్పృశించబడడు. తత్సంబంధమైన వ్యథ ఉండదు. అంతా తానే అయి ఉంటాడు.

సర్వపాపములను అధిగమించినవాడై ఉంటాడు. పాపము ఆతనిని తపింపజేయదు. తానే పాపమును దహించివేసినవాడై ఉంటాడు.

సర్వం పాప్మానం తరతి।
విపాపో విరజో అవిచికిత్సో బ్రాహ్మణో భవతి।

ఆత్మజ్ఞానాగ్నిచే పాపమును కాల్చివేసి ఉంటాడు. (ఈ జీవుడు 'పాపి' కాదు. ఆత్మస్వరూపుడు. Not a sinner. But a Divinity giving appearence in the World Scenary).

ఆతడు ఎట్టి పాపములు లేనట్టి, ఎట్టి కోరికలు లేనట్టి, సర్వ ప్రాపంచక విషయములను దాటి వేసినట్టి, సంశయములన్నీ ఉపశమింపజేసినట్టి బ్రహ్మవేత్త అగుచున్నాడు. బ్రహ్మమును సర్వత్రా దర్శించు **'బ్రాహ్మణుడు'** అయి ఉంటున్నాడు.

---

ఏష బ్రహ్మ లోకః, సమ్రాట్! ఇతి।
ఏనం ప్రాపితోసి ఇతి।
హోవాచ యాజ్ఞవల్క్యః॥

హే సమ్రాట్! "బ్రహ్మలోకమును ప్రవేశించటము"...అనగా ఇదియే. "బ్రహ్మలోక ప్రాప్తి" అనగా తానే బ్రహ్మముగాను, ఈ సర్వము అఖండ - అద్వితీయ బ్రహ్మముగాను సందర్శిస్తూ ఉండటమే సుమా!

---

<u>జనకుడు</u> : సోఽహమ్ భగవతే
విదేహాన్ దదామి।
మాం చ అపి సహ దాస్యాయేతి॥

**జనకమహారాజు** : స్వామీ! యాజ్ఞవల్క్యా! నా ఆత్మయొక్క మహిమను నాకు తెలియజేయుటచే మీరు నాకు పుజనీయులగుచున్నారు. మీ వాక్యములు నాకు ఆత్మ సామ్రాజ్యాధిపతి స్థానమును ప్రసాదిస్తున్నాయి. హే భగవాన్! మీకు కృతజ్ఞతగా ఏమిచ్చుకోగలను? **ఈ విదేహ సామ్రాజ్యమును మీ పాదములకు భక్తితో సమర్పిస్తూ, నేను మీకు సేవకుడుగా నన్ను నేను సమర్పించుకొంటున్నాను.**

---

<u>అథ ఫలశృతి</u>

24 స వా ఏష మహాన్,
అజ, ఆత్మా-అన్నాదో,
వసుదానో విన్దతే, - వసు
య ఏవం వేద।

ఈ యాజ్ఞవల్క్య - జనక సంవాదము మహత్తరమైనది. దేశ - కాలములచే (Factor of place and Time) పరిచ్ఛిన్నము పొందనట్టిది. అన్నములకు (సర్వ అనుభవములకు) భోక్త। సర్వ కర్మఫల ప్రదాత.

ఎవ్వడైతే ఆత్మను ఈ తీరుగా

- సర్వాంతర్యామిగాను,
- సర్వతత్త్వస్వరూపముగాను,
- అఖండము - అప్రమేయము - నిత్యముగాను ఉపాసిస్తాడో,

అట్టివాడు సర్వకర్మలు నిర్వర్తించిన ఫలమును పొందుచున్నాడు. **వసురూపుడై ఆనందిస్తున్నాడు.** (He Presents himself in all else).

---

25 స వా ఏష మహాన్,
అజ ఆత్మా, అజరో అమరో
అమృతో అభయో బ్రహ్మ।
అభయం వై ।
బ్రహ్మ అభయగ్ం హి వై
"బ్రహ్మ" భవతి, య ఏవం వేద।

ఎవ్వడైతే - అట్టి **"మహాన్, అజమ్, అజరమ్, అమరమ్, అమృతమ్, అభయమ్"** అయి ఉన్న, - స్వస్వరూపమగు "ఆత్మ"ను ఎరిగి ఉపాసిస్తాడో, ఆతడు **ఆత్మజ్ఞుడై పరమాత్మస్వరూపముగా అంతటా, అన్నిటా సర్వదా విరాజిల్లుచున్నాడు.** అభయస్థానము - అగు బ్రహ్మమును ఎరుగుచున్నవాడు బ్రహ్మమే తానగుచున్నాడు.

**సోఽహమ్-తత్త్వమ్ ఏకాత్ముడగుచున్నాడు.**

*ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠాధ్యాయః*
*'శారీరక బ్రాహ్మణమ్' నామ*
*చతుర్థ బ్రాహ్మణమ్ సమాప్తమ్॥*

*ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠాధ్యాయః*
*'శారీరక బ్రాహ్మణమ్' నామ*
*చతుర్థ బ్రాహ్మణమ్ సమాప్తమ్॥*

# షష్ఠమాధ్యాయః - పంచమ బ్రాహ్మణమ్

## మైత్రేయీ బ్రాహ్మణము

| | |
|---|---|
| 1. అథ హ యాజ్ఞవల్క్యస్య<br>ద్వే భార్యే బభూవతుః।<br>మైత్రేయీ చ। కాత్యాయనీ చ।<br>తయోః హ మైత్రేయీ బ్రహ్మవాదినీ, బభూవ।<br>స్త్రీ ప్రజ్ఞైవ తర్హి, కాత్యాయని అథః<br>హ యాజ్ఞవల్క్యో అన్యత్ వృత్తమ్ ఉపాకరిష్యన్। | **ఇక ఇప్పుడు ఒక గాథ గురించిన విశేషాలు చెప్పుకుంటున్నాము.**<br>యాజ్ఞవల్క్యమహర్షికి ఇద్దరు భార్యలు.<br>**ఒకామె మైత్రేయి.** ఈమె బ్రహ్మతత్త్వము నందు **సాధన, శ్రద్ధ, ఆశయము, అభ్యాసము** కలిగియున్నట్టివారు. **బ్రహ్మవాదిని.**<br>రెండవభార్య : **కాత్యాయని.** ఈమె ఒక గృహిణిగా ఆశ్రమ వ్యవహారముల పట్ల ఆసక్తి, భర్తయొక్క నిత్యావసరములపట్ల శ్రద్ధ కలిగి ఉన్నట్టిది. అందరు స్త్రీలులాగానే గృహ విషయములలో ఎల్లప్పుడు నిమగ్నమై ఉండేది. ఇంటి పనులు చూచుకునేది. శిష్యులందరినీ తల్లివలె ఆదరించేది.<br>ఒక సమయములో యాజ్ఞవల్క్యుడు మరొక జీవన విధిని (సన్న్యాసాశ్రమమును) స్వీకరించటానికై సంకల్పించారు. |
| 2. మైత్రేయి ఇతి హోవాచ యాజ్ఞవల్క్యః<br>ప్రవ్రజిష్యన్ వా అరే,<br>అహం అస్మాత్ స్థానాత్ అస్మి।<br>హన్త। తే అనయా కాత్యాయనీయ<br>అన్తం కరవాణి ఇతి। | సన్న్యాసాశ్రమము స్వీకరించటానికి ధర్మపత్ని యొక్క అనుజ్ఞ (Permission) అవసరమై ఉన్నది. ఇది దృష్టిలో పెట్టుకుని, ఒకరోజు ఆ యాజ్ఞవల్క్య మహర్షి తన పెద్ద భార్య అగు మైత్రేయిని పిలిచారు.<br>**యాజ్ఞవల్క్యుడు** : ఓ మైత్రేయీ! నేను ఆశ్రమమును మార్చుకొనుటకు నిర్ణయించుకున్నాను. గృహస్థాశ్రమమును త్యజించి **'సన్న్యాసాశ్రమము'** స్వీకరించదలచాను. ఇందుకు నీ అంగీకారము చెప్పవలసినదిగా అర్థిస్తున్నాను. నీకు నేను సన్న్యసించటం సమ్మతమేనంటే, ఇక నేను కాత్యాయని యొక్క అనుజ్ఞ కూడా తీసుకుంటాను. మీరిద్దరు సంపదను చెరిసగము విభజించుకొని పరస్పరము స్నేహభావముతో జీవించండి. ఇరువురు నా సందలు చెరిసగముగా పొంది సుఖశాంతులతో శేష జీవితము కొనసాగించెదరు గాక! (అన్తం = Patitioning). |
| 3. సా హోవాచ మైత్రేయీ:<br>యన్ను మ ఇయం భగోః<br>సర్వా పృథివీ విత్తేన పూర్ణాస్యాత్<br>స్యాన్న్వహం తే న అమృతా అహో 3 (ఉ)? | **మైత్రేయి** : ప్రాణనాథా! మీరు మీ సంపదలు మా ఇద్దరికి పంచి ఇచ్చివేస్తానని అంటున్నారు. బాగానే ఉన్నది. అయితే నాదొక్క సందేహము. భూ-ధన సంపదలు సమృద్ధిగా ఉండి కూడా, మీరు ఆశ్రమము యొక్క మార్పును ('గృహస్తు' నుండి సన్న్యాసాశ్రమము) కోరుకుంటున్నారు కదా!<br>మీరు మాకు ఇవ్వబోవుచున్న సంపదల సహాయముతోను, (లేక) సమస్త భూమి - అనంత సంపద పొందటముచేతను, **మాయొక్క అపూర్ణత్వము** (Incompleteness) **తొలగి, పూర్ణరూపమగు ముక్తిని పొందగల మంటారా?** |
| నేతి। నేతి।<br>హో వాచ యాజ్ఞవల్క్యో :<br>"యథైవ ఉపకరణతాం జీవితం,<br>తథైవ తే జీవితగ్ం స్యాత్ ।<br>అమృతత్వస్య తు।<br>నా శాస్తి విత్తేనేతి॥<br>(న అశాస్తి విత్తేనేతి)॥ | **యాజ్ఞవల్క్యుడు** : లేదు, లేదు. ధనసంపద, భూసంపద ఎంతో కలిగి ఉన్నంత మాత్రము చేత మోక్షము పొంద వీలుకాదు. పూర్ణత్వము పొందే ప్రసక్తియే లేదు. అయితే ధనసంపద, భూసంపదలచేత నీవు లోకమున ధనముకై శ్రమించవలసిన అవసరములేకుండా జీవితాంతము సుఖముగా జీవించగలవు. సంపదలకు సంబంధించినంత వరకు లోటుపాట్లు ఉండవు. అది అంతమాత్రమే!<br>**విత్తము పొందినంతమాత్రమున ముక్తి, మోక్షము జీవునకు లభించవు.** |

4 సా హ ఉవాచ మైత్రేయీ :
యేన అహం న అమృతా స్యాం,
కిం అహం తేన కుర్యాం?
యదేవ, భగవాన్।
వేత్థ, తత్ ఏవ మే బ్రూహి। ఇతి॥

మైత్రేయి : అట్లాగా స్వామీ? ఏవి ఏవైతే పొందినా కూడా **"నేను పొందవలసినది పూర్తిగా పొందాను కదా"** అనే పూర్ణత్వము లభించదో, **అమృతరూపమగు మోక్షము లభించదో,** అట్టి ధన గృహ - భూసంపదలతో నేను ఏమి చేయాలి? ఏమి ప్రయోజనం? నాకేమీ ఉపయోగము కనిపించటము లేదు.

హే భగవాన్! మహర్షీ! అస్మత్ ప్రాణసఖా! పుణ్యమూర్తీ!

దేనిని **తెలుసుకొని, ఉపాసించుటచే** నేను పూర్ణస్వరూపమగు అమృతత్వము, మోక్షస్థానము సముపార్జించుకోగలనో, ఆ మార్గమును నాకు బోధించండి, చాలు. (ఇక సంపదలు మొదలైనవి కావాలంటే కాత్యాయనికి ఇవ్వవచ్చును. లేదా, మీ ఇష్టము వచ్చినట్లు చేయవచ్చును - అని అర్థము?).

---

5 స హోవాచ యాజ్ఞవల్క్యః :
ప్రియా! వై ఖలు, నో భవతీ సతీ ప్రియం
అవృధద్ధన్త తర్హి భవతి,
ఏతత్ వ్యాఖ్యాస్యామి।
తే వ్యాచక్షాణస్య తు మే
నిదిధ్యాసస్వ - ఇతి॥

**యాజ్ఞవల్క్యుడు** : ఓ ప్రేయసీ! ప్రియురాలా! నీవు అడుగవలసిన దానిని అడిగి నాకు మరింత ప్రియమగుచున్నావు. అభివృద్ధి పొందిన దానవుగా నేను నీ గురించి భావిస్తున్నాను.

ఒకవేళ నీవు మోక్షమార్గమునే కోరుకోదలిస్తే, నేను అద్దానిని తప్పక బోధిస్తాను.

అయితే నేను బోధించబోవు బ్రహ్మతత్త్వము అత్యంత సూక్ష్మమగు విశేషము. అందుచేత నీవు అత్యంత విచక్షణాశీలురాలవై, **నిదిధ్యాస** (Complete concentration) తో విని, అర్థం చేసుకొని **అవధారణ** చేయవలసి వస్తుంది. మరి అందుకు నీవు సంసిద్ధమేనా?

మైత్రేయి : నేను సిద్ధము. నాపై దయ, ప్రేమలతో బ్రహ్మతత్త్వము, మోక్షమార్గములను బోధించ ప్రార్థన.

---

కిమర్థం ఇదం ప్రియం భవతి?
6 స హోవాచ: (యాజ్ఞవల్క్యోవాచ):
న వా అరే పత్యుః
కామాయ పతిః ప్రియో భవతి।
ఆత్మనస్తు (ఆత్మన్ అస్తు) కామాయ
పతిః ప్రియో భవతి॥

## ఎవరికొరకు ఇక్కడి విశేషాలు ప్రియము?

**యాజ్ఞవల్క్యుడు : ఓ మైత్రేయీ! మనందరి దేహములలో ఒక మహత్తర వస్తువు వేంచేసినదై ఉన్నది. అదియే 'ఆత్మ'. అట్టి ఆత్మకు ఏది ప్రియమో అదియే ఇక్కడ ప్రియముగా అనిపిస్తోంది. అంతేగాని దృశ్యములో ఏదీ కూడా స్వతఃగా ప్రియమగుటచే నీకు ప్రియముగా అనుభవమవటం లేదు. మనము దృష్టాంతములుగా చెప్పుకుందాము. నీకు అత్యంత ప్రియవస్తువేది?**

మైత్రేయి : నాకు అందరికంటే కూడా అత్యంత ప్రేమాస్పదులగు పతిదేవులు- **మీరంటేనే అత్యంత ప్రియము.**

**యాజ్ఞవల్క్యుడు** : ఒక స్త్రీకి భర్త అత్యంత ప్రియమైన వస్తువు. అయితే భర్త ప్రియమైన వస్తువు కాబట్టి ఆ భార్యకు ప్రియమగుచున్నాడా? కాదు. భర్త యొక్క ఆనందము కొరకు భర్త ప్రియమగుచున్నాడా? లేదు. **ఆత్మకు ప్రియమైనప్పుడు మాత్రమే జీవునకు (లేక, ఆ స్త్రీకి) తన భర్త ప్రియముగా అనుభూతమగుచున్నాడు.**

---

న వా అరే జాయాయై కామాయ
జాయా ప్రియా భవతి।
ఆత్మనస్తు కామాయ జాయా
ప్రియా భవతి॥

అట్లాగే ఒక భర్తకు భార్యలో ఏదో ప్రియత్వముండటంచేత ఆమె ప్రియముగా అగుచున్నదా? కాదు. **ఆత్మకు "భార్యపట్ల సంకల్పము" అనునది ప్రియమైనప్పుడు ఆ పురుషునికి తన భార్య ప్రియముగా అనుభూతము అగుచున్నది.**

| | |
|---|---|
| **న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్తి। ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి।** | కుమారుని ప్రియము కొరకై కుమారుడు ప్రియమనటంలేదు. ఒక తండ్రికి (లేక-తల్లికి) **"పుత్రునిలో ఉన్నట్టి ఏదో ప్రియత్వము"** చేత తల్లి-తండ్రులకు ప్రియముగా అగుచున్నాడా? లేదు. ప్రియత్వము కొడుకు యొక్క దేహములో లేదు. **ఆత్మకు 'కుమారుడు' అనునది ప్రియమగుట చేత మాత్రమే,.. ఆ తండ్రికి, ఆ తల్లికి కుమారుడు ప్రియము అగుచున్నాడు.** |
| **న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి। ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి॥** | ఒకనికి విత్తము ఆనందమగుచున్నది. విత్తము కొరకై విత్తము (ధనము) కోరబడుచున్నదా? విత్తముయొక్క ఆనందము కొరకు ఒకడు విత్తము కోరుకొనుచున్నాడా? లేదు. **ఆత్మయొక్క ప్రియము చేతనే విత్తము ప్రియమైన వస్తువుగా సిద్ధించుచున్నది.** |
| **న వా అరే పశూనాం కామాయ పశవః ప్రియా భవన్తి। ఆత్మవస్తు కామాయ పశవః ప్రియా భవన్తి॥** | పశువుల ప్రియము కొరకై పశువులు ప్రియము అవటం లేదు. ఆత్మకు పశుసంపద ప్రియమైన వస్తువగుటచే పశువులు, ప్రియముగా ఒకనికి అనిపిస్తూ ఉంటున్నాయి. |
| **న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవతి। ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి॥** | ఒకనికి "బ్రాహ్మణుడు" ప్రియమగుచున్నాడు. ఎందుచేత? బ్రాహ్మణుని ప్రియము కొరకై బ్రాహ్మణుడు ప్రియమగుచున్నాడా? లేదు. ఆత్మకు బ్రాహ్మణుడు ప్రియము కాబట్టి బ్రాహ్మణుడు ప్రియమై తెలియ వచ్చుచున్నాడు. అట్లాగే, బ్రహ్మము ఆత్మకొరకే ప్రియము అగుచున్నది. |
| **న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవతి। ఆత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి॥** | మరొకనికి క్షత్రియుడు ప్రియమగుచున్నాడు. ఎందుకు? క్షత్రియుని ప్రియము కొరకు క్షత్రియుడు ప్రియమగుచున్నాడా? లేనేలేదు. **ఆత్మకు క్షత్రియుడు, క్షత్రము ప్రియము కనుకనే క్షత్రియుడు ప్రియమగుచున్నాడు.** |
| **న వా అరే లోకానాం కామాయ లోకః ప్రియా భవన్తి। ఆత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవన్తి॥** | వేరొకనికి లోకములు ప్రియముగా అయి ఉంటున్నాయి. ఎందుకు? లోకముల ప్రీతి కొరకై, లోకముల సంతోషము కొరకై ఆతడు లోకములను ప్రియ భావంతో చూస్తున్నాడా? లేనే లేదు. ఆత్మకు లోకములు ప్రియమైనవి అగుటచే, లోకములను ప్రేమాస్పదముగా చూస్తున్నాడు. **ఆత్మకు లోకములు ప్రియమైనప్పుడు - లోకములు ప్రియముగా తెలియ వస్తున్నాయి.** |
| **న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవన్తి। ఆత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి॥** | ఇంకొకరికి దేవతలు ప్రియమగుచున్నారు. దేవతల ప్రీతి కొరకై దేవతలు ప్రియమగుచున్నారా? కాదు కాదు. ఆత్మకు (తనకు) దేవతలు ప్రియమగుటచే దేవతల పట్ల ఒకడు ప్రియము కలిగి ఉంటున్నారు. |
| **న వా అరే వేదానాం కామాయ వేదాః ప్రియాభవన్తి। ఆత్మనస్తు కామాయ వేదాః ప్రియా భవన్తి॥** | వేదముల ప్రీతికొరకై ఒకనికి వేదములు ప్రియమగుచున్నాయా? లేదు. ఆత్మకు వేదములు ప్రీతి - ప్రియము అయినప్పుడు, **ఆత్మకు ప్రీతి కాబట్టి వేదములు ప్రియమగుచున్నాయి.** |
| **న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్తి। ఆత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి।** | భూతజాలము (సర్వజీవులు) కొందరు ప్రియ దృష్టితో చూస్తున్నారు. అయితే జనుల (సహజీవుల) ప్రీతి కొరకై వారు ప్రియమగుచున్నారా? లేదు. **ఆత్మకు భూతజాలము ప్రియము అయినప్పుడు భూతజాలము ప్రియమగుచున్నది. (పంచభూతముల వలన ప్రియత్వము ఆత్మయొక్క ప్రియ భావనయే).** |
| **న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి। ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి॥** | ఎవ్వరికైనా ఏదైనా ప్రియమగుచున్నది ఎందుకు? ఆ ప్రియమగుచున్న వస్తువు - వ్యక్తి విషయముల ప్రీతి కొరకా? కానేకాదు. ఆత్మ తన కొరకు ఏది ప్రియముగా కోరుకొనునో, అది మాత్రమే 'ప్రియము' అవుతోంది. **ఆత్మ ఏది ప్రియంగా భావిస్తే అదంతా ప్రియముగా ఆత్మకు సిద్ధిస్తోంది.** |

| | |
|---|---|
| **ఆత్మా వా అరే ద్రష్టవ్యః। శ్రోతవ్యో।**<br>**మన్తవ్యో। నిదిధ్యాసితవ్యో।**<br>**మైత్రేయీ! ఆత్మని ఖలుః అరే (ఖల్వరే)**<br>**దృష్టే శ్రుతే మతే విజ్ఞాత, –**<br>**ఇదగ్ం సర్వం విదితం॥** | ఓ మైత్రేయీ! ఆత్మకు వేరై ఇష్టము రూపముగా ప్రాప్తించేదంతా **ఆత్మయొక్క ఇష్ట ప్రదర్శనమే.** అంతేగాని, వస్తువునుండి వస్తూఉన్నది కాదు. **ఆత్మయే అన్నిటికన్నా ప్రియమైనది. కనుక ఆత్మయే తెలుసుకొవలసినది, ప్రేమించవలసినది కూడా.** వేదాంతశాస్త్రము, సద్గురువులు ఎలుగెత్తి గానం చేస్తున్న ఆత్మ గురించిన సమాచారమే **వినతగినది.** ఆత్మ గురించే **మననము చేయాలి.** అంతేగాని ఇష్టములగు బాహ్య వస్తు సముదాయము గురించి కాదు. ఆత్మగురించే ధ్యానము (నిదిధ్యాస) నిర్వర్తించాలి.<br><br>ఆభరణముయొక్క ఆకారముగురించి ఎంత తెలిస్తే ఏమున్నది? బంగారము గురించి తెలిస్తే బంగారు ఆభరణములన్నిటి గురించి తెలిసినట్లే కదా! మట్టి గురించి తెలిస్తే మట్టి బొమ్మలన్నిటి గురించి తెలిసినట్లే కదా!<br><br>అట్లాగే, **'ఆత్మ'** గురించి **"దర్శనము, వినటము, ఆలోచించటము", ద్వారా తెలుసుకుంటే, ఇక ఈ దృశ్యము, ఈ లోకములు, ఈ జగత్-కథా గమనములు, ఉబుసు పోకలు, ఈ దేహముల రాకపోకలు, జాగ్రత్ - స్వప్న సుషుప్తులు - ఇవన్నీ తెలిసిపోగలవు.** |
| **7** బ్రహ్మ తం పరాత్ ఆద్యో। **అన్యత్ర ఆత్మనో।**<br>బ్రహ్మ వేద। క్షత్రం తం పరాత్, అద్యో<br>**'అన్యత్ర ఆత్మనః'**<br>క్షత్రం వేద। | ఓ మైత్రేయీ! ఏదేది నీవు **'బ్రహ్మమునకు వేరు'** అని తలుస్తావో, అది నిన్ను పరాభవించనున్నదని గమనించెదవు గాక!<br><br>- ఎవ్వడైతే "బ్రాహ్మణుడు ఆత్మకు వేరైనవాడు. భిన్నుడు"...అని భావిస్తాడో **ఆతడు బ్రాహ్మణుని (బ్రాహ్మణత్వము)చే పరాభవించబడబోవుచున్నాడు.**<br><br>- ఎవ్వడైతే "క్షత్రియుడు బ్రహ్మము కంటే వేరు"... అని భావిస్తాడో, **ఆతడు క్షత్రియత్వముచే పరాభవించబడబోవుచున్నాడు.** |
| **(లోకాః, తం)** పరాదుర్యో<br>**అన్యత్ర ఆత్మనో లోకాన్** వేద ।<br>**దేవాః తం** పరాదుర్యో<br>**అన్యత్ర ఆత్మనో** దేవాన్ వేద।<br>**వేదాః తం** పరాదుర్యో<br>**అన్యత్ర ఆత్మనో** వేదాన్ వేద<br>**భూతాని తం** పరాదుర్యో<br>**అన్యత్ర ఆత్మనో భూతాని** వేద॥ | ఎవ్వడైతే **"లోకములు బ్రహ్మము కంటే భిన్నము"...** అని భావన కలిగి ఉంటాడో,.... అట్టి వానిని లోకములు పరాభవించబోవుచున్నాయి.<br><br>ఎవ్వడైతే "దేవతలు, ఇష్టదైవము ఆత్మకంటే భిన్నము"....అని భావన చేయుచున్నాడో **ఆతడు దేవతలచే పరాభవించబడబోవుచున్నాడు.**<br><br>ఎవ్వడైతే "వేదములు ఆత్మకంటే వేరు" ....అని భావిస్తాడో అట్టివాడు వేదములచే పరాభవించబడబోవుచున్నాడు.<br><br>ఎవ్వడైతే "ఈ కనపడే పంచభూతములు, ప్రాణులు (జీవులు) ఆత్మకంటే వేరు" ....అని భావిస్తాడో, **అట్టివాడు పంచభూతములచే, ఇతర ప్రాణులచే పరాభవించబడబోవుచున్నాడు.** |
| **సర్వం తం పరాత్ ఆద్యో (పరాదార్యో)**<br>**అన్యత్ర ఆత్మనః** సర్వం వేద।<br>**ఇదం బ్రహ్మ, ఇదం క్షత్రం,**<br>**ఇమే లోకా, ఇమే దేవా,**<br>**ఇమే వేదా, ఇమాని**<br>**సర్వాణి భూతాని – ఇదగ్ం**<br>**సర్వం యత్ అయం "ఆత్మా"॥** | ఎవ్వడైతే **"ఈ సర్వము ఆత్మకంటే భిన్నమైనది"**....అని భావిస్తాడో, అట్టివాడు ఈ సర్వముచే పరాభవించబడబోవుచున్నాడు.<br><br>అనగా...ఓ మైత్రేయీ!<br><br>ఈ బ్రాహ్మణుడు, ఈ క్షత్రియుడు, ఈ 14 లోకములు, ఈ దేవతలు, ఈ ఇష్టదైవము, ఈ వేదములు, ఈ భూతజాలము, ఈ జీవజాలము, **ఈ సర్వము ఇదంతా ఆత్మయే అయి ఉన్నది.** ఆత్మకు భిన్నమైనది ఏదీ ఎక్కడా లేదు - అని నీవు భావన చేసెదవు గాక। అనుకుంటూ ఉండుటయే **- సాధన।** అనిపించటమే 'సిద్ధి'. **ఆత్మనగు నేనే ఇదంతా - అనునదే ఆత్మోపాసన, ఆత్మభావన కూడా।** |

8 స యథా దున్దుభేః హన్యమానస్య
న బాహ్యాన్ శబ్దాన్
శక్నుయాత్ గ్రహణాయ।
దన్దుభేస్తు గ్రహణేన
దన్దుభ్య అఘాతస్య వా శబ్దో గృహీతః॥

ఈ సర్వమునందు బ్రహ్మమే సారవస్తువు. అట్టి బ్రహ్మమునే ధ్యాసగా కలిగి ఉండి, ఈ జగత్తుపట్ల, ఈ సహజీవులపట్ల ఆత్మ స్వరూపముగా భావన - ఉపాసన నిర్వర్తిస్తూ ఉండాలి. అట్టి ధ్యాస ఎట్లా లభిస్తుంది? చూడు! ఒకచోట అనేక వాయిద్యములు వాయించబడుచూ ఉండగా, అతిపెద్ద శబ్దరూపమగు 'దుందుభి' శబ్దమే చెవులకు వినబడుతుంది కదా! తదితర వాయిద్య శబ్దములు వినబడవు కదా!

అట్లాగే, ఇక్కడ కనిపించే నామ-రూప-జాతి-దేహ-గుణ- స్వభావ-సంబంధ- స్నేహ-అస్నేహాభేదములన్నీ పట్టించుకోకుండా,.. **సర్వము ఆత్మయందే, సర్వమునందు ఆత్మనే** దర్శించాలి. **ఆత్మతత్త్వవేత్తకు సర్వత్రా స్వస్వరూపాత్మయే అగుపిస్తోంది.**

---

9 స యథా శంఖస్య ధ్మాయమానస్య
న భాహ్యాన్ శబ్దాన్ శక్నుయాత్ గ్రహణాయ।
శంఖస్య తు గ్రహణేన శంఖధ్మస్య వా
శబ్దో గృహీతః॥

ఒక బలిష్ఠుడైన కళాకారుడు శంఖమును పూరించుచుండగా,...ఇక తదితర పిచ్చుకల - మనుష్యుల శబ్దాలు వినబడవు కదా! వినువాడు శంఖనినాదమునే వింటూ ఉంటాడు కదా!

శంఖముయొక్క శబ్దమే చెవులకు చేరునట్లు **బ్రహ్మతత్త్వవేత్త ఆత్మను తప్పితే మరింకేమీ చూడడు.** అభేదము, అద్వితీయము, ఏకము అగు ఆత్మయే అతనికి అంతటా ద్యోతకమౌతూ ఉంటోంది. మనము కూడా అట్లే ఆత్మను మాత్రమే గ్రహించాలి. తదితరమైనదంతా **'అసత్తు'**గా భావించి, **'అతీతము'** వహించి ఉండాలి.

---

10 స యథా వీణాయై వాద్యమానాయై
న బాహ్యాన్ శబ్దాన్ శక్నుయాత్ గ్రహణాయ।
వీణాయైతు గ్రహణేన
వీణావాదస్య వా శబ్దో గృహీతః॥

మధురమైన వీణాశబ్దము విని పరవశించుచున్న వాడు బాహ్యమున రహదారిలో జనించే శబ్దములేవీ ఏమాత్రమూ కూడా గ్రహించడు. ఆతనికి వినిపించవు. వీణాతంతు శబ్దములు మాత్రమే చెవులలో ప్రవేశించి వీనులకు విందు చేస్తూ ఉంటాయి. అట్లాగే మనము **అనేకములో ఏకమై, సర్వ భేదములచే స్పృశించబడనిదైనట్టి ఆత్మనే అంతటా దర్శించి, మమేకము కావాలి సుమా!**

---

11 స యథార్ద్రైధాగ్నేః ( స యథా ఆర్ద్రైధ అగ్నే)
అభ్యాహితస్య పృథక్
ధూమా వినిశ్చరన్తి,
ఏవం వా అరే అస్య మహతో భూతస్య
నిశ్వసితం ఏతద్యత్ ఋగ్వేదో,
యజుర్వేదః, సామవేదో, అథర్వ,
అంగిరస, ఇతిహాసః, పురాణం
విద్యా ఉపనిషదః, శ్లోకాః,
సూత్రాణి అనువ్యాఖ్యానాని,
వ్యాఖ్యానాని ఇష్టగ్ంం హుతమాశితం
పాయితమ్ అయం చ లోకః,
పరశ్చ లోకః, సర్వాణి చ భూతాని
అస్యైవైతాని సర్వాణి నిశ్వసితాని॥

కొన్ని తడి (ఆర్ద్రైధ) కట్టెలను ఒకచోట పెట్టి తగులబెట్టుచూ ఉంటే కట్టెలప్రోగు యొక్క అన్ని వైపులనుండి పొగలు బయల్వెడలుతాయి కదా!

పరమాత్మ తత్త్వము నుండే **ఋుక్ యజుర్ సామ అథర్వణ వేదములు, ఇతిహాసములు, పురాణములు, నాట్య-సంగీత శాస్త్రము, ఉపనిషత్తులు, ఇహ-పరలోకములు, సమస్త భూతములు...ఇవన్నీ బయల్వెడలుచున్నాయి.**

**ఇవన్నీ బ్రహ్మదేవుని నిచ్ఛ్వాసలుగా చెప్పబడుచున్నాయి.**

వేదోపనిషత్తులు, వ్యాఖ్యాన-ఉపాఖ్యానములు, బ్రాహ్మణములందలి మంత్రములు, స్తోత్రశ్లోకములు, బ్రహ్మసూత్రములు, మంత్ర వివరణలు,అర్థ వాదములు, ఇష్టములు (యజ్ఞములు), సమస్తహుతములు తినిపించునవి, తినబడుచున్నవి, తినుచున్నవాడు(The Experiences, The Experiencing,all That being experienced) ...ఇవన్నీ **బ్రహ్మముయొక్క అంతరము నుండి బయల్వెడలుచున్నవే।** సృష్టికర్తయగు బ్రహ్మదేవుని నిచ్ఛ్వాస (ఊపిరి గాలి విడుచు) చమత్కారములే.

| | |
|---|---|
| **12** స యథా సర్వాసామ్ అపాగ్ం<br>సముద్ర ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం స్పర్శానాం **'త్వక్'** ఏక అయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం రసనాం **'జిహ్వా'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాం గన్ధానాం **'నాసికా'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం రూపాణాం **'చక్షుః'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం శబ్దానాగ్ం **'శ్రోత్రం'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషాగ్ం సంకల్పానాం **'మన'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వాసాం విద్యానాగ్ం **'హృదయం'** ఏకాయనం ఏవగ్ం, | జలములన్నిటికీ జనన-గమ్యస్థానములు సముద్రమే కదా! సముద్రమునుండే బయలుదేరి, చివరికి సముద్రమే చేరుచున్నాయి. అందుచేత జలములకు ముఖ్యస్థానము **సముద్రమే।** అట్లాగే,<br>❖ సర్వ స్పర్శానుభవములకు, స్పర్శనాశక్తికి ముఖ్యస్థానము-**చర్మము** (త్వక్).<br>❖ సమస్తమైన 'రుచి' అనుభవములకు ముఖ్యస్థానము - **నాలుక** (జిహ్వా)<br>❖ సర్వ గన్ధములకు (వివిధ వాసనల, అనుభవమునకు) - ముఖ్యస్థానము **ముక్కు** (ఘ్రాణము)<br>❖ చూడబడుచున్న రూపాలన్నిటికీ జనన-లయస్థానము **కనులే।** చూపుయే ఏకైక గమ్యస్థానము. చూపు బయల్వెడలి భావనతో కూడి, రూపములను తెచ్చుకొని **దర్శనానుభవరూపముగా పొందుచున్నది.**<br>❖ శబ్దములన్నిటికీ **చెవియే** ఏకైక ముఖ్యస్థానము, గమ్యస్థానము.<br>❖ సర్వసంకల్పములకు ఏకైక జననస్థానము - గమ్యస్థానము **మనస్సే.**<br>❖ ఎరుగబడుచున్న - నేర్చుకొనుబడుచున్న సమస్త జగత్-విశేషములకు ఏకైక గమ్యస్థానము **హృదయమే.** |
| సర్వేషాగ్ం కర్మణాగ్ం **'హస్తాః'** ఏకాయనగ్ం ఏవగ్ం,<br>సర్వేషాం ఆనన్దానాం **'ఉపస్థ'** ఏకాయనం ఏవగ్ం, | చేతులతో చేసే సర్వ పనులకు ఏకైక గమ్యము - లయస్థానము హస్తములే (చేతులే) అయి ఉన్నది.<br>సర్వ శృంగార ఆనన్దములకు ముఖ్యస్థానము, ఏకైక గమ్యము ఉపస్థయే అయి ఉన్నది. |
| సర్వేషాం విసర్గాణాగ్ం **'పాయుః'** ఏకాయనం ఏవగ్ం,<br>సర్వేషామ్ మధ్వానాం **'పాదాః'** ఏకాయనం ఏవగ్ం, | విసర్జించబడేదానికంతటికీ పాయువు ఏకైక ముఖ్యస్థానము, గమ్యస్థానము కూడా.<br>తిరుగుచున్న ప్రదేశములన్నిటికీ (నడకలన్నిటికీ) పాదములే ముఖ్య - ఏకైక - గమ్యస్థానము. |
| సర్వేషాం వేదానాగ్ం **'వాక్'** ఏకాయనం (ఏవగ్ం)॥ | అట్లాగే వేదములన్నిటికీ ముఖ్యస్థానము, గమ్యస్థానము - ఏకైక స్థానము **వాక్కుయే।** |
| **13** స యథా సైన్ధవ ఘనో<br>అనన్తరో బాహ్యః కృత్స్నో<br>రసఘన ఏవైవం, వా అరే<br>అయం ఆత్మా అనన్తరో<br>అబాహ్యః కృత్స్నః। | ఓ మైత్రేయీ! ఈ జీవునికి ఈ దృశ్య ప్రపంచమునకు, ఈ విశ్వమునకు బయట లోపల, నీయొక్క నాయొక్క బయట, లోపలకూడా **బ్రహ్మమే సర్వదా సర్వత్రా వ్యాపించినదై ఉన్నది.** ఒక ఉప్పు గడ్డకు బాహ్యము వైపుగాను, లోపల కూడా లవణమే ఏర్పడి ఉన్నది కదా! అట్లాగే 'ఎరుక' రూపము దాల్చిన బ్రహ్మమే ఎరుగబడుచున్న సమస్తమునకు లోపల బయట ఏర్పడి ఉన్నది. **ఆత్మయే సర్వమునకు ఏకైక ఉత్పత్తి - గమ్యస్థానము.** |
| "ప్రజ్ఞాన ఘన" ఏవై। తేభ్యో<br>భూతేభ్యః సముత్థాయ,<br>తాని ఏవాను వినశ్యతి<br>న ప్రేత్య సంజ్ఞాస్తీతి, అరే, బ్రవీమి ఇతి–<br>– హోవాచ యాజ్ఞవల్క్యః। | ఆత్మనుండే పంచభూత ప్రదర్శనమంతా బయల్వెడలి, తిరిగి ఆత్మయందే విలీనమగుచున్నది. **ఈ జీవరాసులంతా,** నీతో - నాతో సహా, **బ్రహ్మము యొక్క ప్రజ్ఞాన ఘనరూపమే అయి ఉన్నాము.** ఈ సర్వము ప్రజ్ఞాన ఘనమునుండే బయల్వెడలి, తిరిగి ప్రజ్ఞానాత్మయందే లయిస్తోంది. ఓ మైత్రేయీ! మనకు దేహభావము తొలగిందా, ఇక మనపట్ల నామ రూపాత్మకమైన భేదమంతా తొలగిపోతోంది. **కేవల ప్రజ్ఞానంద స్వరూపులమై, ఈ సర్వము మనలో ఉన్నదై, ఈ సర్వము మనమే అయి...** ప్రకాశమాన మగుచున్నాము. **ఇక ఆపై నామరూప సంజ్ఞలు మనపట్ల శేషించవు.** |

14 సా హోవాచ మైత్రేయి :

**యత్రైవ మా, భగవాన్!**

**మోహాన్తమాపీ పిపిన్ న వా**

**(మోహనమ్ అపి అజాపన్ న వా)**

**అహమ్ ఇమం విజానామ్-ఇతి।**

**మైత్రేయి** : పరమ పూజ్యుడవు, అస్మత్ ప్రాణేశ్వరుడవు అగు ఓ భగవన్! యాజ్ఞవల్క్య మహర్షీ! నేను దేహ-మనోభావములను వదలినప్పుడు ఆప్యాయతలు మొదలైనవన్నీ కోల్పోయి, అప్పుడు బ్రహ్మభావమును ఆశ్రయించాలని చెప్పుచున్నారు. "ఏది ఎట్లా వదలి-పోగొట్టుకోవాలి? ఏది ఎట్లా పొందాలి?" అన్న విషయంలో, నన్ను కొంతవరకు మీరు మోహమున పడవేస్తున్నారు. నేను మీరు చెప్పిన మాటలచే **'ఆత్మ వస్తువు'** అనగాఏమో గ్రహించలేకపోతున్నాను. మోహమును వదిలించుకోలేకపోతున్నాను.

---

స హోవాచ : (యాజ్ఞవల్క్యోవాచ):

**న వా అరే అహం మోహం బ్రవీమి।**

**అవినాశీ వా అరే, అయం ఆత్మా అనుచ్ఛిత్తి ధర్మా।**

**యాజ్ఞవల్క్యుడు** : లేదు మైత్రేయీ! నేను నిన్ను మోహమును పడవేయుటలేదు. ఏదో వదలమనీ చెప్పటము లేదు. నీయొక్క ఉచ్ఛితి (చీల్చబడు) ధర్మమే లేని ఆత్మను గమనించమని, గ్రహించమని మాత్రమే గుర్తు చేస్తున్నాను. (Please observe the Indivisible SELF of yourself).

---

15 యత్ర హి ద్వైతం ఇవ భవతి,

**తదితర ఇతరం పశ్యతి।**

**తదితర ఇతరం జిఘ్రతి।**

**తదితర ఇతరగ్ం రసయతే।**

**తదితర ఇతరం అభివదతి।**

**తదితర ఇతరగ్ం శృణోతి।**

**తదితర ఇతరం మనుతే।**

**తదితర ఇతరగ్ం స్పృశతి।**

**తదితర ఇతరం విజానాతి।**

ఓ ప్రియమైత్రేయీ! ఆత్మప్రజ్ఞానందస్వరూపిణీ!

ఎక్కడైతే "నాకు వేరుగా - దేహమున్నది. ఇంద్రియములున్నాయి. ఇంద్రియజగత్తు ఉన్నది. దేవతలు ఉన్నారు. దైవము ఉన్నది. బంధుమిత్రపరివారము ఉన్నది" - అనుద్వైతము మనస్సుకు అనిపిస్తూ ఉన్నదో, అట్టి భేద దృష్టి ఉన్నచోట-ఆత్మ ఏమరువబడుచున్నది.

**నేను వేరు.** ఆత్మవేరు.

నాకు వేరుగా శబ్ద - స్పర్శ - రూప - రస గంధాలు

నాకు వేరుగా వినబడేవి, స్పృశించబడేవి - చూడబడేవి - రుచి చూడబడేవి, వాసనచూడబడేవి ఏర్పడి సత్యమై ఉన్నాయి -

**అనునదంచా మనస్సుచేతనే పరిభవిస్తోంది.**

ద్వైతమున్నచోటనే....

- ఒకటి మరొకదానిని చూడటము,
- ఒకటి ఇంకొకదానిని వినటము,
- ఒకటి వేరొకదానిని ఆలోచించటము,
- ఒకటి మరొకదానిని స్పృశించటము,
- ఒకటి వేరైనదానిని తెలుసుకోవటము

...ఇవన్నీ సంభవిస్తున్నట్లుగా అనిపిస్తున్నాయి, కనిపిస్తున్నాయి.

---

**యత్రత్వస్య సర్వం ఆత్మైవ అభూత్, -**

**తత్ కేన కం పశ్యేత్?**

**తత్ కేన కం జిఘ్రేత్?**

**తత్ కేన కగ్ం రసయేత్?**

**తత్ కేన కం అభివదేత్?**

**తత్ కేన కగ్ం శృణుయాత్?**

**తత్ కేన కం మన్వీత?**

**తత్ కేన కగ్ం స్పృశేత్?**

**తత్ కేన కం విజానీయాత్?**

**ఏన ఇదగ్ం సర్వం విజానాతి,**

**తం కేన విజానీయాత్?**

**'సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ' , 'అద్వితీయమ్ మమ ఆత్మా"**...మొదలైన మహావాక్యములు ఎక్కడ విచారణచే బుద్ధికి నిర్దుష్టము, సుస్పష్టము అవుతాయో, అచ్చోట **సర్వము ఆత్మయే అగుచున్నది.** ఇక ఏది దేనిని ఆఘ్రానిస్తోంది? ఏది దేనిని చూస్తోంది? ఏది దేనిని వింటోంది? ఏది దేనిచే దేనిగురించి సంభాషిస్తోంది? ఏది దేనిని విచారణ చేస్తోంది? ఏది దేనిని ఇంకొకటిగా తెలుసుకుంటోంది? ఏ ఆత్మ కారణంగా, ఆత్మజ్ఞానముచే **'ఇదంతా ఆత్మయే'** అని స్వాభావికంగాను, స్వానుభవంగాను నిర్ణయించబడుతోందో, అట్టి ఆత్మ మరొకదానిని (తనకు వేరైన) దేనిని తెలుసుకోవాలి? ఆత్మకు వేరైనది ఉంటే కదా, ఆత్మ తెలుసుకోవలసిన అవసరం?

స ఏష "నేతి। నేతి"। ఇతి–ఆత్మా
అగృహ్యో, నహి గృహ్యతే।
అశీర్యో నహి శీర్యతే।
అసంగో నహి సజ్యతే।
అసితో న వ్యథతే।
న రిష్యతి విజ్ఞాతారమ్
అరే, "కేన విజానీయాత్?"–ఇతి ।
– ఉక్త అనుశాసనాసి॥
మైత్రేయీ! తావత్, అరే!
ఖలు అమృతత్వం।

ఈ విధంగా ఆత్మ అగ్రాహ్యము. ఏది తెలుసుకొనుచున్నదో, ఏది తెలియబడుచున్నదో,... అదంతా ఆత్మయే!

ఆత్మదేనిచేతా దేనినీ స్వీకరించటము లేదు. ఆత్మ దేనికీ చిక్కటము లేదు. దేనితోనూ సంగము కలిగిలేదు. దేనికీ వ్యథచెందటము లేదు. ఆత్మ దేనిచేతనూ బంధము పొందటము లేదు. ఆత్మ దేనిచేతనూ తెలియబడటము లేదు.

**ఆత్మ ఆత్మచేతనే ఏర్పడినదై, ఆత్మగానే సర్వదా వెలుగొందుచున్నది. ఆత్మకానిదేదీ లేదు! ఆత్మకు వేరు ఏదీ లేదు.**

ఓ మైత్రేయీ! మనమంతా అమృతమయ స్వరూపులమే! అది సుస్పష్టము చేసుకోవటానికే ఇదంతా!

ఇతి హోక్త్వా యాజ్ఞవల్క్యో, విజహార॥

ఇట్లు బోధించగా మైత్రేయి **"అహమ్ ఆత్మా"** భావన పొంది సంతృప్తిపొందింది.

యాజ్ఞవల్క్యుడు సన్న్యశించటానికి అంగీకారము తెలిపినది.

**ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠమ అధ్యాయః**
**"మైత్రేయీ బ్రాహ్మణమ్" నామ పంచమ బ్రాహ్మణమ్॥**

**ఇతి బృహదారణ్యకోపనిషత్ - షష్ఠమ అధ్యాయః**
**"మైత్రేయీ బ్రాహ్మణమ్" నామ పంచమ బ్రాహ్మణమ్॥**

# షష్ఠమాధ్యాయః - షష్ఠమ బ్రాహ్మణమ్

## "వగ్ంశః బ్రాహ్మణమ్"

1 అథ (ఇదానీం) వగ్ంశః।
పౌతిమాష్యాత్।
పౌతిమాష్యో గౌపవనాత్।
గౌపవనః పౌతిమాష్యాత్।
పౌతిమాష్యో గౌపవనాత్।
గౌపవనో కౌశికాత్।
కౌశికః కౌణ్డిన్యాత్।
కౌణ్డిన్యః శాండిల్యాత్।
శాణ్డిల్యః కౌశికాచ్చ।
కౌశికాచ్చ గౌతమః॥

అట్టి పరబ్రహ్మము ఒకరిచే మరొకరికి తరతరములుగా ప్రవచించబడుచూ, బోధించబడుతూ వస్తోంది. వంశపారంపర్యముగా, గురు-శిష్య పరంపరగా ఈ లోకమునందు బ్రహ్మజ్ఞానము దేదీప్యమానముగా ప్రకాశమానము అగుచున్నది. అట్టి ఆచార్య పరంపర, గురుశిష్యపరంపరకు కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించు కుంటున్నాము.

**మధుకాండ వంశపరంపర**

**ఓం నమో శ్రీ గురోభ్యో, పౌతిమాష్యాత్ సమారంభాః।**

- శ్రీ పౌతిమాష్యుని నుండి శ్రీగౌపవననుడు,
-శ్రీ గౌపవననుడు శ్రీకౌశికుని నుండి,
-శ్రీ కౌశికుడు శ్రీ కౌణ్డిన్యుని నుండి
-శ్రీ కౌణ్డినుడు శ్రీ శాండిల్యుని నుండి,
- శ్రీ శాండిల్యుడు శ్రీ కౌశికుడు, గౌతముడు అనువారి నుండి,

2 గౌతమః అగ్నివేశ్యాత్। అగ్నివేశ్యో గార్గ్యాత్।
శాణ్డిల్యా చ అనభిమ్లాతాత్
అనభిమ్లాత ఆనభిమ్లాతాత్।
ఆనభిమ్లాతా ఆనభిమ్లాత్యాఅ-నభిమ్లాతా
గార్గ్యో గౌతమా! గౌతమః సైతవాత్।
సైతవ ప్రాచీనయోగ్యాభ్యాగ్ం।
ప్రాచీనయోగ్యో పారాశర్యాత్।
పారాశర్యః, భరద్వాజాత్।
భరద్వాజః భారద్వాజాచ్చ।
గౌతమాచ్చ గౌతమః।
గౌతమాత్ భరద్వాజః।
భద్వాజాత్ పరాశర్యః।
పరాశర్యాత్ పారాశర్యః।
బైజవాపాయనాత్ బైజవాపాయనః
కౌశికాయనేః కౌశికాయనిః॥

శ్రీ గౌతముడు శ్రీ అగ్నివేశ్యుని నుండి, ఆత్మవిద్య- "సర్వము మధురమే" అనే మధుగీతను పొందారు. వారందరికి సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తూ వారి పాదరజమును శిరస్సుపై భక్తి పూర్వకంగా ధరిస్తున్నాము.

-శ్రీ గౌతముడు శ్రీ అగ్నివేశ్యుని నుండి,
-శ్రీ అగ్నివేశ్యుడు శ్రీ శాండిల్యుని నుండి, (మరియు) శ్రీ ఆనభిమ్లాతుని నుండి,
- శ్రీ ఆనభిమ్లాతుడు శ్రీ గౌతముని నుండి,
→ శ్రీగౌతముడు → శ్రీ సైతవుని నుండి (మరియు అనేక మంది యోగులగు మహనీయుల నుండి),
శ్రీ సైతవుడు ప్రాచీన యోగ్యుడగు శ్రీపారాశర్యుని నుండి
శ్రీ పారాశర్యుడు శ్రీ భారద్వాజుని నుండి,
శ్రీ భారద్వాజుడు → శ్రీ భారద్వాజుడు (మరియు) గౌతముల నుండి
శ్రీ గౌతముడు శ్రీ భారద్వాజుని నుండి,
శ్రీ భారాద్వాజుడు శ్రీ పారాశర్యుని నుండి,
శ్రీ పారాశర్యుడు శ్రీ బైజవాపాయను నుండి,
శ్రీ బైజవాపాయనుడు → శ్రీ కౌశికాయనుని నుండి,
(ఘృతకౌశుకుని నుండి) బ్రహ్మ విద్యను నేర్చుకున్నవాయ్యారు.

కౌసికాయని సైతవాత్ప్రైతవః।
సైతవాత్ప్రైతవః పారాశర్యాయణాత్।
పారాశర్యాయణో గార్గ్యాయణ ఉద్దాలకాయనాత్।
ఉద్దాలకాయనో జాబాలాయనో మధ్యన్దినాయనాత్।
మాధ్యాన్దినాయనో సౌకరాయణాత్।
సౌకరాయణః కాషాయణాత్।
కాషాయణః సాయకాయనాత్।
సాయకాయనః కౌశికాయనేః॥

అట్టి బ్రహ్మ విద్యను తరతరములుగా, వంశ పారపర్యంగా, గురు-శిష్య పారవర్యంగా బోధిస్తూ, బోధింపబడుచూ, గ్రంథస్థం చేస్తూ వస్తున్న గౌతమ పారశర్య భారద్వాజ బైజపాయన మొదలైన మహామనీయులందరికీ త్రిప్రదక్షణ పూర్వక- సాష్టాంగ దండ ప్రణామములు. రెండు చేతులు జోడించి నమస్కరిస్తున్నాము.

---

3 కౌశికాయనిః ఘృతకౌశికాత్।
ఘృతకౌశికః పారాశర్యాయణాత్।
పారాశర్యాయణః పారాశర్యాత్।
పారాశర్యో జాతూకర్ణ్యాత్।
జాతూకర్ణ్యః ఆసురాయణాచ్చ, యాస్కాచ్చ।
ఆసురాయణః త్రైవణేః త్రైవణిః రౌపజన్ధనేః
రౌపజన్ధనిః ఆసురేః
ఆసురిః భారద్వాజాత్।
భారద్వాజ ఆత్రేయాత్। ఆత్రేయో మాణ్టేః।
మాణ్టిః గౌతమాత్। గౌతమో గౌతమాత్।
గౌతమో వాత్స్యాత్।
వాత్స్యః శాణ్డిల్యాత్।
శాండిల్యః కైశోరాత్। కాప్యాత్ కైశోర్యః।
కాస్యః కుమారహారితాత్।
కుమారహారితో గాలవాత్।
గాలవో విదర్భీ కౌణ్డిన్యాత్।
విదర్భీ కౌణ్డిన్యో వత్సనపాతోబాభ్రవాత్।
వత్సనపాద్బాభ్రవః, విదర్భీ కౌణ్డిన్యాత్।
విదర్భీ కౌణ్డిన్యో వత్సనపాతో బాభ్రవాత్।
వత్సన పాద్బాభ్రవః పంథా స్సౌభరాత్।
పన్థా స్సౌరభరో - అయాస్య అంగిరసాత్।
అయాస్య ఆఙ్గిరస ఆభూతే స్త్వాష్ట్రాత్।
ఆభూతిస్త్వాష్ట్రో విశ్వరూపాత్।
విశ్వరూపాత్త్వాష్ట్రాత్।
విశ్వరూపస్త్వాష్ట్రోః అశ్విభ్యాం।
అశ్వినౌ దధీచ అథర్వణాత్।

శ్రీ కౌశికాయనుడు శ్రీఘృత కౌశికుని నుండి,
శ్రీ ఘృత కౌశికుడు → శ్రీ పారాశార్యాయణుని నుండి
శ్రీ పారాశార్యాయణుడు → శ్రీ పారాశర్యుని నుండి,
శ్రీ పారాశర్యుడు శ్రీ జాతూకర్ణ్యుడి నుండి,
శ్రీ జాతూకర్ణ్యుడు → ఆసురాయణుని నుండి, (మరియు), శ్రీయాస్కులుని నుండి
శ్రీ యాస్కురాయణుడు → శ్రీ త్రైవణి నుండి,
శ్రీ త్రైవణి → శ్రీ ఓపజంధని నుండి
శ్రీ ఓపజంధని → శ్రీ భారద్వాజుని నుండి,
శ్రీ భారద్వాజుడు → శ్రీ ఆత్రేయుని నుండి,
శ్రీ ఆత్రేయుడు → శ్రీ మాణ్డినుండి,
శ్రీ మాణ్డి → శ్రీ గౌతముని నుండి,
శ్రీ గౌతముడు → శ్రీ వాత్స్యుని నుండి,
శ్రీ వాత్స్యుడు → శ్రీ శాణ్డిల్యుని నుండి,
శ్రీ శాండిల్యుడు → శ్రీ కైశోర్యకాప్యుని నుండి,
శ్రీ కైశోర్యకాప్యుడు →శ్రీ కుమారహారితుడి నుండి,
శ్రీ కుమారహారితుడు → శ్రీ గాలవుని నుండి,
శ్రీ గాలవుడు → శ్రీ విదర్భీ కౌండిన్యునిడి నుండి
శ్రీ విదర్భీకౌండిన్యుడు → శ్రీ వత్సనపాత్ బాభ్రవుని నుండి,
శ్రీ వత్సనపాత్ బాభ్రవుడు → శ్రీ విదర్భీ కౌణ్డిన్యుని నుండి,
శ్రీ విదర్భీ కౌణ్డిన్యుడు → శ్రీ వత్సనపాతో బాభ్రవుని నుండి
శ్రీ వత్సనపాతో బాభ్రవుడు → శ్రీ పంథా సౌభరునుని నుండి
శ్రీ పంథా సౌభరుడు → శ్రీ అయాస్య అంగిరసుని నుండి,
శ్రీ అయాస్య అంగిరసుడు → శ్రీ ఆభూతిత్వాష్టుని నుండి,
శ్రీ ఆభూతిత్వాష్టుడు → శ్రీ విశ్వరూపత్వాష్టుని నుండి,
విశ్వరూపత్వాష్టుడు → అశ్వినీ దేవతల నుండి,

తధ్యఙ్ఞాథర్వణో అథర్వణో దైవాత్।
అథర్వాదైవో మృత్యోః ప్రాధ్వగ్ంసనాత్।
మృత్యుః ప్రాధ్వసనః, ప్రధ్వగ్ంసనాత్।
ప్రధ్వగ్ంసన ఏక ఋషేః।
ఏక ఋషిః- విప్రచిత్తేః।
విప్రచిత్తిః వ్యష్టేః।
వ్యష్టి సనారోః।
సనారుః సనాతనాత్।
సనాతనః సనకాత్।
సనకః పరమేష్ఠినః।
పరమేష్ఠీ బ్రహ్మణో।
బ్రహ్మ స్వయంభూ
బ్రహ్మణే నమః।

ఇతి బృహదారణ్యకోపనిషత్-షష్ఠాధ్యాయః
"వంశబ్రాహ్మణమ్" నామ షష్ఠ బ్రాహ్మణమ్॥

అశ్వినీదేవతలు దధీచినుండి, అధర్వణుని నుండి,
**అధ్యాత్మ విద్యా పరంపరగా శ్రుతముచేయబడుతూ వస్తోంది.**
అధర్వణఃదైవుని నుండి మృత్యుప్రాధ్వసనుడు,
ఆ ప్రధ్వసనుడు ఏకర్షి నుండి,
ఏకర్షి విప్రచిత్తి నుండి,
విప్రచిత్తి వ్యష్టి నుండి,
వ్యష్టి సనారువు నుండి
సనారువు సనాతనుని నుండి,
సనాతనుడు సనకుని నుండి,
సనకుడు పరమేష్ఠి నుండి,
పరమేష్ఠి బ్రహ్మనుండి,
బ్రహ్మ విద్యను గ్రహించటం జరుగుతూ వస్తోంది.
బ్రహ్మ స్వయంభువు తన ఉనికికి తానే కారణమై ఉన్నట్టివారు.
**స్వయంభువు అగు బ్రహ్మదేవునికి, భక్తిపూర్వకంగా ప్రణమిల్లుచున్నాము.**

ఇతి బృహదారణ్యకోపనిషత్-షష్ఠాధ్యాయః
"వంశబ్రాహ్మణమ్" నామ షష్ఠ బ్రాహ్మణమ్॥

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## షష్ఠమ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### అధ్యయన పుష్పము

# (6) షష్ఠమ అధ్యాయము

## 1. ప్రథమ బ్రాహ్మణము

### యాజ్ఞవల్క్య కాండము - షట్ ఆచార్య బ్రాహ్మణము

**ఓం। జనకో హ వైదేహ ఆసాన్చక్రే। అథ హ యాజ్ఞవల్క్య అవవ్రాజ।**

ఒకానొక రోజు..,

విదేహ దేశ చక్రవర్తి జనక మహారాజు రాజసభలో సింహాసనముపై ఆసీనులై ఉన్నారు. అనేక రాచకార్యములను నిర్వర్తిస్తూ ఉన్నారు. సభలోని ఆత్మజ్ఞులగు మహనీయులకు, పండితులకు – గోవులు, ధనములను సమర్పిస్తూ సత్కరిస్తూ ఉన్నారు.

ఉన్నట్లుండి మహనీయుడు, ఆత్మతత్త్వజ్ఞులలో లోక ప్రసిద్ధుడు అగు యాజ్ఞవల్క్య మహర్షి రాజసభలో ప్రవేశించారు. జనక మహారాజు గురువర్యులగు యాజ్ఞవల్క్యులవారికి స్వాగత సత్కారాలు సమర్పించి, సభలో గురు– ఉన్నతాసనముపై ఆశీనులను చేశారు. సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు.

**జనక మహారాజు :** గురువర్యా **కిమర్థమ్? పశూన్? ఇచ్ఛాన్ అర్వాన్తాని – ఇతి?** తమరు ఏమి పని మీద వచ్చారు? ఆశ్రమమునకు గోవుల ఆవశ్యకత కలగటం చేత వేంచేశారా? లేక, సూక్ష్మమగు పరబ్రహ్మము గురించి మనము సంభాషించు ఉద్దేశ్యముతో (ఇష్టముతో) వచ్చారా?

**యాజ్ఞవల్క్యుడు :** హే సమ్రాట్! (వాజపేయ యాగము చేయటచేతను, సామంతరాజులను తన సామర్థ్యముతో సర్వజన సమ్మతముగా పాలించటంచేత... ఈ రెండు కారణాల చేతకూడా జనక మహారాజు – 'సమ్రాట్' అను పిలుపుచే ప్రసిద్ధులు).

జనక మహారాజా! మా ఆశ్రమమునకు గోవులూ అవసరమే। అంతేకాకుండా **కర్మయోగులు, ఆత్మతత్త్వమును శ్రద్ధగా సేవించువారు, యోగపుంగవులు అగు మీతో సంభాషించటము కూడా మహత్తరమైన సందర్భముగా భావిస్తూ ఉంటాము.** అందుచేత మీరు అడిగిన రెండు ఉద్దేశ్యాలు కలిగియే వచ్చాను. అయితే, ఆధ్యాత్మికంగా ఇప్పుడు నేనుగా ఏదీ చెప్పదలచుటలేదు. అందుచేత రాజా! మీరు అనేక మంది ఆచార్యులను సేవిస్తూ ఉంటారు. ఎల్లప్పుడూ (ప్రతిరోజూ) బ్రహ్మజ్ఞులగు మహీయుల, వేదజ్ఞుల, సాహితీవేత్తల సత్సంగ పూర్వకమగు ఉపన్యాసములతో రాజసభను ముగిస్తూ ఉండే ఆనవాయితీ కలిగి ఉంటారు కదా! ఈ మధ్యగా ఈ రాజసభకు ఆచార్యులు విచ్చేసి, బ్రహ్మతత్త్వము గురించి పలికిన **'ఆత్మవాక్యముల వివరణ'** గురించి ఏవైనా ప్రస్తావించండి. అట్టి మహనీయుల అభిప్రాయములను సత్సంగపూర్వకంగా మననము చేసుకుందాము. **నేను మీ వద్ద వింటాను.**

# వాక్ వై బ్రహ్మేతి

**జనక మహారాజు :** అవును. ఈ మధ్య కొన్నిరోజులక్రితం శిలిని ముని కుమారుడు జిత్వాచార్యులు విచ్చేశారు. వారిని మేము **"అయ్యా! బ్రహ్మము గురించి మాకు చెప్పండి!"..** అని విజ్ఞప్తి చేశాము. వారు – **"వాగ్వై బ్రహ్మ్। వాక్‌యే బ్రహ్మము, మరియు వాక్ ఇంద్రియ అధిష్ఠాన దేవత అగు అగ్ని దేవతయే నిశ్చయముగా బ్రహ్మము"...** అని బ్రహ్మసూత్రముగా చెప్పారు. **యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ బ్రూయాత్, తథా తత్ శైలినో అబ్రవీత్– "వాగ్వై బ్రహ్మేఽతి।"** వారు తమ మాతృదేవత, పితృదేవులు, ఆచార్యదేవులు చెప్పిన వల్లె శ్లోకాలు, మాటలు, సవివరణలు, దృష్టాంతాలు ఉటంకిస్తూ **"(అధిష్ఠానదేవత అగు అగ్నితో కూడి) వాక్కుయే – బ్రహ్మము"..** అని వర్ణించుకుంటూ వచ్చారు.

**యాజ్ఞవల్క్యుడు :** ఓహో! ఆ జిత్వాచార్యుల వారు – **"వాక్ వై బ్రహ్మేఽతి" – వాక్కుయే బ్రహ్మము** – అని సిద్ధాంతీకరించారా?

అవును. వారు తల్లి–తండ్రుల వద్ద, ఆచార్యుల వద్ద విన్నవి వివరించి ఉంటారు. నిజమే! వాక్కుతోనే కదా, మనము బ్రహ్మము గురించి వివరించుకునేది! కనుక మంచిదే। బాగుగా చెప్పారు. అయితే,... **అట్టి వాక్కు ఈ భౌతిక శరీరమునందే ప్రతిష్ఠితమైనదని చెప్పారా?** లేక, వాక్కుకు ఉత్పత్తి– ప్రతిష్ఠితము అగు స్థానమైనటువంటి మరొక విశేష స్థానము గురించి, ఆ స్థానములో వాక్కు ఎట్లా జనించి, వికాసము కలిగి ఉంటోందో – అద్దానిని గురించి కూడా చెప్పారా?

**జనక మహారాజు :** లేదు. **"వాక్కు దేనియందు ఎట్లా ప్రతిష్ఠితమైయున్నది?.."** అనే విషయము ఆయన ప్రస్తావించలేదు. **"వాక్కుయే బ్రహ్మము"** అనునది మాత్రం సోదాహరణంగా వివరించి చెప్పారు.

**యాజ్ఞవల్క్యుడు :** ఓహో! ఒకవేళ్ళ ఆ జిత్వాచార్యులవారు భౌతికదేహమునుండి వినిపించే వాక్కును మాత్రమే పరిమితమై, 'వాక్‌వై బ్రహ్మేతి' అనే సూత్రము గురించి సంభాషించి ఉంటే, అప్పుడు **నాలుగు వంతులలో ఒక వంతు వరకు మాత్రమే 'వాక్ బ్రహ్మము' గురించి చెప్పినవారగుచున్నారు.**

**జనక మహారాజు** : అట్లాగా! మీరు అన్నట్లు **"భౌతికదేహము నుండి వినిపించే వాక్కు బ్రహ్మము"..** అని చెప్పినప్పుడు నాలుగింట – ఒక పాదమే చెప్పినట్లు అగుచున్నట్లయితే, **మిగతా మూడు పాదముల 'వాక్ బ్రహ్మము' యొక్క వివరణ ఏమిటో మాకు వివరించి చెప్ప ప్రార్థన.**

**యాజ్ఞవల్క్యుడు** : ఈ భౌతిక దేహములో నాలుగింట ఒకవంతుగా ఉండి ఉన్న 'వాక్కు'... మిగిలిన మూడు వంతులు **"అవ్యాకృత–ఆకాశము"..** అనునదే ఆశ్రయముగా (ఆయతనముగా) కలిగి ఉన్నది.

[**అవ్యాకృతాకాశము** = మనోబుద్ధి – చిత్త – అహంకారాలు అనబడే అంతరంగ చతుష్టయము ఎద్దానియందు జనన స్థానము – లయస్థానముగా కలిగి ఉన్నాయో – అది. **వ్యాకృతము = విస్తరించునది.** (Extending as, Transforming as some thing else). **అట్టి ధర్మము లేనట్టి** ఆత్మాకాశమే – "అవ్యాకృతాకాశము"].

'వాక్' ఇంద్రియమును ఆక్రమించుకొనియున్న (వాక్ అధిష్ఠానమగు) ఆత్మకు (బ్రహ్మమునకు)... 'వాక్కు'యే శరీరము.

- "అవ్యాకృతాకాశమునకు వాక్కు ప్రతిష్ఠ।
- బ్రహ్మమే వాక్కుకు ప్రజ్ఞ" – అని ఉపాసించాలి సుమా.

**జనక మహారాజు** : **"బ్రహ్మమే వాక్కులో ప్రవేశించినదైయున్న ప్రజ్ఞ"..** అని అంటున్నారు కదా! ప్రజ్ఞ → అనగా ఏమి? ప్రజ్ఞ బ్రహ్మముకన్నా, వాక్కు కన్నా వేరైనదా?

**యాజ్ఞవల్క్యుడు** : కాదు. ప్రజ్ఞ బ్రహ్మము కంటే వేరుకాదు. వాక్కుయే **'ప్రజ్ఞ'** అయి ఉన్నది కూడా. అది ఎట్లాగో చెప్పుతాను. వినండి!

వాక్కు చేతనే **"ఇతడు నాకు బంధువు. ఆతడు నాకు స్నేహితుడు"...** మొదలైన సంబంధములు చెప్పుకోబడుచూ, వాక్కు చేతనే అర్థము చేసుకోబడుచున్నాయి కదా। వాక్కు చేతనే...,

ఋగ్వేదము; యజుర్వేదము; సామవేదము; అథర్వణ వేదము, అంగిరసము; ఇతిహాసములు; పురాణములు; బ్రహ్మవిద్యతో సహా సర్వవిద్యలు; ఉపనిషత్తులు; శ్లోకములు; సూత్రములు (బ్రహ్మసూత్రములు, యోగసూత్రములు మొదలైనవి), అను–వ్యాఖ్యానములు.

వాఖ్యానములు. ఇష్టి, ఆహూతులు; భక్షిణ (Eating) నిమిత్తమైన ధర్మములు (అశితములు), పాన (Drinking) నిమిత్తమైన ధర్మములు (పాయితములు), ఈ లోకములోని విషయాలు, పరలోకములోని విషయాలు ఇంకా సకల భూతములు, జీవులు, వారి స్వభావములు...

ఇవన్నీ ఒకనిచే మరొకనికి తెలియజేయబడుచున్నాయి. కనుక ఓ సమ్రాట్! జనక మహారాజా! "వాక్కు పరబ్రహ్మమే అగుచున్నది. **బ్రహ్మము వాక్ రూపమున విశదము అగుచున్నది. 'బ్రహ్మమే వాక్ రూపముగా ప్రదర్శనమౌతోంది' అని ఉపాసించబడు గాక.**

ఎవ్వరైతే "బ్రహ్మమునుండియే వాక్కు జనిస్తూ వినబడుతోంది"– ఉపాసిస్తారో...' (అంతేకాకుండా), **"బ్రహ్మము వాక్కును, తన శరీర విభాగముగా కలిగి ఉన్నది"** – అని ప్రజ్ఞతో గమనిస్తూ ఉంటారో...,

- వారిని వాక్కు ఎన్నడూ విడువదు.
- అట్టివాడు అధ్యయనము చేసిన విద్యను మరువడు.
- వాక్కును బ్రహ్మముగా ఉపాసించువాడు → ఇక్కడే దేవతా రూపమును సంతరించుకుంటాడు.

అనగా..,

**"ప్రతి ఒక్కరి వాక్కు బ్రహ్మమునుండియే ప్రదర్శితమగుచున్నది"...** అని ఉపాసించువాడు **వాక్** సంబంధమైన **దివ్యత్వమును** పొందుచున్నాడు.

వాక్కును బ్రహ్మము యొక్క ప్రదర్శనా విశేషముగా భావించి – దర్శించువాడు **'విద్వాంసుడు'** (విద్వాన్)గా పరిగణించబడుచున్నాడు.

**జనక మహారాజు** : స్వామీ! యాజ్ఞవల్క్యా! వాక్కును (శబ్దముయొక్క జనని–ఉనికి స్థానము) **'బ్రహ్మము'** రూపముగా **ఉపాసించటమును** సిద్ధాంతీకరించి ప్రకటించుచున్న మీకు ఈ సభలోని శ్రోతలమగు మేమంతా కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాము. **'వాక్ బ్రహ్మోపాసన'**ను తెలియజెప్పినందుకు ఏనుగులను పోలిన ఆబోతులతో కూడిన వేయి ఆవులను – దక్షిణగా సమర్పించుకుంటున్నాను. స్వీకరించండి.

**యాజ్ఞవల్క్యుడు :** ఓ జనక మహారాజా! క్షమించండి! **పితాయే అమన్యత న అననుశిష్య హరేతి ఇతి। "శిష్యుని అజ్ఞానమంతా హరించవేయకుండా, జ్ఞానము (Subject) ను ఆవిష్కరించి, కృతార్థుని (సంపూర్ణముగా అర్థము చేసుకొనివానినిగా) చేయకుండా 'గురుదక్షిణ' స్వీకరించరాదు"**... అను "ఒక నియమమును నా పితృదేవులు పాటించేవారు. నేను వారి వలెనే అభిప్రాయపడుచున్నాను. అందుచేత మీరు దక్షిణగా ఇవ్వదలచిన గోవులను ఇప్పుడే నేను స్వీకరించలేను.

అది సరే! ఇంకెవరైనా ఆచార్యులు బ్రహ్మము గురించి ఇంకా ఏవైనా విశేషాలు మీకు చెప్పటం జరిగినదా? అట్లా చెప్పి ఉంటే,... ఆ వాక్యాలు వినిపించండి. వింటాము. సంభాషించుకుందాము.

## 2. ప్రాణో వై బ్రహ్మేతి

**జనక మహారాజు** : కొన్నిరోజులక్రితం – శుల్బముని కుమారుడగు ఉదంక శౌల్బాయన ఆచార్యులవారు ఈ సభకు విచ్చేయటము జరిగింది. వారిని **'బ్రహ్మము'** గురించి వివరించవలసినదిగా విన్నవించినప్పుడు **'ప్రాణో వై బ్రహ్మేతి'** – **"ప్రాణము – (మరియు అధిదేవతయగు వాయువు) బ్రహ్మము"** – అని సిద్ధాంతీకరించి, ఆయా సంబంధిత వివరణలు చెప్పుకుంటూ వచ్చారు. వారు తన తల్లిదండ్రులు, తన గురుదేవుడు ఏరీతిగా **'ప్రాణమే బ్రహ్మము'** అని నిరూపిస్తూ వివరించారో, అవన్నీ వివరించారు. అనేక శ్లోకములు, వివరణలు, దృష్టాంతాలు అందుకుగాను చెప్పారు.

**యాజ్ఞవల్క్యుడు** : అవును! ప్రాణము లేనివాని వలన ఏమి నిర్వర్తించబడుతుంది? ఏమి తెలుసుకోబడుతుంది? కనుక **'ప్రాణము బ్రహ్మము'**.. అనుటలో ఔచిత్యము (Logic) ఉన్నది. సత్యమే చెప్పారు. అయితే ఉదంక ఆచార్యులవారు – **"ప్రాణమునకు ఏది ఆయతనము? (స్థానము)? ప్రాణము దేనియందు ప్రతిష్ఠ కలిగి ఉన్నది? ప్రాణము దేనిని ఆశ్రయముగా కలిగి ఉంటోంది?"** ... అనే విషయము కూడా వివరించారా?

**జనక మహారాజు** : **"ప్రాణము ఎద్దానియందు ఉన్నది? ఎద్దానిని ఆశ్రయించి ఉన్నది?"**... అనే విషయమై ఆ ఉదంకులవారు

స్పృశించలేదు. చెప్పలేదు. (Did not touch that Placement where in). ప్రాణము యొక్క **ప్రాముఖ్యత,** బ్రహ్మముగా **రూపత్వము** మాత్రమే.. వివరించారు!

**'యాజ్ఞవల్క్యుడు'** : ఆయన ప్రాణము యొక్క ఔన్నత్యము గురించి మాత్రమే చెప్పి ఉంటే, అది ప్రాణము గురించి **4 విభాగములలో ఒక విభాగపు (1/4) విశేషముల వరకే** వివరించినట్లు అవుతుందే!

**జనక మహారాజు** : స్వామీ! మీరు ప్రాణము గురించి గమనిస్తున్నట్టి మిగతా మూడు పాదముల గురించి దయచేసి చెప్పండి.

**యాజ్ఞవల్క్యుడు** : ప్రాణమే శరీరము. ఆ ప్రాణము ఉన్న స్థానము (ప్రతిష్ఠ) ఏది? (శరీరమునకు 'శరీరి' వలె) ప్రాణమునకు శరీరి – **"అవ్యాకృత ఆకాశము".**

అట్టి ప్రాణమును 'ప్రియము' రూపముగా భావించి ఆత్మాకాశముగా ఉపాసించాలి. ఎందుకంటే (ఆత్మయొక్క) ప్రియత్వమే ప్రాణ రూపమునకు జనన–లయ స్థానము. **ప్రాణము తనదైనవాడే బ్రహ్మము.**

**జనక మహారాజు : "ప్రియము", "ప్రాణమే ప్రియము" "ప్రియమే బ్రహ్మము"** ల గురించి మరికొంత దయచేసి వివరించండి.

**యాజ్ఞవల్క్యుడు** : బ్రహ్మమునకు ప్రాణమే అనుభూతిచే ప్రియరూపమై యున్నదని మరొకసారి గుర్తు చేస్తున్నాను.

- 'వీరంటే నాకు ప్రాణము' అని జనులు అంటూ ఉంటారుకదా? "వీరంతే నాకు ప్రియము, ఇష్టము" అనియే దానికి అర్థము కదా!
- జనులందరికీ ప్రాణమే అత్యంత ప్రియమైనది.
- ప్రాణమును కాపాడుకోవటానికే జనులు "ధనసముపార్జన".. చేయదలుస్తున్నారు. ధర్మమును అతిక్రమించి కూడా ప్రాణముల కొరకై ఆరాటపడుచున్నారు.
- ప్రాణము యొక్క ప్రయోజనము కొరకే ఒక యాజ్ఞికుడు "శాస్త్ర నియము, నిష్ఠ, నిషేధములు" తెలిసి కూడా 'అర్హత లేనివాడు, పతితుడు' అయినవాని చేత కూడా యజ్ఞము చేయించుటకు సంసిద్ధుడగుచున్నాడు.
- ఒకడు "క్రూరుడు. దొంగతనము చేసినవాడు. లంచగొండి".. అని తెలిసి కూడా, అన్నీ తెలిసిన ఒక వేదపండితుడు... ఆతని నుండి ధనము స్వీకరించుచున్నాడు. (ఆ ధనముతో బాటే దోషములు ఉంటాయని, తనకు దుఃఖము – కష్టము ముందుముందు కలుగజేస్తాయని శాస్త్రముల యొక్క హెచ్చరిక తెలిసి కూడా) – **వర్తమానములో ప్రాణముల ప్రీతికొరకు దుష్టకర్మలు చేయువారి నుండి ధనము తీసుకొనుచున్నాడు.**
- ప్రాణములు పోషించుకొనుటకై ఆటవికుడు ఆహారము మీద వాంఛతో చావుకు సిద్ధపడి భయంకర క్రూరమృగములు సంచరించుచోట్లకు, వెళ్లి క్రూరమైన పనులు నిర్వర్తిస్తున్నాడు.

కనుక ఓ జనక మహారాజా! అన్నింటికంటే ప్రతి ఒక్క జీవునికి అత్యంత ప్రియమైనది ప్రాణమే కదా. అయితే ప్రాణము పరబ్రహ్మస్వరూపమే. అస్థి–భాతి–ప్రియములలో (ఆత్మయొక్క విశేష లక్షణములలో) – ప్రియము ⟶ అనునది ప్రాణస్వరూపమే!

⟶ ప్రాణము కంటే ప్రియత్వము భిన్నము కాదు।

⟶ ప్రియము కంటే ప్రాణము భిన్నము కాదు।

***ప్రాణమే పరబ్రహ్మము యొక్క శక్తి–భావన–అనుభూతి రూపము. 'ప్రాణము'ను ఉపకరణముగా తీసుకొని 'బ్రహ్మము' ఉపాసించ బడుతోంది.***

ఎవ్వరైతే **'ప్రాణశక్తి బ్రహ్మమునకు చెందినదే'** అని ఉపాసిస్తారో, అట్టి దేహిని దేహానంతరము కూడా ప్రాణము (ప్రాణశక్తి సంపద) విడువదు.

బ్రహ్మోపాసనగా ప్రాణమును ఉపాసించువానిని ఏ పరిస్థితులలోనూ ప్రాణము ఆతనిని వెంటనంటియే ఉంటుంది. అనగా ఆతడు దేహానంతరము రాయి – రప్ప వలె జడప్రాయుడు కాదు.

**"బ్రహ్మమే ప్రాణస్వరూపముగా ఉన్నది"** – అని ఉపాసించబడు గాక। ప్రాణమును పరబ్రహ్మమని ఉపాసించెడువానిని – సమస్త జీవులు ప్రాణస్వరూపులే కాబట్టి – సమస్త జీవులు (భూతములు) ఆతనిని ప్రేమించుచున్నారు.

ప్రాణమును బ్రహ్మముగా ఉపాసించువాడు ఇక్కడే దివ్యస్వరూపుడగుచున్నాడు. భౌతిక దేహపతనానంతరము దేవతలను పొందుచున్నాడు. **"ప్రాణము-ప్రాణి"**ల అభేద స్వరూపము ఉపాసించువాడు బ్రహ్మమును త్వరత్వరగా సిద్ధింపజేసుకుంటున్నాడు.

**జనక మహారాజు** : మహాత్మా! **"ప్రాణమును బ్రహ్మముగా ఉపాసించటము"**... అను మహత్తరమగు ప్రయోజనము కలుగజేయు **పరబ్రహ్మోపాసన**ను గుర్తు చేసి, బోధించిన మీకు కృతజ్ఞులము. మీ కొరకై సిద్ధము చేసిన - ఏనుగంత ఎత్తు గల ఎద్దులతో (వృషభములతో) కూడిన వేయి పశుసంపదను ఇప్పుడిక స్వీకరించండి. నాకు గురుదక్షిణ సమర్పించు భాగ్యము ప్రసాదించండి.

**యాజ్ఞవల్క్యుడు** : **"శిష్యుని కృతార్థుని చేయనిదే (పూర్తిగా తెలుసుకొన్నవానినిగా తీర్చిదిద్దకుండా) దక్షిణ స్వీకరించరాదు"**... అను నా పితృదేవుల ఆప్తవాక్యమును నేను అనుసరించవలసినదేగానీ, అధిగమించగలవాడను కాదుకదా! అందుచేత స్వీకరించలేను.

సరేc! ఇంకెవరైనా ఆచార్యులు ఇంకే తీరుగానైనా బ్రహ్మమును గురించి నిర్వచన రూపముగా చెప్పటం జరిగినదా? దానిని (సత్యనిరూపణకై) వినెదముగాక। ఆవశ్యకతానుసారంగా వివరించుకొనెదము గాక।

ఇంకెవరైనా ఆచార్యులు బ్రహ్మము గురించి **'ఇదియే బ్రహ్మము'** అని విశ్లేషించి చెప్పి ఉంటే, అది కూడా వినిపించండి. మనము బ్రహ్మమును మరింత మననము చేద్దాము.

## 3. చక్షుర్వై బ్రహ్మేతి।

**జనక మహారాజు :** మరొకరోజు వురష్ణ ముని యొక్క కుమారులగు వార్ష్ణుడు - (బర్కుడు) అను బర్కాచార్యుల వారు వచ్చారు. వారిని **"అయ్యా! బ్రహ్మమును నిర్వచన పూర్వకంగా అభివర్ణిస్తూ బోధించండి"** - అని మేము మా విన్నపమును నమస్కరిస్తూ తెలియజేశాము.

**"ఈ కన్ను (చూపు) - (అద్దాని అధిష్ఠాన దేవతయగు సూర్యునితో సహా) బ్రహ్మముగా తెలుసుకోండి"** అని చెప్పుచూ, ఆ సంబంధమైన విశేషాలన్నీ తాము తల్లితండ్రుల దగ్గర, గురువుల వద్ద విన్నదంతా చెప్పుకుంటూ వచ్చారు. **"చక్షుర్వై బ్రహ్మేతి"**.. అను మంత్రమును ఉపదేశించారు.

- **"ఆదిత్య బ్రహ్మమే కంటియందుచూపుగా ఉన్నది. అద్దానిని ఉపాసించండి"** - అని బోధించారు.

**యాజ్ఞవల్క్యుడు** : బర్కాచార్యుల వారు పెద్దల వద్ద - గురువుల వద్ద నేర్చి, చెప్పినట్లుగా **చూపు** - అద్దాని అధిష్ఠాన దేవతయగు ఆదిత్యుడు (సూర్యుడు) - ఇరువురు బ్రహ్మముగా ఉపాసించతగినవారే!

ఎందుకంటే... వారు చెప్పినట్లుగా..,

- బ్రహ్మము పేరు సత్యము.

- చెవులతో విన్నది అసత్యము కావచ్చునేమో! కళ్ళతో చూచినది అసత్యము అవదు కదా! అందుకే, "అదిగో, అక్కడ ఒక ఏనుగు పొలములో సంచరిస్తోంది తెలుసా?" - అని ఎవ్వరైనా చెప్పినప్పుడు "నీవు ఆ ఏనుగును చూచావా?".. అని అడుగుతాము. "ఎవ్వరో అన్నారు లేc!".. అని సమాధానమైతే, అక్కడ ఏనుగు ఉన్నదని పూర్తిగా నమ్మము. కొంతవరకే అనుమానము రూపముగా (మాత్రమే) అంగీకరిస్తాముకదా! ఏదైతే కంటితో చూస్తామో,... అద్దానియందు వికల్పములుండవు. విన్నవాటిలో..ఒకరికి మరొకరు చెప్పుకుంటూ వస్తున్నప్పుడు, - కొంత శబ్దము ఆనోట - ఈనోట ప్రయాణం అయిన తరువాత వికల్పములు ఉండివచ్చునేమో - కదా!

అది సరే. జనక యోగీంద్రా! "అట్టి చక్షుదేవత చూపు ఎవ్వరికి ఆయతనము (శరీరము) అయి ఉన్నది? (1) చూపు (2) అద్దాని దేవతా స్వరూపమగు **ఆదిత్యుడు** (The Original Source from where the "Sense of seeing is emanating)-ఈ రెండింటికీ అధిష్ఠానము (ఆశ్రయము) ఏది? (లేక) అవి ఎద్దానియందు ఉదయించి, చరించి-లయిస్తున్నాయి?"... **ఈ ఈ విషయములు కూడా వివరించారా?**

**జనక మహారాజు** : లేదు లేదు! చూపు ఎద్దానికి శరీరమో, చూపు - ఆదిత్యుడు (చూపు బయల్వెడలు దివ్యస్థానము)లకు అధిష్ఠానమేమిటో.. వారు చెప్పనూ లేదు. మేము అడగనూ లేదు.

**యాజ్ఞవల్క్యుడు** : అప్పుడు చక్షుబ్రహ్మతత్త్వము గురించి **నాలుగింట ఒక వంతు మాత్రమే** చెప్పినట్లు, మిగిలిన మూడు వంతుల విషయమేమంటే.., కన్ను ఇంద్రియము. చూపు ఎవరి ఇంద్రియము? **అవ్యాకృతాకాశమునకు చెందినట్టి ఇంద్రియమే.** అంతేకాకుండా, అవ్యాకృతాకాశమే చూపునకు (ఆదిత్యదేవతకు) **జనన-ఉనికి - లయస్థానము** కూడా!

అట్టి 'చూపు' రూపమున ఉన్న ఆదిత్యబ్రహ్మమును **'సత్యము'** అని ఉపాసించాలి!

**జనక మహారాజు : సత్యము** అనగా ఏమి?

**యాజ్ఞవల్క్యుడు** : చూపే సత్యము. **"ఎవ్వరైనా మనలను – అది చూచావా?"...** అని అడుగుతారు. **"అవును. చూచాను!"** అంటాము. అనగా! "సత్యమే!".. అని చెప్పుచున్నామనియే కదా. **"చూపుయే సత్ స్వరూపమగు పరబ్రహ్మము"**... అని ఉపాసించాలి.

**"చూపు రూపమున ఏర్పడి, ఈ దేహములో ఉన్నది బ్రహ్మమే!"...** అని ఎవ్వరు ఉపాసిస్తారో, అట్టి నేత్ర బ్రహ్మోపాసకుని ఆతని 'చూపు' ఇక ఎప్పటికీ వదలదు. **ఈ దేహము పతనము చెందిన తరువాత కూడా చూపు కొనగుతూనే ఉండగలదు.** అంతేకాదు. చూపును బ్రహ్మముయొక్క కళావిశేషముగా ఉపాసించువాడు ఇప్పుడే, ఇక్కడే దేవతారూపమును సంతరించుకొని, దేహపతనానంతరము దేవతలలో ఒకడై దివ్యత్వము సంతరించుకుంటున్నాడు. అందుచేత **"బ్రహ్మమే ఈ కనబడే సమస్తముగా ఉన్నది"**–అని ఉపాసించబడు గాక।

**జనకుడు** : 'చూపు'ను, "ఈ కనబడుచున్న సమస్తమును బ్రహ్మముగా ఉపాసించమని బోధించు గురువర్యులగు మీకు వేయి గోవులు సమర్పించుకొనుట ఉచితమే। కనుక దయచేసి స్వీకరించండి".

**యాజ్ఞవల్క్యుడు** : శిష్యుడు కృతార్థుడు (సంపూర్ణముగా అధ్యయనము నిర్వర్తించినవాడు) కాకుండా గురువు దక్షిణ తీసుకోకూడదని పిత్రుదేవుల వాక్యము కదా! అందుకని, నేను గోవులను స్వీకరించలేను. **ఇంకా ఎవరైనా సభకు వచ్చి బ్రహ్మము గురించి సంభాషించి ఉన్నారా?**

## 4. శ్రోత్రం వై బ్రహ్మేతి।

**జనకుడు :** ఇంకొకసారి భారద్వాజగోత్రీకుడైన గర్దభీ విపీత ఆచార్యులవారు సభకు విచ్చేశారు. బ్రహ్మము గురించి చర్చ జరిగింది.

**"చెవి – అధిష్ఠానమగు దిక్కులు (దిగ్దేవత)** బ్రహ్మము – **శ్రోత్రం వై బ్రహ్మేతి।**" –అని గర్దభీవిపీతాచార్యుల వారు నొక్కి వక్కాణించారు.

ఏ విధంగా తల్లిదండ్రులు, వారిగురువులు వ్యాఖ్యానించారో, – అదంతా వివరించుకుంటూ, **వినికిడియే బ్రహ్మము యొక్క రూపముగా** అభివర్ణించారు.

**యాజ్ఞవల్క్యుడు** : ఓహో! **'వినికిడియే బ్రహ్మము'** అని నిరూపణ గర్దభీ విపీతాచార్యులవారు ప్రవచనము చేసియున్నారా? అవునుకదా మరి! శ్రవణము లేకపోతే ఏదీ సిద్ధించదుకదా! శ్రవణముచేతనే బ్రహ్మము తెలియవచ్చుచున్నది.

అయితే గర్దభీవిపీతముని, **"శ్రోత్రము దేనికి శరీరమేమైయున్నది? వినుటకు ఆశ్రయము (అధిష్ఠానము) ఏమైయున్నది?"**... ఈ విషయము చర్చించినారా?

**జనకుడు** : ఆ గర్దభీవిపీతులవారు శ్రోత్రబ్రహ్మము యొక్క శరీరాశ్రయము గురించి ఏమీ చెప్పటం జరుగలేదు.

**యాజ్ఞవల్క్యుడు**: హే సమ్రాట్! సార్వభౌమా! శ్రోత్రబ్రహ్మము మాత్రమే వివరిస్తే, అది **పరబ్రహ్మములో నాలుగవ భాగమే అగుచున్నది.**

**జనక మహారాజు** : ప్రరబ్రహ్మములో తదితర మూడువంతుల భాగమగు శ్రోత్ర బ్రహ్మము విషయమేమిటో దయతో చెప్పండి.

**యాజ్ఞవల్క్యుడు** : **'శ్రోత్ర బ్రహ్మము'** నాకు శ్రోత్రమే (వినుటయే) శరీరము. అనగా **'వినటము'** అనునది **బ్రహ్మమునకు శరీరమే** అగుచున్నది.

శ్రోత్రబ్రహ్మమునకు⟶ **ఉత్పత్తి, స్థితి, లయము కూడా అవ్యాకృత ఆకాశమే.** దిక్కులు ఆశ్రయమైయున్నది.

**పరబ్రహ్మము యొక్క నాలుగవ భాగమగు (అవ్యాకృతాకాశము నందు ప్రతిష్ఠిగల) దిగ్దేవతా బ్రహ్మము కూడా ఆత్మ వలె అనంతము.** శ్రోత్రము (వినికిడి) బ్రహ్మముయొక్క ఇంకొక ప్రదర్శనమే।

**జనక మహారాజు** : "శ్రోత్రము (వినికిడి / శ్రోత్రబ్రహ్మము)ను **అనంత రూపము–**అని ఉపాసించాలి" – అని సూచిస్తున్నారు కదా! **"అనంతము"** ⟶ అనుటలో మీ పరమోద్దేశ్యము ఏమిటి? మరికొంత వివరించమని అభ్యర్థన. చెవులు అనంతము అవటము ఎట్లా?

**యాజ్ఞవల్క్యుడు** : హే సామ్రాట్! చెవులలోగల **'వినికిడి'** అనంతము. ఎందుకంటారా? దిక్కులే వినికిడిని ప్రసాదించు తత్త్వము (Source). వినబడుచున్నదంతా దిక్కులనుండే కదా! ప్రతి దిక్కు కూడా అనంతమైయున్నది. ఎట్లా అంటారా? ఒకడు తూర్పు దిక్కుగా బయల్వెడలాడనుకోండి. **"ఇదిగో! ఈ తూర్పుదిక్కు ఇక్కడికి అంతము అగుచున్నది"...** అనబడునదేదీ ఆతడు చేరలేడు. అట్లాగే పడమర – దక్షిణ – ఉత్తర దిక్కులు కూడా! కనుక **'దిక్కులు అనంతములు'** అని మహర్షులు, విజ్ఞులు ప్రకటిస్తున్న పరమసత్యము. దిక్కులే శ్రోత్రము (వినటము) అనుదాని **స్వరూపము**. కనుక శ్రోత్రము అనంతము. అనంతమైనది ఆత్మ మాత్రమే! కనుక **వినబడునదంతా పరమాత్మస్వరూపముగా (లేక) పరబ్రహ్మముగా ఉపాసించబడుగాక।**

ఎవ్వడు శ్రోత్రమును (వినికిడి – వినబడుచున్నదానిని) అనంతమగు ఆత్మస్వరూపముగా ఉపాసించు అభ్యాసము నిర్వర్తిస్తాడో, – ఆతనిని శ్రోత్రము (వినగలగటము) అనేది ఎన్నటికీ విడచి ఎక్కడికీ పోదు. ఒక గోవు లేగదూడను ప్రేమించు తీరుగా, వినబడుచున్నదంతా పరబ్రహ్మస్వరూపముగా ఉపాసించు వానిని సమస్త భూతములు (జీవులు) ప్రేమిస్తాయి. అందుచేత **"బ్రహ్మమే వినబడే సమస్త రూపముగా అనుభవమగుచున్నది"** అని ఉపాసించబడు గాక।

అట్టి శ్రోత్ర బ్రహ్మోపాసకుడు ఇప్పుడే ఇక్కడే దివ్యమగు దేవతా స్వరూపుడై, భౌతిక దేహ పతనానంతరము దేవతల స్థానమును పొందుచున్నాడు.

**జనకుడు** : మహాత్మా! మీ సమాధానము, మీరు సూచించిన శ్రోత్ర బ్రహ్మోపాసన **మహత్తరము**. నాపై దయతో ఏనుగువంటి ఎద్దులతో కూడి 1000 గోవులను స్వీకరించండి. ఆనందపూరితుడనై, సమర్పిస్తున్నాను.

**యాజ్ఞవల్క్యుడు** : శిష్యుడు పూర్తిగా ప్రబుద్ధుడు (Wel-Understood) కానిదే శ్రోత నుండి దక్షిణ స్వీకరించకూడదన్నది పితృదేవుల సంకల్పము కదా! శిష్యుని కృతకృత్యుని చేస్తేనే స్వీకరించగలము!

ఇప్పుడు ఇంకా చెప్పండి. ఇంకెవరైనా ఆచార్యులు బ్రహ్మము విషయమై మీతో ఇంకే విధంగానైనా ప్రతిపాదిస్తూ సంభాషించారా?

## 5. మనో వై బ్రహ్మేతి।

**జనక మహారాజు** : ఔను యతీంద్రా! సత్యకామ జాబాలుడు (జబాలి పుత్రుడు) ఈ విధంగా బోధించటం జరిగింది.

**"నా తల్లి-తండ్రి-గురువులచే నేను బోధింపబడిన రీతిగా వివరిస్తున్నాను. వినండి।"**

**"మనస్సుతో కదా, ఎవ్వడైనా ఏదైనా చేసేది, తెలుసుకొనేది, అనుభవము పొందేదీ కూడా! కనుక ఈ మనస్సే బ్రహ్మమై యున్నది."**

– అని బోధించుచూ, అనేక దృష్టాంతములు, సోదాహరణములు చెప్పుకుంటూ వచ్చారు. మనస్సు – యొక్క **"ఏకాగ్రత – ప్రయోజనాలు"**, **"అనేకాగ్రత – వ్యథలు"** – ఇవన్నీ వివరించారు.

**యాజ్ఞవల్క్యుడు** : మహారాజా! 'మనస్సు బ్రహ్మము' అని వారు చెప్పటము సముచితమే। అయితే..,

- మనస్సు ఎవ్వరికి దేహమైయున్నది? **ఎవరికి "ఉపాధి? ఉపకరణము"గా అయి, ఎవ్వరిని సేవించుచున్నది?**
- మనస్సు ఎందులో **ప్రతిష్ఠితమైయున్నది?**

ఈ విషయాలేమైనా వారు ప్రస్తావించటం జరిగిందా?

**జనక మహారాజు** : లేదు. మనస్సు దేహముగా అగుచుండటము గాని, అద్దానికి **'దేహి'** అయినవారి గురించిగాని, మనస్సు ఎద్దానియందు ప్రభవించి, ప్రవర్తించి, ప్రశమనము పొందుచున్నదో, ఆ విషయం గురించి గాని – వారు స్పృశించలేదు.

**యాజ్ఞవల్క్యుడు** : అయితే మనస్సు యొక్క తత్త్వస్వరూపములో 'మనో నిర్వచనము' ఇత్యాదులు – నాలుగవ వంతు వరకే – చెప్పడం జరిగినట్లు అవుతుంది.

**జనక మహారాజు** : మహనీయా! తదితరమగు మనస్సు గురించిన నాలుగింట మూడు వంతుల విశేషములు **మీకు ఏమేమని అనిపిస్తోందో,** మాపై కరుణతో విశదపరచండి!

**యాజ్ఞవల్క్యుడు** : శ్రీ సత్యకామజాబాల ఆచార్యుల వారు వారి తల్లితండ్రులు – గురువుల పాఠములు వర్ణించి చెప్పినట్లే – **మనస్సు**

**ఆనంద స్వరూపము.** చంద్రదేవతా రూపము. మనస్సుతోనే ఎవ్వడైనా ఏదైనా చేసేది. మనస్సు లేనిచోట ఏదీ నిర్వర్తించబడదు. మనోదేవత యొక్క **ఆయతనము** (ఉనికి స్థానము, శరీరిత్వము), ప్రతిష్ఠల గురించి కూడా, తదితర (ఇప్పటివరకూ చెప్పుకున్న) విశేషములవలెనే చెప్పుకుందాము. (**ఆయతనము** = ఇల్లు, స్థానము, యజ్ఞము నిర్వర్తించే చోటు, యత్నము, ఉత్సాహము).

ఆలోచనలకు మునుముందే ఉన్నట్టి మనస్సుయొక్క **స్వతఃసిద్ధ రూపము**ను గమనించాలి. అట్టి మనస్సు ఆనంద స్వరూపబ్రహ్మముగా ఉపాసించాలి. మనస్సు ఆనందముగా ఉంటే అదియే బ్రాహ్మీస్థితి. మనస్సు అవ్యాకృతాకాశమునకు శరీరమై, (ఆయతనమై) అద్దానియందే ప్రతిష్ఠితమైయున్నది. **"ఆత్మ-శరీరి", అని అనుకుంటే మనస్సు ఆత్మకు శరీరము.**

**జనక మహారాజు : "హే మహానుభావన్! మనస్సును ఆనందస్వరూప బ్రహ్మముగా ఉపాసించాలేగాని, అద్దానివలన మనకు బంధమనో, మనస్సును నిరోధించాలనో ప్రయత్నించు అవసరము లేదు"**.. అనుమాట మీ వాక్యములలో ద్యోతకమౌతోంది. **"చంద్రదేవతా రూప ఆనంద బ్రహ్మము"** అని నిర్వచిస్తున్నారు. మనస్సు ఆనందరూపము ఎట్లా అవుతుంది? చెప్పండి!

**యాజ్ఞవల్క్యుడు** : అవును। మనస్సు ఆనంద బ్రహ్మమే। **'మనో-ఆనంద చంద్రబ్రహ్మము'** అని కూడా అనబడుచున్నది ఎందుకంటారా?

→ ఈ జీవుడు మనస్సుతోనే ఏదైనా కోరుకొని, అద్దాని నుండి ఆనందము పొందుచున్నాడు. కోరుకోవటానికి ముందే మనస్సు ఉన్నది. (అద్దములో ప్రతిబింబించేదానికి మునుముందుగానే అద్దము ఉండి ఉన్నట్లు).

→ మనస్సు చేతనే తనను బోలిన పుత్రుని **(ఆత్మా వై పుత్రః)** భార్యయందు పొంది ఆనందిస్తున్నాడు, పుత్రుడు మనోరూపము చేతనే తండ్రికి - తల్లికి ఆనందరూపుడగుచున్నాడు.

**మనస్సుచేత నిర్వర్తించినదే "నిర్వర్తించబడినది"గా అవుతోంది. (మనో యత్ కరోతి, తత్ కృతం భవతి)।**

→ <u>**మనోదేవతయే బ్రహ్మము।**</u>

ఎవ్వరు <u>**'మనస్సు పరబ్రహ్మస్వరూపమే'**</u> అని ఉపాసిస్తారో,... (మనో పరబ్రహ్మదేవతారూపంగా భావిస్తారో), అట్టి ఉపాసకుణ్ణి మనస్సు ఎన్నడూ విడచి ఉండదు. (జాగ్రత్ - స్వప్న-సుషుప్తులలోను, జన్మ-జన్మాంతరములుగాను మనస్సుతోడై వెంట ఉండగలదు).

అట్టి మనో బ్రహ్మోపాసకునికి సకల ప్రాణులు స్నేహాస్పదులై ఉంటున్నాయి. **"బ్రహ్మమే మనోరూపముగా ప్రకాశమానమగుచున్నది"** - అని ఉపాసించబడు గాక।

ఎవ్వడు 'మనస్సు'ను పరబ్రహ్మముగా తెలుసుకొని, ఈ సర్వము మనోరూపముగా, పరబ్రహ్మరూపముగా దర్శిస్తాడో,... ఆతడు ఇక్కడే - ఇప్పుడే దేవతారూపుడై ప్రకాశిస్తున్నాడు. భౌతిక దేహానంతరము కూడా దేవతారూపుడై ప్రకాశమానుడగుచున్నాడు.

**జనక మహారాజు** : స్వామీ! "మనోవై బ్రహ్మేతి। మనస్సు బ్రహ్మమే అయి ఉన్నది" అను సిద్ధాంతము నేను ఒప్పుకుంటున్నాను. ఏనుగువంటి వృషభములతో కూడిన వేయి గోవులను నేను మీకు సమర్పించుటకై అంగీకరించండి. మీరు చెప్పిన **"మనస్సును ఆత్మరూపముగా ఉపాసించటము"**నకు గురుదక్షిణ ఇచ్చుటకు అనుగ్రహించ ప్రార్థన!

**యాజ్ఞవల్క్యుడు** : శిష్యుని కృతార్థుని (All wel-informed) చేయకుండా దక్షిణ స్వీకరించరాదనునది తమకు నేను విన్నవించుకున్నదేకదా, మహారాజా! తండ్రి అడుగుజాడలనుండి - చ్యుతుడను కాలేనుకదా, మహాత్మా!

హే జనక సామ్రాట్! మరింకెవరైనా ఆచార్యులు బ్రహ్మము గురించి ఇంకేమైనా విశేషాలు వివరించి బోధించి ఉన్నారా? చెప్పండి!

## 6. హృదయం వై బ్రహ్మేతి

**జనక మహారాజు** : శ్రీ శకల ముని యొక్క కుమారుడగు విధగ్ధమునీశ్వరులు వచ్చారు. వారిని **"అయ్యా! బ్రహ్మము అనగా ఏదై ఉన్నది?"**.. అని ఆత్మజ్ఞానాసక్త దృష్టితో అడిగాము. వారు తాము తల్లి-తండ్రి-గురువుల వద్ద అభ్యసించిన దేమో, అదంతా బ్రహ్మము విషయమై ఉపన్యసించారు. **'హృదయమే బ్రహ్మము'** అని బోధించారు.

బుద్ధిగతము, సమస్తగతము అయినట్టి హృదయము ఉన్న వానికే అంతా అవగతమౌతుంది. హృదయమే మనో బుద్ధులకు స్థానము. ప్రజాపతియే హృదయమునకు అధిష్ఠాన దేవత।





**అట్టి హృదయమే బ్రహ్మము అయి ఉన్నది.** హృదయమే ప్రజాపతి. సృష్టి అంతా తన హృదయమున కలిగి ఉన్న సృష్టికర్తయగు ప్రజాపతియే బ్రహ్మము.

**యాజ్ఞవల్క్యుడు** : బాగున్నది. హృదయకమలము పరబ్రహ్మరూపమనుట యుక్తి యుక్తమే. జడమైనదానికి హృదయము ఉండదు కదా! సరేఁ! హృదయము ఎద్దానికి ఆయతనమో, **హృదయమునకు స్థానము ఏదై ఉన్నదో,** అది కూడా ఆ విదగ్ధమునీశ్వరులు అభివర్ణించి చెప్పారా?

**జనక మహారాజు** : లేదు. హృదయము యొక్క ఆయతనము (స్థానము), ప్రతిష్ఠ చెప్పలేదు.

**యాజ్ఞవల్క్యుడు** : అయితే హృదయమునకు సంబంధించి నాలుగవ వంతుమాత్రమే చర్చించినట్లు అవుతుంది.

**జనకమహారాజు** : తక్కిన మూడు వంతుల విశేషములేమిటో, దయచేసి చెప్పండి!

**యాజ్ఞవల్క్యుడు** : హృదయమే ఆయతనము (రూపము). ఆకాశమే ఆ హృదయ రూపమునకు అధికారి.

హృదయాకాశములో హృదయరూపముగా 'జగత్తు' మొదలైనంతా జనించి, ప్రవర్తించి, లయమును పొందుచున్నది.

పూర్ణములో (హృదయాకాశములో) పూర్ణమును (హృదయమును) దర్శించటమే పూర్ణత్వము. ఇదంతా పూర్ణమునందే స్థితి కలిగి ఉన్నది.

**జనక మహారాజు** : పూర్ణము – స్థితిల గురించి మరికొంత వివరించండి!

**యాజ్ఞవల్క్యుడు** : హృదయమే 'స్థితి'. ఎందుకంటే హృదయమే సర్వభూతజాలములకు స్థితిగల స్థానము. అంతేకాదు. సర్వలోకములకు కూడా. అట్లాగే, మనో – బుద్ధి – చిత్త – అహంకారాలు, జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు కూడా హృదయమే స్థితి, ముఖ్యస్థానము అయి ఉన్నది. – హృదయాకాశమే హృదయమునకు, హృదయాంతర్గతమైన సర్వ దృశ్య–అనుభూతి విశేషాలకు ప్రతిష్ఠ. అవన్నీ ప్రతిష్ఠింపబడినది హృదయమునందే!

కనుక..., ***"హృదయమే పరబ్రహ్మము".***

***కాబట్టి "పరబ్రహ్మమే సమస్త జీవులయందు హృదయముగా సంస్థితమై ఉన్నది" – అని ఉపాసించబడు గాక.***

ఎవ్వరు హృదయమును పరబ్రహ్మ స్వరూపముగా గమనించి, దర్శించి, ఉపాసిస్తూ ఉంటారో – వారికిక బ్రహ్మము దూరముగా ఉండదు. వారు బ్రహ్మమునకు దూరముగా ఉండరు. అన్ని భూతములు ఆతని యందే ప్రవేశించినవగుచున్నాయి. జలంలోనే తరంగాలు జనించి, చలించి, లయిస్తున్నట్లుగానే, **ఈ జగత్తు, జీవాత్మ, మనోబుద్ధి చిత్త అహంకారాలు మొదలైనవన్నీ కూడా హృదయాకాశములోనే జనించి, ప్రవర్తించి, లయించినవగుచున్నాయి.**

హృదయమును బ్రహ్మముగా ఉపాసించువాడు ఇక్కడే దేవత అయి, భౌతిక దేహానంతరము దేవతాస్వరూపుడై అంతటా వెలుగొందుచున్నాడు.

**జనక మహారాజు** : మహాత్మా! అమోఘము? నేను సమర్పిస్తానని అంటూ వస్తున్న ఏనుగు వంటి ఎత్తైన ఎద్దులతో కూడిన వేయి గోవులను దక్షిణగా స్వీకరించమని ఇప్పుడు మరల మరల వేడుకొనుచున్నాను.

**యాజ్ఞవల్క్యుడు**: ఎట్లా కుదురుతుంది? శిష్యుడు కృతార్థుడు కాకుండా గురువు దక్షిణ స్వీకరించరాదు కదా!

| **ఋషి** | బ్రహ్మమై ఉన్నదేది? | **శరీరములో నివాసస్థానము** | ప్రతిష్ఠ | **ఉపాసనా రూపము** |
|---|---|---|---|---|
| జిత్వాచార్యులు | వాక్ (పలుకు) | నోరు | ఆత్మ | ప్రజ్ఞ |
| ఉదంకాచార్యులు | ప్రాణము (శక్తి) | ప్రాణశక్తి | ఆత్మ | ప్రియత్వము |
| బర్కాచార్యులు | నేత్రము (చూపు) | కళ్లు | ఆత్మ | సత్యము |
| గర్ధభీవిపీతాచార్యులు | శ్రోత్రము (వినికిడి) | చెవులు | ఆత్మ | అనంతత్వము |
| సత్యకామాచార్యులు | మనస్సు (యోచన) | మనస్సు | ఆత్మ | ఆనందము |
| విదగ్ధాచార్యులు | హృదయము (భావన) | హృదయము | ఆత్మ | స్థితి |

***ఇతి – బృహదారణ్యకోపనిషత్ – షష్ఠమ అధ్యాయః***

***యజ్ఞవల్క్యయకాండము – షట్ (6) ఆచార్య బ్రాహ్మణము.***

# షష్ఠమ అధ్యాయః
# ద్వితీయ బ్రాహ్మణము
# కూర్చ బ్రాహ్మణము

యాజ్ఞవల్క్యుడు వివరణాత్మకంగా చెప్పుచున్న విశేషాలన్నీ ప్రశాంత – ఆనందములతో వింటున్న జనక మహారాజు కూర్చము (ఆసనము) నుండి లేచి నిలుచున్నారు. మహర్షి యాజ్ఞవల్క్యుడు ఆసీనులైయున్న ఆసనమును సమీపించారు. పాదములను ఉభయ హస్తములతో నిండుగా– నెమ్మదిగా స్పృశించి కళ్ళకు అద్దుకున్నారు.

**నమస్తే తుభ్యం అస్తు, హే యాజ్ఞవల్క్య!**
**అను మా శాధి। ఇతి। (6-2-1)**

ఓ యాజ్ఞవల్క్యా! మీకు రెండు చేతులూ జోడించి హృదయ పూర్వకముగా నమస్కరిస్తున్నాము. నాకు విద్యను బోధించుచూ, నన్ను అనుశాశించెదరు గాక!

**యాజ్ఞవల్క్యుడు** : ఓ జనక మహారాజా! మీకు శుభప్రదమగుగాక। సుఖాసీనులవ్వండి. ఇక శ్రద్ధగా వినండి.

ఒకానొకడు ఏదో దూరదేశమునకు సుదీర్ఘ ప్రయాణము చేయదలచుకున్నాడు. అందుకుగాను సుందరమైన, యాంత్రికమైన, సులభముగా దూరప్రయాణము చేయగల రథమును నిర్మించుకున్నాడు. పుష్టిగల గుఱ్ఱములను పూన్చాడు. గొప్ప ప్రావీణ్యము గల రథసారధిని నియమించుకున్నాడు. రథములో సుఖముగా కూర్చుని పరిసరములన్నీ వినోదముగా దర్శించగల స్థిరమగు ఆసనము (కూర్చము, కుర్చీ) నిర్మించుకున్నాడు. నదీ, తటాకముల వద్ద నావలు కూడా సిద్ధం.

ఇక ఆతడు దిగులుపడవలసినదేమున్నది"? హాయిగా, హుషారుగా, వినోద–విజ్ఞానములను ఆస్వాదిస్తూ ప్రయాణము చేయగలడుకదా! అట్లాగే,... బ్రహ్మోపాసకుడవు, కర్మయోగపుంగవుడవు అగు ఓ జనక యోగీశ్వరా!

మీరు **'బ్రహ్మజ్ఞాని'** అవటానికి సర్వము సిద్ధము చేసుకొనియే ఉన్నారు. ఉపనిషత్తులు ప్రవచిస్తూ ఉన్న ఆత్మజ్ఞానపాఠ్యాంశములను పఠించి, పరిశీలించి, స్వస్వరూపము వైపుగా వాక్యార్థములను అన్వయించుకుంటూ, దృష్టులను ఆత్మభావనలతో పరిశుద్ధపరచుకొని ఉన్నారు. విజ్ఞులలో పరమ పూజ్యుడవు. వేదాధ్యయనము చేసినట్టివారు. ఉపనిషత్ జ్ఞానముచే స్థిరచిత్తుడైనవారు. **కనుక నిశ్చింతులు, అభయులు అయి ఉండండి.**

సరేఁ! ఇక మిమ్ములను నేను ఒక ప్రశ్న అడుగుచున్నాను.

ఆలోచించి, మరీ సమాధానము చెప్పండి! అధ్యాత్మ విచారణను దృష్టిలో పెట్టుకొని ఈ ప్రశ్నలు అడుగుచున్నాను.

ఈ దేహము కాలముచే వచ్చి, కాలముచే పోవుచున్నది కదా! బ్రహ్మజ్ఞులగు మీరు యథాకాలమునందు దేహమును త్యజించినప్పుడు ఈ దేహమునకు సంబంధించి ఏఏ తత్త్వములు ఎటు పోతున్నాయి? మీరు ఎటు వెళ్ళబోవుచున్నారు?

**జనక మహారాజు** : మహర్షివర్యా! నేను ఎటుపోబోవుచున్నానో, ఈ దేహములోని ఆయా స్థూల–సూక్ష్మ పదార్థములన్నీ ఎటు వెళ్ళనున్నాయో, ఈ వివరాలు నాకు అంతగా తెలియదు. దయతో వివరించండి. ఈ జీవితము యొక్క అంతిమగమ్యము ఏమిటో, ఎటో, ఆ తరువాత ఏమేమిటో నాకు బోధించండి. నేను కృతార్థుడను అవుతాను.

**యాజ్ఞవల్క్యుడు** : జీవన్ముక్తులగు మీరు ఎటు వెళ్ళనున్నారో, ఈ జీవితము యొక్క గమ్యమేమిటో, నేను ఎరిగి ఉన్నాను. మీకు తెలియకపోయినచో చెప్పగలను. మీరు నన్ను అడగవచ్చు.

**జనక మహారాజు** : అయితే దయచేసి వివరించమని మరొక్కసారి అర్థిస్తున్నాను. పూజనీయులగు తమరు మమ్ములను బోధచే తరింపజేయగలరు.

**యాజ్ఞవల్క్యుడు** : అయితే వినండి.

ఈ కనులు – చెవులు మొదలైన దేహేంద్రియములన్నీ ఈ జీవుడు నిర్మించుకున్నాడా? లేదు. ఇవన్నీ తయారు చేయు విధి విధానమునకు కారణమగు దివ్యశక్తులకు సంబంధించిన ప్రజ్ఞలను **'దేవతలు'** అంటారు. అనగా,... ఈ భౌతిక దేహములో కనిపించే వివిధ ఇంద్రియశక్తులన్నీ పౌరాణిక నామములచే విస్తారముగా (దివ్య స్వరూపులగు దేవతల వర్ణనగా) చెప్పబడుచున్నది. (యజ్ఞ–యాగ–క్రతు వేద మంత్రములతో) అట్టి సమిష్టికి చెందిన దివ్య ప్రజ్ఞలగు దేవతల గురించి ఉపాసనలు, స్తోత్రములు, మంత్రములు, పూజా విధులుగా అభివర్ణించ బడుచున్నాయి.

వివిధ ఇంద్రియ దేవతలు – **"దృష్టి దేవత–శ్రుతము దేవత–స్పర్శ దేవత –రసదేవత– ఆఘ్రాణ దేవతలు"**– ఈ విధములైన ప్రత్యక్షనామము ఇష్టపడరు. **అప్రత్యక్ష నామములందు** ప్రీతి కలిగి ఉంటారు. ప్రత్యక్షనామముల పట్ల అయిష్ట భావము కలిగి ఉంటారు. (దృష్టాంతానికి "చాకలి–సుబ్బయ్య గారూ! మంగలి వెంకయ్యగారూ! మంత్రసాని లక్ష్మమ్మ గారూ! పౌరోహిత రామశాస్త్రి గారూ!".. అని పిలిస్తే ఆయా వ్యక్తులకు ఇష్టము ఉండని రీతిగా! "సుబ్బయ్యగారూ! వెంకయ్యగారూ! లక్ష్మమ్మగారూ! రామశర్మ గారూ!".. అని పిలిస్తే, వారికి ప్రీతి అగు రీతిగా) – 'ఇంద్రుడు, వరుణుడు, వాయువు, అగ్ని దేవుడు, భూదేవత, శివుడు, విష్ణువు, లలిత' – మొదలైన దేవతా నామములు – ఇట్టివే).

ఇప్పుడు బ్రహ్మజ్ఞాని జీవన్ముక్తుడు అగువాని యొక్క దేహానంతర విశేషములు ఏ విధంగా ఉంటాయో చెప్పుకుంటున్నాం.

## జాగ్రత్ పురుషుడు

**కుడి నేత్రములో ప్రకాశమానపురుషుడు (లేక పురుషకారము)।**

కుడికంటి యందు ఏ చూపుశక్తి పురుషుడు కలడో ఆతనిని **'ఇంధుడు'** (కుడి–కంటి చూపు రూపము తన శరీరముగా కలవాడు) అని అంటారు. ఈయన క్రియార్థంగా ఇంధుడే అయినా కూడా, పరోక్షముగా **'ఇంద్రుడు'** అని పిలువబడుచున్నారు.

ఈ ఇంద్రుడే (ఇంద్రియములకు అధిపతియే) – జాగ్రత్ అవస్థ యందు దక్షిణ (కుడిదిక్కు) నేత్రములో (కుడికన్ను నందు) ప్రకాశించుచున్న పురుషుడు. ఈ జాగ్రత్ పురుషుడే సర్వజాగ్రత్ వస్తువులుగా ప్రకాశించుచున్నారు. సూర్య మండలమునందు కూడా ప్రకాశించు పురుషుడు ఈయనయే!

ఓ జనక మహారాజా! **స్వస్వరూప బ్రహ్మమును ఎరిగి ఏకత్వము పొందినప్పుడు,** అట్టి బ్రాహ్మీదృష్టి గల నీవంటివారి పట్ల – మరల మరొక పాంచ భౌతికమైన 'వ్యష్టి ఉపాధి' (Individual Physical Body holding)...కి కార్య– కారణములన్నీ అకారణ రూపమై, **రహితము** (Null and Void) అగుచున్నాయి.

అందుచేత **'విశ్వుడు'** అను పేరుగలవాడవై, **జాగ్రత్ అంతా ఆక్రమించుకొని, జాగ్రత్ పురుషకార స్వరూపుడవై నీవే వినోదించుచున్నావు.** ఈ జాగ్రత్ అంతా నిండి ఉన్నది – నీవే। ఈ జాగ్రత్ నీ ఆత్మదేహ అంశ–విభాగమై వెలుగొందుచున్నది.

ఓ విదేహచక్రవర్తీ!

**"ఈ జాగ్రత్ నా శరీర విభాగము. – అంతేగాని ఈ జాగ్రత్‌లో నేను ఒక విభాగమును కాను"** – అని గమనించండి.

## స్త్రీ–పురుష ద్వంద్వరూప భోగ్య – భోక్తలు.

ఈ జాగ్రత్ నీకు భోగ్య వస్తువు అగుచున్నది. జాగ్రత్‌లో నీవులేవు. **జాగ్రత్ నీదై ఉన్నది. నీయందున్నది.**

**భోక్త** – ఇంద్రుడు. భోగించబడునది = **ఇంద్రాణి.** 'ఇంద్రాణి'ని **"ఎడమ కంటితోని పురుష రూపము"** → అని కూడా అంటారు. భోగించబడుదానిని **'అన్నము'** అని కూడా పిలుస్తున్నారు. ఇదియే **'జాగ్రత్ విశ్వుడు'** అను పేరుతో చెప్పబడు ద్వంద్వము.

విశ్వుడు = జాగ్రత్ అనుభవము పొందువాడు +జాగ్రత్ అనుభవముగా పొందబడునది (ఇంద్రుడు + ఇంద్రాణి)

(The Experiencer + Experiences/ All that being Experienced). **ఈ ఇరువురి సమన్వయమే నీయొక్క 'విశ్వుడు' అను పురుషకారము.**

**ఇంద్రుడు** = అనుభవము తనదైనవాడు. **ఇంద్రాణి** = విరాట్ పురుషకారము.

అయితే,-**"ఈ అనుభవించువాడు(జాగ్రత్ అనుభవి)-అనుభవించబడునది"**... అనబడే పురుష-స్త్రీ ద్వంద్వముల **సంభోగస్థానము** ఏది?

**చిదాకాశమే। (లేక) అవ్యాకృతాకాశమే।** (లేక) **హృదయాకాశమే।**

హృదయములో గల ద్రష్ట-దృశ్యముల సంబంధమే ఆ ఇంద్రుడు - ఇంద్రాణి దంపతులు కప్పుకునే వస్త్రము.

హృదయమునందలి మాంస పిండస్థానమగు ఆకాశము (Place / Zone) **చిదాకాశమే।**

### స్వప్న - జాగ్రత్ మార్గములు

హృదయము నందలి పై భాగమున గల నాడీ మార్గమే **స్వప్నము నుండి జాగ్రత్‌కు, జాగ్రత్ నుండి స్వప్నమునకు** పోయి వస్తూ ఉండుమార్గము.

## తేజస పురుషుడు (సూక్ష్మ శరీరాభిమాని)

ఈ ఇంద్రుడు - ఇంద్రాణీ లే (The Experiencer and the Experiencing) స్వప్నసీమలోని జంట కూడా.

**స్వప్నము అనుభవించువాడు+స్వప్న దృశ్యము** కలసిన → **"తేజస పురుషుడు" (స్వప్నాభిమాని).**

స్వప్నాకాశమే → సూక్ష్మ శరీరాభిమాని + స్వప్నపురుషుడు - ఉభయులు **సంభోగించుస్థానము.**

స్వప్న చిదాకాశము కూడా జాగ్రత్ చిదాకాశమువలెనే **"నీయొక్క కేవలమగు చిదాకాశాంతర్గత కల్పిత చమత్కారమే!"**

(1) "స్వప్నములో నేను లేను। స్వప్నము నాదై ఉన్నది. నాయందున్నది.

(2) నేను **'స్వప్నాంతర్గత ద్రష్ట-స్వప్నదృశ్యము'**ల అఖండరూపమగు **చిదాకాశస్వరూపుడను.**

(3) తేజస పురుషుడు + స్వప్నము - ఈ రెండూ కూడా నా యందు సంభోగస్థానము - నాచే కలిగినవై ఉంటున్నాయి.

ఈవిధంగా - నాపై మూడు దర్శనములను ఎరిగినవాడివై సుస్థితుడవై, అచ్యుతుడవై ఉంటున్నప్పుడు **"ఆత్మజ్ఞాని"** - అగుచున్నావు.

ఓ జనక మహారాజా!

- వెంట్రుక చిట్టచివరి విభాగములో వెయ్యవవంతు కంటే కూడా సూక్ష్మాతి సూక్ష్మమైనట్టి హృదయములోని **'హితా'** నాడి. ఈ నాడియే - అంతర హృదయమున ఉండి, జాగ్రత్- స్వప్నములకు రహదారివలె ఏర్పడి ఉంటోంది.
- **అన్నము (జాగ్రత్ - స్వప్నములలో అనుభవముగా పొందబడేదంతా) ఈ 'హితా'నాడి నుండియే వెలువడుచున్నది.**

విశ్వుడు - తేజసుడు, ఈ ఇరువురూ ఈ కళ్లకు కనబడే భౌతికమైన సర్వవస్తువులన్నిటికంటే కూడా **సూక్ష్మాతిసూక్ష్మరూపులు.** జాగ్రత్-స్వప్న ఉభయ పురుషకారములు **మీయొక్క ఆత్మకుచెందిన అఖండ స్వరూపమునుండి పురుషకారములుగా బయల్వెడలుచున్నాయి.** ఇక మీ సహజ రూపమగు ఆత్మయో? **సూక్ష్మాతి సూక్ష్మము కంటే కూడా సూక్ష్మతమము (Most most Subtle).**

## స్వకీయ ప్రాణ స్వరూపధారణ

ఓ జనక మహాత్మా!

**మీ ఆత్మయే**... తూర్పు దిక్కున తూర్పు ప్రాణ స్వరూపంగాను, పడమరవైపున పడమర ప్రాణముగాను, ఉత్తరము వైపున ఉత్తర ప్రాణముగాను, దక్షిణము వైపున దక్షిణ ప్రాణముగాను, ఊర్ధ్వమున ఊర్ధ్వప్రాణముగాను, క్రిందగా అధోప్రాణముగాను - అన్ని దిక్కులందు తన ప్రాణశక్తిచే ఆక్రమించుకొనియున్నది. ఆత్మయొక్క 'శక్తి' రూపమే ప్రాణము. ఆత్మ దృశ్యములో ఒక వస్తువా? కాదు. జాగ్రత్ చేత పరిమితమా? కానేకాదు. ఆత్మయే "విశ్వుడు" రూపముగా జాగ్రత్ అనుభవి అయి, తనను తానే ప్రదర్శించుకొనుచున్నది. ప్రదర్శించువాడు - ప్రదర్శించబడునదిగా ఎట్లా అవుతాడు. అవడు. ఆత్మ ఈ దేహము కాదు. మనో-బుద్ధి- చిత్త-అహంకారాలు

కాదు. జాగ్రత్ అహంకారము కాదు. స్వప్నాహంకారము కాదు. సుషుప్త్యహంకారము కాదు. జాగ్రత్‌లోని కాలము కాదు. స్వప్నములోని కాలము కూడా కాదు. సుషుప్తిలోని కాలము కాదు. ద్రష్ట కాదు. దర్శనము కాదు. దృశ్యము కాదు.

కానీ **ఇవన్నీ ఆత్మకు అన్యము కూడా కాదు.** "ఇది కాదు– ఇది కాదు; నేతి। నేతి"... అని వెతుకుతూ పోగా "ఆ వెతుకువాడు తనకు అన్యముగా దర్శించేవి ఏదీ ఆత్మ కాదు. ఈవిధంగా, **"ఆ వెతుకువాడు ఆత్మకు అన్యమైనవాడు కాదు"** – అని తెలియవస్తోంది.

అయితే, కథారచయితవలె, ఆత్మ – **సమస్తము తానే అయి, సమస్తమునకు వేరుగా కూడా ఏర్పడినదై ఉన్నది.** ఈ విధముగా.. **ఆత్మ అద్వితీయము, అద్వయము, అనన్యము కూడా।**

ఆత్మను ఎవ్వరూ బంధించలేరు. ఆత్మ దేనినీ బంధించుటమూ లేదు. ఆత్మ బంధరహితము। మరొకదానిని బంధించదు.

ఆత్మను ఎవ్వరూ నశింపజేయజాలరు. కాబట్టి **'అవినాశి'।**

> **ఆత్మగా మీరు సర్వాత్మ స్వరూపులు. జ్ఞానముచే ప్రాణదేవతను ఆత్మరూపముగానే పొందినవారై ఉన్నారు. ఆత్మగా మీరు ప్రాణాత్మ–దృశ్యాత్మ స్వరూపులు కూడా। ఆత్మదేనికీ సంబంధించినదికాదు. ఏదీ ఆత్మకు సంబంధించి లేదు. ఆత్మ సర్వదా అసంగము. ఆత్మకు దేనిపట్లా ఆసక్తి లేదు. ఆత్మకు ఎవ్వరూ వ్యధ కలిగించలేరు. 'ఆదిత్యుడు – ఇంద్రుడు– అగ్ని – యముడు – వరుణుడు'... ఇత్యాదులన్నీ మీ యొక్క ఆత్మ చైతన్యప్రదర్శనములే.**

ఓ జనకమహారాజా!

**'ఆత్మోపాసన'** అను మార్గములో **"నేను స్వతఃగానే, సహజముగానే ఆత్మస్వరూపుడను"** అను స్థానము సుస్పష్టము, సందేహరహితము, అనుక్షణికము చేసుకొంటూ ఉండగా – సర్వభయములు, మనో రుగ్మతలు వాటికవే తొలగుతాయి. **"నేను, తదితరులు, లోకములు, ఇహము, పరము – అంతా కూడా అఖండాత్మ స్వరూపమే"** అను ఆత్మోపాసనను, ఆత్మభావనాశ్రయమును సిద్ధింపజేసుకొను విధివిధానమును ⟶ **తస్య అస్య విదుషక్రమేణ** ⟶ చెప్పుచున్నాను వినండి.

## ఉపాసనాక్రమములు

**(1) వైశ్యానరోపాసన** (లేక) **ప్రాణ తాదాత్మ్యము.** నేను దేహరూపుడను కాదు. ప్రాణరూపుడను. అన్ని వైపులా ప్రాణస్వరూపుడనై వెలుగొందుచున్నాను. నా యొక్క ప్రాణస్వరూప ప్రదర్శనయే ఈ సర్వసహజీవుల ప్రదర్శనము. నా ప్రాణస్వరూపము దేహము నశించినప్పుడు మరెచ్చటకో పోదు. ఆత్మయందే ప్రవేశము పొందుతోంది. నాయొక్క ప్రాణశక్తిచే (వస్త్రధారణ – త్యాజ్యమువలె) నేను దేహధారణ – త్యాజ్యము చేస్తూ ఉంటాను.

ప్రాణము = ప్రియము. నాయొక్క ప్రియత్వమే ప్రాణరూపములుగా ప్రదర్శితమగుచు, అన్నముగా (ఇంద్రియములుగాను, ఇంద్రియ దృశ్యముగాను, ఇంద్రియానుభవములుగాను) అనుభూతమగుచున్నది.

**ఇదంతా (సహజీవులు – లోకములు – దేహముల రాకపోకలు మొదలైనవన్నీ) నా ప్రియరూప ప్రాణ ప్రదర్శనయే⟶**

అను భావనయే **"వైశ్వానరోపాసన", (లేక) "ప్రాణతాదాత్మ్యము".**

**(2) హృదయోపాసన :** తరువాత క్రమంగా "ఈ మనోబుద్ధి – చిత్త – అహంకారములకు, వాటి వాటి అనుభవములకు (అన్నము) నా హృదయమే స్థానము.

- సర్వులు నా హృదయమునందే స్థానము కలిగిఉన్నారు.
- సర్వులు హృదయములందు నేనే ఆత్మ స్వరూపుడనై వేంచేసి ఉన్నాను".

అను **హృదయోపాసన** (లేక) **బుద్ధ్యుపాసనకు** ఉపక్రమించబడును గాక!

హృదయమే స్వప్న–జాగ్రత్తుల జనన – లయస్థానమగు **"సుషుప్తి"**గా దర్శించబడుగాక!

**తైజసోపాసన :** "హృదయమున కల్పనచే జగత్తులను స్వీయకల్పనగా దర్శించుచున్నాను.

1. కల నాదైన నేను = ఈశ్వరుడు. పరమ్ (ఆవల) బ్రహ్మము.

2. కలలోని నేను = జీవుడు (స్వప్నానుభవి).

3. కల = స్వప్న జగత్తు.

ఈ మూడు ఆత్మ యొక్క హృదయాంతర్గత లీలా - క్రీడా కల్పనలే....॥"

... **అను రూపముగలదే - "తేజసోపాసన".**

"స్వప్నములో కనిపించేదంతా నా స్వప్న చైతన్యమే - నేనే। అట్లాగే జాగ్రత్ కూడా।" - అని ఉపాసించబడుగాక!

**విశ్వోపాసన :** హృదయములో స్వప్న-జాగ్రత్తుల మధ్య విహరిస్తున్నాను. జాగ్రత్‌లో 'విశ్వుడు' రూపము దాల్చి - ఇంద్రుడు - ఇంద్రాణి అగుచున్నాను. (1) అనుభవజ్ఞుడు (2) స్వీయ ప్రాణశక్తిచే నిర్మితములైన ఇంద్రియములు (3) ఇంద్రియ విషయాలు అగు అన్నము (4) విరాట్ పురుషుడు గా కూడా అయి, జాగ్రత్ అంతా ఆస్వాదిస్తున్నాను" అని ఉపాసించటమే - **"విశ్వోపాసన".**

> *"జాగ్రత్‌లో కనిపించేదంతా - (అనగా) సర్వ లోకములు, విరాట్ పురుషుడు మొదలైనదంతా కూడా నా జాగ్రత్ చైతన్యమే। నా ఆత్మయే। ఆత్మస్వరూపుడగు నేనే।"... అను భావనా పుష్పముతో సర్వేశ్వరుని ఆశ్రయించుచుండటము, సర్వాత్మక లక్షణము పునికి పుచ్చుకోవటము - ఇదియే విశ్వోపాసన।*

ఈ విధంగా ఉపాసనచే ఆత్మోపాసకుడు - సర్వము తానే అయి **"ప్రాణ, జాగ్రత్, విరాట్ విశ్వ, స్వప్న తేజస" స్వరూపుడై, సర్వము ఆత్మయందు ఉపసంహారము చేయుచున్నాడు. సర్వము తానే అయి, సర్వమునకు వేరై** వెలుగొందుచున్నాడు.

ఓ జనక మహారాజా! **అభయంవై ప్రాప్తోఽసీతి!** అట్టి **"ఈ సర్వము నేనే అయి - ఈ సర్వముఎనకు కేవలసాక్షినై ఆభరణము - బంగారము వలె ప్రకాశించుచున్నాను"...** అను **అభయ స్థితి** మీరు పొందియే వున్నారు.

అద్దానిని ఎల్లప్పుడు అనుక్షణికంగాను, స్వాభావికంగాను, సమస్త ప్రమేయములకు అతీతంగాను ఆస్వాదించండి!

అంతే!

**నేను నీ ఆత్మ స్వరూపుడనే అయి నీకు నమస్కరిస్తున్నాను.**

**ఇతి బృహదారణ్యకోపనిషత్**

**షష్ఠమాధ్యాయః - "కూర్చబ్రాహ్మణము" నామ ద్వితీయో అధ్యాయః॥**

# షష్ఠమ అధ్యాయః
# తృతీయ బ్రాహ్మణము
# జ్యోతిర్బ్రాహ్మణము

***ఒకానొక సందర్భములో, ఒకరోజున....,***

యాజ్ఞవల్క్యుడు తన ఆశ్రమము నుండి బయల్వెడలారు. ముఖ్య శిష్యులతో కూడుకొని విదేహ దేశరాజు, ఆత్మజ్ఞుడు, యోగి పుంగవుడు అగు జనక చక్రవర్తి (సామ్రాట్)ని సందర్శించి, బ్రహ్మతత్త్వమునకు మహత్తర ప్రయోజనము చేకూర్చు **'సత్సంగము'** అను సందర్భమును సేవించాలనుకొన్నారు.

ఆ యాజ్ఞవల్క్యుడు మిథిలానగరము ప్రయాణిస్తూ ఈ విధంగా అనుకొన్నారు.

*"ప్రతి ఒక్కసారి నేనే అధికంగా మాట్లాడటం జరుగుతోంది. జనక మహారాజు సభలో ఆత్మజ్ఞులగు మహనీయులెందరో ఉన్నారు. వారు పరబ్రహ్మము గురించి సంభాషిస్తూ ఉంటే వినాలి. నేను మాత్రం ఈ మాటు నాకుగా నోరెత్తను. ఎందుకంటే జనక చక్రవర్తియే స్వయముగా కర్మ-భక్తి-జ్ఞానములలో పరాకాష్ఠ అయి ఉన్నారుకదా! వారే సంభాషిస్తూ ఉంటే కూడా నేను వింటాను. అంతే!"*

యాజ్ఞవల్క్యుడు ప్రియ శిష్యులతో విదేహరాజ్య చక్రవర్తి జనకుని సభా ప్రాంగణంలో ప్రవేశించారు. చక్రవర్తి స్వయముగా ఎదురేగి యాజ్ఞవల్క్యునికి సుస్వాగతము పలికారు. సభలో అనేకమంది వేద - వేదాంగ - వేదాంతవేత్తలు ఉన్నారు. వారంతా నిలుచుని యాజ్ఞవల్క్యునికి ప్రణామాలు పలికారు. అందరూ సుఖాశీనులయ్యారు!

సభ ప్రారంభమైనది!

**జనక మహారాజు :** తత్త్వజ్ఞులు, యోగజ్ఞులు, జ్ఞానజ్ఞులు, కర్మయోగులు, వేద-ఉపాంగ-ఉపనిషత్ పండితులు, తత్త్వజిజ్ఞాసువులు, సద్గురువులతో నిండియున్న సభాసదులందరికి **సుస్వాగతము.**

ఇక మనము **'సత్సంగము'**ను ప్రారంభించుకుంటున్నాము. ఈ రోజు సుదినం. మహనీయులు, అధ్యాత్మజ్ఞానవేత్త అయినట్టి యాజ్ఞవల్క్యులవారు తమ ఆశ్రమం నుండి సుదర్ఘీమైన, శ్రమతో కూడిన ప్రయాణము చేసి మన ఈ సభకు వేంచేశారు. అట్లాగే అశ్వలహోత, ఆర్తభాగుడు, భుజ్యుడు, ఉషస్తుడు, కహోళుడు, గార్గి, ఉద్దాలకుడు, కాప్యుడు, జిత్వా, ఉదంకుడు, బర్కుడు, గర్దభీవిపీతుడు, సత్యకామ జాబాలుడు, విదగ్ధుడు ఇత్యాది ఆచార్యులు, ఋషులు, మునులు మొదలైనవారంతా విజయంచేశారు. సభలోని ప్రతి ఒక్కరికి హృదయ పూర్వకంగా నమస్కరిస్తున్నాను.

ఓ యాజ్ఞవల్క్య మహర్షీ! మిమ్ములను తత్త్వజ్ఞానార్థినై కొన్ని ప్రశ్నలు వేయబోవుచున్నాను. దయతో అనుజ్ఞ ఇవ్వండి.

యాజ్ఞవల్క్యులవారు ఇట్లా అనుకున్నారు!

**"ఇదేమిటి? జనక మహారాజుతో సహా ఎందరో మహానుభావులు పాల్గొనుచున్న ఈ సభకు నేను శ్రోతనై ఉంటానని అనుకొన్నాను కదా! జనకుడు నన్ను సమాధానము చెప్పవలసినదిగా కోరుచున్నారేం? సరేం! నేను శ్రోతగా మాత్రమే పాల్గొనెదని చెప్పుదాము!"..** అని తలచారు.

ఇంతలో ఆ యాజ్ఞవల్క్యుని మనస్సులో కొంతకాలము క్రితము జరిగిన ఒక సంఘటన గుర్తుకొచ్చింది.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు ఒక గొప్ప యజ్ఞమును తలపెట్టి అనేక మంది మహనీయులతో బాటు జనక చక్రవర్తిని కూడా ఆహ్వానించారు. ఆ యజ్ఞ సందర్శనం కొరకు జనకుడు విచ్చేశారు. అప్పుడు **'అగ్నిహోత్రము'** యొక్క యాగములోని కర్మకాండకు సంబంధించిన విశేష పాశస్త్యము గురించి అనేకమైన తాత్త్విక విషయాలు జనక చక్రవర్తి యాగసభాసదులకు వివరించటము జరిగింది. అప్పుడు

యాజ్ఞవల్క్యుడు యాగమండపము నుండి లేచి, జనకుని సమీపించి **"ఓ రాజయోగీంద్రా! మీ వివరణాత్మక శాస్త్రీయ విశేషాలు విని నేను ఎంతో సంతోషించుచున్నాను. నేను మీకు ఏమిచ్చి కృతజ్ఞతలు చెప్పగలను? ఏమైనా వరంగా అడగండి!"..** అని పలికారు. అందుకు జనకుడు చేతులు జోడించి నమస్కరిస్తూ **"నిత్యానిత్య వివేకియగు తత్త్వజ్ఞా! యాజ్ఞవల్క్యా! మీరు వరమిస్తానని అన్నారు కాబట్టి ఒక వరము కోరుకొంటున్నాను. నేను ఎప్పుడైనా తాత్త్విక విషయాలు అడిగినప్పుడు శ్రమ అనుకోకుండా విశదీకరించటానికి అంగీకరించండి! ఇదే నాకు వరము!"**

అప్పుడు యాజ్ఞవల్క్యుడు సంతోషించి, **"ఓ జనక చక్రవర్తీ! మీరు ఎప్పుడు ఏ తాత్త్విక (బ్రహ్మతత్త్వ) సంబంధమైన విశేషము అడిగినా, వెంటనే  తెలిసినంత వరకు వివరిస్తాను - అని శపథము చేయుచున్నాను"!** అని పలికారు.

యాజ్ఞవల్క్యునికి అది ఇప్పుడు గుర్తుకు వచ్చింది. **"ఓ జనక యోగి పుంగవా! మీకు ఇచ్చిన వరమునకు బద్ధుడను కదా। తప్పక అడగండి. తెలిసినంతవరకు వివరిస్తాను!"..** అని పలికారు.



**జనక మహారాజు :** ఓ యాజ్ఞవల్క్యా! ఈ జీవుడు వెలుతురులో అన్నీ నిర్వర్తించగలడు. చీకటిలో ఏమి చెయ్యలేడు కదా! పురుషుడు (జీవుడు) కాళ్ళతో నడుస్తున్నాడు. చేతులతో పనులు చేస్తున్నాడు. కళ్ళు చూస్తున్నాయి. చెవులు వింటున్నాయి. చర్మము స్పర్శ జ్ఞానము కలిగి ఉంటోంది. ముక్కు వాసన చూస్తోంది. నాలుక రుచిని ఆస్వాదిస్తోంది. ఇవన్నీ నిర్వర్తించగలగటానికి కారణమగుచున్న **'తేజస్సు'** ఏది? వ్యవహారములు నిర్వర్తించటానికి పదార్థములను ప్రకాశింపజేసే 'జ్యోతి' ఏది? అనేక వ్యవహారములలో తలమునకలుగా మునిగి ఉన్న ఈ పురుషుడు ఏ వెలుగు (లేక) జ్యోతిలో అన్నీ దర్శిస్తూ నిర్వర్తిస్తూ ఉన్నాడు? అట్టి జ్యోతి (తేజస్సు) ఈ దేహ - అవయవములలో ఒక భాగము వంటిదా? లేకుంటే, అవయవములకు వేరుగా ఉండి అవయవములను చలింపజేయుచున్నదా?

## సూర్య తేజస్సు - జ్యోతి

**యాజ్ఞవల్క్యుడు :** ప్రకృతి సిద్ధమగు భౌతికశరీరము నందు వెలుగొందుచున్న జ్యోతి (తేజస్సు) ఆదిత్యుడు (సూర్యుడు). ఈ పురుషుడు (జీవుడు) **"ఆదిత్య జ్యోతి"** ద్వారానే చూడటము, వినటము, నడవటము, కదలము - ఇవన్నీ నిర్వర్తించగలుగుచున్నాడు. నేత్రేంద్రియములను (కళ్లను) అధిష్ఠించియున్న ఆదిత్య తేజస్సు యొక్క అనుగ్రహము చేతనే కళ్ళు వస్తువులను చూడగలుగుచున్నాయి. ఆ తేజస్సులోనే (వెలుగులోనే) ఈ పురుషుడు ఇటునుంచి అటు - అటు నుండి ఇటు చూస్తూ తిరుగగలుగుచున్నాడు. ఆ వెలుతురులో తాను స్పందిస్తూ, అనుకున్న విధంగా తన చేతులు కదల్చగలుగుచున్నాడు. వ్యక్తి యొక్క అవయవములకు (ఇంద్రియములన్నిటికీ) భిన్నముగా (నాటక దీపము వలె), ఈ పురుషుని భౌతిక దేహములో కూడా ఆదిత్య తేజస్సు వెలుగొందుచున్నది. అదే తేజస్సు సూర్యునియందు, దృశ్యమునందు కూడా ప్రదర్శితమై ఉంటోంది.

కళ్ళు చూస్తున్నప్పుడు - చూడనప్పుడు కూడా (గదిలోని వెలుగు వలె) ఆ ఆదిత్య తేజస్సు దేహమంతా ప్రకాశించుచూ సర్వమును ప్రకాశమానము చేయుచున్నది. అట్టి తేజస్సే సూర్యుని యందు కూడా వెలుగొందుచున్నది (సూర్య జ్యోతి).

**ఆత్మ తేజస్సు** - సూర్యుడు, చంద్రుడు, దేహము మొదలైన వాటికన్నిటికీ విభిన్నమై, విలక్షణమై, సర్వ కార్యక్రమములకు ఆది-కారణమగుచున్నది. అట్టి సూర్యజ్యోతి యొక్క వెలుగు లేకుండా ఈ జీవుడు చిటికిన వేలు కూడా కదల్చలేడు. **సూర్య జ్యోతిమ్ నమామ్యహమ్।**

**జనక మహారాజు :** యజ్ఞవల్క్య మహాశయా! తేజస్సు నందే (వెలుతురులో) కళ్ళు చూడటం జరుగుచున్నాయని, తదితర కాళ్ళ-చేతులు పని చేయగలుగుచున్నాయనునది వాస్తవమే! అయితే, **అస్తమిత ఆదిత్యే, కిం జ్యోతిరేవ?**

ఆదిత్యుడు (సూర్యుడు) అస్తమించినప్పుడు ఏ జ్యోతి (వెలుగు)యందు ఈ జీవుడు చూడటం, నడవటం, కదల్చటం.. మొదలైన ఇంద్రియ వ్యాపారములు నిర్వర్తించగలుగుచున్నాడు? (అట్టి ఆదిత్యుడు అస్తమించినప్పుడు వెలుగు జ్యోతి ఎట్టిది? ఎవరిది?)

**యాజ్ఞవల్క్యుడు :** సూర్యుడు అస్తమించినప్పుడు చంద్రుని వెలుగులో, చంద్రతేజస్సులో చూడటము - పనులు చేయటము మొదలైన ఇంద్రియ వ్యాపారాలన్నీ ఈ పురుషుడు (జీవుడు) నిర్వర్తించుకొనుచున్నాడు. చంద్రజ్యోతి యందు కర్మలు నిర్వర్తించబడుచున్నాయి.

జ్యోతి చంద్రరూపమై ఈ జీవుడు స్పందించుటకు **ఆధార-సహకారి కారణము** అగుచున్నది. **చంద్రజ్యోతిః నమామ్యహమ్!**

**జనక మహారాజు :** మీరు చెప్పింది వాస్తవమే! అయితే స్వామీ! సూర్య-చంద్రులిరువురూ అస్తమించిన సమయంలోనో?

## అగ్నిజ్యోతి

**యాజ్ఞవల్క్యుడు :** సూర్య-చంద్రుల ప్రకాశము లేనప్పుడు - అగ్నియే జ్యోతిస్వరూపముగా ఈ జీవుని భౌతికమైన ఇంద్రియ వ్యాపారములన్నిటికీ సహకరిస్తున్న కారణమగుచున్నది. **'అగ్ని'** అను జ్యోతి స్వరూపము నందు ఈ జీవుడు స్పందించటము, నిలుచోవటం, కూర్చోవటం, మాటలాడటం మొదలైనవి చేస్తూ ఉన్నాడు. **అగ్ని జ్యోతిమ్ నమామ్యహమ్!**

**జనక మహారాజు :** అవును! నిజమే! మరి సూర్య-చంద్రులు అస్తమించగా అగ్ని కూడా శాంతించి ఉన్న సమయంలోనో? ఏ జ్యోతి ఆతనికి కర్మల నిర్వహణకు సహకరిస్తోంది?

## వాక్ జ్యోతి

**యాజ్ఞవల్క్యుడు :** అప్పుడు ఈ జీవుని పట్ల వాక్కు (నోటి మాట)యే జ్యోతి స్వరూపమై జీవుడు ఇంద్రియ వ్యాపారములు నిర్వర్తించటానికి 'సాక్షీదీపము'వలె వసతి (Facility) అగుచున్నది. వాక్కు అనగా → శబ్దము. శబ్దము వినబడినప్పుడు చెవిలోని చైతన్య స్ఫూర్తి స్పందించగానే, **మనస్సు నందు విషయాకార పరిణామము వివేకము రూపముగా పొందుచున్నది.** అట్టి మనస్సుతోనే శబ్దములను వినుచు ఈ జీవుడు మనస్సు నుండి స్పందించుచున్నాడు. శబ్దము చేతనే ఈ జీవుడు స్పందించటము, కర్మలు చేయటము, తిరిగి రావటము చేయుచున్నాడు. శబ్దజ్యోతి చేతనే ఈ జీవుడు వినటము, మాట్లాడటము కూడా నిర్వర్తిస్తున్నాడు.

- ఈ మానవుడు శబ్దము విని, ఏవస్తువో, ఎవ్వరో గుర్తిస్తున్నాడు కదా! అంటే ఏమిటి? శబ్దము ద్వారా మనస్సుతో చూడటం, వినటం, స్పందించటం చేయుచున్నాడు.
- శబ్దము వినగానే కళ్ళలో మెఱుపు కలగటం, దేహము - 'ఝుళ్' మనటము, ఉలిక్కిపడటము, ... ఇవన్నీ జగటం, అందరకీ అనుభవమే కదా!
- శబ్దమును విని (మధుర సంగీతమునకు) మనస్సు ఆనందించటము, (కర్కశ శబ్దములకు) బాధ పొందటము, (గౌరవించబడినప్పుడు) గర్వించటం, (అవమానించ బడినప్పుడు) మనస్సు న్యూనత చెందటము మొదలైనవి జరుగుచున్నాయి.

వాక్కు జ్యోతి ప్రకాశస్వరూపము (లేక) ప్రకాశము (లేక) వెలిగించునది - అని అనటానికి మరొక దృష్టాంతమును వినండి.

ఒకచోట చిమ్మ చీకటిగా ఉన్నచోట, కళ్ళు ఏమీ చూడలేని ఆ నిశీధిలో ఎవ్వరైనా శబ్దము చేసి పిలిస్తే, ఒకడు అటువైపు వెళ్ళగలుగుచున్నాడు. అట్లాగే, ఆకాశము మేఘావృతమై అంతా అంధకారము అలముకొని ఉండగా,... ఒక కుక్క మొరిగినప్పుడు, గాడిద ఓండ్రు పెట్టినప్పుడు ఆ శబ్దము ఎటువైపు నుంచి వచ్చిందో, ఎంతదూరమై ఉంటుందో మనస్సు ఊహించగలుగుతోంది.

(శంకర భాష్యము : శబ్దము వలెనే రసము, గంధము, స్పర్శ... మొదలగు ఇంద్రియ విషయములు కూడా ఈ పురుషుని మనస్సుకు 'ఎరుక' కలుగజేస్తున్నాయని మహర్షి హృదయమై ఉన్నది). **వాక్ జ్యోతిః నమామ్యహమ్। అగ్నిజ్యోతిమ్ నమామ్యహమ్। సకలేంద్రియ జ్యోతిర్నమామ్యహమ్।**

**జనక మహారాజు : ఏవమేతత్‌వై, యాజ్ఞవల్క్య!** అవును అది నిజమే.

ఒకవేళ్ళ సూర్య-చంద్రులు అస్తమించి, అగ్ని సశాంతించి, వాక్కు కూడా శాంతించినట్టి స్థితి కలిగిందనుకోండి. అప్పుడు ఇక ఏ తేజస్సు (లేక) జ్యోతి సమక్షంలో (లేక) సహాయముచే ఈ పురుషుడు చూడటము, రాకపోకలు, చేతులతో పనులు చేయటం, శబ్ద-స్పర్శ-రూప - రస-గంధాలు అనుభవమై, ఉపకరణశీలమవటము జరుగుతోంది?

అంతేకాకుండా, దేహమునకు సంబంధించిన శబ్ద స్పర్శ రూప రస గంధాలు స్థంభించిపోయిన సందర్భములో.. వాటివాటి జ్ఞాపకాలను, భావాలను, అనుభూతులను సంబంధిత భావయుక్తమైన అనుభవాలను పురుషుడు (స్వప్నములో) **మననము** చేయటమనేది ఏ తేజస్సు యొక్క జ్యోతిలో సిద్ధించటము జరుగుతోంది? సహకరిస్తోంది?

సుషుప్తిలో జాగ్రత్-స్వప్న విశేషాలేవీ ఉండవు. కానీ ఆ పురుషుడు **"నేను ఒక్కడినే ఉన్నాను! సుఖము ఆస్వాదిస్తున్నాను"**... అని (నిద్రలేచిన తరువాత) అనుకుంటున్నాడుకదా! మరి అట్టి సుషుప్త-అనుభవము ఏజ్యోతి సమక్షములో పురుషుడు పొందటము జరుగుతోంది?

స్వప్నములో జాగ్రత్‌లోని సూర్య-చంద్ర-అగ్ని-వాక్కులు లేవే! అయినా కూడా ఈ పురుషుడు స్వప్నంలో బంధుమిత్రుల సమాగమము, ఒకచోటి నుండి ఇంకొక చోటికి వెళ్లి-రావటము, చేతులతో కొన్ని పనులు చేయటము, జాగ్రత్ దృశ్య - వస్తువుల వలెనే ఏవేవో చూడటము, తాకటము, వినటము, రుచి-మొదలైన ఇవన్నీ జరుగుతోంది. **ఏ వెలుతురు - తేజస్సు - జ్యోతిలో అవన్నీ అనుభవమగుచున్నాయి**?

## ఆత్మజ్యోతి

**యాజ్ఞవల్క్యుడు :** ఓ జనక మహారాజా! ఈ సూర్య-చంద్ర - అగ్ని-వాక్కుల కంటే **అత్యంత విలక్షణము**, ఆశ్చర్య విశేషము, మహత్తరము అగు ఒకానొక తేజస్సు ఉన్నది. అదియే **"ఆత్మ తేజస్సు"**. **ఆత్మైవ అస్య జ్యోతిః - భవతి ఇతి। ఆత్మనైవా అయం జ్యోతిషా అస్తే పల్యయతే। కర్మ కురుతే। విపల్యేతి - ఇతి। (6-3-6)** మట్టి బొమ్మలన్నీ మట్టితోనే తయారగుచున్న రీతిగా ఈ జీవులు, సర్వలోక జీవులు, సర్వజగత్తులు, సర్వజ్యోతులు ఇవన్నీ కూడా 'ఆత్మ' అను ముడివస్తువుతో తయారగుచున్నాయి. అనగా, ఈ పురుషుడు దేనిచే, సూర్యకాంతి, చంద్రకాంతి, అగ్నికాంతి, శబ్ద స్పందనములతో కళ్ళతో చూడటము, చేతులతో పట్టుకొని విడచిపెట్టటము, కాళ్ళతో రాక-పోకలు, రుచి చూచి అంగీకార - తిరస్కారములు నిర్వర్తించటము - ఇవన్నీ నిర్వర్తిస్తున్నాడో...అదియే **ఆత్మజ్యోతి।**

⌘ అట్టి ఆత్మ పురుషునికి జాగ్రత్ స్వప్న సుషుప్తులు 'పల్లకి' వంటివి అగుచున్నాయి. ఆతడు ప్రవేసిస్తున్నాడు, వదలుచున్నాడు. (పల్యయతే, విపల్యతే)। సమస్త కర్మలు ఆత్మయొక్క తేజస్సులోనే జరుగుచున్నాయి.

⌘ స్వప్న - జాగ్రత్‌లలో అట్టివన్నీ ఆత్మతేజస్సుతో నిర్వర్తిస్తున్నాడు. సుషుప్తిలో ఆత్మజ్యోతియందు తన కేవలీ రూపము ఆస్వాదిస్తున్నాడు.

⌘ ఆత్మ తేజస్సు తానే అయి, తనకు తదితరమైనదంతా అద్వితీయమై (ఆత్మ పురుషుడు) వ్యవహరిస్తున్నాడు.

దేహము - ఇంద్రియావయవములు - ఇంద్రియ తత్త్వములకంటే, (మరియు) బాహ్య సూర్య-చంద్ర-అగ్ని- వాక్కుల కంటే వేరై, జాగ్రత్ - స్వప్న-సుషుప్తులలో సర్వమును వెలిగించుచున్నట్టిది - **జ్యోతిర్మయమగు ఆత్మయే!**

అట్టి ఆత్మజ్యోతి...

❊ **స్వయంజ్యోతి స్వరూపము.** అద్దానిని వెలిగించటానికి మరొక జ్యోతి ఏదీ అవసరము, అగత్యము లేదు.

❊ అది సర్వమును వెలిగించు **జ్యోతిర్జ్యోతి. సూర్య - చంద్ర - అగ్ని - వాక్ - సర్వేంద్రియజ్యోతులను తన వెలుగులో పనిచేయుటకు కారణమగుచున్నది ఆత్మయే!**

❊ ఆత్మజ్యోతి **ఎరుగుటకు** కన్ను - ముక్కు మొదలైనవాటితో పనిలేదు.

❊ అది జాగ్రత్‌కు సంబంధించినది కాదు.
స్వప్నమునకు సంబంధించినదీ కాదు.
సుషుప్తికి - సంబంధించినది కూడా కాదు. **కానీ, అన్నీ అద్దానికి అంతర్గత, స్వయంకల్పిత విశేషాలే।**

❊ అది దేహావయములవలె, సూర్య-చంద్రుల వలె, అగ్ని - వాక్కుల వలె బాహ్య వస్తువుకాదు. సమస్తమునకు **అంతర్జ్యోతి స్వరూపము.** అందుచేత కళ్ళు - చెవులు మొదలైన ఇంద్రియములకు, అంతరింద్రియమగు మనస్సుకు కూడా 'తెలియబడు విషయము' అయి ఉండలేదు. అయితే, **వాటన్నిటికీ ఆత్మయే ఆధారము.**

❊ అది బాహ్య-అభ్యంతర సంబంధమైన సంఘాతము (Association of some materials)లచే ఏర్పడేది కాదు. **స్వయంజ్యోతీ స్వరూపము. స్వయంకృతము. స్వయం ప్రవర్తనశీలము.**

❊ **'నేను'** - అను దానిని జాగ్రత్ - స్వప్న- సుషుప్తులలో వేరువేరైన ఎరుకల కాంతులతో వెలిగించుచున్నట్టిది కూడా

జ్యోతిర్జ్యోతియగు ఆత్మ జ్యోతియే। **(జ్యోతిర్జ్యోతి స్స్వయం జ్యోతిః। ఆత్మ జ్యోతిః।)**

- ❊ ఈ పురుషుని (జీవుని) తేజస్సే ఆత్మ. ఆత్మయే స్వయంజ్యోతి. అనగా అది ప్రత్యక్షము (ఇంద్రియ విషయము) కాక, పరోక్షము (మరెక్కడో ఉన్నది) కాక, జీవుని స్వాభావిక స్వస్వరూపమై, **"అపరోక్షము"** అయి ఉన్నది.
- ❊ ఆత్మ చేతనే బాహ్య – అభ్యంతర ఇంద్రియములు వెలిగించబడుచూ వినియోగించబడుచూ ఉన్నాయి. అంతేగాని, ఈ ఇంద్రియములచే ఆత్మ వెలిగించబడటము లేదు. సూర్య–చంద్ర–అగ్ని – వాక్కు... ఇత్యాదులచే కాదు.
- ❊ **ఆత్మజ్యోతి-సర్వదేహములలో ఉండి సర్వము ఎరుగుచున్న విజ్ఞానమయ స్వరూపము.** సహస్రదీపములలోని **అగ్నిజ్యోతి** సదృశము.

**జనక మహారాజు :** మహాత్మా! యాజ్ఞవల్క్యా! ఈ దేహ – ఇంద్రియ – మనో – బుద్ధి – చిత్త – అహంకార – ప్రాణాదులలో ఆత్మఏదై ఉన్నది? విజ్ఞానమయ స్వరూపుడగు ఆత్మ ఎట్టిదై ఉన్నది? **కతమ ఆత్మేతి యో అయం? (6–6–7)।** (లేక) అధికాధికంగా ఎందులో మనము దర్శించవచ్చు?

**యాజ్ఞవల్క్యుడు :** ప్రాణ – ఇంద్రియములయందు, హృదయమునందు **'ఎరుగుచుండటము'** అను విలక్షణ స్వలక్షణముతో ఏ విజ్ఞానమయ పురుషుడు వెలుగొందుచున్నాడో (జ్యోతిస్వరూపుడో – ⟶ **ఆతడే ఆత్మ పురుషుడు।**

**అది విజ్ఞానమయము. (దృశ్యము, స్వకీయ ఆలోచనలు, ఇష్టాయిష్టములు మొదలైన) సమస్త విశేషాలను తెలుసుకోవటము"** అను రూపము కలిగి ఉన్నట్టిది.

ఈ జగత్తులు, లోకాలు, దేహము, మనో బుద్ధి చిత్త అహంకారాలు **'తెలియబడుచున్నవి'** అగుచుండగా, ఆత్మమాత్రము **"తెలుసుకొనుచున్న దానిని తెలుసుకొనుచున్నట్టిది". "విదితవేద్యము".** సూర్యుడు సర్వలోకములను వెలిగించుచూ తాను సర్వమునకు వేరై ఉండురీతిగా,... ఆత్మయే దేహ, ఇంద్రియ. ఇంద్రియ విషయ, అంతరింద్రియ సంఘాతములన్నిటినీ తన యొక్క **జ్యోతితత్త్వముచే** వెలిగించుచూ, తాను సర్వదా వేరై, **కేవల జ్యోతిస్వరూపమై** ఉన్నది. తదితరమంతా ఆత్మజ్యోతిచే వెలిగించబడుచున్నది. అట్టి ఆత్మజ్యోతి–

- **అనిత్య పదార్థములలో నిత్యమై ఉన్నట్టిది.**
- **సకల ప్రాణులలో ప్రాణశక్తిని స్పందింపజేయుచున్నట్టిది.**

ఆత్మ–కారణకారణము. సర్వవ్యాపకము–పరిపూర్ణము అగుటచే **'ఆత్మపురుషుడు'**... అని పిలువబడుతోంది. **స సమానసన్ ఉభౌ లోకావనుసంచరతి! (6–3–7)। ఆత్మపురుషుడే "ఇహ", "పర" – ఉభయలోకములను అనుసరిస్తూ సంచరించువారై ఉన్నారు.**

ఒకడు నాటకములోని ఒక పాత్రలో ఒదిగి నటిస్తూ ఉన్నప్పుడు **"కళాకారుడు – పాత్ర"** – (సహజము–నాటకములోని సందర్భము) అను రెండింటిలోను సమానముగా సంచరించువాడై ఉంటాడు కదా! **ఇహ–పరము** (Incidental and original) **లలో ఆత్మ ఏక – అఖండ స్వరూపమై వెలుగొందుచున్నది.**

- **ఈ నాటకములో ఈపాత్రగా నటిస్తూ ప్రదర్శించుచున్నదీ నేనే!**
- **సహజముగా నటనా కౌశలము కలిగి అనేక నాటకములలో నటించగల సామర్థ్యముతో కూడిన 'కళాకారుడను' నేనే.. అని ఎరిగి ఉంటాడు కదా!**

అట్లాగే ఇహ (Role in the world Drama) - పర (As one who is playing the 'Role' while being separate from the Role)... రెండు లోకములలో సమానముగా సంచరించుచూ ఉన్నట్టిది **'ఆత్మ'।** రెండు లోకములలో (ఇహ–పర స్థానములందు) సంచరిస్తూ, ఏకరూపమై ఉన్నట్టిది। **ఇహ–పరములను తన జ్యోతిస్వరూపము యొక్క వెలుగు కిరణములుగా కలిగి ఉన్నట్టిది.**

- **ఇహము (జగదంతర్గతము)**గా ఉన్నప్పుడు జీవాత్మ – జగత్తులుగాను,
- **'పరము'** (జగదనుభవమునకు ఆవల)గా ఉన్నప్పుడు వాటిని ఎరుకచే నిర్మించు **కర్తృత్వము** కలదిగాను ఒకేసారి అగుచూ, **వాస్తవానికి సర్వదా పరిశుద్ధమై వెలుగొందుచున్నట్టిది – 'ఆత్మ'!**

- ఈ నామ-రూపములన్నీ ఎందులో **అధ్యారోపము** చేయబడుచున్నాయో... **అది ఆత్మ।**
- ఇహ-పరములు తన జ్యోతిస్వరూపమే అయి ఉండగా, ఆత్మ ఎటూ వెళ్ళటము లేదు-ఎటు నుండి రావటము లేదు కూడా.

**లేలాయతి ఇవ।** ఆత్మ ఇహ - పరములందు చలించుచున్నట్లు (అజ్ఞాన బుద్ధికి) అనిపించవచ్చు గాక! ఉభయము తానే అయి ఉన్నప్పుడు- ఇటు నుంచి అటు, అటు నుండి ఇటు - వెళ్ళటమేముంటుంది? నాటకములో నటించువాడు - తన **వ్యక్తిగతము** నుండి పాత్రలోనికి, **పాత్ర నుండి వ్యక్తిగతములోనికి** వెళ్ళివచ్చుచుండటమనేది ఎక్కడిది,- **రెండు కూడా తన ప్రదర్శనములే అయి ఉండగా?**

రచయిత తాను రచించిన నాటకములోనికి వెళ్లటము, నాటకము నుండి బయటకు రావటము అనునవేవీ లేవు కదా।

**ఒకడు** (1) నటించు కళాకారత్వము (2) నాటకములోని పాత్ర,- రెండింటినీ అధిగమించి (ఆ రెండింటిని తన యందు అంతర్విభాగములుగా కలిగి) ఉంటున్నాడుకదా! ఆట్లాగే, **ఆత్మ పురుషుడు కూడా-**

- **స్వప్న స్వరూపములైనట్టి లోకములను,**
- **మృత్యువు యొక్క రూపములైనట్టి దేహ ఇంద్రియములను -**

**అధిగమించినవాడై,** ఆ రెండింటిని తనయందు స్వల్ప విభాగములుగా, స్వకీయ ప్రభలుగా - తానైయున్న **ఆత్మజ్యోతి తేజస్సుయొక్క తేజో కిరణములుగా** కలిగి ఉంటున్నాడు.

- మార్పు చెందే రూపములన్నీ (మృత్యువుకు విషయములగుచున్నవన్నీ)... తన యందు కలిగి ఉండి..
- తాను సర్వదా అమృతరూపమై,

**ఆత్మజ్యోతిగా ప్రకాశించుచున్నదియే - 'ఆత్మ'।**

ఆత్మయొక్క **'ఎరుక'** అను లక్షణమే బుద్ధియొక్క రూపమగుటచే, (1) లౌకికమైన బుద్ధి - ఆత్మను (తనకు వేరుగా) తెలుసుకొనలేకపోతోంది. (2) అలౌకికమైన బుద్ధి ఆత్మకు అనన్యమై ఉంటోంది.

**- క్షణికమగు తెలియబడుదానికి, శాశ్వతమగు తెలుసుకొనుచున్నట్టి దాని జ్యోతి - ఆత్మయే!**

దీపపు వెలుగుచే దీపము వెలిగించబడుటమనేది ఏమి ఉంటుంది? అట్లాగే, ఆత్మజ్యోతి తన వెలుగే అయి ఉన్న బుద్ధిచే తాను ఎరుగుబడదు. (వెలిగించబడదు).

ఈ జీవుడు - దేహమును ఆశ్రయించినట్టి **ఆత్మజ్యోతి అంశస్వరూపమే। "ఒక వస్తువుపై ప్రసారమగుచు, ఆ వస్తువుకు వేరైయున్న వెలుగు"** వంటివాడే!

ఆత్మస్వరూపుడే అయినట్టి ఈ పురుషుడు (జీవుడు) ...

- **"నేను దేహములో పుట్టుచున్నాను.**
- **నేను పాప- పుణ్యఫలములకు భోక్తనై దేహముతో జీవిస్తున్నాను.**
- **నేను ఈ దేహమును వదలి ఇక ఇప్పుడు ఈ మరొక దేహమును ఆశ్రయించుచున్నాను...."**

అని తలచుచూ, అట్టి తలపులలో పరిభ్రమణము చేయుచున్నాడు. దేహము - దేహాంతర దేహముల మధ్య సంచారాలు చేస్తూ, తన యొక్క సర్వదేహ **సాక్షీభూత స్వరూపమును** (లేక) **కేవలీ స్వరూపమును ఏమరచుచున్నాడు.** బంధము ఉండజాలని చోట "నేను బద్ధుడను" అని పొలికేకలు పెట్టుచున్నాడు. ఏమి విచిత్రం!

- ఆత్మతత్త్వ జ్ఞానముచే దేహములను మనస్సుచే విడచిపెట్టి పైకి (పరస్థానము) చేరినప్పుడు పాప-పుణ్యములను విడచి వేయుచున్నాడు.

ఇహమున భావపరిమితుడై ఉన్నప్పుడు **"నేను దేహ-ఇంద్రియ సంఘాతమునకు చెందినవాడను. ఇదంతా నాకు చెందినది"..** అను అల్పభావార్థమును తన యొక్క **"నిత్య నిర్మల ఆత్మజ్యోతి స్వరూపము"**పై ఆపాదించుకుంటున్నాడు. పాప పుణ్యములకు బద్ధుడు అగుచున్నాడు.

- దీపపు జ్యోతి ⟶ వస్తువులను వెలిగించుచూ, ఆయా వస్తువుల మార్పు–చేర్పులకు తాను కర్త అయి ఉండకయే ఉంటుంది కదా!

**ఆత్మజ్యోతి దేహాత్మలను వెలిగించుచూ, ఆ కర్తృత్వము తన పట్ల లేనిదే అయిఉంటోంది.**

ప్రతి ఒక్క జీవుని సహజ – వాస్తవ – అనునిత్య స్వస్వరూపమగు **'ఆత్మ'**కు బంధమే లేదు. వెలుగులో కనిపిస్తున్న వస్తువుల దోషములు వెలుగును తాకగలవా? **మనో–బుద్ధి–చిత్త–అహంకార దోషములు ఆత్మను ఎట్లా తాకుతాయి? తాకలేవు.**

***ఆత్మజ్యోతి యొక్క అప్రమేయత్వము।***

ఈ పురుషుడు ప్రతిరోజు **"జగత్ దేహము"** నందు ఉన్నవాడై కొన్ని గంటలు గడపిన తరువాత ఈ **'జాగ్రత్ దేహము'**ను వదలి **'స్వప్నదేహము'**ను ఆశ్రయించి స్వప్న దృశ్యమును అనుభవించుచున్నాడు. ఆ స్వప్నదేహమును కూడా కొంత సమయమైన తరువాత – వదలి **'సుషుప్తి దేహము'** స్వీకరించి **"నాకు మరింకొకటేదీ వేరుగా ఏదీ లేనే లేదు"**.. అను సందర్శనమును కలిగి ఉంటున్నాడు.

ఈ విధంగా జాగ్రత్ – స్వప్న – సుషుప్తి బుద్ధులను స్వీకరిస్తూ, త్యజిస్తూ ఉన్నాడు. ధర్మ–అధర్మ కార్యములతో కూడిన త్రిదేహ అభిమానములను ('3' దేహేంద్రియ సంఘాతములను) అంగీకరించటము – తిరస్కరించటము (త్యజించటము) చేయుచున్నాడు.

**– అట్టి తీరైనదే – పునర్జన్మ కూడా। (దేహముల రాక–పోకలు కూడా)।**

ఈ పురుషుడు **ఒక దేహేంద్రియ** సంఘాతముతో నిర్వర్తించిన ధర్మ–అధర్మ సందర్భ వ్యవహారములన్నీ త్యజించి, ... **మరొక దేహముతో** దేహేంద్రియ సంఘాతమును (మరొక సందర్భమును) స్వీకరించుచున్నాడు. ఈ విధంగా **"దృశ్య ధ్యాసా ఆవేశము"** ఒక పరంపరగా కొనసాగునంతవరకు నిరంతరము ఇహలోకము (వర్తమాన లోకము) – పరలోకము (మరణానంతరము పొందు మరొక లోకము) పొందుచున్నాడు. [ ఆ నూతన పరలోకము తిరిగి వర్తమాన (ఇహ) లోకరూపములాగానే పొందబడుచున్నది]

ఇదంతా కూడా **"ఆత్మజ్యోతి"** యొక్క ప్రజ్ఞా కిరణ ప్రతిబింబితముల వంటివి మాత్రమే. జాగ్రత్–స్వప్న–సుషుప్తులు, దేహముల రాక పోకలు, ఇహ–పర వ్యవహారములు – ఇవన్నీ **"ఆత్మజ్యోతి"**, అనే దీపము యొక్క కాంతియందు ప్రకాశించు (గదిలోని వస్తు సముదాయముల) మార్పుచేర్పుల వంటివి మాత్రమే!

**ఆత్మజ్యోతి స్వరూపుడగు పరమాత్మకు** (పరానందస్వరూపమునకు) – "నాటక దీపము, నాటకములోని సంగతి, సందర్భము"లవలె– **జన్మకర్మలతో కించిత్ కూడా సంబంధమే లేదు.** ఉపాధుల వ్యవహారమునకు జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు కించిత్ కూడా ఆత్మ పరిమితము కాదు.

> **తస్మిన్ సంధ్యే స్థానే తిష్ఠత్ – ఏతే**
> **ఉభే పశ్యతి ఇదం చ, పరలోక స్థానం చ। (6-3-9)।**

ఆత్మజ్యోతి⟶ 'సంధి' యందు స్వప్న స్థానమునందున్నదై ... ⟷ ఇటు ఇహదేహమును, అటు పరదేహమును.. రెండు స్థానములను చూచుచూ ఉన్నది! (Merely witnessing the Past, Present and Future as well as Body-coming and Body going).

ఈ ఇహదేహలోకము... – పరదేహలోకము ⟷ (ఈ దేహము యొక్క అనుభవము – పరదేహము యొక్క అనుభవము) మధ్య**గాగల "అపేక్ష"** (Inquistiveness) ను **'సంధ్య'** అని, **'స్వప్నస్థానము'** అని పిలుచుచున్నారు. అట్టి సంధ్యా జ్యోతి స్వరూప ఆత్మపురుషుడే – అటు జాగ్రత్, ఇటు స్వప్నరంగములలో సంచారాలు చేయటము, **'స్వగృహము'** వంటి సుషుప్తికి తిరిగి రావటము, మరల బయల్వెడలటము చేస్తున్నాడు. **'ఆత్మయొక్క'** స్వప్నవిభాగమే ఉభయత్ర సంచారాలు చేస్తోంది. ఇక **'దేహ–దేహాంతరములు'** అను విషయానికి వస్తే, ఈ పురుషుడు వర్తమాన దేహమును త్యజించి, **'సంధ్య'** యందు ప్రవేశించి అక్కడి నుండి తన సాధనలు – కర్మల అభ్యాసము – భావముల కలయికను అనుసరించి మరొక దేహములో ప్రవేశించటము, **మరొక లోకము పొందటము, అక్కడ పాప (దుఃఖ)–పుణ్య (సుఖ)ములను అనుభవించటము నిర్వర్తిస్తూ ఉంటున్నాడు.**

ఇట్లా ఈ జీవుని పట్ల అసంఖ్యాక దేహపరంపరలు కొనసాగుతూ పోతున్నాయి. ఉపాసనలు, కర్మలు–ఇవన్నీ సంస్కారముల రూపములు దాల్చి, అవియే **పరలోకస్థానము** (Placement of Next Body) నకు కారణమగుచున్నాయి. అనగా, ఈ జీవునికి పరదేహస్థానము

(లేక) పరలోకము యొక్క స్థితిని ప్రసాదించు కారణము "స్వకీయ కర్మ-ఉపాసనలే". అంతేగాని, మరొకరెవ్వరో బయట నుండి కారణమై (కర్తలై) ఉండటము లేదు. (You are the Reason for every thing of whatever you are and where ever you are).

ఈ పురుషుడు ఈ జన్మలో అనుభవమునకు రాని, ఈ జన్మకు సంబంధించని అనేక విశేషములను ఒక్కొక్కపుడు స్వప్నములో చూస్తూ ఉన్నాడు. ఎందుచేత?

స్వప్నములో, ఇతఃపూర్వము (వర్తమాన లేక ఇతఃపూర్వపు దేహములతో) స్మరించినవే, – **ఊహతో జోడించి, మరల స్మరించబడి, స్వప్న దృశ్యరూపములుగా** ప్రాప్తించుచున్నాయి. అట్టి విశేషములు అనేక క్రితం ఉపాధులకు సంబంధించినవి కూడా (కొన్నిసార్లు) అగుచున్నాయి.

జాగ్రత్ – స్వప్నములు వర్తమాన దేహముతో పొందునని... ఒకతీరుగా ఉండగా, మరల పరలోకము (వేరొక దేహము)తో జాగ్రత్ -స్వప్నములు వేరువేరైన అనుభవములు కలిగిస్తూ ఉంటున్నాయి. నూతన లోకములకు (దేహములకు) సంబంధించిన నూతన పరిసరానుభవములు అందుకు జోడై ఉండి, పూర్వలోక (పూర్వదేహ) సంబంధములు (వర్తమానమున) **లేనివిగా** అగుచున్నాయి. ఇది – **"ఒక స్వప్నములోని విశేషాల సంబంధాలు – పరిసరానుభవములు, మరొక స్వప్నములో ప్రవేశించక ఉన్నట్టి రీతిగా"**.. కొనసాగుచున్నది.

## స్వప్నకల్పన

ఈ పురుషుడు జాగ్రత్‌లో సంచరించిన తరువాత గాఢముగా నిద్రకు ఉపక్రమించినప్పుడు తనయొక్క ఈ జాగ్రత్ లోకానుభవముల నుండి కొంత భాగమును విడదీసి, ఈ భౌతిక దేహానుభవమును తానే నిష్క్రియము చేసి, తనకు తానే ఆ కొంతభాగము సహాయముతో స్వప్న దేహము నిర్మించుకొనుచున్నాడు. ఆ నూతన స్వప్న దేహముతో ఆత్మజ్యోతియందు స్వప్న దృశ్యమును నిర్మించుకొని ఆస్వాదిస్తున్నాడు. బాహ్యమైన ఇంద్రియోపకరణములు లేకుండానే స్వప్న దృశ్యమును కల్పించుకొని, తేజస పురుషుడై, ఆ స్వీయ నిర్మిత-స్వప్న దృశ్యములో ప్రవేశించి స్వప్నదృశ్యమును ఆస్వాదిస్తున్నాడు. **కనుక ఈ పురుషునికి స్వప్నదృశ్యము స్వీయ – స్వయం ప్రకాశ నిర్మితమే గాని, మరొకరు బయట నుండి కారణము కాదు.**

స్వప్న దశయందు ఇంద్రియ సంబంధమైన బాహ్య విషయములు (జాగ్రత్ వలె) లేకుండానే, **స్వయంజ్యోతి యొక్క కాంతి** యందు ఊహా నిర్మితమైన స్వప్న దృశ్య నిర్మాణము చేసుకొనుచున్నాడు.

పురుషుని యొక్క **"దృక్"** స్వరూపమగు ఆత్మజ్యోతి నుండి ప్రసరించిన కిరణసముదాయము వలె స్వప్న దృశ్యము స్వయముగా నిర్మించుకొని అనుభవించబడినదగుచున్నది. **తానే జ్యోతి అయి ఉండి, తన వెలుగులో తానే భావావేశ నిర్మితమైన స్వప్నదృశ్యము చూస్తున్నాడు.**

స్వప్నములో జరుగు చమత్కారములు ఇంకా వినండి.

- అక్కడ (స్వప్న దృశ్యములో) రథములుగాని, రథమునకు పూన్చిన గుఱ్ఱములుగాని, రథము ప్రయాణించు మార్గముగాని లేవు. **న తత్ర రథా, న రథయోగా, న పంథానో భవన్తి (6-3-10).** అవన్నీ లేవు కానీ, ఈ పురుషుడు తన యొక్క ఆత్మప్రకాశములో స్వకీయ ఆలోచనల రూపమున, భావనల రూపమున, ఊహారూపమున **మనస్సుచే అవన్నీ నిర్మించుకొంటున్నాడు,** ఆస్వాదిస్తున్నాడు.
- అక్కడ ఆనందము లేదు, ఆనందమునకు కారణమగు భౌతికమైన ప్రియవస్తువులు లేవు, వాటిని ఆనందించువాడు లేడు. అవన్నీ లేకున్నప్పటికీ, ఈ పురుషుడు అవన్నీ భావనచే నిర్మించుకొని **"ఇవన్నీ ఇక్కడ-ఇప్పుడు- ఇట్లా నా పట్ల ఉన్నాయి"**... అను అనుభవమును ఆ స్వప్నద్రష్ట పొందుచున్నాడు. స్వప్నానుభవములన్నీ స్వప్న సమయములో **"నిజమే"**.. అన్నట్లే అనుభవించబడుచున్నాయి. అదంతా **'జాగ్రత్‌లోని భావములవంటివే'** అగుచున్నది.
- ఈ పురుషుడు నీటి గుంటలను, నదులను, తటాకములను, నామ-రూప-గుణములను, తనతో ప్రతిస్పందించే స్వప్న సహ జీవులను కల్పించుకొనుచున్నాడు.

ఇదంతా ఈ పురుషుడు ఆత్మజ్యోతి యొక్క వెలుగు నందు ఊహ-భావన-అనుభూతుల కలయికచే నిర్మించుకొనుచున్నాడు. అందుకు ఉపకరణము – **'మనస్సే'।**

**ఇదంతా కూడా ఈ విధంగా సిద్ధాంతపూర్వకముగా శాస్త్రగానము (శ్లోకీకరణము) చేయబడుచున్నది.**

- **ఆత్మజ్యోతి సర్వదా స్వయం ప్రకాశము.** స్వభావముగా తదితరములను (దీపమువలె) వెలిగించుచూ ఉంటుంది.
- ఈ పురుషుడు (జీవుడు) **స్వయంజ్యోతి స్వరూపుడు। ఆత్మజ్యోతి స్వరూపుడు।**
- అట్టి స్వయం జ్యోతి స్వరూపమగు ఆత్మజ్యోతి తన జ్యోతి (వెలుగు)లో తానే జాగ్రత్–స్వప్న–సుషుప్తులను కల్పించుకొని ఆస్వాదించుచున్నది.
- **జాగ్రత్** = ఒకప్పుడు భౌతిక దేహమును ఆశ్రయించి, వాహనము వంటి ఈ భౌతికదేహముతో తన జ్యోతి స్వరూపమునకు అభిన్నమైనటువంటి ఇంద్రియ విషయ రూప దృశ్య జగత్తులను పొందుచున్నది. **'విశ్వుడు'** అను పురుషకారమును ప్రదర్శించుచున్నది.
- **స్వప్నము** = అట్టి ఆ ఉపాధితో ఉన్నప్పుడే, కొంత జాగ్రత్ అనుభవము తరువాత, – ఆ భౌతిక ఉపాధిత్వమును ప్రక్కన పెట్టి, నిదురించినదై **స్వప్నావస్థ**ను పొందుచున్నది. తన తేజస్సు నందు తానే జాగ్రత్ వంటి దృశ్యమును కల్పించుకొని స్వకీయ తేజోమండలము నందు **'తేజసుడు'** అను పురుషకారముచే స్వప్న దృశ్యము అనుభవించుచున్నది. అట్టి సమయములో స్వప్న దృశ్యమే సత్యమైనట్లు, తదితరమైనదేదీ తనకు సంబంధించినది కానట్లు అనుభవము పొందుచున్నది. **ఆ స్వప్న సందర్భములో జాగ్రత్ తనది కానట్లుగా వ్యవహరిస్తోంది.**
- **సుషుప్తి** = అటు తరువాత గాఢనిద్రలో ప్రవేశించి, తనకు వేరైనదేదీ లేనిదై, **ఏకము – ఏకైకము** అగు **"స్వస్వరూపధ్యానము"ను** ఆస్వాదిస్తూ ప్రాజ్ఞుడు (ప్రాజ్ఞ పురుషుడు) అగుచున్నది.

ఈ విధముగా ఈ జీవుడు గాఢ నిద్ర నుండి బయల్వెడలి ఒకప్పుడు జాగ్రత్తును, మరొకప్పుడు స్వప్నమును కల్పించుకొని ఎప్పటికప్పుడు **"నేను ఈ పరిధి పరిసరములలో ఒక విభాగరూపుడను। వీటికి బద్ధుడను। వీటిచే పరిమితుడను। ఇంతవరకే నాకు సంబంధించినది। నేను ఇంతవరకే సంబంధించిన వాడను।"**... అని భావించుచున్నాడు. ఈ సహజ ఆత్మజ్యోతి స్వరూపపురుషుడు తనకు తానే భావనలను కల్పించుకొని, ఆ భావనల మధ్యలో దృశ్యపరంపరలను అనుభవించుచున్నాడు.

అట్టి జ్యోతి స్వరూప చైతన్య పురుషుడు **"ఇప్పుడు ఈ దేహముతో పుట్టాను। ఇవన్నీ జాగ్రత్–స్వప్న–సుషుప్తుల రూపమున పొందుచున్నాను. ఈ దేహముచే నిబద్ధితుడను. ఇక, ఇప్పుడు ఈ దేహముతో మరణిస్తున్నాను. మరల ఇప్పుడు ఈ మరొక దేహము స్వీకరిస్తున్నాను"**.. అనబడు తతంగమంతా, దేహ – దేహాంతరములుగా,.. **సుదీర్ఘముగా తన యొక్క ఆత్మజ్యోతి యందు తానే కల్పించుకొని అనుభవించుచున్నాడు.**

"జాగ్రత్ ⟶ స్వప్నము – సుషుప్తి".
"సుషుప్తి ⟶ స్వప్నము – జాగ్రత్".
– "ఈ దేహము – మరొక దేహము".
– "ఈ లోకములో ఈ దేహము – ఆ లోకములో ఆ దేహము".
– "ఇక్కడ – ఇక్కడి నుండి పైకి – పై నుండి మరొకచోట అక్కడికి".

... ఇదంతా **ఆత్మజ్యోతి** సమక్షంలో (వెలుగులో వేరువేరు వస్తువుల వలె) అనంతంగా, సుదీర్ఘంగా **కొనసాగుతోంది.**

ఇదంతా ఆత్మయొక్క అంతఃకరణ వృత్తి ద్వారా స్వకీయ కల్పనా విన్యాసముచే జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – జన్మ–పునర్జన్మ రూపములుగా ఏర్పడుచున్నది.

## సిద్ధాంతము – అప్రమేయమగు ఆత్మజ్యోతి।

ఒక గదిలో వెలిగించిన దీపము యొక్క వెలుగుకు – ఆ వెలుగు ప్రసరించు వస్తు సముదాయమునకు సంబంధము ఉన్నదా? సంబంధము లేదు కదా।

అట్లాగే, ఈ పురుషుని సహజరూపమగు ఆత్మజ్యోతిత్వమునకు ⟶ ఈ జన్మ–కర్మ–జాగ్రత్–స్వప్న – దృశ్య సంపద – పునర్జన్మ – వాటి వాటి హేతువులు – మొదలైన వస్తు సముదాయమునకు **సంబంధమే లేదు.**

**సూరుడు - కిరణముల దృష్టాంతము:** సూర్యకిరణములు - ఆ కిరణములు ప్రసరిస్తున్న వస్తువులచే బంధము, సంబంధము, అనుబంధము కలిగి ఉంటాయా? లేదుకదా! అట్లాగే **ఆత్మజ్యోతి** - తేజోకిరణములు ప్రసరించే జాగ్రత్, స్వప్న, సుషుప్తి, ఇహ జన్మ-పరజన్మలచే - ఏమాత్రము బంధింపబడజాలవు. సంబంధితములై ఉండజాలవు.

అట్లాగే సూర్య తేజస్సులోనే వస్తువుల ఆకారములు కనిపిస్తున్నట్లుగా,... ఆత్మజ్యోతి (వెలుగు)లోనే జాగ్రత్ - స్వప్న-సుషుప్తి-జన్మ-పునర్జన్మలు.. అగుపించటము, ఉనికి కలిగి ఉన్నట్లవటము జరుగుతోంది. **ఆత్మకు వేరుగా దేనికీ స్వతఃసిద్ధమైన ఉనికి లేదు.**

**ఇక్కడి ఒక మహత్తర చమత్కారము - వినండి.**

**ఈ జీవుడు ఎట్టివాడు?**... అని ప్రశ్నిస్తే, ఆత్మగా → **పరమపురుషుడే।**

- దేహమంతా, **లోకమంతా సుప్రసిద్ధమైన స్వరూపము కలిగియున్నవాడు.**
- జన్మ - మృత్యువులకు, మార్పు- చేర్పులకు **సంబంధించనట్టి కేవల సాక్షియగు అమృతానంద స్వరూపుడు.**
- **స్వయంజ్యోతి స్వరూపుడు. తేజోస్వరూపుడు.**
- **ఏక స్వరూపుడు.** అనేకముగా కనిపిస్తూ సర్వదా ఏకము, **అఖండము** అయిఉన్నవాడు.
- కొన్ని మధుర పదార్థములను ఆస్వాదించువానివలె జాగ్రత్ - స్వప్న - సుషుప్తులను, వాటివాటి అంతర్గత విశేషాలను, జన్మ-జన్మాంతరములను పొంది... **ఆస్వాదించుచున్నట్టివాడు.**
- **నిత్యనిర్మల స్వరూపుడు. కేవలాత్మ స్వరూపుడు. పరమ పురుషుడు.**



**కాపలాదారు:** అట్టి ఈ జీవుడు (లేక-పురుషుడు)... తన యొక్క స్వయంశక్తి రూపమగు ప్రాణవాయువులచే క్రీడావినోదంగా- "మాంసమయము, బొమికలు మజ్జలతో కూడినది, చర్మముతో కప్పబడినది, ఇంద్రియార్థములతో నిండియుండినది- అగు **'భౌతిక శరీరము'**.. అనే పిచ్చుకల గూడులో ప్రవేశిస్తున్నాడు. ప్రవేశించి - అట్టి అనేక పుల్లలతో నిర్మించబడిన (అనేక అవయవములతో నిర్మితమైన) ఈ భౌతికదేహమునకు **'కాపలాదారు'**గా అగుచున్నాడు. ఈ శరీరమును కాపాడుకొనుచు, ఇద్దాని బాహ్యమున శబ్ద-స్పర్శ -రూప-రస- గంధములలో సంచారములు చేస్తున్నాడు. సుఖ-దుఃఖములను తానే నిర్వచించుకొని...,

→ దుఃఖములు తొలగేది ఎట్లా?

→ సుఖములు లభించేది ఎట్లా?

అని అనేక రంధులలో పడి మ్రగ్గుచున్నాడు.

**"- ఎక్కడ భోగ్యపదార్థములు? ఏచోట?"**.. అని గొణుగుకొనుచు వెతకుచున్నాడు. ఎక్కడ ఏదైనా భోగ్య పదార్థము కనిపిస్తే, అక్కడ ఆగి... వెంపరలాడుచున్నాడు. అనేక మనో (యోచనా) తరంగములను వరుసక్రమంగా కల్పించుకొని, అవిశ్రాంతుడై **"నాకు శాంతి కావాలి. ఎట్లా?"**.. అని కనపడినవారినందరినీ ప్రశ్నిస్తున్నాడు.

ఓ జనక మహారాజా!

అంతేకాదు. స్వయం కల్పితమే అయినట్టి, స్వప్నసమానమైనట్టి జాగ్రత్ రచనలో ప్రవేశించి "దేవతా - మానవ - జంతు" ఇత్యాది అనేక ఉచ్చ-నీచ ఉపాధులను పొందుచూ, అనేక భావ తరంగముల మధ్య చిక్కి, వాటిచే కొట్టబడుచు **శిథిలత్వము** పొందుచున్నాడు. ఉపాధుల పరంపరలలో సంచారములు చేస్తూ అనేక వాసనలను చుట్టచుట్టుకుంటున్నాడు.

- స్త్రీలతో సరసాలాడువాడుగాను, (స్త్రీ-పురుషుల పరస్పర సరస-విరసములతోను),
- స్నేహితులతో నవ్వులాటలు ఆడుకొనువాడుగాను,
- కొన్ని దృశ్య సంఘటనలను చూచి భయకంపితుడు అగుచున్నవాడుగాను,

అనేక అనుభవ పరంపరలను - (స్వప్న సమానమైన ఉపాధి పరంపరలతో) పొందుచున్నాడు.

**ఆరామస్య పశ్యంతి, న తం పశ్యతి కశ్చనేతి। (6-3-14)।**

**"ఒక బాలుడు ఇంటి నుండి బయలుదేరి క్రీడాస్థలి** (Play Ground)**కి వెళ్లి, కాసేపు ఆటలు ఆడుకొని ఇంటికి చేరుతాడు కదా! అట్లాగే, "ఈ జాగ్రత్ - స్వప్నములు" అనేవి బాలుడు వెళ్ళి, ఆడుకొని, తిరిగివచ్చు క్రీడాస్థలములు"** - అని కూడా చెప్పబడుతోంది.

ఈ పురుషుడు ఆత్మయొక్క 'క్రీడా సామాగ్రి' వంటి జాగ్రత్-స్వప్నములను చూస్తున్నాడు. అందులోని విషయాలు-విశేషాలతో తన్మయుడగుచున్నాడు. ఆత్మకు క్రీడా స్థలములగు జాగ్రత్-స్వప్నములకు సంబంధించిన విషయాలకు పరిమితుడగుచూ ఉపాధి పరంపరలు గడుపుచున్నాడు. అంతేగాని, జాగ్రత్-స్వప్నములకు ఆధారమై, సమస్తమునకు అప్రమేయమై, జాగ్రత్ స్వప్నములు తనయొక్క భావనా రూపముగా కలిగి ఉన్నట్టి-**నిత్య నిర్మలమగు (స్వస్వరూపమగు) 'ఆత్మ'ను** గమనించటము లేదే! ఎంత ఆశ్చర్యం! ఆత్మను స్వకీయ దేహమునందే గుర్తించటం వాస్తవానికి **సులభమే** అయినప్పటికీ, అందుకు ఈతడు **ప్రయత్నశీలుడు** అవటము లేదు.

స్వప్నదశలో ఉన్నవాడు ఆదమరచి (జాగ్రత్‌ను పూర్తిగా ఏమరచి) స్వప్నములో పూర్తిగా మునిగినవాడై ఉంటున్నాడు. భౌతికమగు శరీరము - ఇంద్రియ ఉపకరణ సంబంధమైన విషయముల నుండి బయల్వెడలి ⟶ 'ఊహ'వంటి స్వప్నములో పచార్లు చేస్తూ అనేక - స్వప్నానుభవములందు మునిగి తేలుచున్నాడు. "అట్లా స్వప్నములో లోతుగా మునిగియున్న వానిని ఒక్కసారిగా హఠాత్తుగా లేపకూడదు, **తం న ఆయతం బోధయేతి - ఇత్యాహుః"**- అని కొందరు అంటూ ఉంటారు. ఎందుకంటే, ఈ జీవుడు జాగ్రత్ నుండి ఒంటరిగా బయలుదేరి స్వప్న క్షేత్రములో స్వీయకల్పనలో రమిస్తూ ఉండగా, అకస్మాత్తుగా నిద్రలేపితే, జాగ్రత్‌కు మరలునప్పుడు ఒక్కసారి దారితప్పినవానివలె క్షోభ చెందగలడని వారి ఉద్దేశ్యము. **ఇంద్రియ గోళములను పట్టుకోలేక బాధపొందుతాడని చెప్పబడుతోంది.**

అకస్మాత్తుగా నిద్రలేపితే ఇంద్రియ గోళముల వేసట వలన గ్రుడ్డితనము, చెవిటితనము వచ్చు ప్రమాదముకూడా కలదని వైద్యభాష!

ఓ జనక మహారాజా!

***జాగ్రత్ - స్వప్న స్థితి-గతుల గురించి ఇంకా మరికొంత చెప్పుకుంటున్నాము - వినండి.***

- ***"జాగ్రత్‌యే పుట్టినిల్లు. అక్కడి నుండి స్వప్నము కల్పించుకొని, ఆస్వాదించి తిరిగి జాగ్రత్‌కు ఈ పురుషుడు తిరిగి వస్తూ ఉంటాడు. అట్లాగే జాగ్రత్ నుండి సుషుప్తిలో ప్రవేశించి, తిరిగి మరలి వస్తూ ఉంటాడు. అందుచేత జాగ్రత్ స్వగృహము వంటిది. స్వస్థానము. స్వప్న - సుషుప్తులు మిత్రుల గృహములకు(ఇళ్ళకు) వెళ్లి రావటము వంటిది"*** అని కొందరు అంటూ ఉంటారు. (జాగ్రత్ తెలివితో)
- ***"ఈ పురుషుడు మెళుకువలో ఉన్నప్పుడు చూచియున్న, ఆలోచిస్తూ ఉన్న, భావిస్తూ ఉన్న, వేదన చెందుతూ ఉన్న విషయములనే నిద్రపోయినప్పుడు గుర్తుచేసుకొని, వాటిని హృదయంలో ఊహాదృశ్యములుగా కల్పించుకొని, జాగ్రత్‌ను ఏమరచి 'ఇదియే సత్యము' అను రీతిగా జాగ్రత్ వలెనే కలలో (స్వప్నములో) అనుభవముగా పొందుచున్నాడు. అనగా 'జాగ్రత్'లో చూచినవే 'స్వప్నము'లో పొందటము జరుగుతోంది. కాబట్టి జాగ్రత్-స్వప్నములు ఒక్క తీరైనవే".*** అని మరికొందరు సిద్ధాంతీకరించుచున్నారు.
- **"అది ఎట్లా? ఈ రోజు జాగ్రత్ రేపు నిదురలేచిన తరువాత కొనసాగుతోంది. ఈ రోజు కల రేపు రాత్రి కొనసాగక, వేరైన మరొక స్వప్నము జనితము అవుతోందికదా! అందుకని స్వప్నము జాగ్రత్ వ్యవహారములో ఊహచే నిర్మితమైన ఒకానొక అంతర్విభాగము. జాగ్రత్ అనగా - తదితరులతో పాల్గొనటము వంటిది. స్వప్నము అనగా - ఒంటరిగా కూర్చుని ఊహలో జీవించటము. ఆ రెండూ ఒక్క తీరైనవికావు"**... అని మరికొందరు అంటున్నారు.
- దానికి మరికొందరు ఇట్లా అంటున్నారు. **"క్రితం ఉపాధి జాగ్రత్ వర్తమాన ఉపాధితో కొనసాటం లేదుకదా! కనుక జాగ్రత్ స్వప్నము వంటిదే।"** అని విశ్లేషిస్తున్నారు.
- **"జాగ్రత్‌లో ఈ పురుషుడు ఇంద్రియ విషయములకు సంబంధితుడు"** అగుచున్నాడు.
- **స్వప్నములోనో?** - బాహ్య ఇంద్రియ - విషయములపై ఆధారపడక స్వయముగా విషయములను తనయందు కల్పన చేసుకొని ఆస్వాదిస్తున్నాడు. కనుక స్వప్నములో ఉన్నప్పుడు ఈతడు "స్వయంజ్యోతి స్వరూపుడు" **అని సిద్ధాంతీకరిస్తున్నారు.**

ఇదంతా ఇట్లా ఉండగా, స్వప్నమును దృష్టాంతముగా తీసుకొని మోక్షశాస్త్రము ఈ పురుషుని (జీవుని) స్వయంజ్యోతి స్వరూపునిగా నిరూపిస్తూ వస్తోంది.

# మోక్షము గురించియే।

**జనక మహారాజు :** హే మహాత్మా! మహాశయా! యాజ్ఞవల్క్యా! మీరు నా వద్ద నుండి నాపై దయతో వేయి (1000) గోవులను దక్షిణగా స్వీకరించండి. నాకు మోక్ష మార్గమును బోధించమని ప్రార్థిస్తున్నాను. జాగ్రత్ – స్వప్నములకు ఊర్ధ్వముగా (ఆవల) గల **ఆత్మ** గురించిచెప్పండి. నేను అనుభవిస్తున్న బంధము ఎట్లా తొలగి, మోక్షము సిద్ధిస్తుందో, అద్దానినే వివరించమని అభ్యర్థిస్తున్నాను.

**యాజ్ఞవల్క్యుడు :** ఈ జీవుడు సర్వదా స్వయంజ్యోతి స్వరూప–ఆత్మపురుషుడేనయ్యా!

ఈ జీవుడు స్వప్నము నుండి విషయములను దాటవేసినట్టి సుషుప్తి స్థానము చేరుచున్నాడు. అట్టి సుషుప్తియందు మునిగి, రమించుచున్నాడు. సుషుప్తిలో పుణ్య–పాప ద్వంద్వములలో ప్రవేశించక, (సుఖ–దుఃఖములను) సాక్షిగా చూస్తూ, వాటి యందు తన్మయుడు కాక, విడిగా **కేవల దృక్** అయి, **నిర్విషయుడై** ఉంటున్నాడు.

ఆ విధంగా కొంత సమయము గడిచిన తరువాత ఈ పురుషుడు తాను సుషుప్తిలో ప్రవేశించిన మార్గముననే వెనుకకు మరలి, తిరిగి స్వప్నస్థానము చేరుచున్నాడు. న్యాయము ప్రకారము (Procedurally in usual course) స్వప్నములో పుణ్య–పాప ద్వంద్వములను (సుఖ–దుఃఖములను) పొందుచున్నాడు.

పుణ్య–పాప ఫలములను చూచుచున్నాడు. అటు తరువాత జాగ్రత్‌కు వచ్చి, ఇంద్రియములను ఉపయోగిస్తూ కర్మలను నిర్వర్తిస్తూ, పుణ్య–పాపఫలములను (The duality) చూస్తూ ఉన్నాడు.

ఓ జనక మహారాజా! వాస్తవానికి ఈ పురుషుడు (జీవుడు) అసంగుడు. దేనితోనూ చేరిక, కూడిక లేనివాడు. పుణ్య–పాపకర్మలకు కర్తకాడు. ఫలభోక్త కాడు. సుషుప్తి – స్వప్న – జాగ్రత్‌లలోనివాడు కాదు. సదా **అప్రమేయుడు** (Unbound and Unconcerned). దేనితోనూ సంబంధము లేనివాడు. ఆ మూడు ఆయన ప్రవేశించుచూ ఆస్వాదిస్తున్న ఆయనకు చెందిన స్వస్థలములు. దేనిచేతనూ ఆత్మపురుషుడు బద్ధుడు కాడు. నిత్య ముక్తుడు. ఆ మూడు ఆయనకు చెందిన ఆటస్థలములేగాని, ఏ ఒక్క దానిలోకో పోయి చిక్కుకొనుచున్నవాడు కాడు. ఎట్లా అంటారా? వినండి!

"స్వప్నములో ఈ పురుషుడు పుణ్య–పాపకర్మలు చేస్తున్నాడు".. అని అనతలచుకొంటే, అప్పుడు ఆతడు స్వప్నములో నిర్వర్తించిన పాప–పుణ్యకర్మలు కర్మఫలములు జాగ్రత్‌లోకి వెంటనంటి రావాలి. మరి, అట్లా వస్తున్నాయా? లేదే। నిద్రలేచిన తరువాత న్యాయమైన రీతిగా (As is sequencial) స్వప్నమును త్యజించి, ఇక ఆపై జాగ్రత్‌ను ఆస్వాదిస్తున్నాడు కదా! ఎందుకంటే స్వప్నములో నిర్వర్తించిన కర్మలను గుర్తుచేసుకొని జాగ్రత్తులో **"నేను కలలో అట్లా అని ఆతనిని బాధించాను। కనుక పాపిని।"**... అని తలుస్తున్నాడా? లేదు.. మరొకడు తన స్నేహితునితో **"అయ్యా! నేను స్వప్నములో ఈ పాపము చేశాను। కనుక పాపిని కదా।"**.. అని చెప్పితే ఆ స్నేహితుడు ఏమంటాడు? **"కలలో ఏదో కనబడి ఉంటుందిలే। వదిలేయి. ఇప్పుడు ఈ ప్రస్తుత విషయానికి వచ్చి మాట్లాడు. కల కలే కదా!"**.. అని అంటాడు. అంతేగాని నిందించడు, గేలిచేయడు. ఎందుచేత? **నతు సత్యమిహ అణ్వపి।** కలలో జరిగిన దానిలో అంతా కల్పనయే గాని అణువంత సత్యము లేదని ఆ స్నేహితుడు ఉద్దేశ్యిస్తున్నాడు. కాబట్టి..., స్వప్నములో జరిగిన దానికి ఆత్మకు ఎలాంటి కర్తృత్వము లేదు. మరి స్వప్నంలో జరిగిన పాప –పుణ్య కార్యముల మాట ఏమిటి? అవి జరిగినట్లు స్వప్నసమయంలో కానవచ్చుచున్నాయే గాని, స్వప్నములో ఏదీ సత్యమై ఉండలేదు.

– కళ్ళుమూసుకొని ఊహలో ఒక పులిని చారలు, గోళ్ళతో సహా చూస్తే..., వాస్తవానికి పులి ఎదురుగా ఉన్నట్లా? లేదు.

శ్రుతులు కూడా **"తస్మాత్ స్వప్నే కుర్వన్ 'ఇవ' ఉపలభ్యతే।**

కర్తృత్వము ఉన్నట్లుగా కానవస్తోంది. **న తు క్రియ అస్థి పరమార్థ తః।**

వాస్తవానికి స్వప్నములో ఏ క్రియ కూడా నిర్వర్తింపబడటము లేదు" ⟶ అని సిద్ధాంతీకరిస్తున్నారు.

**ఉతేవ స్త్రీభిః సహ మోదమానో జక్షత్। ఉతేవ అపి భయాని పశ్యన్। (6-3-13)**

"స్త్రీతో క్రీడించినట్లుగా కల వచ్చింది. నేను అక్కడికి వెళ్ళానుట. వాళ్లు నాతో ఇట్లా అన్నారట".. ఈ విధంగా ఒకడు తన కల గురించి

'వలె', 'గా', 'ట'.. ప్రయోగాలతో చెప్పుతాడు. అనగా, "కలలో జరిగినది వాస్తవానికి జరగనట్లే".. అని చెప్పటమేగా? **స్వప్నము మిథ్యయే! కనుక ఆత్మకు కర్తృత్వము లేదు!**

***ఇక జాగ్రత్తులో జరిగే వాటికి వస్తే...,***

రూపము గల పదార్థములతో రూపము గల దేహ-ఇంద్రియములకు కలయి కలిగి, జాగ్రత్‌లో ఏక-అనేక అనుభవములుగా సంతరించుకుంటోంది. కానీ ఆత్మకు రూపము ఉన్నదా? లేదు. ఎందుకంటే కదిలే **'దేహము'**నకు రూపమున్నదిగాని, కదిలించే దేహికి రూపమెక్కడిది? **రూపము లేనివానిచే (నిరాకారముచే) రూపము కలిగియున్న క్రియలకు (సాకారమునకు) హేతుత్వము ఎట్లా ఆపాదిస్తాము**?

ఆత్మకు (లేక, ఆత్మాకాశమునకు) **రూపము** లేదు. కనుక **సంగము** లేదు. జాగ్రత్‌లో కూడా ఆత్మకు ఏవిధంగానూ కర్తృత్వము సంభవించదు. దేహ-ఇంద్రియములలో **జాగ్రత్‌లో జరిగేదానికి,** ఊహాకల్పితమైన **స్వప్నములో జరిగేదానికి**... ఈ రెండు కూడా ఆత్మకు కర్తృత్వ - భోక్తృత్వ సంబంధములు ఆపాదించటము **కుదరని పని.**

❖❖❖

ఓ జనక మహారాజా! ఈ విధంగా ఈ పురుషుడు (జీవుడు) స్వప్నంలో లాగానే జాగరిత స్థానములో బంధు- మిత్రులు... మొదలైనవారితో అనురాగము, కోపము, దుఃఖము, ఆదుర్దా మొదలైనవన్నీ పొంది, క్రీడించి, అనుభవించి, తిరిగి ఎప్పుడో క్రమంగానో, అకస్మాత్తుగానో - సుషుప్తిలో ప్రవేశిస్తున్నాడు. అంతేగాని జాగ్రత్తులో బద్ధుడై ఉండటము లేదు.

ఆత్మకు జాగ్రత్‌గాని, స్వప్నముగాని, సుషుప్తిగాని బంధము కావు - అని తేలుచున్నది కదా।

ఒక తిమింగలము ఈ ఒడ్డు నుండి ఆ ఒడ్డుకు, ఆ ఒడ్డు నుండి ఈ ఒడ్డుకు యధేచ్ఛగా (As it likes) తిరుగుచున్నది. **"ఈ ఒడ్డు ఆ తిమింగలమునకు బంధము"**.. అని అంటామా? లేక **'ఆ ఒడ్డు బంధము'** అంటామా? అనము. ఒకవైపు ఒడ్డు (One side Bank) తిమింగలము అక్కడ ఉండకుండా, తిరిగి ఇటు - అటు యధేచ్ఛగా తిరుగుతోందని మాత్రమే అంటాము.

అట్లాగే ఈ పురుషుడు జాగ్రత్ - స్వప్నములనే ఈవలి - ఆవలి ఒడ్డుల మధ్య యధేచ్ఛగా సంచరిస్తున్నాడు. **"ఆతనికి జాగ్రత్ బంధము - (లేక) స్వప్నము బంధము"**.. అనునని ఎట్లా కుదురుతుంది? అనలేము. మహా అయితే **"ఈ పురుషుడు స్వప్నస్థానమును, జాగరిత స్థానమును అనుసరించి తిరుగాడుచున్నాడు"**... అని మాత్రమే అని ఊరుకోగలం.

**స్వయం ప్రతిపత్తి (Independance) అగు ఆత్మ - దేహ ఇంద్రియముల కంటే, జాగ్రత్ స్వప్న సుషుప్తుల కంటే ప్రత్యేకమై, కామ్య కర్మలతో సంబంధము లేనిదై, సర్వదా విశుద్ధమై, సంసార ధర్మములగు సుఖ-దుఃఖములకు సంబంధించనిదై, దేహధర్మములగు చావు-పుట్టుకలచే తాకజాలబడనిదై ఉన్నది. ప్రతి జీవుడు సహజంగా ఆత్మస్వరూపుడే। తక్కినదంతా స్వస్వరూపము సమక్షంలో సందర్భ-కల్పితము.**

## సుషుప్త స్థానము

ఆకాశములో డేగ (గరుడపక్షి) రెండు రెక్కలతో అటూ - ఇటూ తిరిగి తిరిగి రెక్కలు విదిలించుచూ ఎగిరి, **"ఇక చాలు! విశ్రాంతి కావాలి"**.. అని తలచి, గూడులో ప్రవేశించి, రెక్కలు ముడుచుకొని విశ్రాంతి తీసుకోనారంభిస్తుంది కదా! అట్లాగే జాగ్రత్ - స్వప్నములలో సంచారాలు చేసిన ఈ పురుషుడు **"నా గూడు అగు సుషుప్తి యందు ప్రవేశించి విశ్రాంతి తీసుకొంటానుగాక।"**... అని తలచి సుషుప్తిలో ప్రవేశిస్తున్నాడు.

**తత్ర న కంచన కామం కామయతి। న కంచన స్వప్నం పశ్యతి।**

అట్టి సుషుప్తిలో జాగ్రత్తులో వలె - **"అది కావాలి, ఇది పొందాలి"**.. అను కోరిక కోరుకోడు. **"ఊహించి - కల్పించి- నాలో నేనే దృశ్యములో చరించాలి"**.. అనే స్వప్నము పొందాలనే కోరిక గాని, స్వప్న దృశ్యముగాని ఉండవు. దేహేంద్రియములతో గాని, తద్వారా దృశ్యము యొక్క కల్పనా దృశ్య - అనుభవంగాని ఇప్పుడిక ఆతనికి ఉండదు. ఆ శక్తి, ఆ వివరాలు - అవన్నీ రహితం అయ్యాయా? లేదు! రహితం కాలేదు. **'అప్రదర్శనము'** అనే "అంతరంగములోని పెట్టి" (Inner Box)లో దాచబడినాయి.

# అవిద్య

ఏ కారణంగా ఆత్మకు అనాత్మ బుద్ధి (**'నేను'** – అను నిర్మల వస్తువుకు – **'నాది'** అనునది) – కలుగుచుండటం జరుగుతోందో, అద్దానినే 'అవిద్య' – అని పిలుస్తున్నారు.

### దేహము 'హితా' నాడి

**తావై అస్య శిరౌ పాణ్యాది లక్షణస్య పురుషస్య ఏతా 'హితా' నామ నాడ్యో।** తల – కాళ్ళు – చేతులు గల దేహముతో తదాత్మ్యము చెందుతున్న ఈ పురుషుడు **'హితా (హితము చేయునవి)'** అను నాడులు కలిగి ఉంటున్నాడు. **యథా కేశః సహస్రధా।** అవి వెంట్రుకలో వేయి (1/1000) వంతు ఎంత సూక్ష్మమో, అంతటి సూక్ష్మముగా ఉండి, ఈ దేహమంతటా విస్తరించినవై ఉంటున్నాయి. ఈ నాడులలో వాత–పిత్త–శ్లేష్మములు వేరువేరైన పాళ్ళలో కలిసి ఉండటము చేత... తెలుపు – నీలము – ఆకుపచ్చ– పసుపుపచ్చ –ఎరుపు రంగులలో మెరుస్తూ ఉంటున్నాయి. ఈ సూక్ష్మ నాడులలో మనో–బుద్ధి–పంచకర్మేంద్రియ – పంచజ్ఞానేంద్రియ–పంచ ప్రాణ చలనముల అంశలతో కూడిన **లింగ శరీరము (సూక్ష్మ శరీరము)** ఈ (హితానాడులయందు) స్థానము పొంది ఉంటోంది. సుఖ – దుఃఖ అనుభవములకు, భావములకు సంబంధించిన దేహదేహాంతర వాసనలన్నీ ఈ లింగ శరీరమును ఆశ్రయించుకొని ఉంటున్నాయి. అట్టి లింగ శరీరము సహజముగా సూక్ష్మము అవటం చేత స్ఫటిక మణివలె స్వచ్ఛముగా ప్రకాశిస్తూ ఉంటోంది. (సంస్కారాలు ఇద్దానిని ఆశ్రయించి ఉంటున్నాయి). ఉపాధులతో సంయోగమునకు వశమై ఉండటము చేత ఈ లింగ శరీరము ధర్మ–అధర్మ సంబంధమైన వేరువేరు వృత్తుల సంయోగముచే ఆపాదితమై ఉంటోంది. లింగశరీరమును జన్మ–జన్మలుగా ఆశ్రయించి ఉన్నాయి. అనేక పుణ్య–పాప వృత్తులే జాగ్రత్ – స్వప్న అనుభవములను, అవగాహనలను నడిపిస్తున్నవగుచున్నాయి. చిత్త చాంచల్యమంతా లింగ శరీరమును (నిర్మల బుద్ధిని) ఆవరించినదై ఉన్నది. ఆత్మ సర్వదా లింగ శరీరమునకు **పరమై** (వేరై) **ఆవలయే** ఉన్నది.

### స్వప్నానుభూతులు

లింగ శరీరము (లేక శుద్ధ బుద్ధి స్వరూపము) నుండి స్వప్నానుభూతులన్నీ – జలంలో తరంగాలవలె, బంగారమునకు పసుపుపచ్చని వన్నెల వలె, జ్యోతి నుండి కాంతి పుంజముల సమూహము వలె **బయల్వెడలుచున్నాయి.** అప్పుడీ పురుషుడు...,

- ఎవరో తనను కొట్టబోవుచున్న వానివలె ఎటో (తన స్వప్నసీమలో తానే) పరుగులు తీస్తున్నాడు.
- పిచ్చిపట్టిన ఏనుగు వెంటబడుచున్నట్లు దర్శించి, అడవిలో ఏ మూల నుండియో – ఏ మూలకో పరుగులెత్తుతున్నట్లుగా (స్వప్నంలో) అనుభవం పొందుచున్నాడు.
- గోతిలో పడుచున్నట్లు అనుభూతి పొందుచూ, **"అయ్యబాబోయ్"** అని కేకలు వేస్తున్నాడు.

జాగ్రత్‌తో కనబడే ఆయా విశేషాల వంటివే కొన్ని కొన్ని స్వప్నంలో కనిపిస్తూ, జాగ్రత్‌లో అనిపించినట్లే – స్వప్న సమయంలో అప్పటికి ఆయా విశేషాలు **"నిజమే కదా!"** అని అనిపించుచూ ఉన్నాయి.

**జనక మహారాజు :** మీరుచెప్పే విశేషములన్నీ వింటూ ఉంటే..., "స్వప్న దృశ్యమునకు కర్త–కర్మ–క్రియ–**స్వప్న ద్రష్టయే।** జాగ్రత్ దృశ్యమునకు కర్త–కర్మ–క్రియ–**జాగ్రత్ ద్రష్టయే।** అంతేగాని మరింకెవ్వరో కాదు..." అని మీరు సిద్ధాంతీకరిస్తున్నట్లుగా నాకనిపిస్తోంది.

**యాజ్ఞవల్క్యుడు** : అవును ఇందులో సందేహించవలసినదియే లేదు.

> **అథ యత్ర దేవ ఇవ, రాజ ఇవ...**
> **"అహమేవ ఇదగ్ం సర్వో అస్మి!"–**
> **– ఇతి మన్యతే సో అస్య పరమో లోకః॥ (6–3–20)।**

ఒక రాజు తన రాజ్యంలో సంచరిస్తూ "ఈ రాజ్యమంతా నాదే కదా!".. అని అనుకుంటూ ఉంటాడు చూచారా? ఒక దేవత తాను దేవతగా ఉన్నచోటును "ఇదంతా నేనే".. అని తలుస్తారు కదా! (చంద్రలోకంలో చంద్రదేవుడు, సూర్యదేవుడు సూర్యలోకంలో,

యమభగవానుడు యమలోకంలో తలచు తీరుగా।).

ఆ విధంగా ఎవ్వడైతే **"ఈ సర్వము నేనే"** అని ఎరుగుచున్నారో,.. ఆతనికి అదియే **'సర్వోత్కృష్ట ధామము'** అగుచున్నది. అజ్ఞానము నిశ్శేషముగా క్షీణించగా,.. ఎప్పుడైతే 'సర్వాత్మభావన'కు చెందిన జ్ఞానము ఉదయిస్తుందో, అప్పుడిక **"స్వప్నమునందు అంతటా చిన్మాత్రుడనగు నేనే వెలయుచున్నాను"** అనునది, **"జాగ్రత్ స్వకీయ కల్పనయే కనుక.. జాగ్రత్ అంతా స్వకీయ చిన్మాత్ర స్వరూపమే"..** అనునది **స్వాభావ సిద్ధమగు అనుభవము**గా అగుచున్నది. అది **"ఆత్మయందు తానే ఉండుట"**.. అను **పరంధామము!**

**సర్వాత్మభావనయే** నిశ్చయముగా ఆత్మయొక్క **సహజ (నిజ) రూపము.** అది ఆత్మకు **'పరస్వరూపము'** అని చెప్పబడుతోంది. సర్వకామములు అధిగమించినట్టి, ధర్మ–అధర్మ వివర్జితమైనట్టి, భయరహితమైనట్టి రూపము.

ఒక పురుషుడు స్త్రీని ప్రేమాస్పదముగా ఆలింగనము చేసుకొన్నప్పుడు ఏకరూపము పొందిన తీరుగా, ఆత్మజ్ఞానముచే, – అట్టి ద్రష్టచే దృశ్యమంతా **ఏకరూపానుభవము** పొందబడుచున్నది.

ఏకమే ఆత్మరూపము. అనేకము – అనాత్మ. అదంతా **'ఆత్మకామము'** = (ఆత్మయే కామముగా కలిగి ఉన్నట్టి స్థితి). ఆత్మ–స్వతఃగా అన్యకామరహిత ప్రేమాస్పద స్వరూపము. అఖండానుభవ స్థానము!

**సుషుప్తిలో స్వభావసిద్ధంగానే ప్రతిజీవుడు అట్టి ఏకస్థితి పొందుచున్నాడు.**

## సుషుప్తస్థితి – అఖండజ్యోతి స్వరూపమే।

**ఆనంద ఏకాత్మకమగు సుషుప్తి యందు ఉన్న పురుషునికి...**

→ జాగ్రత్‌లోని తండ్రి – తండ్రి కాదు.

→ జాగ్రత్‌లోని తల్లి – తల్లి కాదు.

→ జాగ్రత్ పుత్రుడు – పుత్రుడు కాదు.

→ జాగ్రత్ లోకములు లేవు. లోక పాలకులు లేరు.

→ పాపి అనుకున్నవాడు ఇప్పుడు (సుషుప్త స్థితిలో) ఆ అనుభూతియందుండదు. భ్రూణహత్య చేసినవాడు హత్య చేసినవాడు కాదు.

→ కర్మాంగభూతులైన దేవతలు లేరు.

– జాగ్రత్‌లో చణ్డాలుడు సుషుప్తిలో చణ్డాలుడు కాదు.

– పౌల్కసుడు (శూద్రునికి క్షత్రియ స్త్రీ యందు పుట్టినవాడు) పౌల్కసుడు కాదు.

– సన్న్యాసి సన్న్యాసికాదు. తాపసి తాపసికాదు. శ్రమణుడు (పరివ్రాజకుడు) శ్రమణుడు కాదు.

– (గాఢనిద్రాస్థితిలో) కర్మ ప్రతిపాదకములగు వేదములు – వేద విధులు మొదలైనవి కూడా లేవు. యజ్ఞ–యాగ–క్రతు విధులు – విధానములు లేవు.

– కర్మలతో సంబంధమే లేదు కనుక బ్రహ్మచారి–గృహస్థ–వానప్రస్థ–సన్న్యాసాశ్రమ ధర్మ విధులు, నియమములు కూడా లేవు. సుషుప్తి యందు ఆత్మకు శాస్త్ర విహిత – అశాస్త్ర విహిత కర్మలనబడేవేవీ లేవు. పుణ్యకర్మలు – పాపకర్మలు లేవు.

**జనన చక్రవర్తి :** మరి గాఢ నిద్రలో ఉన్న పురుషుని ఆత్మస్వరూపము ఎట్టిది?

**యాజ్ఞవల్క్యుడు :** సుషుప్తియందు ఈ పురుషుడు సమస్తమైన లౌకిక కోరికలు, అభిప్రాయములు, భావములు, నియమములు – మొదలైనవన్నీ నిర్వర్తించనివాడై, గౌరవించనివాడై ఉంటాడు. ***కేవలం స్వయం జ్యోతి స్వరూపుడై ప్రకాశిస్తూ ఉంటాడు. స్వస్వరూపము నందు స్వస్వరూపుడై ఉంటాడు.***

అగ్నికి వేడివలె, సూర్యునికి కాంతివలె, ఆత్మకు **ఆత్మ యొక్క ఆత్మత్వము స్వయముగా ప్రకాశించుచున్నది.** అప్పుడు ఆతడు చూడటము లేదు. వినటము లేదు. ఆఘ్రూనించటము లేదు. మాట్లాడటము లేదు. స్పర్శ పొందటము లేదు. రుచి చూడటము లేదు. ఆలోచించటము లేదు. విచక్షించటము లేదు. అనగా గాఢనిద్రలో ఉన్నప్పుడు అవన్నీ నశించినాయా? లేక,... ఈ పురుషుడు గాఢ నిద్రా సమయములో అవన్నీ కలిగి ఉండి, కూడా ఉపయోగించకుండా (కానీ) కలిగియే ఉన్నాడా? కలిగియే ఉండకపోతే తిరిగి జాగ్రత్‌కు రాగానే ఎట్లా తిరిగి వస్తున్నాయి? కాబట్టి జాగ్రత్ స్వప్న సంస్కారాలు సుషుప్తస్థితిలో **"దాగిఉన్నవి"** అగుచున్నాయేగాని, **'లేనివి'**గా అవటంలేదు.

**యద్వై సుషుప్తే తత్ న పశ్యతి - పశ్యన్ వై, తత్ తత్ర పశ్యన్ ఏవ - న పశ్యతి।** "సుషిప్తి సమయములో ఈ పురుషుడు చూచుట లేదు".. అని అనుకొన్నాము కదా! ఇది ఇట్లా గమనించాలి.

***"- చూచుచున్నవాడే, చూడగలవాడే ఇప్పుడు చూచుట లేదు!"*** ... అని అర్థము. అంతేగాని "చూడలేనివాడు కాబట్టి సుషుప్తిలో చూడలేకపోవుచున్నాడు".. అని అర్థము కాదుకదా!

"సుషుప్తి యందు ఈ జీవుడు చూడటము లేదు".. అనునది - "చూడలేకపోవుచున్నాడు".. అని అర్థము చేసుకోకూడదు. ఎందుకంటే

***సుషుప్తి యందు ఆత్మ చూచుచునే ఉన్నది।***

కాబట్టే ఈ పురుషుడు తాను మరొక సందర్భములో తిరిగి జాగ్రత్ దృశ్యములో ప్రవేశించి ఇతఃపూర్వపు జాగ్రత్ దృశ్య దర్శనమును కొనసాగించుచున్నాడు.

ద్రష్ట ఆత్మస్వరూపుడే! ఆత్మ అవినాశి. కాబట్టి ద్రష్ట - దర్శనము - దృశ్యము కూడా అవినాశనములే. మూడూ కూడా - ఆత్మ స్వరూపములు. **ఆత్మ ప్రదర్శితములు.** ఎందుకంటే...,

**న తు తత్ ద్వితీయమ్ అస్తి, తతో అన్యత్ విభక్తం యత్ పశ్యేత్! (6-3-23)।** ఆత్మ అద్వితీయము కదా! కనుక ద్రష్ట ఆత్మకంటే వేరు కాదు. **ఆత్మ నుండి ద్రష్ట, ద్రష్ట ఆత్మ నుండి ఎన్నడూ విడిపడిపోయేదిలేదు. ఆత్మయే ద్రష్ట- దృశ్యముల రూపముగా కూడా కనిపిస్తోంది.**

సుషుప్తియందు ఆత్మ తన యొక్క స్వయంకల్పితమైనట్టి జాగ్రత్ - స్వప్న దర్శనములకు కించిత్ విరామము ఇచ్చుచున్నది. అంతేగాని జాగ్రత్ - స్వప్నములు ఏమాత్రము నశించటం లేదు. జాగ్రత్త స్వప్నములవలన ఆత్మ ఏమాత్రము స్వస్వరూపమునుండి చ్యుతి పొందటమూ లేదు.

# న పశ్యేత।

**ఆత్మ** → (కళ్ళ వలె) చూచుటకు తనకు అన్యమైనదేదీ లేదు. ఆత్మ అనన్యము. కనుక - **"ఆత్మ దేనినీ చూడటము లేదు"**.. అని కూడా చెప్పబడుచున్నది. **"ఆత్మ దేనినీ ఆఘ్రాణించటము లేదు"**.. అని అన్నప్పుడు ఏదైతే వాసన చూడగలిగియే ఉన్నదో,- అట్టి ఆత్మ ఇప్పుడు ఆఘ్రాణించటమునకు విరామము ఇచ్చి, **ఆఘ్రాణించు స్వభావమును తన యొక్క సుషుప్తిలో ఒకమూల అప్రదర్శితము చేసి దాచి ఉంచుకొనుచున్నది.** అనగా సుషుప్తిలో ఆ పురుషుని ఆఘ్రాణించు శక్తికి లోపమేమీ రాలేదు. ఆ పురుషుడు గాఢ నిద్రలో ఉన్నప్పుడు **'వాసన'**కు సంబంధించిన అనుభవమును కల్పించుకోవటము లేదు. అంతవరకే!

**ఆత్మ** → వాసనను చూచుటక ఆత్మకు వేరైన పదార్థమే లేదు. కనుక **"ఆత్మ వాసన చూచుట లేదు"**... అనునది యుక్తియుక్తమే కూడా! ఆఘ్రాణము **"ఆత్మ స్వరూప చమత్కారమే।"** కాబట్టి, ఆత్మ ఆత్మగా ఎన్నటికీ ఉండియే తీరుతుంది. ఆత్మ అనన్యము కాబట్టి 'వాసన చూడబడునది' అనేది ఆత్మకు వేరుగా లేదు. ఆత్మవలెనే నశించదు కూడా! **"ఆత్మ, వాసనచూడటము" - ఈ రెండు అవినాశి, అమృతము అయి ఉన్నాయి.**

సుషుప్తిలో ఆత్మ దేహముతో రుచి చూచుటలేదు. అయితే రుచి చూడు శక్తిని కోల్పోయినదని కాదు. **"రుచి చూడ కలిగియుండి కూడా, ఇప్పుడు రుచి చూడటమును నిర్వర్తించటము లేదు"** అని అర్థము.

అనగా.. రుచి చూడటము + ఆత్మ కూడా **'అవినాశి'**యే। ఎందుకంటే.. ఆత్మ అమృతస్వరూపము, అద్వితీయము కూడా! రుచి చూడటమనునది ఆత్మకు వేరుగా లేదు. కనుక **రుచి చూడటము కూడా అవినాశి, అమృతము అయి ఉన్నది.**



**"సుషుప్తిలో ఈ పురుషుడు మాట్లాడటము లేదు"** అన్నామనుకోండి. అనగా ఈ పురుషుడు మాట్లాడే శక్తిని కోల్పోయినట్లు అవుతుందా? లేదు. **"మాట్లాడకలిగినవాడే. అయితే ఇప్పుడు మాత్రం మాట్లాడటమును నిర్వర్తించటము లేదు"**.. అని అంటాము.

"మాట్లాడటానికి ఉపకరణము (Instrument) అగుచున్న వాక్ ఇంద్రియము – (నోరు)'ను ఆ పురుషుడు **గాఢ నిద్రా సమయములో ఉపయోగించకుండా ఉన్నాడు"**... అని మాత్రమే అర్థము.

- ఈ వాక్‌శక్తి → పురుషునికి సంబంధించినది.
- వాక్‌శక్తిని నోటి ద్వారా ప్రదర్శించుచున్నాడు.
- అట్టి పురుషుడు అమృతము. అవినాశి అగు ఆత్మస్వరూపుడు.
- ఆత్మ అద్వితీయము. అద్దానికి ద్వితీయమైనది లేదు. కనుక 'మాట్లాడటము' అనునది ఆత్మకు వేరుకాదు. ఆత్మరూపమే.
- **'మాట్లాడటము – మాటలు అనునవి** ఆత్మస్వరూపమే కాబట్టి **అవినాశి, అమృతము** కూడా।

❖❖❖

"సుషుప్తి సమయములో ఆత్మ 'వినటము' లేదు" అను రీతిగా కనిపిస్తోంది. అయతే సుషుప్తి సమయములో 'వినటము' అను శక్తి కోల్పోయిందా? లేదు. **"వినగలిగిన ఆత్మయే ఇప్పుడు గాఢ నిద్రా సమయములో 'వినటము'ను నిర్వర్తించటము లేదు"....** అని మాత్రమే అర్థము. అంతేగాని విను శక్తి నశించలేదు.

'వినటము' అను శక్తి తనదై ఉన్నట్టి ఆత్మ 'చెవులు' అను ఉపకరణము ద్వారా వినుచున్నది. గాఢనిద్రలో ఉన్నప్పుడు వినుచుండుట లేదు. ఆత్మ అవినాశి. అద్దానికి రెండవదేదీ లేదు. రెండవదేదీ ఆత్మకు లేనప్పుడు, 'వినటము' అనేది ఆత్మ స్వరూపమేకదా!

- ఆత్మ స్వరూపమే అయినప్పుడు **'వినటము' అనునది కూడా అవినాశియే। అమృత స్వరూపమే।**
- సుషుప్తిలో శబ్దములు విననంత మాత్రముచేత ఆత్మ 'వినటము' అను తన శక్తిని కోల్పోవటము లేదు.

❖❖❖

సుషుప్తి దశలో ఆత్మ ఆలోచించునట్లు కనిపించటము లేదు. అనగా? 'మనస్సు లేదు' అనియా? కానే కాదు.

→ **"ఆలోచించగల ఆత్మ సుషుప్తిలో ఆలోచించటము మానివేసినది. మనస్సును అప్రదర్శిస్తోంది. అనగా ఏమి? ఆలోచించగలిగిన ఆత్మ ఇప్పుడు ఆలోచించకపోవటమును నిర్వర్తించుచున్నది"** అని మాత్రమే అర్థము. అంతేగాని "ఆత్మ ఆలోచించటమును కోల్పోయినది".. అని కాదు. గాఢనిద్రాసమయములో 'ఆలోచించటము' (లేక-మనస్సు)ను కోల్పోయి ఉంటే, తిరిగి జాగ్రత్‌కు రాగానే (నిద్రలేవగానే) మనస్సు తిరిగివచ్చి చేరదు కదా! అనగా **మనస్సు చచ్చిపోలేదు – అనియే ఒప్పుకోవాలి.**

మనస్సు చావదు కూడా! ఎందుకంటే...,

"ఆత్మకు వేరైనదే లేదు!" అనన్యో హి। – అని కదా వేదవాక్కు. ఆత్మ అవినాశి కూడా।

మనస్సు ఆత్మకు వేరుగా లేదు. (కానిచో ఆత్మ→ అద్వితీయము – అనే బిరుదు ఇవ్వలేము కదా)।

- మనస్సు కూడా ఆత్మరూపమే। (ఆత్మ అద్వితీయము కాబట్టి).
- ఆత్మరూపమే అగు మనస్సు అవినాశియే।
- తలంచునట్టి ఆత్మకు వేరుగా తలంపులు లేవు. (thoughts are not different from Thinker, since thoughts are emanating from the interest of thinker).
- మనస్సు ఆత్మరూపమే కాబట్టి సుషుప్తిలో ఉపయోగించబడనంత మాత్రముచేత నశించటము లేదు (అందుకే తిరిగి జాగ్రత్‌లో స్వభావంగా ఉపకరణమగుచున్నది).

**మనస్సు కూడా ఆత్మవలెనే అవినాశి, అమృతరూపము కూడా।**

❖❖❖

గాఢ నిద్రాసమయములో ఒకనిని కొంచము సుతిమెత్తగా స్పృశించామనుకోండి. ఆతనికి ఆ స్పర్శ తెలియదు. అనగా గాఢనిద్రా సమయంలో ఆ పురుషుని యొక్క స్పర్శ శక్తి నశించిందా? లేదు. ఎందుకంటే గట్టిగా చాలాసార్లు తట్టితే, అది ఎరిగి ఆ జీవుడు నిదురులేస్తున్నాడు కదా! అనగా **"ఆత్మ గాఢనిద్రను ఆస్వాదిస్తున్నప్పుడు 'చర్మము' అను ఉపకరణము ద్వారా తన యొక్క 'స్పర్శ' అనే శక్తిని వినియోగించక ఉన్నది"**... అని అనవలసి వస్తుంది.

స్పృశించగలిగియున్నవాడే.. ఇప్పుడు గాఢ నిద్రలో ఉన్నప్పుడు తనయొక్క స్పృశించు శక్తిని **అప్రదర్శితంగా** తన యందు **దాచుకొను చున్నాడు.**

ఆత్మ యొక్క శక్తియే స్పర్శ।

ఆత్మకు వేరైనదేదీ లేదు. ఆత్మ అవినాశి. ఆత్మ అవినాశి అయినప్పుడు.. స్పర్శ కూడా అవినాశియే। ఆత్మ వలె అమృతస్వరూపమే।

ఆత్మకు భిన్నమైనదేదీ లేదు. స్పర్శశక్తి ఆత్మ స్వరూపమే। ఒక రాజుగారి రాజ్యములో రాజుకు చెందనిది ఏదీ ఉండదు కదా। అట్లాగే ఆత్మ సామ్రాజ్యమగు ఈ విశ్వమంతా ఆత్మకు చెందినదే। స్పర్శ ఆత్మదే! ఆత్మవలె అవినాశియే। – **ఆత్మకు భిన్నమైనది ఎక్కడా ఏదీ లేదు కాబట్టి.**

- స్పర్శ స్పృశించువానికంటే వేరుకాదు
- స్పృశించువాడు ఆత్మకంటే వేరుకాదు.
- ఆత్మకు స్పర్శ వేరుగా లేదు.



***'ఇదిగో! ఈయన ఏదీ తెలుసుకోవటమే లేదు. గాఢ నిద్రలో ఉన్నాడు'***.. అని ఒకరిని గురించి మనము అనుకుంటాము.

– ఆతడు తన తెలుసుకొను తెలివిని పోగొట్టుకున్నాడా? తెలివి నశించిందా? లేదు. ప్రాపంచక విషయముల దృష్ట్యా అప్రదర్శితము మాత్రమే। తెలుసుకొను తెలివి ఔత్సాహితకముగా ఉన్నది కాబట్టే, **నిదుర లేపగానే.. అన్నీ తెలుసుకుంటున్నాడు.**

- తెలివి తెలుసుకొనువాని వెంటనంటియే ఉన్నది.
- తెలుసుకొనువాడు ఆత్మస్వరూపుడే.
- ఆత్మకు అన్యమైనది లేదు. కనుక తెలుసుకోవటము ఆత్మకు అనన్యము, అద్వితీయము.
- ఆత్మ అవినాశి. అట్లాగే, **తెలుసుకోవటము కూడా అవినాశియే। అమృతరూపమే।**
- అనగా... విజ్ఞానము (తెలుసుకోవటము) – అవినాశి. అమృతము.
- ఎరుక (ప్రజ్ఞ, విజ్ఞానము, చిత్) – **ఆత్మకంటే భిన్నము కాదు.**

## ఆత్మయే 'ద్రష్ట, దృశ్య' స్వరూపము కూడా!

**జనక మహారాజు :** ఈ పురుషుడు ఆత్మస్వరూపుడే అయి ఉండగా మరి ఈతడు ఈ దుఃఖమయ ఇంద్రియ విషయములతో కూడిన జగత్తును ఎందుకు, ఎట్లా, ఎవరి వలన పొందుచున్నాడు? ఈతడు ఎందుచేత దేహబద్ధుడై అనేక బంధనములకు, దుఃఖములకు 'లోను' అగుచున్నాడు? ఈ జీవుడు ఎక్కడి నుండి వస్తున్నాడు? ఎటు వెళ్ళుచున్నాడు?

**యాజ్ఞవల్క్యుడు :** మహారాజా! ***"మనము ఇప్పుడు ఆత్మకంటే శబ్ద-స్పర్శ -రూప-రస-గంధ శక్తులు గాని, వాటి వాటి విషయములుగాని వేరు కాదు"..*** అని సిద్ధాంతీకరించుకున్నాము కదా। గాఢనిద్రలో స్వశక్తిరూపమగు 'దృక్'యే జాగ్రత్ – స్వప్నములలో ద్రష్ట – దృశ్యములుగా అగుచు, మరల గాఢ నిద్రలో దృక్ రూపము సంతరించుకొంటోందని – నిరూపించాము కూడా కదా!. ఆత్మకు వేరైన శబ్ద – స్పర్శ – రూప-రస-గంధములు లేవు. మనో-బుద్ధి-చిత్త -అహంకారాలు లేవు. ఎప్పుడైతే ఆత్మ అద్వితీయమో, అనన్యమో, అప్పుడిక ఆత్మ-:

*– ఏ వేరైనదానితో ఏ రెండవ వస్తువును చూస్తుంది? ఏ వేరైన వస్తువును వాసన చూస్తుంది? ఏ మరొక వస్తువును రుచి చూస్తోంది? ఇంకొక దేనిని మాటలాడిస్తుంది? ఏక్కడ మరొక దానిని వినగలుగుతుంది? వేరొక దేనిని స్పృశిస్తుంది? మరొక వేరైన దేనిని తెలుసుకోగలుగుతుంది? (6-3-31).*

ఆత్మ సర్వదా ఏకమై ఉండగా, సర్వమై ఉండగా అట్టి ఆత్మ ఎక్కడి నుండి ఇక్కడికి జీవాత్మ అయి (దేహి అయి) వస్తుంది? ఇక్కడి నుండి ఎక్కడికి (దేహము త్యజించి) పోతుంది? ఆత్మదృష్ట్యా అవేమీ ఎక్కడా జరగటము లేదు. ఇక జడదేహము దృష్ట్యా అడుగుతారా? జడమగు దానికి ఒకచోటికి రావటమేమున్నది? మరొక చోటికి వెళ్ళటమేమున్నది?

నిర్మలమైన మంచినీటి సరస్సులోని జలము లోపల జలమే తరంగములు, బుడగలు, చెక్కర్లు మొదలైన రూపములు ఉన్నతీరుగా, బ్రహ్మము నందు బ్రహ్మమే విజ్ఞానము, మనస్సు, శబ్ద స్పర్శ రూప రస గంధములై, వాటివాటి విషయములు తన రూపముగా – ఏర్పడినదై ఉన్నది.

**"అద్వితీయము, అవినాశి అగు ఆత్మయే – నేను, నీవు, జగత్తు, ఇహము, పరము, ఇక్కడ, అక్కడ, ఇప్పుడు, అప్పుడు – ఎప్పుడూ", సర్వదా సర్వమును స్వీయరూపముగా ప్రకటించి ప్రదర్శించుచున్నది"....** అను ఆత్మావగాహన (A view of one's own SELF)యే **బ్రహ్మలోకము!** బ్రహ్మలోకము యొక్క అవలోనమే **బ్రహ్మావలోకనము.** (వివిధ అవలోకనములే 14 లోకములు కూడా।).

ఓ జనక యోగపుంగవా!

దేహ–ఇంద్రియ – ఉపాధి భేదములచే ఆత్మ ఏ మాత్రమూ భేదము పొందటము లేదు. ఇక భేదము ఎక్కడిది?

అన్ని దేశాలలోని, అన్ని ఆకారముల – అన్ని బంగారు ఆభరణముల వ్యవహారము – **'బంగారము'**ను వేరువేరుగా చేయటము లేదుకదా!

అట్టి ఆత్మ సుషుప్తి కాలములో **'స్వకీయ ఆత్మతేజస్సు'**గా **ఆత్మయందు** వెలుగొందుచున్నది.

**జాగ్రత్ – స్వప్నకాలములలో స్వకీయ తేజస్సును జాగ్రత్ – స్వప్నదృశ్యములుగా కల్పించుకొని ఆస్వాదించుచున్నది.**

ఆత్మ యొక్క స్వకీయ అంతర తేజో ప్రకాశమునకు గాని, బహిర్గత జాగ్రత్ – స్వప్న తేజో విభావములకు గాని **'నాశనము'** అనునదే లేదు.

ఓ జనక మహారాజా! విజ్ఞానమయాత్మకు **"సర్వము స్వస్వరూపాత్మగా దర్శించుచూ ఆస్వాదించటము"** అనునదే **శ్రేష్ఠస్థానము.** అదియే శ్రేష్ఠమైన (బ్రహ్మ)లోకము. అదియే శ్రేష్ఠమైన (బ్రహ్మ) ఆనందము. అట్టి బ్రహ్మానందము యొక్క ఒకానొక ఆనందస్ఫూర్తి – అంశయే ఈ 14 లోకములలోని సర్వజీవుల 'జీవనాంశ' అయి ఉన్నది!

**"అట్టి 'బ్రహ్మానందము' ఎట్టిది?"..** అనునది భాషకు అందనిది. అయినప్పటికీ **బ్రహ్మజ్ఞులగు మహర్షులు గానము చేస్తూ** వినిపిస్తున్న ఆత్మానందము గురించిన ఒకానొక **వర్ణనను** (Discription) ఇప్పుడు మనము చెప్పుకుందాము.

## మనుష్యానందము

**శ్లో॥ స యో మనుష్యాణాగ్ం రాద్ధః సమృద్ధో భవతి అన్య ఏషామ్ అధిపతి సర్వైః మానుష్యకైః**
**భోగైః, సంపన్న తమః – స మనుష్యాణాం పరమ ఆనన్దో॥ (6-3-33)**

**మనుష్యానందము** = – తన సర్వ అవయవములు పరిపుష్టి – ఆరోగ్యములతో కూడుకొని ఉన్నవాడై,

– మనుష్యుడు అనుభవించే సర్వభోగములలో ఏదీ కొఱత లేనివాడై,

– పరిసరములలోని జనులందరిని శాసించు అధికారము కలవాడై,

– తాను ఎవ్వరికీ జవాబుదారీ కానవసరము లేనట్టి..,

ఒక 'మానవుడు' పొందు – ఆనందము – **"మనుష్యానందము".**

**<u>పితరుల ఆనందము :</u>** పైన వర్ణించిన మనుష్యానందమునకు 100 రెట్లు అయినట్టిది – పిత్రు లోకము జయించినట్టి ఆనందము.

**<u>గంధర్వానందము :</u>** పితురుల ఆనందమునకు 100 రెట్లు (100 times) గంధర్వలోక ఆనందము. గంధర్వలోకమును జయించి, తనయందు దర్శించుస్థితి.

**<u>కర్మదేవానామ ఆనన్దః :</u>** గంధర్వానందమునకు నూఱు రెట్లైనది. ఆ ఆనందము ఉత్తమ కర్మలచే పొందు దేవలోకానందము.

**<u>అజాన (జన్మసిద్ధి) దేవానందము :</u>** కర్మదేవానందమునకు నూఱు రెట్లు, వేదాధ్యయనము చేసినవాడు, పాపరహితుడు, కోరికలు లేనివాడు – అట్టివాడు అజాన దేవానందమును పొందుచున్నాడు. అట్టి ఆనందమునకు శ్రోత్రియుడు (శ్రుతులగు వేదముల అర్థము తెలిసినవాడు) అర్హుడగుచున్నాడు.

**<u>ప్రజాపతి దేవానందము :</u>** అజాన దేవానందమునకు వంద రెట్లు అయినట్టిది – **ప్రజాపతి దేవానందము**. ఇది సృష్టికర్తయగు ప్రజాపతి ఆనందము. పాపాచరణము లేనట్టి – వేద వేత్తకు కూడా ఈ ఆనందము లభిస్తోంది. వేదాంతజ్ఞానికి ఇక్కడ **"నేనే అంతటికీ కర్తను"** – అనురూపముగా అనుభవమగుచున్నది.

**<u>బ్రహ్మ లోకానందము :</u>** ఇది 100 మంది ప్రజాపతుల ఆనందముతో సమానమైనది. బ్రహ్మమును ఎరిగిన **విదితవేద్యుడు పొందుచున్నాడు.**

అట్టి బ్రహ్మలోకానందము (లేక) హిరణ్యగర్భానందమునకు ఆవల, ఇక్కడి **గణితము వర్తించనట్టిది అయి ఉన్నది.**

.... వంద – వందరెట్లు చొప్పున మనము చెప్పుకున్న ఆనందములన్నీ కూడా ఏ ఆనందసాగరములో కొద్దినీటి బిందువులతో, సమానమో... **అది బ్రహ్మానంద సాగరము**

ఓ సమ్రాట్! జనక మహారాజా!

జీవునికి వాస్తవమైన **పరమానంద – పరమ ప్రశాంత – అగణిత "ఆత్మమేవాహమ్"** – ఆనంద స్థానము అదియే। ఎందుకంటే..., *బ్రహ్మానందుడు* →

(1) 'నాకు వేరైనది' అను రూపంగా **తదితరమైనదేదీ చూచుట లేదు.**

∆ **"చూచువాడు, చూడబడునది, చూడటము".**

ఏక రూపము పొందుచున్నాయి.

(2) తదితరమైనదేదీ బ్రహ్మానందమునందు వినుచుండుటలేదు.

∆ **"వినువాడు, వినునది, వినటము",** ఏకత్వము సంతరించుకుంటున్నాయి.

(3) అద్దాని యందు దేశ–కాల వస్తు పరిచ్ఛేదములు లేవు.

(All Bifurcations Pertaining to factors of Place, Time and Matter completely subside). అందుచేత అది **అపరిచ్ఛిన్నము, అవినాశనము.** (Indivisible and Undistructable).

(4) అద్దాని యందు (1) తెలుసుకొనువాడు (2) తెలియబడునది (3) తెలుసుకోవటము.. అనబడే జ్ఞాతృ – జ్ఞేయ – జ్ఞానముల భేదములేదు. తెలుసుకొనువాడే తెలియబడునదిగా అయి, తనను తానే అన్యమువలె కల్పించుకొని ఆనందపూర్వకంగా ఆస్వాదించుచున్నాడు.

తదితరములైన అన్ని ఆనందములు– (వేరుగా చూడబడేది, వేరుగా వినబడేది, దేశ–కాల – వస్తువులచే పరిచ్ఛేదములు, తెలుసుకొనువానికి వేరైనవి) అన్నీ కూడా – **బ్రహ్మానందమునకు అంతర్గతము అయి ఉన్నాయి.** అవన్నీ ఆత్మకు వేరైన ఆనందము. తెలుసుకొనుచున్నవాని వృత్తి –ప్రవృత్తులపై ఆధారపడి ఉంటున్నాయి. ఆత్మానందము స్వయం స్వరూపము.

*ఇంకా బ్రహ్మానందము గురించి చెప్పుకోవాలంటే...,*

- అది పాప-పుణ్యకర్మలకు, కర్మఫలములకు ఏ మాత్రము సంబంధించినది కాదు. బ్రహ్మానందము నందు పాపి – పుణ్యుడు... ఇత్యాది భేదములు ఈషణ్మాత్రము స్థానము కలిగి ఉండనట్టిది. **సూర్యునిలో చీకటికి చోటెక్కడిది?**

- "పాపికేమో తక్కువ బ్రహ్మానందము...,

  యజ్ఞములు – పుణ్యకార్యములు చేసిన వానికి అధికమగు బ్రహ్మానందము"...

అనబడు వ్యవహార భేదములకు తావే లేదు. **అటువంటి భేదముల ఊసు కూడా ఉండదు.**

*పాపాచరణము, శ్రోత్రియుడై ఉండటము, తృష్ణ, తృష్ణ లేకుండటము, పుణ్యాచరణము, విహితకర్మలు, అవిహితకర్మలు, భూమికలు, సాధనముల హెచ్చుతగ్గులు, కాలముచే హెచ్చుతగ్గులు మొదలైన వాటికి **'బ్రహ్మానందము'**తో ఏ సంబంధమూ లేదు. అయ్యది సర్వదా **అప్రమేయము, అనునిత్యప్రత్యేకము, అద్వితీయము, సర్వమునకు అసంబంధము కూడా!***

పైపై భూమికలు హెచ్చుతగ్గులు కలిగి, కర్మ – యోగ – సాధనా సంబంధమైనవి అయిఉంటున్నాయి.

బ్రహ్మానందమునకు **'కారణము' అనునదే అఖర్లేదు. సాధనములతో పని లేదు.**

పైపై భూమికలు తృష్ణతో కూడి ఉంటాయి.

**బ్రహ్మానందము తృష్ణను అధిగమించినట్టిది.**

తృష్ణ నశించినప్పటి సుఖముతో – ప్రపంచము ఏలే సమ్రాట్ సుఖముగాని, మూడు లోకముల సుఖముగాని – పోల్చటానికి కూడా పనికి వచ్చేవి కావు. గులకరాయితో కొండని ఏమి కొలుస్తాము?

ఓ జనక మహారాజా! బ్రహ్మానందము గురించి వివరించాము కదా! సరేనా? బ్రహ్మలోకము –అనగా ఏమో గమనిస్తున్నారుకదా?

**జనక మహారాజు** : ఓ యాజ్ఞవల్క్య మహాశయా. భగవన్! **సో అహమ్ సహస్ర – దదామి! అథ ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి!**

మీరు చెప్పిన విశేషాలన్నీ నేను కాదనటము లేదు. ఒప్పుకుంటున్నాను. అయితే ఇక మీరు నాకు **'బంధవిముక్తి'** కలిగి, **'మోక్షము'**ను సిద్ధింపజేసుకోగల మార్గమొక్కటే దయతో చెప్పండి? మీకు నేను వేయి గోవులను సమర్పించుకొనుచున్నాను. పూజనీయులగు మీరు మాపై అనుగ్రహముతో స్వీకరించండి!

❖ ❖ ❖

యాజ్ఞవల్క్యులవారు జనక మహారాజు చెప్పినది విన్నారు. **"ఈయన ఇంకా అత ఊర్ధ్వమ్ విమోక్షాయైవ హి బ్రూహి ఇతి!"** అంటున్నారే! **"ఇక నుండి మోక్షము ఎట్లా లభిస్తుందో మాత్రమే ఉపదేశించండి..** అని అడుగుచున్నారే!" – అని ఆశ్చర్యపడ్డారు.

కొంచము గమనిస్తూ, ఆలోచిస్తూ ఉండగా యాజ్ఞవల్క్యునికి భయము వేసింది.

యాజ్ఞవల్క్యుని భయమునకు కారణం?

- నాకు చెప్పే సామర్థ్యము లేకనా?
- ఈయనకు తెలియకయా? అజ్ఞానము కారణంగానా? ...

మరి?

**"ఈ జనకుడు అత్యంత ప్రజ్ఞా దురంధురుడు. అందుచేతనే ప్రశ్నలన్నింటికీ ఒక ముగింపు పలుకగల "నిర్ణయము"... కొరకై నన్ను కట్టిపడవేస్తున్నారు. 'గోవులు' మిషచే నేను కలిగియున్న విజ్ఞానమంతా ఉపదేశించేట్లు చేస్తున్నారు."** ... అని యాజ్ఞవల్క్యుడు తలచారు. ఇదియే యాజ్ఞవల్క్యుడు ఉలిక్కిపాటుకు, భయపడటానికి కారణము.

శ్రుతులు – అవి చెప్పే హేతువులు ఆత్మ గురించిన దృష్టాంతాలు మాత్రమేనని జనకుని అభిప్రాయము. అందుచేత **"ఇక మోక్షము గురించే చెప్పేసేయండి"** – అని యాజ్ఞవల్క్యునితో అన్నట్లు అవుతోంది.

**యాజ్ఞవల్క్యుడు :** ఓహో! ఈ జీవునికి సంబంధించిన 'సద్యోముక్తి' గురించి చెప్పుకుందామని సూచిస్తున్నట్లు నాకు అనిపిస్తోంది. అయితే వినండి. "త్వం" ను నిర్వచించుకుందాము.

నీవు సర్వదా ఆత్మ స్వరూపుడవై స్వయంజ్యోతి స్వరూపుడవై సర్వదా ప్రకాశించుచున్నావు. ప్రకాశించు సూర్యునకు, ఒక దీపమునకు కూడా తదితర వస్తువులను ప్రకాశింపజేయటము స్వభావమే కదా!

– స్వప్న – జాగ్రత్ – సుషుప్తులు నీ ప్రకాశములో వెలుగొందుచున్నట్టి స్థాన విశేషములు. నీ యొక్క స్వకీయ "వినోద రచన" అగు 'జీవాత్మ' అను అంశచే సంచారములు చేయబడుచున్న **ప్రదేశములు.**

  స్వతఃగాను, స్వయముగాను, సహజముగాను ఆత్మజ్యోతి స్వరూపుడవగు నీవు సర్వదా **అద్వితీయుడవు. 'రచన' అంతా కూడా – రచయితకు అద్వితీయమే కదా।**

– జాగ్రత్ స్వప్న సుషుప్తి భూమికలు గాని, ఆ భూమికలలో కనిపించే విశేషపరంపరలు గాని **నీకన్నా వేరుకాదు. (అట్లాగే) వాటిచే నీవు పరిమితుడవూ కాదు.**

జలములో తరంగ దృష్టిచే కనిపించే తరంగములన్నీ జలమే కదా। అట్లాగే, జీవాత్మ దృష్టిచే నీయందు బ్రహ్మాండములు, లోకములు, లోకపాలకులు, లోకజీవులు, వారి స్వభావములు... ఇవన్నీ కనిపిస్తున్నాయి. **ఆత్మదృష్టిచే ఆత్మయందు ఆత్మయే ఉన్నది. మరింకేమీ ఎన్నడూ లేదు. 'ఆత్మ' (ఆపః మాం) అను ఆనందసాగరంలో అవన్నీ 'తరంగములు' వంటివి.**

జీవాత్మ దృష్టిని ఆశ్రయించినప్పుడు **నీవు లోకములలో ఉన్నట్లు,** పరమాత్మ దృష్టిచే **లోకములు నీయందు** (మట్టిలో బొమ్మలు, బంగారముచే ఆభరణములు, జలముచే తరంగములు వలె) – **నీయందే నీకు అభిన్నమై ఉన్నట్లు – తెలియవచ్చుచున్నాయి.** మట్టి బొమ్మ నిండా మట్టియే ఉండి ఉండగా, "మట్టిలో బొమ్మ ఉన్నది" – అని అంటామా?

దీపపు కాంతి ఒక వస్తువుపై ప్రసరిస్తే, ఆ వస్తువు దీపపు కాంతి కిరణములను బంధిస్తుందా? బంధించగలుగుతుందా? లేదుకదా! అట్లాగే ఆత్మజ్యోతి కిరణములు 'ఎరుక' రూపముదాల్చి, ఎరుగుబడుచున్నదానిపై ప్రసరించినంతమాత్రముచేత, **ఎరుగబడేదానిచే ఆత్మకు బంధమెక్కడిది? ఈవిధంగా ఆత్మజ్యోతి స్వరూపులమగు మనకెవ్వరికీ బంధము లేనేలేదు.**

---

# దేహేంద్రియాభిమానము

కేవలాత్మ స్వరూపుడవగు నీనుండి, **"నేను అనుభవమును పొందెదను గాక"**.. అను ఒకానొక **'అభిమానము'..(Intution of belongingness) స్వయంకల్పితమగు క్రీడా-లీలా వినోదముగా బయల్వెడలుతోంది.** ఆ అభిమానము బయల్వెడలటము... **'కథను కల్పించి ఆనందించాలి'**.. అను భావన వంటిది. అదంతా కూడా నీనుండి – నీకు సర్వదా అభిన్నము. **నీ యొక్క అంశ అయినట్టిది.**

(1) దేహ – ఇంద్రియాభిమాని (2) దేహ-ఇంద్రియ వ్యవస్థ (3) దేహ – ఇంద్రియవిషయములు.. తో కూడి – 'జీవాత్మ' అనబడేది – ఆత్మస్వరూపుడవగు నీనుండే బయల్వెడలుచున్నది.

అభిమానమునకు ఆవల **పరమాత్మగా...,**
అభిమానముకు ఈవల **జీవాత్మగా...,**
**నీ పరబ్రహ్మస్వరూపమే రూపములు దాల్చుచున్నది.**

ఊహనాధైన నేను... **పరమాత్మ।**
ఊహలోని నేను... **జీవాత్మ।**
నాధైన ఊహా వ్యవహార దృశ్యము... **జగత్తు।**

**ఈ మూడు స్వయముగా, స్వయం కల్పితముగా నీనుండి బయల్వెడలుచున్నాయి.**





## జాగ్రత్ అవస్థ – జాగ్రత్ అభిమాని – "విశ్వుడు"।

ఒకప్పుడు దేహి – "దేహము, దృశ్యము" అను రెండిటిని స్వీకరించటంచేత, **"అనుభవజ్ఞుడు – అనుభవరూపమగు విరాట్ రూపము"** నీకు అభిన్నరూపములుగా బయల్వెడలుచున్నాయి. అది సరదాగా కథ చదువుచూ, ఆ కథలోని సంఘటనలతో తాదాత్మ్యము చెందినవాడవై ఉండటము వంటిది.

→ దేహికి → దేహము స్వీకరించటము, దేహమును త్యజించటము... అనే జీవన్–మరణ స్థితులు సందర్భపడుచున్నాయి.

→ అట్టి దేహి జాగ్రత్ – స్వప్న – సుషుప్తి ప్రదేశములను కల్పించుకొని భౌతిక రూపిగా సంచరించటము **"అవిద్యచే"** అని అనబడుచున్నది. ఆత్మ నిత్యనిర్మలము. సర్వ స్వాతంత్ర్యము. అప్రమేయము. అయిఉండి కూడా... **'పురుషుడు – ప్రకృతి"** రూపము దాల్చి ఒకదానితో మరొకటి సంబంధించినదై (కథ చదువువాడు – కథావిశేషాల వలె) **విరాట్ పురుషుడు – విరాట్ రూపముగా అమృతస్వరూపుడవగు నీవే అగుచున్నావు.**

దేహ – ఇంద్రియ సంబంధముచే ఇంద్రియ దృశ్యానుభవరూపమగు జాగ్రత్ స్థితిని జీవాత్మగా నీవు పొందటము జరుగుతోంది.

జాగ్రత్‌ను కల్పించుకొని దేహధారి అయి, 'జాగ్రత్'నందు నీవే **'విశ్వుడు'** అను ఆ **జాగ్రదనుభవి** యొక్క (శాస్త్రీయమైన) పేరును సంతరించుకుంటున్నావు.

## స్వప్నావస్థ – స్వప్నాభిమాని – "తేజసుడు"

భౌతిక దేహముతో **"సుఖ–దుఃఖములు, పుణ్య–పాపములు"**... అను ద్వంద్వములను కల్పించుకొని 'విశ్వుడు' అను పురుషకారముచే జాగ్రత్ స్థితిని – (ఆత్మగా) –పొందుచున్నావు. కొంతసేపైన తరువాత **"ఇక ఈ ఇంద్రియములతో వ్యవహరించటమును కొంతసేపు విరమించెదనుగాక!"** అని తలచుచున్నావు. అప్పుడు బాహ్యానుభవముల రూపమగు జాగ్రత్‌ను నీయందు దాచి, దేహనాడులలో ప్రవేశించి **"అంతరంగ దృశ్యకల్పన – ఆస్వాదన"** అనే స్వప్న ప్రదేశములో నీవే ప్రవేశించి **'తేజసుడు'** అను పురుషకారముచే (స్వప్నానుభవి – స్వప్నాభిమాని) అయి, స్వప్న దృశ్యమును హృదయాకాశములో తన్మయతతో ఆస్వాదించుచున్నావు. **జాగ్రత్ స్వప్నములు నీయొక్క పురుషకార మహిమా విభాగములే।**

నీవే జీవాత్మగా స్వప్నావస్థ యందు కొంత సమయము రమించి, సంచరించి పుణ్య–పాపములను నిర్వర్తించి, సుఖదుఃఖములను పొంది, **అటు తరువాత** ఎప్పుడో ఆ స్వప్నము నుండి విరమించి, **తిరిగి జాగ్రత్ స్థానమును స్వీకరించుచున్నావు.** ఏదారిన జాగ్రత్ నుండి స్వప్నసీమలో ప్రవేశిస్తున్నావో, నీవు తిరిగి ఆ మార్గములోనే జాగ్రత్‌కు చేరుచున్నావు.

ఈ విధంగా జాగ్రత్ నుండి స్వప్నమునకు ⟵⟶ స్వప్నము నుండి జాగ్రత్తుకు – మొసలి నదిలోని ఈవలి – ఆవలి ఒడ్డునకు చేరురీతిగా – నీవు ప్రయాణములు లీలగా, క్రీడావినోదంగా సలుపుచున్నావు.

## పునర్జన్మ

జాగ్రత్ నుండి స్వప్నమునకు, స్వప్నము నుండి జాగ్రత్‌కు ప్రయాణించు తీరుగానే నీవు ఒకానొకప్పుడు ఈ దేహమును త్యజించి, మరొక దేహమును స్వీకరించి మరల **"ఇంద్రియ విషయ జగత్తు (జాగ్రత్) – అంతరంగ కల్పనా జగత్తు (స్వప్నము)"**లను ఆ నూతన దేహముతో పొందుచున్నావు.

**దృష్టాంతానికి...,**

...... చాలా బరువుతో నింపబడిన ఒక బండి, ఆ బండివానిచే ఒక ప్రదేశము నుండి ధ్వనిచేస్తూ మరొకచోటికి నడపబడుచున్నట్లుగా నీయొక్క 'జీవాత్మ'చే **'సంస్కారములు – భావములు'** అనువాటిచే నింపబడిన 'మనస్సు' అనే బండి ఒక దేహము (ప్రదేశము) నుండి మరొక దేహములోనికి తరలించుచున్నావు. **వస్తుతః చూస్తే, నీవు సర్వదా జన్మరహితుడవే.**

ఈ దేహ ఊర్ధ్వశ్వాస (దేహము నుండి లేచిపోవు శ్వాస) కలిగి ఉన్నప్పుడు – బుద్ధి అనుభూతులతో కూడిన లింగాత్మ [ (లేక) జీవుడు, ప్రాజ్ఞాత్మ (ప్రాజ్ఞుడు), (లేక) – కేవల 'బుద్ధి' రూపుడు] – తన సంస్కారములను (వాసనలను) వెంట నిడుకొని మరొక దేహమునకు

ప్రయాణించుచున్నాడు. తరలి వెళ్లుచున్నాడు. నూతన భౌతిక పరిసరములలో మరల జాగ్రత్ – స్వప్నముల ఆస్వాదనను ఒకటి తరువాత మరొకటిగా ఆస్వాదిస్తూ ఉన్నది ఎవరు? **ఇదంతా నీ మహిమయే।**

"ఎప్పుడు శిరస్సు, చేతులు, కాళ్ళతో కూడిన వర్తమాన దేహము వృద్ధత్వము (వార్ధక్యము) వలనగాని, వ్యాధుల కారణంగాగాని శిధిలత్వము పొందటము (లేక) అణుత్వము పొందటం జరుగుతోందో, అప్పుడు – ఒక మామిడిపండు (లేక) మేడిపండు (లేక) రావిపండు వృక్షము నుండి నేలవ్రాలురీతిగా, (ఈ దేహము యొక్క అవయవములు విడిపోతున్నాయి. ఏవి ఎక్కడి నుండి వచ్చాయో... అక్కడికి చేరుచున్నాయి. ఈ జీవాత్మ తన ప్రాణముల ప్రియత్వ ఆస్వాదన కొరకే ఈ భౌతిక దేహములో ప్రవేశించిన తీరుగానే, తిరిగి ప్రాణముల కొరకే ఈ దేహమును త్యజిస్తున్నాడు. (లేక) ఖాళీ చేస్తున్నాడు. జీవాత్మ రాజ ఠీవిలో ఈ దేహము వదిల, మరల తన అధికారముతో కూడి (రాజు తన రాజ్యములోని ఒక ప్రదేశము నుండిమరొక ప్రదేశములోనికి ప్రవేశించు రీతిగా) – మరొక దేహమునందు ప్రాణములతో కూడి ప్రవేశించుచున్నాడు.

| | |
|---|---|
| ప్రాణములు = రాజ్యాధికారము వంటిది। | దేహము = పట్టణము వంటిది। |
| 14 లోకములు = రాజుగారి రాజ్యము। | ఆత్మ = రాజుగారు |

**ఈ తతంగమంతా నీయొక్క 'జీవాత్మ' అనబడు 'అంశ' యొక్క చమత్కారమే। నీయొక్క స్వయంకల్పనా వినోదమే।**

## నూతన దేహావిష్కరణ

ఒక రాజుగారు తన రాజ్యములోని ఒక గ్రామమునకు తన రాజ్యాధికారముతో వేంచేస్తూ ఉన్నారు. అప్పుడు ఏమి జరుగుతుంది? **"రాజు గారు మన గ్రామానికి విజయం చేస్తున్నారహో!"..** అని డప్పు శబ్దములలో గ్రామములో వార్త ప్రకటించబడుతుంది. అప్పుడు ఆ గ్రామ జనులు రాజుగారిని దర్శించి సేవించటానికి భయంభయంగా సంసిద్ధమౌతారు.

→ తప్పుచేసిన వారిని శిక్షించే అధికారము గల గ్రామములోని అధికారులు,

→ (కరణము – మునసబు– గ్రామ అధ్యక్షుడు – ఉపాధ్యక్షుడు మొదలైన) గ్రామపెద్దలు,

→ తదితర గ్రామ ప్రజలు...,

వీరంతా రాజుగారి కొరకై ఆహార పదార్థములు, మద్యము (Hot Drinks) మొదలైన పానద్రవ్యములు, రాజుగారు విశ్రమించటానికి విశ్రాంతి గృహము, సేవించటానికి సేవకులు.. ఇవన్నీ సంసిద్ధము చేస్తారుకదా! రాజుగారిని ఆహ్వానించి, సేవించి అటు తరువాత సకల మర్యాదలు అందించే తతంగమంతా నిర్వర్తిస్తారు కదా!

అట్లాగే..,

నూతన దేహమునకు వచ్చుచున్న ఆత్మ గురించి సర్వము (చూపు–వినికిడి–స్పర్శ – రుచి– వాసన... ఆస్వాదించగల ఇంద్రియార్థములు) సంసిద్ధము చేయబడుచున్నాయి. ఇక రాజుగారు 'మనస్సు–బుద్ధి–చిత్తము– అహంకారము' మొదలైన రాజ పరివారముతో 'నూతన దేహము' అనే తన బ్రహ్మాండరాజ్యములోని ఇంద్రియ గ్రామమునకు వస్తున్నారు.

**ఈ జీవాత్మ దేహమును విడచునప్పుడు పంచప్రాణములు ఆయనను అనుసరిస్తున్నాయి.**

ఈ సమస్తమునకు ఆది – మధ్య – అంతము నీవే అయిఉన్నావు.

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – షష్ఠమ అధ్యాయః।**

**"జ్యోతి ర్బ్రాహ్మణమ్" నామ తృతీయో – బ్రాహ్మణము॥**

# షష్ఠమ అధ్యాయః
# చతుర్థబ్రాహ్మణము
# శారీరక బ్రాహ్మణము

**యాజ్ఞవల్క్యుడు :** ఓ జనక మహారాజా! ఇంకా వినండి। ఈ భౌతిక దేహము వార్ధక్యము వల్లనో, వ్యాధులవల్లనో... శిథిలమైనప్పుడు..., (అనగా) మరణకాలమునందు..,

*జీవాత్మ (ఈ దేహమునకు సంబంధించినంత వరకు) సమ్మోహము దృఢముగా పొందినదగుచున్నది. దేహముతో ఇప్పటిదాకా కొనసాగిన సంబంధములు సన్నగిల్లసాగుచున్నాయి.*

ఆ సమయములో ప్రాణరూపమగు ఇంద్రియములు ఆత్మకు అభిముఖముగా కదలనారంభిస్తున్నాయి. క్రమంగా అప్పుడు 'లింగశరీరము' (బుద్ధి-సంస్కారములు) తన ఉపాధిగా గల ఆత్మకు **ఆయా అంగముల నుండి పూర్తిగా విముక్తి కలుగుచున్నది.**

ఆత్మస్వరూపుడగు జీవుడు తన తేజస్సు యొక్క వివిధ **'అంశలు'** అయినట్టి ఇంద్రియములను తనకు అభిముఖముగా తన వద్దకు స్వీకరించినవాడై **హృదయము నందు సూక్ష్మమగు విజ్ఞానరూపముగా ప్రకటనమగుచున్నాడు.** ఇంద్రియములు సూక్ష్మమగుటచే చూపు-వినికిడి-స్పర్శ-ఆఘ్రాణము - రుచి - శక్తులు తేజో అంశములై జీవుని ప్రాణతత్త్వమును ఆశ్రయించగా,... **"జీవాత్మ తేజస్సు"** నందు విలీనమగుచున్నాయి.

→ చూపు - లింగాత్మ (లేక) జీవాత్మతో ఏకీభూతము అయినప్పుడు,... ఆతని సమీపమున గల బంధువులు "మన బంధువుకు చూపు పడిపోయిందిరా!".. అని చెప్పుకుంటున్నారు.

" - మన ఈ ప్రియమైన బంధువు...,

→ ఇక చూడలేదు! వినలేదు। అఘ్రాణించ లేదు। స్పృశించ లేదు। తెలుసుకొనలేదు।.. మరణించాడు కదా! ఆలోచించలేదు కూడా!

అని బంధువులు దుఃఖిస్తూ ఉంటారు. అయితే, మరణించినప్పుడు,... ఆ జీవాత్మ యొక్క చూచుశక్తి, ఆఘ్రాణించు శక్తి, రుచి చూచు శక్తి, పలికే శక్తి - వినే శక్తి, ఆలోచించే శక్తి, స్పృశించే శక్తి, వివేచనా శక్తి, నశించాయా? లేదు! నశించలేదు. గాఢనిద్రలో ఉన్నవాని వలెనే అవన్నీ ప్రాణము నందు, ప్రాణము విజ్ఞానాత్మయందు, విజ్ఞానాత్మ - ఆత్మయొక్క **"కేవలీ స్వరూపము"**నందు **యథారూపముగా** ప్రవేశిస్తున్నాయి.

సర్వేంద్రియములు → ప్రాణతత్త్వమును చేరి **'పరము'** (Beyondness) ను పొందుచున్నాయి. అనగా. **'ఇహము'** (Here and now) ను త్యజిస్తున్నాయి. అట్టి **పర (సూక్ష్మ)** స్వరూపముతో (ప్రాణరూపముతో) **విజ్ఞామయాత్మయందు ఏకమగుచున్నాయి.**

- అట్టి ఇంద్రియ ఇహతత్త్వములు ఏకముగా అయినట్టి ప్రాణతత్త్వము తన యందు లయించుకొన్నట్టి విజ్ఞానమయాత్మ (Self Form of conseciousness)తో కూడుకొన్న స్థితిలో "హృదయరంధ్రము".. యొక్క జీవన నిర్గమ స్థానము (The out - going path of life factor)... నాడీ ద్వారము ద్వారా 'ఆత్మతేజము'తో **ఉత్తేజితము - ప్రకాశమానము** అగుచున్నది.

అప్పుడు...,

కేవల బుద్ధిస్వరూపమగు లింగ శరీరమును తన యొక్క ఉపాధిగా కలిగియున్న విజ్ఞానమయాత్మ (లేక జీవుడు)...,

-భౌతిక దేహము యొక్క కళ్ళ ద్వారాగాని, శిరస్సు (బ్రహ్మరంధ్రము) ద్వారా గాని, ముక్కు-చెవులు-నోరు మొదలైన తదితర ప్రదేశముల ద్వారా గాని దేహమును త్యజించి బహిర్గతుడు (Vacating the Body and going out)... అగుచున్నాడు.

ఎప్పుడైతే ఈ జీవుడు భౌతిక దేహము నుండి **'బహిర్గతుడు'** అగుచున్నాడో..., ఆతని ఎరుక (లేక) విజ్ఞానమయాత్మత్వము వెంట – (దేహములోని అణువణువు అంతవరకు పెత్తనము చెలాయిస్తూ కాపాడుచున్న) **'ప్రాణము'** కూడా ఆ జీవుని (దేహమును ప్రాణశక్తితో ఇప్పటివరకు జీవింపచేసినట్టి విజ్ఞానమయాత్మ) వెంట అనుసరించుచున్నది. ప్రాణముల వెంట ఈ విధంగా వాగింద్రియము, స్పర్శేంద్రియము, ఘ్రాణేంద్రియము, రసేంద్రియము, శ్రోత్రేందియము... ఇవన్నీ వాటి వాటి ఇంద్రియ స్థానములను వీడి 'ప్రాణము' నందు ప్రవేశించుచున్నాయి. ఆ ఇంద్రియములకు ప్రదర్శన – ఉపకరణములగు "కళ్ళు, చెవులు, నోరు" మొదలైన ఇంద్రియ ద్వారములు నిస్సారంగా మూగబోవుచున్నాయి. ప్రాణము బహిర్గతమగుచు, మరొక దేహగృహమును ఆశ్రయిస్తోంది.

**<u>మరొక దేహము</u> :** ఇక జీవాత్మయొక్క విజ్ఞానమయ స్వరూపము – ఈ దేహమునందు బహిర్గతమైన తరువాత, కర్మలకు అధీనమై, విశేషమైన జ్ఞానము కలిగినదై, **మరొక భౌతిక దేహమును ఆశ్రయించి,** తన ప్రాణత్వమును ప్రదర్శనము చేయ సిద్ధపడుచున్నది. ప్రాణమునకు చెందిన శబ్ద–స్పర్శ – రూప – రస గంధ సూక్ష్మతత్త్వములు బయలుదేరి వాటివాటి ఉపకరణ స్థానములు అయినట్టి చెవులు – నోరు – నాలుక – కళ్లు మొదలైన చోట్ల ప్రజ్ఞ – అనుభవముల ప్రదర్శనము సిద్ధింప ప్రారంభిస్తున్నాయి.

ఈ పురుషుడు ఒక దేహమును వదలి, మరొక దేహమును ప్రాణశక్తి సమన్వితుడై (ప్రాణముల నుండి ఇంద్రియశక్తి ప్రదర్శనాశీలుడై) ఆశ్రయించటము ఎటువంటిదంటే, ఒక 'జలగ' లేక 'గడ్డి పురుగు'.. ఒక గడ్డిపోచను వదలుచూ శరీరమును ముందుకు కదల్చి క్రమంగా మరొక గడ్డిపోచను ఆశ్రయించి, మొదటి గడ్డిపోచను పూర్తిగా వదలటము వంటిది. **ఆత్మకు శరీరము ఆగంతుకము గాని సహజముకాదు.** ఒకడు ఒక చొక్కా ధరిస్తే, ఇప్పుడు ఆ చొక్కా యొక్క రంగు–రూపు–రేఖలకు, ఆ వ్యక్తి యొక్క గుణములు ఇత్యాది విశేషాలకు ఏమి సంబంధము? ఏమీ ఉండదు. **జీవుని వాసనలే దేహ–దేహాంతరములకు కారణము.** (One's own 'Tendency' is the reason for the sequences of Body after Body).

ఒక దేహమును ఉపసంహరించుకొని, మరొక దేహమును ఆశ్రయించటము నీకు శిధిలవస్త్రమును త్యజించి నూతన వస్త్రమును ధరించటము వంటిది మాత్రమే! (**వాసాంసి జీర్ణాని యథా విహాయ** – గీతాచార్యులవారు).

అంతేకాదు. ఇప్పుడు చెప్పుకున్న "గడ్డిపురుగు" దృష్టాంతములో ఒక గడ్డి పరక నుండి తన శరీరమును ముడుచుకొని, మెడను ముందుకు చాచి, మరొక గడ్డిపరకను ఆశ్రయించి, ఇదివరకటి గడ్డి పరకను వదలిన రీతిగా, ఈ జీవుడు సూక్ష్మ ఇంద్రియ శక్తులు అంతర్గతమైయున్న ప్రాణశక్తిని కర్మల సందర్భానుసారంగా (కానీ స్వతఃగా చూస్తే లీలగా) ఒక దేహగృహము నుండి మరొక దేహగృహమునకు జేర్చుచున్నాడు. అయితే, మరణించుచున్న జీవుడు **స్వతఃగా మరణ రహితమగు, అమృతరూపమగు ఆత్మ స్వరూపుడే అయిఉన్నాడు కూడా।**

- అట్టి ఆత్మస్వరూపుడు ఒకానొకప్పుడు తన యొక్క స్వభావము (ప్రకృతి)ను ప్రదర్శించి వినోదించనెంచుచున్నాడు.
- అట్టి స్వభావము (లేక) ప్రకృతి ప్రదర్శనకు తనయొక్క ప్రజ్ఞ (ఎరుక) + శక్తిని ఉపకరణములుగా చేసుకొనుచున్నాడు. **అట్టి ఉభయము ఆత్మకు అనన్యము.** (వేరుకాదు). ఎందుకంటే ఆత్మ సర్వదా **అమృతము, అనన్యము** (తనకు వేరైనదేదీ ఎక్కడా లేనట్టిది) కదా!

  శక్తి = ప్రాణశక్తి। ఈ ప్రాణశక్తియందు సర్వేంద్రియతత్త్వములు సూక్ష్మరూపము వహించి ఉన్నాయి. (లేక) ఏకమగు ప్రాణశక్తియే ఇంద్రియతత్త్వముల రూపమున, వాటివాటి విషయముల రూపమున కూడా ప్రదర్శితమగుచున్నది. (Subtle form of Experiences). దృశ్యము కూడా 'ప్రాణశక్తి' యొక్క ఒకానొక చమత్కారము, అద్భుతము అయినట్టి ప్రదర్శనమే।

  ప్రజ్ఞ = విజ్ఞానమయాత్మ। 'ఎరుక' అను మూలపదార్థముతో నిర్మితమైన ప్రజ్ఞాత్మ స్వరూపుడు। జీవాత్మ। పురుషుడు। (One who is experiencing)।

అనన్యమగు ఆత్మ తన యొక్క శక్తి – ప్రజ్ఞల ద్వారా అన్యత్వమును లీలగా, వినోదముగా కల్పించుకోవటమే సృష్టియొక్క ఆరంభము.

**అవిద్య :**

- అట్టి లీలావినోదమును ఆశ్రయించుచూ ఉండగా, ఎప్పుడో తన అనన్యత్వమును ఏమరచి తనను తాను (స్వకీయ ప్రాణశక్తి యొక్క ప్రదర్శనములగు) ఇంద్రియశక్తుల, ఇంద్రియ శక్తి ప్రవాహ ద్వారముల, ఇంద్రియ దృశ్యముల – మధ్య చిక్కి **"నేను బద్ధుడను"** అని భావించుటయే.. **వాసనలు.**
- వాసనలతో ఒక శరీరమును ఆశ్రయించి **"ఈ దేహమే నేను! ఇంతకుమించి ఏమీ కాను"**.. అని తలచటము, ఆ దేహము శిథిలమైనప్పుడు వాసనానుసారంగా మరొకదేహమును ఆశ్రయించి, పాతదంతా ఏమరచి **"ఇక ఈ నూతన దేహమే నేను. ఇంతకుమించి మరేమీ కాను. నా సుఖదుఃఖాలన్నీ ఈ దేహస్థితి-గతులే నిర్ణయిస్తున్నాయి"**... అని తలచి బంధత్వము అనుభవించటము,
- ఎప్పటికప్పుడు జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో ప్రవేశిస్తూ.. ఎప్పటికప్పుడు **"నేను ఇంతవరకే"**... అని బంధమును అనుభవించటము.

**ఇదియే అవిద్య। ఇదియే 'సంసారము'। ఇవియే 'వాసనలు'।**

> **ఆత్మా ఇదగ్ం శరీరమ్ నిహత్యా,**
> **అవిద్యాం గమయిత్వా, "అన్యమ్" ఆక్రమమ్**
> **ఆక్రమ్య ఆత్మానమ్ ఉపసగ్ంహరతి౹౹ (6-4-3)౹**

అమృత స్వరూపుడగు ఆత్మ ప్రాణశక్తిచే భౌతికదేహమును ప్రకాశింపజేసి, తన ప్రాణ శక్తి యొక్క అంశలగు **"ఇంద్రియములను, ఇంద్రి విషయములను"** ఆస్వాదించటము ప్రారంభిస్తున్నది. ఇదియే **'జీవాత్మ యొక్క జననము'.**

- అట్టి దేహముతో జాగ్రత్ స్వప్న సుషుప్తులను పొందుచూ, అనన్యమగు ఆత్మ **"ఇదంతా నాకు అన్యము"**.. అను భావన పొందుచున్నది. జాగ్రత్ స్వప్న సందర్భములలో అప్పటికప్పుడు అదియే సత్యమని 'భావన' కలిగి ఉంటోంది.

  ఇదియే అవిద్య (లేక) మాయ (లేక) – **'అనన్యత్వము' నుండి బయల్వెడలిన 'అన్యత్వము'.**
- ఒక శరీరము శిథిలమైనప్పుడు ప్రజ్ఞాస్వరూపాత్మ (జీవాత్మ) ఆ శరీరములో తాను ప్రవేశింపజేసిన ఇంద్రియశక్తులను – అనుభూతులను ఉపసంహరించి, ఆ జడదేహమును 'శిథిల వస్త్రము' వలె త్యజించుచున్నది. **ఇదియే 'మరణము'.**

మరల తన ప్రజ్ఞ- ప్రాణములను మరొక దేహములో ప్రవేశింపజేసి, అక్కడి ఇంద్రియ ద్వారములతో **"నేను ఇంతే!"** అని పొందుచూ జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను కొనసాగించుచున్నది. **ఇదియే పునర్జన్మ!**

- తన ఆత్మత్వము 'అమృతము – అప్రమేయము' అని గమనించినప్పుడో? **"దేహముల రాక-పోకలచే నాకు బంధము అనునది ఎప్పుడూ ఏర్పడటమే లేదు. ఏర్పడజాలదు. నేను సర్వదా సదాశివుడనే। అమృతము – సర్వము – అప్రమేయము – అనన్యము అగు ఆత్మను। ఇదంతా నేనే"**.. అని గమనించుచూ ఇదంతా దర్శించుచున్నావు. ఇదియే **'మోక్షము'.**

ఈ విధంగా జీవాత్మ-దేహముల రాకపోకలు స్వభావముగా అనన్యమగు ఆత్మ యొక్క వినోదరూప ప్రకృతి (లేక, భావన) యొక్క కల్పనగా జరుగుచున్నది. ఆత్మ తనయొక్క అనన్యత్వమును ఏమరచుటచేత, అధీనత్వము మాత్రమే గుర్తుంచుకోవటం చేత – **"అస్వాతంత్ర్యము"**ను మనస్సుచే పొందుతోంది.

**ఓ జనక మహాత్మా! ఆత్మ ఒక శరీరమును వదలి మరొక దేహమును స్వీకరించుకోవటము గురించి మరికొన్ని దృష్టాంతపూర్వకమైన వివరణలు చెప్పుకుందాము.**

**స్వర్ణకారుడు – పాత ఆభరణముల నుండి (బంగారమును కరగించి) క్రొత్త ఆభరణములు పునర్నిర్మించటము.**

ఒక స్వర్ణకారుడు (Gold smith) సువర్ణము (Gold metal)ను తీసుకొని నూతనమైన శోభతో కూడిన అందమైన ఆభరణములను (Ornaments) నిర్మిస్తూ ఉంటాడు కదా! **తత్ యథా పేశస్కారీ పేశసో మాత్రామ్ ఉపాదాయాన్యన్ అ(న)వతరం కళ్యాణ తరగ్ం రూపం తనుత। – (6-4-4)।**

అదేవిధంగా ..,

ఆత్మకూడా (జీవాత్మ – ప్రజ్ఞాత్మకూడా) (పాతబడిన బంగారము వలె) **శిథిలమైన** శరీరమును విడచి, క్రిందపడవైచి, నిశ్చేశ్చితము చేసివేసి, ప్రాణశక్తిని ఉపసంహరించి అప్పుడు మరొక సుందరదేహమును నిర్మించుకొనుచున్నది. అటువంటి దేహము – మానవ దేహమో, పితృదేవతల దేహమో, గంధర్వ–దేవతా– ప్రజాపతి దేహమో, తదితర జీవజాతి దేహమో – నిర్మించుకొనుచున్నది. ఇదంతా "జీవుడు జన్మిస్తున్నాడు. ఎదుగుతున్నాడు. మరణిస్తున్నాడు" అనురూపంగా దేహదృష్టిచే (అజ్ఞాన – అవిజ్ఞాన దృష్టిచే) మనస్సు దర్శిస్తోంది. **మనస్సే బంధ – మోక్షములను కల్పించుకుంటోంది. ఇంతే! (మనయేవ మనుష్యానాం కారణం బంధ మోక్షయో)।**

ఓ జనక మహారాజా! సర్వే సర్వత్రా ప్రసిద్ధమై ప్రకాశించు కార్య – కారణ విజ్ఞాన స్వరూపమగు – ఆత్మయే,

→ (1) పరబ్రహ్మము, (2) సృష్టికర్త అగు బ్రహ్మ, (3) ఆయన సృష్టి సంకల్పముకూడా అయి భాసిస్తోంది.

→ ఆత్మయే ఆలోచనలు చేస్తూ మనోరూపము దాల్చుచున్నది. శక్తిస్వరూపమై ప్రాణశక్తి రూపము దాల్చుచున్నది. నేత్రరూపమై చూచుచున్నది. 'వినికిడి' రూపము దాల్చి వినుచున్నది.

**ఆత్మభగవానుడే...,**

❋ భూస్వరూపుడు. జలస్వరూపుడు. తేజో (అగ్ని)రూపుడు, వాయు స్వరూపుడు, ఆకాశ స్వరూపుడు కూడా।

❋ **తేజోరూపుడు – తేజో రహితుడు** కూడా।

❋ సర్వకోరికలు కలిగి ఉండటము ఆత్మ చేస్తున్నదే। అట్లాగే కోరికలు లేకుండటము ఆయన చమత్కారమే। **కామరూపుడు, అకామరూపుడు కూడా।**

❋ **క్రోధరూపుడు** ఆత్మభగవానుడే। **క్రోధరహితుడు,** పరమ శాంతుడు కూడా ఆయనయే।

❋ **ధర్మ** స్వరూపుడూ ఆయనే! **అధర్మస్వరూపుడు** కూడా ఆత్మదేవుడే।

❋ వ్యష్టి స్వరూపుడు – సమష్టి స్వరూపుడు– సర్వస్వరూపుడు కూడా ఆత్మయే।

**ఇంకా ఆత్మజ్యోతి స్వరూపుడు...,**

ప్రత్యక్షముగా కనబడేది, వినబడేది, మాట్లాడబడేది, వాసన చూడబడేది, స్పర్శించబడేది, కళ్ళు–చెవులు–నోరు–ముక్కు– చర్మము కూడా అయి ఉన్నారు. అంతేకాక, –అప్రత్యక్షమగు **'అంతరంగ చమష్టయము'** కూడా ఆత్మయే!

**– ఆత్మయే జీవుడు, ఈశ్వరుడు, ఆ ఉభయములకు సాక్షి, కారకుడు, ప్రేరకుడు అగు పరమాత్మ కూడా। అట్టి పరమాత్మయే – నీవు।**

## కామ పురుషుడు

కొందరు "ఈ జీవుడు కామ పురుషుడు" అని కూడా అభివర్ణిస్తున్నారు. ఎందుకంటే ఇతడు ఏది **'సత్యము'** అని భావిస్తే, అది ఈతని పట్ల సత్యము అగుచున్నది. (యత్ భావం తత్ భవతి). 'బంధము ఉన్నది' అనుకుంటే బంధము **ఉన్నదే** అగుచున్నది. 'బంధము లేదు' అని అనుకుంటే **లేనిదే** అగుచున్నది.

కామ రూపుడైనట్టి ఈ పురుషుడు (జీవుడు) ఏది కోరుకొని కర్మ చేయుచున్నాడో,... ఆ కర్మ ఫలము అట్లే అగుచున్నది. ఏ **ఆసక్తితో** కర్మ చేస్తున్నాడో, కర్మఫలము **ఆ తీరుగానే సిద్ధిస్తోంది**. ఆవిధంగానే ఈతనిచే పొందబడుతోంది. అందుకే **"ఈ జీవుడు కామపురుషుడు"... అని కూడా చెప్పుకోబడుచున్నది.**

ఈ పురుషుని మనస్సు దేనియందు లగ్నమగుచూ ఉంటే, ఆసక్తి కలుగుతూ ఉంటే, అదియే **కర్మలింగము (బుద్ధిరూపము)**గా కూడా అగుచున్నది. ఈ జీవుడు ఏదో లోకములో ప్రవేశించి, కర్మలను నిర్వర్తించి ఆయా కర్మఫలములను అనుభవించే నిమిత్తమై ఈలోకమునకు వస్తున్నాడు. ఇక్కడి దేహముతో ఏవేవో కర్మలు నిర్వర్తించి, ఈ దేహమును త్యజించిన తరువాత ఆ కర్మఫలములు అనుభవించటానికి మరొక లోకములో మరొక దేహమును ఆశ్రయిస్తూ ఉన్నాడు. ఈ విధంగా ఆయా లోకములలో వందల–వేల ఉపాధులలో ప్రవేశము

– నిష్క్రమణము నిర్వర్తిస్తూ ఉన్నది కూడా ఆత్మయే. ఒకడు తాను కల్పించుకొన్న స్వప్నంలో ప్రవేశించి, అందులో ఒక స్వప్న–అంతర్గత జీవుడై, తదితర స్వప్న – అంతర్గత జీవులను చూస్తూ **"ఇదిగో! వీరు నావారు। వారో? మనవాళ్ళు కాదు। వీళ్ళు శత్రువులు। వాళ్ళు మిత్రులు। ఇక వాళ్లంటారా? మధ్యరకం। వారు–వారు మనకు కొంచం పరిచయస్తులు మాత్రమే। ఈతడు – ఈమె అందమైనవారు। వాళ్ళా? అబ్బే! ఏమి అందంలే।"** మొదలైన అనేక భేదదృష్టులను కల్పించుకుంటూ **"ఇదంతా నా స్వప్నమే"** అనే జ్ఞానము లేకుండా అనుభవిస్తున్నాడు.

అట్లాగే జాగ్రత్తులో (అద్వితీయుడై కూడా) తనకు అభిన్నమైన ద్వితీయమైనదంతా పొందుచూ,

జీవాత్మగా... **ద్వితీయమును,**
పరమాత్మగా... **అద్వితీయమును –**
ఒకేసారిగా కలిగినదై ఉంటోంది. **అట్టి ఆత్మవే నీవు.**

**సకామి–కామకామి:**

ఓ జనక మహారాజా! కర్మఫలములపట్ల స్వయంకృతంగా – గాఢంగా ఏర్పరచుకొంటున్న 'ఆసక్తి'యే – **"సంసారము".**

ఏ జీవుడైతే కర్మఫలములను "నేను పొందాలి కదా!" అని కోరుకొనుచున్నాడో, ఆతడు కర్మరూప సంసారమంతా ఒక పరంపర వలె పొందుచూనే ఉంటున్నాడు. 'సంసారి' అని పిలువబడు అట్టి పురుషుడు ఈ లోకములోనే కొన్ని కర్మ ఫలములను సిద్ధం చేసుకొని, అనుభవించి, మరల మరికొన్ని కర్మఫలములను మూటకట్టుకుని మరొక లోకమునకు పోయి, అక్కడ మరల **'సంస్కారముల పెట్టె'** తెరచి, మరికొన్ని కర్మఫలములను అనుభవించటము, ఇంకొన్ని కర్మలను ఫలముల కొరకై నిర్వర్తించటము చేస్తూపోతున్నాడు.

ఈ విధంగా కర్మఫలముల పట్ల ఆసక్తి కలవాడు జనన –మరణ రూప సంసారమును అవిరామంగా (Restlessly) పొందుచున్నాడు.

**అకామి: అకామకామి:**

ఎవ్వడు ఆత్మతత్త్వమును ఎరుగుచూ కర్మఫలముల పట్ల ఆసక్తిని నివృత్తి (Non-avocative) చేసుకొనుచున్నాడో, అట్టివాడు⟶

**యో అకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామః–**
**న తస్య ప్రాణా ఉత్క్రామన్తి! బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి! (6–4–6)**

**'అకామో':** కర్మఫలములను కోరుకోవటము లేదు. "ఆత్మభావన సిద్ధించటము".. యొక్క సమక్షములో కర్మఫలములు (మహాపర్వతమును సొంతం చేసుకొని వానికి గులకరాళ్ళ ముక్కల వలె) స్వల్ప విషయములగుచున్నాయి.

**'నిష్కామ':** కర్మలు నిర్వర్తిస్తూ కూడా, కర్మ ఫలములను అధిగమించిన దృష్టి కలవాడై, నిష్కాముడై (కోరవలసినదేదీ దృశ్యములో లేనివాడై) ఉంటున్నాడు.

**'ఆప్తకామ':** సమస్త కామములు తీరినట్టి 'ఆత్మతృప్తి' అలవరచుకుంటున్నాడు. పొందవలసినది పొందినవాడగుచున్నాడు.

**'ఆత్మకామః':** సర్వత్రా ఆత్మదర్శనమే ఆతని ఏకైకాశయము. అట్టివాని ప్రాణశక్తి ఆతనిని విడువదు. ఆతడి ఇంద్రియములు ఇంద్రియార్థములు, జీవాత్మత్వము, ఈశ్వరత్వము – ఇవన్నీ కూడా ఇప్పుడే ఇక్కడే ఆయా దృశ్య విషయములన్నిటితో సహా 'బ్రహ్మత్వము'ను సంతరించుకుంటున్నాయి. దీనికి వేదమంత్రము (వేదగానము) ఇట్లా ఉన్నది!

**శ్లో।। యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే అస్య హృది శ్రితాః,**
**అథ మర్త్యో అమృతోభవతి। అత్ర బ్రహ్మ సమశ్నుతి ఇతి।। (6–4–7)**

ఎప్పటికైతే బ్రహ్మవేత్త ఆత్మకాముడు (సర్వకోరికలు తీరము చేరినవాడు) అవుతాడో **"ఆత్మస్వరూపుడనైన నేను మనోకల్పనా మాత్రమగు దృశ్యజగత్తులో కోరుకోవలసినది, పొందవలసినది, ఏదీ లేదు. అంతా ఆత్మయే అయి ఉండగా, నేను యథాతథముగా ఆత్మస్వరూపుడనై ఉన్నాను. ఇక వదలవలసినది మాత్రం ఎక్కడైనా ఏముంటుంది?"**... అని బుద్ధి నిశ్చలపూర్వకంగా గ్రహిస్తాడో, ఎవ్వని హృదయములో కించిత్ కూడా కామము (Desire and Expectations from the outer world) అనే చీకటికి ("ఆత్మజ్ఞాన తేజస్సు కారణంగా")

చోటు లభించదో,... అట్టివాడు ఇక్కడే ఇప్పుడే మృతమును అధిగమించి **అమృత స్వరూపుడు అగుచున్నాడు. 'నేను బ్రహ్మమునే" అను బ్రాహ్మీభావమునందు నిశ్చలుడు అగుచున్నాడు.**

**మృతము** = "దేహాలతో పుడుతున్నాను.. చస్తున్నాను.. నేను ఏదో పోగొట్టుకొని మరణము కారణంగా ఎటో వెళ్ళుచున్నాను".. అనే భ్రమ.

**అమృతము** = "ఆత్మ స్వరూపుడనగు నేను, నా ప్రాణశక్తి యొక్క వివిధ ప్రదర్శనములగు జ్ఞానేంద్రియ – కర్మేంద్రియములను దేహ గృహములో ప్రవేశింపజేస్తూ, లీలగా దేహములలో ఉపకరణముల వలె ఉపయోగిస్తూ, మరింకెప్పుడో ఆ దేహమునుండి ఉపసంహరించు కొని ఆత్మతో ఏకము చేస్తూ ఉంటాను. అంతేగాని **దేహాలతో పుట్టను, దేహాలతో చావను.** ఆత్మచక్రవర్తినగు నా రాకతో నా పాలనలోని (ఇంద్రియ) గ్రామము వెళ్ళినప్పుడు అక్కడి గ్రామ ప్రజల గౌరవ – మర్యాదల వంటిదే – నా పట్ల ఈ దృశ్యచమత్కారమంతా। ఇక్కడి **ఆహార – పానీయ – సంబంధ – అనుబంధ – విహారాదులు అట్టివే".. అను అవగాహన।**

**మరణము :** త్రాచుపాము కుబుసము త్రాచుపాముచే విడువబడినప్పుడు ఆ కుబుసము నేలపై నిస్సారముగా పడి ఉంటుంది కదా। అట్లాగే, ప్రాణశక్తి, బహిర్గతమైనప్పుడు ఈ భౌతిక దేహము నిస్సారమై నేలకూలుచున్నది.

ఇక ఆపై జీవాత్మ ప్రాపంచక ధ్యాసలు – కర్మలు – భావములు నమ్ముచూ ఉండుకారణముగా, తన యొక్క భావావేశములచే నడుపబడుచు, **ప్రాణశక్తిని** వాహనముగా గైకొని మరొక ఇంద్రియ గ్రామమునకు (నూతన శరీరములోనికి) బయల్వెడలుచున్నాడు. శరీరమును వదలటమే – **మరణము**. మరొక శరీరము స్వీకరించటమే – **జననము. (లేక, 'పునర్జన్మ').**

## జీవన్ముక్తుడు

ఎవ్వరైతే ప్రాపంచమైన – దృశ్య/లోక సంబంధమైన సర్వకామములు హృదయము నందు పారద్రోలివైచి ఉంటాడో, అట్టివాడు ఇప్పుడే ఇక్కడే (దేహము ఉన్నా – లేకున్నా కూడా) **మరణమునకు విషయమే కానట్టి అమృతరూపమగు పరమాత్మ తేజస్సే** అయి → **సర్వముగా, సర్వసాక్షిగా, సర్వాంతర్యామిగా** → **వెలుగొందుచున్నాడు.**

**జనక మహారాజు:** మహామహనీయా! గురువర్యా! యాజ్ఞవల్క్యా! మీ మహత్తరమగు ఆత్మతత్త్వ బోధకు తృప్తుడనగుచున్నాను. గురుదక్షిణగా వేయి గోవులను సమర్పిస్తున్నాను. దయచేసి స్వీకరించండి. **మీ ప్రసాదము వలన నేను అనుభవైక వేద్యమగు ఆత్మత్వమును పొందుచున్న వాడనగుచున్నాను**. అందుచేత మీరు దక్షిణ స్వీకరించవచ్చునని నా విన్నపము.

**యాజ్ఞవల్క్యుడు :** "అట్టి సూక్ష్మమైన పరమాత్మ అయినట్టి → **జీవాత్మ** → ప్రాణ, ప్రాణాంశలగు ఇంద్రియ ఇంద్రియ విషములను స్వీయకల్పనగాను, స్వకీయ ఆత్మ స్వరూపముగాను దర్శించటము".. అనబడే **సూక్ష్మము – సనాతనము** (జన్మకర్మలకు మును ముందే ఉన్నట్టి సత్ ఆత్మగా దర్శించు విశేషము కలిగినట్టిది) – **విస్తారము** (బ్రహ్మాండములను, జన్మ జన్మాంతరములను ఆక్రమించినట్టిది)– → అగు **ఆత్మధర్మము నన్ను పొంది ఉన్నది. నాకు నేనే పొందుచున్నాను**. శాస్త్ర–గురువాక్యముల ప్రభావముచేత నేను ఆత్మాభావనచే స్పృశించబడినాను. నాచే ఫలపర్యంతము పొందబడుచున్నది.

(అనగా... ఆత్మతత్త్వము ఎవ్వరికి వారే అప్రమేయమగు బుద్ధితో ఆత్మను దర్శించి, ఆత్మతో మమేకమై సిద్ధించుకోవలసినదే। వివేకబుద్ధిచే అనునిత్యానుభవంగా తీర్చిదిద్దుకోవాలి। జగత్‌ను దాటివేసిన దృష్టిచే **"ఆత్మయేవాఽహమ్"** భావన ఎవరికివారే పండించుకోవాలి – అని ఉద్దేశ్యము. అందుకుగాను గురు, శాస్త్ర, అభ్యాసములు సహకారి కారణములు).

నాచే ఆత్మజ్ఞానము పొందబడి, నాచే సాక్షాత్కరించుకోబడినది. ఆ విశేషాలే మీకు శాస్త్రమర్యాదానుసారం వివరించి చెప్పాను. బ్రహ్మవిద్యకు ఫలము **"నేను ఆత్మనై, ఆత్మగా ఉండటము"**.. అనియే కదా! అది అనుభవైకవేద్యము. అంతేగాని నేను మీకు ప్రసాదించునది కాదు. ఎవ్వరూ మరొకరికి ఇవ్వగలిగినది కాదు. గురువులు దారిచూపుతారు. నడువవలసినది మనమే.

ఈ మార్గములో ప్రజ్ఞావంతులగు బ్రహ్మవేత్తలు జీవించి ఉండగానే ముక్తులై ప్రకాశించుచున్నారు. దేహమున్నప్పుడే స్వయమాత్మ స్వరూపులై వెలుగొందుచున్నారు.

అట్టి జ్ఞానయోగ మార్గము ద్వారా మోక్షమును జేరు విషయమై..., కొందరు యోగులు, పండితులు – **"తెల్లటి శుక్లనాడీ మార్గము మోక్షమార్గమైయున్నది"** అని, యోగాభ్యాసమును నిర్వర్తిస్తూ ఉన్నారు.

మరికొందరు → **"అది నీలమురంగులో ఉండే నాడీ మార్గములో ఊర్ధ్వ ప్రయాణము"** అని

ఇంకొందరు → **"పసుపు పచ్చని రంగు గల నాడి నుండి ఊర్ధ్వ ప్రయాణము"** – అని

వేరే కొందరు యోగులు → **'ఆకుపచ్చని నాడీ ద్వారా ప్రయాణము'** అని,

కొందరుకొందరు – **'అది ఎఱ్ఱని నాడీ ప్రయాణము'** అని అభివర్ణిస్తున్నారు. తమ యోగాభ్యాస మార్గంలో దర్శిస్తూ, తమను ఆశ్రయించిన శిష్యజనులకు సూచిస్తున్నారు.

మార్గాలు అనేక రూపములుగా కనిపించవచ్చు గాక। మోక్షస్థానము ఒక్కటే! **అది సర్వస్వము, సర్వాత్మత్వములతో కూడిన సాక్షిత్వము.**

అట్టి బ్రహ్మవిద్యారూపమైన మోక్షమార్గము అయినట్టి – పరమాత్మ స్వరూపమును ఆశ్రయించిన వాడు – **'బ్రాహ్మణుడు'** అనబడుచున్నాడు. ***"మోక్షస్థానము బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణునిచే ఎఱుక! ఒకడు ఆత్మానుభవము చేత మాత్రమే బ్రాహ్మణుడగుచున్నాడు.***

బ్రహ్మ విద్యా స్వరూపమైనట్టి అట్టి బ్రహ్మమును ఎరిగినవాడు – **"దృష్టి, సృష్టి, హృదయము"** ల యందు సమరూపముగా ప్రతిష్ఠించుకొని బ్రహ్మమే తానై పరమ ప్రకాశమానుడై ఉంటున్నాడు.

**అవిద్యోపాసన :**

**"పరాకాష్ఠ – స్వస్వరూపము – సర్వస్వరూపము – అమృతము" అగు ఆత్మోపాసనను వదలి, "ఇంద్రియ విషయములు, దృశ్యవిషయములే... పరమార్ధము"** అని తలచి, అవియే పరమావధిగా తలచువారు – **విద్యను వదలి అవిద్యను ఉపాసించువారు అగుచున్నారు**. అది – **బడికి వెళ్లి చదువును ఏమరచి తదితరములైన** (అల్లరి చేయటం మొదలైన) విషయములు ఆశయముగా కలిగి ఉండటము వంటిది.

**అన్ధం తమః ప్రవిశన్తియే అవిద్యాయామ్ ఉపాసతే! (6-4-10)**। 'ఇంద్రియములకు అగుపడు విషయములే మహత్తరము' అని తలచి ఆ ఇంద్రియములకు ఆధారమగు ఆత్మను ఉపాసించటమును, దర్శించటమును అభ్యసించనివారు – నిబిడాంధకార బంధురమైన అజ్ఞాన ఉపాధి పరంపరలకు త్రోవచేసుకొని ప్రయాణించువారగుచున్నారు. ఎవ్వరైతే కేవలము ఆత్మగురించి వర్ణనములకు పరిమితులై, వేదవాదరతులై, వేదవిద్యాసక్తులై, **"బ్రహ్మమే నేను। బ్రహ్మమే ఈ జగత్తు। బ్రహ్మమే ఈ సర్వ సహజీవులు"**।.. అను బ్రహ్మవిద్యను బుద్ధి యొక్క అనుభవము కొరకై ఉపాసించరో, పవిత్ర ఆత్మదృష్టికి సంసిద్ధులుకారో..., అట్టివారు **మరింతగా అంధకారమును ఆశ్రయించి కారుచీకటి – (అజ్ఞాన)లోకములలో ప్రవేశించువారగుచున్నారు...** అని హెచ్చరించబడుచున్నది.

ఓ జనక మహాత్మా!

**శ్లో॥ ఆనందా నామ తే లోకా అంధేన తమస అవృతాః**
**తాగ్ం స్తే ప్రేత్య అభిగచ్ఛంతి విద్యాగ్ం సో అబుధో జనాః॥ (6-4-11)**।

**'ఆత్మజ్ఞానము'** విషయమై దృష్టి లేకుండా కేవలము ఇంద్రియానందమే ప్రయోజనముగా కలిగియున్నట్టి లోకములు **"ఆనందలోకములు"**అని (అజ్ఞానులచే) చెప్పబడుచూ, జీవితాశయముగా కొందరిచే బోధింపబడుచున్నాయి. ఆత్మజ్ఞాన రహితులగు కేవల కర్మపరిమిత విద్వాంసులు అటువంటి లోకములలో ప్రవేశించుచున్నారు. అవన్నీ అశాశ్వతములు, దుఃఖమిశ్రితములు కూడా। ఓ ప్రియజనురాలా! **లోకములన్నీ మీయందు దర్శింపజేయు ఆత్మవిద్యను వదలి, లోకములలో సంచారములు చేయుటకై** పరిమితమై, సాధనలను ఆశ్రయించటము, ఆశయులై ఉండటము తెలివితక్కువ కాదా? 'ఆత్మవిద్య'ను తెలుసుకొని కూడా, స్వానుభవముగా సంతరించుకోని జనులు – అబుధజనులే। (తెలివి తక్కువవారే)।

# ఆత్మానం అహమస్మీతి

శ్లో॥ ఆత్మానం చేత్ విజానీయాత్ 'అయమ్ అస్మి' ఇతి పూరుషః,
కిమ్ ఇచ్ఛన్, కస్య కామాయ శరీరమ్ అనుసంజ్వరేత్? (6-4-12)

**"ఆత్మ అని దేని గురించి చెప్పబడుచున్నదో, అది మరెవ్వరో, ఎక్కడో ఉన్నది కాదు! నేనే అయి ఉన్నాను!"** ... అని ఏ మానవుడు సంశయ రహితంగా, సుస్పష్టముగా, మనో-బుద్ధి - చిత్త పూర్వకంగా, అనునిత్యముగా, సు-స్వాభావికంగా, హృదయాంతర్గత స్వానుభవ పూర్వకముగా... **ఎరిగి ఉంటాడో,** అట్టివాడు... ఇక దేనికీ ఈ శరీరమును కష్టపెట్టవలసిన పనిలేదు. దేనిగురించీ దుఃఖపడవలసిన పనిలేదు. **ఆతనికి ఆత్మగా సర్వము తానే అయి ఉండగా, ఇక** మరొకటి గురించి ఏ కోరికతోనూ పనిలేదు.

ఈ భౌతిక దేహము అనేకములగు దోషములకు, అనర్థములకు పెద్దపుట్ట. అట్టి నాశన శీలమగు ఈ రక్తమాంసమయ భౌతిక దేహములో అమృతస్వరూపుడగు ఆత్మ ప్రవేశించి,... **"నేను భౌతికదేహమునకు మాత్రమే చెందినవాడను, ఇది మాత్రమే నాకు చెందినది. దీని హాని వృద్ధులు నావే అగుచున్నాయి। ఇది అందంగా ఉంటే నేను అందగాడిని। ఇది బాగుండకుంటే నేను బాగుండను।"**.. ఇటువంటి దేహతదాత్మ్యము చెందుచున్నాడు. ఇది ఆశ్చర్యం! సందర్భములతో మమైక్యమై, తనయొక్క ఆత్మైన్నత్యమును మరచి ఉంటున్నాడు. ఇంకేమని చెప్పాలి?

అట్టి ఈ మాంసమయ దేహమునందు ఎవ్వరైతే **"సర్వాంతర్యామి, సర్వ ప్రాణాత్మకుడు, సర్వదేహాంతర్గతుడు"**.. అగు ఆత్మను దర్శిస్తారో...,

→ వారే **ధన్యులు...।**

→ వారే **విదితవేద్యులు।** తెలుసుకొనవలసినది తెలుసుకొని ఉన్నట్టివారు। (Have come to know the 'knower').

→ అట్టి జ్ఞాని **"నాచే దర్శించబడి, అనుభవించబడే జగత్తుకు నేనే కర్తను!"**.. అని గమనిస్తున్నాడు. **'విశ్వకృత్'** అగుచున్నాడు.

- సర్వమునకు కర్త ఆత్మయే! **సహి సర్వస్య కర్తా!**
- ఇది ఆయన లోకమే। **తస్య లోకః।** ఎందుకంటే, **ఆత్మయొక్క అవలోకనమే ఈ జగత్తు యొక్క వాస్తవ రూపము.** (The perception of one's own 'Self' is what this World-Scenary is).
- ఆయనయే ఈ లోకము! **స ఉ లోక ఏవ।**
- స్వప్నమంతా స్వప్నద్రష్టయే అయి ఉన్నట్లు ఈ జాగ్రత్‌లో కనిపించే లోకమంతా ఆత్మకు చెందినదే। ఆత్మయే। 'ఆత్మ' అనగా - నీవే।
- ఆత్మను ఎరిగిన జ్ఞాని **'దేహాత్మత్వము'**నకు **పరిమితుడు** కాడు. 'దేహి'ని ఆత్మగా ఎరుగుచున్నాడు.
- సర్వదేహములకు ఆతడే ఆత్మ।
- ఆతని యందే సర్వదేహములు ప్రకటనము అగుచున్నాయి.

✠

కనుక **మీరు మోక్షము పొందటానికై....,**

- నేను సర్వాత్మకుడను। ఈ లోకములన్నిటియొక్క ఆత్మ నేనే। నాకు వేరైనది ఎక్కడా ఏదీ లేదు।

**అందుచేత అద్వితీయుడను!**

- సర్వదా ఏకస్వరూపుడను. అనేకముగా కనిపిస్తున్నదంతా నా ఏక-అఖండ ఆత్మయే! (ఓం ఏకాక్షరం బ్రహ్మ।)।
- "ఆత్మ-బ్రహ్మము-పరమాత్మ - జీవాత్మ - పరబ్రహ్మము - ఇహాత్మ - పరాత్మ - సృష్టి - సృష్టి యొక్క కల్పన - స్థితి - లయకారులగు త్రిమూర్తులు-నీవు-నేను-ఈ లోకముల - అవలోకనము... **ఇవన్నీ నా 'ఆత్మ' యొక్క పర్యాయపదములే!**

**- అను స్వాభావికమును ఆశ్రయించెదవుగాక।**

✠ ✠ ✠

ఓ జనక మహారాజా! గురుబోధల వలన కావచ్చు, శాస్త్ర పాఠముల కావచ్చు, స్వానుభవము వలన కావచ్చు,... మొత్తం మీద **"మనము ఆత్మస్వరూపము"** అని ఎరుగుచున్నాము. ఉపాసిస్తున్నాము. **ఈ సర్వము నందు ఆత్మను, ఆత్మయందే ఈ సర్వమును ఏకము చేసి ఆత్మగా అగుచున్నాము.**

ఈ దేహమునందే **"విశ్వఈశము – విశ్వంభరము"** అగు ఆత్మను దర్శించకపోతే – **మహతీ వినష్టిః**। ఎంత పెద్ద నష్టము। నిష్కారణముగా మోహమున పడి అసంఖ్యాక జనన– మరణ ద్వంద్వములలో కొట్టుకుపోవలసి వస్తుందే!

ఆత్మవేత్త యొక్క ఔన్నత్యము వాక్కులతో ఏమని ప్రకటించగలం? అట్టి భూత–వర్తమాన– భవిష్యత్తులకు ప్రభువగు ఆత్మ భగవానుడు – త్రికాలములకు చెందిన సర్వమును ప్రకాశింప జేయుచున్నారు.

**"నా హృదయమున నాకు సంబంధించిన సమస్తము తానే అయి వెలుగొందుచున్నారు!"** అను వేదవాక్కు మనము గమనిస్తున్నాము. మమాత్మ యొక్క ఔన్నత్యమును ఆచార్యుల పాఠ్యాంశముల ద్వారా ముముక్షువు ఎరుగుచున్నాడు. ఎరిగిన తరువాత, ఇక ఆతడు ఆత్మ గురించిగాని, మరింక దేని గురించైనా సరేగాని **భయమేమి ఉంటుంది?** కాలనియామకుడే తన ఆత్మ అయినప్పుడు కాలమంటే మాత్రం భయమెందుకు?

స్వయం ప్రకాశరూపుడు, సర్వ ప్రకాశకుడు అగు ఆత్మభగవానుడే తానని తాను ఎరిగిన తరువాత ఆతనికి దేవతల కృప–రక్షణ కావాలని ఎందుకు కోరుకుంటాడు? కర్మల వలన, కర్మఫలముల వలన క్రొత్తగా వచ్చేదేమున్నది? అంతా తానే అయి ఉండగా ఎవ్వరిని ద్వేషిస్తాడు? ఎవరిని నిందిస్తాడు?

ఏ **సర్వతత్త్వ స్వరూపునికి** క్రిందుగా కాలచక్రము కల్పితమై భూత–వర్తమాన–భవిష్యత్ చక్రములతో కూడి తిరుగాడుచున్నదో,... అట్టి ఈశ్వరుడే తన వాస్తవ స్వరూపమై యుండగా,.. ఇంక కాలమునకు భయపడవలసిన పనేమున్నది? **(కాలః కాల ప్రసన్నానాం కాలః కిం న్ను కరిష్యతి?)**

ఏది జ్యోతులకే జ్యోతియో, తమస్సుకు ఆధారమో – ఆ జ్యోతిర్జ్యోతియే తానని తెలుసుకొన్న వానిని దేవతలు కూడా తమ ప్రియమై **ఆయుః స్వరూపుడుగా, ఆత్మస్వరూపుడుగా** ఉపాసిస్తున్నారు. తమయొక్క అమృతరూపముగా భావిస్తున్నారు. దీర్ఘాయుర్దాయము కోరువాడు పరబ్రహ్మమే తన ఆయువుగా ఉపాసించునుగాక!

**"నేను సర్వ అంతర్హృదయాంతరంగుడను"** అని తనను తాను గమనించువాడు దేవతలకు ప్రియాతిప్రియుడు, సర్వజీవులకు ఆప్యాయము అయినవాడు అగుచున్నాడు.

## సోఽ హమ్ గానము।

ఓ జనక మహారాజా!

ఏ ఆత్మతత్త్వము నందైతే, –

**పంచ జనులు** ⟶ గంధర్వజనులు – పితృలోక జనులు – దేవలోక దేవతలు – అసురులు – రాక్షసులు..,

**పంచ కోశములు** ⟶ అన్నమయకోశము – ప్రాణమయకోశము – మనోమయకోశము – విజ్ఞానమయకోశము – ఆనందమయకోశము,

**త్రి ఆకాశములు** ⟶ భూతాకాశము – చిత్తాకాశము – చిదాకాశము,

**పంచ భూతములు** ⟶ పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము... ఇవన్నీ కూడా అంతర్లీనమై (ఎద్దాని యందు) అభిన్నరూపంగా ఉన్నాయో, **అట్టి ఆత్మ స్వరూపమే నేను** – అని భావిస్తున్నాను। తెలుసుకొన్నాను। ఆస్వాదిస్తున్నాను।

అట్టి "సోఽ హమ్", "మమాత్మా సర్వభూతాత్మ", "అహమ్ బ్రహ్మాస్మి"...అను మహావాక్యార్థముల పరమార్థమును తెలుసుకొనుటచే అమృతరూపమును పుణికిపుచ్చుకొన్నవాడిని అగుచున్నాను. **అజ్ఞానముచే నేనే జీవుడను. జ్ఞానముచే (తెలుసుకున్నప్పుడు) నేనే బ్రహ్మమును। బ్రహ్మమే నేను।**

ఈ జగత్తుకు, పంచప్రాణముల వ్యాపారములకు, నేత్రములకు, చూపుకు, కనబడేదానికి, చెవులకు, వినికిడికి, వినబడుచున్న సర్వమునకు, స్పర్శేంద్రియమునకు, స్పర్శకు, స్పర్శించబడుదానికి – **ఆధారము ఆత్మయే।** ఆ ఆత్మానారాయణుడు మనస్సుకే మనస్సై ఉన్నారు. **ఆయనయే నాయందు నేనైన నేనై అన్నీ ఎరుగుచున్నారు!** నాలోని నేనైన నేనే ఆయన! ఇంక నాకు లోటేమున్నది? నేను జనకాత్మజుడను! నీవు యాజ్ఞవల్క్యాత్మజుడవు! ఇంక భేదమేమున్నది? **మనమిద్దరము అభేద – అఖండ ఆత్మపురుషులము।**

**జనక మహారాజు :** 'నాలోని నేనైన నేను' అగు అస్మత్ స్వస్వరూప పరమాత్మను నేను ఎరిగినవాడనై, తన్మయుడనై, మమేకమై చూచుచుండటము ఎట్లా?

**యాజ్ఞవల్క్యుడు :**

**శ్లో॥ మనసైవ అను ద్రష్టవ్యం, నేహ (న-ఇహ) నానాస్తి కించన।**
**మృత్యోః స 'మృత్యుమ్' ఆప్నోతి య ఇహ నానేవ (నానా ఇవ) పశ్యతి॥ (6-4-19)**

ఏ మనస్సుకు ఇక్కడ అనేకమంతా అనుభవమౌతోందో..., ఆ మనస్సే **"ఇక్కడ ఏకము- అఖండము అగు ఆత్మ తప్పితే మరింకేదీ కించిత్ కూడా లేదు"**.. అనునది దర్శించాలి. మనస్సు చేతనే **"ఏకత్వాత్మదర్శనము"**ను నిర్వర్తించాలి. అంతకుమించి దర్శించేది మరింకేమున్నది?

ఏ మనస్సైతే ఏకమగు ఆత్మను అంతటా దర్శిస్తుందో, ఆ మనస్సు ఆత్మకు అభిన్నమగుచున్నది. ఆత్మకు అద్వితీయము అగుచున్నది! ఆత్మ స్వరూపమే అగుచున్నది.

మనస్సుచే – **'న ఇహ నానాస్తి (నానా అస్తి) కించన'** నానాత్వము లేనే లేదు – అను దర్శనమే మోక్షము. **అంతకుమించి మోక్షమంటూ మరింకేదీ లేనేలేదు.**

## య ఇహ నానేవ (నానా ఇవ) పస్యతి...

ఏ మనస్సైతే ఇక్కడ నానాత్వమును దర్శించటమును మానదో,

- నేను వేరు – నీవు వేరు.
- పరమాత్మ వేరు – జీవాత్మవేరు.
- భక్తుడు వేరు – భగవంతుడు వేరు.
- చూచువాడు వేరు – చూడబడునది వేరు.
- వినువాడు వేరు – వినబడునది వేరు.
- ద్రష్ట వేరు– దృశ్యము వేరు.
- నేను వేరు – నా ఇష్టదైవము వేరు.
- మంచివేరు – చెడు వేరు.
- పుణ్యము వేరు – పాపము వేరు.
- ఇహము వేరు – పరము వేరు–

ఈ – ఈ మొదలైన అనేక రూపములు గల నానాత్వమును మూర్ఖముగా వదలనే వదలదో, ఆత్మ యొక్క తాత్త్విక సత్యమును – అఖండత్వమును – ఏకైకత్వమును పరిశీలించి ఆత్మత్వము వైపు దృష్టి సారించదో, **మృత్యోః స మృత్యుమ్ ఆప్నోతి।**

అట్టి మనస్సు దేహ పరంపరలలో అనంతంగా ప్రయాణిస్తూ ⟶ ఎప్పటికప్పుడు **ఒక చావు నుండి మరొక చావును కొని తెచ్చుకుంటూనే పోతుంది.**

అందుచేత ఓ జనక మహారాజా! బ్రహ్మమును (పరమాత్మను) ఉపాసించి మోక్షస్థానమును చేరాలనుకుంటే,... ఉన్న ఉపాయము ఒక్కటే. **ఆత్మను (బ్రహ్మమును) ఏకముగాను, అఖండముగాను చూడాలి। అనేకముగా కాదు। ఇంతకు మించిన పరాకాష్ఠ మరేమీ లేదు.**

అట్టి బ్రహ్మము **ఎట్టిది?** నీవు–నేను అయినట్టిదే సుమా! మనమంతా అఖండాత్మానంద స్వరూపులమే। ఇంకా కూడా,

- సర్వదా **ఏకము.**
- దేనిచేతను పరిమితము కాదు. ప్రమేయము కలిగిలేదు. **అప్రమేయమైనది.**
- అది చలనము పొందదు. ఒకచోటి నుండి మరొకచోటికి పోదు. ఉన్నచోటే ఎల్లప్పుడూ ఉండి ఉన్నది. **ధృవము.**
- త్రికాలములలోను యథాతథము. అందుచేత **నిత్యమైనది.**
- దృశ్య–దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారములు తానే అయి ఉండి కూడా,... వాటివాటి దోషములు స్పృశించనట్టిది. బంగారపు ఉంగరములోని బంగారమునకు "ఇది ఆతనిది। కొన్నాడు। దొంగిలించాడు। బంధువులు ఇచ్చారు। భార్యకు కొని ఇచ్చాడు।"... మొదలైన విశేషాలేవీ స్పృశించవు కదా! **ఆత్మ మాలిన్య రహితమైనది.**
- ఆత్మ స్థూలములైన పంచభూతములు కాదు. సూక్ష్మములగు మనో బుద్ధి చిత్త అహంకారములు కాదు. ఆకాశ – వ్యష్టి అహంకారములకంటే కూడా **సూక్ష్మాతిసూక్ష్మము.**
- దేహమునకు జన్మ–మృత్యువులు, రాక–పోకలు, పెరుగుదల–తరుగుదలలు ఉండవచ్చుగాక। దేహికి? అవేమీ లేవు. ఆత్మ **అజము. జన్మ రహితము!**
- ఈ జీవుని పరిశీలిస్తే ఈతని యందు శ్రేష్ఠాతిశ్రేష్ఠము – సర్వశ్రేష్ఠము అయినది **ఆత్మయే!**

వివేకి అయినట్టి వేదవేత్త (వేద ప్రవచనమేమిటో ఎరిగినవాడు – తెలుసుకొన్నవాడు) ఇక తాత్సారం చేయరాదు. బ్రహ్మవిదుడు – బ్రాహ్మణుడు కావాలి! **బ్రహ్మమే తానై, ఈ సమస్తమును బ్రహ్మముగా దర్శించుచూ బ్రహ్మానందభరితుడగుచుండును గాక।**

- ఆత్మతత్త్వమునందే 'నిష్ఠ' కలిగినవాడై ఉండాలి! తదితరమైన పై పై కథలు, చరిత్రలు, వ్యష్టి గుణములు – ఇత్యాదుల పట్ల కాదు!
- ధీరుడై బుద్ధిని సునిశితము, నిర్మలము, విస్తారము చేసుకోవాలి.
- అసలైన వస్తువగు ఆత్మ తానే। ఈ రీతిగా అంతటా స్వస్వరూపమును దర్శించటము మాని, ఊరికే శాస్త్ర సాంకేతిక శబ్దములను (Jargons) తీసుకుని తర్జన–భర్జనలు చేస్తూ కాలమును వృధా చేసుకోరాదు. వాక్ ఇంద్రియముతో శబ్దగ్రహణము ఎంతగానో 'గ్లాని'ని కలిగించగలదని ఏమరువరాదు.

వృథా శబ్దములు శ్రమను మాత్రమే మిగులుస్తాయి. **అందుచేత ఆత్మని ఆత్మకొరకు ఆత్మతో ధ్యానించాలి.**

## ఆత్మ ఉన్నచోటెక్కడ? ఎట్టిది?

ఈ జీవుడు ఎల్లప్పుడూ కూడా → "ఏ ప్రాణతత్త్వము నందు విజ్ఞానమయమై ప్రకాశిస్తోందో' – అట్టి **మహత్తరము.. అజము** (జన్మరహితము) అగు **ఆత్మయే అయి ఉన్నాడు.** అయితే కూడా, ప్రాణములు (శక్తి)తో కూడి 'ఎరుక' అను విశేషముతో (Energy + Knowing) – **విజ్ఞానమయ పురుషుడై** (అనగా, జీవుడై)... కనిపిస్తున్నాడు.

– ఈ జీవుడు మొట్టమొదట పరమాత్మయే। చిట్టచివరికి? పరమాత్మగానే శేషించుచున్నాడు. ఇప్పుడో? **ఇప్పుడు కూడా ఈ జీవుని** (లేక) (నీయొక్క – నాయొక్క – మనలోని ప్రతి ఒక్కరి యొక్క) **సహజరూపము 'పరమాత్మ'యే।** మిగతాదంతా సందర్భానుచితము మాత్రమే।

సందర్భ సత్యమాత్రములగు జీవాత్మ – జ్ఞాని – అజ్ఞాని మొదలైనవన్నీ సందర్భముతో ఏర్పడి, సందర్భము తొలగితే (నాటక పాత్రవలె, పురుషుని నీడవలె, దర్పణములో ప్రతిబింబము వలె, జలములో ప్రతిబింబమువలె) వాస్తవానికి – **అవన్నీ కూడా 'లేనివే' అగుచున్నాయి.**

→ **య ఏషో అంతర్ – హృదయ ఆకాశః తస్మిన్ శేతే। (6-4-22)।**

అట్టి ఆత్మ **హృదయములోని ఆకాశము నందు** – హృత్ పుండరీకమధ్యము నందు (లేక బుద్ధి యొక్క విజ్ఞానమయ ఆకాశమునందు) **ప్రశాంతముగా దివ్యప్రకాశమానమై ఉన్నది.**

→ **సర్వస్య వశీ :** దేహ-ఇంద్రియ-మనో-బుద్ధి-చిత్త అహంకారములను (ఒక దొంగలనాయకునివలె) తన వశము నందు కలిగి ఉన్నది.

→ **సర్వస్య ఈశానః :** సర్వమును నియమించుచున్నదై ఉన్నది. సమస్తమునందు ఓతప్రోతముగా విస్తరించినదై ఉన్నది.

→ **సర్వస్య అధిపతిః :** సర్వమునకు తానే ఒక చక్రవర్తి వలె ఆధిపత్యము వహిస్తోంది.

→ **స - న సాధునా కర్మణా భూయాత్। న ఏవా అసాధునా కనీయాన్।**

ఆత్మ - జీవాత్మ యొక్క సాధు కర్మలచే (ఉత్కృష్టత - గొప్పతనము ప్రతిబింబించు పనులచే) **ఉన్నతి** పొందటం లేదు. జీవాత్మ యొక్క అసాధు (చెడు - బలహీనమగు) కర్మలచే **న్యూనత** పొందటము లేదు. ఆత్మ సర్వదా **యథాతథము.**

→ **ఏష సర్వేశ్వర :** దివ్య శక్తి సంపన్నులగు దేవతాలోకములోని దేవతలకు, మర్త్య - పాతాళలోకములకు ఆధారము, నియమించునది, యజమాని ఆత్మయే!

→ **ఏష భూతాధిపతి :** పిపీలికము నుండి బ్రహ్మ వరకు సకల ప్రాణులకు అధిపతి (Owner) ఆత్మయే!

→ **ఏష భూత పాలకః :** ఒక మహారాజు తన రాజ్యమునంతటికీ పరిపాలకుడై ఉండుతీరుగా, సకల జీవజాలములకు పరిపాలకుడు ఆత్మయే। పంచభూతముల నియామకుడు, పాలించువాడు. అంతేగాని ఆత్మపురుషుడు పంచభూతములచే నియమించబడువాడు కాదు.

→ **ఏష సేతుర్విధరణ :** ఈ జీవులు లోకములు బ్రహ్మాండములు పరస్పరము సంబంధము కలిగి ఉండటానికి 'సేతువు' (Abridging) వంటిది. ఆత్మ! (విధరణ = వర్ణాశ్రమ వ్యవస్థను, లోకములను, ఆలోకముల హద్దులను తన సత్తా-స్ఫూర్తుల ద్వారా నిలబెట్టేది)

**ఏషాం లోకా నామ సంభేదాయ :** లోకాలన్నీ స్థిరముగా ఉండగలగటానికి ఆధారమైనది - ఆత్మయే। పరమాత్మ యొక్క ఉనికి చేతనే జీవాత్మ, జగత్తు, దేహములు, స్వభావములు, కర్మవిధులు, కర్మఫలములు - మొదలైనవన్నీ ఒక వ్యవస్థగా ఆయా పరిధులలో ప్రవర్తించటం జరుగుతోంది.

→ **తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి :**

అట్టి బ్రహ్మమును ఎరుగుట గురించి చెప్పు బ్రహ్మవేత్తలగు తత్త్వజ్ఞులు - **"నాయనలారా! వేద వచనములు ఉపాసించండి. యజ్ఞముచేత, దానము చేత, తపస్సు చేత, ఉపవాస వ్రతములచేత ప్రయత్నశీలురై బుద్ధిని నిర్మలము చేసుకొని ఆత్మయొక్క ఔన్నత్యము తెలుసుకొనెదరుగాక!"**... అని బోధించుచున్నారు. **యజ్ఞేవ దానేన తపసా అనాశకేన ఏతమేవ విదిత్వా 'మునిః' భవతి!**

ఎవ్వడైతే నిష్కామముగా కర్మ-యజ్ఞ-దాన - తపస్సులు నిర్వర్తించి, నిర్మలమైన బుద్ధితో ఆత్మనే అంతటా దర్శిస్తాడో,... అట్టివాడు ఆత్మకు వేరైన సర్వ విషయముల పట్లా 'మౌనము' సిద్ధించుకుని, **'ముని'** అగుచున్నాడు.

**ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి। (6-4-22)**

కొందరు మహనీయులు 'ఆత్మావలోకనము'ను కోరుకొన్నవారై, అయ్యది సిద్ధించటము కొరకై సర్వసంగపరిత్యాగమును ఆశ్రయించి పరివ్రాజకులు (సన్యాసులు)గా అగుచున్నారు. **ఏతద్ధస్మ వై తుత్పూర్వే విద్వాగ్ంసః ప్రజాం న కామయన్తే। కిం ప్రజయా కరిష్యామః- ఇతి।**

ఈ కారణము వలననే మరికొందరు ***"కుటుంబము, సంతానము, వాటికి సంబంధించిన వ్యవహారములతో*** *మాకు* ***పనిలేదు. అవి పొందితే*** *మాత్రం* ***క్రొత్తగా (జన్మించినందుకు) పొందగలిగినది*** *ఏమున్నది?* ***ఆత్మయే*** *మా* ***సర్వస్వమగు లోకమై యుండగా ఈ భౌతిక లోక ప్రయోజనములు మేమెందుకు కోరుకోవాలి?"*** అని తలచుచున్నారు. ఈషణత్రయము పట్ల జాగరూకులు అగుచున్నారు. ఏది పొందితే అంతవరకే అంగీకరిస్తూ, ఆత్మసంతృప్తులై ఉంటున్నారు.

(1) పుత్రైషణ (2) విత్తైషణ (3) లోకైషణ అనబడే ఈషణ త్రయమును త్యజించి **భిక్షక సన్న్యాసిత్వము స్వీకరించ సిద్ధపడుచున్నారు.**

పుత్రుల పట్ల (సంతానము పట్ల) **"ఇది నాకు చెందినది"** – అను రాగ, మమకారములే... **పుత్రైషణ।**

"నా సంతానము బాగుండాలి కదా! అందుకే ఏది చేసైనా సరే, డబ్బు వెనుక వేసుకోవటము, లోభగుణము, అన్యాయంగా విత్తము ఆర్జించటముచేస్తే తప్పేమిటంట?" అని భావించి ధన సంపాదన, సంపాదించినది దాచటమే జీవితాశయముగా ఆయుష్షు ఖర్చుపెట్టుకుంటున్నారు. ఇదియే **'విత్తైషణ'.**

***అనగా, పుత్రేచ్ఛయే విత్తేచ్ఛరూపము దాల్చుచున్నది.***

విత్తము సంపాదించి దాయాలంటే, లౌకికమైన అనేక ధ్యాసలు, ఆలోచనలు, కార్యక్రమాలు కలిగి ఉండాలి. అందుచేత "విత్తేషణయే **లోకేషణ** కూడా।".. అని ఎప్పబడుతోంది. విత్తేషణ – లోకేషణ ఒక్కటేగా కూడా చెప్పబడుతోంది. లోకంలో రెండే ముఖ్య ఈషణములు

(1) పుత్రేషణ (2) విత్త – లోకేషణ

## ఆత్మ – ఆత్మజ్ఞాని లక్షణములు

'నేతి–నేతి' మార్గము ద్వారా అంతిమంగా – **"ఈ జీవుడు ఎవ్వడు?"**.. అను ప్రశ్నకు సమాధానమైయున్నట్టిదే 'ఆత్మ'!

**ఆత్మా అగ్రాహ్యో। :** అది ఇంద్రియములచేత – మనస్సు చేత పట్టుకోబడే వస్తువో, విషయమో కాదు. గ్రాహ్యము కాదు. ఎందుకంటే అది దేనికీ పట్టుబడేది కాదు. **నహి గృహ్యతే।** ఆత్మ దేనిచేతా పట్టుకొనబడటము లేదు.

**అశీర్యో నహి శీర్యతే। :** ఆత్మ అశీర్యము (నశించనిది). ఎందుకంటే దేహము మొదలైన వస్తువులవలె అది శైథిల్యము (Decay) పొందునట్టిది కాదు.

**అసంగో। నహి పజ్యతే। :** ఆత్మకు దేనితోనూ సంగము లేదు. కనుక దేని పట్లా ఆసక్తిగాని, అనాసక్తిగాని కలిగి ఉండదు. దేనికీ బద్ధము అయి ఉండదు.

**అసితో–న వ్యథతే। నహి రిష్యతే :** దేనికీ వ్యథ ఉండదు. అవినాశన శీలమగు బ్రహ్మము యొక్క జ్ఞానముచే ఇక ఆతని పట్ల **'ఇది పాపము– ఇది పుణ్యము'** అనునవి తాపమును సృష్టించలేవు. **రెండింటినీ దాటవేసిన ఆత్మదృష్టి యందు ఆతనియొక్క సర్వ దృష్టులు** – బెల్లము నీళ్ళల్లో కరిగినట్లు – **కరిగిపోయినవై ఉంటాయి.**

**న కృత– అకృతే తపతః।** "విహిత కర్మలు చేయలేకపోతున్నానే? అవిహిత కర్మలు నా వలన జరిగిపోతున్నాయే?" – అనునవి ఆత్మజ్ఞుని పట్ల సంతాపము కల్పించజాలవు.

న్యూనత – అధికత మొ॥వి ఆత్మపట్ల – ఏనుగును కట్టుటకు, కట్టి పడవేయుటకు సన్నటి ప్రత్తి దారమును ఉపయోగించటము వంటిది – అవుతోంది.

**తత్ ఏతత్ ఋచ అభ్యుక్తం। ఇంకా 'ఆత్మ' గురించి ఈ విధంగా ఋక్కుల రూపముగా గానము చేయబడుచున్నది (వేదములచే గానము చేయబడున్నది).**

**ఏష నిత్యో। :** ఆత్మ నిత్యమైనది. ఎల్లప్పుడు ఉండేది. జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు దేహ దేహాంతరములకు, లోక లోకాంతములకు ఆధారమై, 'కాలము'చే పరిమితము అవనిదై, **త్రికాలములలోను ఏకరూపమైయున్నది.**

**మహిమా బ్రాహ్మణస్య :** ఆత్మ అనిర్వచనీయము. ఒక వేళ్ళ ఎట్లాగో అట్లా నిర్వచించాలనుకొంటే, ఆత్మ → ఆత్మజ్ఞుని (లేక) బ్రహ్మవేత్తయొక్క (లేక) శ్రవణము చేయువాని యొక్క స్వాభావికమగు **'స్వమహిమ'** (Divinity)యే అయి ఉన్నది. అట్టి మహిమ ఆత్మగురించి ఎరిగినవానిపట్ల స్వతఃసిద్ధము, సహజము కూడా!

**న వర్ధతే కర్మణా, నో కనీయాన్ :** కర్మల వలన ఆత్మ హాని – వృద్ధులు పొందేది కాదు. స్వప్నములోని కర్మలవలన, ఆ స్వప్నము తనదైన ఈ జీవుడికి హాని – వృద్ధులు ఏముంటాయి?

**తస్యైవ అస్యాత్ తత్ పద విత్తం విదిత్వా న లిప్యతే కర్మణా పాప కేన ఇతి।** ఆత్మను ఎరిగి, ఆత్మగా వెలుగొందువానికి పాప – పుణ్యకర్మల లేపనము ఉండదు.

పాపముచే – దుఃఖము। పుణ్యముచే – సుఖము।

ఆత్మజ్ఞానము – తత్ ఆత్మా అహమేవ – అను జ్ఞానము చేతనో,... ద్వంద్వరహితమగు 'మోక్షము' – కరతలామలకమవగలదు.

- ఇది పుణ్యకార్యము (లేక) వ్రతము. కానీ, చేయకపోయానే?
- అయ్యో అప్పుడు అది పాపం కదా! .... కనుక నేను ఎందుకూ పనికిరాను.
- ఈ వ్రతము – సాధన – మంత్రము ఇంకా ఇంకా ఇంతగా చేయలేకపోయానే?
- ఉపవాసం ఉండలేక – ఆ వ్రతం చేయలేక పోయానే, ఇది నా కర్మ కాకపోతే!
- పుణ్యాత్ములు వేరు, పాపాత్ములు వేరు – **ఈఈ రూపముగల మోహమంతా తొలగగలదు.**

శాస్త్రాలు కర్మ విధులు, వ్రత జప యాగ–యజ్ఞవిధానములు చెప్పేది ఎందుకంటే –

(1) **<u>నిర్మలత :</u>** బుద్ధి నిర్మలత కొరకు,

(2) **<u>కృతజ్ఞత :</u>** ఈ జగత్తును, ఇందలి పదార్థ క్రమములను నిర్వర్తిస్తూ, పరిరక్షిస్తూ, శరీరములను (నిర్మిస్తూ, చలింపజేస్తూ) – ఉపయోగయుక్తముగా చేస్తున్న దివ్యశక్తి సంపన్నులు, అశరీరులు అగు **దేవతా ప్రజ్ఞలకు – ప్రార్థన – సమర్పణలతో కృతజ్ఞత తెలియచెప్పటానికి.**

(3) **<u>పరిపోషణ :</u>** జనుల పరస్పర ప్రేమ, సాధనాక్రమము, సహకారము, సానుకూల్యతల **పరిపోషణ కొరకు.**

నిష్కామ కర్మచే బుద్ధి సునిశితము, ప్రశాంతము, ప్రజ్ఞాయుతము, విస్తారము కాగలదు. అదియే కర్మల ప్రయోజనం గాని, దృశ్యములో ఏవో వస్తువులు, లోకములు కోరుకొని, అల్ప ప్రయోజనములు పొంది ఊరుకోవటానికి కాదు. ఆత్మ జ్ఞాని కర్మల – విధివిధానముల పాత్ర ఏమిటో, ఎందుకో, ఎంతవరకో ఎరిగి ఉండటంచేత, **కర్మ బద్ధుడు కాడు.** విధి – విధానములకు పరిమితుడై, దాసుడు కాడు. పాప – పుణ్యకర్మలు, కర్తలు ఆతనియొక్క **'సర్వత్రా సర్వులు ఆత్మయే'** అను దర్శనమును అడ్డగించలేవు. స్పృశించజాలవు.

**– తస్మాత్ ఏవం విత్ 'శాంతో, దాంత, ఉపరత – తితిక్షుః – సమాహితో, భూత్వా ఆత్మన్యేవ ఆత్మానం పశ్యతి। (6-4-23):** తనయందు, సర్వభూతములయందు సర్వదా **సమము, అతీతము, సర్వాధారము** అగు 'ఆత్మ' యొక్క మహిమను ఎరిగినవాడు స్వభావంగానే – పిల్లగాలులచే స్పృశించబడుచున్న కొండలాగా – దేనికీ స్పర్థ, వేదన పొందడు. పరమ**<u>శాంతుడై</u>** ఉంటాడు. ఆకాశము ఏదీ పొందకయే సమస్తమును విడువక – కలిగియే ఉంటుంది కదా!

## *దేనికీ చలించడు.*

- **<u>దాంతుడై</u>** ఇంద్రియములను తన ఉద్దేశ్యము ప్రకారము పరిపాలించువాడై ఉంటాడు. అంతేగాని తాను ఇంద్రియములకు, ఇంద్రియ – విషయములుగా తారసపడుచున్నవాటికి **దాసుడు** కాడు. ఇంద్రియములచే పాలింపబడడు. ఇంద్రియ విషయములకు స్పర్థ పొందడు.
- **ఇంద్రియ పాలకుడై ఉంటాడు. "ఓ ఇంద్రియములారా! మీమీ శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ శక్తులు, వాటివాటికి సంబంధించిన విషయ విశేషపరంపరలు ఆత్మనగు నన్ను సేవించుటకొరకేగాని,.... నన్ను బంధించుట కొరకు కాదు!"** అని ఎరిగి ఆత్మజ్ఞుడు **ఇంద్రియ పాలకుడుగా** ఉంటున్నడేగాని, **ఇంద్రియ బద్ధుడుగా** కాదు, ఇంద్రియ లోలుడుగా కాదు. ఒక నాటక రచయిత వ్రాసిన నాటకములోని పాత్రల పరస్పర సంబంధములు బయటకువచ్చి ఆ రచయితకు బంధము కలిగించగలవా? లేదు కదా!
- **<u>ఉపరతః :</u>** సర్వము ఆత్మగా దర్శించటమునందు ఉపరతుడై ఉంటాడు.
- **<u>తితిక్ష (ఓర్పు) :</u>** జగత్ దృశ్య సంగతి – సంబంధ – సందర్భముల పట్ల స్వభావంగానే ఓర్పు కలిగి ఉంటాడు. ఉపరతుడై ఉంటాడు.
- **సమాహితో భూత్వా।** ఆత్మ యందు – ఆత్మగా దర్శించటమునందు ఏకాగ్రచిత్తుడై ఉంటాడు.

**ఆత్మన్యేవ ఆత్మానమ్ పశ్యతి।** ఈ జగత్ దృశ్యమును **ఆత్మయందు ఆత్మగానే** దర్శిస్తూ ఉంటాడు.

- తనయందే తనను ఆత్మగా, తనను ఆత్మయందే, తాను ఆత్మగానే – అయినట్లు దర్శిస్తున్నాడు. **సర్వమ్ ఆత్మానమ్ పశ్యతి –** సమస్తము ఆత్మగా దర్శిస్తున్నాడు.

అట్టి ఆత్మ మహిమతో విరాజిల్లు ఆత్మజ్ఞుని ఇక్కడి లోకసంబంధములైన పుణ్య–పాపములు అంటవు. పుణ్యపాపముల పరిధులను దాటివేసినవాడై ఉంటాడు. ఆత్మను తెలుసుకొని, ఆత్మతో మమేకమై సర్వాంతర్యామిత్వము ఆస్వాదించువానిని చేసినట్టి – చేయనట్టి కర్మలు (కృత–అకృత కర్మలు) బాధించజాలవు. సర్వ కృత – అకృతకర్మలను జ్ఞానాగ్నిచే భస్మము చేసివేయుచున్నాడు.

– పాపరహితుడై, దోషరహితుడై, ఇచ్ఛారహితుడై సంశయ వర్జితుడై, బ్రహ్మము ఎరిగిన వాడై, బ్రహ్మమే తానై ఉంటాడు.

**ఓ జనకమహాశయా! సర్వాత్మకము, సర్వతత్త్వస్వరూపము అగు బ్రహ్మమే నీవై ఉండుము. సర్వ ఉపదేశముల సారము ఇదియే।**



**జనకమహారాజు :** ఓ యాజ్ఞవల్క్యా! నన్ను బ్రహ్మముగా నిరూపిస్తూ సర్వము నేనుగా, సర్వమునకు సాక్షిగా మీ బోధచే ఆత్మానందమును గుర్తుచేసి, అనుగ్రహించిన అమూల్యమగు, అమోఘమగు మీ **ఆత్మ – ఉపదేశము** నకు కృతజ్ఞుడను. మీకు తలవంచి నమస్కరిస్తున్నాను.

- మీసేవ నిమిత్తమై ఈ రాజ్యసంపదను మీకు సమర్పిస్తున్నాను.
- నేను మీ దాసుడను అగుచున్నాను.



ఈ యాజ్ఞవల్క్య – జనక సంవాద రూపమగు ఆత్మతత్త్వజ్ఞానము – ఆత్మ స్వరూపమును నిరూపించునదై, అన్నము (దృశ్య జగత్తును) భక్షించునదై ఉన్నది. దీనిని పఠించువాడు వాసుదేవుడై, సర్వభూముతములయందు ఆత్మస్వరూపుడై ప్రకాశించుచున్నాడు.

సర్వ కర్మలకు ఫలప్రదాత ఆత్మయే।

సకల ఆహార భోక్త – ఆత్మయే।

ఎవ్వడు 'ఆత్మ'ను ఉపాసిస్తాడో, అట్టి వాడు సర్వత్మకుడై చెన్నొందుచున్నాడు।

**శ్లో॥ స వా ఏష మహాన్ అజ ఆత్మా అజరో అమరో అమృతో అభయో బ్రహ్మ।**
**అభయం వై బ్రహ్మ। అభయగ్ం హి వై 'బ్రహ్మ' భవతి, య ఏవం వేద। (6-4-25)।**

ఈ 'జీవుడు'గా 'త్వమ్' అని చెప్పబడువాడు నిశ్చయముగా ఆత్మ స్వరూపుడే। అట్టి ఆత్మ దేశ పరిచ్ఛేద రహితము. పుట్టుక – హాని – వృద్ధి – వృద్ధాప్యము లేనిది. అవినాశనము. అభయస్వరూపము. అభయస్థానము. **స్వస్వరూపమగు ఆత్మయే అభయస్థానమగు బ్రహ్మము.**

**ఇది ఎవడు నిశ్చయముగా, నిర్ద్వంద్వముగా, నిస్సంశయముగా ఎరుగుచున్నాడో, ఆతడు బ్రహ్మమే।**

ఎరుగనివాడు ఎరుగుటచే బ్రహ్మమే తానగుచున్నాడు. ఎరుగనంత కాలము "కాదేమో" అని సందేహిస్తున్నాడు.

**ఏది ఏమైనా బ్రహ్మము కానివాడు ఎవ్వడూ లేడు.**

**ఇతి బృహదారణ్యకోపనిషత్ – షష్ఠమ అధ్యాయః**
**చతుర్థబ్రాహ్మణః – 'శారీరక బ్రాహ్మమ్' సమాప్తం।**

# షష్ఠమ అధ్యాయః
# పంచమ బ్రాహ్మణము
# మైత్రేయీ బ్రాహ్మణము

బ్రహ్మజ్ఞుడు తత్త్వదర్శి, మోక్షశాస్త్ర విద్వరేణ్యుడు అగు యాజ్ఞవల్క్య మహర్షికి ఇద్దరు భార్యలు.

**(1) మైత్రేయి :** బ్రహ్మజ్ఞానమునందు అత్యంత అభిలాష కలిగి ఉన్నవారు. యాజ్ఞవల్క్యుని శుశ్రూషచే అనేక ఆత్మజ్ఞాన విశేషములను పరిశీలించి హృదయస్థము చేసుకొని ఉన్నవారు. గొప్ప ప్రజ్ఞ కలవారు. తత్త్వశాస్త్ర సంబంధమైన అనేక విశేషాలు పఠిస్తూ ఉండేవారు.

**(2) కాత్యాయని :** పతిసేవ, గృహసేవ నిర్వర్తిస్తూ ఉన్న ఇల్లాలు. పతి ఆజ్ఞను తు.చ తప్పక నిర్వర్తించువారు. ఒక గృహిణిగా ఆశ్రమమునకు సంబంధించిన వ్యవహారములు తీర్చిదిద్దటము, యాజ్ఞవల్క్యుని వద్ద విద్యను అభ్యసించు శిష్యులు యోగక్షేమములు చూడటములయందు ఎల్లప్పుడు నిమగ్నమై ఉండువారు. తత్త్వజ్ఞానము విషయమై వారికి తీరికలేనట్లు ఉండేవారు. వారి శ్రద్ధలో అత్యధిక భాగము గృహిణియొక్క కార్యక్రమములకే సరిపోయేది. ఆత్మవిద్య పట్ల వారికి ఏమంత శ్రద్ధ, సమయపాలన ఉండేది కాదు.

ఒక సమయంలో యాజ్ఞవల్క్యులవారు గృహస్థాశ్రమమును త్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించదలచారు. **"సన్న్యాసాశ్రమము స్వీకరించువారు వారి భార్యయొక్క అంగీకారము పొందాలి"**.. అనే ఒకానొక నియమము ఉన్నది. అందుచేత, మైత్రేయిని పిలిచి ఇట్లా సంభాషించసాగారు.

❖ ❖ ❖

**యాజ్ఞవల్క్యుడు :** ఓ ప్రియ మైత్రేయీ! నేను ఈ గృహస్థాశ్రమమును త్యజించి పరివ్రాజకుడను (సన్న్యాసాశ్రమ విధుడను) కాదలచాను. నా ఇరువురి భార్యల అనుజ్ఞ స్వీకరించి అప్పుడిక అందుకు సిద్ధము కాగలను. మనకు మహారాజులవలన, శిష్యుల గురుదక్షిణ వలన లభించియున్న భూ-ధన సంపదలను, మణి-మాన్యాలను నీకు, కాత్యాయనికి పంచి ఇచ్చి వేయబోవుచున్నాను. ఆ సంపదలతో మీరిద్దరు శేషజీవితమంతా సుఖముగా వెళ్ళబుచ్చవచ్చును. మరి నేను ఈ గృహస్థాస్రమమును త్యజించి పరివ్రాజకత్వమును ఇప్పుడు స్వీకరించటానికి అంగీకారమే కదా!

**మైత్రేయి :** స్వామీ! ప్రాణేశ్వరా! మీరు మాకు సిరి సంపదలను పంచి ఇస్తానంటున్నారు, బాగానే ఉన్నది. అయితే నాదొక ప్రశ్న!

– ఇప్పుడు మీరు విభజించి ఇవ్వచూపు సంపద చేతగాని, (లేక) మీయొక్క ఆధ్యాత్మిక ఔన్నత్యమును ప్రశంసిస్తూ ఏ చక్రవర్తియో ఈ భూమిపై గల సకల సంపదలను మాకు ఇవ్వటం జరిగినప్పటికిగాని, అవన్నీ పొంది నేను నిర్వర్తించు కార్యక్రమములవలనగాని **'అమృతత్వము'** అనబడే **మోక్షము** పొందగలనా? లేదా?

**యాజ్ఞవల్క్యుడు :** లేదు లేదు. సిరి సంపదలవలన సకల భోగసామాగ్రి పొందినవాని జీవితము ఎట్లా సుఖప్రదముగా ఉంటుందో,...అట్లాగు మీ ఇరువురు జీవితాంతము ధనము – వస్తువులకు ఏలోటూ లేకుండా హాయిగా జీవించగలరు. **యథైవ ఉపకరణవతాం జీవితం, తథైవతే జీవితగ్ం। (6-5-3)।**

అంతేకానీ, **అమృతత్వస్య తు నా శాస్తి విత్తేనేతి!** ధనము మొదలైన సంపదలు కలిగి ఉన్నంతమాత్రముచేత **"అమృతత్వము"** రూపమగు మోక్షము లభిస్తుందని అనలేము. సంపదల వలన కలిగే సుఖము – అమృతత్వము వేర్వేరు కదా! **భార్య – భర్త – పుత్రులు – ధనము మొదలైనవి ప్రపంచంలో జీవించటానికి పనికివచ్చేవి కావచ్చునేమోగాని మోక్షమార్గమునకు అవన్నీ ఎందుకూ ఉపయోగించవు. ఇంకొక విషయం** – అవన్నీ విజ్ఞునికి ఉపకరణములు, అజ్ఞునికి అపకారకములు కాగలవు కూడా।

**మైత్రేయి : యేన అహం అమృతా స్యాం, కిమ్ అహం తేన కుర్యాం? (6-5-4)** మీరు చెప్పేవన్నీ (ధనము, సంతానము మొ॥వి) మృత్యువుతో ముగిసిపోయేవేకదా! దేనిచే నేను అమృతత్వమును సముపార్జించలేనో,...అవన్నీ మీరు ఇచ్చి, నేను పుచ్చుకొనినా కూడా,– **శాశ్వతమైన ప్రయోజనము ఏమున్నది?** ఓ ప్రాణనాథా! దేనివలన నేను అమృతత్వము పొందగలనో, మోక్షస్థానమును

సమీపించగలనో, అట్టి విద్యను నాకు ప్రసాదించండి. బోధించండి. అంతేగాని మృతస్వభావములగు వస్తువులతో నాకేమి పని? నేను ఈ మాత్రముచే సంతోషించను. నాపై దయతో మోక్షమార్గమును తెలియ చెప్పండి! అందుకై మిమ్ములను శరణువేడుచున్నాను.

**యాజ్ఞవల్క్యుడు :** ప్రియ ప్రాణేశ్వరీ! మైత్రేయీ! నీవు మృతస్వభావముతో కూడిన ధనము మొదలైననవి దూరంగా ఉంచి, అమృతత్వమునకు మార్గమును అడగటము **నాకు చాలా సంతోషమును కలుగజేస్తోంది.** ఎప్పటిలాగానే నీవు ఇప్పుడు అడిగిన విషయము నాకు నీ పట్ల ప్రీతిని మరింతగా వర్ధిల్లింపజేస్తోంది. నీవు కోరినట్లు నేను **'అమృతత్వము'** (లేక) **మోక్షము** గురించి వ్యాఖ్యానిస్తూ వివరించటానికి సిద్ధముగా ఉన్నాను. అయితే, నేను చెప్పబోవు **అమృతత్వమును పొందు విశేష మార్గమును** నీవు నిదిధ్యాసతో, ఏకాగ్రతతో యోచనపూర్వకంగా వినాలి. శ్రద్ధ-ఆసక్తులతో విని, అర్థం చేసుకొని హృదయస్థం చేసుకోగలగాలి సుమా! లేకుంటే విన్నప్పటికీ ఉత్తమ ప్రయోజనము ఉండదు మరి.

**మైత్రేయి :** స్వామీ! అత్యంత సావధానచిత్తురాలనై మీరు చెప్పబోవు అమృతస్థానమును సూచించు ఆప్తవాక్యములను వినటానికి, వివేచనచో హృదయస్థము చేసుకోవటానికి సంసిద్ధురాలనై ఉన్నాను. నాకు అమృతత్వమును సూచించు బోధను ప్రసాదించండి. దయచేసి అనుగ్రహించండి.

**యాజ్ఞవల్క్యుడు :** అయితే చెప్పుచున్నాను విను.



ఒక భార్య తన భర్తను ఎంతో ప్రియముగా చూచుచున్నది. ఎందుచేత? ఆ భర్తలో ఏదో ప్రత్యేకత ఉండటం చేతనా? కాదు.

❀ **న వా అరే పత్యుః కామాయ పతిః, ప్రియో భవతి। (6-5-6) ।** భర్త యొక్క ప్రీతి, ఆనందముల కొరకై భార్య తన భర్తను ప్రేమిస్తోందా? లేనే లేదు.

**ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి।** ఆత్మయొక్క (తనయొక్క) ఆనందము కొరకే భార్యకు భర్త ప్రియమై ఉండటము, తను ప్రేమించటము - జరుగుతోంది. తనకొరకే తాను **భర్తను ప్రేమిస్తోందిగాని భర్త యొక్క ప్రియము కొరకు కాదు!**

ఒక భర్తకు తన భార్య అనగా ప్రీతి. అయితే ఆతనికి తన భార్యయొక్క సంతోషము (ఆనందము - ప్రయోజనము) కొరకై భార్య ప్రీతి అవటం లేదు. తనయొక్క ప్రయోజనము, ప్రీతి కొరకై ఆతనికి ఆతని భార్య ప్రీతి అవుతోంది. **తన కొరకై తాను భార్యను ప్రేమించుచున్నాడుగాని, భార్యయొక్క ప్రియము కొరకు అయి ఉండలేదు.**

❀ దంపతులకు తమ సంతానముయొక్క ప్రయోజనము కొరకై సంతానము ప్రియమవటంలేదు. తనయొక్క (ఆత్మయొక్క) ప్రయోజనము - ప్రీతికొరకై సంతానము (పుత్రులు, పుత్రికలు, మనుమలు, మనమరాళ్లు మొ॥వారు) ప్రియమగుచున్నారు. తమ కొరకై పిల్లలను ప్రేమిస్తున్నారుగాని, పిల్లల ప్రీతి-ప్రయోజనములకొరకై పిల్లలను ప్రేమించటము లేదు సుమా!

❀ ఒకనికి ధన సంపాదన ఎంతో ఇష్టముగా అగుచున్నది. ఎందుచేత? ధనము యొక్క ప్రయోజనము కొరకై ధనము ప్రియము అవటం లేదు. తనకు ధనము ఇష్టము కాబట్టి ధనము ప్రియమగుచున్నది. అనగా తనకు ప్రియమగుటచే మాత్రమే, తనయొక్క ప్రియము, ఆనందము కొరకే ధనము ప్రీతి అగుచున్నది. **తనకొరకు ధనముగాని, ధనముకొరకు ధనము కాదు. ధనము కొరకై తాను కాదు.**

ఒకనికి పశువులు (ఆవులు, గేదెలు, మేకలు మొదలైన సంపదలు) ప్రియమగుచున్నాయి. ఆ పశువుల సంతోషము కొరకు పశువుల ఆనందము కొరకు అవి ఆతనికి ప్రీతిపాత్రమగుచున్నాయా? లేదు. అవన్నీ తన కొరకే ప్రీతి అగుచున్నాయి.

ఈ జీవుడు "వారి సంతోషము కొరకు, వీరి సుఖము కొరకు నేను ప్రేమిస్తున్నాను" - అనుకుంటున్నాడు. కాదు. తనకు ఇష్టము - ఆనందము కాబట్టి భర్య భర్తను, భర్త భార్యను, తండ్రి కొడుకును, ధనవంతుడు ధనమును, పశువుల యజమాని పశువులను ప్రేమగా - ప్రియముగా చూడటము, అవన్నీ ప్రియముగా పొందటము జరుగుతోంది. **ఇవన్నీ ఆ ప్రియముగా చూచువాడు తన ఆనందము కొరకు అట్లా చూస్తున్నాడేగాని, అయా ప్రియముగా చూడబడువారి యొక్క ప్రయోజనము కొరకు కాదు.**

**తన కొరకే వాటిని. అంతేగాని, వాటి కొరకు తాను కాదు।**

అట్లాగే, ఒకనికి బ్రాహ్మణుని ప్రయోజనము కొరకై బ్రాహ్మణుడు ప్రియము అవటం లేదు. తనయొక్క (ఆత్మయొక్క) ప్రీతి కొరకై 'బ్రాహ్మణుడు' అనువాడు ప్రియముగా అగుచున్నాడు. **తన ప్రియము కొరకు బ్రాహ్మణుడు. అంతేగాని బ్రాహ్మణుని ప్రియము కొరకో, (లేక) ఎవరి ప్రమేయము కొరకో – తాను ప్రియము కలిగి ఉండటము లేదు.**

– ఒకానొకనికి క్షత్రియుడు ప్రియమగుచున్నాడు. (లేక) క్షాత్రము ప్రియము – ప్రీతి అగుచున్నది. ఎవరి కొరకు? ఆ క్షత్రియుని ఆనందము కొరకా? కాదు. తన ప్రియము, ఆనందము కొరకే క్షత్రియుడు గాని, క్షాత్రముగాని తనకు ప్రియముగా అగుచున్నాయి. **తన ప్రియము కొరకు క్షత్రియుడుగాని, క్షత్రియుని ప్రియము కొరకు క్షత్రియుడు, క్షాత్రము ప్రియము అవటంలేదు.**

ఒకానొకనికి **"ఈ లోకమంతా కూడా నాకు ప్రియము – ఇష్టము"**.... అని అనిపిస్తోందనుకో! ఆతని యొక్క ఆ ప్రియము (లేక) ఇష్టము లోకము యొక్క ప్రయోజనము కొరకా? కాదు. తాను లోకమును ఇష్టపడటముచేత, తనకొరకే లోకము ఇష్టవస్తువు అగుచున్నది. **తన ప్రియము కొరకు లోకముగాని, లోకముయొక్క ప్రియముకొరకు తాను ప్రియము పొందటంలేదు.**

– మరొకనికి దేవతయో, దేవతలో అత్యంత ప్రియముగా అగుచున్నారు. ఎందుకు? ఆ దేవత యొక్క ప్రయోజనము కొరకై, ఆనందము కొరకై ఈతడు ఇష్టము – ప్రియము కలిగి ఉంటున్నాడా? లేదు. **తనయొక్క ఇష్టము కొరకై, ప్రయోజము కొరకై, ఈతడు ఆ దేవతపట్ల ప్రియత్వము – ఇష్టము** కలిగి ఉంటున్నాడు. తన ఇష్టము – ప్రియము కొరకు ఇష్టదేవత. అంతేగాని ఆ ఇష్టదేవత ప్రియము కొరకు తాను ప్రియత్వము వహించటము జరగటం లేదు.

ఒకనికి వేదములు, వేదపండితులు ఇష్టమైనవారగుచున్నారనుకో. అట్టి ఆతని ఇష్టము వేదముల–వేదపండితుల ప్రయోజనము కొరకా? కాదు. తనకు వేదములంటే ప్రియము. అందుకే తనకొరకు, తన ప్రయోజనము కొరకు వేదములు, వేదపండితులు తనకు ప్రియమగుచున్నారు. **తనకు ఇష్టము కాబట్టి వేదములు పఠిస్తున్నాడు. అంతేగాని వేదముల ప్రీతికొరకై తాను పఠించుటలేదు.**

ఇంకొకనికి భూతజాలమంటే (చిలకలు, కుక్కలు, పిల్లులు, మేకలు, మొదలైనవి) అంటే ఎంతో ప్రియము. మరొకరికి భిక్షకునికి దానము చేయటము, పేదపిల్లలను చదివించటము, ఆశ్రమములకు ధన సమర్పణ...ఇటువంటివంటే ఎంతో ఇష్టము. అదంతా ఆతడు ఆయా ధనము – సేవ పొందు వారి ప్రయోజనము కొరకై అయిఉన్నదా? కాదు. తనయొక్క ప్రియత్వ ప్రయోజనము కొరకై ఆతడు పక్షులకు ఆహారము, పేదలకు దానము నిర్వర్తిస్తున్నాడు. ఆత్మ తృప్తి పొందుచున్నాడు. **తన ప్రీతి, తృప్తి కొరకు భూతజాలము పట్ల ప్రేమ. అంతేగాని, భూతజాలముయొక్క ప్రీతి కొరకై తాను ప్రేమ కలిగి ఉండటము లేదు.**

ఈ విధంగా **ఆత్మతృప్తియే** జీవులందరి **లక్ష్యము, ఆశయము, ఇష్టము కూడా।**

ఎవడు దేనియొక్క ప్రయోజనమును ఉద్దేశించి ఏది నిర్వర్తించినా కూడా..., అదంతా ఆయా అవతల వారి ప్రియము కొరకు కాదు. తనకు (ఆత్మకు) **'ప్రియము'** అనే ప్రయోజనము సిద్ధించటానికే అవన్నీ నిర్వర్తిస్తున్నాడు. ఎవ్వరు ఏది చేసినా (అది పూజ కావచ్చు, తీర్థయాత్రలు కావచ్చు, దైవారాధన కావచ్చు, ఇంకేదైనా కావచ్చు, పుట్టటము కావచ్చు, స్నేహములు కావచ్చు) .....అటువంటివన్నీ ఇతరుల ప్రయోజనములు ఆశించి చేస్తున్నట్లు పైకి కనిపిస్తున్నప్పటికీ, **వాస్తవానికి అవన్నీ 'ఆత్మతృప్తి' కొరకే చేస్తున్నాడు.**

అంటే...అర్థమేమిటి? ఏది ఎందుకొరకు చేసినా, అది **ఆత్మతృప్తి, ఆత్మను సంతోషింపజేయడమే** అంతర్లీనమైన ఉద్దేశ్యము అయి ఉన్నది – అని కదా!

## సిద్ధాంతము

పై విశేషములను దృష్టిలో పెట్టుకొని ఈ విధముగా సిద్ధాంతీకరించబడుచున్నది.

ఎద్దాని ప్రియము కొరకు, తృప్తికొరకు (జన్మ జన్మాంతరములు మొదలైన వాటితో సహా) సర్వకర్మలు, వ్యవహారములు నిర్వర్తించబడుచున్నాయో,.. అట్టి ఆత్మయే – **ఆత్మా వా అరే ద్రష్టవ్యః । శ్రోతవ్యో। మన్తవ్యో।** నిదిధ్యాసితవ్యో। **(6–5–6).**

**ఆత్మయే సర్వదా....**

→ దర్శింప తగినది। → వినతగినది।
→ మననము చేయతగినది। → ధ్యానము చేయతగినది।
→ మమేకమవతగినది।

**అందరి ఆశయము ఆత్మానందమే। కాబట్టి, అఖండము, అమృతస్వరూపము అగు ఆత్మయే సర్వదా, సర్వత్రా, సర్వముగా ఉపాసించబడు గాక।**



**ఓ మైత్రేయీ!**

మట్టి గురించి తెలిస్తే,... మట్టి బొమ్మలన్నిటి యొక్క మూల విశేషమేమిటో తెలిసిపోతుంది కదా! అట్లాగే శ్రవణ – మనన – నిది ధ్యాసలు సహాయముతో నీవు 'ఆత్మ' గురించి తెలుసుకొన్నావా,...

ఇక లోకములు – లోకపాలకులు మొదలైన వాటితో కూడి ఈ సర్వము యొక్క తత్త్వమేమిటో నీకు తెలిసిపోతుంది. **ఎందుకంటే ఇదంతా కూడా ఆత్మయే (లేక) బ్రహ్మమే అయి ఉన్నది కాబట్టి.**

ఎవ్వడు దేనిని **'ఇది బ్రహ్మమునకు వేరు'** అని తలుస్తాడో, **అద్దానిచే ఆతడు పరాభవించబడగలడని** శ్లోకములు ఈ విధంగా గానం చేస్తున్నాయి.

**"నేను వేరు – ఇది వేరు" అనుకొనువాడు అద్దానిచే పరాభవించబడుచున్నాడు.**

ఎవ్వడైతే → **'బ్రాహ్మణుడు ఆత్మకంటే భిన్నము'** అని భావిస్తాడో,

ఆతడు బ్రాహ్మణుని (బ్రహ్మణ్యము)చే పరాభవించబడుచున్నాడు.

– అట్లాగే ఎవ్వడు **"క్షత్రియుడు – వైశ్యుడు– శూద్రుడు వేరు.. ఆత్మవేరు"..** అను నిర్ణయము కలిగి ఉంటాడో, అట్టివాడు ఆ క్షత్రియ వైశ్య శూద్రులచే పరాభవించబడుచున్నాడు.

– ఎవ్వడైతే **"ఆత్మవేరు – ఇక్కడి 14 లోకములు వేరు"..** అను అభిప్రాయము పెంపొందించుకొని ఉంటాడో, అట్టివాడు లోకములచే పరాభవించబడుచున్నాడు.

– ఎవ్వడైతే **"ఆత్మ (లేక నేను) వేరు – దైవము వేరు"..** అని అనుకొంటూ ఉంటాడో, **ఆతడు దైవముచే పరాభవించబడుచున్నాడు.**

ఎవ్వడైతే **"ఆత్మ వేరు – వేదములు వేరు"...** అని తలుస్తాడో, ఆతడు వేదములచే పరాభవించబడుచున్నాడు.

ఎవ్వడైతే **"ఈ కనబడే సమస్త ప్రాణులు వేరు–ఆత్మనగు నేనువేరు–(లేక) బ్రహ్మము వేరు"..** అను ఉద్దేశ్యముతో దర్శిస్తూ ఉంటాడో,.. **అట్టివాడు... సకల ప్రాణులచే పరాభవించబడగలడు.**

ఎవ్వడైతే **'సర్వము ఆత్మకంటే వేరు'** అని అనుకుని చూస్తూ ఉంటారో..., ఆతడు **సర్వము చేత పరాభవించబడుచున్నాడు.**

ఎందుచేత? **సర్వము ఆత్మయే కాబట్టి!**

– "చాతుర్వర్ణ్యములు, లోకములు, దేవతలు, వేదములు, ప్రాణులు... సర్వము సర్వదా ఆత్మయే। బ్రహ్మమే। ఆత్మనగు నేనే"। → అను దృష్టిని కలిగియుండెదవు గాక। ఆత్మకు అన్యముగా ఏదీ లేదు. **అంతా ఆత్మయే సర్వదా అయి ఉన్నది.**

ఓ ప్రియ మైత్రేయా!

– ఒకచోట ఒక భేరీ నినాదము పెద్దగా మ్రోగుచూ ఉంటే,... ఇక తదిరత వాయిద్యముల శబ్దజాలము వినము చూచావా? అట్లాగే ఈ చాతుర్వర్ణ్యములు, లోకములు, దేవతలు, సర్వజీవులు, వేదములు... 'ఆత్మ భేరీ నినాదము' ప్రక్కన చిన్నవాయిద్యపు ధ్వనుల వలె చూడాలి। **అన్నీ ప్రక్కకు నెట్టి ఆత్మనే దర్శించాలి.**

శంఖము పెద్దగా ఒకడు ఊదుతూ ఉంటే తాటిఆకుల కదలిక శబ్దములు గుర్తింపుబడవు కదా! మృదుమధురముగా వీణ వాయిస్తూ ఉంటే, తదితర జనుల గుసగుస శబ్దములు వినబడవు కదా!

అట్లాగే 'ఆత్మ' గురించిన శాస్త్ర – గురు ప్రవచితములగు నినాదములు, పార్యాంశములు, అభివర్ణనములు, వివరణలు వింటూ ఉంటే, ఇక ఏఏ భేద దృష్టులు ప్రవర్తిస్తున్నాయో, అవన్నీ వినబడక, **"సమం సర్వేషు భూతేషు। సమవత్ స్థితమ్ ఈశ్వరమ్।"**.. అను ఆత్మనాదమే నీ చెవులకు సోకు గాక! **తదితరములు ఆత్మనాదము ముందు మంద్రనాదములై పట్టించుకోబడనివి అగుగాక!**

తడి కట్టెలను అగ్నిచే స్పృశింపజేసినప్పుడు పొగలు బయల్వెడలునట్లు, ఆత్మ నుండే చాతుర్వర్ణ్యములు, సకల జీవులు, వారివారి లోకములు, వేదములు... ఇవన్నీ బయల్వెడలుచున్నాయి. పరమాత్మ అనే అగ్ని ఉండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఇతిహాసములు, పురాణములు, ఉపనిషత్తులు, వ్యాఖ్యానములు, ఇహపరలోకములు, సమస్త జీవరాశులు పొగల వలె, అగ్ని శిఖల వలె బయల్వెడలుచున్నాయి. ఇవన్నీ పరబ్రహ్మము యొక్క నిట్టూర్పు, వాయు తరంగముల వంటివే!

- ఏవిధంగా, సమస్తమైన ఉదకములకు సముద్రమే ఉనికి స్థానము అయి ఉన్నదో...,
- సమస్తమైన **స్పర్శలకు** చర్మము ముఖ్యస్థానమో,
- తీపి–చేదు మొదలైన సమస్తమైన **రుచులకు** నాలుక ముఖ్యస్థానమో,
- సుగంధము – దుర్గంధము మొదలైన **సర్వ గంధములకు** ముక్కు (ఘ్రాణేంద్రియము) ముఖ్యస్థానమో,
- అందము– అందవికారము మొదలైన **సర్వరూపములకు** కన్ను ముఖ్యస్థానమై ఉన్నదో..,
- మధురము – బాధ – ఆనందము – దుఃఖము కలిగించు **శబ్దములన్నిటికీ** చెవులే ముఖ్యస్థానమై ఉన్నాయో...,
- సమస్తమైన ఆలోచనలకు, సంకల్ప–వికల్పములకు **మనస్సే** జనన – లయ ముఖ్యస్థానమో...,
- సమస్తమైన విద్యలకు **బుద్ధియే** ముఖ్య స్థానమో,
- సర్వ కర్మలకు **చేతులు** ముఖ్య స్థానమై ఉన్నాయో,
- ఆనందములకు **ఉపస్థ** ముఖ్యస్థానమై యున్నదో,
- (మల)విసర్జనకు **గుదమే** ముఖ్య స్థానమైయున్నదో,
- సర్వ నడకలకు **కాళ్లే** ముఖ్యస్థానమై ఉన్నాయో,
- సమస్త వేదోచ్ఛారణలకు **వాక్ ఇంద్రియమే** ముఖ్యస్థానమై యున్నదో...,

**ఆ విధంగానే ఈ సర్వమునకు ఆత్మయే ముఖ్య స్థానము.**

ఒక ఉప్పు స్ఫటికము (గడ్డ) యొక్క బయట – లోపల కూడా ఘనీభవించిన సముద్రజలములోని ఉప్పు రసమే ఏర్పడి ఉన్నది కదా? ఆకారము ఇత్యాదులు ఉప్పురసము నుండి వేరు కాదు కదా! అట్లాగే, ఈ కనబడేదంతా కూడా బాహ్య అభ్యంతర రహితము అయినట్టి సర్వాత్మకమగు **ప్రజ్ఞానము (ఎరుక) యొక్క ఘనీభూత రూపమే!**

అట్టి నిర్వికల్ప–నిరాకార – సర్వాతీతమగు ఆత్మయే స్వకీయ మాయారచనచే **'జీవాత్మ'గా అయి, పంచభూతముల నుండి దేహమును పొంది, పంచభూతములందే దేహమును త్యజిస్తోంది.** మరొకప్పుడు ఆత్మజ్ఞానముచే జీవాత్మత్వమును త్యజించి **సర్వాత్మత్వమును ధ్యానించి, సర్వాత్మకమై, బ్రహ్మమే తానై వెలుగొందుచున్నది.** సర్వసంబంధ–అనుబంధ – బాంధవ్యములను త్రోసిరాజని ఏకాత్మ అయి ప్రకాశిస్తోంది. ఇక **అట్టి ఆత్మ ప్రజ్ఞాస్వరూపునికి నామ రూపాత్మకమైన పరిమితములు ఉండవు.**

**మైత్రేయి :** స్వామీ! మహాత్మా! ప్రాణనాథా! బ్రహ్మజ్ఞా! **"ఈ దేహము మొదలైన సంఘాతముల నుండి ఆత్మజ్ఞానముచే అతీతత్వము సంపాదించుకొన్న తరువాత, ఇక ఆపై పరిచ్ఛిన్న రూపమగు అభిమాన పూర్వకమైన ప్రజ్ఞ ఉండదు"** – అని మీరు చెప్పుచున్నట్లునాకనిపిస్తోంది. అనగా బ్రహ్మజ్ఞానము సంపాదించుకున్న తరువాత ఈ దేహము ఉండదా! పతిదేవులుగా మీతో సంపాదించుకున్న ఆప్యాయత మొదలైనవి ఉండవా? తొలగిపోతాయా?

**"... ఆత్మజ్ఞానముచే అపరిచ్ఛిన్నత్వము సిద్ధిస్తుంది"..** అని మీరు చెప్పుచున్నప్పుడు, మీరు నన్ను మరింతగా మోహకూపములో దింపుచున్నవారగుచున్నారు. అన్నీ పోగొట్టుకొని ఆత్మను సంపాదించుకోవటమనుదానిని – నేను సానుకూల్యమైన స్థానముగా అర్థం చేసుకోలేకపోవుచున్నాను. ఆత్మ వస్తువు ఎట్టిదో గ్రహించలేకపోవుచున్నాను.

**యాజ్ఞవల్క్యుడు :** ఓ మైత్రేయీ! నేను నిన్ను మోహము నందు ఉంచి ఉంచాలనే ఉద్దేశ్యముతో నీకు ఇవన్నీ చెప్పటము లేదు. అట్టి అభిలాషతో నాకేమి పని? నేను **నీ ఆత్మ యొక్క ధర్మము ఎట్టిదో, అది వివరించి చెప్ప ప్రయత్నిస్తున్నాను.** అంతవరకే!

(1) నీవు స్వతఃగా సహజముగా, సర్వదా ఆత్మస్వరూపిణివేగాని, దేహ–మనో–బుద్ధి–అహంకార స్వరూపుడవు కావు. **అవన్నీ ఆత్మయందు ఆత్మచే కల్పనగా కనిపిస్తున్నవి మాత్రమే!**

(2) ఒక్క **'ఆత్మ'**కు మాత్రమే 'వినాశనము' అను స్వభావము లేదు. మార్పు–చేర్పు లేనట్టిది. అద్దానికి వికార రూపమైన నాశనముగాని, అభావరూపమైన స్థితిగాని లేదు.

(3) ఆత్మయే ఈ సర్వమునకు కారణము, ఆధారము.

(4) నీవు ఆత్మ స్వరూపమును త్యజించు క్షణమే లేదు. అది జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో నిన్ను వీడదు. ఎందుకంటే అవన్నీ దశలై ఉండగా, **నీవు వాటిని దశలు తనవిగా కలిగి ఉన్నట్టి ఆత్మవు.**

(5) ఆత్మకు సమస్తము ప్రియమే. మధురమే. కనుక నీవు దేనిపట్ల ఏదీ (ఆత్మజ్ఞానానంతరము) పోగొట్టుకొనేది ఉండదు.

ఈ విషయమే నేను నీ ఆత్మ గురించి చెప్పుచున్నాను. ఇందులో మోహమునకు తావెక్కడిది? మనో–బుద్ధి–చిత్త–అహంకారములకు, సంబంధములకు, తదితర భర్త – భార్య ఇత్యాది అనుబంధములకు ఆత్మజ్ఞానముచే తొలగటము అనే మాటెక్కడిది?

**సహజ సత్యము సమక్షములో అవన్నీ సందర్భసత్యములుగా నీవు గుర్తించగలగుతావు. అదియే ఆత్మజ్ఞానము యొక్క ప్రయోజనము.**

# అద్వితీయమ్।

ఎప్పుడు ద్వైతము అనుభవమునకు వచ్చుచున్నదో – అక్కడ ఆత్మయే:

- **తాను వేరై, తనకు వేరైనట్లుగా శబ్ద – స్పర్శ – రూప–రస–గంధములను – చెవి, చర్మము, నాలుక, ముక్కు ద్వారముల ద్వారా కల్పించుకొని...**

**"అనుభవించువాడు – అనుభవములు"** అను *ద్వైతమును తనకు తానే క్రీడావినోదంగా కల్పించుకొనుచున్నది.*

ఒకడు దారిలో నడుస్తూ త్రోవలో ఒకచోట కొంతమంది ఆటలు ఆడుకుంటూ ఉండగా తనను కొంతసేపు ఏమరచి, ఆ ఆటలలోని కదలికలను విశేషాలను ఆస్వాదిస్తున్నట్లుగానే, **అఖండము – నిత్యము – నిత్యసత్యము అగు ఆత్మ–కొంతసేపు లీలా వినోదముగా ద్వితీయమును కల్పించుకొని,** (దర్పణములో ప్రతిబింబము వంటి జీవాత్మ (లేక) దేహిని కల్పించుకొని) **దృశ్యములను, ఉపాధి పరంపరలను పొందుచున్నది.**

– ఆత్మ తన సర్వత్వమును, అప్రమేయత్వమును ఏమరచినప్పుడు, **అజ్ఞానమును అంగీకరిస్తోంది.** అజ్ఞానమును స్వీకరించి, ఆత్మయే స్వయముగా దృశ్యానుభూతమును పొందుతోంది, ఆస్వాదిస్తోంది.

ఎక్కడ పైరీతిగా **ద్వైతము** ప్రవర్తించుచున్నదో, అక్కడ మాత్రమే అట్టి అజ్ఞానావస్థ యందు...

→ ఒకటి చూచునది – మరొకటి చూడబడునది;

→ ఒకటి వినునది – మరొకటి వినబడునది;

→ ఒకటి స్పృశించునది – మరొకటి స్పృశించబడునది;

→ ఒకటి వాసన చూచునది – మరొకటి వాసనారూపము;

→ ఒకటి రుచి ఆస్వాదించునది – మరొకటి రుచికరములగు పదార్థములు,

→ ఒకటి మాట్లాడునది – మరొకటి మాట్లాడబడు విషయములు –

... అనునదంతా ప్రత్యక్షానుభవమగుచున్నది. అయితే, ఈ అనుభవమయే సమస్తము కూడా **ఆత్మయందే జనిస్తూ, ఆత్మకు అనన్యము అయి ఉన్నది.**

ఎక్కడ **అద్వైత సత్యము** – ద్వైతమునకు ఆధారమై, ద్వైతమునకు ఆవల 'జ్యోతిరాత్మ'గా ప్రకాశించుచున్నదో, **ఎక్కడ నీవు అఖండాత్మవై ఉన్నావో,** (స్వప్నము తనదైనవాడు స్వప్నమంతా తన ఊహా రూపముగా విస్తరించువానివలె) **సర్వము స్వయముగా నీవే అయి ఉన్నావో...** అక్కడ ఇక →

| | | |
|---|---|---|
| చూచేవాడెవ్వడెవ్వడు? | – | చూడబడేది ఏమిటి? |
| వినేవాడెవ్వడు? | – | వినే బాహ్య శబ్దము లెక్కడివి? |
| ఆఘ్రాణించేవాడెవ్వడు? | – | వాసన చూబడునది ఎక్కడివి? |
| ఆలోచించువాడెవ్వడు? | – | ఆలోచనలు ఎక్కడివి? |
| తెలుసుకొనువాడెవ్వడు? | | తెలియబడునది ఎక్కడిది? |

స్వప్న – జాగ్రత్ – సుషుప్తులలో **తెలుసుకొనేది, తెలియబడేది, తెలుసుకొనువానిని తెలుసుకొనుచున్నది** – నీ ఆత్మయే। నీ స్వస్వరూపమే। ఆత్మయే ఆత్మను ఆత్మగా ఎరుగుచున్నది। అంతయూ ఆత్మయే। నీకు ఎరుగబడుచున్నదంతా నీ ఆత్మ స్వరూపమే। నీవో? ఆత్మస్వరూపుడవే। నీలోని సాక్షి కూడా ఆత్మయే।

***ఇట్టి ఆత్మజ్ఞానమే.. నీ యొక్క ఆత్మ మహిమను గుర్తు చేసి చూపుతోంది. ఆత్మయే నీయొక్క అమృతత్వరూపమగు స్వమహిమ!***

ఇదంతా నీ స్వమహిమ అయి ఉండగా నీకు బంధమెక్కడిది చెప్పు?

బంధమే ఉండజాలనప్పుడు నీవు మోక్షస్వరూపివే కదా। క్రొత్తగా సంపాదించుకోవలసిన 'మోక్షము' అనబడేది – ఎక్కడ ఉన్నది?

***ఓ అమృత – మోక్ష స్వరూప మైత్రేయీ! నామధేయ మమాత్మ స్వరూపమా!***

ఆత్మనై ఆత్మగా దర్శిస్తూ, ఆత్మగా ఉపాసిస్తూ నీవు–నేను అను భేదమే లేని అఖండాత్మగా నన్ను – నిన్ను అనుక్షణికంగా దర్శించుచున్నాను.

విన్నావా ఓ మైత్రేయీ! **ఇదియే అమృతమగు మోక్ష మార్గము.**

ఈ విధంగా ఆత్మతత్త్వమును ఉపదేశించి యాజ్ఞవల్క్యుడు మౌనము వహించారు. మైత్రేయి యాజ్ఞవల్క్యుని వాక్యార్థములు గ్రహించి **అఖండాత్మ భావనను పునికిపుచ్చుకొని స్వయం ప్రకాశమానమై ఆనందించసాగింది.**

***ఇతి బృహదారణ్యకోపనిషత్ షష్ఠమ అధ్యాయమ్***

***'మైత్రేయీ బ్రాహ్మణమ్' నామ పంచమ బ్రాహ్మణమ్***

***సమాప్తమ్।***

## బృహదారణ్యకోపనిషత్
## '6'వ అధ్యాయము - '6'వ బ్రాహ్మణము
## గురుపరంపరా నమస్కారము
## వంశగురుభ్యోన్నమః। శ్రీ గురుభ్యోన్నమః

| | | |
|---|---|---|
| పౌతిమాష్యాత్ | - | పౌతిమాష్యాయ నమః। |
| గౌపవనాత్ | - | గౌపవనాయ నమః। |
| కౌశికాత్ | - | కౌశికాయ నమః। |
| కౌండిన్యాత్ | - | కౌండిన్యాయ నమః। |
| శాండిల్యాత్ | - | శాండిల్యాయ నమః। |
| గౌతమాత్ | - | గౌతమాయ నమః। |
| అగ్నివేశ్యాత్ | - | అగ్నివేశ్యో నమః |
| గార్గ్యాత్ | - | గార్గ్యో నమః। |
| సైతవాత్ | - | సైతవ నమః। |
| పారాశర్యాత్ | - | పారాశర్యాయ నమః। |
| గార్గ్యాయణాత్ | - | గార్గ్యాయ నమః। |
| ఉద్దాలకాయనాయాత్ | - | ఉద్దాలకాయనాయ నమః। |
| జాబాలాయనాత్ | - | జాబాలాయ నమః। |
| మాధ్యన్దినాయనాత్ | - | మాధ్యన్దినాయ నమః। |
| సౌకరాయణాత్ | - | సౌకరాయణే నమః। |
| కాషాయణాత్ | - | కాషాయణాయ నమః। |
| సాయకాయనాత్ | - | సాయకాయనే నమః। |
| కౌశికాయనాత్ | - | కౌశికాయ నమః। |
| ఘృతకౌశికాత్ | - | ఘృతకౌశికాయ నమః। |
| పారాశర్యాత్ | - | పారాశర్యాయ నమః। |
| జాతూకర్ణ్యాత్ | - | జాతూకర్ణ్యాయ నమః। |
| ఆసురాయణయాస్కాత్ | - | ఆసురాయణయాస్కాయ నమః। |
| త్రైవణాత్ | - | త్రైవణే నమః। |
| ఔపజన్ధనాత్ | - | ఔపజన్ధనే నమః। |
| ఆసురేరాత్ | - | ఆసురేరాయ నమః। |

| | | |
|---|---|---|
| భారద్వాజాత్ | - | భారధ్వాజాయ నమః। |
| ఆత్రేయాత్ | - | ఆత్రేయాయ నమః। |
| మాండేయాత్ | - | మాండేర్నమః। |
| గౌతమోగౌతమాత్ | - | గౌతమోగౌతమాయ నమః। |
| వాత్స్యాద్వాత్ | - | వాత్స్యద్వాయ నమః। |
| శాండిల్యాత్ | - | శాండిల్యాయ నమః। |
| కైశోర్యాత్ | - | కౌశోర్యకాప్యాయ నమః। |
| కాప్యాత్ | - | కాప్యాయ నమః। |
| కుమార హారితాత్ | - | కుమారహారితే నమః। |
| గాలవాత్ | - | గాలవో నమః। |
| విదర్భీ కౌండిన్యాత్ | - | విదర్భీ కౌండిన్యే నమః। |
| వత్సనపాతో బాభ్రవాత్ | - | వత్సనపాతో బాభ్రవాయనమః। |
| పథాస్సౌభరాత్ | - | పథాస్సౌభరో నమః। |
| యాస్య అంగీరసాత్ | - | యాస్య అంగీరసాయ నమః। |
| ఆభూతేస్త్వాష్ట్రాత్ | - | ఆభూతిస్త్వాష్ట్రాయ నమః। |
| విశ్వరూపత్వాష్ట్రాత్ | - | విశ్వరూపత్వాష్ట్రాయ నమః। |
| దధీచ ఆథర్వణాత్ | - | దధీచ ఆథర్వణాయ నమః। |
| దైవోమృత్యోః ప్రాధ్వగ్సనాత్ | - | దైవోమృత్యో ప్రాధ్వసనే నమః |
| ప్రాధ్వగ్ంసనాత్ | - | ప్రధ్వగ్ంసాయ నమః। |
| ఏకఋషేపాయాత్ | - | ఏకర్షి నమః। |
| విప్రచిత్తాత్ | - | విప్రచిత్తే నమః। |
| యష్టేత్ | - | యష్టేన్నమః। |
| సనారో | - | సనారు నమః। |
| సనాతనాత్ | - | సనాతన నమః। |
| సనకాత్ | - | సనకాయ నమః। |
| పరమేష్ఠినః | - | పరమేష్ఠీ నమః। |
| బ్రహ్మణో బ్రహ్మ | - | స్వయంభు బ్రహ్మణే నమః। |

ఓం బ్రహ్మాదిభ్యో। బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృద్భ్యో।
వంశఋషిభ్యో। మహద్భ్యో। గురుభ్యోన్నమః।
ఇతి బృహదారణ్యకోపనిషత్। షష్ఠమధ్యాయః। షష్ఠమబ్రాహ్మణః।

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## సప్తమ అధ్యాయః

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ "పూర్ణమ్ అదః, పూర్ణమ్ ఇదం।
పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।
పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ–
పూర్ణమ్ ఏవ అవశిష్యతే।



<u>పరమాత్మ</u> → అదః పూర్ణమ్। అయ్యది పూరించునది। వర్ధిల్లునది। నిరాకారము। సంపూర్ణము। ఆకాశము వలె సర్వ వ్యాపకము. అట్టి కారణ రూపమగు పరతత్త్వ పురుషుడు సర్వదా స్వయముగా పూర్ణుడే!

ఇదమ్ (జగత్తు) - పూర్ణమ్। అనేక విశేషములతో కూడిన ఈ దృశ్య జగత్తు-పరమాత్మచే పూరించబడునది, పరమాత్మనుండి వర్ధిల్లునట్టిది; సాకారము; సర్వత్ర వ్యాపింపజేయబడినది; కార్యరూపము; దృశ్యరూపమై ఉన్నది. ఆధేయము. అట్టి ఈ కార్యరూప జగత్తు కూడా (నిరాకార జలములో సాకార తరంగములవలె) పూర్ణమే.

ఇదమ్ (జీవో) ? (పరమాత్మయొక్క అంశగా) జీవాత్మ కూడా పూర్ణుడే। పూర్ణమగు పరమాత్మ నుండి పూర్ణమగు ఈ జగత్తు జీవాత్మలు ప్రదర్శితమగుచుండగాకూడా, <u>స్వస్వరూప పరమాత్మ పూర్ణముగానే ఉన్నారు. అదియే నేను।</u>

## సప్తమాధ్యాయః - ప్రథమం బ్రాహ్మణము

### ఖిలకాండము – ఓం ఖం బ్రాహ్మణము

1 ఓం 3 (ఉ) ఖం బ్రహ్మ।
ఖం పురాణం।

**ఓం ఖం బ్రహ్మ।** → ఈ ఎదురుగా ఉన్న ఆకాశము ఓంకారార్థమగు బ్రహ్మస్వరూపమే। ఓం - బ్రహ్మాకాశము. **'ఓం' అని ఉచ్చరిస్తూ, భౌతికాశమును ఉపకరణంగా చేస్తూ పరమాత్మను ధ్యానించాలి.**

**'ఖం'** → ఆకాశము భూ - జల - అగ్ని - వాయువుల కంటే మునుముందే ఉన్నది. కనుక సనాతనము. పురాణము. **(**మొదలే గల సూక్ష్మతత్త్వము**)**

వాయురం 'ఖం' ఇతి।
హ స్మాహ కౌరవ్యాయణీ పుత్రో।

వాయువునకు ఆధారము ఆకాశము అయి ఉన్నది. ఆకాశమే బ్రహ్మముగా ఉపాసించాలి... అని కౌరవ్యాయణి యొక్క పుత్రుడగు ఒక ఋషి చెప్పు సిద్ధాంతము.

వేదో అయం బ్రాహ్మణా విదుః।
వేదైనేన యత్ వేదితవ్యమ్॥

<u>ఇతి "ఖం బ్రాహ్మణం" నామ</u>
<u>ప్రథమ బ్రాహ్మణమ్॥</u>

"ఈ ఓంకారమే వేదరూపము".. అని వేదవేత్తలు ప్రకటన చేయుచున్నారు. ఏ ఆత్మ గురించి ఈ జీవుడు తెలుసుకోవాలో అట్టి ఓంకార బ్రహ్మమును ('ఓం) ఖం' ఆకాశమును (Vacant space) ఓంకార రూపముగా ఉపాసించటము - అను సాధనను ఆశ్రయించెదముగాక।

**ఇతి 'ఖం' బ్రాహ్మణమ్ నామ ప్రథమ బ్రాహ్మణమ్.**

# సప్తమాధ్యాయః - ద్వితీయం బ్రాహ్మణము

## "ప్రజాపత్య బ్రాహ్మణము"

1 త్రయాః ప్రజాపత్యాః।
ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్యమ్ ఊషుః ।
దేవా, మనుష్యా, అసురా ఉషిత్వా।
బ్రహ్మచర్యం దేవా ఊచుః
బ్రవీతు నో భవాన్। ఇతి।

బ్రహ్మమును సిద్ధించుకోవటానికై ఆకాశమును పరమాత్మగా ఉపాసించటమంటే **నిరాకార - నిర్గుణ తత్త్వమును ఉపాసించటమే.** అయితే, ఏకాగ్రతకు ఆకాశము కష్టతరమైన ఉపాసన. అందుచేత సత్త్వగుణ సంపన్నులు (దేవతలు), రజోగుణ సంపన్నులు (మనుష్యులు), తమోగుణ సంపన్నులు (అసురులు)... ఈ త్రి స్వభావములు గల దేవ-మానవ-అసుర జీవులు తమను సృష్టించిన సృష్టికర్తయగు ప్రజాపతిని (బ్రహ్మదేవుని) సమీపించారు. **"ఓ ప్రజాపతీ! మమ్ములను సృష్టించిన స్వామీ! మేము బ్రహ్మచర్యమును (బ్రహ్మమును) ఉపాసించటానికై సాధనమును ప్రసాదించండి.."** అని అభ్యర్థించారు.

---

తేభ్యో హైతత్ అక్షరం ఉవాచ।
**"ద"** ఇతి వ్యజ్ఞాసిష్టా 3 (ఉ) ఇతి। వ్యజ్ఞాసిష్మేతి।
హెూచుః దామ్యతేతి।।
న ఆత్థేతి। "ఓం" ఇతి।।

వారందరికి ప్రజాపతి **"ద"** అను వర్ణమును ఉపదేశించారు. వారు ఆ ఉపదేశమును బ్రహ్మతత్త్వమును ఉపాసించుట కొరకై ఉపకరణముగా స్వీకరించారు. **"ద" అనిబాహ్య అభ్యంతరములలో పలుకుచూ ఆత్మోపాసన చేయ సాగారు.**

కొంతకాలం తర్వాత ప్రజాపతి మొట్టమొదట దేవతలను పిలిచారు.

**ప్రజాపతి :** ఓ దేవతలారా! మీరు **'ద'** వర్ణమును ఆశ్రయించి ఆత్మోపాసన చేస్తున్నారు కదా! అక్షరముతో అనుసంధానం చేసే యత్నము చేస్తున్నారా?

**దేవతలు :** ఔను! హే ప్రజాపతీ! పితామహా! మీరు ప్రసాదించిన **'ద'** వర్ణము అక్షర బ్రహ్మయోగమార్గముగా ఉపాసిస్తున్నాము.

**ప్రజాపతి :** **'ద'**... అను వర్ణమునకు ఏమని అర్థము తెలుసుకొన్నారో... చెప్పండి? వింటాను!

**దేవతలు :** స్వామీ! ఇతఃపూర్వము మేము ఇంద్రియ వ్యాపారముల పట్ల ఆకర్షితులమై ఉన్నాము. అందుకే బ్రహ్మమును ఎరుగ లేక పోవుచున్నాము. మీరు **'ద'** అను వర్ణము ద్వారా - "ఇంద్రియ నిగ్రహము లేని మీరు ఇంద్రియ నిగ్రహము కలవావరలు అవండి".. అని మాకు బోధించినట్లు గ్రహిస్తున్నాము. మీ పాఠ్యాంశమును ఎరిగి శ్రేయోవాక్యముగా స్వీకరించుచున్నాము. ఇంద్రియ దమమును అభ్యాసంగా ఆశ్రయిస్తున్నాము. (ద = దమము)

---

హ ఉవాచ: (హెూవాచ):
వ్యజ్ఞా సిష్టేతి।।

**బ్రహ్మదేవుడు :** మీరు తెలుసుకోవలసినది తెలుసుకొని సాధనను స్వీకరించారు! మంచిది. కొనసాగించండి, శుభము అగు గాక! వెళ్లిరండి।

---

2 అథ హి ఏనం మనుష్యా ఊచుః :
బ్రవీతు నో భవాన్ ఇతి।
తేభ్యో హైతత్ ఏవ అక్షరం
ఉవాచ : "ద" ఇతి। వ్యజ్ఞాసిష్టా 3 ఇతి।
వ్యజ్ఞాసిష్మే(ష్టే)తి।
హ ఊచు: దత్తేతిన
ఆత్థేతి। 'ఓం' ఇతి।
హెూవాచ (హ ఉవాచ): వ్యజ్ఞాసిష్టేతి।

అప్పుడు ప్రజాపతి మానవులను పిలిచారు.

**ప్రజాపతి :** ఓ మానవులారా! ఏమి చేస్తున్నారు!

**మానవులు :** హే భగవాన్! పితామహా! సృష్టికర్తా! నిర్గుణము - నిరాకారము అగు 'ఓం' కార సంజ్ఞా - ఆత్మోపాసనకొరకై మీరు మాకు త్రోవచూపిన విధంగా **'దం'** వర్ణోపాసనమ్ ఉపక్రమించి నిర్వర్తిస్తూ ఉన్నాము.

**ప్రజాపతి :** అట్లాగా! అక్షర బ్రహ్మోపాసనకు నేను సూచించిన **'దం'** వర్ణమును ఏ రూపముగా అన్వయించుకొని ఉపాసిస్తున్నారు? **'దం'** వర్ణమును అందించుచున్నప్పుడు నా ఉద్దేశ్యమును గ్రహించారా?

**మానవులు** : అవును మహాత్మా! హే సర్వాంతర్యామీ! **'ద'** అను అక్షరము ద్వారా **"దానము చేయండి"** అని చెప్పుచున్నట్లుగా సమన్వయించు కున్నాము. "ఓ మానవులారా! లోభగుణము నుండి బయటకు రండి. 'దానము' అనునది అభ్యసించండి".. అని బోధిస్తున్నట్లు భావిస్తున్నాం!

**ప్రజాపతి** : సరిగ్గా అర్థం చేసుకొన్నారు. **'ద'** వర్ణము ద్వారా **లోభగుణమును తొలగించుకొని ఆత్మతత్త్వజ్ఞులు అయ్యెదరు గాక! వెళ్ళిరండి!**

---

3 <u>అథ హి ఏనం అసురా ఊచుః :</u>

**బ్రవీతు నో భవాన్ ఇతి।**

**తేభ్యో హి ఏతత్ ఏవ అక్షరం,**

**ఉవాచ : 'ద' ఇతి వ్యజ్ఞాసిష్టా 3 ఇతి। వ్యజ్ఞాసిష్మేతి।**

**హ ఊచుః 'దయ ధ్వం' ఇతి।**

**న ఆత్థేతి 'ఓం' ఇతి।**

**హోవాచ : వ్యజ్ఞాసిష్టేతి।**

**ప్రజాపతి** : ఓ అసురులారా! మీరెట్లా అక్షర బ్రహ్మయోగసాధన చేస్తున్నారు?

**అసురులు** : పితామహా! సృష్టికర్తా! మేము మీరు ప్రసాదించిన మార్గము అగు 'ద'ను ఉపదేశిస్తున్నాము.

**ప్రజాపతి** : 'ద' అను అక్షరమును ఏమని తెలుసుకున్నారు?

**అసురులు** : మేము క్రూరులమై దయ-దాక్షిణ్యములు లేకుండా ప్రవర్తిస్తూ ఉన్నాము. అందుచేత మీరు **"ద- దయ - సహప్రాణులయందు దయ-దాక్షిణ్యము కలిగి ఉండండి"**.. అని బోధించినట్లు మేము అర్థము చేసుకుంటున్నాము. సహజీవులందరి పట్ల దయ చూపటమే ఓంకారోపాసనగా భావిస్తున్నాము.

**ప్రజాపతి** : సరియే! మీరూ నా ఉద్దేశ్యమును గ్రహించారు. ఇదియే ఆత్మోపాసన మీకగుచుండునుగాక!

---

**తత్ ఏతత్ ఏవ ఏషా దైవీవాక్ అనువదతి।**

**<u>స్తనయిత్నుః</u> <u>'ద ద ద'</u> ఇతి దామ్యత।**

**దత్త దయధ్వమితి।**

**తదేతత్ త్రయగ్గ్ం శిక్షేత్**

**"దమం దానం దయాం" ఇతి॥**

***<u>ఇతి బృహదారణ్య కోపనిషత్। సప్తమోధ్యాయే।</u>***

***<u>"ప్రజాపత్య బ్రాహ్మణం" నామ ద్వితీయం బ్రాహ్మణమ్॥</u>***

ఈ విధంగా **'దం'** - వర్ణోపాసన దేవతా-మానవ - అసుర త్రివిధ జీవుల ఉపాసనా క్రమమగుచున్నది. ఈనాటికీ కూడా మేఘ ఘర్జనా రూపముతో **'ద ద ద'** అను దైవీవాణిచే వినిపించబడుచూ ఉన్నది.

దం - దమము (ఇంద్రియ నిగ్రహము) కలిగి ఉండండి!

దం-<u>దానము</u> చేయండి!

దం - <u>దయాగుణము</u> కలిగి ఉండండి

అనునది ప్రజాపతి మనందరికీ ఇచ్చు మంత్రము. త్రివిధ జీవులు వారి హృదయాకాశములో కలిగియున్న సంస్కారములననుసరించు త్రివిధ బోధితులు ఆయా అర్థము స్వీకరించసాగారు.

(ప్రజాపతి 'ద-ద-ద'అంటూ దకారమును మూడుసార్లు ఉచ్చరించగానే త్రివిధ జీవులు.. వారి వారి సందేహములను, స్థితులను అనుసరించి, అర్థమును గ్రహించారు.)

అక్షర బ్రహ్మోపాసన చేసి సర్వ సమ స్వరూపమగు బ్రహ్మ భావన సిద్ధింపజేసుకొను నిమిత్తమై, ఓంకారోపాసనగా....

(1) దమము (ఇంద్రియ నిగ్రహము) కలిగి ఉండండి.

(2) దానము చేయండి.

(3) దయను చూపండి.

"-- అను **మూడు మంత్రములు** ప్రవర్తన **పూర్వకంగా అభ్యాసము చేయండి. నేర్చుకోండి" - అని ప్రజాపతిచే జీవులందరికీ బోధించటమైనది.**

# సప్తమాధ్యాయః - తృతీయం బ్రాహ్మణమ్

## "హృదయ బ్రాహ్మణము"

1 **ఏష ప్రజాపతిః, యత్ హృదయం।**
**ఏతత్ బ్రహ్మ। ఏతత్ సర్వం।**

ఈ జీవుని హృదయమే ప్రజలను సృష్టించే ప్రజాపతి (సృష్టికర్త) యొక్క సామ్రాజ్య విశేషము. (సర్వభావాలకు, ఆలోచనలకు, అనుభూతులకు, అనుభవ స్థానము - హృదయమే).

హృదయమే బ్రహ్మ। సకల ప్రాణుల యందు హృదయము దేశకాల పరిచ్ఛేదము లేనిదై ఉన్నది. కనుక - ఆత్మయే అయి ఉన్నది. సర్వమునకు ఆత్మ **హృదయమే**. సమస్తము అక్షర పరబ్రహ్మస్వరూపమే।

---

**తదేతత్ త్ర్యక్షరగ్ం 'హృదయమ్' – ఇతి।**
**<u>'హృ'</u> ఇత్యేకం అక్షరమ్**
**అభిహరన్తి, అస్మై స్వాశ్చ**
**అన్యే చ, య ఏవం వేద।**
**<u>'ద'</u> ఇత్యేకం అక్షరం దదతి అస్మై**
**స్వాచ్ఛాన్యే చ య ఏవం వేద।**

**<u>'హృ' 'ద' 'యం'</u>** అను పేరు గల శబ్దములోని - 3 అక్షరములలోని ఒక్కొక్క అక్షరమును ఏకాక్షరముగా ఉపాసించుటచే ఈ మానవుడు విశేష ఫలమును పొందుచున్నాడు. **హృ**-బ్రహ్మస్వరూపము- కనుక - హృ-హృదయ బ్రహ్మోపాసన - బ్రహ్మోపాసనగా చెప్పబడింది. **'ద'** అను అక్షరమును బ్రహ్మముగా అక్షర బ్రహ్మోపాసన ఉపాసించటము చేత జీవునికి - ఇంద్రియములను, వాటి వాటి ఇంద్రియ శక్తులను → ఉపయోగించేటప్పుడు **'స్వచ్ఛత'** ప్రసాదిస్తున్నది.

---

**<u>'యం'</u> ఇత్యేకం అక్షరమ్ ఏతి స్వర్గం లోకం,**
**య ఏవం వేద।**
***<u>ఇతి బృహదారణ్యా కోపనిషత్, సప్తమాధ్యాయే।</u>***
***<u>'హృదయ బ్రాహ్మణమ్' నామ తృతీయ బ్రాహ్మణమ్॥</u>***

**య** 'అక్షర బ్రహ్మోపాసనః ('య' - ఏకాక్షరమును) పరబ్రహ్మముగా ఉపాసించువారు దేవతల నివాసమగు దేవలోకము పొందుచున్నారు. హృదయమును.. **"నామ బ్రహ్మము"**గాను **"పరబ్రహ్మము"**గాను ఎవ్వరు ఉపాసిస్తారో, వారు మహత్తరమగు విశేష ఫలము పొందుచున్నారు. స్వర్గలోకమును (మరణానంతరము సుఖమయ లోకములను) ప్రాప్తింప జేసుకుంటున్నారు.

"య" = ఎప్పటికీ ఏర్పడినదై, "అక్షరము" - అయి ఉన్నట్టిది.

**(యమ్‌సత్-తత్ "సత్యమ్"।**
**యమ్ హృత్ - తత్ "హృదయమ్"।**
**యమ్ అభిదమ్ - తత్ "అభ్యుదయమ్"।)**

# సప్తమాధ్యాయః - చతుర్థం బ్రాహ్మణమ్

## సత్య బ్రాహ్మణము

1 తద్వై తత్ ఏతత్ ఏవ తదాస సత్యమేవ।
స యో హైతం (హి ఏతం) మహద్యక్షం
ప్రథమజం వేద "సత్యం బ్రహ్మేతి",
జయతి ఇమాన్ లోకాన్।

[ ఇంతకు ముందు చెప్పబడినట్లుగా, **హృదయము పరబ్రహ్మస్వరూపమే।**

- హృదయము <u>మూర్తము</u> (with Form), <u>అమూర్తము</u> (with out Form) కూడా.

- (Matter & Energy) పదార్థము + శక్తిల కలయిక కూడా। అనగా, **పంచభూతాత్మకము, (మరియు) భూతజగత్తుకు ఆవలది - శంకర భాష్యము**].

-హృదయమే సత్యము. ఎవ్వడైతే హృదయమును, సృష్టికి మొట్టమొదటగా ఉన్నట్టి <u>'బ్రహ్మదేవుడే'</u> అని భావన చేస్తూ పంచభూతాత్మక+శక్తి సమన్వితమగు **తత్త్వబ్రహ్మముగా** దర్శిస్తూ ఉపాసిస్తాడో,... సత్య స్వరూపంగా గమనిస్తాడో..., అట్టివాడు ముల్లోకములను జయించగలడు.

---

జిత ఇన్న్వసావసద్య ఏవం
ఏతం మహద్యక్షం
ప్రథమజం వేద <u>సత్యం బ్రహ్మేతి।</u>
సత్యగ్ంం హి ఏవ బ్రహ్మ।

ఆతనికిక ముల్లోకములలో శత్రువులు ఉండరు. ఎందుకంటే, ముల్లోకములు ఆతని హృదయమునందే విరాజిల్లుచున్నవగుచున్నాయి. ఆతడు హృదయ స్వరూపబ్రహ్మ అయి స్వకీయ హృదయాంతరంగముగా సర్వము సందర్శిస్తున్నాడు. **ఆతనికి తన దృష్టియే సృష్టిరూపమని తెలియవస్తోంది.**

**"ఇదంతా నా కథా రచనయే"** - అనుకున్న వానికి తాను వ్రాసిన కథలో తనకు శత్రువులెవరుంటారు? అట్టి సృష్టిప్రారంభమునకు - మునుముందే గల హృదయమే బ్రహ్మము.

అదియే బ్రహ్మదేవుని స్వరూపము. సత్యస్వరూపము.

స్వకీయ హృదయమునే సృష్టికర్త అగు బ్రహ్మదేవుని స్వరూపంగా తెలుసుకొన్న వానికి ఈ త్రిలోకములు తన గృహప్రాంగణములో, తనచే క్రీడగా నిర్మించుకున్న ఆటస్థలముల వంటివగుచున్నాయి. ఆతనికి తనయందలి తన కల్పనలో శత్రువులెవ్వరు? మిత్రులెవ్వరు? కనుక <u>**"ఇదంతా నా హృదయములోనిదే!" - అని దృశ్యజగత్తు ఉపాసించబడుగాక! హృదయమును సత్యమగు బ్రహ్మముగా గమనించటమే సత్యలోకమగు బ్రహ్మలోక ప్రాప్తి.**</u>

---

2 ఆప ఏవ ఇదమ్ అగ్ర ఆసుః।
తా ఆపః సత్యం అసృజన్త
సత్యం – బ్రహ్మ ప్రజాపతిం।

అట్టి సత్యబ్రహ్మము బుద్ధికి ప్రకటనమగుటకు ఉపాసించు విధానము చెప్పుకుంటున్నాము.

ఈ జగత్తు సృష్టికి పూర్వము అప్ (ఆపః. ద్రవము) రూపమున ఉండి ఉన్నది. వికారరూపమగు ఈ జగత్తు సృష్టికి-ముందు ఉదకము నందు ఉన్నది.

ఉదకము = ఆపః= ద్రవము(ద్రవములో÷ తక్కిన 4 భూతములు సూక్ష్మరూపమున ఉన్నాయి)

అట్టి "ఆపః (జలము)" - ఆ తరువాత సత్యమును సృష్టించింది. అట్టి సత్యస్వరూపుడే - సకలప్రాణులను తన గర్భమున కలిగి ఉన్న మొదటి సృష్టియగు హిరణగర్భుని జననము.

ప్రజాపతిః దేవాగ్ం
తే దేవాః సత్యమేవ ఉపాసతే।
తత్ ఏతత్ త్ర్యక్షరగ్ం సత్యమితి।
'స' ఇతి ఏకం అక్షరం। 'తి' ఇతి ఏకం అక్షరం।
'యం' ఇతి ఏకం అక్షరం। (స+తి+యం)।
ప్రథమా → ఉత్తమే అక్షరే సత్యం।
మధ్యతో→ అనృతం। తదేతత్ అనృతం ఉభయతః-
-సత్యేన పరిగృహీతగ్ం। సత్య భూయం ఏవ భవతి।
నైనం విద్వాగ్ం సం అనృతగ్ం హినస్తి।

*ఇతి 'సత్య బ్రాహ్మణమ్' నామ చతుర్థ బ్రాహ్మణమ్।*

అటు తరువాత ఆ హిరణ్యగర్భుడు రకరకాల జీవరాసులకు సృష్టికర్త అగుచున్నారు. కనుక ఆయనయే ప్రజాపతి। **ఏకమగు బ్రహ్మమే బ్రహ్మదేవుని రూపముగా అయి, అనేకమగు ఈ సమస్తమును కల్పించుకొని వినోదిస్తోంది.**

**తత్ విధానము**

సత్యము - హిరణ్యగర్భుని (విరాట్ పురుషుని) సృష్టిస్తోంది. ఆయనే చతుర్ముఖ బ్రహ్మ।

ఈ చతుర్ముఖ బ్రహ్మ - విరాట్ పురుషుని (బ్రహ్మాండములను భావనచేయు భావికుని) సృష్టిస్తున్నారు.

విరాట్ పురుషుడు - సృష్టికొరకై చూపు - వినికిడి, స్పర్శ - రుచి - పలుకు.. ఇత్యాది దివ్యశక్తులను దృశ్యములో సృష్టిస్తున్నారు. వీరే 'దేవతలు'.

దివ్య ప్రజ్ఞారూపులు, అశరీరులు అగు ఆ దేవతలు 'సత్యము' అనే '3' అక్షరములను ధ్యానించుచున్నారు.

**'స'** **'త'** **'యమ్'** = సత్యమ్

**'స' - 'య'** → సత్। ఉనికి సత్యమైనవి. ఎప్పటికీ నశించనిది.

**'త'** → త్రికాలములుగా ఉనికి (Being) రూపము కలిగి ఉన్నట్టిది. మృత్యు స్వరూపమైనది. జనించి నశించునది. మార్పు చేర్పులకు ప్రతీక ఈ **'త'** - అను అక్షరము - "వ్యక్తము". 'సృష్టి'.

**'స' 'య'**..అను మార్పు చెందని నశించని సత్యమును - గ్రహించినప్పుడు, అట్టి సత్య పరిగ్రహణము యొక్క ఆధిక్యత చేత మధ్య గల మార్పు చెందే విషయమే అవిషయమగుచున్నది.

సృష్టికి ముందు **"సత్యమే"** వేంచేసినదై ఉన్నది।

లయము తరువాత కూడా శేషించునది **"సత్యమే"।**

**'త'** = ఆ రెంటి మధ్య (As in between) కనిపించేది **అనృతము**. కల్పన. ఊహా కల్పితము.

ఈ విధముగా ఎవ్వరు ఈ సృష్టిని ఆది-అంతస్థానములలో నిలకడ కలిగి ఉన్న సత్యమును దర్శిస్తారో, అట్టి విద్వాంసుడు మృత్యువుకు విషయము కాడు. మృత్యువుచే బాధింపబడడు. **పైగా, మృత్యువే ఆతనికి ఉపకరణము వంటిది అగుచున్నది.**

---

**వివరణ :** (మృత్యుస్సర్వ హరత్యాహమ్। ఉద్భవశ్చ భవిష్యతాం - భగవద్గీత)

(సత్యమ్ = య సత్, అయమ్ సత్। య అయమ్। 'సత్'యే ఈ రూపంగా జలములో తరంగాలువలె పొందబడుతోంది).

(సత్ = ఉనికి (Being) । చిత్ = ఎరుక (knowing) । ఆనందమ్ = ఆనందించటము (Enjoying)।

**అయమ్ ఆత్మా లక్షణమితి (శంకరభాష్యము).**

**( "స = మార్పు చెందనిది. త = మార్పు చెందునది. ఈ రెండిటి కలయికయే ద్రష్ట - దృశ్యములు).**

**- ఇతి చతుర్థ బ్రాహ్మణము -**

# సప్తమాధ్యాయః - పంచమం బ్రాహ్మణమ్

## సత్యబ్రహ్మ సంస్థాన బ్రాహ్మణము

| | | |
|---|---|---|
| 1 | **తత్ యత్ సత్యమ్ అసౌ స ఆదిత్యో॥** | ఏది పరమ సత్యమో, అదియే "ఆదిత్యుడు" అయి ఉన్నది. |
| | **య ఏష ఏతస్మిన్ మణ్డలే పురుషో<br>యశ్చ అయం దక్షిణే అక్షః పురుషస్తావ<br>ఏతావత్ అన్యోన్య అస్మిన్ ప్రతిష్ఠితౌ<br>రశ్మిభిః ఏషో అస్మిన్ ప్రతిష్ఠితః॥** | **ఆది+యత్ పురుషః॥** జన్మలకు - దృశ్యములకు మునుముందే (ఆది యందు), సర్వ కల్పనలకు కారకుడై ఈ సర్వమునకు ఉనికి మాత్రముచేత ప్రేరకుడైన సత్యస్వరూపుడగువాడే ఆదిత్యుడు'. మొదలే ఉండి, ఆ తరువాత ఈ సమస్తము తన పురుషకారముగా కలవాడు ఆదిత్యుడు.<br><br>ఆదిత్యుని తేజస్సే (1) ఆకాశంలో సూర్యమండలము నందు, (2) ఈ జీవాత్మ యొక్క కుడికంటి యందు (విజ్ఞాన స్వరూపుడగు జీవుని కుడి కంటిచూపు యందు) ఉభయ స్థానములందు సమముగా ప్రకాశించు చున్నది.<br><br>☙ సూర్యుడు జీవునిలో తన కిరణములచేత **అధ్యాత్మరూపముగు** చూపుగాను,<br><br>☙ జీవుడు ప్రాణములచేత **అధిదైవ స్వరూపము** అయిన సూర్య మండలమునందును,<br><br>ప్రకాశించుచు పరస్పరము ప్రకాశింపజేసుకొనుచున్నారు. |
| | **ప్రాణై రయమ్ అముష్మిన్<br>స యత్ ఉత్క్రమిష్యన్ భవతి।<br>శుద్ధం ఏవై తత్ మణ్డలం పశ్యతి,<br>నైనం ఏతే రశ్మయః ప్రత్యాయన్తి॥** | ఇట్లు ఒకరినొకరు ప్రకాశింపజేయు జీవుని **ప్రాణశక్తి, సూర్యుని తేజోశక్తుల పరస్పరత్వమును** ఎవ్వరు ఎరుగుతారో, అట్టి కుడికంటిలోని చాక్షుస స్వరూపుడైన సూర్యుడు-దేహము త్యజించు ఇచ్ఛ కలిగి ఉన్నప్పుడు - తన "చూడటము" అనే కిరణములను తనలోకి ఉపసంహరించుకొని ఈ జీవుడు ప్రశాంతచిత్తుడు అగుచున్నాడు.<br><br>కేవల తటస్థరూపమును (ఆత్మరూపమును) సంతరించుకుంటున్నాడు. ఆత్మను పరిశుద్ధమైనదానివలె తెలుసుకొని ఆస్వాదిస్తున్నాడు.<br><br>**సూర్యునిలోని తేజోరూపము, కన్నులోని విజ్ఞామయ పురుష రూపమును ఈ ఉభయము "ఏకము. ఒక్కటే కదా!" - అని ఎరిగి భావించి ఉపాసించువానిని ఇక సూర్యకిరణములు బాధ కలిగించనివిగా అగుచున్నాయి.** |
| 2 | **య ఏష ఏత ఏతస్మిన్ మణ్డలే పురుషః,<br>తస్య "భూ" ఇతి శిరః<br>ఏకగ్ం శిర।<br>ఏకం ఏతత్ అక్షరం।** | అట్టి 'ఆదిత్య మండలాంతర్గతుడు' అగు 'సత్యము' అను పేరు గల ఆదిత్యమండల పురుషుడగు హిరణ్యగర్భునిచే (సృష్టికర్తచే) సృష్టికి ముందు ఉచ్ఛరించబడిన శబ్దములను **'వ్యాహృతులు'** అంటారు. మొట్టమొదట ఉచ్ఛరించబడిన శబ్దము "భూః"! కనుక ఈ భూ వ్యాహృతిని ఆదిత్య మండల పురుషుని 'తల'. భూః- ఏకాక్షరమే - ఈ భౌతికమైన సమస్తముగా ప్రదర్శనమౌతోంది. |
| 3 | **(ఏకం ఏతత్ అక్షరం) "భువ" ఇతి – బాహూ।<br>ద్వౌ బాహూ ద్వే ఏతే అక్షరే।<br>సువః ఇతి ప్రతిష్ఠా।** | సమస్త భావనల, అనుభూతుల, అనుభవముల సంజ్ఞయే రెండవ వ్యాహృతి అగు - **భువః**. 'భువః'లో అక్షరములు రెండు అయిన విధంగా.. ఆదిత్య - పురాణ పురుషుని బాహువులు (భుజములు) రెండు. **భువః** అనే వ్యాహృతి చేతులను సూచిస్తున్నాయి. |

| | |
|---|---|
| **ద్వే ప్రతిష్ఠే। ద్వే ఏతే అక్షరే తస్య ఉపనిషత్**<br>**'అహః' ఇతి హన్తి।**<br>**పాప్మానం జహాతి చ, య ఏవం వేద।** | స్వః.. 'స్వరము' వలె చరణములు (కాళ్ళు). 'సం-అహః స్వః అహః 'పగలు' అనేది స్వః కు రెండవ పేరు.<br>ఆదిత్య మండల పురుషుని యొక్క రహస్య నామమే ఈ భూః భువః సువః అనబడు త్రివ్యాహృతులు.<br>అట్టి "ఓం భూ భువః సువః" అను వ్యాహృతులు → (1) స్థిరము- నిశ్చలము - చలన రహితము అగు ఆత్మ యొక్క - (2) చంచలమగు వ్యావహారిక ప్రదర్శనముయొక్క ఏకత్వమును సూచిస్తున్నాయి.<br>ఎవ్వడైతే ఆదిత్య మండల పురుషుడగు ఆత్మదేవుని 'అహః' పగలుయే- (కాంతి పుంజములగు) జీవుల జనన - ఉనికి స్థానము- అని ఉపాసిస్తాడో, అట్టి వాడు జగత్తు పట్ల (జగత్తు వేరు- బ్రహ్మము వేరు అను) దోష దృష్టులను త్యజించి వేయుచున్నాడు. |
| **3 యో అయం దక్షిణే అక్షన్ పురుషః।**<br>**తస్య 'భూః' ఇతి శిర ఏకగ్ం।**<br>**శిర ఏకమ్-ఏతత్ అక్షరం।** | అట్టి ఆదిత్య మండలాంతర్గత పురుషుని ఇక్కడ భౌతిక దేహములో కుడికంటిలో ఉపాసించువాడు విజ్ఞుడు.<br>ఈ కుడి కంటిలోని ఆదిత్య మండల పురుషునికి<br>**భూః** = ప్రథమ వ్యాహృతి. ఏకాక్షరము (ఒక్క అక్షరము).<br>ఈ కుడి కంటిలోని ఆదిత్య పురుషుడు ఏకము + అక్షరము అయి ఉన్నారు. |
| **"భువ" ఇతి బాహూ।**<br>**ద్వౌ బాహూ ద్వే ఏతే అక్షరే।** | **భువః** = ఆయనయే ఈ ద్వయీ అక్షరి. వ్యాహృతిగా రెండు భుజములు, రెండు చేతులు కలిగి ఉన్నారు. ఇహాత్మ- పరాత్మ (1. జీవాత్మ, 2. పరమాత్మ ఆయన యొక్క రెండు చేతులు). కనిపించు దానికి మనస్సుతో అర్థము కల్పించువాడై ఉన్నాడు. |
| **'సువః-ఇతి' ప్రతిష్ఠా ద్వే।**<br>**ప్రతిష్ఠే ద్వే ద్వే ఏతే**<br>**అక్షరే తస్య ఉపనిషత్ అహం ఇతి।**<br>**హన్తి పాప్మానం జహాతి చ**<br>**య ఏవం వేద।**<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్। సప్తమాధ్యాయే।</u>**<br>**<u>"సత్య బ్రహ్మసంస్థాన బ్రాహ్మణమ్"</u>**<br>**నామ పంచమ బ్రాహ్మణమ్॥** | **సువః** = సు-అహః = పగలు అహమ్ = ఆ ఆదిత్య మండల పురుషుడే 'అహమ్' చరణములు. రెండు కాళ్ల నడకలు. (జ్ఞాన దృష్టి)<br>**సు** = నిర్మలమగు (Absolute)<br>**అహమ్** = నేను (I)<br>ఈ విధంగా **"భూ-భువః - సువః"** ఆదిగా గల వ్యాహృతులే అవయవములుగా గల - <u>'ఆదిత్య పురుషుడు'</u> అను సత్యస్వరూపుడు - ఈ జీవుని కుడి కంటి యందు 'అధ్యాత్మపురుడు' (అహము) (పగలు-అహమ్) అను రహస్య నామము కలిగి ఉన్నారు. ఆ కుడికంటిలోని ఆధ్యాత్మ పురుషుడు సర్వపాపముల నుండి జీవుని రక్షించగలరు. 'అహమ్' అను రహస్య నామము కలిగి ఉన్నట్టి - ఆ సత్య పురుషుని ఎరుగుటచే పాపములు నశిస్తాయి. పాపదృష్టులు, వికారాలు సమసిపోతాయి.<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్। సప్తమాధ్యాయే।</u>**<br>**<u>"సత్య బ్రహ్మసంస్థాన బ్రాహ్మణమ్"</u>**<br>**నామ పంచమ బ్రాహ్మణమ్॥** |

# సప్తమాధ్యాయః - షష్ఠమం బ్రాహ్మణమ్
## మనో బ్రాహ్మణము

1 మనోమయో అయం పురుషో।
భాసః సత్యః। తస్మిన్ అన్తర హృదయే
యథా వ్రీహిః వాయవో వాస।
ఏష సర్వస్య ఈశానః।
సర్వస్య అధిపతిః।
సర్వం ఇదం ప్రశాస్తి-
యత్ ఇదం కిఞ్చ।

ఇతి బృహదారణ్యకోపనిషత్। సప్తమో-అధ్యాయే।
'మనో బ్రాహ్మణమ్' నామ షష్ఠమ బ్రాహ్మణమ్।

**మనస్సు** = విషయములకు సంబంధించిన ఆలోచనా ప్రవంతి.

మనస్సుచే అనుభవమగువాడు కాబట్టి ఆ పరమపురుషుడు (ఆదిత్య పురుషుడు) - 'మనోమయుడు'. "మనస్సుకు సాక్షాత్కరించువాడు" - అవటం చేత కూడా మనోమయుడు.

సత్య-నిత్య చైతన్య స్వరూపుడగు ఆతడు మనోమయుడై హృదయములో -ధాన్యపు గింజలో బియ్యపు గింజలాగా, గోధుమలో గోధుమగింజ లాగా - దేహములలో చైతన్యప్రకాశమే తన ఉనికిగా కలిగి ప్రకాశించుచున్నారు. అట్టి మనోమయ-హృదయాంతర్గత చైతన్యరూపుడగు ఆదిత్య పురుషుడే- ఈ సర్వమును శాసించువాడు। అనుశాసితారమ్। ఈశానః।

ఆతడే ఈ జగత్ మనో-బుద్ధి-చిత్త-అహంకారాలకు **అధిపతి** (The Owner) .

ఈ దృశ్యములో కనిపించేదంతా నియమించునది, శాసించునది, పరిపాలిస్తున్నది, ఆస్వాదిస్తున్నది, తన యందు తానే ఎప్పుడో 'లయము' చేసుకొనుచున్నది కూడా ఆయనయే! ఆత్మపురుషుడే।

ఇదంతా కూడా ఆయన యొక్క మనోమయ ఉచ్ఛ్వాస నిశ్వాసములే। (ఊపిరి వదలటము - పీల్చటములే)।

ఇతి బృహదారణ్యకోపనిషత్। సప్తమో-అధ్యాయే।
'మనో బ్రాహ్మణమ్' నామ షష్ఠమ బ్రాహ్మణమ్।

---

# సప్తమాధ్యాయః - సప్తమం బ్రాహ్మణమ్
## విద్యుత్ బ్రాహ్మణము

1 "విద్యుత్ బ్రహ్మ - ఇతి ఆహుః।
విదానాత్ (విత్-ఆనాత్) 'విద్యుత్' విద్యతి।
ఏనం పాప్మ నో, య ఏవం వేద
"విద్యుత్ బ్రహ్మేతి"
విద్యుద్ధ్యేవ బ్రహ్మ।
(విద్యుత్ హి ఏవ బ్రహ్మ) ।

ఇతి 'విద్యుత్ బ్రాహ్మణమ్' నామ
సప్తమ బ్రాహ్మణమ్

అట్టి ఆత్మపురుషుడు **'విద్యుత్ బ్రహ్మము'** అని కూడా అభివర్ణించ బడుచున్నారు. విద్యుత్ = ద్యుత్ - చీకటిని విశేషముగా ఖండించున్నది; అజ్ఞానదృష్టులను అజ్ఞాన భావములను ఖండించి జ్ఞానమును వెలిగించునది. విదా-ఉనాత్ విద్యుత్. **"జననము, ఉత్పత్తి"**-అనే చీకటిని ఖండించునది కాబట్టి **'విద్యుత్'**.

ఎవ్వడైతే చీకటిని ఖండించు వెలుగు అగు విద్యుత్‌ను బ్రహ్మముగా ఎరిగి, **'బ్రహ్మమే విద్యుత్ రూపము'** అని ఉపాసించుచూ ఉంటాడో, అట్టి వాని యొక్క ప్రతికూల పాపములన్నిటినీ ఆ విద్యుత్ బ్రహ్మము ఖండించివేయగలదు.

ఎందుకంటే..

విద్యుత్.. (ప్రకాశము) స్వయముగా బ్రహ్మమే కాబట్టి. 'ప్రకాశము' బ్రహ్మము యొక్క లక్షణము కనుక.

ఇతి 'విద్యుత్ బ్రాహ్మణమ్' నామ సప్తమ బ్రాహ్మణమ్

# సప్తమాధ్యాయః - అష్టమం బ్రాహ్మణమ్

## వాగ్ధేను బ్రాహ్మణము

1 **“వాచం ధేనుం’ - ఉపాసీత।**
**తస్యాః చత్వారః స్తనాః।**
**“స్వాహా” కారో। “వషట్” కారో।**
**“హన్త” కారః। “స్వధా” కారః॥**

వాక్కు = ఋక్-సామ-యజుర్ - సామవేదములు

వాక్కు→ శబ్దము యొక్క రూపము.

అట్టి “వాక్కు”ను “కామధేనువు”గా (పాలిచ్చే ఆవుగా) ఉపాసించటము చెప్పబడుతోంది. అట్టి ‘వాక్కు’ అను కామధేనువుకు ‘4’ స్థనములు ఉన్నాయి. ఆ నాలుగు స్థనముల నుండి జీవుల కొరకై పాలు (ఆహారము) స్రవిస్తున్నాయి. ఈ వాక్ రూప కామధేనువు యొక్క రెండు స్థనముల నుండి స్రవించు ఆహారమును దూడల వంటి దేవతలు ఆశ్రయించి జీవిస్తున్నారు.

(1) ‘స్వాహా’ కారము

(2) ‘వషట్’కారము అందుకే “స్వాహా, వషట్” పేర్లతో యజ్ఞ మంత్రములు గానం చేస్తున్నాయి.

[ (1) (2) - దేవతలకొరకు ఆహారము ఇచ్చు స్తనములు. ]

(3) హంతకారము. మానవులకు అన్నము ఇచ్చు స్తనము.

(4) స్వధాకారము. పితృదేవతలకు కవ్యము (పిండము) ఇచ్చు స్తనము.

---

**తస్యా ద్వౌ స్తనౌ దేవా ఉపజీవన్తి -**
**స్వాహాకారం చ, వషట్కారం చ ।**
**హన్తకారం మనుష్యాః।**
**స్వధాకారం పితరః॥**
**తస్యాః ప్రాణ ఋషభో। మనో వత్సః।**

→ ‘వాక్కు’ అను ఆవుకు ఆబోతు (ఋషభము) వంటిది → **ప్రాణము**

(ఎందుకంటే ప్రాణము ద్వారానే వాక్కురూప ధేనువు (ఆవు) ఉత్పన్న మౌతోంది).

→ మనస్సు - ఆవు దూడ వంటిది.

మనస్సు ద్వారానే, మనస్సు సంకల్పించినదే వాక్ రూపధేనువుగా వెలువడుతోంది.

**“స్వాహా” = దేవతలకు సమర్పణగా చెప్పు శబ్దము.**
**“వషట్” = అగ్నియందు వ్రేల్చు హవిస్సుల సమర్పణ శబ్దము.**
**“హన్త” = అతిథికి పెట్టబడుచున్న “అన్నము” మొదలైనవి.**
**“స్వధా” = పితృదేవతలకు** (To the Divine Entities who are maintaining our physical Bodies to be alive, active and survive) **సమర్పణగా చెప్పు శబ్దము.**

(1) **దేవతలకొరకై -** స్వాహా (2) వషట్ → దేవతలకు ఆహారము అన్నము హవిస్సు ఇవ్వబడుచున్నది.

(2) **మనుష్యుల కొరకై** - “ఇదిగో! ఆహా।” శబ్దములచే అన్నము ఇవ్వబడుచున్నది. అందుకే “హంత। ఇదిగో । ఆహా।” అని ‘హంతకారము’లో కూనవులు (జీవులు) చేర్చబడుచున్నారు. (హన్త = అతిథి దేవతా సమర్పణము - అని కూడా). (“ఇదిగో! ఇది తీసుకోండి” అని భిక్ష స్వీకరించు వానితో అంటాము కదా)।

(3) **పితృ దేవతలకొరకై -** ‘స్వధా’ అని పలుకుచు పిండ సమర్పణ నుండి అన్ని సమర్పణములు చేయబడుచున్నాయి.

ఈ విధంగా వాక్ రూప ధేనువును ‘బ్రహ్మ’గా ఉపాసించువాడు ‘వాక్‌రూప బ్రహ్మము’ను పొందుచున్నాడు. [ **ప్రాణము** = ఎద్దు (వృషభము). **వాక్కు** = ఆవు (ధేనువు) **మనస్సు** = ఆవుదూడ] - అను **ఉపాసన.**

**ఇతి బృహదారణ్యోపనిషత్। సప్తమాధ్యాయే।**
**“వాగ్ధేను బ్రాహ్మణమ్” నామ అష్టమో బ్రాహ్మణమ్।**

**- ఇతి వాగ్ధేను బ్రాహ్మణము -**

# సప్తమాధ్యాయః - నవమం బ్రాహ్మణమ్

## వైశ్వానరాగ్ని బ్రాహ్మణము

1 **అయం అగ్నిః వైశ్వానరో।**
**యో అయం అన్తః పురుషే**
**యేన ఇదం అన్నం పచ్యతే।**
**యత్ ఇదం (యదిదం) అద్యతే, తస్యైష ఘోషో భవతి।**
**య మే తత్ కర్ణావపిధాయ శృణోతి॥**
**స యదా ఉత్క్రమిష్యన్ భవతి,**
**నైనం ఘోషగ్ం శృణోతి॥**

**ఇతి "వైశ్వానరాగ్ని బ్రాహ్మణమ్" నామ నవమ బ్రాహ్మణమ్॥**

### వైశ్వానరాగ్ని ఉపాసన

ప్రత్యక్షమగు అగ్ని యొక్క అపరోక్ష రూపము - "వైశ్వానరాగ్ని".

అది కళ్ళకు కనబడనిది కాబట్టి "ప్రత్యక్షము" కాదు. ఆకలి, ఆహారమును అంగీకరించటము, ఆహార పచనము మొదలైన కార్యక్రమములు నిర్వర్తిస్తూ దేహములోనే ఉండి ఉన్నది కాబట్టి **పరోక్షము కాదు.**

**అందుచేతనే అది అపరోక్షము.**

ఏ అగ్ని అయితే ఈ వ్యష్టి దేహమునందు స్థానము కలిగియుండి (అంతః శరీరి అయి)

→ ఆహారమును పచనము చేయుచున్నదో..,

→ ఆహారమును స్వీకరించుచున్నదో...,

→ జఠరాగ్నిగా జఠరము (పొట్ట)యందున్నదో, శరీరమంతా ఉష్ణము, ఉత్తేజము కలిగించుచున్నదో,

**అదియే వైశ్వానరాగ్ని!**

అద్దాని ఘోషయే శరీరము నుండి చెవులు మూసుకొన్నప్పుడు "ఉమ్ - ట్ - మ్"! శబ్దముగా వినబడుచున్నది. అది యోగసాధనకు "ఉపాసనా-ఉపకరణము" - అగుచున్నది.

ఎప్పుడైతే ఈ దేహము నుండి ప్రాణములు బయల్వెడలుచున్నాయో, అప్పుడు 'వైశ్వానర ఘోష' చెవులకు వినబడదు.

అట్టి వైశ్వానరాగ్ని యొక్క ఉపాసన... బ్రహ్మోపాసనమే।

**చెవులు మూసుకొని వైశ్వానర శబ్దరూపమును వినటము. ప్రాణాయామ యోగసాధన కూడా వైశ్వానరోపాసనా విధియే!**

పైపై రీతులుగా మరియు తదిర సాధనాక్రమముల సహాయంతో **ఆత్మ తత్త్వజ్ఞాని ఈ జీవితమును సద్వినియోగపరచుకుంటున్నాడు.**

# సప్తమాధ్యాయః - దశమం బ్రాహ్మణమ్

## గతి బ్రాహ్మణము

| | |
|---|---|
| 1 యదా వై పురుషో అస్మాత్ లోకాత్ ప్రైతి,<br>స వాయుం ఆగచ్ఛతి।<br>తస్మై స తత్ర విజిహీతే।<br><br>యథా రథ చక్రస్య ఖం<br>తేన స ఊర్ధ్వ ఆక్రమతే। | ఈ లోకమునందు, శరీరమును విడచినప్పుడు కూడా వాయువు ప్రాణశక్తితో ఏకమై ముఖ్యప్రాణ రూపమును పొందుచున్నది. ఇంద్రియములు, ప్రాణశక్తి ఏకమగుచున్నాయి. 'మహావాయువు' అగుచున్నది.<br><br>- మహావాయువు ఆతనికి "రథచక్రము యొక్క రంధ్రము" వంటి మార్గమును త్రోవగా ఇచ్చుచున్నది.<br><br>**- అట్టి మహావాయువుచే ప్రసాదించిన మార్గము ద్వారా ప్రాణోపాసకుడు వాయు మండలమును దాటివేయుచున్నాడు.** |
| స ఆదిత్యం ఆగచ్ఛతి।<br>తస్మై స తత్ర విజిహీతే,<br>యథా (ఆ)డంబరస్య ఖం,<br>తేన స ఊర్ధ్వ ఆక్రమతే।<br>స చన్ద్రమసమా గచ్ఛతి। | వాయు మండలమునుండి - రథచక్రము యొక్క రంధ్రము వంటి మార్గములో ఆతడు ఇంకనూ పైకి ఊర్ధ్వముఖుడై సూర్యమండలము చేరుచున్నాడు.<br><br>బ్రహ్మలోకమును పొందగోరు బ్రహ్మోపాసకులకు మార్గమధ్యంలో అడ్డుగా ఆదిత్య పురుషుడు ఉన్నారు. ఆయన కూడా ఆత్మోపాసన యొక్క పరిపక్వత గలవానిని తనయందు ఆడంబరము (ఒక డమరుకము) యొక్క ఛిద్రము (చిల్లి)వంటి మార్గము ద్వారా త్రోవను ఇస్తున్నారు. ఆ జీవుడు సూర్యలోకము నుండి ఆ విధంగా 'చంద్రలోకము' చేరుచున్నాడు. |
| తస్మై స తత్ర విజిహీతే।<br>యథా దున్దుభేః ఖం<br>తేన స ఊర్ధ్వ ఆక్రమతే।<br>స లోకం ఆగచ్ఛతి।<br>అశోక మహిమం,<br>తస్మిన్ వసతి శాశ్వతీః సమాః।<br><br>– ఇతి 'గతి బ్రాహ్మణమ్' నామ<br>దశమం బ్రాహ్మణమ్॥ | చంద్రుడు చంద్రలోకములో ఆత్మోపాసకునికి దున్దుభి (నగారా) అంత బయటకు వెళ్ళు ద్వారములో త్రోవచూపుచున్నారు. అట్టి మార్గముగుండా ఇంకా పైకి అభిముఖుడై ముందుకు సాగుచున్నాడు. మానసిక శారీరక శోకము లేనట్టి **బ్రహ్మలోకము** జేరుచున్నాడు. ఆ (బ్రహ్మ) లోకములో శాశ్వత (అనంత) సంవత్సరాలు శోక రహితుడై ఉంటున్నాడు.<br><br>ఇతి 'గతి బ్రాహ్మణమ్' నామ<br>దశమో బ్రాహ్మణమ్॥ |

# సప్తమాధ్యాయః - ఏకాదశం బ్రాహ్మణమ్

## తపో బ్రాహ్మణము

1 ఏతద్వై పరమం తపో–యత్ వ్యాహితః।
తప్యతే పరమగ్ం హైవ (హి ఏవ) లోకం జయతి।
య ఏవం వేద।
ఏ తత్ వై పరమం తపో।

**వ్యాధి - తపస్సు - ఉపాసన**

తపస్సు = **తపనయే తపస్సు.**

జీవుడు ఈ జీవితములో అనేక తపనలు, వేదనలు, వ్యాధి బాధలు పొందుచున్నాడు. ఆత్మతత్త్వమును ఉపాసిస్తున్న ఆత్మోపాసకుని పట్ల గాని, దృశ్య విషయములే పరమావధిగా భావిస్తూ ఉన్న వాని పట్ల గాని అట్టి **ఆధి (మానసిక రుగ్మతలు)- వ్యాధి (శారీరక రుగ్మతలు) తప్పుటలేదు.** అయితే ఆత్మజ్ఞాని జ్వరము మొదలైన శారీరక రుగ్మతలను, (మరియు) సంతానము మొదలైన వారి వలన ఏర్పడుచున్న మానసిక వేదనలను - రుగ్మతలను కూడా **"పరమాత్మ కొరకై తపన- ఉపాసన- తపస్సు"..** అని భావిస్తున్నాడు. అవన్నీ లోక పరిమితం చేసి **తపోభావం పొందుచున్నాడు.** జన్మ-మృత్యువులు, జీవితంలోని శారీరక, బాధలు, మానసిక రుగ్మతలు కూడా ఆతని దృష్టిలో ఆత్మోపాసనయే అగుచున్నది.

- జ్వరపీడితుడై సంతాపము పొందటము కూడా అతని దృష్టిలో శ్రేష్ఠమగు తపస్సే అగుచున్నది. పరమాత్మకొరకు ప్రయత్నములోని విభాగముగా భావించబడుచున్నది.

**ఎవ్వడైతే ఈ రీతిగా శారీరక వ్యాధి - మానసికబాధను ఆత్మోపాసనకు అవకాశముగా భావిస్తాడో అట్టివాడు పరమోత్కృష్ట లోకము పొందుచున్నాడు.**

---

యం ప్రేతమ్ అరణ్యగ్ం హరన్తి,
పరమగ్ం హైవ లోకం జయతి –
య ఏవం వేద।

ఏతద్వై పరమం తపో, –
అయం ప్రేతం అగ్నావభ్యా దధతి।
పరమగ్ం హైవ లోకం జయతి –
య ఏవం వేద॥

ఇతి 'తపో బ్రాహ్మణమ్'
నామ ఏకాదశ బ్రాహ్మణమ్॥

**"మరణించిన తరువాత నామృతదేహమును నా బంధువులు గృహము (లేక) గ్రామము నుండి అడవి - శ్మశానము జేర్చుచూ ఉండటము కూడా నాకు తపస్సే। ధ్యానము కొరకే। అది నాకు వానప్రస్తము వంటిదే"** - అని భావించువాడు ఆత్మధ్యానవంతుడు అగుచున్నాడు.

**"నా ఈ భౌతిక దేహమును మరణానంతరము (ప్రేతమును) అగ్నిలో కాల్చుటము కూడా నాకు శారీరక తపస్సే।"..** అని భావించువాడు భూ-సూర్య-చంద్ర లోకములను నిశ్చయముగా జయించి, బ్రహ్మలోకము చేరుచున్నాడు.

ఇతి 'తపో బ్రాహ్మణమ్'
నామ ఏకాదశ బ్రాహ్మణమ్॥

# సప్తమాధ్యాయః - ద్వాదశం బ్రాహ్మణమ్

## అన్న ప్రాణ బ్రాహ్మణము

### అన్నప్రాణబ్రహ్మోపాసన

1 **"అన్నం బ్రహ్మ" - ఇతి ఏక ఆహుః।**
**తత్, న తథా। (కింతు) పూయతి వా**
**(అన్నమ్ ఋతే) అన్నమృతే ప్రాణాత్।**

(**అన్నమ్** = తినబడేది. పంచేంద్రియములకు జగత్తుగా దర్శనమగు / అనుభవమగు విషయములన్నీ 'అన్నము' శబ్దము యొక్క **సూచన**).

**"అన్నము బ్రహ్మమే"। → అనుభవమగుచున్నదంతా బ్రహ్మముగా ఉపాసించబడుగాక"..** అని కొందరు ఆచార్యుల సిద్ధాంతీకరణ!

---

**"ప్రాణో బ్రహ్మ" - ఇతి ఏక ఆహుః।**
**తత్ న తథా। శుష్యతి వై।**
**ప్రాణ ఋతే అన్నాత్।**

ఇక ఆ వాక్యము ఒప్పుకోని మరికొందరు ఆచార్యులేమో -"అబ్బే! అదెట్లా కుదురుతుంది? అన్నము, అమృతము కాదు. ప్రాణముతో కూడి ఉండకపోతే మృతమే! కుళ్ళిపోతుంది కదా! కాబట్టి 'అన్నమ్ బ్రహ్మ' అనటం కన్నా "ప్రాణమ్ అమృతము. **ప్రాణమే బ్రహ్మము..** అని ప్రతివాదిస్తున్నారు. ఎందుకంటే నాశనము లేనిది బ్రహ్మము కదా!

---

**ఏతే హత్వేవ దేవతే**
**ఏకధా భూయం భూత్వా**
**పరమ తాం గచ్ఛతః।**

అట్లా ఎట్లా? అన్నము లేనిదే ప్రాణము కూడా శోషిస్తోంది కదా!

అన్నము లేకుండా ప్రాణము దేహములో ఉండజాలదు. మీరన్నట్లే వాస్తవమైతే ప్రాణము కూడా బ్రహ్మము కాకూడదుగా?.. వేరు వేరుగా ఉన్నాయనుకుంటే అన్నము బ్రహ్మము కాదు, ప్రాణము బ్రహ్మము కాదు.

**(1) 'దివ్యము, దేవతా స్వరూపము'** అగు అన్నము **(2) 'ప్రాణము'** - ఈ రెండు పరస్పరము **ఏకతా స్వరూపం పొందినప్పుడే** అవి అవినాశ ధర్మము కలిగి 'బ్రహ్మము' అగుచున్నాయి.. అని కూడా వాదిస్తున్నారు.

---

**తద్ధస్మాహ (తత్ హ స్మాహ) ప్రాతృదః :**
**పితరం కిగ్ం స్విదేవ ఏవం**
**విదుషే సాధు కుర్యాం**
**కిం ఏవాస్మా అసాధు కుర్యామ్-ఇతి।**
**స హ స్మాహ పాణినా మా ప్రాతృదకః**
**త్వేన యోరేకథా (యోః ఏకథా)**
**భూయం భూత్వా పరమ తాం గచ్ఛతి ఇతి।**

ఒకసారి పాతృదు అనే ఆయన తన తండ్రిని సమీపించి ఇట్లా ప్రశ్నించారు.

**పాతృదుడు (అను) ఋషిపుత్రుడు :**

పిత్రుదేవా! **"అన్నము బ్రహ్మమే (అనుభవింపబడుచున్నదంతా బ్రహ్మమే)। అట్లాగే ఏ ప్రాణశక్తి ద్వారా అన్నము ఇంద్రియ విషయముల రూపమున అనుభవముగా అగుచున్నదో అదీ బ్రహ్మమే। ఉభయము బ్రహ్మమే।"..** అని మీరు భావిస్తున్నారు కదా! **"అనుభవమగుచున్నదంతా బ్రహ్మమే!"** అన్నప్పుడు (లేక) **ప్రాణశక్తితో పొందబడుచున్నదంతా కూడా బ్రహ్మమే** - అని చెప్పునప్పుడు - ఇక **"ఇది పుణ్యము! ఇది పాపము!"** అనేదేదీ ఉండదా? అంతా బ్రహ్మమని తెలియుటచే నేను ఇక కర్మల ద్వారా చేయు శుభకర్మ- అశుభకర్మ ఫలములు ఉండవంటారా? శుభకర్మలు చేయనవసరం లేదంటారా?

ఇతరుల వలన - (శుభకర్మల ఫలితంగా) **పూజింపబడటము** - (అశుభ కర్మల ఫలితంగా) **అవమానించటము** కూడా లేవంటారా?

**తస్మా ఉ హైతత్ (హి ఏతత్) ఉవాచ :**
**వీత్యన్నం వై వి అన్నే హి ఇమాని సర్వాణి**
**భూతాని విష్టాని రమితి। ప్రాణో వైరం।**
**ప్రాణే హి ఇమాని సర్వాణి భూతాని రమన్తే।**
**సర్వాణి హ వా అస్మిన్ భూతాని విశన్తి।**
**సర్వాణి భూతాని రమన్తే,**
**య ఏవం వేద।**

**<u>ఇతి 'అన్న ప్రాణ బ్రాహ్మణమ్'</u>**
**<u>నామ ద్వాదశ బ్రాహ్మణమ్॥</u>**

**ఋషి** : కుమారా! ప్రాతృదుడా!

అట్లా అనకూడదయ్యా! ఎందుకంటావా? అన్నము-ప్రాణములు బ్రహ్మమే → అని ఉపాసించినంతమాత్రము చేత ఒకానొకడు బ్రహ్మమును (బ్రహ్మభావమును) పొందలేడయ్యా! పరమాత్మను సిద్ధించుకోలేడు. కేవలము ఉపాసనయే ఆశయమైతే బ్రహ్మమును పొందడు సుమా।

ఓ కుమారా! ఇంకా విను. ఈ ప్రాణులందరు అన్నమును **అనుష్ఠించి** (ఆశ్రయించి) మాత్రమే జీవిస్తున్నాయి.

అన్నము = 'వి'. ప్రాణము = 'ర' (రయము).

అందుచేత 'వి' అని (ఆధారము- ఆవస్యకము) అను అక్షరంతో చెప్పుచున్నాము. "అన్నము వినా జీవించలేరు. వినాశనము పొందుతారు".. అనుదానిని అనుసరించి, అన్నము = 'వి', 'రం' = ప్రాణము. సకల జనులు ప్రాణమునందు రమించుచున్నారు. బలమునకు ఆశ్రయము ప్రాణము, ప్రాణము ఉన్నప్పుడే జీవులు రమించగలరు.

అన్నము లేనప్పుడు ప్రాణము శరీరము నుండి విరమించుచున్నది.

**"రమించబడునది (that beeing experienced) - అన్నము.**

ఈ విధంగా వి-ర= అన్నము-ప్రాణములను సమస్త భూతములకు ఆశ్రయమగు క్రీడా -ఉపకరణములని, సమస్త భూతములు రమించు స్థలమే ఆత్మ అని ఎరిగి నర్తించువాడు (ఉపాసించువాడు) - **తానే ఆత్మ అగుచున్నాడు.**

**సకల ప్రాణలు ఆతనియందు ప్రవేశించునవి, రమించునవిగా అగుచున్నాయి.**

**<u>ఇతి 'అన్న ప్రాణ బ్రాహ్మణమ్'</u>**
**<u>నామ ద్వాదశ బ్రాహ్మణమ్॥</u>**

# సప్తమాధ్యాయః - త్రయోదశం బ్రాహ్మణమ్

## ఉక్థ బ్రాహ్మణము

1 ఉక్థం ప్రాణో వా।
ఉక్థం ప్రాణో హి ఇదగ్ం
సర్వం ఉత్థాపయతి।
ఉద్ధ అస్మాత్
ఉక్థవిత్ ధీరః తిష్ఠతి।
ఉక్థస్య సాయుజ్యగ్ం।
స లోకతాం జయతి,-
య ఏవం వేద।

ఉక్థము = దేవతల యొక్క గుణములను వర్ణించునది.

'శస్త్రము' అని కూడా అర్థము. ఒక క్రతువు - పూజ - భజన - స్తోత్రము - తపస్సులలో ఉక్థము (దేవతాగుణ వర్ణన) ప్రధానమైనది. అంతర్లీనమైనది కూడా.

ఈ దేహములోని ఇంద్రియములన్నిటిలో ప్రాణమే ప్రప్రథమము, **ప్రధానమైనది** కూడా. కనుక ప్రాణమే ఉక్థము.

ప్రాణము ఎందుకు ఉక్థము? - అని అడిగితే →

**"ఈ సమస్తమును నిలబెట్టి ఉంచుచున్నది ప్రాణమే. సమస్తమును కదల్చుచున్నది కూడా ప్రాణమే"** → అనునది సమాధానము. అట్టి సర్వమునకు త్రాణ - ఆధారము అగు ప్రాణతత్త్వమును ఎవ్వరు తెలుసుకుంటారో, ఆతడు ఉత్తమ బుద్ధి కలవాడు అగుచున్నాడు. ఆతడు 'ఉక్థము'గా చెప్పబడు ప్రాణము యొక్క స్తోత్రము చేయబడు దేవత యొక్క సాలోక్యమును, సాయుజ్యమును పొందుచున్నాడు.

---

2 "యజుః" ప్రాణో వై।
యజుః ప్రాణే హి ఇమాని
సర్వాణి భూతాని యుజ్యన్తే।
యుజ్యన్తే హాస్మై సర్వాణి భూతాని।
శ్రైష్ఠ్యాయ యజుషః సాయుజ్యగ్ం ।
స లోకతాం జయతి, య ఏవం వేద।

ప్రాణమే ఈ జగత్తునకు యజుర్వేదము. **ప్రాణబ్రహ్మమును యజుర్వేదముగా ఉపాసించాలి.** ప్రాణమే యజస్సు. ఎందుకంటే ఈ సకల ప్రాణులు ప్రాణమునకే కూర్చబడి ఉన్నారు. ఎవ్వనికీ కూడా ప్రాణము లేకుండా దేనితోనూ యోగము (కలయిక) కుదిరేది కాదుకదా!

**ప్రాణమును యజస్సుగా యజుర్వేదముగా ఉపాసించబడుగాక!** ప్రాణమును యజస్సుగా తెలుసుకొనువానిపట్ల సకల భూతములు భక్తి కలిగి, ఉద్యమించి, ఆ ప్రాణోపాసకునికి శ్రేష్ఠత్వమును అందించుచున్నాయి. (యజించటము = అర్చించటము).

ఈ విధంగా ప్రాణమును యజస్సులుగాను, యజుర్వేదముగాను భావించువాడు **అపరోక్ష జ్ఞానమును** పొందుచున్నాడు. ప్రాణములతో సామీప్య - సాలోక్య - సాయుజ్యములను సిద్ధింపజేసుకొనుచున్నాడు.

**ప్రాణే హి యస్మాత్ సర్వాణి భూతని యుజ్యంత్, తస్మాత్ యజుః ప్రాణః।** సకల ప్రాణులు (విశ్వ) ప్రాణము నందు యోగమును పొందుచున్నాయి కనుక. **యజుర్వేదమే ప్రాణరూపము.**

3 "సామ" ప్రాణో వై।
సామ ప్రాణే హి ఇమాని।
సర్వాణి భూతాని సమ్యన్చి।
సమ్యన్చి హ అస్మై సర్వాణి భూతాని।
శ్రైష్ఠ్యాయ కల్పన్తే సామ్నః సాయుజ్యగ్ం।
స లోకతాం జయతి,
య ఏవం వేద।

'**ప్రాణమే సామవేదము**' అని కూడా ఉపాసించబడుగాక!

ప్రాణబ్రహ్మమే సామప్రాణము. సామప్రాణమే సామవేదము కూడా. ఎందుకంటే ప్రాణము దృష్ట్యా సర్వ జీవులు **"సమస్వరూపము"** - అను యోగమును (అట్టి ఉపాసకుడు) పొందుచున్నాడు. ప్రాణమునందు సకల ప్రాణులు కలయుచున్నాయి.

"దేహ మనో బుద్ధి చిత్త అహంకారముల నుండి జనించే భేదములన్నీ కూడా ప్రాణాగ్నిలో ఏకము, అమృత స్వరూపము అగుచున్నాయి.

ఎవ్వరు ప్రాణమును సామవేద గానముగా గమనించి ఉపాసిస్తారో, అట్టి ఉపాసకుని కొరకై సకల ప్రాణులు ఏకరూపమై ఆతని గొప్పతనమును ప్రకటించుటకు సంసిద్ధమవగలవు. ఆతని 'శ్రేష్ఠత' కొరకై సమస్తము కూడా ప్రత్యక్షమునందు సమర్ధములుగా అగుచున్నాయి. అట్టివాడు (సహస్ర దీపములకు దీపజ్యోతి వలె) ప్రాణతత్త్వముతో సారూప్యము, సాలోక్యము, సాయుజ్యము అనుభవముగా పొందుచున్నాడు.

---

4 క్షత్రం ప్రాణో వై।
క్షత్రం ప్రాణో హి వై ।
క్షత్రం త్రాయతే హైనం ప్రాణః క్షణితోః।
ప్రక్షత్రం అత్ర మ ఆప్నోతి।
క్షత్రస్య సాయుజ్యగ్ం।
సలోకతాం జయతి,
య ఏవం వేద।

<u>ఇతి 'ఉక్థ బ్రాహ్మణమ్' నామ</u>
<u>త్రయోదశ బ్రాహ్మణమ్॥</u>

## క్షత్రము = రక్షణ

"సర్వమును సంరక్షిస్తున్నది క్షత్రము. క్షత్రమే పరిపాలించు మహత్తర శక్తి రూపము. ప్రాణము హింస నుండి కాపాడి మోక్షమార్గము అగుచున్నది".. **కనుక, క్షత్రరూపము - ప్రాణరూపముగా ఉపాసించబడు గాక!**

ప్రకృతిలోని, ఈ భౌతిక శరీరములోని "రక్షణ" రూపము ప్రాణశక్తియే.

మాస పిండమగు ఈ దేహము-గాయము పొందినప్పుడు - మరల మాంసమును నింపి రక్షించేది - '**క్షత్రము**' అను **ప్రాణ క్రియా విశేషమే।**

రక్షణ విధానంగా శరీరమునంతటినీ రక్షిస్తున్నది ప్రాణమే! అనగా, ప్రాణమే రక్షణ విధి (లేక) క్షత్రము (Protection Mechanism)గా ఉన్నది.

**ప్రాణమునే సర్వమును రక్షిస్తున్న 'క్షాత్ర తత్త్వము'గా ఉపాసించువారిని ప్రత్యక్షముగా సహజీవుల ప్రియత్వము, అపరోక్షముగా ప్రాణముతో సాలోక్య-సాయుజ్యములు లభించగలవు.**

<u>ఇతి 'ఉక్థ బ్రాహ్మణమ్' నామ</u>
<u>త్రయోదశ బ్రాహ్మణమ్॥</u>

# సప్తమాధ్యాయః - చతుర్దశం బ్రాహ్మణమ్

## గాయత్రీ బ్రాహ్మణము

1 **"భూమిః అన్తరిక్షం ద్యౌః (దః యో)"**

**2 4 2**

**ఇతి అష్టావక్షరాణి, అష్టాక్షరగ్ం।**

**గాయత్రీ ఉపాసన**

**మొదటిపాదము**

**భూర్భువస్సువః (5).. తత్ సవితుః వరేణ్యం (8)**

**ధియో యోనః ప్రచోదయాత్ (8)**

భూమి+ అన్తరిక్షము(ఆకాశము)+ ద్యులోకము (అంతరిక్షము) అనే ముల్లోకములు కలిపి - భూర్భువస్సువః వరేణ్యం→ ముల్లోకముల సారము. (8).

---

**హ వా ఏకం గాయత్ర్యై పదం**
**ఏతత్ ఉ హైవాస్యా**
**ఏతత్ స యావత్ ఏషు (యావదేషు) త్రిషు లోకేషు**
**తావద్ధ (తావత్ హ) జయతి**
**యో అస్యా ఏతత్**
**ఏవం పదం వేద।**

**ఏకాక్షరం బ్రహ్మ।** - ఏకము - అక్షరము అగు ఆత్మయే అనుష్టుప్ ఛందమగు గాయత్రీ మంత్రార్థము. **త్రిలోకముల స్వరూపమే గాయత్రీ మంత్రోపాసన.**

ఎవ్వడైతే పైన చెప్పిన **("భూమిః అంతరిక్షం దఃయో")** '8' అక్షరములు గల 'గాయత్రి' యొక్క పాదమును తెలుసుకుంటాడో ఆతడు మూడు లోకములను జయించి (అధిగమించి), తనయందే (ఆత్మయందే) ముల్లోకములను గాంచుచున్నాడు.

**"భూః-భువః - సువర్ వరేణ్యం" - మొదటి పాదము।**

(1) (2) (2) (3)

ఇది 8 అక్షరములు గల మొదటి పాదము. ముల్లోకముల సారము.. ను (త్వయందే) ఆత్మకు అభిన్నంగా దర్శించి ముల్లోకములు పొందిన వాడగుచున్నాడు.

---

2 **ఋచో యజూగ్ంషి సామా ని**

**(2) (4) (2)**

**ఇతి అష్టావక్షరాణి,**
**అష్ట అక్షరగ్ం హ వా।**

**ఏకం గాయత్రై, పదం ఏతదు హైవ**
**అస్యా ఏతత్ స యావతీయం,**
**త్రయా విద్యా। తావద్ధ జయతి, (తావత్ హ జయతి),**
**యో అస్యా ఏతదేవం (ఏతత్ ఏవం) పదం వేద।**

**రెండవ పాదము**

**ఋచః యజూగ్ంషి సామాని**

2 3 3

☙ ఇవి అష్టాక్షరి ( 8 అక్షరములు కలది).

☙ గ్రాయత్రి యొక్క మొదటి పాదము కూడా '8' అక్షరములు.

- గాయత్రి యొక్క మరొక పాదము ఋక్ - సామ - యజుర్ రూపమైన త్రయా విద్య. '3' వేదములు గాయత్రి యొక్క పాదములు-**త్రిపదా। త్ర్యక్షరా।**

ఆత్మను **"గాయత్రీ త్రయా విద్య"** ద్వారా ఉపాసించువాడు - ఋక్సామ యజుర్వేద సారమును గ్రహించినవాడగుచున్నాడు. వేదత్రయా జ్ఞాన ఫలమును సిద్ధించుకొనుచున్నాడు!

3 "ప్రాణో అపానో, వ్యాన (వి ఆ న) ఇతి" అష్టావక్షరాణి।
(2) (3) (3)
అష్ట-అక్షరగ్ం హ వా
ఏకం గాయత్ర్యై పదం।
ఏతదు హైవ (హి ఏవ) అస్యా
ఏతత్స (ఏతత్ స) యావత్ ఇదం
ప్రాణి, తావద్ధ జయతి। (తావత్ హ జయతి)।

**మూడవ పాదము**

**ప్రాణో అపానో వియాన (వ్యాన)**
== == == == (8)

ఈ మూడు ప్రాణవృత్తులను (ప్రవేశ - నిష్క్రమణ - విస్తారణ వృత్తులను) నిర్దేశిస్తున్నాయి. (ప్రకృతి = "ప్ర" దర్శనము, "కృ"తము, "తి" రోధానము)
ధియో యోనః ప్రచోదయాత్।
= = = = = = = = (8)

ఇది గ్రాయత్రి యొక్క 8 అక్షరములు గల అష్టాక్షరి.

**ఈ ప్రాణత్రయమే గాయత్రి యొక్క మూడవ పాదము.**

ఎవడు గాయత్రి యొక్క మూడవపాదమును ప్రాణ - అపాన- వ్యాన స్వరూపముగా తెలుసుకొని ఉపాసించుచున్నాడో అట్టివాడు ప్రాణసమూహమును జయించుచున్నాడు. **ప్రాణ సమూహమును, ప్రాణుల సమూహమును తన ఆత్మయందే దర్శించుచున్నాడు.**

---

'తురీయ'। (4వ పాదము)
యో అస్యా ఏతదేవం పదం వేద అథాస్యా।
ఏతత్ ఏవ తురీయం దర్శతం పదం
పరోరజా య ఏష తపతి।

యత్ వై చతుర్థం, తత్ తురీయం,
దర్శతం పదం ఇతి।
దదృశ ఇవ హి ఏష పరోరజా
ఇతి సర్వం ఉ హ్యేవైష రజ
ఉపరి-ఉపరి, (ఉపర్యుపరి) తపతి ఏవగ్ం
హైవ శ్రియా,
యశసా తపతి యో అస్యా,
ఏతదేవం పదం వేద॥

తరువాత - '4' పాదముల శబ్దరూపగాయత్రి.

ఏ సూర్యుడు తపించుచూ ఆకాశములో ప్రదర్శితమగుచున్నారో ఆ సూర్యమండలములోని తేజస్సును **తురీయరూపమగు** (చతురీయమగు) నాలుగవ పాదము.

అట్టి తురీయమును **"పరోరజా"**, **'దర్శితపాదము'** అని కూడా శ్రుతులు గానం చేస్తూ ఉన్నాయి.

జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల, **ఆ మూడు తనవై ఉన్నదే తురీయము. (4వది).**

ద్రష్ట - దర్శనము - దృశ్యములకు ఆధారమై → ఆవల ఉన్నది కాబట్టి **'దృక్' లేక దర్శితపదము. (సర్వము చూస్తున్నట్టిది).**

గాయత్రీమంత్రము ఈ (చ) **తురీయమునే** ఉద్దేశ్యిస్తోంది.

**దర్శితుడు** =సూర్యమండలాంతర్గత పురుషుడు. ఆదిత్యుడు.

**పరోరజ** = (అన్నా కూడా) మండలాంతర్గత పురుషుడే. త్రిపాదములకు సాక్షియగు - ఆవల గల పరస్వరూపుడు.

అట్టి తురీయుడు సమస్తమైన రజములకు (భూ-భువర్-సువర్ లోకములకు) ఆవల ఉండి, అవన్నీ సత్త యందు ప్రకాశింపజేయువాడు కాబట్టి 'పరోరజ'!

ఎవడు 'గాయత్రీ మహామంత్రము' యొక్క ఈ నాలుగవ పాదమును ఈవిధంగా తెలుసుకొనుచున్నాడో, ఆతడు సర్వాధిపత్యముతో కూడిన 'ఖ్యాతి'తో ప్రకాశించుచున్నాడు.

---

4 స ఏష గాయత్ర్యా
ఏతస్మిగ్ం తురీయే
దర్శతే పదే పరోరజసి ప్రతిష్ఠితా।

గాయత్రీ మంత్రము యొక్క మొదటి మూడు పాదములు కూడా → "గాయత్రీ పరోరజసి" - దర్శితపదము అయినట్టి - సూర్యమండలాంతర్గత పురుషుడే స్థానము కలిగియున్నట్టివి. నాలుగవ పాదము (తురీయము)నందు → ప్రతిష్ఠితములు అయి ఉన్నాయి.

| | | |
|---|---|---|
| | తద్వై తత్ సత్యే ప్రతిష్ఠితం<br>చక్షుర్వై సత్యం।<br>చక్షుర్హి <u>వై</u> సత్యం। చక్షుర్హి <u>వై</u> సత్యం।<br>తస్మాత్ యత్ ఇదానీం<br>ద్వౌ వివదమానా వేయాతామ్<br>అహం దర్శమ్–<br>అహం అశ్రౌషం–ఇతి<br>ఏవం బ్రూయాత్, "అహం అదర్శమ్" ఇతి।<br>తస్మా ఏవ శ్రద్ధ ధ్యామ। తద్వై తత్ సత్యం–<br>బలే ప్రతిష్ఠితం। ప్రాణో <u>వై</u> బలం। | → అట్టి 'ప్రసిద్ధము' అగు నాలుగవ పాదము '<u>సత్యము</u>'నందు <u>ప్రతిష్ఠితమైయున్నది.</u><br>సత్యము ఏది? అని అంటే, కనులను ఉపయోగించి 'చూపు'అను తేజస్సుతో చూచినదే సత్యము। చూచుచున్నదంతా (తురీయ రూప) సత్యమే!<br>అందుకే ఒకాయన **"నేను ఇప్పుడు ఇట్లా జరిగిందని విన్నాను"** అని, రెండవ ఆయన, "నేను ఇప్పుడు ఇట్లా జరిగినట్లు చూచాను".. అని చెప్పుచున్నప్పుడు, **చూచినవానినే నమ్ముతాము.** వినినవానిని అంతగా నమ్మము కదా!<br>→ తురీయ రూపమై సూర్యునికి ఆశ్రయమైయున్నదే - (కుడి) నేత్రము నందు ప్రసిద్ధమైన సత్యము. 'బలము' నందు (చూపుశక్తియందు) ప్రతిష్ఠితమైయున్నది కూడా అదే.<br>**- ప్రాణమే బలము రూపముగా ఉన్నది.** |
| | తత్ ప్రాణే ప్రతిష్ఠితం।<br>తస్మాత్ ఆహుః బలగ్ం<br>సత్యాత్ ఓగీయ ఇతి।<br>ఏవం ఏషా గాయత్రీ<br>అధ్యాత్మం ప్రాణే ప్రతిష్ఠితా।<br>సా హి ఏష (అ) గయాగ్ం। తత్రే<br>ప్రాణా వై గయాః తత్ ప్రాణాగ్ం<br>తత్రేతత్ యత్ గయాగ్ం। | - సత్యాత్మకమగు నేత్రము (చూపు) - **'బలము'** రూపమగు 'ప్రాణము' నందు ప్రతిష్ఠితమైయున్నది.<br>- ప్రాణము నేత్రేంద్రియము కంటే బలిష్ఠమైనది. ఎందుకంటే నేత్రము యొక్క చూపుశక్తి - ప్రాణము నందే ప్రతిష్ఠితము అయి ఉండటంచేత ప్రాణమో? **పరమాత్మయందు ప్రతిష్ఠితము!**<br>"పరమాత్మ యొక్క శక్తి రూపమహిమ" అగు ప్రాణము నందు 'గాయత్రి' యొక్క మొదటి '3' పాదములు ప్రతిష్ఠితమై ఉన్నాయి.<br>గాయత్రి → వాగింద్రియమును కాపాడుచూ ఉన్నది.<br>(గాతయత్ త్రాయతే యస్మాత్ గాయత్రీ - ఇతి అభిధీయతే।) |
| | తత్రే తస్మాత్ <u>గాయత్రీ</u> నామ<br>స యాం ఏవామూగ్ం <u>సావిత్రీం</u><br>అన్వహై షైవ స యస్మా<br>అన్వాహ తస్య ప్రాణాగ్ం త్రాయతే॥ | ఈ విధంగా వాక్ ఇంద్రియములను కాపాడుచూ ఉండటంచేత 'గాయత్రి' అను పేరుతో పిలువబడుచున్నది. గాయత్రి ప్రాణరూపము ధరించి సర్వజగత్తులకు 'రక్షణ' రూపమును ప్రదర్శించుచూ ప్రకాశించుచున్నట్లు ఉపాసించబడుగాక! గాయత్రిని ఉపాసించువాని గాత్రము మధురము గాను, గంభీరముగాను ఉండగలదు.<br>ఆ ఆచార్యుల వారు సవితృదేవతాత్మకమైన మంత్రమును (సవితృ= సత్+విత్+ఋత్= ఉనికి+ ఎరుక+ అనుభూతి= ఆత్మలక్షణ విలక్షణి) చెప్పుచున్నారు.<br>అష్టవర్షాత్ - 8 సంవత్సరముల బాలునకు ఉపనయన సందర్భములో బోధించబడుచున్నది. **సావిత్రి (సత్+విత్+ఋత్)-అని కూడా పిలువబడుతోంది.**<br>(మరియు) **'గాయత్రి'** - ఆచార్యుల వారు వటువుకు <u>"ఓం భూర్భువస్సువః తత్ సహితుః వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్"</u>.. అను మంత్రము బోధిస్తున్నారు. అది ప్రాణశక్తి అయి, ఉపాసకునికి ప్రాణరక్షణ కలిగిస్తూ, బుద్ధిని ప్రేరేపించి **"అహమాత్మానుభవము"**నకు సంసిద్ధుని చేయుచున్నది. |
| 5 | తాగ్ం హైతాం ఏకే<br><u>"సావిత్రీం"</u> అనుష్టుభ్ అన్వాహుః।<br><u>'వాక్'</u> అనుష్టుభ్ ఏతత్ వాచం<br>అనుబ్రూమ ఇతి। | అట్టి సావిత్రీ (సత్-విత్-ఋత్ స్వలక్షణ సమన్విత) ఆత్మను 'అనుష్టుప్ ఛందస్సు'తో అనుకరణము చేసి చెప్పిరి.<br>**"బిడ్డలారా! అనుష్టుప్ ఛందస్సును ఈ వాక్కును అనుసరించి ఆత్మోపాసన కొరకై చెప్పుచున్నాము"** - అని ఆచార్యులవారు ముందుగా చెప్పుచున్నారు. |

**న తథా కుర్యాత్**
**గాయత్రీమ్ ఏవ సావిత్రీమ్ అనుబ్రూయాత్ ।**
**యది హ వా (యత్ ఇహ వా)**
**అప్యేవం విత్‌బహ్వివ**
**ప్రతిగృహ్ణాతి। న హైవ**
**తత్ గాయత్ర్యా ఏకన్చ**
**న పదం ప్రతి।**
**(ప్రతిగృహీతము = దానము పుచ్చుకొనటము)**

వారిదృష్టిలో వాక్కే అనుష్టుప్. 'గాయత్రి' మంత్రమునే 'సావిత్రి' (సావిత్-బ్రుత్) మంత్రముగా చేసి చెప్పుచున్నారు. ఎందుకంటే గాయత్రియే ప్రాణము. ప్రాణమే సర్వేంద్రియమంతా కూడా! (ఒక్క వాక్కే ప్రాణము కాదు. సర్వేంద్రియములు ప్రాణ ప్రదర్శనమే).

ఈ విధముగా గాయత్రీ ఉపాసన చేయువాడు ఒకానొక చోట ధనమును గ్రహిస్తే కూడా దోషము అంటదు.

అది ఆత్మోపాసనా భావము సమక్షములో అత్యంత స్వల్ప సందర్భమై యున్నది. అదంతా (ధనము మొదలైనవి) చతుష్పద గాయత్రీ మహావృక్ష ఫలములందు ఒక్క ఫలముగా కూడా సరితూగదు.

అందుచేత గాయత్రీ ఉపాసకుని ప్రతిగ్రహ (ప్రతిగృహీత) దోషము స్పృశించజాలదు.

---

**6 స య ఇమాగ్ం**
**త్రీన్ లోకాన్ పూర్ణాన్**
**ప్రతిగృహ్ణీయాత్**
**సో అస్యా ఏతత్ ప్రథమం పదం ఆప్నుయాత్।**

గాయత్రీ మంత్రము య్యొక్క... మొదటి పాదము : **<u>ఓం భూర్భువస్సువః</u>**

[ భూమిః-అంతరిక్షము- ద్యౌః (దేవతా లోకము)]- ఈ మొదటి పాదము యొక్క ఉపాసనతో కూడిన ఉచ్చారణచే పూర్ణములగు భు-భువర్-సువర్ లోకములను ప్రతిగ్రహణము పుచ్చుకొనటము చేసినవాడగుచున్నాడు.. అట్టివాడు ప్రథమ పద-విజ్ఞానఫలము సిద్ధించినదగుచున్నది.

---

**అథ యావతీయం 'త్రయీ విద్యా'**
**యస్తావత్ (యః తావత్) ప్రతిగృహ్ణీయాత్,**
**సో అస్యా ఏతత్**
**ద్వితీయం పదం ఆప్నుయాత్।**
**అథ యావత్ ఇదం ప్రాణి యః,**
**తావత్ ప్రతి గృహ్ణీయాత్**
**సో అస్యా ఏతత్**
**తృతీయం పదం ఆప్నుయాత్।**

గాయత్రీ మంత్రము యొక్క ద్వితీయ పదము : **"భర్గోదేవస్య ధీమహి"।**

ఇది త్రయీ విద్య ప్రసాదించునది. ఋచః (ఋగ్వేదము) - యజూంషి (యజుర్వేదము) - సామాని (సామవేదము)ల సారవస్తువు ఈ ద్వితీయ పాదము యొక్క ఉచ్చారణ, ఉపాసనలచే లభించుచున్నది. వేదముల అధ్యయనము ఏ ఫలమును ఇస్తుందో, అదంతా కూడా గాయత్రి ఈ ద్వితీయ పాద - ఉపాసకునికి అందజేస్తోంది.

ఈ రెండవ పాదమును ఏకాగ్రతగా మనో - వాక్కులతో ఉపాసిస్తూ ఉండగా, - ఎంతెంత ప్రాణికోటి ఈ సృష్టియందు కలదో, ఆ త్రిలోక ప్రాణికోటి ఆతనిచే స్వస్వరూపముగా ప్రతిగ్రహించబడునది అగుచున్నది. ఆ ప్రతిగ్రహణము - **మూడవ పదము** వరకు వ్యాపించుచున్నది.

---

**అథా అస్యా ఏతత్ ఏవ తురీయం**
**దర్శతం పదం పరోరజా**
**య ఏష తపతి, నైవ కేన చ నాప్యం,**
**కుత ఉ ఏతావత్ ప్రతిగృహీయాత్।**
**(ప్రతి గృహ్ణీయాత్)।**

ఈ విధంగా 'గాయత్రి' యొక్క మూడు పాదముల ఫలము పొందిన తరువాత **ఇక నాలుగవ పాదము :**

→ సూర్య మండలము నందు - సర్వ దేహములందు ప్రకాశించు ఆదిత్య పురుషుడు, పరోరజస్సు - **తురీయపాదము** (చతురీయ 4వ పాదము). తప్పించు సూర్యుడే 4వ పాదము.

అట్టి పరోరజస్సు, తురీయ పాదము, **నాల్గవ పాదము.** సూర్యమండ లాంతర్గత (ఆదిత్య మండల) పురుషదర్శనము. ఇది ఎవ్వడు కూడా ప్రతిగ్రహణము చేయలేడు. ప్రతిగ్రహణ విధి ద్వారా మొదటి మూడు (జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు) మాత్రమే ఆక్రమించివేయబడగలవు. తురీయము వ్యాపించబడేది కాదు. ప్రతిగ్రహణము చేయగలిగేది కాదు. **తురీయము అగు నాలుగవ పాదములో ద్వితీయమే ఉండదు.**

ఏకమగు చోట ఏది దేనిచేత ప్రతిగ్రహించబడుతుంది, వ్యాపించబడుతుంది? ఏది దేనిచేత మ్రింగబడుతోంది?

→ అంతా తానే అయి ఉండగా రెండవది ఏది?

ఇప్పుడు గాయత్రీ దేవి నమస్కారమంత్రము - ఉపస్థానము గురించి చెప్పుకుంటున్నాం!

7 **తస్యా ఉపస్థానం।**
**గాయత్ర్యస్య - ఏకపదీ, ద్విపదీ,**
**త్రిపదీ, చతుష్పద్యపదసి నహి**
**(చతుష్పదీ అపదసి)**
**నహి పద్యసే। నమస్తే।**

**గాయత్రీ ఉపస్థాన (స్మరించు) మంత్రము**

త్రిలోక జననీ! ఓ గాయత్రీ జగన్మాతా! నీవు ఈ త్రిలోకములకు ఆత్మవై ఉన్నావు. ఇది నీ మొదటి పాదము. ఆపై త్రివేదముల (ఋక్-యజుర్-సామ) స్వరూపము నీ యొక్క రెండవ పాదము. వేదజననివి. ఇది నీ త్రయీ విద్యాస్వరూపము। ఇంక తరువాత - ప్రణవము అగు **ప్రాణ అపాన-వ్యానరూపము - నీ మూడవ పాదము.** ఈ విధంగా త్రిపదవు సూర్యమండలార్గత తేజోపురుషకారము నీదే।

నీవు అపదసి (పాదములు) లేనిదానవు కూడా।

- తురీయము నీ నాల్గవ పాదము. 4వ పాదముగా నిరుపాధికము, (ఉపాధి రహితము) కాబట్టి నిన్నెవ్వరు దర్శించలేరు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను. (బుద్ధికి మాత్రమే స్వానుభవము కాగలిగినది)।

---

**నమస్తే। తురీయాయ దర్శతాయ**
**పదాయ పరోరజసే।**
**అసావదో మా ప్రాపదితి।**
**యం ద్విష్యాత్ అసావస్మై కామో,**
**మా సమృద్ధీతి వా న హైవ**
**అస్మై స కామ ఋధ్యతే।**
**యస్మా ఏవం ఉపతిష్ఠతే,**
**అహమ్ అదః ప్రాపమితి వా।**

"తురీయము (చతురీయము - 4వది)" అనబడు 'పరోరజ' అని చెప్పబడు దర్శిత - అదర్శిత (కలిగి-లేని) పాదము గల ఓ గాయత్రీ! నమస్తే!

నీ తురీయ పాదదర్శనముచే ఇక నేను నీకు **అద్వితీయమును.** అట్టి నీ యొక్క పాదపద్మములను దర్శించి నీ పదప్రాప్తిపొందుటకై కలుగుచున్న విఘ్నములు నిర్విఘ్నమగుగాక। **ఇతి ఉపస్థానం।**

"ఎవ్వరైతే (ఏఏ గుణములైతే, ద్వేషమోహముల మమకారముల-అహంకారముల ఇత్యాది రూపంగా) **"గాయత్రీ త్రిపాద ఉపాసన - చతుష్పాద మమేకత్వము"** నిర్వర్తించుచున్న సాధకుని బాధిస్తాయో, ఆతని మార్గములోని ఆటంకములై ద్వేషభావరూపప్రదర్శనము చేస్తాయో, **అవి తమ ఆశయములను సమర్థతను పోగొట్టుకొంటాయి. అట్టి ఆటంకములు సంపద పొందవు.**

ఈవిధంగా సంకల్పిస్తూ గాయత్రీ మంత్రము జపిస్తూ ఉండగా, అంతశ్శత్రువులు (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు, వాటివాటి సహకారికములు) నశిస్తాయి. ఉపాసకుడు కోరుకునే ఆత్మైకత్వము లభించగలదు. నేను అంతర్-శత్రువులను జయించి, ఇష్ట ఫలసిద్ధి, అభ్యుదయము పొందుచూ **అద్వితీయమగు తురీయ రూపగాయత్రీ పదము పొందెదనుగాక!** ఇతి ప్రార్థన!

---

8 **ఏతద్ధ వై (ఓతత్ హి వై) తత్ జనకో వైదేహో**
**బుడిలం అశ్వతరాశ్విం ఉవాచ:**
**యన్ను హో యత్ (తత్) గాయత్రీ విదబ్రూథా,**
**అథ కథగ్ం హస్తీ భూతో వహసి ఇతి?**

గాయత్రి గురించి **"ఇతి ముద్రా న జానాతి గాయత్రీ నిష్ఫలం భవేత్"..** అను నానుడి ఉన్నది. అయితే, గాయత్రీ ఉపాసన కేవలాత్మోపాసనయే. అట్టి గాయత్రి మంత్రమును లోక సంబంధమైన ధన - సంపద.. ఇత్యాదుల కొరకై విజ్ఞులు వినియోగించరు. ఉద్దేశ్యించరు.

**ఈ విషయమై విదేహరాజు అగు జనక మహారాజుకు - అశ్వతరాశ్వుని కుమారుడైనట్టి బుడిలునికి-ఈ విధంగా సంభాషణ జరిగింది.**

**జనక మహారాజు :** అశ్వతరాశ్వమునీంద్రుని ప్రియకుమారుడవగు ఓ బుడిల మహాశయా! మీకు సుస్వాగతం! మీ ఉపాసనా విశేషాలు చెప్పుతూ మీ రాకకు కారణం తెలియజేయ ప్రార్థన.

**బుడిలుడు :** నేను త్రిపదా గాయత్రీ ఉపాసకుడను. **నిరాకార, నిరవయవ, నిర్గుణ, సర్వాత్మక ఆత్మ స్వరూపిణి** యగు గాయత్రీ దేవిని గాయత్రీ మంత్రముచే ఉపాసించువాడను. ఈ రోజు ఆశ్రమము నిమిత్తమై కొన్ని వసతుల కొరకై మహారాజు అగు మిమ్ములను అర్థించవచ్చాను.

**ముఖగ్ం హి అస్యాః**
**స సమ్రాట్! న (సమ్రాణ్ణ)– విదాఇ్చకారేతి।**
**హ ఉవాచ! తస్యా అగ్నిరేవ ముఖం యది హ వా**
**అపి బహ్వివాగ్నావభ్యా దధాతి।**
**సర్వం ఏవ తత్ సన్దహత్**
**ఏవగ్ం హైవైవం విద్యద్యపి,**
**బహ్వివ పాపం కురుతే సర్వమేవ**
**తత్ సంప్సాయ శుద్ధః పూతో,**
**అజరో అమృతః సంభవతి॥**

---

**ఇతి– "గాయత్రీ బ్రాహ్మణమ్" నామ**
**చతుర్ధశ బ్రాహ్మణమ్"**

జనక మహారాజు : మహాత్మా! మీ ఆశ్రమము కొరకై మీరడిగినవి సమర్పించి సేవించటానికి నేను సిద్ధముగా ఉన్నాను. అది సరే! **'నిరాలంబము - తురీయ స్వరూపిణీ - తుహినాచలవాసిని'** అగు గాయత్రీ తత్త్వమును ఎరిగియున్న మీరు ప్రతిగ్రహణము (Receiving) అనే దోషమును ఎట్లా సహిస్తున్నారు?

**బుడిలుడు** : ఓ! అదా! మహాత్మా! వినండి. నేను గాయత్రీ ధ్యాన - ఉపాసకుడినే। అయితే ఇంకా పూర్ణోపాసకుడను అవలేదు. గాయత్రి యొక్క 'ముఖము'ను నేను ఇంకా తెలుసుకోలేదు. పాదములు - హస్తములు మాత్రమే ఉపాసిస్తూ ఉన్నాను.

జనక మహారాజు : మీరు చెప్పునది మరికొంత వివరించమని అభ్యర్థిస్తున్నాను.

**బుడిలుడు** : ఇంకా గాయత్రీ ముఖమును దర్శించలేదు. అందుచేతనే "పరిగ్రహణము'' (Receiving) అను పాపము కొనసాగుచున్నది. అయితే మాత్రం ఏమి? ఎందుకంటారా? ఒకానొక చోట అనేక కట్టెలు దహనము అగుచున్నాయనుకోండి! అందులో కొద్ది పచ్చికట్టెలు వేస్తే, అవి కూడా దహనము అవుతాయి కదా! అట్లాగే అగ్నియే ముఖముగా కలిగినట్టి 'గాయత్రి'ని తెలుసుకొన్న తరువాత ఆ అగ్నిలో ప్రతిగ్రహణము (Receiving) రూపము గల సర్వపాపములు దహనమవుతాయి.

'గాయత్రి'ని **ఉపాసించి పరిశుద్ధుడు, అమృత స్వరూపుడు అగుచున్నాను. జరా-మరణముల పరిధిని అధిగమించుచున్నాను.**

**కర్మలు, కర్మఫలములు. కర్మదోషములు నాకు అంటవు. నన్ను వెనుకకు మరల్చలేవు కూడా।**

---

**ఇతి– "గాయత్రీ బ్రాహ్మణమ్ నామ చతుర్ధశ బ్రాహ్మణమ్"**

# సప్తమాధ్యాయః - పఞ్చదశం బ్రాహ్మణమ్

## సూర్యాగ్ని ప్రార్థనా బ్రాహ్మణము

1 హిరణ్మయేన పాత్రేణ సత్యస్య
అపిహితం ముఖమ్।
తత్ త్వం పూషన్!
న పావృణు, 'సత్య ధర్మాయ' దృష్టయే।

ఈ జగత్ పరిపోషణకు కారణమగు ఓ పూషదేవా! సూర్యభగవాన్! ఆదిత్య దేవాదిదేవా!

నాలో పరమసత్యమై, నిత్యమై ఆదిత్య తేజోవిలాసంతో ప్రకాశించుచున్నారు. అయితే అట్టి **'బ్రహ్మము'** అనబడు నాయందలి తమ యొక్క **సత్యతేజస్సు** హిరణ్మయపాత్రమూతచే (ఆత్మకు అన్యముగా దృశ్యమును చూడటము - అనే సాంసారిక, ఐహిక దృష్టిచే) కప్పబడి ఉన్నది.

మావంటి చిత్త విషయ దృష్టి గలవారికి ఆ పాత్ర యొక్క మూతను ఈవలకు తొలగించటము చేతకావటం లేదు. సత్య - ధర్మ దృష్టిని మాకు ప్రసాదించండి.

"సృష్టి భావరూప హిరణ్మయపాత్ర" అను ప్రతిబంధకమును మీరు తొలగించండి! (**నపావృణుం।** మూత తెఱువండి)

---

పూషన్! ఏకర్షే! యమ సూర్య!
ప్రాజాపత్య! వ్యూహ రశ్మీన్।
సమూహ తేజో।
యత్ తే రూపం కల్యాణతమం,
తత్ తే పశ్యామి।
యో అసావసౌ పురుషః, సోఽహమస్మి।
వాయుః అనిలం అమృతమథేదం
భస్మాన్తగ్ం శరీరం॥

**జగత్ పోషకుడు, ఏకర్షి , సర్వ నియామకుడు, జగత్ ప్రాణస్వరూపుడు, జగత్ ప్రాణ ప్రేరకుడు, హిరణ్యగర్భపుత్రుడు** - అగు ఓ సూర్యదేవా! తమ తీక్ష్ణమగు కిరణములు ఉపసంహరించండి. కల్యాణప్రదముగు ఆత్మరూపమును మా యొక్క దర్శనమునకై ప్రసాదించండి.

ఏ ఆదిత్య తేజోపురుషకారము మీ యందు ప్రకాశించుచున్నదో,- అద్దాని యొక్క కిరణములమే మేము. కనుక **మేము మీకు అభిన్నులము. మీరు అద్వితీయులు కదా! మీకు మేము ద్వితీయులము ఎట్లా అవుతాము?**

నేను ప్రాణవాయువును పొందుచున్న అమృత స్వరూపుడను. మృతరూపమగు శరీరమునుకాను! దేహము దేహికి ఐహిక మోహము! అట్టి ఈ **శరీరభావము -"(శరీరి) జ్ఞానాగ్ని"** యందు భస్మమగునుగాక!

---

ఓం 3(ఉ) క్రతోస్మర। కృతగ్ం స్మర।
క్రతో స్మర। కృతగ్ం స్మర।
అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్।
యుయోధ్యస్మత్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ।

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ సప్తమ అధ్యాయే</u>
<u>"సూర్యాగ్ని ప్రార్థనా బ్రాహ్మణమ్"</u>
<u>నామ పంచదశమ్ బ్రాహ్మణమ్॥</u>

'ఓం'! తేజో రూపుడవగు ఓ అగ్నిదేవా! నేను చేసిన కర్మలన్నీ కట్టెలవలె స్వీకరించండి. భస్మము చేయండి. మమ్ములను కర్మ-కర్మఫలముల చక్రము నుండి రక్షించండి।

ఓ అగ్నిదేవా! పూషన్! ద్వాదాశాదిత్యా!

మమ్ములను ఆత్మ తేజోమయ మార్గము కొరకై సరియగు కర్మలగుండా నడిపించండి! మా కర్మఫలములు స్వీకరించి సుపథము ద్వారా త్రోవచూపండి. మా మనో-బుద్ధుల వర్తమాన స్థితి-గతులు ఏమేమిటో మీరు ఎరిగియే ఉన్నారు.

మా కుటిల-వంకరటింకర పాప బుద్ధులను, అల్పబుద్ధులను పరిశుద్ధము చేయండి. మా బుద్ధిని **పవిత్రము, నిర్మలము, సునిశితము, సువిశాలము** చేయండి.

మీ గురించిన ఉపాసన కొరకై సుదీర్ఘమగు ప్రయత్నములు చేయుటకు అశక్తులము.

మీకు హృదయపూర్వకముగా చేతులు ఏకంచేసి నమస్కరించుచున్నాము. **ఈ నమస్కారమే మా సర్వసమర్పణ ఆరాధన.**

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్</u>
<u>సప్తమాధ్యాయమ్ సమాప్తమ్॥</u>

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## సప్తమ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

### 1. ప్రథమ బ్రాహ్మణము

### ఖిలకాండము – 'ఓం ఖం' బ్రహ్మ బ్రాహ్మణము

**ఓం పూర్ణ మదః పూర్ణ మిదమ్। పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।**

**'ఓం'** అను అక్షరముచే (సంజ్ఞచే) చే చెప్పబడు **'బ్రహ్మము'** (లేక) **'పరబ్రహ్మము'** ప్రత్యక్షముకాదు. ఇంద్రియములకు విషయము కాదు. అయితే అది పరోక్షమా? కానే కాదు. **"ప్రతి ఒక్కరి స్వస్వరూపమే, ప్రతి ఒక్కరికీ అనన్యమే"**.. అయి ఉండగా,.. మరి పరోక్షము (Placed at some where else) ఎట్లా అవుతుంది? కాదు. అది **అపరోక్షము**. అట్టి బ్రహ్మము స్వతఃగానే పూర్ణము. అనగా, అద్దానిని మరొకటేదీ చేరి పూర్ణము చేయవలసిన అగత్యము లేదు. దేనిచేతనూ అది అపూర్ణము అవదు.

ఇక ఈ ఇహాత్మ (లేక) జీవాత్మ? జలములో తరంగము వలె ఈ జీవాత్మ పరమాత్మ నుండే బయల్వెడలుచున్నాడు.

తరంగము స్వతఃగా జలమే అయిన రీతిగా, **ఈ ఇహాత్మ (జీవాత్మ) స్వతఃగా చూస్తే – పరబ్రహ్మమే।** కనుక **పూర్ణుడే।**

ఇక ఈ దృశ్య జగత్తో? మట్టిచేత అనేక బొమ్మలు తయ్యారయినప్పుడు ఆ బొమ్మలన్నీ మట్టియే అయిన విధంగా, ఈ జగత్తు స్వతఃగా పరబ్రహ్మమే మూలపదార్థముగా కలిగి ఉండటం చేత– జగత్తు కూడా పూర్ణమే!

**పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।**

పూర్ణమగు పరబ్రహ్మము నుండే పూర్ణత్వముతో కూడి జీవాత్మ – జగత్తులు సంప్రదర్శితము అగుచున్నాయి.

**పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ, పూర్ణమేవ అవశిష్యతే।**

పూర్ణమగు పరబ్రహ్మము నుండి పూర్ణరూపమగు ద్రష్ట (జీవాత్మ–దృశ్యములు జగత్తులు) బయల్వెడలుచున్నప్పటికీ, **పరబ్రహ్మము యొక్క పూర్ణత్వము సర్వదా యథాతథము.** ఈ జీవుడు ఎరిగినప్పుడు – ఎరుగనప్పుడు కూడా పరబ్రహ్మముగా పూర్ణుడే అయి ఉన్నాడు. **జీవాత్మగా ఉన్నది పరబ్రహ్మమే కనుక జీవాత్మ కూడా పూర్ణుడే!**

కారణ రూప పరబ్రహ్మము – కార్యరూప జీవాత్మ, జగత్తులు ఏ సమయంలో కూడా తమ పూర్ణత్వము కొల్పోవటం లేదు!

సృష్టికి పూర్వము పరబ్రహ్మము పూర్ణమే అయి ఉన్నది. అట్టి పరబ్రహ్మమునకు **'అభిన్నము, అద్వితీయము'** అయి ఉన్న ఈ సృష్టి స్వతఃగా పరబ్రహ్మమే కాబట్టి ఇది కూడా పూర్ణమే। పూర్ణమగు పరబ్రహ్మము నుండి ఈ సృష్టి బయల్వెడలిన తరువాత కూడా పరబ్రహ్మము పూర్ణముగానే సదా ఏర్పడియే ఉన్నది! సముద్ర జలము – సముద్ర జల తరంగముల వలె ఈ **'పరబ్రహ్మము', 'సృష్టి'**– ఉభయము ఏక స్వరూపమే అయి ఉండియే పూర్ణమై ప్రకాశించుచున్నాయి. తరంగము సముద్ర జల ధర్మములు కలిగి ఉండియే, ఆకారము దృష్ట్యా మాత్రమే కల్పితమైనట్లుగానే, ఈ 'సృష్టి', దీనిని అనుభవముగా పొందుచున్న 'జీవుడు' కూడా పరబ్రహ్మ ధర్మములన్నీ కలిగి ఉండి ఉన్నారు. అయితే, నామ–రూపములు మొదలైనవి ఆపాదితముగాను, కల్పితముగాను అజ్ఞాని దృష్టికి అగుపిస్తున్నాయి.



## "ఓం ఓం ఓం 'ఖం' బ్రహ్మ"।

నిర్విషయ – అఖండ– సర్వగత ధర్మములు కలిగి ఉన్నట్టి ఈ ఎదురుగా గల ఆకాశము బ్రహ్మమే అయి ఉన్నది. 'ఓం' అని పలుకుచూ, భౌతికాకాశమును ఆలంబనముగా చేసుకొని **సృష్టి– సృష్టికర్తల రూపముగా** పరస్పరము **అద్వితీయమై** యున్న **పరమ పురుషుని** ధ్యానించాలి! **సగుణ నిర్గుణ పరబ్రహ్మములు ఉభయము 'ఓం' సంజ్ఞచే ఉద్దేశ్యంచబడి, ధ్యానించబడునుగాక!**

**'బ్రహ్మము'** అను అర్థముతో వేదములు **'ఓం'**ను పలుకుచున్నాయి. అందుచేత బ్రహ్మమును భావించి మమేకమగుటకు **'ఓం'** అను అక్షరము యొక్క ఉచ్ఛారణ – ధ్యానములు పరమోత్తమమగు సాధనమగుచున్నది. సాకార ధ్యానము సందర్భములో కూడా విష్ణు–శివ ఇత్యాది దేవతలు, **'ఓం'** శబ్దమును ప్రారంభించియే స్తుతించబడుచున్నారు. విష్ణువు యొక్క ప్రతిమకు విష్ణువుతో అభేదము భావన చేయు విధంగా **'ఓం'** శబ్దమును బ్రహ్మముగా ధ్యానము చేయవలెనని **'ఓం ఖం బ్రహ్మ'** అను ఈ మంత్రముల యొక్క ఉద్దేశ్యము అగుచున్నది.

**కౌరవ్యాయణి మహర్షియొక్క కుమారుడగు కౌరవ్యాయణాయ బ్రహ్మజ్ఞుడు ఇట్లా అంటున్నారు.**

**"ఓం"** – యొక్క సిద్ధికొరకై ఆకాశమును ధ్యానించుదాము. నిరుపాధికము (ఉపాధి రహితము) అగు ఆకాశమునకు ఉపాధిగా వాయువు ఆశ్రయమయినట్లుగానే, **నిర్గుణ నిరాకార బ్రహ్మమునకు–సగుణ సాకార జగద్దృశ్యమే ఉపాధి. సాకారమగు ఈ సృష్టికి నిరాకారమగు పరబ్రహ్మమే ఆశ్రయము** → అను మననముతో, సృష్టి – బ్రహ్మల ఏకత్వ భావనతో – **"ఓంకారోపాసన చేయుదుము గాక!"**

**'ఖం'** – ఆకాశము పురాణమైనది (పురానవము). "తదితర వాయు–అగ్ని–ద్రవ–భూ" – 4 భూతములకు – భూతజాలమునకు ఆకాశము – మునుముందే ఉన్నట్టిది. తదితరముగా కనిపిస్తున్న సమస్తమునకు ఆకాశమే ఓతప్రోతము. అదియే జనన స్థానము. మార్పు చేర్పులు లేనట్టిది.

**ఆత్మాకాశము కూడా జీవాత్మ – జగత్తులకు మునుముందే ఉండి, సర్వదా యథాతథమైయున్నది.** అందుచేత **"ఆకాశము"ను 'ఓం'కారార్థ పరబ్రహ్మోపాసనకై వేదవాఙ్మయము సూచించుచున్నది.** అవ్యాకృతాకాశమే వ్యాకృత (Extension) విశేషము చేత భూతాకాశముగా కూడా అగుచున్నది. (అవ్యాకృతము = దేనినుండీ వేరు పడనట్టిది).

## అయం ఓంకారో వేదమ్। [వేదమ్ =తెలియబడుచున్న సమస్తము (శబ్దార్థము)]

ఈ **తెలియబడుచున్నదంతా** ఓంకార సంజ్ఞార్థమగు **పరబ్రహ్మమే. "ఈ నామరూపాత్మకమైనదంతా సహజముగా అనామ–అరూపాత్మకమగు బ్రహ్మమే!"**–అని వేదవత్తలు నిర్వచిస్తున్నారు. తెలియబడుచున్నదంతా – ఓంకార స్వరూపమగు 'తెలివి' (ప్రజ్ఞ. logic) చేతనే తెలియబడుచున్నది. వాక్కులన్నీ ఓంకారమే! ఋక్–యజుర్–సామ–అధర్వణవేదములు కూడా **'ఓం'**కార స్వరూపమే!

**దృక్–ద్రష్ట – దృశ్య రూపములను 'ఓం' కారముయొక్క పరమార్థముగా భావించి, ఆత్మయొక్క అఖండత్వమును ఉపాసించువాడు బ్రహ్మమును ఎరిగి, బ్రహ్మమే తానగుచున్నాడు. (ఓం = అ+ఉ+మ, కేవలము–అనుభవించబడుచున్న సమస్తము–అనుభవి).**

*ఇతి 'ఖిలకాండము' – "ఓం ఖం బ్రహ్మ బ్రాహ్మణమ్" నామ సప్తమోధ్యాయాంతర్గత*
*ప్రథమ బ్రాహ్మణము*

# సప్తమ అధ్యాయము
# ద్వితీయ బ్రాహ్మణము
# 2. ప్రాజాపత్య బ్రాహ్మణము

**సాధనములు :** ఇప్పటిదాకా మనము నిర్విషయము – శూన్యము– నిరాకారము –నిర్గుణము అగు **ఆకాశము**ను ఉపాసించి **చిదాకాశ రూపమగు బ్రహ్మము**ను జేరటం గురించి చెప్పుకున్నాము. **'ఉపాసించటము'** అనగా విర్గుణ బ్రహ్మమును కేవలము స్తోత్రము చేయటమా? లేక మనస్సుతో ఆలోచనకు కేంద్రీకృతం చేయటమా? ఈ రెండూ కూడా **"నిర్విషయ ఆకాశ ధ్యానమార్గము"**.. అను విధానములో కష్టతరమైనవి. ఎందుకంటే.. **"నాకు దేహము దృష్ట్యా ఆకారము ఉన్నది. ఆకార బద్ధుడను"**.. అని దేహభావన ఉన్నవారే మనలో అధికము. నిరాకారమగు దేహిని భావించి నిరాకార ధ్యానము చేయటము **అత్యంత దుర్లభము.** పైగా, ఒకడు తనయందు ఇంద్రియ సంబంధమైన ఆశ– ఆశయములను కొనసాగిస్తూ ఉంటే, నిర్విషయమగు ఆకాశ ధ్యానము ఆశ్రయించినా కూడా, అనేక సందర్భాలలో దృశ్య దృష్టులే పెత్తనం చెలాయిస్తాయి. అవి ఆత్మభావన కొరకై నిర్వర్తించే ధ్యానమునకు అడుగడుగునా విఘ్నములు కలుగజేస్తాయి. అందుచేత విద్వజ్ఞులచే సాధకులకు **"సాకారధ్యానము"** సూచించబడుతోంది.

❖❖❖

సృష్టికర్తయగు ప్రజాపతి సత్త్వ–రజో–తమో గుణముల వేరువేరు పాళ్ళ కలయికతో ఈ సృష్టి వ్యవహారమును నిర్వర్తిస్తున్నారు. గుణముల కల్పన లేనిదే జగన్నాటకమూ ఉండదు, ఒక వీధి నాటకమూ ఉండదు. **సృష్టి కల్పన కూడా నాటకము వంటిదే.**

అట్టి ప్రజాపతి (బ్రహ్మదేవుని) సృష్టిలోని జీవులు వారివారి గుణాధిక్యతల దృష్ట్యా '3' విభాగములుగా విభజించబడ్డారు.

(1) సత్త్వగుణ – ఆధిక్య జీవులు → ఊర్ధ్వలోకములలోని 'దేవతలు'. (సత్త్వగుణ ప్రాధాన్యులు).

(2) రజోగుణాధ్యిక్య జీవులు → మానవులు (రజోగుణ ప్రాధాన్యులు).

(3) తమోగుణ – ఆధిక్య జీవులు – అసురులు. దానవులు. రాక్షసులు (తమోగుణ ప్రాధాన్యులు).

ఈ మూడు రకములగు బ్రహ్మ సృష్టిలోని వేరువేరు స్వభావులగు దేవతలు, మానవులు, అసురులు కూడా – ఒకసారి **"జగత్ సృష్టికర్త, జగతః పిత"** అగు బ్రహ్మదేవుని దర్శించారు. **'మోక్షము, పరమానందము'**.. నకు మార్గమును బోధించవలసినదిగా కోరారు.

**త్రివిధ ప్రాధాన్య జీవులు :** మమ్ములను సృష్టించిన ఓ ప్రజాపతీ! పితామహా! బ్రహ్మదేవా! లోకగురూ! మేము సర్వ విఘ్నములను జయించి **"ఆత్మావలోకనము"** చేయు సాధనముల గురించి చెప్పండి! – మార్గాన్వేషకులగు మాకు మోక్ష మార్గమునకు కర్మసాధనల గురించి తెలియజేయండి. మేము మీరు బోధించినది అనుసరించినవారమై **పరమానందరూపుడగు పరమాత్మ**ను చేరగలము.

**బ్రహ్మదేవుడు :** బిడ్డలారా! చాలా సంతోషము. మీరు శ్రేయోమార్గమును కోరుచున్నారు. తప్పక చెప్పుతాను!

ఇట్లా పలికి వారు దేవతలను, మానవులను, అసురులను **విడివిడిగా** పిలచి **"ద"** అను వర్ణమును ఉపదేశించారు. కొంతకాలము గడచింది. అప్పుడు ప్రజాపతి తన బిడ్డలు ఏమి చేయుచున్నారో తెలుసుకోదలచారు. దేవతలను, మానవులను, అసురులను విడివిడిగా పిలచి సంభాషించసాగారు. మొట్టమొదట **దేవతలను** పిలచారు.

**ప్రజాపతి :** ఓ దేవతలారా! నేను మీకు ఉపదేశించిన ఏక–అక్షరము **'ద'**ను గురించి అర్థమును తెలుసుకొన్నారా? తెలుసుకొని యథారీతిగా ప్రవర్తనము కలిగి ఉంటున్నారా? మీరు ఏమని అర్థము తెలుసుకొన్నారు? ఏమి చేస్తున్నారు? చెప్పండి!

**దేవతలు :** హే భగవాన్! పితృదేవా! ప్రజాపతి గురువర్యా! మీరు ఉచ్చరించిన **'ద'** అను అక్షరార్థమును **'దమము'** అని భావించి ఉపాసన నిర్వర్తిస్తున్నాము.

**దామ్యత! అదాంతా యూయం స్వభావతః। అతో దాంతా భావత – ఇతి॥ –**

మీరు **‘ద’** అను శబ్దము ఉచ్చరించగానే **“ఓ దేవతలారా! మీరు దాంతులు (అనగా) ఇంద్రియ నిగ్రహము కలవారు అవండి. మీకు ఇంద్రియ నిగ్రహము లేని కారణంగానే, అది మీ ఆత్మానుభావమునకు విఘ్నములు కలిగిస్తున్నది. ఇక నుండి ఇంద్రియ విషయముల పట్ల జాగరూకులై, వాటికి వశులు కాకుండా ఉండండి. ఇంద్రియములు, ఇంద్రియ విషయములు – వీటిని పూర్తిగా అదుపులోకి తెచ్చుకోండి.”** అని బోధించుచున్నారని, మేము చర్చించుకొని, అర్థం చేసుకున్నాము. మేము ‘ఓం’తో పాటు **“ఇంద్రియములను విషయముల నుండి ఉపశమింపజేసి, పరమాత్మ వైపు నియమించబటము”** అను ప్రయత్నములలో నిమగ్నులమై, మీరు బోధించిన **‘దం’** ఏకాక్షరోపాసన చేస్తున్నాము. అది **“ఓం కారోపాసన – అక్షర పరబ్రహ్మ యోగము”**నకు మార్గముగా మాకు ఉపకరిస్తోంది.

**ప్రజాపతి :** బిడ్డలారా! దేవతలారా! మీరు తెలుసుకొనినది సరియే! బాగుగా తెలుసుకున్నారు. ఏతత్ మీ మీ సాధనలను కొనసాగించెదరుగాక।

❖

అప్పుడు ప్రజాపతి **మానవులను** పిలిచారు.

**ప్రజాపతి :** ఓ మానవులారా! మీ యొక్క ఓంకార సంజ్ఞాత్మకమగు పరమాత్మోపాసనకు సహకారికంగా **‘దం’** అక్షరోపాసనను నేను చెప్పినట్లు అభ్యసించుచున్నారు?

**మానవులు :** పితామహా! సృష్టికర్తా! మీరు సూచించినట్లే **‘దం’** అను ఏకాక్షరమును ఉపాసనగా ఉపాసిస్తున్నాము.

**ప్రజాపతి :** బిడ్డలారా! చెప్పండి! ‘దం’ అని నేను ఉచ్చరించి బోధించిన అక్షర యోగమును ఏ విధంగా తెలుసుకుని ఉపాసిస్తున్నారు?

**మానవులు :** హే సద్గురు భగవాన్! ప్రజాపతీ! మీరు ఉచ్చరించిన **‘దం’** శబ్దమును విని…,

**“ఓ మానవులారా! మీరు స్వభావతః లోభగుణము కలిగియున్నారు. దాచి దాచి ఉంచుకొని, పరులకు దానము ఇవ్వక, ఆయుష్షులు గడుపుచున్నారు. దానితో పరమాత్మత్వమును ఆశ్రయించలేక పోవుచున్నారు. ఆ మీ లోభగుణమే మీ అధ్యాత్మ మార్గములో అనేక విఘ్నములను కలిగిస్తూ దారి తప్పిస్తోంది. ఇప్పుడు ఆ లోభ గుణమును త్యజించండి. దానము చేయటం నేర్చుకోండి”**… అని మీరు మాకు ఉపదేశించినట్లుగా మేము గ్రహించాము. లోభగుణమును **‘త్యాగము’** అను ఉత్తమ ఆయుధముతో జయించుట యందు నిమగ్నులమై ఉన్నాము. **“దం = ఇచ్చుట”** – అనే అర్థాన్ని మేము స్వీకరించి ఉపాసిస్తున్నాము.

**ప్రజాపతి :** ప్రియ మానవులారా! నా **‘దం’** అక్షర బోధను మీరు సరిగ్గానే అర్థము చేసుకొన్నారు. ఇంకా కూడా మీ మీ స్థానములో ఉండి **“దం” → శబ్ద ఉచ్చారణ, త్యాగనిరతి”**ల ద్వారా లోభమును జయించి ఆత్మానందమునకు అర్హులు అయ్యెదరు గాక! వెళ్లి రండి.

❖

అప్పుడు ప్రజాపతి **అసురులను** పిలిపించారు.

**ప్రజాపతి :** బిడ్డలారా! అసురులారా! నేను చెప్పియున్న **‘ద’** అక్షరమును ఉపదేశము యొక్క ఉద్దేశ్యమును ఎరిగియే ఉపాసిస్తున్నారా? ఏమని అర్థము చేసుకొనిన వారై ఉన్నారు? చెప్పండి.

**అసురులు :** మేము జన్మతః క్రూర స్వభావులమై ఉంటాము కదా! అదియే మా ఆత్మోపాసనకు అసంఖ్యాక బలవత్తరమైన విఘ్నములు కలుగజేస్తోందని మీరు గుర్తు చేసినట్లు మేము భావించాము.. **“సహ ప్రాణుల పట్ల దయ–దాక్షిణ్యము కలిగి ఉండండి”** అని– **‘ద’** అక్షరమును పలుకుటలో మీ ఉద్దేశ్యముగా మేము గ్రహిస్తున్నాం. **‘ద = దయ’** అను అభ్యాసమును ఆశ్రయిస్తూ ఉన్నాము.

***“హింసించుటలో, పీడించుటలో మీరు ఉత్సాహము కలిగి ఉంటున్నారు. అందుచేతనే బ్రహ్మమును దర్శించి బ్రహ్మానందమునకు అర్హులు అవటము లేదు”***.....అని మీరు మాకు శ్రేయోభిలాషులై **‘ద’** అక్షరము ద్వారా బోధించుచున్నారని గ్రహించాము.





"క్రూరత్వము-బాధించటము - హింసించటము" మొదలైన పూర్వాభ్యాసములను మా ఆత్మోపాసనకు అడ్డుగోడలగుచున్నాయని మేము ఆత్మపరిశీలనగా గమనిస్తూ,- మీరు చెప్పిన మార్గములో సహజీవుల పట్ల ప్రేమ-ఆప్యాయతలను ఉపాసనగా ఎన్నుకుని జీవనమును సరిదిద్దుకుంటున్నాము.

**ప్రజాపతి :** అవును. మీరు అర్థం చేసుకొన్నది. నేను ఉద్దేశ్యించిన తీరుగానే। మీరు మీ క్రూరత్వ-హింసతత్త్వములను చక్కగా త్యజించి **ఆత్మ తత్త్వజ్ఞానముచే ఆత్మానందమునందు ప్రవేశించెదరు గాక!**

❖ ❖ ❖

ఈ విధంగా ప్రజాపతి **'ద' 'ద' 'ద'** అని ఉపదేశించగానే **దేవ, మానవ, అసురులు** వారివారికి ఆత్మజ్ఞానమార్గములో స్వీయ దోషములై అడ్డుపడుచున్నట్లుగా గుర్తెరిగి, దోషములను తొలగించుకొంటున్నారు. శ్రద్ధగలవారు తప్పక ఎప్పుడో ఒకప్పుడు ఆత్మసామ్రాజ్యమునందు ప్రవేశించి ఆత్మానంద స్వరూపులవగలరు.

ఆనాడు ప్రజాపతి పలికిన దైవావాక్కు **'ద ద ద'** అను '3'సార్లు ఉచ్ఛరణయే మేఘ గర్జనల రూపంగా- నేటికీ వినబడుచున్నది.

## 'ద' 'ద' 'ద' దైవ వాణి.. మేఘగర్జన!

→ ఓ జనులారా! **దమము** (ఇంద్రియ నిగ్రహము) కలిగి ఉండండి! ఇంద్రియములు మీకు ఉపకరణములుగా ఉండాలి. ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు మీరు లోలురు (Involved, Entangled) కాకూడదు। ఇంద్రియ విషయములకు దాసులై, "చాంచల్యము' అనే మనోజాడ్యము తెచ్చి పెట్టుకోకండి. అల్పము, దుఃఖ పర్యవసానము అగు ఇంద్రియ సుఖముల వెంటబడి, ఆత్మానందము నుండి చ్యుతి పొందకండి.

→ దానము చేయండి. లోభ గుణమును జయించండి. 'నాది' అనునది బంధము. 'నీది - పరమాత్మది' అను త్యాగభావముతో లోభమును జయించండి। "హే సర్వాంతర్యామీ! 'నాది' అని నాకు అనిపించేదంతా వాస్తవానికి మీది. 'నాది-నాది' అనే జాడ్యము తొలగుగాక। అను ప్రార్థన, ఉపాసన కలిగి ఉండండి.

→ దయ కలిగి ఉండండి. మీరు కష్ట కాలములో ఏది ఇతరుల నుండి కోరుకుంటారో, అది మునుముందుగానే కష్టములో ఉన్న వారికి చేయి అందించండి. క్రూరము - హింస వీడకున్నారా,... మరల ఈ మానవ జన్మయొక్క అవకాశము ఎన్నటికో చెప్పలేము సుమా! 'మనస్సు'లో **ద్వేషము-నిరాశలను, మాటలో 'పరుషత్వము'ను, చేతలలో 'బాధించటము'ను త్యజించి, ఈశ్వరభావమును ఆశ్రయించండి-**

-అని గుర్తు చేయబడుతోంది. ఈ విధంగా బ్రహ్మదేవుడు దేవ-మానవ-రాక్షసులకు ప్రతి ఒక్క జీవునికి ఉద్దేశ్యించిన పాఠ్యాంశములు చెప్పారు. ఎందుకంటే **ప్రతి ఒక్క జీవుని యందు జన్మ-కర్మల మార్గములో నడుచుచుండగా, దేవ-మానవ-ఆసుర స్వభావములు అంతరంగమున గుట్టలుగా పేరుకొనియే ఉంటున్నాయి కాబట్టి।**

దేవ - మానవ - అసురులు వేరుగా ఎక్కడో లేరు! జీవుల హృదయములో పేరుకొన్న స్వభావములు కాకుండా దేవ-మానవ-జనులు బాహ్యంగా భౌతికమైన వేరు వేరు రూపులు కాదు.

ప్రతి మానవునిలో దాగి వున్న విఘ్నముల అడ్డు తొలగటానికై **దమము** (Control over indrias) **దానము, దయ** పాటించెదరుగాక।

ప్రజాపతి వాక్యార్థములను **'ద'** శబ్దార్థములను గ్రహించి ఈ మానవుడు తన 'మోక్షమార్గము'ను తీర్చిదిద్దుకుని, స్వస్వభావమగు ఆత్మతత్త్వమును సహజముగా చేసుకొనును గాక!

**ఇతి బృహదారణ్యకోపనిషత్। సప్తమధ్యాయః ।**

**"ప్రాజాపత్య బ్రాహ్మణమ్" - నామ ద్వితీయ బ్రాహ్మణమ్ - సమాప్తమ్।**

## సప్తమ అధ్యాయము
## తృతీయ బ్రాహ్మణము
# 3. హృదయ బ్రాహ్మణము

**"ఇంద్రియ నిగ్రహము", "లోభమును జయించటము" – "దయా భూతేషు"..** ఈ మూడు బ్రహ్మము యొక్క జ్ఞానము కొరకై ఏర్పడుచున్న ప్రతిబంధకములను (అడ్డు–Coverages, Hurdles) తొలగిస్తాయని ప్రజాపతి దేవ–మానవ – అసుర స్వభావములు గల జీవులకు ఉపాయముగా బోధించటము ((క్రిందటి బ్రాహ్మణములో) జరిగింది కదా! **అట్టి ప్రజాపతి ఎక్కడ స్థానము కలిగి ఉన్నారు?** ఎక్కడి నుండి అదంతా బోధిస్తున్నారు? ఆయన ఉన్న ప్రదేశమేది?

**ఏష ప్రజాపతిః యత్, హృదయమ్।** హృదయమునందే సృష్టికర్త – సృష్టి కూడా స్థానము కలిగి ఉన్నాయి.

- సకల ప్రాణుల యందు సంప్రతిష్ఠితమై, సకల ప్రాణుల ఆత్మకు చెందిన స్థానమే → **హృదయము!**
- హృదయమే ప్రజలను సృష్టించు ప్రజాపతి. హృదయ పురుషుడే ఈ సృష్టికి కర్త.
- అట్టి హృదయము దేశ–కాల–వస్తు పరిచ్ఛేదము లేనట్టిది. (It is unpartitionable by virtue of place, Time and Matter). అందుకే **"హృదయమే సృష్టికర్త అగు బ్రహ్మ"** – అని వేదవాఙ్మయముచే సిద్ధాంతీకరించబడుతోంది. **ఏతత్ బ్రహ్మ। ఏతత్ సర్వమ్। – ఇతి వేద హృదయమ్।**

అట్టి హృదయమునే **'బ్రహ్మ'** అని, **'బ్రహ్మము'** అని, **సర్వము అయి ఉన్నదని నిర్వచించబడుతోంది.**

**నా హృదయమే "పరబ్రహ్మస్వరూపము"** అను భావనతో **ఉపాసన** కొనసాగునుగాక!

అట్టి **"హృదయము"** యొక్క స్తుతి కోసమై **'హృదయమ్'..** అను శబ్దము విశ్లేషించబడుచున్నది.

(హృ)(ద)(యం) → **'3' అక్షరములు. హృ= సమస్తము కలిగి ఉన్న స్థానము। ద = ఇచ్చునది। యమ్=ఏదైతే అయి ఉన్నదో।**

**హృ**= హృఞ్ – హృత్ । ధాతువు = "తీసుకొని వచ్చుట"కు స్థానము. (Bringing. A Source to bring). ఇంద్రియములను, శబ్ద–స్పర్శ–రూప–రస గంధములను వాటివాటి విషయములను, ద్రష్ట–దర్శనములను హృదయముకొరకై → హృదయము నుండి తెచ్చి, తిరిగి హృదయమునకు సమర్పించటమును **'హృ'** అక్షరము ఉద్దేశ్యిస్తోంది. ఆవిధంగా హృదయమునుండి తెచ్చి, తిరిగి హృదయమునకు తిరిగి అందించే హృదయ విభాగమే 'బుద్ధి' అని పిలువబడుతోంది.

ఎవ్వరు **'హృ'** అక్షరమును **పరబ్రహ్మముగాను, ఆలోచనలకు–భావనలకు జనించు స్థానముగాను** ఉపాసిస్తారో, ఆతనికి ఆతని బంధువులు, తదితరులు కూడా ఆతనికి కావలసినవి తీసుకువచ్చి సమర్పించగలరు.

**(సర్వము హృదయము నుండి తేబడుచున్నది)**

(A Source where from everything is being brought)

**'ద'** = 'దా ఖే' అనే ధాతువు. **ఇచ్చునది.** హృదయము నుండి ఇంద్రియ – ఇంద్రియార్థ సర్వ వస్తువులు తేబడుచుండగా..,

హృదయమే "శక్తి – జ్ఞానము – సామర్థ్యము"లను ఈ దేహేంద్రియములకు, మనో–బుద్ధి –చిత్త అహంకారములకు ప్రసాదించుచున్నట్టిది.

ఎవ్వరైతే **'ద'** అను అక్షరము ద్వారా "సర్వమును ప్రసాదించి, పరిరక్షించునట్టి పరబ్రహ్మము"గా ఉపాసిస్తారో,... అట్టి వానికి తదితరులు తమకు తామే తమ ఆప్యాయతను సమర్పించగలరు. తమను తాము ఆనందింపజేసుకొనే విధంగా **'ద'** తత్త్వోపాసకునికి దేవతలు మొదలైన వారు **కావలసినది కావలసినచోట** ప్రసాదించుచున్నారు. హృదయాకాశమే ఆత్మాకాశమై సమస్తమునకు ఉనికి, స్థానము, సర్వత్రా సంప్రదర్శనా చైతన్యము అయి ఉన్నది.

**(సర్వము హృదయమే ప్రసాదించుచున్నది. ఆవిధంగా ప్రసాదించబడుచున్న సమస్తమును 'అనుభము'గా పొందటానికి కూడా "ద" చేతనే మనో బుద్ధి చిత్త పరికరములు ఇవ్వబడుచున్నాయి).**

(A Source which is Sanctioning/Releasing all this)

**"యం" = ఇ ఇణ్ – ధాతువు యొక్క రూపము. అయం సర్వమ్ హుత్ ఏవ।** ఇదంతా కూడా, ఈ నామ–రూపాత్మకమైనదంతా హృదయమునందే ఉండి, హృదయరూపమే అయిఉన్నది.

ఎవ్వరు ఈ పాంచభౌతిక – నామరూపాత్మకమైనదంతా హృదయము నందు హృదయ రూపముగా ఉన్నట్లుగాను, (మరియు) బ్రహ్మము నందు – బ్రహ్మమునకు అభిన్నమై ఉన్నట్లుగాను దర్శిస్తూ, ఉపాసిస్తూ, భావిస్తూ, ఆస్వాదిస్తాడో ఆతనికి సుఖమయ లోకములగు స్వర్గము మొదలైనవి అత్యుత్సాహముతో సుస్వాగతము పలుకుతూ ఉంటాయి. విశ్రాంతి – ఆనందములకు అందజేయుటకై ఆతని వెంటనంటి ఉంటాయి.

ఈ విధంగా **'హృ ద యం'**.. నామాక్షరములను భావించి – ఉపాసించినంతమాత్రముచేత ఆసాధకుడు అత్యుత్తమమగు ఫలములను ప్రయోజనముగా పొందుచున్నాడు.

ఇక....,

స్వహృదయ–సర్వ హృదయ స్వరూపముగా **పరబ్రహ్మము**ను ఉపాసించువాడు వర్ణనాతీతమగు మహత్ఫలమును పొందుచున్నాడని వేరుగా చెప్పాలా!

- ఈ (భు–భువర్–సువర్) త్రిజగత్తులు హృదయము నందే ఉన్నాయి!
- జాగ్రత్ – స్వప్న–సుషుప్తులు, భూత – వర్తమాన – భవిష్యత్తులు, పూర్వ – ఇప్పటి – ఇకముందు శరీరములు, ఇతఃపూర్వము చూచిన – ఇప్పుడు చూస్తున్న – ఇక ముందు చూడబోవు దృశ్యములు, ఇతః పూర్వము చూచిన – ఇప్పుడు చూస్తున్న –ఇక ముందు చూడబోవు సహజీవులు, – ఇవన్నీ **హృదయము నందే జలతరంగములవలె ప్రదర్శితమగుచూ, జలంలో తరంగాల వలె లయిస్తున్నాయి. హృదయమే బ్రహ్మముగా ఉపాసించువాడు తనకుతానే స్వాభావికంగా బ్రహ్మమై ప్రకాశించుచున్నాడు.**

  అందుచేత సమస్త జీవులలోని 'హృదయము' – సర్వదా ఉపాసనా విశేషమై ఆత్మోపాసకులకు **'లక్ష్యశుద్ధి'** ప్రసాదించగలదు.

## సప్తమ అధ్యాయము
## చతుర్థ బ్రాహ్మణము
## 4. సత్య బ్రాహ్మణము

ఇంతవరకు మనం చెప్పుకున్న హృదయ రూప పరబ్రహ్మము మూర్తమా? అమూర్తమా? (Is it with form or Form less)?

- హృదయములోనే పదార్థము + శక్తిల కలయిక ⟶ కాబట్టి **'మూర్తము'!**
- పదార్థము – శక్తిలకు 'ఉత్పత్తి'కి స్థానము. హృదయము శక్తి పదార్థములకు మునుముందే ఉన్నది. కాబట్టి, **అమూర్తము** కూడా!

**తద్వై తదే తత్ ఏవ!** ఈ హృదయము **తత్ స్వరూపమగు బ్రహ్మమే!**

**తత్ ఆస సత్యమేవ!** హృదయము సత్ (ఉనికి - Presence) రూపమై ఉన్నది. ఉనికి, తెలివి, ఆనందములు – **హృదయ సరోవర సుందర పుష్పములే।**

**తత్ త్యత్।** సాకార రూపారూపములుగా ఉన్నది కూడా హృదయమే! దేహము, భావన, ఆలోచన, అభిప్రాయము, విచక్షణ – ఇవన్నీ **'త్యత్'** స్వరూపములు 'వీటన్నింటికి' జనన – ఉనికి స్థానము హృదయమే అగుచు, హృదయప్రదర్శనముగానే అవి అగుచున్నాయి. అయి ఉన్నాయి.

**సత్యమ్** = యమ్ తత్ సత్ = ఈ పంచభూతములుగా ప్రదర్శితమయ్యేది **'సత్ స్వరూపమే!'**

పంచభూతములచే **నామరూపాత్మకమైనదంతా తనదే** అయినట్టిది, దేశ-కాల-వస్తు **పరిచ్ఛిన్న రహితమైనది,** ఈ సర్వమునకు మూలస్వరూపమైనది - అగు హృదయమును **'బ్రహ్మము'** గాను, **'స్వస్వరూపము'** గాను ఎవ్వరు ఉపాసిస్తారో...

> **యథా సత్యేన బ్రహ్మణే మే, లోకా ఆత్మసాత్ కృతాజితాః,**
> **ఏవం - సత్య - ఆత్మానం బ్రహ్మ - మహద్యక్షం,**
> **ప్రథమజం వేద, స జయతి ఇమాన్ లోకాన్।"** (శంకరభాష్యము)

సత్యమగు పరబ్రహ్మముచే - ఈ లోకములన్నీ తన స్వరూపముగా కలిగియున్నవై, స్వయం నిర్మితమై ఉన్నట్లు దర్శించువారిచేత ఈ లోకములన్నీ జయించబడుచున్నాయి.

అట్లాగే **"నేను సత్యమగు బ్రహ్మమునే"** అని ఎరుగుచుండగా, ఇక్కడి సమస్తము స్వస్వరూపముగా దర్శించబడి జయించబడినవిగా అగుచున్నాయి. ఒక వీరుడు శత్రువును జయించి ఆక్రమించి తన వశము చేసుకొనురీతిగా, **తన యొక్క సహజము, నిత్యము, అప్రమేయము, అమృతము అగు స్వస్వరూపముచే ఆత్మజ్ఞుడు లోకములన్నీ స్వస్వరూపాత్మగా దర్శిస్తూ స్వస్వరూపాత్మ అయి ఆక్రమించివేస్తున్నాడు.**

"ఈ కనబడే జగత్తు, ఇందులోని స్పృహ, తన దేహము, తదితర దేహములు, లోకములు, లోకపాలకులు, జాగ్రత్ - స్వప్న సుషుప్తి పురుషులు, - ఇదంతా కూడా (జలములోని బుడుగలు, నురుగు మొదలైనవి జలమే అయి ఉన్న తీరుగా) - **మహత్తరము, పరమ పూజనీయము, జగత్ ప్రకటనకు మునుముందే ఉన్నట్టిది అగు 'సత్య బ్రహ్మము' యొక్క యథాతథమైయున్న బాహ్య ప్రదర్శనా చమత్కారమే।"**.. అని ఎవ్వరు ఉపాసిస్తారో... ఆతనికి శత్రువులు ఉండరు.

అంతా తానే అయి ఉండగా ఎవరు ఎవ్వరికి శత్రువు?

> **ఓయీ! శ్రోతమహాశయా! నీవే ఆ సత్యబ్రహ్మమువు।**
> **నీ యొక్క పరబ్రహ్మ స్వరూపమే నేను!**
> **సత్యగ్ంం హి ఏవ బ్రహ్మ। బ్రహ్మమే ఉన్న సత్యము। ఈ కనబడేదంతా బ్రహ్మమే।**

అట్టి సత్యబ్రహ్మమును ఉపాసించటమెట్లా? దర్శించటమెట్లా?

**ఆప ఏవ ఇదమగ్ర ఆసుః। (7-4-2)**

సవికారము - సాకారము అగు ఈ జగత్తు మొట్టమొదట "ఆపః (జలము)" [ ద్రవము ] రూపమున అవికారమై, నిరాకారమై ఉన్నది.

తరంగరహిత (నిస్తరంగా) నిరాకార జలము = అవ్యాకృతాకాశమునకు 'సంజ్ఞ'.

**(ఆపః)** → - అవ్యాకృత ఆకాశమునకు, ఆత్మకు 'సంజ్ఞ'

తరంగసహిత - సాకార జలము = జీవుల బాహ్యాకారములకు, మనో బుద్ధి చిత్త అహంకారములకు "సంజ్ఞ".

**తతః పునః ఆపః సత్యమ్ అసృజంత।**

నిరాకారము - నిర్గుణము అగు జలము **(అవ్యాకృతాకాశము)** నుండి 'ఉనికి' రూపమగు "నేను ఉన్నాను".. (I am Present by myself) అను రూపము గల 'యమ్ సత్ - సత్యమ్' అనునది **ఆత్మజలముచేతనే** బయల్వెడలదీయబడుచున్నది.

అట్టి సత్యము (ఉనికి) నుండి ఎరుక (Knowing logic / Awareness) బయల్వెడలుచున్నది. అట్టి సత్ - చిత్ సత్యము నుండి లీలగా సృష్టి యొక్క (కల్పన యొక్క) సంకల్పాభిమానియగు **సృష్టికర్త** (సృష్ట్యభిమాన అహంకారము) బయల్వెడలుచున్నాడు. హిరణ్యగర్భుని యొక్క శాస్త్ర ప్రసిద్ధమగు ఆరంభము ఇదియే.

– అవ్యాకృతమగు (Non-Extending) తత్త్వము నుండి నామరూపాత్మక వ్యాకృత (Extending) జగత్ – ప్రదర్శనమునకు కూడా ఇదియే ప్రారంభము.

ఈ విధముగా జలము నుండి సత్యము, సత్యము నుండి చతుర్ముఖ బ్రహ్మ [(లేక) విరాట్ బ్రహ్మ (లేక) హిరణ్యగర్భుడు .. అను పౌరాణిక నామములు గల **కల్పనల [ (లేక) సృష్టి] అభిమాని** బయల్వెడలుచున్నారు.

**అట్టి బ్రహ్మదేవుడు (సృష్టి అభిమాని) తన గర్భము నందు సకల ప్రాణులకు సంబంధించిన సృష్టి – స్వభావ సంస్కారములను కలిగి ఉండటం చేత 'హిరణ్యగర్భుడు' అని పిలువబడుచున్నారు.** జాగ్రత్ – స్వప్న–సుషుప్తి – తురీయములు తన సృష్టి సంకల్పము నందు వ్యష్టి పూర్వకముగా కలిగి ఉండటం చేత **'చతుర్ముఖుడు'** అని పిలువబడుచున్నారు.

ఆ చతుర్ముఖ బ్రహ్మ తన అభిరుచి సంకల్పముచే చిత్రవిచిత్ర విశేషములు కలిగియున్న విరాట్ పురుషుని సృష్టించుచున్నారు.

ఆ విరాట్ పురుషుడు 'సృష్టి' యొక్క సిద్ధి కొరకై →

చూచువాడు – చూచుట – కళ్ళు – కనబడునది,

వినువాడు – వినుట – చెవులు – వినబడునవి,

స్పర్శించువాడు – స్పర్శించుట – చర్మము – స్పృశించబడునవి,

ఆఘ్రాణించువాడు – ఆఘ్రాణించుట – ముక్కు – వాసన చూడబడునవి,

రుచి చూచువాడు – రుచి చూచుట – నోరు – రుచికరములగునవి,

= ఇవన్నీ సృష్టించప్రారంభిస్తున్నారు. మొట్టమొదట దివ్యశక్తులను (చూడటం – వినటం – స్పృశించటం – అఘ్రాణించటం – రుచి చూడటం అనే దివ్యశక్తి – అభిమానులను) సృజించారు. వారే సృష్టిలోని **"దేవతలు".**

ఆ దేవతలు సత్యబ్రహ్మమునే ధ్యానించుచున్నారు. (లేక) ఉపాసించుచున్నారు. ఎందుకంటే మునుముందుగా పుట్టినది పూజనీయమగు **బ్రహ్మ.** పంచ భూతాత్మకమగు బ్రహ్మకే **'సత్యము'** అని మరొక పేరు. ఆయన లోకము **'సత్యలోకము'.**

**సత్యము – తదేతత్ త్ర్యక్షరగ్ం సత్యం – ఇతి॥ (7-4-2)**

**స** ఇత్యేకమక్షరం.. ఇది ఒక అక్షరము (సత్)

**తి** ఇత్యేకమక్షరం.. ఇది ఒక అక్షరము (ఇతి–ఇది)

**యం** ఇత్యేకమక్షరం.. ఇది ఒక అక్షరము (యంసత్ । సత్ యం। సత్యం)

**ప్రథమ – ఉత్తరమే అక్షరే సత్యం। మధ్యతో అనృతం। (7-4-2)**

సత్ యం ; మొదటిది – ఆఖరుది యగు 'స' – 'యం' ఈ రెండు **అమృతరూపములు. మార్పు లేనివి.** (2)త్.. (ఇది).. ఇది మార్పు చెందునది. అనృతము. మృత్యురూపము. కల్పన. సందర్భ సత్యము. **మార్పు చెందనిది + మార్పు చెందునది..** రెండు కలిసియే 'సత్యమ్' అగుచున్నది. మార్పు చెందనిది నిత్య సత్యము. మార్పు చెందేది సందర్భ సత్యము – మాత్రమే।

| **స** | **త్** | **యం** |
|---|---|---|
| మార్పులేనిది | మార్పు చెందునది | మార్పు చెందనిది |
| అమృతము<br>(సత్యము)<br>(సహజ సత్యము) | మృత్యువు<br>(అనృతము) సందర్భ సత్యము<br>(కల్పనా మాత్రము) | అమృతము<br>(సత్యము)<br>(సహజ సత్యము) |

# సత్యమ్

*జగత్తు కంటే మునుముందే సత్యము ప్రకాశమానమైయున్నది. (ఊహకుముందే ఉన్న ఊహించువాడు. భావనకు ముందే ఉన్న భావించువాడు).*

*జగత్తు కల్పన (సందర్భ సత్యము). (ఊహ. భావన. అనుభూతి. అనుభవము).*

***జగత్తు లయించునది సత్యమునందే। జగత్తు రహితమైనప్పుడు శేషించునది సత్యమే। జగత్తు సందర్భములో కూడా ఇదంతా - బ్రహ్మమునకు అభిన్నమై, సత్యముగానే సహజరూపముగా కలిగి ఉన్నది.***

ఈ సహజ - సందర్భములను బ్రహ్మముగాను, సత్యముగాను, ఆత్మగాను ఎవ్వరు సందర్శిస్తారో, అట్టి సత్యతత్త్వ విద్వాంసుడు మృత్యువుకు విషయుడు కాడు. మృత్యువుచే బాధించబడడు. (లేక) అసత్యము ఆతనిని స్పృశించలేదు.

(1) సత్యము - (Originally True).

(2) అనృతము (కల్పన, సందర్భము Incidental, contextual) .

(3) యం (After and off the Incident).. ఈ త్రి - కాలములయందు వేంచేసియున్న ఆత్మను ఎవ్వడైతే ఉపాసించువాడై ఉంటాడో, సందర్భమును కూడా ఆత్మ యొక్క ఒక చిత్కాళా విశేషంగా ద్రష్ట - దర్శన - దృశ్యములను ఏకం చేసివేసి దర్శిస్తూ, (అప్పుడు  కూడా) ఆత్మగానే ఉపాసిస్తాడో.. **అట్టివానిని సందర్భములు బాధింప జాలవు.**

## సప్తమ అధ్యాయము
## పంచమ బ్రాహ్మణము
## 5. సత్య బ్రహ్మ సంస్థాన బ్రాహ్మణము

*(1) ఆదిత్య మండలము నందు ఆదిత్య మండలాభిమాని అగు పురుషకారము (లేక) పురుషుడు (తేజస్సు) ।*

*(2) దేహ- ఇంద్రియ సంఘాతము యొక్క కుడి కంటి యందలి 'చూపు'ను ఉపకరణముగా చేసుకొనుచున్న పురుషకారము (తేజస్సులో వస్తువులను చూచువాడు) ।*

*ఈ విధంగా ఒకే తేజస్సు రెండు తీరులుగా సృష్టియందు వర్తిస్తున్నది.*

"ఒకానొక చోట --- ఒక పెద్ద కొండ కనిపిస్తోంది" అను సందర్భములో.. మూడు (3) విశేషములు పాత్ర వహిస్తున్నాయి.

(1) **ద్రవ్యతేజము :** ఆదిత్యుని యందలి తేజస్సు సత్య స్వరూపమే। ఆ ఆదిత్యునియందలి పృథివి మొదలైన పంచభూతముల సృష్టికి ముందటి **అవ్యక్త సారాంశము** - అయిఉన్నది **సత్యము.**

పంచభూతములు మొట్టమొదటగల ఆదిత్య పురుషుని యందు తేజోరూపమై, ఒకప్పుడు అప్రకటితమగుచున్నాయి. మరొకప్పుడు ప్రకటనమగుచున్నాయి.

ఆదిత్య తేజస్సే అప్రకటిక పాంచభౌతిక సృష్టి తేజస్సు కూడా! (ప్రకటనచేస్తున్న **పురుషుడే** ఆదిత్య తేజో సృష్టి అభిమాని).

(2) **దర్శన తేజము :** ఆ తరువాత ఆదిత్య పురుషుని ప్రదర్శన తేజస్సే - పృధివి మొదలైన పాంచభౌతిక రూపముగా ప్రకటనమగుచు, సృష్టిని - ప్రదర్శించుచున్నది. (**సాకార సంతరించుకొను అభిమాని**, ప్రదర్శనాభిమాని)

(3) **ద్రవ్య తేజము :** వస్తువులు (Matter & Material) రూపము పొందినంత మాత్రమున **'సృష్టి'** అనే అనుభవము సిద్ధించదు. మరి? **ద్రష్ట ఉన్నప్పుడే సిద్ధిస్తుంది.** ఈ జీవుని దేహ- ఇంద్రియ సంఘాతము యొక్క కుడి కంటిలో చూపు రూపమున **'సందర్శన తేజో అభిమాని'** (చూచు అభిమాని) పాల్గొనుచున్నప్పుడే 'సృష్టి' అనే అనుభవము సిద్ధిస్తుంది. (ద్రష్టాభిమాని/ అనుభవి).

(1) ఆదిత్యమండలములోని ఆదిత్య మండల తేజో అభిమాను పురుషుడు (దృశ్యతేజము)→

(2) దేహమునందలి దేహాభిమానిగా కుడి కంటి యందు దర్శన (చూచు) అభిమాన పురుషుడు (ద్రష్ట తేజము)

**ఈ ఇద్దరు కూడా ఒకే సత్యబ్రహ్మము యొక్క వేరువేరు సంప్రదర్శనా రూపములు.**

(1) ఆదిత్య పురుషాభిమానియే కుడి కంటి యందు **'చూడటము'** అను రూపమును ప్రదర్శించుచున్నారు. కుడి కంటిలోని చూచు **పురుషకారాభిమానిగా** కూడా ప్రతిష్ఠితులై ఉన్నారు.

(2) కుడి కంటిలోని **'సందర్శనము చేయుట'** అను శరీరాభిమానియే సూర్యుని యందు (వెలుగునందు) తేజోచైతన్యమై ప్రకాశించుచున్నారు.

*సూర్య తేజోచైతన్యము + దేహములోని చూపు చైతన్యము = ఒకే ఆత్మ పురుషుని ద్వివిధ ప్రదర్శనలు.*

అనగా.. (1) ఆదిత్యునిలో తేజమయ పురుషుడు, (2) దేహము యొక్క కంటిలోని ద్రష్ట తేజోపురుషుడు – ఇరువురు ఒకే "సత్య బ్రహ్మము" యొక్క ద్వివిధ పురుషకారములుగా వేంచేసి ఉన్నాయి. **ఈ ఇరువురు పురుషులు కలిస్తేనే "సత్యము (ఉనికి – ఉన్నది)" అను బ్రహ్మము యొక్క విశేషమునకు 'సిద్ధి' లభిస్తోంది.** (అనుభవము అనునది రూపుదిద్దుకోగలదు).

***మరింత వివరంగా చెప్పుకోవాలంటే....***

(1) సూర్య మండలాభిమాన పురుషుడు (2) దేహేంద్రియ సంఘాతాభిమాని పురుషుడు కూడా – రెండు దీపముల లోని ఒకే అగ్ని వలె, **ఒకే సత్యబ్రహ్మము యొక్క రెండు ప్రదర్శనములు.** అట్టి మండలాభిమాని, సంఘాతాభిమానిల పరస్పరత్వము గురించి మరికొంతగా వివరించుకుంటున్నాము.

***ఆదిత్యుని ప్రకాశమే =***

→ ఆధిభూతము (Solid) నందలి వెలుతురు, **ఆధ్యాత్మమునందలి** (Suitable) చూపుచే (దేహము నందు ఉనికి పొందుచూ), దేహమునందలి కంటి యందు 'చూపు'గా భౌతికమై (Materially) ప్రతిష్ఠితము అగుచున్నది.

***కంటి యందలి 'చూపు' ప్రకాశ చైతన్యమే =***

→ ఆదిత్యునియందు వెలుతురును ప్రకాశింపజేస్తూ ఆదిత్య మండలాంతర్గతమైనట్టి **'అధి దైవము'** (Divinity) నందు ప్రతిష్ఠితమై యున్నది.

కంటియందలి **'చూపు',** మండలమునందలి **'తేజస్సు'** – ఒకే సత్యబ్రహ్మము యొక్క ప్రదర్శములని, అట్టి సత్యబ్రహ్మము సదా ఈ **జీవుని స్వస్వరూపమే అయిఉన్నదని** భావించి ఉపాసించువాడు **తటస్థరూపుడై, ఉభయములందు తానే ప్రకాశించుచున్నవాడగుచున్నాడు.** అట్టివాడు ఈ భౌతిక దేహమును త్యజించు ఇచ్ఛ కలుగుచున్న సందర్భము నందు చూపు, వెలుతురులకు – **'సాక్షి, తటస్థ'** రూపము వహిస్తున్నాడు.

**"సూర్య మండలములో నిత్య కిరణ తేజస్సును, దేహములో దర్శన తేజస్సును"** తనయందు ఉపసంహరించుకొని, **తనను తాను పరిశుద్ధమగు ప్రశాంత – పూర్ణచంద్ర అఖండాత్మ తేజస్సుగా అనుక్షణము స్వానుభవుడగుచున్నారు.**

సూర్యునిలోని తేజో అభిమాన పురుషుని – కంటిలోని విజ్ఞాన పురుషుని.. ఆత్మ స్వరూపముగా ఉపాసించి– దర్శించి – మమేకమగుచున్న యోగిని సూర్యకిరణములు ఎచ్చటా బాధించవు.

## వ్యాహృతులు (స్తోత్ర శబ్దజాలము)

**వ్యాహృతము** = పలుకబడినది. వచించబడినది.

ఆదిత్య మండలములో తేజోస్వరూపుడై ప్రకాశించుచున్న **సత్య బ్రహ్మము** గురించిన **సృష్టికర్త యొక్క** (బ్రహ్మ దేవుని యొక్క – హిరణ్య గర్భుని యొక్క) స్తోత్ర శబ్దములే 'వ్యాహృతులు'. అట్టి హిరణ్యగర్భుని వ్యాహృతులే ఈ లోకముల సృష్టి. (The Discriptive song of the creator about the original 'Athma Truth' is what this creation is)!

ఆదిత్య మండలాంతర్గతుడైన సత్యబ్రహ్మము అగు మండల పురుషునకు (లేక) ఈ దేహము నందు కుడినేత్రములో సంస్థితుడై ఉన్న విజ్ఞాన రూప అధ్యాత్మ పురుషునకు →

(1) 'భూః' అను వ్యాహృతి యందు → = శిరస్సు ఏకాక్షరము. (భూమి).

(2) భువః - అను వ్యాహృతి → = భుజములు - 2 భుజములు. (అంతరంగము).

(3) సువః - అను వ్యాహృతి యందు → - రెండు అక్షరములు రెండు పాదములు. (అనుభవి).

ఆ ఆదిత్య పురుషునికి అహః (పగలు) → రహస్య స్వరూపము.

భు-భువర్ - సువర్ వ్యాహృతులే అవయవములుగా కలిగి ఉన్నట్టి (సత్యాత్మ యొక్క) కుడి కంటిలోని అధ్యాత్మ పురుషుని ధ్యానము చేత, **సర్వ బాహ్య దృష్టుల వలన కలిగే దోషములు నశించి, దృష్టి జ్ఞానమయము** అగుచున్నది. సత్యబ్రహ్మము యొక్క **(1) "సూర్యమండలాంతర్గత (2) ఇంద్రియముల అంతర్గత (3) బాహ్య దృశ్యరూపాంతర్గత" ఏకత్వమును ధ్యానించువాడు** - తన దృష్టిని పవిత్రము చేసుకొనుచున్నాడు. సర్వపాపదృష్టులను వదల గల సామర్థ్యము పొందుచున్నాడు.

***ఇతి -పంచమ బ్రాహ్మణమ్। - సత్య బ్రహ్మ సంస్థాన బ్రాహ్మణమ్!***

## సప్తమ అధ్యాయము
## షష్ఠమ బ్రాహ్మణము
# 6. మనో బ్రాహ్మణము

**'మనస్సు'ను తనయొక్క ఉపకరణముగాను, వినోదవస్తువుగాను, ఉపాధిగాను, కలిగియున్న బ్రహ్మమును ఉపాసించటము॥**

***మనో మయో అయం - పురుషో భాసః సత్యః, తస్మిన్ అంతర్హృదయే యథా వ్రీహిర్వాయవో౹***

ఈ పురుషుడు (జీవుడు) 'మనస్సు'చే నిర్మితుడై, మనోమయుడై ఉంటున్నాడు.

- మనస్సు చేతనే ఈ పురుషుడు అనుభవమునకు వచ్చుచున్నాడు. అనుభవములన్నీ పొందుచున్నాడు.
- ఈ పురుషుని (జీవుని) ఉనికి -చైతన్య ప్రకాశమే అయి ఉన్నది. అదియే ఈతని వాస్తవరూపము.
- సకల పదార్థములను ఈ పురుషుని పట్ల మనస్సే ప్రకాశింపజేస్తోంది.

**"స్వీయ తేజస్సు** (+) **స్వీయ మననము"** ల చేతనే సర్వము భాసింపజేయబడుచున్నది-సత్యాత్మ స్వరూపుడైయున్నది ఈ పురుషుడే!

**"మనో రూప పురుషకార కాంతి"** తనయొక్క సత్యస్వరూపముగా కలవాడై, సర్వాత్మకుడగు పరమాత్మయే (ప్రతి జీవుని) హృదయ మధ్యంలో ప్రకాశించుచున్నారు. ధాన్యపు గింజలో బియ్యపు గింజ వలె ఈ దేహములో **హృదయము** నందు రాజాధిరాజై **ప్రకాశిస్తూ, సర్వమును ప్రకాశింపజేయుచున్నారు.**

**❖ సమస్తమును నియమించుచున్నారు. ❖ సమస్తమునకు ప్రభువై యున్నారు. ❖ సమస్తము శాసించున్నవారై ఉన్నారు.**

అట్టి స్వస్వరూప ఆత్మపురుషుని ఎవ్వరు - సర్వ జీవులలోను - తనలోను మనో రూపుడై వెలుగొందుచున్నారని, ఆ మనస్సుతో సర్వమును భాసింపజేస్తున్నారని, నియమిస్తూ పరిపాలిస్తున్నారని - ఉపాసిస్తారో.. అట్టి ఉపాసకునికి..,

**(మనస్సే బ్రహ్మము అని ఉపాసించువానిచేత) ఈ దృశ్యములు - ఈ 14 లోకములు స్వీయ మనో రూపంగా దర్శించబడతాయి. వినోదించబడతాయి.**

**"ఈ సమస్త దృశ్యము నా మనోరూపమే" అను అనుభవము సిద్ధించుచుండగా, బ్రహ్మానందము స్వాభావికము కాగలదు.**

**ఇతి షష్ఠమ బ్రాహ్మణమ్।**
**మనో బ్రాహ్మణమ్।**

## సప్తమ అధ్యాయము
## సప్తమ బ్రాహ్మణము
## 7. విద్యుద్బ్రాహ్మణము

పరబ్రహ్మమును **'విద్యుత్'**గా కూడా ఉపాసించబడుచున్నది. వివిధమైన ఉపాసనలలో విద్యుత్ బ్రాహ్మణోపాసన మరొక ఉపాయము. **విద్యుత్ బ్రహ్మేతి ఆహుః।** (విద్యుత్ = తేజస్సు. వెలుగు. చీకటిని పారద్రోలునది).

**విద్యుత్** = వి = చీకటి (ని)
ద్యుత్ = ఖండించునది. **"వెలుగు"**

చీకటిలో ఒక్కసారి దీపము వెలిగించగానే చీకటి పటాపంచలై, వెలుగు గదియంతా నిండి సర్వము సుస్పష్టమగు విధానమును తీరును – **'విద్యుత్ రూప పరబ్రహ్మము'**గా విద్యుత్ ఉపాసకులు ఉపాసిస్తున్నారు.

**'విద్యుత్తు'**ను అంధకారము (అజ్ఞానము)ను ఖండించివేయు బ్రహ్మము యొక్క **ప్రభావ వీచికగా అభివర్ణిస్తున్నారు.**

అనాత్మరూపమైన సర్వ సంసారిక దోషములు, పాపధ్యాసలు→ విద్యుత్ (చీకటిని పటాపంచలు చేయు మెఱుపు) ఉపకరణముచే సత్యాత్మ తత్త్వోపాసన చేయటం చేత → పటాపంచలైపోతాయి. అందుచేత "వెలుగు" – బ్రహ్మముగా ఉపాసించబడుచున్నది.

**– విద్యుత్తు బ్రహ్మమే అయి ఉన్నది** – అను విద్యుత్ బ్రాహ్మణోపాసకుడు – స్వయముగా విద్యుత్ తేజోరూపుడై, లోకములన్నీ వెలిగించు దివ్యాత్మ స్వరూపుడై ప్రకాశిస్తున్నాడు.

**ఇతి – "విద్యుత్ బ్రాహ్మణమ్" నామ సప్తమ బ్రాహ్మణమ్॥**

## సప్తమ అధ్యాయము
## అష్టమ బ్రాహ్మణము
## 8. వాక్ బ్రాహ్మణము

**వాచం ధేనుమ్ ఉపాసీత।**

అఖండము – అప్రమేయము –కేవలము – అనునిత్యము అగు **సత్యబ్రహ్మమును** "వాక్కు" అనే పాలిచ్చే ఆవును **సాధన ద్రవ్యముగా** స్వీకరించి, ఎట్లా ఉపాసించవలెనో... వివరించుకుంటున్నాము.

**తస్యాః చత్వారాః స్తనాః :** 'వాక్' అనే ధేనువు (ఆవు)కు 4 స్థనములు (స్రవించు పాల పొదుగులు).

**(1) 'స్వాహా' కారము : ఈ రెండు స్థనముల చేత హవిస్సులు దేవతలకు ఇవ్వబడుచున్నాయి.**

**(2) 'వషట్' కారము :** (పాలు = ఆహారము)

**(3) 'హంత' కారము :** మనుష్యులకు 'అన్నము' ఇవ్వబడుచున్నది.

**(4) 'స్వధా' కారము :** పితృదేవతలకు 'కవ్యము'గా (తర్పణము, పిండ ప్రదానము మొ॥విగా **'స్వధామః'** అనుచూ) ఇవ్వబడుచున్నది.

**తస్యాః '(ప్రాణ' ఋషభో। మనో వత్సః।** అట్టి 'వాక్' రూప కామధేనువు – **'ప్రాణశక్తి'** నుండి జనించుచున్నది. అందుచేత "వాక్ ధేనువుకు ప్రాణము వృషభమే (ఎద్దు)" అని చెప్పబడుచున్నది.

ఆ వాక్‌ధేనువుకు ఒక దూడ (వత్సః) కూడా ఉన్నది. అదియే **"మనస్సు"।**

ఈ విధంగా వాక్ రూప ధేనువును →

**<u>'స్వాహా – వషట్' (దేవతలకు)</u>** .. **స్వాహా** = భౌతికము; **వషట్** = సూక్ష్మములగు జాగ్రత్ – స్వప్నసుషుప్తి – మనోః చిత్త – అహంకారములు. పరిరక్షకులకు కృతజ్ఞతాంజలి సమర్పణ।

**<u>హంత (మానవులకు)</u>** .. మానవులకు అన్నములగు ఇంద్రియ విషయములు – శబ్ద స్పర్శరూప రస గంధములు– రక్షించు విశ్వ దేవతలను ఉపాసించటము.

**<u>స్వధా (పిత్రుదేవతలకు)</u>** .. గర్భస్థ శిశు– జన్మాంతర విధుల నిర్వాహకులు, పరిరక్షకులు అగు పిత్రు దేవతలు.

→ దేవతల – మానవుల – పిత్రుదేవతల పరిరక్షణ – పరిపోషణ రూపముగా, **ప్రాణ** వృషభ సమేత – **మనో** ఆవుదూడ సమేత కామధేను రూపముగా ఆత్మ ఉపాసించబడుచున్నది.

**వాక్ ఇతి శబ్ద త్రయీం। తాం:** వాక్కు అనగా → ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. ఈ త్రయీ వేదములు కామధేనువు వంటివి. వేదవాక్కులను **'పాలిచ్చే ఆవు'** వలె ఉపాసించబడుచున్నది.

("తత్త్వమ్ – సోఽహమ్ – త్వమేవాహమ్ – అహమేవత్వమ్" వేద పరిభాషలు ఆత్మధేనువుకు '4' స్తనములు)

ఆవు నాలుగు పొదుగుల నుండి పాలను స్రవింపజేస్తున్న రీతిగా 'వేదవాక్కులు' అను స్తనములు – దేవతలకు, మానవులకు, పిత్రుదేవతలకు తాత్త్వికమైన ఆహారములు ప్రసాదించుచున్నాయి.

వేద వాక్ రూప స్తనములు గల వేదములను దూడల వంటి దేవతలు ఆశ్రయించి ఉన్నారు. వేదమంత్రములచే సంతోషించిన దేవతలు మానవులకు అన్నమును, దేహ రక్షణను ప్రసాదించుచున్నారు.

దేవతలకు 'స్వాహా' 'వషట్' శబ్దముల ద్వారా యజ్ఞము చేయు మానవులచే హవిస్సులు ఇవ్వబడుచున్నాయి.

మనుష్యుల కొరకై 'ఇదిగో! ఆహా' అను శబ్దములచే 'అన్నము'ను (ఆహారము) ఇవ్వబడుచున్నది. అందుచేత మానవులు 'హంత' శబ్దమును ఆశ్రయించి జీవించుచున్నారు.

(**స్వాహా** = సమర్పణ. **స్వధ** = కృతజ్ఞత – అని శబ్దార్థములు)

పితృదేవతలకు 'స్వధా' అని పలుకుచూ ఆహారము (పిండప్రదానము) సమర్పించటం జరుగుతోంది. కనుక పితృదేవతలు 'స్వధా'కారమును ఆశ్రయించి జీవిస్తున్నారు.

ప్రాణము – మనస్సుల సమన్వయముచే వేదశబ్దములు పలుకబడుచున్నాయి. **ఏ శబ్దమైనా ప్రాణ–మనస్సులు కలిస్తేనే పలుకగలం.** మనస్సుతో సంకల్పించిన విషయమే ఒకడు వాక్కుతో మాట్లాడుచున్నాడు. మనస్సు ఉన్నచోటే వాక్కు అర్థయుక్తమై ప్రవర్తిల్లుచున్నది. మనస్సు వాక్కుకు ఉత్పాదక స్థానము. కాబట్టి మనస్సు దూడతో పోల్చబడుచున్నది. ఈ విధంగా **వాగ్రూప ధేనువును బ్రహ్మముగా ఉపాసించువాడు తేలిక గతిగా బ్రహ్మమును పొందుచున్నాడు.**

**॥ఇతి 'వాక్ బ్రాహ్మణమ్" నామ అష్టమ బ్రాహ్మణమ్॥**

# సప్తమ అధ్యాయము
# నవమ బ్రాహ్మణము
# 9. వైశ్వానరాగ్ని బ్రాహ్మణము

**అయమ్ అగ్నిః వైశ్వానరో। (7-9-1)**

మహాపంచభూతములలో అగ్నియే దేహము నందు **'వైశ్వానరాగ్ని'** అయి వేంచేసి ఉన్నది. దేహములో అగ్ని దేహమును సర్వదా సంరక్షించుచున్నది.

ఇది ఇట్లా ఉండగా...,

**'వైశ్వానరాగ్ని'** దేహాభిమాని అగు వైశ్యానరుడు దేహమునందు తన అంశను ప్రతిక్షేపించి, **ఈ జీవుడు తిను ఆహారమును 'రస స్వరూపము'గా మార్చుచున్నారు.**

**వైశ్వానరాగ్ని** = జీవులు తిను అన్నమును పచనము చేయు జఠరము (పొట్ట)లోని అగ్ని (Temparature - Healthy man's 98.4$^0$ F.H)

**(వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపాన సమాయుక్తం పచామి అన్నం చతుర్విధం-అస్య సాక్షాత్ ఉప లక్షణాత్ ।** అట్టి జఠరాగ్ని (లేక) వైశ్వానరాగ్ని అభిమాని అగు **వైశ్వానరుని - దేహములో ప్రత్యక్షముగా గమనించటము 'ఉపాసన' అవుతోంది.**

**ఆహారము జీర్ణమగుచుండగా - తస్య ఏష ఘోషో భవతి।** - దేహములో ఒకానొక ఘోష శబ్దము జనిస్తోంది. అట్టి ఘోష శబ్దమును రెండు వ్రేళ్ళతో చెవులు మూసుకొన్నప్పుడు దేహములో నుండి వినబడుచున్నది. - **యమే ఏతత్ కర్ణావపిధాయ శృణోతి।**

అయితే ఎప్పుడైతే ఈ శరీరమునందు 'భోక్త' అయి ఉంటున్న ఈ జీవుడు తన ప్రాణశక్తిని శరీరము నుండి ఉపసంహరిస్తాడో.. ఆపై ఇక **"ఆహార జీర్ణఘోష శబ్దము"** వినిపించదు.

ఈ జీవుడు చెవులు మూసుకొన్నప్పటి **'ఘోష'** శబ్దముపై ఏకాగ్రము చేయుటచే **"బ్రహ్మము"** యొక్క తత్త్వమును వైశ్వానరోపాసకులు- **ఆత్మతత్త్వ సిద్ధికై ఉపాసిస్తున్నారు.** అట్టి బాహ్య - అభ్యంతర స్థితమైన 'వైశ్వానరాగ్ని'ని బ్రహ్మముగా ఉపాసించువానిపట్ల 'బ్రాహ్మీభావన' సులభసాధ్యమవగలదు.

**ఇతి - నవమ బ్రాహ్మణమ్।**
**వైశ్వానరాగ్ని బ్రాహ్మణమ్।**





## సప్తమ అధ్యాయము
## దశమ బ్రాహ్మణము
## 10. గతి బ్రాహ్మణము

**యదా వై పురుషో అస్మాత్ లోకాత్ ప్రైతి, స వాయుమ్ ఆగచ్ఛతి।** ఆత్మతత్త్వ జ్ఞానము సముపార్జించక, కేవలము ఇంద్రియ విషయములే సత్యమని తీవ్ర – అభ్యాసములందు మునిగి తేలుచున్నంతకాలము (దృశ్య విషయములను పరమాశయముగా కలిగి ఉన్నంత కాలము) ఈ జీవుడు అనేక ఉచ్ఛ-నీచ ఉపాధుల సంచారములు 14 లోకములలో చేస్తూ జన్మ-మృత్యువుల మధ్య బంధితుడు అగుచున్నాడు.

ఇదంతా "ఒక స్వప్నము నుండి→ మరొక స్వప్నమునకు" వలె ఈ జీవుని పట్ల కొనసాగుతూ పోతోంది.

విసిగి వేసారిన ఈ జీవుడు ఎప్పుడో **"ఈ జన్మ – మృత్యువుల ప్రహసనమంతా ఇట్లా నా పట్ల ఎందుకు కొనసాగుతోంది? జన్మ-కర్మ-కర్మఫల- జన్మాంతరములు నా వాస్తవస్వభావమా? ఇంతకు వేరైన సత్యము నాకు సంబంధించి ఏమైనా ఉన్నదా? ఉంటే అది ఏమై ఉన్నది?"** అను ప్రశ్నకు వస్తున్నాడు.

దృశ్యముతో తన సంబంధమును – ప్రశ్నించుకోవటము, సత్యము కొరకై అన్వేషణము.. ఆతని యందు **చిగురిస్తున్నాయి.**

ఇప్పుడిక శాస్త్రములు చెప్పు వైరాగ్య – యోగ – భక్తి – జ్ఞాన మార్గములను, వాటి – వాటికి సంబంధించిన సమాచారములను పరిశీలించ ప్రారంభిస్తున్నాడు. అప్పుడు ఈ జీవుడు మార్గాన్వేషి అయి, మార్గ దర్శనమునకు నడుము కట్టుచున్నాడు. ఆత్మ బంధువులగు మహనీయుల జీవితములను పరిశీలిస్తున్నాడు. స్వస్వరూపాత్మతత్త్వ సంబంధమైన శాస్త్రములు చెప్పు సాధనలు నిర్వర్తిస్తున్నాడు. ఆత్మతత్త్వజ్ఞులగు సద్గురువులను సమీపిస్తున్నాడు. **"తత్త్వమ్** (నీ సహజ సత్యమే అది. సోఽహమ్ 'నేను అదియే అయి ఉన్నాను', **"జీవో బ్రహ్మైఽతి నా పరః"** – ఈ జీవాత్మ సందర్భముగా జీవాత్మగా కనిపిస్తున్నప్పటికీ, సహజముగా పరమాత్మయే అయి ఉన్నాడు"... మొదలైన) మహావాక్యార్థముల పరాకాష్ఠార్థములను వినుచున్నాడు.

శ్రవణ – మనన – నిదిధ్యాసలచే సత్యాత్మ తత్త్వమును గ్రహిస్తున్నాడు!

❖❖❖

స్వస్వరూపాత్మ తత్త్వము యొక్క సర్వత్వము, సమగ్రత్వము ఎరిగిన తరువాత ఈ జీవుడు సత్యాత్మత్వమును పుణికిపుచ్చుకొనుచున్నాడు.

అట్టి **'ఆత్మాహమ్'** భావనతో తన యొక్క **"కేవల సత్, కేవల చిత్, కేవల ఆనందము"** ఎరిగిన మహనీయుడు యథాకాలమునందు ఈ భౌతిక దేహము త్యజించుచున్నప్పుడు **దేహపురముల పరిధులను దాటివేసినవాడై ఉంటున్నాడు.** అట్టి బ్రహ్మతత్త్వానుభూతి పరుడగు జీవన్ముక్తుని దేహానంతర గతుల గురించి ఇప్పుడు కొన్ని విషయాలు చెప్పుకుంటున్నాము.

→ ఆత్మతత్త్వశాస్త్రము నందు విద్వాంసుడు, (విజ్ఞాని అగు పురుషుడు) (జీవుడు) – ఈ లోకములోని తన పాంచభౌతిక దేహమును విడచిన తరువాత – ("నమస్తే వాయుః త్వమేవ ప్రత్యక్షమ్ బ్రహ్మాఽసి।".. అను వాక్య సారానుసారంగా..) 'వాయు' రూపమును (లేక) ప్రాణ స్వరూపమును సంతరించుకుంటున్నాడు.

→ **అట్టి మహావాయువు** – తనలో వాయు స్వరూపుడై ప్రవేశించిన ఆ బ్రహ్మజ్ఞునికి – **రథచక్రము యొక్క రంధ్రము వంటి మార్గమును ఇచ్చుచూ, – ఊర్ధ్వలోకములు జేరుటకు సహకరించుచున్నది.**

\- మహావాయువు చూపుతున్న రథచక్రము యొక్క మధ్య రంధ్రమంత మార్గము ద్వారా ప్రయాణించి ఆ **ఆత్మసంయమయోగి** ఊర్ధ్వమునకు (పైకి) అభిముఖుడై **సూర్యుని చేరుచున్నాడు.** (సూర్య తేజస్సులోకి తేజో కిరణుడై ప్రవేశిస్తున్నాడు).

- ఆదిత్య (సూర్య) మండలములోని దమరుకము (చర్మముతో తయారగు ఒక వాద్య ఉపకరణము) వంటి మార్గము గుండా ఊర్ధ్వంగా ప్రయాణించి **'చంద్ర మండలము'** చేరుచున్నాడు.
- చంద్ర మండలము నుండి కూడా భేరీవాద్యము (డప్పు/దుందుభి) వంటి రంధ్రము గుండా ప్రయాణించుచూ చంద్ర మండలమును అతిక్రమించి **ప్రజాపతిలోకము (బ్రహ్మలోకము)** చేరుచున్నాడు.

అట్టి ప్రజాపతి (బ్రహ్మ) లోకము శారీరక-మానసిక దుఃఖములు లేనట్టిది. శరీర శ్రమలు, శారీరక రుగ్మతలు, బాధలు ఉండనట్టిది.

ఆ బ్రహ్మతత్త్వజ్ఞుడు బ్రహ్మలోకములో ప్రవేశించి శాశ్వత (అనేక) సంవత్సరముల కాలము (అనేక కల్పములు) నివసిస్తున్నాడు.

అటు తరువాత ఎప్పుడో బ్రహ్మదేవునితో కూడి, బ్రహ్మదేవునిచే బోధింపబడి, **బ్రహ్మైక్యము పొందుచున్నాడు.**

**ఇతి 'గతి బ్రాహ్మణమ్' నామ**

**దశమ బ్రాహ్మణమ్।**

## సప్తమ అధ్యాయము
## ఏకాదశ బ్రాహ్మణము
## 11. తపో బ్రాహ్మణము

**శ్లో॥ ఏతత్వై 'పరమం తపో'**
**యత్ వ్యాహితః తప్యతే। (7-11-1)**

ఈ భౌతిక దేహము అనేక ఆధి-వ్యాధుల ద్వారా ఈ జీవుని దుఃఖింపజేస్తూ ఉండగా, దేహధారియగు ఈ జీవుడు **"నేను అప్రమేయము, - నిత్యము, సమస్తము అయి ఉన్న ఆత్మ స్వరూపుడనే!"**.. అనునది అనుభూతపరచుకునేది ఎట్లా? అట్లా అనుభూతపరచుకొన్నది అనునిత్యము చేసుకొనేది ఎట్లా?

ఈ ప్రశ్నకు [ ఈ బృహదారణ్యకోపనిషత్ - (సప్తమ అధ్యాయము - తపో బ్రాహ్మణమ్ నామ ఏకాదశోధ్యాయము)] ఇట్లా సాధన - సంవిశ్లేషణములను వివరించుచున్నది.

**ఏతద్వైపరమం తపో - యత్ వ్యాహితః తప్యతే పరమగ్ః, హైవ లోకం జయతి।**
**యః వ్యాహితో వ్యాధితో జ్వరాది పరిగృహీతస్సన్,**
**యత్ తప్యతే - "తత్ ఏతత్ పరమం తప"** - ఇతి ఏవం చింతయేత్, దుఃఖ సామాన్యాత్! *(శంకరభాష్యము).*

ఆత్మతత్త్వోపాసకుడు (బ్రాహ్మీస్థితి - అను ఆశయముచే) ("భక్తి-జ్ఞాన - కర్మ - క్రియా యోగ" ఇత్యాది శాస్త్రములచే చెప్పబడిన మార్గములుగా) సాధన చేస్తూ ఉండగా, ఆతనికి జ్వరము, నొప్పి ఇటువంటి శారీరకమైన, సాంఘికమైన, మానసిక బాధలు తటస్థపడుతూ ఉండగా ఏమి చెయ్యాలి?

**అవన్నీ గొప్ప తపస్సులో భాగములే।** ఎందుకంటే.. తపస్సు అంటేనే తపన।

వ్యాధిలోను - తపస్సులోను ఉండేది తపనయే।

ఎవ్వరైనా సరే, వ్యాధిలోని తపన - బాధలను **తపస్సుగా** ఉద్దేశ్యిస్తే, **అది గొప్ప తపస్సే.** అట్టి 'భావనా మననము'చే ఎవ్వరికైనా అది సుసాధ్యమే।

**తస్య ఏవం చింతయతో విదుషః**
**కర్మక్షయ హేతుః తదేవ తపో భవతి।**
**అనిందితో, అవిషీదితః,**
**స ఏవ చ తేన విజ్ఞాన తపసా దగ్ధ కిల్బిషః॥ (శంకరభాష్యము)।**

బాధ సమయంలో ఆరోగమునో, తదితరులనో, దైవమునో దూషించకుండా, ధైర్యము కోల్పోకుండా.. **'ఉపాసన'**గా భావిస్తే... అది ఆ ఉపాసకుని ఇతః పూర్వపు రోగములను, పాపములను ప్రక్షాళన చేసి, ఆ సాధకుని నిర్మల పరచగలవు.

**అట్టివాడు సర్వోత్కృష్టమగు పుణ్యలోకములను పొందుచున్నాడు.**

❖❖❖

అంతేకాదు

**యం ప్రేతం అరణ్యగ్ం హరంతి ఏతత్వై పరమం తపో।**
**పరమగ్ం హి ఏవ లోకం జయతి, య ఏవం వేద॥ (7-11-1)**

"ఈ జీవుడు మరణించినప్పుడు, ఆతని బంధువులు ఆ ప్రేతము యొక్క (మరణించినవాని) భౌతిక దేహమును ఇంటి నుండి, ఊరు నుండి దూరముగా తీసుకువెళ్లి అరణ్యములో వదులుతారు. అది ఆ ప్రేతమునకు దుఃఖమే కదా!".. అని లోకంలో అనుకూంటూ ఉంటారు. అయితే ఆత్మతత్త్వము ఎరిగిన యోగుల దృష్టిలో వారి వారి దేహముల రాకపోకలపట్ల అంతా కూడా గొప్ప తపస్సుతో సమానమే అవుతోంది. ఎందుకంటే ఒకడు ఏకాంతముగా తపస్సు చేయాలనే ఆశయముతో జనస్థానములను, గృహము – సంపద –సంతానమును వదలి [ వానప్రస్థమునకు (వనములలోకి, అడవులకు) వెళ్ళటము ఉత్తమమగు ఆత్మతత్త్వము కొరకు సాధనయే కదా! **తమ భౌతిక దేహము మరణానంతరము బంధువులచే అరణ్యములోకి చేరవేయటము కూడా ఆత్మజ్ఞుల దృష్టిలో వానప్రస్థముతో సమానము.**

ఎవ్వడైతే, **"ఈ మరణానంతరము ఈ నా భౌతిక దేహమును బంధువులు గ్రామానికి దూరంగా ఒక అడవిలో వదలటము నా దృష్టిలో ఆత్మభావన యొక్క సిద్ధికొరకు తపస్సుతో సమానమే!"** ... అని భావిస్తాడో, అట్టివాడు 14 లోకముల జన్మ-జన్మాంతర సాంసారిక ప్రయాణమును జయించినవాడు అగుచున్నాడు. ఉత్తమ లోకములను కూడా జయించి ఆత్మ సంస్థితిని సమీపించుచున్నారు.

❖

**యం ప్రేతం అగ్నాః అవభ్యా దధతి, ఏతద్వై పరమం తపో।**
**పరమగ్ం హి ఏవ లోకం జయతి, య ఏవం వేద! (7-11-1)**

***"మరణానంతరము బంధువులు ఈ భౌతిక దేహమును అగ్నిలో దహించటము కూడా నాకు గొప్ప తపస్సుతో సమానమే"!***

అని ఆత్మజ్ఞుడు భావిస్తున్నాడు. ఎందుకంటే, ఈ దేహమును యోగాగ్నిలో తపింపజేసి భస్మము చేయటము తపోయజ్ఞములో చెప్పబడిన ఒకానొక విధాన యోగమే కదా!

ఎవ్వరైతే మరణానంతరము తమ ఈ భౌతిక దేహ దహనము→ తపో–అగ్నిలో భౌతికభావనలను భస్మము చేయటముతో (ఆధ్యాత్మిక భావనలను వెలిగించుటతో) సమానముగా భావిస్తారో, అట్టివారు ఉత్తమ లోకములను పొందుచూ, వాటిని జయించి "పరమాత్మతత్త్వము"ను చేరు మార్గమును సుగము (సుఖమయము) చేసుకుంటున్నారు.

***ఇతి సప్తమ అధ్యాయమ్– ఏకాదశ బ్రాహ్మణమ్***
***"తపో బ్రాహ్మణము"॥***

## సప్తమ అధ్యాయము
## ద్వాదశ బ్రాహ్మణము
## 12. అన్న-ప్రాణ (పదార్థము-శక్తి) బ్రాహ్మణము

**అన్నమ్ = ఆహారము.** అన్నము, (మరియు) ఇంద్రియములకు ఆహారము లైనట్టి శబ్ద – స్పర్శ, రూప – రస – గంధ విషయములు. విషయ రూప జగత్.

**ప్రాణము = ఇంద్రియములను ఉపయోగించు శక్తి. ప్రాణశక్తి.**

### కిం బ్రహ్మేతి? 'బ్రహ్మము' అనగా?

**అన్నం బ్రహ్మేతి ఆహుః :** కొందరు వేదవేత్తలగు ఆచార్యులు **"అన్నము** (అనుభవమగుచున్నది. All that being experienced).. **-బ్రహ్మము"**.. అని నిర్వచించి చెప్పుచున్నారు. అందుచేత అన్నము (స్వీకరించు ఆహారము – కళ్ళక కనిపించేది, చెవులకు వినిపించేది, మొదలైనవన్నీ) బ్రహ్మముగా ఉపాసించాలి.

**తత్ న తథా గ్రహీతవ్యం అన్నం బ్రహ్మేతి। అన్యే చ ప్రాహుః "ప్రాణం బ్రహ్మేతి।"**

**తత్ న గ్రహీతవ్యమ్ :** మరికొందరు ఆచార్యులు ఇట్లా అంటున్నారు. అది అట్లా కాదు.. అన్నము ప్రాణశక్తితో కూడి ఉండకపోతే ఆ అన్నము కుళ్ళి చెడిపోగలదు. అందుచేత **'బ్రహ్మము'** అని అన్నము గురించి అనటం ఎట్లా? బ్రహ్మము అవినాశి కదా!

పోనీ **'ప్రాణము'**ను బ్రహ్మమును అనవచ్చునా.. అంటే, అదీ కుదరదు. ఎందుకంటే.. అన్నము స్వీకరించనప్పుడు ప్రాణము కృషించి పోవుచున్నది కదా! అందుచేత అన్నముగాని, ప్రాణముగాని విడివిడిగా బ్రహ్మము కాదు.

అయితే..,

**అన్నము-ప్రాణము** → దేవతా స్వరూపములై **'ఏకస్వరూపము'** పొందినప్పుడు బ్రహ్మత్వమును పొందుచున్నాయి. బ్రహ్మమే అగుచున్నాయి.

ఈ విధంగా **"అన్నము+ప్రాణము"**లను ఏకరూప (లేక) **'పదార్థము – శక్తి'** (Matter +Energy) లను **ఏకరూపంగా, పరబ్రహ్మముగా** ఉపాసించువాడు బ్రహ్మత్వమును త్వరగాను, సులభముగాను చేరుచున్నాడు. దుష్టత్వము ఆతనిని వశంచేసుకోలేదు. పుణ్య పాప ద్వంద్వములకు పట్టుబడడు.

❖ ❖ ❖

ఈ విషయమై **ప్రాత్రుదుడు** అను ఒక ఋషికుమారుడు, ఆయన తండ్రి యగు **ఋషి** → ఈ విధంగా సంభాషించుకోవటము జరిగింది.

**ప్రాత్రుదుడు అను ఋషిపుత్రుడు :** (తన పితృ దేవులగు ఋషిని సమీపించి) : తండ్రీ! సద్గురూ! ఇప్పుడు నాదొక సంశయము అన్న-ప్రాణములను బ్రహ్మముగా ఉపాసించువాని యొక్క బ్రహ్మోపాసన సంపూర్తి అయినట్లే కదా! ఆతనికి క్రొత్తగా ఏమిచ్చి శోభ కలిగించగలం? ఏమి ఇవ్వక అశోభ అవుతుంది?

అన్న-ప్రాణములను బ్రహ్మముగా (పరమాత్మగా) ఉపాసిస్తే బ్రహ్మము యొక్క ఉపాసన పూర్తిగా నిర్వర్తించినట్లేనా?

**ఋషి :** (చేతులు –ముఖము – "కాదు" అన్నట్లుగా కదిలించుచూ) ఊహూఁ! ప్రియకుమారా! ప్రాత్రుదుడా! నీవు అట్లా చెప్పరాదయ్యా! అన్న-ప్రాణదేవతలను కలిపి బ్రహ్మగా (సృష్టికి కారణముగా) దర్శించినంత మాత్రము చేత బ్రహ్మోపాసన పూర్తి అయినట్లు కాదు.

సమస్త భూతములు 'అన్నము'ను విష్టించి (ఆశ్రయించి) ఉన్నాయి. అందుచేత అన్నము (పదార్థము –Matter)ను విశంతి – అనే అర్థము వచ్చే తీరుగా **"వి"** అని అనబడుచున్నది.

అంతేకాకుండా,

సమస్త భూతములు ప్రాణమునందే రమిస్తున్నాయి. ప్రాణము ఉన్నప్పుడే జీవులు చలించగలరు. అందుచేత ప్రాణమును **'రమ్'** అని పిలుస్తున్నారు.

పదార్థము (Matter) ఉన్నప్పటికీ ఈ జీవుడు ప్రాణము తోడుగా ఉండకపోతే రమించలేదు. ప్రాణము ఉన్నప్పటికీ పదార్థము (అన్నము) లేకపోతే అనుభూతి సిద్ధించదు.

కనుక వి+రమ్ = విరమ్

**పదార్థము + ప్రాణము = విరమ్**

అట్టి **'విరమ్ రూపమే ఆత్మ'** అని ఉపాసించబడు గాక!

'నేను పదార్థమును స్వీకరించను' అని అన్నంత మాత్రము చేత బ్రహ్మమును పొందలేవు. పదార్థము – స్వీకరించు శక్తిల (అన్న–ప్రాణముల) ఏకత్వమే బ్రహ్మముగా ఉపాసించు. బ్రహ్మము కొరకై ఉపాసించు.

ఈ విధంగా ఆత్మకు ఆనందరూప ప్రదర్శనములే అయి ఉన్న అన్న–ప్రాణములు సమస్త భూతములకు తాము ఆశ్రయించు 'జీవితము' అనే క్రీడా ప్రాంగణములో ఉపయుక్త–విశేషములు అగుచున్నాయి.

**"అన్న – ప్రాణములు ఆత్మ భగవానునికి ఎల్లప్పుడూ తాను విహరించే క్రీడా ప్రాంగణము"** అని భావించి స్వస్వరూపాత్మను ఉపాశ్రయించుచూ, ఉపాసించుచున్నారు.

**శ్లో॥ సర్వాణి హ వా అస్మిన్ భూతాని విశంతి,**
**సర్వాణి భూతాని రమంతే, య ఏవం వాద॥ (7-11-1)**

ఈ విధంగా అన్న- ప్రాణములను ఆత్మకు (స్వస్వరూపమునకు) క్రీడా ప్రాంగణములుగా సంచరించు స్థానముగా దర్శించువానిని సర్వము ఆశ్రయించినవై ఉంటాయి. **అట్టివాడు ఆత్మ తేజోవిలాసముతో మహాబలవంతుడగుచున్నాడు.**

సర్వభూతములు ఆతని యందు ప్రవేశించినవై ఉంటాయి. సర్వభూతములు అట్టివానియందు (అన్నప్రాణ బ్రహ్మోపాసకుని యందు) రమిస్తూ ఉంటాయి!

***ఇతి అన్న ప్రాణ బ్రాహ్మణమ్***
***నామ ద్వాదశోధ్యాయః॥***

## సప్తమ అధ్యాయము
## త్రయోదశ బ్రాహ్మణము
## 13. ఉక్థ బ్రాహ్మణము

***ఇప్పుడు సగుణ బ్రహ్మము యొక్క మరొక ఉపాసన – దైవగుణ వర్ణనా స్తోత్రము" గురించి చెప్పుకుంటున్నాము.***

**ఉక్థము** = – శస్త్రము
– వేదమంత్రముతో 'దేవత'యొక్క గుణ విశేషములను వర్ణించటము
– ఋగ్వేద మంత్రములను 'ఉగ్ధము' అని పిలుస్తారు?

**ఉక్థం ప్రాణో వా। ఉక్థం ప్రాణో హి ఇదగ్ం।**

ప్రాణమే వాస్తవానికి శస్త్రము. బ్రాహ్మీస్థితిని లక్ష్యముగా చేయుబాణము. అందుచేత ప్రాణమును స్తోత్రముద్వారా పరతత్త్వము వైపు సంధించబడిన శస్త్రముగా (బాణముగా) ఉపాసించుచున్నారు.

**ఉక్థమ్ శస్త్రమ్ తద్ధి ప్రధానం మహావ్రతే క్రతే!**

– ఋగ్వేదమంత్రములతో దేవత యొక్క మహత్ గుణములను వర్ణించటమే శస్త్రమును ఎక్కుబెట్టుటము. **'ఆత్మయజ్ఞము'** అనే మహావ్రతములో ఉక్థము (స్తోత్రము) అత్యంత ప్రధానమైనట్టి అంగము (Most Important wing / part / phase).

- ఇంద్రియములలో ప్రాణము ప్రప్రథమము, ప్రధానము.
- అట్లాగే శస్త్రములన్నిటిలో (సాధన వస్తువులన్నిటిలో) ఉక్థము – భగవత్‌స్తోత్రమునకు అత్యంత ప్రాముఖ్యమైన పాత్ర.
- ప్రాణమే ఆత్మకు స్తోత్రము. **ప్రాణోపాసన ఆత్మకు సమర్పించే అతి ముఖ్యమైన స్తోత్రం.**

ప్రాణము యొక్క ప్రాముఖ్యత ఎటువంటిది?... అని ప్రశ్నిస్తే... **ప్రాణో హి ఇదగ్ం సర్వమ్ ఉత్థాపయతి । ప్రాణమే ఈ సర్వమును ఉత్పన్నము చేస్తూ, సంరక్షించుచున్నది** – అనునది సమాధానము. అందుకే ప్రాణమే ఉక్థముగా చెప్పబడుతోంది.

కదలుచున్నట్టిది – అన్నము (Matter)

కదిలించుచున్నది – ప్రాణము (Energiger)

ప్రాణమే ఈ సర్వమును కదిలించుచున్నది. **ఎవ్వడు కదిలే దానియందు కదిలించే యోగమగు ప్రాణమును తెలుసుకుంటాడో, ఆతడే ప్రాణవేత్త। ధీరుడు।**

**ఉత్ + హ** = జడమగు దానిని ఎత్తి ఉంచునది – **ప్రాణశక్తి.**

ఈ జగత్తును ప్రాణతత్త్వముగా ఎవడు ఉక్థము (స్తోత్రము) చేస్తూ ఉన్నాడో ఆతడే 'ఉక్థ' (స్తోత్రము) చేయుట ఎరిగినవాడు. ఆతనికి ఉక్థజ్ఞ దృష్టి → పుత్రుడుగా అగుచున్నాడు. అట్టివాడు ప్రాణబ్రహ్మైక్యము పొందినవాడై ప్రాణ బ్రహ్మమునకు సమానమగు లోకములను జయించి ప్రాణముతో సాలోక్యము – సాయుజ్యము పొందుచున్నాడు.

ఈ విధంగా ప్రాణమే ఋగ్వేదము.

ఇంకా కూడా...

### యజుర్వై ప్రాణః (7–13–2). యజుర్వేదము ప్రాణ స్వరూపమే।

**యజుః ప్రాణోవై। "యజుః" ఇతి చ ఉపాసీత ప్రాణమ్।** యజుర్వేదమును ప్రాణముగా ఉపాసించాలి. ధ్యానించాలి. యజుర్వేదములోని యజస్సులు (ఇంద్ర–అగ్ని–వాయు–యమ.. ఇత్యాది) అధి దేవతల, ప్రత్యధిదేవతల సంబంధమైన స్తోత్రములు (అష్టదిక్పాలక–నవగ్రహా, స– అంగ, స–ఉపాగ్ం, స ఆయుధ, సపత్నీ : ఆహ్వాన స్తోత్ర నివేదన పూర్వకములైన యజస్సులన్నీ)... అన్నీ కూడా ప్రాణోపాసనలే! **ప్రాణోవై యజుః! కథం యజుః ప్రాణః? ప్రాణేహి యస్మాత్ సర్వాణి భూతాని యుజ్యంతే!**

*ప్రాణములే యజుర్వేదములో యజస్సులు అయి ఉన్నాయి. ఎట్లా? ఎందుచేత?*

→ సకల ప్రాణులు ప్రాణము నందే యోగము పొందిన తరువాతనే దేహములలో జనిస్తున్నారు.

→ ప్రాణము లేకుండా ఏ ఒక్కనికీ కూడా దేనితోనూ కలయిక (యోగము) లభించదు కాబట్టి!

**యుజ్యంతే** = కలుపుచున్నది. దేనితోనైనా కలుపుచున్నది ప్రాణమే కాబట్టి యజుర్వేదము ప్రాణ స్వరూపమే అగుచున్నది.

ఎప్పుడైతే ఈ విశ్వమంతా ప్రాణ స్వరూపముగాను, అట్టి ప్రాణోపాసన –ఆత్మత్వము (బ్రహ్మత్వము)నకు మహత్తరమైన ఉపకరణ (సాధన) వస్తువుగా కూడా – ఉపాసిస్తూ ఉంటాడో, అట్టి ప్రాణయోగ సాధకుని శ్రేయో–ప్రేయములకొరకై సకల జీవులు (సకల భూతములు) **ఉద్యమించునవై ఉంటాయి,** వారికి శ్రేయోదాయకమైనవి, ప్రేయోదాయకమైనవి వాటికవే వారిని సమీపిస్తూ ఉంటాయి.

### యుజ్యంతే హాస్మై సర్వాణిభూతాని। (8–13–2)।

ఎవ్వడైతే యజుర్వేద – యజస్సులను స్తోత్రములుగాను (ఉక్థములుగాను), పరమాత్మ గురించిన ప్రేమాస్పదములగు వర్ణనములుగాను ఉపాసిస్తాడో, అట్టివాడు ప్రాణ బ్రహ్మముయొక్క సాలోక్యమును, సాయుజ్యమును సులభతరం చేసుకుంటూ, క్రమంగా తానే **పరమాత్మ**

– **పరబ్రహ్మము** అయి ప్రకాశించుచున్నాడు. తన ఉద్యమమునే తాను ఈ సర్వ విశేషములతో కూడిన జగత్తుగా ఆస్వాదించుచున్నాడు. తానే సమస్తమునకును 'ఆది' (The Begining) స్వరూపముగా తనను తాను సందర్శిస్తున్నాడు.

## 'సామ' ప్రాణో వై।
## సామ వేదము ప్రాణ స్వరూపమే।

సామవేదమును ప్రాణ స్వరూపముగాను, ప్రాణ బ్రహ్మమును 'సామ'గాను కొందరు ఉపాసించుచున్నారు.

– సకల ప్రాణులు ప్రాణమునందే ఉన్నారు.

**సామ** = సమత్వమును పొందటము

సమత్వము పొందుటకు ప్రాణమే (ప్రాణోపాసనయే) గొప్ప సహకారి – కారణము అగుచున్నది.

ఈ జీవులంతా ఏక ప్రాణస్వరూపులే. సామ ప్రాణోపాసకుని పట్ల సర్వ ప్రాణములు ఏకముగా అగుచున్నాయి. సకల ప్రాణులు ప్రాణోపాసకుని ఔన్నత్యము గానము చేయటానికై సిద్ధమగుచున్నారు. సామగాన ప్రాణోపాసకుని గొప్పతనమును ఎలుగెత్తి చాటుచున్నారు.

సామగానమును ప్రాణతత్త్వముగా ఉపాసించువాడు ప్రత్యక్షంగా ప్రాణశక్తితో సారూప్యము, సామీప్యము, సాలోక్యము, సాయుజ్యము పొందుచున్నాడు. అపరోక్షముగా ప్రాణముతో ఐక్యత్వమును, సమానలోకత్వమును అనుభవములోకి తెచ్చుకొనగలుగుచున్నాడు.

## క్షత్రం ప్రాణోవై!

ఇంతవరకు ఋక్ – యజో – సామవేదములలోని బ్రాహ్మణముల గురించి చెప్పుకున్నాము. ఇప్పుడు ఇక 'క్షత్రము' గురించిన ఉపాసనను వివరించుకుంటున్నాము.

**క్షత్రము** = సంరక్షించు ధర్మము.

దృశ్యములోను, దేహములోను ప్రత్యక్షమై కనిపిస్తున్న 'పరిరక్షణతత్త్వము' ప్రాణ స్వరూపముగా ఉపాసించబడుచున్నది. ఎందుకంటే, రక్షణ స్వయముగా ప్రాణతత్త్వమే అయి ఉన్నది. **క్షత్రం ప్రాణో హి।**

రక్షణము ప్రాణబ్రహ్మముగా ఉపాసించటం ఇంకా ఎందుకు?

– **త్రాయతే హి ఏనం ప్రాణః క్షణితోః। (7–13–4)** ।

'మాంస పిండము' అయినట్టి ఈ భౌతిక దేహమునకు గాయము అయినప్పుడు ఆ గాయము అయిన ఖాళీ స్థానమును తిరిగి మాంస పిండముతో నింపుచున్నది, తద్వారా దేహమును రక్షిస్తున్నది **ప్రాణమే।**

రక్షణ (క్షత్రము)ను ప్రాణశక్తిగా ఉపాసించువానిని రక్షించుటకు బాహ్య వస్తువు యొక్క ఆవస్యకత లేకుండా, ప్రాణశక్తియే రక్షణ కవచమగుచున్నది.

**"ప్రక్షత్రమ్"** అనే ప్రత్యక్ష రక్షణగా దేహములోని ప్రాణశక్తియే రూపముదాల్చి, ఈ జీవుని దేహమును రక్షిస్తోంది.

ఎవ్వడు దేహములోని, బాహ్యములోని – **'రక్షణ తత్త్వము'** యొక్క మహత్తర కార్యములను గమనిస్తూ, అద్దానిని **'ప్రాణము'**గా ఉపాసిస్తాడో, … అట్టి వాడు ప్రాణబ్రహ్మము యొక్క సాలోక్యమును, సాయిజ్యమును పొందుచున్నాడు.

**ఇతి బృహదారణ్యక – సప్తమ అధ్యాయ**

***"ఉక్థబ్రాహ్మణమ్" నామ త్రయోదశ బ్రాహ్మణమ్॥***

న

**సప్తమ అధ్యాయము**

# చతుర్థశ బ్రాహ్మణము

# 14. గాయత్రీ బ్రాహ్మణము

ఇప్పుడు మనము **'గాయత్రి'** అను ఉపాసన ద్వారా **'బ్రహ్మము'**ను ఉపాసించుట గురించి చెప్పుకోబోవుచున్నాము.

## గాతయత్ త్రాయతే యస్మాత్।

ఛందస్సులన్నిటిలో గాయత్రీ ఛ్చందస్సు ప్రాధాన్యమైనది. త్రాయతే. ప్రాణములను రక్షించునది. ప్రాణముతో తాదాత్మ్యము చెందింపజేయునదిగా గాయత్రీ ఛ్చందస్సు అభివర్ణించబడుతోంది.

- హింస నుండి రక్షించునది
- వాక్కు మొదలగు ఇంద్రియములకు క్షత్రము – కాపాడునది.

## ద్విపదా। ద్విజా।

గాయత్రి ప్రాణశక్తికి స్తోత్రము. అందుచేత గాయత్రీ మంత్రము – ప్రాణోపాసనకు, ఆత్మోపాసనకు (ఉభయములకు) ఉపాయముగా విధించబడుతోంది. మానసిక బంధములైనట్టి కోరికలను రహితము చేసి బ్రహ్మమార్గమును చూపునది. ఉపాసకునికి రెండవ జన్మ ప్రసాదించి, **ద్విజునిగా తీర్చిదిద్దునది.** ఆటంకములు తొలగించి మోక్షము వరకు రక్షణ కలిగించునది కాబట్టి – **ద్విపద।**

మంత్రము – **ఓం।** **భూమి అంతరిక్షం ద్యౌః (దయః) ఇతి అష్టాః అక్షరాణి।**

**2 4 2 = 8**

**భూర్భువస్సువః** = భూమి, అంతరిక్షము – (ద్యు) లోకము (5).

**తత్ సవితుః వరేణ్యం** = 2+3+3= (8)

**భర్గోదేవస్య ధీమహి** = 2+3+3=(8)

**ధియో యోనః ప్రచోదయాత్** = (4+4) = (8)

త్రిలోకములంతా నిండుగా ఆక్రమించుకుని ఉన్నవాడు, త్రివేదములసారమయినవాడు, స్తోత్రములకు అర్హమగు సత్‌చిత్ ఆనంద బ్రహ్మస్వరూపుడు, కేవలబుద్ధి స్వరూపుడు, సర్వమును వెలిగించువాడు – అగు భర్గోదేవుడు **మా బుద్ధిని వికశింపజేయునుగాక!**

## త్రిపదా।

**I. గాయత్రి – <u>మొదటి పాదము</u> – ముల్లోకముల సారము। భూ – ఆకాశ – సువర్లోక (స్వర్గలోక) రూపి।**

**<u>భూ భువర్ సువః</u>**

**భూమిః; అంతరిక్షమ్; దివి – (దివ్య లోకము / దేవతా లోకము).**

**1 2 2 = 5**

ఈ గాయత్రీ మంత్ర – మొదటి పాదమును – చెఱకు గడలు 'మూడిటి'లోని చెఱకు రసము వలె – **"మూడు లోకముల సారము"** అని ఎవరు తెలుసుకొని ఉపాసిస్తాడో – **స యావదేషు త్రిషు లోకేషు, తావద్ధ జయతి–యో అస్య ఏతత్ ఏవం పదం వేద।**

.... అట్టివాడు ముల్లోకములను తనయందే పొందుచూ, తనయందే దర్శించి, ముల్లోకములను జయించువాడు (దాటివేయువాడు) అగుచున్నాడు.

## త్రయీవిద్య

**II. గాయత్రీ మంత్రము యొక్క రెండవ పాదము**

**తత్ సవితుః వరేణ్యం (వరణీయం. స్తుతించబడునది) (త్రివేదసార స్వరూపం)**

(2) (3) (3) (8)

ఇది '8' అక్షరములతో కూడి ఉన్నది.

**వరేణ్యమ్** = ఋచః – యజూంషి – సామాని। ఋక్ యజుర్ – సామ వేదములచే వర్ణించబడుచూ ఉన్నట్టిది.

**సవితుః** = సత్+విత్+ ఉ   సత్ = ఉనికి. విత్ ఎరుక, విచక్షణ (logic). ఉ = సత్ – విత్‌ల వినియోగము.

ఉ = "ఎక్కడ ఉనికి। దేని గురించి ఎరుక?" – అను రూపముగల జగత్ ప్రదర్శనము।

సత్ చిత్ ఆనంద స్వరూపమగు 'ఆత్మ'.

ఎవడు ఈ రెండవ పాదమును ఈవిధంగా ఉపాసిస్తున్నాడో, ఆతడు మూడు వేదములలోని జ్ఞానసారమును మంత్రదేవతచే అనుగ్రహించబడినవాడై గ్రహిస్తున్నాడు. గాయత్రి – 'త్రయీ విద్య'. అందుచేతనే (సత్–విత్–ఉ విద్యగా సవితుర్యితిగా) చెప్పబడుతోంది. ఉపాసకుడు త్రయీ విద్యాఫలము పొందుచున్నాడు. వేద విద్యఎంతటిదో, గాయత్రీ రెండవపాద ఉపాసకుని పట్ల మంత్రఫలము అంతటిది. ఈ రెండవ పాదము ఉపాసించువాడు **'వేదోపాసకుడే'** అగుచున్నాడు.

వేదముల సారమే వేద స్తుతమగు సత్ – విత్ ఉ (సవితుః)। అది ఈ జీవుని సహజ రూప వర్ణనము, స్తుతి।

## అఖండ – అనన్యానుభవం

***గాయత్రీ మంత్ర మూడవ పాదము***

**ధియో యోనః ప్రచోదయాత్। (8 అక్షరములు)**

**2 2 4**

ఇది ప్రాణ – అపాన – వ్యాన స్వరూపమైన పాదము.

***గాయత్రీ మంత్రమును –***

ప్రాణతత్త్వము యొక్క ఉపాసనా రూపముగాను, సర్వ ప్రాణ (సప్రాణ) – అఖండ ప్రాణ తత్త్వముగాను ఉపాసించబడుతోంది. అట్టి ఉపాసనచే ఆ ఉపాసకుడు ప్రాణికోటినంతటినీ తనయందు దర్శించుచూ **"సహజాత్మ దర్శనము"**ను సిద్ధించుకుంటున్నాడు. సర్వప్రాణి కోటిని జయించి **'ఆత్మైవమేవ సర్వత్ర'** స్థానము చేరుచున్నాడు. (**మయా తతమ్ ఇదం సర్వం। మత్తః పరతరం నాస్తి। అహమేవ ఇదగ్ం సర్వమ్** – అను అఖండాత్మానందస్థానమును పుణికిపుచ్చుకుంటున్నాడు).

***భర్గో దేవస్య। తురీయము – 4వ పాదము***

ప్రత్యక్షంగా కనిపిస్తున్న సూర్యమండలములోని తేజస్సును **"పరోరస మండలము"** అంటారు.

**తురీయమ్** = యద్వై చతుర్థం ప్రసిద్ధం లోకే, తత్ ఇదం "తురీయ" – శబ్దేన అభిధీయతే!

**నాలుగవది** 'తురీయ శబ్దముచే లోకంలో ప్రసిద్ధి పొందినది. (తురీయము = జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు తనయొక్క స్వయం కల్పిత సంచారస్థానములుగా కలిగియున్న – **సంచార పురుషుడు.** చతురీయ (4వ) పురుషుడు / పురుషకారము.)

**పరో మండలము** = ఇహత్వమునకు ఆధారమైయున్న

- "పర (ఆత్మ)" తత్త్వము (మన కేవల స్వరూపము)
- "పరోరజము" అను పదము (కేవల స్థానము)
- 'గాయత్రి' యొక్క 'తురీయము' అయినట్టి 'దర్శితపాదము' (కేవల దర్శనము)

ప్రత్యక్ష సూర్యమండలాంతర్గత పురుషుడే గాయత్రీ పురుషుడు.

**పరోరజ పురుషుడు** = సమస్తమైన రజస్సు (భౌతికం స్థూల – సూక్ష్మ – పదార్థతత్త్వములకు) ఆవల ప్రకాశించుచున్నట్టి పరమ పురుషుడు!

ఎవ్వరైతే ఈ విధంగా గాయత్రి యొక్క నాలుగవ పాదము అగు తురీయమును తెలుసుకొనుచున్నాడో, ఆతడు ఆకాశములోని సూర్యుని వలె (భూ–భువర్ – సువర్ లోకములకు పైనగా కనబడు తీరుగా)

- సర్వమునకు ఆధిపత్యమును,
- సర్వ ఖ్యాతిని–

పొందుచున్నాడు. తరంగములన్నిటికీ జలమే అధికారి అయిన తీరుగా, సమస్తమునకు అధికారి అయి 'అధిపురుషుడు' అగుచున్నాడు. 'అట్టి 'తురీయము'ను ఉపాసించు పురుషుడు దేవతల అభీష్టమును శాసించుచున్నాడు. సూర్యునివలె సృష్టికంతటికీ శోభ–కీర్తి కలిగించుచు ప్రకాశించుచున్నాడు.

ఈ విధంగా గాయత్రి యొక్క మొదటి మూడు పాదములు (1) '3' లోకములు (2) 3 వేదములు (3) '3' ప్రాణములు ఉపాసనకు ఉద్దేశ్యించుచున్నాయి. ఇక నాలుగవ పాదము **"సోఽహమస్మి – అదియే నేను"**.. అను రూపంలో ఆదిత్య పురుషుని యందు తేజోరూపమై ప్రతిష్ఠితమగుచున్నది. అట్టి 4వ పాదము తురీయము, పరోరజసము, మూర్తామూర్తముల సారము, కేవలీ స్వస్వరూపము–ఇత్యాది విశేషణములతో (అట్టి మంత్రసిద్ధి స్థానము) వర్ణించబడుతోంది. 4వ దగు పరోరజస్థానము 'సత్యము' నందు ప్రతిష్ఠితమైయున్నదని ప్రసిద్ధి.

## *కిం సత్యమ్? సత్యము ఏదై ఉన్నది?*

**(1) చక్షుర్వై సత్యం। కథం చక్షుర్హి సత్యం?**

చూపుయే సత్యము. చూచునదే సత్యమని ఎట్లా అంటాము? శ్రుతి ఇట్లా చెప్పుచున్నది. చూచునది సత్యమనునది ప్రసిద్ధి అయిన విషయమే। ఇద్దరు వాదులాడుకొంటూ మన వద్దకు వచ్చినప్పుడు,

- మొదటివాడు → నేను అక్కడ 'పులి' ఉన్నట్లు స్పష్టంగా చూచాను! అంటూ ఉండగా,
- రెండవ వాడు → కాదు. అది 'సింహం' అని ఎవరో అంటూ ఉంటే నేను విన్నాను! – అన్నప్పుడు,

మొదటివానిని నమ్ముతాముగాని, రెండవ వానిని కాదు. ఎందుకు? వినేవాడు విన్నది తప్పుకావచ్చునేమో। కానీ చూచేవాడు చూచేది తప్పు అవటానికి వీలు లేదు కదా!

అందుచేత **'చూపు'** సత్యమైయున్నది. **'చూపు'**నందు గాయత్రి యొక్క మొదటి మూడు పాదములతోబాటు.. నాలుగవ పాదమగు 'సత్యము' కూడా ప్రతిష్ఠితమైయున్నదని శ్రుతి శ్లోకము, గానము.

**(2) సత్యము బలమునందు ప్రతిష్ఠితమైయున్నది.**

దేహబలము – బుద్ధి బలము కలవాడే సత్యమును చూచి, గ్రహించగలడు. బలహీనుడు అనుమానములతో, దురభిప్రాయములతో భయ–ఆందోళనలతో, ఆవేశములతో కూడుకొన్నవాడైతే– **సత్యమును చూస్తూ కూడా అసత్యమైన రీతిలోనే గ్రహించటము జరుగుతోంది.** ఈ విధంగా **"తురీయ పాదమునకు ఆశ్రయము అయినట్టి సత్యము బలమునందే ప్రతిష్ఠితమైయున్నది"**... అని శ్రుతి శ్లోకములు ఎలుగెత్తి గానం చేస్తున్నాయి.

**(3) బలము మరి ఎందులో ప్రతిష్ఠితమైయున్నది?**

**"ప్రాణము" నందు!**

- బలము యొక్క రూపము ప్రాణమే। **ప్రాణరూపమగు బలమునందు సత్యము ప్రతిష్ఠితమై యున్నది.** ప్రాణమును "సూత్రాత్మ" – అంటాము.
- ఈ నామరూపాత్మకమైన జగత్తంతా కూడా **'సూత్రాత్మ'** అని పిలువబడు సమష్టి ప్రాణమునందు (సప్రాణమునందు) ప్రతిష్ఠితము.

సత్యము బలము (ప్రాణము)నందు ప్రతిష్ఠితమై ఉండటము చేత **'సత్యము కంటే బలమే గొప్పది'** అని అనబడుతోంది. ఎందుకంటే, బలమునందు సత్యము ప్రతిష్ఠితమై యున్నది. ఎందుచేత? బలహీనుడు బలహీనమైనదే 'సత్యము'గా అనుకుంటూ, భావిస్తూ, నమ్మి ఉంటాడు కాబట్టి.

ఒకదానిలో రెండవది స్థానము కలిగి ఉన్నదని అన్నప్పుడు – **ఆ రెండవదానికంటే మొదటితే గొప్పది** – అని అర్థము కూడా।

ఈ విధంగా గాయత్రీ ఉపాసనా సిద్ధి పొందుచున్న యోగపురుషుని (యోగాభ్యాసియొక్క) అనుభవము ప్రకారము..,

→ గాయత్రి సూర్యుని యందు,

→ సూర్యుడు సత్యమునందు,

→ సత్యము చూపునందు,

→ చూపు ప్రాణము నందు **ప్రతిష్ఠితము.** ప్రాణము **'బలము'గా ప్రదర్శనమౌతోంది.**

అనగా గాయత్రి → **'దేహ-ఇంద్రియ సంఘాతము'**లోని 'ప్రాణము'నందు ప్రతిష్ఠితమై యున్నది. అంతేకాదు..

- గాయత్రియే ప్రాణము.
- ప్రాణమునందు ఈ జగత్తు సుప్రతిష్ఠితము.
- కనుక ఈ జగత్తు 'గాయత్రి' యందు ప్రతిష్ఠితము.

సూత్రాత్మ యగు ప్రాణము (లేక) గాయత్రి యందు సకల దేవతలు, సకల వేదములు, సకల లోకములు, సకల కర్మలు, కర్మ ఫలములు – ప్రాణరూపమున ప్రతిష్ఠితమైయున్నాయి. ఈ జగత్తుకు ఆత్మ గాయత్రియే! ఇదంతా గాయత్రీగానమే। (The Song sung about **Al-Present Self**)

***గాయత్రీ ఆధ్యాత్మేన ప్రతిష్ఠితా:***

ఈ విధంగా గాయత్రి ప్రాణస్వరూపిణిగా, బలము రూపముగా 'ఆత్మ' యందు ప్రతిష్ఠితమైయున్నది. జీవాత్మయందలి సత్య వస్తువు గాయత్రీ సూత్రాత్మయే। **గాయత్రీ సూత్రాత్మ యొక్క ఒకానొక ప్రదర్శనమే ఈ జీవుడు.**

## గాయత్రి ప్రసాదించు రక్షణ

**గయము = వాక్కు; గై = శబ్దము**

**సా హి ఏషా గయాం తత్రే త్రాతవతీ!**

గాయత్రి గయమును (వాక్కును) రక్షించుచున్నట్టిది.

"గాయత్రి → వాక్కు ఉదయించుటకు హేతువు అయి ఉన్నది".. అని గమనించి, ఉపాసించబడు గాక! **(గాతయత్ త్రాయతే యస్మాత్ 'గాయత్రీ' ఇత్యభిధీయతే)।**

ఏ రక్షణ విధానము ఈ దేహములోని ఇంద్రియములు శిథిలమైపోకుండా అనేక సంవత్సరములకాలము అనుక్షణము, ఎల్లప్పుడు (ఈ దేహి జాగ్రత్ –స్వప్న– సుషుప్తులలో ఉన్నప్పుడు కూడా) రక్షించుచున్నదో – **అట్టి శక్తియే గాయత్రీ శక్తి.**

# ఉపనయన సంస్కారము

ఆచార్యులవారు '8' సంవత్సరముల బాలునికి ఉపనయన సంస్కారములను చేస్తూ "సవితృదేవాత్మకము" అగు గాయత్రిని ఉపదేశిస్తున్నారు.

**సవితృ** = సత్+విత్+ఋత్–"సావిత్రి"

**"సూర్యుడు, హిరణ్యగర్భుడు"** → దేవతలుగా గల గాయత్రీ మంత్రమును ఉపదేశిస్తున్నారు.

సగము ఋక్కులుగా విడదీసి ఒకసారి...,

పూర్తి మంత్రమును కలిపి మరోకసారి.. తండ్రి కుమారునికి ఉపదేశిస్తున్నారు.

**"ఈ జగత్తుకు హృదయమే గాయత్రి"**... అని సూచిస్తూ తండ్రి **గురువై కుమారునికి సమర్పించుచున్నారు.** కుమారుడు ఇంద్రియ విషయములలో పడిపోకుండా ఉండాలని, ఆ గాయత్రీ మంత్రోపాసనచే **వాస్తవ – సహజ ఆనంద** రూపమగు, ఆత్మతత్త్వము వైపుగా **సాధన రూప సంసిద్ధతకు** ఉపక్రమించాలని **'గాయత్రి ఉపదేశరూప ద్విజత్వము'**ను కుమారునికి మార్గముగా చూపుచున్నారు.

సావిత్రీ ఉపదేశము పొందిన బాలునియొక్క ప్రాణము రక్షిస్తుంది కాబట్టి 'గాయత్రి'గా ప్రసిద్ధి పొందినది. (గాతయత్ త్రాయాతే)।

## గాయత్రి → పరమార్థోపాసన – వాక్ ప్రకటన అనుష్టుప్ ఛందస్సు

అనేకులు (వేరువేరు వేదశాఖలకు చెందిన వారు) సావిత్రీ మంత్రమును "అనుష్టుప్ ఛందస్సులో మాత్రమే ఉచ్చరించాలి" అనే నియమములను అనుబంధంగా చెప్పుతూ ఉంటారు.

"ఈ సావిత్రీ–సవితృదేవతా మంత్రము అనుష్టుప్ ఛందస్సు నుండి ఉద్భవించింది. అందుచేత అనుష్టుప్ ఛందస్సు కలదానిగా గాయత్రీ మంత్రమును వటువుకు ఉపదేశిస్తున్నాము" – అని వారు అంటూ ఉంటారు. **(సరస్వతీభ్యాం నమః)**

గాయత్రియే పరబ్రహ్మము. పరబ్రహ్మమునుండే వాక్కు. వాక్కు నుండి అనుష్టుప్ ఛందస్సు.. కనుక వాక్కే అనుష్టుప్। వాక్కే సరస్వతి। అందుచేత వాగ్రూపమగు సరస్వతిని వటువుకు గాయత్రీ మంత్రరూపంగా ఉపదేశిస్తున్నారు.

**"సరస్వతి నుండి వాక్కు రాలేదు. మరి? వాక్కే సరస్వతి. 'గాయత్రి' నుండి మంత్రము రాలేదు. మంత్రమే గాయత్రి.**

**ప్రాణమే గాయత్రి। గాయత్రీ ఛందస్సులో 'సావిత్రి'ని ఉపదేశించాలి"** – అని కొందరు పెద్దలు సూచన।

**ప్రాణమే వాక్కు, తదితర ఇంద్రియములు కూడా।**

– 'అనుష్టుప్' మాత్రమే అయితే కేవలము వాక్కును మాత్రమే ఉపదేశించినట్లు అవుతుంది.

– **"వాక్కే అనుష్టుప్। వాక్కే ప్రాణము। ప్రాణమే పరబ్రహ్మము।" అని ఉపదేశించటము** – పరమార్థబోధ అవుతుంది.

గాయత్రి యొక్క (మనము ఈ గాయత్రీ బ్రాహ్మణములో చెప్పుకొన్న) 4 పాదముల పరమార్థము తెలిసి ఉపాసించటము ఉచితము. కేవలము వాక్కుకు మాత్రమే పరిమితమైతే (వాక్కు కొరకే వాక్కు అయితే) 4వ వంతు ఫలము మాత్రమే అవుతుంది. గాయత్రియే వాక్కు। గాయత్రి కొరకై వాక్కు। **వాక్కును గాయత్రిగా, అనుష్టుప్‌గా భావించి ఉపాసించుచున్నప్పుడు ప్రతిగ్రహ దోషము ఉండదు.**

→ ఒకచోట అధికంగా ప్రతిగ్రహంచేసినా కూడా (లౌకిక ప్రయోజనములు ఉద్దేశ్యించినా కూడా). గాయత్రీ మంత్రమునే ఆత్మవైభవముగా (గాయత్రీ రూపంగా) ఉపాసించువానిని ఏదైనా స్వీకరించినట్టి ప్రతిగ్రహణదోషము అంటదు. (Even the receiving of worldly considerations will not polute such receipient).

**గాయత్రీ మంత్రమును ఆత్మోపాసనా ఉపాసించాలేగాని 'అన్యదేవతా ఉపాసన'గా సరిపెట్టుకోకూడదు.** 'సర్వము గాయత్రీ స్వరూపమే' అని భావించువానికి దోషము లేవీ అంటవు. గాయత్రీ ఉపాసకుడు గోవులు – గుర్రములు – ఏనుగులు మొదలైన అనేక సంపదలతో కూడిన '3' లోకములను ప్రతిగ్రహణము చేసినా కూడా, ఆ దోషము.. 'గాయత్రి' ఉపాసనలోని మొదటి పాదము (ఓం భూర్భువ సువః).. తో తొలగిపోతుంది. ఇంక త్రిలోకములు – త్రిప్రాణములు – తురీయముల రూపమగు '2' '3''4' పాదముల ప్రయోజనము మందు ప్రతి గ్రహణ దోషము ఉండదు – అని వేరే చెప్పనఖర్లేదుగా!

→ **గాయత్రి యొక్క మొదటి పాదము – "ఓం భూర్భువస్సువః"**

త్రిలోకములను తన యందు సంయమనము చేసి, ఆ సాధకుడు (లేక) ఉపాసకుడు త్రిలోకములను జయించి వేయుచున్నాడు. తన ఆత్మనే త్రిలోక రూపచమత్కారముగా దర్శించటము జరుగుతోంది. తానే భూర్భువస్సువః (Matter, thought, Divine Self) స్వరూపుడై, సమస్తము తానే అయి ప్రకాశమానుడగుచున్నాడు.

→ **గాయత్రి యొక్క రెండవ పాదముచే "తత్ సవితుర్వరేణ్యం"**

వేద విద్యచే నేర్చినది, ప్రతిగ్రహణము చేసినది, (లేక) త్రివేదసారము ఈ రెండవ పాదము నందు వ్యాపించినదగుచున్నది. జాగ్రత్ –స్వప్న–సుషుప్తులలో తెలియబడేదంతా తానే అగుచున్నది.

→ **గాయత్రి యొక్క మూడవ పాదము – భర్గో దేవస్య ధీమహి**

ప్రాణికోటి ఎంతవరకు కలదో, అదంతా స్వీకరించబడినది అగుచున్నది. **సమస్త ప్రాణికోట్లు తనయొక్క క్రీడా వినోద స్వస్వరూప సంవిస్తరణముగా ఆస్వాదించబడగలదు.**

గాయత్రీ ఉపాసకుడు '3' పాదములతో సమానమైన ప్రతిగ్రహణము చేసినా కూడా,... ఆ దోషము.. "గాయత్రీ మంత్ర పవిత్రత" ముందు → **అత్యంత స్వల్పము.** ఎందుకంటే, సమస్తము ఆతనికి, సమస్తమునకు ఆతడు – పరమ ప్రేమాస్పదము అగుచున్నాయి. ఆతని పట్ల గ్రాహ్య–త్యజ్యములు 'లేనివే' అగుచున్నాయి.

→ **నాలుగవ పాదము : – ధియో యో నః ప్రచోదయాత్।**

తపించుచున్న సూర్యమండలమే తురీయ పాదము. ఈ పాదమే పరోరజస్సు. "సమస్త జీవులు, సమస్త లోకములు స్వకీయ తేజో కిరణ రూపములే" – అను అనుభూతిని ప్రసాదించగలదు. ("నేనే సూర్యుడు. సమస్త జీవులు నా కిరణములు"–అను భావన).

## ఉపస్థానము – ఉపాసనతో కూడిన నమస్కారము

ఓ గాయత్రీ మంత్ర దేవతా! గాయత్రీ త్రిలోక జననీ! వేదమాతా! నన్ను జనింపజేసిన తల్లీ!

అమ్మా! జగదంబికే! జగత్ మాతృకే! నీవు సర్వము ప్రసాదించగా, ఇదంతా పొందుచున్న నిన్ను సమీపించి నమస్కరిస్తున్నాను!

**"న (పరమ్) మ (ఇహమ్) సత్"** కార స్వరూపిణీ!

ఇదిగో ఈ నా స్తోత్రము స్వీకరించవమ్మా!

**హే గాయత్ర్యసి!** ఈ సర్వమును నాకొరకై 'రక్షణ' రూపమును దాల్చి నన్ను అనుక్షణం రక్షిస్తున్నది నీవే అయిఉన్నావమ్మా।

**భవసి త్రైలోక్య పాదేన ఏకపదీ! :** ఈ భూ–భువర్ – సువర్ (భూమి – ఆకాశము – స్వర్గము) –లోకములు నీ యొక్క (నాలుగిటిలో) మొదటి పాదము! హే త్రిలోకేశ్వరీ! త్రిలోకములలోని అన్నము (అనుభవించబడునది), జీవులు, దేవతలు, సృష్టికర్త.. మొదలైన వాటితో కూడిన నీ ఈ త్రిలోక స్వరూప పాదమునకు త్రి–ప్రదక్షిణ పూర్వక సాష్టాంగ దండప్రాణామములు। ఓ త్రయీ లోకమాతా! నమస్తే!

**ద్విపదీ! త్రయీ విద్యారూపేణ ద్వితీయేన ద్విపదీ।** ఋక్ యజుర్ సామవేదముల రూపములు నీ రెండవ పాదము. త్రివేదములలోని ఋక్కులు, మంత్రములు, స్తోత్రములు, స్తుతించబడు దేవతలు, యజ్ఞకర్త, యజ్ఞవిధులు, యజ్ఞఫలములు, ఉపనిషత్తులు ఇవన్నీ ఈ నీ **రెండవ పాదము** యొక్క అలంకార విశేషాలే। మూడు వేదములు నీ రెండవ పాదముతో → **"తెలుసుకోవలసినది తెలుసుకోలేక మ్రగ్గుచున్న" మాకు** – తెలియజేయు గురువు, శాస్త్రము, యాజ్ఞీక రూపిణివై → సముద్ధరించుచూ ఉన్నావు. ఓ వేద ప్రసాదినీ! వేదరూపిణీ! వేదమ్ (తెలియబడు సమస్తము) నీవే అయి ఉన్న శ్రీమాతా! ("తామ్" ఇతి మాతా! నన్ను నన్నుగా తీర్చిదిద్దునది అగుటచే) మమ మాతా! వేదముల ద్వారా నిన్ను మాకు తెలియజేయు వేద – వేదాంతర్గత వేదమాతా! నమస్తే! ఇహ–పరములను ఏకరూపంగా చేస్తూ రెండు చేతులు జోడించి నమస్కరిస్తున్నాము. రెండు అరచేతులు నీ త్రివేదస్వరూప రెండవ పాదమును భక్త్యావేశములో తాకించి ఉంచి, ఆ తరువాత రెండు చేతులతో మా రెండు కళ్ళకు హత్తుకుంటున్నామమ్మా! **త్రయీ వేదమాతా! నమస్తే!**

**త్రిపదీ! భవసి ప్రాణాదినా తృతీయేన త్రిపదీ!** ప్రాణ శక్తిగా నా యీ దేహమునందు, ఈ దృశ్యలోకములందు కూడా ప్రవేశించి **ఉనికిని, అనుభూతిని** ప్రసాదిస్తున్న ఓ ప్రాణేశ్వరీ! ప్రాణ–అపాన – వ్యానములను మూడవ పాదముగా కలిగియున్న మమ ప్రాణమా! **ఊపిరి, శక్తి, అరుగుదల, రసము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు... ఇవన్నీ నీ మూడవపాదము.** నాయందు ప్రాణ స్వరూపిణివై దేహ–దేహాంతరములుగా నన్ను రక్షిస్తూ ప్రియము కలిగిస్తున్నావు. నా ప్రాణము, ఊపిరి నీవే! అట్టి మమత్రయీ! మాతా! ప్రాణస్వరూప స్వరూపిణివగునీకు – మా యీ పంచప్రాణములు జోడించి నీ మూడవ సప్రాణస్వరూప పాదమునకు – **శిరోఫాలభాగ స్పృశతో** కూడి నమస్కరిస్తున్నాను! ***త్రయీ ప్రాణమాతా! నమస్తే!***

**చతుర్థేన తురీయేణ చతుష్పదీ అసి।** నాలుగవ పాదము తురీయము. సూర్యమండలములో అంతర్గతమైయున్న **కేవల –కేవలతేజో కేవలఓజో** స్వరూపిణివయి ప్రకాశించుచున్న నీ నాలుగవ పాదమునకు భక్తి–జ్ఞాన – వైరాగ్య– యోగపూర్వక నమస్కారములు!

**ఏవం చతుర్ధే పాదౌ ఉపాసకైః → పద్యసే! జ్ఞాయసే!** ఈ విధంగా నిన్ను నాలుగు పాదములు కలదానివిగా ఉపాసకులమగు మేము నిన్ను ఉపాసిస్తున్నాము. **"సమస్తము నీవే"** అని ఎరుగుచున్నాము.

*ఇంతేనా.. అంటే.. ఇంత మాత్రమే కాదు!*

**నహి పద్యసే!** నాయందు, సమస్త జీవులయందు, సమస్త లోకములందు తురీయ స్వరూపిణివై ప్రకాశించునీవు – అన్నిటికీ ఆవల నిరుపాధిక స్వరూపిణివై, (ఉపాధి అనునదే లేనిదానివై...), అపరిమితమై వెలుగొందుచున్నావు. నిరుపాధివై ఉండగా నీవు ఎవ్వరికీ తెలియబడటము లేదు. తెలుసుకొనటానికి బయల్వెడలిన నేను – నీ యొక్క 4 పాదములు ఉపాసిస్తూ ఉండగా... నాలో – తెలుసుకొనువాడు నీవే అయి ఉండటముచేత, **ఇక *తెలుసుకొనువాడినైన నేను వేరుగా లేకుండాపోతున్నాను. నీ తురీయమునందు ద్రష్ట – దర్శన– దృశ్యములు ఏకీభూతమై యుండగా, తెలుసుకొనుచున్న నీవే నేనై ఉండగా.. ఇక తెలియబడటమెక్కడ? ఏది? తెలుసుకొనువాడెక్కడున్నాడు***?

అందుచేతనే – అందరిలోని "తెలుసుకొనుచున్నదే" నీవు అయి ఉండగా ఎలా తెలియబడతావు?

మీ మొదటి '3'పాదములు అంతటా విస్తరించి ఉండగా,... ఈ తురీయ పాదము ఎటువైపుకూ విస్తరించటము లేదు. కానీ శ్రుతులు నీ గురించి "అంతటా త్రిలోకములలోను, త్రివేదములలోను, త్రిప్రాణములుగాను విస్తరించి ఉన్నావు".. అని కల్పించి స్తోత్రము చేస్తున్నాయి! అంతా కూడా, అన్నీ కూడా నీవే అయి ఉండగా – ఇక వేరుగా విస్తరించటమెక్కడిది? ఎచ్చటికి?

**తురీయాతీతము – అపాదము:** నాలుగు పాదములులకు ఆవల నీ స్వరూపము ఉపాధి రహితము. సర్వ వ్యవహారములకు అతీతము. కనుక 'అపాదము' అయి ఉన్నావు. "నేతి। నేతి। ఇది కాదు – ఇది కాదు" అని, "ఇంద్రియ – ఇంద్రియ విషయ– దేహ–మనో–బుద్ధి– చిత్త–అహంకారములను".. నిషేధిస్తూ పోగా,... దేనిని "ఇది నేను కాదు".. అని నిషేధించలేమో, అట్టి **అహమ్–ఆత్మస్వరూపిణివే నీవు**. అందుచేత నాలుగు పాదములు గల నీకు పాదమే లేదు" అను మాట కూడా యుక్తి – యుక్తమే కదా మాతా! మమాత్మవే నీవు.

**యస్మాత్ నహి పర్యతే నేతి నేతి – ఆత్మత్వాత్!** సర్వము నిషేధించగా అప్పటికీ శేషించే నా ఆత్మవే నీవు సుమా!

- సర్వజీవుల మనస్సులకు ఉత్పత్తి స్థానము నీవే। అందుచేత (యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ)..మనస్సుకు కూడా లభించవు. మనస్సుచే తెలియబడవు. **అయితే, మననమునకు ఆవల మననశీలివి నీవే।**
- వ్యవహారములకు విషయము కావు.
- ప్రమాణములచే గోచరించుదానవు కావు.

'నేను'గా శేషించియున్నది నీవే! సోఽహమ్! తత్ త్వమ్! త్వమేవాహమ్।

లోకములకు అతీతమగు నిన్ను ప్రేరణగా, తేజోరూపముగా, సూర్యమండల పరమ పురుషునిగా యోగులు (ఉపాసకులు) దర్శించుచున్నారు.

అట్టి తురీయ – తురీయాతీత స్వరూపిణివగు నీ పాదపద్మములు చేరుచున్న మార్గములోని కామ–క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్య.. (అరిషట్) శత్రువులు విఫలమై ప్రక్కకు తొలగుదురుగాక.

గాయత్రీ జగజ్జననీ! లోకమాతా! సకల రక్షణీ! ప్రాణ స్వరూపిణీ! మమాత్మా సోఽహమ్ స్వరూపిణీ!

**నమో నమో నమో నమః॥**

ఈ విధంగా (గాయత్రీ మంత్రోపాసనా అనంతరము)–

గాయత్రీ ఉపస్థానమును పఠిస్తూ, బుద్ధితో హృదయమునందు గాయత్రీ రూప పరమాత్మయొక్క తత్త్వమును 'ఉపస్థానము' చేయుదుముగాక! (**ఉపస్థానము** = చేరిక. వాస స్థానము. పొందటము. ఉపాసన. సేవించటము. స్మరణ).

ఇప్పుడు ఇక సందర్భానుచితముగా విదేహరాజ–అశ్వతరాశ్వపుత్రుల మధ్య జరిగిన ఒకానొక సంభాషణను ఇక్కడ చెప్పుకొంటున్నాము.

**జనక మహారాజు:** హే అశ్వతరాశ్వని కుమారుడా! బుడిల యోగీ! మీరు గాయత్రీ ఉపాసకులుగా లోక ప్రసిద్ధులు కదా! గాయత్రీ మంత్రోపాసనా ఫలము ఏమిటో వివరించ ప్రార్థన!

**బుడిలముని :** ఏమని చెప్పాలి? గాయత్రీ ఉపాసనచే ధన–ధాన్య–గృహ.. ఇత్యాది సంపదలన్నీ అడుగకుండానే స్వయముగా మంత్రదేవత ప్రసాదించుచున్నది.

**జనక మహారాజు :** స్వామీ! మీరు గాయత్రీ మహిమను తెలుసుకొంటినని చెప్పుచున్నారు. ఇంతలోనే లౌకిక ప్రయోజనముల గురించి చెప్పుచున్నారే? మీరు **"గాయత్రీ ఉపాసన"**చే **"గాయత్రీ చతుష్పాదస్వరూప–తురీయాతీతతత్త్వము"**ను తెలుసుకొని ఉండి కూడా,... రెండు హస్తములతో ప్రతిగ్రహము (దానము స్వీకరించుట) నిర్వర్తించటమనేది ఎట్లా భరిస్తున్నారు? గాయత్రీ అనుగ్రహ సిద్ధులై ఉండి కూడా "ప్రతిగ్రహణ దోషము" (దానము అడిగి తీసుకొనుట) అను దానిని – ఏనుగు అయి బరువును మోయటము వలె – ఎట్లా సహిస్తున్నారు?

**బుడిల ముని :** ఓహో! అదియా మీ ప్రశ్న?.. గాయత్రీ ఉపాసకుడినై ఉండి, గాయత్రీ చతష్పాదములను ఆశ్రయించి కూడా మీ వద్ద 'దానము' పుచ్చుకొనుటము దోషము కదా – అని అడుగుచున్నారా? అయితే నా సమాధానము వినండి!

నేను గాయత్రీ ఉపాసకుడిని. ఆ తల్లి నాలుగు పాదములను సేవించువాడను. అయితే సర్వాత్మ స్వరూపిణి – సర్వతత్త్వ స్వరూపిణి అగు గాయత్రీ ముఖదర్శనము ఇంకనూ నేను చేయవలసియే ఉన్నది.

అయితే కూడా, గాయత్రీ ఉపాసన విషయమై ఒక విషయం మీ దృష్టికి తెస్తూ, మీ ముందు ఉంచుచున్నాను. అందువల్లనే ప్రతిగ్రహదోష పాపమును సహించుచున్నాను. ఒక దృష్టాంతము. ఒకచోట చాలా ఎండుకట్టెలను పెద్దప్రోగుగాచేసి కాల్చుచున్నారనుకోండి. ఒకానొకడు తన దగ్గర గల పచ్చికట్టెలను ఆ అగ్నిలో వేశాడనుకోండి. అప్పుడు ఆ పచ్చి కట్టెలు కూడా ఎండుకట్టెలతో బాటే కాలి బూడిద అవుతాయి కదా!

అట్లాగే...,

అగ్నియే ముఖముగా కలిగియున్నట్టి 'గాయత్రి' యొక్క తత్త్వమేమిటో, (ఆత్మోపాసన–ఆత్మతత్త్వోపాసన) ఎట్టిదో ఎరిగియున్న తరువాత, –అట్టివాడు చేయునట్టి **ప్రతిగ్రహరూపమగు (దానము స్వీకరించిన) దోషములను** (పచ్చికట్టెలను కాల్చినట్లు) – గాయత్రీ మంత్ర యోగాగ్ని దహించివేయగలదు.

గాయత్రీ ఉపాసకుడు గాయత్రీ స్వరూపుడై పరిశుద్ధుడగుచున్నాడు.

- పవిత్రుడగుచున్నాడు.
- జరామరణ పరిధులను, పాప–పుణ్య ఫలద్వంద్వములను అధిగమించినవాడగుచున్నాడు.
- అమృత స్వరూపుడై ప్రకాశించుచున్నాడు.

**జనక చక్రవర్తి ఈ సమాధానమును విని తృప్తిని పొందారు.**

**ఇతి బృహదారణ్యకోపనిషత్**

**సప్తమాధ్యాయ – అంతర్గత**

***'గాయత్రీ బ్రాహ్మణమ్' నామ చతుర్దశ బ్రాహ్మణమ్॥***

## సప్తమ అధ్యాయము
## పంచదశ బ్రాహ్మణము
# 15. సూర్యాగ్ని ప్రార్థనా బ్రాహ్మణము

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్య అపిహితం ముఖమ్।**

హే సూర్యభగవాన్!

మీ యొక్క **'తేజో మండలము'**లో "హిరణ్మయ పాత్ర" చేత **"సత్యము" "బ్రహ్మము"** అను మీ ముఖము కప్పబడియున్నది. ఒక పాత్రలో మధుర పదార్థము ఇష్టమైన వస్తువు దాచినప్పుడు పిల్లవాడు ఆ మధుర పదార్థము కొరకై 'మూత తీసి ఇవ్వండి'... అని తండ్రిని అడిగినట్లు మేము మిమ్ములను బ్రతిమిలాడుచున్నాము.

ఆదిత్య మండలముచే కప్పివేయబడినట్లుగా ఉండగా, చిత్త చాంచల్యము కారణంగా చిత్త సమాధానము పొందని కారణంగా అత్యంత మధురమగు **'ఆత్మ సత్యము'**ను మేము (మూతను తీసి) –పొందలేకపోవుచున్నాము.

ఓ పూష దేవా! సర్వ జీవులను పరిపోషించు దేవాదిదేవా? ఆదిత్య దేవా! మీరు ఆ ఆత్మానుభవమునకు (సోఽహమ్ భావనకు) అచ్ఛాదకములను, ప్రతిబంధకములను తొలగించండి. ఆత్మసాక్షాత్కారమునకు వెళ్లుచూ కూడా, మేము అజ్ఞానముచే కల్పించుకొనే అజ్ఞానరూపమైన అవరోధములను దయతో నివారించండి. సత్య–ధర్మములచే మీ ఆత్మకు మేమంతా అద్వితీయులము కదా! జలబిందువులను కలిగి ఉన్నట్టి ఆత్మానందసాగరంలో జీవాత్మ జలబిందువగు మేమంతాకూడా సత్య–ధర్మ స్వరూపులమే. మేమంతా జలములో జలబిందువులవలె మీ మహిమయందు అంతర్గత స్వరూపులం.

హే జగత్ ఆధారుడా! జగత్ పోషకుడా! జగత్ రక్షకా। ఆకాశము నందు ఒంటరివై సంచరించుచున్న ఋషి పుంగవా!

ఏకఋషీశ్వరా! ఆత్మ ఏకస్వరూపమైన తీరుగా 'పరబ్రహ్మాకాశము' వంటి ఆకాశము నందు ఏక ఋషి స్వరూపులై, (ఋత్= సత్యము) సత్యస్వరూపులై సంచారము చేస్తున్న భగవాన్! సవితృదేవా। (సత్+విత్+ ఋత్ దేవా!)। జగత్తును నియమించువాడవగుటచే వేదమంత్రములచే 'ఏకర్షి' అని పిలువబడుచున్న స్వామీ!

మీరు యముడుగా సర్వమును నియమించువారు కూడా।

– జగత్తు యొక్క జలరసములను, తేజో కిరణములను, జీవుల బుద్ధులను ప్రేరేపించువారు – అగుటచే **సూర్యదేవుడు** అని పిలువబడుచున్నారు.

హే సూర్యభగవాన్!

సమష్టి ప్రాణ స్వరూపుడవగు 'ప్రజాపతి' అను సృష్టికి మూలపురుషుని (సగుణబ్రహ్మ యొక్క) ప్రత్యక్ష రూపమా!

ప్రత్యక్ష నారాయణా! మేము మిమ్ములను ఆత్మసాక్షాత్కార నిమిత్తమై ఆశ్రయిస్తున్నాము. ఓ ప్రజాపత్యా! మీ కిరణముల అడ్డు తొలగించండి. మీ తేజస్సు యొక్క ఉష్ణత్వమును తొలగించండి. మీ యొక్క ప్రసాదముగా, మీ **"కల్యాణతమము – పరమ శుభప్రదము"** అగు స్వరూపమును నేను ఇప్పుడు చూచుచున్నాము.

**"భూ భువః సువః.."** అను వ్యాహృతుల రూపమున వెలుగొందు దివ్య చైతన్య పురుషుడవగు మీకు చెందినవారమే మేము। మీకు చెందిన వారమగుటచే మేము కూడా మీ వలెనే అమృతతుల్యులమే।

ఈ నా ప్రాణము విశ్వప్రాణమునకు, **ఈ ఇంద్రియములు – ఆయా అధిష్ఠాన దేవతలకు చెందినవై ఉండును గాక।** ఈ దేహము అగ్నిదేవునిచే భస్మము చేయబడును గాక। భూమి యందు భస్మమై కలియబోవును గాక।

ఓ అగ్నిదేవా! మాయొక్క భ్రమ, అజ్ఞానములచే ఏర్పడు దేహాత్మ భావమును దయచేసి భస్మము చేయండి.

ఓ జాతవేదా! తేజో స్వరూపా!

మా మీద కరుణతో మా యొక్క ఉపాసనా సంబంధమైన సమస్త పుణ్య కర్మలను తమరే స్వీకరించండి. మీరు మమ్ములను గుర్తుపెట్టుకోండి. మేము చేసిన ఉపాసన -స్తోత్ర-అగ్ని కార్యములను తీసుకొని నన్ను ఉత్తమ మార్గమున నడిపించండి! హే అగ్నిదేవా! దేవాదిదేవా! మీరు అన్నీ ఎరిగినవారు.

ఓ విశ్వదేవతలారా! మమ్ములను కాంతివంతమగు ఉత్తమ మార్గములో నడిపించి, ఆత్మతత్త్వము వైపుగా అడుగులు వేయించండి.

ఓ అగ్నిదేవా! ఇదిగో! మేము దేహ - ఇంద్రియ - మనో- బుద్ధి - చిత్త - అహంకారములనే ఉపకరణములతో చేస్తున్న సమస్త కర్మలు "స్వాహా" అంటూ సమర్పిస్తున్నాము.

మాలోని కుటిలత్వము, పాపదృష్టులు భస్మము చేసి, మా హృదయములను పవిత్రముగా తీర్చిదిద్దండి. ఆత్మదేవుని ప్రతిక్షేపించండి.

మీకు హృదయపూర్వకముగా నమస్కరించుచున్నాము. ఇంతకుమించి గొప్ప గొప్ప కర్మలతో సేవ చేయు సామర్థ్యము లేనివారము.

ఓ ఆదిత్య భగవాన్! సవిత్రు దేవాదిదేవా! **యుయోధ్యస్మః జుహరాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ।**

మా ఈ హృదయపూర్వక నమస్కారము స్వీకరించి అంధకారము నుండి ఆత్మజ్యోతి వైపుగా ప్రయాణించుటకు మాకు తల్లి, తండ్రి, గురువు అయ్యెదరుగాక। మార్గాన్వేషకులగు మాకు సర్వదా మార్గదర్శకులై ఉండెదరుగాక।

**మీ గురించి నమస్కార వాక్కులతో మరల మరల ప్రార్థిస్తున్నాము.**

*ఇతి బృహదారణ్యకోపనిషత్-సప్తమోధ్యాయాంతర్గత*

*'సూర్యాగ్ని ప్రార్థనా బ్రాహ్మణమ్' నామ పంచదశ బ్రాహ్మణమ్।*

## ఇతి-సప్తమోధ్యాయం సమాప్తమ్।।

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## అష్టమ అధ్యాయః

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఓం। యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద,
జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి।

ఎవ్వడైతే అల్పమైన దృశ్య-ఇంద్రియ సంబంధిత విషయాలన్నీ దాటివేసి, **'జ్యేష్ఠమైనది - శ్రేష్ఠమైనది'** అగుదానినే ఉపాసిస్తాడో అట్టివాడు తనకు తానే తనవారందరిలో జ్యేష్ఠుడు - శ్రేష్ఠుడు...అగుచున్నాడు.

## అష్టమాధ్యాయః - ప్రధమం బ్రాహ్మణము

### ప్రాణ సంవాద బ్రాహ్మణము

1 ఓం। యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద,
జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి।
ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ।
జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి–
అపి చ యేషాం బుభూషతి,
య ఏవం వేద।

ఎవ్వడైతే చిన్నచిన్నవి - అప్రాముఖ్యమైనవి అగువాటిని ప్రక్కకు నెట్టుకుంటూ, **'జ్యేష్ఠమైనది - శ్రేష్ఠమైనది'** అగుదానినే ఉపాసిస్తాడో, అట్టివాడు అందరిలో జ్యేష్ఠుడు - శ్రేష్ఠుడు...అగుచున్నాడు. మరి ఈ దేహములో అత్యంత శ్రేష్ఠమైన-జ్యేష్ఠమైనది ఏది? చూపా? వినికిడియా? మనసా? కాదు. **'ప్రాణమే' అత్యంత శ్రేష్ఠము - జ్యేష్ఠము.** అట్టి జ్యేష్ఠము - శ్రేష్ఠము అగు ప్రాణమును ఉపాసించువాడు తనవారందరిలో జ్యేష్ఠుడు - శ్రేష్ఠుడు అగుచున్నాడు. అంతేకాదు-

- ప్రాణము యొక్క జ్యేష్ఠత్వము, శ్రేష్ఠము ఎరిగినప్పుడు అట్టివాడు తదితరులైనవారందరిలో కూడా జ్యేష్ఠుడు - శ్రేష్ఠుడుగా పూజింప బడుచున్నాడు. (ప్రాణాయామోపాసకులకు అట్టి ఉత్తమ ఫలము కలుగగలదని సూచించబడుతోంది).

---

2 యో హ వై వసిష్ఠాం వేద,
వసిష్ఠః స్వానాం భవతి।
వాగ్వై వసిష్ఠా। వసిష్ఠస్వానాం భవతి।
అపి చ యేషాం బుభూషతి, య ఏవం వేద।

ఈ విశ్వములో వసిష్ఠమైన (The Highest) వస్తువు ఏదై ఉన్నదో తెలుసుకొని వాక్కుతో ఉపాసించువాడు **వసిష్ఠత** (High Importance) యందు ప్రతిష్ఠితుడై ఉండగలడు!

**"వాక్" యే వసిష్ఠమైనది"।**

ఎవ్వడు - **"వాక్ వసిష్ఠమైనది"** అని భావించి, ఎరుక కలిగి ఉంటాడో, అట్టివాడు తనవారియందు, తదితరులయందు, తాను కోరుకొను వారియందు వాక్కుచే అత్యంత ప్రాముఖ్యమును, నిర్భయత్వమును పొందుచూ మాటలాడుటలో శ్రేష్ఠుడు, ప్రవక్త అగుచున్నాడు! **(నాదోపాసన = సమస్త సహజీవులనుండి వినిపించే మాటలను బ్రహ్మముయొక్క శబ్దతత్త్వముగా ఉపాసించటము).**

## చూపు - ప్రతిష్ఠ

3 యో హ వై ప్రతిష్ఠాం వేద ప్రతితిష్ఠతి।
సమే ప్రతితిష్ఠతి దుర్గే।
చక్షుర్వై ప్రతిష్ఠా, చక్షుషా హి
సమే చ దుర్గే చ ప్రతితిష్ఠతి।
సమే ప్రతితిష్ఠతి(సమే), ప్రతితిష్ఠతి దుర్గే చ-
య ఏవం వేద।

ఈ జగత్తులో (లేక), ఈ విశ్వములో (లేక), ఈ దృశ్యములో అత్యంత ప్రతిష్ఠమైనది ఏదో గ్రహించి ఉపాసించువాడు 'ప్రతిష్ఠ'ను పొందుచున్నాడు. 'దుర్గము' (రక్షణ)యందు ప్రతితిష్ఠుడు అగుచున్నాడు.

చూపు-కళ్లు - ఇవే అత్యంత ప్రతిష్ఠమైనవి.

నేత్రము (చూపు), యొక్క 'ఉపయోగించటము' చేతనే...,

- సమృద్ధిగల దేశ కాలములందు,
- విషమ దేశకాలములందు (దుర్భిక్ష కాలమునందు)

ఈ జీవుడు ప్రతిష్ఠ కలిగియుంటున్నాడు.

కనబడే సమస్తము (కనబడేదంతా) కంటియందే ప్రతిష్ఠతమైనది. ఎవడు **"చూపునందే (దృష్టియందే) కనబడేదంతా ప్రతితిష్ఠితమైనది"** - అని గమనించినవాడై, ఈ దృశ్య జగత్తును ఉపాసిస్తూ ఉన్నాడో, అట్టివాడు సమ దేశ కాలములందు, విషమ దేశకాలములందు కూడా (సానుకూల్య ప్రతికూల్య స్థితులందుకూడా) తన చూపునందు తానే సుప్రతిష్ఠతుడై ఉంటున్నాడు. ఈ సర్వమును తన 'చూపుశక్తి'లోని అంతర్విభాగ చమత్కారముగా సందర్శనము చేయుచున్నాడు. **(ఎందుకంటే దృష్టియే సృష్టి కాబట్టి).**

---

## వినికిడి-సంపద।

4 యో హ వై సంపదం వేద,
సగ్ం హాస్మై పద్యతే యం కామం, కామయతే।
శ్రోత్రం వై సమ్పత్।
శ్రోత్రే హీ మే సర్వే వేదా అభిసమ్పన్నాః।
సగ్ం హాస్మై పద్యతే
యం కామం కామయతే, య ఏవం వేద॥

ఎవ్వడైతే - "ఉత్తమమైన (నిజమైన) సంపద ఏది?" అని తెలుసుకొని ఉపాసిస్తాడో,....అట్టివాడు ఆ ఉత్తమమైన, నిజమైన సంపదను, తద్వారా సుఖ-శాంతులను పొందుచున్నాడు. అట్టి వాస్తవమగు సుఖప్రదాతయగు సంపద ఏది?

**-శ్రోత్రేంద్రియము (చెవి వినికిడి)యే అట్టి ఉత్తమ సంపద.**

- ఈ శ్రోత్రేంద్రియము ద్వారానే సమస్త వేదములు తెలియబడుచున్నాయి. తెలియబడే సమస్తము సుసంపన్నము అగుచున్నది.

కనుక ఎవడు **"శ్రోత్రేంద్రియమే (వినబడేదంతా) నాకు సమస్త సంపదా రూపముగా అగుచున్నది కదా!"**....అని ఉపాసిస్తాడో, అట్టివాడు తాను కోరుకున్న ఫలమును పొందుచున్నాడు. దృశ్య జగత్తును ఆత్మానందముగా ఆస్వాదించు సామర్థ్యము పొందగలడు.

---

## మనస్సు-ఆయతనము।

5 యో హ వా ఆయతనం వేద,
ఆయతనగ్ం స్వానాం భవతి।
ఆయతనం జనానాం
మనో వా ఆయతనం।
ఆయతనగ్ం స్వానాం భవతి।
ఆయతనం జనానాం, య ఏవం వేద॥

ఎవ్వడు సరిఅయిన ఆయతనమును (విషయములు ఆశ్రయిస్తున్న దానిని) తెలుసుకొని ఉపాసిస్తాడో, అట్టివాడు తన స్వజనులకు ఆశ్రయము కలిగించువాడై, ఆశ్రితుడై ఆనందము కలుగజేయుచున్నాడు.

**"ఈ చూపు-వినికిడి-స్పర్శ-రస-గంధములు దేనిని ఆశ్రయించినవై ఉంటున్నాయి?"** అనునది పరిశీలిస్తే →

- **"ఇవన్నీ కూడా 'మనస్సు'ను ఆశ్రయించినవై ఉంటున్నాయి।"**....అని గమనించబడుచున్నది. **మనస్సే అన్నిటికీ ఆశ్రయమై ఉన్నది.**

(మననమే మనస్సు యొక్క రూపము).

**'మనస్సే సర్వమునకు ఆశ్రయము'** అని తెలుసుకొని మనో-కేవలీ స్వరూపమును ఉపాసించువాడు స్వజనులకు, జ్ఞాతులకు శ్రేయో-ఆశయుడై, **తాను కూడా వారికి సుఖమును ప్రసాదించువాడు అగుచున్నాడు.**

6 యో హ వై ప్రజాపతిం వేద,
ప్రజాయతే హ ప్రజాయా పశుభిః।
రేతో వై ప్రజాతిం (ప్రజాపతిః)। ప్రజాయతే,
హ ప్రజయా పశుభిః, య ఏవం వేద॥

## సృష్టి - సృష్టికర్త (ప్రజాపతి)

అనేక జీవజాతులతో కూడిన ఈ కనబడే జగత్తు ఎవ్వరి వలన ఉత్పత్తి అగుచున్నది? సమస్తమునకు సమష్టిగా సంకల్పించువాడు-సంకల్పముల కలయిక చేతనే ఈ అద్భుత సృష్టి ప్రదర్శనమగుచూ ప్రవర్తితము అవుతోంది. అట్టి ఈ సృష్టికి కర్త 'ప్రజాపతి' అని పిలువబడుచున్నారు. రేతస్సే ప్రజాపతి.

ఈ సృష్టికి కర్తయగు ప్రజాపతి (The Worker of the Universe) ని జనుల, జంతువుల జననమునకు కారణముగా గమనిస్తూ, ఎరుగుచూ, ఉపాసించువాడు సంతానమును, పశుసంపదను కావలసినంతగా పొంది, భాగ్యవంతుడై ఉంటున్నాడు.

---

7 తే హ ఇమే ప్రాణా అహగ్ం శ్రేయసే
వివదమానా బ్రహ్మ జగ్ముః।
తద్ధో (తత్ హ) ఊచుః : "కో నో వసిష్ఠ" - ఇతి?

**ఈ దేహ గృహంలో జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు ఎవరు?**

ఒకానొకప్పుడు ఈ ఇంద్రియములన్నీ కూడా ఒకచోట సమావేశమై "మేము గొప్ప (అంటే) మేము గొప్ప" అని వాదోపవాదములు చేసుకోసాగాయి. ఎవరు గొప్పో తేల్చుకోలేక ప్రజాపతి సమక్షానికి వెళ్ళి, **"అయ్యా! ఇంద్రియములన్నీ సృష్టించిన సృష్టికర్తా! ప్రజాపతీ! మా ఇంద్రియములన్నిటిలో శ్రేష్ఠమైనది ఏది? వసిష్ఠమైనదేది? మీరు తేల్చి చెప్పండి"**.... అని అడిగాయి.

---

**తగ్ం హోవాచ (బ్రహ్మోవాచ)। (తత్ హ ఉవాచ):**
**యస్మిన్ వ ఉత్క్రాన్త ఇదగ్ం శరీరం**
**పాపీ యో మన్యతే, స వో వసిష్ఠ ఇతి।**

అప్పుడు ప్రజాపతి ఇట్లా అన్నారు. "మీలో ఎవ్వరు శ్రేష్ఠము?" అనునది మీరే తెలుసుకోండి. అది ఎట్లా అంటారా? మీలో ఎవ్వరు ఈ భౌతిక దేహమునుండి తొలగగానే, ఈ భౌతికదేహము కుళ్ళిన మాంసమువలె తుచ్ఛమైనదని, దూరంగా పారవేయవలసినదని, దోషవస్తువని జనులు తలుస్తారో,.. ఆ ఇంద్రియమే వసిష్ఠము (శ్రేష్ఠము) అని మీరు భావించవచ్చు.

**"ఓహో! అట్లాగా!"**.... అని ఇంద్రియములు అనుకున్నాయి.

---

8 **'వాక్' ఘో(హో) ఉచ్చక్రామ।**
**సా సంవత్సరం ప్రోష్య। అగత్యో, వాచ :**
**"కథం అశకతమ్, అదృతే జీవితుం ఇతి?"**

మొట్టమొదట 'వాక్కు' ఈ దేహమునుండి బయటకు బయల్వెడలింది. ఒక సంవత్సరకాలము ఎటో వెళ్ళి, తిరిగి శరీరమును సమీపించింది. ఆ సంవత్సరము కాలము జీవుడు మాట్లాడనేలేకపోయాడు. వాక్కు పనిచేయనట్టి సంవత్సరకాలము కూడా దేహము శిథిలము కాలేదు. **వాక్‌దేవత - ఆశ్చర్యపోయింది.**

"ఓ తదితర చక్షువులు చెవులు, రుచి, రేతస్సు, కాళ్ళు - చేతులు, మొదలైన కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనో-దేవతలారా!

వాక్కు ఇంద్రియుడనగు నేను ఈ దేహమును విడచి ఒక సంవత్సరకాలం దూరంగా ఉన్నప్పటికీ ఈ శరీరము, మీరు ఎట్లా కలిసి ఉండి, జీవించియే ఉన్నారు? చెప్పండి''- అని అడిగింది.

---

**తే హ ఊచుః : (తదితర ఇంద్రియాణాం)।**
**యథా అకలా అవదన్తో, వాచా ప్రాణన్తః।**
**ప్రాణేన పశ్యన్తః చక్షుషా।**
**శృణ్వన్తః శ్రోత్రేణ।**
**విద్వాగ్ంసో మనసా।**
**ప్రజాయమానా రేతస।**
**ఏవం అజీవిష్మేతి।**

అప్పుడు మిగతా ఇంద్రియములు ఇట్లా సమాధానం ఇవ్వసాగాయి.

''ఓ వాక్ ఇంద్రియమా! ఇందులో ఆశ్చర్యం ఏమున్నది చెప్పండి! ఒకానొకడు పుట్టుమూగవాడు అయినా, (లేక) ఏదో వ్యాధి వలన గొంతు పోగొట్టుకొన్నప్పుడు (మూగవాడైనప్పుడు) కూడా జరుగుచున్నదేమిటి?

ప్రాణము-ప్రాణవ్యాపారము నిర్వర్తిస్తూ ఉండగా, (అట్టి మాట్లాడలేనిస్థితిలో ఉన్నవానిపట్ల) **కళ్ళు చూస్తూనే ఉంటాయి. చెవులు వింటూనే ఉంటాయి. నాలుక రుచి చూస్తూనే ఉంటుంది. చర్మము స్పర్శ కలిగి ఉంటూనే ఉంటుంది. మనస్సుతో మననపూర్వకంగా సుఖ-దుఃఖములు పొందుచూనే ఉన్నది. 'పునరుత్పత్తి రేతో దేవత' కొనసాగుచూనే ఉంటుంది కదా!**

| | |
|---|---|
| | అంతేగాని 'మూగవాడు' కదా అని, మిగతా ఇంద్రియాలు మూగపోవటము లేదు కదా! మనస్సు కూడా ఆగటం లేదు.<br>ఓ వాక్ ఇంద్రియదేవా! మీరు శరీరము విడచి ఒక సంవత్సరకాలము ఎటో బయటకు వెళ్ళగా, ఇప్పుడు జరుగుచున్నది కూడా అదే! వాక్కు మూగపోయినప్పటికీ, మిగతా ఇంద్రియములమగు మేము పనిచేస్తూనే ఉన్నాము. ఈ శరీరము క్రుళ్ళి నశించక, జీవితము కొనసాగుచూ వస్తోంది।" |
| <u>ప్రవివేశ హ వాక్।</u> | **"అనగా దేహములో నేను శ్రేష్ఠము కాదన్నమాట"- అని ఎరిగి, వాక్కు (కించిత్ సిగ్గుతో) తిరిగి దేహంలో ప్రవేశించింది.** |
| 9 చక్షుర్హ (చక్షుః హ) ఉచ్చక్రామ।<br>తత్ సంవత్సరం ప్రోష్య। | అప్పుడు **'చూపుశక్తి'** లేచి నిలబడింది. **"మా గొప్పతనం ఇక చూడండి! సర్వేంద్రియానాం నయనం ప్రధానం!....అని అందరికీ తెలుసుకదా! మేము ఈ దేహమును విడచి వెళ్ళుచున్నాము"**...అని ఎలుగెత్తి ప్రకటన చేస్తూ దేహమునుండి బయల్వెడలింది. అప్పుడిక జీవుడు ఏమీ చూడనే లేకపోయాడు. అట్లా సంవత్సరకాలం గడచింది. సంవత్సరకాలం తరువాత చూపు శరీరంలో మరల ప్రవేశించి చూడగా....కళ్ళు కనబడని ఆ సంవత్సరకాలము కూడా తదితర ఇంద్రియములు (వాక్కు - చెవులు - నాలుక - చర్మము - కాళ్లు - చేతులు - గుదము - రహస్యము మొదలైనవి) తమ తమ పనులు చేస్తూ ఇతః పూర్వంలాగా పనిచేస్తూ ఉండసాగాయి. దేహము క్రుళ్ళలేదు. శిధిలం కానేలేదు. |
| **<u>ఆగత్యో వాచ : (ఆగత్య ఉవాచ):</u>**<br>**కథం అశకతం అదృతే జీవితుం ఇతి?"** | అప్పుడు చూపు ఇట్లా అన్నది.<br>"ఓ తదితర ఇంద్రియములారా! మేము ఎటో వెళ్ళిపోయి ఉన్న ఈ సంవత్సరకాలము ఈ దేహమెట్లా నిలిచింది? మీరు మీ పనులను ఎట్లా కొనసాగించగలుగుచున్నారు?" |
| **<u>తే హ ఊచుః :</u>**<br>**యథా అన్ధా అపశ్యన్తః**<br>**చక్షుషా ప్రాణన్తః ప్రాణేన।**<br>**వదన్తో వాచా।**<br>**శృణ్వన్తః శ్రోత్రేణ।**<br>**విద్వాగ్ంసో మనసా।**<br>**ప్రజాయమమానా రేతః,**<br>**<u>సైవం అజీవిష్మ-ఇతి।</u>**<br>**<u>ప్రవివేశ హ చక్షుః।</u>** | <u>అప్పుడు మిగతా ఇంద్రియములు ఈ విధంగా సమాధానం చెప్పాయి.</u><br>"ఓ చక్షురింద్రియమా! మీరు అంతగా ఆశ్చర్యపడవలసినదేమున్నది చెప్పండి? లోకంలో పుట్టిగ్రుడ్డివారు, మధ్యలో చూపు కోల్పోయినవారు కూడా జీవిస్తూనే ఉన్నారు కదా! ప్రాణముతో దేహయాత్ర వ్యాపారము చేస్తూ ఉండగా, వారంతా వాక్కుతో పలుకుచున్నారు. చెవితో వినుచున్నారు. నాలుకతో రుచి చూస్తూనే ఉన్నారు. చర్మముతో స్పర్శానుభవం పొందుచున్నారు. నోటితో మాట్లాడుచూనే ఉన్నారు. అదేతీరుగా మీరు దేహములో లేనప్పటి సంవత్సరకాలము ప్రాణముతో మేము పనులు కొనసాగిస్తూనే ఉన్నాము". **అది విని నేత్రేంద్రియము సిగ్గుతో తిరిగి దేహంలో ప్రవేశించింది.** |
| **10 శ్రోతగ్ం హోచ్చక్రామ। (హ ఉచ్చక్రామ)।**<br>**తత్ సంవత్సరం ప్రోష్య।**<br>**<u>ఆగత్యో వాచ : (ఆగత్య ఉవాచ):</u>**<br>**కథమ్ అశకతం అదృతే**<br>**జీవితుం ఇతి?**<br>**తే హ ఊచుః <u>:</u>**<br>**యథా బధిరా అశృణ్వన్తః**<br>**శ్రోత్రేణ ప్రాణన్తః ప్రాణేన** | అప్పుడు **వినికిడి (శ్రోత్రము) ప్రజ్ఞాదేవత** శరీరము నుండి ఒక సంవత్సరకాలము ఉత్క్రమణము (vacating the Body) నిర్వర్తించి, ఆ తరువాత తిరిగివచ్చింది. అయినాకూడా,- దేహము శిధిలము కానేలేదు. అప్పుడు శ్రోత్రము - **"తదితర ఇంద్రియములారా! నేను బయటకు వెళ్ళిన సంవత్సర కాలము కూడా ఈ దేహము ఒక్క మాట కూడా వినలేకపోయేది కదా! మరి మీరంతా ఎట్లా ఇంకా జీవించి ఉన్నారు?"** - అని ప్రశ్నించింది. అందుకు తదితర ఇంద్రియములు చిరునవ్వుతో....<br>"చెవిటి వారు (Deaf People) చెవితో ఏ శబ్దము వినలేకపోతున్నప్పటికీ |

| | |
|---|---|
| **వదన్తో వాచా।**<br>**పశ్యన్తః చక్షుషా।**<br>**విద్వాగ్ంసో మనసా।**<br>**ప్రజాయ మానాః రేతస ఏవమ్।**<br>**అజీవిష్మేతి।** | ప్రాణం పోతోందా? లేదు. ప్రాణము తన వ్యాపారము కొనసాగిస్తూనే ఉన్నది కదా! అట్లాగే ఈ జీవుని కళ్ళు చూడటము, నోరు మాట్లాడటము, నాలుక, రుచి చూడటము, ముక్కు వాసన చూడటము, రేతో క్రియ జరుగుచూనే ఉన్నాయి. అవన్నీ కొనసాగుతూనే ఉంటాయి. అట్లాగే, చెవులనుండి మీయొక్క వినికిడి శక్తిని మీరు సంవత్సర కాలము ఉపసంహరించినప్పటికీ కళ్ళు చూసన్తానే ఉన్నాయి. మనస్సు సుఖ-దుఃఖాలు పొందటం, ఇష్టాయిష్టములను అనుభవించటము చేస్తూనే ఉన్నది. రేతస్సుతో ఆ జీవుడు సంతానమును పొందుచూనే ఉన్నాడు.<br>పుట్టు చెవిటివానిలో తదితర ఇంద్రియములు పనిచేస్తూ ఉన్నట్లే మేము కూడా మా మా ధర్మాలు నిర్వర్తిస్తున్నాం. శరీరమేమీ క్రుళ్ళిపోలేదు. నిస్తేజమై పోనూలేదు'' - అని పలికాయి. |
| **– <u>ప్రవివేశ హ శ్రోత్రం॥</u>** | అది విని శ్రోత్రేంద్రియము (వినికిడి శక్తి) సిగ్గుపడుచూ తిరిగి శరీరంలో ప్రవేశించింది. (నేను వసిష్ఠము) కాదు-అని భావించింది. |
| **11 మనో హ ఉచ్చక్రామ।**<br>**తత్ సంవత్సరం ప్రోష్య।**<br>**ఆగత్యో వాచ :**<br>**"కథం అశకతం**<br>**అదృతే జీవితుం ఇతి?"** | అప్పుడు మనస్సు లేచి, **"ఇదిగో! నేనెంత ముఖ్యమో ఈ దేహానికి రుచి చూపిస్తాను. ఎందుకంటే నేను లేకుంటే ఈ దేహము ఉండజాలదు"** అని పలికింది. దేహమునుండి బయటకు వెళ్ళిపోయింది. సంవత్సరకాలం ఆ దేహములో మనస్సు లేదు. మనస్సు తిరిగి దేహమునకు వచ్చి చూస్తే దేహము నశించిపోలేదు. **"ఇదేమిటి? ఇదెలా సాధ్యం? నేను బయటకు వెళ్ళి సంవత్సరకాలం ఈ జీవుడిని మనోరహితముగా చేసినా కూడా, ఈ శరీరము, తదితర ఇంద్రియములు ఎట్లా జీవిస్తున్నాయి?"** అని ప్రశ్నించింది. |
| **<u>తే హోచుః</u> : (తే హ ఊచుః)।**<br>**యథా ముగ్ధా అవిద్వాగ్ంసో**<br>**మనసా ప్రాణన్తః ప్రాణేన।**<br>**వదన్తో వాచా। పశ్యన్తః చక్షుషా।**<br>**శృణ్వన్తః శ్రోత్రేణ। ప్రజాయమనా**<br>**రేతసైవం (రేతస ఏవం) అజీవిష్మేతి।** | అప్పుడు తదితర ఇంద్రియములు ఇట్లా సమాధానం చెప్పాయి.<br>మనస్సు అత్యంత మూర్ఖతవహించినదై, **"ఈ జీవుడు- 'ఏది ఎప్పుడు ఎట్లా చేయాలి"** అనే కార్య - అకార్య వ్యవస్థ తెలుసుకోలేని శిశుదశ, మనోచాంచల్యము (పిచ్చి) సందర్భంలో కూడా, ప్రాణములతో ప్రాణవ్యాపారము చేస్తూ అట్టి జీవుడు వాక్కుతో పలుకుచున్నాడు. కళ్ళతో చూస్తున్నాడు. రేతస్సుతో సంతానము పొందుచున్నాడు.<br>అట్లాగే మనస్సు సంవత్సరకాలము దేహములో ఉండక, బయల్వెడలి నప్పటికీ దేహము చెడటంలేదు. ఇంద్రియములు యథాతథంగా తమ పని తాము చేసుకుపోతున్నాయి.<br>**అప్పుడు మనస్సు ఇట్లా తలచింది.**<br>- మనస్సునగు నేను ఉన్నా - లేకున్నా ఇంద్రియములు కొనసాగుచూనే ఉన్నాయి.<br>- నేను క్రియావంతం కాకపోయినప్పుడు కూడా దేహంలో తదితర ఇంద్రియాలు, రేతస్సు (పునరుత్పత్తి, సంతానముయొక్క తీరులు)- ఇవన్నీ ఎప్పటిలాగానే కొనసాగుచున్నాయి.<br>- "కనుక నా వలననే ఈ దేహము జీవిస్తోందని అనలేము''. |
| **<u>ప్రవివేశ హ మనః॥</u>** | ఇట్లా తలచి సిగ్గుపడుచూ మనస్సు తిరిగి దేహంలో ప్రవేశించింది. |

| | |
|---|---|
| 12 రేతో హ ఉచ్చక్రామ।<br>తత్ సంవత్సరం ప్రోష్య। ఆగత్య, ఉవాచ : | **రేతస్సు**<br>అప్పుడు సమస్త జీవ దేహజాతుల పునరుత్పత్తి ప్రదాతయగు 'రేతస్సు', **"నావలనగదా, సంతానము అను ప్రకృతి విధానము కొనసాగుతోంది! నేనే లేకుంటే? ఈ జీవజాతులన్నీ నశించేవే। కనుక ఈ దేహము నాపై ఆధారపడి ఉన్నదని నిరూపిస్తాను"**....అని భావించి, సంవత్సరకాలము ఆ జీవుని దేహమును విడచి, సంవత్సరం తరువాత తిరిగి దేహమును సమీపించింది. |
| "కథం అశకతం అదృతే జీవితుం ఇతి?"। | "ఓ ఇంద్రియములారా! నేను ఒక సంవత్సరము కాలము ప్రవాసము చేసినప్పటికీ మీరు చైతన్యము కోల్పోలేదే? ఎందుచేత?" అని ప్రశ్నించింది. |
| తే హ ఊచుః :<br>యథా క్లీబా అప్రజాయమానా<br>రేతసో ప్రాణన్తః ప్రాణేన।<br>వదన్తో వాచా। పశ్యన్తః చక్షుషా।<br>శృణ్వన్తః శ్రోత్రేణ।<br>విద్వాగ్ంసో మనస ఏవం–<br>అజీవిష్మేతి। | **తదితర ఇంద్రియములు, మనస్సు** : "ఓ రేతస్సు తత్త్వమా! అవును. మీరు చెప్పినది నిజమే। మీరు దేహమును వదలిన సంవత్సర తరువాత కూడా మేము శిధిలమవక, ఎప్పటివలె ఉన్నాము. **ఇందులో ఆశ్చర్యం ఏమున్నది?** ఒకడు రేతస్సు దృష్ట్యా నపుంసకుడు అయినప్పటికీ ఇంద్రియములు వాటి వాటి పనులలో సమర్ధతను కలిగియే ఉంటాయి. కళ్లు చూస్తూనే ఉంటాయి. చెవులు వింటూ ఉంటాయి. శరీరము శిధిలం అవటంలేదు. మనస్సు ఆలోచిస్తూనే ఉంటుంది కదా.<br>'రేతస్సు' అగు మీరు సంవత్సరం కాలము ప్రవాసము చేసినప్పటికీ దేహములో మేము (ఇంద్రియములు) మరియు ఈ దేహము శిధిలము కాకపోవటము అట్టిదే. |
| ప్రవివేశ హ రేతః। | ఇది గమనించిన రేతస్సు **"నేను శ్రేష్ఠము కాదు" అని తలచి తిరిగి శరీరంలో ప్రవేశించింది.** |
| 13 అథ హ ప్రాణ ఉత్క్రమిష్యన్, ।<br>యథా మహాసు హయః సైన్ధవః<br>పడ్వీశశంకూన్ సంబృహేత్ ఏవగ్ం<br>హైవేమాన్ ప్రాణాః – సంబబర్హ।<br>(హి ఏవ ఇమాన్ ప్రాణాః సంబబర్హ)। | ప్రాణ – ఉత్క్రమణ<br>అప్పుడు ముఖ్యప్రాణము దేహమునుండి బయల్వెడలిపోవటానికి సన్నాహాలు ప్రారంభించింది.<br>ఎప్పుడైతే ప్రాణము ఉత్క్రణము ప్రారంభించిందో, తత్క్షణం నోరు మాటలు కోల్పోవటం జరుగసాగింది. చెవులు వినికిడిని, చర్మము స్పర్శను, నాలుక రుచిని, ముక్కు గాలిని పీల్చటం - **మానివేయటం ప్రారంభించాయి.** అశక్తులు కాసాగాయి. ఇంద్రియములన్నీ కూడా కట్టుకొయ్యను త్రెంచుకున్న గుఱ్ఱములవలె బలవంతముగా ప్రాణము వెంట పరుగులు తీయటానికి సిద్ధంకాసాగాయి. |
| తే హ ఊచు:<br>మా భగవ! ఉత్క్రమీః ।<br>న వై శక్ష్యామః,<br>త్వత్ ధృతే జీవితుం ఇతి। | **అప్పుడు ఇంద్రియములు ప్రాణముతో ఇట్లా పలికాయి:**<br>ఓ ముఖ్యప్రాణదేవా! ఆగండాగండి! బయల్వెడలకండి! మీరు ఈ దేహములో ఉంటేనే మేము జీవిస్తాము. మీరు కనుక దేహమును విడచి వెళ్ళారా, మేము నిస్తేజులము అయిపోతామని గమనిస్తున్నాము. **మీరే ఈ దేహములో అతి ముఖ్యమైనవారు. ఇంద్రియములకు శక్తిని అందించు మహానాయకులుగా మేము గుర్తిస్తున్నాము.** మీ ఔన్నత్యము ఒప్పుకుంటున్నాము. |
| తస్యో మే బలిం కురుతేతి। | **ముఖ్యప్రాణదేవత**: నేను ఈ దేహంలో ఉండాలంటే నాకు **"బలి"** సమర్పించబడాలి.<br>**వాక్ మొదలైన ఇంద్రియములు** : 'విషయములు' అను అనుభవములతో మేము మీకు ఎల్లప్పుడు బలిసమర్పణ కొనసాగించుటకై సిద్ధముగా ఉన్నాము. |
| ప్రాణౌవాచ: తథేతి। | **ప్రాణము** : సరే! అయితే కొనసాగుతాను. |

14 సా హ 'వాక్' ఉవాచ :

"యద్వా అహం వసిష్ఠాఽ స్మి,
తద్వత్ వసిష్ఠో అసీతి।
యద్వా అహం ప్రతిష్ఠాఽ స్మి
త్వం తత్ ప్రతిష్ఠో, అసీతి చక్షుః।
"యద్వా అహగ్ం సంపదస్మి,
త్వం తత్ సంపదసీతి" – శ్రోత్రం।
"యద్వా అహం
ఆయతనం అస్మి, త్వం తత్
ఆయతనం అసీతి" – మనో ।
"యద్వా అహం ప్రజాతి రస్మి
త్వం తత్ ప్రజాతిః అసి ఇతి రేతః।

ప్రాణదేవుని గురించి ఇంద్రియ, మనో, రేతస్సులు ఈవిధంగా స్తుతించాయి.

వాక్కు : ఓ ముఖ్య ప్రాణమా। మాకు చెందిన **వసిష్ఠత్వము,** (గొప్పతనము) - అంతా మీదే।

**చక్షువులు** : మాదైన **ప్రతిష్ఠ** మీనుంచి వస్తున్నదే.

**శ్రోత్రము** : మా **సంపద** అంతా మీదే।

**మనస్సు** : మా **ఆయతనము** (స్థానము) మీకు చెందినదే।

**రేతస్సు** : మాయొక్క **పునరంకుర (ప్రజాజనక) శక్తి** మీ విశేష గుణమే (Our Reproductive ability is yours).

ఓ ప్రాణదేవా! మేము కలిగియున్న మాట్లాడుట, చూచుట, స్పర్శ, వినుట, రుచి, వాసనలు చూచుట, ఆలోచన, ప్రజాతి - ఇవన్నీ కూడా మీకు చెందిన **వసిష్ఠ, ప్రతిష్ఠ, సంపద, ఆయతన, రేతో** (పునరంకుర) విశేష-, (ప్రత్యేక ప్రాముఖ్యమైన) - **గుణములే అయి ఉన్నాయి.**

---

ప్రాణదేవత : తస్యో మే కిం అన్నం?
కిం (మే) వాస? ఇతి॥"

ఇంద్రియదేవతలు: యదిదం కించాశ్వభ్య, ఆ కృమిభ్య
ఆ కీట పతంగే అభ్యసత్,
తే అన్నం, ఆపో, వాస ఇతి।

**ముఖ్యప్రాణదేవుడు** : ఓ ఇంద్రియములారా? మంచిదే! మరి అయితే మాకు అన్నము (ఆహారము) ఏది? వస్త్రము ఏది? అన్న వస్త్రములు లేకుండా నేను ఈ దేహంలో నిలువలేను కదా?

**వాక్ మొదలైన ఇంద్రియములు** : ఓ ముఖ్య ప్రాణేశ్వరా! విషయములే ఇంద్రియానుభవరూపములగు (ఆహారమే - ఇంద్రియానుభవ విషయములే) మీకు అన్నము. ఉదకమే మీకు వస్త్రము. గుఱ్ఱము (మొదలైన జంతువులు) క్రిమి - కీటక - పతంగములు పొందే ఆహారమంతా మీకు సమర్పణయే.

---

న హ వా అస్యాత్ అన్నం జగ్ధం భవతి।
నాన్ అన్నం ప్రతిగృహీతం య ఏవమే తత్
అన్నస్య అన్నం వేద।
తత్ విద్వాగ్ంసః
శ్రోత్రియా ఆశిష్యన్త–
ఆచామన్య శిత్వా చ, అచామన్తి।
ఏతమేవ తత్ అనమనగ్నం
కుర్వన్తో మన్యన్తే॥

ఇతి అష్టమాధ్యాయః –
"ప్రాణ సంవాద బ్రాహ్మణమ్"
నామ ప్రథమ బ్రాహ్మణమ్॥

ఈ విధంగా సర్వజీవుల సర్వేంద్రియానుభవములే 'ప్రాణము'నకు 'అన్నము' అని ఉపాసించువానికి అభక్ష్యము (తినకూడనిది) అంటూ ఉండదు. "ఇది ఎట్లా తింటాము" అనునదేమీ ఆ ఉపాసకునికి కలుగదు.

ప్రాణమునకు ఉదకమే వస్త్రము. అందుకే అవపోసనగా అన్నము తినటానికి ముందు, అన్నం తినిన తరువాత కూడా జలముతో ఆచమనము చేయుచున్నారు.

పండితులు, వేదాధ్యయనము చేస్తున్నవారు అన్నమును స్వీకరించుటకు మునుముందుగా

**"ఓ-భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి।**
**ధియోయోనః ప్రచోదయాత్॥"**

అని అవపోసనతో ప్రాణమునకు ఉదక వస్త్రము సమర్పించుచున్నారు. భోజనము ముగించిన తరువాత

**"అమృతాపిధానమసి। అరౌరవే, పుణ్యానిలయే,**
**పద్మార్బుద నివాసినే। అర్థినామ్ ఉదకమ్ దత్తమ్**
**అక్షయమ్ ఉపతిష్ఠతు। అన్నదాతో సుఖీభవ॥"**

... అని ముఖ్యప్రాణమునకు (ముఖ్యప్రాణేశ్వరునికి) ఇంద్రియములను శక్తి సామర్థ్యములను వస్త్రము రూపముగా సమర్పణ చేయుటం జరుగుచున్నది.

ఇతి అష్టమాధ్యాయః
"ప్రాణ సంవాద బ్రాహ్మణమ్" నామ ప్రథమ బ్రాహ్మణమ్॥

# అష్టమాధ్యాయః - ద్వితీయం బ్రాహ్మణము

## కర్మవిపాక బ్రాహ్మణము

1 శ్వేతకేతుః హ వా ఆరుణేయః
పంచాలానాం పరిషదం ఆజగామ।
స ఆజగామ, జైవలిం ప్రవాహణం-
పరిచారయమాణం।

ఆరుణి మునీశ్వరుని కుమారుడు (ఆరుణి-ఆరుణేయుడు) అగు శ్వేతకౌతువు. తండ్రి వద్ద వేదాధ్యయనము చేస్తున్నారు. ఒకరోజు **"నీవు నాకు తెలిసిన విద్యనంతా నేర్చావు"** అని తండ్రిచే ప్రశంసించబడ్డారు.

ఒకనాడు శ్వేతకేతువు తన వేద-వాదాంగ పాండిత్యమును రాజ్యసభలో ప్రదర్శించి మెప్పు పొందాలని భావించారు. తనయొక్క వేద-అధ్యయన కీర్తి చాటుకోవటానికై పంచాలదేశపు విద్వత్ పరిషత్తు (విద్వత్ సభ) ప్రవేశించారు. **"రాజుగారి సభలోని వారందరినీ నేను జయించగలను"** - అను ధీమాతో హుందాగా నడుచుకొంటూ పంచాలరాజు విశ్రాంతి మందిరం సమీపించారు. పాంచాలరాజు జీవనుని కుమారుడగు ప్రవాహణుడు శ్వేతకేతువుకు విశ్రాంతి మందిరానికి ఆహ్వానం పలికి ఉచిత ఆసనం సమర్పించారు.

---

తం ఉదీక్ష్య "అభ్యువాద
కుమారా!" 3 - ఇతి।
స 'భో'। 3 - ఇతి।
ప్రతిశుశ్రావ - అనుశిష్టో
అన్వసి, పిత్రా? - ఇతి।
'ఓం' ఇతి - హోవాచ।

ఈ ఆరుణీయుడు అగు శ్వేతకేతువు తాను వేద వేదాంగ విద్యా ప్రవీణుని గర్వమును ఆతని కదలికలలో గమనించిన ప్రవాహణ మహారాజు తలపైకి ఎత్తి "ఓయీ! కుమారా!" అని చిన్నపిల్లవానిని మన్నన చేయురీతిగా పలకరించారు. మూడుసార్లుగా పిలచారు.

అందుకు సమాధానంగా కించిత్ వెటకారంగా "ఏమిటి తండ్రీ! అయ్యా!" అని తండ్రికి సమాధానం ఇచ్చినట్టుగా "భో! భో! భో!" - అని శ్వేతకేతువు పలికారు.

ప్రవాహణమహారాజు: మహనీయుడుగు ఆరుణికుమారా! ఆరుణేయా! శ్వేతకేతూ! మీ నాన్నగారివద్ద వేద విద్యను చక్కగా అభ్యసించినట్లు ఉన్నారు?

**శ్వేతకేతువు** : అవును! (ఇందులో సందేహమేమున్నది! కావాలంటే మీరు ప్రశ్నించి చూచుకోవచ్చు! అన్నట్లుగా తలాడించారు).

(**ప్రవాహమహారాజు :** సరే! మిమ్ములను '5' ప్రశ్నలు అడుగుచున్నాను)

---

2 ప్రవాహణుడు: వేత్థ యథేమాః (యథా ఇమాః) ప్రజాః
ప్రయత్యో విప్రతి పద్యన్తా 3 ఇతి?
శ్వేతకేతువు : "నేతి (న ఇతి)" హోవాచ॥
(మొదటిప్రశ్న)

**పంచాలదేశమహారాజు - ప్రవాహణ మహారాజు :**

1. మొదటి ప్రశ్న : ఈ జనులంతా కూడా కాలగతి చేత ఎప్పుడో మరణము పొందుచున్నారు కదా! వేరువేరైన వీరంతా ఏవిధంగా, ఏ వివిధ మార్గముల ద్వారా ఎటు వివిధ స్థానములకు వెళ్ళుచున్నారో, మీకు తెలుసా? చెప్పండి! **(మొదటిప్రశ్న).**

శ్వేతకేతువు : మరణించినవారు ఏ వివిధ మార్గములలో ఎటు వెళ్ళు చున్నారో, నాకు తెలియదే!

---

ప్రవాహణుడు : వేత్థో యథా ఇమం లోకం
పునః ఆపద్యన్తా 3 - ఇతి?
శ్వేతకేతువు : "నేతి" హోవాచ। (రెండవ ప్రశ్న)

ప్రవాహణమహారాజు : సరే! ఆ మరణించి వెళ్ళినవారు తిరిగి ఈ లోకమునకు ఏ వివిధ మార్గములుగా ఎట్లా తిరిగి వస్తారు? ఇది చెప్పండి. **(రెండవ ప్రశ్న)**

శ్వేతకేతువు : అది కూడా నాకు తెలియదే.

---

ప్రవాహణుడు : వేత్థో యథా అసౌ
లోక ఏవం (ఏవ) బహుభిః
పునః పునః ప్రయద్భిః
న సంపూర్యతా 3 ఇతి?
శ్వేతకేతువు: నేతి-హోవాచ। (హైవోవాచ)। (మూడవ ప్రశ్న)

ప్రవాహణమహారాజు : సరే! ఇదన్నా చెప్పండి। ఒకరి తరువాత మరొకరు మరల మరల మరణించుచుండగా ఆ మరణానంతర (స్వర్గ) లోకము మరణించినవారితో నిండిపోయి, ఖాళీ లేకుండా పోవాలి కదా! కానీ అట్లా జరగటంలేదు. ఎందుచేత? **(మూడవ ప్రశ్న)**

శ్వేతకేతువు : మరణానంతర పై (పర) లోకములు మరణించినవారితో ఎందుకు నిండిపోవటము లేదో, అది కూడా నాకు తెలియదు.

| | |
|---|---|
| ప్రవాహణుడు : వేత్థో యతిథ్యామ్ ఆహు, త్యాగ్ం హుతాయాం ఆపః 'పురుష' వాచో భూత్వా సముత్థాయ వదన్తీ 3 ఇతి? శ్వేతకేతువు: నేతి (నన్నతి) హైవ ఉవాచ। (హ ఉవాచ) (నాలుగవ ప్రశ్న) | ప్రవాహణమహారాజు : హే శ్వేతకేతూ! ఇంకొక ప్రశ్న। ఎంత సంఖ్యంగా ఎన్ని ఆహుతులు హోమము చేయుచుండగా ఉదకము పురుషవాక్కులు (నిర్విషయ జలమునుండి క్రియా విశేష సమన్వితమగు జగత్తుగా) మారి → **'పురుషుడు'** (Experiencer) రూపముగా పరిణమించి, అవన్నీ పురుషునివాక్కు (Voice of the individual participant-being)గా ప్రదర్శితమగుచున్నాయి? పురుషవాక్ ధ్వనులుగా ఎట్లా అగుచున్నాయి? **(నాలుగవ ప్రశ్న).**<br>శ్వేతకేతువు : ఏఏ - ఎన్నెన్ని ఆహుతులు హోమము చేయగా ఉదకము పురుషుడు - పురుషకారములుగా జనిస్తున్నదో, కూడా నాకు తెలియదే! ఎన్ని ఆహుతుల హోమముచే **ఉదకములు వాక్‌ను ప్రకటించగల పురుషకారము ధరిస్తాయో** తెలియదు. |
| ప్రవాహణుడు : వేత్థో "దేవయానస్య" వా పథః ప్రతిపదం 'పితృయాణస్య' వా? –యత్ కృత్వా దేవయానం వా పన్థానం ప్రతిపద్యన్తే। పితృయాణం వాఽపి హి న ఋషేః వచః శ్రుతమ్॥ | ప్రవాహమహారాజు : మరొక ప్రశ్న. లోకంలో **దేవయానమార్గము** అని, **పితృయాన మార్గము** అని రెండు మార్గములు ప్రతిపాదితమై ఉన్నాయి కదా!<br>ఏఏ కర్మల వలన ఈ జీవుడు దేవయా మార్గమును, ఏ ఏ కర్మల వలన పితృయాన మార్గమును - అనుప్రతిపదము (Walks of Life) గా పొందుచున్నాడో, ఇది వివరించే చెప్పు శాస్త్రముల మంత్రవాక్యములు మేము వింటున్నాము. |
| ద్వే సృతీ అశృణవం పితౄణాం అహం దేవానామ్ ఉత మర్త్యానాం। తాభ్యాం ఇదం విశ్వమ్ ఏజత్సమేతి। యత్ అన్తరా (యదన్తరా) పితరం మాతరం చ ఇతి। శ్వేతకేతువు : న అహం అత ఏకం చ, న వేదేతి। – హోవాచ। (ఐదవ ప్రశ్న) | ఇవి రెండూ దేవతలయొక్క (మరియు) - పితృదేవతలయొక్క రెండు మార్గములు. అవి ఈ జగత్తులో మరణించినవారి కొరకై ఏర్పడినవై ఉన్నాయని శ్రుతిమంత్రములు చెప్పటం జరుగుతోంది. ఈ రెండు మార్గములలో మానవులు (జీవులు) ప్రయాణిస్తూ దైవలోకమో, పితృలోకమో జేరుచున్నారు.<br>ఈ రెండు మార్గములు అనబడు పితృ-దేవమార్గములు- (తల్లి తండ్రులమధ్యగా ఈ భూమి అంతరిక్షములు మధ్యగా కనిపించేదంతా ఉన్నట్లుగా) - కనిపిస్తూ ఉన్నాయని మేము వినియున్నాము. అట్టి దేవయానము - పితృయానము... రెండిటిని రెండు మార్గములుగా కలిగిన ఈ **'దృశ్యరూప విశ్వము'** గురించిన వివరములు మీకు తెలుసునా? మీరు ఎరిగియే ఉన్నారా? **(5వ ప్రశ్న)**<br>శ్వేతకేతువు : ఏ ఈ జగత్తు పితృయాన-దేవయానములు అను రెండు ప్రయాణమార్గములు కలిగియున్నదో, వాటి గురించి గాని, వాటి మధ్యగల జగత్ విశేషం గురించిగాని నాకు తెలియదే! తెలియనే తెలియదు. |
| 3 అథైనం వసత్యా ఉపమన్త్రయాన్ చక్రే అనాదృత్య వసతిం కుమారః । ప్రదుద్రావ స ఆజగామ పితరం। తగ్ం హోవాచ ఇతి, *(శ్వేతకేతువు – తండ్రిగారైన ఆరుణి మునీంద్రులతో)* "వావ కిల నో భవాన్ పురానుశిష్టా, నవోచత్ ఇతి। (పురానుశిష్టానవోచ ఇతి)। | **ప్రవాహణమహారాజు :** హే శ్వేతకేతు మహాశయా! ముందుగా మీరు మాకు అతిథులు. వేదజ్ఞులు. భక్తి - ప్రపత్తులతో ఆసనము, అర్ఘ్య-పాద్యాదులను (కాళ్లు కడిగి నీరు శిరస్సున దాల్చు మర్యాదను) సమర్పిస్తాను. స్వీకరించండి.<br>కుమారుడగు శ్వేతకేతువు ప్రవాహణ మహారాజు సమర్పించబూనుచున్న ఆసన-అర్ఘ్య-పాద్యములను స్వీకరించకుండా అప్పటికప్పుడే తన తండ్రిగారు అరుణి మునీశ్వరులు ఉన్న ఆశ్రమానికి బయలు వెళ్ళారు.<br>**శ్వేతకేతువు పితృదేవులగు ఆరుణిమునీశ్వరుని ఆశ్రమంలో తండ్రితో సంభాషించసాగారు.**<br>శ్వేతకేతువు : పితృదేవా! ఆరుణి మహాత్మా! నేను సకల విద్యలు నేర్చినట్లేనని తమరు చెప్పి ఉన్నారు కదా? |

ఆరుణి : అవును. నీవు సకల విద్యలు నేర్చినట్లేనని అన్నాను. ఇప్పుడు ఏమి లోటు వచ్చింది? నేర్చుకొనియే ఉన్నావు కదా!

---

కథగ్ం సుమేధ ఇతి–?
పఞ్చమా ప్రశ్నాన్, రాజన్యబన్ధుః
అప్రాక్షీత్। తతో నై కఞ్చన వేదేతి।
కతం ఏత ఇతీమ
ఇతి హ ప్రతీకాన్ ఉదాజహార।

**శ్వేతకేతువు :** లేదు లేదు. అనేక విద్యలలో నిష్ణాతుడను అయి ఉండి కూడా ప్రవాహణ మహారాజు అడిగిన ఐదు ప్రశ్నలలో ఏ ఒక్క ప్రశ్నకు నేను సమాధానము చెప్పలేకపోయాను. (నిష్కారంగా) ఆ రాజబంధువు యొక్క '5' ప్రశ్నలకు నాకు సమాధానమే తెలియకపోయింది. (రాజబంధువు = అధికారం లేకపోయినా కూడా, దర్పం చూపే అల్పుడు).

"ఆరోజు అడిగిన ప్రశ్నలేవి?" అని తండ్రి ఆరుణిమునీంద్రులు అడుగగా, శ్వేతకేతువు ఆ ఐదు ప్రశ్నలను సంక్షిప్తంగా తెలియజేశారు.

---

4 <u>స హ ఉవాచ :</u> (ఆరుణి మునీంద్రొవాచ)।
తథా నః త్వం, తాత!
జానీథా యథా యత్ అహం,
కించ(న) వేద సర్వం।
అహం తత్ తుభ్యం అవోచం।
(ప్రేతి తత్ర) ప్రైహి తు తత్ర ప్రతీత్య
బ్రహ్మచర్యం వత్స్యావ ఇతి॥

ఆరుణి : ఓ ప్రియపుత్రకా! శ్వేతకేతూ! <u>"నావద్ద సకల విద్యాపారంగతుడవు అయ్యావు"</u> అని నీ గురించి చెప్పినప్పుడు, <u>"నాకు తెలిసిన విద్యలన్నీ నాదగ్గర నీవు నేర్చుకున్నట్లే!"</u>...అని నా ఉద్దేశ్యము. ఇప్పుడు ఆ ప్రవాహణమహారాజు నాకన్నా అధికముగా తెలుసుకొనియున్నవారని ఆయన ప్రశ్నలవలన తెలియవస్తోందికదా! అంతా మనకే తెలుసని ఎట్లా అంటాం? మనకన్నా అధికంగా అనేక కోణములలో (In many angles) తెలిసినవారు ఉంటారు కదా! వారివద్ద మనము ఎప్పుడూ నేర్చుకుంటూ ఉండివలసిందే. ఇందులో ఆశ్చర్యం ఏమున్నది?

అందుచేత ఓ కుమారా? రమ్ము? **మనిద్దరము కూడా ఆ రాజుదగ్గిరకు వెళ్దాము. ఆయనవద్ద జ్ఞానము పొందుటకై బ్రహ్మచర్యము పాటించి, ఆయనను సేవించెదముగాక!**

---

<u>శ్వేతకేతువు :</u> భవాన్ ఏవ గచ్ఛతి ఇతి।
స ఆజగామ గౌతమో యత్ర
ప్రవాహణస్య జైబ(వ)లేః ఆస।

**శ్వేతకేతువు :** ఆయన దగ్గిరకు వెళ్ళి <u>'నేను విద్యాపారంగతుడను'</u> అని చెప్పుకొని, ఇప్పుడు మరల విద్యార్థినై వెళ్ళటమా? నేను రాను. కావాలంటే మీరు వెళ్ళిరండి! (ఆ తరువాత మీవద్దనే నేర్చుకుంటాను).

అప్పుడు 'గౌతముడు' (శాస్త్రపాండిత్యము వలన గౌరవింప తగినవారు) అను బిరుదుగల అరుణి "సరే! పుత్రా! నేను వెళ్ళివస్తాను" - అని చెప్పి ప్రవాహణమహారాజు సభకు వచ్చారు.

---

తస్మా ఆసనం ఆహృత్య,
ఉదకం ఆహారయాంచకార
అథ హాస్మా అర్ఘ్యం చకార।
తగ్ం హోవాచ : (ప్రవాహణొవాచ):
"వరం భగవతే! గౌతమాయ! దద్మ" ఇతి॥

**ప్రవాహణమహారాజు :** ఓ అరుణి మహాశయా! గౌతమ బిరుదాంకితా! సుస్వాగతము ఇదిగో ఈ ఆసనమును స్వీకరించండి! అర్ఘ్య-పాద్యములు కూడా సమర్పిస్తున్నాను. దయచేసి అంగీకరించండి. మీరు తపోసంపన్నులు. మహనీయులు. విద్యాపారంగతులు. మీరాక మాకు, మా ప్రజలకు శుభప్రదము. ఇందుకు కృతజ్ఞత తెలుపుకోవటానికై మీరు నన్ను ఏదైనా వరముకోరి, సమర్పించటానికి ఆజ్ఞాపించండి. సమర్పించుకొని, సర్వశాస్త్ర కోవిదులగు మీపట్ల నాకు గల భక్తిని, ప్రపత్తిని తెలియజేసుకుంటాను.

---

5 సహోవాచ, (ఆరుణింవాచ): ప్రతిజ్ఞాతో మ
ఏష వరో యాం తు। కుమారస్య
అన్తేవాచమ భాషథాస్తాం,
ఏవ బ్రూహీతి। (బ్రూహి। ఇతి।)

**ఆరుణి ముని :** హే। ప్రవాహణ మహారాజా! మీరు సమర్పించిన అతిథి మర్యాదలకు నేను చాలా సంతోషిస్తున్నాను. నేను కోరినది సమర్పించటానికి సంసిద్ధత ప్రకటించారు కదా! మీరు నా కుమారుడు శ్వేతకేతువును అడిగియున్న '5' ప్రశ్నలకు సమాధానము ఏమైయున్నదో, అది నాకు దయచేసి వరప్రదానంగా బోధించండి. నేను మీకు శిష్యుడనై, మిమ్ములను భక్తితో సేవిస్తూ, మీ సమాధానములను విని నేర్చుకుంటాను. **ఇదియే మీ నుండి నేను కోరుకొను వరము.**

| | | |
|---|---|---|
| 6 | **సహోవాచ (ప్రవాహణ జాబాలౌవాచ) :**<br>**దైవేషు వై గౌతమో! తత్ వరేషు–**<br>**మానుషాణాం బ్రూహి! ఇతి॥** | <u>పాంచాలదేశ-మహారాజు-జీవలుని పుత్రుడగు ప్రవాహణ జైవాల మహారాజు:</u><br>ఓ అరుణి మహాశయా! గౌతమా! మీరు దేవతలు కోరతగిన వరమును కోరుకొంటున్నారేగాని, మానవులు కోరే వరము కాదు. **మానుషవరములు** (మానవులు కోరవలసిన వరములు అగు) గోవులు,- గుఱ్ఱములు, బంగారము, భూములు, దాసీ జనము, వస్త్రములు, పరివారము, గ్రామాధిపత్యము - ఇటువంటివి కదా! వీటిలో ఏవైనా **దయచేసి** కోరుకోండి. సమర్పించుకోవటానికి నేను **సంసిద్ధుడనై ఉన్నాను.** |
| 7 | **<u>స హ ఉవాచ :</u> (ఆరుణి మునీంద్రౌవాచ):**<br>**విజ్ఞాయత ఇహ అస్తి**<br>**హిరణ్యస్య అపాత్ తం**<br>**గో అశ్వానాం దాసీనాం, ప్రవారాణాం పరిధానస్య॥** | అరుణి ముని : అయ్యా! తమకు తెలియనిది ఏమున్నది? మీరు చెప్పిన బంగారము, గో-సంపద, దాసీజనము, అశ్వములు - ఇవన్నీ మీరు ఇవ్వటము, మేము పుచ్చుకోవటము ఇంతకుముందు జరిగినదే. ఆ విషయాలలో మీరు దాతలై ఉండటంచేత మాకు ఏలోటూ ఏనాడూ లేదు. |
| | **మా నో భవాన్ బహోః అనన్తస్య,**<br>**అపర్యన్తస్య అభ్యవదాన్యో అభూత్ ఇతి॥**<br>**<u>ప్రవాహణుడు :</u> స వై, గౌతమ!**<br>**తీర్థేన ఇచ్ఛాసా ఇతి॥**<br>**<u>ఆరుణి :</u> ఉపైమి అహం భవన్తం ఇతి॥**<br>**వాచా హ స్మ వై (స్మైవ) పూర్వ ఉపయన్తి,**<br>**సహోపాయన కీర్త్యోవాస॥** | అందరి విషయంలో మీరు గొప్ప దాతలుగా లోకప్రసిద్ధులై ఉన్నారు. ఒక్క మా విషయంలో మాత్రము **'కదర్యుడు'** (ఉండి కూడా అర్థికి దానము చేయనివాడు) అవవలసిన పనేమున్నది చెప్పండి? ఒకడు దానం అడిగిన మాత్రం చేతనే **అనన్తముగా, అపర్యన్తంగా** మునిమనుమలు వరకు అనుభవించగల సంపద ప్రసాదించే మీరు ఇప్పుడు అడిగినా లేదని ఎందుకనాలి? అనకండి. దయచేసి, గురుస్వరూపులై మీ'5' ప్రశ్నలకు మీరే సమాధానం చెప్పి మాకు నేర్పండి. అదియే 'వరము'గా ప్రసాదించండి.<br><br>ప్రవాహణ మహారాజు : ఓ గౌతమ మహాశయా! అట్లా అయితే మీరు తీర్థస్వీకారము చేసి విధి విధానముగా ''పొందాలి'' - అని నన్ను కోరుకొనెదరుగాక! గురుశిష్య సాంప్రదాయంగా అడిగెదరు గాక.<br><br>అరుణి : ఓ ప్రవాహణ మహారాజా! బ్రాహ్మణాచారమును అనుసరించి **"నేను మీకు శిష్యుడను! శిష్యస్తే ఉహమ్! దయతో విద్యను నేర్పండి - మీ '5' ప్రశ్నలకు మీరు నాకు సమాధానములు ప్రసాదించండి!"**<br><br>-అని వేడుకొనుచున్నాను. ఉపసదనమును నిర్వర్తిస్తున్నాను. (పూర్వీకులగు బ్రాహ్మణులు విద్యకొరకై క్షత్రియులను గాని వైశ్యులను గాని, శూద్రులనుగాని ఆశ్రయించినప్పుడు పాదాభివందనము, సాష్టాంగ నమస్కారము మొదలైనవి ఆచారము కాదు). ఉపసదనము చేయుటయే ఆచారము. ("అయ్యా! జ్ఞానవిషయాలకొర్రకై మిమ్ములను అర్థిస్తున్నాను. శరణువేడుచున్నాను" ... అను అర్థముతో వాక్కును ఉపయోగించి, నమస్కరిస్తూ చెప్పటం 'ఉపసదనము').<br><br>**నేను 'వాక్' మాత్రముచేతనే మీకు శిష్యుడను అగుచున్నాను.** |
| 8 | **<u>స హ ఉవాచ : (ప్రవాహణౌవాచ)</u> :**<br>**తథా నః త్వం, గౌతమ! మా అపరాధాః॥**<br>**తవ చ పితామహా యథేయం విద్యేతః,**<br>**పూర్వం న కస్మిగ్ంశ్చన**<br>**బ్రాహ్మణ ఉవాస,** | ప్రవాహణమహారాజు : మీరు కోరిన రీతిగా '5' ప్రశ్నలకు సమాధానం చెప్పుతాను. మీ తాతగారు మా తాతాగారివద్ద ఆధ్యాత్మికవిశేషాలను విని అపరాధము' అని అనుకోకుండా, స్వీకరించినట్లుగానే, మీరు కూడా నేను చెప్పు వివరములను అపరాధముగా భావించక, వినెదరుగాక! ఈ '5' ప్రశ్నలకు సమాధానము **'పంచాగ్నివిద్య'** అని వేదాంత విద్యలో ప్రసిద్ధమైయున్నది. నేను ఎరిగిన అట్టి పంచాగ్నివిద్యను ఏ బ్రాహ్మణునికీ నేను ఇప్పటి వరకూ చెప్పి ఉండలేదు. ఇది క్షత్రియ పరంపరగా వచ్చిన విద్య మాత్రమే. **(అనగా, ఇది బ్రహ్మవిద్య కాదు. లోక-లోకాంతర, జన్మ-జన్మాంతర సంబంధిత విద్య మాత్రమే).**<br><br>అయినప్పటికీ విజ్ఞులు - బ్రాహ్మణులు అగు మీకు చెప్పబోవుచున్నాను. |

తాం తు అహం తుభ్యం వక్ష్యామి
కో హి త్వ ఏవం బ్రువన్తం
అర్హతి ప్రతి ఆఖ్యాతుమ్ ఇతి॥

నేను క్షత్రియుడను. మీరు బ్రాహ్మణులు. మీకు విద్య బోధించునంతటి వాడను కాను. అయినప్పటికీ "నేను మీకు శిష్యుడనై వినెదను"...అని మీరు ప్రతిజ్ఞ చేస్తూ ఉన్నారు. శాస్త్ర నియమానుసారము వాక్కుతో అడుగుతూ నమస్కరించుచున్నారు. అందుచేత నేను మీ కుమారుని అడిగియున్న '5' ప్రశ్నలకు సమాధానం శాస్త్ర, వర్తన, నిర్వచన, విశదీకరణలను అనుసరించి చెప్పుచున్నాను.

ప్రవాహణ జైబల మహారాజౌవాచ:

9 అసౌ వై లోకో అగ్నిః, గౌతమ!
తస్య ఆదిత్య ఏవ సమిదః।
రస్మయో ధూమో। అహరర్చిః (అహః అర్చిః)
దిశో అఙ్గారా। అవాన్తర దిశో, విస్ఫులింగాః।
తస్మిన్ ఏతస్మిన్, అగ్నౌ దేవాః 'శ్రద్ధాం' జుహ్వతి।
తస్యా ఆహుత్యై 'సోమో రాజా' సంభవతి॥

పంచాగ్నిహౌత్ర-హుతాదులకు యజ్ఞకర్త-దేవతలు (ఇంద్రుడు, వరుణుడు మొదలైన దివ్యప్రజ్ఞలు).
1. అగ్ని = ద్యులోకము 2. సమిధ/ఇంధనము = అదిత్యుడు 3. ధూమము/పొగ = కిరణములు (రస్మి) 4. జ్వాల = పగలు 5. అంగారాః/బొగ్గులు = దిక్కులు (తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ) 6. మిణుగురులు/విస్ఫులింగము = అవాంతరదిశలు (ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి, వాయువ్య) 7. హోమద్రవ్యము = శ్రద్ధ 8. యజ్ఞఫలము = సోమరాజు/చంద్రుడు

## పంచాగ్ని విద్య

### ముందుగా 4వ ప్రశ్నకు సమాధానము

ఓ గౌతమా! వినండి! ఈ (ద్యు)లోకమంతా అగ్నితేజో స్వరూపం. ఆ అగ్నిని మరొక కాల్చబడు వస్తువు లేకపోతే ప్రదర్శితము కాదు. అట్టి అగ్నికి ఇంధనము ఏది? "ఆదిత్యుడు"! (సమిధ = వంట చెఱకు)

**కిరణములే ధూమము. పగలు ఆ అగ్ని యొక్క జ్వాల.**

దిక్కులు (తూర్పు-పడమర-ఉత్తరం-దక్షిణం) అద్దానికి **నిప్పుకణములు.**

ఈశాన్యము, వాయువ్యము, ఆగ్నేయము, నైఋతి (మూలదిక్కులు).... విస్ఫులింగములు అటువంటి అగ్ని తేజో నిర్మిత (ద్యు)లోకములో దేవతలు (ఇంద్రుడు, వరుణుడు, మొ॥నివారు ) "**శ్రద్ధ**" అనే ఉదకముతో హోమము చేస్తున్నారు.

అట్టి 'శ్రద్ధ' రూపమగు దేవతలయొక్క ఉదకహోమము నుండి '**సోమరాజు**' (మనోరూపచంద్రుడు) ఉదయిస్తున్నారు. (సోమరాజు = సంకల్పము).

**అట్టి అగ్ని - చంద్రులను (కేవలాత్మ-జీవాత్మల అనన్యతత్త్వమును) ఉపాసించెదముగాక!**

రెండవ అగ్ని

10 పర్జన్యో వా అగ్నిః, గౌతమ।
తస్య సంవత్సర ఏవ సమిద (ధ)।
అభ్రాణి ధూమో। విద్యుత్ అర్చిః।
అశనిః అఙ్గారా। హ్రాదునయో విస్ఫులిఙ్గాః।
తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవాః
"సోమగ్ం రాజానం" జుహ్వతి। తస్యా
ఆహుత్యై 'వృష్టిః' సమ్భవతి॥

1. అగ్ని = పర్జన్యుడు/వరుణుడు 2. సమిధ/ఇంధనము = సంవత్సరము 3. ధూమము/పొగ = మేఘములు 4. జ్వాల = మెఱుపు 5. అంగారాః/బొగ్గులు = పిడుగు 6. మిణుగురులు/విస్ఫులింగము = మేఘగర్జన శబ్దములు 7. హోమద్రవ్యము = చంద్రుడు 8. యజ్ఞఫలము = వర్షము.

ఓ గౌతమమహాశయా! ఇంకా వినండి.

### రెండవ అగ్ని / ఆహుతి

పర్జన్యుడే ....(వర్షస్వరూపదేవతయే) = అగ్ని.

ఆ అగ్నికి ఇంధనము (కట్టెలు) సమిధ = **సంవత్సరము।**

**మేఘశకలములే** పొగ (మేఘములు పొగనుండే పుడతాయికదా!)

మెరుపుయే **జ్వాల** (ప్రకాశించు ధర్మము). పిడుగులే అగ్నికణములు (బొగ్గులు). గర్జన శబ్దములే **విస్ఫులింగములు.**

ఈ విధంగా అగ్ని-ఇంధనము-జ్వాల-పొగ-అంగారము-మిణుకులు...అనే పదార్థ షట్కము (ఆరు విశేషాలు) గల పర్జన్యాగ్ని యందు (ఇంద్రుడు వరుణుడు వాయు మొదలైన) దేవతలు - (పితృదేవతలకు, బ్రాహ్మణులకు రాజు అయినటువంటి) **చంద్రుని** (సోమరాజును) **హోమము** చేయుచున్నారు. అట్టి హోమము ఫలించగా వృష్టి (వర్షము) సంభవించుచున్నది. ఈవిధంగా **పర్జన్యము యొక్క (పైన చెప్పిన 6, విశేషాలతో ఫలించు వర్షమును ఉపాసించెదము గాక!**

మూడవ అగ్ని

11 అయం వై లోకో అగ్నిః, గౌతమ!
తస్య పృథివ్యేవ సమిదః।
అగ్నిః ధూమో। రాత్రిః అర్చిః।
చన్ద్రమా అంగారా। నక్షత్రాణి విస్ఫులింగాః।

1. అగ్ని = ఈ లోకము (జన్మ-కర్మలకు, కర్మఫలములకు ఆధారమైనట్టిది. 2. సమిధ/ఇంధనము = పృథివి (భూమి) 3. ధూమము/పొగ = అగ్ని 4. జ్వాల = రాత్రి 5. అంగారాః/బొగ్గులు = చంద్రుడు 6. మిణుగురులు/విస్ఫులింగము = నక్షత్రములు 7. హోమద్రవ్యము = వర్షము 8. యజ్ఞఫలము = ఆహారము (బియ్యము, గోధుమలు, పప్పులు మొ॥వి).

### మూడవ అగ్ని / ఆహుతి

(భూమి-సముద్రములు-పర్వతములు-నదీప్రవాహములు మొదలైన వాటితో కూడిన) ఈ లోకమే అగ్ని.

అట్టి ఈ లోకాగ్నికి సమిధ (కట్టె) ఈ భూమి (పృథివి).

అగ్నియే 'పొగ'.

రాత్రియే అద్దాని వెలుగు (అర్చి). చంద్రుడే నిప్పుకణములు. నక్షత్రములు ఈలోకాగ్ని యొక్క నిప్పురవ్వలు.

తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ

దేవా 'వృష్టిం' జుహ్వతి।

తస్యా ఆహుత్యా "అన్నగ్ం" సంభవతి

అట్టి లోకాగ్నియందు వర్షమును దేవతలు హోమము చేయుచున్నారు. అట్టి ఆహుతినుండి **'అన్నము'** సంభవించుచున్నది.

**లోకాగ్నిని - షష్ఠ విశేషములతో అన్నము జనిస్తోందని ఉపాసించెదము గాక।**

**4వ అగ్ని**

**12 పురుషోవా అగ్నిః, గౌతమ!**

**తస్య వ్యాత్తమేవ సమిత్ ప్రాణో। ధూమో వాక్।**

**అర్చిః, చక్షుః। అంగారాః శ్రోత్రం। విస్ఫులింగాః।**

**తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవా "అన్నం" జుహ్వతి।**

**తస్యా ఆహుత్యై "రేతః" సమ్భవతి।**

**1.** అగ్ని = పురుషుడు **2.** సమిధ/ఇంధనము = వ్యాత్తము (తెరిచిన నోరు) **3.** ధూమము/పొగ = ప్రాణము **4.** జ్వాల = వాక్కు **5.** అంగారాః/బొగ్గులు=కన్ను **6.** మిణుగురులు/విస్ఫులింగము=చెవి **7.** హోమద్రవ్యము = అన్నము **8.** యజ్ఞఫలము = రేతస్సు

**4వ అగ్ని/ఆహుతి**

ఓ గౌతమా।

ఈ పురుషుడే (జీవుడే) అగ్ని! అట్టి పురుషాగ్ని తెరువబడిన నోరు - ఇంధనము (కట్టె). ప్రాణమే ధూమము (పొగ). వాక్కుయే జ్వాల.

కళ్ళు (చూపు) → కాల్చబడుబొగ్గులు.

శ్రోత్రము (వినికిడి)...విస్ఫులింగములు. అట్టి జీవాగ్నియందు దేవతలు అన్నమును హోమద్రవ్యముగా సమర్పించుచున్నారు. **అట్టి ఆహుతి వలన "రేతస్సు" కలుగుచున్నదని ఉపాసించెదము గాక!**

**5వ అగ్ని**

**13 యో అసా వా (యోషా వా) అగ్నిః, గౌతమ!**

**తస్యా ఉపస్థ ఏవ సమిత్। లోమాని ధూమో।**

**యోనిః అర్చిః। యత్ అన్తః (యదన్తః) కరోతి,**

**తే అఙ్గారా। అభినన్దా విస్ఫులింగాః।**

**తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవా 'రేతో' జుహ్వతి।**

**తస్యా ఆహుత్యై 'పురుషః' సంభవతి॥**

**స జీవతి। యావజ్జీవతి, అథ యదా మ్రియతే॥**

**1.** అగ్ని = స్త్రీ **2.** సమిధ/ఇంధనము = జననేంద్రియము **3.** ధూమము/పొగ = రోమములు **4.** జ్వాల = యోని **5.** అంగారాః/బొగ్గులు = మైథునవ్యాపారము **6.** మిణుగురులు/విస్ఫులింగము = సంభోగసుఖానుభవములు **7.** హోమద్రవ్యము = రేతస్సు **8.** యజ్ఞఫలము = పురుషుడు / సంతానము. ఇంతవరకు 4వ ప్రశ్నకు సమాధానము

ఓ గౌతమా!

**స్త్రీయే** (నిశ్చయంగా) అగ్ని!

**ఆ స్త్రీయొక్క జననేంద్రియమే ఇంధనము.** శరీరములోని వెంట్రుకలే ధూమము.

**- యోని, ఉపస్థయే - జ్వాల.** అంతఃకరణమునందు (అంతఃయోని యందు) జరుగు **మైథునవ్యాపారమే నిప్పురవ్వలు.** ఆనంద లేశములే **మిణుగురులు.**

అట్టి 'స్త్రీ యోని' అను అగ్నియందు దేవతలు **రేతస్సును హోమము చేయుచున్నారు. అట్టి దేవతలు చేయు రేతస్సుయొక్క హోమముచే పురుషుడు (జీవుడు) పుట్టుచున్నాడు.**

అట్టి పురుషుడు దేహము కొనసాగునంత వరకు కర్మలు చేయుచూనే ఉన్నాడు. ఆ విధంగా జీవిత కర్మలు నిర్వర్తిస్తూ, కాలక్రమంగా మరణము పొందుచున్నాడు. **అట్టి రేతస్సును హోమ-ఉపాసనగా నిర్వర్తించెదముగాక। స్త్రీ- సంతానములను షష్ఠవిశేషములతో ఉపాసించెదము గాక!**

**14 అథ ఏనం అగ్నయే హరన్తి।**

**తస్య అగ్నిః ఏవ అగ్నిః భవతి।**

**సమిత్ సమిత్। ధూమో ధూమో ।**

**అర్చిః అర్చిః। అంగారా అంగారా।**

**విస్ఫులింగాః విస్ఫులింగాః।**

**తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవాః పురుషం జుహ్వతి,**

**తస్యా ఆహుత్యై 'పురుషో'-**

**భాస్వర వర్ణః సంభవతి।**

స్త్రీ జననంగమునుండి శరీరము పొందిన జీవుడు దేహమున్నంతవరకు జీవిస్తూ, కర్మలు నిర్వర్తిస్తూ, ఎప్పుడో మరణించుచున్నాడు. జీవుడు దేహమును త్యజించినప్పుడు బంధువులు నిర్జీవ దేహమును అగ్నికి సమర్పించటానికి శ్మశానము జేర్చుచున్నారు.

- అప్పుడు భౌతికదేహములోని అగ్ని-విశాగ్నిగా అగుచున్నది.
- సమిధలలోనికి 'సమిధ' .
- ధూమములోనికి ధూమము (పొగయే పొగ).
- జ్వాలలోనికి జ్వాల.
- బొగ్గులలోనికి బొగ్గులు.
- నిప్పు కణికలలోనికి నిప్పుకణికలు - ఇవన్నీ స్వస్థానం చేరుచున్నాం.

అటువంటి లోకప్రసిద్ధమైయున్న అగ్నియందు పితృదేవతా స్థానముల కొరకై ఋత్విక్కు మంత్రముద్వారా పురుషుని నిర్జీవదేహమును హోమము చేయుచున్నారు.

| | |
|---|---|
| | అట్టి హోమము యొక్క ఆహుతి నుండి 'అన్యాహుతి' అయినట్టి పురుషుడు ప్రకాశించు దీప్తి కలవాడు అగుచున్నాడు. 'వివేకము' నుండి → అన్యాహుతిచే సర్వకర్మలసంస్కార ఫలము పొంది ఆ జీవుడు అధికంగా తేజోవంతుడు అగుచున్నాడు. **అట్టి జీవుడు - అగ్ని - భస్మములను షష్ఠ విధులతో కూర్చి ఉపాశించెదము గాక!** |
| <u>మొదటి ప్రశ్నకు సమాధానము</u><br>15 తే య ఏవం ఏతత్ విదుః,<br>యే చామీ అరణ్యే శ్రద్ధాగ్ం<br>సత్యమ్ ఉపాసతే। | **మరణించే వారియొక్క (జీవించి ఉన్నప్పటి) యోగాభ్యాసము అనుసరించి రెండు మార్గములు. (1) ఉత్తరాయణమార్గము (2) దక్షిణాయణమార్గము**<br>**ఉత్తరాయణమార్గము**<br>(1) ద్యులోకాగ్ని (2) పర్జన్యాగ్ని (3) లోకాగ్ని (4) పురుషాగ్ని (5) యోషాగ్ని....ఇదియే "పంచాగ్ని విద్య". ఎవ్వరైతే ఈ సృష్టిలోని పైన వర్ణించబడు దేవతల ఆహుతులను ఉపాసిస్తారో అట్టి గృహస్తుడు - సన్న్యాసి, వానప్రస్తుడు కూడా - ఉత్తమశీలత్వము-స్థితి పొందు చున్నారు.<br>ఎవ్వరైతే తపశ్శాలురై అరణ్యమునందు (జగత్ రాహిత్యమునందు) సత్యమును ఉపాసిస్తారో వారు అగ్నిజ్వాలల సహాయముతో ఉత్తమమార్గము పొందుచున్నారు. |
| తే అర్చిః అభిసంభవన్తి ।<br>అర్చిషో అహరహ్న ఆపూర్యమాణ పక్షం।<br>ఆపూర్యమాణ పక్షాద్యాన్<br>షణ్మాసాన్ ఉదఙ్ఞ ఆదిత్య ఏతి।<br>మాసేభ్యో దేవ లోకం। దేవలోకాత్। ఆదిత్యం।<br>ఆదిత్యాత్ వైద్యుతం। తాన్ వైద్యుతాత్ (న్)<br>పురుషో మానస ఏత్య, బ్రహ్మ లోకాన్ గమయతి।<br>తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి।<br>తేషాం న పునరావృత్తిః॥ | అట్టి వారు **"జ్యోతిరభిమానదేవత"**ను పొందుచున్నారు.<br>**జ్యోతి రభిమాన దేవత → అహరభిమానదేవతను, అహరభిమాన దేవత→ అపూర్యమాన (శుక్లపక్ష) దేవతను పొందుచున్నారు.**<br>సూర్యుని మహాతేజోమయ విభవముతో నిండిన షణ్మాసము (ఆరు మాసములు) అనే ఉత్తరదిక్కును పొందుచున్నారు. ఆదిత్యుని షణ్మాసాయోగము పొందుచున్నారు.<br>☙ ఉత్తర షణ్మాసముల ఉపాసన వలన **దేవలోకాభిమాన దేవతను,**<br>☙ దేవలోకాభిమాన దేవత వలన → **ఆదిత్యుని (సూర్యుని),**<br>☙ ఆదిత్యునివలన → విద్యుదభిమాన దేవతను (తేజో సిద్ధిని) పొందుచున్నారు.<br>☙ విద్యుత్ (తేజో) అభిమాన దేవత (విద్యుల్లోకము) నుండి → **బ్రహ్మలోకమును** పొందుచున్నాడు.<br>ఆ విధంగా బ్రహ్మలోకమునందు శ్రేష్ఠులై, అనేక సంవత్సరములు బ్రహ్మలోకమునందు ఉనికిని పొంది ఉంటున్నారు.<br>"అట్టివారికి" పునరావృత్తి దోషము (చర్విత చర్వణంగా బ్రహ్మలోక నివాసమునుండి పురుగు వరకు ఉపాధుల రాకపోకలు) ఉండవు।<br>**ఇది ఉత్తరాయణ మార్గము.** |
| 16 అథ యే యజ్ఞేన దానేన<br>తపసా లోకాన్ జయన్తి,<br>తే ధూమం అభిసంభవన్తి॥<br>ధూమాత్ రాత్రిగ్ం।<br>రాత్రేః అపక్షీయమాణ।<br>పక్షం, అపక్షీయమాణ। పక్షాద్యాన్, | పైన చెప్పిన ద్యులోకాగ్ని - పర్జన్యాగ్ని - లోకాగ్ని - పురుషాగ్ని - యోషాగ్ని... అనబడునది పంచాగ్ని హోత్రాగ్ని ఉపాసన- **మోక్షోపాసన / ఉత్తరాయణ మార్గము.**<br>**ఇక దక్షిణాయణమార్గవర్తనులు.**<br>వీరు యజ్ఞ-దాన-తపస్సులను ఉత్తమలోకములను ప్రాప్తించుకొను ఆశయముచే నిర్వర్తించువారు. సకాములవటం చేత వీరు **"ధూమము"** (Smoke) నందు ప్రవేశము పొందుచున్నారు.<br>ధూమము నుండి **'రాత్రి'**ని పొందుచున్నారు.<br>రాత్రి నుండి క్షీణధర్మముగల **కృష్ణపక్షమును** పొందుచున్నారు. |

| | |
|---|---|
| **షణ్మాసాన్, దక్షిణాం ఆదిత్య ఏతి।**<br>**మాసేభ్యః పితృలోకం।**<br>**పితృలోకాత్ చన్ద్రం।**<br>**తే చన్ద్రం ప్రాప్య అన్నం భవన్తి।** | ☙ కృష్ణపక్షము (క్షీణించే పక్షము)ను ఆశ్రయించి - సూర్యుడు దక్షిణాయణమున సంచరించుమార్గమగు - దక్షిణాయణ షణ్మాసమును పొందుచున్నారు.<br>☙ షణ్మాస దక్షిణాయానమునుండి పితృలోకము పొందుచున్నారు.<br>☙ పితృలోకమునుండి మనోస్థితి రూపమగు చన్ద్రలోకమును చేరుచున్నారు.<br>☙ చంద్రుని రూపమునుండి అన్నము (ఆహారము) రూపము సంతరించు కుంటున్నారు. |
| **తాగ్ం తత్ర దేవా యథా సోమగ్ం రాజానమ్**<br>**ఆప్యాయస్వ అపక్షీయస్వ ఇత్యేవమేనాగ్ం।**<br>**తత్ర భక్షయన్తి। తేషాం యదా తాత్పర్యవైతి**<br>**అథేమమ్ ఏవ ఆకాశం అభినిష్పద్యన్తే॥**<br>**ఆకాశాత్ వాయుం। వాయోః వృష్టిం।**<br>**వృష్టేః పృథివీం। తే పృథివీం ప్రాప్య అన్నం భవన్తి।** | అట్టి ఆహారము పొందినప్పుడు ఋత్విక్కులు - "ఆప్యాయస్వ-అపక్షీయస్వ" -నింపుము-ఖాళీచేయుము...అనుచూ సోమరసము భక్షించు రీతిగా, వారు (కర్మఫలములను) భక్షిస్తున్నారు.<br>కర్మక్షయము అయిపోగానే దక్షిణాయన బాటసారి జీవులు ఆకాశరూపము పొందుచున్నారు. ఆకాశము నుండి వాయురూపమును పొందుచున్నారు. వాయువును, వాయువునుండి వర్షాన్ని ఆశ్రయిస్తున్నారు. వర్షము ద్వారా భూమిని చేరుచున్నారు. భూమిని చేరిన తరువాత మరల అన్నముగా అగుచున్నారు. |
| **తే పునః పురుష అగ్నౌ హూయన్తే।**<br>**తతో యోషా అగ్నౌ జాయన్తే,**<br>**తే లోకాన్ ప్రతి ఉత్థాయినస్త (ప్రత్యుత్థాయినస్త)**<br>**ఏవం ఏవ అనుపరివర్తన్తే।** | ఆ తరువాత ఆ కర్మఫలోపాసకులు దేవతలచే పురుషాగ్నిలో 'హవము' చేయబడి, మరల లోకములో దేహము రూపము పొందుస్థితిని ఆశ్రయిస్తున్నారు. మరల యోషాగ్నిలో ప్రవేశించుచున్నారు. ఈ విధంగా కామ్యకర్మిష్ఠులు దృశ్యములో ఏదో....లోకములు మొ॥వి పొందాలనే ఆశయములుగల వారు అగుచున్నారు. **మరల మరల జనన - మరణ స్థితి-గతులలో తిరుగాడుచూనే ఉన్నారు.** |
| **అథ య ఏతౌ పన్థానౌ న విదుః, -**<br>**- తే కీటాః పతంగా యత్ ఇదం దన్దశూకమ్॥**<br><br>**ఇతి బృహదారణ్యకోపనిషత్ - అష్టమాధ్యాయః**<br>**"కర్మ విపాక బ్రాహ్మణమ్" నామ ద్వితీయబ్రాహ్మణమ్।** | పై రాక పోకలు కారణంగా మరణానంతర లోకములు నిండటము లేదు. ఇక ఈ ఉత్తరాయన (జ్ఞాన) మార్గముగాని, దక్షిణాయన (కర్మఫల) మార్గముగాని ఎరుగని జీవులు **మూడవ రకము** వారు. వీరు మరణానంతరము కీటకాలుగాను, పురుగులుగాను, దోమలుగాను పుట్టుచున్నారు. మరల ఎప్పటికో మానవ జన్మకు వస్తున్నారు.<br>ఈ విధంగా మరణానంతరము (1) ఉత్తరాయణ (2) దక్షిణాయన, దుష్టకర్మ మార్గములలో ఈ జీవులు ప్రయాణిస్తున్నారు. దక్షిణాయన - కర్మఫల (అజ్ఞాన) మార్గములో ప్రయాణించు జీవులు మరల మరల జన్మ - మరణ పరంపరలను పొందుతూ, అనంతకాలము జీవన్మరణ చక్రములో తిరుగాడుచున్నారు.<br>**ఉత్తరాయణ మార్గముచే బ్రహ్మలోకము చేరి జనన - మరణ చక్రము నుండి బయల్వెడలుచున్నారు.**<br>ఇది మొదటి మూడు ప్రశ్నలకు, ఐదవ ప్రశ్నకు సమాధానము.<br>(ఉత్తరాయణం = **ఆత్మోపాసన.**<br>దక్షిణాయణం = **దృశ్యోపాసన. కర్మ ఫలమార్గము)**<br><br>**ఇతి బృహదారణ్యకోపనిషత్ - అష్టమాధ్యాయః**<br>**"కర్మ విపాక బ్రాహ్మణమ్" నామ ద్వితీయబ్రాహ్మణమ్।** |

# అష్టమాధ్యాయః - తృతీయం బ్రాహ్మణము

## శ్రీమంథ బ్రాహ్మణము

| | |
|---|---|
| 1 స యః కామయేత<br>మహత్ ప్రాప్నుయామ్ ఇతి॥ | **స్వాహా** = దేవతలకు ఆహుతలను సమర్పిస్తూ ఉన్నప్పుడు చెప్పు 'వేదశబ్దము'. (సమస్తము స్వస్వరూపమే అయి ఉన్నది-అనునది గూడార్థము).<br>**మంథ** = గొప్పతనము। **శ్రీమంథ** = గొప్పసంపద।<br>వైదిక కర్మలకు అధికారి (Authorised) అయి ఉండి, అట్టి కర్మలు నిర్వర్తిస్తూ మహత్- సిరి-సంపద-(లోకసంబంధమైన) ప్రయోజనములు, ఉత్తమ గతులు ఉద్దేశ్యించువారు వాటిని ఎట్లా ప్రాప్తించుకోగలరో - చెప్పుకుంటున్నాము. |
| ఉదగయన, ఆపూర్యమాణ పక్షస్య,<br>పుణ్యా హే ద్వాదశాహం ఉపసద్ వ్రతీ భూత్వా,<br>ఔదుంబరే కగ్ంసే<br>చమసే వా, సర్వ ఔషధం ఫలాని –<br>ఇతి సంభృత్య, పరిసమూహ్య,<br>పరిలిప్య, అగ్నిమ్ ఉపసమాధాయ।<br>పరిస్తీర్య ఆవృత ఆజ్యగ్ం సగ్ంస్కృత్య<br>పుగ్ంసా నక్షత్రేణ "మన్థగ్ం"<br>సన్నీయ జుహోతి। | <u>**ఒకానొక వ్రతము సూచించబడుతోంది.**</u><br><u>**మంథ కర్మ శ్రీమంథ వ్రతము. వ్రత సంకల్పము.**</u><br>→ ఉత్తరాయణములో, శుక్లపక్షమునందు, పుణ్యతిథినాడు ప్రారంభించబడు గాక।<br>12 రోజులు '**ఉపసదస్సు**' అనే నియమమును ఆచరిస్తూ (పాలు మాత్రమే ఆహారముగా తీసుకొనుచున్నవాడై) ఉండెదరు గాక।<br>మేడికట్టె (wood)తో చేసిన కంచముగాని, కంచుతో తయారుచేసినదిగాని అగు సోమపానపాత్రగాని, (చమస పాత్రను) సిద్ధం చేసుకోవాలి.<br>→ సర్వ ఓషధ ద్రవ్యములను (మినుములు, పెసలు, ఉలవలు, వడ్లు, నువ్వులు, కందులు, గోధుమలు-నవ ధాన్యములను) ఆ చమస పాత్రలో ఉంచాలి.<br>పెరుగులో, తేనెలో, వెన్నలో నానపెట్టి ఒక పుల్లతో బాగుగా కలియబెట్టి, ఒక ముద్దగా తయారుచేయాలి. ఈ ముద్దను 'మంథసము' (మంథము) అని పిలుస్తారు.<br>వేదిక చుట్టూ దర్భలను పరచి, మధ్యలో అంతటా అలికి, స్థాలీపాక పద్ధతిలో నేతితో పూయబడిన చేతులతో పిష్టము (ముద్ద) చేసి, దర్భలపై పరచాలి. వేదికపై విడిగా అగ్నిని వెలిగించి (మధ్యగా) అగ్నిలో హోమము చేయాలి! |
| యావన్తో దేవాః త్వయి జాతవేదః<br>తిర్యఞ్చోఘ్నన్తి పురుషస్య కామాన్।<br>తేభ్యో అహం భాగధేయం జుహోమి। | "ఓ అగ్నిదేవా! దేవతలందరు మీలో జ్వలిస్తూ మీయందు మీకు అధీనులై ఉంటున్నారు. వారిలో కొందరు మాపై వ్యతిరిక్తమైన - వక్రమైన అభిప్రాయములు - అభినివేశములు కలవారై మాయొక్క కోరికలను వ్యతిరేకించువారై ఉంటున్నారు. మా కోరికలను కొట్టివేయుచున్నారు.<br>అట్టి దేవతల కొరకు, (మరియు) తదితర సర్వదేవతల ప్రీతి కొరకు మా కోర్కెలు తీర్చుటకై నవ ధాన్యములతో కూడిన పాలు, పెరుగు, వెన్న, తేనెలలో నాన్చిన పిష్టమును ఎంతో ఇష్టముగా, భక్తిపూర్వకంగా మీకు నివేదనము చేయుచున్నాము''. |
| తే మా తృప్తాః సర్వైః కామైః తర్పయన్తు స్వాహా॥<br>యా తిరశ్చీ నిపద్యతే అహం విధరణీ ఇతి।<br>త్వాం త్వా ఘృతస్య ధారయా<br>యజే సగ్ంరాధనీ మహగ్ం స్వాహా॥ | "అట్టి దేవతలందరూ నేను మీ ద్వారా నివేదనము చేస్తున్న ఈ 'పిష్టము'ను స్వీకరించువారై, మాకు సకల కామ్యములను ప్రసాదించి సంతృప్తిని కలిగించెదరు గాక! **తత్ సకలదేవతాయై స్వాహా।"**<br>"ఏఏ దేవత తిరశ్చీనము (అడ్డదిడ్డముగా) పోవు మార్గముగా 'సంసారము' రూపంగా మాపట్ల ధారణ కలిగి ఉన్నదో, ఆ దేవతను మేము ఈ 'నేతిధార'తో ఆరాధించుచున్నాము. మమ్ములను తిరశ్చీని (వక్ర) మార్గము నుండి జ్ఞానమార్గము వైపుగా నడిపించును గాక।''<br>- **'స్వాహా' స్వీకరించండి! ఆయా దేవతలకు అందించండి!** అని గరిట (స్రువముతో) తీసుకొన్న నెయ్యిని అగ్నికి సమర్పించి, శేషించిన నేయిబొట్లను 'పిష్టము' పై వేయాలి. |

| | |
|---|---|
| 2. "జ్యేష్ఠాయ స్వాహా।<br>శ్రేష్ఠాయ స్వాహా" । | **"జేష్ఠాయ స్వాహా। శ్రేష్ఠాయ స్వాహా।"**<br>- జ్యేష్ఠుడగు ప్రాణదేవతకొరకు ఈ 'ఆహుతి'ని అగ్నికి సమర్పిస్తున్నాను.<br>- "శ్రేష్ఠుడగు ప్రాణదేవత కొరకు ఈ ఆహుతిని కూడా సమర్పిస్తున్నాను" అని అగ్నియందు రెండు ఆహుతులను సమర్పించాలి. |
| – ఇతి అగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి॥<br>– "ప్రాణాయ స్వాహా।<br>వసిష్ఠాయై స్వాహా।"<br>– ఇతి అగ్నౌ హుత్వా, మన్థే సగ్ంస్రవం<br>అవనయతి। | అట్లా హోమము చేసిన తరువాత స్రువము (నేతి గరిట) యందు మిగిలియున్న 'నేయి'ని మంథసము (నవధాన్య - ఓషధ పిష్టము)పై వేయాలి. **"ప్రాణాయస్వాహా! వసిష్ఠాయై స్వాహా!** (వసిష్ఠ గుణముతో కూడిన ప్రాణ దేవతకొరకు సమర్పిస్తున్నాను) - అని అగ్నియందు రెండుసార్లు హోమము చేసి స్రువమునందు ఇంకా మిగిలియున్న నేతిని మంథసము (పిష్టము) పై వేయాలి. |
| "వాచే స్వాహా। ప్రతిష్ఠాయై స్వాహా।"<br>– ఇతి అగ్నౌ హుత్వా, మన్థే సగ్ంస్రవం<br>అవనయతి । | **"వాచే స్వాహా ప్రతిష్ఠాయ స్వాహా!"** వాక్ రూపముగాను ప్రతిష్ఠిగాను ఉన్న స్వామీ! ఇదిగో! ఈ ఆజ్యము సమర్పిస్తున్నాను....అని అగ్నికి శ్రువముతో సమర్పిస్తూ మిగిలిన నేయిని మన్థసముపై సమర్పించాలి. |
| "చక్షుషే స్వాహా।<br>సమ్పదే స్వాహా।" ఇతి అగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి।<br>"శ్రోత్రాయ స్వాహా।<br>ఆయతనాయ స్వాహా।", ఇతి అగ్నౌ<br>హృత్వా, మన్థే సగ్ంస్రవం అవనయతి॥ | **"చక్షుషేస్వాహా। సంపదే స్వాహా"।** చక్షురింద్రియ రూపమున ఉన్న ప్రాణదేవా! "చూపు" అనే సంపద్గుణ విశేషరూపుడవగు ప్రాణదేవా!...అని అగ్నియందు స్రువము (గరిట)తో నేయిని రెండుసార్లు సమర్పిస్తూ, కొంత శేషించిన నేయిని మంథసముపై వేయవలెను.<br>**"శ్రోత్రాయ స్వాహా! ఆయతనాయ స్వాహా।"** అని పలుకుచూ, సద్గుణ విశిష్ఠమైన వినికిడికొరకు శ్రోత్రస్వరూపుడగు ప్రాణదేవతకు ఈ అజ్యమును సమర్పిస్తున్నాను...అని భావిస్తూ, గరిటతో నేయిని అగ్నికి ఆజ్యం చేస్తూ, కొంత నేయిని మన్థసముపై పోయాలి. (ఆయతనము= అగ్నిని- ఇల్లు, స్థానము, దేవాలయముగా ఉపాసించటము). |
| "మనసే స్వాహా। ప్రజాత్యై స్వాహా।"<br>– ఇతి అగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి॥<br>"రేతసే స్వాహా" ఇత్యగ్నౌ<br>హుత్వా, మన్థే సగ్ంస్రవమ్ అవనయతి॥ | **"మనసే స్వాహా! ప్రజాపత్యై స్వాహా।"** అంటూ ఉత్తమమైన ఆచరణ (ఆయతనము) గల మనస్సుకొరకై మనోదేవతకు ఈ ఆజ్యము సమర్పిస్తున్నాను" - అని నేయిని అగ్నికి, స్రువములో శేషించిన నేయిని మంథసము పైన సమర్పణగా పోయాలి. అట్లాగే "ఉత్తమమైన సంతాన రూపమగు రేతస్సుకొరకై, ఉత్తమగుణములు గల జనుల వృద్ధికొరకై ఈ నేయిని సమర్పిస్తున్నాను - **"రేతసే స్వాహా"**.... అని పలుకుతూ నేయిని అగ్నికి స్రువములో శేషించిన దానిని మన్థసమునకు సమర్పించాలి. |
| 3 "అగ్నయే స్వాహా" – ఇతి అగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి।<br>"సోమాయ స్వాహా" – ఇత్యగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి।<br>"భూః స్వాహా" – ఇత్యగ్నౌ హుత్వా,<br>మన్థే సగ్ంస్రవం అవనయతి"। | ఐశ్వర్యమును ప్రసాదించగలుగు ఈ **'పయః పానవ్రతము'**ను ఇంకా పై విధంగా కొనసాగించాలి,<br>"అగ్నయే స్వాహా।" → అగ్ని కొరకు ఆజ్యమును హోమము చేయుచున్నాను. (Respect to Zone of Wisdom).<br>**"సోమాయ స్వాహా!"** → చంద్రుని కొరకు ఆజ్యమును హోమము చేయుచున్నాను. (Respect to Zone of Matter).<br>**"భూః స్వాహా!"** → ఈ భూలోకము కొరకు ఆజ్యమును హోమము చేయుచున్నాను. (Respect to Zone of Matter). |

"భువః స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా,
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"సువః (స్వః) స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"భూర్భువస్సువః స్వాహా"
ఇత్యగ్నౌ హుత్వా మన్థే సగ్ంస్రవం అవనయతి।

"భువః స్వాహా" → అంతరిక్షము కొరకు ఈ ఆజ్యమును హోమము చేయుచున్నాను. (Respect to zone of Feelings and Thoughts)

స్వః స్వాహా → ద్యులోకము (ప్రకాశమయమగు దేవతా లోకములకొరకు) ఈ ఆజ్యమును హోమము చేయుచున్నాను. [(Respect to Zone of Self) (Feeler, Thinker)]

భూర్భువస్వః స్వాహా → భూ-అంతరిక్ష-ద్యులోకములకొరకు ఈ ఆజ్యమును అగ్నికి, మంథసమునకు సమర్పిస్తున్నాను-

-అంటూ, ఆజ్యమును (నేయిని) స్రువముతో అగ్నికి సమర్పిస్తూ, స్రువము (గరిటె)తో శేషించిన నేయిచుక్కలను (నవ ధాన్య - ఓషధ వనస్పతులతో నిర్మితమైన) ప్రతిఒక్కసారి "పిష్ఠము (పిండిముద్ద)"పై వేయాలి.

---

"బ్రహ్మణే స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"క్షత్రాయ స్వాహా" ఇత్యాగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।

'బ్రహ్మణే స్వాహా!' → బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణుల ఆనందము కొరకు, వారు నాపై ప్రసరించు 'ఆత్మాజ్ఞానామృతము' అను తత్త్వామృతవర్షము కొరకు ఈ ఆజ్యమును అగ్నికి, మంథసమునకు సమర్పిస్తున్నాను. బ్రహ్మమునకు సమర్పిస్తున్నాను.

'క్షత్రాయ స్వాహా!' → సామర్థ్యమును ప్రసాదించు దేవతల కొరకై ఈ నేయిని అగ్ని ద్వారా (మరియు) మంథసము ద్వారా ఆజ్యమును (నేయిని) ఆహుతము చేస్తున్నాను.

---

"భూతాయ స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"భవిష్యతే స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"విశ్వాయ స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"సర్వాయ స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।
"ప్రజాపతే స్వాహా" ఇత్యగ్నౌ హుత్వా
మన్థే సగ్ంస్రవం అవనయతి।

"భూతాయ స్వాహా!" - కాలస్వరూపదేవత యొక్క ఒక రూపమగు భూతకాలమునకు(For the factor of past) స్రువముతో ఈ నేయిని అగ్నికి, మరియు మంథమునకు సమర్పిస్తున్నాను.

"భవిష్యతే స్వాహా!" - భవిష్యత్ కాలదేవతకు (For the factor of Future) నేయిని అగ్నికి, మంథమునకు సమర్పిస్తున్నాను.

"విశ్వాయ స్వాహా"। - ఓ విశ్వరూప - జగత్ రూప మహాదేవా! వైశ్వానరా! ఇదిగో! ఈ నేయిని ఈ శ్రువముతో అగ్నికి, శేషించిన నేయిని మంథసమునకు సమర్పిస్తున్నాను.

"సర్వాయ స్వాహా!" ఓ సర్వము నీవై ఉన్న ఓ సర్వేశ్వరా। సర్వాంతర్యామీ! మిమ్ములను ఉద్దేశ్యించి ఈ అగ్నిద్వారా ఈ ఆజ్యమును అగ్ని - మంథసములకు సమర్పిస్తున్నాను.

అని మనసా, వాచా మననం చేస్తూ గరిటతో నేయి తీసుకొని రెండుసార్లు అగ్నికి సమర్పించి, శేషించినది ఒకసారిగా మంథమునకు సమర్పించాలి.

"ప్రజాపతయే స్వాహా"....అని ఈ విధంగా మొదలుపెట్టి ఒక్కొక్క ఆహుతి చొప్పున స్రువముతో నేయిని అగ్నితో హోమము చేస్తూ, స్రువము (గరిట)లో మిగిలిన దానిని 'మంథసము' నందు విడుచుచూ హోమము నిర్వర్తించాలి.

---

4 అథైనం అభిమృశతి,
భ్రమదసి। జ్వలదసి।, (భ్రమత్ అసి। జ్వలత్ అసి)
పూర్ణమ్ అసి। ప్రస్తబ్ధం అసి। ఏక సభం అసి।

ఈ విధంగా హోమము పూర్తి చేసిన తరువాత - మన్థస ద్రవ్యమును ప్రాణముతో ఏకం చేస్తూ... **ఓ మంథస ద్రవ్యమా!**

'భ్రమదసి' → నీవు వాయు రూపమున సర్వత్రా పరిభ్రమిస్తున్నావు.

"జ్వలదసి" → ప్రాణ దేవతారూపము ధరించి సకల ప్రాణులలో ప్రజ్వలిస్తున్నావు! ప్రకాశించుచున్నావు!

"పూర్ణమసి" → అంతటా అన్నిటా పూర్ణమై ఉన్నావు.

"ఏకసభమసి" - ఏకాంశగా ఈ జగత్తును ఏక సభరూపమున కలిగి ఉన్నావు. అనేకముగా కనిపిస్తున్న ఈ సమస్తము నీయొక్క ఏకాంశ (ఒకానొక అంశ)యే! ఈ జగత్తంతాకూడా నీ సభయే.

**హిఙ్కృ(ంకృ)తమ్ అసి। హిఙ్క్రి(ంక్రి) యమాణమ్ అసి।**
**ఉద్గీథమ్ అసి। ఉద్గీ(ద్గీ)యమానమ్ అసి।**
**శ్రావితమ్ అసి। ప్రత్యాశ్రావితమ్ అసి।**
**ఆర్ద్రే సన్దీప్తమ్ అసి।**
**విభూః అసి। ప్రభూః అసి।**
**అన్నమ్ అసి। జ్యోతిః అసి।**
**నిధనమ్ అసి। సంవర్గో అసి।**
**ఇతి॥**

**"హిఙ్కృతమసి"।** - యజ్ఞములో 'ప్రస్తోత' చేసే 'హిం'కారము మీరే। దేహము నుండి చెవులు మూసుకొనినప్పుడు వినబడు 'హింకార రూపము' మీరే! సర్వప్రాణులకు హితము చేయుచు, ప్రియమై ఉండు ప్రాణస్వరూపిణివి.

**"ఉద్గీథమసి"।** - యజ్ఞమంత్రములుగా బిగ్గరగా గానము చేయబడు గాన స్వరూపుడవై ఉన్నావు. (ఉత్ = ఎలుగెత్తి చేయుగీథము గానము, పాట)

**"ఉద్గీయమానమసి"।** - ఉద్గానమునకు ముందటి ప్రయత్నరూపమై ఉన్నావు. (సామగాన వేద ప్రణవ స్వరూపిణివి. సామగాన స్వరూపిణివి).

**"శ్రావితమసి"।** - మధురముగా వినిపించు వేద పలుకుల సంగీత రూపము నీవే! గంధర్వ శబ్దగానము నీవే! "ఓ అగ్నీధ్రా! దేవతలకు మా ఆహ్వానమును వినిపించండి" - అను ఆహ్వాన వేదశబ్దము మీరే।

**ప్రత్యాశ్రావితపసి।** - "అస్తు! అట్లాగే! శ్రేషట్! అవును। ఓ దేవదేవా! సావధానుడవు కమ్ము!" అనే ప్రత్యాశ్రావిత శబ్దము సంబోధిస్తున్నది మిమ్ములనే. పలుకుచున్నది కూడా మీరే।

**"ఆర్ద్రే సదీప్తమసి।"** - వేదగానము చేయుచుండగా హృదయము 'ఆర్ద్రత' పొందినప్పటి పరమప్రకాశము మీరే।

**"విభూరసి।"** - అనేక విభూతులుగా (రూపములుగా) ఉన్నది మీరే। (You are the one as all these many forms)

**"ప్రభూరసి।"** - సమర్థుడవు, ప్రభువు, ప్రభవముగా ఉన్నది మీరే।

"అన్నమసి" - 'అన్నము' గా ఉన్నది మీరే। అనుభవముగా పొందబడు చున్నదంతా మీరే।

**"జ్యోతిరసి।"** → సర్వజీవులు నీ జ్యోతిస్వరూపమే! మీరు పరంజ్యోతి స్వరూపులు.

"నిధనమసి।" → సర్వరూపుడవై, సర్వమును సృష్టించి, ధరించి, లయింపజేసుకొనునది మీరే। ఇదంతా మీయందే లయించినదగుచున్నది. సమస్తము సమాప్తము అగుచున్నది మీ స్వరూపముగానే।

**"సంవర్గోఅసి।"** → సర్వేంద్రియములను ఉపసంహరించుకునేది మీరే। ఉపసంహారము అయ్యేది మీయందే. మీయొక్క సంవర్గమే (మీకు చెందినదే) - ఇదంతా।

---

5 **అథైనం (అథ ఏనం) ఉద్యచ్ఛతి -**
**"ఆమగ్ంసి। ఆమగ్ంహి।"**
**(హి) తే మహి। స హి రాజేశానో**
**అధిపతిః। సమాగ్ం రాజేశానో।**
**అధిపతిం కరోతి। ఇతి।**

అప్పుడు "ఆమగ్ంసి-ఆమగ్ంసి" అనే మంత్రమును ఉచ్ఛరిస్తూ - రండి. నా అరచేతిని అలంకరించండి" అని చెప్పుచూ మంథనమును అరచేతిలోనికి తీసుకొని పైకి ఎత్తాలి.

- మీరు సర్వము ఎరుగుదురు.
- మీయొక్క మహత్తర - మహిమాన్విత రూపమును ధ్యానించుచున్నాము!
- ప్రాణదేవతారూపమగు మీరు సర్వత్రా ప్రకాశించుచున్నారు.
- సర్వమునకు అధిపతివి. నాకు, నా ఈ ఇంద్రియములకు, ఇంద్రియములకు విషయముగా కనిపించుదానికి యజమాని మీరే!
- సర్వమును శాసించుచున్నవారు.
- సర్వమును అధిష్ఠించి పాలించుచున్నవారు.

సర్వమును, ప్రకాశింపజేసి ప్రదర్శించుచున్నట్టి మిమ్ములను- మేము కోరుకొనువాటిని అధిపతిగా చేయమని ప్రార్థన!.

6 అథైనమ్ అచామతి "తత్సవితుర్వరేణ్యమ్"।
మధు వాతా ఋతాయతే।
మధుక్షరన్తి సిన్ధవః।
మాధ్వీర్నః సన్తు ఓషధీః। భూః స్వాహా।

ఇప్పుడిక ఈ మంథసమును మంత్రయుక్తముగా స్వీకరించాలి (భక్షించాలి).

గాయత్రీ మంత్రములోని మొదటి పాదమును (తత్సవితుర్వర్యేణ్యం), **'మధువాతా ఋతాయతే.....**మంత్రమును చెప్పుచూ 'భూః' మొట్టమొదటి కబళమును (విభాగమును) భక్షించాలి.

స్తోత్రార్హుడగు **తత్** ఆత్మస్వరూపుడా! సత్ ఆత్మస్వరూపుడా! మీవలననే గాలి మధురంగా వీస్తున్నది. మీవలననే నదులు సుఖకరంగా ప్రవహిస్తున్నాయి। ఓషధ రూపములగు వృక్షజాలములు మధురంగా - సుఖప్రదమై ఉంటున్నాయి. అట్టి మీ **'భూ'** స్వరూపమునకు ఈ మొదటి కబళము సమర్పిస్తున్నాను.

---

"భర్గో దేవస్య ధీమ హి।"
మధునక్తమ్ ఉతోషసో।
మధుమత్ పార్థివగ్ం రజః।
మధుద్యౌరస్తు నః పితా।
భువః స్వాహా।

అదేవిధంగా [భూలోకము -భువర్లోకము-సువర్లోకము (ద్యులోకము) మాపట్ల సుఖప్రసాదితములు అగుగాక!" అని భావిస్తూ] గాయత్రియొక్క రెండవ పాదము **"భర్గో దేవస్య ధీమహి"**తోను, రెండవ వ్యాహృతిలోను రెండవ ముద్దను భక్షించాలి.

**మధుమత్....**। మా పట్ల మధురమగుగాక! తేజోమయుడు అగు భర్గోదేవుడు మాకు ఉత్తమ బుద్ధిని ఇచ్చుగాక! రాత్రింబవళ్లు ఈ సమస్తము మాపట్ల మధురమగుగాక। ఈ పృథివీలోకము ప్రీతికరమగు గాక। తండ్రియగు ద్యులోకము మాకు ప్రియమగుగాక।

అంతరిక్షము కొరకు స్వాహా। (సమర్పిస్తున్నాము) ఇతి భువః స్వాహా॥

---

ధీయో యో నః ప్రచోదయాత్।
మధుమాన్ నో వనస్పతిః।
మధుమాగ్ం 3 అస్తు సూర్యః ।
మాధ్వీః గావో భవన్తు నః॥
సువః స్వాహా ఇతి।
(స్వస్స్వాహేతి)

"ఓ సూర్యదేవుని తేజోరూపమా! వేదములలో ప్రసిద్ధుడవగు తేజో పురుషుడా! మా యొక్క బుద్ధిశక్తులను ప్రేరేపించండి! సముత్సాహ పరచండి! మందముగా-నిద్రాణమైయున్న మాయొక్క ధీశక్తిని ఉత్తేజ పరచండి! అన్నమును ప్రసాదించు వనస్పతులు, వృక్షములకు ఆహారముగా అగు ఓషధ-ఆహార రసములు - మాపట్ల సుఖకరమగుగాక! ఆకాశంలో దేదీప్యమానంగా ప్రకాసించే సూర్యభగవానుడు "తన కిరణములతో మాపట్ల సుఖ ప్రసాదితులు అగుదురుగాక। "గో" (ఆవులు, కిరణములు, దిక్కులు) మా పట్ల మధురమగు సుఖ సంతోషములు ప్రసాదించునవి అగుగాక! పసుసంపద మాకు మధురమును ప్రసాదించునదై ఉండుగాక।

"దేవతాలోకము" అగు, సువర్లోకములో సూక్ష్మరూపులై, అశరీరారులై మమ్ములను కాపాడుచున్న దేతలకు - **"స్వాహా** । ఇదిగో, ఈ హవిస్సుయొక్క మూడవ కబళము సమర్పిస్తున్నాము" అని భుజించాలి.

---

సర్వాం చ సావిత్రీం అన్వాహ।
సర్వాశ్చ మధుమతీః ।
'అహమ్' ఏవ ఇదగ్ం సర్వం భూయాసం।
భూర్భువస్సువః స్వాహా। - హి ఏతత్।
అన్తత ఆచమ్య,
పాణీ ప్రక్షాళ్య జఘనేన।
అగ్నిం ప్రాక్ఛిరాసః (ప్రాక్ శిరాః) సంవిశతి।

ఆ తరువాత త్రిపదాగాయత్రిని (**"తత్సత్‌వితర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్"**...అని) మొత్తము మంత్రము చదువుచూ, **"ఈ సర్వములోని మధుర మాధ్యురసము నేనే। ఇదంతా నేనే। నేనే ఈ దృశ్యమంతా అయి ఏర్పడినవాడనై ఉన్నాను"- అని చెప్పుచూ "భూర్భువస్సువః స్వాహా।** భూలోకము - అంతరిక్షము - ద్యులోకమునకు ఈ మంథము యొక్క నాలుగవ ముద్దను సమర్పిస్తున్నాను । **స్వాహా"** - అంటూ స్వీకరించాలి.

యజమాని → ఈ విధంగా మంథసముయొక్క '4' ముద్దలను స్వీకరించి, అప్పుడు చేతులు కడుగుకొని మరల "ఓం కేశవాయస్వాహా....." మొదలైన (24+1)నామములు పలుకుచూ పునః ఆచమనం చేయాలి! ఆ తరువాత అగ్నికి వెనుకవైపుగా... తూర్పుముఖము కలవాడై శయనించాలి!

ప్రాతః ఆదిత్యం ఉపతిష్ఠతే।
దిశామ్ ఏక పుండరీకమ్
అస్య అహం మనుష్యాణాం
ఏక పుణ్డరీకం భూయాసం
ఇతి యథేతమ్ ఏత్య జఘనేన
అగ్నిం ఆసీనో, వగ్ంశం జపతి।

మరల సూర్యోదయ సమయాన ప్రాతఃకాలంలో లేచి, స్నానాదులు ముగించుకొని తూర్పువైపు ముఖముతో ఆదిత్యుని (సూర్యునికి) అభిముఖంగా నిలబడి ప్రార్థించాలి.

ఓ సూర్యదేవా! దిక్కులన్నిటికీ ఏకైక పుండరీకమువు, అధిపతివి నీవు. **"నేను జనులందరికి అధిపతిని, శ్రేష్ఠుడను (పుండరీకమును) అగుదునుగాక - అని ప్రార్థిస్తున్నానయ్యా! నిన్ను అందుకు శరణు వేడుచున్నాను"** అని ప్రార్థన చేయాలి.

యథావిధిగా అగ్నిగుండమునకు జఘనముగా (వెనుకభాగమునకు)- వెళ్ళి సుఖంగా ఆశీనుడై 'వంశబ్రాహ్మణము'ను ధ్యానించాలి.

---

7 తగ్ం హై తం ఉద్దాలక ఆరుణిః,
వాజసనేయాయ యాజ్ఞవల్క్యాయ-
అన్తేవాసిన ఉక్త్వో వాచాపి।
య ఏనగ్ం శుష్కే స్థాణౌ నిషించేత్
జాయేరన్ శాఖాః
ప్రరో హేయుః పలాశాని। ఇతి॥

ఈ సుప్రసిద్ధమైన **"మంథస యజ్ఞకర్మ"**ను అరుణిఋషి కుమారుడగు ఉద్దాలక మహర్షి తనయొక్క ప్రియశిష్యుడు, 'వాజనేయశాఖాధ్యయనము' చేసియున్నవారు - అగు యజ్ఞవల్క్య మునిసత్తమునికి బోధించారు.

శ్రీ మంథస ఆహుతిని ఒక ఎండిపోయిన - శిధిలమైన వృక్షము మొద్దుపై పాలతో సంస్కరిస్తే, ఆ మొద్దునుండి మరల కొమ్మలు పుట్టగలవు. ఆకులు చిగురిస్తాయి. మంథసకర్మ ఇంతటి మహత్తరమైనది.

---

8 ఏతము హైవ వాజసనేయో,
యాజ్ఞవల్క్యో, మధుకాయ, పైంగ్యాయ (పైంగాయ)
అన్తేవాసిన ఉక్త్వ వాచాపి య
ఏనగ్ం శుష్కే స్థాణౌ నిషించేత్ జాయేరన్ శాఖాః
ప్రరోహేయుః పలాశాని। ఇతి॥

అట్టి ఈ శ్రీ మంథస యజ్ఞవిద్యను వాజసనేయశాఖాధ్యయునుడగు యాజ్ఞవల్క్యులవారు తన ప్రియాతిప్రియశిష్యుడగు పైంగి మధుక ఋషికి బోధించారు. బోధిస్తూ ఇట్లా చెప్పారు. **"ఓ మధుకుడా! ఈ శ్రీమంథ విద్య మహత్తరమైనది సుమా! మొద్దుగా ఉండే వృక్షము నుండి చిగుళ్ళు, కొమ్మలు పుట్టురీతిగా , మొద్దుగా ఉండే బుద్ధి నుండి బ్రహ్మైక్యత్వము జనింపజేయగలదు".**

---

9 ఏతము హైవ మధుకః
పైంగ్యశ్చూలాయ భాగవిత్తయే
అన్తేవాసిన ఉక్త్వో వాచాపి - య ఏనగ్ం
శుష్కే స్థాణౌ నిషించేత్ జాయేరమ్ శాఖాః
ప్రరోహేయుః పలాశాని ఇతి॥

ఆ తరువాత పైంగమధుక ఋషి తన శిష్యుడు చూలభాగవిత్తికి బోధించారు. బోధిస్తూ..."ఎవ్వడైనా ఈ శ్రీమంథనమును ఎండిన మోడుపై చల్లితే....అది తిరిగి మొలకలు పొంది కొమ్మలు మొలుస్తాయి. ఆకులు తొడుగుతాయి. అజ్ఞాని సుజ్ఞాని అవుతాడు" - అని వివరించాడు.

---

10 ఏతము హైవ చూలో భాగవిత్తిః
జానకయే ఆయస్థూణాయ
అన్తేవాసిన ఉక్త్వో వాచాపి
య ఏనగ్ం శుష్కే స్థాణౌ
నిషించేత్ జాయేరన్ శాఖాః
ప్రరోహేయుః పలాశాని ఇతి॥

ఆ చూల భాగవిత్తి తన శిష్యుడు, జనకుని కుమారుడగు ఆయస్థూణునికి ఉపదేశించారు. "శుష్కించిన స్థాణువు (చెట్టు) చిగురించు తీరుగా అజ్ఞానియందు ఆత్మ విజ్ఞానమును ఈ శ్రీమంథస అగ్నియజ్ఞము ఉదయింపజేయగలదు" - అని కూడా బోధించారు.

---

11 ఏతము హైవ జానకిః ఆయస్థూణః
సత్యకామాయ జాబాలాయ అన్తేవాసిన
ఉక్త్వో వాచాపి, య ఏనగ్ం శుష్కే స్థాణౌ
నిషించేత్ జాయేరన్ శాఖాః
ప్రరోహేయుః పలాశాని ఇతి॥

ఆ జానకి ఆయస్థూనుడు తన ప్రియశిష్యుడగు సత్యకామ జాబాలునికి బోధించారు. ఎండిన మ్రాను ఈ శ్రీమంథస ద్రవ్యస్పర్శచే తిరిగి ఆకులు, పూలు, ఫలములతో పునఃజీవనము పొందగలదు - అని ఉపదేశించారు.

**"సాంసారిక దృష్టులచే నిర్వీర్యుడై, భ్రమాకర్షితుడైన జీవుడు కూడా శ్రీ మంథస యజ్ఞముచే బ్రహ్మత్వము - పుణికుపుచ్చుకొనుటకు సంసిద్ధుడు కాగలడు".**

| | |
|---|---|
| 12 ఏతము హైవ సత్యకామో జాబాలో<br>అన్తేవాసిభ్య ఉక్త్వోచాపి<br>య ఏనగ్ం శుష్కే స్థాణౌ<br>నిషించేత్ జాయేరన్శ్ఛాఖాః (శాఖాః)<br>ప్రరోహేయుః పలాశాని ఇతి।<br>తమేతం నాపుత్రాయవా (న అపుత్రాయవా)<br>అనన్తేవాసినే వా బ్రూయాత్॥ | ఈ మంథసకర్మనే సత్యకామజాబాలుడు తన శిష్యులకు ఉపదేశిస్తూ ఈ రెండు విషయాలు కూడా తెలియజేశారు.<br>(1) ఎవ్వడైతే శ్రీమంథసమును ఎండినమ్రానుపై చల్లుతారో, ఆ మోడు మరల చిగురించగలదు. సమస్త కోరికలు సిద్ధించగలవు.<br>(2) ఈ **'మన్థసరూప హవిస్సు'** విధిని శిష్యుడుకానివానికి, పుత్రుడు కానివానికి బోధించకూడదు.<br>(1) బ్రహ్మచారి (2) గురు దక్షిణ ఇచ్చువాడు (3) మేధావి (4) శ్రోత్రియుడు (5) గురువుకు ప్రియమైనవాడు - ఈ ఐదు లక్షణములు గల శిష్యుడే ఇందుకు అర్హుడు. |
| 13 చతుః ఔదుంబరో భవతి।<br>ఔదుంబరః స్రువ। ఔదుంబరః చమస।<br>ఔదుంబర ఇధ్మ।<br>ఔదుంబర్యా ఉపమన్థన్యౌ।<br>దశ గ్రామ్యాణి ధాన్యాని భవన్తి॥ | ఔదంబరముతో (మేడికర్ర)తో తయారు చేయబడిన 4 వస్తువులు ఈ శ్రీమంథనమునకు ఉపకరణములు.<br>(1) ఓదుంబర స్తువము (2) ఓదుంబర చమస పాత్ర (3) ఓదుంబర సమిధ (4) ఓదుంబర చిన్నకవ్వము ఈ నాలుగు మేడి కర్రతో చేసినవి వాడబడుగాక. |
| వ్రీహి యవాః తిల మాషా అణు ప్రియంగవో<br>గోధూమాశ్చ మసూరాశ్చ, ఖల్వాశ్చ,<br>ఖలకులాశ్చ, తాన్ పిష్టాన్ దధిని,<br>మధుని ఘృత ఉపనిషించ త్యాజ్యస్య జుహోతి।<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ అష్టమాధ్యాయమ్। –</u>**<br>**<u>'శ్రీ మంథ బ్రాహ్మణమ్' నామ తృతీయ బ్రాహ్మణమ్॥</u>**<br>**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>** | గ్రామములో లభించే 10 రకాల ధాన్యములు మంథమునకు ఉపయోగించబడుచున్నాయి. (అధికంగా ఏవైనా లభిస్తే అవికూడా వాడవచ్చు).<br>దశ (10) గ్రామ్యములైనట్టి వడ్లు, బార్లీ, మినుములు, చిరువడ్లు, కొర్రలు, గోధుమలు, ఉలవలు, అనుములు, ఖలకులు, ధాన్యములు - వీటితో పిండిని తయారుచేయాలి.<br>- ఆ పిండిని పెరుగులో, తేనెలో నేతితో తడిపి ముద్ద చేయాలి.<br>- నేతితో హోమము చేయాలి.<br>- హోమము కొరకై దినుసులను మధురఫలరసములను ఉపయోగించ వచ్చు.<br>ముద్దపై - అగ్నిలో వేయగా మిగిలిన నేతిని హోమము చేయాలి. ఆ తరువాత ఆ హోమద్రవ్య ఓషధ సమన్విత - శ్రీమంథమును పరమాత్మయొక్క సృష్టి ప్రసాదంగా భావించి, నాలుగు విభాగములు చేసి భుజించాలి.<br><br>**<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ అష్టమాధ్యాయమ్। –</u>**<br>**<u>'శ్రీ మంథ బ్రాహ్మణమ్' నామ తృతీయబ్రాహ్మణమ్॥</u>**<br>**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>** |

# అష్టమాధ్యాయః - చతుర్థ బ్రాహ్మణము

## రేతసో వాజపేయ బ్రాహ్మణము

| | |
|---|---|
| 1 ఏషాం వై భూతానాం పృథివీ రసః ।<br>పృథివ్యా ఆపో। అపాం ఓషధయ।<br>ఓషధీనాం పుష్పాణి।<br>పుష్పాణాం ఫలాని।<br>ఫలానాం పురుషః।<br>పురుషస్య "రేతః"।। | ఈ ఎదురుగా కనిపిస్తున్న స్థావర - జంగమాత్మకమైన సర్వవస్తు జాలములలోకెల్లా "పృథివి" అత్యంత శ్రేష్ఠమైనది, సారభూతమైనది రసస్వరూపము.<br>భూమియొక్క సారము - "ఉదకము (నీరు)".<br>ఉదకము యొక్క సారము ఓషధులు 'పూతీగలు - మొక్కలు'.<br>ఓషధుల యొక్క సారము - "పుష్పములు".<br>పుష్పముల సారము ఫలములు. ఫలముల యొక్క సారము- "పురుషుడు".<br>పురుషుని యొక్క సారము - "రేతస్సు". |
| 2 సహ ప్రజాపతిః ఈక్షాన్‌చక్రే హన్తాస్మై<br>ప్రతిష్ఠామ్ కల్పయాని ఇతి।<br>స స్త్రియగ్ం సస్పృజేతాగ్ం<br>సృష్ట్వా, అథ ఉపాస్త।<br>తస్మాత్ స్త్రియం' అథ ఉపాసీత। | **సర్వభూతముల సారమే రేతస్సు.**<br>కనుక ప్రజాపతి **"ఈ రేతస్సుకు తగిన స్థానమును కల్పించాలి"** అని సంకల్పించారు.<br>ఆ ప్రజాపతి 'స్త్రీ'ని సృష్టించి ఉపస్థ (సంభోగ) కర్మను సేవించారు.<br>అందుచేతనే **'స్త్రీ' దేవతారూపముగా పూజాభావనతో ఉపాసించబడును గాక! "వీరు కదా, ఈ దేహమును గర్భములో '9' నెలలు మోసి రక్షించునది"** - అని మాతృసమానమైన పూజాభావము కలిగి ఉండాలి. |
| స ఏతం ప్రాఞ్చం గ్రావాణం ఆత్మన ఏవ<br>సముదపారయత్ తేనైనామ్ అభ్యసృజత్।। | తాను సృష్టించిన స్త్రీని చూచిన ప్రజావతి వేగముతో కూడిన చంద్రకిరణములను పాషాణ సదృశమైన జననేంద్రియములో ప్రవేశింపజేశారు. ఆ స్త్రీతో సంసర్గము పొందారు. |
| 3 తస్యావేదిః ఉపస్థో లోమాని<br>బర్హిః చర్మాధిషవణే సమిధో<br>మధ్యతస్తౌ ముష్కౌ స యావాన్ హ వై<br>వాజపేయేన యజమాన్యస్య లోకో భవతి। | **వాజపేయ యజ్ఞ ఉపమాన పూర్వకంగా :**<br>యోని '→ 'యజ్ఞవేదిక".<br>- వెంట్రుకలు → "దర్భలు".<br>- రహస్య ప్రదేశమునందలి చర్మము రేక "సోమఫలకము" యోని పార్శ్వముల యందుగల కఠినమైన మాంసఖండములు - సోమ ఫలకమునందలి వృషణములు **"అగ్ని"**.<br>ఈ విధముగా జీవుల జనన స్థానమగు స్త్రీ యోనిని యజ్ఞశాలగా భావించి ఉపాసించువారికి వాజపేయ యజ్ఞకర్తకు లభించు ఉత్తమ లోకములు, శుభఫలములు సిద్ధించగలవు. |
| తావాన్ అస్య లోకో భవతి।<br>య ఏవం విద్వాన్ అథః ఉపహాసం<br>చరతి ఆసాగ్ం స స్త్రీణాగ్ం సుకృతం వృంజ్క్తే।। | స్త్రీని - తనతో సహా సర్వదేహులకు - జీవులకు జన్మనిచ్చి మహోపకారము చేయుచున్న దేవతా రూపముగా భావించి ఉపాసించువాడు, అట్టి పవిత్ర దృష్టితో స్త్రీ సాంగత్యమును భావించువాడు ఆ స్త్రీలు చేయు పుణ్య కార్యముల ఫలమును తాను కూడా సరిసమానంగా పొందుచున్నాడు. |
| అథ య ఇదమ్ అవిద్వాన్ అథ్య ఉపహాసం<br>చరతి అస్య స్త్రియః సుకృతం వృఞ్జతే।। | స్త్రీని - తనతో సహ జీవులందరికి జన్మనిచ్చు దేవతగా భావించక, స్త్రీయొక్క ఔన్నత్యమును గుర్తించక, స్త్రీ సాంగత్యమును కేవలము ఇంద్రియానందముగా మాత్రమే - చూచువాడు - ఆతని సుకృతములను స్త్రీకి సమర్పించుచున్నవాడు అగుచున్నాడు. తాను తనయొక్క కొన్ని పుణ్యఫలములను కోల్పోవుచున్నవాడు అగుచున్నాడు. |

4. ఏతద్ధస్మ (ఏతత్ హ అస్మ) వై తత్ విద్వాన్ ఉద్దాలక ఆరుణిః।
ఆ హై తద్ధస్మ (తత్ హ అస్మ) వై తత్ విద్వాన్ నాకో మోద్గల్య।
ఆ హై తద్ధస్మ వై తత్ విద్వాన్ కుమార హారిత
–ఆహ, బహవో మర్యా బ్రాహ్మణాయనా
నిరింద్రియా విసుకృతో అస్మాత్ లోకాత్ ప్రయన్తి।
య ఇదమ్ అవిద్వాగ్ం సో అథ ఉపహాసం చరన్తి ఇతి।
బహు వా ఇదగ్ం సుప్తస్య వా,
జాగ్రతోవా రేతః స్కన్దతి॥

ఈ విషయంలో....

-వాజపేయ యజ్ఞమహిమాకోవిదుడగు ఆరుణి కుమారుడు ఉద్దాలకుడు అను మునీశ్వరుడు, ముద్గలమునీంద్రుని కుమారుడగు నాకుడు అను ముని, కుమార హరితుడు, - ఈ ముగ్గురు ఒకప్పుడు ఇట్లా తమ శిష్యులకు బోధించటము జరిగింది.

స్త్రీతో సంగమము వాజపేయయాగముతో సమానముగా భావనచేయక బ్రహ్మమును ఉపాసించు ముముక్షువులు మైథునము చేసినను (అట్లాగే) మేలుకొనినప్పుడో, నిదురించినప్పుడో "స్ఖలనము" జరిగితే, వారికి పాయశ్చిత్తము (దోషపరిహారార్థము నిర్వర్తించవలసిన కర్మవిధిని) ఇప్పుడు చెప్పుకోబోవుచున్నాము! మీరంతా వినండి"!

---

5 తదభి మృశేత్ అను వ
ఆమన్త్రయేత:
"యన్మే ఆద్యరేతః। (యత్ మే ఆద్యరేతః)।
పృథివీం అస్కాన్త్సీద్య దోష ధీరప్య సరద్య దపః
ఇదమ్ అహం తత్ రేత ఆదదే।
పునః మామైత్విన్ద్రియం। (మామ్ ఏతి ఇంద్రియం) పునః తేజః।
పునః భగః। పునః అగ్ని ధిష్ణియా।
యథా స్థానం కల్పన్తామి।"
ఇతి అనామికాం అంగుష్ఠాభ్యాం
ఆదాయాన్తరేణ స్తనౌ వా, భ్రువౌ వా నిమృజ్జ్యాత్॥

"స్త్రీ - దేవీ ఉపాసనా భావన (లేదా) ఉత్తమసంతాన సిద్ధి" అనే సంకల్ప యజ్ఞభావన లేకుండా అసంకల్పితంగానో, సంకల్పితంగానో అస్త్రీయుతంగా రేతస్కలనము జరిగినప్పుడు (బ్రహ్మచారులు, సన్యాసులు, గృహస్తులు కూడా) రేతస్సును, స్పృశించి - ఈ విధంగా ప్రాయశ్చిత్తమును అభిమంత్రించాలి।

"ఈ నా వీర్యము స్కలనమై భూమిపై పడినది కదా! అది అన్నముతో కూడిన సారాంశము (మరియు) ఉదకముతో కూడి ఉన్నట్టిది. ఈ రేతస్సును "అన్నమ్ సార బ్రహ్మమ్ ఇతి"...అను భావనతో స్పృశిస్తున్నాను" అని భావించుచూ, అంగుష్ఠ - అనామికలతో (బొటనవ్రేలు-క్రిందనించి రెండవ వ్రేలుల చివరల కలయికతో) స్పృశించి, స్తనములకు - భ్రూమధ్య భాగమునందు రాస్తూ ఈ మంత్రార్థమును స్మరించునుగాక।

- "ఈ ఇంద్రియ తేజస్సు తిరిగి నాయందు యధాతథమై ప్రవేశము పొందునుగాక!

- నా నుండి బయల్వెడలిన వీర్యము మరల నాదేహంలో పునరుత్పన్నమై నాయందు సౌభాగ్యముగా, తేజస్సుగా ప్రకాశించుచుండునుగాక।

- అగ్నియందు నివాసము కలిగియున్న ఓ దేవతలారా! తిరిగి నా దేహమును రేతస్సుతో ప్రజ్ఞానసమన్వితముగా నింపి ఉంచమని మిమ్ములను ప్రార్థిస్తున్నాను".

---

6) అథ యత్ ఉదక ఆత్మానం
పరివశ్యేత్ తత్ అభిమన్త్రయేత।
"మయి తేజ ఇన్ద్రియం, యశో ద్రవిణగ్ం సుకృతమితి"
"శ్రీర్హవా (హవా) ఏషా స్త్రీణాం యత్ మలోద్వాసాత్।
తస్మాత్ మల ఉద్వాసనం
యశస్వినీం అభిక్రమ్యమ్ ఉపమన్త్రయేత।

ఎప్పుడైనా ఉదకమునందు సంకల్పితంగానో - అసంకల్పితముగానో రేతోస్ఖలనము (వీర్యపతనము) జరిగినప్పుడు - అప్పుడు ఆ బ్రహ్మచారి, సన్యాసి, వానప్రస్తుడు (లేక) గృహస్థుడు కూడా -

"ఓం మయి తేజ ।
ఓం మయి తేజ ।
ఓం మయి తేజ" ।

అను మంత్రమును జపిస్తూ, తన ప్రతిబింబమును జలములో చూస్తూ అభిమంత్రించాలి.

గృహస్థుడైతే... తన భార్య రూపమును తలచుకొంటూ→

"నా భార్య లక్ష్మీస్వరూపినిగా నేను భావించి ఆమె రూపమును పరాప్రేమతో ఉపాసించుచున్నాను.

- అట్టి లక్ష్మీస్వరూపిణియగు నా జీవిత భాగస్వామిని త్రిరాత్ర్యానంతరము (రజస్వల దినముల తరువాత) నేను కలయునప్పుడు ఈ జలములో నివశించు దేవతలు నాకు సత్సంతానము, ఉత్తమవంశజులను ప్రసాదించుదురుగాక!"

అని చెప్పుచూ జలములోని దేవతలకు హృదయపూర్వకంగా నమస్కరించాలి.

| | |
|---|---|
| **7 సా చేత్ అస్మై న దద్యాత్ కామం<br>ఏనామ్ అవక్రీణీయాత్,<br>సా చేత్ అస్మై నైవ దద్యాత్ కామం,<br>ఏనాం యష్ట్యా వా పాణినా వోపహత్య(తి)<br>అతిక్రామేత్ ఇన్ద్రియేణ, తే యశసా, యశ<br>ఆదద ఇతి అయశా ఏవ భవతి॥** | త్రిరాత్ర్యానంతరము (రజస్వలానంతరము) సత్సంతానము కొరకై ప్రేమతో, వాత్సల్యముతో (లేక) కించిత్ అధికారముతో - "రజోరూపమైన ఇంద్రియములతో మీయొక్క రజస్సును గ్రహించుచున్నాను" - అను మంత్రార్థముతో స్త్రీ రజస్సును అతిక్రమించి సంభోగ యజ్ఞమును నిర్వర్తించాలి. రజస్సును స్వీకరించాలి. |
| **8 సా చేత్ అస్మై దద్యాత్<br><u>"ఇంద్రియేణ తే యశసా</u><br><u>యశ ఆదధామి"</u> - ఇతి<br>యశస్వినావేవ భవతః॥** | స్త్రీ భర్తకు స్వాధీనమైన తరవాత ఆ పురుషుడు **"ఇంద్రియేణ తే యశ సాయశ ఆదదామి"** - "ఇంద్రియములతో మీ యశోతేజస్సును ఆక్రమించుచూ స్వీకరించుచున్నాను"....అను భావనతో సంభోగించాలి. స్త్రీ పురుషులు పరస్పర ఉపాసనాభావముచే సంభోగించుటచే సత్సంతానము, విజ్ఞులగు పుత్రులను పొందగలరు. |
| **9 స యాం ఇచ్ఛేత్ కామయేతం ఏతి,<br>తస్యాం అర్థం నిష్ఠాయ,<br>ముఖేన ముఖగ్ం సన్ధాయ,<br>ఉపస్థమ్ అస్యా అభిమృశ్య, జపేత్-<br><u>"అంగాత్ అంగాత్ సంభవసి।</u><br><u>హృదయాత్ అధిజాయసే।</u><br>స త్వం అంగ కషాయో అసి<br>దిగ్ధ విద్ధాం ఇవ మాదయే<br>మా మమూం (మాం అమూం) మయి।" ఇతి।** | జీవితభాగస్వామి సంభోగమునకు ప్రీతిగా ఉన్నదని గ్రహించి అప్పుడు పురుషుడు సంసిద్ధుడు కావాలి. ముఖమును ముఖముతో సంప్రీతితో ఆనించి కలయికకు సిద్ధము కావాలి. హస్తముతో యోనిని స్పృశించుచూ "అంగాత్ అంగాత్ సంభవతి। ఓ రేతస్సా! నీవు నా శరీరము నందు తేజోరూపివై జనించుచున్నావు. ముఖ్యముగా అన్న రసమునుండి హృదయములో జనించి రసరూపివై సంసిద్ధమగుచున్నావు. అందుచేత విషముతో నిండిన బాణము జింకను స్వాధీనపరచుకొనురీతిగా, నా నుండి బయల్వెడలు రేతస్సు ఈ స్త్రీ యొక్క శోణితమును స్వాధీనము చేసుకొనెదవు గాక! సత్సంతానమునకు శుక్ల - శోణితములు ప్రవర్తమానము, ప్రవృద్ధమానము అగునుగాక" - అని భావన చేయాలి. |
| **10 అథయామి ఇచ్ఛేత్ న గర్భం దధీతి ఏతి -<br>తస్యామ్ అర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ం<br>సన్ధాయ అభిప్రాణ్యాత్ అపాన్యాత్ ఇంద్రియేణ<br>తే రేతసా రేత ఆదద।<br>ఇతి అరేతా ఏవ భవతి॥** | ఒకవేళ పురుషుడు - స్త్రీ (దంపతులు) "ఇప్పుడు గర్భధారణ వలదు" - అని అనుకుంటే...అప్పుడు<br>- ఆ పురుషుడు జీవితభాగస్వామి ఉపస్థను జననేంద్రియములతో స్పృశించుచు<br>- ముఖముతో ముఖమును జేర్చి, <u>"అభిప్రాణా అపాన్యాత్ ఇంద్రియేణతే రేతసా రేత ఆదదే"</u>...ప్రాణ - అపాన నిశ్వాసముతో అపానమువలన ఇంద్రియములను నియోగించి నా రేతస్సుతో నీ రేతస్సును - రజస్సును స్వీకరించివేయుచున్నాను. పీల్చుచున్నాను" ...అని పలుకుచూ, ఆ జీవిత భాగస్వామిని (స్త్రీని) అతిక్రమించాలి. అట్లు జపించగా ఆ సందర్భములో స్త్రీ రజస్సు లేనిదగుచున్నది. తత్కారణంగా ఆ స్త్రీ గర్భము ధరించదు. |

11 అథ చ యామ్ ఇచ్ఛేత్ దధీతి ఏతి,
తస్యామ్ అర్థం నిష్ఠాయ,
ముఖేన ముఖగ్ం సన్ధాయ,
అపాన్య అభి ప్రాణ్యాత్
"ఇన్ద్రియేణ తే రేతసా రేత ఆదధామి"। -
ఇతి గర్భిణి ఏవ భవతి।

ఆ తరువాత మరొకప్పుడు ఆ దంపతులు "గర్భము ధరించాలి"...అని తలచినప్పుడు పురుషుడు స్త్రీ ముఖమునందు ముఖమును ఉంచి, జననేంద్రియమును ఉపస్థతో స్పృశించి "అభిప్రాణ్యాత్ ఇన్ద్రియేణ తే రేతసా రేత్ ఆదాధామి"....అను మంత్రమును, మంత్రార్థమును భావన చేయునుగాక। "నిట్టూర్పుతో నీయొక్క రేతస్సుతో రేతస్సును ఉంచు చున్నాను"....అని జపించునుగాక. అప్పుడు స్త్రీ గర్భము కలిగినది అగుచున్నది.

---

12 అథ యస్య జాయయై జారస్య ఆత్తం చేత్,
ద్విష్యా దామపాత్రే అగ్నిమ్ ఉపసమాథాయ,
ప్రతిలోమగ్ం శరబర్హిః తీర్త్వా,
తస్మిన్ ఏతాః శరభృష్టీః ప్రతిలోమాః
సర్పిషాక్తా జుహుయాత్।

వాజపేయయాగ సంపత్తిగల పురుషుని భార్యతోగాని, మరొక పరస్త్రీతోగాని, జారత్వము అర్ధాయుష్షునకు, వినాశనమునకు కారణము.

**జారపురుషుని శిక్షించు విధి :**

- పంచభూత సంస్కారయుతముగా -
- పచ్చి మట్టిపాత్రలో అగ్నిని స్థాపించి,
- విపరీత విధానంగా (కుడి నుండి ఎడమకు గాని, తూర్పు నుండి పడమరకుగాని) శరభములను (దర్భలను) (బర్హి = దర్భ) పరచి,
-బాణాకారంగా ఉండే దర్భ చివరలను నేతితో తడిపి,
- దర్భల చివరలను వ్యతిరేకదిశలో ఉంచి...

---

"మమ సమిద్ధా హౌషీః
ప్రాణ అపానౌ త ఆదదే అసావితి।
మమ సమిద్ధే హౌషీః పుత్ర పశూగ్ంస్త
ఆదదే అసావితి॥
మమ సమిద్ధే హౌషీరిష్టా (హౌషీః ఇష్టా) సుకృతే త
ఆదదే అసావితి! మమ సమిద్ధే అహౌషీ
రాశాః పరాకాశౌ త ఆదదే అసావితి।
స వా ఏష నిరింద్రియో
విసుకృతో అస్మాత్ లోకాత్ ప్రైతి।
యం ఏవం విద్వాన్ బ్రాహ్మణః శపతి।

"మీరు పరస్త్రీ వ్యామోహముతో అస్మత్ జీవితభాగస్వామిపైగల దృష్టిదోషమును శిక్షించుటకై మీ ప్రాణ - అపానములను, పశుపుత్ర ఇత్యాది సంపదను, మీయొక్క శ్రోత్ర - స్మార్త కర్మ ఫలములను దోషాగ్నికి ఆహుతి అగునట్లు సంకల్పించుచున్నాను".

.... అని హోమము చేయుచున్నారు. అప్పుడు జారబుద్ధికలవాని పుణ్యకర్మలు నశించుచున్నాయి.

అందుచేత పరుల భార్యతో సంభోగేచ్ఛ అర్ధాయుష్షునకు, దుర్భర మరణమునకు కారణమగుచున్నదని పురుషులు గుర్తెరుగుదురుగాక!

పరస్త్రీ వ్యామోహము, పరభార్య జారత్వము అకారణమరణమునకు, చేసియున్న పుణ్యకార్యఫలము పోగొట్టుకోవటానికి, దుర్భర రోగపీడనములకు కారణముకాగలదని ఎరిగిఉండవలెను.

---

తస్మాత్ ఏవం విత్ శ్రోత్రియస్య
దారేణ న ఉపహాసమ్ ఇచ్ఛేత్ ఉత హి,
ఏవం విత్పరో భవతి॥

'శ్రోత్రియుని భార్యతో శృంగార పరిహాసము మొదలైనవి రోగమునకు, బలవన్మరణమునకు కారణములు అగుచున్నవి. పుణ్యసంపద క్షయమునకు దారితీయుచున్నది. విపత్తులను ఆహ్వానించటమగుచున్నది - " అని ఎరుగబడుగాక!

---

13 అథ యస్య జాయామార్తవం విన్దే
త్ర్యహం కగ్ంసేన పిబేత్।
అహత వాసా నైనాం వృషలో
న వృషల్యుపహన్యాత్।
త్రిరాత్రాన్త ఆప్లుత్య వ్రీహి నవ ఘాతయేత్।

**ఋతు కాలము గురించి**

స్త్రీ, ఋతుభావము పొందినప్పుడు '3' రోజులు కంచుపాత్రలో 'జలపానము' చేయునుగాక! రజోదూషితవస్త్రము ధరియించునుగాక! రాత్రిళ్ళు స్నానము చేయుటచే రజోదూషిత వస్త్రము తొలగినదగుచున్నది.

త్రిరాత్రి అనంతరము స్నానాదులు చేసిన ఆ స్త్రీ 'ధాన్యము దంచటము' మొదలైన దైనందిక పనులు నిర్వర్తించవచ్చును. (శారీరకమైన పరిశ్రమలచే తిరిగి శరీరము సౌష్టవము పొందుచున్నది).

| | |
|---|---|
| **14** స య ఇచ్ఛేత్<br>పుత్రో "మే శుక్లో జాయే"- వేదం అనుబ్రువీత,<br>సర్వమ్ ఆయురియాత్" - ఇతి,<br>క్షీరౌదనం పాచయిత్వా,<br>సర్పిష్మన్తం అశ్నీయాతాం, ఈశ్వరౌ జనయిత వై॥ | ఆ దంపతులు తెల్లటి ఛాయతో కూడిన కుమారుని బిడ్డగా కోరుకొన్నపక్షంలో **'మే శుక్లో జాయేత'**... అను వాక్యమును - వేదపఠనము దైవ స్తోత్రములతో బాటుగా - ఉచ్ఛరించెదరుగాక! దీర్ఘాయుష్షు - ఆరోగ్యముగల పుత్రులు కలుగుటకై బియ్యముతో క్షీరాన్నమును వండించి దంపతులు ఇద్దరు భక్షించెదరుగాక। అట్లా క్షీరాన్నము ప్రతిదినము భక్షించుటచే అట్టి బలము, తేజము, దైవీగుణసంపత్తి (ఈశ్వరాంశతో కూడిన తెల్లటిఛాయగల పుత్రుడు) జనించగలడు. |
| **15** అథ య ఇచ్ఛేత్ -<br>"పుత్రో మే కపిలః పింగళో జాయేత<br>ద్వౌ వేదాః అనుబ్రూవీత। సర్వమాయుః యాతి।"<br>ఇతి దధ్యోదనం పాచయిత్వా,<br>సర్పిష్మన్తం అశ్నీయాతామ్<br>ఈశ్వరౌ జనయిత వై॥ | ఎర్రటి - పచ్చని ఛాయగల పుత్రుడు కలగాలంటే **"పుత్రో మే కపిలః పింగళో జాయేత"** అను మంత్రమును రెండు వేదములలోని పనసలతోబాటు పఠించెదరుగాక। అట్టి కపిల - పింగళ ఛాయగల పుత్రుడు పూర్ణాయుర్దాయవంతుడై ఉండుటకై దధ్యోదనమును (పెరుగు కలిపి - దినుసులతో కూడిన అన్నమును) నెయ్యితో కలిపి ఆ దంపతులు భుజించెదరుగాక। అప్పుడు ఈశ్వరలక్షణుడగు పుత్రుని పొందగలరు. |
| **16** అథ, య ఇచ్ఛేత్ "పుత్రో మే శ్యామో,<br>లోహితాక్షో, జాయేత్, త్రీన్ వేదాన్ అనుబ్రూవీత।<br>సర్వమ్ ఆయుః ఇయాత్" ఇతి, ఉదోదనం<br>పాచయిత్వా సర్పిష్మన్తం<br>అశ్నీయాతామ్ ఈశ్వరౌ జనయిత వై। | శ్యామలవర్ణము (నల్లటి రంగు) - లోహిత నేత్రములుగల పుత్రునికొరకై ఇచ్ఛ కలిగి ఉంటే "పుత్రః మే శ్యామః -లోహితాక్షః జాయేత్"...అని పలుకుచు ఆ దంపతులు '3' వేదములు పనసలు పఠించెదరుగాక! అందుకుగాను నీటితో బియ్యమును ఉడికించి, ఆ తరువాత నెయ్యితో కలిపి భుజించెదరుగాక! |
| **17** అథ య ఇచ్ఛేత్ "దుహితా మే పండితా<br>జాయేత - సర్వమాయాః ఇయాత్"<br>ఇతి, తిలౌదనం పాచయిత్వా,<br>సర్పిష్మన్తం అశ్నీయాతాం<br>ఈశ్వరౌ జనయిత వై। | "పాండిత్యము, పూర్ణాయుర్దాయముగల కుమార్తె కావాలి" అని ఆ దంపతులు కోరుకుంటే, నువ్వుల పులగమును భక్షించుచుండెదరు గాక! |
| **18** అథ య ఇచ్ఛేత్ "పుత్రో మే<br>పణ్డితో విగీతః సమితింగమః,<br>శుశ్రూషితాం వాచం భాషితా జాయేత,<br>సర్వాన్ వేదాన్ అనుబ్రువీత,<br>సర్వం ఆయురియాత్" ఇతి,<br>మాగ్ంసౌదనం<br>పాచయిత్వా, సర్పిష్మన్తం<br>అశ్నీయాతాం ఈశ్వరౌ<br>జనయిత వా<br>ఔక్షేణ వా, ఆర్షభేణ వా॥ | పండితుడు, పండిత సభలో మహాపాండిత్యమును ప్రకటించగలవాడు అగు కుమారుడు కలుగుటకొరకై - **"సమితింగమః శుశ్రూషితాం వాచం భాషితా జాయేత సర్వాన్ వేదాని అనుబ్రవీత - సర్వమ్ ఆయుః ఇయాత్"** - అను మంత్రము పఠిస్తూ నాలుగు వేదముల పనసలను పారాయణము చేయుచుండెదరుగాక!<br><br>అట్టి దంపతులు ముసలి ఎద్దు మాంసాన్నమును నేయితో భక్షించుటచేత అట్టి కోరిక సిద్ధించగలదు. **(తదితర శాస్త్రములచే అట్టి మాంసాన్నము నిషిద్ధము - అని చెప్పబడుతోంది).** |

19 అథ అభి ప్రాతః ఏవ స్థాలీపాక ఆవృత
ఆజ్యం చేష్ఠిత్వా, స్థాలీపాకస్య
ఉపఘాతం జుహోతి,
"అగ్నయే స్వాహా। అనుమతయే స్వాహా।
దేవాయ సవిత్రే సత్య ప్రసవాయ స్వాహా"।
ఇతి హుత్వా, ఉద్ధృత్య ప్రాశ్నాతి।
ప్రాశ్యేతరస్యాః ప్రయచ్ఛతి ప్రక్షాళ్య పాణీ,
ఉదపాత్రం పూరయిత్వా, తేనైనాం త్రిరభ్య,
ఉక్షతి ఉత్తిష్ఠాతో। విశ్వావసో,
అన్యాం ఇచ్ఛ ప్రపూర్వ్యాం
సంజాయాం పత్యా సహేతి॥

**ఋతు కాలము తరువాత 4వ రోజున:**

- ఆ దంపతులు ఉదయమే లేచి, నిత్యకృత్యాలను తీర్చుకొని, దంపిన బియ్యమును స్థాలీపాకవిధానంగా నేయిని వేసి కలపాలి.

"అగ్నియే స్వాహా! అనుమతయే స్వాహా! దేవాయ సవిత్రే సత్య ప్రసవాయ స్వాహా"...మొదలైన మంత్రములతో '3' ప్రధాన ఆహుతులు ఇవ్వాలి.

- ఆహుతులు తరువాత శేషించిన అన్నమును ముందుగా భర్త భుజించాలి.

- భర్త తినగా మిగిలిన శేషాన్నాన్ని భార్య భుజించాలి.

- చేతులు కడుగుకొని ఉదర పాత్రనిండా నీరు నింపి **"ఉత్తిష్ఠతో, విశ్వావసో।"** అను మంత్రము చెప్పుచూ భార్య శిరస్సుపై సంప్రోక్షణ చేయాలి.

- "ఓ విశ్వావసు గంధర్వా! మీ దయతో మేము ఉత్తమ సంతతికై క్రీడించెదముగాక। ఆశీర్వదించండి" - అని కోరుకొనెదరుగాక!

---

20 అథైనాం (అథ ఏనాం) అభిపద్యతే
"**అమో అహం అస్మి।**
సా త్వగ్ం సా త్వమస్యమో। అహం సామ।
అహమస్మి ఋక్త్వం। ద్యౌః అహం।
పృథివీ త్వం। తావేహి।
సగ్ం రభావహై సహ రేతో
దధావహై పుగ్ంసే
పుత్రాయ విత్తయ"
ఇతి।

ఆ తరువాత భార్యాభర్తలు పరస్పరానుమతి ప్రకారము క్షీరాన్నము మొదలైన ఔషధాన్నములను భుజించి ఏకశయ్యాశయనులు అయ్యెదరుగాక! **"అమోஉహమస్మి"** అని భర్త భార్యను 'దేవీభావనగా ఉపాసించాలి'.

**"ఓ దేవీ! - నేను ప్రాణమును! మీరు వాక్కువు। ప్రాణమునకు వాక్కు స్వాధీనమగుచున్నట్లు మీరు నాకు స్వాధీనులగుచున్నారు.**
**నేను సామవేదమును! మీరు ఋగ్వేదము! సామవేదమునకు ఋగ్వేదము వలె నాకు ఆధీనమైయున్నారు.**

**- నేను అంతరిక్షమును. మీరు భూమివి. భూమి - అంతరిక్షము ఈ లోకమునకు తల్లితండ్రులు అయిన తీరుగా మనము మన సంతానమునకు తల్లిదండ్రులము అగుచున్నాము.**

**- మనమిద్దరము ఉత్తమ సంతతికొరకై యజ్ఞభావులము అయ్యెదము. యజ్ఞపూర్వకంగా ప్రయత్నించువారమై ఉండెదము.**
**- రేతస్సును ప్రార్థించి ధరించెదము".**

**అని ప్రార్థనను చేయుదురుగాక!**

---

21 అథాస్యా (అథ అస్యా) ఊరూ విహాపయతి।
"విజిహీథాం ద్యావా పృథివీ" ఇతి।
తస్యాం అర్థం నిష్ఠాయ
ముఖేన ముఖగ్ం సన్ధాయ,
త్రిరేనామ అనులోమాం,
అనుమార్ష్టి, విష్ణుర్యోనిం కల్పయతు।
త్వష్టా రూపాణి పిగ్ంశతు। ఆసించతు।
ప్రజాపతిః ధాతా గర్భం దధాతు తే॥

"ఓ భూమి - ఆకాశములారా! సత్సంతానదీక్ష నిమిత్తమై వినియోగము పొందెదరుగాక!" అని ప్రార్థించుచూ పురుషుడు స్త్రీ తొడలను విడదీయునుగాక! స్త్రీ యందు జననేంద్రియమును ఉంచి, ముఖమును భార్య ముఖముతో తాకించుచు మూడుసార్లు స్త్రీ శరీరమును స్పృశిస్తూ, **"విష్ణుర్యోని కల్పయతు"** అను మంత్రమును చెప్పుతూ అరచేతులతో స్పృశించునుగాక!

ఓ హృదయేశ్వరీ!

- విష్ణు భగవానుడు మీయందు సంతానోత్పత్తికి కారకము, సమర్థము అగు భాగము (ఉష్ణము)ను ప్రసాదించునుగాక!

- త్వష్ట అను సూర్యుడు మన బిడ్డలకు రూపురేఖలు దిద్దునుగాక!

- ప్రజాపతి నా ఆత్మరూపమును మీయందు రేతస్సుగా పరిపోషించును గాక!

| | |
|---|---|
| **గర్భం దేహి సినీవాలి। గర్భం దేహి పృధుష్టుకే।**<br>**గర్భం తే అశ్వినౌ దేవా వా ధత్తాం పుష్కర స్రజౌ॥** | - సూత్రాత్మ మన సంతానము కొరకై మీ గర్భమును కాపాడునుగాక! ఓ పత్నీ! దేవీ! మీరు గర్భమును ధరించెదరుగాక! స్తోత్రరూపిణివగు ఓ దేవతా! గర్భమును ధరించుము! అశ్వినీగర్భులగు అశ్వనీ దేవతలు మీ గర్భములోని శిశువుకు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుదురు గాక!" |
| **22 హిరణ్మయీ, అరణీయాభ్యాం**<br>**నిర్మన్థతాం అశ్వినౌ।**<br>**తంతే గర్భం హవామహే**<br>**దశమే మాసి సూతయే।** | "ఓ దేవీ! మీయందు తేజోరూపమైన అరణులు ప్రకాశించుచున్నాయి। అవి అశ్వనీదేవతల కళాసమ్మూర్తులు".<br>"అట్టి మీయొక్క గర్భమునందు 10 మాసముల కాలంలో బహిర్గతమగు శిశువు కొరకై దేవతలు కరుణించు రీతిగా హోమము చేయుచున్నాను". |
| **యథా అగ్నిః గర్భా పృథివీ,**<br>**యథా ద్యౌః ఇన్ద్రేణ గర్భిణీ,**<br>**వాయుర్దిశాం యథా గర్భ ఏవం,**<br>**గర్భం దధామి తే అసావితి॥** | "ఏవిధంగా అయితే ఈ భూదేవత (పృథివి) అగ్నిని ధరించుచున్నదో, ఏ విధంగా స్వర్గలోకము తన గర్భమునందు దేవేంద్రుని ధరించుచున్నదో, ఈ అష్ట దిక్కులు వాయువును ఏ రీతిగా ధరించుచున్నాయో, ఆవిధంగా నేను ధానము (ధారణము) చేయుబిడ్డను (శిశువును) మీరు గర్భమునందు ధరించి సంరక్షించెదరుగాక!" |
| **23 సోష్యన్తీం అద్భిరభ్యుక్షతి। (అద్భిః అభ్యుక్షతి)।**<br>**"యథా వాయుః పుష్కరిణీగ్ం"**<br>**సమింగయతి సర్వతః,**<br>**ఏవా తే గర్భ ఏజతు, సహైవై తు,**<br>**జరాయుణా ఇన్ద్రస్య అయం వ్రజః కృతః**<br>**సార్గళః। స పరిశ్రయః।**<br>**తమ్ ఇన్ద్ర నిర్జహి గర్భేణ సావరాగ్ం సహేతి॥** | **పురుషుడు (భర్త) - స్త్రీయొక్క (భార్య యొక్క) ప్రసవసమయంలో "యథా వాయుః పుష్కరిణీగ్ం సమింగయతి సర్వతః, ఏవా తే గర్భ ఏజతు సహైవై తు జరాయుణా ఇన్ద్రస్య అయం వ్రజః".**<br>"ఏవిధంగా అయితే వాయువు ప్రసరిస్తూ తటాకమునకు ఏమాత్రము కూడా హాని జరుగకుండా జలమును తరంగములుగా సంచరింపజేస్తోందో, ఆ విధంగా ప్రసూతి వాయుదేవతలు నా భార్యామణీదేవి గర్భమున చలించి ఆత్మజుడగు మా శిశువును మావితో కూడా బయటకుకొని తెస్తాయి గాక! మా శిశువు చక్కటి ఇంద్రియయములతో కూడి బయల్వెడలునట్లుగా ప్రసూతివాయువులు సహకరించెదరు గాక!...."అని ప్రార్థన చేస్తూ కళ్ళకు అద్దుకున్న జలముతో నెప్పులు పొందుచున్న జీవిత భాగస్వామి (భార్య)పై సంప్రోక్షము చేయాలి. ప్రాణదేవతను ఇట్లా ప్రార్థించాలి.<br>**"ఓ ప్రాణదేవతా! నా బిడ్డయొక్క ప్రాణ-మార్గము గర్భాదానకాలములో మావితో కూడుకొనిఉన్నది. మీరు నా శిశువు దేహములో ఇంద్రునివలె వేంచేసి యున్నారు. మీరు గర్భముతో కూడా వెడలిరండి!"** - అని మంత్రోచ్ఛారణ చేయుచు ప్రసువాభిముఖురాలైన భార్యపై మంత్రజలము సంప్రోక్షించును గాక! (పైవన్నీ మనస్సుతో ఆచరించవచ్చును)। |
| **24 జాతే అగ్నిం ఉపసమాధాయ,**<br>**అంక ఆధాయ, కగ్ంసే**<br>**పృషదాజ్యగ్ం (పృషత్-ఆజ్యగ్ం)**<br>**సన్నీయ పృషదాజ్యస్య (పృషత్ ఆజ్యస్య)**<br>**ఉపఘాతం జుహోతి।** | ప్రసవానంతరము **"మా ఈ శిశువు సర్వజీవులకు ఆనందము కలుగజేయువాడై, మహదాశయుడై, ఋషివాక్కులను ఉపాసించువాడై, ఆయురారోగ్య ఐశ్వర్యములుతో వర్ధిల్లునుగాక।"**.... అని 'జాతక కర్మ' అను అగ్ని యజ్ఞకార్యమును ఆ దంపతులు నిర్వర్తిస్తున్నారు। (నిర్వర్తించెదరుగాక)।<br>పురుషుడు (భర్త) జాతక కర్మయందు అగ్నిని వ్రేల్చి, గిన్నెయందు పృషదాజ్యమును (పెరుగుతో కలిపిన నేతిని) ఉంచి, ఆ గిన్నెను తొడపై ఉంచి హోమ సంబంధమైన సంస్కారము, అగ్ని సమర్పణ చేయుచున్నారు. (చేయును గాక)। |

| | |
|---|---|
| **అస్మిన్ సహస్రం పుష్యా సమేధమానః**<br>**స్వే గృహే। అస్య ఉపసద్యాం**<br>**మాఛేత్సీత్ ప్రజయా చ, పశుభిశ్చ స్వాహా।**<br>**మయి ప్రాణాగ్ం స్త్వయి (త్వయి)**<br>**మనసా జుహోమి స్వాహా।** | "ఒక గృహస్థుడుగా ఈ గృహమునందు నేనే ఈ నా పుత్రుని రూపముగా వృద్ధి పొందుచున్నాను. ఈ పుత్రుడు నా ఆత్మ స్వరూపుడే (ఆత్మా వై పుత్రః)। అట్టి పుత్రుని రూపమున ఉన్న నేను వృద్ధి పొంది వేలాదిజనులను పోషించెదనుగాక!<br>ఈ నా పుత్రుడు సాధికముగా జీవితము కొనసాగించుచూ, నా వంశపరంపరగా విజ్ఞులగు సంతానముతో, పాలు ఇచ్చు పశువులతో, అందరికన్నా అధికమై, అందరికీ సంతోషము కలుగజేయు 'సంపద'తో వర్ధిల్లునుగాక! "స్వాహా!" - హోమము అందుకై సమర్పించుచున్నాను.<br>ఓ ప్రియపుత్రకా! నాయందుగల ప్రాణమును నీయందలి మనస్సుతో జతజేర్చి అగ్నిదేవునికి ఈ హోమము చేయుచున్నాను! స్వాహా!" |
| **యత్ కర్మణాత్యరీరిచం (యత్ కర్మణా అత్యరీరిచం)**<br>**యద్వా న్యూనం ఇహాకరం,**<br>**అగ్నిష్టత్స్విష్టకృత్ విద్వాంత్స్విష్టగ్ం**<br>**(అగ్నిష్టత్ స్విష్టకృత్। విద్వాంతు స్విష్టగ్ం।)**<br>**సుహుతం కరోతు నః స్వాహా ఇతి॥** | "ఓ అగ్నిదేవా! న్యూనం సంపూర్ణతాం యాతి! నేను తెలిసియో తెలియకయో భక్తిప్రపత్తులతో చేస్తున్న ఈ హోమమును, ఇత్యాది ఇప్పటి ఈ అగ్ని కార్యములను పెద్దమనస్సు గల, విద్వాంసుడవగు దేవతా-ఆశ్రితడవు అగు మీరు దయతో స్వీకరించండి. "ప్రాణములను మనస్సునందు నిలిపి ఈ హోమము చేస్తూ ఉన్నాను. ఈ సమర్పించు దానిని ప్రియముగా నా కుమారుని కొరకై స్వీకరించెదరు గాక।" |
| **25 అథ అస్య దక్షిణం కర్ణం అభి నిధాయ**<br>**"వాక్ వాక్ వాక్" – ఇతి త్రిః।** | ఈ విధంగా అగ్నికార్యమును, హోమమును ముగించిన తరవాత ఆ పురుషుడు (తండ్రి) తన కుమారునియొక్క కుడిచెవియందు 'వాక్-వాక్-వాక్' (శబ్దము-అర్థము-పరమార్థము) అని మూడుసార్లు జపించాలి. |
| **అథ దధి మధు ఘృతగ్ం సన్నీయాత్**<br>**అన్తర్హి తేన జాత రూపేణ ప్రాశయతి।**<br>**"భూస్తే దధామి భువస్తే దధామి।**<br>**సువస్తే దధామి।**<br>**భూర్భువస్సువః సర్వం త్వయి దధామి"**<br>**ఇతి॥** | తరువాత, అప్పుడిక 'పెరుగు-తేనె-నేయి'లను స్పృశింపజేసిన 'బంగారు చెంచా'తో కుమారునిచే తినిపించాలి.<br>"భూ" "భువః" "సువః" అను మూడు వ్యాహృతులను చెప్పుచూ '3' సార్లు నాలుకకు తాకించాలి.<br>**"ఓ ప్రియ మమాత్మస్వరూప బిడ్డా! ఈ త్రిలోకసారము నీకు అభిరుచిగల అన్నమగుగాక।"** - అని పలుకునుగాక।<br>"భూర్భవస్సువః" అను వ్యాహృతులను మూడిటిని చెప్పుచూ,<br>"ఈ సమస్తము మీయందు, (ఆత్మయందు) ఉంచుచున్నావయ్యా!" అని చెప్పుచూ, భావిస్తూ నాలుకకు పెరుగు - తేనె - నేయిలను తాకించాలి. |
| **26 అథ అస్య నామ కరోతి వేదో అసీతి,**<br>**తదస్య, తత్ గుహ్యమ్ ఏవ నామ భవతి॥** | జాతక కర్మ సందర్భములో కుమారునికి 'వేదమ్' అని రహస్య నామకరణము తండ్రి చేయుచున్నాడు.<br>'వేదమ్ = ఈ కనబడేదంతా నీయొక్క 'ఎరుక (knowing) అనుదాని ప్రదర్శనా రూపమే!<br>నీవు ఆవల తెలుసుకొనువాడవై **వేదాంతుడవై** (వేదాంత పురుషుడవై, పురుషోత్తముడవై) ఉన్నావు! ఇదంతా నీచే తెలియబడునది। నీచే తెలియబడునదంతా నీయొక్క 'ఆత్మ' అనబడు ఎరుక రూపమే. తెలియబడేదానిని ఉపయోగించుకొని, నీలోని తెలుసుకొను వానిని 'అఖండాత్మ'గా ఎరిగెదవుగాక।<br>మహదాశయ నామకరణము రహస్యమైనది. వ్యవహారనామము కాదు. ఆత్మయొక్క ఔన్నత్యమేమిటో తెలియజేయునది.<br>ఇప్పుడిక వ్యవహారనామము చెప్పి, అందరికీ తండ్రి తెలియ పలుకు చున్నాడు. |

**27 అథ ఏనం మాత్రే ప్రదాయ స్తనం ప్రయచ్ఛతి।**

**యస్తే స్తనః (యత్తే స్తనః) శశయో యో మయో**

**"భూః"యో రత్నధా వసు వసువిద్యః సుదత్రః।**

**యేన విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతి**

**తమ్ ఇహ ధాతవే కరితి॥**

ఆ తరువాత **"యత్ తే స్తనః"**। - ఇదంతా కూడా - నీయొక్క అనుభూతి రూపమే - అని చెప్పుచూ తల్లిచే స్తన్యము ఇప్పించాలి. అప్పుడు దేవీ సరస్వతీ స్తోత్రమంత్రమును ఈ అర్థముతో తండ్రిచే పలికించబడుచున్నది.

"ఓ దేవదేవీ! దేవేశ్వరీ! జగజ్జననీ! లోకమాతా! సరస్వతీదేవీ! నీ స్తనములు అక్షయ క్షీరము (పాలు) ప్రసాదించు అక్షరభాండాగారములు.

- ఆ నీ స్తనములలోని (క్షీరము చేతనే) దేవతలు, మానవులు, తిర్యక్ యోనిషులు (జంతువులు)తో సహా **సర్వ జీవరాసులు ఎల్లప్పుడు పరిపోషించబడుచున్నారు.**

- విశ్వ సంపోషణివగు నీవు క్షీరమును నా జీవిత భాగస్వామియగు నా భార్య స్తనములలో నా కుమారుని పరిపోషణము కొరకై ప్రవేశింపజేయమని ప్రార్థన చేస్తూ అర్థిస్తున్నాను".

- (జాతక - నామకరణ సందర్భములో) ఇట్లా పలుకుచూ ఉపాసిస్తూ ఉండగా తల్లి బిడ్డకు స్తన్యమును ఇవ్వటం జరుగుచున్నది.

---

**28 అథ అస్య మాతరమ్ అభిమన్త్రయతే – 'ఇల అసి'**

**(ఇలాసి)। మైత్రావరుణీ వీరే వీరమజీ జనత్।**

**సా త్వం వీరవతీ భవ।**

**యస్మాన్ వీరవతో, అకరత్ ఇతి।**

**తం వా ఏతం ఆహురతి**

**పితా బతా భూరతి॥**

**పితామహో బతా భూః।**

**పరమాం బత కాష్ఠాం ప్రాపత్ శ్రియా,**

**యశసా, బ్రహ్మవర్చసేన య ఏవం విదో,**

**బ్రాహ్మణస్య పుత్రో జాయత ఇతి।**

**<u>ఇతి అష్టమాధ్యాయః–</u>**

**<u>"రేతసో వాజయపేయ బ్రాహ్మణమ్" నామ</u>**

**<u>చతుర్థ బ్రాహ్మణమ్॥</u>**

ఆ తరువాత ఆ పురుషుడు పురోహితుడు అందించే పుణ్యాహవచన మంత్ర జలముతో తత్ మంత్రములను పఠిస్తూ పుత్రుని - తల్లిని (తన కుమారుని, తన భార్యను) అభిమంత్రించునుగాక!

ఓ అరుంధతీ స్వరూపిణీ! అర్ధాంగీ! జీవితభాగస్వామీ! నన్ను నిమిత్తముగా చేసుకొని మీరు వీర్యత్వముతో కూడిన సంతానమును కని నాకు, లోకమునకు అందించుచున్నారు. అందుచేత మీరు స్తుతికి అర్హులగుచున్నారు.

- నన్ను వీరులైన పుత్రులను కలవారినిగా చేశారు. మీరు కూడా 'వీరమాత' అగుచున్నారు.

- ఈ వీరపుత్రుని కనులుచే నన్ను కూడా వీరునిగా చేసినవారయ్యారు.

ఓ కుమారా! నీవు తండ్రి - తాతలను కూడా మించిన సంయోగ్యుడవు అయ్యెదవుగాక! బంధువులందరు నిన్ను 'ఆశ్చర్యము' అంటూ స్తుతించెదరుగాక। దీవించెదరుగాక।

ఈ నా పుత్రుడు → సంపద చేతను, యశస్సు వల్లను, బ్రహ్మజ్ఞానముచేతను, బ్రహ్మ తేజస్సు చేతను గొప్ప స్థితిని పొందాలి.

బిడ్డా! దేహము అనే అవకాశము 'బ్రాహ్మీస్థితి' కొరకై యున్నదని గుర్తెరుగుదువు గాక!

- సర్వజనులకు నీ ప్రవర్తనచే ప్రీతిగొలుపుచూ, ప్రశంసాపాత్రుడవు అయ్యెదవుగాక!

**- ఈ విధమైన మంత్రార్థములతో, ఆశీర్వాదముతో జాతకకర్మ నిర్వర్తించబడుగాక।**

**–"రేతసో వాజయపేయ బ్రాహ్మణమ్"–**

**నామ – చతుర్థ బ్రాహ్మణమ్ సమాప్తమ్॥**

# అష్టమాధ్యాయః - పంచమం బ్రాహ్మణము
## వంశ బ్రాహ్మణము

1) అథ వగ్ంశః।
పౌతిమాషీ పుత్రః కాత్యాయనీ పుత్రాత్।
కాత్యాయినీ పుత్రో గౌతమీ పుత్రాత్।
గౌతమీ పుత్రో భారద్వాజీ పుత్రాత్।
భారద్వాజీ పుత్రో పరాశరీ పుత్రాత్।
పారాశరీ పుత్రో ఔపస్వతీ పుత్రాత్।
ఔపస్వతీ పుత్రః పారాశరీ పుత్రాత్।
పారాశరీపుత్రః కాత్యాయనీ పుత్రాత్।
కాత్యాయనీ పుత్రః కౌశికీ పుత్రాత్,
కౌశికీ పుత్రః ఆలంబీ పుత్రాత్, చ।
ఆలంబీ పుత్రః వైయాఘ్రపది పుత్రాత్ చ
వైయాఘ్రపదీ పుత్రః కాణ్వీ పుత్రాత్, చ।
కాణ్వీపుత్రాత్ చ కాపీ పుత్రః ।

బ్రహ్మవేత్తల వంశము - (మాతృదేవతాపూర్వకంగా)

పేతిమాషి అనే ఆమె కుమారుడు కాత్యాయనీ పుత్రుని వలన, బ్రహ్మమును ఎరిగెను.

కాత్యాయనీ పుత్రుడు గౌతమీపుత్రుని వలన బ్రహ్మతత్త్వము వినెను!

గౌతమీ పుత్రుడు భారద్వాజీపుత్రుని నుండియు.

భారద్వాజీ పుత్రుడు పరాశరీ పుత్రుని వద్దను,

పరాశరీపుత్రుడు ఔపస్వస్తి కుమారుని నుండియు,

ఓపస్వస్తీ పుత్రుడు పారాశరీ పుత్రుని నుండియు,

పారాశరీ పుత్రుడు కాత్యాయునీ పుత్రుని చేతనను

కాత్యాయనీ పుత్రుడు కౌశికీ పుత్రుని వలనను,

కౌశకీ పుత్రుడు ఆలంబీపుత్రుని నుండి,

ఆలంబీ పుత్రుడు ఆలంబీ వైయాఘ్రపదీపుత్రునినుండియు

వైయాఘ్రపదీ పుత్రుడు కాణ్వి అను ఆమె కుమారుని వద్దను.

కాణ్వీ పుత్రుడు కాపీ (అను ఆమె) పుత్రుని నుండి,

---

2. కాపీ పుత్రః ఆత్రేయీ పుత్రాత్।
ఆత్రేయీపుత్రో గౌతమీపుత్రాత్।
గౌతమీ పుత్రః భారద్వాజీ పుత్రాత్।
భారద్వాజీ పుత్రః పారాశరీ పుత్రాత్।
పారాశరీ పుత్రో వాత్సీ పుత్రాత్।
వాత్సీపుత్రః పారాశరీ పుత్రాత్।
పారాశరీపుత్రో వార్కారుణీ పుత్రాత్।
వార్కారుణీ పుత్రో ఆర్తభాగీ పుత్రాత్।
ఆర్తభాగీ పుత్రః శౌంగీపుత్రాత్।
శౌంగీపుత్రః సాఙ్కృతీ పుత్రాత్।
సాఙ్కృతీ పుత్రః ఆలంబాయనీ పుత్రాత్।
ఆలమ్బాయనీ పుత్రః ఆలమ్బీ పుత్రాత్।
ఆలమ్బీ పుత్రో జాయన్తీ పుత్రాత్।
జాయన్తీ పుత్రో మాండూకాయనీ పుత్రాత్।

కాపీ పుత్రుడు ఆత్రేయీ పుత్రుని నుండి,

ఆత్రేయీ పుత్రునినుండి గౌతమీ యొక్క పుత్రునినుండి, గౌతమియొక్క పుత్రుడు భరద్వాజీ అను స్త్రీయొక్క పుత్రుని నుండి,

భరద్వాజీ యొక్క పుత్రుడు పారాశరీ పుత్రుని నుండి,

పారాశరీపుత్రుడు వాత్సీ (అనే స్త్రీ) యొక్క పుత్రుని నుండి,

వాత్సీ యొక్క పుత్రుడు పారాశరీ అనే స్త్రీ యొక్క పుత్రుని నుండి,

పారాశరీ పుత్రుడు → వార్కారుణీ (అనే స్త్రీ) యొక్క కుమారుని నుండి,

వార్కారుణీపుత్రుడు → ఆర్తభాగీ యొక్క పుత్రునినుండి,

ఆర్తభాగీపుత్రుడు శౌంగీపుత్రుని నుండి,

శౌంగీపుత్రుడు సాఙ్కృతీపుత్రుని నుండి,

సాఙ్కృతీపుత్రుడు ఆలంబాయనీ పుత్రుని నుండి,

ఆలమ్బాయనీ పుత్రుడు ఆలమ్బీపుత్రుని నుండి,

ఆలమ్బీపుత్రుడు జాయన్తీ పుత్రుని నుండి,

జాయన్తీ పుత్రుడు మండూకాయనీ పుత్రునినుండి,

| | |
|---|---|
| **మాండూకాయనీ పుత్రో మాండూకీ పుత్రాత్,** | మాండూకాయనీ పుత్రుడు మాండూకీ పుత్రునినుండి |
| **మాండూకీ పుత్రః శాణ్డిలీ పుత్రాత్।** | మాండూకీ పుత్రుడు శాణ్డిలీపుత్రునినుండి |
| **శాణ్డిలీ పుత్రో రాథీతరీ పుత్రాత్,** | శాణ్డిలీపుత్రుడు రాథీతరీ పుత్రునినుండి |
| **రాథీతరీ పుత్రో భాలుకీ పుత్రాత్।** | రాథీతరీపుత్రుడు భాలుకీ పుత్రుని నుండి |
| **భాలుకీ పుత్రః క్రౌఞ్చికీ పుత్రాభ్యాం।** | భాలుకీ పుత్రుడు క్రౌఞ్చికీ ఇరువురు పుత్రులనుండి, |
| **క్రౌఞ్చికీ పుత్రౌ వైదభృతీ పుత్రాత్।** | క్రేఞ్చికీపుత్రులు వైధృభతీ పుత్రునినుండి |
| **వైదభృతీ పుత్రః కార్శకేయీ పుత్రాత్।** | వైదృభతీపుత్రుడు కార్శకేయీ పుత్రుని నుండి |
| **కార్శకేయీ పుత్రః ప్రాచీనయోగీ పుత్రాత్।** | కార్శకేయీ పుత్రుడు - ప్రాచీనయోగీ పుత్రుని నుండి, |
| **ప్రాచీనయోగీ పుత్రః సాంజీవీ పుత్రాత్।** | ప్రాచీనయోగీ పుత్రుడు సాఞ్జీవీ పుత్రునినుండి |
| **సాంజీవీ పుత్రః ప్రాశ్నీ పుత్రాత్।** | సాజ్జీవీపుత్రుడు ప్రాశ్నీపుత్రునినుండి, |
| **ఆసురి వాసినః ప్రాశ్నీ పుత్ర।** | ఆసురివాసినుడు పాశ్నీ పుత్రుని నుండి జ్ఞానము ఎరగటం జరిగింది. ఇప్పటివరకు మాతృదేవి (తల్లి) నామములు చెప్పబడినవి. |
| **ఆసురాయణాత్ ఆసురాయణ ఆసురేరాసురిః॥** | ఆసురాయన → ఆసురే-ఆసురే అనువారివలనను - జ్ఞానము పొందారు. |
| **3. ఆసరిః యాజ్ఞవల్క్యాత్।** | ఆసురీబుషి యాజ్ఞవల్క్యుని నుండి, |
| **యాజ్ఞవల్క్యః ఉద్దాలకాత్।** | యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకుని నుండి |
| **ఉద్దాలకో అరుణాత్।** | ఉద్దాలకుడు అరుణినుండి, |
| **అరుణః ఉపవేశే।** | అరుణి ఉపవేశినుండి, |
| **ఉపవేశి కుశ్రేః।** | ఉపవేశి - కుశ్రునినుండి |
| **కుశ్రిః వాజశ్రవసో।** | కుశ్రి అనే ఆయన వాజస్రవసువు నుండి, |
| **వాజశ్రవా జిహ్వావతో బాధ్యోగాత్,** | వాజశ్రవశువు → జిహ్వావతో వాధ్యోగాతుని నుండి |
| **జిహ్వావాన్బాధ్యోగో అసితాద్వార్ష గణాత్** | జిహ్వావతో వాధ్యాగునినుండి అసితాద్వార్ష గణునినుండి, |
| **అసితోవార్షగణో హరితాత్కస్యపాత్।** | అసితాద్వార్షగణునిడు హరితునినుండి, హరితుడు కస్యపుని నుండి , |
| **హరితాత్కస్యపా శిల్పే కశ్యపాత్** | హరిత కాశ్యపుడు శిల్పునినుండి, కాశ్యపుడు శిల్పుని నుండి |
| **శిల్పే కశ్యపో కాశ్యపాన్నై ధృవేః।** | కాశ్యపునివలన ఇంక కాశ్యపుడు, నైద్రువుడు కాశ్యపుని వలనను, |
| **కాశ్యపోన్నైధ్రువే వాచో।**<br>**వాక్ అంభిణ్యా- అంబిణ్యాదిత్యాత్।**<br>**అంభిణ్యా ఆదిత్యాత్।**<br>**ఆదిత్యాత్ తానీమాని**<br>**శుక్లాని యజూగ్ంషి**<br>**వాజసనేయేన యాజ్ఞవల్క్యేన**<br>**ఆఖ్యాయన్తే॥** | నైధ్రువుడు వాక్కునుండి వాక్కు అంభిణునినుండి, అంభిణి ఆదిత్యుని నుండి (సూర్యునినుండి), ఆదిత్యుడు తానిమానిశుక్లుని నుండి, శుక్లుడు యజుశ్శాఖాద్యాయి వాజసని నుండి, ఆయననుండి యజ్ఞవల్క్యుడు బోధను పొందారు. |

4 సమానమా సాఞ్జీవీ పుత్రాత్।
సాఞ్జీవీపుత్రో మాండూకాయనేః।
మాండూకాయనిః మాండవ్యాత్,
మాండవ్యః కౌత్సాత్। కౌత్సో మాహిత్థేః।
మాహిత్థిః వామకక్షాయణాత్।
వామకక్షాయణః శాండిల్యాత్।
శాండిల్యో వాత్స్యాత్।
వాత్స్యః కుశ్రేః।
కుశ్రిః యజ్ఞవచసో।
యజ్ఞవచసః
రాజస్తమ్బాయనాత్।
రాజస్తమ్బాయనః తుకావషేయాత్।
తుకావషేయే ప్రజాపతేః॥

సమానమాసుడు సాంజ్జీవి అనే స్త్రీ యొక్క పుత్రుని నుండి
సాంజ్జీవీపుత్రుడు మాండూకాయనుని వలనను,
మాండుకాయనుడ→ మాండవ్యుని నుండి
మాండవ్యుడు కౌత్సాయనునుండి,
కౌత్సాయనుడు మహితుని నుండి,
మహితుడు వామకక్షాయణుని నుండి,
వామకక్షాయణుడు మాహిత్థిచేతనుని నుండి,
వామపక్షాయణుడు శాండిల్యుని నుండి,
శాండిల్యుడు మరో శాండిల్యునినుండి,
శాండిల్యుడు వాత్సునినుండి
వాత్సాయనుని నుండి కుశ్రి అను ముని,
కుశ్రిముని యాజ్ఞవల్క్యుని నుండి,
రాజస్తమ్బాయనుని వలన కృశియు,

---

కావషేయః ప్రజాపతేః।
ప్రజాపతిః బ్రహ్మణో।
బ్రహ్మస్స్వయమ్భుః।
బ్రహ్మణ్యే నమః।

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ అష్టమాధ్యాయే</u>
<u>"వంశ బ్రాహ్మణమ్" నామ పంచమం బ్రాహ్మణమ్।</u>

<u>ఇతి బృహదారణ్యకోపనిషత్ సమాప్తా॥</u>
<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>

రాజస్తమ్బాయనుని వలన యాజ్ఞవల్క్యుడు,
కావషేయాత్తురుడు కావషేయ ప్రజాపతివలనను,
ప్రజాపతి బ్రహ్మదేవుడివద్దను బ్రహ్మముగురించి నేర్చిరి.

**ఈ విధంగా హిరణ్యగర్భుడగు ప్రజాపతి/బ్రహ్మదేవుని నుండి బ్రహ్మతత్త్వసమాచారము ఋషులకు, ఋషుల తరువాత ఋషి - వంశపారంపర్యులగు శిష్య ప్రశిష్యులచే చెప్పుకొనబడుచూ వస్తోంది.**

బ్రహ్మము స్వకీయమైనది. స్వయముగా ఉనికి కలిగి ఉన్నట్టిది.
- బ్రహ్మ స్వకీయముగా పుట్టినారు - **స్వయంభువు.**
- నిత్య బ్రహ్మమునకు నమస్కారము. స్వయంభువాయ నమః॥
ఆ పరబ్రహ్మము యొక్క స్వకీయ మననమే విస్ఫులింగమువలె జగత్తులుగా ప్రస్ఫుటించుచున్నది.

**శ్రీమత్ పరబ్రహ్మణే నమః।**
**ఇతి - బృహదారణ్యకోపనిషత్ - అష్టమాధ్యాయమ్ - 'వంశ బ్రాహ్మణము' నామ పంచమ బ్రాహ్మణమ్**

**ఇతి "బృహదారణ్యకోపనిషత్" సమాప్తమ్॥**

శుక్లయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# బృహదారణ్యకోపనిషత్

## అష్టమ అధ్యాయము

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## 1. ప్రథమ బ్రాహ్మణము

## ప్రాణసంవాద బ్రాహ్మణము

**ఓం। యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద, జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి। ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ।**

ఈ దేహములో అంతర్గతమై ప్రవర్తించుచున్న ఏకానేక విశేషములు ఉన్నాయి. అవన్నీ కూడా ఈ జీవునిచే 'ధ్యాస'చే ఉపయోగించబడుచున్నాయి. అవన్నీ శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములుగా ఏర్పడి ఉన్నాయి. అయితే **ఈ దేహములో ప్రవర్తిల్లుచున్న వస్తువులలో అత్యంత శ్రేష్ఠమైనది, అత్యంత జ్యేష్ఠమైనది ఏది?** ఎందుకంటే అదియే ముఖ్యముగా ఉపాసించతగినది అవగలదు కదా! అత్యంత శ్రేష్ఠము - జ్యేష్ఠము అగు వస్తువును ఉపాసించుటచే ఈజీవుడు శ్రేష్ఠత్వము-జ్యేష్ఠత్వము సంతరించుకోగలడు. అట్టిది ఏది? **"ప్రాణము"।**

సమస్త ఇంద్రియములలోకెల్లా శ్రేష్ఠమైనది, జ్యేష్ఠమైనది ప్రాణమే। ఈ ప్రకారముగా ప్రాణము యొక్క ముఖ్యత్వము ఎరిగినవాడు, ఉపాసించువాడు - తన జ్ఞాతులలో (సహజీవులలో) శ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు అగుచున్నాడు.

**జ్యేష్ఠము** → ఈ దేహము జనించుచున్న సందర్భములో మొట్టమొదటగా ప్రాణము ఏర్పడునది అగుచున్నది.

**శ్రేష్ఠము** → తదితర ఇంద్రియములన్నీ కూడా ప్రాణమే ఆధారముగా కలిగి ఉండినట్టివి. ఇంద్రియములన్నీ ప్రాణము వలననే మనుగడ, వ్యావహారికత్వము (Functional Ability) పొందుచున్నాయి.

### వాక్కు - వసిష్ఠత (విశిష్ఠత)।

ఈ దేహ విశేషములలో 'వాక్కు' యొక్క **వసిష్ఠతను** (విశిష్ఠత) ఎరిగి ఉపాసించువాడు, తనయొక్క జ్ఞాతులందరిలోను, తదితరులందరిలో వసిష్ఠుడు (ముఖ్యుడు - ఉన్నతుడు) అగుచున్నాడు. తదితర జనులకు ఆశ్రితుడు అగుచున్నాడు.

→ **వస ఆచ్ఛాదనే ఇతి వసిష్ఠా।**
→ **ఆచ్ఛాదనార్థస్య వా వసేః వసిష్ఠా।**

సమస్త శబ్దములను కప్పి ఉంచునది కాబట్టి **వాక్కే వసిష్ఠము.** వాక్కు సర్వమును సుస్పష్టపరచునది కాబట్టి 'వసిష్ఠము'గా చెప్పబడుతోంది.

- వాక్కే సర్వనాదములను ఉత్తేజపరచుచున్నది.
- అధికముగా అతిశయముగా వసింపజేయగలది కాబట్టి వాక్కు వసిష్ఠము.

**వాక్ ఇంద్రియమును వసిష్ఠ రూపముగా (పరబ్రహ్మముయొక్క కళాప్రదర్శనముగా) తెలుసుకొని ఉపాసించువాడు - నిర్మలముగా, సుస్పష్టముగా, సునిశితముగా, ధారాళముగా, సూటిగా పలుకువాడు కాగలడు. అందరిలోను నిర్భయముగా మాట్లాడగల ప్రవక్త కాగలడు.**

## నేత్రేంద్రియము - చూపు - ప్రతిష్ఠత।

ఈ దేహములో వేంచేసి ఉన్న 'చూపు' ప్రతిష్ఠత గలిగినట్టిది.

ఎవడు అట్టి ప్రతిష్ఠను గుర్తించి తెలుసుకుంటున్నాడో, ఉపాసిస్తున్నాడో, అట్టివాడు **సమమైన, విసమమైన** సందర్భములందు కూడా సమత్వముతో కూడి ప్రతిష్ఠితుడు అగుచున్నాడు. నేత్రము చేతనే కష్ట-సుఖ కాలములందు చూచి, విచక్షించి, నిర్ణయించి విజయుడగుచున్నాడు. ఈ జీవుడు చూపునకు వేరుగా **'చూచువాడై'** ఉన్నాడు. **"చూపు"**ను **బ్రహ్మముగా** భావించి, ఉపాసించువాడు సమదృష్టి కలిగి సమస్తమైన పరిస్థితులను జయించివేయగలడు.

## శ్రోత్రేంద్రియము (వినికిడి) - సంపద।

వినికిడి ఈ జీవుని పట్ల **'సంపద'**గా చెప్పబడుచున్నది. ఎవడు ఈ వినికిడిని పరమాత్మకు చెందిన 'సంపద'గా ఉపాసిస్తాడో, తాను కోరుకొన్న ఫలములను పొందగలడు. **సగ్ం కామం కామయతే య ఏవం వేద!** శ్రోత్రేంద్రియము వలననే సమస్త శ్రుతలు (వేదములు) వృద్ధి చెందుచున్నాయి. అందుచేత శ్రోత్రేంద్రియమును పవిత్రమగు వేదశాస్త్ర పరిశీలనకు ఉత్తమమైన ఉపకరణమైనట్లుగా ఉ పాసించాలి. అట్టివానికి 4 వేదములు **సుముఖము, వరదము, అభిముఖము** అగుచున్నాయి. వేదములలో ప్రశస్తమైయున్న సారము (రసము) హృదయములో సులభంగా ప్రవేశించగలడు.

**వినికిడి కలవాడే వేదాధ్యయనము చేయగలుగుతాడు. శ్రుతము (వినికిడి) సహాయముతోనే వేదములో విధించబడిన ఉత్తమ కర్మలు నిర్వర్తించి, తాను కోరుకొన్న ఫలములను ఈ జీవుడు పొందగలుగుచున్నాడు.**

## మనస్సు - సర్వమునకు ఆశ్రయము।

ఎవ్వడైతే ఈ దేహములోని ఆయనతనమును (సర్వమును ఆశ్రయించుచున్నట్టి దానిని) ఉపాసిస్తాడో, అట్టివాడు తదితర జనులకు ఉత్తమ ఆశ్రయుడై ప్రకాశించుచున్నాడు. అన్నిటికీ కూడా ఆశ్రయమై ఉంటున్న వస్తువేది? **"మనస్సే".**

మనస్సు నిశ్చయంగా అన్నిటినీ ఆశ్రయించిఉండటం చేత మాత్రమే, జగద్విషయాలన్నీ **'ఉన్నవి'** అగుచున్నాయి. ఇంద్రియములకు, శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములకు ఆశ్రయం ఎవరయ్యా- అంటే, ఈ మనస్సే! మనస్సు ఏది పొందితే అది మాత్రమే అనుభవముగాను, భోగ్యముగాను అగుచున్నది. ఇంద్రియములు తమ (ఇంద్రియ) విషయములపై వ్రాలుచున్నప్పుడు కూడా, మనస్సుకే లోబడి ఉంటున్నాయి. మనస్సు బట్టే ప్రవృత్తి-నివృత్తి ఏర్పడుచున్నాయి. మనస్సు ఏది 'ఫలితము' అనుకుంటే అదే ఫలితము అగుచున్నది. **(మనో య కరోతి తత్ కృతం భవతి। య న కరోతి - తత్ న కృతం భవతి)** (యోగవాసిష్ఠం)

**ఈ విధంగా మనస్సు యొక్క స్వభావమును, ప్రభావమును, ఆయతనమును ఎరిగి, కేవలమగు మనస్సును పరతత్త్వ స్వరూపముగా ఉపాసించువాడు తన వారలకు తానే ఆయతనము (ఆశ్రయము) అగుచున్నాడు.**

## ప్రజాతి - రేతస్సు - సంతానమును ఉద్భవింపజేయునది।

ఈ కనబడే సృష్టి అంతా ఎవరి వలన ఉత్పత్తి అగుచున్నదో - ఆయన సృష్టికర్త।

**ప్రజాతి** = ఉద్భవింపజేయునది.
ఉపస్థ. జన్మను ఇచ్చు ఉపకరణము.

**ప్రజాపతి** = ఈ జీవుల ఉత్పత్తికి కర్తృత్వము వహించు సృష్ట్యభిమాని. సృష్టికర్త. ప్రజాభిమాని. **"ఈ సృష్టి నా కార్యమే। నా కల్పనయే।"** - అని అభిమానించువాడు.

ఈ జీవజాల ఉత్పత్తి విధి –విధానమును (ప్రజాతిని) ఉపాసించువాడు సంతానము, పశుసంపదతో వర్ధిల్లగలడు.

'రేతస్సు'యే ప్రజాతి. ప్రజల – పశువుల ఉత్పత్తి అగు సృష్టికర్మ యొక్క అభిమానియే → **ప్రజాపతి!**

**సృష్టి-సృష్టికర్త (ప్రజాతి-ప్రజాపతి)ల అన్యోన్యత్వము, ఏకత్వములను ఎరిగినవాడు, ఉపాసించువాడు సంపద సమన్వితుడగుచున్నాడు.**

## "ప్రాణా అహగ్ం శ్రేయసే" వివదమానా।

ఒకప్పుడు ఈ వాక్కు, చక్షువులు, చెవులు, మనస్సు, రేతస్సు → ఈ ఈ ఇంద్రియములన్నీ ఒకచోట సమావేశమైనాయి. ఇంద్రియములన్నీ కూడా ఒక్కొక్కటి లేచి – **"అహగ్ం శ్రేయసే – వివదమానా।." మేము గొప్ప-అంటే "మేము గొప్ప"** అంటూ **పోట్లాడుకోసాగాయి.** ఎంతగా వాదోపవాదములు చేసుకొన్నప్పటికీ కూడా.., ఈ దేహములో వాక్కు గొప్పదా? చూపు గొప్పదా? వినికిడి గొప్పదా? మనస్సు గొప్పదా? రేతస్సు (పునరుత్పత్తి ప్రదాత) గొప్పదా? మనస్సు గొప్పదా? **ప్రాణము గొప్పదా?** ... అనే విషయం ఇదమిత్థముగా తేల్చుకోలేకపోయాయి.

ఈ దేహములో ఏ ఒక్క ఇంద్రియము పనిచేయకున్నా, అంగలోపముచే లోటే కదా! అప్పుడు ఆ ఇంద్రియములన్నీ తమలో ఎవరు గొప్పయో నిర్ణయించుకోలేకపోయాయి. **సృష్టికర్తయగు ప్రజాపతిని సమీపించాయి.**

*చూపు, వినికిడి, స్పర్శ, ఆస్వాదన, రుచి, వాక్కు , మనస్సు – ఇత్యాది అభిమాన దేవతలుగా మమ్ములను సృష్టించిన ఓ సృష్టికర్తా! ప్రజాపతీ! మీరు దేహములో మమ్ములను సృష్టించారు. బాగున్నది. అయితే మాలో ఎవ్వరు అత్యంత శ్రేష్ఠమైనవారో– అది మేము వాదులాడుకొని కూడా తేల్చుకోలేక, మీ దర్శనానికి వచ్చాము. మీరు తేల్చి చెప్పండి! మాలో ఎవ్వరు అత్యంత జ్యేష్ఠులు, శ్రేష్ఠులు?"*

**బ్రహ్మదేవుడు :** ఓ ఇంద్రియములారా! మీరంతా కూడా దేహములో శ్రేష్ఠులే! మీరంతా నాచే సృష్టించబడటం చేత **"ఈ ఇంద్రియము తదితర ఇంద్రియములకంటే కూడా అత్యంత శ్రేష్ఠము"** అని ఎట్లా చెప్పుతాను? తండ్రి తనబిడ్డలతో **"ఈతడే అందరి కంటే శ్రేష్ఠుడు"** అని అనలేడు కదా! అందరూ తన బిడ్డలేనాయె! అట్లాగే నాకు మీరు కూడా.

**ఇంద్రియములు :** తండ్రీ! మేమంతా మీ బిడ్డలమే. అయినాకూడా, ఏది ఏమైనా సరే, మాలో ఎవ్వరు దేహమునకు అత్యంత ప్రాముఖ్యమో, అత్యంత శ్రేష్ఠమైయున్నామో, అది మేము తేల్చుకోదలచాము. అంతే। కనుక మీరు చెప్పండి.

**బ్రహ్మదేవుడు :** ఓహో! అట్లాగా? అయితే ఒక పని చేయండి. మీలో ఎవ్వరైతే దేహమును విడచి పెట్టటం చేత ఈ దేహము అత్యంత అపవిత్రమై, నిష్ప్రయోజనముగా అగుచున్నదో, వారే **అత్యంత వసిష్ఠము, శ్రేష్ఠము** – అని అనుకోవచ్చు. **కనుక మీరే తేల్చుకోండి.**

అప్పుడు ఆ ఇంద్రియములు బ్రహ్మదేవుని సూచన దృష్ట్యా ఎవడు వసిష్ఠుడో తేల్చుకోవాల్సిందేనని నిర్ణయించుకున్నాయి.

[**వసిష్ఠుడు** = (దేహములో) నివసించువాడు.
– దేహమును నివసింపజేయుచున్నవాడు.]

## వాక్ ఇంద్రియము (The Divine form of Talking Ability)

ముందుగా **'వాక్కు'** అందుకు ముందుకు వచ్చింది. తన గొప్పతనము, శ్రేష్ఠత్వము, వసిష్ఠత్వము ఎంతటిదో ప్రదర్శించతలచింది. **శరీరము నుండి బహిర్గతమై, ఒక సంవత్సరకాలము ఎటో వెళ్ళిపోయింది.** ఆ సంవత్సరకాలము ఆ జీవుడు ఒక్క మాట కూడా మాట్లాడలేకపోయాడు. **"నేను వెళ్లిపోయిన సంవత్సరకాలము ఈ జీవుడు మాటమాట్లాడలేడు. కనుక, దేహము నిరుపయోగమైనదని నిరూపణమయ్యే ఉంటుందిలే!"** అని తలచుచూ తిరిగి (సంవత్సరకాలం తరువాత) శరీరములో ప్రవేశించి అంతా కలియజూచింది. ఆశ్చర్యపడింది. **శరీరము శిథిలము కాలేదు.** తదితర ఇంద్రియములు నశించకపోగా, తమ తమ పనులను యథారీతిగా ఇదివరకటి లాగానే నిర్వర్తిస్తూ కనిపించాయి.

**వాక్ ఇంద్రియము :** ఓ తదితర ఇంద్రియములారా! **కథమ్ అశకతమదృతే జీవితుమితి?** నేను సంవత్సరకాలము ఈ దేహమును విడిచి వెళ్ళినప్పటికీ, ఈ శరీరముగాని, మీరుగాని నశించనే లేదే? ఎందుచేత? నేను లేకుండా మీరంతా ఎట్లా జీవించగలిగారు? ఇది నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఎట్లా సాధ్యపడిందో చెప్పండి? వాక్కు లేకుండా శరీరం ఎట్లా నిలిచింది?

**తదితర ఇంద్రియములు :** ఓ వాక్ – ఇంద్రియమా! ఇందులో మీరు అంతగా ఆశ్చర్యపడవలసిన విశేషము ఏమున్నది?

– పుట్టు మూగవాడు (మరియు) మధ్యలో, గొంతును వాక్కును (ఏ అనారోగ్యము వలననో) పోగొట్టుకొన్నవాడు – ఈ ఇరువురు కూడా ప్రాణములతో జీవిస్తూనే ఉన్నారు కదా! ఆతని కళ్ళు చూస్తూనే ఉన్నాయి. మనస్సుతో ఆతడు తెలుసుకుంటూనే ఉన్నాడు. రేతస్సుతో సంతానము పొందుచూనే ఉన్నాడు.

అదంతా ఎట్లా జరుగుతుందో, అదేవిధంగా మీరు లేని సంవత్సరకాలము దేహము–ప్రాణములతో జీవించియే ఉన్నది. మేము మా పనులను కొనసాగిస్తూనే ఉన్నాము.

అప్పుడు వాక్కు ఇట్లా తలచింది : ***"బ్రహ్మదేవుడు చెప్పిన విధానము ప్రకారము నేనే అందరి కన్నా వసిష్ఠము, శ్రేష్ఠాతిశ్రేష్ఠము కాదన్నమాట!". సిగ్గుపడి, తిరిగి శరీరములో ప్రవేశించి, ఇక తన పని తాను చేసుకోసాగింది.***

## చక్షు (చూపు) ఇంద్రియము (The Divine form of Seeing Ability)

**చక్షురింద్రియము :** అప్పుడు చక్షురింద్రియము (చూపు–చూచుశక్తి) **"ఇక, నా గొప్పతనమేమిటో చాటి చెప్పెదనుగాక!"**.. అని తలచి, **దేహమును విడచి ఎటో వెళ్ళింది.** సంవత్సరకాలము తిరిగి రానేలేదు. ఈ సంవత్సరకాలము ఆ దేహి (శరీరి) ఏదీ కనులతో చూడకయే గడచింది. సంవత్సరకాలం తరువాత చక్షురింద్రియము తిరిగి దేహంలో ప్రవేశించింది. (The organ of 'Seeing' vacated the body and, after one year, got back into the Body).

తదితర ఇంద్రియములు ఇంతకుముందు వలెనే తమ పనులు తాము కొనసాగిస్తూనే ఉన్నాయి. దేహము శిధిలము కాలేదు.

**నేంత్రేంద్రియము :** ఓ తదితర ఇంద్రియములారా! నేను సంవత్సరకాలం ఈ దేహాన్ని విడచి ఎటో వెళ్ళాను కదా। తిరిగి వచ్చి చూస్తే, ఇంకా కూడా ఈ శరీరము శిధిలం కాలేదు. నశించలేదు. శరీరంతోబాటే మీరంతా ఇంకా కొనసాగుచూనే ఉన్నారు. ఇదెలా సాధ్యం? ఈ దేహములో అత్యంత శ్రేష్ఠము నేనే కదా? కాదా?

**తదితర ఇంద్రియములు :** ఓ నేంత్రేంద్రియమా! ఈ మాత్రానికి ఆశ్చర్యపడవలసినదేమున్నది? పుట్టుకతో గ్రుడ్డివాడు ప్రాణములతో జీవించటం లేదా? ఒకనికి ఏదో ప్రమాదంలో కనులు పోయినప్పుడు కూడా – తదితర ఇంద్రియములైన వినికిడి, రుచి, స్పర్శ, మాట్లాడటం, కాళ్ళతో నడవటం, చేతులతో వస్తువులను పట్టుకోవటం, శృంగారము– ఈ పనులన్నీ ఆతడు కొనసాగిస్తూనే ఉన్నాడు కదా! ఆ తీరుగానే మీరు లేచిపోయిన సంవత్సరకాలము మేము మా మా పనులను ఈ శరీరములో కొనసాగిస్తూనే ఉన్నాము. చూడలేకపోయినంత మాత్రంచేత ఈ శరీరము మూలపడి నశించనూ లేదు. నశించదు.

అప్పుడు నేత్రేంద్రియము ఇట్లా తలచింది : **"ఓహో! ప్రజాపతి చెప్పిన రీతిగా నేను లేకపోయినంత మాత్రంచేత ఈ శరీరము నశించుట లేదు కాబట్టి, "నేనే శ్రేష్ఠాతిశ్రేష్ఠం" అని అనటానికి వీలు లేదన్నమాట!"** ఇట్లా తలచి మౌనము వహించింది. తన పనిని శరీరములో కొనసాగించసాగింది.

## శ్రోత్రేంద్రియము - వినికిడి (The Divine form of Hearing Ability)

అప్పుడు శ్రోత్రేంద్రియము దేహమును విడచి ఎటో వెళ్లిపోయి, సంవత్సరమైన తరువాత తిరిగి దేహములో ప్రవేశించింది. ఆ సంవత్సరకాలము ఆ జీవుడు ఒక్క శబ్దము కూడా వినలేకపోయేవాడు. తీరా, తిరిగి దేహములో ప్రవేశించిన తరువాత చూస్తేనో? దేహము శిధిలము కాలేదు. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. నోరు మాట్లాడుచూనే ఉన్నది. మనస్సు విషయాలను ఆలోచిస్తూనే ఉన్నది. రేతస్సు సంతానమును కనటం ఆగనేలేదు.

తదితర ఇంద్రియములన్నీ ఇట్లా అన్నాయి.

*"ఓ శ్రోత్రేంద్రియమా! మీరు ఈ దేహమును విడచి వెళ్ళిన సంవత్సరకాలము మేమంతా మామా ధర్మములను కొనసాగిస్తూనే ఉన్నాము. ఈ శరీము నేలకూలలేదు కూడా. ఎందుకంటారా? పుట్టుకతో చెవిటివాడు మాట్లాడుతూనే ఉన్నాడు కదా! చూస్తూనే ఉన్నాడు కదా! సంతానము పొందుచూనే ఉన్నాడు కదా! ఆలోచనలు చేస్తూనే ఉన్నాడుకదా! అదేవిధంగా దేహంలో ఒక్క వినికిడి తప్పించి తదితర వ్యవహారాలన్నీ కొనసాగుచూనే వచ్చాయి".*

అప్పుడు శ్రోత్రేంద్రియము అనుకొన్నది. "నేను లేనప్పుడు కూడా దేహము కొనసాగింది. అనగా నేను అత్యంత ప్రాముఖ్యమైన విభాగమును కాదు. **నేను లేకుంటే శరీరము ఉండదు – అని తలచటం.. సముచితం కాదు".**

అప్పుడిక ఇక శరీరములో ప్రవేశించి తన ధర్మములను కొనసాగించసాగింది.

## మనస్సు - ఆలోచన (The Divine form of Thinking Ability)

ఇకప్పుడు మనస్సు శరీరమును విడచి ఎటో వెళ్ళిపోయి, సంవత్సరకాలము తరువాత వచ్చి చూస్తే. శరీరములోని తదితర ఇంద్రియములతో సహా, దేహము క్షయించక క్షేమంగానే ఉన్నది. **"ఇదేమిటి? నేను ఇంతకాలం లేకున్నా ఈ దేహము ఎట్లా కొనసాగింది?"**... అని ప్రశ్నిస్తూ ఉంటే,... తదితర ఇంద్రియములు ఇట్లా వివరించాయి.

"ఒకడు అత్యంత మూఢుడుగానో, మతిలేనివాడుగానో (Mad Person) – అయినప్పటికీ కూడా, జననేంద్రియ పునరుత్పత్తి భావములు, స్పర్శ రూప రస గంధజ్ఞానములు కొనసాటం లేదా? ఇదీ అంతే! మతిలేనివాడు కూడా మాట్లాడుచూనే ఉన్నాడు. ఒక సామాన్య మానవునివలె **"ఎదురుగా ఉన్నది లోకరీతిగా గుర్తించటము – తెలివితో మాట్లాడటము"**.. లేనప్పుడు కూడా, శరీరము శిధిలమవటం లేదని అందరూ చూస్తున్నాం కదా! ఇదీ అంతే!"

**"అట్లా అయితే నేను కూడా ఈ జీవునికి అనివార్యంగా అత్యంత శ్రేష్ఠమైన ఇంద్రియమును కాదన్నమాట!"**.. అని తలచి మనస్సు కూడా మౌనం వహించింది. శరీరములో ప్రవేశించి తన 'మననము' అను స్వభావం నిర్వర్తించసాగింది.

## రేతస్సు - జననేంద్రియము (The Divine form of Reproductive Ability)

అప్పుడు రేతస్సు (శృంగార భావన) దేహమును విడచి ఎటో వెళ్ళి సంవత్సరకాలం తరువాత దేహములో ప్రవేశించి చూడగా, దేహము జీవితమును కొనసాగిస్తోందేగాని, ముగియలేదు. **"ఇది ఏమిటబ్బా?"** అని ఆశ్చర్యపడుచూ ఉంటే తదితర ఇంద్రియములు ఇట్లా సమాధానం చెప్పాయి.

ఓ జననేంద్రియమా! ఓ రేతస్సా! ఎందుకండీ ఆశ్చర్యపడతారు? సంతానము కనలేకపోయినంత మాత్రం చేత మనస్సు లేకుండాపోతుందా? నోరు మాట్లాడదా? నాలుక రుచి చూడదా? కళ్ళు చూడటం మానివేస్తాయా? చెవులు వినకుండా ఉంటాయా? కాళ్ళు నడవవా? చేతులు పట్టుకోవా? ఎవ్వరి పని వారిదే. ఆ మాటకు వస్తే జన్మతః నపుంసకుడు అయినవాడు మాత్రం జీవించటం లేదా?

*ఏదైనా వ్యాధి కారణంగా రేతస్సు నిర్వీర్యమైనా కూడా ఆ దేహము నశించుటలేదుకదా! అదేరీతిగా మీరు లేనట్టి ఒక సంవత్సరకాలము ఈ దేహము క్షీణించనేలేదని గమనించండి.*

ఆ మాటలు విని రేతస్సు **"అవును కదా! కాబట్టి నేను లేనంత మాత్రం చేత దేహము నశించునది కాదు. కాబట్టి – ప్రప్రధానమైన, – అత్యంత శ్రేష్ఠమైన ఇంద్రియమును నేను అయి ఉండలేదు".. అని గ్రహించి మౌనము వహించింది. తిరిగి దేహంలో ప్రవేశించి తన స్థానమును కొనసాగించసాగింది.**

## ప్రాణ ఉత్క్రామిష్యన్।

ఆ తరువాత **ప్రాణము** దేహమును నిష్క్రమించటము ప్రారంభించింది. అంతే! ఒక పెద్ద పంచకళ్యాణి గుఱ్ఱము త్రాళ్ళను తెంచుకొని త్రాళ్ళతో సహా పరుగులు తీయటం ఆరంభిస్తుంది చూచారా!. ఆ విధంగా ప్రాణము వెంటగా **కంటి చూపు, చెవుల వినికిడి, చర్మపు స్పర్శ, మనస్సు యొక్క యోచనలు – రేతస్సు**.... మొదలైన ఇంద్రియ విశేషాలన్నీ వాటివాటి విషయ ప్రసరణలను విరమించుకొని

పెకలించబడిన చెట్లు కొమ్మలు తుపానుగాలికి ఎగిరిపోవునట్లుగా,– **'ప్రాణము' అనే గుఱ్ఱము వెంట పరుగులు తీయటానికి సిద్ధం కాసాగాయి.**

ఈ విధంగా ఇంద్రియములన్నీ దేహము నుండి తమ తమ స్థానములను కోల్పోవుచున్నట్లు ప్రాణముతో బాటే బయటకు పరుగులు తీస్తున్నట్లు, తాము జారిపోతున్నట్లు (తమ గురించి) పంచేంద్రియములు, మనస్సు గమనించాయి. వెంటనే ముఖ్యప్రాణశక్తికి ఈవిధంగా 'ప్రార్థన' సమర్పించసాగాయి.

**ఓ పూజనీయా! ముఖ్యప్రాణ దేవతా! మీరు దేహము నుండి పైకి లేవకండి। ఆగండాగండి। మేమిప్పుడు రెండు విషయాలు గమనించాము.**

*(1) ప్రాణము లేకుండా మేము ఈ దేహములో ఏమాత్రమూ ఉనికిని కొనసాగించలేమని మాకు తెలిసిపోతోంది.*

*(2) మాలోని వాక్కు యొక్క* ***విశిష్ఠత్వము – వసిష్ఠత్వము*** *మీకు చెందినదే! కనుక మీరే వసిష్ఠుడు. మాలోని కన్నుల యొక్క* ***ప్రతిష్ఠ,*** *మనస్సు యొక్క* ***యోచనాశక్తి,*** *సంతానమును వర్థిల్లజేయు* ***రేతోశక్తి*** *కూడా మీకు చెందిన శక్తులే. సమస్త దేహాంతర్గత దేవతలము మీకు చెందిన తేజో విశేషులమే. ప్రాణశక్తియొక్క వివిధరూపములైన ప్రదర్శనములే.*

ఈ విధంగా **సంపద–ప్రతిష్ఠ – ఆయతనము – ప్రజననములు ముఖ్యప్రాణదేవుని వివిధ తేజోరూపములుగాను, తమను తాము ప్రాణమునకు చెందినవారిగాను ఇంద్రియములు గుర్తించి, ప్రాణమును స్తోత్రము చేయసాగాయి.**

**ముఖ్యప్రాణము :** ఓ ఇంద్రియములారా! మీరంతా నా యొక్క తేజోకిరణ విశేషములుగా గమనించి గుర్తిస్తున్నారు కదా! నాకు సంతోషము. అయితే.. **మే కిమ్ అన్నం? కిం వాస?** నాకు ఆహారము (అన్నము) కావాలి. వస్త్రములు కావాలి మరి! ఎట్లా నాకు లభించేది? అవన్నీ లభిస్తూ ఉంటేనే ఈ దేహంలో నేను ఉంటాను.

**ఇంద్రియములు :** ఓ ప్రాణదేవా! సకల జీవులకు ప్రాణములకు ఇష్టమగుచున్న అన్నము (అనుభముగా అగు విషయములన్నీ కూడా)... మీకు **అన్నము** అగుచున్నది. జలమే మీరు ధరించు వస్త్రము.

ఎవ్వడైతే ఇట్లు అన్నము (అనుభవములు)లను 'ప్రాణము యొక్క అన్నము'గా ఉపాసిస్తారో, అట్టివారికి అభక్ష్యము (తిన గూడదు)... అనునవి ఏవీ ఉండజాలవు. (తినతగినవే లభిస్తాయి).

**"జలము ప్రాణమునకు వస్త్రము వంటిది"** అని గ్రహించటంచేతనే, ఇప్పటికీ కూడా వేదవేత్తలు (ప్రాణమును ఉపాసించుటకై) భోజనము చేసే ముందు ఆహార పదార్థములపై సంప్రోక్షం చేస్తూ **"ఓం భూర్భువస్సువః,... ప్రాణాయి స్వాహా! అపానాయి స్వాహా! వ్యానాయి స్వాహా! ఉదానాయిస్వాహా! సమానాయిస్వాహా"** అను మంత్రము చదువుచూ అగ్నిదేవుని రూపమగు జఠరాగ్నికి నమస్కరిస్తున్నారు. అట్లాగే భోజనానంతరము **"ఓం... అమృతాభిధానమసి, అరొరవే పుణ్యానిలయే.."** అను మంత్రమును చదువుచున్నారు. ఇట్లా చేయుటచే మేము **'ప్రాణము నగ్నము కాకుండా చేయుచున్నాము'.** – **"ఏవమే తత్ తదవమగ్నం కుర్వంతో మన్యంతే।"** – అని భావిస్తున్నారు.

అనగా..

భోజనముకు ముందు, భోజనము తరువాత కూడా (కర్మగా) శుద్ధి కొరకు, భావనగా ప్రాణమునకు వస్త్రముగా జోడించవలెనని శృతి విధించుచున్నది. – **ఓం ప్రాణోగాయత్రి – ఇత్యుక్తం!** ప్రాణమే గాయత్రి అని చెప్పబడుచున్నది। **శ్రేష్ఠశ్చ, జ్యేష్ఠశ్చ ప్రాణః। న వాక్ ఆదయో।** ఈవిధంగా దేహములో జ్యేష్ఠమైనది, శ్రేష్ఠమైనది ప్రాణశక్తి తత్త్వమే. అంతేగాని వాక్కు, ఇతర ఇంద్రియములు, మనస్సు మొదలైనవి కావు. ఇంద్రియానుభవములన్నీ కూడా ప్రాణదేవతయొక్క దైనందికమైన (ప్రతిరోజూ) ఆహారము.

**ఇతి – అష్టమాధ్యాయః**

***ప్రాణ సంవాద బ్రాహ్మణమ్ నామ ప్రథమోధ్యాయః – సమాప్తం॥***

అష్టమాధ్యాయము

# ద్వితీయ బ్రాహ్మణము
# 2. కర్మ విపాక బ్రాహ్మణము

**ఆరుణి ముని యొక్క పుత్రుడు శ్వేతకేతువు.** ఆ శ్వేతకేతువు తండ్రి యొద్ద వేద-వేదాంగ- తర్క... ఇత్యాది విద్యలు నేర్చుకొనియున్నారు. ఒకరోజున తన కుమారుని విద్యానైపుణ్యమును గ్రహించిన ఆరుణి **"నీవు నాకు తెలిసిన విద్యలన్నీ నేర్చినావు. నాకు చాలా సంతోషము"**.. అని హర్షమును, ప్రశంసను (Apreciation) ప్రకటించారు.

చాలా సంతోషము పొందిన శ్వేతకేతువు తండ్రితో **"పితృదేవా! మీ నుండి విద్యను నేర్చినందుకు సార్ధకత** (Fruitfulness) **కొరకై నేను పాంచాలదేశము వెళ్ళుటకు అనుజ్ఞ ఇవ్వండి. అక్కడ గొప్ప 'పండిత సభ' జరుగుతోందని విన్నాము. నేను ఆ సభలో నా పాండిత్యము ప్రదర్శించి, పండితుల మన్ననలను, పాంచాలరాజు యొక్క సన్మానమును పొందవలెనని భావిస్తున్నాను"**.. అని పలికారు.

**ఆరుణి:** కుమారా! శ్వేతకేతువూ! అట్లాగే వెళ్ళిరమ్ము! పండిత సభలో పాల్గొనటంచేత నీకు ఇంకా **అనేక విషయాలు అవగతమౌతాయి.** – ఇట్లా పలికి కుమారుని ఆశీర్వదించి పంపారు.

తండ్రి యొక్క అనుజ్ఞానుసారంగా – పండిత సభలో పాండిత్య ప్రదర్శన వలన కీర్తి-ప్రతిష్ఠలను పొందు ఉద్దేశ్యముతో – శ్వేతకేతుముని పాంచాలదేశపు పండిత సభను ప్రవేశించారు. ఆ దేశపురాజు జీబలుడు – అనువాని కుమారుడు. **పేరు ప్రవాహణుడు.** ఆయన స్వతఃగానే రాజయోగి. విద్యావేత్త అని, విద్యాపరిపోషకుడు అని లోక ప్రసిద్ధుడు.

ఎంతోఠీవిగా నడచివచ్చుచున్న శ్వేతకేతువును ప్రవాహణమహారాజు గమనించసాగారు. ఆతని నడక – మాటతీరులలో **"నేను సర్వ విద్యలను నేర్చిన పండితుడను సుమా!"**.. అను **గర్వము**, తదితర పండితులకంటే అధికంగా విద్యనేర్చాననే **దర్పము** ఉన్నట్లు రాజుకు అనిపించింది.

**ప్రవాహణమహారాజు :** (దర్పము చిన్నవారికి పనికిరాదు – అని గుర్తుచేయువిధంగా).. కుమారా! కుమారా! కుమారా! రండి! రండి!

**శ్వేతకేతువు :** (కించిత్ దర్పముతో కూడిన వ్యంగ్యముగా) ఓ భో రాజా! భో రాజా! భో రాజా! వస్తున్నాను. వస్తున్నాను. వస్తున్నాను.

**ప్రవాహణ మహారాజు :** పూజనీయులగు మీ తండ్రిగారు ఆరుణి మునీశ్వరుల ఆశీర్వాదము, అనుజ్ఞ తీసుకొనియే ఈ పండిత సభకు వేంచేస్తున్నట్లుగా నేను అనుకుంటున్నాను. కుమారా! అవును కదా!

**శ్వేతకేతువు :** అవును మహారాజా! మా పిత్రుదేవుల ఆజ్ఞను అనుసరించే ఈ పండిత సభకు **పాండిత్య ప్రదర్శన** కొరకై వస్తున్నాను.

**ప్రవాహణ మహారాజు :** బిడ్డా! చాలా సంతోషము. మీరు అంగీకరిస్తే మిమ్ములను కొన్ని ప్రశ్నలు అడుగ తలచాను. మీకు అంగీకారమేనా?

**శ్వేతకేతువు :** నాయొక్క పాండితీ ప్రదర్శన కొరకే ఈ పండిత సభకు వచ్చాను. కనుక మహారాజా! మీరు తప్పకుండా అడుగవచ్చును. తప్పక సమాధానము సశాస్త్రీయంగా చెప్పగలను.

**ప్రవాహణ మహారాజు :** మీ పిత్రుదేవులు – మాకు, మా వంశమునకు, పూజ్యులు అగు ఆరుణి మునీంద్రుల వారికి నమస్కరిస్తూ ఈ ప్రశ్నలు అడుగుచున్నాను.

**మొదటి ప్రశ్న : వేత్థ యథేమాః ప్రజాః ప్రయత్యో విప్రతి పద్యన్తా 3(ఉ) ఇతి? (8-1-2)।** ఈ జనులంతా కూడా తమ యొక్క మరణానంతరము ఏఏ వివిధ మార్గములగుండా ప్రయాణించి వెళ్ళుచున్నారో, అది మీకు తెలుసుకదా? **విప్రతి పద్యన్తాం।** (వేరువేరు మార్గములుగా) → ఎటెటు ప్రయాణిస్తూ ఉన్నారు? నేటి సభకు వివరించి చెప్పగలరు కదా!

**శ్వేతకేతువు :** నేతి। ఈ జీవులంతా మరణానంతరము ఏఏ వేరైన మార్గములలో ప్రయాణించి వెళ్ళుచున్నారో, అది నాకు తెలియదే!

**ప్రవాహణ మహారాజు :** ఇదేమిటి? మీకు తెలియదా? సరే!

**రెండవ ప్రశ్న : వేత్థో యథా ఇమం లోకం పునరాపద్యన్తా 3(ఉ) ఇతి?** ఆ మరణించినవారు తిరిగి ఈ లోకములోనికి ఏఏ వివిధ మార్గముల గుండా ప్రయాణించి తిరిగి వస్తున్నారు? ఇది సభకు చెప్పండి. బహుశః ఇది మీకు తెలిసియే ఉండవచ్చు కదా!

**శ్వేతకేతువు :** లేదు. తెలియదే! మరణించినవారంతా ఏఏ వేరువేరు మార్గములలో తిరిగి ఈ లోకంలో ప్రవేశిస్తున్నారో, ఇది కూడా నేను తెలుసుకొని ఉండలేదు.

**ప్రవాహణ మహారాజు :** ఇదీ వినలేదా? సరే! నా **మూడవ ప్రశ్న** వినండి! **వేత్థో యథా అసౌ లోక ఏవం బహుభిః పునః పునః ప్రయద్భిః సంపూర్యతా 3(ఉ) ఇతి?**

ఈ జీవులు ఒకరితరువాత మరొకరుగా మరణిస్తూ పరలోకమునకు పోవుచున్నారు కదా! ఈ అసంఖ్యాక మరణము పొందిన జీవాత్మలచే పరలోకములు నిండిపోతూ క్రొత్తవారికి చోటులేకపోవాలి కదా? ఎందుకు చోటు దొరకక నిండిపోవటము లేదు? ఇది మీకు తెలిసినదే కదా?

**శ్వేతకేతువు :** ఈ మీ మూడవ ప్రశ్నకు కూడా నాకు సమాధానము తెలియదే? నేనెప్పుడూ వినలేదు, విచారించలేదు, తెలుసుకోవటానికి యత్నించి ఉండలేదు కూడా.

**ప్రవాహణ మహారాజు :** దీనికీ సమాధానము మీరు ఎరుగరా? సరేలెండి. నా **నాలుగవ ప్రశ్న** వినండి.

**వేత్థో యతిథ్యామాహుత్యాగ్ం హుతాయామ్**
**ఆపః పురుష - వాచో భూత్వా సముత్థాయ వదంతీ 3 (ఉ) ఇతి? (8-2-2)।**

ఆహుతులు చేయబడుచుండగా, **ఎన్నవ ఆహుతికి** జలములు **"పురుషుడు"**.. అని పిలువబడేవిగా అయి, **పురుషవాక్కును పొంది, లేచి నిలబడి** మాటలాడగలుగుచున్నాడో, ఇది మీరు తెలుసుకొనే ఉన్నారుకదా?

[ఇదే ప్రశ్న ఈ రీతిగా అడుగుతాను. ఉదకము ఆహుతి చేస్తూ ఉండగా, ఏ సంఖ్య అయిన ఆహుతి హోమము చేయబడగా, పురుషుని (ఏవాక్కుగలదో - అ) వాక్కుగా కలది అయి (లేక 'పురుషుడు' అని పిలువబడునవై) పురుషుని రూపముగా పరిణతి చెందుతోంది? పురుషుని వాక్కుగా అయి, అది ధ్వని చేస్తుంది? ఆ జలములు చక్కగా లేచి, పలుకులు పలుకుతాయి? జీవుడు మాట్లాడగలుగుచున్నాడు?]

**శ్వేతకేతువు : ఎన్నొవ ఆహుతి సమర్పించినప్పుడు ఉదకము పురుషకారముగా మారి వాక్కును ధ్వనిస్తుందో,** (లేక) సంభాషిస్తుందో.. ఈ విషయం గురించి కూడా నేను వినియే ఉండలేదు. ఏ మాత్రము తెలియదు కూడా।

**ప్రవహణ మహారాజు :** ఇదీ ఎరుగరా! సరే! **నా ఐదవ ప్రశ్న** : **వేత్థో 'దేవయానస్య' వా, పథః ప్రతిపదం పితృతయాణస్య వా? 'దేవయానము' 'పిత్రుయానము'** అనే మార్గముల **'ప్రతిపదము'** ఏమిటో మీరు ఎరుగుదురా? అనగా, ఏఏ క్రమమైన కర్మలచేత దేవయానము, పిత్రుయానము - అను మార్గములను ఫలములుగా ఈ జీవులు పొందగలరో, ఆ ప్రతిపద రూప (ఫలసిద్ధి నిర్వచన రూప) మంత్ర వాక్యములు మీరు వినియున్నారా? మీకు తెలియునా? (లేక)

**దేవయాన - పిత్రుయాన మార్గములు పొందే సాధనములు, తత్సంబంధమైన మంత్రవాక్యములు మీరు సభకు వివరించి చెప్పగలరా?**

**మరికొంత వివరణ వినండి!**

మేము దేవతల యొక్కయు - పిత్రుదేవతల యొక్క రెండు మార్గములను శ్రుతులు చెప్పగా విని ఉన్నాము.

→ ఈ రెండూ కూడా **మానవులు మరణానంతరము ప్రయాణించునట్టి, మానవులకు చెందిన మార్గములే.** ఈ రెండు మార్గముల మధ్య ఈ చంచల జగత్తంతా సాధన - రూపముగా ఉండి ఉంటోంది. ఈ రెండూ కూడా భూ-స్వర్గలోకముల మధ్య - (తల్లి తండ్రుల మధ్య ఉన్నవి వలె) - ఉనికి కలిగి ఉన్నాయి.

అట్టి దేవయాన - పిత్రుయాన **మార్గముల గురించి, సాధనముల గురించి, సాధ్యము గురించి వివరించండి.**

**శ్వేతకేతువు : నాహమత ఏకం చ। న వేదేతి।**

ఓ పాంచాల దేశాధీశా! జీబల ప్రియపుత్రా! ప్రవాహణ మహారాజా! మీరు అడిగిన ఐదు ప్రశ్నలలో ఏ ఒక్క ప్రశ్నకూ నాకు నిజంగా సమాధానం తెలియదు.

**ప్రవాహణ మహారాజా :** పోనీలెండి! మీరు మాకు అతిథులు. యువకులు. మీ తండ్రి గారు ఆరుణిమునీంద్రుడు మాకు పూజ్యులు. మీకు చక్కటి వసతిగృహము చూపించవలసినదిగా మా మంత్రిని ఆదేశించాను. దయచేసి చక్కగా విశ్రాంతి తీసుకోండి. ఈ పండిత సభలో పాల్గొని ఆయా అనేక విశేషాలు నేర్చుకొనెదరు గాక. మీకు వీలైనన్ని రోజులు మేము అందించే అతిథి సేవ స్వీకరిస్తూ, సభలలో ప్రవచనములు చేసెదరుగాక।

ఇట్లా పలికి, ప్రవాహణ మహారాజు **ఆ రోజు సభ కొరకై తన సేవకులకు తగిన ఆజ్ఞలు ఇస్తూ, ఇక తదితరమైన పనులలో నిమగ్నమయ్యారు.**

**శ్వేతకేతువు** (తనలో) ఈ విధంగా సమాలోచించసాగారు

నేను **"విద్యా పారంగతుడను"** అని మా తండ్రిగారు నా అధ్యయనమునకు మెచ్చుకున్నారు కదా। పాంచాలదేశపు పండిత మహాసభలో నా పండిత్య ప్రకర్షను ప్రదర్శించాలని వచ్చానే! వచ్చీ రాగానే ఈ రాజు అడిగిన '5' ప్రశ్నలకే సమాధానం చెప్పలేకపోయాను. ఇంకేమి పాండిత్యము? ఇక నేను ప్రవచించేదేమున్నది? ఈరోజు ప్రశ్నలకే సమాధానం తెలియని నాకు ఇక్కడేమి గౌరవం? ఇక్కడ నేను ఉండికూడా ప్రయోజనం లేదు. ఇక తిరిగి మా తండ్రి గారి దగ్గరకే వెళ్ళి అడుగుతాను.

***ఇట్లా ఆలోచిస్తూ, పాంచాల పండిత సభా ప్రాంగణము నుండి వెనుకకు మరలారు. ఇంటికి చేరి ఆ శ్వేతకేతువు తండ్రిని సమీపించారు.***

❖ ❖ ❖

**ఆరుణి :** ప్రియపుత్రా! శ్వేతకేతూ! అప్పుడే పాంచాలరాజ్యంలో జరుగుచున్న పండిత సభలు ముగిశాయా ఏమిటి? వచ్చేసావేమిటి?

**శ్వేతకేతువు:** తండ్రీ! అదేమీ లేదు. ఇంకా పండిత సభలు కొనసాగుచున్నాయి. అది సరేకానీయండీ...,

**ఆరుణి :** ఏమి? ఏమైనది? ఆ రాజుగారు, ఆ పండిత సభ నిన్ను ఆదరించలేదా?

**శ్వేతకేతువు :** అదేమీ లేదు. ప్రవాహణ మహారాజు ఆదరించారు. సంభాషించారు కూడా. ఇది వరకు నా విద్యాభ్యాసము సంపూర్తి అయిన తరువాత **"అన్ని విద్యలలో నీవు శిక్షణ పొందినట్లే"** అని మీరు అన్నారు కదా! అనలేదా, చెప్పండి?

**ఆరుణి :** అవును. అన్నాను. ఓ సుమేధా? శ్వేతకేతూ? ఏమైనదని అట్లా అడుగుచున్నావు? **కథం కేన ప్రకారేణ తవ దుఃఖమ్ ఉపజాతమ్?** ఇప్పుడు నీకు ఎందుకు దేనివలన ఆ విషయంలో బాధ కలిగింది? వివరించి చెప్పు।

**శ్వేతకేతు :** ఇంక ఏమైనదేమిటి? **పంచమా ప్రశ్నాన్ రాజన్యబంధుః అప్రాక్షీః। తతో నై కంచన వేదేతి।**

(నిష్ఠూరంగా) ఆ రాజన్యబంధువు నన్ను ఐదు ప్రశ్నలు అడిగారు. ('రాజబంధువు' అనగా 'రాజుగారి చుట్టము'. ఇది దూషణ వాక్యము).

ఒక సామాన్యుడగు రాజు అడిగిన ఐదు ప్రశ్నలలో ఒక్కదానికి కూడా నేను సమాధానము చెప్పలేకపోయాను.

తలదించుకొని వచ్చాను, తెలుసా? ఇంక నేను నిపుణిణ్ణి - అని మీరు ఎట్లా అన్నారో తెలియటం లేదు.

**ఆరుణి :** అట్లాగా? ఏమిటా '5' ప్రశ్నలు?

**శ్వేతకేతువు :** సంక్షిప్తంగా చెప్పుతాను. వినండి.

(1) మరణించినవారంతా ఏ ఏ మార్గములలో పరలోకాలకు వెళ్ళుచున్నారు?
(2) వారంతా ఏ ఏ త్రోవలలో తిరిగి ఈ లోకంలో పునః ప్రవేశిస్తున్నారు?
(3) మరణిస్తున్నట్టి ఈ అసంఖ్యాక జీవులతో పరలోకములు నిండిపోవటం లేదా? ఎందుచేత?
(4) ఎన్నవ ఆహుతి సమర్పించిన తరువాత ఉదకము పురుషరూపము దాల్చి, వాక్కును పొంది సంభాషిస్తోంది?
(5) ఏఏ కర్మల కారణంగా (సాధనములచే) ఈ జీవులు దేవయాన - పిత్రుయాన మార్గములను అనుసరిస్తున్నారు? వాటికి సంబంధించిన సాధన - సాధ్యములు ఏమేమి?

ఇంకనూ నేను వేదవిద్యావేత్తలతో, తదితర ప్రసిద్ధి కెక్కిన పండిత వరేణ్యులతో వాద-ఉపవాదములలో ప్రవేశించనే లేదు. నా పాండిత్యమును చెప్పుకోనే లేదు. మొట్టమొదటే సామాన్యుడు - అపండితుడు అగు ఆరాజన్య బంధువు అడిగిన ఐదు ప్రశ్నలకే సమాధానం తెలియక మరలివచ్చాను. ఇక్కడేమో, నేను విద్యలన్నీ పూర్తిగా అభ్యసించానని మీరు అంటారు? అదేమి బాగు?

**ఆరుణి :** కుమారా! **"నీవు విద్యలన్నీ సంపూర్ణంగా అభ్యసించావు"** అని నేను అన్నమాట నిజమే! ఈ నా వాక్యమునకు అర్థమేమి? నాకు తెలిసినంత విద్యను నీకు చెప్పానని, నీవు చక్కగా నేర్చుకొన్నావని నా ఉద్దేశ్యము. అంతేగాని **ప్రపంచములోని అన్ని విద్యలు-అన్నీ నాకు తెలుసుననీ, నీవు నేర్చావనీ ఎట్లా అర్థం చేసుకుంటావు?** నీ వద్ద నాకు తెలిసిన విద్య దాచిపెట్టడానికి, నాకేమి అవసరం?

ప్రియ పుత్రుడవైన నీకన్నా నాకెవరు అధికులై ఉన్నారు? ఆ రాజు అడిగిన ప్రశ్నలకు నాకు కూడా సమాధానము తెలియదు సుమా! అయినా..., మనకన్నా అధికంగా వేదవిద్య-ఆత్మవిద్య మొ॥నవి తెలిసినవారు తారసబడినప్పుడు, వారివద్ద శిష్య భావముతో సమాచారము గ్రహించాలి. అంతేగాని, **"నాకు అన్నీ తెలిసిపోయాయి"**.. అని భావించటము తప్పు.

అనువుకాని చోట అధికులము - అనకూడదు. మన కన్నా అధికంగా విద్య తెలిసినవారు తారసబడినప్పుడు అణకువ (Humbleness) చూపి నేర్చుకోవలసినది నేర్చుకోవాలి. అది మానేసి **"ఆయన రాజన్య బంధువు! అయోగ్యుడు! సామాన్యుడు! నాకన్నా ఆయనకు ఎట్లా తెలిసింది?"**.. అని దూషిస్తారా? తప్పుకాదూ? మనకన్నా ఉన్నత విద్య తెలిసినవారు ఎంతమంది ఉండరు?

సరేఁ! అయినదేమో అయినది. ఇప్పుడు మనిద్దరము ఆ పాంచాలదేశమహారాజు ప్రవాహణుని వద్దకు వెళ్దాము. **"అయ్యా! మీ ప్రశ్నలకు సమాధానం మాకు తెలియదు. గురురూపులై మీరే మాకు బోధించండి"** - అని అభ్యర్థిద్దాము. ఆయన వద్ద బ్రహ్మచర్యమును ఆచరిస్తూ, అక్కడే ఉండి మనకు తెలియని సమాధానాలు నేర్చుకుందాము. పద. మరల ప్రయాణానికి సిద్ధపడు. **ప్రేహి తు తత్ర ప్రతీత్య బ్రహ్మచర్యం వత్స్యావ ఇతి॥ (8-1-4)॥**

**శ్వేతకేతువు :** తండ్రీ! మీరు చెప్పినదంతా ఇప్పుడు ఒప్పుకుంటున్నాను. అయితే, **భవానేవ గచ్ఛత్వ॥** నేను ఇప్పుడు వారి ముఖమును మరల చూడటానికి ఉత్సాహం పొందలేకపోవుచున్నాను. దయచేసి మీరు వెళ్ళిరండి.

❖ ❖ ❖

అప్పుడు గౌతమగోత్రీకుడగు ఆరుణి (ఒక్కడే) అప్పటికప్పుడే జీవలుని కుమారుడగు ప్రవాహణుని చూడటానికి బయలుదేరారు.

రాజసభకు వేంచేసిన ఆరుణి మునిని చూచి, **"గౌతమగోత్ర మునీశ్వరా! సుస్వాగతము?"** అని పలుకుచూ.. ప్రవాహణుడు తమ సేవకుల ద్వారా సపర్యలు సమర్పించి ఉచితాసనము చూపారు. పాదములకు నమస్కారములు సమర్పించి **"ఓ గౌతమా! పూజ్యులగు మీకు వరము రూపంగా గోవులు, గుఱ్ఱములు, ధనము మొదలైనవి సమర్పించుచున్నాను. స్వీకరించండి!"**.. అని వినమ్రులై పలికారు.

**ఆరుణి :** మహారాజా! మీకు శుభమగుగాక! మీ ప్రజలకు సుఖ-శాంతి- ఐశ్వర్యములు, సమృద్ధిఅయి, లాభించును గాక! మీ ఆధ్వర్యములో జరుగుచున్న ఈ పండిత సభ శోభిల్లునుగాక! మీ సాదర- మర్యాదలకు సంతోషిస్తూ, కృతజ్ఞతలు తెలుపుచున్నాను. నేను ఒక వరము అడగటానికి మిమ్ములను దర్శించవచ్చాను. మీరు వరము ఇస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నారు. **ఇంకా సంతోషము.** మీరు నా కుమారుడగు శ్వేతకేతువును '5' ప్రశ్నలు అడిగియున్నారు. ఆ '5' ప్రశ్నలకు మీ సమాధానమేమిటో అదియే వరముగా మిమ్ములను శిష్యుడనై కోరుకుంటున్నాను. దయచేసి, ఆ ఐదు ప్రశ్నలకు సమాధానము బోధించండి.

**ప్రవాహణుడు :** హే గౌతమా! ఆ 'ప్రశ్నలకు సమాధానము' అనునది - **దైవేషు వై తద్వరేషు॥** దేవతలకు చెందిన వరము కదా! అందుచేత - **మానుషాణాం బ్రూహీతి।** మనుష్యులు కోరతగిన మరమేమైనా - ధనము, పశువులు, గుఱ్ఱములు, యజ్ఞ పరికరములు, గ్రామములు, దాసీజనము మొదలైనవి - దయచేసి కోరుకోండి. మీకు సంతోషముగా సమర్పించుకోగలను.

**ఆరుణి :** రాజా! విజ్ఞాయ తే! మీకు అంతా తెలుసు కదా! మేము మీ వద్ద ధనము - గోవులు -గుఱ్ఱములు - దాసీజనము... ఇవన్నీ ఇతఃపూర్వం పొందియే ఉన్నాము. అవన్నీ మీయొక్క దాన యశస్సుచేత - మా ఆశ్రమంలో సమృద్ధిగా ఉన్నాయి. అందుచేత, **మానుషవరములతో నాకు పనిలేదు. "నా వద్ద ఏది లేదో అది నేను కోరాలి. అది మీరు ఇవ్వాలి"**.. అనునదే మీరు ప్రతిజ్ఞ చేసి ఇచ్చిన వరము కదా! ప్రతిజ్ఞను కాపాడుకోవాలనే విషయం మీకు తెలుసు. ఇక్కడికి వేంచేస్తున్న వారందరి విషయంలో అపరిమితమగు దాతలుగా ప్రసిద్ధికెక్కి, మీరు మా ఒక్కరి విషయంలో మాత్రమే కదర్యుడు (ఉండి, మాట ఇచ్చి, ఇవ్వనివాడు) అవరు కదా॥

**ప్రవాహణ రాజు :** సరేఁ! మీరు మునుముందుగా శాస్త్రోక్తమైన విధానముగా శిష్యభావముతో విద్యను పొందటానికై సంకల్పించెదరుగాక!

**ఆరుణి :** ఓ ప్రవాహన మహారాజా! శిష్య భావముతో మిమ్ములను గురువుగా భావించి ఉపసదనము (శిష్యుడుగా గురువును అభ్యర్థించటము) చేయుచున్నాను. శిష్టాచారము ప్రకారము బ్రాహ్మణులు విద్యను కోరుకొని, **క్షత్రియ - వైశ్య- శూద్రులను సమీపించినప్పుడు వాక్కు ద్వారానే శిష్యత్వమును ప్రకటించి, విద్య నేర్పమని కోరుకోవటం శాస్త్రీయము.** అదే రీతిగా మీకు "పాదాభివందనము, సేవ, పాదసంవాహనము" మొదలైనవాటితో ఉపసదనము చేయటము లేదు. వాక్కుతోనే ఉపసదనము (శిష్యత్వ స్వీకారము) చేయుచున్నాను. కనుక నన్ను అర్హుడగు శిష్యునిగా పరిగణించి, మీ '5' ప్రశ్నలకు సమాధానము మీరు బోధించవలసినదిగా వేడుకొంటున్నాను. ప్రార్థిస్తున్నాను.

**ప్రవాహణ మహారాజు :** ఓ గౌతమా! ఈ ఇటువంటి సందర్భాలలో సందేహనివృత్తి కొరకు, ఆధ్యాత్మవాక్య నిరూపణ కొరకై మీ తాతలు మా తాతలను సమీపించినప్పుడు **"మీరు మీ శిష్యత్వము ప్రకటించి అప్పుడు సందేహ నివృత్తికై ప్రశ్నలు అడగండి"**.. అనే గురుశిష్య సంబంధమైన ఒకానొక సంకల్పమును ప్రతిజ్ఞగా పలకటం ఆచారం కాబట్టి, నేను ముందుగా **"శిష్యభావముతో సంకల్పించండి. అప్పుడిక చెప్పుతాను"**.. అని పలికాను. అంతేగాని, **తపో-జ్ఞాన-యోగ-వేదాధ్యయనములకు సంబంధించి అనేక విషయాలలో మీరు నాకంటే సమున్నతులని నాకు తెలుసు.** అందుచేత **"మీ శిష్యత్వము సంకల్పించి ప్రకటించటం మీరు అడిగిన విషయాన్ని చెప్పటానికి కావలసిన ఆచార విధి"**ని మీరు పూర్తి చేసినట్లే. అట్టి ఆచార విధిని మిమ్ములను కోరినందుకు అన్యథా భావించకుండెదరు గాక! (Kindly don't think otherwise).

మా తాతల పట్ల మీ తాతలు ఏవిధంగా **'అపరాధము'** అని భావించలేదో, అట్లాగే శిష్యత్వము - అను ఆచారము ప్రకటించమన్నందుకు మీరు అపరాధముగా భావించకుండెదరు గాక! మీరు కూడా వారివలెనే నన్ను, నా రాజ్యమును, నా ప్రజలను ఆశీర్వదించుచుండెదరు గాక!

## పంచాగ్ని విద్య

**ప్రవాహణ మహారాజు :** ఇప్పుడు రాజ పరంపరగా వస్తున్న **'పంచాగ్ని విద్య'** చెప్పవలసినదిగా మీరు కోరుచున్నారు. ఆ **"5 ప్రశ్నలు - వాటి సమాధానాలు"**.. **'పంచాగ్ని విద్య'**గా రాజవంశములలో ప్రసిద్ధమై ఉన్నాయి. ఈ విద్య క్షత్రియుల పరంపర ద్వారానే లోకమున ప్రవర్తిల్లుతూ వస్తోందని చెప్పబడుతోంది. ఏ బ్రాహ్మణునియందు కూడా ఈ విద్య ఇప్పటివరకు వెల్లివిరియలేదని మా పెద్దలు, ఆర్యులగు క్షత్రియులు అంటూ వుండేవారు. ఇదంతా మీకూ విదితమే. అందుకే, **"ఇది దేవతలకు చెందిన వరము కదా! మానవులకు సంబంధించిన ఏదైనా వరము కోరుకోండి"**.. అని మిమ్ములను ఇంతకుముందు కోరటం జరిగింది.

ఇది అట్లా ఉండగా, **"తపో సంపన్నులు, వేదవేత్తలు, జ్ఞానయోగులు అగు మీ వంటి మహనీయులు అడిగితే ఇవ్వరానిదేదీ లేదు"**.. అని కూడా మా పితృదేవులు జీవలుడు, మా తాతలు కూడా మమ్ములను వంశాచారంగా ఆజ్ఞాపించి ఉన్నారు. ఈరోజు ఈ పంచాగ్ని విద్యకోసం వాక్కుతో శిష్యత్వము ప్రకటించి అడుగుచున్నారు. అందుచేత **"ఈ విద్య రాజవంశములోనే ఉండాలి"** - అనునది నియమముగా కలిగి ఉండటం సాధ్యం కాదని నేను తలచుచున్నాను. విద్యలన్నీ లోకము కోసమే కదా! **"నేను శిష్యుడను - శిష్యస్తేఽహమ్"** అని మీ వంటి మహనీయులు పలికిన తరువాత మా నాన్నగారు గాని, తాతలుగాని, నేనుగాని **చెప్పకుండా ఎట్లా ఉండగలము?** స్వామీ! ఇక చెప్పుచున్నాను. ఓ గౌతమా! వినండి!

**"ఎన్నవ సంఖ్య గల ఆహుతి హోమము చేయబడగా ఉదకము పురుషుని రూపము సంతరించుకొని, పురుష వాక్కును పలుకుతోంది?"** అన్నటువంటి **నా 4వ ప్రశ్నకు మునుముందుగా** సమాధానం చెప్పుకుందాము. **అసౌవై లోకో అగ్నిః - చతుర్థః ప్రశ్నని పాథమ్యేన నిర్ణీయతే!** ఎందుకంటే, **"మొదటి మూడు ప్రశ్నల సమాధానము - నాలుగవ ప్రశ్న యొక్క సమాధానము"**-పై ఆధారపడి ఉండటం చేత!

## 4వ ప్రశ్నకు సమాధానము

### (1) ప్రథమాగ్ని : "ద్యు లోకాగ్ని" - శ్రద్ధ అను హోమద్రవ్యము - సోమో రాజా ఉదయం।

ప్రజాపతి యొక్క లీలా-క్రీడా వినోదంగా బయల్వెడలిన **'సృష్టి'** అనే సంకల్పము సిద్ధించటానికై మొట్టమొదట ఆయన దివ్యశక్తి తత్త్వులగు శబ్ద -స్పర్శ - రూప-రస-గంధ అధిష్ఠాన దేవతలను సంకల్పించారు.

అట్టి ఆ అధిష్ఠాన దేవతలు (ఇంద్రుడు, వరుణుడు, వాయువు, యముడు మొదలైనవారు).

వారు సృష్టి కొరకై పంచాగ్ని హోత్ర కార్యక్రమమును ప్రారంభించారు.

అందులో ద్యులోకాగ్ని హోత్రకార్యము - (దేవతాలోకము సిద్ధించుటకై) -గురించి ఇప్పుడు చెప్పుకొంటున్నాము.

- "ద్యులోకము"ఈ ప్రథమ అగ్ని హోత్రకార్యము నందు **'అగ్ని'**.
- ఆ ద్యులోకాగ్నికి ఇంధనము (కట్టె) - ప్రజ్వలన స్వరూపుడగు **"ఆదిత్యుడు (సూర్యాగ్ని)"**.
- ఆ ఆదిత్యుని (సూర్య) కిరణములే **"పొగ"**.
- ఆ ద్యులోకాగ్ని యొక్క జ్వాలయే **"పగలు (Day Light) "**.
- తూర్పు - పడమర - ఉత్తరము - దక్షిణము.. అను నలుదిక్కులు - **"బొగ్గులు"**.
- ఈశాన్యము-ఆగ్నేయము-నైఋతి-వాయువ్యము. ఈ నాలుగు **"అవాంతర దిక్కులు. మిణుగురులు (అగ్ని విస్ఫులింగములు)"**.

**అట్టి ఈ విధమైన (6) గుణములతో / విశేషములతో కూడిన 'ద్యులోకము' అనే అగ్నిలో : –**

– ఇంద్రుడు – వరుణుడు – వాయువు మొదలైన దేవతలు కర్తలై,
– **'శ్రద్ధ'** అను దానిని హోమ ద్రవ్యముగా భావన చేసి సమర్పిస్తున్నారు.
– అట్టి ఆహుతి నుండి **సోమరాజు (చంద్రుడు)** ఉదయించుచున్నారు.
(చంద్రుని సంజ్ఞా రూపమగు మనస్సు ఉదయిస్తోంది).
– చంద్రుడు పిత్రు దేవతలకు – బ్రాహ్మణులకు శరీర ప్రజ్ఞల నిర్మాణమునకు (Body formation and knowledge formation, Intelect) కు ప్రభువు.
– ఆహవనీ యాగ్ని – సమిధ – పొగ – బొగ్గు – మిణుగురులు – హోమ ద్రవ్యము అను ఈ '6' కూడా ఆహుతికి సాధనలు

[ ***శారీరకంగా:***

..... యజమాని దేహమునందలి వాక్కు –చూపు– స్పర్శ – రుచి–వాసనలు (పంచేంద్రియ శక్తులు)... ఇవి దేవతలు. అగ్నిహోత్ర కర్మ యొక్క హోతలు. స్తోత్రములు ఋత్విక్కులు. ఇవియే అధి దైవతంగా భౌతిక దేహంలోని ఇంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలు – "దేహప్రవర్తనము" అనే – **'విశ్వయజ్ఞము'**ను ఎల్లప్పుడూ నిర్వర్తిస్తూ ఉన్నారు].

## (2) ద్వితీయాగ్ని :: "పర్జన్యాగ్ని"

పర్జన్యుడే (మేఘములే) అగ్ని. పర్జన్యుడు అనగా సాధన రూపమగు, మేఘముతో తాదాత్మ్యము చెందియున్న దేవతా దివ్యప్రజ్ఞా రూపము.

– ఆ పర్జన్యాగ్నికి 'సంవత్సరము' యే కట్టె (ఇంధనము). ఎందుకంటే సంవత్సరము శరత్ 'ఋతువు'లో ప్రారంభమయి, శిశిర ఋతువుతో అంతమయ్యే తన ఋతు– అవయవములతో 'చక్రము' వలె తిరుగాడుచున్నది కాబట్టి
– మేఘ శకలము.. – **"పొగ".**
– మెరుపే **"జ్వాల".**
– పిడుగే **బొగ్గులు.** కఠోరమైన పిడుగులు మెరుపు తరువాత ప్రకటనమగుచున్నాయి.
– గర్జన శబ్దములు మిణుగురులు. ఈ గర్జన శబ్దములు దిక్కులన్నిటిలో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఈవిధంగా – అగ్ని, ఇంధనము, జ్వాల, ధూమము, అంగారము, (బొగ్గు, ఎరుపు), మిణుగురులు అనే 'ఆరు' పదార్థములు (పదార్థషట్కము) గల పర్జన్యాగ్ని యందు – **దేవతలు చంద్రుని (సోమరాజును) హోమము చేయుచున్నారు.**

**చంద్రుడు** = – దేవతలకు, బ్రాహ్మణులకు రాజు
– మనోరూపుడు
– ఓషధి – వనస్పతి ప్రసాదకుడు.
— **అప్పుడు "వృష్టి" లేక "వర్షము" యజ్ఞఫలముగా రూపము పొందుతోంది.**

## (3). తృతీయాగ్ని - "లోకాగ్ని"

**ఇక మూడవ అగ్ని:**

(1) సముద్రములో – నదులు – పర్వతములు – జీవులు వృక్షములు మొదలైన వివిధ పదార్థములతో కూడిన ఈ లోకమే మూడవ అగ్ని. **జన్మ–కర్మ–కర్మఫలాలకు ఆలవాలము ఈ లోకమే.** అవలోకమునకు సవిషయమంతా **లోకాగ్నియే.**
(2) అట్టి లోకాగ్నికి ఈ 'భూమి' → **ఇంధనము** (ఈ పృథివితోలోకము సమృద్ధముగా అగుచున్నది).
(3) ఈ భూమిపైగల అగ్ని → **ధూమము.** పొగవలెనే 'అగ్ని' కూడా ఈ భూమినంతటిని ఆశ్రయించి ఉన్నది. అగ్నిరూపంగా భూమిపై ప్రదర్శితము అయిఉన్నది.
(4) **'రాత్రి'యే జ్వాల.** 'పృథివి' అనే సమిధలో కలియుటచేతనే రాత్రి ఏర్పడుతోంది. **పృథివి యొక్క నీడయే** రాత్రి అయి ఉన్నది.
(5) **చంద్రుడు – బొగ్గు.** జ్వాల నుండి బొగ్గు ఉత్పన్నమగుచున్నట్లు రాత్రియందు చంద్రుడు ఉదయిస్తున్నారు.
(6) నక్షత్రము మిణుగురులు. ఆకాశంలో నక్షత్రాలు 'మిళుక్' మంటున్నాయి.

***లోకాగ్ని యొక్క మిణుగురులు 6 అగ్నికణములుగా చెప్పబడుచున్నాయి.***

**తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవా వృష్టిం జుహ్వతి తస్య ఆహుత్యా 'అన్నగ్ం' సంభవతి! (8-1-11)**

ఆ ఈ 'లోకాగ్ని' యందు దేవతలు (2వ అగ్ని కార్యఫలము అయినట్టి) వృష్టిని (వర్షమును) హోమము చేయుచున్నారు. అట్టి లోకాగ్నియందు జరుగు **వర్షహోమముచే అన్నము** ఉదయించుచున్నది.

**"అన్నము"**

అన్నము = ఆహారము. పరిపోషకము.

నోటికి అన్నము = వాక్కు. పలుకులు.

కళ్ళకు అన్నము = దృశ్యము. కనబడునవి.

చెవులకు అన్నము = శబ్దము. వినబడునవి.

భౌతిక దేహమునకు అన్నము = ఆహారపదార్థములు బియ్యము, గోధుమలు, మొదలైన ధాన్యములు పప్పులు, పళ్ళు, చెట్లు మొదలైనవి. (నవధాన్యములు= వడ్లు, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనిములు, కందులు, సెనగలు)

వర్షము నుండి ఆహార ధాన్యములు (బియ్యము, గోధుమలు మొదలైనవి), అపరములు (పెసలు, మినుగులు, కందులు మొదలైనవి) దినసులు (ధనియాలు, మిరియాలు, నువ్వులు మొదలైనవి), చెట్లు, లతలు... ఇవన్నీ ప్రవృద్ధమగుచున్నాయి.

## (4) చతుర్థాగ్ని "పురుషాగ్ని"

→ **జీవుడే (పురుషుడే) 4వ అగ్ని।**

*కాళ్ళు - చేతులు - తల మొదలైనవి గల దేహమును ఉపయోగించువాడే పురుషుడు (The user of the physical body)*

→ **పురుషుని తెరచిన నోరే - సమిధ.**

*మాట్లాడటం, వాదించటం, స్తోత్రం చేయటం ఇవన్నీ నోటితోనే, నోరు తెరచి పురుషుడు నిర్వర్తిస్తున్నాడు.*

→ **శ్వాసయే పొగ.**

*అగ్ని నుండి పొగ వెలువడినట్లుగా నోటి నుండి శ్వాస వెలువడుచున్నది.*

→ **వాక్కు (లేక) శబ్దము → జ్వాల.**

*వాక్కు జ్వాలవలె భావమును తెలియజేయునట్లు చేస్తోంది. జ్వాల వస్తువులను కనబడేట్లు చేస్తుంది. వాక్కు విషయమును తెలియజేస్తోంది.*

→ **కన్నుయే బొగ్గు.**

ఒకడు చెప్పదలచుకొన్నది చెప్పి, ఆ తరువాత ఎదుటివాడివైపు "సమాధానం ఏమిటో?".. అని చూస్తాడు కదా!

ఈ విధంగా వాక్కు ఉపశమించుటకు, కళ్లు చూడటానికి ఒకానొక సంబంధం ఉన్నది. అట్లాగే జ్వాల ఉపశమిస్తూ బొగ్గు ఏర్పడుతుంది.

'జ్వాల' అనే వెలుగుకు బొగ్గు ఆశ్రయమైయున్న తీరుగా - **చూపుకు కన్ను ఆశ్రయము.**

**చెవులు మిణుగురులు :** అగ్నికి మిణుగురులు. (రవ్వలు) వలె చెవులు ఈ పురుషునికి మిణుగులు. మిణుగురులు చెల్లాచెదురై ఉండునట్లు రెండు చెవులు రెండు వైపులా విసిరివేసినట్లు ఉంటాయి. ఈ పోలికను అనుసరించి చెవులే మిణుగురులు.

ఇంద్రియ దేవతలు (ఇంద్రుడు-వరుణుడు-వాయువు మొదలైనవారు) **ఈ పురుషుని దేహమునందు ఆహారమును హోమము చేయుచున్నారు.** అట్టి ఆహారము భక్షించుట వలన జీవుల దేహములలో **'రేతస్సు'** జనిస్తోంది.

- రేతస్సు అన్నము యొక్క ఒకానొక రస రూపమే। - రేతస్సు నుండియే సంతానము రూపము పొందటం జరుగుతోంది.

## (5) పంచమాగ్ని "స్త్రీ అగ్ని"

**యోష** (లేక) **స్త్రీయే**.. ఐదవ అగ్ని. స్త్రీ హోమమునకు '5'వ ఆధారము.

- స్త్రీ యొక్క ఉపస్థ (జననేంద్రియము) → సమిధ (ఇంధనము).
- రోమములే పొగ. ఉపస్థేంద్రియ స్థానము నుండి సంతానము ఆవిర్భవించటము చేత అగ్ని మండి బయల్వెడలు పొగగా చెప్పబడింది.
- యోనియే జ్వాల. రంగుననుసరించి జ్వాలగా చెప్పబడుతోంది.
- **యద్యంతః కరోతి తే అంగారా।** సంభోగము, మైధున వ్యాపారమే బొగ్గు. వీర్యమును చల్లార్చునది కాబట్టి సంభోగమునకు బొగ్గుతో పోలిక. -అభినందనలు - సంభోగము వలన కలుగుచున్న సుఖానుభవములు - మిణుగురులు. మిణుగురుల వలెనే అవి కూడా క్షణికములు.

దేవతలు స్త్రీ యోనియందు (పురుష) రేతస్సును హోమము చేయుచున్నారు. అట్టి ఆహుతి నుండి **సంతానము (పురుషులు - స్త్రీలు)** జనించుచున్నారు.

-----





ఈ విధంగా....,

**ద్యులోకాగ్ని, పర్జన్యాగ్ని, ఇహలోకాగ్ని. పురుషాగ్ని, స్త్రీ అగ్ని.**. ఈ 5 అగ్నులయందు హోమము చేయబడుచున్న జలములు ఒకదాని కంటే మరియొకటి స్థూలభావము పొందుచున్నాయి. క్రమంగా **శ్రద్ధ, సోముడు (వెన్నెల), వర్షము, ఆహారము, రేతస్సు** అనే రూపములు పొందుచున్నాయి.

"శ్రద్ధ" అనబడే దాని నుండే (దేవతల శ్రద్ధ నుండి) పంచ – అగ్నిహోమముల తరువాత రేతస్సు – శుక్ల శోణిత ద్రవ్యముల నుండి ఈ జీవునికొరకై దేహము (భౌతిక శరీరము) ఉద్భవము అగుచున్నది.

ఓ గౌతమా! ఇప్పుడు 4వ ప్రశ్నయగు **"ఎన్నవ ఆహుతి హోమము దేవతలచే చేయబడగా జలములు పురుష రూపము ధరించి 'వాక్కు'ను కలిగి ఉంటున్నాయి?"** అనే ప్రశ్నకు సమాధానము వినండి

"స్త్రీ" అనే "5వ" **అగ్నియందు** రేతస్సు **ఆహుతి** చేయబడగా, (అనగా) రేతస్సు అనే జలము దేవతలచే హోమము చేయబడగా, **రేతో – జలము** నుండి **వాక్కుతో కూడిన పురుషుడు (పురుషకారము గల జీవుడు) ఆవిర్భవిస్తున్నాడు** – అనునది సమాధానమైయున్నది.

ఈ విధంగా పురుషకార క్రమంగా జన్మించి ఈ పురుషుడు (జీవించటమును అభిమానముగాగల జీవుడు) – **'జీవితము'** అనునది పొందుచున్నాడు.

ఆకాశము నుండి వర్షము ద్వారా లోకములో ఆహారము (అన్నము) రూపముగా ప్రవేశించిన జలము – **నాలుగవ స్థానమగు పురుషునిలో 'రేతస్సు'** అయి, స్త్రీ యొక్క యోనిలో ప్రవేశించి, **'దేహము'** అనే ఆకారము పొంది **"సొంతవాక్కు.. సొంత అభిప్రాయములు – సొంత బుద్ధి"**.. ఇవన్నీ పొంది, ఈ పురుషుడు (జీవుడు) → **జీవితము**' అనే నాటక రంగములోనికి ప్రవేశము చేయుచున్నాడు.

ఏ దేవతలు సృష్టికొరకై శ్రద్ధావంతులై ఆహుతులు (ద్యులోకాగ్ని) – పర్జన్యాగ్ని – లోకాగ్ని– పురుషాగ్ని – యోషాగ్ని – అనబడు) పంచాగ్నులకు తమ తమ అంశలను సమర్పిస్తున్నారో, **ఆ దేవతాంశలే దేహము నందు శబ్ద – స్పర్శ– రూప – రస–గంధముల రూపములగుచున్నాయి.** ఆ దేవతాంశలే ఇంద్రియ విషయములుగా కూడా (జగద్దృశ్యముగా కూడా) రూపము పొందినవగుచున్నాయి.

**తస్య ఆహుత్యై, పురుషః సంభవతి। స జీవతి। యావత జీవతి। అథ యదా మ్రియతే।**

– 5వ జలము (స్త్రీ యోనిలోకి ప్రవేశించిన రేతస్సు) పురుషకారము ధరించగా దేహము+దేహి సమన్వయమై, 'జీవుడు' అనబడుచు (దేహముతో కూడుకొని జీవప్రజ్ఞ) ఈ పాంచభౌతిక లోకంలో ప్రవేశించి జీవితమును గడుపుచున్నది.

  ఆ తరువాత కాలానుగతంగా (నాటకములో పాత్రధారుడు రంగముపై నటించు తీరుగా) జీవుడు వాక్కు –చూపు –స్పర్శ – రుచి – వాసన మొదలైన దేవతాంశములను ఉపయోగించి కర్మలయందు, కార్యక్రమములందు ప్రవేశించి అనేక పనులు చేయటము, అనేక అనుభూతులను – అనుభవములను పొందటము ఆరంభిస్తున్నాడు.

– ఆత్మాంశ అగు ఈ జీవుడు ఎంతవరకైతే ఈ శరీరము ఉండటానికి 'కర్మలు' ఉండి ఉన్నాయో, అంతవరకు జీవాభిలాషి అయి జీవిస్తూ ఉన్నాడు.

– ఆ దేహముతో **జాగ్రత్ దశను, స్వప్నదశను, సుషుప్తదశను** అనుభవించుచున్నాడు. **యావత్ జీవత్యథ, యదా మ్రియతే!**

కాలగతియందు 5వ జలహోమాగ్ని రూపముగా జనించిన, (రూపము పొందిన), పంచతన్మాత్రల (శబ్ద–స్పర్శరూప – రస– గంధముల) దేవతాంశ–భౌతికాంశల సమన్వయము అగు ఈ భౌతికదేహము– మరల **కాలగతిచే కర్మలను అనుసరించి మరణము పొందుతోంది.** ఈవిధంగా శరీర నిర్మాణము – శరీర క్షయము విశ్వయజ్ఞములో అంతర్భాగమై సాగుతోంది.

## మరణానంతరము
## మొదటి ప్రశ్నకు సమాధానము

ముఖ్య ప్రాణదేవత తన యొక్క దేవతా–అంశలగు శబ్దస్పర్శ రూప రస గంధములను భౌతిక దేహము నుండి విరమింపజేయబడినప్పుడు ఈ దేహము నిస్తేజము, ప్రాణశక్తి స్పందన రహితము అగుచున్నది. శరీరము ఒక మాంసపు ముద్దవలె నిర్జీవమగుచున్నది. అప్పుడు బంధువులు **"మనవాడు మరణించినాడు రా!"** అని గమనించుచున్నారు. అప్పుడు బంధువులు, ఋత్విక్కులు మరణ సంస్కారములను మంత్రయుక్తంగా పలుకుతూ చైతన్య స్పందన లేని ఆ మాంసపు – బొమికల గూడు వంటి భౌతిక దేహమును అగ్నికి ఆహుతి చేయటానికై శ్మశానముకు జేర్చుచున్నారు. అగ్నియందు సమర్పిస్తున్నారు. అప్పుడు..,

→ దేహములోని అగ్ని విశ్వములోని అగ్నితో ఏకమగుచున్నది.

→ ఏ కట్టెలతో భౌతికదేహమును కాల్చుచున్నరో.. అదియే 'ఇంధనము' – అగ్నియొక్క ఇంధన తత్త్వములో కలియుచున్నది.

→ దేహమును దహించుటకై కట్టెలు కాలుచుండగా వచ్చునది 'పొగ' – విశ్వములోని పొగతో ప్రవేసిస్తోంది.

→ అగ్ని యొక్క శిఖలు అగ్నిలో కలియుచున్నది.

→ అగ్ని నుండి బయల్వెడలు విస్ఫులింగములు – అగ్నితో కలియుచున్నాయి.

ఏ దేవతలు పంచాగ్నులలో హోమము చేయుచుండగా '5వ' జలాగ్నిచే ఈ భౌతిక దేహము + వాక్కు (అనుభవజ్ఞుడు) ఒకచోటికి వచ్చి 'జీవుడు'గా రూపము దిద్దుకున్నాయో, ఆ దేవతలే (దివ్య తత్త్వ ప్రజ్ఞలే) ఇప్పుడు ఈ పురుషుని అగ్నియందు 'హోమము' చేయుచున్నారు. **తస్మిన్ అగ్ని దేవాః ఏతో పురుషం జుహ్వతి!**

**మరణము తరువాత వైదిక కర్మలు :** అట్టి దేహాగ్ని హోమముచే అంత్యేష్టి వరకు ఆతడు పొందిన దేహదశలు, కల్పితానుభవములు, కర్మ విశేషముల నుండి పరిశుద్ధుడై, వైదిక కర్మలచే సంస్కరించబడినవాడై, ఆ జీవుడు తేజోవంతముగా ప్రకాశించుచున్నాడు. వేడినీళ్ళతో స్నానము చేసిన బాలుడు ఏ విధంగా దుమ్ము – ధూళి తొలగగా అంతకుముందు కంటే అధికముగా ప్రకాశించుచున్నాడో, అదేవిధంగా వేదోక్త మంత్ర – తంత్రములచే పరిశుద్ధము పొందిన ఆ జీవుడు జీవించి ఉన్నప్పటి స్థితి కంటే ఎంతో అధికముగా ప్రకాశించుచున్న వాడగుచున్నాడు. **మిక్కిలిగా పరిశుద్ధుడై ఆవిర్భవిస్తున్నాడు.**

## 5వ ప్రశ్నకు సమాధానము – గతులు

మరణించిన తరువాత ఈ జీవుడు ఎటు వెళ్ళుచున్నాడు? రెండు మార్గములు ఉన్నాయి.

(1) ఉత్తరమార్గము (శుక్ల గతి మార్గము) **నిష్కామ (సశాస్త్రీయ) కర్మ** – ఉపాసనల ఫలితముగా లభించే మార్గము.

(2) దక్షిణ మార్గము (కృష్ణగతి) **సకామ (సశాస్త్రీయ) కర్మ** – ఉపాసనల ఫలితముగా లభించే మార్గము.

***(1) ఉత్తర మార్గము–శుక్ల గతి–శాశ్వత బ్రహ్మలోక నివాసము–పునరావృత్తి రాహిత్యము। నిష్కామ (శాస్త్రీయ) కర్మిష్ఠులు***

ఈ పంచాగ్ని విద్యను (ద్యులోకాగ్ని, పర్జన్యాగ్ని, లోకాగ్ని, పురుషాగ్ని, యోషాగ్నిలను వంటి రహస్యమును) తెలుసుకొన్నవాడు.., ఏ ఆశ్రమవాసుడైనా కూడా (బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి – ఎవ్వరైనా కావచ్చు), **అరణ్యే శ్రద్ధాగ్ం సత్యమ్ ఉపాసతే– వారు నిష్కామమగు 'శుక్లగతి' అనే ఉత్తరోత్తర మార్గమును ఆశ్రయిస్తున్నారు.**

ఈ దృశ్యములో తాదాత్మ్యము పొందకుండా దూరంగా (Hands in the world while Head in the Forest) మానసికంగా అరణ్యంలో ఉండి, పరమ సత్యమగు **'ఆత్మ'**ను సర్వే – సర్వత్రా ఎవరైతే ఉపాసిస్తూ ఉంటారో, **వారి తదనంతర గతి 'ఉత్తరగతి' అగుచున్నది.** అనగా..,

"నా ఈ దేహము ఈ మార్గముగా **పంచాగ్నుల హోమము** ద్వారా నా **పిత్రుదేవుని (తండ్రి) దేహము** నుండి **రేతస్సు** రూపమున నా మాత్రు దేవత (అమ్మ) యోనిలో ప్రవేశించి, దేవతల హోమద్రవ్యముగా **హోమము** చేయబడి, ఈ **భౌతిక రూపము** దాల్చి తిరిగి దేవతలచే అగ్నికి ఆహుతి చేయబడుచున్నది"... అని ఎరుగుటమే – **"సత్యము అగు సర్వమునకు వేరైనది అగు"** ఆత్మను ఉపాసించుటము. ఇదియే. **"పంచాగ్నిహోత్రోపాసన"!**

పంచాగ్ని విద్యను ఎరిగినవాడు **"నా ఈ దేహము దేవతలచే హోమము చేయబడి ద్యులోకాగ్ని – వర్షాగ్న – లోకాగ్ని – పురుషాగ్ని – స్త్రీఅగ్ని"... లలో దేవతలచే హోమము చేయబడి, శబ్ద – స్పర్శ – రూప – రస – గంధ – ఇత్యాది జ్ఞానేంద్రియ – కర్మేంద్రియ దేవతాంశలను పొంది, చివరికి దేవతలచే అగ్నికి హోమము చేయబడుచున్నది"..** అని గమనిస్తున్నాడు. సత్యమగు ఆత్మను ఉపాసించుటకై **'జీవితము'** అను అవకాశమును **సద్వినియోగపరచుకొనుచున్నాడు. "నా స్వరూపము అగ్నియే (తేజస్సే)".. అని గ్రహించి** ఉంటున్నాడు. ఈ పంచాగ్ని విద్య తెలిసిన వారు (లేక) యజ్ఞ–దాన – తపో–సాత్వికగుణ–భక్తి – వైరాగ్య... ఇత్యాది శాస్త్రములు, గురువులు చూపు మార్గములో జీవితమును ఉపాసనగా తీర్చిదిద్దుకొనువారు → **భౌతిక భోగములను దూరంగా ఉంచి, ఈ భౌతిక దేహమును బాహ్యవస్తువుగా భావించి, మనస్సుచే త్యజించి 'అర్చిత'..** అను **మార్గములో ప్రవేశిస్తున్నారు.**

అట్టివారు **'జ్యోతిరాభిమాన దేవత'**ను పొందుచున్నారు. ఇది ఉత్తమ రూపమార్గమగు దేవతామార్గము. వారు – **జ్యోతి అభిమాన దేవతను చేరి జ్యోతి స్వరూపులగుచున్నారు.**

అట్టి **'అర్చిర్ దేవత'** స్థానము నుండి **"అహరాభిమాన దేవత"** (పగలు–వెలుగు అభిమానించు దేవత) (లేక) **'వెలుగు'** రూపము పొందుచున్నారు.

ఆ అహర్ అభిమాన దేవతా స్థానము నుండి క్రమముగా **శుక్ల పక్షాభిమాన దేవతను** చేరుచున్నారు. (వెలుగు వృద్ధి పొందు శుక్ల చంద్రకళలు సంజ్ఞారూపము).

శుక్ల పక్షాభిమాన దేవతచే ఆ ఉపాసకుడు తీసుకొనిపోబడి ఉత్తరాయణమునకు చెందిన **'ఉత్తర షణ్మాషాభిమాన దేవత'** వద్దకు చేర్చబడుచున్నాడు. (ఉత్తరాయణంలో సూర్యుడు ఉత్తరాభిముఖుడై ప్రయాణించు సంజ్ఞ)। ఆరుగురు (ఆరు నెలల) ఉత్తరాయణ దేవతలు ఏకమై ఆ ఉపాసకుని స్వీకరిస్తున్నారు.

ఉత్తరాభిమాన దేవతలు ఆ ఉత్తమ నిష్కామోపాసకుని **'దేవలోకాభిమాన దేవత'** వద్దకు జేర్చుచున్నారు. దేవలోకము నుండి వారు **ఆదిత్యుని** (ఆదిత్యాభిమాన దేవతను) పొందుచున్నారు. అక్కడి నుండి **'బ్రహ్మ లోకవాసి'**యగు బ్రహ్మవేత్తలచే విద్యుత్ (మహత్ తేజస్సు) ద్వారా **బ్రహ్మలోకమునకు** తీసుకొని పోబడుచున్నారు. ఆ పురుషుడు **బ్రహ్మమానస పుత్రుడు** అగుచున్నాడు. అట్టివారు బ్రహ్మలోకములలో ప్రకాశించుచు అనేక ఉజ్జ్వల సంవత్సరములు (కల్పముల కాలము –బ్రహ్మయొక్క అనేక కల్పములు) నివశించుచున్నారు. అట్టివారు తిరిగి జన్మలకు వచ్చుచుండటము లేదు. అనగా, **వారిని పునరావృత్తి దోషము స్పృశించదు. 'ఇహము'**నందు ప్రవేశించక, **పరము** నందే స్థానము కలిగినవారై ప్రకాశించుచున్నారు. తమను తాము జన్మరహితముగాను, జన్మలకు అతీతముగాను వీక్షిస్తూ, ఆత్మానందులై, జన్మ – కర్మ వ్యవహారములు లీలగా, క్రీడగా, సందర్భమాత్ర పరిమితమైనవిగా ఆస్వాదిస్తున్నారు.

## *(2). దక్షిణమార్గము – కృష్ణగతి – పునరావృత్తి– సకామ (శాస్త్రీయ) కర్మ*

**ప్రవాహణుడు :** ఓ గౌతమా! ఆరుణి మునీంద్రా! ఇక **ఈ భూలోకము జయించి సుఖమయములగు స్వర్గలోకము జేరాలి** – అను యావృత్తితో – (దృశ్యములో ఏదో ఉత్తమ లోకము కోరి) యజ్ఞ–దాన–తపస్సు–ధ్యానము – మొదలైనవాటిని నిర్వర్తించువారి గురించి చెప్పుకొందాము.

వీరు ఏదో లోక విశేష సంబంధమైనవి (ఇంద్రియ సుఖసంబంధమైనవి) కోరి, అవన్నీ నిర్వర్తిస్తూ ఉంటే (లేక పంచాగ్నులను భౌతిక విషయము ఆశయములతో ఉపాసించువారైతే) అట్టి వారు →

→ **'ఉత్క్రాంతి గతి'**ని మాత్రమే సేవించుచున్న వారగుచున్నారు. అంతేగాని **పరమ సత్యమును సేవించుట లేదని గ్రహించండి.**

→ వీరు **"కేవల కర్మఠులు"**.. అని పిలువబడుచున్నారు.

→ కర్మ సంబంధమైన –కర్మ ప్రయోజనముల సంబంధమైన సాధనములచే వీరు స్వర్గ – పిత్రులోకములను జయిస్తున్నారు. (సముపార్జిస్తున్నారు)

- వీరిది ధూమమార్గము. (కాంతి – తేజోమయము కాదు). ఎందుకంటే ధూమ అభిమాన దేవతా స్థానములు, రాత్రి అభిమాన దేవతా స్థానములు వీరు చేరబోవు స్థానములుగా అగుచున్నాయి.
- (కృష్ణపక్షములో పాడ్యమి నుండి చంద్రుడు క్షీణించురీతిగా) – వీరి వైదిక యజ్ఞ–యాగ–అగ్నిహోత్ర–దాన– తపో ఫల ధనములు కర్మ **ఫలానుభావముచే క్షీణము పొందుతూ** ఉంటాయి.

**ఆరు మాసముల దక్షిణాయణ షణ్మాసముల అభిమాన దేవతలను** పొందుచున్నారు. అక్కడి నుండి **పిత్రులోకము**, ఆ తరువాత **చంద్రలోకము** చేరుచున్నారు.

చంద్రలోకములో సుఖానుభావానంతరము అన్నము (ఆహారము/భోగ్యము) రూపముగా కొంతకాలము వర్ధిల్లుచున్నారు. చంద్రలోకము నందు దేవతలు ఆ అన్నరూపములైనవారిని (లేక) ఋత్విక్కులు – **"ఆప్యాయస్వ – అపక్షీయస్వ"** – అని పలుకుచూ "నింపుము – ఖాళీ చేయుము" (వచ్చువారు వచ్చెదరుగాక – పోవువారు ఇక వెళ్ళండి) – అని చెప్పుచూ సోమరసము స్వీకరించినట్లుగా ఆ అన్నమును భక్షించుచున్నారు. ఆ జీవులు (కర్మఫలాశయులై ధూమమార్గమును ఆశ్రయించటం చేత) బ్రహ్మలోక మార్గము ఆశ్రయించక తమ కర్మఫలక్షయము అయిపోగానే...,

→ తిరిగి ఆకాశమును పొందుచున్నారు.

→ అట్టి సూక్ష్మాకాశ స్వరూపము నుండి వాయువును పొందుచున్నారు.

→ వాయువు నుండి వర్షమును, వర్షము నుండి భూమిని చేరుచున్నారు.

– ఆ కర్మిష్ఠులు భూమిని చేరి మరల 'అన్నము' రూపము అగుచున్నారు.

– మరల వారు దేవతలచే పురుషాగ్నిలో హవనము చేయబడి, లోకములలోకి ప్రయాణిస్తూ యోషాగ్నిలో (స్త్రీగర్భములో) తిరిగి ప్రవేశిస్తున్నారు. ఈ విధంగా కర్మఫలాశయులు కలిగిఉండటం చేత మాటిమాటికీ జనన-మరణ రూపములలో తిరుగాడుచూనే ఉంటున్నారు. **(1) ఉత్తరగతిని** ఆశ్రయించువారు **బ్రాహ్మీస్థితికి, (2) దక్షిణగతిని** ఆశ్రయించువారు **పునః ఈ భౌతికలోకములకు** వచ్చుచుండుటచే స్వర్గలోకము మరణించినవారిచే నిండిపోవటము లేదనునది 3వ ప్రశ్నకు సమాధానము. అదియే 5వ ప్రశ్న యొక్క వివరణ కూడా!

## అశాస్త్రీయ కర్మిష్ఠులు

**ఆరుణిముని :** హే గురవర్యా! ప్రవాహణ మహారాజా! (1) నిష్కామ కర్మతో కూడిన జ్ఞానమార్గము ఆశ్రయించి యజ్ఞ-తపో-దాన-ధ్యాన-ఇత్యాది కర్మలు నిర్వర్తించువారి పునరావృత్తి రహిత - శుక్లగతి.. చే శాశ్వత బ్రహ్మలోకప్రాప్తి గురించి, (2) సకామ కర్మమార్గము ఆశ్రయించి యజ్ఞ-తపో- దాన-ధ్యానాదులు నిర్వర్తించువారి పునరావృత్తి రూప-కృష్ణగతిచే తిరిగి భౌతికలోకములో ప్రవేశించటము గురించి (రెండు గతుల గురించి) చెప్పారు. బాగానే ఉన్నది.

ఇక ఉభయ ఆశయములు లేకుండా, సాధనలు ఆశ్రయించక, **ఇంద్రియ విషయములను మాత్రమే** ఆశ్రయించి జీవితములు గడుపుచున్న జీవుల **'గతులు'** ఏ విధంగా ఉంటున్నాయో, అది కూడా వివరించండి.

**ప్రవాహణ మహారాజు :** అవును. కొందరు జీవులు సాధన సంపత్తిని ఆశ్రయించక ఇంద్రియ విషయములందే ఆసక్తులై జీవిస్తున్నారు. వారు పూర్వజన్మలలో సముపార్జించుకొన్న యజ్ఞ-దాన-తపో ఇత్యాది ఫలములను ఇక్కడ మానవ జన్మలో ఖర్చు చేసుకొనుచున్నారేగాని, తిరిగి పుణ్యఫలములను కూడబెట్టుకొనే ఆశయములను ప్రదర్శించటమే లేదు. అందుకు ఫలితంగా అట్టి జీవులు క్రిమి-కీటక-పక్షి-దోమ మొదలైన జన్మలలో ప్రవేశించుచున్నారు. పునః పునః పాంచభౌతికంగా పునరావృత్తులు అగుచున్నారు. అందుచేత వారి వలన స్వర్గలోకము నిండిపోవుచున్నదను మాట మొదలే లేదు.

ఈ విధంగా మనము 1 నుండి 5వ ప్రశ్న వరకు సమాధానములను వివరించుకున్నాము.

***ఇతి బృహదారణ్యకోపనిషత్ -8వ అధ్యాయము - 2వ బ్రాహ్మణము***

***"కర్మ విపాక బ్రాహ్మణము" సమాప్తము.***

## బృహదారణ్యకోపనిషత్ - అష్టమ అధ్యాయము
## తృతీయ బ్రాహ్మణము
## 3. శ్రీ మంథ బ్రాహ్మణము (పయః పానవ్రతము)

వేదవాఙ్మయము పారమార్థికమగు **'సోఽహమ్ మోక్ష-తత్త్వం పరాకాష్ఠ'** - స్థానమును ఉత్తమాధికారులకు చూపుచున్నది. అట్లాగే మధ్యమాధికారులకు యజ్ఞ-యాగ-క్రతు-దాన-వ్రతముల అభివర్ణనచే ఉత్తమలోక ప్రాప్తికొరకై విధి-విధానములను నిర్ణయిస్తోంది. అంతేకాకుండా. లోక సంబంధమైన ప్రయోజనములు కోరువారికి కూడా వేద వాఙ్మయము కొన్ని వ్రతములు, పుత్రకామేష్ఠి మొదలైన యాగములు కూడా అభివర్ణించి విధి - విధానములతో సహా ప్రసాదించుచున్నది. ఈ **'శ్రీమంథ బ్రాహ్మణము'** నందు మానుషవిత్తము సముపార్జించుటకు ఉపాయమగు **"శ్రీమంథవ్రతము"**ను విధి విధాన పూర్వకంగా వర్ణించి చెప్పబడుచున్నది. (జ్ఞానికి అగ్నియజ్ఞము 'ఆత్మోపాసన'గా కూడా ఉపకరించగలదు).

**ఉపాసన** → స్వాతంత్ర్యమైనది. ద్రవ్యాపేక్ష లేనట్టిది. ఏ ఆపేక్షా లేకుండానే ఉత్తమ ఫలములను తనకు తానై ప్రసాదించునది.

**కర్మ** → (1) దైవ విత్తము (సగుణోపాసన),
(2) మానుష విత్తము (గోవులు - ధనము - పుత్ర సంతానము.. ఇటువంటి సంపదలు ప్రసాదించునది).

కర్మ కొరకై మానుష విత్తము అవసరమైయున్నది. - అట్టి ద్రవ్యములను 'ప్రత్యవాయదోషము' లేనట్టి (స్వభావమును దోషపూరితము చేయనట్టి) ఉపాయములతో సముపార్జించాలి. అట్టి విత్తము ప్రాప్తించు ఉపాయముగా **'శ్రీమంథము'** అనే ఒకానొక వ్రతవిశేషము ఇక్కడ చెప్పబడుతోంది. **స యః కామయేత - మహత్ ప్రాప్నుయామ్ - ఇతి। (8-3-1)**

'వైదిక కర్మ' యందు అధికారము కలిగి, **విత్తము** కోరువాడు, మహదత్త్వము మొదలైనవి కోరువాడు, అది సిద్ధించుటకై **'శ్రీమంథకర్మ'**ను ఆశ్రయించుగాక - అని శ్రుతులు చెప్పుకొస్తున్నాయి.

## శ్రీమంథ వ్రతము (మంథకర్మ। స్మార్తాగ్ని సహిత కర్మ।)

**ఉచిత కాలము** : సూర్యుడు 'ఉత్తరగతి'ని పొందునట్టి ఉత్తరాయన పుణ్యకాలము. శుక్లపక్షము – శుక్ల శుద్ధ పాడ్యమి నుండి పౌర్ణమి వరకు ఏదైనా పుణ్యతిథి నుండి (లేక) యజమానికి అనుకూలమైన తిథి. పురుషనామధేయ తిథి అయి ఉండటము శ్రేష్ఠము – (హస్త మొదలైన నక్షత్రములు)

**వ్రత నియమములు:** వ్రతము చేసే పుణ్యతిథికి 12 రోజులు ముందుగా (ఆ 12 రోజులు) ఉపసదస్సులు (ఉపసద్వ్రతీ/ఉపసత్‌వ్రతీ) నియమములు ఆచరించాలి. **ఉపసత్తులు**=జ్యోతిష్టోమయాగమునందు సుప్రసిద్ధము అయిన నిష్ఠ–నియమములు.

(1) మొదటిరోజు → ఆవు యొక్క ఒక స్తనము నుండి వచ్చే పాలు మాత్రమే స్వీకరించటము.

(2) రెండవ రోజు → ఆవు యొక్క రెండు స్తనముల నుండి వచ్చే పాలు మాత్రమే తీసుకోవటము.

(3) మూడవ రోజు → 3 స్తనములు పాలు తీసుకోవటము.

(4) నాలుగవ రోజు → 4 స్తనముల పాలు తీసుకోవటము.

(5) 5వ రోజు → 3 స్తనములు పాలు తీసుకోవటము.

(6) 6వ రోజు → 2 స్తనముల పాలు తీసుకోవటము.

ఈ విధంగా మరల తగ్గించుకుంటూ పాలు మాత్రమే తీసుకునే నియమమును **'ఉపసత్తులు'** (ఉపసత్‌వ్రత నియమములు) అని అంటారు.

***వ్రతదీక్ష తరువాత 12వ రోజు***

– **సోమపాన పాత్ర** – మేడి కఱ్ఱతోగాని, కంచుతో గాని తయారైన పాత్ర

– **సోమపాన పాత్రలో వేయవలసిన ఓషధులు** → వరి బియ్యము, గోధుమలు, రాగులు, కందులు, పెసలు, ఉలవలు, అనుములు, మినుగులు, నువ్వులు ఇత్యాది దినుసులు మొదలైన దశ ధాన్యములు. పది కన్నా ఎక్కువగా కూడా గ్రామములో దొరికితే, దొరికేవన్నీ తీసుకోవచ్చు.

– పెరుగులో, తేనెలో, వెన్నలో బాగుగా నానపెట్టాలి.

– ఇంకేమైనా పళ్ళు, దినసులు (సస్యవిశేషములు) – ఆ ప్రాంతంలో లభించేవి కూడా ఇందులో కలిపి నానపెట్టవచ్చు.

– ఆ తరువాత ఒక పుల్లతో (లేదా) చిన్న కవ్వముతో బాగుగా కలియబెట్టి, ఒక ముద్ద అయ్యే విధంగా చేయాలి. ముద్దగా చేయబడినదే **'మంథము'** (మంథసగము, మంథసము) అని కూడా అంటారు.

వేదిక చుట్టూ అంగకలాపము ప్రకారము ముగ్గును వేయాలి.

***యాగశాలలో అగ్ని గుండమునకు దగ్గర*** → పై సర్వ ఔషధములతో మంథనము ఉంచిన పాత్రను దర్భలపై( పాత్రతో సహా) ఉంచాలి. (మంథమును పాత్రలో అమర్చాలి).

అగ్ని కార్యమును ప్రారంభించాలి. స్మార్తాగ్నిని (త్రేతాగ్ని కాదు) స్థాపించాలి. నేయితో అగ్నికి, ఈ మంథమునకు హోమము ప్రారంభించాలి. స్మార్తకర్మ కాబట్టి క్రియాకలాపమును స్థాలీపాక పద్ధతితోనే చేయాలి. ***అగ్ని దేవుని ఇట్లా ప్రార్థించాలి.***

**యావన్తో దేవాసత్వయి, జాతవేదః తిర్యన్చోఘ్నన్తి పురుషస్య కామాన్, తేభ్యో అహం భాగధేయం జుహోమి। తే మా తృప్తాః సర్వైః కామైః తర్పయన్తు స్వాహా।**

"ఓ అగ్నిదేవా! మీయందలి ఏఏ దేవతలు కావాలని ఉద్దేశ్యపూర్వకంగా మానవులు కోర్కెలకు విఘాతము కలిగిస్తూ ఉంటున్నారో, వారి కొరకు నేను ఈ స్థాలీ పాకాదికముగా నేయిని సంస్కరించి హోమము చేయుచున్నాను. ఆయా దేవతలంతా ఈ హుతము (ఆజ్యము/నెయ్యి)ని స్వీకరించెదరుగాక! తృప్తి చెంది నన్ను సకల కామ్యసిద్ధునిగా చేయటానికై నేను ఈ నేతి ధారను (ఆజ్యభాగమును) మీద్వారా సమర్పించుకొనుచున్నాను. ఆయా దేవతలందరు తృప్తిని పొందినవారై, సానుకూల్యురై మా యొక్క సర్వ కోర్కెలు నెరవేరునట్లుగా చేసెదరుగాక! అగ్నిగుండములో స్రువము (ఆజ్య ఆహుతి చేయటానికై మాని కొయ్యతో చేసిన గరిట వంటిది)తో నేయిని (ఆవునేయి శ్రేష్ఠము) అగ్నికి సమర్పించి, శేషించిన భాగమును మంథముపై సమర్పించుచూ హోమము చేయుచున్నాము. అగ్నిదేవా! అనుగ్రహించండి"

**వైశ్వానరాయ విద్మహే! లాలీలాయ ధీమహి, తన్నో అగ్నిః ప్రచోదయాత్।। తన్నో అగ్న్యాంతర్గత దేవత ప్రచోదయాత్।।**

అని మూడు సార్లు అగ్నికి స్రువముతో (కొయ్య గరిటతో) ఆజ్యము వేసి శేషించిన దానిని.. 'మంథము'పై వ్రేల్చాలి.

పై రీతిగా స్రువముతో (గరిటతో) , ఆజ్యమును(నేయిని) అగ్నికి సమర్పిస్తూ (హోమముచేస్తూ), శేషించిన దానిని మంథముపై (స్రువముతో) వేయుచూ.. ఈ విధంగా అగ్ని విధిని కొనసాగించాలి. **2 ఆహుతులను – అగ్నికి, స్రువములో మిగిలి ఉన్నదానిని ఒకసారి శ్రీమంథమునకు సమర్పించాలి.**

| | | |
|---|---|---|
| **(1) "ఓం జ్యేష్ఠాయస్వాహా"।** | → ఇతి అగ్నౌ హుత్వా । | – జ్యేష్ఠుడవు – శ్రేష్ఠుడవు అగు ఓ ప్రాణదేవా! ప్రాణేశ్వరా! ఈ ఘృతము (ఆజ్యము)ను స్వీకరించండి! |
| **(2) "ఓం శ్రేష్ఠాయస్వాహా"।** | → మంథేసగ్ం స్రవం అవనయతి। | – ఓ మంథమా! శ్రీత్వమును ఆహ్వానించి నీకు నమస్కరిస్తున్నాము. ఈ ఆజ్య శేషము స్వీకరించండి. |
| **(3) "ప్రాణాయస్వాహా"** | → ఇతి ఆగ్నౌహుత్వా। | – వసిష్ఠగుణములు కలిగియున్న ప్రాణ దేవత ప్రీతికొరకు స్రువముతో ఈ నేతిని అగ్నికి రెండు ఆహుతులుగా సమర్పిస్తున్నాము. |
| **వసిష్ఠాయై స్వాహా** | → మంథేసగ్ం స్రవం అవనయతి! | – సమస్తమునందు వసిష్ఠము, శ్రేష్ఠము అగు ప్రాణదేవతకు నమస్కరిస్తూ శేషించినది శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |
| (4) **"వాచే స్వాహా"** | | – 'వాక్కు' రూపమున ఉన్న ప్రాణదేవతకు ఈ ఘృతము (నేయి)ని '2' ఆహుతులుగా సమర్పిస్తున్నాము. |
| **వాగ్దేవతాయ నమః।** | | – శేషించిన నేయిని శ్రీమంథమునకు ఆహుతి చేస్తున్నాము. |
| **(5) "చక్షసే స్వాహా"** | | – చక్షువుల రూపమున, చూపు రూపమున ఉన్న ప్రాణదేవత – ప్రాణ శక్తికి ఈ నేయి సమర్పిస్తున్నాము (2 ఆహుతులు) |
| **– సంపదే స్వాహా। చక్షుర్దేవతాయ నమః।** | | – సంపద ప్రదాతకు శేషించినది శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. (ఈ విశ్వము తన సంపద అయి ఉన్న చక్షుదేవతకు సమర్పిస్తున్నాను). |
| **(6) శ్రోత్రాయ స్వాహా** | | – చెవులు – వినికిడి రూపమున ప్రకాశించుచున్న ఆయతన (శబ్దజనన స్థానము) – గుణ విశిష్ఠమగు ప్రాణదేవతకు ఈ నేయి (2 ఆహుతులు) సమర్పిస్తున్నాము. |
| **ఆయతనాయస్వాహా। శ్రోత్ర దేవతాయ నమః।** | | – మాకు క్షేమము ప్రసాదించటానికై శేషించిన నేయిని శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |
| **(7) మనసే స్వాహా** | | – మనోరూపమున (మనో జనన స్థానమున) ఉన్న ప్రాణము కొరకు, విశిష్ఠగుణ సంపన్నమగు ప్రాణ దేవతకు ఈ రెండు ఆహుతులు సమర్పిస్తున్నాను. |
| **ప్రజాత్యై స్వాహా। మనోదేవతాయ నమః।** | | – సర్వ ప్రజారూపమును, ప్రజయమును ఉద్దేశించి శేషించిన నేయిని శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |
| **(8) 'ఓం రేతసే స్వాహా"** | – ఇత్యగ్నే హుత్వా, | – రేతస్సు (సంతాన వృద్ధి) రూప, ప్రాణము కొరకు అగ్నికి స్రువముతో నేతిని సమర్పిస్తున్నాము. |
| **రేతసే నమః।** | – మంథే సగ్ం స్రువం అవనయతి। | – స్రువము పాత్రలో శేషించిన ఆద్యమును (నెయ్యిని) శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |
| **(9) "ఓం అగ్నయే స్వాహా"** | | – అగ్నిదేవుని కొరకై ఈ నేయిని అగ్నికి సమర్పించుచున్నాము. |
| **జాతవేదసే నమః।** | | – స్రువములో శేషించిన నేతిని శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |

| | |
|---|---|
| **(10) "ఓం సోమాయ స్వాహా"** | – ఓ సోమదేవా! చంద్రభగవాన్! ఓషధ, వనస్పతి ప్రదాతా! మీ కొరకై ఈ ఆజ్య భాగము సమర్పిస్తున్నాము. |
| **సోమాయ నమః।** | – ఓ మంథమా! శేష ఆజ్యమును స్వీకరించండి. |
| **(11) "భూ స్స్వాహా"।** | – భూలోకమా! భూదేవతా! (The Divinity of Matter)! మీ ఉపాసనగా ఈ ఆజ్య భాగము సమర్పిస్తున్నాను! స్వీకరించండి. |
| **భూ–నమః।** | – ఓ శ్రీమంథమా! ఈ శేషాజ్యమును స్వీకరించండి. |
| **(12) "ఓం భువస్స్వాహా"।** | – ఓ అంతరిక్ష భగవాన్! మిమ్ములను ఉపాసిస్తూ ఈ ఆజ్య భాగము సమర్పిస్తున్నాను. దయతో ప్రేమగా స్వీకరించండి. |
| **భువః – నమః।** | – ఓం శ్రీమంథమా! ఈ శేషించిన ఆజ్యము స్వీకరించండి! |
| **(13) "ఓం సువస్స్వాహా"** | – ఓ ద్యులోక– (దేవతా లోక) స్వామీ! ఈ ఆజ్యభాగము స్వీకరించండి. ప్రియము అవండి। |
| **సువః నమః।** | – ఓ శ్రీమంథమా! ఈ శేష – ఆజ్యము స్వీకరించండి. |
| **(14) "ఓం భూర్భువస్సువ స్స్వాహా।** | – ఓ భూ– అంతరిక్ష – దివ్య (ద్యు)లోక దేవతలారా! ఈ ఆజ్యమును సమర్పిస్తున్నాము. స్వీకరించి తృప్తులుకండి. |
| **భూర్భువస్సువాయ నమః।** | – ఓ శ్రీమంథమా! ఈ శేషించిన ఆజ్య భాగమును ప్రియంగా స్వీకరించండి. |
| **(15) "ఓం బ్రహ్మణే స్వాహా!"** | – ఓ బ్రహ్మజ్ఞానమా! శ్రీ సరస్వతీదేవీ! బ్రహ్మ జ్ఞానము ప్రసాదించు బ్రహ్మదేవా! ఓ బ్రహ్మజ్ఞులారా! ఇదిగో, ఈ ఆజ్యమును స్రువముతో అగ్నికి ఆజ్యముగా సమర్పిస్తున్నాము. స్వీకరించండి. |
| **బ్రహ్మణే నమః।** | – ఓ శ్రీమంథదేవతా! ఈ శేష ఆజ్యము స్వీకరించప్రార్థన. |
| **(16) "ఓం క్షత్రాయ స్వాహా"** | – ఓ క్షాత్రమా! సామర్థ్య దైవమా! ఓ క్రియాదేవతా! కర్మదేవతా! ఓ రజో దేవతా! ఇదిగో, ఈ స్రువముతో సమర్పించు ఆజ్యము ప్రియముగా స్వీకరించండి. |
| **క్షత్రాయ నమః।** | – ఓ శ్రీమంథమా! ఇదిగో శేషించిన ఆజ్యము! |
| **(17) ఓం భూతాయ స్వాహా** | – ఓ సమస్త జీవ (భూత) స్వరూపదేవతా! ఓ భౌతిక రూపదేవతా! పంచభూతదేవా! తమోగుణ దేవతా! మీ కొరకు ఈ ఆజ్యము సమర్పిస్తున్నాను. మీరు ఇది స్వీకరించండి. ఓ భూతకాల స్వరూపా! ఈ ఆహుతి మీరు స్వీకరించెదరు గాక! |
| **భూతాయ నమః।** | – ఓ శ్రీమంథదేవతా! శేషించిన ఆద్యము (నేయి)ని స్రువము నుండి (గరిట నుండి) స్వీకరించండి. |
| **(18) ఓం భవిష్యతే స్వాహా** | – ఓ భవిష్యత్ కాల దేవతా! – కాలము భవిష్యత్తులో కలిగించబోవు సందర్భములకు ఈ ఆహుతిని (నేయిని) అగ్నికి సమర్పిస్తున్నాము. |
| **భవిష్యతే నమః।** | – మిగిలిన నేయిని స్రువముతో శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |
| **(19) విశ్వాయ స్వాహా।** –ఇతి అగ్నేహుత్వా | – ఈ విశ్వము కొరకు, విశ్వరచయిత (విశ్వేదేవుని) కొరకు ఈ నేయిని రెండు ఆహుతులగా సమర్పణ చేస్తున్నాము. |
| **విశ్వాయ నమః।** – మంథసగ్ం స్రవం అవనయతి | – శేషించిన నేయిని స్రువమునుండి శ్రీమంథమునకు సమర్పిస్తున్నాము. |

**(20) సర్వాయ స్వాహా** – సర్వము కొరకు ఈ ఆహుతిని సమర్పిస్తున్నాము. హోమము చేయుచున్నాము.

**సర్వాయ నమః।** – స్రువములో మిగిలిన నేయిని 'శ్రీమంథము'నకు సమర్పిస్తున్నాము.

**(21) ప్రజాపతయే స్వాహా** –ఈ కనబడే సృష్టికంతటికీ కర్తయగు హిరణ్యగర్భునికి, (ఇదంతా ఆయన మనస్సు యొక్క సంకల్పమే కాబట్టి) ప్రజాపతికి ఈ నేయిని స్రువముతో అగ్ని ద్వారా సమర్పిస్తున్నాము.

**ప్రజాపతయే ఇదం స్వాహా।** – శేషించిన హోమద్రవ్యమును (నేయిని) శ్రీ మంథమునకు ఆహుతి చేయుచున్నాము.

ఈ విధంగా జ్యేష్ఠాయస్వాహా। శ్రేష్ఠాయస్వాహా। ప్రాణాయస్వాహా। వాచే స్వాహా। చక్షసే స్వాహా। శ్రోత్రాయ స్వాహా। మనసే స్వాహా। రేతసే స్వాహా। అగ్నయే స్వాహా। సోమాయ స్వాహా। భూస్స్వాహా। భువస్స్వాహా। సువస్స్వాహా। భూర్భువస్సు స్వాహా। బ్రహ్మణే స్వాహా। క్షత్రాయ స్వాహా। భూతాయ స్వాహా। భవిష్యతే స్వాహా। విశ్వాయ స్వాహా। ప్రజాపతయే స్వాహా। అని... పలుకుచూ ఒక్కొక్క ఆహుతిని మంథనపాత్ర (నేయిపాత్ర) నుండి స్రువము (కొయ్యగరిట)తో అగ్నిగుండములోని అగ్నికి ఆహుతి చేస్తూ, స్రువములో మిగిలి ఉన్న నేతిని శ్రీమంథముపై వదలుచూ ఈ **"పయఃపాన వ్రతము"**.. యొక్క హోమము విభాగమును పూర్తి చేయాలి.

# శ్రీమంథన స్తోత్రము

**అథ ఏనమ్ అభిమృశతి:** అప్పుడు మంథమును వేరొక చిన్న కవ్వముతో మథించాలి (చిలకాలి). ఇక శ్రీమంథము కలిగియున్న (మేడికర్ర) పాత్రను ఒక ఆసన స్థలముపై ఉంచి రెండు చేతివ్రేళ్ళతో స్పృశించి కళ్ళకు, హృదయమునకు, భుజములకు హద్దుకుని **స్వీయ ప్రాణమును – శ్రీమంథముతో ఏకము చేసినట్లు భావించాలి.** అట్లా ఒక్కొక్క స్తుతితో **"చేతి వ్రేళ్ళతో మంథపాత్రపై తాకటము, కళ్ళు, హృదయము, రెండు భుజములు తాకించటము"**.. అనే ప్రక్రియ నిర్వర్తించాలి.

**ఓం।। భ్రమదసి। జ్వలదసి। పూర్ణమసి। ప్రస్తబ్ధమసి। ఏక సభమసి। 'హిం' కృతమసి। 'హిం' క్రియమాణమసి। ఉద్గీథమసి। ఉద్గీయమానమసి। శ్రావితమసి। ప్రత్యాశ్రావితమసి। ఆర్ద్రే సందీప్తమసి। విభూరసి। ప్రభూరసి। అన్నమసి। జ్యోతిరసి। నిధనమసి। సంవర్గో అసి। ఇతి।।**

ఓ శ్రీమన్థ ద్రవ్యమా! విశ్వప్రాణ స్వరూపమా! విశ్వాంతర్గత ప్రాణదేవా!

మీరు వాయురూపంగా – ప్రాణదేవతా రూపులై సర్వప్రాణుల దేహములలో సంచరించుచున్నారు. అన్ని దేహములలోను, విశ్వమంతా కూడా అగ్నిరూపమున ప్రజ్వలిస్తూ ప్రకాశించుచున్నారు. సర్వస్వరూపులైన మీరు **మాకు చెందిన పరబ్రహ్మ విభూతిరూపులు.**

పూర్ణముగా పరబ్రహ్మ స్వరూపులై సర్వత్రా వేంచేసి ఉంటున్నారు. మీ బ్రాహ్మీతత్త్వముతో అంతటా అన్నిటా నింపివేసి పూర్ణులై ఉన్నారు. ఆకాశము అంతటా నిండి ఉండగా అట్టి ఆకాశమునకు ఒక చోటి నుండి మరొక చోటికి వెళ్ళటమనేది ఉండదు కదా. ఆవిధంగా కంపనమనేది లేకుండా స్తబ్దంగా (ప్రస్తబ్దముగా) ఉన్నట్టివారు। **ఏకాంశేన స్థితోజగత్** – ఈ జగత్తంతా ఏకాంశము (ఒకే అంశ)గా కలిగి ఉన్నట్టివారు। ఏక స్వరూపులు। అద్వితీయ పరమార్థ స్వరూపులు। యజ్ఞములో ప్రస్తోత చేసే 'హిం'కారము మీ గురించే! 'హిమ్' అనే ధ్వనిని చేసే ప్రయత్నము కూడా మీరూపమే। సామవేదము గానము చేసే స్తోత్రరూపమగు ఉద్గీథము (సామ) మీరే! ఉద్గీయమాన రూపమగు బెగ్గరగా గానము చేయుటకు మునుముందటి ప్రయత్నము కూడా మీ రూపమే। యజ్ఞములో ఆధ్వర్యుడు, దేవతాహ్వాన రూపమగు **"ఆగ్నీధా–ఆశ్రావయ"** మంత్రోచ్చారణ కూడా మీరే। పాటల – సంగీత రూపమగు శ్రావ్యము మీరే। ఆగ్నీధ్రుడు (దేవతాహ్వానములను మంత్రమగ్గంగా ఉచ్చరించే యాజ్ఞీకుడు)చే **"అస్తు" "శ్రేషట్" – "అవున స్వామీ! విచ్చేయండి"** అను శబ్దములు, వాటి అర్థములు, ఆహ్వానించబడునది కూడా మీరే! ప్రత్యాశ్రావితముగా (అస్తు – శ్రేషట్‌గా) పలుకుచు–ప్రదర్శనమగుచున్నది మీరే। ఉద్దేశ్యించబడుచున్నది మీకొరకే। మేఘముగాను, మేఘమునందు లేత – ముదురు కారునలుపు ప్రకాశములుగా ప్రదర్శితమగుచూ ఉన్నది – మీయొక్క **సంప్రదర్శనా విన్యాస చమత్కారమే। విభూరసి।** ఈ జగత్తులోని విభూతులు మీకు చెందినవే। విభవములుగా కనిపించేదంతా మీయొక్క **ప్రభవ–విభవములే।** జీవులందరికీ రాజు, ప్రభువు మీరే। జీవులందరూ భుజించుచున్న ఆహారము మీరు ప్రసాదించుచున్నట్టిదే। ఆహారములో రుచి–రసశక్తి – త్రాణ అగు తత్త్వము మీ కళావిశేషమే। అగ్నిరూపముగా భోక్త కూడా మీరే। ఈ కనబడే దృశ్యమంతా చివరికి లయించుచున్నది (విలీనమగుచున్నది) మీయందే. ఈ సర్వేంద్రియములు తన యందు ఉపసంహరించుకొనే **ప్రాణశక్తి** మీదే। మేమంతా మీవారమే। మీరే మా అందరి రూపముతో విరాజిల్లుచున్నారు।

ఆ తరువాత, – **"ఆమగ్ంసి। ఆమగ్ంహి"** (రండి। వేంచేయండి)– అను మంత్రమును చదువుచూ...,

- శ్రీమంథమును రెండు చేతులతో భక్తి–జ్ఞాన–యోగ భావనాపూర్వకంగా స్పృశించాలి.
- ప్రాత్రతో సహా శ్రీమంథమును పైకి ఎత్తాలి.

ఓ ప్రాణస్వరూపమా! మీరు సర్వము ఎరిగియే ఉన్నారు. మేము మీ యొక్క అనంత విశేషములతో కూడిన మహిమను, గొప్పతనమును తెలుసుకొనుచున్నాము. స్తుతిస్తున్నాము. ఒక మహారాజు వలె సర్వేంద్రియములను, ఇంద్రియ విషయములను సృజియించి, నియమించి పాలించుచూ సర్వమునకు ప్రభువైయున్న ప్రాణస్వరూపమే మీరు. మిమ్ములను ఉపాసిస్తున్న మేము కూడా మీకు చెందినవారమే అగుచున్నాము.

రాజాధిరాజైన సర్వగత సత్ప్రాణము మమ్ములను మాకు చెందిన సమస్తమునకు అధిపతినిగా చేయునుగాక। **మీరు మాకు వేరుకాదు। మేము మీకు వేరు కాము।**

❖

**అథ ఏనమ్ ఆచామితి :** ఇప్పుడు శ్రీమంథమును '4' విభాగములుగా చేసి ఒక్కొక్క విభాగములోని కొంతకొంత భాగమును భక్షించాలి. **"గాయత్రి"** మరియు **'మధుమతీ'** మంత్రములను చదువుచూ మంథమును నాలుగు భాగములుగా చేసుకోవాలి.

***'గాయత్రీ' మంత్రము యొక్క మొదటి పాదము – ప్రథమ కబళ భక్షణం।***

**తత్సవితుః వరేణ్యం – తత్+సత్+విత్ (తుః) → వరేణ్యమ్** [**8-3-6**]

*సకల ప్రాణులకు జన్మను ఇచ్చే సూర్యదేవత యొక్క సర్వోత్కృష్టమైన తేజస్సుకు మేము నమస్కరించుచున్నాము.*

***మధుమతీ మంత్రము యొక్క మొదటిపాదము:***

**మధు వాతా ఋతాయతే** → అట్టి పరమాత్మ యొక్క మహిమచేతనా గాలులు ప్రియముగా వీచుచున్నాయి.

**మధు క్షరంతి సింధవః** → నదులు సుఖకరములుగా మాకొరకై ప్రవహించుచున్నాయి.

**మాధ్వీర్న సంతు ఓషధీః** → మొక్కలు – వృక్షములు మా కొరకై మధుర రసమును కలిగినవై ఓషధ రూపముగా రక్షిస్తున్నాయి.

**భూః స్వాహా।** అట్టి భూలోకము (Materialistic, భౌతికరూపము) సంతరించుకొనియున్న భూలోక మాత రూప పరమాత్మకు ప్రథమ కబళమును 'ఆహుతి'గా సమర్పిస్తున్నాము – అని పలుకుచూ మొదటి శ్రీమంథన కబళమును స్వీకరించాలి. (తినాలి)

## ద్వితీయ (రెండవ) కబళ భక్షణం

***(గాయత్రీ) – 2వ పాదము***

**"భర్గో దేవస్య ధీమహి।"** – భర్గోదేవుని (భగవానుని) యొక్క 'ధీ' మహిమను స్తుతిస్తున్నాము.

***మధుమతీ – 2వ పాదము:***

| | |
|---|---|
| **మధు నక్తమ్ ఉతోషసో।** | రాత్రిం–బవళ్ళు మాకు ప్రీతినే కలిగించు గాక। |
| **మధుమత్ పార్థివగ్ం రజః।** | భూ ధూళి మా పట్ల ప్రియమును ప్రసాదించునవి అగుగాక। |
| **మధు ద్యౌః అస్తు నః పితా।** | ద్యులోకము మాకు సుఖమును ప్రసాదించుగాక! దివ్యలోకవాసులగు దేవతలు మా పట్ల సానుకూల్యము కలిగి ఉండెదరు గాక! మాకు తండ్రి వలె రక్షణ కలిగించును గాక! |
| **భువ స్స్వాహా।** | అంతరిక్షము కొరకు ఈ చక్కని ఆహుతి సమర్పిస్తున్నాము. స్వాహా! |

**అని మంత్రము చదువుచూ, ఉద్దేశ్యిస్తూ రెండవ కబళమును స్వీకరించాలి.**

## తృతీయ (మూడవ) కబళ భక్షణం

| | |
|---|---|
| **ధియో యోనః ప్రచోదయాత్** | ఆ భర్గోదేవుడు (సూర్య భగవానుడు) మా యొక్క బుద్ధులను వికశింపజేసి, (**ప్రచోదనము, నిర్మలము – విస్తారము–సునిశితము – సముత్సాహవంతము**) చేయును గాక। |
| **మధు మా అన్నో వనస్పతిః।** | – వనస్పతులు (ఆకులు–పూవులు–పళ్ళు–కాయలు).. మా పట్ల సుఖకరములు, మధురమగునుగాక। అన్నము రూపమై ఆనందముగా మమ్ములను సమీపించును గాక। |

**మధుమాగ్ం అస్తు సూర్యః।** ఈ సూర్యభగవానుడు జీవులమగు మా పట్ల మధురరూపుడు, సుఖ–ఆనంద–ప్రదాత అగునుగాక!
**మాధ్వీ గావో భవంతు నః।** పాలిచ్చు ఆవులు మొదలైనవి మాకు సుఖము ఇచ్చునవి అగుగాక!
స్వస్స్వాహేఽఽ తి "స్సుః" (స్వర్గలోకము – దేవతా లోకములు) మా పట్ల సుఖప్రదాతలై ఉండుదురు గాక!
**అని మంత్రోచ్చారణ – భావనలతో '3'వ కబళమును శ్రీమంథోపాసకుడగు యజమాని స్వీకరించాలి.**

## చతుర్థ (4వ) కబళ భక్షణము

| |
|---|
| **గాయత్రీ మంత్రము : "ఓం భూర్భువస్సువః తత్ సత్ వితుర్ వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్"** [(పూర్తి గాయత్రి) చదవాలి] |
| **మధుమతీ మంత్రము : మధువాతా ఋతాయుతే। మధు క్షరన్తి సింధవః। మధ్వీర్నః సంత ఓషధీః। మధునక్తమ్ ఉతోషసో। మధుమత్ పార్థివగ్ం రజః। మధు ద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిః। మధుమాగ్ం 3 (ఉ) అస్తు సూర్యః। మాధ్వీః గావో భవంతు నః। స్సువస్స్వాహేతి।** (పూర్తి మధుమతీ మంత్రమును చదవాలి) |

**అహమేవ ఇదగ్ం సర్వ భూర్భువస్సువః।**

నా ఆత్మయే ఈ సర్వము, ఈ భూ–అంతరిక్ష – ద్యులోకములు కూడా। ఈ సమస్తము నేనే। అట్టి ముల్లోకముల కొరకు ఈ 4వ శ్రీమంథవిభాగమును ఆహుతిగా సమర్పిస్తున్నాము.... అని 4వ భాగమును భక్షించాలి.

ఆహుతుల తరువాత

- పాత్రలో ఇంకేమైనా మంథము శేషించి ఉంటే అది కూడా వెలికితీసి నీటిలో కలిపి త్రాగాలి.
- అప్పుడు రెండు చేతులను కడుగుకొని అగ్నికి వెనుకగా, తూర్పుదిక్కుగా కూర్చుని ఆచమనం చేసి ప్రాతః సంధ్యావందనము చేయాలి.

**"దిశాం ఏకం పుండరీకమసి అహం। మనుష్యాణామ్ ఏకం పుండరీకం భూయాసమ్ ఇతి।" (8-3-6)।**

అను మంత్రమును చదువుచూ సూర్యునికి ఎదురుగా నిలబడి నమస్కారము సమర్పించాలి.

→ ఆదిత్యోత్పత్తిస్థానదర్శనముకై (ఆదిత్యునికి నమస్కరించి ఉపాసన తెలుపుటకు) బయటకు వెళ్లి, అదే మార్గములో తిరిగి ఆసనమునకు వచ్చి, అగ్నిగుండమునకు (3) ఆహుతులు సమర్పించాలి.

→ అగ్నికి తూర్పుగా కూర్చుని "చతుస్సాగర పర్యంతం గో బ్రాహ్మణేభ్యః శుభం భవతు.." అని చదువుచూ ఋషినామధేయములతో కూడిన 'ప్రవర' పలకాలి.

❖ ❖ ❖

మొట్టమొదట ఈ 'మంథనకర్మ'ను ఆరుణిపుత్ర ఉద్దాలక ఋషి వాజనేయ రేఖాధ్యయనుడగు యాజ్ఞవల్క్యునికి బోధిస్తూ ఇట్లు ఫలశృతి పలికారు : **ఈ మంథమును (శేషించిన దానిని) ఎండి – వ్రాలిపోయిన వృక్షముపై చల్లినంతమాత్రం చేత మోడు వారిన చెట్టు తిరిగి చిగురించగలదు. (బ్రతికి ఉన్న చెట్టు వలె చిగురులు తొడుగగలదు. కొమ్మలు విస్తరించగలవు). అదేవిధంగా అజ్ఞానియందు కూడా ఆత్మజ్ఞానము చిగురించగలదు. పేద విధి వ్రాత అనుభవించువాడు కూడా గొప్ప సంపద పొందగలడు. ఈ ఆహుతి ప్రభావము అంతటిది.**

**ఈ శ్రీమంథకర్మను ఫలశ్రుతితో సహా =**

→ **వాజసనేయవంశజ యాజ్ఞవల్క్యఋషి** → తన శిష్యుడు, పింగఋషికుమారుడు **పైంగ మధుకమునికి,**

→ **పైంగ మధుకముని** → తన శిష్యుడు, భగవిత్తి కుమారుడగు **చూలభాగవిత్తికి,**

→ **చూలభాగవిత్తి** → తన శిష్యుడగు జకన పుత్రుడు **జానకరాయాస్థూణునికి,**

→ **జానకరాయాస్థూణుడు** → తన శిష్యుడగు సత్యకామ **జాబాలికి,**

→ **సత్యకామ జాబాలి** → తన యొక్క అనేక శిష్యుల కొరకు ఉపదేశించటము – జరిగింది.

ఈ **'శ్రీమంథ–అగ్ని ఉపాసన'**ను పుత్రుడు కాని వానికి, శిష్యుడు కానివానికి ఉపదేశించవలదని నిర్దేశించబడినది.

❖ ❖ ❖

**తదితర సూచనలు:** 'శ్రీమంథము' అనబడే ఈ మధుకర్మయందు – **చతురౌదుంబరో భవతి** – మేడికర్ర (ఔదుంబరము)తో చేసిన ఉపకరణ సాధనములు నాలుగు ఉపయోగిస్తున్నారు.

***ఓదుంబర (మేడికఱ్ఱ)తో చేసినవి :***

(1) స్రువము (గరిట) – మేడికఱ్ఱది (2) చమసపాత్ర – మేడికఱ్ఱది (3) సమిధ – మేడికఱ్ఱ (4) చిన్న కవ్వము – మేడి కఱ్ఱది.

ఇక దశ ధాన్యములు–(మంథన ద్రవ్యము) గ్రామములో ఏవేవి లభ్యమౌతాయో అవి (కనీసము 10 రకములు వాడాలని నియమము).

***ధాన్యము–అపరములు:*** *(ఉదా: బియ్యము– బార్లీ – గోధుమ –జొన్న – మొక్కజొన్న – పెసలు – మినుగులు– కందులు – ఉలవలు – నువ్వులు – శనగలు – అనుములు ఇంకా వేరుశెనగలు.. మొదలైనవి.* ***దినుసులు:*** *మిరియాలు – ధనియాలు – జీలకఱ్ఱ – వాము... ఇవి కూడా లభించినవి వాడవచ్చును. పళ్ళను కూడా ఉపయోగించవచ్చు. వాటిన్నిటితో పిండి చేసి పెరుగు – తేనె– నేతితో తడిపి ముద్ద చేయాలి. ఆవు నేతితో తడపాలి.* (మంథములో నిషిద్ధములు = ఉల్లిపాయ, వెల్లుల్లి, దుంపలు మొ॥వి).

***ఇతి – బృహదారణ్యకోపనిషత్ '8'వ అధ్యాయము 3వ బ్రాహ్మణము***

***శ్రీ మంథ బ్రాహ్మణము సమాప్తము***

**బృహదారణ్యకోపనిషత్ – అష్టమాధ్యాయము**

# చతుర్థ బ్రాహ్మణము

# 4. రేతసో వాజపేయ బ్రాహ్మణము

***(జీవుల దేహోత్పత్తికి–తదనంతర దేహయానముల గురించి వాజపేయ యజ్ఞమును ఉపమానముగా తీసుకొని చెప్పబడుచున్నది.)***

## రేతస్సు జీవుల కల్పనా సారము

**శ్లో॥ ఏషాం వై భూతానాం పృథివీ రసః। పృథివ్యా ఆపో। ఆపాం ఓషధయః।**
**ఓషధీనాః పుష్పాణి। పుష్పాణాం ఫలాని। ఫలానాం పురుషః। పురుషస్య రేతః। (8–4–1)**

ఈ స్థావర – జంగమాత్మకమైనట్టి దృశ్య జగత్తు (లేక) భౌతిక జగత్తులో అత్యంత సారమైనది ఏది? **'భూమి'** యే శ్రేష్ఠమైనది, సారవంతము కూడా।

భూమి యొక్క సారము (The essence, the Finest and most important part) - **'ఉదకము'.**

ఉదకము యొక్క సారరూము – మొక్కలు, పూతీగలు, చెట్లు, వృక్షములు రూపమున గల **'ఓషధులు'.**

ఓషధుల యొక్క సారము→ **పుష్పములు.** పుష్పముల సారము → **ఫలములు.**

ఫలముల సారము→ **పురుషుడు** (The Being having qualitative feature of functioning on ones own logic/ one's own accord).

పురుషుని యొక్క సారము → **రేతస్సు** (Reproductivity). సర్వభూతముల సారము **'రేతస్సు'యే** అయి ఉన్నది.

– రేతస్సు చేతనే దేహముల నుండి దేహములు జనిస్తూ ఉన్నాయి. ఈ 'సృష్టి' – అనే నాటక రంగముపై రేతస్సువలననే **'జీవులు'** అను నటులు (లేక) బాటసారులు రాకపోకలు చేస్తూ ఉన్నారు. నాటక రచయిత వంటి **'సృష్టికర్త'** యొక్క కల్పన యుగయుగాలుగా కొనసాగుతూ పోతోంది.

సృష్టికర్తయగు ప్రజాపతి జగత్ నాటక రంగముపై **'సృష్టి'** అనే నాటకమును ప్రారంభిచేముందు ఇట్లా తలచారు.

"ఇప్పుడు నేను అనేక జీవజాతులు, జీవరాసులు, స్వభావములు, జన్మ జీవన్ మరణములు, జీవుల రాకపోకలు, దేవతలు, మానవులు, జంతువులు, లోకములు, సుఖదుఃఖములు – ఇటువంటి అసంఖ్యాక విశేషములతో కూడిన సృష్టిక్రమమును కల్పించ బోవుచున్నాను.

ఇట్టి సృష్టిక్రమమునకు అతి ముఖ్యమైన ఒక వస్తువు **రేతస్సు. 'ఉత్పత్తి – పునరుత్పత్తి'** అను ప్రకృతి కల్పనకు సారమైనది రేతస్సు.

అట్టి రేతస్సుకు సృష్టియందు తగిన స్థానము ముందుగా కల్పించాలి కదా!"

ఈ విధముగా భావించిన సృష్టికర్త 'స్త్రీ'ని కల్పించారు. మొట్టమొదట తానే పురుషుడై, తాను కల్పించిన 'స్త్రీ'తో **'సంభోగము'** అను సృష్టి ప్రారంభకర్మను కల్పించి తానే **'సంభోగకర్మ'**ను సేవించారు. చంద్రకిరణముతో కూడిన పాషాణ సదృశమైన **'జననేంద్రియము'**నందు రేతస్సును కల్పించి **'స్త్రీ సంసర్గము'** అను సృష్టియజ్ఞ క్రియకు 'నాంది' పలికారు. ఇక ఆపై స్త్రీ–పురుష క్రమమును సృష్టించారు. కనుక అట్టి **'సృష్టి సంకల్పము'** యొక్క సిద్ధి–ప్రసిద్ధి కొరకై సృష్టిలో పురుషులు 'స్త్రీ'ని సేవించుట జరుగుచున్నది.

# రేతసో వాజపేయ యజ్ఞము

ఇప్పుడు వాజపేయ యజ్ఞ విధిని ఉపమానంగా తీసుకొని రేతసోయజ్ఞ విధి క్రమముగా <u>**ఉపాసన పూర్వకంగా**</u> అభివర్ణించుకుంటున్నాము. రేతస నామ యజ్ఞమునకు..

- స్త్రీ యొక్క యోనియే **'యజ్ఞవేదిక'**గా అగుచున్నది.
- వెంట్రుకలు **దర్భలు** అగుచున్నాయి.
- రహస్య ప్రదేశము.. **అగ్నిగుండము.**
- వృషణములు ... **నేయి పాత్ర (చసకము)**
- పురుషాంగము ... స్రువము (మేడికర్రతో చేయబడిన కొయ్యగరిట)

**"మేము ఈ లోకమున సత్సంతానము కొరకై యజ్ఞభావముతో సంభోగయజ్ఞమును భావన చేయుచున్నాము"** అని ఏ దంపతులు భావిస్తారో,...

- ఆ పురుషుడు వాజపేయియజ్ఞ ఫలమును **స్త్రీ నుండి పొందుచున్నాడు.**
- ఆ స్త్రీ పురుషునితో సమానమైన వాజపేయ యజ్ఞ ఫలము **పురుషుని నుండి పొందుచున్నది.**

***'రేతసో వాజపేయ యజ్ఞము'*** అను సృష్టికర్త సంకల్పమును ఎరిగిన ఆరుణిమహర్షి కుమారుడగు ఉద్దాలక మహర్షి, ముద్గల మహర్షి కుమారుడగు నాకుడు, కుమారహరితుడు.. మొదలైన మహర్షులు పైరీతిగా లోకములకు సిద్ధాంతీకరించి చెప్పటం జరిగింది.

***"మైధునమును రేతో వాజపేయ యజ్ఞముగా ఉపాసనగా జనులు భావించెదరు గాక!"*** అని వారు దంపతులకు యజ్ఞవిధి బోధించటము జరిగింది. ఇది వివాహ మంత్రములలో నిక్షిప్తమై యజ్ఞీకునిచే పలుకబడుచున్నది.

# అయజ్ఞము - ప్రాయశ్చిత్తము

ఏ సందర్భములో అయినా రేతసో వాజపేయ యజ్ఞభావన చేయకనో, (లేక) నిద్రించి యుండగానో - మెళకువగా ఉన్నప్పుడో, సంకల్పితంగానో, అసంకల్పితంగానో **రేతస్ఖలనము** జరిగినప్పుడు రేతసోదేవతకు ఈ విధమైన ప్రార్థన (ఉపాసన)ను ఉద్దాలక, నాక, కుమారహరిత మొదలైన మునిసత్తములుచే (మానవ జాతి శ్రేయోభిలాషులగు మహర్షులచే) →'ప్రాయఃశ్చిత్తము'గా విధించబడుతోంది. **ప్రాయశ్చిత్తముగా రేతస్సును స్పృశించి ఈవిధంగా అభిమంత్రించాలి.**

- "సర్వ ఔషధ - అన్నసారమగు ఈ స్కలించిన రేతస్సును నేను సృష్టికర్తృరస దేవతగా అభిమంత్రిస్తూ ఉన్నాను.

- భూమిపై పడిన ఓ స్కలనమా! "పృథివి నుండి అన్నము రసము - ఉదకములతో కూడి రసస్వరూపమై వచ్చియున్నారు." - అని నమస్కరించాలి. అట్టి రేతస్సును స్పృశించి రేతోతేజముగా భావిస్తూ అనామిక - అంగుష్ఠములతో (ఉంగరము వ్రేలు - బొటనవేలు చివరలను కలిపి) స్పృశించి, స్వీయ స్థనములపైన, భ్రూమధ్యమున రేతస్సును తాకించి రేతసో దేవతకు ఈవిధంగా నమస్కరించాలి.

**పునః మామ్ ఏతి ఇంద్రియం। పునస్తేజః। పునర్భగః। పునః అగ్ని ధిష్ణయా యథాస్థానం కల్పన్తామ్॥**

**"ఓ రేతసో రసదేవా! రేతస్సు తిరిగి లోనికి ప్రవేశించును గాక। ఈ రీతిగా బయల్వెడలిన వీర్యము మరల తిరిగి వచ్చి నాకు తేజస్సును, సౌభాగ్యమును ప్రాప్తింపజేయునుగాక। అగ్నియందు స్థానము కలిగి ప్రకాశించుచున్న ఓ దివ్యస్వరూపులగు దేవతరాలా! నా దేహములో రేతస్సును, రేతో ప్రకాశమును తిరిగి దేహభాగములలో నింపి ఉంచమని ప్రార్థిస్తున్నాను. స్తోత్రము సమర్పించుచున్నాను"...** అని నమస్కరించాలి.

<u>*నీటిలో వీర్య పతనము జరిగినప్పుడు ప్రాయశ్చిత్తము।*</u>

**అథ యత్ 'ఉదక' ఆత్మానం పరిపశ్యేత్ తత్ అభిమంత్ర యేత్।** → జలములో తన ప్రతిబింబమును చూచుకొని ఇట్లా అభిమంత్రించాలి.

**"మయి తేజ ఇన్ద్రియం యశో ద్రవిణగ్ం సుకృతమ్ ఇతి"।** "నా ఇంద్రియములు యశోద్రవ్యము - సుకృతముగా అగును గాక।

స్త్రీ రజస్వల అయి ఉన్నప్పుడు పురుషుడు చదువవలసిన మంత్రము

**యన్మలోద్వాసాః తస్మాత్ మలోత్ వాసనం యశస్వినీమ్ అభిక్రమ ఉపమన్త్రయేత।"**

**- రజస్వల అయిన నా భార్య లక్ష్మీరూపమై ఉండునుగాక।"**

<u>ఇక రజస్వల అయిన ధర్మపత్నితో</u> మూడు రాత్రులు తరువాత మాత్రమే భోగించాలి.

**"మాకు చక్కటి గుణములు గల పుత్రుడు కలుగును గాక!"** అని రేతో దేవతను ప్రార్థించాలి.

ధర్మపత్నితో ప్రేమాస్పదముగా సంభోగమునకు అంగీకరింపజేయాలి. అంగీకరించని భార్యను దర్పము చూపి అంగీకరింపజేయవచ్చును. **"నా ఇంద్రియములలోని రేతస్సుతో మీలోని రజస్సును సత్సంతానసిద్ధికై అతిక్రమించుచున్నాను"**.. అని భావన చేయాలి.

**"ఇంద్రియేణ తే యశ సాయశ ఆదధామి"।**

"నా ఇంద్రియములతో మీ యశోవిభాగమును అతిక్రమించుచున్నాను– అను మంత్రము మననము చేయుచూ పురుషుడు భార్యతో సంభోగించుటచే సత్సంతానము కలుగగలదు.

"జీవిత భాగస్వామి సంభోగమునకు ప్రీతి కలిగియున్నది' అని గ్రహించి – ముఖేన ముఖగ్ం సన్ధాయ–ముఖమును ముఖమున ఆనించి, **ఉపస్థమ్ అస్యా అభిమృశ్య** – హస్తముతో యోనిని స్పృశించుచు పలకవలసిన మంత్రము.

**"అంగాత్ అంగాత్ సంభవసి। హృదయా దధి జాయసే। స త్వమ్ అఙ్గకషాయోఽసి। దిగ్ధ విద్ధామివ మాదయే, మా మమూం మయీతీ।" (8-3-9)।**

**"ఓ రేతస్సా! మీరు ఆహారము యొక్క రసమై నా యొక్క అవయవములనుండి పుట్టుచున్నారు. ఇంకా చెప్పాలంటే అన్న రసము నుండి హృదయములో జనిస్తున్నారు. అందుచేత మీరు నా అవయవములన్నిటిలోని రసరూపులు. నాయొక్క అన్ని అవయవములలో నుండి రసముగా బయల్వెడలి ఇప్పుడు ఈ నా ధర్మపత్ని యోని యందు బాణముతో కొట్టబడిన జింకవలె ప్రవేశించి, గర్భమున చేరి సంతానము కొరకై స్వాధీనమగునట్లు చేయండి".**

## సంతానము దంపతులు వద్దనుకొన్నప్పుడు

దంపతులు గర్భధారణను ఇప్పుడు వద్దని అనుకొన్న **"అభిప్రాణ్యాత్ అపానాది ఇంద్రియేణ తే రేతసా రేత ఆదదే"..** "ఆపానము ద్వారా (నిచ్ఛ్వాస ద్వారా) రేతస్సును రేతస్సుతో ఉపసంహరించుచున్నాను, వెనుకకు మరల్చుచున్నాను" అని మంత్రమును జపించుచు అపానము ద్వారా రేతస్సును గ్రహించుటచే గర్భము కలుగక ఉండగలదు.

## దంపతులు తిరిగి సంతానము కావాలనుకొన్నప్పుడు

**అథ చ యామ్ ఇచ్ఛేత్ గర్భం దధీతేతి। తస్యాం అర్థం నిష్ఠాయ ముఖేన ముఖగ్ం సన్ధాయ,**
**అభిప్రాణ్యాత్ (అపాన్యాది) ఇన్ద్రియేణ తే రేతసా, రేత ఆదధామి – ఇతి గర్భిణ్యేవ భవతి।**

- ముఖముపై ముఖము చేర్చి
- అపానమును విడచి – నిట్టూర్పుతో
- ఇంద్రియముల సారమగు రేతస్సుతో రేతస్సును ఉంచుచున్నాను"

... అను మంత్ర –మంత్రార్థమును ఆ దంపతులు ఆశ్రయించుటచే, ఆ స్త్రీ గర్భము దాల్చగలదు.

## మంత్రముతో జారపురుషుని శిక్షించువిధి

ధర్మమును వీడి ధర్మపత్నిని ఏమరచి 'జారుడు' అయినట్టి పరస్త్రీ వ్యామోహము గలవానిని శిక్షించు విధానము ఈ విధముగా చెప్పబడుచున్నది.

- పచ్చిమట్టితో చేసిన పాత్రను ఏర్పరచి, అగ్నిని అద్దానియందు స్థాపించి,
- దానిపై కుశాంతాలను, (దర్భలను) (బర్హిస్సులను) చివరలను విపరీత పద్ధతిలో (దక్షిణము వైపుగాగాని, పశ్చిమ దిక్కువైపుగాగాని కొసలు ఉండే రీతిగా) పరచి,
- వాటిపై బాణాకారంగా ఉండే కుశాగ్రాలను నేతితో తడపి – వ్యతిరేక దిశలో ఉంచి,
- అగ్నిలో 4 ఆహుతులు (ఈ క్రింది అర్థము వచ్చే మంత్రాలతో) సమర్పించాలి.
- "ఈ పేరుగల కర్తకు చెందిన (లేక) మీకుచెందని యోషాగ్నియందు రేతస్సును ఉంచి తప్పుచేస్తున్నావు. అందుకు ప్రాయశ్చితము (శిక్ష)గా ఈ యజమాని చేయు అగ్ని విధిచే మీ ప్రాణ ఆపానములు, పశుపుత్రులు శ్రోత–స్మార్త కర్మ ఫలములు, ఆశాసిద్ధి సంపదలు ఈ యజమానిచే లాగివేయబడుచున్నాయి".

ఈ విధంగా వాజపేయ యాగ సంపత్తి గలవాడు జారుని శపించు విధి చెప్పబడుచున్నది.

*అందుచేత పరస్త్రీ– పరభార్య వ్యామోహము పరస్త్రీ పురుషులతో పరిహాసము, సంభోగము మొదలైనవన్నీ కూడా రేతస్సు దేవతలకు కోపకారణమని, అది కలసిరావలసిన సంపదలకు విఘాతమని, దేహమును పాలించు దేవతలకు కోపకారణమని, ఆ కారణంగా అనారోగ్యము – మరణము ... సంభవించగలవని జనులు ఎరిగి ఉండెదరుగాక!*

**జీవిత భాగస్వామి (భార్య) ఋతుభావము పొందినప్పుడు యజమాని (మరీయు) ఆ స్త్రీ అనుసరించవలసిన నియమములు:**

- భార్య రజస్వల అయిన '3' రోజులు భర్త కంచుగిన్నెతో జలపానము చేయును గాక.
- రజోదూషిత అయిన స్త్రీని స్పృశించరాదు.
- 3 రాత్రులు అనంతరము ఆ స్త్రీ రజోదూషిత వస్త్రములు త్యజించి అభ్యంగన స్నానానంతరము ఉతికిన వస్త్రములు ధరించునుగాక।
- 4వ రోజు (3 రాత్రుల అనంతరము) ఆ స్త్రీ ధాన్యము దంపటము మొదలైన వ్యాయామ రూప గృహసేవా కర్మలు నిర్వర్తించును గాక।

**తెల్లని రంగుతో, ఒక వేదాధ్యయనము చేయగల, పూర్ణాయుర్దాయము గల పుత్రుని కోరుకొనే దంపతులు** → దంపతులిద్దరు బియ్యముతో 'క్షీరాన్నము'ను వండించి భక్షించెదరు గాక!

**కపిల వర్ణము – పచ్చని రంగు కలిగి రెండు వేదములు పఠించుచు, పూర్ణాయుర్దాయము కలవానిని పుత్రునిగా పొందుటకై** → ఆ దంపతులు దధ్యోదనము (పెరుగు అన్నము)తో నేయి కలిపి భుజించెదరుగాక.

**శ్యామ వర్ణము, లోహిత నేత్రములు, అంతర్ దృష్టి కలిగి, '3' వేదములు పఠించుచూ, పూర్ణాయుర్దాయము గల పుత్రుని పొందటానికై...** → ఆ దంపతులు నీటితో బియ్యమును ఉడికించి, ఆవునేయిని కలిపి భుజించెదరుగాక!

**పాండిత్యము – పూర్ణాయుర్దాయము గల పుత్రికను పొందాలని దంపతులు కోరిక కలిగి ఉంటే...** → ఆ దంపతులు నువ్వుల పులగమును వండించి, నేతితో కలిపి భక్షించెదరు గాక!

**దంపతులు కనుక పండితుడు – పది మందిలో సుప్రసిద్ధుడు, సభలో మనోహరమైన వాక్యములు పలుకగలిగినవాడు అగు పుత్రుని కోరుకొంటూ ఉంటే, 4 వేదములు చదివినవాడు కూడా అయి ఉండాలనుకొంటే, దీర్ఘాయుష్మంతుడు కూడా అయి ఉండాలనుకొంటే.... మాగ్ంసౌదనం పాచయిత్వా సర్పిష్మన్తమ్ అగ్నీయాతామ్ ఈశ్వరౌ జనయితవా। (8-4-18)। మాంసమును ఆవునేయితో కలిపి వండి భక్షించెదరుగాక।** ((బ్రాహ్మణులకు, కొన్ని ఉపాసనలలో ఉన్నవారికి మాంసాహారము నిషిద్ధము).

## స్త్రీ రజస్వల (బహిష్ఠు) అయి, 3 రాత్రుల తర్వాత 4వ రోజు నిర్వర్తించుటకు చెప్పబడు శాస్త్ర విధులు

- ఆ స్త్రీ తెల్లవారకముందే కాలకృత్యములు, స్నానాదులతో సహా పూర్తి చేసుకోవాలి.
- ఉదయమే దంపించి – వండి ఉంచుకొన్న బియ్యము (స్థాలీ పాకము)ను ఘృత సంస్కారము [(శ్రీమంథ బ్రాహ్మణములో పిష్ఠమునకు చేయు ఘృత (నేయి) సమర్పణ – అగ్ని విధి వలె] ఆ దంపతులు చేయాలి.
- గిన్నెలో నుండి (చామస పాత్ర నుండి) అన్నమును కొద్దికొద్దిగా తీసుకొని

  **"(1) అగ్నయే స్వాహా। (2) అనుమతయే స్వాహా। (3) దేవాయ సవిత్రే సత్య ప్రసవాయ స్వాహా।"** అని మూడు ప్రధాన ఆహుతులను అగ్నికి 3సార్లు సమర్పించాలి.

ఆ విధంగా 3 × 3 = 9 ఆహుతులను సమర్పించిన తరువాత

- శేషించిన అన్నభాగమును (కొంత) భర్త ముందుగా ప్రసాదము వలె స్వీకరించాలి.
- భర్త తినగా మిగిలిన కొంత భాగమును భార్యకు ఇవ్వాలి. భార్య స్వీకరించాలి.

అప్పుడు – **ప్రక్షాళ్య పాణీ।** చేతులు కడుగుకొని,

- ఆ చమస పాత్రలో మంచినీరుపోసి – **ఉదపాత్రం పూరయిత్వా** – ...,

**"ఉత్తిష్ఠాతో విశ్వావసో। అన్యామ్ ఇచ్ఛ ప్రపూర్వ్యాం సంజాయాం పత్యా సహేతి।" (8-3-19)।**

***"ఓ విశ్వావసు గంధర్వుడా! మీరు నా భార్య యొక్క స్వామీపృతను విడచి వెళ్లెదరుగాక! మరొక చోటికి వెళ్ళి రండి!"***.... అను మంత్రమును చదువుచు, భర్త భార్య యొక్క సిరస్సు పై ఆచమసపాత్రలోని జలముతో సంప్రోక్షించాలి (చల్లాలి).

ఆ తరువాత...,

భర్త తన అభిమతమును అనుసరించి భార్యతో 'క్షీరాన్నము'ను భుజించి శయనాగారము ప్రవేశించుచూ 'ఆలింగనమప్పుడు చదువవలసిన మంత్రమును చెప్పుకుంటున్నాము.

**ఆలింగన మంత్రము**

**అమో అహమస్మి। సా త్వగ్ం? స్వాత్వమ్। అస్య అమో అహమ్। సామ అహమస్మి। ఋక్ త్వం। ద్యౌః అహం। పృథివీ త్వమ్। తావేహి సగ్ంరభావహై, సహ రేతో దధావహై పుగ్ంసే పుత్రాయ విత్తయ ఇతి। (8-4-20)॥**

- అమో ఉ హమస్మి। నేను **ప్రాణమును**. మీరు **వాక్కు**.

  ప్రాణమునకు వాక్కు స్వాధీనమగుచున్నట్లు మీరు నాకు ప్రేమతో స్వాధీనమగుచున్నారు. అందుకు ప్రేమవాక్కులు పలుకుచున్నాను.

- నేను సామవేదమును. మీరు ఋగ్వేదము.

  సామవేదము ఋగ్వేదమునకు ఆధారమైయున్నట్లుగా మీరు నాకు ఆధారమైయున్నారు.

- నేను అంతరిక్షమును. మీరో.., భూమి!

  భూమి-అంతరిక్షములు లోకమునకు తల్లిదండ్రులైన రీతిగా మనమిరువురము మన సంతానమునకు తల్లి-తండ్రులము అగుచున్నాము. అందుచేత మనమిరువురము ఉత్తమ సంతానము కొరకై రేతసాగ్నిని ఉపాసిస్తూ ధరించుచున్నాము.

అప్పుడు పురుషుడు... **అథ అస్య ఊరూ విహాపయతి। "విజీహీథాం ద్యావా పృథివీ ఇతి, తస్యాం అర్థం నిష్ఠాయ, ముఖేన ముఖగ్ం సన్ధాయ త్రిరేనామానులోమా మనుమార్ష్టి।** ఈ నా ధర్మపత్ని యొక్క తొడలను విడదీయుచున్నాను" అని పలుకుచు స్త్రీయందు జననేంద్రియము ఉంచునుగాక।

"ఓ నా ఈ ధర్మపత్ని యొక్క తొడలు రూపమున ఉన్న భూమ్యాకాశములారా! మీరు విడివడెదరుగాక!" అని భర్త భార్య యొక్క దేహమంతా స్పృశించుచూ..,

**విష్ణుర్యోనిం కల్పయతు। త్వష్టా రూపాణి పిగ్ంశతు। ఆసిన్చతు। ప్రజాపతిః ధ్గాతా గర్భం దధాతు తే।**
**గర్భం దేహి సినీవాలి। గర్భం దేహి పృథుష్టుకే। గర్భంతే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజౌ॥ (8-4-21)**

విష్ణు భగవానుడు మనయందు సంతానము జనించుటకు సమర్థమైన 'భాగము' (అగ్ని-ఉష్ణము)ను కల్పించి మనకు సత్సంతానమును ప్రసాదించుదురు గాక।

'త్వష్ట' అను సూర్యభగవానుడు మన సంతానమునకు రూపము ప్రసాదించుదురు గాక।

- ప్రజాపతి నాయందు ప్రత్యక్షమై మీయందు రేతస్సును సుహుర్భావంగాను, క్రమక్రమంగాను జేర్చును గాక।
- సూత్రాత్మ దేవత మీయందు గర్భమును కాపాడును గాక!
- దర్శనార్హమగు ఓ దేవతా స్వరూపిణీ! భార్యామణీ! మీరు రేతస్సును నానుండి స్నేహ - సంతానోపాసనాపూర్వకంగా ఆహ్వానించి గర్భమును ధరించెదరుగాక!
- స్తోత్రరూప దేవతా! అర్ధాంగీ! "మీరు గర్భమును ధరించండి'.. అని అర్థిస్తున్నాను, ప్రార్థిస్తున్నాను.
- అశ్వనీ పుత్రులగు అశ్వనీదేవతలు శిశు సంరక్షణ, పరిపోషణ కొరకై - మన ఇరువురిపై కరణ వహిస్తూ.. మీ గర్భస్థానమును సంసిద్ధపరచుచుండెదరు గాక!

**హిరణ్మయీ అరణీయాభ్యాం నిర్మన్థతామ్ అశ్వినౌ!**
**తం తే గర్భం హవామహే దశమే మాసి సూతయే।**
**- యథా అగ్నిః గర్భా పృథివీ,**
**- యథా ద్యౌః ఇంద్రేణ గర్భిణీ,**
**- వాయుః దిశాం యథాగర్భ-**
**ఏవం గర్భం దధామి తే అసావితి।**

ఓ పత్నీరూప దేవీ! రేతస్సు తేజోరూప అరణులు. అట్టి ఏ అరుణులచే అశ్వినీదేవతలు స్తుతించబడి మధింపబడుచున్నారో,... ఆ అరణులు మీ గర్భమునందు నా నుండి ప్రవేశించుచున్నాయి. ఇప్పటి నుండి పదవ మాసము నందు మన బిడ్డను ప్రసవించుటకై అట్టి తేజోరూప అరణులను మీయందు దేవతలు హోమము చేయుచున్నారు.

- అగ్నిని భూమి తన గర్భములో ధరించుచున్న విధంగా,
- దేవేంద్రుడు స్వర్గమును తన గర్భమునందు ధరించుచున్న రీతిగా,

– దిక్కులు, వాయువున తమ యందు ధారణ చేస్తున్న విధానంగా,

'................' పేరు గల నా ధర్మపత్ని వగు మీ గర్భములో సంతానమును దానము చేయుచున్నాను.

ఈ విధంగా పలుకుకు స్త్రీ యోని యెందు మధించిన రేతస్సును పురుషుడు దేవతా–హోమము చేయుచుండును గాక!

## స్త్రీ ప్రసవించుచున్న సమయములో

పురుషుడు స్త్రీని సమీపించి ఓ........... (పేరు గల) ధరపత్నీ దేవతా!

**యథా వాయుః పుష్కరిణీగ్ం సమింగయతి సర్వతః, ఏవా తే గర్భ ఏజతు।**
**సహే వై తు జరాయుణా ఇన్ద్రస్య అయం వ్రజః కృతః సార్గళః స పరిశ్రయః।**
**తమ్ ఇన్ద్ర నిర్జహి గర్భేణ సావరాగ్ం స హేతి। (8-4-23)।**

నెప్పులు వచ్చుచున్న భార్యను జలమును ప్రోక్షిస్తూ, (మానసికంగా ఉపాసన చేస్తూ),

– "వాయువు తటాకముపై ప్రసరిస్తూ, తటాక స్వరూపమునకు ఏ మాత్రము హాని చేయకుండా తటాకమునందు అంతటా ఏవిధంగా సంచరిస్తూ ఉన్నదో..,

అదేవిధంగా నా ఈ ధర్మపత్ని యొక్క గర్భమునందు చలించుచున్న ప్రసూతివాయువులు గర్భస్థ శిశువును గర్భమునకు హాని కలుగకుండా మావితో సహా బయటకు తెచ్చివేయునుగాక!

మావి మార్గము గర్భదాన(ప్రసవ) కాలమున 'మావి'తో కూడికుని ఉన్నది. ఓ ప్రాణదేవాది దేవా! మీరు గర్భమునుండి బయటకు వెడలిరండి।"... అను అర్థము గల మంత్రములతో స్పృశించబడిన జలమును ధర్మపత్ని శిరస్సుపై (దేవత–ఉపాసనభావనతో) సంప్రోక్షించాలి!

## జాతక కర్మ

జనించిన శిశువుకు 'జాతక కర్మ' (శాస్త్రములచే) ఈవిధంగా విధించబడుచున్నది.

దంపతులిద్దరు జాతక కర్మను నిర్వర్తించాలి. ముందుగా యజ్ఞ స్థానమును ముగ్గులతో అలంకరించి, అగ్నిని ఆహ్వానించి, వ్రేల్చి, దర్భలతో నలువైపుల మంత్రముగ్ధంగా అలంకరించాలి. హోమద్రవ్యము (నేయి)తో హోమము చేయాలి.

'పృషదాజ్యము' (నేయి కలిపిన పెరుగు) గల పాత్రను తొడపై ఉంచి నేతితో హోమసంస్కారము చేయుదురుగాక।

**అస్మిన్ సహస్రం పుష్యా సమేధమానః స్వేగృహే। అస్య ఉపసద్యాం మా ఛేత్సీత్ ప్రజయా చ – పశుభిశ్చ స్వాహా! (8-4-24)।**

*ఈ నా గృహంలో నేనే ఈ నా కుమారుని రూపంగా వృద్ధి పొందుతూ వేలాది మంది జీవులకు, పశువులకు పరిపోషణ – ఆనందములను కలుగజేసెదనుగాక! అందుకొరకై ఈ (ఆజ్యము అగ్నికి సమర్పిస్తూ ఉన్నాను)। **ప్రజయాచ పశుభిశ్చ స్వాహా।***

**మయి ప్రాణాగ్ం త్వయి మనసా జూహోమి స్వాహా।**

*'ఓ కుమారా! నాయందలి ప్రాణశక్తిని నీ యొక్క 'మనస్సు' అనే హోమగుండము నందు హోమము చేయుచున్నాను। స్వాహా'!*

**యత్ కర్మణా అత్యరీరిచం, యద్వా న్యూనం ఇహాకరం। అగ్నిష్టత్ స్విష్ట కృత్ విద్వాం తు స్విష్టగ్ం సుహుతం కరోతు నః స్వాహా ఇతి।।**

*నేను చేయు అగ్ని కార్యముల న్యూన అధికములను పట్టించుకోకుండా విద్వాంసుడగు (అన్నియు తెలిసియున్న) అగ్నిదేవుడు ప్రియమును చేయుచు నా పుత్రుని, నన్ను, నా ధర్మపత్నిని ఆశీర్వదించెదరు గాక।*

ఆ విధంగా **'స్వాహా ఏతి'** అని ముగించి ఆ తండ్రి తన పుత్రుని చెవియందు నోరు జతచేర్చి..,

**"వాక్! వాక్! వాక్"** అని '3'సార్లు జపించాలి. – తరువాత బంగారు చెంచాతో పెరుగు, తేనె, నేయిలో ముంచి కుమారుని నాలుకను తాకిస్తూ చప్పరింపజేయాలి.

"ఓ కుమారా! 'భూ–భువః – సువః" అను '3' వ్యాహృతులను చెప్పుచూ భూలోకమును, అంతరిక్షమును, దేవ (దివ్య)లోకమును నీ మనస్సు నందు ఉంచుచున్నాను.

– 'భూర్భువస్సువః'.. అను వ్యాహృతిచే సమస్తము నీయందు ఉంచునట్లు అవుతోంది.

నాయనా! ఆస్వాదించు".. అని చెప్పుచూ తినిపించాలి.

# నామకరణము

ఇప్పుడు తండ్రి పుత్రునికి 'నామకరణము' చేయుచున్నారు. అట్టి నామకరణము రెండు విధములైనవి.

**వేదో౽సీతి :** మొట్టమొదట వేదనామకరణము చేయుచున్నారు. 'వేదము' (ఎరుగువాడవు – ద్రష్టవు – కేవల దృక్ స్వరూపుడవు).. అను అర్థం వచ్చే నామము రహస్యమైనది. అందుచేత ఆ పేరు వ్యవహారమున ఉండదు. కాని 'ఇది జీవితాశయము'.. అని సూచించు వేదవేద్య (తెలుసుకొనుచున్నవానిని తెలుసుకోవలసినదానికి సంబంధించిన) సూచన. (Indication : The Purpose of this your life opportunity is to know the knower of yourself)

**వ్యావహారిక నామము :** ఆ తరువాత వ్యావహారిక నామము నిర్ణయించబడి, బియ్యముపై ఓంకారముతో కూడి తండ్రిచే ఉంగరముతో లిఖించబడుతోంది

తరువాత **'యత్ తే స్తనః"** అని తల్లిచే స్తనముల ద్వారా బిడ్డకు పాలు తాగించాలి. తండ్రి ఈ విధంగా స్తోత్రమంత్రము చదువును గాక!

**– శశయో మయో భూర్యో రత్నధా వసు విద్యః సు దత్రః।**

**– యేన విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతి। తమ్ ఇహ ధాతవే కరితి। (8-4-27)।**

"ఓ దేవదేవీ! సరస్వతీ జగన్మాతా! నీ స్తనములు సర్వజీవులకు క్షీరములు ప్రసాదించుచున్న అక్షయభాండములు. ఆ నీ క్షీరము సమస్త భూతములకు, దేవతలకు కూడా పరిపోషకములు.

ఓ దేవతలారా! అట్టి పరమ పావనము, విశ్వపరిపోషకము అగు క్షీరమును ఈ నా అర్ధాంగి అగు దేవియొక్క స్తనములలో ప్రవేశింజేయండి!

ఈ విధంగా మంత్రము తండ్రి చదువుచుండగా, తల్లి రహస్యముగా తన స్తనములతో బిడ్డకు పాలు త్రాగించును గాక!

# అభిమన్త్రయతి

అప్పుడు తండ్రి బిడ్డను – తల్లిని జలముతో అభిమంత్రించాలి.

*<u>మంత్రము :</u>* **ఇలాసి మైత్రావరుణీ వీరే వీరమజీ జనత్।**

**సా త్వం వీరవతీ భవ, యస్మాన్ వీరవతో అకరదితి! (8-4-28)**

ఓ అర్ధాంగీ! దేవీ స్వరూపిణీ! అరుంధతీ కళాస్వరూపిణీ! మిమ్ములను అభినందిస్తున్నాను. నన్ను నిమిత్తముగా చేసుకొని మీరు వీరపుత్రుని ప్రసాదించారు. నన్ను వీరపుత్రుడు కలవానిగా చేశారు. మీరు 'వీరమాత' అయ్యారు. నన్ను వీర్యవంతుడిగాను, గౌరవము పొందువానిగా చేశారు. అందుచేత ఓ దేవీ! నీవు ఎల్లప్పటికీ నాకు అభినందనీయురాలివి! సుఖీభవ। విజయీ భవ। సుప్రసన్నోభవ। వరదోభవ।

ఓ బిడ్డా!

**తం వా ఏత మాహురతి పితా బతా భూరతి। పితామహో బతా భూః పరమాం బత।**

"నీవు తండ్రిని – తాతను మించినవాడవు" అని నిన్ను బుధజనులు మెచ్చుకొనేటట్లు జీవితమును తీర్చిదిద్దుకొనెదవు గాక!

బ్రహ్మమును విద్యగా అభ్యసించి, బ్రహ్మజ్ఞానివై నీ బ్రహ్మప్రకాశముతో ఈ జగత్తును నింపివేయదువు గాక!

యశస్సు చేతను, బ్రహ్మవర్చస్సు చేతను గొప్పస్థితిని పొంది పూజ్యులగు జనులకు ప్రశంసాపాత్రువగుటకై ఇక ఉద్యమించుము.

***ఇతి బృహదారణ్యకోపనిషత్ – 8వ అధ్యాయము***

***4వ బ్రాహ్మణము – రేతసోవాజపేయ బ్రాహ్మణము సమాప్తము***